## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ చిన్న జీయర్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) చిన్న జీయర్ వెబ్ సైట్: http://www.chinnajeeyar.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## చిన్న జీయర్ వారి వెబ్ సైట్

## http://www.chinnajeeyar.org



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

## ఈ సంచికలో.....



## పంచాంగ వివరాలు

### జనవరి

11 ఉ.షా. కార్తె ప. 3-37

14 భోగి పండుగ, సర్వేషాం వైకుంఠ ఏకాదశి, భద్రాచలాది క్షేత్రములలో ఉత్తరద్వార దర్శనం, ద్వాదశి తిథి, మకర సంక్రమణం రా॥ గం॥ 9-49 ని॥లకు.

15 సంక్రాంతి పండుగ, ఉత్తరాయణ పుణ్య కాలం, శూన్యతిథి

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ పెద్ద జీయరుస్వామివారి పరమపదోత్సవం

16 త్రయోదశి తిథి, కనుము

18 ఎంబార్ తిరునక్షత్రము

20 తిథి ద్వయము

21 చవితి తిథి, తిరుమళ్లిశైయాళ్వార్ తిరు॥

22 శ్రీత్యాగరాజస్వామి ఆరాధన

24 కూరత్తాళ్వార్ తిరు॥, శ్రీవైష్ణవ గృహాలలో ద్రావిడ వేదాధ్యయన ప్రారంభము

26 భారత గణతంత్ర దినం

28 సర్వేషామేకాదశి

### ఫిబ్రవరి

1 సర్వేషాం అమావాస్య

6 వసంత పంచమి

8 రథసప్తమి

13 కుంభ సంక్రమణం ఉ॥ 8-33 సర్వేషాం భీష్మైకాదశి శ్రీవిష్ణుసహస్రనామ జయంతి

16 వ్యాసపూర్ణిమ

### భక్తినివేదన పాఠకులకు శుభవార్త

రాబోవు 2003వ సంవత్సరం మార్చినెల భక్తినివేదన **'బదరీనాథ్ ప్రత్యేక సంచిక'**గా వెలువడుతుందని తెలియజేయుటకు సంతోషించుచున్నాము. ఇందులో ......

బదరీనాథ్ యాత్రా విశేషాలు, బదరీనాథ్ చుట్టుప్రక్కల ఉండే ప్రదేశముల గురించి, బదరీలో **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామి వారి**చే నిర్వహించే అష్టాక్షరీ క్షేత్ర వివరములు, అక్కడ ఏర్పాటు చేసిన వసతి మరియు అన్నదానము గూర్చిన వివరములు ఉండును. అందమైన బదరీనాథ్ పరిసర ప్రాంతాల కలర్‌ఫోటోలతో తెలుగు, హిందీ, ఇంగ్లీషు భాషలు ఒకే పత్రికగా ముద్రించబడును.

**మీ మీ కాపీలను ముందుగా రిజర్వు చేసుకొనగలరు.**

మీ సేవలో.... ________


**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 272929,
చందా : సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-, విదేశాలకు సంవత్సరచందా $25.
E-mail : bhakthinivedana@yahoo.co.in Internet : www.chinnajeeyar.org
D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం,




శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

## ఆధ్యాత్మిక మాసపత్రిక

చిత్రభాను నామ సంవత్సరం పుష్య మాసము

పాఠకులకు ఆంగ్ల నూతన సం॥ & గోదా కళ్యాణ & శ్రీవైకుంఠ ఏకాదశి, సంక్రాంతి శుభాకాంక్షలతో.....
శ్రీవారి మంగళాశాసనములు


**సంపుటి 55 2003 జనవరి సంచిక 10**

వ్యవస్థాపకులు
శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు :
శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు

సంపాదకీయం

# ఆశ....!

**ఆశ 'బహు' దొడ్డది. 'మహా' చెడ్డది.**

ఎక్కడపడితే అక్కడ వినపడేమాట ఈ ఆశ...

ఎవరికిపడితే వారికే కలిగేది యీ ఆశ....

ఆశ అన్నది మనిషికి అవసరం. ఆశ అంటూ లేకపోతే మనిషి అడుగు ముందుకు వెయ్యలేడు. వట్టి కదలికకేకాదు గట్టి పురోగతికీ ఈ ఆశ ఆవశ్యకమే.

నాటిన మొక్క మారాకు వెయ్యాలని ఆశ. మారాకు తొడిగినది కొనలు సాగాలని ఆశ. కొనలు సాగినది మొగ్గతొడగాలని ఆశ. మొగ్గ విరియాలని ఆశ. విరి నెత్తావులు చిమ్మాలని ఆశ. ఆ తావులు మూర్కొని జనం ఆనందంతో పరవశించాలని ఆశ. ఇట్లా సాగుతూనే ఉంటుంది ఆశ. ఈ ప్రక్రియ అంతా ఒక క్రమంలో సాగుతుంది.

ఆశే లేకపోతే నాటినమొక్క ఎప్పుడో నాశమౌను. అసలు మనిషి బతుకుతున్నది ఆశవల్ల, అన్నంలేకపోయినా బతుకుతాడేమో కానీ మనిషి ఆశ లేకపోతే బతకలేడు. మనిషిని నిలబెడుతుంది ఆశ. నిలబడ్డవాడికి దన్నుగా నిలుస్తుంది ఆశ. నిలిచినవాణ్ణి నిచ్చెన లెక్కిస్తుంది ఆశ.

పరశురాముణ్ణి నిలవరించిన ఏకవీరుడు, భీష్ముడు నేలకొరిగేడు. అస్త్రవిద్యాపారంగతుడు ద్రోణుడు అస్తమించేడు. ఉద్ధరిస్తాడు, అర్జునుడికి ఉద్దిగా నిలుస్తాడనుకున్న కర్ణుడు కన్నుమూసేడు. అసలింక నిలబడే వారెవరున్నారు? నిలవరించే వారెవరున్నారు? ఇప్పటికయినా మించి పోయింది లేదనుకొని సంధికి రావాలి దుర్యోధనుడు. ఊహూ..! ఇంకా ఆశ చావలేదు వానిలో. ఏమో శల్యుడు జయిస్తాడేమో పాండవులనని ఆశపెట్టుకున్నాడు.

ఇంద్రజిత్తు ఇకలేడు. కుంభకర్ణుడు కూలిపోయేడు రెక్కలు తెగిన పక్షితాను. చేతులు రెండూ పోయేయి చేసేదేమిటి తానింకా! అయినా పులుసుచావలేదు. కొడిగట్టిన దీపంలా ఇంకా మిణుకు మిణుకుమంటూనే ఉంది రావణునిలో ఆశ.

ఇంతకూ ఆశ మంచిదా? చెడ్డదా? ఉండాలా? వద్దా? ఆశ మంచిదే ఉండాలి.

ఆశ అంటున్నాం కాని అదెట్లాంటిదో చెప్పుకోలేదు. ఉండాలంటున్నాం కానీ ఎంత వరకూ ఉండాలో అనుకోలేదు.

ఆశకు మూడు దశలున్నాయి. దీనికి కొన్ని పరిమితులన్నాయి.

నీ శక్తినిబట్టి నీకు ఆశ ఉండాలి. అవతలి వస్తువును పట్టి ఆశ ఉండాలి. ఆ ఆశకు ఒక పరిమితి అంటూ ఉండాలి. అప్పుడే అది దొడ్డది. కావలసినదీని.

నీ శక్తికి మించి ఆశ పడకూడదు. అందని మ్రాని పండ్లకు అర్రులు చాచరాదు. శక్తి పెరిగింది, ఆశనీ పెరగనీ! శక్తిని పెంచుకోకుండా ఆశను పెంచుకోకు.

శక్తిని పెంచుకోవాలనుకోవటమూ ఒక ఆశే. ఈ శక్తిని పెంచుకోవాలనుకోవటమూ ఒకప్పుడు నీ శక్తికి మించిన పని కావచ్చును. అప్పుడది శక్తికి మించిన ఆశ అవుతుంది. అప్పుడది చెడ్డదే!

అందుకే ఆశకు అడ్డుకట్ట అవసరం. **"ఆశాపాశము తా గడున్నిడుపు వేదంతంబు"** – అని ఊరికే అన్నారా!

ఆశలో ఉద్యమించాలి, తప్పుకాదు. అయితే ఆ ఉద్యమానికి అవధి ఉండాలి.

రామచంద్ర ప్రభువు అడవులకు పోతున్నాడు. ఒక పేద బాపడు భార్యప్రేరణతో అర్థిగా వస్తాడాయన కడకు. అప్పటికే అన్నీ ఇచ్చేసి చేతులు దులిపేసు కుంటున్నాడు రాముడు.

కాని వచ్చిన బాపణ్ణి ఏదో ఇవ్వక పంపరాదు. శోధనం ఎక్కడో మిగిలి ఉన్నది గుర్తొచ్చింది. ఇంతలో చిన్న చమత్కారం చిత్తాన చిగిర్చింది.

నీ చేతికర్ర ఎంత దూరం విసురుతావో అంత







వరకూ ఉన్న ఆలమందను నీకిస్తాను. నీ బలం చూడాలనుంది. విసర మంటాడు. ఆ బక్కబాపడు రామహర్మ్యం నుంచి విసరిన కర్ర సరయువునుదాటి అల్లంత దూరాన పడినదట! ఈ లోపల ఉన్న ఆలమందలనన్నిటినీ పొందినాడాయన. ఆశా ప్రవృత్తి ఫలించింది నిష్ప్రమాదంగా ఇక్కడ.

ఇది చూడండి – ఎక్కడా ఆగక ఎంత దవ్వు పరుగు తీస్తే అంత దవ్వూ నేల నీకిస్తా నన్నాడు భూస్వామి. అర్థి పరుగులు పెడుతున్నాడు. అడుగులు, మూరలు, బారలు, మైళ్ళు, పది, పదిహేను ఇరవై ఇల్లా సాగుతున్నాడు.

ఎక్కడో ఆగితే ఆ మేరంతా అతనిదే. కాని ఆశ ఆగనివ్వలేదు. ఇంకా పో, ఇంకాపో అంటూ తరుముతోంది. చివరకు తానే పోయాడు. ఆశ తీరు ఇది. **అందుకే అన్నారు ఆశ కడుచెడ్డది అని.**

నీ శక్తి చూసుకోవాలి. నీ శ్రమచూసుకోవాలి. ఆశ మనిషికి మంచి బతుకునివ్వాలి. అసలు బతుకే లేకుండా చెయ్యకూడదు. అదిగో అల్లాటి దుస్థితి వచ్చే వీలున్నందునే ఆశకు అవధులుండాలి. కళ్ళేలు వేయాలి అనటం.

ఆశ ఎప్పుడూ అత్యాశకాకూడదు. దురాశా కాకూడదు.

**శక్తికి మించిన దాన్ని కోరుకోవటం అత్యాశ.**

**కూడనిదాన్ని కోరుకోవటం దురాశ.**

ఆశ ఉండవలసిందే. కాదనం అయితే, అది అధికారానుగుణం కావాలి. ఔచితీసహం కావాలి. ఈ ఔచిత్యాన్ని, అధికారాన్ని తెలుసుకోకుండా ఆశలు పలుపోకలు పోతున్నందువల్లనే మనిషి నిరుద్వేగంగా ఉండలేక పోతున్నాడు. ఎదిరిని నిరుపద్రవంగా ఉండనివ్వకపోతున్నాడు.

ఉద్వేగం లేకుండా, ఉపద్రవం లేకుండా మానవత మనుగడ సాగించాలంటే ఆశకు కళ్ళెం వెయ్యాల్సిందే. అట్లా వెయ్యాలంటే ఆశా స్వరూపం తెలుసుకోవాలి. బతుకు పరమార్థం తెలుసుకోవాలి. తెలుసుకున్నా బతుకులో అన్వయించుకోవాలి.

**అప్పడే మనిషి కృతార్థుడు.**

**బతుకు చరితార్థమూను.**

**-శ్రీరామచంద్రాచార్య**



## గ్రంథ పరిచయం - తిరుప్పావై పూదండ

ఆళువారలలో ఒక్క ఆండాళమ్మగారే స్త్రీ. ఆమె అనుభవం నిసర్గ భోగ్యం. మిగిలిన ఆళువారల అనుభవం ఆరోప సిద్ధం అంటారు శ్రీవేదాన్త దేశికులు.

ఆమె శూడిక్కొడుత్తాళ్‌గా పాడిక్కొడు త్తాళ్‌గా ప్రఖ్యాత. తిరుప్పావై ఆమె రంగనికి సమర్పించిన పద్య ప్రసూన మాలిక. అంతటి ధ్వని నిర్భర మధుర కావ్యం మరోటి లేదనటం కేవలం స్వభావోక్తి. తిరుప్పావైని నాటి నుండి నేటి వరకు ఎందరో వ్యాఖ్యానిస్తూనే ఉన్నారు. ఎందరో భాషాంతరీకరణం చేస్తూనే ఉన్నారు.

ఎవరి అనుభవం వారిది. ఎవరి ఆనందం వారిది. తాళ్ళపాక తిరువెంగళనాథుడు పరమయోగి విలాసంలో భక్తాంఘ్రిరేణువుల 'తిరుప్పళ్ళి ఎళుచ్చి'ని చక్కటి ద్విపదలో తెనుగు కావించేడు. ఆళువారుల దివ్యప్రబంధం అంతా తిరువెంగళ నాథుడు తెలుగులోనే పాడితే బాగుండుననుకొన్నారు విమర్శకులు. తిరుప్పావైకి వచ్చిన తెలుగు అనువాదాలు ఇన్నీ అన్నీ కావు. పదరూపంగా, పద్యరూపంగా, గేయ రూపంగా చాలా వచ్చేయి. వాటిలో లక్ష్మణ దాసు (శ్రీలక్ష్మణ యతీంద్రులు)గారి రసధుని పేర్కొనదగినది.

ప్రస్తుతం ఉ.వే.శ్రీమాన్ చిత్రకవి ఆత్రేయగారు 'తిరుప్పావై పూదండ' పేర మూలానుసారంగా లలిత విశదంగా గేయఫణితిలో తెలుగుసేత వెలయించినారు. ధనుర్మాస వ్రతానుష్ఠానం, తిరుప్పావై ప్రవచనం ఉద్దీపకాలుగా అనుభవానంద పరవశులయి శ్రీమాన్ ఆత్రేయగారు తెలుగువారు తెలుగులో హాయిగా పాడుకోవాలని ఈ గ్రంథాన్ని రచించినారు.

పాడుకోవటంతోపాటు సేవాకాలానికీ వీలుగా మూలాన్ని కూడా ముద్రించి భాగవత లోకోపకారకులయినారు. "ఏకస్స్వాదు న భుంజీత" అన్న నియమానికి కట్టుబడి సర్వులూ సేవింపదగినది ఈ 'తిరుప్పావై పూదండ'. 52 పుటల యీ గ్రంథం వెల రూ. 10/-

ప్రాప్తిస్థానము

శ్రీమాన్ 'చిత్రకవి' **ఆత్రేయ**, సహృదయ భవన్.
ఎ-2, షీలానగర్, విశాఖపట్నం - 530 012

**విశాఖ సారస్వత వేదిక**, కృష్ణాశ్రమం
నౌరోజీ రోడ్డు, విశాఖ పట్నం - 530 002



# శ్రీ వైకుంఠైకాదశి

సేకరణ : **శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యులు, అథర్వవేది**

సూర్యుడు ధనూరాశిలోనికి ప్రవేశించిన తరువాత వచ్చే శుద్ధ ఏకాదశినే **శ్రీవైకుంఠ ఏకాదశి** అని అంటారు. దీనికే ముక్కోటి ఏకాదశి అని కూడ పేరు. ముక్కోటి దేవతలు శ్రీవైకుంఠమునకు చేరుకుని శ్రీమన్నారా యణుని సేవించుకునే రోజు కావడంతో దానికాపేరు వచ్చింది.

ఆషాఢ శుద్ధ ఏకాదశి నుండినాలుగు నెలలపాటు '**జగద్రక్షణ చింతన**'మనే యోగ నిద్రలోనున్న స్వామి కార్తీక శుద్ధ ఏకాదశినాడు మేల్కొంటాడు. అందుకే దానికి '**ఉత్థాన ఏకాదశి**' అని పేరు. అలా మేల్కొన్న స్వామి, ధనుస్సంక్రమణం అయిన తరువాత వచ్చే శుద్ధ ఏకాదశినాడు బ్రహ్మరుద్ర మహేన్ద్రాది దేవతలకు ప్రత్యేక సందర్శనభాగ్యాన్ని ప్రసాదిస్తాడని పురాణాలు చెపుతున్నాయి. ఆనాడు బ్రహ్మాదులందరూ శ్రీవైకుంఠానికి ప్రధాన ద్వారమైన ఉత్తరద్వారంనుండి స్వామిని సేవిస్తూ సృష్టి - స్థితి - లయ కార్యనిర్వహణాత్మకములయిన ఆదేశాలను స్వామినుండి అందుకుంటారట.

దేవతలకు మకరసంక్రమణం సూర్యోదయం వంటిది. దానికి ముందున్న ధనుర్మాసమంతా వారికి బ్రహ్మముహూర్త కాలం, అంటే తెల్లవారు ఝామన్నమాట. ప్రతిదినము వారు తెల్లవారు ఝామున ఈ విధంగా స్వామిని సేవిస్తారు. మన సంవత్సర కాలం వారికొక్క దినముగా, మన 12 మాసములు వారికి 12 ముహూర్తాలుగా సాగే ఈ కాలవ్యత్యాసంలో మన ధనుర్మాసం వారికి బ్రహ్మముహూర్తకాలమైంది. సత్త్వగుణ ప్రవృద్ధమయ్యే ఆ సమయం పరమసత్త్వ సమాశ్రయుడైన పరమాత్మకు ఎంతో ప్రీతి పాత్రమైంది. మన భాగ్య విశేషం కొద్దీ మన అమ్మ గోదాదేవి అనుగ్రహఫలంగా ఆ ధనుర్మాసమంతా మనకు తిరుప్పావై వ్రత మయ్యింది. మనల్ని తరింపజేసే సాత్త్విక వ్రత మాసమైంది.

ఈ విధంగా తెల్లవారు ఝామున బ్రహ్మాదులందరూ స్వామిని సేవించుకునే ఆ దివ్యమైన సన్నివేశాన్ని స్మరించుకుంటూ దివ్యదేశములు మొదలుకొని అన్ని విష్ణ్వా లయములలోనూ ఉత్తర ద్వారదర్శన మహోత్సవాన్ని ఆచరిస్తున్నారు.

సృష్ట్యాదిలో మధుకైటభులనే రాక్షసులను సంహరించిన శ్రీమహావిష్ణువు పరమ కారుణి కుడై వారిరువురినీ ఈ ద్వారంనుండే తన సాన్నిధ్యానికి చేర్చుకోవడం వల్లకూడ (ఉత్ + తర = భగవత్ సాన్నిధ్యాన్ని పొందించేది) ఈ ద్వారానికి ఉత్తరద్వారం అని పేరు వచ్చినట్లుగా పురాణ ప్రసిద్ధమైనకథ.

వైకుంఠ ఏకాదశినాడు ఉత్తర ద్వారంలో గరుడ వాహనారూఢుడయిన స్వామిని సేవించినవారు తప్పక పునరావృత్తిరహితమైన మోక్షాన్ని పొందుతారని శ్రీపాంచరాత్ర ఆగమ శాస్త్రం ఈ విధంగా చెపుతోంది.

**వైకుంఠ పద పూర్వాయాం ఏకాదశ్యాం ద్విజోత్తమాః**
**ఉత్తర ద్వారగమనే దేవస్య మధు విద్విషః ॥**
**దుర్లభం సర్వలోకానాం దర్శనం మోక్షదాయకమ్।**
**జన్మరాహిత్యమమలం ప్రాప్నోతి సువినిశ్చయః ।**
**గరుడారూఢ విష్ణోస్తు సేవా మోక్షఫలప్రదా ॥**

**పరమపురుష సంహిత 4 అ॥ 63,64,65 శ్లో॥**

పై ప్రమాణ శ్లోకములలోని '**మధు విద్విషః**' అనే పదం మనం ఇంతకు మునుపు చెప్పుకున్న కథను స్ఫురింప జేస్తోంది. ఈ విధంగా మోక్షాన్ని ప్రసాదించే రోజుకావడంతో దీనిని **మోక్షదాఏకాదశి** అని కూడ వ్యవహరి స్తుంటారు.

ఇంకా ఎన్నో పౌరాణికమైన, ఆగమ పరమైన,చారిత్రకమైనవిశేష మాహాత్మ్యములు కల ఈ వైకుంఠైకాదశిని పురస్కరించుకుని చాలా దివ్యదేశాలలో అధ్యయనోత్సవాలను కూడ నిర్వహిస్తారు. ముఖ్యంగా ఈనాటి ఉత్తరద్వారదర్శనమహోత్సవం, శ్రీరంగ క్షేత్రంలోను, భద్రాచల క్షేత్రంలోను రంగరంగ వైభోగంగా జరుగు తుందనే విషయం సుప్రసిద్ధమైనది.

మన పంచాంగాలలో, క్యాలెండర్లలో కూడ '**శ్రీరంగ, భద్రాచలాది క్షేత్రేషు వైకుంఠ ద్వారదర్శనోత్సవః**' అని ఉండడం పరిపాటిగా మనం చూస్తుంటాం. శ్రీపాంచరాత్రాగమాను సారంగా జరిగే క్షేత్రము లన్నింటిలోని దాదాపు అన్ని ఉత్సవాలకు శ్రీరంగక్షేత్రాన్ని ప్రమాణంగ స్వీకరిస్తారు. కానీ, శ్రీరంగ క్షేత్రంలో ఈ సం॥రం వైకుంఠైకాదశిని ధనుస్సంక్రమణకాకుండానే మార్గశిర శుద్ధ ఏకాదశినాడు ఆచరించారు. ఇది ఇతర ఆలయాలలో చర్చనీయాంశ మైనది. అలా ధనుస్సంక్రమణం కావడానికి ముందే చేయడం ప్రమాణమా? శ్రీరంగంలో అలా చేస్తే మిగిలిన వాటికి క్రమమేమి? అన్నీ ఆనాడే చేయాలా. లేక శ్రీరంగంలో మాత్రమేనా? అనే సంశయాలు తలెత్తాయి. ఆ సందేహాన్ని తీర్చడమే ఈ వ్యాసం యొక్క ముఖ్యోద్దేశ్యము.

**ధనుర్మాసే సితే పక్షే ఏకాదశ్యాం శ్రియః పతేః**
**వైకుంఠ పదపూర్వాయాం దేవస్యోత్సవమాచరేత్ ॥**

ధనుర్మాసంలో వచ్చే శుద్ధ ఏకాదశియే వైకుంఠ ఏకాదశి అని, ఆనాడే వైకుంఠ ద్వార దర్శన మహోత్సవాన్ని ఆచరించాలని శ్రీపాంచ రాత్రాగమ పరమపురుష సంహిత (10వ అ॥ 64శ్లో॥) శాసిస్తోంది. **ఉత్సవం సమ్యగాచరేత్** అని ఈ ఉత్సవాన్ని వైభవోపేతంగా నిర్వ హించాలనికూడ ఆ సంహిత పేర్కొంటోంది. ఆ విధంగా ఈసారి వైకుంఠైకాదశీఉత్సవం 2003 జనవరి 14వ తేది భోగిపండుగనాడు వచ్చింది. శ్రీరంగంలో మాత్రం డిశంబర్ 15 తేదీన ఈ ఉత్సవం వైభవోపేతంగా జరిగింది.

**గీతాజ్యోతి శ్లోకమాలిక 48 శ్లోకముల వివరణముతో ప్రత్యేక పుస్తకం విడుదలై అందరికీ అందుబాటులో ఉంది కనుక ఇక మన భక్తినివేదనలో వాటిని ప్రచురించటం లేదని పాఠకులకు తెలియజేస్తున్నాం.**

**-గీతాజ్యోతి, వికాసతరంగిణి**





భక్తినివేదన　పాఠకులకు నూతన ఆంగ్ల సంవత్సర శుభాకాంక్షలు　జనవరి 2003

దాదాపు 19 సం॥ములకొక్కసారి శ్రీరంగంలో మాత్రం వచ్చే మార్పుయిది. ఇది సర్వత్ర ఆచరణీయంకాదు. శ్రీరంగాన్నే అన్నివిధాల అనుసరించే ఆలయాలకు కూడ ఇది ఆచరణీయంకాదు.

ఈ ఉత్సవం శ్రీరంగంలో ఇలా జరగడానికి కల కారణం, శాస్త్రీయం కాకపోయినా అవశ్య కర్తవ్యమైన ఒక చారిత్రకశాసనంవల్ల ఏర్పడినది కావడం విశేషం. "**ఆచార ప్రభవో ధర్మః**" అన్నట్లు ఈ ఆచారం శ్రీరంగక్షేత్రానికి మాత్రం పరిమితమై నిలిచింది. '**ధర్మజ్ఞ సమయః ప్రమాణం**' అన్నట్లు దీనిని అనూచానంగా అక్కడ ఆచరిస్తున్నారు. శ్రీవైష్ణవ సంప్రదాయానికి మహోపకారకులయిన శ్రీమణవాళమహామునులు చేసిన నిర్ణయమిది. దానికి అనుగుణంగా శ్రీవీరభూపతి ఉడైయార్ చేసిన శాసనమిది.

శ్రీవీరభూపతి ఉడైయార్, విజయ నగరం, (హంపి) మహారాజా పరంపరకు చెందిన ధార్మికుడయిన రాజు శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందిన వాడు. ఆధ్యాత్మిక చింతన కలవాడు. ప్రజలకు ఏ చీకూచింతా లేకుండా పరిపాలన చేసేవాడు. ముఖ్యంగా ఆరాజుకి శ్రీరంగనాథుడంటే వల్లమాలిన భక్తి. ప్రతిఏడాది తన జన్మ నక్షత్రంనాడు శ్రీరంగరాజుయొక్క వైభవాన్ని ఇనుమడింపజేసే విధంగా ఏదో ఒక క్రొత్త కైంకర్యాన్ని చేస్తూండేవాడు. అలా ఎన్నో కైంకర్యాలను సమర్పించాడటకూడ. అలా ఆ రాజు క్రీ॥ శ॥ 1413వ సం॥రం తన జన్మ నక్షత్రమైన మకర పునర్వసునాడు సమర్పించిన కైంకర్యమే చిత్రవీథి రథోత్సవం.

చక్కని భక్తి ప్రపత్తులు కల ఆరాజు యొక్క జన్మనక్షత్రంనాడుప్రతి ఏడాది ఈ రథోత్సవాన్ని వైభవోపేతంగా నిర్వహించాలని సకల జనసమక్షంలో విశదవాక్ శిఖామణులయిన శ్రీమణవాళమహామునులు నిర్ణయం చేశారు. అప్పట్లో శ్రీరంగక్షేత్ర నిర్వాహకులుగా, గృహస్థాశ్రమంలోనున్న శ్రీవరవరముని చేసిన నిర్ణయమే, రాజాజ్ఞగా శాసనమైంది. ప్రతి ఏటా శ్రీరంగంలో మూడు మార్లు జరిగే మహోత్సవాలలో (బ్రహ్మోత్సవాలు) ఉభయనాచ్చియార్లతో నమ్బెరుమాళ్ వేంచేసే రథోత్సవం ఇది ఒక్కటే. అధ్యయనోత్సవములు పూర్తి అయిన తరువాత మకర మాసంలో 9రోజులపాటు జరిగే భూపతి సేవలలో 9వ రోజు పునర్వసునాడు జరిగే రథోత్సవమిది. ముక్కోటి ఏకాదశికి ముందు పదిరోజులు, తరువాత పదకొండు రోజులు మొత్తం 22 రోజులపాటు పెరుమాళ్ళ అధ్యయనోత్సవాలు జరుగుతాయి. తరువాత 20 రోజులపాటు తాయార్ సేవలుంటాయి. ఆపైన మకర పునర్వసునాడు జరుగవలసిన ఉత్సవమిది కానీ... ఈ సంవత్సరం ముక్కోటి ఏకాదశి బాగా ముందుకు జరిగి ధనుర్మాసం చివరినాడు రావడం వల్ల, ముక్కోటి ఏకాదశినాటికి ఐదవనాడే మకర పునర్వసు కావడంవల్ల ఈ మార్పు సంభవించింది. ముక్కోటి ఏకాదశి నాటికి తరువాత పదకొండు రోజులపాటు జరుగవలసిన రాపత్తు సేవలు అఱయర్ గానములు పూర్తికాకుండా మరో ప్రత్యేక ఉత్సవం చేయతగదు. మరి మహారాజ శాసనంగాను, మణవాళ మహామునుల నిర్ణయంగాను ఏర్పడ్డ మకరపునర్వసునాటి రథోత్సవాన్నికూడ







మానరాదు. ఈ ధర్మ సూక్ష్మాన్ని బాగా చర్చించిన మన పూర్వాచార్యులు చేసిన నిర్ణయానుసారంగా వైకుంఠైకాదశీ ప్రయుక్త అధ్యయనోత్సవాలను మకర పునర్వసు ఉత్సవానికి ఆటంకం లేకుండా ముందుగానే నిర్వహిస్తున్నారు. సామాన్య విధికంటే విశేషవిధి బలీయమైనది. **నావిష్ణుః పృథివీపతిః** - రాజును విష్ణుస్వరూపంగా భావించాలని, ధార్మికమైన అతని ఆజ్ఞను తప్పక పాటించాలని శాస్త్రాలు చెపుతున్నాయి. అలాంటి రాజు భక్తుడై, భగవత్కైంకర్య విషయంలో శ్రద్ధాసక్తులు కలవాడయినప్పుడు అతని ప్రార్థనను లేదా అతని ఆజ్ఞను పాటించడంలో తప్పేముంటుంది? పైగా శాస్త్ర వచనం కూడ. దాదాపు 19 సం॥లకొకసారి ఈ విధంగా వస్తుందనే విషయాన్ని చర్చించారో లేదో తెలియదు కానీ ఇది ఆచరణీయం గాను, ఇకపై ఇలాంటివి తగని విధంగాను శాసనం చేసారు. అప్పటి నుండి ఈ ఉత్సవాలు అవిచ్చిన్నంగాను, 19 ఏళ్ళకు ఒకసారి వచ్చే ఈ మార్పునకు అనుగుణంగాను జరుగుతున్నాయి. ఈ విధంగా రాజాజ్ఞను, మహోత్సవ ప్రాధాన్యాన్ని దృష్టిలో ఉంచుకుని వైకుంఠైకాదశీ ప్రయుక్త అధ్యయనోత్సవాదులను శ్రీరంగక్షేత్రంలో ముందుగానే ఆచరించారు.

ఇది శ్రీరంగక్షేత్రానికి మాత్రమే చెందిన ప్రత్యేక నియమం. శ్రీరంగేతర క్షేత్రాలకు వేటికీ ఇది నియమం కాదు. ఇలా ఆచరణీయమూ కాదు. ఇదీ కథ...

మకర పునర్వసునాడు రథోత్సవం జరిగే ఈ చిత్రవీథిని **విక్రమ శోళన్ తిరువీథి** అని కూడ అంటారు. దేవేరులిద్దరితో శ్రీరంగరాజు విలాసంగావిహరించే ఈ బంగరు తేరుఉత్సవమంటే మణవాళ మహా మునులకు ఎనలేని ఇష్టమట. ఒకసారి మకర పునర్వసునాడు మణవాళమహామునులు ఆళ్వారు తిరునగరిలో వేంచేసిఉన్నారట. ఆనాడు శ్రీరంగక్షేత్రంలోని విక్రమశోళన్ తిరువీథిలో జరిగే రథోత్సవాన్ని స్మరిస్తూ ఆహా!! ఈ సమయానికి శ్రీరంగరాజు ఉభయదేవేరులతో కూడి తేరులో ఊరేగుతూంటారుకదా!!! అని తన్మయతతో ఈ పాశురాన్ని ఆశువుగా అనుగ్రహించారట.

**తేవియరుంతాముం తిరుత్తేరిన్మేల్**
**అరంగర్ మేవి విక్రమ వీథిత్తనిల్**
**పేవైశెయ్యుం అన్దస్వర్గత్తై అనుబవిక్క**
**పెత్తిలమే ఇన్ద తిరునాళిల్ యామ్**

మకర పునర్వసునాటి రథోత్సవం పరమపదానుభవాన్ని కలిగిస్తుందని మణవాళమహామునుల మాట.

ఈసారి మన వైకుంఠైకాదశి తరువాత వచ్చే ఈఉత్సవానికి ఇంత ప్రాశస్త్యం ఉందన్నమాట. మనం ఈ సం॥ గోదా కళ్యాణంనాడు జనవరి 14వ తేదీన శ్రీశ్రీశ్రీ స్వామివారి సాన్నిధ్యంలో పిట్టలవాని పాలెంలో అత్యంత వైభవోపేతంగా జరుగబోయే సామూహిక వైకుంఠైకాదశి వ్రత మహోత్సవం జరుగుతోంది. అందరం అన్వయిద్దాం.అమితానందాన్ని అనుభవిద్దాం.





# భగవద్రామానుజ చరిత్ర

టి.కె. చూడామణి, విజయవాడ

ఉడైవరులు ఆళ్వార్ తిరునగరి నుండి **'తిరుప్పుళియంగుడి'** అనే ఊరు బయలు దేరారు. దారిలో ఒకఅమ్మాయి ఆడుకుంటూ కనిపించింది. ఆ అమ్మాయిని పిలిచి 'అమ్మా! ఇక్కడికి తిరుప్పుళియంగుడి ఎంత దూరము ఉంటుదమ్మా!' అని అడిగారు. 'అయ్యో! స్వామీ! మీకు తిరువాయ్‌మొళ్ళి తెలిసే ఉంటుందిగదా! ఒక్కసారి ఈ పాశురాన్ని గుర్తుకు తెచ్చుకోండి. అంటూ తిరువాయి మొళ్ళి 9-2-10 పాశురాన్ని చదవడం మొదలు పెట్టింది.

**పా॥ కొడువినైప్పడైకళ్ వల్లై యాయ్ ।**
**అమరర్ క్కిడర్కెడ అశురర్ కట్కిడర్ శెయ్**
**కడువినై నెఞ్జే ఎన్నుడై అముతే ।**
**కలి వయల్ తిరుప్పుళియంగుడియాయ్**
**వడివిణైయిల్లా మలర్ మకళ్ మత్తై నిలమకళ్**
**పిడిక్కుమ్ మెల్ అడియై**
**క్కొడువినై యేనుమ్ పిడిక్క నీ ఒరునాళ్ ।**
**కూవుతల్ వరుతల్ శెయ్యాయే ।**

**తాత్పర్యం :** క్రూరవ్యాపారములుగల దివ్యాయుధములను ధరించిన సమర్థుడా! దేవతలకు దుఃఖము నశించునట్లు, అసురులకు దుఃఖమును కలుగజేయుటలో ఔషధముచేత కూడా శాంతికాని (క్రూర వ్యాపారముగల విషము వంటివాడా! నాకు అమృతమువలె భోగ్యభూతుడా! సమృద్ధమైన పొలములుగల తిరుప్పుళియంగుడి యందు వేంచేసి యున్నవాడా! తిరుమేనుకు సాటిలేని కమలవాసిని లక్ష్మియు, అలాంటి స్వభావమే కలిగిన భూపిరాట్టియు స్పృశింపదగిన మృదువైన నీ శ్రీపాదములను చెడ్డపాపము గల నేనును స్పృశించునట్లు నీ వొకనాడు పిల్చుటయో, వచ్చుటయో చేయుము.

ఈ భావం కలిగిన పై పాశురాన్ని ఆ చిన్నారి చదువుతూంటే ఆనందంతో వింటున్నారు యతిరాజులు. ఇంత చిన్న వయస్సులో తిరువాయ్ మొళ్ళినోటికి రావడం ఎంత భాగ్యం. ఏదో పాశురాలు కంఠస్థంచేసి చదివేయడమే కాకుండా అందులో అర్థాన్ని తెలుసుకోవడం ఎంత పుణ్యవిశేషం. తెలిసిన ఆ అర్థాన్ని సరిగ్గా సమయానికి అన్వయించి చెప్పడం ఎంత పరిజ్ఞానముంటే సాధ్యమౌతుంది. ఈ అమ్మాయి ఎంత అదృష్ట వంతురాలు. ఈ పాశురంలో 'కూవుతల్ వరుతల్' అని చెప్పారు నమ్మాళ్వార్లు. అంటే అక్కడికి తిరుప్పుళియంగుడి కేకవేస్తే వినబడేంత దూరంలో ఉందన్నమాట. ఎంత బాగా చెప్పావమ్మా అంటూ ఆ బాలికను ఆశీర్వదించి ముందుకు నడిచారు భగవద్రా మానుజులు.

నమ్మాళ్వార్ల తిరువాయ్ మొళ్ళి వైభవాన్ని తలుచుకుంటేచాలు వారి హృదయం ఆనంద తరంగిత మౌతుంది. ఆ గ్రంథ వైభవమంత గొప్పది. అది లౌకిక సుఖాల్నీ ప్రసాదిస్తోంది. పరమాత్మ సన్నిధిని చేరడానికీ చేయూత నిస్తోంది. ఇంతకంటె ఏం కావాలి? అందుకే తిరువాయ్ మొళ్ళికి వ్యాఖ్యని వ్రాయించారు గదా మన రామానుజులు. ఆ సన్నివేశాలను తలుచు కుంటూ ముందుకుసాగారు.







పరమహంస పరివ్రాజకులు

## శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి పర్యటనా వివరములు.

| | | |
|---|---|---|
| 14-1-2003 | : | ధనుర్మాస కార్యక్రమంలో భాగంగా గోదాకళ్యాణం పిట్టలవాని పాలెంలో జరుగును. రాత్రికి నడిగడ్డపాలెం ఆశ్రమంకు వేంచేస్తారు. |
| 15-1-2003 | : | శ్రీ పెద్దజీయరుస్వామివారి పరమపదోత్సవ కార్యక్రమంలో పాల్గొని, వైజాగ్ వేంచేస్తారు. |
| 16-1-2003 | : | సింహాచలంలో శ్రీఉ.వే.శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్య స్వామివారి (**భక్తినివేదన ఎడిటర్**) సప్తతి మహోత్సవం కార్యక్రమములో అన్వయిస్తారు. |
| 18-1-2003 | : | రాత్రికి సికింద్రాబాద్ వేంచేస్తారు. |
| 19-1-2003 | : | అష్టలక్ష్మీ దేవాలయంవద్ద వైట్‌హౌస్ మండపంలో గోపాలోపాయన కార్యక్రమం నిర్వహిస్తారు. |
| 20, 21, 22 | : | హైదరాబాద్‌లో వివిధ కార్యక్రమాలలో పాల్గొంటారు. |
| 23 నుండి 26 వరకు | : | ఖమ్మం జిల్లా, పాల్వంచలోని నవభారత్ ఫెర్రో యల్లాయిస్ & ధర్మల్ విద్యుత్ కేంద్రంలో సుదర్శన మహాయజ్ఞంలో పాల్గొంటారు. |
| 5-2-2003 | : | వరంగల్ జిల్లాలోని చిట్యాలలో శ్రీ సీతా రామాంజనేయ ఆలయ ప్రతిష్ఠ. అనంతరం బీచుపల్లి వేంచేస్తారు. |

# మహర్షుల చరిత్ర - శ్రీ శుక మహర్షి

తమిళమూలం :
వై.శా. నావల్‌పాకం దేవనాథ
తాతాచార్యస్వామి

తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.శ్రీ శ్రీమాన్ తూపురాణి
ఉడయవర్‌స్వామి, విజయవాడ

## భలే జన్మ

అవి కురుక్షేత్రంలో వేదవ్యాసుడు తపస్సు చేసుకునే రోజులు. ఒక రోజున **'ఘృతాచి'** అనే అప్సరస అక్కడకు హఠాత్తుగా రావడం జరిగింది. ఆమె అతిలోక సౌందర్యాన్ని చూచిన వ్యాసుని మనస్సు వ్యామోహ పరవశం అయింది. వ్యాసుడు నిత్య బ్రహ్మచారి. ఆమె అయితే ఎంతో మనోబలంకల మునీశ్వరులనైనా తన అంద చందాలతో వశపరచుకొని తుచ్ఛమైన కామ సుఖాలలోనికివారిని దిగజార్చివేయగల సామర్థ్యంకలది. వ్యాసుడు ఆమె సౌందర్యాన్నిచూచి మనసు నిగ్రహించుకోలేక పోయాడు. కామసుఖాను భవానికి మనసు ఆరాటపడసాగింది ఎంతో ప్రయత్నంతో మనసుని స్వాధీనం చేసుకోవాలని ప్రయత్నించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. వ్యాసుని మానసిక స్థితిని ఘృతాచి పసికట్టింది. ఈ సమయంలో ఈయనతో కామసుఖానుభవానికై తొందర పడటం మంచిదికాదని భావించింది. ఘోరమైన ముని శాపానికి గురికావడం తప్పదు అని కూడా గ్రహించింది.

ఈ సంకట పరిస్థితి నుంచి ఎలా బయటపడాలా అని ఆలోచించి వెంటనే ఒక పచ్చని చిలుకగా మారిపోయింది. వ్యాసుడు ఇదంతా గమనిస్తూనే ఉన్నాడు. కాని అరికాలి నుండి నడినెత్తిదాకా కామాగ్ని దహించి వేస్తోంది. ఆ సమయంలో అగ్నిమథన కార్య క్రమంలో నిమగ్నుడై ఉన్నాడీయన. పూర్వం నిప్పుకోసం రెండు కర్రలను ఒకదానిపై ఒకటి ఉంచి పెరుగు చిలికినట్లు రాపాడించేవారు. అలా కొంతసేపు చేస్తే నిప్పు బయలుదేరేది. ఈనాటికీ యజ్ఞ యాగాలలో వినియోగించే అగ్నిని ఈ విధంగానే తయారుచేయడం మనం చూస్తూ ఉంటాము. ఈ అగ్నిమథనం చేసే కర్రకు అరణి అనిపేరు. వ్యాసుడు తన మనస్సును, ఘృతాచి అప్సరసను చూచినందువల్ల కలిగిన సంకట పరిస్థితి నుండి కాపాడుకోవడానికి అరణి కట్టెలపైనే దృష్టిని కేంద్రీకరించి వేగంగా మథించసాగాడు. పాపం మనస్సును నిగ్రహించుకోలేకపోవడంతో అతని వీర్యం అరణి కట్టెలపై పడింది. వెంటనే అది ఒక శిశువుగా మారింది. ఈ రీతిగా ఒక స్త్రీగర్భంతో సంబంధం లేకుండగనే లోకాతీతంగా జన్మించాడు శ్రీశుకుడు.

## పచ్చదబ్బ పండు :

లోకంలో అందమైన పసికందును చూస్తే **'పచ్చదబ్బపండులా ఉన్నాడు'** అంటారు. అంటే శరీరచ్ఛాయ పచ్చగా ఉందని కాదు కదా! కాని శుకునివిషయంలో శరీరం,



7 Bn Jan.03.p65



అందంగా ఉండటంతోపాటు, చిలుకాకు పచ్చరంగులో ఉండటం విశేషం. శుకుని ఆవిర్భావం అతివేగంగా, కొన్ని క్షణాల్లో జరిగిపోయింది. ఆ సమయంలో వ్యాస మహర్షి దృష్టి, మనస్సు అంతా చిలుక రూపంలో ఉన్న ఘృతాచి మీదనే ఉండటం చేత, పుట్టిన పిల్లవాడికికూడ ఆ పచ్చదనం వచ్చేసింది. అంతమాత్రమే కాదు, శుకుడి ముక్కుకూడ చిలుకముక్కులాగే ఏర్పడింది. మనుష్యజాతి, పక్షిజాతుల కలయికవల్ల కలిగిన సంతానం అని అనవచ్చు. **'చిలుక ముక్కు మహర్షి'** అనికూడ ఈయనకు పేరు కలిగింది. చిలుకవలె పచ్చని శరీర శోభ కలవాడు కావడంచేత శుకుడు అనే ఈయనకు పేరు పెట్టబడింది. సంస్కృతంలో చిలుకకు **'శుకం'** అనిపేరు. అదే మాటతో వీరివిషయంలో **'శుకుడు'** అని పిలువసాగారు.

క్షణాల్లో జరిగిపోయిన సంఘటనలను తలచుకుని వ్యాసమహర్షి, ఇది భ్రమా! నిజమా! అని ఆశ్చర్యపోయాడు. ఆ స్థితిలో ఆ అప్సరసను శపించాలనే ఆలోచనకూడ ఋషికి కలగలేదు. నేలమీద పడిఉన్న తల్లిలేని పిల్లవాడిమీదనే అతని దృష్టిఅంతా కేంద్రీకృతం అయింది. 'ఇప్పుడు ఈ పిల్లవానిని ఏంచేయాలి?' ఇది అతని ఆవేదన. పసివాడినిచూస్తే తేజస్సుతో వెలిగిపోతున్నాడు. అరణులతో అగ్నిమథనం ఆరంభిస్తే, మెల్ల మెల్లగా వేడెక్కి, వేడిబాగా పెరిగిన తరువాత సాక్షాత్తుగా అగ్నిప్రకాశిన్తూ బయలు దేరుతుంది. మన శుకుడు అలా అగ్ని బయలుదేరే సమయంలో పుట్టడంచేత, గొప్ప తేజస్సుతో ప్రకాశించాడు. అరణిలో వ్యాసుని వీర్యం కొద్దిసేపు ఉండటంచేత ఆ వేడి వీర్యానికి పట్టింది. వెంటనే శుకుడు పుట్టడం జరిగింది. అందుచే శుకుడికి **'అరణీ గర్భ సంభవుడు'** అని పేరు ఏర్పడింది. అంటే, శుకుడు గర్భవాసంచేసింది, తల్లి గర్భంలో కాక, అరణి గర్భంలో అన్నమాట. చిలుక ముక్కు, అప్సరస అందం, అరణి వేడి (తేజస్సు) అన్నీ కలసి వ్యాసమహర్షికి అందాల **'శుక'** బాబుగా ఏర్పడ్డాయి. ఈ జరిగినదంతా మనకు 'ఇలా జరగడానికి అవకాశం ఉందా?' అని అనిపించినా, సృష్టికర్త చతుర్ముఖ బ్రహ్మ నిర్ణయం ప్రకారం అలాగే జరిగిపోయింది. అందుకే ఈ శుకుడికి **'బ్రహ్మరాతుడు'** అనే పేరుకూడా ఏర్పడింది. బ్రహ్మచేత ఇవ్వబడినవాడు అని ఈ మాటకు అర్థం. లోకంలో అందరూ బ్రహ్మచేత ఇవ్వబడిన వారే అయినా ఈయన మాత్రమే అలా పిలవబడటానికి కారణం, ఆయన ప్రత్యేకతే.



## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషిచేస్తున్న వారిలో ఒకరు శ్రీమతి కె. భారతీ సుధీర్ రెడ్డి (వరంగల్ జిల్లా), ఇప్పటి వరకు 250 మందిని భక్తినివేదనలో చేర్చారు. వచ్చే ఉగాదిలోగా 1008 మందిని భక్తినివేదన కుటుంబంలో చేర్చాలని బద్ధదీక్షా కంకణులయ్యారు.

శ్రీశ్రీశ్రీస్వామివారు అనేక మంగళాశాసనములను కృపచేసారు.

## జనచైతన్య







# సందేహాలు - సమాధానాలు

**శ్రీ వి.రామచందర్**

ప్ర. మనము ఫాలభాగమందు ధరించు ఊర్ధ్వ పుండ్రములు ఏల ధరించవలె? దాని లౌకికార్థము, రహస్యార్థము విపులీకరించ ప్రార్థన?

జ. **1. లౌకికార్థం :-** పైకి చూపిస్తున్నట్టు ధరించడం ద్వారా 'ఉన్నతి'ని పొందాలను కుంటున్నట్లు తెలుపుతుంది. విష్ణు భక్తులు వీరని స్పష్టపరుస్తుంది. తెలుపు ప్రశాంతతకి, ఎఱుపు ప్రేమకీ గుర్తుకద! మానసిక ఉద్రిక్తతలు తగ్గి ఏర్పడ్డ ప్రశాంతత అనే పునాది మీద, భగవత్ప్రేమ చిగురిస్తే, అదే జీవుణ్ణి ఉత్తమ శిఖరాలకు చేరుస్తుంది అనేది సూచించడం ఈ బొట్టులక్ష్యం. నుదుట అంత బొట్టుంటే కనీసం తప్పుడు పనులు చేయడానికి జంకుతారు. ఇతరులు తిడతారు అనే భయం చేతనైనా అదీ ఓ కారణం కావచ్చు.

**2. రహస్యార్థం :-** నుదుట ఊర్ధ్వ పుండ్రం, ధరించినవారిని యముడు, ఆతని దూతలూ తాకరు. అని హరివంశం స్పష్టం చేసింది. బొట్టునిలా పెట్టడంలో ఇదే కారణం శ్రియః పతి పాదాలు సత్యచిహ్నాలని 'లక్ష్మి', భగవ త్ప్రేమ వర్థకురాలిని, వారి పై కృతజ్ఞతతో ఆ రెంటినీ క్రమంలో శిరసాధరించడం 'పుండ్రధారణ'. చాలుకద!

**శ్రీమతి కె. ఉమామహేశ్వరి, విజయవాడ.**

ప్ర. స్వామీ! మీరు సమాశ్రయణాలు అనుగ్రహించినపుడు శంఖచక్రములు ఒకటి పూర్తిగ ముద్రపడి, రెండవది ముద్రపడలేదు. మాలో లోపాలున్నందున, అలా జరిగిందేమోనని మాకు అనుమానం దాన్ని నివారించి, మార్గాన్ని చెప్పవలసిందిగా ప్రార్థన.

జ. కొద్దిగ వేడిచేసి భుజాలపై శంఖచక్ర చిహ్నాలను ముద్రిస్తారు. అదొక సంస్కారముగ చేస్తారు. ఒక వేళ ఆ ముద్ర కాస్త పలుచగ పడినా ప్రమాదమేమీలేదు. అది బాగ కనపడేటట్లు ముద్రపడాలనే నియమం ఏమీలేదు. ఎంత పడినా కొంత కాలానికి అది కనపడదు గద! చర్మంలో కలిసిపోతుంది. మంత్రముద్వార తాప సంస్కారముగ వేస్తే చాలును. మీలో లోపమున్నదని మీరు దిగులు చెందే అవసరం లేదు, ఈ విషయంలో.....

**శ్రీ కె. కృష్ణకిషోర్, కంభం, శ్రీకాకుళం.**

ప్ర. శాంతిపట్టికలోని 25వ ప్రశ్న - ప్రకృతి, జీవ, పరమాత్మలనే మూడు తత్త్వాలను గూర్చిన ప్రామాణికమైన, వాస్తవికమైన జ్ఞానం అంటే ఏమిటి? వివరించ ప్రార్థన?

జ. ప్రకృతి ఏమిటి ఎలాంటిది, ఎలా ఏర్పడింది, ఎందుకేర్పడింది అనేవి మన విజ్ఞానశాస్త్రానికి అందవు, జీవ, పరమాత్మలైతే భౌతిక వస్తువులు వేటికీ అందేవే కావు. వాటి గురించి వేద శాస్త్రమే చెప్పాలి. ఉపనిషత్తులలో ఈ విషయాలన్నీ ఉంటాయి. వాటి స్వరూప స్వభావాలన్నీ 'కల'వలె కరిగిపోయేవీ, అబద్ధములో, అసత్యములో కాదు, అవన్నీ పారమార్థికములే అంటూ భగవద్రామా నుజులవారు నిరూపించి ఉన్నారు. అది తెలుసుకోవడమే.

# శ్రీ విష్ణు మహాపురాణము

## పంచమాధ్యాయం - యజ్ఞ నిర్వహణాత్మకమే సర్వసృష్టి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, కొవ్వూరు.



కృతయుగం ధ్యాన ప్రధానమైంది. కనుకనే **'ధ్యాయన్ కృతే'** అన్నట్లు ధ్యాన ప్రధానంగా ఆ యుగం సాగింది. ఇక కృతానంతరం ప్రవృత్తమైంది త్రేతాయుగం. **'యజన్ యజ్ఞైశ్చ త్రేతాయామ్'** అని ఈ యుగంలో **'యాజనం'** దేవతాప్రీతికరమైన కర్మను ఆచరించడమే ప్రధానంగా ఈయుగం సాగింది. కనుకనే బ్రహ్మ, తాను చేసిన సృష్టి నంతటినీ యజ్ఞార్థమై అన్వయించాడు.

**విష్ణుపురాణం ఇలా అంటుంది.**

**త్రేతాయుగముఖే బ్రహ్మ కల్పస్యాదౌ ద్విజోత్తమ।**
**సృష్ట్వాఽఽపశ్వౌషధీః సమ్యగ్యుయోజ సతదాధ్వరే॥**

జలాలను, ఓషధులను త్రేతాయుగాదిలో (కల్పాదిలో) సృజించి వాటిని **'అధ్వరం'**లో (యజ్ఞంలో) వినియోగించాడు.

శ్వాపదాలు (పెద్దపులులు మొదలైనవి) ద్విఖురాలు (గవయమృగాదులు) ఏనుగులు, వానరాలు, పక్షులు, ఉదకవాసులైన నక్రాదులు (మొసలి మొదలగు) పాములు మొదలైనవి ఇలా అనేక జంతు జాలాన్ని సృజించాడు. తన ముఖం నుండి గాయత్రం, ఋక్కులు, త్రివృత్తు మొదలైన సామ వృత్తి విశేషాలు, రథంతర, బృహద్ వైరూప వైరాజాలనే సామవిశేషాలను, అగ్నిష్టోమాది సోమసంస్థలను ఇలా ఎన్నో యజ్ఞవిశేషాలను ఆవిర్భవింపజేశాడు. ఇలాగే ఇతరముఖాల నుండి యజుస్సామలను సంబంధించిన అనేక భేదాలను సృజించాడు. ఇలాగే అథర్వ సంబద్ధాలైన విశేషాలను ఆవిర్భవింపచేసి, బ్రహ్మ ఉత్కృష్టాలు, నికృష్టాలు అయిన ఎన్నో భూత విశేషాలను, తన శరీరం నుండి ఆవిర్భవింప చేశాడు.

దేవతలను, పితృదేవతలను, అసురులను, మనుష్యులను సృజించాడు. ఇలా ఎన్నో రకాల స్థావరజంగమ సృష్టిచేశాడు. చతుర్ముఖ బ్రహ్మ.

**వెనుకటి సృష్టి పునరావృత్తమౌతుంది.**

వెనుకటి సృష్టిలో ఏయే ప్రాణులు ఏయే కర్మలలో కూడి ఉన్నాయో, మళ్ళీ మళ్ళీ జరిగే సృష్టిలో తత్తత్కర్మానుగుణంగా ఆ ప్రాణులే ఆవిర్భవిస్తాయి.

మృదుక్రూర స్వభావాలు, హింస్రాహింస్ర ప్రవృత్తులు, ధర్మాధర్మ ప్రవృత్తులు, అజ్ఞానావృతాలు, అనావృతాలు ఇలా అయా ప్రాణులు తమ తమ పూర్వసృష్టి సంబద్ధులైన సంస్కారాలతోనే ఆవిర్భవిస్తాయంటుంది విష్ణు పురాణం.

**సృష్టిలోని వైవిధ్యం స్వాభావికమే అంటే కర్మస్వభావమూలమే**

**ఈసృష్టి అంతా ఎంతో వైవిధ్యంతో కూడి ఉంది.**

**ఇంద్రియార్థేషు భూతేషు శరీరేషు చ స ప్రభుః।**
**నానాత్వం వినియోగం చ ధాతైవ వ్యసృజత్ స్వయమ్॥**

ఆయా ప్రాణులకు ఇంద్రియాలు, వాటికి సంబంధించిన శబ్ద స్పర్శ రూపరస గంధాది విషయ భేదాలు, శరీరాలు, పంచభూతాలు వీటిలోగల భేదాన్ని వాటికి గల ప్రత్యేక ప్రయోజనాన్ని స్వయంగా బ్రహ్మ కల్పించాడు. దీన్నిబట్టి ఈ సృష్టిలోని భేదమంతా స్వాభావికమే కాదు, ప్రయోజనవంతం విచిత్రం కూడా.

**వేదాల నుండే సర్వమూ స్వీకరింపబడింది**

**నామరూపం చ భూతానాం కృత్యానాం చ ప్రపంచనం।**
**వేదశబ్దేభ్య ఏవాదౌ దేవాదీనాం చకారసః॥**

పేర్లు, ఆకృతులు, వాటివాటి పనులు ఇవన్నీ సర్వభూతాలకు, వేదాలను ఆధారంగా







చేసికొనే ఏర్పరచాడు. దేవాదులకు కూడా వేదాధారంగానే అన్నీ ఏర్పరచాడు.

ఋషులపేర్లు, వేదంలో ఉన్నవే, ఆయా స్వభావకృత్యాలకు తగినట్లు ఇతరులకు కూడా ఏర్పరచాడు.

ఆయా ఋతువుల్లో ఉండవలసిన స్వభావాలను, ఆయా స్వభావాలను యుగాదిలో ఎలా ఉంటాయో తరువాత తరువాత కూడా అలాగే ఏర్పరచాడు.

**బ్రహ్మలో రెండు శక్తులున్నాయి**

చతుర్ముఖ బ్రహ్మలో రెండు శక్తులు న్నాయంటుంది పురాణం. 1. సిసృక్షా శక్తి, 2. సృజ్య శక్తి.

సృజించాలనే సంకల్ప శక్తి, సృజింపబడే పదార్థాలకు చెందిన సృజ్యశక్తి. వీటిలో రెండవది ప్రచోదకంకాగా మొదటి శక్తిని పరిగ్రహించి బ్రహ్మ సృష్టి చేస్తాడు.

**కరోత్యేవంవిధాం సృష్టిం కల్పాదౌ స పునః పునః।**
**సిసృక్షా శక్తియుక్తోఽసౌ సృజ్యశక్తి ప్రచోదితః॥**

కనుకనే విష్ణుపురాణం ఆయా ప్రాణులకు, పదార్థాలకు తాను స్వయంగా తనయిష్టం వచ్చినట్లు స్వరూపస్వభావాదులను కల్పింపడని, ఆయా ప్రాణులకు చెందిన **'కర్మ'**యే సృజ్యశక్తి కనుక, తదనుగుణంగానే, ఆ పదార్థాల స్వభావాలు ఉపయోగానుగుణంగా ఏర్పడతాయని, అంటూ, **'నిమిత్త మాత్రమే వాసౌ సృజ్యానాం సర్గకర్మణి'** సృష్టిక్రియ అంతా ఆయనకు శరీరంగా ఉన్న చేతనాలలో ఉన్న యోగ్యతను బట్టే జరుగుతుందని విష్ణుపురాణం చాలాచోట్ల పేర్కొంటుంది.



✦✦✦

# రామాయణంలో రమ్యగాథలు

## వానరుల దక్షిణ దిగన్వేషణాదేశం

-చెవుటూరి కుసుమ కుమారి, విజయవాడ.

**గోశీర్షకం పద్మకం చ హరిశ్యామం చ చందనమ్ ।**
**దివ్యముత్పద్యతే యత్ర తచ్ఛైవాగ్ని సమప్రభమ్ ॥**

ఆ పర్వతము మీద గోశీర్షకము, పద్మకము, హరిశ్యామము అను అగ్ని సమాన కాంతిగల చందనము ఉత్పత్తి అగును.

ఈ హెచ్చరికను జాగరూకులై విని జ్ఞప్తియందుంచుకొనుడు. ఎవరూ ఆ చందనమును ఏమాత్రమూ స్పృశించరాదు. ఏలయన ఆవనమును రోహితులు అను గంధర్వులు రక్షించు చుందురు.

**తత్ర గంధర్వ పతయః పంచ సూర్య సమప్రభాః ।**
**శైతాషో గ్రామణీ శిక్షః శుకో బభ్రు స్తథైవ చ ।**
**రవి సోమాగ్ని వపుషాం నివాసః పుణ్యకర్మణామ్ ।**

అక్కడ సూర్య సమాన కాంతిగల శైతాషుడు, గ్రామణి, శిక్షకుడు, శుకుడు, బభ్రువు అను ఐదుగురు గంధర్వరాజులు పరిపాలన చేయుచుందురు. అక్కడ అపార పుణ్యకర్మలుచేసినపుణ్యాత్ములు సూర్యచంద్రాగ్ని సమాన తేజోరాశులై నివసిస్తూ వుంటారు. **'అన్తే పృథివ్యా దుర్ధర్షాస్తతః స్వర్గ జితః స్థితాః'.** అటు తరువాత ఈ పృథివికి అంతము. అచట స్వర్గప్రాప్తి పొందినవారు నివసించు చుందురు.

**'తతః పరం న వః సేవ్యః పితృలోకః సుదారుణః'** ఆపైన ఇంక మీరు వెళ్ళలేరు. ఎందుచేతననగా అది పితృలోకము.

**రాజధానీ యమస్యైషా కష్టేన తమసా వృతా**
**ఏతావ దేవ యుష్మాభిర్వరం వానర పుఙ్గవాః**
**శక్యం విచేతుం గన్తుం వా తతో గతిమతాంగతిః**

వానర పుంగవులారా! అది యముని రాజధాని. అచట భయంకరమైన చీకటి ఆవరించి వుండును కనుక ప్రాణికోటి అచటకు వెళ్ళుటకు సాధ్యపడదు. మీరు అంతవరకు వెళ్ళి ఆ చుట్టుపట్ల వెదికి సీతజాడ తెలుసుకొని రావలె.

ఒక మాసము లోపల సీత జాడ తెలుసుకొని వచ్చినవాడు నాకు ప్రాణము కన్న ఇష్టుడు. ఆతడు అనేక అపరాధములు చేసిన వాడైననూ కానిండు నాకు ఆప్తబంధువగును. మీరందరూ అమిత బలశాలురు. ఉత్తమ సంజాతులు. కనుక సీతాన్వేషణకై తగిన విధమున పురుష ప్రయత్నము ఆరంభించుడని కార్యోన్ముఖులను చేసినాడు సుగ్రీవుడు.

### పశ్చిమ దిగన్వేషణకై సుగ్రీవుని ఆదేశం

మహాబలశాలురు, బుద్ధి కుశలురు అయిన అర్చిష్మంతుడు, అర్చిమాల్యుడు అతని తమ్ములైదుగురినీ పిలచి, అతి భయంకర పరాక్రమశాలి తార తండ్రి అయిన సుషేణుని నాయకునిగా నిర్ణయించి రెండు లక్షల వానరులతో పశ్చిమ దిక్కునకు సీతాన్వేషణకై కదలుడని శాసించినాడు వానరరాజు సుగ్రీవుడు.

వానర శ్రేష్ఠులారా! సౌరాష్ట్ర, బాహ్లిక మొదలైన దేశములయందు రమ్యములు, విశాలములు అయిన నగరములను, ఋష్యాశ్రమాలనూ పశ్చిమ దిశగా ప్రవహించే నదులను, శీతలము, ఉన్నతము అయిన పర్వత పంక్తులను, దాటి పశ్చిమ సముద్రమును చేరుడు.







అక్కడ సముద్ర తీర వన, పర్వతములను, జటాపుర, అవంతీ, అంగలేపాపురములను, మురచీ పట్టణమును, అలక్షిత వనమును, యింకనూ అక్కడి సమస్త విశాల రాష్ట్రములను, పట్టణములందూ కూడా వెదకి సీత జాడతెలుసు కొనుడు.

కపి ముఖ్యులారా! ఇంకనూ వినుడు. అక్కడ సింధునదీ సాగర సంగమ ప్రదేశమున మహావృక్షములతో నిండిన సోమగిరి అను మహాపర్వతము వున్నది. దానికి నూరు శిఖరములు వున్నవి. ఆ పర్వత చరియలందు నివసించు సింహములకు రెక్కలుండును. అవి మత్స్యములను పట్టి తమ గుహలకు చేర్చుకొనును. పెద్దపెద్ద ఏనుగులను పట్టి భక్షంచుచుండును. నలుదిక్కులా నీరుగల విశాల ప్రదేశములలో మదించిన ఏనుగులు భయంకర సింహములు సదా సంచరించుచునే ఉండును.

వానర వీరులారా! మీరు అక్కడి పారియాత్ర పర్వతముయొక్క వంద యోజన విస్తీర్ణ బంగారు శిఖరమును దర్శించుడు. దాని కాంతి కనులకు మిరుమిట్లు గొలుపు చుండును. ఆ పర్వత శిఖరమున అగ్నితో సమాన తేజ శ్శాలురు, భయంకరులు తపశ్శాలురు అయిన ఇరువది నాలుగు కోట్ల గంధర్వులు వున్నారు.

**పావకార్చిః ప్రతీకాశాః సమవేతా స్సమన్తతః ।**
**నాత్యాసాదయితవ్యాస్తే వానరై ర్భీమ విక్రమైః॥**

వానర వీరులారా! మీరు భీమ పరాక్రమవంతులైనా కానిండు, నలుదిక్కులా వ్యాపించిన అగ్ని జ్వాలల వంటి ఆ గంధర్వులను మీరు సమీపించరాదు. అక్కడ ఒక్క ఫలము నైననూ భక్షించరాదు. తాకను కూడా తాకరాదు. మీరు సామాన్య వానరుల వలే సంచరించి సీతాన్వేషణ కావింపుడు. అప్పుడు మీకా భయంకర గంధర్వుల వలన భయముండదు.

యింకనూ వినుడు. అక్కడ వైఢూర్య మణివంటి ప్రకాశము కలిగినదీ, వజ్రా కారములో నున్నదీ ఒక పర్వతము నూరు యోజనముల ఎత్తుకలదీ గుహలతోనూ, మహావృక్ష, లతాదులతోనూ మిక్కిలి దట్టమైనది వున్నది. మీరు ఆ గుహలను అతి జాగరూకులై వెదుకవలెను సుమా!

**చతుర్భాగే సముద్రస్య చక్రవాన్నామ పర్వతః।**
**తత్ర చక్రం సహస్రారం నిర్మితం విశ్వకర్మణా॥**

ఓ హరి ముఖ్యులారా! సముద్రము యొక్క నాల్గవ వంతులో చక్రవంతం అనే పర్వతం వున్నది. దేవశిల్పి అయిన విశ్వకర్మ ఆ పర్వతం మీద వేయి అంచులుగల పర్వతాన్ని నిర్మించాడు.

జై శ్రీమన్నారాయణ!

## బదరీనాథ్‌లోని అష్టాక్షరీ క్షేత్రంలో జరుగు అన్నదానమునకు, నిర్మాణమునకు వివిధ పోషకులుగా కైంకర్యములు సమర్పించిన భక్తుల వివరములు

జెట్ సీతానగరముద్వారా

**పోషకులు :** శ్రీమతి వి. వసంత కామేశ్వరి (అమెరికా), శ్రీమతి యస్. ఆదిలక్ష్మీ కామేశ్వరి (అనకాపల్లి). శ్రీమతి బి. దుర్గమ్మ (హైదరాబాద్), శ్రీమాన్ సి. సత్యనారాయణ మూర్తి, విజయవాడ.

**జీవిత సభ్యులు : హైదరాబాద్ :** శ్రీ సిహెచ్. శేషావతారం, శ్రీ కె. రంగారావు, శ్రీ ఎ. లక్ష్మీపతి, శ్రీ టి. శేషాల్వాందార్ (విజయవాడ), శ్రీ యమ్. శ్రీనివాసరావు (ఏలూరు), శ్రీ యమ్. చంద్రమౌళేశ్వరరావు (గుంటూరు), శ్రీమతి పి. రావమ్మ (తాడేపల్లి), శ్రీమతి టి. విష్ణులత (హనుమకొండ), శ్రీమతి సావిత్రి నరసింహారావు (బోగోలు), శ్రీ టి.వి.కెసి. నాగేశ్వరరావు (జంగారెడ్డిగూడెం), శ్రీమతి బి. సత్యవతి శారదాదేవి (రాజమండ్రి), శ్రీమతి జి. వరలక్ష్మీ (చీరాల), శ్రీమతి బాల విజయలక్ష్మీ (బొబ్బర్లంక), శ్రీ వంగపండు అప్పారావు (మల్లంపేట), శ్రీమతి యస్. వీరాయమ్మ (గొల్లల మామిడాడ), శ్రీమతి కె. రంగనాయకమ్మ (నూజివీడు), శ్రీమతి కె. నీరజ (కాజీపేట), శ్రీ కోటా ప్రసన్న శ్రీనివాస్ (అమెరికా), శ్రీ చలమారెడ్డి (అమెరికా), శ్రీమతి కె. సత్యవతమ్మ (గోడిలంక), శ్రీ కె. సత్యనారాయణ (కాకినాడ), శ్రీ సిహెచ్. యతిరాజాచార్యులు (కాకినాడ), శ్రీ సిహెచ్. వెంకటాచార్యులు (కాకినాడ) శ్రీమతి ఎ. వెంకట సుబ్బమ్మ (బాపట్ల), యస్. రవిశంకర్ (నరసాపూర్).

**అభిమానులు : హైదరాబాద్ :** శ్రీ యన్. మోహన్ రెడ్డి, శ్రీమతి పి. పార్వతి, శ్రీమతి బంగారమ్మ, శ్రీ కె. శ్రీనివాస రంగాచార్య, శ్రీ యస్. శ్రీనివాసరెడ్డి, శ్రీమతి వై. అనసూయాదేవి, శ్రీమతి యన్. తాయారమ్మ, శ్రీమతి యస్. అపూర్వరెడ్డి, శ్రీ బి. మురళిమోహనరావు, శ్రీమతి డి. రంగనాయకమ్మ, శ్రీ యన్. శేషగిరిరావు, శ్రీ కె.సదాశివరెడ్డి, శ్రీ యమ్.ఆర్.సి. మూర్తి, శ్రీమతి కె. పట్టమ్మ, శ్రీ బి. నరసింహం, శ్రీమతి బి.టి. ఆశ్లేష, శ్రీమతి వి. చూడామణి, శ్రీ కె. కిషోర్ రెడ్డి, శ్రీ యమ్.వి. మల్లేశ్వరరావు, శ్రీ కె. ఠాకూర్.

శ్రీ కె. కాశీవిశ్వనాథరావు (సింగుపాలెం), శ్రీమతి బి. సీతమ్మ, కె. నాగేంద్రమ్మ (మూల్పూరు), శ్రీ జి. వెంకటేశ్వరరావు (వేకనూరు), శ్రీ టి. చక్రపాణి (ఆర్మూరు), శ్రీ యస్. జగన్నాయకులు, శ్రీమతి శ్యామలాబాయి (సికింద్రాబాద్), శ్రీ యస్.వి. సూర్యనారాయణ ప్రసాదరావు, శ్రీమతి యస్. వెంకట సుబ్బలక్ష్మీ (నర్సాపూర్), శ్రీ యమ్. శ్రీరాంరెడ్డి (వనపర్తి), శ్రీ డి. సాంబశివరావు శ్రీ సిహెచ్. సాంబశివరావు, శ్రీమతి టి. కనకదుర్గా కుమారి (గుంటూరు), శ్రీ బి. రాజశేఖర్, శ్రీ టి. అమృతాంజనవతి, శ్రీ సిహెచ్. సుబ్రహ్మణ్య శర్మ, శ్రీమతి ఎ. సూర్యకూమారి, శ్రీ ఐ. రాధాకృష్ణమూర్తి, శ్రీ పి. రాజేంద్రరావు, శ్రీమతి బి. వీరమ్మ, శ్రీ డి.టి.సి. ఠాకూర్, శ్రీ డి. అచ్యుతరావు, శ్రీ బి. లక్ష్మీనరసింహమూర్తి, శ్రీ ఎ. శర్మ, శ్రీ వై. నరసింహారావు, శ్రీ కె. నారాయణ, శ్రీమతి కృష్ణకుమారి (విజయవాడ), శ్రీ కె.యమ్. శ్రీనివాస్ (సేలం), శ్రీ మోహన గాంధి (కొమరాయ పాలెం), శ్రీ జి. రామరాజు (తాడేపల్లిగూడెం), శ్రీ ఎ. లక్ష్మీరామచంద్ర (కోయంబత్తూరు), శ్రీ కె. మురళీకృష్ణరాజు (బుజభలపట్నం), శ్రీ శ్రీరామనాగరాజు, కె. ముకుంద నారాయణ (విశాఖపట్నం), శ్రీమతి వి. కోటమ్మ (ఖమ్మం), శ్రీ ఓ. సోమన్న (సూర్యాపేట), శ్రీ ఓ. హరికుమార్ (చొప్పదండి), శ్రీమతి కె. సుబ్బరత్నమ్మ (మార్కాపూర్), శ్రీ వి. మంగపతిరావు (భద్రాచలం), శ్రీమతి కె. సీతామహలక్ష్మీ (అవనిగడ్డ), శ్రీ పి.సి. కృష్ణారావు, శ్రీ బి.వి. శేషపాణి (తాడిపత్రి), శ్రీ యస్. సత్యనారాయణ మూర్తి (హోస్‌పేట), శ్రీ రెడ్డి వెంకట్రావు (మాచవరం), శ్రీ యమ్. శ్రీనివాస రఘు, శ్రీ ఎ.శ్రీహరి, శ్రీమతి







ఎ. కృష్ణకుమారి (ఏలూరు), శ్రీ పి.నరసింహారావు (పెనుగొలను), శ్రీ యమ్. యాదగిరి (చింతపట్ల), శ్రీమతి కె. నరసమ్మ, పి. వెంకటేశ్వర్లు (త్రిపురాంతకం), శ్రీ కె. చక్రధరరావు (కొవ్వూరు), శ్రీ పి. హనుమయ్య (వింజనంపాడు), శ్రీమతి జి. సుబ్బాయమ్మ (పసుమర్తి), శ్రీ యన్. సుబ్బారావు (గుడివాడ), శ్రీ కె. మల్లికార్జునరావు (అడ్డాడ), శ్రీ యన్. లక్ష్మయ్య (ఖమ్మం), శ్రీ యస్. వైకుంఠరెడ్డి (వనపర్తి), శ్రీ కె. బాపయ్య (తాడికొండ), శ్రీ పి. కృష్ణారావు (బడేపురం), శ్రీ యమ్. అప్పల నరసింహరాజు (కోనూరు), శ్రీమతి కె. సత్యవతమ్మ (పల్లిపాలెం), శ్రీ ఎ. శ్రీమన్నారాయణ (పెద్దరాసపల్లి), శ్రీ చింతాపూర్ణచంద్రరావు (తెన్నేరు), శ్రీమతి సి.వి. రమణమ్మ (జ్యోతీనగర్), శ్రీ వై. శ్రీరాములు (మోకాస కల్వపూడి), శ్రీ ఆర్. కృష్ణప్రసాదరావు (గుడివాడ), శ్రీ పి. సత్యనారాయణరాజు (తణుకు), శ్రీ ఆర్. ఆంజనేయులు (చిలకలూరిపేట), శ్రీ పి. కృష్ణారావు (చినబాదం), శ్రీమతి యస్. అన్నపూర్ణమ్మ (పెద్దమద్రిపాడు), శ్రీ జి. బాలకృష్ణ (అంతర్‌కుడ్డ), శ్రీ వి. సీతారామమూర్తి (శ్రీకాకుళం), శ్రీ కె. వెంకటాచార్యులు (నెల్లూరు), శ్రీ నున్నలక్ష్మీ (జలహల క్యాంప్), శ్రీ దేవతరాజు (గోకవరం), శ్రీ కె. సీతారావమ్మ (వెలగపూడి), శ్రీ యమ్. మాణిక్యాచారి (కొవ్వూరు), శ్రీమతి డి. అనసూయమ్మ (విశాఖపట్నం), శ్రీ కె. సుబ్బరాజు (పల్లిపాలెం), శ్రీ యమ్. వెంకటరెడ్డి (రాజమండ్రి), శ్రీమతి పి. మాణిక్యమ్మ, శ్రీమతి కె. జానకమ్మ (వీర్లపాలెం), శ్రీమతి ఇ. సుమలత (సికింద్రాబాద్), శ్రీ పి.వి. సుబ్బరత్నం (కంభం), శ్రీమతి యన్.సిహెచ్. సీతాదేవి (రాజమండ్రి), శ్రీ జి. వెంకటమహావీర్ (కాకినాడ), శ్రీ డి. వెంకటేశ్వరరావు (చిన్నబాదం), శ్రీ పి. వేణుగోపాల్, శ్రీమతి పి. చాందిని (రిట్టాపాడు), శ్రీమతి యస్. కుటుంబమ్మ (గోవిందకుంట), శ్రీ కె. రామమూర్తి (రాజమండ్రి), శ్రీ యన్. వెంకటరాజు (పోతుమర్రు), శ్రీ వి. కరుణాకర రెడ్డి (అనికేపల్లి), శ్రీమతి వరలక్ష్మీరావు (శాయన్నపాలెం), శ్రీ యన్. జగన్నాథం, శ్రీ ఐ. కృష్ణమూర్తి.

## నడిగడ్డపాలెం మన ఆశ్రమంలో వృద్ధాశ్రమం గదుల నిర్మాణం కోసం కైంకర్యాలు సమర్పించిన భక్తుల వివరాలు

హైదరాబాద్ : శ్రీమతి దేవులపల్లి శ్రీరంగమ్మ, శ్రీమతి గోపురాజు సరళ, శ్రీమతి దేవులపల్లి గోదాదేవి, శ్రీమాన్ క్రాంతినరసింహారావు, శ్రీమతి మంగు పద్మా అప్పారావు, శ్రీమతి మంగు రాణి తిరుమల రావు, శ్రీమతి మంగు రేఖాజగన్నాథరావు, శ్రీమతి కేశిరాజు రాధా ప్రకాశరావు, శ్రీమాన్ రావులపాటి గోపాలకృష్ణారావు రుక్మిణి, శ్రీమతి దేవులపల్లి రాధమ్మ, శ్రీమాన్ డా॥ యమ్. నాగేశ్వరరావు బృందాదేవి, శ్రీమతి ఉమా వినోద కృష్ణ, శ్రీమతి యస్. భారతీ నరసింహారావు, శ్రీమాన్ దేవులపల్లి మదన మోహన్‌రావు, శ్రీమతి కె. సుజాతా పాండురంగారావు, శ్రీమతి కె. వీణానరసింహారావు, కీ.శే. ఎ. లక్ష్మణరావు ఆండాళ్ళమ్మ జ్ఞాపకార్థం వారి మిత్రులు, కీ.శే. కేతిరెడ్డిపల్లి కిషన్‌రావు జ్ఞాపకార్థం వారి భార్య మిత్రులు, శ్రీమాన్ యన్.వి. రంగనాథం, శ్రీమతి కేశిరాజు అనసూయ జగన్మోహనరావు, శ్రీమతి జి. కమలవల్లి, శ్రీమతి ఎ. వేదవల్లి, శ్రీమతి వి. శారదా మల్లిఖార్జునరావు.

సికింద్రాబాద్ : డా॥ మరింగంటి సంపత్కుమారాచార్య, శ్రీమతి పి.బి. లక్ష్మీ, శ్రీమాన్ వేణుగోపాల్, శ్రీమాన్ జి.యస్.దాస్ రంజిత, డా॥ జి. సంపత్, శ్రీమతి వి. రాధారామారావు, శ్రీమతి కె. విజయ.

శ్రీమతి నారపరాజు సరోజని (కందిబండ), శ్రీమతి దేవులపల్లి యశోదాదేవిగారి జ్ఞాపకార్థం వారి కుమారులు, శ్రీమతి రంగరాజు యశోదాదేవి సీతారామారావు (నల్గొండ), శ్రీమతి వి. అరుణా యాదగిరిరావు (నాగోలు).

# ఇతిహాసబోధ-11

కురుక్షేత్ర యుద్ధంలో జరిగిన బంధువధ వల్ల కలిగిన పాప ఉపశమన నిమిత్తంగా ధర్మరాజు అశ్వమేధ యాగాన్ని సంకల్పించాడు. యాగాశ్వ రక్షకుడుగా అర్జునుడు బాధ్యత స్వీకరించి ససైన్యంగా అశ్వం వెంట బయలుదేరాడు. అశ్వం పలుదేశాలు సంచరించసాగింది. ఆయా రాజులను ఓడించి అశ్వంతో అర్జునుడు ముందుకు వెళుతున్నాడు.

వింధ్యపర్వతారణ్యాలలో ప్రయాణం సాగుతున్నది. యోజనం పొడుగున్న ఒక పెద్ద శిల అశ్వరాజానికి తటస్థపడింది. అశ్వం ఆ శిల దగ్గరకు వెళ్ళి తన శరీరాన్ని రుద్దుకొన్నది. చెట్లను, కొండలను తాకి ఆ విధంగా రుద్దుకోవడం జంతువులకు సహజ స్వభావం. అయితే ఆశ్చర్యకరంగా యాగాశ్వం ఆ పెనుశిలకు అతుక్కుపోయింది. ఎన్ని విధాలుగా ప్రయత్నించినా గుఱ్ఱానికి రాతినుండి విమోచనం లభించలేదు.

వెంట ఉన్న అశ్వపాలకులు కొరడాలతో బాది చూచారు. గట్టిగా పట్టుకొని లాగారు. ఏమాత్రము ప్రయోజనం లేకపోయింది. గుఱ్ఱం శిలకు అతుక్కుపోవడం, వింతగానూ, ఆశ్చర్యంగానూ, అనిపించింది అందరికీ. యాగానికి ఈ విఘ్నమేమిటా అని అర్జునుడు బాధపడ్డాడు. ఈ రాతి ప్రభావమేమిటో, యాగశ్వ విమోచన మార్గమేమిటో అతనికి బోధపడలేదు.

అనుచరుల ద్వారా దగ్గరలో **'సౌభరి మహర్షి'** ఆశ్రమం ఉన్న విషయం తెలుసుకొని, అక్కడకు వెళ్ళిమునిని ఆశ్రయించాడు. యాగాశ్వానికి సంభవించిన విపత్తును వివరించి, పరిష్కారాన్ని చూపమని, ప్రార్థించాడు అర్జునుడు. అర్జునుని వేదనకు ఊరటనిస్తూ సౌభరి చక్కటి తత్త్వోపదేశం చేసాడు. అర్జునుని కోరిక మేరకు శిలయొక్క కథను వివరించాడు.

"పూర్వం ఉద్దాలకుడనే ముని ఉండేవాడు. అతడెంతో ఉత్తముడు. అతడు 'చండి' అనే స్త్రీని వివాహం చేసుకొని గృహస్థ ధర్మాన్ని స్వీకరించాడు. అయితే చండిది ఎడ్డెమంటే తెడ్డెమనే స్వభావం. విపరీతమైన మంకుతనం, పొగరు, గర్వం. పెండ్లి పీటలనాడే ఆమె స్వభావం బయటపడింది. పురోహితుల వారు పెండ్లి మంత్రాలు చదువుతూ 'అన్ని వేళలా నీ భర్తను అనుసరిస్తానని, చెప్పినపని చేస్తానని'- పలకమన్నారు. ఆమె ఆ సందర్భంలోనే కుండబ్రద్దలుకొట్టినట్లుగా స్పష్టం చేసింది. 'ఆయన మాటలు నేను వినేది ఏమిటి? ఆయన చెప్పిన పని ఎట్టి పరిస్థితులలో చేయను".

సాధువైన ఉద్దాలకుడు, పెండ్లి పెద్దలు తెలిసీ తెలియనితనంతో చండి గడుసుగా మాట్లాడు తుందనుకున్నారేకాని, పెండ్లిపీటల నాటి పలుకులను యదార్థం చేసే ఉద్యమం చేపట్టిందని గ్రహించలేకపోయారు. ఉద్దాలకుడు భార్యను చాలా గారాబంగా చూసుకొన్నాడు. మార్పు క్రమంగా వస్తుందిలే అని అన్ని పనులూ తానే చేసేవాడు. ఆయన అనునయంగా మాట్లాడితే, ఆమె ఆగ్రహంతో చిందులు ద్రొక్కేది.

కొన్నాళ్ళయ్యాక భయపడుతూనే గృహస్థ ధర్మాలను బోధించసాగాడు ఉద్దాలకుడు.







'ఎందుకు నా బుఱ్ఱతింటావు? నీ ధర్మ పన్నాలు నా వద్ద చెల్లవు. నేనూ నీ కన్నా గొప్ప పండితురాలినే. నీమాటలు నేను వినను మొఱ్రో అంటే బుద్ధి లేకుండా పదేపదేచెప్పిచెప్పి నా ప్రాణాలెందుకు తీస్తావ'ంటూ భర్తమీద కయ్యిమనేది భార్య.

బిక్కచచ్చిపోయి, భార్య ఇచ్చే బిరుదులను స్వీకరిస్తూ మనస్తాపంతో సర్దుకుపోయేవాడు ఉద్దాలకుడు. వంట పనులలోనూ అగ్ని కార్యాలలోనూ చివరికి పడకగదిలోనూ సమస్త విషయాలలోనూ చండి ఉద్దాలకునికి వ్యతిరేకంగానే ప్రవర్తించేది. ఆమె దెబ్బకు భయపడిపోయి చేయవలసిన ధర్మకార్యాలను కూడా చేయలేక బాధపడసాగాడు ఉద్దాలకుడు. అతని ఇంటికి బంధుమిత్రులుకూడా రావడం మానేసారు. చండి విశ్వరూప ప్రభావ ఫలితమిది.

కొంత కాలానికి ఉద్దాలకునికి గురువైన కౌండిన్య మహర్షి శిష్యసమేతంగా తీర్థయాత్రలు చేస్తూ అటు ప్రక్కకు వచ్చాడు. గురువుగారి పాదాలను ఆశ్రయించి బావురుమన్నాడు ఉద్దాలకుడు. తన విపరీత గృహస్థజీవితాన్ని దయనీయంగా వర్ణించాడు. 'గర్విష్టి అయిన భార్యవల్ల సంసార సుఖం లేదు. సంతాన యోగం లేదు. ధర్మకార్యాల ఫలంలేదు. వెటకారపు మాటలు, దెప్పిపొడుపు చేష్టలూ తప్ప ధార్మిక జీవనానికి సహకారం కలికానికి కూడా కనిపించడం లేదు. ఆడదానిపై దండోపాయం అనాగరికం. పితృశ్రాద్ధం సమీపిస్తున్నది. గడిచేమార్గం బోధపడటం లేదు. తరణోపాయాన్ని సెలవియ్యండి". అంటూ కౌండిన్యుడిని వేడుకొన్నాడు.

కౌండిన్యుడు ఆలోచించి ఉద్దాలకునితో రహస్యంగా చెప్పాడు, "నీవు నీ భార్యతోనీకు కావలసిన పనికి వ్యతిరేకంగా మాట్లాడి చూడు, ఫలితంఉండే అవకాశం ఉంది". చండి 'సత్కారాల' కోసం వేచిచూడకుండా కౌండిన్యుడు శిష్యునికి సలహా ఇచ్చి దగ్గరలో ఉన్న గౌతముని ఆశ్రమానికి వెళ్ళాడు.

'ఇదుగో చండీ! ఈ వెళ్ళిన కౌండిన్యుడు వట్టి దుర్మార్గుడు. రేపు ఉదయం ఇటుగా వస్తానంటున్నాడు. వచ్చినవాడిని గట్టిగా దులిపేసి బయటకు త్రోసేయి. అన్నంగానీ, బట్టలుగానీ ఇవ్వొద్దు' అన్నాడు ఉద్దాలకుడు.

'అంత మంచివారిని పట్టుకొని దుర్మార్గుడంటావా? రేపు ఉదయం వారిని రానీయండి! చక్కగా ఆహ్వానించి, అన్న వస్త్రాలతో సత్కరించి ఆనందింపచేస్తాను' అని చండి ప్రతిజ్ఞ చేసింది.

గురువుగారి ఉపాయం పనిచేస్తుందని ఉద్దాలకుడు లోలోపల ఆనందించాడు.

'అది సరే! రేపు పితృతిథి గుర్తుంది కదా! ఎట్టి పరిస్థితులలోనూ దీనిని నిర్వహించను. పోయిన వానికి జరిపే ఈ కార్యాలన్నీ శుద్ధ దండుగ పనులాయె'!? అన్నాడు ఉద్దాలకుడు.

అసలు మీకు బుద్ధి ఉందా? ఉంటే మామగారికి పితృకార్యం చేయనంటారా? తృప్తీ, సౌఖ్యమూ ఉండేలా జరగాల్సిన వైదిక కర్మలు జరిపితీరవలసిందే! నామాట నెగ్గకపోతే ఏం జరుగుతుందో తెలుసుగా"!, హెచ్చరించింది చండి.

'సరిసర్లే! ఒక వేళ సరదాపడి నీవు పైతృకం జరిపించాలని పట్టుపట్టినా దేనికీ పనికిరాని, ఏబ్రాసి, చదువురాని, ఆచార భ్రష్టులైన బ్రాహ్మణులనెవరినైనా తీసుకొని వస్తాను. తక్కువ సంభావనతో మనం ముగించే యవచ్చు.'

'అదేమీ వీల్లేదు! వేద శాస్త్ర వేత్తలైన ఉత్తమ బ్రాహ్మణులను ఈ రాత్రికే వెళ్ళి నేను రేపు

భోక్తలుగా రమ్మని ఆహ్వానించి వస్తాను. నీ మాటలు సాగనిస్తే నేను చండి నెలా అవుతాను'? అని గదమాయించింది భర్తను.

'చండీ! నా ప్రాణాలు తోడేస్తున్నావు. బలవంతంగా నా చేత శ్రాద్ధ పెట్టించబో తున్నావు. కనీసం నా మాటవిని రేపు వండాల్సిన పదార్థాల విషయంలోనైనా క్లుప్తంగా, పొదుపుగా జాగ్రత్తపడు. ఏవోనాలుగు పచ్చడిమెతుకులు విదిలిస్తే పనిజరిగిపోతుంది కదా!' అన్నాడు ఉద్దాలకుడు.

'నా మీద పెత్తనం ఏమిటి? నీమాటలు వినేదాన్ననుకొన్నావా నేను? రేపుచూడు. వంటలన్నీ సశాస్త్రీయంగా ఎంత అద్భుతంగా చేస్తానో', శ్రాద్ధకర్మను నియమబద్ధంగా జరిపించి తీరుతాను. నీ వరకూ నోరుమూసుకొని చేయాల్సిన పనిచేయి చాలు' అని భర్తను శాసించింది చండి. ఉద్దాలకుడు గురువుగారి ఉపాయాన్ని తు.చ. తప్పకుండా ఆచరించడంతో మరుసటిరోజు శ్రాద్ధకర్మ సశాస్త్రీయంగా జరిగింది. భోక్తలు సంతృప్తి చెందారు. వారికి తగిన విధంగా సత్కారాలు చేసింది చండి. గృహస్థులైన ఉద్దాలకుడు, చండిలు భోజనం చేయాల్సిన సమయం వచ్చింది.

కార్యక్రమం సజావుగా జరిగినందుకు పట్టరాని ఆనందం కల్గింది ఉద్దాలకునికి. ఆ తన్మయత్వంలో కార్య విధానాన్ని మరచిపోయి'. చండీ! చక్కగా పూజించిన ఈ పార్వణాన్ని (పిండాన్ని) తీసుకెళ్ళి గంగా జలంలో కలిపిరా!' అన్నాడు.

ఉద్దాలకుడు మరచినా చండి తన పద్ధతిని మరచిపోయే అజ్ఞానురాలు కాదాయె! భర్తచెప్పిన దానికి వ్యతిరేకంగా చేయడమే ఆమె కర్తవ్యం. కనుక పార్వణాన్ని తీసుకెళ్ళి భర్త చూస్తుండగానే పెంట కుప్పమీద విసిరి పడేసింది.

అప్పటిదాకా ఉగ్గపట్టుకొని నిగ్రహంతో భార్యను మన్నిస్తూ వచ్చిన ముని ఒక్కసారిగా భగ్గుమన్నాడు. 'ఆసి! పాపిష్టురాలా! ఎంత పనిచేసావు? పరమ పవిత్రమైన పార్వణాన్ని పెంటకుప్పపాలుచేస్తావా? ఇక నీ ఆగడాలు చాలు! గుండెను బండరాయి చేసుకొని బ్రతుకుతున్న నీవు కూడా బండరాయిగా మారు. ఇదే నా శాపం!' అంటూ భార్యను శపించాడు ఉద్దాలకుడు.

ఆ శాపఫలంగా చండి ఇలా బండ రాయిలా మారింది. కరుణించి ఉద్దాలకుడు సూచించిన శాప విమోచన సమయం చండికి ఇప్పుడు ఆసన్నమయింది. యాగాశ్వ కారణంగా ఆమెకు విమోచనం లభించే అవకాశం లభించింది. భగవద్గీతామృతాన్ని గ్రోలిన కర్మవీరుడవు. నీ స్పర్శతో, అశ్వానికి శిలకూ రెండింటికీ విమోచనాన్ని ప్రసాదించు' అన్నాడు సౌభరి.

చండి, అర్జునుని స్పర్శతో శాపవిముక్తు రాలై బుద్ధిగా భర్తతో కాపురం చేయడానికి ఉద్దాలకమునిని చేరింది.

జైమినీ భారతంలోని అశ్వమేధ పర్వంలోని 16వ అధ్యాయమైన 'శిలామోక్ష' ఘట్టమిది.

సరదాగా నవ్వుకోవడానికి, గయ్యాళులుగా వ్యవహరించేవారిని 'చండి'తో పోల్చుకోవడానికి మాత్రమే ఈ ఐతిహాసిక అంశాన్ని ఇక్కడ ఉదహరించడంలేదు.

జైమిని మహర్షి 'చండి కథ'ను మనకు తన 'మహాభారతం'ద్వారా తెలియపరచడం ద్వారా కొన్ని సామాజిక ధర్మాల నిర్వహణపట్ల మన బాధ్యతలను స్పష్టంచేసే ప్రయత్నం చేసాడు.

వివిధ సామాజిక సంస్థలలాగే 'కుటుంబమూ' ఒక సామాజిక సంస్థే! ఇది అన్ని సంస్థలకూ మూలాధారమైన సంస్థ. కుటుంబ ధర్మాల







నిర్వహణలో అవసరమైన సమన్వయమూ, సర్దుబాటు ధోరణిలేకుండా ధార్టికంగా వ్యవహరించే 'చండి' లాంటివారి మనస్తత్వం అది స్త్రీలకైనా, పురుషులకైనాసరే తగనిది. ఆ విషయాన్నే ఈ కథ స్పష్టం చేస్తుంది.

ఈ కుటుంబ వ్యవస్థకేకాదు, వివిధ సామాజిక వ్యవస్థలకు కూడా ఇదే నియమం వర్తిస్తుంది. 'ఒకరు చెబితే నేను వినేదేంటి?' అనే మనస్తత్వం సామాజిక వికాసానికి, ధార్మిక సహజీవనానికి అవరోధం. ఈ రకమైన మనస్తత్వాలు కొద్దిగానో, గొప్పగానో, మన వికాసతరంగిణి కార్యక్రమాలలో కూడా తటస్థపడుతుంటాయి.

'చెప్పింది వినకపోవడమే కాదు, వాడు ఇలా చెప్పాడు కాబట్టి ఖచ్చితంగా నేను అలా చేస్తాను' అనే విపరీత ధోరణి కొన్ని సందర్భాలలో ఎదురౌతుంటుంది. సామాజిక వికాసం కోసం పనిచేయాలనుకొనే వికాసతరంగిణి కార్యకర్తలకు, పదిమందినీ కలుపుపోవాల్సిన సమయంలో ఈ రకమైన **'చండీ వారసులు'** అప్పుడప్పుడు ప్రత్యక్షమౌతూంటారు. అలాంటి వారితో 'జాగ్రత్త'గా కాస్త దూరంగా, అంటీ అంటనట్టుగా వ్యవహ రించడమే మనకు తగినది.

'చండీ వారసుల'తో ఘర్షణపడి, మనసునూ, సమయాన్ని భగ్నపరచుకొని, వైరం పెంచుకొనే ధైర్యం విజ్ఞత కలవారెవ్వరూ చేయరు. అయితే ఉద్దాలకునికి ఏర్పడ్డ సంకట పరిస్థితే కొన్ని పరిస్థితులలో **సహచర** బృందంతో పనిచేయాల్సి వచ్చినప్పుడు ఏర్పడుతుంది.

పరంపరగా **పైతృక సంపదగా** మనకు లభించిన **సనాతన ధర్మపు** విలువలను భగవద్బంధువులందరికీ తెలియపరచాలి. వాడవాడల్లోని వ్యక్తి వ్యక్తికీ **ఆధ్యాత్మిక ఆహారాన్ని** పరమాదరంతో అందించాలి. 50 లక్షల కుటుంబాలకు సంవత్సరకాలంలో ఆత్మీయతాస్పర్శతోకూడిన భగవత్ సందేశాన్ని అందించాలి. ఇది మన గీతాజ్యోతి పరమలక్ష్యం.

మనం ఈ దిశగా పయనించకపోతే, పనిచేయకపోతే **మరొకడెవ్వడో** తన దిశగా మన వారిని మరల్చుకొంటాడు. 'మనం' చేయాల్సిన పనిని మనం చేయాలి' మన పూర్వీకుల, ఋషుల ఋణాన్ని తీర్చుకొనే విధానమే ఇది అని భావించి గీతాజ్యోతి **ధర్మక్షేత్రాలకు** రూపకల్పన చేసారు స్వామి. **స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ', 'మాధవ సేవగా సర్వప్రాణి సేవ'** సూత్రాల ప్రాతిపదికపై పనిసాగించమన్నారు.

సామాజిక పరివర్తనాన్ని ఆశించి పది మంది తోనూ కలిసి చేయాల్సిన ఉద్యమమిది. ఇందులో కలిసి అడుగులు వేసేవారు కొందరైతే, ఎదురు ప్రశ్నలు వేసి ఇబ్బందులు పెట్టేవారు ఎందరో ఉంటారు. తాటాకులు కట్టేవారికి, అడ్డంకులు కల్పించేవారికి కొదువ ఎక్కడుంది? మన చుట్టుప్రక్కలుండి మనతో కలిసి పనిచేయాల్సిన వారే, కలసి పనిచేసేవారే అప్పుడప్పుడు ఎన్నో ఆటంకాలు సృష్టిస్తుంటారు వీరంతా **చండీ అంశలే.** అలాంటప్పుడు మనం ఏం చేయాలి?

మనం ఉద్దాలకుడిలా సహకరించని వారిని 'బండరాయి' కమ్మని శపించలేము. ఆ విషయంలో మనకు అంత అధికారమూ, శక్తీ లేదు. మనకు తగినదీ కాదు. కనుక మనం చేయాల్సిన పని 'చండివారసుల'ను గుర్తించి, వారిని మార్చే బాధ్యతను భగవంతునికి అప్పగించి మన పనిని మనం చేసుకుపోవడం చేయాలి.

**ఈ నీతిని ఆచరించడంతోపాటు, యథాప్రకారం ఈ కథ కు కూడా తగినపేరు సూచించడం మరువకండీ..!**

| | |
|---|---|
| "మధులుబ్ధో యథాభృంగః | ''Madhu lubdho: Yatha: Bhrungah |
| పుష్పాత్ పుష్పాంతరం వ్రజేత్ | Pushpath pushpa:ntharamVraje:th |
| జ్ఞానలుబ్ధ స్తథా శిష్యః | Jna:na lubdho: thattha: sishyah |
| గురోః గుర్వంతరం వ్రజేత్" | guro:r gurvantharam vraje:th" |

***A bee collects drops of honey from different flowers thus makes a hue.***

***Real student seeking knowledge approaches great people and learns from each event. Not only from just persons but also from The Mother Nature, he learns so many lessons at every moment and thus becomes a scholarly model to the world.***



## శుభవార్త

**ఈ ఆంగ్ల సంవత్సరాది (జనవరి 2003) నుండి చాన్ద్రమాన 'తారణ' సంవత్సరాది (మార్చి 2004) వరకు వినూత్నంగా 15 నెలలను సంతరించుకున్న పంచాంగం క్యాలెండర్ అందమైన దివ్య దేశాల సువర్ణ చిత్రాలతో మనకు సన్మార్గ దర్శనంచేయడానికి సిద్ధంగా ఉంది.**

**మన '*భక్తినివేదన*' ద్వారా మహాసిమెంట్స్‌వారు భక్తితో నివేదిస్తున్న ఈ విలక్షణమైన పంచాంగం క్యాలెండర్ మన వికాస తరంగిణి శాఖలన్నింటి వద్ద లభిస్తుంది. త్వరపడండి.**

ఆశిస్తే.... అందమైన పంచాంగం..!! ఆలసిస్తే.... ఆశాభంగం..!!

మూల్యము : మాత్రమే జై శ్రీమన్నారాయణ...!!







నచికేతుడు

నచికేతుడు







# వికాస దర్శిని నివేదన

కరీంనగర్ జిల్లా జగిత్యాల పట్టణంలో శ్రీస్వామివారు 24వ, తేదీన అత్యంత వైభవంగా గీతాజ్యోతి ధర్మక్షేత్ర కార్యక్రమం నిర్వహించి రాత్రి 2.30 గంటలకు హైదరాబాద్ చేరుకున్నారు. శ్రీమాన్ పెరటి ప్రతాప్‌రెడ్డి దంపతుల ఆహ్వానాన్ని మన్నించి హోటల్‌సప్తగిరి 2వ దశ ప్రారంభించడానికి విచ్చేసారు.

25-11-2002 : హైదరాబాద్ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం 10.00 గంటలకు శ్రీస్వామివారు నాంపల్లిలో నూతనంగా 36 గదులతో నిర్మించిన భవనాన్ని ప్రారంభించారు. యజమానులు శ్రీమతి పెరటి రమాదేవి, శ్రీమాన్ ప్రతాప్‌రెడ్డి, కుమారుడు శ్రీమాన్ రుక్మిణికాంత్‌రెడ్డిని తమ ద్రవ్యాన్ని ధార్మిక కార్యాలలో మరింతగా వినియోగించే ఔదార్యాన్ని పెరుమాళ్ళు కృప చేయుగాక అని మంగళాశాసనం చేసారు. ఈ సందర్భంగా సుదర్శన హోమం కూడా జరిగింది.

మధ్యాహ్నం శ్రీమాన్ వీరమల్ల సుదర్శన్‌గారి ఆహ్వానంపై సరూర్‌నగర్, ఖర్మన్‌ఘాట్‌లోని హిమగిరి రైస్‌మిల్‌ను సందర్శించి మంగళాశాసనం చేసారు. అనంతరం శ్రీమాన్ బి. శ్రవణ్ (జెట్ భవనంలో ఉండే శ్రీమాన్ రాముగారి సోదరులు) గారి గృహానికి వేంచేసి మంగళాశాసనం చేసారు.

సాయంకాలం 5-00 గంటలకు అష్టలక్ష్మీ ఆలయాన్ని సందర్శించి ఆలయానికి అనుబంధంగా నూతనంగా నిర్మించిన ప్రవచన మండపాన్ని, వాణిజ్య భవన సముదాయాన్ని ఉద్ఘాటన కావిస్తూ ప్రతి ఆలయమూ ఆ ప్రాంతంలోని వారందరికి అమ్మ ఒడిలాగా ఉండాలని ప్రవచనంలో అందరికీ మంగళా శాసనములు కృపచేసారు.

అనంతరం శ్రీస్వామివారు డా॥ రామనాథం గారి ఆహ్వానంపై దిల్‌సుఖ్‌నగర్ పిల్లల హాస్పిటల్‌కు వేంచేసి గీతాజ్యోతి అంబులెన్స్‌ను ఉద్ఘాటనం చేసారు. శ్రీస్వామివారు Free Child Health cardను ఆవిష్కరించారు. మున్సిపల్ చైర్మన్ శ్రీమాన్ సురేష్ రెడ్డిగారిచే Free Chaild Immunisation card ను, శ్రీమాన్ గౌతంరెడ్డి గారు Mother & child health cardను ఆవిష్కరించారు. శ్రీమాన్ రామనాథంగారు ఆరోగ్యవికాస్ బ్యానర్‌పై ఔదార్యంతో చేస్తున్న వైద్య, ఆరోగ్య సేవలను ప్రశంసిస్తూ దంపతు లిరువురికి, పరివారానికి అనేక మంగళా శాసనములు కృపచేసారు.

రాత్రి 7.30 ని॥లకు ఆండాళ్ నిలయంలో జరిగే శ్రీకందాడై రామానుజాచార్యస్వామివారి సమ్మాన సభకు వేంచేసారు. ఈ సభకు వరంగల్ నుండి మహా మహోపాధ్యాయ శ్రీ ఉ.వే. శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామివారు కూడా వేంచేసారు. కందాడై స్వామివారు సంప్రదాయానికి చేస్తున్న విశిష్ట సేవలను శ్లాఘిస్తూ మరింత విస్తృతంగా తమ సమయాన్ని సత్సంప్రదాయ పరిమళ పరివ్యాపన దిశలో కేంద్రీకరించే శక్తి, ఓర్పు పెరుమాళ్ళు ప్రసాదించుగాక! అని దంపతు లిరువురికి శ్రీస్వామివారు మంగళాశాసనముల నుగ్రహించారు. మధ్యాహ్నం నుండి శ్రీమాన్ దైవజ్ఞ శర్మగారు కూడా శ్రీస్వామివారితో పాటు అన్ని కార్యక్రమాల్లో అన్వయించారు.

రాత్రి 10.00గంటలకు దోమలగూడలోని శ్రీమాన్ మదన్‌మోహన్ మాలవ్యగారి గృహానికి వేంచేసారు. శ్రీవారి శిష్యులైన వారి తల్లి శ్రీమతి కాంచనరత్నమాలగారు ఆచార్య తిరువడిన లంకరించిన సందర్భంగా వారి కుటుంబ సభ్యులను పలుకరించి, సాంత్వన వచనాలు పలికి బోయిన్‌పల్లి లోని శ్రీమతి రమాదేవి, శ్రీమాన్ ప్రభాకర్‌రావు (C.E., R&B Dept.) గారింటికి వేంచేసారు.

వీరి కుమారుడు చి॥ డా॥ దిలీప్ వివాహము చి॥ల॥సౌ॥ డా॥ స్మితతో జరిగిన శుభ సందర్భంగా నూతన వధూవరులకు శ్రీస్వామివారు మంగళా శాసనాలు అనుగ్రహించారు. సత్సంతానాన్ని లోకానికందించి సత్సంప్రదాయంలో ప్రవర్తించేట్టు చేయాలని చెప్పారు. రాత్రి వీరింటిలోనే బస చేసారు. 26న ఉదయం శ్రీస్వామివారు ఆరాధనాదులు ముగించుకొని శ్రీమాన్ ప్రభాకర్‌రావు దంపతులకు కుటుంబ సభ్యులందరికి మంగళాశాసనములనుగ్రహించి మ॥ 12-30కు నిజామాబాద్ జిల్లాలో గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగా ముఖ్యంగా గ్రామాలనే లక్ష్యంగా సందర్శించి స్వీయ ఆరాధన-సర్వ ఆదరణ, మాధవ 'సేవగా సర్వప్రాణి సేవ' అనే సూత్రాలను వారికి విశదం చేయడానికి బయల్దేరారు.

## నిజామాబాద్ జిల్లా పర్యటన

మధ్యాహ్నం 3.00గంటలకు ఇందల్‌వాయ్ గ్రామము వద్ద నిజామాబాద్ జిల్లా వికాస తరంగిణులు, గీతాజ్యోతి కమిటి శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఎస్. వెంకటాచార్యస్వామివారి మార్గనిర్దేశంలో శ్రీమాన్ గంప శ్రీనివాస్, శ్రీమాన్ లక్ష్మారెడ్డిగారు మరియు బృందము శ్రీస్వామివారికి తమ జిల్లాలోకి ఘనంగా స్వాగతం పలికారు. శ్రీస్వామివారు మధ్యాహ్నం 3.00 గంటల నుండి రాత్రి 3.00 గంటలవరకు నిర్విరామంగా తిరుమన్‌పల్లి, ధర్పల్లి, పెద్దవాల్గోట్, కొండూర్, మైలారం, జాగిర్యాల, రామన్నపేట, సుంకెట, మోర్తాడ్ గ్రామాలను సందర్శించి అక్కడ చేరిన అశేష జనానికి అద్భుతమైన గీతాజ్యోతి కార్యక్రమ సూత్రాలను వివరిస్తూ తక్షణ కర్తవ్యాన్ని ఉద్బోధించారు.

ఈ గీతాజ్యోతి ప్రచార యాత్రలో కార్యకర్తలకు సంబంధించిన 20 కార్లు, తత్త్వ ప్రచారకులు శ్రీమాన్ గంగాధర్‌గారు గీతాజ్యోతి రథముతో పాల్గొన్నారు. అనుకున్న సమయానికి రెండు మూడు గంటల తేడాతో ఆయా గ్రామాలను సందర్శించినా భక్తులు ఏమాత్రం అలుపు లేకుండా శ్రీస్వామివారి కోసం అత్యంత ఉత్సాహంతో నిరీక్షిస్తూ నృత్య, వాద్య, గీతాలతో తమ తమ గ్రామాలలోకి స్వాగతం పలికి తమ భక్తి శ్రద్ధలను ప్రకటించారు. మంచి కార్యక్రమాన్ని అందుకొని, ఆచరించి, అందరికీ అందించడానికి మేమంతా స్వామీజీ ! మీ వెంట ఉన్నామని తమ సంసిద్ధతను వ్యక్తం చేసారు. వారి ఉత్సాహానికి శ్రీస్వామివారు అనేక మంగళా శాసనములననుగ్రహించి తెల్లవారు ఝాము 3.00గంటలకు నిజామాబాద్ చేరుకొని శ్రీమాన్ గంప శ్రీనివాస్‌గారి గృహంలో బస చేసారు.

27న ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీస్వామివారు ప్రెస్‌మీట్‌లో పాల్గొన్నారు. అన్ని ప్రధాన దిన పత్రికలు, T.V. ఛానల్స్ ఇందులో పాల్గొన్నాయి. గీతాజ్యోతి కార్యక్రమ వైశిష్ట్యాన్ని వివరించి, ప్రస్తుత పాలన, విద్య, ఎండోమెంట్స్ వ్యవస్థలో ఉన్న లోపాలను వివరించి సరిదిద్దుకోవలసిన మార్పులను కూడా సూచించారు. అలాగే విలేఖరులు చిత్తశుద్ధితో వాస్తవాన్ని ప్రజలకందించాలని ఆశీర్వదించారు.

శ్రీస్వామివారు మధ్యాహ్నము 2.00 గంటలకు ప్రముఖ వస్త్రవ్యాపారవేత్తగారి గృహానికి వేంచేసి వారికి మంగళాశాసనములందించి నిజామాబాద్ పట్టణమునుండి బయల్దేరారు. మ॥ 3.00







గంటలకు డిచ్‌పల్లి చేరుకొని శ్రీమాన్ కిషన్‌రెడ్డి (సర్పంచ్)గారి ఆహ్వానంపై 14వ శతాబ్దమునాటి చారిత్రాత్మకమైన శ్రీసీతారామచంద్రస్వామి దేవస్థానాన్ని సందర్శించారు. శిథిలావస్థలో ఉన్న దీనిని ఊరివారంతా కలిసి చక్క బరుచుకోవాలని చేయవలసిన మార్పులను, సవరింపులను సూచించి కామారెడ్డికి బయల్దేరారు. సా॥ 5-30 గంటలకు కామారెడ్డి వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ డా॥ రాజగోపాలరావుగారి గృహానికి వేంచేసారు. ఈ మధ్యన వీరింట్లో దొంగలు పడి వీరి ధర్మపత్నిని తీవ్రంగా కొట్టి చంపారు. డాక్టరుగారిని పరామర్శించి సాంత్వన వచనాలు పలికి మంగళాశాసనములనుగ్రహించి హైదరాబాద్ బయల్దేరారు.

శ్రీస్వామివారు 8-30గంటలకు హైదరాబాద్ చేరుకుని నిజాంపేటలోని శ్రీరాజధాని రెసిడెన్సియల్ స్కూల్ 15వ వార్షికోత్సవం సందర్భంగా వేంచేసి చిరంజీవులకు స్ఫూర్తిదాయకమైన సందేశాన్నందించారు. వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీమాన్ మక్కపాటి చంద్రశేఖరరావుగారికి, అధ్యాపక బృందానికి సూచనలందిస్తూ Moral teaching కూడా ఉండాలి. దానివల్ల పిల్లలు చక్కనిసంస్కారవంతులుగా తయారవుతారన్నారు. అనంతరం శ్రీస్వామివారు రాత్రి 11.00 గంటలకు దోమల్‌గూడలోని జెట్ భవనాన్ని చేరుకున్నారు.

28-11-2002న శ్రీస్వామివారు హైదరాబాద్ నుండి ఉదయం 11.30కు విమానంలో విశాఖపట్టణానికి బయల్దేరారు. శ్రీవారిరాకకై వేచిఉన్న వందలాది మంది భక్తులను శ్రీవారు ఆప్యాయంగా పలకరించి అక్కడ నుండి శ్రీమాన్ UAN రాజుగారి ఆహ్వానంపై కూర్మన్నపాలెం లక్ష్మీపురంకాలనీ, శ్రీ వెంకటేశ్వర స్వామి ఆలయాన్ని సందర్శించారు. అక్కడ చేరిన భక్తులందరికీ గీతాజ్యోతి సందేశాన్నిచ్చారు. శ్రీమాన్ అశోక్‌రాజు గారిగృహాన్ని సందర్శించారు. అనంతరం మధ్యాహ్నం 3.00 గంటలకు తత్త్వ

ప్రచారకులు శ్రీమాన్ రఘునాథాచార్యులుగారు, శ్రీమాన్ ఇ. రామానుజాచార్యులుగార్ల ఆహ్వానంపై అనకాపల్లి సమీపంలోని కొండకొప్పాక అనే గ్రామానికి వేంచేసి వారి నూతన గృహాన్ని పునీతం చేసారు. అప్పటికే అక్కడికి చేరిన 25 వికాసతరంగిణుల భక్త సందోహం శ్రీవారికి ఘన స్వాగతం పలికారు. అనకాపల్లి వికాసతరంగిణి 3వ వార్షికోత్సవం శ్రీవారి సన్నిధిలో జరిగింది. శ్రీమాన్ పీతాంబరం రఘునాథా చార్యులుగారు ప్రతి వికాస తరంగిణిని శ్రీవారికి పరిచయం చేసి వారిచేత గీతాజ్యోతి కార్యక్రమాల వివరాలను విజ్ఞాపన చేయించారు. చోడవరం, కసింకోట, నర్సింగ్‌రావుపేట, తుని, శ్రీహరిపురం, పాయకరావుపేట, అనకాపల్లి- శారదానగర్, గవరపాలెం, గాంధీనగర్, వేంపాడు, మాడుగుల, గాజువాక, నర్సీపట్నం, ఏటికొప్పాక, మర్రిపాలెం, తేజాపురం, అక్కయ్యపాలెం, స్నేహధార, కొత్తపాలెం, రేపాక, M.V.P కాలని, సెక్టార్-9, జగన్నాథపురం, కేశవపురం, విజయనగరం, బొబ్బిలి, బాలలవికాసతరంగిణి వారు కూడా ఈ సందర్భంగా పాల్గొని శ్రీవారిని సేవించుకొన్నారు. గీతాజ్యోతి సందేశాన్ని మరింత సమర్థవంతంగా ఎలా సమాజానికి అందించాలి అనే విషయాన్ని శ్రీస్వామివారు కార్యకర్తలకు వివరించి జ్ఞాపికలను అందించి మంగళా శాసనములను గ్రహించారు.

బొబ్బిలి వాస్తవ్యులు డా॥ మురళీకృష్ణగారి ధర్మపత్ని శ్రీమతి మైథిలీకుమారి కీర్తిమూర్తులు శ్రీ ఉ.వే. శ్రీమాన్ తె.కం గోపాలాచార్యస్వామివారి ద్వారా ఉపదేశ రూపంగా విన్నవన్నీ 'తిరు మంత్రార్థము' అనే గ్రంథరూపములో కూర్చగ దాన్ని ఆవిష్కరించి, వారికి మంగళా శాసనములు కృపచేసారు.

ఈకార్యక్రమాన్ని రూపొందించిన శ్రీమాన్ ఇ. రామానుజాచార్యులుగారికి, ఈ వార్షికోత్సవాన్ని అందంగానిర్వహించిన అనకాపల్లి వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమతి టి. మమతగార్కి, శ్రీమతి శైలజ గార్కి, వన దుర్గపీఠ నిత్యసేవకులు శ్రీమాన్ పీతాంబరం రామానుజాచార్యులు గారికి కూడా మంగళా శాసనాలను గ్రహించారు. శ్రీమాన్ రఘునాథాచార్యులుగారి గృహం ఆధ్యాత్మిక కార్యక్రమాలకు నిలయం కావాలని మంగళా శాసనం చేసి అక్కడకు విచ్చేసిన శ్రీమాన్ కాశీరాజు గారికి విశాఖ వికాసతరంగిణి ప్రెసిడెంట్ శ్రీమాన్ 'స్నేహధార' సత్యనారాయణగారికి, శ్రీమాన్ యస్. రామానుజంగారికి, శ్రీమాన్ యస్.టి.పి. రాజ గోపాలాచార్యులుగారికి, గీతాజ్యోతి కార్యక్రమం గురించి ముచ్చటించి వారందరికి మంగళా శాసనాలు అందించారు.

హేస్టలాయ్ కాస్టింగ్ లిమిటెడ్ ఫ్యాక్టరీవారి మేనేజింగ్ డైరెక్టర్‌గారి అభ్యర్థన మేరకు సమీపంలో ఉన్న వారి ఫ్యాక్టరీని సందర్శించి మంగళాశాసనం చేసారు. శ్రీస్వామివారు రాత్రి 8.00 గంటలకు అనకాపల్లి చేరి శ్రీమాన్ కొణతాల జగన్నాథరావు నాయుడు (జగన్) మున్సిపల్ ఛైర్మన్ గారి అభ్యర్థనపై వారి కుమార్తెను, అల్లుడిని మంగళా శాసనంచేసి భారతీయ వివాహ సంప్రదాయం ఎంత గొప్పదో, దానికుండే పవిత్రతనుగురించి, దంపతులు ఎంత అన్యోన్యంగా ఉండాలో, అక్కడ చేరిన వేలాది మందికి శ్రీవారు అనుగ్రహభాషణం కావించి అక్కడి నుండి తూ.గో. జిల్లా మండపేట బయల్దేరారు.

మధ్యలో రాత్రి 11-00 గంటలకు జగ్గయ్యపేట ఆగమకళాశాల మేనేజర్ శ్రీమాన్ బాబు దంపతులు సర్పవరంలో నూతనంగా నిర్మించుకున్న గృహాన్ని శ్రీస్వామివారు తమ పాదస్పర్శతో పునీతం చేసి అర్ధరాత్రి ఒంటిగంటకు శ్రీ పెద్దజీయరుస్వామివారి అవతార స్థలమైన అర్తమూరు చేరుకున్నారు. శ్రీమాన్ కర్రిపాపారాయుడుగారి గృహంలో కొంత సమయంగడిపారు. వారు మండపేటలో నూతనంగా నిర్మించిన "కామత్ ఆర్కేడ్" భవన







సముదాయ మును అర్ధరాత్రి 2-10 ని॥లకు ఉద్ఘాటన కావించారు. పెరుమాళ్ళతో యుక్తంగా వేంచేసి 5 అంతస్తులు కలిగి సకల సౌకర్యాలతో కూడిన ఆ భవనమంతటా పర్యటించి శ్రీస్వామివారు తమ పాదస్పర్శతో పునీతం గావించారు.

29-11-2002 శ్రీస్వామివారు ఉదయం తీర్థగోష్ఠి కామత్ ఆర్కేడ్‌లోనే నిర్వహించారు. అనంతరం విచ్చేసిన వివిధ వికాస తరంగిణులకు, భక్తగోష్ఠికి మంగళాశాసన పూర్వక అనుగ్రహ భాషణమును కృపచేసారు. తూ.గో. జిల్లా వికాసతరంగిణి కో-ఆర్డినేటర్‌గా శ్రీమాన్ కర్రి పాపారాయుడు దంపతులు గీతాజ్యోతి కార్యక్రమానికి విశేషంగా అందిస్తున్న సేవలను శ్లాఘిస్తూ వీరి నూతన భవనము భగవద్భాగవత ఆచార్యసేవకు నిలయం కావాలనిమంగళాశాసనములందించి బయల్దేరారు.

మధ్యాహ్నం 1.30 గంటలకు వీరభద్రపురము లోని శ్రీమతి సత్యవతిగారి సోదరులు పీపర్తి వీరభద్రారావు, నారాయణరావుగార్ల నూతన గృహాన్ని ఉద్ఘాటనం కావించారు. మ॥ 2-20 గంటలకు జొన్నాడలోని శ్రీమాన్ దొరబాబుగారి గృహానికి వేంచేసి మంగళాశాసనం చేసారు. సాయంకాలం 4-00గంటలకు శ్రీమతి విజయమ్మగారి ఆహ్వానంపై ప.గో. జిల్లా, భీమవరం చేరుకున్నారు. అల్లూరి సీతారామరాజు కళాక్షేత్ర ప్రాంగణంలో నిర్మించిన శ్రీనివాస పద్మావతీ కళ్యాణమండపాన్ని ఉద్ఘాటన కావించారు. ఈ సందర్భంగా విచ్చేసిన భక్తగోష్ఠికి మంగళాశాసన పూర్వక ప్రవచనాన్నను గ్రహించారు. శ్రీస్వామివారు 9-00గంటలకు కనుమూరి కృష్ణకుమారి, గోపాలరాజుగారి గృహానికి వేంచేసి పాదపూజను స్వీకరించారు. ఆరాధన కూడా కావించి తీర్థగోష్ఠి నిర్వహించి రాజమహేంద్రి బయల్దేరారు. అర్ధరాత్రి 12-00 గంటలకు రాజమహేంద్రి చేరుకుని గ్రంధివారి కల్యాణ మండపంలో బసచేశారు.

**30-11-2002 నుండి 2-12-2002 వరకు రాజమహేంద్రిలో ఉభయ వేదాంత సభలు**

30వ తేదీన తీర్థగోష్ఠి కాగానే ఉ॥9-30 గంటలకు శ్రీస్వామివారు గ్రంధి కల్యాణ మండపంలోనే జ్యోతి ప్రజ్వలనచేసి సభను ప్రారంభించారు.

గీతాజ్యోతి కార్యక్రమం జరుగుతున్న తరుణం కనుక ప్రవచనాలన్నీ భగవద్గీతపైన సాగాలని ఉభయవేదాంత పీఠం కార్యదర్శి శ్రీ ఉ.వే. శ్రీమాన్ డా॥ రంగరామానుజా చార్యస్వామివారు నిర్ణయించారు. భక్తినివేదన సంపాదకులు శ్రీ ఉ.వే. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారు 9వ అధ్యాయంపై ప్రవచించారు. శ్రీ ఉ.వే. శ్రీమాన్ వేంకటాచార్య స్వామివారు గీతావతరణమును విశదీకరించారు. మ॥12-00 గంటలకు సభ సమాప్తం కాగానే నల్లమందుసందు ప్రాంతంలోని శ్రీ వేంకటేశ్వర స్వామి దేవాలయాన్ని సందర్శించారు. అనంతరం వంకాయలవారి వీధి ప్రాంతంలో నిర్మాణదశలో ఉన్నఅష్టలక్ష్మీ ఆలయానికి వేంచేసి తగు సూచనలందించారు.

గీతాభవనంకు వేంచేసి తీవ్ర ఆనారోగ్యంతో బాధపడుతున్న శ్రీమాన్ కృష్ణగారిని పరమర్శించి, శ్రీమాన్ మాదల కృష్ణమూర్తిగారి ఆహ్వానంపై మోరంపూడిలోని సిద్ధార్ధ అకాడమి సందర్శించారు. విద్యార్ధులందరికి మంగళా శాసనాలననుగ్రహిస్తూ విద్యయొక్క విశిష్టతను, గీతాజ్యోతి సూత్రాలను వివరించారు. విద్యార్ధులపై ప్రత్యేకంగా రూపొందించిన చిత్రగీతను పరిచయం చేసి అభ్యాసం చేయించడంలో అధ్యాపకులకు తగిన సూచనలందించారు. సాయంకాలం 4-30 గంటలకు మతమార్పిడి ఉద్ధృతంగా సాగుతున్న శాటిలైట్‌సిటినిసందర్శించిఅచటి రామాలయంను మంగళాశాసనం చేసి పాఠశాల ఆవరణలో ఏర్పాటు చేసిన సభలో గీతాజ్యోతి కార్యక్రమ వైశిష్ట్యాన్ని వివరించి, ప్రలోభాలకు లొంగి మతం మార్చుకొని నైతికంగా దిగజారకూ డదని హెచ్చరించారు. సాయంకాలం 6-00 గంటలకు ఆనం కళాకేంద్రంలో శ్రీ విష్ణు సహస్రనామ పారాయణం అనంతరం శ్రీ తులసీ రామానుజ కూటం 110వ వార్షిక మహోత్సవం సందర్భంగా శ్రీమాన్ కర్రిరామారెడ్డిగారు తులసీ రామానుజ కూటం ద్వారా నిర్వహించిన విశేష కార్యక్రమాలను శ్రోతలకు స్మరింపచేసారు. ఉభయ దారులకు శ్రీవారు జ్ఞాపిలనందించి శాలువాతో సత్కరించారు. అనంతరం శ్రీస్వామివారు గీతాజ్యోతి గురించి పురస్సర దివ్య సందేశాన్నందించారు.

1-12-2002న 2వ రోజు సభలో శ్రీ ఉ.వే. శ్రీమాన్ అయ్యంగార్ స్వామివారు (వరంగల్), శ్రీ ఉ.వే. శ్రీమాన్ కోనప్పాచార్యస్వామివారు (రాజ మహేంద్రి) శ్రీ ఉ.వే. శ్రీమాన్ రామానుజాచార్య స్వామి (పెంటపాడు) వారు భగవంతుడు గీతలో అందించిన అనేక విషయాలను హృద్యంగా శ్రోతలకందించారు. చివరగా శ్రీస్వామివారు మంగళాశాసనం చేస్తూ రామానుజులవారు ప్రతి యుగంలోను అవతరించారని, త్రేతలో భరత, లక్ష్మణ, శత్రుఘ్నులుగా మూడు రూపాల్లో, ద్వాపర యుగంలో బలరామానుజుడైన శ్రీ కృష్ణునిగా, కలియుగములో సాక్షాత్ భగవద్రామానుజులుగా అవతరించారు. సంసారసాగరంలో కొట్టుమిట్టాడు తున్న మనల్ని కడతేర్చడానికే వారి అవతారమని ప్రవచించారు.

మధ్యాహ్నం 12-30గంటలకు శ్రీస్వామివారు శ్రీమాన్ రంగరాజభట్టర్‌స్వామి వారి అభ్యర్ధనపై కోరుకొండ వేంచేసి కీ.శే. మాధవరావుగారి జ్ఞాపకార్థం వారి కుటుంబ సభ్యులు పెంచల నాయుడు మొ॥వారు ప్రార్థించగా శ్రీలక్ష్మీ నృసింహ స్వామి దేవస్థానమునకు వైభవముగా గ్రామ ప్రారంభంలో నిర్మించిన ముఖద్వారమును ఉద్ఘాటనం కావించి, భట్టరుస్వామివారి గృహాన్ని, శ్రీనివాసాచార్యులుగారి నూతన కుటీరాన్ని మంగళాశాసనం చేసి, ఆలయానికి వేంచేసి పెరుమాళ్ళను సేవించుకొని మంగళాశాసనం చేసారు. అనంతరం పత్రికా విలేఖరుల సమావేశంలోపాల్గొన్నారు. అశేష భక్తగోష్ఠికి మంగళాశాసనములు కృపచేసారు.

మధ్నాహ్నం 2-30కు వికాస తరంగిణి కార్యకర్త శ్రీమాన్ బాబి అభ్యర్థన మేరకు వారి స్వగ్రామమైన ''కోటి'' వేంచేసారు. మొదటగా గీతాజ్యోతి సందర్భంగా ఏర్పాటు చేసిన దంతవైద్య శిబిరాన్ని సమీక్షించి డా॥ శ్రీధర్, డా॥ త్రివేణి మరియు సేవలోపాల్గొన్న సిబ్బందికి మంగళా శాసనములు కృపచేసారు. అనంతరం రామాలయం సందర్శించి అశేష భక్తగోష్ఠికి తమ అనుగ్రహభాషణములో గీతాజ్యోతి సూత్రాలను వివరించి తక్షణ కర్తవ్యాన్ని ఉద్బోధించారు.

శ్రీస్వామివారు తిరిగి రాజమహేంద్రికి వెడుతూ మధ్యలో వరాహలక్ష్మీ నృసింహస్వామి ఆలయానికి వేంచేసి అమ్మవారికి వెండి కిరీటము, పరహస్త, పరపాదాలు, పెరుమాళ్ళకు బంగారు హారమును అలంకరించారు.

సా॥ 5-30 గంటలకు ఆనం కళాకేంద్రానికి వేంచేసారు. పారాయణంతో కార్యక్రమం







ప్రారంభమయింది. అనంతరం వేద పాఠశాల 4వ వార్షికోత్సవ వేడుకలు జరిగాయి. ఈ సందర్భంగా కడియం MLA శ్రీమాన్ రాంమోహన్‌రావు గారు పాల్గొని శ్రీస్వామివారి మంగళాశాసనములను పొందారు. వేదపాఠశాల గురువుగారు శ్రీమాన్ రంగనాథాచార్యస్వామి (మైత్రాయణీ శాఖ)కి, వారి శిష్యులకు జెట్-వికాసతరంగిణి వారు శ్రీస్వామివారి చేత శాలువాలు కప్పి సమ్మానం చేయించారు. భక్తగోష్ఠికి కొద్దిసేపు వేదఘోషను వినిపించి పరమానంద-భరితులను చేసారు. వెంటనే వేదపాఠశాల ఉభయదారులకు కూడా శాలువా, జ్ఞాపికలతో సత్కరించారు. శ్రీస్వామివారు తమ ప్రవచనంలో వేదం మానవ జీవితానికి మూలమని దాన్ని పరిరక్షించుకొనవలసిన కర్తవ్యం మన అందరిదని పేర్కొన్నారు. గీతాజ్యోతి కార్యక్రమంలో 33వ వారం శ్లోకం (13-1) "**ఇదం శరీరం ....** శ్లోకాన్ని వివరించారు. అదే అధ్యాయంలో భగవానుడు చెప్పినఅమానిత్వం అదంభిత్వం మొ॥గు గుణాలను అలవర్చుకోవాలని విశదీకరించారు. ప్రవచనం కాగానే చిత్రగీత పోటీలోవిజయం సాధించిన చిన్నారులకు బహుమతుల ప్రదానం చేసారు.

2-12-2002న 3వ రోజు సభలో మధురవాక్ శిఖామణి శ్రీ ఉ.వే. శ్రీమాన్ సాతులూరి గోపాల కృష్ణమాచార్య స్వామివారు (సింహాచలం), శ్రీ ఉ.వే. శ్రీమాన్ రంగా చార్యస్వామివారు (రాజమహేంద్రి) జ్ఞానయోగము లోని భగవదవతార రహస్యాన్ని ప్రవచించారు. ఉభయ వేదాంత సభా సారథులు శ్రీ ఉ.వే. శ్రీమాన్ డా॥ ఎస్.వి. రంగరామానుజా చార్యస్వామివారు శ్రీవిష్ణు పురాణంలోని విశేషాన్ని భగవద్గీతతో అన్వయిస్తూ తమ ప్రవచనం కొనసాగించారు. శ్రీమాన్ మార్గపురి లక్ష్మినృసింహా చార్యస్వామి (కోరుకొండ), శ్రీమాన్ శాంతారాం (సీతానగరం)కూడా వాచిక కైంకర్యమును సమర్పించుకొన్నారు. సభ ముగింపుసందర్భంగా శ్రీస్వామివారు మంగళాశాసన ప్రవచనం చేస్తూ యుక్తా యుక్త వివేకం లేకపోవడమే దుఃఖాలకి మూలకారణం, భగవంతుడు మీ వెంట ఉన్నాడని గుర్తుంచుకోండి. **మా శుచః** అని 3 సార్లు ముచ్చటగా భగవంతుడు అర్జునుడిని వ్యాజంగా పెట్టుకొని మనందరికి ధైర్యాన్ని ప్రసాదించాడు. శోకదూరులమవుదాం! ఆనందసాగరంలో తేలియా డుదాం! అని ప్రవచించారు. శ్రీమాన్ గ్రంధి నాగేశ్వర రావుగారు ప్రభృతులు ప్రవచనములు అందించిన వారందరికి యథోచిత సమ్మానం సమర్పించు కున్నారు.

మధ్యాహ్నం 2-00గంటలకు శ్రీ వేణుగోపాల స్వామి ఆలయాన్ని సందర్శించి దశవతారాలు, ఆళ్వారాచార్యులతో కూడిన రజత ద్వారాన్ని ఉద్ఘాటన చేసారు. ఈ సందర్భంగా రాజమండ్రి MLA శ్రీమాన్ బుచ్చయ్య చౌదరిగారు, ఎండోమెంట్స్ అధికారులు శ్రీమతి అరుణ కుమారిగారు, శ్రీమాన్ నర్సింహారావుగారు కూడా అన్వయించి శ్రీస్వామివారిని సేవించి మంగళా శాసనాలు పొందారు. ఆలయ ప్రధానార్చకులు శ్రీమాన్ అనంతాచార్యస్వామి వారిని, అర్చక పరివారమునకు ధర్మకర్తలకు మంగళాశాసనము లందించి భక్తగోష్ఠికి అనుగ్రహభాషణము నందించారు.

శ్రీస్వామివారు 3.00గంటలకు ఆయుర్వేద వైద్యులు డా॥ పద్మజారాణి, డా॥ హరవిజయ్ కుమార్‌గారి ఆహ్వానంపై మైదవోలు వారి వీధిలోని వారి గృహానికి వేంచేసి "గాయత్రి చారిటబుల్ ట్రస్ట్"ను ప్రారంభించారు. విద్యాభ్యాసం చేస్తూ ఫీజులు కట్టుకోలేని పేద బ్రాహ్మణ విద్యార్థులకు స్కాలర్‌షిప్స్ ఈ ట్రస్ట్‌ద్వారా ఇస్తున్నారు. ట్రస్ట్ సేవలు వర్ధతాం అభివర్ధతాం అని శ్రీస్వామివారు మంగళాశాసనం చేసారు.

శ్రీస్వామివారు సా॥ 4-00 గంటలకు శ్రీమతి వేదవతి ఎస్.ఎన్. రాజుగారి ఆహ్వానంపై ధవళేశ్వరం-గౌతమి సదన ఆవరణలో జరిగే గీతాజ్యోతి కార్యకర్తల సమావేశానికి వేంచేసారు.

మత మార్పిడులు ఉధృతంగా జరుగుతున్న ప్రాంతమిది. గీతాజ్యోతి సూత్రాలను వివరించి మతం విషయంలో చక్కటి అవగాహనను ప్రసాదించి ప్రచారంలో తీసుకోవలసిన జాగ్రత్తలను, మెళకువలను సూచించారు.

6.00 గంటలకు ఆనం కళాకేంద్రానికి చేరుకున్నారు. శ్రీమాన్ కర్రిరామారెడ్డిగారు మల్టీ మీడియా ద్వారా ఈ నెలలోని గీతాజ్యోతి శ్లోకమాలికలోని నాలుగింటిని సంక్షిప్త మనో హరంగా చూపించి అందరిని పరమానంద భరితులను చేసారు. శ్రీస్వామివారు వారి కృషిని, సమర్థతను శ్లాఘించారు. వీరు మానసిక తత్త్వవేత్త మాత్రమే కాకుండా ఆధ్యాత్మిక తత్త్వవేత్త, మూర్తీభవించిన వినయ, విధేయతలకు మారు పేరు. సతతమూ విద్యార్థియే సతతమూ ఉపాధ్యాయులే అంటూ మంగళాశాసనాలను అందించారు. గీతాజ్యోతి కార్యక్రమ ప్రచారం రాజమహేంద్రిలో ముమ్మరంగా సాగడానికి ముఖ్యకారకులైన శ్రీమాన్ నందం సీతారామ రాజుగారికి ప్రత్యేకముగా మంగళాశాసనములు కృపచేసారు. తర్వాత శ్రీస్వామివారు తమ ప్రవచనంలో 13వ అధ్యాయంలో భగవానుడను గ్రహించిన అహింస, క్షాన్తిః, ఆర్జవం మొదలగు గుణాలను విశ్లేషించారు. కార్యకర్తలకు, ఉభయదారులందరికీ జ్ఞాపికలను ప్రదానం చేశారు. శ్రీ ఉ.వే.శ్రీమాన్ డా॥ యస్.వి. రంగ రామానుజాచార్యస్వామివారి మార్గ దర్శకత్వంలో డా॥ రాజారామ్‌గారు, డా॥ రామారెడ్డి గారు, డా॥నారాయణరావుగారు, వర్మగారు, గ్రంధి నాగేశ్వరరావుగారు, నందం సీతారామరాజుగారు, డా॥ ప్రసాద్ చౌదరిగారు, రంగప్రసాద్‌గారు, మూర్తిగారు, గుప్తగారు, బాబి, రమేష్, చిరంజీవి గారు వారికుమారులు రామ్ మరియు శ్యామ్ గార్లు, విఠల్‌గారు (పి.ఆర్.ఓ), సత్యనారాయణ గారు, గ్రంథిరాంచంద్ర రావుగారు, రామలింగేశ్వర రావుగారు, ఆంజనేయులుగారు, విశ్వనాథ్‌గారు, సంపత్‌గారు, సత్యనారాయణమూర్తిగారు, రమేశ్ (రాజారామ్‌గారి స్టాఫ్), సత్యనారాయణ (ఆటో), పెద్దిరాజు ఇంకా అనేకమంది కార్యకర్తలు చక్కటి సేవలందించి గీతాజ్యోతి ప్రయుక్త ఉభయవేదాంత సభాది కార్యక్రమాలు విజయవంతం కావడానికి కారకులయ్యారు. తత్త్వప్రచారకులు కుమారి శారదగారు, కుమారి ఉషగారు చేదోడువాదోడుగా ఉండి కార్యక్రమాలను సమన్వయం చేయడంలో సహకరించారు. రాత్రి గం॥ 10-00లకు కార్యకర్తల సమావేశం జరిగింది. వచ్చేగోదావరి పుష్కరాలకు ఇప్పటినుండే సమాయత్తం కావాలని, వచ్చిన భక్తులందరికీ లేదనకుండా తదీయారాధన నిర్వహించాలని, దక్షులయిన కార్యకర్తలను సమీకరించుకోవడం చాలా ముఖ్యమని, వచ్చిన భక్తులకు ఉండుటకు వసతి కల్పించడం, అవసరమైతే మన మన గృహాల్లోకూడా కొంత మందికి వసతి కల్పించే ఏర్పాటు చేస్తే బాగుంటుందని శ్రీస్వామివారు తగు సూచనలందించారు. ఈ గోదావరి పుష్కరాలను ప్రారంభంలో 7 రోజులు రాజమహేంద్రిలో, చివరి 7 రోజులు ఆదిలాబాద్ జిల్లా మంచిర్యాలలో జరుగుతాయని విశదం చేశారు.

3-12-02 : శ్రీస్వామివారు తీర్థగోష్ఠి అనంతరం సమాశ్రయణ కార్యక్రమం నిర్వహించి రాజమహేంద్రి నుండి 'తుని' ధర్మక్షేత్ర కార్యక్రమానికి బయల్దేరారు.

మధ్యాహ్నం 3-00 గం॥లకు తుని పట్టణానికి చేరుకొని పాయకరావుపేటలోని శ్రీమాన్ గడ్డం శ్రీనివాసరావు, శ్రీమాన్ కోరుకొండ కృష్ణగార్ల గృహానికి మంగళాశాసనం చేసారు. సా॥ 4 గం॥లకు తిమ్మాపురం శ్రీమహావిష్ణుదేవాలయానికి విచ్చేసారు. ఈ సందర్భంగా విష్ణుమాల వేసుకున్న దీక్షాపరులు 1000 మంది (Cream Colour) దీక్షావస్త్రాలను ధరించి బారులు తీరి కూర్చొని చక్కటి శోభను







కల్గించారు. దీక్షను స్వీకరించిన వారు మొత్తం 1300 మంది దాకా ఉన్నారు. వయోభేదం లేకుండా, అంతస్తులు తేడాలు మరచి అంతమంది ఈ విధంగా దీక్షను స్వీకరించడం శ్రీస్వామివారికి అమితానందం కల్గించింది. శ్రీస్వామివారు పెరుమాళ్ళను సేవించుకొని తమ అనుగ్రహ భాషణమును కృపచేసారు. ఈ సందర్భంగా ఆర్థిక శాఖామాత్యులు శ్రీమాన్ యనమల రామకృష్ణుడు, టి.టి.డి. చైర్మన్ శ్రీమాన్ చలపతిరావుగారు కూడా పాల్గొని శ్రీస్వామివారి మంగళాశాసనం పొందారు.

సా॥ గం॥ 6-30 ని॥లకు శ్రీస్వామివారు శ్రీమాన్ వి.హెచ్.యస్. నర్సింహారావుగారి ఆహ్వానంపై శ్రీ ప్రకాశ్ విద్యా సంస్థను సందర్శించి విద్యార్థులకు విద్యయొక్క ఆవశ్యకతను ప్రవచించి తక్షణ కర్తవ్యాన్ని ఉద్బోధించారు. చిత్రగీతలో పాల్గొని గెలుపొందిన వారికి బహుమతి ప్రదానం చేసి అందరికీ మంగళాశాసనములందించి పాయకరావు పేట MLA శ్రీమాన్ చెంగల్రావు గారి గృహానికి వేంచేసారు. ప్రజాసేవలను ఇతోధికముగా చేసే శక్తి భగవంతుడు ప్రసాదించుగాక! అని మంగళా శాసనం చేసారు. అనంతరం పాయకరావుపేట వికాసతరంగిణి ఆహ్వానంపై పాండురంగ స్వామి ఆలయానికి వేంచేసి, పెరుమాళ్ళను సేవించి అనుగ్రహభాషణము నందించారు. ఇది పెద్దజీయరుస్వామివారు వేంచేసి మంగళాశాసనం చేసిన ఆలయం కావడం విశేషం. వికాసతరంగిణి ద్వారా చక్కటి సేవలందిస్తున్న శ్రీమతి ఆండాళ్ గారికి, సభ్యులందరికీ ప్రత్యేక మంగళా శాసనాలందించారు.

రాత్రి గం॥ 9-00 తుని పట్టణంలోని రోటరీ క్లబ్‌లో గీతాజ్యోతి కార్యకర్తలు, ఉభయదారులతో శ్రీస్వామివారు సంభాషించారు. ఉభయదారులకు జ్ఞాపికలుకూడా అందించారు. ఈ సందర్భంగా అన్నవర దేవస్థానం ఇ.ఓ. శ్రీమాన్ యమ్. శేషగిరిబాబు మరియు వేదపండితులు వచ్చి, అన్నవరం వేంచేసి పెరుమాళ్ళను మంగళాశాసనం చేయవలసినదిగా శ్రీస్వామివారిని ప్రార్థించారు, రేపు సేవించుకుంటాం అనగానే వారి సంతోషానికి అవధుల్లేవు. పరమానంద భరితులయ్యారు.

రాత్రి గం॥ 10-30 ని॥లకు శ్రీమాన్ యనమల కృష్ణుడుగారింటికి వేంచేసారు. శ్రీస్వామివారికి బస ఇక్కడ ఏర్పాటు చేసారు.

### 'తుని' 4వ ధర్మక్షేత్ర కార్యక్రమం 4-12-02

శ్రీస్వామివారు ఆరాధనాదులు ముగించుకొని గీతాజ్యోతి ఉ॥ 11-00గం॥లకు యన్. అన్నవరంలోని వసిష్ఠస్కూల్ ఆవరణలో ఏర్పాటు చేసిన దంతవైద్య శిబిరాన్ని ప్రారంభించారు. డా॥ శివనాగిరెడ్డి మరియు సిబ్బందికి, వసిష్ఠ స్కూల్ నిర్వాహకులు కె.యస్.యన్. రాజు దంపతులకు మంగళాశాసనములందించి ఇదే గ్రామంలోని రామాలయం ఆవరణలో ఏర్పాటు చేసిన పశువైద్య శిబిరాన్ని ప్రారంభించారు. దీన్ని ఏర్పాటు చేయడంలోకృషి చేసిన చోడిశెట్టి వెంకట్రావుగారు, త్రిమూర్తులస్వామిగార్లు మరియు వైద్యసేవ లందిస్తున్న డాక్టర్లకు, సిబ్బందికి మంగళా శాసనములనుగ్రహించారు. ఈ సందర్భంగా శ్రీస్వామివారు తమ ప్రవచనంలో పశువులయెడ ఒక పవిత్రభావన ఉండాలని, వాటిని పాలిచ్చే యంత్రాలుగా భావించడం మహాపాపమని అన్నారు. అనంతరం తుని రోటరీ క్లబ్ భవనంలో నేత్ర వైద్య శిబిరాన్ని ప్రారంభించారు.

### గీతాజ్యోతి శోభాయాత్ర

సరిగ్గా మ॥ 12-00 గం॥లకు శోభాయాత్ర ప్రారంభమైంది. పుష్పాలతో అలంకరించబడిన రథంలో శ్రీస్వామివారితోపాటు టి.టి.డి చైర్మన్ శ్రీమాన్ చలపతిరావుగారు, శ్రీస్వామివారి రథానికి ముందు ముగ్గురు ముగ్గురుగా 1000 మంది విష్ణుదీక్షా భక్తులు, తప్పెటగుళ్ళు, రథానికి వెనుక 150 గ్రామాల నుండి వచ్చిన అశేష భక్తజనంతో

తుని ప్రధాన వీధులగుండా శోభాయాత్ర అత్యంత శోభాయమానంగా సాగింది.

గీతాజ్యోతి సూత్రాలను, కృష్ణం వందే జగద్గురుమ్, జై శ్రీమన్నారాయణ అని నినదిస్తూ, భగవన్నామంతో అత్యద్భుతంగా సాగింది శోభాయాత్ర. అతి తక్కువ సమయంలో వైభవంగా జరిగిన శోభాయాత్రగా దీనిని చెప్పవచ్చును.

మ॥ గం॥ 1-30 ని॥లకు పత్రికా విలేఖరుల సమావేశంలో పాల్గొని, గం॥ 2-30 ని॥లకు అన్నవరం వేంచేసి పెరుమాళ్ళను సేవించుకుని మంగళాశాసనం చేసారు. అర్చక బృందం, అధికార బృందం ఆలయ మర్యాదలను శ్రీస్వామివారికి సమర్పించారు. శ్రీస్వామివారి సూచన మేరకు ఇ.ఓ. శ్రీమాన్ శేషగిరిబాబుగారు స్పందించి ఆలయ పరిసర గ్రామాల్లో, పట్టణాల్లో ధర్మప్రచారం నిర్వహించుటకై ఒక కమిటీని ఏర్పాటు చేస్తామన్నారు. శ్రీస్వామివారు సంతోషించి తమ మంగళాశాసనములు కృపచేసారు.

### శ్రీకృష్ణ పూజలు

సా॥ 4-00 గం॥లకు శ్రీస్వామివారు తుని ధర్మక్షేత్ర వేదికపైకి వేంచేసారు. శ్రీస్వామివారు అశేష భక్తజనానికి ప్రవచనాన్ని అనుగ్రహించారు. ఇతర మతస్థులు బలవంతంగా చేసే మతమార్పిడులను ఆపాలని, పరస్పరం సౌహార్దంతో మెలగుతూ సమాజ ప్రగతికి పాటుపడాలని చెప్పారు. 'స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ', 'మాధవ సేవగ సర్వప్రాణిసేవ' అనే గీతాజ్యోతి సూత్రాలపై చక్కటి అవగాహనను కలిగించారు. అనంతరం శ్రీస్వామివారు కృష్ణపూజ కార్యక్రమాన్ని అశేషభక్తగోష్ఠి చేత విధివిధానంగా చేయించారు. తర్వాత వసిష్ఠ స్కూల్, ఉషోదయ కాన్వెంట్ చిన్నారులు ప్రదర్శించిన కష్ణం వందే జగద్గురుమ్, అన్నమాచార్య కీర్తనలపై ప్రదర్శించిన నృత్యం అందరినీ అలరించింది. శ్రీస్వామివారు సానందంగా వీక్షించి చిన్నారులందరికీ మరియు వారికి శిక్షణనిచ్చి ప్రోత్సహించిన టీచర్లకు, యాజమాన్యమునకు మంగళాశాసనములు కృపచేసారు. ఈ తుని ధర్మక్షేత్ర కార్యక్రమంలో సంపూర్ణంగా స్వామివారితో ఉండి ప్రత్యేక శోభను కల్గించిన ఆర్థిక శాఖామాత్యులు యనమల రామకృష్ణుడుగారికి, గీతాజ్యోతి కార్యక్రమాన్ని స్వీకరించి ఎలాంటి విపత్తులేర్పడ్డా భయపడకుండా ముందుకుసాగి ఇంత వైభవానికి కారకులైన శ్రీమాన్ కుసుమంచి సుబ్బరాయలు, యనమల కృష్ణుడు, చెన్నకాంతారావు, కె.యస్.యన్. రాజుగారు, చెన్న రామారావు, ఆర్. రామారావు, చైర్మన్ తలుపుల రావులకు శ్రీస్వామివారు అభినందన పూర్వక మంగళాశాసనములు కృపచేసారు.

చక్కటి మార్గదర్శనం చేస్తూ గీతాజ్యోతి కార్యక్రమాన్ని ఆరు మండలాలకు చెందిన 150 గ్రామాల్లో లక్షా యాభైవేలమందికి అందించి ప్రచారం దిగ్విజయంగా నిర్వహించిన తత్త్వ ప్రచారకులు శ్రీమాన్ పీతాంబరం రఘునాథాచార్యస్వామివారు, శ్రీమతి హైమావతిగారు సహకరించిన శ్రీమాన్ శ్రీనివాస వర్మగారు, ఐ. రామానుజాచార్యగారు, గీతాజ్యోతి రథ సిబ్బంది కొండలరావు, శ్రీను, చక్కటి ప్రణాళికనందించిన వికాస తరంగిణి ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ భవానీ ప్రసాద్‌గార్లకు శ్రీస్వామివారు ప్రత్యేక మంగళాశాసనములు కృపచేసారు. ఇంకా గీతాజ్యోతి రథం ఆయా మండలాలకు వెళ్ళినపుడు సహకరించిన సత్యనారాయణ, రామచంద్రమూర్తి, ఆర్.యస్. యస్. సత్య, దర్శి మోహన కృష్ణ, యమ్. రామారావు (తుని వికాసతరంగిణి శాఖ అధ్యక్షులు), తిరుపతి, మహంతి శ్రీనివాస్, పెనుగొండ రాజాబాబు, దర్శి సత్తిబాబు, శేషగిరిరావు (తుని మండలాధ్యక్షులు) మొదలగువారందరికీ శ్రీస్వామివారు తమ దివ్య మంగళాశాసనములు కృపచేసారు.

ప్రచార కార్యక్రమంలో భాగంగా శ్రీమాన్ రఘునాథాచార్యస్వామివారు కొలిమేరు 'గ్రామానికి







వెళ్ళినప్పుడు వీరి ప్రవచనానికి ప్రభావితులై తమ గ్రామంలో శిథిలావస్థలో ఉన్న రామాలయాన్ని బాగుచేసుకొనుటకు వెంటనే తలా కొంత వేసుకొని 1,50,000 రూ॥ల నిధిని సిద్ధంచేసుకోవడం విశేషం.

25,000 మందికిపైగా భక్తులు అనేక గీతాగోష్ఠుల నుండి తరలివచ్చి ఈ కార్యక్రమంలో పాల్గొని సేవించి తరించారు. సాయంకాలం 7 గం॥లకు ధర్మక్షేత్ర కార్యక్రమం దిగ్విజయంగా పూర్తయింది. అనంతరం శ్రీస్వామివారు శ్రీవేంకటేశ్వర ఆలయానికి వేంచేసి పెరుమాళ్ళను సేవించి మంగళాశాసనం చేసారు. శ్రీమాన్ చెన్న కాంతారావుగారు, శ్రీమాన్ సుబ్బరాయలుగారి గృహాలనుకూడా తమ పాదస్పర్శతో పునీతం చేసి రాత్రి గం॥ 9-30ని॥లకు తుని పట్టణం నుండి శ్రీకాకుళం జిల్లా పర్యటనకు బయల్దేరారు.

### 5-12-02 అచ్యుతాపురం

ఉదయాత్పూర్వము 3-00 గం॥లకు శ్రీస్వామివారు శ్రీకాకుళం జిల్లాలోని అచ్యుతాపురం చేరుకొని శ్రీమాన్ లక్ష్మణ్‌రావుగారి గృహంలో బస చేసారు. శ్రీస్వామివారితో మానస సరోవర యాత్రలో పాల్గొన్న శ్రీమాన్ విశాల్‌గుప్తగారి పురుషకారంతో ఈ గ్రామానికి శ్రీస్వామివారు వేంచేసారు. శ్రీమాన్ లక్ష్మణరావుగారు ఆస్తికాగ్రేసరులు. రామాలయాలను అన్ని హంగులతో వైభవంగా నిర్మింపచేసి తమవంతు కర్తవ్యాన్ని చక్కగా నిర్వర్తిస్తున్నారు. వీరి శ్రద్ధ, భక్తికి సంతోషించి శ్రీస్వామివారు వేంచేసారు.

ఉ॥ 8-00 గం॥లకు శ్రీస్వామివారు అమెరికా వారికి టెలిబ్రిడ్జ్‌లో ప్రవచనాన్ననుగ్రహించి, 10-00 గం॥లకు తీర్థగోష్ఠి నిర్వహించారు. అనంతరం సమాశ్రయణ కార్యక్రమం జరిగింది.

మధ్యాహ్నం గం॥ 1-30 ని॥లకు శ్రీస్వామివారు రామాలయ ఆవరణలో వివిధ గ్రామాలనుండి వచ్చిన అశేష భక్తజనంచేత లక్ష్మీనారాయణ పూజ చేయించారు.

సా॥ 5-00 గం॥లకు చిన్నారులు ప్రదర్శించిన పందిరి నృత్యాన్ని వీక్షించి శ్రీస్వామివారు పరమానంద భరితులయినారు. బృందానికంతటికీ అనేక మంగళాశాసనములందించారు. అనంతరం భక్తగోష్ఠికి గీతాజ్యోతి జరుగుతున్న ఈ తరుణంలో చేయవలసిన తక్షణ కర్తవ్యాన్ని గుర్తుచేసారు. గీతాజ్యోతి సూత్రాలను విశదీకరించారు.

6-12-02 నాడు శ్రీస్వామివారు ఆరాధనాదులు ముగించుకొని శ్రీమాన్ లక్ష్మణ్‌రావు విజయలక్ష్మి దంపతులకు, కుటుంబసభ్యులందరికీ మంగళాశాసనములనుగ్రహించి ఉ॥ 10-00 గం॥లకు అచ్యుతాపురం నుండి బయల్దేరి 'అలుదు' అనే గ్రామం వేంచేసారు. శ్రీమాన్ లక్ష్మణ్‌రావుగారి యొక్క బావగారు, వరుదు రఘునాథరావు సుజాతమ్మ దంపతులు నిర్మింపచేసిన రామాలయమును సందర్శించి మంగళాశాసనం చేసి నందిగామ చేరుకున్నారు. నందిగామ నుండి సమీపంలోని పెంటూరు వరకు శోభాయాత్ర అశేష భక్తజనంతో సాగింది. గీతాజ్యోతి సందర్భంగా ఏర్పాటు చేసిన పశువైద్యశిబిరాన్ని ప్రారంభించి డా॥ ప్రసాద్‌గారికి, నిర్వాహకులు బొడ్డ జనార్దన్, ఎ.వి. ప్రసాద్‌గార్లకు మంగళాశాసనములు కృపచేసారు. భక్తగోష్ఠికి గీతా సందేశాన్నందించి మ॥ 2 గం॥లకు "మందసా" గ్రామం చేరుకుని అశేషభక్తజనానికి గీతాజ్యోతి సందేశం అందించారు. ఈ గ్రామంతో మన పెద్దజీయరుస్వామివారికి, శ్రీ ఉ.వే.శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారికి సన్నిహిత సంబంధం ఉంది. ఇచ్చట శ్రీ ఉ.వే.శ్రీమాన్ రామానుజా చార్యస్వామివారని గొప్ప విద్వాంసులు ఉండేవారు. వారివద్దనే శ్రీభాష్యమును ఆచార్య స్వాములిరువురూ అభ్యసించారట. ఆరోజుల్లో వైభవంగ సాగే శ్రీవాసుదేవస్వామి ఆలయం ప్రస్తుతం శిథిలావస్థలో ఉంది. దాని నిర్వహణ బాధ్యత మన శ్రీస్వామివారు స్వీకరించి పునరుద్ధరణకు ఏర్పాట్లు చేసారు. శ్రీస్వామివారు వేంచేసిన ఈ సందర్భంగా భువనేశ్వర్ నుండి స్థపతి

శ్రీమాన్ రఘునాథ్ మహాపాత్రోను పిలిపించి రూ. 40 లక్షల ఖర్చుకాగల పునర్నిర్మాణాన్ని లాంఛనంగా ప్రారంభింపచేసారు. గ్రామములోని ప్రముఖులతో శ్రీస్వామివారు మాట్లాడి, మీ గ్రామం పురోఖభివృద్ధి సాధించి సుభిక్షంగా ఉండాలంటే ఈ ఆలయ పునరుద్ధరణకు మీరు కూడా ద్రవ్యరూపేణా సేవారూపేణ మీ శ్రద్ధను కనబర్చాల నగానే అందరూ తమ సంసిద్ధతను వ్యక్తం చేశారు. శ్రీస్వామివారు వారికి అనేక మంగళాశాసనము లందించి మందసా నుండి బయల్దేరారు.

రాత్రి 7 గం॥లకు నర్సన్నపేటలో అందవరపు రామమూర్తి, టెంకాల బాబ్జిగార్ల గృహాలను శ్రీస్వామివారు తమ పాద స్పర్శతో పునీతం చేసి శ్రీకాకుళం వేంచేసారు. భక్తినివేదన సంపాదకులు శ్రీ ఉ.వే.శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామి వారి కుమారులు శ్రీమాన్ రామానుజాచార్యస్వామి వారు శ్రీస్వామివారికి ఘనంగా స్వాగతం పలికారు. వికాసతరంగిణి పరివారానికి, భక్తజనానికి శ్రీస్వామివారు గీతాజ్యోతి సందేశాన్నందించారు. శ్రీకాకుళం మున్సిపల్ చైర్మన్ శ్రీమతి పైడిశెట్టి జయంతిగారు గీతాజ్యోతి కార్యక్రమాన్ని తమ ప్రాంతంలో చేయించే బాధ్యతను స్వీకరించడం శ్రీస్వామివారికెంతో ఆనందాన్ని కల్గించింది. అందరికీ శ్రీస్వామివారు దివ్యమంగళా శాసనములందించి రాత్రి 10 గం॥లకు 'రాజాం' పట్టణం చేరుకొని శ్రీమాన్ విశాల్ గుప్తగారి గృహానికి వేంచేసారు. ఆ దంపతులు, కుటుంబ సభ్యులు శ్రీస్వామివారికి పాదపూజ చేసారు. రాత్రి శ్రీస్వామివారు వీరి గృహంలోనే బస చేసారు. శ్రీకాకుళం పర్యటలో ఇచ్ఛాపురం వికాస తరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ రుక్మాంగధరరెడ్డిగారు కూడా శ్రీస్వామివారిని అనుసరించారు.

7-12-02 ఉ॥ 9గం॥లకు శ్రీస్వామివారు ఆరాధన కాగానే భక్తగోష్ఠికి గీతాజ్యోతి సందేశాన్ని కృపచేసి తీర్థాన్ని అనుగ్రహించారు. అనంతరం శ్రీమాన్ విశాల్‌గుప్త కుటుంబసభ్యులందరికి మంగళా శాసనములను గ్రహించి సమీపంలోని రాజగోపాలస్వామి ఆలయానికి వేంచేసి పెరుమాళ్ళను సేవించి మంగళా శాసనం చేసారు. ప్రముఖ న్యాయవాది శ్రీమాన్ కె. పార్థసారథిగారు, వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమతి సీతాదేవి హరనాథ్ బాబు గార్ల గృహాలను వేంచేసి మంగళా శాసనాలనుగ్రహించారు. డా॥ దామెర రాజేందర్‌గారి అభ్యర్థనపై రాధాకృష్ణ నర్సింగ్‌హోమ్‌ను సందర్శించి రాజాం నుండి బయల్దేరారు. మధ్యాహ్నం 1-00 గం॥కు "లైదామ్" గ్రామంలోని శివానందాశ్రమం చేరుకున్నారు. పూజ్య శ్రీ రామయోగిగారు ఈ ఆశ్రమాన్ని నిర్వహిస్తూ, ఈ ప్రాంతంలో ఆధ్యాత్మిక, సామాజిక సేవలు చక్కగా నిర్వహిస్తున్నారు. వారి శ్రద్ధకు సంతోషించి శ్రీస్వామివారు వేంచేసారు. పరిసర గ్రామాలనుండి విశేషంగా వేల సంఖ్యలో భక్తులువచ్చి శ్రీస్వామివారిని సేవించుకొని గీతాజ్యోతి సందేశాన్ని విని అందరికి అందిస్తామని వాగ్దానం చేసారు. అందరికీ మంగళాశాసనము లందించి సా॥ 4-00 గం॥లకు విశాఖపట్టణంలోని శ్రీమాన్ యు.ఎ.యన్. రాజుగారి కుమారులు శ్రీమాన్ కాశీరాజుగారి గృహానికి వేంచేసారు. స్నానం, సంధ్యావంద నాదులు ముగించుకొని శ్రీమాన్ కాశీరాజు దంపతులకు మంగళాశాసనము లనుగ్రహించి హైదరాబాద్ బయల్దేరారు.

## హైదరాబాద్ : 8-12-02

ఉదయానికి రంగారెడ్డి జిల్లా, మేడ్చల్‌లోని క్షేత్రగిరి శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయానికి చేరుకొని ఆరాధనాదులు కాగానే ఉ॥ 10 గం॥లకు క్షేత్రగిరి శ్రీవేంకటేశ్వరస్వామి వారి ప్రతిష్ఠా మహోత్సవం శ్రీస్వామివారి కరకమలముల మీదుగా ఆగమ విద్వాంసులు శ్రీమాన్ రమాకాంతాచార్యస్వామివారి యాజ్ఞికంలోఅత్యంత వైభవంగా జరిగింది.

ఈ సందర్భంగా హోం శాఖామాత్యులు శ్రీమాన్ దేవేందర్‌గౌడ్, నల్గొండ యమ్.పి. శ్రీమాన్







సుఖేందర్‌రెడ్డి, శ్రీమాన్ దైవజ్ఞ శర్మగారుకూడా విచ్చేసి శ్రీస్వామివారి మంగళాశాసనములు స్వీకరించారు.

ఈ ఆలయం మేడ్చల్, శామీర్‌పేట మండలాలకు మధ్యన ఉన్నది. మాకే చెందినదీ దేవాలయమని ఇరువురూ గొడవపడుతుంటే శ్రీస్వామివారు వారిని శాంతపరచి రెండుమండలాల నుండి కొంత కొంత మంది కమిటీలో ఉండి అందరూ కలిసి ఆలయ అభివృద్ధికి పాటుపడండి అనగానే అందరూ సంతోషంగా అంగీకరించడంతో వాతావరణం ఆహ్లాదకరంగా మారింది. వ్యవస్థాపక ధర్మకర్త శ్రీమాన్ సుదర్శన్ రావుగారికి, అసిస్టెంట్ కమీషనర్ శ్రీమాన్ రాఘవాచార్యులగారికి తగు సూచనలు చేసి మంగళాశాసనములందించారు.

ఈ మధ్య ఆచార్య తిరువడినలంకరించిన శ్రీమాన్ మాధవరపు కిషన్‌రావుగారి (కూకట్ పల్లిలోని) గృహానికి వేంచేసి వారి కుటుంబ సభ్యులను పలుకరించి సాంత్వన వచనాలు పలికి మంగళాశాసనాలు అందించారు శ్రీవారు. అనంతరం డా॥ శ్రీధర్‌రావు, డా॥ భాస్కరరెడ్డిగార్ల అభ్యర్థనపై శ్రీస్వామివారు క్రితం సంవత్సరం ప్రారంభించిన రెమెడి హాస్పిటల్‌కు వేంచేసి ఎమర్జెన్సీ యూనిట్‌ను ప్రారంభించారు.

మధ్యాహ్నం 2-30 ని॥లకు A.P., వెలమ సంఘంవారి సహకారంతో ఆహ్లాదకరమైన వాతావరణంలో నిర్మించిన "వడ్డేపల్లి నర్సింగరావు సీనియర్ సిటిజన్ హోమ్" (వృద్ధాశ్రమం)నకు వేంచేసి శ్రీస్వామివారు తమ పాదస్పర్శతో ఆ ప్రాంతాన్నంతా పునీతం చేసారు. శ్రీమాన్ నర్సింగరావుగారి కృషిని శ్లాఘించారు. ఈ సందర్భంగా శ్రీస్వామివారు ప్రవచిస్తూ కొబ్బరి చెట్టు మొక్కగా ఉన్నప్పుడు కొన్ని నీళ్ళు పోస్తే పెరిగాక జీవితాంతం కృతజ్ఞతతో మనకు తియ్యటి నీటినిస్తుంది. జన్మనిచ్చి, విద్యాబుద్ధులు నేర్పిపెంచి పెద్దచేసిన తల్లిదండ్రులను చెట్టుపాటి కృతజ్ఞత లేక చాలామంది మానసిక క్షోభకు గురిచేస్తున్నారు. పాశ్చాత్య సంస్కృతిని అరువు తెచ్చుకొని సంస్కార హీనంగా ప్రవర్తిస్తున్నారు. శ్రీమాన్ నర్సింగరావుగారు అలాంటివారి తల్లిదండ్రులను దృష్టిలోపెట్టుకొని ఒక ఆవాసాన్ని ఏర్పాటు చేయడం చాలా గొప్ప విషయం అంటూ వారి కృషిని కొనియాడారు. ఈ సందర్భంగా ప్రముఖ రాజకీయవేత్త శ్రీమాన్ రత్నాకర్‌రావుగారు, అయోధ్యరామారావుగారు, మహాసిమెంట్స్ అధినేత శ్రీమాన్ జె. రామేశ్వరరావు గారు, శ్రీమాన్ మాధవరావుగార్లు అనేకమంది ప్రముఖులు పాల్గొని శ్రీస్వామివారి మంగళా శాసనములు పొందారు.

సా॥ గం॥ 5-30 ని॥లకు యూసుఫ్‌గూడ - కృష్ణనగర్‌లోని కాకర్ల సుబ్బారావుగారి (నిమ్స్ డైరెక్టర్) గృహానికి వేంచేసి మంగళాశాసనం చేసారు. ఈ సందర్భంగా చేరిన వైద్యబృందము, బంధు మిత్రులకు గీతాజ్యోతి సందేశపూర్వక అనుగ్రహ భాషణమును కృపచేసారు. శ్రీమాన్ సుబ్బారావు గారి సౌశీల్యాన్ని శ్రీస్వామివారు కొనియాడారు. అంత పెద్ద హోదాలో ఉండి కూడా సామాన్యులతో సైతం అరమరికలు లేకుండా మాట్లాడుతారు. అమెరికాలో ఉన్నప్పటి నుండి వేం గమనిస్తున్నామని శ్రీస్వామివారు అందరితో చెప్పారు.

శ్రీమాన్ భట్టర్‌గారి (అపోలో) అభ్యర్థనపై శ్రీస్వామివారు రాత్రి గం॥ 7-30 ని॥లకు జూబ్లీహిల్స్‌లోని శ్రీవేంకటేశ్వరస్వామి దేవస్థానమునకు వేంచేసి మంగళాశాసనం చేసి అక్కడ నిర్మాణంలో ఉన్న నృసింహస్వామి, సీతారామచంద్రస్వామి, ఆళ్వార్ల సన్నిధులను వీక్షించారు. నూతనంగా నిర్మించిన యాగశాలను సందర్శించి గం॥ 8-30 ని॥లకు ప్రాంతంలో శ్రీస్వామివారు రామాంతపూర్ వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమతి సుగుణ శ్రీనివాస్ గారి గృహానికి

వేంచేసారు. వికాసతరంగిణి వారంతా కలిసి శ్రీస్వామివారికి పాదపూజ మహోత్సవాన్ని నిర్వహించుకున్నారు. అనంతరం ధర్మక్షేత్ర కార్యక్రమ ఏర్పాట్లను మెచ్చుకుంటూ చెప్పారు. 9,10 తేదీల్లో ఇక్కడే వేంచేసి ఉన్నారు.

9-12-02 ఉ॥ తీర్థగోష్ఠి నిర్వహించి శ్రీమాన్ మెన్నగంటి ఉమామహేశ్వర్‌రావు, శ్రీమతి శారద దంపతుల ఆహ్వానంపై చీకుడు మామిడి పల్లిలోని 'ప్రోగెసివ్ ఇంజనీరింగ్ కాలేజ్'ను సందర్శించి విద్యార్థుల నుద్దేశించి ప్రసంగిస్తూ భౌతిక ప్రగతి ఎంత ముఖ్యమో ఆంతర స్వచ్ఛత కూడా అంతే ముఖ్యం. విజ్ఞానానికి విశ్వాసానికి వైరుధ్యం ఎంత మాత్రము లేదు. ఉంటే అది సమగ్రమైన జీవితమనిపించుకోదు. We should not miss the whole for the sake of part అన్నారు. ఈ సందర్భంగా Technical Board Secretary శ్రీమాన్ వెంకట కృష్ణారావుగారుకూడా వచ్చారు.

మ॥ గం॥ 1-30 ని॥లకు యజ్ఞాచార్యులు శ్రీమాన్ చిలకమర్తి శ్రీనివాసాచార్య స్వామివారు, ధర్మకర్తలు శ్రీమాన్ నాగేశ్వర్‌రావు, ప్రసాద్‌గార్ల ఆహ్వానంపై శ్రీరాఘవేంద్ర కాలనీలో శ్రీ పద్మావతి సమేత శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానం సందర్శించి మంగళాశాసనం చేసారు.

**రామాంతపూర్ గీతాజ్యోతి 5వ ధర్మక్షేత్ర నివేదిక**

**'చిత్రలేఖన పోటీలు'** : రామంతపూర్ వికాస తరంగిణి అధ్యక్షులు శ్రీమతి సుగుణ శ్రీనివాస్‌గారి మార్గనిర్దేశంలో, స్కూల్స్ కమిటీ కో-ఆర్డినేటర్ శ్రీమాన్ ఠాకూర్, డి.యస్. హరినారాయణ సింగ్ మరియు కమిటి సభ్యులు కలసి చిత్రగీతపై పోటీలు నిర్వహించారు. 114 పాఠశాలలకు పైగా ఈ పోటీలలో పాల్గొన్నాయి. వేసిన చిత్రాల్లో సెలక్ట్‌చేసి Display చేసారు. శ్రీస్వామివారు 9వ తేది మధ్యాహ్నం 3 గం॥లకు బాగ్ అంబర్‌పేట గీతా కాన్వెంట్ హైస్కూల్‌కు వేంచేసి Display చేసిన వాటిలోంచి మూడింటిని సెలక్ట్ చేసారు. వరుసగా గీతా కాన్వెంట్, ముంతాజ్, శాంతినికేతన్, సేయింట్ ఆన్స్ హైస్కూల్, ప్రథమ, ద్వితీయ, తృతీయ కన్సోలేషన్ బహుమతులు గెలుచుకున్నాయి. శ్రీస్వామివారు వారికి తమ కరకమలముల మీదుగా బహుమతులు ప్రదానం చేసారు. విద్యార్థులందరూ చిత్రాలను చక్కగా వేసారని, శ్రీస్వామివారు అందరిని అభినందించారు. ఈ సందర్భంగా జెట్ హైదరాబాద్ చైర్మన్ శ్రీమతి శ్రీకుమారి రామేశ్వర్‌రావుగారు, జంటనగరాల సమన్వయ కమిటీ అధ్యక్షులు శ్రీమాన్ కల్కి అవతారంగారు, శ్రీమాన్ అర్జున్ కుమార్ గౌడ్ గారు ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు.

**సామూహిక శ్రీకృష్ణపూజలు** : సా॥ ఉప్పల్ X రోడ్స్ వద్దగల ఉప్పల్ మున్సిపల్ స్టేడియంలో శ్రీస్వామి వారి ప్రత్యక్షపర్యవేక్షణలో శ్రీకృష్ణ పూజలు అత్యంత వైభవంగా జరిగినవి. స్టేడియం అంతా గీతాజ్యోతి భక్తగోష్ఠులతో క్రిక్కిరిసిపోయింది. సుమారు 5000 మంది దంపతులు పూజాకార్యక్రమంలో పాల్గొన్నారు. అశేష భక్తజనం సేవించుకున్నారు. పూజలోపాల్గొన్న దంపతులందరికీ శ్రీకృష్ణుని పంచలోహ విగ్రహంతోపాటు అవసరమైన పూజా ద్రవ్యములుకూడా సమకూర్చారు. ఈ కార్యక్రమానికి విచ్చేసిన భగవద్బంధువులకు 14,000 లడ్డూ ప్రసాదం వితరణ చేశారు. శ్రీస్వామివారు మంగళాశాసన ప్రవచనంలో గీతాజ్యోతి కార్యక్రమం ఇంతటితో పూర్తయిందనుకుంటే పొరపాటు. అసలు కార్యక్రమం ఇప్పుడే మొదలయింది. దీనిని చివరి శ్వాస వరకు కొనసాగించి గీతాజ్యోతి సూత్రాలను మనం ఆచరిస్తూ అందరికి చెప్పి ఆచరింపచేస్తూ పరస్పరం సహకరించుకుంటూ సమాజ ప్రగతికి పాటుపడాలని సందేశాన్నిచ్చారు. శ్రీస్వామివారు అందరితో నేతి దీపాలు వెలిగింపజేసి పైకెత్తి పట్టుకొని గీతాజ్యోతి ప్రతిజ్ఞను చేయించారు. ఈ కార్యక్రమానికి ఉప్పల్ మున్సిపల్ చైర్మన్ శ్రీమాన్ డి. శ్రీనివాస్‌గారు, శ్రీమాన్ దైవజ్ఞ శర్మగారు, ఉప్పల్







మండల్ ప్రెసిడెంట్ శ్రీమాన్ యమ్. సుధీర్ రెడ్డిగారు, శ్రీమతి శ్రీకుమారి రామేశ్వర్‌రావు గారు, శ్రీమాన్ కల్కిఅవతారం గారు గౌరవ అతిథులుగా విచ్చేసారు. వేలసంఖ్యలో ఈ కార్యక్రమాన్ని సేవించుకొని తరించారు. శ్రీమతి మంజుల శ్రీగారు సభానిర్వహణ చక్కగా చేసారు. ధర్మక్షేత్ర నివేదిక శ్రీమతి సుగుణ శ్రీనివాస్‌గారు చదివారు. సా॥ 5 గం॥లకు ప్రారంభమైన కార్యక్రమం 7-30ని॥లకు పూర్తయింది.

10-12-2002 : శ్రీస్వామివారు ఉ॥ 10-30 ని॥లకు మహేంద్ర హిల్స్‌లోని శ్రీమతి తోట రమాదేవి శ్రీమాన్ గోవిందరాజులు దంపతులు నూతనంగా నిర్మించుకోబోతున్న భవనానికి శంకుస్థాపన చేసారు. అనంతరం రామంతపూర్ గీతాజ్యోతి ధర్మక్షేత్ర కార్యక్రమంలో భాగంగా పర్వతాపురంలో పశువైద్యశిబిరాన్ని ప్రారంభించడానికి విచ్చేసారు. ముందుగా పూజ్యశ్రీ యాదమాతగారు నిర్వహిస్తున్న శ్రీలక్ష్మీ నృసింహ దేవస్థానానికి వేంచేసి మంగళాశాసనం కావించి అదే ఆవరణలో నిర్మించిన నూతన భవనాన్ని ఉద్ఘాటన చేసి పశువైద్య శిబిరానికి వేంచేసి జ్యోతి ప్రజ్వలన కావించి గోమాత పూజ చేసి శిబిరాన్ని లాంఛనంగా ప్రారంభించారు.

ఈ సందర్భంగా పశుసంవర్ధక శాఖ డైరెక్టర్ డా॥ ఆర్. మోహన్‌రావు, Addil. Director డా॥యల్. మోహన్ Jnt. Director, డా॥ యమ్.వి. రెడ్డి Asst. Director, డా॥ వెంకటరామయ్య, డా॥పార్థసారధి గారు మొదలగు వారు విచ్చేసారు. వైద్య సేవలందించడానికి డా॥ శ్రీనివాస్‌రెడ్డి, డా॥యస్. యమ్‌యస్. ఖాద్రి, డా॥ రాంకృష్ణారావు, డా॥ విజయ్‌కుమార్‌రెడ్డి, డా॥ వేణుగోపాల్రావు, వి.బి.ఆర్.ఐ. నుండి వ్యాధి నిర్ధారణ నిపుణులు డా॥మృణాలిని, డా॥ అనూరాధ, డా॥ సుధారాణి Asst. Director , డా॥ సుబ్బారెడ్డి, డా॥ విద్యాధర రెడ్డి మొదలగు వారు విచ్చేసి సుమారు 1000 పశువులకు వైద్యం చేసారు. పశువులన్నింటికి Foot & Mouth Vaccine ఇవ్వడం జరిగింది. పశువులకు ఆహారంగా ఇచ్చే వివిధ గడ్డిమొక్కల ప్రదర్శనను మరియు పశువులకు పెట్టే ఆహారములను కూడా రైతుల కోసం ప్రదర్శించారు. పశువులను చక్కగా చూస్తున్న రైతులకు అవార్డ్స్ కూడా ఇవ్వడం జరిగింది. జాతీయ అవార్డ్ పొందిన పశువును ఈ శిబిరంలో ప్రదర్శించారు. యజమాని శ్రీమాన్ శంకర్‌యాదవ్‌గారికి శ్రీవారు మంగళాశాసనములు కృపచేసి శోభాయాత్ర ప్రారంభించడానికి మేడిపల్లి వేంచేస్తూ మధ్యలో సాయికృష్ణా హార్డ్‌వేర్ సానిటరీ షోరూమ్ ఉద్ఘాటన కావించారు. గం॥ 1-30 ని॥లకు శోభాయాత్ర స్థలమైన మారుతి హిల్స్‌లోని ఆంజనేయస్వామి ఆలయానికి వేంచేసి ముందుగా నూతనంగా నిర్మించిన సింహద్వారాన్ని ఉద్ఘాటన కావించారు. వివిధ పాఠశాలల విద్యార్థులంతా బారులు తీరి ఇరువైపులా ఉండి వాద్యగోష్ఠితో శ్రీస్వామివారికి స్వాగతం పలికారు.

హనుమత్స్వామిని సేవించుకొని శోభాయాత్ర సందర్భంగా సందేశాన్నిస్తూ శ్రీస్వామివారు, మన శోభాయాత్ర ప్రకృతి మాతను పులకరింపచేస్తుంది. శోభాయాత్ర వల్ల కలిగే సత్ఫలితాలలో మీరంతా భాగస్వాములే మన శోభాయాత్రలో 4 రకముల నినాదములు చేస్తూ ముందుకు సాగుదాం. **1. స్వీయ ఆరాధన - సర్వఆదరణ, 2. మాధవసేవగ సర్వప్రాణి సేవ (చేద్దాం), 3. జై శ్రీమన్నారాయణ!, 4. కృష్ణం వందే జగద్గురుమ్.** అని చెప్పి గీతాజ్యోతిని వెలిగించి శోభాయాత్రను ప్రారంభించారు. ఈ శోభాయాత్రలో పాల్గొంటున్న వివిధ పాఠశాలల విద్యార్థులు, ఉపాధ్యాయులు, యాజమాన్యానికి, అశేషభక్త జనానికి అనేకానేక మంగళాశాసనములు చేసి బయలుదేరారు. సుమారు 9 కి.మీ. సాగిన సుదీర్ఘ శోభాయాత్ర నగర ప్రధాన రహదారులగుండా వెడుతుంటే అశేషభక్తజనం, వచ్చిపోయే వాహనాల్లో ఉండే జనం శ్రీస్వామివారిని సేవించుకొని

తరించారు. సామాజిక స్పృహతో, భక్తి పారవశ్యంతో సాగుతున్న ఈ శోభాయాత్ర వల్ల ట్రాఫిక్‌కు ఇబ్బంది కల్గినా, ఆ విధంగానైనా అశేషజనవాహిని ఈ కార్యక్రమాన్ని, శ్రీస్వామివారిని సేవించి తరించ గలిగారు. వాద్య నృత్య, గీత, నినాదములతో అత్యంత శోభాయమానంగా కనివినీ ఎరుగని రీతిలో జరిగిన ఈ సుదీర్ఘ శోభాయాత్ర సా॥ గం॥ 6-30 ని॥లకు రామంతపూర్‌లోని లింగారెడ్డి గార్డెన్స్‌కు చేరుకుంది. అత్యంత ఉత్సాహంతో అలుపెరుగకుండా శోభాయాత్రలో పాల్గొన్న భక్తగోష్ఠినుద్దేశించి శ్రీస్వామివారు సందేశాన్నిస్తూ మనం ప్రగతి సాధించాలంటే మానసికంగా కుదురు ఏర్పడాలి. లేకపోతే మనిషి సుఖంగా ఆరోగ్యంగా ఉండలేడు. పంచభూతాలకు మనం భగవన్నామాన్ని వినిపించాం. దీని ఫలితాన్ని తప్పకుండా మనం పొందుతాం. మనం చేయడం వల్లే ఈ ఫలితం సంభవించింది. అని అహంకరించ కూడదు అని పేర్కొన్నారు. ఈ శోభాయాత్రలో పాల్గొన్న భక్తగోష్ఠికి అనేక మంగళా శాసనములందించారు. ఈ శోభాయాత్రలో భక్తులు నీరస పడకూడదని వికాసతరంగిణి కార్యకర్తలు 10,000 కిలోల పులిహోర, 20,000 మినరల్ వాటర్ ప్యాకెట్స్, 4000 బిస్కట్ పాకెట్స్ వితరణ చేశారు.

ఈ ధర్మక్షేత్ర కార్యక్రమాన్ని ఇంత వైభవంగా నిర్వహించిన రామంతపూర్ వికాసతరంగిణి వారికి శ్రేయోభిలాషులకు శ్రీస్వామివారు మంగళా శాసనములు కృపచేసారు. వారిలో ముఖ్యులు శ్రీమతి సుగుణ, శ్రీమాన్ శ్రీనివాస్, ఉప్పల్ మున్సిపల్ చైర్మన్‌గారి కుమారుడు వేణు, కోడలు, కుమార్తె మరియు కుటుంబ సభ్యులు, శ్రీమతి లక్ష్మి, డా॥ ఎ. యాదగిరిరెడ్డి దంపతులు (C.D.R. Hosp.), శ్రీమతి ఆండాళ్, శ్రీమతి శైలజ, శ్రీమతి నిర్మల, శ్రీమతి శ్యాంసుందరాచార్యులు, శ్రీమాన్ ప్రసాద్, శ్రీమతి లక్ష్మి, శ్రీమతి వరలక్ష్మి, శ్రీమాన్ రవి మొదలైన కార్యకర్తలు, ఉభయదారుల సహాయ సహకారములతో ఈ ధర్మక్షేత్ర కార్యక్రమం విజయవంతమైంది.

శ్రీస్వామివారు రామంతపూర్ నుండి బయల్దేరి రాత్రి 9 గం॥లకు శ్రీమాన్ రవి అమర్ - చిత్ర దంపతుల ఆహ్వానంపై వేంచేసి 'భాగ్యశ్రీ ఆనిమేషన్స్ & స్పెషల్ ఎఫెక్ట్స్' సెంటర్‌ను ప్రారంభించి ఆ దంపతులకు, కుటుంబ సభ్యులకు, స్టాఫ్‌కు మంగళాశాసనములను గ్రహించారు. అనంతరం ఎ.పి. వెలమ స్టూడెంట్స్ హాస్టల్‌కు వేంచేసి ఇ-మెయిల్, ఇంటర్‌నెట్‌ను ఉద్ఘాటన చేశారు. ఈ సౌకర్యాన్ని శ్రీమాన్ బి. ప్రభాకరరావు (C.E. National Highways)గారి కుమారుడు డా॥ దిలీప్‌గారు కల్పించారు. వీరు ఇదే హాస్టల్‌లో ఉండి చదువుకున్నారు. వారి ఉపకార స్మృతికి శ్రీస్వామివారు అనేక మంగళాశాసనములు కృపచేశారు. రాత్రి గం॥ 10-30 ని॥లకు శ్రీస్వామివారు సాయిక్రిష్ణ సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్‌కు వేంచేసి బ్రెయిన్ హెమరేజ్‌తో తీవ్ర అనారోగ్యంగా ఉన్న నిజామాబాద్ వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ లక్ష్మారెడ్డిగారిని పరామర్శించారు. వీరివల్ల శ్రీస్వామివారిని సేవించుకునే భాగ్యం కల్గిందని డా॥ యస్.ఆర్. శ్రీధర్ (M.D.,)గారు మరియు సిబ్బంది తమ భాగ్యానికి మురిసిపోయారు. లక్ష్మారెడ్డిగారి ధర్మపత్నికి, కుటుంబసభ్యులకు ఏం పర్వాలేదని ధైర్యంచెప్పి జూబ్లిహిల్స్‌లోని శ్రీమతి శ్రీలతమ్మగారి నూతన గృహానికి వేంచేసి పావనం చేసారు. రాత్రి ఇక్కడే వేంచేసిఉన్నారు.

11-12-2002న ఉ॥ తీర్థగోష్ఠి కాగానే తల్సా (U.S.A.,) నుండి విచ్చేసిన శ్రీమతి డా॥ ఊర్వశిపటేల్‌గారు, మరోముగ్గురు శ్రీస్వామివారి ద్వారా సమాశ్రయణములు పొందారు. మధ్యాహ్నము శ్రీలతమ్మగారి గృహ ఆవరణలో హనుమంతుని శిలావిగ్రహాన్ని ప్రతిష్ఠచేశారు. వారి బంధుమిత్రులందరికి అనుగ్రహభాషణం కృపచేసి పాదపూజ స్వీకరించారు. శ్రీలతమ్మగారికి, కుటుంబ







సభ్యులకు అనేక మంగళా శాసనములనుగ్రహించి సా॥ 4-00 గం॥లకు శ్రీస్వామివారు, శ్రీమాన్ కల్కిఅవతారంగారి అభ్యర్థనపై వారికుమారుడు రాహుల్ విపర్తిగారు స్థాపించిన 'First Gen Systems' సంస్థకు వేంచేసి మంగళాశాసనం చేశారు. అనంతరం శ్రీస్వామివారు సునిల్ వి. చావడా గారి అభ్యర్థనపై వారి గృహాన్ని మంగళా శాసనం చేసి వనస్థలిపురం ధర్మక్షేత్ర కార్యక్రమానికి బయల్దేరారు.

## వనస్థలి పురం గీతాజ్యోతి 6వ ధర్మక్షేత్ర కార్యక్రమ నివేదిక

జంటనగరాలలో జరిగిన రెండవ ధర్మక్షేత్ర కార్యక్రమం వనస్థలిపురం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో ధర్మక్షేత్ర కార్యక్రమం 11వ తేదీన సాయంకాలం శోభాయాత్రతో ప్రారంభమైనది. శ్రీ సీతారామచంద్రస్వామి ఆలయం నుండి వనస్థలిపురం, సచివాలయ నగర్, NGO కాలనీ, J.C. సెంటర్, రైతుబజారు, కమలానగర్, ద్వారకామయి నగర్, సుబద్రానగర్, శారదా నగర్, శాంతి నగర్ మీదుగ రాజప్ప మైదానం చేరుకున్నది. బాలబాలికలు చక్కని సాంస్కృతిక కార్యక్రమాలను ప్రదర్శించారు. పాఠశాలల నుండి వచ్చిన విద్యార్థులు కృష్ణుని గాథలను చక్కగా నృత్యాలతో ప్రదర్శించారు.

1500 మంది దంపతులు శ్రీకృష్ణ పూజలను భక్తి శ్రద్ధలతో శ్రీస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో జరిపినారు. 12వ తేదీన తుర్కయాంజిల్ గ్రామంలో పశువైద్య శిబిరమును ప్రారంభించినారు. 1000కి పైగ పశువులకు వైద్యసదుపాయం లభ్యమైనది. తరువాత శ్రీస్వామివారు శాంతినికేతన్ స్కూలును Mentally Rehabilitated సందర్శించినారు.

12-12-2002 : సా॥ 5 గం॥లకు వనస్థలిపురంలోని శ్రీమాన్ బలరాంమూర్తి మహాలక్ష్మి దంపతుల గృహాన్ని మంగళాశాసనం చేసి (వీరు వాషింగ్‌టన్ డి.సిలో ఉంటున్న శ్రీమాన్ రమణగారి తల్లిదండ్రులు) వైరా వెడుతూ రాత్రి 7-00 గం॥లకు నల్గొండలోని శ్రీమతి కమలాదేవి గారి గృహానికి వేంచేసి మంగళాశాసనం చేసారు. వీరి భర్త శ్రీమాన్ వెంకట్రామిరెడ్డిగారి 75వ జన్మదిన వేడుకలు ఈ నెల 29వ తేదీన జరుగుతున్న శుభ సందర్భంగా వారికి శ్రీస్వామివారు అనేక మంగళా శాసనము లందించారు. వీరి గృహంలోనే స్నానం, సంధ్యావందనం పూర్తిచేసుకుని శ్రీస్వామివారు రామగిరిలోని సీతారామ చంద్రస్వామి ఆలయానికి వేంచేసి ధనుర్మాసారంభ సందర్భంగ స్వామిని గోదాఅమ్మవారిని సేవించు కొన్నారు.

రాత్రి 11-00 గం॥లకు ఖమ్మం పట్టణంలోకి ప్రవేశించగానే శ్రీమాన్ రామారావుగారు శ్రీస్వామి వారికి స్వాగతం పలికారు. వీరి పురుషకారంతో శ్రీస్వామివారు రాయపూడి లక్ష్మణ్‌రావుగారి హనుమాన్ ట్రాక్టర్స్ షోరూమ్‌కు వేంచేసి మంగళా శాసనం చేసారు.

గం॥ 12-30 ని॥లకు 'వైరా' చేరుకొని JNR & సన్స్ ఫిల్లింగ్ స్టేషన్‌కు వేంచేసి మంగళాశాసనం చేసారు. వైరా వికాసతరంగిణి వారు మరియు భక్తబృందము శ్రీస్వామివారికి ఘనస్వాగతం పలికారు. కార్యక్రమ నిర్వాహకులు శ్రీమాన్ కె. కృష్ణారావుగారి సోదరులు శ్రీమాన్ కె. వెంకటేశ్వర రావుగారి గృహంలో శ్రీస్వామివారు బసచేసారు.

### 13-12-2002 : వైరా

శ్రీస్వామివారు ఆరాధనాదులు పూర్తిచేసుకొని ఉ॥ 10.00గం॥లకు వైరా సమీపంలోని 'గుబ్బగుర్తి' గ్రామానికి వేంచేసి మయినేసుబ్బారావుగారి సహకారంతో, గీతాజ్యోతి సందర్భంగా ఏర్పాటు చేసిన పశువైద్యశిబిరాన్ని ప్రారంభించారు. గీతాజ్యోతి సందేశాన్ని కూడా వివిధ గ్రామాల నుండి వచ్చిన భక్తులకందించి వైరా చేరుకొని 45 అడుగుల అభయాంజనేయస్వామి వారి విగ్రహానికి చేసే క్షీరాభిషేక మహోత్సవంలో అన్వయించారు. ఎక్కడ చూసినా జనసందోహం

ట్రాఫిక్ ఎక్కడికక్కడే నిల్చిపోయింది. సుమారు లక్షవరకు భక్తులు తండోపతండాలుగా ఈ కార్యక్రమాన్ని శ్రీస్వామి వారిని సేవించు కోవడానికి విచ్చేసారు. శ్రీస్వామి వారు, కార్యకర్తలు అరకొరగ వెదురుకర్రలతో ఏర్పాటు చేసిన నిచ్చెనల సహాయంతో 45 అడుగుల హనుమద్విగ్రహ కిరీట భాగాన్ని చేరుకొని అశేషభక్తజనసందోహానికి మంగళాశాసన పూర్వక అనుగ్రహభాషణం చేసి 9 కలశాలలోని క్షీరంతో అభిషేకం ప్రారంభించారు.

సహస్ర కలశాభిషేకాన్ని జరపాలనే పెద్ద కార్యక్రమానికి తగినంత గట్టిగా ఈ నిచ్చెనలు లేవని, మొదట ఖమ్మం గీతాజ్యోతి సమన్వయకర్త శ్రీమాన్ రామారావుగారు, స్వామివారిని పైకి ఎక్కడానికే అంగీకరించలేదు. అయితే నిర్వాహకులు శ్రీకృష్ణారావుగారి నిర్బంధంవల్ల, కమిటీ వారి ప్రార్థనలతో శ్రీస్వామివారు జాగ్రత్తగ ఎక్కి ప్రారంభించారు అభిషేకాన్ని. చాల జాగ్రత్తగ చేయాలీ కార్యాన్ని శ్రీస్వామివారు అక్కడ పాల్గొనే భక్తులను కోరారు. క్రిందికి దిగి భక్తజన సందోహం మధ్యనుండి చాకచక్యంగా శ్రీస్వామి వారు నిలయాన్ని చేరుకుని గృహ యజమానులు శ్రీమాన్ కె. వెంకటేశ్వరరావు దంపతులు చేసిన పాదపూజను స్వీకరించి మంగళా శాసనములు కృపచేసారు. KCSIL, JMD శ్రీమాన్ వీరయ్యగారు, MD శ్రీమాన్ వెంకటేశ్వర్లుగారు, శ్రీమాన్ బాబుగారి అభ్యర్థనపై మ॥ గం॥ 2-30 ని॥లకు కల్లూరు వేంచేసి షుగర్ ఫ్యాక్టరీని, పవర్ ప్లాంట్‌ను మంగళాశాసనంచేసారు. కాలనీలోని నిలయానికి వేంచేసి శ్రీస్వామివారు జగ్గయ్యపేట, కల్లూరు పాఠశాల విద్యార్థులు, గురువుగార్లగూర్చి చర్చించారు. ఆలయ అర్చకుల గూర్చి కూడా చర్చించి తగు సూచనలందించి శ్రీమాన్ వీరయ్య గారికి, శ్రీమాన్ వెంకటేశ్వర్లు దంపతులకు, కుమార్తెకు మంగళాశాసనము చేసారు. అక్కడుండగానే వైరా నుండి విషాదకర సమాచారం అందింది. కార్యకర్తల భక్తుల క్రమశిక్షణా రాహిత్యంవల్ల పైకి ఎక్కిన జనం వత్తిడి వల్ల, పాలుపోసే ఒక యువకుడు కాలుజారి ప్రాణం విడిచినట్లు, 4గురు తీవ్రంగా గాయపడినట్లు తెలిసింది. శ్రీవారు శ్రీమాన్ రామారావుగారిద్వారా వారికి సాంత్వనం పలికారు. రాత్రి గం॥ 7-00 లకు సీతానగరం ఆశ్రమం చేరుకున్నారు. శ్రీమాన్ వెంకటాచార్యులుగారు, విద్యార్థులు, గురువుగార్లు శ్రీస్వామివారికి పూర్ణకుంభంతో స్వాగతం పలికారు.

**సీతానగరంలో శ్రీవారు 14,15,16 తేదీలలో**

14-12-02 సీతానగరంలో తీర్థగోష్ఠిని ముగించుకుని శ్రీస్వామివారు 'పొరంకి' వేంచేసారు. ఈ మధ్యనే నవీకరించిన శ్రీ వసంత వేణుగోపాలస్వామి, శ్రీ ఆంజనేయస్వామివార్ల ఆలయాలలో శ్రీస్వామివారి కరకమలముల ద్వారా ఉ॥ 9-34 ని॥లకు కుంభాభిషేక కార్యక్రమం జరిగింది. ప్రతిష్ఠ, పూర్ణాహుతి మొదలగు కార్యక్రమాలలో పాల్గొని, అనుగ్రహభాషణం చేశారు. అక్కడి నుండి సిబార్ డిస్నీలాండ్‌కు చేరారు. అక్కడ దశావతారాలు దళాలుగా నూతనంగా నిర్మించుతున్న లోటస్ కృష్ణ టెంపుల్‌కు శంకుస్థాపన చేసారు. సిబార్ గ్రూప్ ఛైర్మన్ కె. అనిల్ కుమార్, శ్రీ మురళీధర్ ప్రభృతులకు మంగళాశాసనాలను కృపచేసి ఆశ్రమానికి వేంచేసారు.

**పటమట** : విజయవాడ పటమట ధర్మక్షేత్ర కేంద్రముగ వికాసతరంగిని శాఖ ఆధ్వర్యంలో శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయ ప్రాంగణంలో గీతాజ్యోతి శ్లోకమాలికల కంఠస్థపోటీలను నిర్వహించడం జరిగింది. 60 మంది విద్యార్థులు పాల్గొన్నారు. వీరిలో 7 గురుకు శ్రీస్వామివారి కరకమలముల ద్వారా బహుమతి ప్రదానం జరిగింది.

15-12-02 వ తేదీ ఉదయం యర్రబాలెం గ్రామంలో శ్రీమాన్ యమ్.వి. శేషారెడ్డిగారు, కె.ఆర్.యస్. సాయి ప్రసాద్‌గార్ల ఆధ్వర్యంలో నిర్వహించబడుచున్న శ్రీశరణం సాయి ప్యాకేజీ







కంపెనీ ఉదయం గం॥ 9-55ని॥లకు శ్రీవారిచేత ప్రారంభంచేయబడినది. కార్యక్రమం తరువాత పాదపూజ జరిగినది. ఈ కార్యక్రమంలో జిల్లా పరిషత్ ఛైర్మన్ శ్రీమాన్ పాతూరి నాగభూషణం, మంగళగిరిM.L.A., శ్రీమాన్ యమ్. హనుమంత రావుగారు, Ex. M.L.A., నిమ్మగడ్డ రామమోహన్ రావుగారు తదితరులు పాల్గొన్నారు.

15-12-02 మధ్యాహ్నం గీతా జయంతి సందర్భముగ మాంటిసోరి విద్యాలయంలో విద్యార్థులకు'మానవతాధర్మం' అనే అంశంపై శ్రీస్వామివారు అనుగ్రహభాషణం సాగిస్తూ 'ఏం చేస్తే ఈ జన్మసార్థక మవుతుంది? దానికి మనం ఏర్పరచుకోవలసిన లక్ష్యాలేమిటి అనే విషయా లను తెలిసికోవాలని' సూచించారు. అదే రోజు సాయంత్రం 4॥ గం॥లకు నల్లూరు వారి శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం ప్రాంగణంలో గీతా జయంతి ఉత్సవానికి శ్రీవారు విచ్చేసినారు. పటమట వికాసతరంగిణి (చైతన్య) శాఖ ఆధ్వర్యంలో శ్రీవారికి పూర్ణకుంభస్వాగతం పలికినారు. ఉత్సవానికి హాజరైన 2000 మంది భక్తులకు గీతాజయంతి యొక్క అమూల్యమైన సందేశాలను వివరించారు. ఈకార్యక్రమంలో పటమట (చైతన్య) వికాసతరంగిణి సభ్యులు రాణి సంయుక్త, కోనేరు ప్రసాదరావు, అన్నపూర్ణ, విజయలక్ష్మిగార్లు మొదలగు కార్యకర్తలు పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో 40 మంది గోవిందమాల దీక్ష స్వీకరించిన భక్తులు పాల్గొనడం విశేషం.

15-12-2002 ఆదివారం మధ్యాహ్నం గీతాజయంతి సందర్భముగ నల్లూరు వారి శ్రీవేంకటేశ్వరస్వామి దేవస్థాన ప్రాంగణంలో శ్రీవారి మంగళాశాసనములతో ఉచిత దంత మరియు కంటి వైద్య శిబిరం నిర్వహించబడినది. 127 మందికి పరీక్షలు నిర్వహించినారు. 15 మందికి ఉచితంగ ఆపరేషన్లు చేయడం జరిగింది. ఈ కార్యక్రమంనకు నేత్ర వైద్యులు శ్రీమాన్ డా॥ వి. లక్ష్మీపతి గారు ఆధ్వర్యవంలో నిర్వహించినారు.

డా॥ అల్లూరి అజయ్ దేవ్‌గారి ఆధ్వర్యంలో 71 మందికి దంతపరీక్షలు నిర్వహించడం జరిగింది. 10 మందికి వైద్యసేవలను నిర్వహించడం జరిగింది మరియు డా॥ జి. యుగంధర్‌గారు పాల్గొన్నారు.

శ్రీవారి కరకమలముల ద్వారా డాక్టర్లకు వారి సిబ్బందికి బహుమతులు ప్రదానం చేయడం జరిగింది. ఈ కార్యక్రమానికి శ్రీవేంకటేశ్వరస్వామి వారి దేవస్థానం, డా॥ కె.వి. చలపతిరావుగారు, సిహెచ్. దుర్గారావు, శ్రీమతి వి. రాణి భ్రమరాంబ, బి. లక్ష్మీ ప్రసన్న, శ్రీ జి. రంగారావుగార్లు పాల్గొన్నారు.

16-12-02 ఆశ్రమంలో తీర్థగోష్ఠి ముగించుకుని శ్రీమాన్ వెంకటాచార్యులుగారికి, పరివారానికి ఆశ్రమ నిర్వహణ విషయంలో తగు ఆదేశాలను అందించి ధనుర్మాసోత్సవ వ్రతానికై పిట్టలవాని పాలెంలో బయలుదేరారు.

ముందుగా తెనాలి చేరుకున్నారు. అక్కడ మాజీమంత్రివర్యులు, రాజ్యసభ సభ్యులు, శ్రీమాన్ యడ్లపాటి వెంకట్రావుగారి 84వ జన్మదిన అభినందన సభలోపాల్గొన్నారు. అక్కడ చేరిన ప్రముఖులందరికీ సందేశాత్మకమైన ప్రవచనాన్ని అనుగ్రహించి శ్రీమాన్M.P. గారికి మంగళా శాసనములను కృపజేసి పిట్టలవానిపాలెంకు చేరుకున్నారు.



## కర్నూలు జిల్లా

**డోన్ :** డోన్ వికాసతరంగిణి శాఖ అధ్యక్షులు శ్రీమాన్ పాతాళం సుబ్బారావు (గుంటూరు) గారు 'గీతాజ్యోతి' స్ఫూర్తితో తమ మారుతీ వ్యాన్‌ను ప్రచార రథంగా తీర్చిదిద్దారు. వికాసతరంగిణి

అశయాలను, శ్రీస్వామివారి చిత్రాన్ని, 'కృష్ణం వందే జగద్గురుమ్' నినాదాన్ని అందంగా వ్యాన్‌పై చిత్రీకరించారు. మైకును ఏర్పాటు చేసుకొన్నారు.

శ్రీసుబ్బారావుగారు నిర్మించి, నిర్వహిస్తున్న శ్రీపద్మావతి 'గోదాదేవి సమేత శ్రీ వేంకటేశ్వర దేవస్థానం' ప్రతినిధిగా రథం చుట్టుప్రక్కల గ్రామాలలో చక్కటి దైవీ సందేశాన్ని, ప్రవచనాలను అందజేస్తున్నది. అంతేకాకుండా ప్రతి శనివారం శ్రీ వేంకటేశ్వరుని ప్రసాదంగా 30 కె.జీల అన్న ప్రసాదాన్ని గ్రామాల్లోకి వెళ్ళి ఆర్తులైన భక్తులకు అందజేస్తున్నారు. వర్షాలు లేక కరువుతో బాధపడుతున్న బడుగు ప్రజానీకానికి కాస్త ఉపశమనంగా ఈ సేవ ఉపయోగపడుతున్నది. ఇప్పటికి 2000 కె.జీలకు పైగా అన్నప్రసాద వినియోగం జరిగింది.

శ్రీవారు పిట్టలవానిపాలెంలో నిర్వహిస్తున్న 'ధనుర్మాస వ్రత' సందర్భంగా పరిసర ప్రాంతాల్లో భగవత్ సందేశాన్ని అందజేయడానికి శ్రీమాన్ పాతాళం సుబ్బారావు(గుంటూరు)గారు తమ 'గీతాజ్యోతి' రథాన్ని తమ కైంకర్యంగా అందజేసారు. వారికి శ్రీస్వామివారు మంగళాశాననాలను అందజేసారు. శ్రీ సుబ్బారావుగారు మన 'బదరీ అన్నదాన కమిటీ సభ్యులుకూడా.

## నల్గొండ జిల్లా

**మిర్యాలగూడ :** నల్గొండ జిల్లా ధర్మక్షేత్ర కేంద్రముగ మిర్యాలగూడ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో 5 మండలాలలోని 108 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం మొదటి దశ పూర్తిచేయడం జరిగింది. మిర్యాల గూడ గీతాజ్యోతి అధ్యక్షులు శ్రీమాన్ టి. మారుతీరావుగారు ఆర్థిక సహాకారంతో ప్రచార రథం సమకూర్చుకొని ప్రచారం చేయుచున్నారు. కార్యక్రమ నిర్వహణకు శ్రీమాన్ మార్గపురి శ్రీనివాసాచార్యులును నియమించడం జరిగింది. ప్రతి ఇంట గీతాజ్యోతి నేతిదీపాలను వెలిగించి గోష్ఠులను నిర్వహించు కుంటున్నారు. పట్టణములలోని ప్రధాన దేవాలయాలలోను, పురవీధులలోను ప్రతి యింటికి ధ్వజాలను, స్టిక్కర్లను అందజేయడం జరిగినది. శ్రీమాన్ ఫణికుమారాచార్యులు, గోపాలాచార్యులు, జ్యోతి, నిర్మల, వెంకట చైతన్య, సరోజగార్లు పూర్తి సమయం కేటాయించినారు. పట్టణంలో 50 పాఠశాలలో విద్యార్థులకు గీతాజ్యోతి శ్లోకమాలికలను అందించినారు. గీతాజయంతి సందర్భంముగ 500 మందితో సంపూర్ణ గీతాపారాయణ, కృష్ణపూజ కార్యక్రమములను వైభవంగ జరుపుకొన్నారు. పశువైద్య, శిశువైద్య శిబిరముల నిర్వహణకు సన్నాహాలు జరుపుచున్నారు.

**కోదాడ :** నల్గొండ జిల్లా కోదాడ ధర్మక్షేత్ర కేంద్రముగ గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగ నడిగూడెం మండల కేంద్రములో ప్రభుత్వ పశువైద్యశాఖ ఆధ్వర్యవంలో ఉచిత పశువైద్య శిబిరం నిర్వహించబడినది. కోదాడ 'శ్రీకళావెటర్నరీ మెడికల్ ఏజన్సీస్' వారి ఆర్థిక సహాయంతో 200 పశువులకు నట్టల మందు యివ్వడం జరిగింది. 10వేల రూపాయల విలువగల మందులను యివ్వడం జరిగినది. ఈ కార్యక్రమంలో పశువైద్య అధికార్లు సంజీవరావుగారు, శ్రీనివాసరెడ్డి, పెంటయ్య, వంశీకృష్ణ గార్లు పాల్గొన్నారు. ఈ పశువైద్య శిబిరంద్వారా వివిధ గ్రామాల ప్రజలు తమ పశువులకు పరీక్షలు నిర్వహించుకొని లబ్ధిపొందినారు. ఈ కార్యక్రమంలో యమ్. కాశీనాథంగారు, గుండా శ్రీనివాస్‌గారు, లక్ష్మీ సుశీల పద్మగార్లు పాల్గొన్నారు.

కోదాడ ధర్మక్షేత్రం రెట్లకుంట్ల గ్రామంలో గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగా ఉచిత పశువైద్య శిబిరంలో సుమారు 200 పశువులకు పరీక్షలు జరిపారు. సమావేశానికి సర్పంచ్ మల్లెల రామారావు అధ్యక్షత వహించగా, పశువైద్యులు షేక్







ఖలీల్ ఉర్‌రహ్మాన్, ఎం. వంశీకృష్ణ, సంజీవరావు, శ్రీనివాసరెడ్డిలు పశువులకు వైద్యసేవలు అందించారు. మందులు ఉచితంగా పంపిణీ చేశారు. కార్యక్రమంలో ఉల్లుల శేషయ్య, వికాస తరంగిణికి చెందిన ఎం. కాశీనాథం, గుండా లక్ష్మి మణెమ్మ, వెంకటేశ్వరరావు, శేషగిరి, ఎం.ఎ. ఖాన్ తదితరులు పాల్గొన్నారు.

**హిల్ కాలనీ :** హిల్ కాలనీ (నాగార్జునసాగర్) వికాస తరంగిణి ఆధ్వర్యవంలో స్థానిక రమాసహిత సత్యనారాయణ స్వామివారి దేవస్థానం నందు ప్రతిరోజు విష్ణుసహస్రనామ పారాయణం జరుగుచున్నది. ప్రతి ద్వాదశి రోజున ఒకరి గృహంలో భగవద్గీత పారాయణం జరుపుకొనుచున్నారు. గీతాజ్యోతి కార్యక్రమం శ్రద్ధానక్తులతో చేసుకొనుచున్నారు. ఈ కార్యక్రమంలో డా॥శ్రీనివాసరావు, తాయారమ్మ, పుష్పలత ఇతర ప్రముఖులు పాల్గొన్నారు.

## కృష్ణా జిల్లా

**గంపలగూడెం :** కృష్ణాజిల్లా గంపలగూడెం ధర్మక్షేత్ర కేంద్రముగ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో ప్రభుత్వ, ప్రవేట్ పాఠశాలలయందు గీతాజ్యోతి శ్లోకమాలిక కంఠస్థపోటీలు నిర్వహించడం జరిగింది. 8,9 తరగతులకు సంబంధించిన విద్యార్థులు 50 మంది పాల్గొన్నారు. ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలు పొందిన విద్యార్థులను ఎంపిక చేయడం జరిగింది. ఈ కార్యక్రమంలో యస్.విజయలక్ష్మి (రిటైర్డ్ హెచ్.యమ్.) యన్. రాఘవరావుగారు, గంపల గూడెం వికాసతరంగిణి చైర్ పర్సన్, కఠారు జయప్రదగారు, కోటేశ్వరరావుగారు, పార్వతిగారు, కృష్ణకుమారిగారు, రాధామణిగారు, జ్యోతిగార్లు పాల్గొన్నారు.

**వీరంకిలాకు :** కృష్ణా జిల్లా వీరంకిలాకు ధర్మక్షేత్ర కేంద్రంగా గీతాజ్యోతి ప్రచార కార్యక్రమంలో భాగంగా ఉయ్యూరు రోటరీ క్లబ్ వారి ఆధ్వర్యవంలో 30వ తేదీన ఉచిత నేత్ర వైద్య శిబిరం నిర్వహించబడినది. ఈ కార్యక్రమంలో 147 మంది పరీక్షలు చేసి అందులో 11 మందికి ఆపరేషన్ చేయడం జరిగింది. 31వ తేదీన ఉచిత గర్భకోశవ్యాధుల చికిత్సా శిబిరం నిర్వహించబడినది. ఈ కార్యక్రమంలో 145 పశువులకు గర్భకోశ వ్యాధులు పరీక్షలు జరిపినారు. 1500 రూ॥ విలువగల మందులను ఉచితంగా పంపిణీ చేయడం జరిగింది. వికాసతరంగిణి చైర్ పర్సన్ శ్రీమతి సక్కుబాయమ్మ, శ్రీమాన్ డా॥ వి. రాధాకృష్ణమూర్తి ఆసుపత్రి సిబ్బంది, మరియు పశుసంవర్ధక శాఖ డా॥ వైన దామోదర నాయుడుగారు, మరియు సిబ్బంది పాల్గొన్నారు.

## గుంటూరు జిల్లా

**పుల్లడిగుంట :** గుంటూరు జిల్లా పుల్లడిగుంట ధర్మక్షేత్ర కేంద్రముగ గీతాజ్యోతి ప్రచార కార్యక్రమంలో భాగంగ శ్రీమాన్ మరింగంటి రంగాచార్యస్వామి తిరునక్షత్రోత్సవ సందర్భముగ స్థానిక జగన్నాథస్వామి దేవాలయంలో విష్ణుసహస్ర నామ అవధాన కార్యక్రమం నిర్వహించబడినది. 30-11-2002 తేదీన ఏకాదశినాడు వల్లూరు గ్రామంలో 200 మంది దంపతులచే పూజలు నిర్వహించడం జరిగింది. గీతాజ్యోతి కార్యక్రమంను గూర్చి వివరించి విద్యార్థులకుశ్లోకాలపోటీలను నిర్వహించడం జరిగింది. గెలుపొందిన చిన్నారులకు శ్రీరాజేంద్రప్రసాద్‌గారు బహుమతులు అందజేసినారు. కార్యక్రమ నిర్వహణలో వట్టి చెరుకూరు, పల్లపాడు, గుంటూరు వికాసతరంగిణి శాఖలు పాల్గొన్నాయి. శ్రీమతి లలితకుమారిగారు, అష్టావధాన కార్యక్రమానికి శ్రీమతి వైదేహి, శ్రీమాన్ యమ్.ఆర్.కె. ప్రసాద్‌గారు, హరిబాబుగారు, కోటేశ్వరరావుగార్లు పాల్గొన్నారు.

## అనంతపురం జిల్లా

**తాడిపత్రి :** అనంతపురం జిల్లా తాడిపత్రి వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో స్థానిక చింతల వెంకట రమణ స్వామివారి బ్రహ్మోత్సవము సందర్భముగ శ్రీవారి కళ్యాణము రోజున

కార్యకర్తలు వివిధ సేవలను అందించినారు. టి.టి.డి కళ్యాణమండపమునందు 'ఉచిత వికలాంగుల పరీక్ష శిబిరం' నందు వికాస తరంగిణి కార్యకర్తలు స్వయం సేవకులుగ పాల్గొని 4,500 మంది రోగులకు అనేక రకాల సేవలందించి ఆహారపొట్లాలను అందజేసినారు. 17-11-2002న చల్లవారి పల్లె గ్రామంలో ఉచిత పశువైద్య శిబిరం నిర్వహించడం జరిగింది. 'మాధవ సేవగా సర్వప్రాణి సేవ' అనే లక్ష్యంతో కార్యక్రమం జరిపినారు.

10-11-02న తేదీన స్థానిక టి.టి.డి కళ్యాణ మండపంలో తాడిపత్రి రోటరీక్లబ్‌వారి ఆధ్వర్యంలో మంగళం న్యూఢిల్లీవారి సహకారంతో వికలాంగుల పరీక్ష శిబిరం నిర్వహించబడినది. వైద్యపరీక్షల అనంతరం వారికి తగిన ఉపకరణములు, కృత్రిమ అవయవములు ఉచితంగ అందజేయబడినవి. రోటరీక్లబ్ సభ్యులు శ్రీ రాఘవరెడ్డి, బాల సుబ్రహ్మణ్యం, రెడ్డి నాగరాజు, వి.పి. మద్దులేటి తదితరులు పాల్గొన్నారు. రాయలసీమ కరువు దృష్ట్యా గీతాజ్యోతి కార్యక్రమం నిదానముగా జరుగుచున్నది. కొంత శ్రమించి ఆర్థికవనరులు సమకూర్చుకొని మురికివాడలలో ప్రచారం చేయుచున్నారు. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి మెంబర్స్ రవి ప్రసాద్, నాగూరయ్య, దామోదరదాసు, రామాంజనేయులు, రంగరామానుజ, నరసింహన్ మున్నగువారు పాల్గొన్నారు.

## కరీంనగర్ జిల్లా

**కరీంనగర్** : కరీంనగర్ పట్టణంలోని సప్తగిరి కాలనీ వికాసతరంగిణి శాఖ అధ్యక్షులు శ్రీమాన్ బొంత భాస్కరరావుగారు 3-12-02 ఆచార్య తిరువడినలంకరించారు. వీరు శ్రీస్వామివారి సేవలో అనేక కార్యక్రమాలలో పాల్గొని, కైంకర్యములు సమర్పించి శ్రీవారి అనుగ్రహానికి పాత్రులయినారు.

**వావిలాలపల్లి** : కరీంనగర్‌జిల్లా వావిలాలపల్లి వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో గీతాజ్యోతి, గీతాజయంతి ఉత్సవము ఘనంగ నిర్వహించుకున్నారు. ఈకార్యక్రమంలో 500 మంది భక్తులు పాల్గొన్నారు. 48 శ్లోకాలు గీతాజ్యోతి శ్లోకమాలికలను పఠించి 108 నేతి దీపాలను వెలిగించి ప్రసాద వితరణ కార్యక్రమంతో ముగిసినది.

## ఖమ్మం జిల్లా

**భద్రాచలం** : భద్రాచలంలోని మన జీయర్ మఠంలో 16-12-2002 ఆదివారంనాడు గీతాజయంతి సందర్భంగా గీతాజ్యోతి శ్లోకమాలిక కంఠస్థపోటీలు నిర్వహించడం జరిగినది. ఈ పోటీలో విద్యార్థినీ విద్యార్థులు విరివిగా పాల్గొన్నారు. వీరిలో చి॥ కె. శశిజ్ఞత ప్రథమస్థానం, చి. వై.యస్. యన్. రాజు ద్వితీయస్థానం పొందారు. సబ్ జూనియర్ విభాగంలో చి॥ యస్ రంగనాథా చార్యులు ప్రథమ స్థానం, చి॥ గుదిమెళ్ళ శ్రీరామ్ ద్వితీయ స్థానాన్ని, చి॥ కె. ఋత్విక్ తృతీయస్థానం పొందారు. సీనియర్ విభాగంలో చి॥ కె. స్వాతి ప్రథమ స్థానం, చి॥ పి. క్రాంతి ద్వితీయ స్థానం పొందారు. వీరికి బహుమతి ప్రదానం జరిగినది. ఈ పోటీలకు న్యాయనిర్ణేతలుగా శ్రీమతి చక్రవర్తుల లక్ష్మీనరసమ్మగారు, శ్రీమాన్ యన్.సి.హెచ్. చక్రవర్తిగారు, శ్రీమతి రాజ్యలక్ష్మీగారు వ్యవహరించారు. శ్రీమాన్ వెంకటాచార్యులు(LIC), శ్రీమాన్ స్థలశాయిగార్ల నిర్వహణలో కార్యక్రమం వైభవంగా జరిగింది.

**సత్తుపల్లి** : సత్తుపల్లి మండలం, నారాయణపురం వికాసతరంగిణి వారు 15-12-02 గీతాజయంతి సందర్భమున గీతాపారాయణ, శ్రీకృష్ణపూజలు నిర్వహించినారు. సత్తుపల్లి ధర్మక్షేత్రంలో గీతాజ్యోతి అధ్యక్షుడు మందపాటి కేశవరెడ్డిగారు 75 గ్రామాలలో పర్యటించినారు.

**ఖమ్మం :** ఖమ్మం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో కమాన్ బజార్‌లోని స్వామి







గురునాథం కాంప్లెక్స్‌లో శ్రీమాన్ బదరీనారాయణ స్వామి వారిచే ధనుర్మాస కార్యక్రమం ప్రారంభమైనది.

## జంటనగరాల వార్తలు

సరూర్‌నగర్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో గీతాజ్యోతి శ్లోక పరిచయ కార్యక్రమం ప్రజమ్ హౌసింగ్ కాంప్లెక్సులోని దత్తాత్రేయ ఆలయ ప్రాంగణంలో, St. Dominic పాఠశాల విద్యార్థులకు గీతాజ్యోతి సదస్సు నిర్వహించడం జరిగింది. 200 మంది భక్తులు ఉత్సాహంగా పాల్గొన్నారు. 25వ తేదీ శ్రీవారు అమృతహస్తాల మీదుగ ఉచిత అంబులెన్స్ సర్వీస్ ప్రారంభమైంది. శ్రీ ఆంజనేయస్వామి దేవాలయంలో Lotus Lap School విద్యార్థులకు శ్లోకపఠన పోటీలు నిర్వహించబడినవి. 8వ తేదీ మధుమేహ వ్యాధి గ్రస్తులకు, స్త్రీలకు ప్రత్యేక వైద్య శిబిరం జరిగింది. స్థానిక పెద్దలు, డాక్టర్లు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## విజయలక్ష్మి దేవాలయం శాఖ

జూలై 20వ తేదీన శ్రీవిజయలక్ష్మి దేవాలయ శాఖ గీతాజ్యోతి ప్రయుక్త గీతాయజ్ఞాన్ని ప్రారంభించినారు. ప్రతి ఏకాదశి రోజున ఉదయం భగవద్గీతలోని ఒక అధ్యాయం గీతాజ్యోతిలోని శ్లోక మాలికతో యజ్ఞం చేస్తూ సాయంకాలం పండితులచే గీతా ప్రవచనంగావిస్తున్నారు.

**మసాబ్‌ట్యాంక్** : మసాబ్‌ట్యాంక్ వికాస తరంగిణిశాఖ ఆధ్వర్యంలో నవంబరు 16 శ్రీ తులసీ మహావిష్ణువుల కళ్యాణ ఉత్సవము వైభవంగ నిర్వహించుకొన్నారు. గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం అన్ని కాలనీలలో చక్కగా చేయుచున్నారు. 24వ తేదీన షేక్‌పేట నాలావద్ద పశువైద్య శిబిరం నిర్వహించడం జరిగింది.

**కూకట్ పల్లి** : ఈ శాఖ ఆధ్వర్యంలో గత 4 సం॥ల పేదపిల్లలకు ఉచిత పాఠశాల నిర్వహించుచున్నారు. కొన్ని కారణాలవలన ఈ పాఠశాల మూయవలసి వచ్చినది. తరువాత శ్రీమాన్ మాధవరావుగారు, హనుమంతరావుగారు, నర్సింగరావుగారు కలుగజేసికొని పాఠశాలను పునః ప్రారంభించినారు. ఈ శాఖ యథోచితంగా గీతాజ్యోతి ప్రచారం జేస్తున్నారు.

## తిరుప్పావై మహోత్సవాలు

తిరుప్పావై మహోత్సవాలు జంటనగరాలలో ఉత్సాహంతో ప్రారంభమయినాయి. జెట్ కార్యాలయంలోను, అనేక వికాసతరంగిణి కేంద్రాలలోను తిరుప్పావై సేవ, సామూహిక శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రపారాయణం, తిరుప్పావై ప్రవచనం జరుగుచున్నవి.

జెట్ కార్యాలయంలో శ్రీమాన్ శ్రీభాష్యం శ్రీనివాసాచార్యస్వామివారు, మాసాబ్‌ట్యాంక్ శాఖలో శ్రీమతి మంజులశ్రీగారు, సరూర్‌నగర్ శాఖలో శ్రీమాన్ రఘునాథాచార్యులుగారు, అంబర్‌పేట శాఖలో శ్రీమాన్ అచ్చి శ్రీనివాసా చార్యులుగారు, బోయినపల్లి శాఖలో శ్రీమతి త్రిగుణగారు ప్రవచనాలు అందిస్తున్నారు.

## వరంగల్ జిల్లా

## వరంగల్ జిల్లా గీతాజ్యోతి ధర్మక్షేత్రాల వివరములు

వరంగల్ జిల్లాలో 18 ధర్మక్షేత్రాలు ఏర్పాటు చేయబడినాయి. ఆంధ్రప్రదేశ్‌లో మొట్టమొదటి ధర్మక్షేత్రం వరంగల్ జిల్లా కమలాపురంలో శ్రీస్వామివారి పర్యవేక్షణలో నిర్వహింపబడినది. మొత్తం 18 ధర్మక్షేత్రాలు ఈ జిల్లాలో ఏర్పాటు చేయడం జరిగింది.

**జనగామ** : జనగామ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో 15-12-02న గీతాజయంతి సందర్భముగ స్థానిక శ్రీ వేంకటేశ్వర దేవాలయం నందు శ్రీమాన్ సంపత్ కుమార కృష్ణమాచార్య సిద్ధాంతిగారి ఆధ్వర్యంలో గీతాజ్యోతి పారాయణ జరిపి 150 మంది పిల్లలకు చిత్రగీత పుస్తకములను పంచడం జరిగింది. 100 మంది భక్తులు పాల్గొన్నారు. 16-12-02 సోమవారం మధ్యాహ్నం

ధనుర్మాస వ్రత మహోత్సవం ప్రారంభించినారు.

జనగామ ధర్మక్షేత్ర కేంద్రముగ 108 గ్రామాలలో గీతాజ్యోతి కార్యక్రమం ప్రచారం చేసినారు. గీతాజ్యోతి గోష్ఠులను ఆయా గ్రామాలలోఏర్పాటు చేసినారు. వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీ గోపయ్యగారు గీతాజ్యోతి ప్రచార సామగ్రి అందరికి పంపిణీ చేయడం జరిగింది. రక్త దాన శిబిరం, పశువైద్య శిబిరం, ఉచిత వైద్య శిబిరాలు నిర్వహించడం జరిగింది కొన్ని గ్రామాలలో కృష్ణపూజ కార్యక్రమాలు నిర్వహించడం జరిగింది.

**వనపర్తి** : వనపర్తి ధర్మక్షేత్ర కేంద్రముగ శ్రీమాన్ కుమార స్వామిగారు తమ సభ్యులతో గీతాజ్యోతి కార్యక్రమం ప్రచారం చేయడం జరిగింది. ఉచిత వైద్య శిబిరములను నిర్వహించడం జరిగింది. పాఠశాలలయందు గీతాజ్యోతి శ్లోకమాలికలు, చిత్రగీతలను అందజేసి పోటీలను జరిపించినారు. గీతాజ్యోతిప్రచార సామగ్రి అందరికీ అందజేయడం జరిగింది.

**ఘనపూర్** : ఘనపూర్ ధర్మక్షేత్రముగ ఆయా గ్రామాలలో ప్రచారం ముమ్మరంగా జరుగుచున్నది. పాఠశాలవిద్యార్థులకు శ్లోకమాలికలు, చిత్రగీతలు అందజేసి పోటీలు నిర్వహించినారు. పశువైద్య శిబిరాలను నిర్వహించినారు. కొన్ని శిబిరాలను నిర్వహించుటకు సన్నాహాలుజరుపుచున్నారు.

**మహబూబ్‌బాద్** : మహబూబాబాద్, అప్పరాజుపల్లి ధర్మక్షేత్రాలు కేంద్రాలుగ 220 పైగ గ్రామాలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం వేగంగ జరుగుచున్నది. 10 ఆక్యుప్రెషర్ క్యాంపులు నిర్వహించారు. వందకు పైగ గ్రామాలలో కృష్ణ పూజలు నిర్వహించడం జరిగింది. పాఠశాల విద్యార్థులకు గీతాజ్యోతి శ్లోకమాలిక, చిత్రగీత పోటీలను నిర్వహించి బహుమతులు ప్రకటించినారు. శ్రీవారి తిరునక్షత్రోత్సవ సందర్భముగ పేదలకు తదీయారాధన, దుప్పట్లు పంపిణీ చేసారు. జనవరినెలలో పశువైద్య శిబిరాలు, ఉచితవైద్య శిబిరాలు నిర్వహించుటకు సన్నాహాలు జరుపుచున్నారు.

**ఎరిజర్ల** : ఎరిజర్ల ధర్మక్షేత్ర కేంద్రముగ వికాస తరంగిణి ఆధ్వర్యవంలో 108 గ్రామాల్లో తండాల్లో గీతాజ్యోతి కార్యక్రమం చురుకుగా సాగుచున్నది. ముఖ్యంగ తండా వాసుల సహకారంతో గీతాజ్యోతి కార్యక్రమం అన్ని వర్గాల వారికి అందజేస్తున్నారు. పశువైద్య శిబిరాలలో పిల్లలకు, మహిళలకు సంబంధించిన శిబిరాలు నిర్వహిస్తున్నారు.

**వర్ధన్నపేట** : వర్ధన్నపేట ధర్మక్షేత్ర కేంద్రముగ మాధవరావుగారు, వారి సభ్యులు నిర్వహణలో ప్రచార కార్యక్రమం ఆలస్యంగ ప్రారంభమైన తమ పరిధిలోని అన్ని గ్రామాలలో శ్లోకమాలికలు చిత్రగీతలు మిగతా గీతాజ్యోతి సామగ్రి అందిరికీ పంపిణీ చేయడం జరిగింది. మహిళలు, పిల్లలకు సంబంధించిన ఉచిత వైద్య శిబిరాలు నిర్వహించడం జరిగింది.

**బొమ్మకల్లు** : శ్రీమతి ఇందిరాదేవిగారి ఆధ్వర్యవంలో బొమ్మకల్లు ధర్మక్షేత్రం పరిధిలోని అన్నిగ్రామాలలో ప్రచార కార్యక్రమం విస్తృతంగ జరుగుచున్నది. పాఠశాలలో శ్లోకమాలికలు చిత్రగీతలు అందజేసి పోటీలు నిర్వహిస్తున్నారు. అనేక గ్రామాలలో కృష్ణపూజలు నిర్వహించినారు. దంత, పశువైద్య శిబిరములు నిర్వహించారు.

బొమ్మకల్లు ధర్మక్షేత్ర కేంద్రముగా బొమ్మకల్లు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో నెల్లకుదురు గ్రామంలో 1-12-02 ఉదయం పశువైద్య శిబిరంలో 2000 పశువులకు వ్యాక్సిన్ వేయించినారు. మధ్యాహ్నం దంతవైద్య శిబిరము డా॥ సుధాకర్‌గారు, డా॥ తులసిగార్ల వైద్య బృందం ఆధ్వర్యవంలో డా॥ జ్యోతిగారు జ్యోతిని వెలిగించి ప్రారంభించినారు. 120 మందికి చికిత్స కావించినారు. డిసెంబరు 8వ తేదీ ఉదయం పాలకుర్తిలో మహిళా ఆరోగ్య శిబిరము నిర్వహించినారు. డా॥ శ్రీమతి పి. జ్యోతిగారు, డా॥ భరత్ సింగ్‌గారు, డా॥ శ్యామలా భాయిగారు, డా॥ బుచ్చిరెడ్డిగారు, డా॥







సుధాకరరావుగారు, డా॥ మహేందర్‌గారు ఈ శిబిరంలో పాల్గొన్నారు. 400 మంది మహిళలకి చికిత్స జరిగినది. 50 మందికి ప్రత్యేక చికిత్స జరిగినది.

**పరకాల** : డా॥ విజయపాల్‌రెడ్డిగారి ఆధ్వర్యవంలో పరకాల ధర్మక్షేత్ర పరిధిలోని గ్రామాలలో గీతాజ్యోతి కార్యక్రమాన్ని విస్తరింప జేసినారు. ప్రతి మంగళ వారం ఉచిత వైద్యశిబిరము నిర్వహిస్తున్నారు. పాఠశాలల్లో శ్లోకమాలికలు, చిత్రగీతలను అందజేసినారు. గీతాజయంతి సందర్భముగ 40 గ్రామాల ప్రజలను ఆహ్వానించి వైభవంగ గీతాపారాయణాన్ని ప్రవచనాన్ని అందించినారు.

**ఆత్మకూరు** : ఆత్మకూరు ధర్మక్షేత్ర కేంద్రముగ కేశవమూర్తి గారి ఆధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమాన్ని అన్ని గ్రామాలలో అందజేస్తున్నారు. ఎక్కువమంది విద్యార్థులుకార్యక్రమాలలో పాల్గొనే విధంగ కృషిచేస్తున్నారు. గ్రామాలలో కృష్ణపూజలు, నిర్వహించుచున్నారు. దంత, పశువైద్య, మహిళ వైద్య శిబిరాలను ఏర్పాట్లు చేసుకొంటున్నారు. గీతాజ్యోతి గోష్ఠులను నిర్వహించి ప్రచార సామగ్రి అందరికీ అందజేయడం జరిగింది.

**తొర్రూర్** : వరంగల్ జిల్లా తొర్రూర్ వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో కార్తీక పౌర్ణమి రోజున శ్రీవేంకటేశ్వర ఆలయంలో సహస్ర దీపాలంకరణ మహోత్సవం వైభవంగా జరుపుకున్నారు. గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగా ఉచిత దంత వైద్యశిబిరం డా॥ తులసీ, డా॥ నందిని గార్ల ఆధ్వర్యవంలో నిర్వహింపబడినది. 150 మంది వృద్ధులకు పరీక్షలు నిర్వహించి ఉచితంగా మందులు పంపిణీ చేయడం జరిగింది. ధనుర్మాస వ్రత కార్యక్రమం స్థానిక శ్రీవెంకటేశ్వరస్వామివారి దేవాలయం నందు ప్రారంభించినారు.

తొర్రూర్ ధర్మక్షేత్రకేంద్రముగ శ్రీమతి గీతారెడ్డిగారి ఆధ్వర్యవంలో ధర్మక్షేత్ర పరిధిలోని గ్రామాలకు, తండాలకు గీతాజ్యోతి కార్యక్రమాన్ని అందించినారు. స్కూలు విద్యార్థులకు పోటీలను నిర్వహించినారు. ఉచిత దంత, క్యాన్సర్, పశువైద్య శిబిరాలను నిర్వహించుటకు సన్నాహాలు జరుగుచున్నవి.

**నర్సంపేట** : శ్రీమాన్ వీరేశ లింగంగారు నర్సంపేట ధర్మక్షేత్ర పరిధిలోని అన్ని గ్రామాలలో గీతాజ్యోతి కార్యక్రమం అందించినారు. పాఠశాలలో గీతాజ్యోతి పోటీలు నిర్వహించి బహుమతి ప్రదానం జరిగినది. జనరల్ హెల్త్ క్యాంప్‌లు, దంత, పశు, రక్త, దాన శిబిరములు నిర్వహించారు. చాలా గ్రామాలలో కృష్ణపూజలు నిర్వహించినారు.

**హనుమకొండ :** వరంగల్, ఖాజీపేట చుట్టు ప్రక్కల మండలాలను పరిగణాలోనికి తీసుకొని ఐదు ధర్మక్షేత్రాలుగ విభజించుకొన్నారు. గీతాజ్యోతి ప్రచారం ముమ్మరంగ ప్రతి యింటిలో, దేవాలయంలో సాగుచున్నది. ఈ విధంగా హన్మకొండ వికాసతరంగిణి పరిధిలో మొత్తం

## పరమపదవార్త

**శ్రీమతి తొడుపూనూరి పద్మావతిగారు** చిత్రభానునామ సం॥ కార్తీక మాస బ॥ సప్తమి అనగా తేది : 26-11-2002 మంగళవారం నాడు ఆచార్యతిరువడి సన్నిధిని చేరినారు. వీరు వానమామలై శ్రీశ్రీశ్రీ తోతాద్రి రామానుజ జీయరుస్వామివారి వద్ద సమాశ్రయణాలు పొందారు. వీరు శ్రీశ్రీశ్రీ పెద్దజీయరుస్వామివారి అనుగ్రహ పాత్రులుకూడ వీరికి ఆశ్రియఃపతి సన్నిధి కైంకర్యము లభించాలని ప్రార్థిస్తున్నాము.

జిల్లాలో 13+5 = 18 ధర్మక్షేత్రాలుఏర్పాటు చేయడం జరిగింది.

గతంలో శ్రీవారు అనుగ్రహించిన ప్రతి కార్యక్రమాన్ని ఎలా అందుకున్నారో అదే విధంగా గీతాజ్యోతి కార్యక్రమా లనుకూడ ఆ విధంగా ఆదరిస్తున్నారు. 6 పశువైద్య శిబిరాలు, పిల్లలకు సంబంధించిన నేత్ర, దంత శిబిరాలు నిర్వహించినారు.

ఉచిత పశువైద్య శిబిరం డిసెంబరు 22న పసరుగొండ గ్రామంలో 1556 పశువులకు వైద్యం జరిగింది. డిసెంబర్ 23వ తేదీన గీసుకొండ గ్రామంలో 1074 పశువులకు వైద్య చికిత్సలతో పాటు ఉచిత మందులను పంపిణీచేయడం జరిగినది. 5 గ్రామాల ప్రజలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ శిబిరంలో శ్రీమాన్ సుబాష్ రెడ్డి, డా॥ పి. నరసింహ, డా॥ బి. వెంకటేశ్వరరావు, కృష్ణమాచారి, రాధాకిషన్‌రావు, భగవాన్‌రెడ్డి, డా॥ శ్రీనివాస్, డా॥ నరసయ్య, డా॥ పి. యాకోబురెడ్డి, డా॥ జె. వెంకటరమణారెడ్డి, మరియు పారామెడికల్ సిబ్బంది పాల్గొన్నారు.

7వ తేది చంద్రాయిపల్లి గ్రామంలో ఉచిత పశువైద్య శిబిరం నిర్వహించ బడినది. ఈ శిబిరంలో 814 పశువులకు వైద్యం చేయడం జరిగింది. చట్టుప్రక్కల గ్రామాల రైతులు ఈ శిబిరాన్ని సద్వినియోగం చేసుకొన్నారు.

15-12-2002వ తేదీన అనంతారం గ్రామంలో 988 పశువులకు వైద్యశిబిరం నిర్వహించబడినది. గుండెవాపు, చూడి పరీక్షలు, గర్భకోశ వ్యాధులకు సంబంధించిన చికిత్సలు నిర్వహించడం జరిగింది. వైద్యచికిత్సతోపాటు ఉచిత మందులు పంపిణీ చేయడం జరిగింది. ఈ కార్యక్రమంలో డా॥ చాడ సుబాష్‌రెడ్డి, డా॥ బి. వెంకటేశ్వరరావు, డా॥ నర్సింహారావుగారు, డా॥ కృష్ణమాచారిగారు, డా॥ జె. రమణారెడ్డిగారు, డా॥ యాకుబ్‌రెడ్డిగారు పాల్గొన్నారు.

జనవరి 2వ తేదీన ఘనపురంలో (వరంగల్ జిల్లా) నిర్వహింపబడుతున్న పశుప్రదర్శనలో ప్రభుత్వం కోరిక మేరకు గోవుకు, గో మహిమ కుసంబంధించిన ప్రదర్శనను నిర్వహిస్తున్నారు.

అన్ని వర్గాలవాళ్ళు ఈ కార్యక్రమాన్ని ఆదరిస్తున్నారంటే శ్రీస్వామివారి అమోఘమైన సంకల్పబలం వల్లనే. వరంగల్ జిల్లా నగరంలో కఱువు కాటకాలు ఎదురైనా, ఆర్థిక పరిస్థితులు బాగా లేకపోయినా శ్రీస్వామివారి ఆజ్ఞను తలదాల్చి అన్ని ధర్మక్షేత్రాలకు సంబంధించిన కార్యకర్తలు, ప్రజలు అంకితభావంతో కార్యక్రమం విజయవంతం కావడానికిఎంతో కృషి చేస్తున్నారు.

ఈ సందర్భంగా వికలాంగులకు కూడ చిత్రగీత పోటీలను ప్రకటించడం జరిగింది. వాటిలో వరుసగా ప్రథమ బహుమతిగా రూ. 5000/-, ద్వితీయ బహుమతిగా రూ. 3000/-, తృతీయ బహుమతిగా రూ. 1000/-లను ఇవికాక 20 కన్సోలేషన్ బహుమతులుకూడ ప్రచురించబడ్డాయి.

అన్ని వర్గాల ప్రజలు ఈ కార్యక్రమాన్ని ఆదరిస్తున్నారు. శ్రీవారి ధర్మరథం 18 ధర్మక్షేత్రాలలో ప్రచారమునకు ఎంతో దోహదపడినది. స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ అన్న లక్ష్యం ప్రజల ఆదరణకు పాత్రమై దేశవ్యాప్తంగ ప్రచారంలోనికి వచ్చి అన్ని వర్గాల ప్రజలను ఆకర్షిస్తున్నది. శ్రీస్వామివారు నిర్దేశించిన ఈ లక్ష్యమే మూల మంత్రమై దేశమంతా శబ్దితమై శ్రీస్వామివారు సంకల్పించిన ఉద్యమాన్ని విజయవంతం చేస్తుందనడంలో సందేహం లేదు.

వరంగల్ జిల్లాలో 18 ధర్మక్షేత్రాలు ఏర్పడటానికి మార్గదర్శకురాలైన శ్రీమతి డా॥ పి. జ్యోతిగారు ధర్మక్షేత్రాల కన్వీనర్లకు తగిన సూచనలిస్తూ జిల్లాలో ధార్మిక ఉద్యమాన్ని ముందుకు నడిపిస్తున్నారు.

**భువనేశ్వర్ :** భువనేశ్వర్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో 'ప్రతి ఒక్కరు సేవా భావంతో ముందుకు సాగాలి' అనే భావనతో కార్యక్రమం నిర్వహింపబడినది. ఒరిస్సా రాష్ట్రంలోని గంజాం జిల్లాలో హనుమాన్‌పల్లిలో ఏర్పాటు చేసిన కార్యక్రమంలో గీతాజ్యోతి యొక్క వైభవాన్ని మధుసూదన్ రామానుజదాస్ వివరించారు.







గీతలోని 700 శ్లోకాలలో 48 శ్లోకాలు ఏడాది పొడవున ఉచ్చరించేందుకు ప్రచారం చేస్తున్నారు. ఈ కార్యక్రమంలో భువనేశ్వర్ వికాసతరంగిణి చైర్‌పర్సన్ శ్రీమాన్ బి.జె. దాస్‌గారు, శ్రీమాన్ పి.వి. రమణారావుగారు, శ్రీమాన్ విప్రనారాయణ పండా, ఎ.కె. భుయాన్ గారు మరియు 85 మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

**పెనుగొండ :** పశ్చిమగోదావరి జిల్లా పెనుగొండ ధర్మక్షేత్రంగ గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం జరుగుచున్నది.

**తిరుపతి :** తిరుచానూర్ శ్రీపద్మావతి అమ్మవారి బ్రహ్మోత్సవముల సందర్భముగ తిరుపతి వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో 18-12-02న 30 వేలమందికి తోళప్పగార్డెన్‌లో అన్నదాన కార్యక్రమంలో సేవచేయడం జరిగింది. గత 2 సం॥ల నుండి ఈ సేవాకార్యక్రమంలో వికాస తరంగిణి సేవలను అందించుచున్నది. 100 మంది కార్యకర్తలు పాల్గొన్నారు. వికాసతరంగిణి చైర్ పర్సన్ శ్రీమాన్ యన్. నాగేంద్రశాయిగారు ఆధ్వర్యంలో నిర్వహించు చున్నారు.

**ఖానాపూర్ :** ఖానాపూర్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో సామూహిక లక్ష్మినారాయణ పూజలు, గీతాజ్యోతి ప్రచార కార్యక్రమాలు, గీతా సందేశాలతో ప్రచారం జరుగుచున్నది.

**యద్దనపూడి :** యద్దనపూడి మండలంలో వికాసతరంగిణి ఆధ్వర్యంలో 15-12-02 ఉ॥ ఉచిత వైద్య శిబిరం జరిగినది. 200 మంది రోగులను పరీక్షించి సేఫ్ కంపెనీ, యద్దనపూడి రాజేశ్వరి గార్లు ఉచితముగా మందులు ఇచ్చినారు. ఈ కార్యక్రమంలో డా॥ రమేష్‌గారు, డా॥ వీరశంకర్‌గారు, డా॥ రంగనాథ్ వైద్య బృందం పరీక్షలు నిర్వహించినారు. యద్దనపూడి వికాసతరంగిణి తరపున దేవాలయములకు తులసి కుండీలను వితరణ చేయుట జరిగినది.

**చోడవరం :** చోడవరం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో స్థానిక కన్యకాపరమేశ్వరి దేవాలయంలో గీతాయజ్ఞం 108 మందిచే గీతాపారాయణం చేయడం జరిగింది. ఈ కార్యక్రమంలో 150 మంది భక్తులు పాల్గొన్నారు. గీత పుస్తకములు అందరికీ పంపిణీ చేయడం జరిగింది. ఈ కార్యక్రమంలో చైర్‌పర్సన్ శ్రీమతి రత్నకుమారిగారు, ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు.





**శ్రీస్వామినారాయణ పరివారం శ్రీసాధుయజ్ఞేశ్వరస్వామి, శ్రీవారిని దర్శించారు. శ్రీశ్రీశ్రీస్వామివారు వారికి ఆక్యుప్రెషర్ గురించి వివరిస్తున్న దృశ్యం.**

జై శ్రీమన్నారాయణ..!

ఈ సంచికలో .....



## పంచాంగ వివరాలు

**ఫిబ్రవరి**

8 రథసప్తమి

13 కుంభ సంక్రమణం ఉ॥ 8-33
సర్వేషాం భీష్మైకాదశి
శ్రీవిష్ణుసహస్రనామ జయంతి

23 తిథి ద్వయం

24 నవమి తిథి

27 సర్వేషామేకాదశి

**మార్చి**

1 మహాశివరాత్రి,శ్రీశైలం, వేములవాడాది శైవక్షేత్రములలో అభిషేక కళ్యాణోత్సవములు

2 సర్వేషాం అమావాస్య

4 యాదగిరి శ్రీలక్ష్మీనరసింహస్వామివారి బ్రహ్మోత్సవారంభం

6 చవితి తిథి

7 శూన్య తిథి

8 పంచమి తిథి

11 తిరుక్కచ్చి నంబి తిరునక్షత్రము
యాదగిరి శ్రీలక్ష్మీనరసింహ స్వామివారి కళ్యాణోత్సవం

**ముఖచిత్రపరిచయం :** పిట్టలవానిపాలెం ధనుర్మాస వ్రతమహోత్సవములో

1. కళ్యాణమహోత్సవము రోజున సర్వాలంకారములతో దర్శనమిస్తున్న గోదామాత.
2. లక్ష నేతి దీపోత్సవము.
3. పిట్టలవానిపాలెంలో శ్రీవారి శాంతియాత్రలో వందల వాహనములతో పాల్గొన్న అశేష భక్తజనం.
4. శ్రీవారు ప్రవచనం సాయించిన వేదిక **'శ్రీవిల్లిపుత్తూరు ప్రాంగణము'.**
5. గోపాలోపాయన మహోత్సవములో శ్రీవారి నుండి సమ్మానపత్రములను అందుకొంటున్న పురస్కార గ్రహీతలు
6. శ్రీవిల్లిపుత్తూరు ప్రాంగణములో వైకుంఠ ద్వారదర్శనము.
7. పిట్టలవానిపాలెంలో తిరుమల శ్రీవేంకటేశుని దివ్య శేష ప్రసాదమును శ్రీవారికి సమర్పిస్తున్న శేషాద్రిగారు.

మీ సేవలో....


**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 272929,
చందా: సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-, విదేశాలకు సంవత్సరచందా $ 25.
E-mail : bhakthinivedana@yahoo.co.in Internet : www.chinnajeeyar.org
D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం,




శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాసపత్రిక


చిత్రభాను నామ సంవత్సరం | మాఘ మాసము

**సంపుటి 55 | 2003 ఫిబ్రవరి | సంచిక 11**


వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు :

శ్రీ ఉ. వే. శ్రీమాన్ **T.P. శ్రీరామచంద్రాచార్యులు**




సనాతన భారతీయ జీవనవిధానం ద్విముఖంగా సాగుతూంటుంది. ఒకటి ప్రవృత్తి ముఖం, మరొకటి నివృత్తి ముఖం. ఐతే యీ ప్రవృత్తి - నివృత్తుల్ని నిర్వచించుకోవటంలోనూ, వాటి స్వరూప స్వభావాలను నిరూపించి నిర్దేశించుకోవటంలోనూ, వాటిని జీవితాలకన్వయించుకోవటంలోనూ జనం పలుపోకలు పోతున్నారు.

ఈ బహుముఖీనతవల్ల వాటి విషయంలో స్పష్టమైన అవగాహన కొరవడిందనే చెప్పవచ్చును. కొన్నిచోట్ల వీటిని గూర్చిన అచ్చపు తెలివి లేకపోవటంవల్ల విపరీతధోరణులు కూడా ప్రబలి జన జీవితాలు కల్లోలితాలు, కలుషితాలు కావటంతోపాటు దురర్థకాలుగాను, నిరర్థకాలుగానూ సమసిపోవటం కూడా జరుగుతుంది.

అసలు ప్రవృత్తి అంటే ఏమిటి? నివృత్తి అంటే ఏమిటి? మనిషి మనుగడలో ఇవి సమాంతరాలుగా సాగుతాయా? సన్నిహితాలుగా మెలగుతాయా? పౌర్వాపర్యాన్ని పాటించి వర్తిస్తాయా? ముందు వెనక లెట్లా? వీటికేమైనా పరిమితులున్నాయా? ఆగర్భ శత్రువుల్లా, ఉత్తర దక్షిణ ధ్రువాల్లా ఎడ మొగం పెడమొగంగానే ఇవి నిలుస్తాయా? ప్రవృత్తిలో నివృత్తికాని, నివృత్తిలో ప్రవృత్తికాని సహజీవనం సాగించవా? ఎన్ని శంకలో? ఎన్ని ప్రశ్నలో? ఎన్ని విచికిత్సలో చెప్పలేం!

**ఇంతకూ ప్రవృత్తి అంటే ఏమిటి?**

ఒకదాని యందు మనసు లగ్నంచేసి దాని స్వరూప స్వభావాలను వాచా చర్చించి, సాధకబాధకాలు తర్కించుకొని అనుకూలబుద్ధి నేర్పరచుకొని క్రియారూపంలో దాన్ని కనబరచటం ప్రవృత్తి అనుకోవచ్చును. త్రికరణాలూ అనుకూలంగా ఏకముఖంగా స్పందించకపోతే ఒక మనిషి ఒక విషయంలో ప్రవర్తించలేడు.

ఇట్లా ఇవి అనుకూలంగా స్పందించడానికి ఒక ప్రయోజనం ఉండాలి. ఇంద్రియాలకు విషయాలను గ్రహించే శక్తి ఉంది. కనుక గ్రహిస్తాయి. ఐతే గ్రహించినా నిర్దిష్టప్రయోజనం లేకపోతే ఆ గ్రహణం సమర్థం కాదు, సమగ్రంకాదు, ఫలవంతమూ కాదు. చూసిన ప్రతిదీ మనసుకెక్కదు. చెవిన పడిన ప్రతిదీ ఎదకు పాకదు. ఆ చూపునకు ప్రయోజనం, ఆ వినికికి ప్రయోజనం ఉంటే, అది అట్టిదిట్టిదికాక కాస్త గట్టిదయితే ఆ చూపు దూసుకుపోతుంది. చూసినదాన్ని ఎదలో పదిల పరచుకుంటుంది. ఆ చెవి నిక్కి నిలుస్తుంది. సవ్వడిని నిలుపుకుంటుంది. ఎదలోతులకు కొనిపోతుంది. అక్కడ గూడుకట్టి కూర్చుండబెడుతుంది. అప్పుడది







కార్యరూపంలో నిలుస్తుంది. జీవితాన్ని ముందుకు నడిపిస్తుంది. ఇదంతా మనిషిలో కలిగే ఒకానొక అనుకూల స్పందనం.

ఒక మనిషి విద్యావంతుడు కావాలన్నా, ధనవంతుడు కావాలన్నా, కీర్తిమంతుడు కావాలన్నా, ఏంకావాలన్నా ఈ ప్రవృత్తి అవసరం. మనిషి సర్వతోముఖంగా అభ్యుదయాన్ని పొందటానికి ప్రవృత్తి ప్రాథమికంగా ఉండవలసిన లక్షణం.

**ఇక నివృత్తి అంటారా?**

కారణం ఏమికానీండి, ప్రయోజనం ఏమికానీండి - ఒక దానినుండి సర్వాత్మనా మరలి పోవటం నివృత్తి. రాగం లేక మరలవచ్చు. ఆశ లేక మరలవచ్చు. ఫలం అక్కరలేక మరలవచ్చు. ఫలం రాదని ఎరిగి మరలవచ్చు. అనుభవాలయందు, భోగాలయందు, ప్రాప్యాలయందు ఆస్థ తగ్గి, సొంతం రూపరి మరలవచ్చు. మనిషి మనుగడను స్తంభింపచేయటానికి తుద ముట్టించడానికి ఈ నివృత్తి దారితీయవచ్చు.

అస్థాన పతితమైన నివృత్తి అకర్మణ్యతకు పలాయన ధోరణికి కారణం కావచ్చు. ఇది స్పృహణీయం కాదు.

ప్రవృత్తి నివృత్తులు రెండూ మనిషికి ఉండాల్సినవే. అయితే వాటి మోతాదుల్లో అవి ఉన్నంతవరకూ రెండూ మంచివే. శ్రుతిమించితే మితిమీరితే ఏదైనా ఇక్కట్టుకే.

ఇక ఇవి సమాంతరాలా, సన్నిహితాలా, పూర్వోత్తరాలా అన్నది చూడవలసింది.

చాలామంది అభిప్రాయం, ఇవి పూర్వోత్తరాలని. మనిషి మనుగడ కొంత దవ్వు ప్రవృత్తిమార్గంలో సాగుతుందనీ, తరువాత నివృత్తి మార్గానికి వస్తుందనీ వీరి తలపు. ఈ దృష్టి ఉండటంవల్లనే పూర్వ వయస్సులో సుఖభోగాలు ఉన్మస్తకంగా అనుభవించి, వయస్సుడిగేక కాలుసేతులు కదలక కఫవాతపిత్తాలు కంఠావరోధకాలు కాగా శవప్రాయమైపోయినాక, ఇహ కృష్ణా, రామా అనుకుందాం-అనుకొని అదీ కుదరక చావలేక బతకలేక రోజులీడుస్తూ నివృత్తి మార్గంలో ఉన్నామనుకొంటారు.

ప్రతీ స్పందనంలోనూ అది కార్యరూపం పొందటంలోనూ ప్రవృత్తి-నివృత్తులు రెండూ ఉంటాయి. ప్రారంభించిన ఏ పనయినా తుదముట్టాల్సిందేకదా! ప్రవృత్తి ఫలం ప్రారంభం అనుకుంటే సమాప్తి సూచనం నివృత్తి. ఇదొక నియత వ్యవస్థ. దీన్లో రెండూ దశాభేదాలే తప్ప విరుద్ధాంశాలు కావు.

చాలామంది జీవితంలో సగం, లేదా మూడువంతులముప్పాతిక ఐహిక సుఖ భోగానుభవార్థం అని, మిగిలినది ఆముష్మికం కోసం అని ఒక భావనంలో ఉంటారు. భోగార్థమైన జీవితంఅంతా ప్రవృత్తిమయం అని, ఆముష్మికం కోసం నిర్దేశించిన భోగం నివృత్తిపరం అని వీరి అభిప్రాయం.

ఈ లెక్కన జీవితాన్ని విభజించుకొంటే కొందరి జీవితాలలో నివృత్తి పర్వానికి కాలం కర్మం కలసిరాకపోతే అవకాశమే రాకపోవచ్చు.

అసలు ప్రవృత్తికి మట్టుకు సమగ్రమైన అవకాశం లభిస్తుందన్న నమ్మకమేముంది? శతాయుష్కులకు, నూరేళ్ళు నిండడం మాటకేమి పాతికేళ్ళకి నూరేళ్ళు నిండటం ఎన్నిచోట్ల చూడటంలేదు. అప్పుడీ విభాగానికి ప్రయోజనమేముంటుంది?

ఇక్కడ బుద్ధిమంతుడు గమనించాల్సింది ఒకటుంది. రేపన్నది వీని చేతిలోనిది కాదు. కాని ఆశ అన్నది ఉండక తప్పదు. రేపటికై నేడు తపనా తప్పదు.

ప్రవృత్తి-నివృత్తులు సన్నిహితాలు, అన్యోన్య సంశ్లిష్టాలుగా ఉండాలి. ఇవి సమాంతరాలూకారాదు. పూర్వోత్తరాలూ కారాదు. ఐతే వీటిని అన్వయించుకోవటంలోనే ఉన్నది కౌశలం అంతా.

దేహం అని శరీరం అని మనిషి ఒంటిని చెప్పేరెండు మాటలున్నాయి. ఇందులో దేహం ప్రవృత్తిని నిర్దేశిస్తుంది. శరీరం నివృత్తిని నిరూపిస్తుంది. పెరిగేది దేహం. విరిగేది శరీరం. మళ్ళీ విచికిత్స. పూర్వ వయస్సులో ప్రవృత్తిమార్గంలో దేహాన్ని పెంచి, ఉత్తర వయస్సులో నివృత్తిపథాన పడి శరీరాన్ని కృశింపచెయ్యాలా? అని.

ఏ వయస్సులోనైనా సరే! శరీరాన్ని పోషించాల్సిందే! అది ధర్మసాధనం. శరీరం లేకపోతే బ్రతుకులేదు. మనం పెంచాలన్నా పోషించాలన్నా ఉత్తరవయస్సు వచ్చేక శరీరం మెరుగు తరగక తప్పదు. చర్మం ముడుతలు పడకాతప్పదు. తలనెరవకా తప్పదు. పళ్ళు ఊడకాతప్పదు. ముదిమిరాకా తప్పదు. తారుణ్యం, దార్ఢ్యం తరలిపోకా తప్పదు. అట్టి స్థితిలోనూ శరీరాన్ని పోషించాల్సిందే. అన్నం పోకపోతే జావ, అదీ పోకపోతే నీళ్ళు, అదీ పోకపోతే అప్పుడు ప్రాణాలు తామే పోతాయి. అంతవరకూ ప్రయత్నం తప్పదు. అట్టాంటి స్థితిలో కూడా శరీరాలు నిలిచిన ఉదంతాలు అనేకం. ఎక్కడ ఈ నివృత్తి?

వయసను మళ్ళేక అన్నోదకాలు మానతాడా మనిషి? ఐతే తగ్గించుకోవచ్చును. ఇది నివృత్తి అని కొందరి తలపైతే కావచ్చును. కానీ, అదీ నివృత్తికాదు. ఎక్కువ తింటే రోగం వస్తుందని అరగది బ్రతుకుక్కు భంగం ఏర్పడుతుందని ఈ ఆహారనియమం. అంటే బతకాలనేగా! ఎందుకు? బతికినాక ఏదో చెయ్యాలిగా. అంటే అది ప్రవృత్తేకదా! అందుకే అన్నాం ప్రవృత్తి-నివృత్తులు సన్నిహితాలని సంశ్లిష్టాలనీని.

ప్రవృత్తికి కాని నివృత్తికి కాని భావనం ప్రధానం. విశుద్ధమైన భావనం అనుష్ఠానపర్యంతం పర్యవసించాలి. అంతేకాదు కొన్నిటిలో ప్రవృత్తి ఎన్నటికీ ఏకరూపంగానే ఉండాలి. భావనంలోనే నివృత్తి. అది విశుద్ధమైనప్పుడు ఈ ప్రవృత్తి కూడా నివృత్తికి అంగంగా రూపొందుతుంది.

దూరప్రయాణం పెట్టుకుంటాం. ప్రయాణం సుఖంగా సాగటానికి కావలసిన ఏర్పాట్లు ముందు చేసుకుంటాం, ప్రయాణం చేస్తాం. చేస్తున్నంతసేపూ చాలా హాయిగా ఉంటుంది. గమ్యం చేరేక కూడ ఇంకా ఆ యానసాధనాల్లోనే ఉండిపోతే బాగుండునని







పిస్తుంది. కాని అట్లా ఉండిపోతామామఱి? దిగకుండా?

జీవితమూ అంతే! ప్రయాణం సుఖంగా సాగాలని ఎన్నో సదుపాయాలు చేసుకున్నాం. ఈ ఏర్పాట్లు చేసుకుంటున్నంతసేపూ, ప్రయాణం చేస్తున్నంతసేపూ ఇవి శాశ్వతాలు కావని మనం ఫలానా దగ్గర దిగిపోతామని. దిగిపోవాలనీ తెలుసు. తెలిసే చేస్తున్నాం.

ప్రవృత్తి సాగుతున్నంతసేపూ నివృత్తి కూడా నియతం అనీ, అనివార్యం అని తెలిసే ఉండాలి. ఇట్లా ఈ భావాలు సన్నిహితాలు, అన్యోన్యసంశ్లిష్టాలు.

ప్రవృత్తి రాగాత్మకం, భోగాత్మకం అని నివృత్తి విరాగాత్మకం. జీవిత చరమాంకంలో ఏర్పడాల్సింది అనీ కొందరి తలపు. ఈ హద్దులనేర్పరుప మనమెవరం?

అయితే ఒకటి, ఇతర ప్రాణులకంటే మనిషి విలక్షణుడు. వీని జీవిత పరమార్థం వేరు. అంచేత వీడు జీవితంలో కొన్ని నియమాలనేర్పరచుకోవాలి. ప్రణాలికలు రూపొందించుకోవాలి. వాటిని ఆచరణలో పెట్టుకోవాలి. లక్ష్యాన్ని చేరుకోవాలి.

ప్రవృత్తి అయినా నివృత్తి అయినా ఆ లక్ష్యానికి అభిముఖంగా వీణ్ణి నడిపేందుకు తోడ్పడాలి.

దేహం ఉత్తరావస్థ శరీరం అన్నాం. కనుక దాన్ని పట్టి మనిషి జీవన విధానంలో ఒక క్రమచర్య ఉంటుంది. దేహం సహకరించినంతగా శరీరం సహకరించదు. శరీరంవంతు వచ్చేటప్పటికి బుద్ధి, ఇంద్రియాలు అన్నీ రాను రాను వాటివాటి స్పందనలలో మందగిస్తాయి. కనుక వాటి వ్యాపారాలు కడదాకా కొనసాగాలంటే వాటిని కొంత నియంత్రించక తప్పదు. చూపు మందగిస్తుంది. కంటికి ఎక్కువ శ్రమనివ్వకూడదు. వినికి తగ్గుతుంది. వినే ప్రయత్నం తగ్గుతుంది. బుద్ధి శ్రమను తట్టుకోలేదు. దానికి కాస్త విశ్రాంతినివ్వాలి. ఈ స్థితినే వార్ధకం అంటున్నాం. మనిషి నివృత్తిమార్గంలో పడ్డాడంటున్నాం.

వాస్తవానికి ఇక్కడా ప్రవృత్తే సాగేది. ఐతే ఇది విశృంఖలంగా కాకుండా నియంత్రితంగా సాగుతుంది. నివృత్తిలా కనిపిస్తుంది.

పిల్లకు పెళ్ళి చెయ్యాలి. పెద్ద ఖర్చు.

దీన్ని తట్టుకోవడానికి ఎన్నో చిన్న చిన్న చిల్లర ఖర్చులు తగ్గించుకొంటాం. ఇది నివృత్తి. ఇదీ ప్రవృత్తే. ఐతే నియంత్రణంతో సాగుతుంది.

పరమనేది ఒకటుందని, దానికోసమే ఈ జీవితం అని పెద్దల తలపు. జీవితం ఉంటుంది. వెనుక మనం అనుకున్నట్లు అది ఒక ప్రయాణం. ప్రయాణం కంఫర్టబుల్‌గా సాగాలి. మనగమ్యం వేరు. ప్రయాణం గమ్యం చేరటానికి సాధనం, ఉపాయం. ప్రయాణమే గమ్యం మట్టుకు కాదు.

అట్లాగే ఈ జీవితాన్నీ ప్రయాణంలా భావించాలి. కంఫర్ట్స్ కావాలి. గమ్యం రాగానే అన్నీ వదులుకొని దిగిపోవాలి. జీవితమూ అంతే.

**గమ్యాన్ని చేరుకోవటానికి ఏం చెయ్యాలో అన్నీ ఈ బ్రతుకులోనే చేసుకోవాలి.**

ఇలా దిగిపోవాలని తెలిసి ఉండటమే, అలా దిగిపోగలగటమే నివృత్తి. ప్రయాణం సుఖంగా సాగటానికి ఏర్పాట్లు చేసుకోవటమే ప్రవృత్తి. రైలెక్కక ముందు నుంచీ మనకు తెలుసు దిగిపోవాలని. అయితే తేడా అల్లా ప్రయాణంలో ఎక్కడ దిగాలో ఎప్పుడు దిగాలో ముందు మనకు తెలుసు.

**జీవిత ప్రయాణంలో గమ్యం ఎప్పుడు చేరతామో ఎప్పుడు దిగిపోతామో తెలియదు. అంచేత ఎప్పుడు దిగిపోవాలన్నా సిద్ధపడే ఉండాలి ఈ ప్రయాణంలో. ఇదిగో ఈ సిద్ధపడటమే నివృత్తి.**

**'పరత్రహేతో రిహ జన్మనా చ'** - ఈ వయస్సు ఆ వయస్సు అనికాక ఈ జన్మ అంతా పరం కోసం తపించాలి లోకవృత్తాన్ననుసరిస్తూనే.

నివృత్తి జ్ఞానంతో ప్రవృత్తి పెనవేసుకుపోవాలి. అట్లా అవిరెండూ నీరంధ్ర సంశ్లిష్టాలయిననాడే. వీని చదువు, సంస్కారం, బుద్ధి, వివేకం మొదలయినవి వీని ప్రవృత్తిని నియంత్రిస్తూ గమ్యం వైపు పురోగమించటానికి, గమ్యం రాగానే దిగి పోవటానికీ తోడ్పడతాయి.

నియంత్రణలేని ప్రవృత్తిని, గమ్యం చేర్చని నివృత్తినీ మనం సహించం.

**- శ్రీరామచంద్రాచార్య**











# శ్రీవిష్ణు మహాపురాణము

## షష్ఠాధ్యాయం - చాతుర్వర్ణ్యాది సృష్టి

**శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, కొవ్వూరు.**



చతుర్ముఖ బ్రహ్మరూపుడైన పరమాత్మ నుండి, ఆయన సృష్టి సంకల్పంచేసినప్పుడు, మొట్టమొదటగా ముఖం నుండి సత్త్వోద్రిక్తులైన ప్రజలు, వక్షస్థలం నుండి రజోగుణోద్రిక్తులు, ఊరువుల నుండి, పాదాల నుండి రాజస, తామస గుణోద్రిక్తులైన ప్రజలు ఆవిర్భవించారు.

వీరినే క్రమంగా బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులని అంటారు.

### చాతుర్వర్ణ్య సృష్టి ఎందుకు?

నాల్గురకాలుగా నల్గురు ప్రజలను సృజించవలసిన అవసరం ఏముంది? అన్న ప్రశ్నను విష్ణుపురాణం ఇలా సమాధానిస్తున్నది.

**"యజ్ఞనిష్పత్తయే సర్వ మేతద్ బ్రహ్మ చకార వై ।**
**చాతుర్వర్ణ్యం మహాభాగ యజ్ఞసాధన ముత్తమమ్॥"**

దాని అభిప్రాయం ఏమిటి? యజ్ఞం కొరకు నాల్గు రకాల స్వభావాలుకల ప్రజలు సృజింపబడ్డారట. యజ్ఞంలో నాల్గుఅంశాలుంటాయి.

యజ్ఞమనేది దేవతాప్రీతికొరకు చేసే కర్మ. ఇది నిర్వహింపకపోతే దేవతా ప్రీతికలగదు. అది కలగనప్పుడు వృష్టి కురవదు, పంటలు పండవు. మన కంటికి అగుపించని ఏవో కొన్ని దివ్యశక్తులు ప్రకృతి స్వభావాన్ని నియమిస్తూ ఉంటాయని, మేఘాలు ఏర్పడ్డం కానీ, వర్షాలు తగిన కాలంలో కురవడం కానీ, ఇవన్నీ ఆ అతీత దివ్యశక్తులపై ఆధారపడి ఉంటుందని, కనుక ఆదివ్య శక్తులను స్తుతించే వైదిక మంత్రాల ద్వారా ఆ దేవతలకు, తాము తినే ద్రవ్యాన్నే అగ్నితో సమర్పించడం ద్వారా, వారికి ప్రీతిని కలిగించి వృష్టిని పొందాలని ప్రాచీనమైన వైదిక విశ్వాసం. పురాణాలు ఆ విశ్వాసాన్ని ఉట్టంకిస్తాయి.

**'సహయజ్ఞైః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।**
**అనేన ప్రసవిష్యధ్వమ్ ఏషవోఽస్తు ఇష్టకామధుక్॥**

**అన్నాద్భవన్తి భూతాని, పర్జన్యాదన్నసంభవః ।**
**యజ్ఞాద్భవతి పర్జన్యః యజ్ఞః కర్మ సముద్భవః ॥**

అని చెప్పడం ద్వారా శ్రీగీతలో శ్రీకృష్ణస్వామి ఒక చక్రాన్ని మనముందు ఉంచాడు.

అన్నంవల్లనే ప్రాణులు పుడుతున్నాయి. అన్నం వర్షాలవల్ల వస్తుంది. యజ్ఞంవల్ల వర్షం ఏర్పడుతుంది. యజ్ఞం పురుష

ప్రయత్నంచేత సాధ్యం. మరి ఆ పురుషులెవ్వరు? పైన పేర్కొన్న నాల్గురకాల ప్రజలే. ఒకరు దేవతా స్తుతిని మంత్రాలద్వారా చేసి దేవతా ప్రీతి కరమైన యజ్ఞాన్ని నిర్వహిస్తే, దానికి కావలసిన సంభారాలు కొందరు సమకూరుస్తారు. కొందరు ఈ యజ్ఞ ప్రక్రియ విఘ్నితం కాకుండా రక్షిస్తారు. కొందరు క్రియా కలాపం సాగేలా సంభారాలను ఒకచోట సమకూర్చడంతో పరిశ్రమించి కార్యసాధకు లౌతారు. నాల్గు వర్ణాలు చేసే పనులు నాలుగు ఇవి. దాన్ని మనం *Distribution of Work of responsibility* అని ఆధునిక పరిభాషలో చెప్పవచ్చు. ఈ నల్గురిలో ఎవరు లేకపోయినా యజ్ఞం సాగదు. మన జీవనం (మనుగడ) సాగదు. భవనానికి నాల్గు కుడ్యాల్లా, మండపానికి నాల్గు స్తంభాల్లా సామాజిక జీవనంలో ఈ నల్గురికీ సమాన భాగస్వామ్యం. సమాన ఫలలబ్ధి. ఇది వైదిక నిర్ణయం. కాలక్రమేణ వ్యక్తుల మనోభావాల్లో ఏర్పడిన వికారాల వల్ల హెచ్చుతగ్గులు, వైషమ్యాలు పెరిగి ఈ లక్ష్యం దెబ్బతిన్నదని మనం గుర్తించాలి.

ఈ విషయాన్ని విష్ణుపురాణం ఎంతో అందంగా వివరించింది చూడండి.

**'యజ్ఞైరాప్యాయితా దేవాః వృష్ట్యుత్సర్గేణ వై ప్రజాః ।**
**ఆప్యాయయన్తే ధర్మజ్ఞ యజ్ఞాః కల్యాణహేతవః ॥**

**నిష్పాద్యన్తే నరైస్తైస్తు స్వధర్మాభిరతై స్తతః ।**
**విశుద్ధచరణోపేతైః సద్భిః సన్మార్గ గామిభిః ॥**

**స్వర్గాపవర్గౌ మానుష్యాత్ ప్రాప్నువన్తి నరా మునే ।**
**యథాభిరుచి తం స్థానం తద్యాన్తి మనుజా ద్విజ॥**

ఈశ్లోకాలభావాన్ని పర్యాలోచించుదాం.

# అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషిచేస్తున్న వారిలో ఒకరు శ్రీమాన్ మామిడాల సురేష్ బాబుగారు (నల్గొండ జిల్లా వికాస తరంగిణి ఉపాధ్యక్షులు, మిర్యాల గూడెం), తమ వంతు కైంకర్యముగా మన భక్తినివేదన కుటుంబాన్ని మరింతపెంచే దిశగా కృషిచేస్తున్నారు. వీరికి శ్రీశ్రీశ్రీస్వామివారు అనేక మంగళాశాసనములను కృపచేసారు.







# శ్రీశ్రీశ్రీ చిన్నజీయరుస్వామివారి పర్యటనా వివరములు - 2003

3-2-2003 మంగళగిరిలో కళ్యాణ మండపం ప్రారంభోత్సవంలో పాల్గొంటారు.

4-2-2003 వరంగల్ జిల్లా, చిట్యాల గ్రామంలో సమాశ్రయణములు, శ్రీకృష్ణపూజలు నిర్వహిస్తారు.

5-2-2003 చిట్యాలలో శ్రీ సీతారామాంజనేయస్వామి ఆలయ ప్రతిష్ఠ నిర్వహిస్తారు. రాత్రికి బీచుపల్లి వేంచేస్తారు.

6-2-2003 బీచుపల్లిలో ప్రతిష్ఠా కార్యక్రమంలో అన్వయిస్తారు. రాత్రికి అపోలో హాస్పిటల్ సంప్రోక్షణ కార్యక్రమ ప్రారంభం చేస్తారు.

7-2-2003నుండి 14-2-2003వరకు అపోలో హాస్పిటల్‌లో నిర్మించిన ఆలయ కార్యక్రమాల్లో వేంచేసి ఉంటారు.

12-12-2003 హైదరాబాద్‌లోని వివిధ కార్యక్రమాల్లో పాల్గొంటారు.

13-2-2003 యన్.టి.ఆర్. స్టేడియంలో భీష్మ ఏకాదశి కార్యక్రమం నిర్వహిస్తారు.

15-2-2003 ఆస్ట్రేలియా ప్రయాణం

# భక్తినివేదన పాఠకులకు శుభవార్త

**రాబోవు 2003వ సంవత్సరం మార్చినెల భక్తినివేదన 'బదరీనాథ్ ప్రత్యేక సంచిక'గా వెలువడుతుందని తెలియజేయుటకు సంతోషించుచున్నాము. ఇందులో ......**

బదరీనాథ్ యాత్రా విశేషాలు, బదరీనాథ్ చుట్టుప్రక్కల ఉండే ప్రదేశముల గురించి, బదరీలో **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామి వారిచే** నిర్వహించే అష్టాక్షరీ క్షేత్ర వివరములు, అక్కడ ఏర్పాటు చేసిన వసతి మరియు అన్నదానము గూర్చిన వివరములు ఉండును. అందమైన బదరీనాథ్ పరిసర ప్రాంతాల కలర్‌ఫోటోలతో తెలుగు, హిందీ, ఇంగ్లీషు భాషలు ఒకే పత్రికగా ముద్రించబడును.

**మీ మీ కాపీలను ముందుగా రిజర్వు చేసుకొనగలరు.**

మరిన్ని వివరములకు :

జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్, సీతానగరం, గుంటూరు జిల్లా - 522 501.
ఫోన్ : 08645- 272929, 272353.



# భగవద్రామానుజ చరిత్ర

శ్రీమతి టి.కె. చూడామణి, విజయవాడ



అది శ్రీరంగం. శ్రీరంగనాథునికి జరిగే ఉత్సవాలు కన్నుల విందులు చేస్తున్నాయి. ఆ ఆనందం అనుభవైక వేద్యమేకాని వర్ణించడం సాధ్యంగాదు. భక్తులు శ్రీరంగనాథుని సేవిస్తూ పులకించి పోతున్నారు. నంబెరుమాళ్ ఆనందంగా లోకాన్ని అనుగ్రహించడానికి బయలు దేరారు ఊరేగింపుగా. తన ఆలయం వరకు రాలేనివారిని కటాక్షించాలనే ఉదార భావంతో స్వామి స్వయంగా బయలుదేరి వారివారి గృహాలవద్ద ఆగి వారికి తమ దివ్యదర్శనాన్ని ప్రసాదించడం ఊరేగింపులో పరమార్థం. స్వామి ఊరేగింపు బయలు దేరింది. రంగనాథుని ఊరేగింపులో ఒయ్యారి నడకలు వైభవోపేతాలు. ఒకసారి సింహగమనం. ఒక సారి శార్దూల గమనం, ఒకసారి వృషభ గమనంలో ఠీవి, మరోసారి వాహనం సర్పం తిరిగినట్లు తిరిగిపోతూ ఓహో! భక్తకోటి పరవశించి పోతున్నారు.

రామానుజులు శిష్య బృందంతో స్వామికి ముందు వేదోక్తులు పఠిస్తూ బయలుదేరారు. ఎక్కడ చూసినా స్వాములే. ఊర్ధ్వపుండ్ర సంశోభితులైన వారి ముఖ పద్మాలు చూపరులకత్యంతానందాన్ని ప్రసాదిస్తున్నాయి. వేదఘోష పవిత్రంగా సాగుతోంది. శ్రీరంగనాథుని సేవించు కుంటూ రామానుజులు వెను వెనువగా అడుగులు వేస్తూ నడుస్తున్నారు. ఆ దివ్యసన్నివేశాన్ని ఆనందంతో సేవిస్తూ పక్కల బారులుగా తీరినడుస్తున్నారు భాగవతోత్తములు.

శ్రీరామానుజుల శిష్యులలో వడుగ నంబిగారు ఆచార్యనిష్ఠకి పెట్టింది పేరు. తమ ఆచార్యులు రామానుజులే వారికి సర్వస్వం. భగవంతుడు కూడా ఆచార్యుల తరువాతే. ఆ రోజు ఉత్సవంలో వారు కూడా అన్వయించారు. అయితే వారు మాత్రం రామానుజులను సేవించు కుంటూ, స్వామివైపు వీపుపెట్టి తదేక ధ్యానంగా, ఆచార్య దర్శనంలో పరవశించిపోతూ నడుస్తున్నారు. ఇది గమనించారు కొంత మంది స్వాములు. అయ్యో! భగవంతునికి







తమ వెనుక భాగం చూపిస్తూ నడుస్తున్నారే సరిగ్గా నడువమని చెప్దాం అనుకుంటూ గబగబా ముందుకి వచ్చి వడుగ నంబిని పిలిచారు. 'స్వామి ఒక్కమాట. మీరు భగవంతునికి వెనుక భాగం చూపిస్తూ, నడుస్తున్నారే. కొంచెం సరిగ్గా నడవండి అన్నారు. ఒక్క నిముషం ఆగారు వడుగనంబి. 'అయ్యా! మీకు దాసోహం, కృతజ్ఞతలు. మరి నా భావాన్ని కూడా చెప్పనీయండి. నాకు మా ఆచార్యులు భగవద్రామానుజులు. వారి దర్శనమే నా జీవనాధారం. నంబెరుమాళ్ కూడా నాకు వారి తరువాతే. పతివ్రత అయిన స్త్రీకి భర్త ఒక్కడే ఆరాధ్యుడైనట్లు, నా దృష్టిలో ఆచార్యులకే ప్రథమస్థానం. వారికి వెనుక భాగం చూపిస్తూ నేను నడువలేను. వారిని సేవించు కోకుండా ఈ కన్నులుండలేవు. ఈ మనస్సు సుఖించదు. ఈ జీవితం నిలువదు. అందుకే వారిని కనులారా సేవిస్తూ ఇలా నడుస్తున్నాను' అన్నారు. ఆచార్యనిష్ఠ అంటే ఇదా! ఉత్తముడైన శిష్యుడు ఆచార్య దివ్యమంగళ విగ్రహ సేవలో ఇంత ఆనందాన్ని తృప్తిని పొందుతాడా! వడుగనంబీ! మీ ఆచార్యభక్తి అనితరసాధ్యం. ఇంతటి మహనీయుల్ని మిమ్మల్ని సేవించుకొని మేమంతా ధన్యులమయ్యాము. భగవంతుని కంటే ఆచార్య వైభవం ఎంత గొప్పదో తెలిపిన మీకు మా శతకోటి దాసోహాలు సమర్పిస్తున్నామంటూ ఉత్సవంతో సాగిపోయారా స్వాములు.



# సందేహాలు - సమాధానాలు

S.K. తులసి, అదిలాబాద్.

ప్ర. నేను శ్రీరంగనాథస్వామికి శరణాగతి చేసాను. రామాలయానికి, వెంకటేశ్వరస్వామిగుడికి వెళ్ళవచ్చా? ద్వయమంత్రం ఎపుడు చెప్పకోవచ్చు?

జ. ద్వయమంత్రాన్ని అన్నీ వేళలా, అన్ని స్థితులలోనూ స్మరించుకోవచ్చు. అయితే ఆ తలంపు 'మంత్రార్థము'ను తెలిసి చేస్తే మరీ మంచిది. అసలు ద్వయమంత్రానికి అర్థానుసంధానమే ప్రధానము శ్రీమణవాళమహామునులట్లే ఉండేవారని పూర్వదినచర్యలోని 'మంత్రరత్నాను సంధాన సన్తత స్ఫురితాధరం' అని తెలుపుతోంది.

Dr. గణేశ్వరరావు, విజయవాడ

ప్ర. నేను ప్రతిరోజు 'శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః' అనుకొంటూ ఉంటాను. ఇంతకన్నా మంచి మంత్రం ఉంటే తెలుపగలరు?

జ. ఎందుకు? మీరనుకొనేది చక్కగా ఉంది. మరేమీ మార్పు అవసరం లేదు. మీకు గురువుగారెవరైనా ఏదైనా మంత్రముపదేశిస్తే జపానికి దానిని వాడుకోండి. మిగిలిన వాటిలో నచ్చినవి స్మరణ, కీర్తనాదులకు వాడవచ్చు. ఉపదేశంగ పొందినది మాత్రము బయటికి అనరాదు.

జి. కృష్ణయ్య, హైదరాబాద్.

ప్ర. పారాయణ సమయంలోనూ, ప్రవచన సమయంలోనూ ఆవలింతలు వస్తున్నాయి. మిగతా సమయాల్లో రావు. ఏం చెయ్యాలో తెలియచేయ ప్రార్థన?

జ. అంటే, పారాయణాదులను మీ మనస్సు ఇష్టపడటం లేదు. మీరు ఇష్టపడ్డా మనస్సుకు నచ్చనివి చేస్తే ఆవలింతలు, నిద్ర, గురక ఇవన్నీ వచ్చేసీ లక్ష్యాన్ని దెబ్బతీస్తాయి. మనస్సుకి నచ్చాలంటే పారాయణలవల్ల కలిగే లాభమేమిటనేది మీరు లోలోపలేనచ్చ చెప్పాలి. కూర్చొని పారాయణాదులు చేయకండి. ఇటునటు తిరుగుతూ చేయండి. తప్పులేదు.

శ్రీవిష్ణు సహస్రనామ బృందం, రాజమండ్రి

ప్ర. ధ్యానం అంటే ఏమిటి? ఎలా చేయాలి?

జ. కోరుకొనిన ఒక వస్తువును, దాని కుండే మంచి గుణములతో గుర్తించి, ప్రీతితో, తనకది చెందినదని భావిస్తూ, పదే పదే అవిచ్ఛిన్నముగా తలచుకొనుటనే ధ్యానమంటారు. అదే భగవంతుని విషయంలో ఉండే 'భక్తి' లేక 'ఉపాసన' అంటారు.

పి. ప్రవీణ్, అదిలాబాద్.

ప్ర. ఇంటిలోకి ఉడుము వచ్చినది. పూజారిగారు ఇల్లు ఖాళీచేయమన్నారు. మేం ఏం ప్రాయశ్చిత్తం చేసుకోవాలో తెలియపరచరా?

జ. అందరూ కూర్చొని, లక్ష్మీనారాయణ పూజ చేస్కొని, శ్రీవిష్ణు సహస్రనామపారాయణ సామూహికంగ శ్రద్ధగ చేయండి. 3గురు శ్రీవైష్ణవులు లభిస్తే వారికి భోజనమేర్పాటు చేయండి. వేరే ప్రాయశ్చిత్తమేమీ అవసరం లేదు.

యు. బాపిరాజు, విశాఖపట్టణం

ప్ర. యజ్ఞము, క్రతువు ఈ మూడింటికి గల తేడా ఏమిటి?

జ. యజ్ఞము, యాగము అనేవి పర్యాయ పదాలు, కోరికలేమీ లేకుండా చేసే భగవదారాధన రూపమైన ప్రతీ పనినీ యజ్ఞ మనవచ్చు. అదే విధముగ అగ్నిలో ఆహుతులర్పించే రీతిలో చేసేది గూడ యజ్ఞమని అంటారు. క్రతువంటే అలాకాదు, ఏదో ఒక ప్రయోజనం కోరి, హోమరూపంగ ఇతరత్రా కానీ చేసే వైదిక ప్రక్రియను 'క్రతు'వని అంటారు.







# మహర్షుల చరిత్ర - శ్రీ శుక మహర్షి

తమిళమూలం :
వై.వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి

తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూపురాణి ఉడయవర్‌స్వామి, విజయవాడ

## జాతకర్మాది సంస్కారాలు

బిడ్డపుట్టిన తరువాత ఆ బిడ్డ క్షేమం కోసం చేసే పనులు కొన్ని ఉంటాయి. వాటిని సంస్కారాలు అనిపిలుస్తారు. జాతకర్మ, నామకర్మ, అన్నప్రాశనం, చౌలమ్, ఉపనయనం మొదలైన సంస్కారాలు శుకుడికి వైభవంగా జరిపించాడు తండ్రి. సాక్షాత్తుగా వేదవ్యాసుడే తండ్రికావటంతో సంస్కారాలు ఏ లోటూ లేకుండా జరిగాయి. వేదవ్యాసుడే ఈ సంస్కారాలన్నీ స్వయంగా నెరవేర్చాడు. పాపం, జనసంచారంలేని అడవిలో ఒంటరిగా తపస్సు చేసుకుంటూ ముక్కు మూసుకుని కూర్చునే వేదవ్యాస మహర్షికి అనుకోకుండా ఇటువంటి సంతానం కలగడం, దానిని పెంచే బాధ్యతను స్వీకరించవలసి రావడం జరిగిపోయాయి.

వేద వ్యాసమహర్షి ఆ బిడ్డను చేతుల్లోకి తీసికొని, గంగనుచేరి, తాను స్నాన మాచరించి, బిడ్డను స్నానమాడించి, తరువాత వరుసగా జాతకర్మ మొదలైన సంస్కారాలు నెరవేర్చాడు. పుట్టిన బిడ్డకూడ సాధారణమైన దేమీ కాదు. పుట్టిన కొన్ని క్షణాల్లోనే ఐదు లేక ఆరు సంవత్సరాల వయస్సు కలవాడుగా ఎదిగిపోయాడు. వ్యాసుడు కూడా ఇలాగే పుట్టిన వెంటనే పెరిగినవాడే. తన కుమారుడు కూడ తనలాగే ఉన్నందుకు వ్యాసుని ఆనందానికి అవధుల్లేకుండా పోయాయి.

పిల్లలకు శుభసంస్కారాలు చేసేటప్పుడు మంగళవాయిద్యాలు కావాలి కదా! అవి అడవిలో ఎక్కడి నుంచి వస్తాయి? వేదమంత్రాలనే గట్టిగా ఉద్ఘోషిస్తూ కార్యక్రమాలు పూర్తిచేశాడు. పిల్లవాడి మీద పుష్పవృష్టి కురిసింది. వాయిద్యాలు మారుమ్రోగాయి. ఇదంతా ఆకాశంలో గుంపులు గుంపులుగా చేరిన దేవతల మహిమే. సంగీతనాట్యాలలో ప్రవీణులైన దేవతలు గంధర్వ కిన్నరులు, నారద తుంబురాదులు అక్కడ ఆకాశంలో చేరి తమ ఆనందాన్ని ఆ విధంగా తెలియజేసారు.

వారి ఆనందానికి కారణం ఏమై ఉంటుంది? పుట్టిన పిల్లవానికి 'ఘృతాచి' అప్సరతో ఏదో ఒక విధమైన సంబంధం ఉందనా? కాదు.

'ఈ భూలోకంలో మునుపు ఎన్నడూ కని వినీ ఎరుగని మహాజ్ఞాని పుట్టాడు' అన్నదే వారి ఆనందానికి కారణం. 'ఈతని ఉపదేశాన్ని పొంది రాబోవు కాలంలో కోట్లకొలది జనులు ఉజ్జీవించగలరు. సాటిలేని భాగవత పురాణం ఈతడు రచించగలడు'. అని ఆనందంతో పరవశించి ఆడారు దేవతలు.

**ఉపనయనం :-**

ఈ విధంగా 'జాతకర్మ' సంస్కారం జరిగిన తరువాత 'నామకరణం'. ఆ చిరంజీవికి 'శుకుడు' అని పేరు పెట్టారు. తరువాత 'ఉపనయనం' సంస్కారం కూడా జరిగింది. వ్యాసుడే స్వయంగా దానిని నిర్వహించాడు. వేదం అభ్యసించడానికి అర్హత కోసం ఉపనయన సంస్కారం చేయడం లోకంలో అలవాటు. శుకుని విషయంలో ఇది ఒక 'ఆనవాయితీ'గా మిగిలింది. ఎందుకంటే, శుకుడు పుట్టిన వెంటనే నాల్గువేదాలు, 6 అంగాలు, మిగిలిన శాస్త్రాలు, అన్నీ అతనికి కరతలామలకాలు అయ్యాయి. ఈ వంశంవారికి ఇదేమీ కొత్తకాదు. ఈతని తండ్రి వ్యాసమహర్షికి, తాత పరాశరమహర్షికి కూడ వేద వేదాంగములతోపాటు సకల శాస్త్రాలు పుట్టుకతోనే అలవడ్డాయి. చేప పిల్లకు ఈత నేర్పనవసరం లేదు కదా! అయినా శాస్త్ర విధి ననుసరించి శుకునికి ఉపనయనం చేయడం జరిగింది. వేదాధ్యయనం, గురుకులవాసం, వ్రత నియమాలు యథావిధిగా జరిగిపోయాయి. దేవ గురువైన బృహస్పతియే సాక్షాత్తుగా ఈయనకు గురువుగా ఉండి వేదాన్ని అభ్యసింప చేశాడు. ఇదంతా శాస్త్రం కోసమే. అన్ని శాస్త్రాలు శుకుని మనస్సులో సాదరంగా తిష్ఠవేశాయి. ఇటువంటి ఆశ్చర్యకర సంఘటనలెన్నో ఆనాడు జరిగాయి. కొన్ని మాత్రమే మనకు అంది మిగిలినవి కాల గర్భంలో కలిసిపోయాయి. శుకునికి ఉపనయనం జరిగిన సమయంలో ఆకాశం నుంచి కొన్ని వస్తువులు అతని దగ్గర పడ్డాయట. దండము, కమండలము, కృష్ణాజినము, మౌంజి ఇవే ఆ వస్తువులు. ఈ విధంగా శుకుని జన్మ, బాల్యము, వేదాభ్యాసం ఇవన్నీ దైవ సంకల్పంగా జరిగిపోయాయి. సాధారణ మానవుల జన్మవలె కాక శుకుని జన్మ అసాధారణమైనది. అందుచేతనే ఇతనికి 'బ్రహ్మరాతుడు' అనేపేరు కూడ ప్రసిద్ధిచెందినది.

**పరీక్షిత్తు :-**

శుకమహర్షి గొప్పతనాన్ని లోకానికి తెలియజేయటానికి సహాయపడినవాడు 'పరీక్షిత్తు'. ఇతడు మహారాజు. ఈతనికి 'విష్ణురాతుడు' అనే పేరుకూడా ఉంది. పరీక్షిత్తు పుట్టుటకు ముందు జరిగిన సంఘటన ఆధారంగా ఈ పేరు ఏర్పడింది. పంచ పాండవులలో అర్జునుని కుమారుడు అభిమన్యుడు. ఇతడు మహావీరుడు. ఈ



8 Bn feb.03.p65



అభిమన్యుని కుమారుడే పరీక్షిత్తు. విరాటరాజు కుమార్తె అయిన 'ఉత్తర' ఈతని తల్లి. మహాభారత సంగ్రామం జరిగే సమయంలో పరీక్షిత్తు తల్లిగర్భంలో ఉన్నాడు. ఈతడు పుట్టటానికి ముందే భారత యుద్ధం ముగిసింది. ఆ యుద్ధంలో శౌర్యపరాక్రమాలతో విజృంభించిన తన తండ్రి అభిమన్యుని పరీక్షిత్తు చూడలేదు. అతని గురించి విన్నాడు, అంతే. అభిమన్యుడు, పరీక్షిత్తు పుట్టడానికి ముందే యుద్ధంలో పరమపదించాడు. శత్రువులు అన్యాయంగా చంపారు. పాండవవంశం సమూలంగా నాశనం కావాలని, ఉత్తర గర్భంలో ఉన్న పరీక్షిత్తుపై అశ్వత్థామ బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. తన చక్రాయుధ ప్రయోగంతో పరీక్షిత్తుని కాపాడాడు ఆపద్బాంధవుడైన శ్రీకృష్ణపరమాత్మ.

చక్రాయుధంతో దర్శనం ఇచ్చాడు గర్భంలోని శిశువుకు పరమాత్మ. ప్రహ్లాదుడు, నమ్మాళ్వార్లవలె 'ఆగర్భశ్రీమంతుడు' శుకుడు. అశ్వత్థామ విడచిన బ్రహ్మాస్త్రాన్ని తన తీక్ష్ణమైన జ్వాలలతో తరిమికొట్టింది చక్రాయుధం. ఆ చక్రాయుధమే లోని శిశువుకు అమృత ప్రాయమైంది. ముందు బ్రహ్మాస్త్రం దాని వెంట చక్రాయుధం, దానివెంట పరమాత్మ అనేక సార్లు తన చుట్టూ తిరుగుతూ ఉండడాన్ని చూచి దిగ్భ్రమ చెందింది ఆ శిశువు. ఎవ్వరికీ సాధ్యముగాని ఈ భగవద్దర్శనము భగవంతుని అనుగ్రహంతో పరీక్షిత్తుకు లభించింది. ఈ విధంగా భగవంతుని పరీక్షించుటచే 'పరీక్షిత్తు' అనే పేరు వీనికి ఏర్పడింది. పరి - నాలుగు ప్రక్కల, ఈక్షిత్ - చూచువాడు అని ఈ పేరుకు అర్థము.

**ఇంకో గొప్పదనం :-**

అదే గర్భంలో తన జ్వాలలతో బ్రహ్మాస్త్రాన్ని తరిమికొట్టిన చక్రాయుధం, శిశువుకు మాత్రం ఏమాత్రం హాని కలుగనివ్వలేదు. చక్రాయుధం నుండి బయలుదేరిన అగ్నిజ్వాలలు, బ్రహ్మాస్త్రానికి నిప్పుకణాలుగాను, అదే సమయంలో గర్భంలోని శిశువుకు అమృత కిరణాలుగాను పనిచేశాయి. అట్టహాసంతోను తీవ్ర కోపంతోను హిరణ్యకశిపుని చంపుటకు అవతరించిన నరసింహావతారము లోకాన్నే వణికింపచేసింది. కానీ, ఏ కలతాలేక తన పాదాలవద్దచేరిన ప్రహ్లాదునికి ఆనంద ప్రవాహమా! అన్నట్లు అనిపించింది.

**"శీత్తత్తోడరుళ్ పెత్తవన్ అడిక్కీ(ర్పుకనిష్ట శెజ్గణ్మాల్"**

అని నమ్మాళ్వార్ ఆ అతిశయాన్నిపాడి అనుభవించారు. అటువంటి అద్భుతమే పరీక్షిత్తు విషయంలోను జరిగింది. ఇలా జరిగితే తప్ప గర్భంలోని శిశువు బతకడానికి అవకాశం లేదు. శ్రీమన్నారాయణుడు తప్ప మరెవ్వరూ ఈ విధంగా ఆ బిడ్డని కాపాడే వారులేరు. అందుచేతనే 'విష్ణురాతుడు' అనే

విశిష్టమైన పేరు ఈతనికి ఏర్పడింది. పుట్టే ప్రతి బిడ్డనీ భగవానుడే కాపాడుచున్నాడు. ఆయన అనుగ్రహం లేకపోతే ఏ శిశువు జీవించలేదు. కానీ, పరీక్షిత్తు విషయంలో ఇది ఒక విశిష్టతను సంపాదించుకున్నది కదా! అందుచేతనే 'విష్ణురాతుడు' అనే విశిష్టపేరుతో ఇతడు పిలువబడసాగాడు. 'భగవానుడు పెట్టిన బిక్ష' అనే వాడుక పదం పరీక్షిత్తుకు పూర్తిగా సరిపోయింది.

**శమీక మహర్షి :-**

శమీకమహాముని విషయంలో పరీక్షిన్మహారాజు చిన్న తప్పుచేశాడు. దానితో ఘోరశాపం ఏర్పడింది. దాని కారణంగా ఏర్పడినదే శ్రీభాగవత పురాణం. దీని కర్త అయిన శుకమహర్షి కీర్తికూడ నాల్గుమూలలా వ్యాపించింది.

ఒకసారి వేటకై అడవికి వెళ్ళాడు పరీక్షిన్మహారాజు. వేటాడి అలసి, దప్పికతో శమీకమహర్షి ఆశ్రమానికి చేరాడు. 'దాహం దాహం' అంటూ అనేక సార్లు పిలిచాడు. యోగనిష్ఠలో ఉన్న శమీకమహర్షికి ఆ కేకలు వినపడలేదు. సమాధానం లేకపోవడంతో రాజుకు కోపం వచ్చింది. తన ప్రార్థనకు బదులీయక, ప్రాణంలేని శవమా! అనునట్లున్న శమీకమహర్షి మెడలో, సమీపంలో ఉన్న చనిపోయిన పాము కళేబరాన్ని ధనుస్సుతో ఎత్తి మాలగావేసి తిరిగి వెళ్ళాడు. తనను తాను మరచి తపోనిష్ఠలో ఉన్న శమీకమహర్షికి జరిగిన దేమియు తెలియలేదు.

**పిల్లకారి తనం :-**

శమీకుని కుమారుడు శృఙ్గి - బాలుడు. తన వయస్సులోని పిల్లలతో ఆడుకుంటున్న శృఙ్గికి తన తండ్రి మెడలో చనిపోయిఉన్న పాము సంగతి ఎవరో చెప్పారు. వచ్చి చూచి మహాకోపంతో శృఙ్గి 'చనిపోయిన పామును నా తండ్రి మెడలో వేసినవాడు ఈనాటి నుండి ఏడవ రోజున తక్షకుడు అనే పాము కాటుకు గురియై చనిపోవుగాక!' అని శపించాడు. పిడుగులాంటి ఈ వార్త పరీక్షిన్మహారాజు చెవిలో పడింది. తపోనిష్ఠనుండి లేచిన శమీక మహర్షి, రాజు విషయంలో తన కుమారుడిచ్చిన శాపం సంగతి తెలుసుకుని చాలా విచారించాడు. 'దేశానికి రాజే రక్ష కదా! దూరదృష్టిలేని చిన్న పిల్లవాడు చేసిన పనివల్ల ఎంత అనర్థం ఏర్పడుతోంది' అని మనస్సులో చాలా బాధపడి, శీఘ్రంగా వెళ్ళి రాజుకు ఈ విషయం తెలియజేయ మని మనిషిని పంపి రాజుకు శాపం సంగతి తెలియజేశాడు. పాపం! ఏడు రోజులలో చనిపోవడానికి సిద్ధంగా ఉన్నతాను, ఈ లోగా ఆత్మోజ్జీవనానికి ఏదైనా చేయాలని అనుకున్నాడు రాజు. ఆ కోరిక పరీక్షిన్మహరాజు గొప్పతనాన్ని, శుకమహర్షి వైభవాన్ని లోకానికి చాటిచెప్పే కారణమయింది. శ్రీమన్మహాభాగవతం అవతరించింది.





9
Bn feb.03.p65



## బ్రహ్మోత్సవ సహిత లక్ష్మీనారాయణ యాగము

## లక్షమల్లె పుష్పార్చన

**వేదిక : శ్రీవాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం.**

**తేది : 11-3-2003 నుండి 18-3-2003 వరకు**

ప్రతిరోజు వాహన సేవలు, మల్లెపుష్పార్చన, నాలాయిర సేవాకాలము, జపహోమాదులు జరుగును. 18-3-2003 పూర్ణిమరోజున 108 కలశాలతో తాయార్లకు క్షీరాభిషేకము. కళ్యాణము పూర్ణాహుతి, ఇష్టులుకూడా నిర్వహింపబడును. కైంకర్య వివరములు : ఇష్టికార్యమునకు రూ. 3,000/-, ఒకరోజు వాహన యాజమాన్యము రూ. 3,500/-, ఒకరోజు ఊంజిల్ సేవ, సహస్ర దీపారాధన రూ. 2,000/-, అభిషేకము రూ. 150/-, సహస్ర నామార్చన రూ. 100/-, కళ్యాణోత్సవము రూ. 350/-

**వివరములకు :**

**శ్రీకార్యం, శ్రీవాసుదాసాశ్రమం,**
నడిగడ్డపాలెం, చుండూరు మండలం, గుంటూరు జిల్లా - 522 318.
ఫోన్ : (08644) 276522, 276150.

## మానస సరోవరయాత్ర

శ్రీవారి మానస సరోవర యాత్రా వివరాలతో కూడిన పుస్తకములు, **C.D.**లు హైదరాబాద్, విశాఖపట్నం, మద్రాసు, రాజమహేంద్రిలోని మన జెట్ ఆఫీసులయందు స్వీకరించవచ్చును. తెలుగు, ఇంగ్లీషులలోకూడా లభిస్తున్నాయి. పుస్తకం రూ. 150/-, **C.D.** రూ. 150/-

---

జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్, సీతానగరం, గుంటూరు జిల్లా ఫోన్: 08645-272929
జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్, 1-2-412/1/2, గగన్ మహల్ కాలనీ, దోమలగూడ హైదరాబాద్-29, ఫోన్ 040-23224426
జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్, నెం: 2, సింధూరి గార్డెన్స్, ఇంజంబాకం, చెన్నై. ఫోన్: 044-24492984
జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్, స్నేహధార బిల్డింగ్స్, వాల్తేర్ మెయిన్ రోడ్, సిడిఆర్. హాస్పిటల్ దగ్గర, విశాఖపట్నం. ఫోన్: 0891-2561640.
తులసీరామానుజకూటం, ట్రయినింగ్ కాలేజ్ లైన్, మేడూరి హోటల్ ఎదురు, ఇన్నీస్ పేట, రాజమహేంద్రి, ఫోన్: 0883-2479000

# రామాయణంలో రమ్యగాథలు

## వానరుల దక్షిణ దిగన్వేషణాదేశం

-చెవుటూరి కుసుమ కుమారి, విజయవాడ.

**తత్ర పంచజనం హత్వా హయగ్రీవం చ దానవమ్।**
**ఆజహార తతశ్చక్రం శంఖం చ పురుషోత్తమః ॥**

ఆ పర్వతము మీది శంఖమును రక్షించుచున్న పంచజనుడు అను రాక్షసుని చంపి శంఖమును, హయగ్రీవుడను రాక్షసుని చంపి చక్రమును శ్రీమహావిష్ణువు గ్రహించినాడు. అక్కడి అందమైన చరియలను, విశాలమైన గుహలను జాగరూకులై వెదకుడు. అక్కడ అగాధమైన సాగరంలో అరవై నాలుగు యోజనములు వ్యాపించిన బంగారు శిఖరాలను కలిగిన వరాహమను పర్వత మున్నది. అక్కడ ప్రాగ్జ్యోతిషమను పట్టణ మున్నది.

**........ జాతరూపమయం పురమ్ ।**
**తస్మిన్వసతి దుష్టాత్మా నరకోనామ దానవః ॥**

బంగారుమయం అయిన పట్టణాన్ని దుష్టాత్ముడైన నరకుడనే రాక్షసుడు పాలిస్తున్నాడు. ఆ హేమగుహలను వెదకిన తరువాత స్వర్ణ సౌవర్ణమను పర్వతమును కూడ దాటుడు. అటు పిమ్మట పాకశాసనుడు (పాకాసురుని చంపినవాడు) అయిన ఇంద్రునకు దేవతలు పట్టాభిషేకము చేసిన ప్రదేశము కలిగిన మేఘమను పర్వతమును కూడ దాటవలెను. మీరు మహేంద్రపాలిత మేఘ శైలమును దాటి

**"షష్టం గిరి సహస్రాణి కాంచనాని గమిష్యథ**
**తరుణాదిత్య వర్ణాని భ్రాజమానాని సర్వతః**
**జాతరూప మయైర్వృక్షైః శోభితాని సుపుష్పితైః"**

అన్ని వైపులనుండీ బాలాదిత్య ప్రకాశమానమై, బంగారు వృక్షములుకల దీవీ ఫలపుష్పభరితమైనది. అయిన అరువది వేల బంగారు పర్వతములను చేరుడు. ఆ పర్వతముల మధ్య పర్వతరాజైన మేరుపర్వత మున్నది. గొప్పదైన ఆ మేరుగిరికి సూర్యుడు ప్రసన్నుడై యిటువంటి వరం ప్రసాదించినాడు.

**తేనైవ ముక్తః శైలేన్ద్రః సర్వ ఏవ త్వదాశ్రయాః ।**
**మత్ప్రసాదాద్భవిష్యన్తి దివారాత్రౌ చ కాఞ్చనాః ॥**

ఓ పర్వతరాజా! నీ మీదవున్న ప్రతి వస్తువూ కూడా రాత్రింబవళ్ళు బంగారు వర్ణముగనే దేదీప్యమానం అగుచుండును.

**త్వయి యే చాపి వత్స్యంతి దేవగంధర్వదానవాః।**
**తే భవిష్యన్తి రక్తాశ్చ ప్రభయా కాఞ్చనప్రభాః ॥**

నీపై నివసించు దేవ గంధర్వ దానవుల దేహవర్ణములు కూడా ఎరుపు కలిగిన బంగారు వర్ణమువలె ప్రకాశించగలవు" అని. విశ్వే దేవతలు, దేవతలు, అష్టవసువులు, సప్త మరుత్తులు సాయంసంధ్యా సమయమున మేరుగిరిని చేరి ఆదిత్యుని అర్చిస్తారు. వారిచేత అర్చించబడిన అనంతరము సూర్యుడు ప్రాణికోటికి కనుమరుగై అస్తాద్రికి చేరును. కపివరులారా! మేరుగిరి నుండి పదివేల యోజనములున్న అస్తాద్రిని సూర్యుడు అర్ధ ముహూర్తకాలమున చేరును.

ఇంకనూ వినుడు. ఆ అస్తాద్రి శిఖరము మీద సూర్యప్రభాభాసమైన అక్కడ చిత్రవిచిత్రమైన చెట్లు, పక్షులు అత్యద్భుతంగా







కనువిందు చేస్తూ వుంటాయి. అది పాశహస్తుడైన వరుణుని ఆవాసము.

కపివర్యులారా! మరియొక విశేషమును అకర్ణించుడు.

**అంతరా మేరుమస్తం చ తాలో దశశిరా మహాన్ ।**
**జాతరూపమయః శ్రీమాన్ భ్రాజతే చిత్ర వేదికః ॥**

ఆ మేరు గిరికి, అస్తగిరికి మధ్యన పది శిరస్సుగల పెద్ద బంగారు తాటిచెట్టు, చుట్టూ చిత్రమైన వేదికలు అనేకము కలిగి, అతి కాంతివంతముగా ప్రకాశిస్తూ ఉంటుంది. మీరు అక్కడి ప్రతి గిరి దుర్గములోనూ, సరస్సులలోనూ కూడా రామపత్ని కొరకు గాలించవలె. ఆ ప్రాంతముననే మహాతపశ్శాలి, ధర్మజ్ఞుడు, బ్రహ్మసమానుడు అయిన మేరుసావర్ణి ముని పుంగవునకు శిరసా అంజలి ఘటించి రామపత్ని సీతను గురించి అడిగి తెలుసుకొనుడు. ఆ విధముగా మీరు అస్తాద్రి వరకు వెళ్ళి ఒక మాసము కాగానే తిరిగి ఇచటకే తిరిగి రావలెను. అట్లుగాక మాసము దాటిననూ రానివారికి మరణ దండన విధించబడును.

వానర యోధులారా! మీరందరూ కార్య శూరులే. అయిననూ పూజ్యుడూ, నాకు మామగారుఅయిన సుషేణుని నాయకత్వమున పడమటి దిక్కును వెదకి రామపత్నిని చూడగలిగిన ఎడల శ్రీరామునకు ప్రత్యుపకారము చేసి, మన మందరము కృతకృత్యులము కాగలము. అని సుణేషాది కపివీరులను పశ్చిమాభిముఖంగా బయలు దేరుడని ఆజ్ఞాపించినాడు సుగ్రీవుడు.

## పరమపదవార్తలు

**శ్రీమాన్ యస్. రామరాజుగారు** తేది : 22-1-2003, బుధవారం సా॥గం॥4-45 ని॥లకు ఆచార్యతిరువడి నలంకరించారు.

విజయనగరంలోని నేత్ర విద్యాలయము కార్యనిర్వహణాధికారిగా వ్యవహరించారు. యస్. రామరాజుగారు శ్రీస్వామివారి శిష్యులు, అనేక కార్యక్రమములలో అన్వయించి శ్రీవారి మన్ననలు పొందారు.

వీరికి ఆ శ్రియఃపతి సాన్నిధ్యం నిత్యం కలగాలని కోరుతున్నాం.




**శ్రీమతి సమయమంతుల సీతామహాలక్ష్మిగారు (భర్త : మల్లిఖార్జునరావుగారు)** తేది : 17-1-2003, మధ్యాహ్నం, గం॥1-45 ని॥లకు (భద్రాచలం) ఆచార్యతిరువడి నలంకరించారు.

మన పెద్దజీయరుస్వామివారివద్ద సమాశ్రితులయినారు. వీరు బేతుపల్లి గ్రామంలో ఆధ్యాత్మికత అభివృద్ధికోసం అనన్య కృషి సల్పారు. భద్రాచలంలో అఖండ హరేరామ నామ సంకీర్తన సంఘమును ప్రారంభించి 12 సం॥లుగా సాగిస్తున్నారు.

వీరికి ఆ శ్రియఃపతి సాన్నిధ్యం నిత్యం కలగాలని కోరుతున్నాం.




జై శ్రీమన్నారాయణ!

## బదరీనాథ్‌లో అష్టాక్షరీ క్షేత్రంలో జరుగు అన్నదానమునకు, నిర్మాణమునకు వివిధ పోషకులుగా కైంకర్యములు సమర్పించిన భక్తుల వివరములు

### జెట్ సీతానగరం

**పోషకులు :** శ్రీ కె. జనార్ధన, పుల్లంపేట

**జీవితసభ్యులు :** శ్రీ కె. సత్యనారాయణ రాజు కాకినాడ, శ్రీ డి. నాగేశ్వరావు హైదరాబాద్, శ్రీమతి బీ కోటి చంద్రమణి హైదరాబాద్, శ్రీ వై. రామోహన్‌రావు, వై. తారాబాయమ్మ విజయవాడ, శ్రీ సిహెచ్. నాగశయన బాబు గుంటూరు, శ్రీ యమ్. జితేంద్ర వర్మ హైదరాబాద్, శ్రీ కె. నారాయణ రావు రాజమండ్రి, శ్రీ జి. కృష్ణమూర్తిరాజు జియన్.పాలెం, శ్రీ యమ్.వి.యు.బి. సురేష్‌వర్మరాజు మంతెనవారిపాలెం,

**అభిమానులు :** శ్రీమతి యమ్. పుణ్యవతి తాడేపల్లి, శ్రీమతి ఆర్. వరలక్ష్మి శాయన్నరావుపాలెం, శ్రీమాన్ పి.యల్. ఉమాపతి బళ్లారి, శ్రీమతి బి. ఉమావతి విజయ నగరం, ఆర్. జానకి రామన్ ఉష ఓమన్, శ్రీమతి యస్. రమణి రాజమండ్రి, శ్రీమతి యమ్. సుజాత హైదరాబాద్, శ్రీ జి.డి.యల్.వి.వి.యన్. మల్లేశ్వరరావు మంగళగిరి, శ్రీ యస్.వరప్రసాద్ హైదరాబాద్, శ్రీ కె. రూపకుమార్ మచిలీపట్నం, శ్రీ బి. వీరరాఘవయ్య కనకరత్నం కొల్లూరు, శ్రీమతి పి. సుశీల శివనివాస్, శ్రీ రాజమన్నార్ ఒంగోలు, శ్రీమతి యస్. వైదేహి కొనిస, శ్రీ డి. వెంకటపతిరాజు విశాఖపట్నం, శ్రీ పి. వెంకట భాస్కర శర్మ పొన్నూరు, శ్రీ యన్. కృష్ణమూర్తి నకిరేకల్, శ్రీ యస్. రవిచంద్ర ఏలూరు, శ్రీ టి. సత్యనారాయణ గుప్త పుంగనూరు, శ్రీ బి. గంగాధరరావు విజయవాడ, శ్రీ యన్. వీరరాఘవ రెడ్డి అనపర్తి, శ్రీమతి డి. సూర్యకాంతం రాజమండ్రి, శ్రీమతి యస్. రత్నావతి అర్జునుడి పాలెం, శ్రీ బి. వెంకటరమణమూర్తి తుని, శ్రీ బి. సోమేశ్వరరావు అనకాపల్లి, శ్రీమతి యమ్. సూర్యకాంతం నరసింహరాజు శృంగవృక్షం, శ్రీమతి పి. సుందరమ్మ అల్లూరు, శ్రీమతి ఎ. వెంకటనరసమ్మ బొప్పూడి, శ్రీమతి యమ్. షణ్ముఖి నిడుబ్రోలు.

### సింహాచలంలో జరిగిన సమావేశములో సమర్పించిన విరాళములు

**పోషకులు :** శ్రీ ఎ. శఠగోపాచార్యులు విశాఖపట్నం.

**జీవితసభ్యులు :** శ్రీమతి యమ్.యస్.కమలాదేవి విశాఖపట్నం, శ్రీమతి పి. మాణిక్యమ్మ విశాఖపట్నం, శ్రీ బి. పేరరాజు విశాఖపట్నం,

**అభిమానులు :** శ్రీమతి టి. అన్నపూర్ణమ్మ సాలూరు. శ్రీమతి డి. సూర్యకాంతం విశాఖపట్నం, శ్రీ కె. అప్పారావు విశాఖపట్నం, శ్రీమతి డి. వెంకటరమణమ్మ విశాఖపట్నం, శ్రీ బి. నరసింహారావు విశాఖపట్నం, శ్రీ ఎ. సత్యనారాయణ శర్మ యలమంచలి, కె. వెంకటరమణయ్య గౌరవరం, శ్రీ జి. అప్పారావు గోపాలపట్నం, శ్రీ కె.వియస్. మూర్తి కళావతి విశాఖపట్నం, శ్రీ వి. సత్యనారాయణ మూర్తి యలమంచలి, శ్రీ పి. అన్నాజిరావు విశాఖపట్నం, శ్రీ యస్. సూర్యారావు పార్వతీపురం, శ్రీ ఆర్. చంద్రశేఖరరావు విశాఖపట్నం, శ్రీ కె.వి. సుబ్రహ్మణ్యం విశాఖపట్నం, శ్రీమతి వి. శ్రీదేవమ్మ నర్సాపూర్, శ్రీమతి కె. మంగరత్నం విశాఖపట్నం, శ్రీమతి సిహెచ్. ఆనంద్ పద్మావతి విశాఖపట్నం, శ్రీ యన్. మోహన్‌దాస్ విశాఖపట్నం, శ్రీ వి.ఆర్.కె.టి. ఆచార్యులు విశాఖపట్నం, శ్రీమతి కె. సుందరమ్మ విజయనగరం, శ్రీమతి ఆర్. రాజాయమ్మ







విజయనగరం, శ్రీ పి. రామజోగారావు పెందుర్తి, శ్రీమతి పి. భాగ్యమ్మ విశాఖపట్నం, శ్రీమతి యస్. తులసి కరుణశ్రీ విశాఖపట్నం, శ్రీమతి యన్. రత్నకుమారి విశాఖపట్నం, శ్రీమతి టి. సత్యవతి విశాఖపట్నం, శ్రీ జి. వెంకట సుకుమార్ ఓ.వి. పేట, శ్రీ బి. సుందరమహేష్ బెంగుళూరు, శ్రీమతి ఆర్. సూర్యకాంతం సింహాచలం, శ్రీ యస్. హనుమత్ సోమయాజులు సింహాచలం, శ్రీమతి కె. విజయలక్ష్మి విశాఖపట్నం, శ్రీ జి. రామకృష్ణ విశాఖపట్నం, శ్రీమతి సిహెచ్. మీనాక్షమ్మ విశాఖపట్నం, శ్రీ యమ్. ఉమాభాస్కర్ హైదరాబాద్, శ్రీ యన్.వీరారెడ్డి విశాఖపట్నం, శ్రీమతి ఆర్. సూర్యకాంతం సింహాచలం, శ్రీ వి.వి.యన్. మూర్తి సింహాచలం, శ్రీ వి. విజయ రామ్ విశాఖపట్నం, శ్రీ పి. చిట్టిమామయ్య కొనిస, శ్రీ ఎ. శేషభాబు అనిత విశాఖపట్నం, శ్రీ వి. సుబ్రహ్మణ్యం విశాఖపట్నం, శ్రీమతి సావిత్రమ్మ విశాఖపట్నం, శ్రీ పి. శ్రీనివాసరావు జరజపుపేట, శ్రీ యమ్. గంగాధర్ పేర్రాజు విశాఖపట్నం, శ్రీ యమ్.బి. రాజు విశాఖపట్నం, శ్రీ జె. బ్రహ్మలింగం విశాఖపట్నం, శ్రీ జె. సీతారామస్వామి సీతానగరం, శ్రీమతి సాలా మాధవ సుజాత సీతానగరం, శ్రీ జి. రంగారావు సీతానగరం, శ్రీ కె. కన్నబాబు చింతలపాలెం, శ్రీ యమ్. భట్టరు నరసింహాచార్యులు తెర్లాం, శ్రీ డి. మురళీకృష్ణ బొబ్బిలి, శ్రీ కె. అప్పలనరసింహమూర్తి చింతలపాలెం, శ్రీ యన్. ఉమామహేశ్వరరావు అనకాపల్లి, శ్రీ బి. భాస్కరరావు గౌరవరం, శ్రీ వి. సాంబమూర్తి చింతలపాలెం, శ్రీ డి. శంకరరావు బొబ్బిలి, శ్రీ డి.వి.యస్.కె. బదరీనాథ్ విజయనగరం, శ్రీ యమ్.నానాజీరావు విశాఖపట్నం, శ్రీమతి ఇ. సీతారత్నం రామభద్రాపురం, శ్రీమతి టి. విమలా జగదీష్ విశాఖపట్నం, శ్రీ సిహెచ్. గురుమూర్తి విశాఖపట్నం, శ్రీ పి. విశ్వనాథం విశాఖపట్నం, శ్రీమతి ఓ. మాధురీ రామకృష్ణ విశాఖపట్నం, శ్రీ కె.యస్. వెంకటేశ్వరరావు విశాఖపట్నం, శ్రీ కె. రామకృష్ణ విజయనగరం, శ్రీ కె. సింగరాచార్య విశాఖపట్నం, శ్రీ కె. ఆదినారాయణ విజయనగరం, శ్రీ కె. శ్రీకర్ విశాఖపట్నం, శ్రీ యన్. సూర్యనారాయణ గోపాలపట్నం, శ్రీ సిహెచ్. వెంకటనారాయణ మూర్తి మొగలిపురం, శ్రీ డి. సత్యనారాయణ విశాఖపట్నం, శ్రీ యస్.టి.పి. లక్ష్మి కుమార్ సింహాచలం, శ్రీమతి యస్.టి.పి. విజయలక్ష్మి సింహాచలం, శ్రీ డి. గోపాలరావు చిలకలపల్లి, శ్రీ జె.యస్.యన్.రాజు విశాఖపట్నం, శ్రీ బి.యస్.యస్.యన్. రాజు విశాఖపట్నం, శ్రీ యస్.ఎల్. నరసరాజు విజయనగరం, శ్రీ జి. తిరుపతి నాయుడు విశాఖపట్నం, శ్రీ ఇ. అన్నపూర్ణ విశాఖపట్నం, శ్రీమతి ఐ. సరోజనమ్మ విశాఖపట్నం, శ్రీ డి.వి.యమ్. బంగారురాజు గరివిడి, శ్రీమతి డి. విజయలక్ష్మి విశాఖపట్నం, శ్రీ టి. శ్రీనివాసరావు సింహాచలం, శ్రీమతి పి. సుధాగాయత్రి విశాఖపట్నం, శ్రీ డి. విజయ బంగారురాజు కె. కోటపాడు, శ్రీమతి డి. సత్యనారాయణమ్మ కో.కోటపాడు, శ్రీమతి జి. కమలాదేవి కె. కోటపాడు, శ్రీ బి. వీర్రాజు యలమంచలి, శ్రీమతి వి. తిరుపతమ్మ బొండపల్లి, శ్రీ కె.యస్. ఆంజనేయులు విశాఖపట్నం, శ్రీ వి. సూర్యనారాయణ విశాఖపట్నం, శ్రీమతి వి. హైమావతి విశాఖపట్నం, శ్రీమతి యస్. మంజువాణి విశాఖపట్నం, శ్రీ బి. మాధవవర్మ విశాఖపట్నం, శ్రీ జి. అప్పలరాజు విశాఖపట్నం, శ్రీమతి ఎ. చిట్టిరాణి విశాఖపట్నం, శ్రీ జె. అప్పారావు విశాఖపట్నం, శ్రీ యల్. గంగాధరరావు విశాఖపట్నం, శ్రీ జి. అప్పలనరసయ్య విశాఖపట్నం, శ్రీ వి. రత్నమ్మ విశాఖపట్నం, శ్రీ యస్.వి.జె. రమేష్‌నాయుడు విశాఖపట్నం, శ్రీమతి యల్. శైలజా గోపి విశాఖపట్నం, శ్రీ కె. గుణరాజు విజయనగరం, శ్రీ పి. ప్రసన్న కుమార్ రిట్టాపాడు.

# ఇతిహాసబోధ - 12

ధర్మరాజు అశ్వమేధ యాగాన్ని సంకల్పించాడు. యాగాశ్వరక్షకుడిగా ఉన్న అర్జునుడు యాగాశ్వంతోపాటుగా దేశదేశాలు తిరుగుతున్నాడు. దారిలో శ్రీకృష్ణుడు, ప్రద్యుమ్నుడు, బభ్రువాహనుడు, మయూరధ్వజుడు అర్జునునికి తోడయ్యారు. వీరందరూ చూస్తుండగానే ఓ రోజు యాగాశ్వం సముద్ర తీరాన సంచరిస్తూ హఠాత్తుగా సముద్ర గర్భంలోకి వెళ్ళిపోయింది.

వెళ్ళిన యాగాశ్వాన్ని సాధించడానికి నీళ్ళల్లోకూడా తిరుగగల రథాలతో ఐదుగురు వీరులూ సముద్రంలోకి ప్రవేశించారు. ఆ సముద్ర మధ్యభాగాన వారికో చక్కని దీవి కనిపించింది. ఆ దీవిలో ఒక వృద్ధఋషి తపస్సు చేసుకొంటున్నాడు. అతడు ఒక వటపత్రాన్ని చేత ధరించి తలపై పెట్టుకున్నాడు. ఆ ఆకు జీర్ణావస్థలో ఉండి, ఎండి చిల్లులుపడిఉంది. దానిపై సాలెపురుగు గూళ్ళు కట్టుకొని ఉన్నాయి.

ఆయన శరీరంలోంచి మొలిచాయా అన్నట్లుగా రెండు మోదుగ చెట్లు దేహాన్ని ఒరుసుకుని పెరిగిఉన్నాయి. చెట్లపై వందలాది పక్షులు గూళ్ళు కట్టుకొని ఉన్నాయి. ఆయన దేహం చుట్టూ పాముల పుట్టలు. వాటిలోంచి బైటకు వచ్చిన పాములు ఆయన శరీరాన్ని ఆనరాగా చేసుకొని ఆటలాడుతున్నాయి. జింకలు తమ దేహాలను ఆ ఋషి పుంగవుడి శరీరానికి ఆనించి రాసుకుంటూ విశ్రాంతి తీసుకొంటున్నాయి.

ఈ వింత దృశ్యం అర్జునుడికి ఎంతో ఆశ్చర్యం కల్గించింది. ఆ నిర్జన ద్వీపంలో కఠోర తపోవ్రతదీక్షలో ఉన్న ఋషిపుంగవుడికి యోధులందరూ నమస్కరించారు. తన ఏకాంతానికి భంగం కల్గినందుకు ఒక ప్రక్క చింతిస్తూ, మరొక ప్రక్క శ్రీకృష్ణదర్శనం లభించినందుకు పరమానందం చెందాడా ఋషి.

అతడిపేరు బకదాల్భ్యుడు. అర్జునుడు వినయ విధేయతలతో కుశల ప్రశ్నలు అడిగాడు ఋషిని. అల్పాయుష్కులైన మానవులకు సంసార బంధనంవల్ల కలిగే హానిని గూర్చి అర్జునునికి బోధించాడు ఋషి. ధర్మ మార్గాన్ని గూర్చి చింతించని బ్రతుకు వ్యర్థమన్నాడు. ఆ వృద్ధ ఋషి వయస్సెంతో తెలుసుకోవాలనిపించింది అర్జునునికి. ప్రశ్నించాడు బకదాల్భ్యుడిని.

నవ్వాడు బకదాల్భ్యుడు. 'నాయనా! మనిషి ఆయుష్షు ఎంతో స్వల్పం. కుటీరం లేకుండా ఈ ఎండుటాకు నీడన సమయాన్ని సద్వినియోగపరచుకొనే సాధన చేస్తున్నాను. ఈ సాధన ఎంత కాలంగా సాగుతున్నదంటే ఏం చెప్పను? ఎందరు మార్కండేయులు? ఎందరు లోమశులు తటస్థపడ్డారో? లెక్కకు అందే పరిస్థితికాదు. ఇప్పటికి ఇరవైమంది బ్రహ్మలు అస్తమించారు.

ఈ సృష్టి తరచూ నశిస్తూంటుంది. బ్రహ్మకాలం అంతమైనప్పుడు సర్వమూ జలమయమే కదా అయ్యేది. ఆ సమయంలో వందలాది కొమ్మలతో ఆకాశాన్ని ఆవరిస్తూ ఒక మఱ్ఱిచెట్టు మాత్రమే ఉంటుంది. దాని కొమ్మపై ఉన్న ఒక ఆకుపై పడుకొని ఒక అందమైన పిల్లవాడు తన కాలి బ్రొటనవేలిని నోటపెట్టుకొని చీకుతూంటాడు. అతని దర్శనం అద్భుతం. ఆ శిశువే ఇప్పుడు నీ ప్రక్కన శ్రీకృష్ణుడై నిలచి మిమ్మల్ని తరింపచేస్తున్నాడు'







అని అర్జునునితో పలికాడు బకదాల్భ్యుడు.

ఆ తర్వాత కృష్ణునిచూచి 'భగవాన్! నన్ను ఈ నడిసముద్రాన విడచి ఎందుకు దూరం దూరంగా పోతున్నావు? మఱ్ఱిఆకుపై బాలుడిగా పవళించి దర్శనమిచ్చావు. ఆ శైశవాన్ని విడనాడి ఇప్పుడు పూర్ణ పురుషుడవై నన్ను అనుగ్రహించవచ్చావా! నీ ఆలింగన భాగ్యాన్ని నాకు ప్రసాదించు' అంటూ శ్రీకృష్ణుని కౌగలించుకొన్నాడు.

శ్రీకృష్ణుడు ఆత్మీయంగా నవ్వుతూ...

'బకదాల్భ్యా! నీవు పురాణ పురుషుడవు! 20 మంది బ్రహ్మలను దర్శించిన వృద్ధుడవు. మా కందరికీ నీవు పూజనీయుడవు. నీ దర్శనం వల్ల మా ధర్మరాజుయొక్క యజ్ఞం సఫలమైంది. నీవు ధర్మరాజు యొక్క యజ్ఞానికి తప్పనిసరిగా రావాలి'! అంటూ ప్రశంసావాక్యాలతో ఆహ్వానించాడు.

బకదాల్భ్యుడు, చిరునవ్వు నవ్వుతూ 'కృష్ణా! నీవు నాపై గర్వభారాన్ని ఉంచజూస్తున్నావు. అయినా కమలగర్భుడికీ, నాకూ గర్వభంగం ఎప్పుడో నీవల్ల జరిగింది కదా! – అంటూ 'నాయనా అర్జునా! ఈ శ్రీకృష్ణుడు వేదాలకు మూలం. ఆయనకు సర్వమూ తెలుసు! మాకు కల్గిన గర్వభంగవృత్తాంతం చెబుతాను శ్రద్ధగా విను.

'ఈ ద్వీపంలో నేను ఎప్పటిలాగే తపస్సు చేసుకొంటూండగా మహాకల్పంలో వేదుడనే 40 ఏళ్ళ వయస్సున్న బ్రహ్మ హంసవాహనుడై వేదాలు వల్లిస్తూ నావద్దకు వచ్చాడు.

'బ్రహ్మణుడా! ఎవరు నీవు? తలపై ఈ ఆకు పెట్టుకొని ఏదో కోరి దీర్ఘకాలం తపస్సు చేస్తున్నట్లున్నావు. నీ పట్ల ప్రసన్నుడైనాను. నేను చతుర్ముఖ బ్రహ్మను. ఏ వరం కావాలో కోరుకో తీరుస్తాను' అన్నాడు గర్వంగా!

బ్రహ్మకు మించిన తలపొగరునాది. బ్రహ్మ వైపు నిరాదరంగా చూస్తూ! 'ఇక్కడ నుండి దూరంగావెళ్ళు ముందు. నీ వేంటి నాకు వరాలిచ్చేది? నీలాంటి బ్రహ్మలను ఇప్పటికి ఇరవైమందిని చూసాను మర్యాదగా ఇక్కడ నుండి వెళ్ళు' అని గద్దించాను.

నా మాటలు పూర్తయ్యేయో లేదో హఠాత్తుగా ఒక భయంకరమైన సుడిగాలి వచ్చి మా ఇద్దరినీ విశాల ఆకాశంలోకి ఎగరేసుకు వెళ్ళింది. అలా వెళ్ళి వెళ్ళి మేమొక తెలియని ప్రదేశంచేరాము. ఆ ప్రదేశం ఎంతో రమణీయంగా ఉంది. అక్కడ మాకు ఆశ్చర్యకరంగా అష్టముఖ బ్రహ్మ కనిపించాడు.

'ఎవరు మీరు! ఇక్కడకు ఎక్కడినుండి వచ్చారు. మీ పేర్లేంటి?' వివరాలు అడిగాడు ఆ ఎనిమిది ముఖాల బ్రహ్మ.

'నేను సత్యలోకం నుండి వచ్చిన చతుర్ముఖ బ్రహ్మను. పద్మసంభవుడిని. ఇతడు నా శిష్యుడు, పేరు బకదాల్భ్యుడు' నీ సేవకోసం వచ్చాడు. అన్నాడు నాతోపాటు వచ్చిన బ్రహ్మ.

ఆ మాటలు విని అష్టముఖ బ్రహ్మ విరగబడి నవ్వాడు.

'నీవు బ్రహ్మవా? ఈ రెండవవాడు నీ శిష్యుడా? బాగుబాగు, మీరిద్దరూ సత్యం తెలుసుకోండి? నేను బ్రహ్మను. మీరిరువురూ నాకు పరిచర్యలు చేయడానికి సిద్ధంకండి! నేను స్నానం చేయడానికి సదుపాయాలు ఏర్పాటు చేయండి? అంటూ గర్వంగా గద్దించాడు.

అష్టముఖ బ్రహ్మ మాటలు ముగిసే సరికి మరొక్కసారి పెనుగాలి మా ముగ్గురినీ కలిసి వినీల ఆకాశంలోకి త్రోసుకెళ్ళింది. ఆ సుడిగాలి మమ్మల్ని అలా తీసుకెళ్ళి మరో క్రొత్త ప్రదేశంలో విడిచి పెట్టింది.

అక్కడి జనులు మమ్మల్ని చూచి పలుకరించారు, 'ఎవరు మీరు? ఎక్కడ నుండి వచ్చారు. మీ పేర్లు ఏమిటి?' అంటూ యథా ప్రకారం మా పరిచయాలు పూర్తిచేసాము. 'ఇది షోడశముఖ బ్రహ్మ (పదహారు ముఖాల బ్రహ్మ)

లోకం. మీరు వినమ్రంతో ఇక్కడ వ్యవహరించాలి. గర్వాన్ని విడిచి, మౌనంగా మా బ్రహ్మదేవుడికి నమస్కరించండి' అని షోడశముఖబ్రహ్మ వద్దకు మమ్మల్ని తీసుకొని వెళ్ళారు.

షోడశముఖ బ్రహ్మ – చతుర్ముఖ బ్రహ్మ, అష్టముఖ బ్రహ్మలను చూచాడు. వారి మాటలు విని గర్వంతో 'ఎంత విచిత్రం? నేనుండగా ఇంక ఇద్దరు బ్రహ్మలు ఉండటమా? ఎంత ఆశ్చర్యం'? అంటూండగానే ఒక భయంకరమైన వాయు తరంగం మమ్మల్ని అందరినీ తల్లక్రిందులుగా ఎగరేసుకెళ్ళింది.

అలా వెళ్ళిన మేము మరొక బ్రహ్మలోకం చేరాము. అక్కడి బ్రహ్మకు 32 ముఖాలు న్నాయి. ఆ బ్రహ్మ మా సమాచారం అడిగి తెలుసుకొని, అతి గర్వంతో విఱ్ఱవీగుతూ 'నేను తప్ప మరొకడెవ్వడూ బ్రహ్మకాడు. సూర్యుడు కనుపించనంత సేపే మిణుగురు పురుగుల వెలుగులు. నా దర్శనం మీకు ఈ నిజాన్ని తెలియజేయడంలేదా?' అన్నాడు.

మళ్ళీ సుడిగాలి 32 ముఖాల బ్రహ్మతో సహా మమ్మల్నందరినీ మరొకలోకంలోకి తీసుకెళ్ళింది. అక్కడ ఎదురుపడ్డ బ్రహ్మకూ ఇదే గర్వం. ఆయనకూ మాకు జరిగిన సత్కారమే జరిగింది.

అలా రెట్టింపు ముఖాల బ్రహ్మలను వెంట వేసుకొని, వారి రెట్టింపు గర్వంవల్ల లోకాలు తిరుగసాగాము. ఈ బ్రహ్మలతో కలపి ఆ సుడిగాలి చివరకూ విరాట్రూపుడైన పరమేష్ఠి దగ్గరకు చేర్చింది. ఆయన మమ్మల్ని చూసి స్వాగతం పలికాడు.

'పూజ్యపాదులైన ఇందరి బ్రహ్మల రాకతో మా లోకం పావనమైంది. మీ అనుగ్రహంవల్ల నాకు గొప్ప గౌరవం లభించబోతున్నది'. అంటూ ఆయన పరమాదరంతో పలుకుతుంటే సిగ్గుతో చితికిపోయి మేమంతా ఆయన కాళ్ళమీద పడిమ్రొక్కాము.

మా అహంకారాలను మన్నించి కరుణించమని ఆ పరమాత్మను స్తుతించాము. ఆయన దయతో మమ్మల్ని అనుగ్రహించి యథాస్థానాలలో ప్రవేశపెట్టాడు.

ఈ అనుభవంతో బుద్ధివచ్చినేను మరల ఇక్కడ నా సాధన కొనసాగిస్తున్నాను అర్జునా! గర్వం జ్ఞానానికి శత్రువు అని గ్రహించు' అని బకదాల్భ్యుడు తన అనుభవం వివరించాడు.

అక్కడ లభించిన యాగాశ్వంతోపాటుగా అర్జునుడు తిరుగుదారి పట్టాడు. కృష్ణార్జునుల కోరిక మేరకు బకదాల్భ్యుడుకూడా హస్తినాపురం బయలుదేరాడు.

ఇది జైమిని భారతంలోని 'బకదాల్భ్య సంవాద ఘట్టం' 61వ అధ్యాయంలో జైమిని వివరించిన ఈ సంఘటన మన వికాస తరంగిణి కార్యకర్తలకు చక్కని హితదాయక బోధ అవుతుంది.

'మాధవ సేవగా సర్వప్రాణి సేవ' లక్ష్యంతో పనిచేయాల్సిన మనకు 'సేవక'భావం తరచు మాయమౌతూంటుంది. కార్యక్రమాల నిర్వహణలో ఎక్కువగా మనం అహంకార చిత్తంతోనే పనిచేసహ్తాంటాము. శ్రీస్వామి వారంతటి ఆచార్యుని నీడలో మనమున్నా, సత్సంగగోష్ఠిగా పదుగురమూ కలసి పనిచేస్తున్నా మనకు వివాదాలు – సంఘర్షణలు – 'త్వం శుంఠ అంటే త్వం శుంఠ' అనే చప్పుళ్ళు మనకు వినిపిస్తుంటాయి కనిపిస్తుంటాయి.

ఇది పెద్ద కార్యాలు చేస్తున్నామనుకొనే వారికి మరీ పెద్దగా, చిన్నకార్యాలు చేస్తున్నా మనుకొనేవారికి కొద్దిగా చిన్నగా కనిపిస్తుంటాయి. ఏ పనీ చేయని వారికి ఏదీ కనపడదనుకోండి! సమాజ కార్యాన్ని







దైవకార్యంగా సంభావించి, 'సేవక వ్రతం' నిర్వహించాల్సిన సాధనలో మనమంతా ఆరితేరాల్సి ఉందనటానికి ఈ చప్పుళ్ళే సాక్ష్యాలు.

ఎక్కడైనా కార్యక్రమాలలో కలుపుకొని పోవాల్సిన స్థానంలో కలహించుకునే మనస్తత్వం ఎదురౌతుందంటే 'సేవక వ్రత'దీక్ష అక్కడ కొఱవడిందన్నమాటే! దీనికి కారణం చాలా సింపుల్. మనం, అవతలి వాడు 'సేవకుడు' కావాలనుకొంటాము తప్ప మనం 'సేవకు'లం కావాలనుకోం. అవతలివాడు ఒదిగి ఉండాలని కోరుకొంటాం. మనం ఒదిగి ఉండటం మన గొప్పదనానికి చేటని భావిస్తాం. దాని పర్యవసానమే పరస్పర దూషణలు.

'నేను బాగానే పనిచేస్తున్నాను కానీ, వాడే వట్టి వెధవాయి' అంటూ ఆరోపణలు. ప్రత్యారోపణలు. ఈ సంవాదాల సంఘర్షణల పర్వాన్నిదాటి మరింత క్రియాశీలురంగా, అంకిత భావంతో మనం పనిచేయాలంటే 'సేవక వ్రత' దీక్ష మనలో బాగా బలపడాలి.

లోకాలను సృష్టించే కార్యం నిర్వహిస్తున్న బ్రహ్మకు, బకదాల్భ్యునికి జ్ఞానోదయం కల్గించిన భగవానుడే మన సహచరులకు కూడా జ్ఞానోదయాన్ని కల్గిస్తాడు. అయితే అంతకు ముందుగా మన హృదయాకాశంలో జ్ఞాన భానూదయాన్ని ఆహ్వానించే సన్నాహం మనం చేసుకోవాల్సి ఉంది. ఆ సత్యాన్ని గుర్తుచేయడానికే ఈ 'ఇతిహాస బోధ'

**ఈ నీతిని ఆచరించడంతోపాటు, యథాప్రకారం ఈ కథకు కూడా తగినపేరు సూచించడం మరువకండీ..!**

## ఇతిహాసబోధ – 11 శీర్షికకు పాఠకులు పంపిన కొన్ని పేర్లు

1. సాహచర్యంతో సామాజిక పరివర్తనాన్ని కల్గించుట – **ఎ. సీత, హైదరాబాద్.**
2. చండీ ఉద్దాలకోపాఖ్యానమ్ – యస్. **లక్ష్మీనరసింహారావ్, గుంటూరు.**
3. మొండి ఘటం – యల్. యజ్ఞప్రకాశ్, **హనుమకొండ.**
4. సహనం కన్నా సముద్రం చిన్నది – జి. శ్రీనివాస్, **కోదాడ**
5. ఉద్దాలకుడివంటి సహనాన్ని మనం ఆచరించాలి. – **వి. విష్ణువర్ధన్, మామిళ్ళగూడెం.**
6. భర్తజ్ఞాని – భార్య అజ్ఞాని – యమ్. విశ్వనాథం, **హనుమకొండ.**
7. 'చండి' వంటివారికి ఒక దండం – సిహెచ్. **హనుమంతరావ్, కరీంనగర్.**
8. ఎవరేమన్న, భగవత్ సందేశాన్ని ఉద్దాలకుల వలె ఓర్పుతో, సనాతన ధర్మపు విలువలను భగవద్బంధువులందరికి అందించడమే గీతాజ్యోతి పరమలక్ష్యం – **జె. అమరయ్య, అమరావతి.**
9. చండీ మొండితనము అనే పట్టుదలను గీతాజ్యోతి కార్యక్రమాలను జయప్రదం చేయడమే స్ఫూర్తి – **వి. సుజాత, హైదరాబాద్.**
10. వినాశకాలే విపరీతబుద్ధిః – **యస్. పుష్పలత కమలాకరరావ్, కరీంనగర్.**
11. నీతిని ఆచరించుటకై దీక్షను బూనడం జరిగింది. – **ఆర్. అనసూయ, అనంతపురం**

**ఈ శీర్షికకు పేర్లు పంపిన భక్తులందరికీ శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములు తెలియజేస్తున్నాం.**

– మీ వికాసతరంగిణి

# 108 శ్రీరామ క్రతు స్థూప జీర్ణోద్ధరణ ప్రాజెక్ట్

**భగవద్బంధువులారా..!**

మానవ చరిత్రలో 1941 సంవత్సరం చీకటికాలం. మానవత్వపు విలువల్ని, ప్రపంచానికి చాటేందుకై ఋషి వాల్మీకి రచించిన **"శ్రీరామాయణ"** పవిత్రగ్రంథాన్ని ఈ సంవత్సరంలో కొందరు అవివేక రాజకీయనాయకులు హేయంగా అవమానించారు. ఈ ఘోరపాపం నుండి ప్రపంచాన్ని కాపాడేందుకు ఒక గొప్ప శ్రీవైష్ణవ సన్యాసి ఉద్యమించారు. వారే **పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ పెద్ద జీయర్ స్వామివారు.** ఆంధ్రప్రదేశ్‌లో అవతరించిన శ్రీస్వామివారు, 13-10-1960 నుండి 1969 వరకూ, 9 సంవత్సరాలపాటు, నిర్విరామంగా, ఒకొక్కటి 27 రోజుల చొప్పున **'108 శ్రీరామ మహాక్రతువుల'**ను భరతవర్షమంతటా నిర్వహించారు.

అశేష భక్తజనావళి సమర్పించిన **"శ్రీరామ"** నామాంకితమైన ఇటుకలపై, ఒక్కొక్క రూపాయిచేర్చియిస్తే స్థూపం నిర్మితమైంది. ఇందులో కోట్లాది 'శ్రీరామ నామ లిఖిత పుస్తకాలు, పత్రాలు భద్ర పరిచారు. మానవత్వపు విలువలను పరిమళింపచేసిన శ్రీరామచంద్రునిజీవితం ప్రతిఒక్కరికి మార్గదర్శకమనే ప్రేరణను, స్ఫూర్తిని కల్గించేందుకే ఈ స్థూపాలు నిర్మితమైనవి.

మన దేశంలో ఈ స్థూపాలున్న రాష్ట్రాలు :- **ఆంధ్రప్రదేశ్ - 61, తమిళనాడు - 7, మహారాష్ట్ర - 4, ఉత్తరప్రదేశ్ - 14, మధ్యప్రదేశ్ - 2, బీహార్-4, రాజస్థాన్ - 2, ఒరిస్సా - 6, గుజరాత్ - 2, కర్నాటక - 1, కాశ్మీర్ - 1, హర్యానా - 1, నేపాల్‌దేశం-3.**

విలువను గుర్తించిన ప్రజలు వీటిని నిర్మించుకున్నారు. కుల, మత, వర్ణ, ప్రాంతాది భేదంలేకుండా యావత్ ప్రపంచసుఖానికి అవసరమైన సేవలందించేందుకై తన జీవితాన్నే సమర్పించిన శ్రీరామ చంద్రుడు అందరికీ పూజనీయుడు, ప్రేమాస్పదుడు, ఆదర్శమూను.

**అందుకే ఋషి వాల్మీకి...**

**"రామో రామో రామ ఇతి ప్రజానాం అభవన్ కథాః ।**
**రామభూతం జగదభూత్ రామే రాజ్యం ప్రశాసతి ॥"** - అన్నాడు.

**భవిష్యత్ ప్రపంచం ఈ బాటలోనే ఉద్యమించి ముందుకు సాగుగాక!**

అందువలన ఇట్టి సంప్రదాయమును కొనసాగించుటకై **ఈ కార్యక్రమములో పాల్గొని అన్ని విధములుగా ప్రోత్సహించగలరని మీకు తెలియపరుస్తున్నాము. మీ ప్రాంతములో ఉన్న శ్రీరామక్రతు స్థూపము భద్రముగా ఉంచుకొనుటకు మరియు పునరుద్ధరణకై కావలసిన సలహాలు వివరములు తెలుపుటకు శ్రీరామక్రతు స్థూప పునరుద్ధరణ ప్రాజెక్ట్‌కి కార్యకర్తగా చి॥ యం. విజయలక్ష్మి పని చేయుచున్నది.**

మీకు అందుబాటులో ఉన్నంతలో పాల్గొనుటకు మంచి అవకాశము మీముందు ఉన్నది. మీ **సహాయము విశేషముగా శ్లాఘించబడును.**

ఇట్టి మహోన్నత కార్యక్రమములో భాగస్వాములగుటకు భగవంతుడు మీకు శక్తి, సామర్థ్యములు కలుగజేయుగాక!

**(శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు)**

**జై శ్రీమన్నారాయణ..!**







## గీతాజ్యోతి కైంకర్యముల వివరములు

శ్రీమాన్ కె. శివరావుగారు, బెంగుళూరు - రూ. **50,111/-**

శ్రీమాన్ ముద్రగడ పద్మనాభంగారు, పార్లమెంటు సభ్యులు, కాకినాడ - రూ. **99,000/-**

శ్రీమాన్ లింగమనేని పూర్ణచంద్రరావుగారు, విజయవాడ - రూ. **25,000/-** *(దుర్గగారి ద్వారా)*

శ్రీమాన్ పి.వి.ఆర్. కృష్ణారావుగారు, శ్రీకాకుళం - రూ. **11,673/-**

## జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్‌కు కైంకర్యము సమర్పించిన భక్తులు

శ్రీమాన్ మురళీకృష్ణం రాజుగారు (దేవీ ఛారిటబుల్ ట్రస్ట్) పిట్టలవానిపాలెం - రూ. **2,00,000/-**

**M/s.** నవభారత్ ఫెర్రో అల్లాయిస్ లిమిటెడ్, పాల్వంచ - రూ. **2,00,016/-**

## గ్రంథ పరిచయం - **శ్రీరామకృష్ణ పరమహంస**

భారతదేశంలో ఆధ్యాత్మిక చైతన్యాన్ని ఉద్దీపింప చెయ్యటంతోపాటు ప్రపంచంలో సనాతన ధర్మ శంఖరావాన్ని వినిపించిన మహాప్రవక్త శ్రీ వివేకానందులను దేశానికి ప్రసాదించిన దేశిక ప్రవరులు శ్రీరామకృష్ణ పరమహంస. కారణజన్ములు శ్రీరామకృష్ణులు. భారతీయ తాంత్రిక సాధనల నన్నిటినీ సమగ్రంగా అనుష్ఠించిన 'యోగి పుంగవులు' సిద్ధ పురుషులూను వాఉ, ఎందరో మహా యోగులను దేశానికి ప్రసాదించిన మహానుభావులువారు.

మహానుభావుల సమకాలంలో జన్మించి వారి ఉపదేశాలు విని వారి దయకు పాత్రులై వారి ద్వారా ఆధ్యాత్మికానందాను భూతిని పొందడం అందరికీ సాధ్యమయ్యేది కాదు. కానీ, కాలాంతరాలవారుకూడా గ్రంథాల ద్వారా వారి బోధనలను, వారి అనుష్ఠాన విధానాలను తెలుసుకొని ఉత్తేజాన్ని పొంది ఆధ్యాత్మిక సాధనలో అభిముఖ్యాన్ని సంతరించుకొని యోగ్యులయిన ఆచార్యులు నిర్దేశకత్వంలో లక్ష్యాన్ని చేరుకోవటం మనకు తెలియనిది కాదు.

'శ్రీరామకృష్ణ పరమహంస' అన్న గ్రంథం ఆస్తిక జిజ్ఞాసువులలో అట్లాంటి అభిముఖ్యాన్ని కలిగించేందుకు తోడ్పడమే ఒక మంచి గ్రంథం. శ్రీరామకృష్ణుల జీవితంలోని ఎన్నో అద్భుత ఘట్టాలను, వారు కావించిన వివిధ తాంత్రికానుష్ఠాన ప్రక్రియలను, వారు ప్రాస్తావికంగా కావించిన ఉపదేశాలనూ వివరంగా ఒక దగ్గర ప్రామాణికంగా ప్రోదిచేసి పాఠకుడికి అందించేది యీ బృహద్గ్రంథం.

సనాతన ధర్మాన్ని ప్రచారం కావించిన ఎందరో మహానుభావుల జీవిత విశేషాలు కాని వారి వారి అనుష్ఠాన వైఖరులు కానీ అనేక కారణాల వల్ల తరవాతి తరాల వారికి తెలియకుండా పోయినాయి.

ఆ లోటును గుర్తించిన శ్రీ శారదానందస్వామి శ్రీరామ కృష్ణుని జీవితాన్ని, వారి వివిధ సాధన ప్రక్రియలను, వారి సందేశాలను బావితరాల వారికి తెలపాలన్న కాంక్షతో ఈ గ్రంథాన్ని రచించేరు.

శ్రీరామకృష్ణులు ప్రత్యక్ష శిష్యులయిన శ్రీ శారదానంద స్వామి వంగ భాషలో "శ్రీరామకృష్ణ లీలా ప్రసంగం" పేర రచించిన గ్రంథాన్ని శ్రీదయాత్మానందస్వామి తెలుగులో "శ్రీరామకృష్ణ పరమహంస" అన్నపేరుతో చక్కగా అనువదించేరు. విషయం ఎంత ఉదాత్తమో ముద్రణమూ అంత ఉత్తమం. చక్కని క్యావికోచ్చెడు. అనువాదమే అయినా చాలా వరకు స్వతంత్ర రచనవలెనే సాగింది యీ గ్రంథం.

శ్రీరామకృష్ణ పరమహంస రెండు సంపుటాలు మొదటి సంపుటం 700 పుటలు, రెండవ సంపుటం 640 పుటలు. గ్రంథం అసలు వెల 400/- తగ్గింపువెల రూ. 200/- మాత్రమే.

ఈ తగ్గింపు వెల 1-1-2003 నుండి 28-2-2003 వరకు మాత్రమే వర్తిస్తుంది. ఈ పుస్తకాలు సెట్టుగానే విక్రయింపబడతాయి.

ఈ గ్రంథాన్ని రిజిష్టర తపాలా ద్వారా పొందగోరేవారు రూ. 240/- ద్వారాకానీ, ద్వారా కానీ

శ్రీరామకృష్ణ మఠం, మైలాపూర్, చెన్నై - 600 004. అన్న చిరునామాకు గడువులోగా చేరేట్టు పంపి పొందగలరు.




## ధనుర్మాస వ్రత సహిత సామూహిక వైకుంఠ ఏకాదశి వ్రత మహోత్సవము

(2002 డిశెంబరు 16నుండి 2003, జనవరి 14వరకు)

**పిట్టలవానిపాలెం** :- పిట్టలవానిపాలెంలో ధనుర్మాస వ్రతమహోత్సవానికి శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి వారు డిసెంబరు 16వతేదీన సీతానగరం నుండి బయలుదేరారు. పార్లమెంటు సభ్యులు శ్రీమాన్ యడ్లపాటి వెంకటరావుగారు తమ 84వ జన్మదినం సందర్భముగా శ్రీస్వామివారిని తమ యింటికి ఆహ్వానించగా శ్రీస్వామివారు, వారి ఆహ్వానాన్ని మన్నించి మార్గమధ్యంలో తెనాలిలో వారికి మంగళా శాసనాలు అందజేసారు.

మధ్యాహ్నం 1-00 గం॥కు శ్రీస్వామివారు, మన జెట్ కార్యదర్శి శ్రీమాన్ గంగరాజుగారు, మాజీ మంత్రివర్యులు శ్రీమాన్ కనుమూరి బాపిరాజుగారు, వికాసతరంగిణి ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ భవానీ ప్రసాద్ వెంటరాగా పిట్టలవానిపాలెం చేరుకొన్నారు.

అప్పటి వరకు శ్రీస్వామివారి రాకకై ఎదురుచూస్తున్న ఈ ధనుర్మాస వ్రత మహోత్సవ నిర్వహణ కమిటి అధ్యక్షులు మరియు 'మా' టి.వి. చైర్మన్ శ్రీమాన్ పెనుమెత్స మురళీకృష్ణంరాజుగారు, ఆహ్వాన సంఘం అధ్యక్షులు మరియు బాపట్ల శాసనసభ్యులు శ్రీమాన్ మంతెన అనంత వర్మగారు నిర్వహణ కమిటి ఉపాధ్యక్షులు శ్రీమాన్ పెనుమెత్స వెంకటేశ్వరరాజుగారు, జనరల్ సెక్రటరీ శ్రీమాన్ దెందుకూరి కృష్ణంరాజుగారు, సెక్రటరీ శ్రీమాన్ డా॥ గోకరాజు సుబ్బరాజుగారు, కోశాధికారి శ్రీమాన్ గోకరాజు గిరిధరవర్మగారు, పిట్టలవానిపాలెం మండల ప్రెసిడెంట్ శ్రీమతి కంకిపాటి యశోదగారు, గ్రామ సర్పంచ్ శ్రీమతి బొలగాని సులోచనగారు, ఉత్సవ కమిటీ సభ్యురాలు శ్రీమతి కంకిపాటి పూర్ణమ్మగారు మరియు వికాస తరంగిణి సభ్యులు, గ్రామపెద్దలు వందలాది మంది శ్రీస్వామివారి భక్తులు జ్యోతులతో రోడ్డుకిరువైపులా వరుసగా శ్రీస్వామి వారికి ఎదురేగి స్వాగతించి వికాస తరంగిణి కార్యాలయానికి తోడ్కొనివచ్చారు.

### శోభాయాత్ర - అఖండ శ్రీవిష్ణుసహస్ర నామ పారాయణ

శ్రీస్వామివారి ఆదేశం మేరకు డిశంబరు 5వ తేదీనుండి వికాసతరంగిణి కార్యాలయంలో అఖండ శ్రీవిష్ణుసహస్ర నామ స్తోత్రపారాయణం ప్రారంభమైంది. ఈ సందర్భంగా కార్యాలయంలో ఏర్పాటు చేసిన శ్రీలక్ష్మీనారాయణ పెరుమాళ్ళ విగ్రహాలను ప్రత్యేక వాహనంపై ఉంచి శ్రీస్వామి వారు బయలుదేరగా వారివెంట వందలాది మంది భక్తులు రాగా పిట్టలవానిపాలెం వీథులలో 'శోభాయాత్ర' జరిగింది.

అనంతరంశ్రీలక్ష్మీనారాయణ పెరుమాళ్ళ విగ్రహాలను వైకుంఠ, ప్రాంగణంలోని మందిరంలో ఉంచారు. అప్పటి నుండి జనవరి 15వ తేదీ తెల్లవారుజామువరకు మందిరము వద్ద వివిధ గ్రామాల భక్తజనావళి వంతులవారీగా అఖండ పారాయణం (మొత్తం 40 రోజులు) చేశారు.

200 మందికి పైగా భక్తులు దీక్షాకంకణాలు ధరించి ఎంతో శ్రద్ధాసక్తులతో మండల దీక్ష చేశారు. గ్రామాలనుండి సకాలంలో భక్తులను తరలించడానికి సుధాకర్ పైప్స్, సూర్యాపేట వారందించిన వ్యాన్ మరియు జీపు 24 గం॥లు సేవలందించాయి.







### ధనుర్మాస వ్రత నిర్వహణ ఏర్పాట్లు

**1. శ్రీస్వామివారికి విడిది :**

శ్రీమాన్ డా॥ గోకరాజు సుబ్బరాజు, శిరోమణి దంపతులు (ఇంగ్లండ్) పిట్టలవాని పాలెంలో ఇటీవల నిర్మించిన తమ విశాలగృహమును శ్రీస్వామివారికి విడిదిగా ఇచ్చారు. శ్రీస్వామివారు, పరివారము మరియు దర్శనార్థం వచ్చే ప్రముఖులకు ఈ ముప్పది రోజులు భక్తి శ్రద్ధలతో ఆతిథ్యమిచ్చి డా॥ సుబ్బరాజు దంపతులు శ్రీస్వామివారి మన్ననలకు పాత్రులై ధన్యత నొందిరి.

**2. వసతి ఏర్పాట్లు :**

ఈ మహత్కార్యానికి దూర ప్రాంతాల నుండి విచ్చేసిన భక్తులకు పిట్టలవానిపాలెం, ఖాజీపాలెం మంతెనవారిపాలెం, జి.ఎన్. పాలెంలోగల శ్రీస్వామివారి భక్తులు తమ తమ గృహాలలో వసతి కల్పించి తమ సహృదయతను చాటుకున్నారు. వీరే కాక మిగిలిన వందలాది మంది దూరప్రాంతాల వారికి పిట్టలవానిపాలెంలో వసతి సౌకర్యాల కల్పనలో శ్రీమాన్ కంకిపాటి ప్రసాదరాజు, శ్రీమాన్ వేగేశ్న మార్కండేయ రాజులు విరివిగా కృషి చేశారు.

5000 జనాభా ఉన్న చిన్న గ్రామం పిట్టలవానిపాలెం ఈ గ్రామంలోని అరాకొర సౌకర్యాలతో సర్దుకొని వందలాది భక్తులు ధనుర్మాస వ్రత వైభవాన్ని అనుభవించడం వారి అంకితభావానికి నిదర్శనంగా నిర్వాహకులు భావించారు.

**3. బృందావనం - శ్రీవిల్లిపుత్తూరు వేదిక :**

ప్రవచన మండప నిమిత్తంగా శ్రీమాన్ గోకరాజు నరసరాజు మరియు శ్రీమాన్ గోకరాజు సూరపరాజుగార్ల 3 ఎకరాల మెట్టభూమిని ఎంపిక చేయడం జరిగింది. ఈ ప్రదేశాన్నే 'బృందావనం' అన్నారు. ఉపన్యాస వేదికకు 'శ్రీవిల్లిపుత్తూరు' వేదికగా నామకరణం చేశారు.

మహాసిమెంట్స్ అధినేత శ్రీమాన్ డా॥ రామేశ్వర రావుగారి సౌజన్యంతో శ్రీవిల్లిపుత్తూరు వేదికను అందంగా తీర్చిదిద్దారు. యావత్తు ప్రాంగణం శోభాయమానంగా రూపొందడానికి ఖాజీపాలెం డిగ్రీకళాశాల ప్రిన్సిపాల్ శ్రీమాన్ రామరాజుగారు, పొన్నూరు భవానీ ఆర్ట్స్ అధిపతి శ్రీమాన్ అనీల్‌కుమార్ బృందము విశేష కృషి చేశారు.

**4. వైకుంఠ ప్రాంగణం :**

బృందావన ప్రాంగణానికి ప్రక్కగా 3 ఎకరాల స్థలంలో వైకుంఠ ప్రాంగణం ఏర్పడింది. వేసిన వరి పంట తీసి తీయకుండానే ఆ బురద నేలలోనే శ్రీలక్ష్మీనారాయణ మందిరనిర్మాణాన్ని పకడ్బందీగా కార్యకర్తలు తీర్చిదిద్దారు. మందిరానికి ఎదురుగా శ్రీవిష్ణు సహస్ర నామాలతో కూడిన 1000 గీతాజ్యోతి ధ్వజాల మధ్యలో 84 అడుగుల గీతాజ్యోతి హనుమధ్వజాన్ని భారీఎత్తున ఎగరవేశారు. దేవాలయానికి ప్రక్కగా రాత్రింబవళ్ళు అఖండ పారాయణం చేయడానికి వీలుగా పందిరి ఏర్పాటు చేశారు. మందిరంలో అఖండ జ్యోతి 40 రోజులపాటు ఆవునేతితో వెలిగే ఏర్పాటు చేశారు.

**5. తదీయారాధన :**

బృందావన ప్రాంగణమునకు పడమటి వైపున ఉన్న తిరుమల తిరుపతి దేవస్థానము వారి కళ్యాణ మండపాన్ని తదీయారాధన కేంద్రముగా ఉపయోగించారు. తదీయారాధనకు అవసరమగు సామగ్రిని సమకూర్చు కొనుట, తదీయారాధన తయారీ మరియు వేలాది మందికి పంపిణీచేయుట మొదలగు ఏర్పాట్లను శ్రీమాన్ కూసంపూడి జితేంద్రవర్మగారు, శ్రీమాన్ ఉప్పలపాటి లక్ష్మీపతిరాజుగారు శ్రీమాన్ వేగేశ్న లక్ష్మీపతిరాజుగార్లు పర్యవేక్షించారు.

డిశంబరు 16వ తేదీ నుండి జనవరి 14 వరకు ఈ ధనుర్మాస వ్రతమహోత్సవంలో ప్రతి దినము శ్రీస్వామివారు సా॥ గం॥ 5-30 ని॥లకు శ్రీవిష్ణు సహస్రనామస్తోత్ర పారాయణం, గం॥6-00 లకు తిరుప్పావైప్రవచనాన్ని అనుగ్రహించే వారు.

ఈ ధనుర్మాస వ్రత మహోత్సవాన్ని నిర్వహించిన ముప్పది రోజులలో శ్రీస్వామి వారు కొన్ని విశేష కార్యక్రమాలుకూడా నిర్వహించారు.

పొన్నూరు, రేపల్లె, తెనాలి వంటి పట్టణాలలోని విద్యాసంస్థలను శ్రీస్వామివారు దర్శించి గీతాజ్యోతి సందేశాన్ని వేలాది మంది విద్యార్థులకు అందజేశారు.

⌘20-12-02న సామూహిక కృష్ణపూజ

⌘27-12-02న సామూహిక రామపూజ

⌘01-01-03న నూతన ఆంగ్ల సంవత్సర సందర్భముగా మంగళాశాసనములు.

⌘03-01-03న శ్రీలక్ష్మీపూజ

⌘04-01-03న 800 మందికి పైగా భక్తులు సమాశ్రయణాలు పొందారు.

⁜05-01-03న, ఆదివారం ఉ॥ 11-00 గం॥ల నుండి మధ్యాహ్నం గం॥ 1-00 వరకు 'భావిభారత నిర్మాణం-విద్యాలయాల కర్తవ్యం' అనే అంశంపై శ్రీస్వామివారు మార్గదర్శనం చేశారు. దాదాపు మూడువేల మంది విద్యార్థినీ విద్యార్థులు, అధ్యాపకులు, యాజమాన్య ప్రతినిధులు, ప్రభుత్వా ధికారులు ఈ కార్యక్రమంలో పాల్గొని శ్రీస్వామివారి మంగళాశాసనములు పొందారు. విద్యార్థులు ప్రత్యేకించి శ్రీస్వామివారు మంగళాశాసనం కావించిన 'శ్రీహనుమ' డాలర్లను అందుకున్నారు.

⁜ 6-1-03న సోమవారం ఉ॥ గం॥ 10-00ల నుండి గం॥ 12-00ల వరకు 'సమాజ వికాసం - మన బాధ్యత' అనే అంశంపై శ్రీస్వామివారు మార్గదర్శనం చేశారు. ఎఱుకల, యానాదుల వంటి షెడ్యూల్డు తెగలకు చెందిన భగవద్బంధువులను ఉద్దేశించి నిర్వహించిన ఈ కార్యక్రమంలో పాల్గొన్న దాదాపు 1200 మంది ప్రతినిధులకు శ్రీస్వామి వారు మంగళాశాసనములు చేయుటయే కాక ప్రతి గృహిణికి ఒక తులసి కుండీని ప్రసాదించారు. ఈ కార్యక్రమంలో ముఖ్య అతిథిగా T.T.D. J.E.O., శ్రీమాన్ బాలసుబ్రహ్మ ణ్యంగారు పాల్గొన్నారు.

వెనుకబడిన తరగతులవారి కాలనీలలో అసంపూర్తిగ ఉన్న రామాలయమును పూర్తిచేయించి పెట్టమని వారుకోరగా, శ్రీస్వామివారు వెంటనే స్పందించారు. మహాసిమ్మెంట్స్ వారు చొరవ చూపి ఆ ఆలయాల కవసరమైన సిమ్మెంట్ యిస్తామన్నారు. శ్రీస్వామివారి సూచన మేరకు T.T.D. J.E.O., శ్రీమాన్ బాల సుబ్రహ్మణ్యంI.A.S., గారు ఈ ట్రైబల్ కాలనీలలో నిర్మించే రామాలయానికి అవసరమైన శ్రీరాముల పరివారపు శిలామూర్తులను T.T.D. ద్వారా చేయించి యిస్తామని వాగ్దానం చేసారు.

⁜7-1-03న మంగళవారం ఉ॥ గం॥ 11-00ల నుండి సా॥ గం॥ 4-00ల వరకు **'సమాజ శాంతి - ఆలయాల పాత్ర'** అనే అంశముపై శ్రీస్వామివారు సదస్సు నిర్వహించారు. ఈ సదస్సులో రాష్ట్రదేవాదాయ, ధర్మాదాయ శాఖామాత్యులు శ్రీమాన్ దండు శివరామరాజుగారు, దేవాదాయ, ధర్మాదాయశాఖ కమీషనర్ శ్రీమాన్ డి.యన్. మూర్తిగారు పాల్గొన్నారు. సమీప ప్రాంతాల నుండేకాక సుదూర ప్రాంతాల నుండి కూడా అర్చక స్వాములు, ఆలయ నిర్వహణా కమిటీ సభ్యులు ఎందరో ఈ సదస్సులో పాల్గొని శ్రీస్వామివారి మంగళాశాసనాలు పొందారు. ఈ సందర్భంగ చేసిన కొన్ని శ్రీవారి సూచనలను కమిషనర్ గారు వెంటనే అమలుపరుస్తూ ఆజ్ఞలు జారీచేయడం విశేషంగ గుర్తించదగినది.

⁜8,11 తేదీలలో వరుసగా అగ్ని, కూడారై ఉత్సవాలు వైభవంగా నిర్వహించబడ్డాయి.

## శాంతి యాత్ర

⁜12-1-03 ఆదివారం ఉ॥ గం॥ 11-00 లకు వైకుంఠ ప్రాంగణం నుండి శ్రీస్వామివారి ఆధ్వర్యవంలో గీతాజ్యోతి జెండాలతో, **స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ, మాధవ సేవగ సర్వప్రాణిసేవ** సూత్రాలను తెలియజేసే బ్యానర్లతో అలంకరింపబడిన వాహనాలతో శాంతియాత్ర ప్రారంభమైనది. శ్రీస్వామివారు ప్రత్యేకంగా అలంకరించిన వాహనంలో బయలుదేరగా 120 ట్రాక్టర్లు, 80 కార్లు, 150 స్కూటర్లు, మోటారు సైకిళ్ళతో వేలాది మంది భక్తులు శ్రీస్వామివారిని అనుసరించారు.

శ్రీస్వామివారి వెంట శ్రీమాన్ మురళీ కృష్ణంరాజుగారు, బాపట్ల శాసన సభ్యులు శ్రీమాన్ మంతెన అనంతవర్మగారు, రాష్ట్ర వికాస తరంగిణి ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ భవానీ ప్రసాద్‌గారు, శ్రీమాన్ కె. రామరాజుగారు, శ్రీమాన్ డా॥ గోకరాజు సుబ్బరాజుగారు, ప్రకృతి చికిత్స నిపుణులు డా॥ మంతెన సత్యనారాయణ రాజుగారు మరియు ప్రముఖు లెందరో పాల్గొన్నారు. వేలాది మంది భక్తులు పాల్గొన్న ఈ శాంతియాత్ర ఖాజీపాలెం, కర్లపాలెం, బాపట్ల, పొన్నూరు, చందోలు మీదుగా తిరిగి పిట్టలవానిపాలెం రాత్రి గం॥ 10-30లకు చేరుకొన్నది. 65 కి.మీ. నిడివిగల ఈ శాంతి యాత్రను పూర్తిచేయుటకు 10గం॥లు సమయం పట్టింది. యాత్ర మొదలయినది మొదలు తుదివరకు అడుగడుగునా శ్రీస్వామివారికి హారతులే. దారి పొడవునా గ్రామాలలోని జనులంతా రోడ్డుమీదకు తరలి వచ్చి శ్రీస్వామివారి దర్శన భాగ్యంతో, దివ్యానుగ్రహభాషణంతో తరించిపోయారు.

ఈ ప్రాంతంలో ఇంతకు మునుపెన్నడూ కనీవినీ ఎరుగని రీతిలో సాగిన ఈ శాంతి యాత్రలో వేలాది మంది భక్తులు పాటించిన క్రమశిక్షణ చూపరులను ఆకట్టుకున్నది.

## సామూహిక వైకుంఠ ఏకాదశి వ్రత







## సహిత గోదారంగనాథుల కళ్యాణం

భక్తులంతా ఎప్పుడెప్పుడా అని ఎదురు చూస్తున్న 'వైకుంఠ' ఏకాదశి రానేవచ్చింది. భోగి పండుగ పర్వదినం నాడే వైకుంఠ ఏకాదశి రావడం ఆరోజే శ్రీగోదారంగనాథుల కళ్యాణం కావడం, తేది 14-1-03 మంగళవారం యొక్క విశేషం.

ఆ రోజు ఉదయం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన వైకుంఠ ఉత్తర ద్వార దర్శనప్రాశస్త్యాన్ని గూర్చి శ్రీస్వామివారు భక్తులకు వివరించారు. వేలాది మంది భక్తులు ఉత్తర వైకుంఠ ద్వారం నుండి భగవంతుని దర్శించి పులకరించి పోయారు. తీర్థగోష్ఠి అనంతరం సామూహిక లక్ష్మీనారాయణ తులసి పూజలను శ్రీస్వామివారు నిర్వహించారు. ఈ సందర్భంగా కార్యకర్తలు 10,000 భగవన్నామ సహిత తులసి కుండీలను భక్తులకు అందజేయడం విశేషం. 3 ఎకరాల ప్రాంగణం ఈ సందర్భంగా భక్తజన సందోహంతో క్రిక్కిరిసి పోయింది.

అనంతరం రాత్రి 8-00గం॥ల వరకు భజనలు, కోలాటాలు, ప్రవచనాలు జరిగాయి. 70వేలమంది భక్తులు అటు బృందావనం లోను ఇటు వైకుంఠ ప్రాంగణంలోను క్రిక్కిరిసి ఉండి రహదారులను ముంచెత్తివేస్తుండగా శ్రీస్వామివారు శ్రీగోదారంగనాథుల కళ్యాణాన్ని సామూహికంగా మహావైభవంగా నిర్వహించారు.

మరొక ప్రక్క బృందావనం వైకుంఠ ప్రాంగణాలలో 200 నేతి డబ్బాలతో ఏర్పాటు చేసిన లక్ష ఆవునేతి దీపాల మహోత్సవం కన్నులపండుగగా ప్రారంభమైంది. బృందావనమంతా దీపద్వీపం మధ్య ఉన్నట్లుగా జ్వాలా మయమైంది.

రాత్రి 10గం॥ల నుండి తెల్లవారు జామున 4-30 గం॥ల దాక నృత్య భక్తి గీతాలతో భక్తులను అలరించడానికి శ్రీమాన్ గజల్ శ్రీనివాస్ బృందం హైదరాబాద్‌వారు సన్నద్ధమయ్యారు. కుమారి స్వాతి సోమనాథ్ తమ శిష్యురాండ్రతో చేసిన దశావతార నృత్యం భక్తులను తన్మయులను చేసింది. శ్రీమాన్ రామాచారిగారు ఆయన శిష్యులు శ్రీమాన్ గంగాధర్‌గారు, శ్రీమాన్ గజల్ శ్రీనివాస్ గారు ప్రభృతులు తమ సంగీతకళాకారులతో వైకుంఠ ఏకాదశి జాగరణోత్సవాన్ని మహాద్భుతంగా నిర్వహించారు.

శ్రీస్వామివారు 3గం॥ల వరకు బృందావన ప్రాంగణంలో ఉండి కీర్తనల మాధుర్యాన్ని ఆస్వాదించారు. శ్రీస్వామివారితో పాటుగా జాగరణ వేడుకలో పాల్గొనడం భక్తులందరికీ మరువలేని అనుభూతిని మిగిల్చింది. రాత్రంతా కార్యకర్తలు లక్షదీపాలు ఆవునేతితో వెలిగేటట్లు కృషిచేశారు.

అనంతరం శ్రీస్వామివారు కార్యకర్తలకు పెద్దలకు, భగవద్బంధువులకు మంగళాశాసనములు చేసి తెల్లవారుజామున గం॥4-00లకు నడిగడ్డపాలెం బయలుదేరారు.

లోకకళ్యాణార్థం శ్రీస్వామివారి అనుగ్రహంతో ఇక్కడ జరిగిన ధనుర్మాస వ్రత మహోత్సవంలో ప్రధానభూమిక శ్రీమాన్ పెనుమెత్స మురళీ కృష్ణంరాజుగారు వహించారు. తల్లిగారైన శ్రీమతి యశోదమ్మగారి కోరిక మేరకు వారు తమ ద్రవ్యాన్ని కార్యక్రమ వైభవ నిమిత్తంగా వినియోగించారు. ప్రవాస భారతీయులు శ్రీమాన్ మంతెన

నరసరాజుగారు లక్షరూపాయల ద్రవ్యమును, శ్రీమతి శిరోమణి సుబ్బరాజుదంపతులు 40 క్వింటాళ్ళ బియ్యమును, శ్రీమతి నందిని రామలింగరాజు గారు సత్యం గ్రూఫ్ ఆఫ్ కంపెనీస్ తరపున 40,000 రూ. సమర్పించుకొని శ్రీస్వామివారి మన్ననలకు పాత్రులయ్యారు.

ముప్పది రోజులు అతివైభవంగా ధనుర్మాసవ్రత మహోత్సవాన్ని నిర్వహించడంలో పిట్టలవానిపాలెం మరియు పరిసర గ్రామ యువతీ యువకులు పాత్ర ఎంతగానో ఉన్నది. శ్రీమాన్ మంతెన కృష్ణంరాజు గారు, శ్రీమాన్ డా॥ గోకరాజు సుబ్బరాజుగారు, శ్రీమాన్ డా॥ డి.యస్. రాజు వంటి పెద్దలు గ్రామాలలో పర్యటించి యువకులు పెద్దసంఖ్యలో పాల్గొనునట్లు చేయడంలో సఫలీకృతులైనారు. శ్రీమాన్ భవానీప్రసాద్‌గారు ఈ కార్యక్రమాలన్నిటికీ సమన్వయ కర్తగా వ్యవహరించి అన్ని విషయాలలోనూ మార్గదర్శనం చేసి శ్రీస్వామి వారి మన్ననలను పొందారు.

బృందావన ప్రాంగణంలోని తాటి యాకు పందిళ్ళ నిర్మాణంలోను, శ్రీవిల్లిపుత్తూరు వేదిక నిర్మాణంలోను, వైకుంఠ ప్రాంగణం నిర్మాణంలోనూ శ్రీమాన్ కొత్తపల్లి సుబ్బరాజుగారు శ్రీమాన్ కనుమూరి సాంబరాజుగారి సేవలు ప్రశంసనీయ ములు. అనుదినము వేదిక అలంకరణ మరియు రక్షణ, పూజకు తగిన ఏర్పాట్ల పర్యవేక్షణలో శ్రీమాన్ మంతెన పురుషోత్తమ రాజుగారు, శ్రీమాన్ పెనుమెత్స శ్రీనివాసరాజుగారు, శ్రీమాన్ గోకరాజు రామరాజుగారు, శ్రీమాన్ పెనుమెత్స నరసింహమూర్తిరాజుగారు, భక్తి శ్రద్ధలతో తమ సేవలందించి శ్రీస్వామి వారి కృపకు పాత్రులైనారు.

ధనుర్మాసవ్రత మహోత్సవంలో పాల్గొనుటకు విచ్చేయుచున్న వేలాది మంది భక్తులకు, దూరప్రాంతాల నుండి విచ్చేసి నెలరోజులపాటు ఇక్కడే ఉన్న భక్తులకు ప్రాంగణంలోనే ప్రత్యేక శిబిరమును ఏర్పాటు చేసి పిట్టలవానిపాలెం ప్రాథమికోన్నత ఆరోగ్య కేంద్రంవారు, ఖాజీపాలెం ఆయుర్వేద వైద్యశాల వారు ఉచితంగా వైద్య సేవలందించుటయేకాక మందులుకూడా సరఫరాచేశారు.

ఖాజీపాలెం డిగ్రీకళాశాల NCC ఆఫీసర్ శ్రీమాన్ వేగేశ్న బదరీనారాయణగారి ఆధ్వర్యంలో NCC కాడెట్లు మరియు NSS వాలంటీర్లు తమ తమ సేవలను ఈ కార్యక్రమంలో అందించిరి. శ్రీమతి పార్వతి గారు (హైదరాబాద్) పాదరక్షల విభాగంలోనూ, శ్రీమతి పూర్ణమ్మగారు, హరెమ్మగారు, శారదగారు, ఇందిర (కర్లపాలెం) గారు, కామేశ్వరమ్మ (జియన్.పాలెం) గారు మొదలగు వారు ప్రచార విభాగంలోనూ, శ్రీమాన్ ధర్మరాజు మరియు యానాదిరాజుగారు, ట్రెజరర్ గిరిధర్‌వర్మగార్కి ఆర్థిక విషయాలలో పర్యవేక్షణలో సహకరించారు.

శ్రీమతి పుష్పావతిగారు, శ్రీమతి ఇందు మతిగారు, శ్రీమతి పద్మగార్ల పర్యవేక్షణలో (వికాసతరంగిణి స్త్రీల విభాగం) అనేక మంది యువతీ యువకులు తులసి కుండీలను, పూజ సామగ్రిని సమకూర్చుట, పంపిణీ చేయుట మొదలగు పనులను చక్కగాచేసి అందరి ప్రశంసలుపొందారు.

ఈకార్యక్రమ ప్రధానదాత శ్రీమాన్ మురళీ కృష్ణంరాజుగారిచ్చిన భరోసాతో పిట్టలవానిపాలెం వికాసతరంగిణి సభ్యులు 'గీతాజ్యోతి' ధర్మక్షేత్ర సహిత ధనుర్మాస వ్రత మహోత్సవా'న్ని చేపట్టారు. స్వంత కార్యక్రమంగా భావించి ఎన్నో బాధ్యతలను తమ భుజ స్కంధాలపై వేసికొని వారివారి స్థాయిలో విశేష కృషిచేసి కార్యక్రమవిజయానికి కార్యకర్తలు కృషిచేశారు. ఎంతో మంది పిన్నలు పెద్దలు, స్త్రీలు, పురుషులు భక్తి శ్రద్ధలతో స్వామి సేవలో పాలుపంచుకోటానికి ప్రేరణనిచ్చిన వారు శ్రీమాన్ పెనుమెత్స మురళీకృష్ణంరాజు, దేవి దంపతులు మరియు శ్రీమాన్ పెనుమెత్స వేంకటేశ్వరరాజు, యశోదమ్మ దంపతులు (మురళీకృష్ణం రాజుగారి తల్లిదండ్రులు).

గత నాలుగు మాసాలుగా టీచర్ ట్రైనీలుగా శ్రీస్వామివారి వద్ద శిక్షణపొందిన 45 మంది యువకులు అన్ని విభాగాలలో వారివారి స్థాయికి తగిన రీతిలో వారి సేవలను అందించి శ్రీస్వామి వారి మంగళాశాసనాలను పొందారు. శ్రీస్వామివారి పట్లభక్తితో శ్రీసుధాకర్ పైప్స్ వారి వాహనము, డోన్ శ్రీవేంకటేశ్వర దేవస్థానము వారి వాహనములు ఈ కార్యక్రమం ఆది నుండి డ్రైవర్లతో సహా ఇక్కడే ఉండి ఎన్నదగిన సేవలు చేశాయి. బదరీనాథ్‌లోని అష్టాక్షరీ క్షేత్రాన్ని నిర్వహిస్తున్న కుమారి ఉషశ్రీ శ్రీవిల్లిపుత్తూరు వేదికను శ్రీస్వామివారి పరోక్షంలో భక్తజన రంజకంగా నిర్వహించి అందరి ప్రశంసలు పొందారు.



20 Bn feb.03.p65



పిట్టలవానిపాలెం మరియు దాని పరిసర ప్రాంతాలకు వింతశోభను చేకూర్చిన ఈ ధనుర్మాసవ్రత మహోత్సవ కార్యక్రమాలను, శ్రీస్వామివారి అమూల్య సందేశాలను ఎంతో ఓర్పుగా నేర్పుగా రాష్ట్ర ప్రజలందరికి తమ ప్రసారాలద్వారా అందజేసి 'మా'టీవి యాజమాన్యము, సాంకేతిక నిపుణులు శ్రీస్వామివారి కృపకు పాత్రులై ధన్యత నొందారు.

30 రోజులు నిర్వహించిన ఈ ధనుర్మాస వ్రత మహోత్సవములో పాల్గొని శ్రీస్వామివారి మంగళాశాసనాలు పొందిన ప్రముఖులు.

1. నెల్లూరుజిల్లా గాలిపాలెం వెంకయ్యస్వామివారు
2. శ్రీశ్రీశ్రీ త్రిదండి అష్టాక్షరీ సంపత్కుమార రామానుజ జీయరుస్వామివారు
3. శ్రీమాన్ ముద్రగడ పద్మనాభంగారు, పార్లమెంటు సభ్యులు, కాకినాడ.
4. శ్రీమాన్ యన్. ఇంద్రసేనారెడ్డిగారు, శాసన సభ్యులు, మలక్‌పేట.
5. శ్రీమాన్ కోడెల శివప్రసాద్‌గారు, మంత్రివర్యులు
6. శ్రీమాన్ చింతల రామచంద్రారెడ్డిగారు, భారతీయ జనతాపార్టీ.
7. శ్రీమాన్ ఆలపాటి రాజేంద్రప్రసాద్‌గారు, శాసన సభ్యులు, వేమూరు.
8. శ్రీమాన్ మోపిదేవి వెంకటరమణా రావుగారు, శాసన సభ్యులు, కూచినపూడి.
9. శ్రీమాన్ డా॥ నాయుడమ్మగారు, గుంటూరు (అతుక్కొని జన్మించిన 3 కవలల జంటలను అరుదైన చికిత్సద్వారా వేరుచేయడంలో విజయ వంతమైన శస్త్ర చికిత్స నిపుణులు)
10. శ్రీమాన్ రాయపాటి శ్రీనివాస్‌గారు, గుంటూరు జిల్లా పరిషత్ మాజీ అధ్యక్షులు.
11. శ్రీమాన్ ఎర్లపాటి వెంకట్రావుగారు, పార్లమెంటు మెంబరు.

వీరే కాక వివిధ జిల్లాల వికాసతరంగిణుల నిర్వాహకులు, మరికొందరు మాజీ శాసన సభ్యులు, పారిశ్రామికవేత్తలు, విద్యావేత్తలు, ప్రవాస భారతీయులు ఈ కార్యక్రమంలో పాల్గొని శ్రీస్వామివారి మంగళా శాసనాలు పొందారు.

మొత్తము మీద 30 దినములు శ్రీస్వామి వారిని దర్శిస్తూ వారి అమృత వాక్కులు వినే మహాభాగ్యము కల్గినందుకు మొత్తం భక్తకోటి ఆనందపారవశ్యములో శ్రీస్వామివారికి జేజేలు పల్కినారు.

16-1-03 గురువారం రా॥ గం॥ 6-00లకు శ్రీమాన్ పెనుమెత్స మురళీ కృష్ణంరాజుగారు ధనుర్మాస వ్రతమహోత్సవం విజయవంతం కావడంలో పాలుపంచుకొన్న ప్రతి ఒక్కరికి ధన్యవాదాలు తెలుపుటకై పిట్టలవానిపాలెం TTD కళ్యాణ మండపంలో ప్రత్యేక సమావేశమును ఏర్పాటు చేసిరి. శ్రీమాన్ మంతెన అనంతవర్మగారు, శ్రీమాన్ మంతెన కృష్ణంరాజుగారు, శ్రీమాన్ డా॥ గోకరాజు సుబ్బరాజుగారు, శ్రీమాన్ దెందుకూరి కృష్ణంరాజుగారు, శ్రీమాన్ కూసంపూడి రామరాజుగారు మొదలగు పెద్దలు, కార్యకర్తలు,

వాలంటీర్లు, స్త్రీలు, పురుషులు దాదాపు 300 మంది పాల్గొన్న ఈ సదస్సులో శ్రీమాన్ మురళీకృష్ణం రాజుగారు ప్రతిఒక్కరికీ పేరు పేరున ధన్యవాదాలు తెలియజేసి ధనుర్మాస వ్రతమహోత్సవమునకు సంబంధించిన జ్ఞాపికలు అందజేసిరి. సదస్సులో పాల్గొన్నవారికి కళ్యాణ మండపం ఆవరణలో భోజన ఏర్పాట్లు జరిగాయి. 30 రోజులపాటు అతి వైభవంగా జరిగిన ధనుర్మాస వ్రత మహోత్సవ సంబరాలను నెమరు వేసుకుంటూ ప్రతిఒక్కరూ అంతటి గొప్ప కార్యక్రమాన్ని ఈ ప్రాంతంలో జరిపించుటలో ప్రముఖ భూమిక వహించిన శ్రీమాన్ మురళీకృష్ణంరాజుగారు దంపతులను ప్రశంసించిరి.

### నడిగడ్డపాలెం
### 15-1-2003 - పెద్దస్వామి వారి పరమపదోత్సవము

శ్రీశ్రీశ్రీ పెద్దజీయరు స్వామివారి పరమ పదోత్సవము సందర్భముగా ఉ. 5.00 గంటలకు శ్రీస్వామివారు నడిగడ్డపాలెం వేంచేసారు. అనుష్ఠాన, ఆరాధనముకావించి పెరుమాళ్ళ సన్నిధిలో శాత్తుముఱై, తీర్థగోష్ఠి సేవించి శ్రీవారు పరివారసమేతంగా పెద్ద జీయరుస్వామివారి సన్నిధికి (బృందావనానికి) వేంచేసారు. ఉ. 10 గం॥లకు పెద్దజీయరుస్వామి వారికి అభిషేక కార్యక్రమం ప్రారంభమయింది. ఈ కార్యక్రమాన్ని సేవించుకొనుటకు వచ్చిన అశేష భక్తజనాన్ని ఉద్దేశించి శ్రీవారు ప్రవచిస్తూ 'ఆచార్య అనుగ్రహం లేనిదే ఉజ్జీవించడం ఎవరికీ సాధ్యం కాదు. జ్ఞాన శరీరులైన ఆచార్యులు నిత్యులు. వారి పరమ పదోత్సవం జరుపనవసరం లేదు. కాని సాక్షాత్ శిష్యులైనవారు మాత్రం ఉపకారస్మృతిగా ఈ కార్యక్రమాన్ని ప్రతి సంవత్సరం చేస్తుంటారు. ఈ సంప్రదాయాన్ని కొనసాగిస్తూ శ్రీరంగంలో రంగ నాథుడు, వరవరమునులకు పరమ పదోత్సవాన్ని నిర్వహిస్తాడట. ఈ రోజు మనందరం దేవత్వం, ద్విజత్వం, గురుత్వం, ప్రాజ్ఞత్వం నాలుగు నిండుగా ఉన్నటువంటి పెద్దజీయరుస్వామివారి పరమ పదోత్సవాన్ని జరుపుకుంటున్నాం' అన్నారు. అనంతరం శ్రీ ఉ.వే.శ్రీమాన్ నేపాల్ శ్రీకృష్ణమాచార్యస్వామి వారు మాట్లాడుతూ 'ఈ వాసుదాసాశ్రమము ఒక జ్ఞానస్థలం' అనేకమంది ఉభయవేదాంత పండితులను, లోకోప కారక జీయరులను అందించిన దివ్యస్థలమిది. 'ఉత్తమ శ్లోకు'లు అని జ్ఞానులైన పెద్దలను అంటారు. వారిని సేవించు కొనకపోతే మనల్ని మనమే నిందించు కోవాలి. అలాంటి 'ఉత్తమ శ్లోకు'లైన మన పెద్దజీయరు స్వామివారు. వారి పరమపదోత్సవంలో పాల్గొనే భాగ్యాన్ని పొందిన మనమంతా ఎంతో ధన్యులం అన్నారు.అభిషేకానంతరం శ్రీస్వామివారి శ్రీపాదుకలకు అష్టోత్తర శతనామార్చన కావించి తీర్థప్రసాద గోష్ఠి నిర్వహించారు. అనంతరం శ్రీ స్వామివారు ఆశ్రమ ప్రాంగణంలో బృందావనానికి వెనుక వృద్ధాశ్రమభవన నిర్మాణమునకై భూమి పూజ నిర్వహించి ఆశ్రమ వాసులకి, అర్చక పరివారానికి మంగళాశాసనములు కృపచేసి గుంటూరు బయల్దేరారు.

**గుంటూరు** – సాయంకాలం 4 గంటలకు శ్రీవారు శ్రీమాన్ సత్యనారాయణగారి అభ్యర్థనపై ఎస్.వి.ఎన్. కాలనీలోని శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానమునకు వేంచేసారు. పెరుమాళ్ళకు సువర్ణ కిరీటమును శ్రీస్వామి వారు తమ కరకమలములతో అలంకరించారు. దీనిని సమర్పించిన ప్రవాసభారతీయులు డా. వావిపాటి సీతా రామయ్యగారు, విజయలక్ష్మి దంపతులకు శ్రీవారు మంగళాశాసనములు కృపచేసారు. అనంతరం శ్రీమాన్ పోలిశెట్టి హరిప్రసాద్‌రావు గారి జన్మదిన శుభసందర్భ ముగా వారి గృహానికి వేంచేసి మంగళాశాసనమును గ్రహించి విజయవాడ బయల్దేరారు. శ్రీమాన్ కోటేశ్వరరావు (సి.ఐ) గారు శ్రీస్వామివారు గుంటూరు వేంచేసి, బయల్దేరే వరకూ యథోచిత సేవలందించి మంగళాశాసన పాత్రులైనారు.

సాయంత్రం 5.30 **విజయవాడ** చేరుకొని గాయత్రీనగర్‌లోని శ్రీమాన్ లింగమనేని పూర్ణ భాస్కం రావు, స్వర్ణకుమారిగారి గృహానికి వేంచేసి మంగళా శాసనములను గ్రహించి **సీతానగరం** ఆశ్రమం చేరుకున్నారు. ధనుర్మాస మహోత్సవాన్ని వైభవంగా ముగించుకొని వచ్చిన శ్రీవారికి శ్రీ వెంకటాచార్యులు గారు, విద్యార్థులు, గురువుగార్లు, కార్యాలయసిబ్బంది పూర్ణకుంభ స్వాగతం పలికారు. ఇదే రాత్రి శ్రీస్వామి వారు సింహాచలం బయల్దేరారు.







### సింహాచలం 16,17,18 తేదీలు

శ్రీవారి ఆధ్వర్యవంలో భక్తినివేదన సంపాదకులు శ్రీఉ.వే.శ్రీమాన్ టి.పి.శ్రీరామచంద్రాచార్యస్వామి వారి సప్తతిపూర్తిమహోత్సమును వారి కుటుంబ సభ్యులు, బంధువులు, మిత్రులు, అభిమాను లంతా కలిసి శ్రీఉ.వే.శ్రీమాన్ డా. ఎస్.వి. రంగరామానుజాచార్య స్వామివారి నేతృత్వంలో అత్యంత వైభవంగా నిర్వహించారు. ఈకార్యక్రమమువారి స్వగృహమైన బృందావనిలో జనవరి 16,17,18తేదీలలో విలక్షణమైన రీతిలో జరిగినది. ఈ మహోత్సవానికి ప్రవచన శిరోమణి, మహామహోపాధ్యాయ శ్రీఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారు, కవిశాబ్దిక కేసరి, మహామహోపాధ్యాయ, శాస్త్ర రత్నాకర శ్రీఉ.వే.శ్రీమాన్ న, చ. రఘునాథాచార్య స్వామివారు, శ్రీఉ.వే.శ్రీమాన్ డా. ఎస్.వి. రంగ రామానుజా చార్యస్వామి వారు, శ్రీ ఉ.వే. శ్రీమాన్ డా. కందాడై రామానుజాచార్యస్వామి వారు ముఖ్య ఆహూతులుగా విచ్చేసి, ప్రవచన వేదికకు విశేష శోభను కల్గించారు. అశేషభక్తజనం ఈ మహోత్స వాన్ని సేవించి, ఆనందించారు. వచ్చిన భక్తులందరికి తదీయారాధన విశేషంగా నిర్వహించారు.

16వ తేదీన శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామివారి ప్రారంభ వచనాలతో సభారంభమైంది. శ్రీమాన్ న.చ. రఘునాథాచార్య స్వామివారు భగవద్రామానుజ ఉపనిషత్సి ద్ధాంతంపై ప్రవచించి శ్రోతలకు చక్కటి అవగాహనను కల్గించారు.

ఈ సందర్భంగా సప్తతిపూర్తి మహోత్సవ సంఘం శ్రీవారి కరకమలముల మీదుగా శ్రీరామ చంద్రాచార్య స్వామి వారి శ్రీహస్తములకు సువర్ణ కంకణములను అలంకరింపజేసారు. అలాగే వారి ధర్మపత్ని శ్రీమతి రంగనాయకమ్మ గారికి కూడా బంగారు గాజులను శ్రీరామచంద్రాచార్యస్వామి వారిచే అలంకరింపజేసారు. వెను వెంటనే శ్రీరామచంద్రాచార్యస్వామివారి మిత్రులు, బంధువులు, అభిమానులు అభినందన చందన గోష్ఠి నిర్వహించారు. వీరితో వారికిగల తీపి జ్ఞాపకాల పరంపరలను ఆవిష్కరించారు కూడా. ఈ సందర్భంగా శ్రీస్వామివారు మంగళాశాసనములను గ్రహిస్తూ శ్రీరామచంద్రాచార్య స్వామివారు ఋజుస్వభావులు. కార్యాన్ని రూపుదిద్దడం ఒక ఎత్తైతే, దానిని భావించడం మరొక ఎత్తు. సౌందర్య పూర్ణ ఆవిష్కారం చేయడంలో వారికి వారే సాటి. ఏ విషయాన్ని స్పృశించినా ఆ విషయసంబంధ గ్రంథాలను అవలోడన చేసి అందంగా ఆవిష్కరించగలరని సంభావించారు. వారి సంతానం వారి వైభవానికి దీటుగా ఈ సప్తతిపూర్తి మహోత్సవాన్ని జరిపించారు. చాలా రోజులుగా మూగబోయిన వారి గొంతు ఈ ధనుర్మాస మహోత్సవంలో ఒంగోలులో విచ్చుకోవడం మాకు చాలా ఆనందాన్నికల్గించింది. ఇది ఇలాగే కొనసాగాలని మేము అనేక మంగళా శాసనములు చేస్తున్నామన్నారు. చివరగా శ్రీరామచంద్రాచార్యస్వామివారు వారి ఆనందాన్ని వ్యక్తం చేస్తూ శ్రీవారి మంగళాశాసనాలు అందుకోవడమే ఈ కార్యక్రమానికి ముఖ్యప్రయోజనం. నేను ఈ స్థితిలో ఉండడానికి ఒక నల్గురు మహానుభావులు ప్రధాన కారణం. ఈ సందర్భంగా వారిని స్మరించుకొనక పోతే కృతఘ్నుడిని అవుతాను. వారిలో (1) కీ.శే.శ్రీమాన్ **SVN** భాష్యకారాచార్య స్వామివారు (2) కీ.శే. కులపతులు శ్రీఉ.వే. శ్రీమాన్ తె.కం.గోపాలాచార్య స్వామివారు (3) మహామహోపాధ్యాయ శ్రీఉ.వే. శ్రీమాన్ ఎస్.ఎన్.సి. రఘునాథాచార్య స్వామివారు (4) జగదాచార్యులు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరుస్వామివారు అని వారిపట్ల హృదయపూర్వకకృతజ్ఞతను ఆవిష్కరించారు.

17వ తేదీన ప్రవచన గోష్ఠిని శ్రీవారు ప్రారంభిస్తూ మనది భారతజాతి అని వైదిక సంప్రదాయములను పరిచయం చేయగా శ్రీ ఉ.వే. శ్రీమాన్ డా. ఎస్.వి. రంగరామానుజాచార్యస్వామివారు 'శ్రీ పాంచరాత్ర దర్శనము' పై చక్కటి ప్రవచనాన్ని అనుగ్రహించారు.

మధ్యాహ్నము 2 గంటలకు శ్రీవారు పత్రికా విలేఖరుల సమావేశంలో గీతాజ్యోతి వైశిష్ట్యాన్ని వివరించారు. వెంటనే శ్రీవారి ప్రత్యక్ష పర్యవేక్షణలో **బదరీ అష్టాక్షరీక్షేత్రయ అన్నదాన శాఖాసంఘము ప్రాంతీయ జీవితసభ్యుల సమావేశం** జరిగింది. దానిలో సభ్యులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా శ్రీ రామచంద్రా చార్యస్వామివారు అన్నదానం యొక్క

విశిష్టతను వివరించి మీరంతా ఇతోధికకైంకర్య శ్రీ వల్లభులు కావాలని కోరారు. అనంతరం ఎస్. రామానుజం గారు, స్నేహధార, సత్యనారాయణగారు, రమణమ్మగారు, విశాల్‌గుప్తగారు, రాజాం పార్థసారథి గారు తమ తమ అభిప్రాయములను, సలహాలను, సభాముఖంగా వ్యక్తం చేసారు. సమావేశంలో పాల్గొన్న వారందరికీ మంగళా శాసనములనుగ్రహిస్తూ శ్రీవారు 1998లో బదరీలో ప్రారంభించిన నిత్యాన్నదాన కార్యక్రమం దినదిన ప్రవర్ధమానంగా దివ్యంగా జరుగడంలో భక్తుల ఔదార్యమే మూలకారణమని ఇది విస్తరించాలని మంగళాశాసనము చేసారు. చివరగా కుమారి ఉషశ్రీ సమావేశంలో పాల్గొన్న సభ్యులందరికి కృతజ్ఞతావిష్కరణ చేసారు.

సాయంకాల సభలో శ్రీవారు శ్రోతలకు గీతామృత వితరణం చేసారు. అనంతరం శ్రీరామ చంద్రాచార్య స్వామివారు సంకలనం చేసిన 'ఆర్యోక్తులు' అనే గ్రంథాన్ని ఆవిష్కరించారు. చివరగా శ్రీరామచంద్రా చార్యస్వామివారిని కీర్తిస్తూ వారి మనుమలు చక్కటి గేయాన్ని శ్రావ్యంగా ఆలపించి తాతగారిని ఆనందంతో పరవశింప చేసారు. రాత్రి 8.30 గం॥కు శ్రీవారు సపరివారముగా సింహాద్రి వరాహ లక్ష్మీ నృసింహ స్వామివారిని సేవించి, అర్చక పరివారానికి, 20 మంది అధికార పరివారానికి మంగళా శాసనములు కృపచేసారు. అనంతరం బృందావనిలో సప్తతిపూర్తి మహోత్సవంలో సేవలందించిన కార్యకర్త లందరితో సమావేశం జరిగింది. శ్రీరామచంద్రా చార్యస్వామివారి కుమారులు శ్రీమాన్ దాశరధిగారు, శ్రీమాన్ శ్రీనివాసరామానుజం, శ్రీమాన్ రాజగోపాల్, శ్రీమాన్ శ్రీకాంత్, శ్రీమాన్ కులశేఖర్‌గార్లు ఈ కార్యక్రమంలో సేవలందించిన కార్యకర్తలందరికి జ్ఞాపికలను శ్రీ స్వామివారి కరకమలము మీదుగా ఇప్పించారు. సింహాచలం, వైజాగ్ నుండే కాక విజయ నగరం, గన్నవరం, కరీంనగర్, రాజమహేంద్రి ఇంకా అనేక ప్రాంతాల నుండి విచ్చేసి విశేష సేవలదించారు.

18వ తేదీన ప్రవచన గోష్ఠి ప్రారంభంలో **శ్రీరామచంద్రాచార్యస్వామివారి సప్తతిపూర్తి సంచిక**ను శ్రీవారు ఆవిష్కరించారు. అనంతరం శ్రీ ఉ.వే. శ్రీమాన్ డా. కందాడ రామానుజాచార్యస్వామివారు **దివ్యసూరి దర్శనం** అనే శీర్షికపై ఆళ్వారులు పాడిన దివ్యప్రబంధాలను గూర్చిన ప్రవచనాన్ని అనుగ్రహించారు.

సప్తతి పూర్తి మహోత్సవ శుభసందర్భముగా శ్రీరామచంద్రాచార్య స్వామివారిని ఒక ఉపాధితో సత్కరించదలచిన సప్తతిపూర్తి మహోత్సవ కమిటీ అభ్యర్ధన మేరకు శ్రీవారు స్పందించి **'సువచః కైంకర్య శ్రీవల్లభ'**అనే ఉపాధిని సూచించారు. డా. ఎస్.వి. రంగరామానుజా చార్యస్వామివారు దీనిని సభా ముఖంగా ప్రకటించడంతో అందరూ కరతాళ ధ్వనులతో దీనిని ఆమోదించారు.

చివరగా సభను మంగళాశాసనం చేస్తూ మహామహోపాధ్యాయ శ్రీ ఉ.వే. శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామివారు తాము ఎంతో కృషిచేసి రచించిన శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్ర వ్యాఖ్యానము అనే బృహద్గ్రంథాన్ని శ్రీరామచంద్రాచార్యస్వామివారికి శ్రీవారి కరకమలముల మీదుగా అందించారు. అనంతరం శ్రీ రామచంద్రాచార్య స్వామివారి తిరునక్షత్ర తనియన్‌ను కుటుంబ సభ్యులకు, శిష్యులకు ప్రసాదించారు.

విజయనగరంమహారాజా కళాశాలలో శ్రీరామచంద్రాచార్యస్వామివారిలో కలసి పనిచేసిన శ్రీమాన్ మానాప్రగడ శేషసాయిగారు ఈ సప్తతి మహోత్సవాన్ని కీర్తిస్తూ శ్రావ్యంగా ఆలపించిన కవిత అందరిని అలరించింది.

శ్రీమాన్ శ్రీనివాస రామానుజంగారి కృతజ్ఞతా విష్కరణతో కార్యక్రమం సుసంపన్నమయింది. శ్రీవారు అందరికీ మంగళాశాసనములనుగ్రహించి భాగ్యనగరానికి బయల్దేరారు.

## 19-01-2003 హైదరాబాద్ గోపాలోపాయనం

ఈ నెల 28న వైకుంఠవాసులైన న్యాయ వేదాన్త విద్వాన్ శ్రీమాన్ తె.కం. గోపాలచార్య స్వామివారి నూరవ తిరునక్షత్రోత్సవం. భాగ్య నగరంలోని దిల్‌సుఖ్‌నగర్ దగ్గర వైట్‌హౌస్‌లో 19వ తేదీ సాయంకాలం **ఆచార్య వరివస్యగా గోపాలోపాయన** కార్యక్రమం అత్యంత వైభవంగా జరిగింది. శ్రీ మదుభయ వేదాన్తా చార్య పీఠం, 1997 నుండి ప్రతి







సంవత్సరం, కులపతులు, న్యాయవేదాంత విద్వాన్ శ్రీమాన్ తె.కం. గోపాలా చార్యస్వామివారి జీవిత విశేషాలను స్మరించు కుంటూ, వారు చేసిన లోకోపకారమునకు కృతజ్ఞతగా ఈ ఉత్సవాన్ని నిర్వహిస్తోంది. ఇది ఆరవది. దీనిలో భాగంగా సంస్కృత వేదాంతంలోగాని, ద్రావిడ వేదాంతంలోగాని, పరినిష్ఠితులైన పండితులనొకరిని శ్రీ స్వామివారి పేర సత్కరిస్తారు. అయితే ఈ సంవత్సరం ఈ పురస్కారంతో ఇద్దరు మహానుభావులను ఒక్కొక్కరినీ రూ. 50,000/- చొప్పున సమ్మానించడం విశేషం. వారిలో ఒకరు వేద, చతుశ్శాస్త్రరత్నాకర, మహామహోపాధ్యాయ శ్రీ ఉ.వే. శ్రీమాన్ నావల్‌పాకం శఠగోప రామానుజ తాతాచార్య స్వామివారు (తమిళనాడు), మరొకరు వ్యాకరణాచార్య, వేదాన్తాచార్య శ్రీ ఉ.వే. శ్రీమాన్ అధికారి మధుసూదనా చార్యస్వామివారు (బృందావనం, ఉత్తరప్రదేశ్). ప్రతి సంవత్సరం ఒక్కరికి మాత్రము, అది కూడా రూ. 25,000/- పారితోషకము మాత్రమే ఇవ్వడం జరిగేది. కాని ఈ సంవత్సరం ఇద్దరు మహానుభావులకు చెరి రూ. 50,000/- పారితోషకంతో సమ్మానించడం జరిగింది. శ్రీమతి శారదా మల్లిఖార్జున్‌రావు దంపతులు రూ. 50,000/-, శ్రీమతి రమానవనీత కిషన్‌రావు దంపతులు రూ. 25,000/- శ్రీమతి అరుణా రాఘవరెడ్డి దంపతులు రూ. 25,000/- సమర్పించి తమ పవిత్ర ద్రవ్యాన్ని ఈ సత్సంప్రదాయసేవలో వినియోగించారు. వారికి శ్రీస్వామివారు అనేక మంగళాశాసనములు కృపచేసారు.

సరిగ్గా సా॥ 4.00 గం॥కు గోపాలోపాయనం కార్యక్రమం ప్రారంభమయింది. జెట్-హైదరాబాద్ కార్యదర్శి ప్రొ. శ్రీమాన్ పురుషోత్తమరావుగారు శ్రీవారిని మరియు అతిధులను వేదికపైకి ఆహ్వానించి, సభాధ్యక్ష్యం వహించవలసినది మహామహోపాధ్యాయ శ్రీ ఉ.వే. శ్రీమాన్ న.చ. రఘునాధాచార్యస్వామి వారిని ప్రార్థించారు. శ్రీవారు దీపపజ్జ్వలన కావించగా వేదవిద్యార్ధులు వేదనాదంతో సభా కార్యక్రమం ప్రారంభమయింది.

శ్రీ మదుభయ వేదాంత పీఠము కార్యదర్శి శ్రీ ఉ.వే. శ్రీమాన్ డా. ఎస్.వి. రంగరామానుజా చార్యస్వామివారు గోపాలోపాయనపురస్కారమును గూర్చిన పరిచయాన్ని సభాసదులందరికి విశదం చేసారు. అధ్యక్షులవారి తొలిపలుకుల అనంతరం జెట్‌సొసైటీ అధ్యక్షులు శ్రీమాన్ డా. జె. రామేశ్వర్‌రావుగారు మాట్లాడారు. భక్తుల తరపున శ్రీమాన్ కె.రామకృష్ణారెడ్డి గారు, తత్త్వ ప్రచారకుల పక్షాన శ్రీమతి మంజులశ్రీ గారు, శిష్యుల తరపున శ్రీమాన్ డా॥ సంపత్‌గారు, గోపాలాచార్య స్వామి వారితో తాము పొందిన మధుర అనుభూతులను అందరితో పంచుకొన్నారు.

తదనంతరం గోపాలోపాయన పురస్కార గ్రహీతల పరిచయాన్ని శ్రోతలకందించారు. శ్రీ ఉ.వే. శ్రీమాన్ నావల్‌పాకం శఠగోప రామానుజ తాతాచార్యస్వామి వారిని శ్రీమాన్ ప్రొ॥ కె.వి.ఆర్. రామకృష్ణమాచార్య స్వామివారు పరిచయం చేయగా, శ్రీఉ.వే.శ్రీమాన్ అధికారి మధుసూధనాచార్యస్వామివారిని శ్రీమాన్ నేపాల్ శ్రీకృష్ణమాచార్యస్వామివారు పరిచయంచేసారు. తదుపరి పురస్కార గ్రహీతలకు సమ్మానం, సమ్మాన పత్రాన్ని శ్రీవారు తమ కరకమలములమీదుగా

## ద్వితీయ వర్ధంతి

**శ్రీరావుల పాండురంగారావుగారు** ది. 4-2-2001న (భీష్మఏకాదశి) ఆచార్య తిరువడి నలంకరించారు. 12-2-2003న ద్వితీయ వర్ధంతి సందర్భముగా కుటుంబ సభ్యులు శ్రీవారిమంగళాశాసనములు కోరుతూ పత్రికకు కైంకర్యము గావించినారు.

సమర్పించారు. ఈ కార్యక్రమాన్ని శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఎస్.వి. రంగరామానుజాచార్యస్వామి వారు నిర్వహించారు. ఆపై సమ్మాన గ్రహీత శ్రీమాన్ తాతాచార్యస్వామివారు తమ సందేశంలో - పూర్వాచార్య అనుగ్రహంతో చక్కటి అధ్యయనం, అధ్యాపనములు సాగించి ఇప్పటికెన్నో పురస్కారాలు అందుకున్నా, అన్నిటికన్నా గొప్పదీ పురస్కారము. అంతేకాదు ఇంతవరకు ఏ జీయరు స్వామివారుకూడా పండితులను గుర్తించి పురస్కారములను అందించడం నేను చూడలేదు. ఇలా చేస్తూ శ్రీ స్వామివారు సత్సంప్రదాయంలో ఒక నూతన అధ్యాయాన్ని ప్రారంభించారు. తెలుసుకొనవలసినది ఎంతో ఉంది. కాలమేమో స్వల్పం. విఘ్నాలు లెక్కలేనన్ని. కాబట్టి ఏది సారభూతమో దానినుపాసించి కృతకృత్యులు కావాలన్నారు. **(అనంతసారం బహువేదితవ్యం, అల్పశ్చకాలో బహవశ్చ విఘ్నాః, యత్సారభూతం తదుపాసి తవ్యం)** రామానుజ సిద్ధాంతం సమాజానికి ఏ విధంగా ఉపయోగ వంతం అనే విషయంపై సంక్షిప్త మనోహరంగా ప్రవచించారు. వీరిది మాతృభాష తమిళమే అయినా తెలుగులో మాట్లాడి శ్రోతలను ఆనందపర్చారు. అనంతరం శ్రీ ఉ.వే. శ్రీమాన్ అధికారి మధుసూదనాచార్య స్వామివారు కూడా సత్సంప్రదాయ పరిరక్షణకు అకుంఠిత దీక్షతో శ్రీవారు చేస్తున్న సేవలను శ్లాఘించారు. గురు తుల్యులైన శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారి గౌరవ పురస్కారమును అందుకోవడం పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నా మన్నారు. వీరు హిందీ భాషలో తమ ప్రవచనాన్ని కొనసాగిస్తూ గోపాలా చార్యస్వామివారితో తామను భవించిన మధుర ఘట్టాలను వివరించారు.

వీరు భగవద్రామానుజులంగీకరించి ప్రతిపాదించిన శరీరాత్మ భావమును అనగా చరాచర జగత్తంతయు, భగవంతునికి యథేష్ట వినియోగార్హము అనే విషయాన్ని ప్రామాణికంగా నిరూపించారు.

అతిథులను మరియు దాతలను సమ్మానించడ మును హైదరాబాద్ జెట్ చైర్‌పర్సన్ శ్రీమతి శ్రీ కుమారిరామేశ్వరరావుగారు నిర్వహించారు. అనంతరం శ్రీస్వామివారు మంగళాశాసన ప్రవచనం చేస్తూ ఒక దేశం కేవలం ఆర్థికంగా ప్రగతి సాధించినంతమాత్రాన సంపూర్ణప్రగతి అనిపించుకోదు. ఆధ్యాత్మిక ప్రగతి కూడా సాధించినపుడే నిజమైన ప్రగతి సాధించినట్లు. జ్ఞానాన్ని గ్రహించి, అందరికీ అందించడం బుద్ధి మంతులైనవారి లక్షణం. శ్రీపెద్దజీయరు స్వామివారు, గోపాలాచార్యస్వామివారు గనుక అవతరించి ఉండకపోతే నేటి పరిస్థితి ఎలా ఉండేదో? అని ఆస్తికా గ్రేసరులందరు అనుకునే మాట. నేడు మనం ఊర్ధ్వపుణ్డ్రాలు పెట్టుకొని ధైర్యంగా తిరగ్గలుగుతు న్నామంటే ముఖ్యకారకులు వీరిద్దరే.

వీరిద్దరు ఒకరు ఆత్మ అయితే ఒకరు శరీరంగా మెదిలిన మహానుభావులు. ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారు ఒక సారి గోపాలాచార్య స్వామివారిని అడిగారట 'స్వామీజీ! మీరు సర్వ స్వతంత్రులు కదా! ఎవరి పెత్తనాన్ని సహించగలిగే వారు కాదు! అలాంటి భావాలే కల్గిన శ్రీపెద్ద జీయరు స్వామివారితో కలసి ఇంత బాగా ఎలా ఉండగల్గు తున్నారు" దీనికి సమాధానంగా "నాకు చాలా పాండిత్యం ఉన్నమాట వాస్తవం. విద్యావంతులను తీర్చి దిద్దడంలో నేను దిట్టను అని తెలుసు. అయితే సామాన్య ప్రజలకు ఈ గహనమైన శాస్త్ర విషయాలను సువిదితం చేయడం శ్రీజీయర్ స్వామివారికి వెన్నతో పెట్టిన విద్య. ఈ విధంగా మేము **'పరస్పరం భావయన్తః'** అన్నట్లుగా కలసి ఉండగల్గుతు న్నామన్నారట." శ్రీ గోపాలాచార్య స్వామివారు, తొమ్మిది మంది జీయరులను లోకానికందించిన మహా మనీషి వీరు, కేవలం దక్షిణాదిలోనే కాకుండా ఉత్తరాదిలో అయోధ్యా, బృందావనం, నేపాల్ వంటి ప్రాంతాల్లో కూడా అధ్యాపనం కావించి ఎంతోమంది మహా పండితోత్తములను లోకాని కందించారు. 'ఒక్కొక్కరు మీ అంతటి వారిగా మరొకరిని తయారు చేయడమే నాకు మీరు సమర్పించాల్సిన గురుదక్షిణ అనే వారట. తీవ్రమైన శారీరక అనారోగ్యంతో బాధపడుతున్నా అధ్యాపనం మాత్రం అసిధారావ్రతంగా చివరి శ్వాసవరకు కొనసాగించిన మహానుభావులు. సంధ్యావందన సమయంలో **'స్థిత్వా అర్ఘ్యం భానవే దద్యాత్'** అర్ఘ్యప్రదానం నిలబడే చేయాలి అనే







నియమాన్ని కూడా చివరి వరకు పాటించారు. 1903లో వారుఅవతరించి 1996లో తిరునాడు నలంకరించారు. ఇప్పటికి వారవతరించి 100 సం.లు పూర్తయింది. ఈ విధంగా వారిని స్మరించుకుంటూ ఉపకార్స్మృతిగా 1996 నుండి గోపాలోపాయనం కార్యక్రమాన్ని నిర్వహించు కుంటున్నాం. ఈ సవంవత్సరం తమ ద్రవ్యాన్ని ఈ పవిత్ర కార్యంలో వినియోగించిన వారందరికి పేరుపేరునా మంగళా శాసనములు చేస్తున్నామని శ్రీవారన్నారు. ఈ కార్యక్రమానికి అన్ని హంగులతో కూడిన 'శ్వేత సౌధాన్ని' (WHITE HOUSE) వేదికగా ఏర్పాటు చేసిన శ్రీమాన్ చంద్రశేఖర్, శ్రీమాన్ రమేశ్, శ్రీమాన్ ఆర్. నర్సింహారావు, శ్రీమాన్ రాజేందర్‌గార్లకు, సేవలందించిన కార్యకర్తలకు, భక్తగోష్ఠికి అనేక మంగళాశాసనములు కృప చేశారు. ఈ సంవత్సరం పురస్కారాన్ని గ్రహించిన తాతాచార్యస్వామివారికి, అధికారి మధుసూధనాచార్యస్వామివారి కృతజ్ఞతా పూర్వక మంగళా శాసనములు కృపచేశారు.

శ్రీఉ.వేశ్రీమాన్‌డా.యస్.వి. రంగరామానుజా చార్యస్వామివారు ఈ కార్యక్రమంలో పాల్గొన్న భగవద్బంధువులందరికి వందన సమర్పణ చేయగానే వేదవిద్యార్థులు శాంతి పాఠాన్ని ఆలపించారు. విచ్చేసిన అశేష భక్తగోష్ఠికి ప్రసాదవితరణం చేయడంతో కార్యక్రమం సుసంపన్న మయింది.

19వ తేది రాత్రి శ్రీవారు శ్రీమాన్ కమలాకర్‌రావు దంపతుల ఆహ్వానంపై కుందన్‌బాగ్, బండారి రెసిడెన్సీ 6వ అంతస్తులో వారు నూతనంగా నిర్మించుకున్న గృహానికి వేంచేసి పునీతం చేసారు. రాత్రి ఇక్కడే బస చేసారు. 20న ఉదయం తీర్థగోష్ఠిలో TTD E.O శ్రీమాన్ అజయ్ కలాంగారు శ్రీవారిని సేవించుకొని మంగళాశాసనములు స్వీకరించారు. శ్రీవారు, కమలాకరరావుగారు తమ గృహంలో తలపెట్టిన సుదర్శన హోమ పూర్ణాహుతిని జరిపించి, విచ్చేసిన భగవద్బంధువలనుద్దేశించి ప్రవచించారు. లక్ష్యాలు ఉన్నతంగా ఉండాలని... ఎటువంటి క్లిష్ట పరిస్థితులెదురైనా లక్ష్యం చెదరకుండా ఉండే మనోధైర్యాన్ని ప్రసాదించమని భగవంతుణ్ణి ప్రార్థించాలి. గోదాదేవిచెప్పినట్లు "నీవే మాకు రక్షకుడవు" అని భగవంతుణ్ణి మనం విశ్వసించ గలగాలి అన్నారు. శ్రీమాన్ కమలాకర్‌రావుగారు, వారి ధర్మపత్ని శ్రీమతి కమలగారు సంతానం కళ్యాణ్ చరణ్, ఐశ్వర్య రాజ్యలక్ష్మి వీరందరిని ఆ భగవంతుడు ఆశించిన మంచి, లక్ష్యం వైపు నడిపించాలని వారికి శ్రీవారు అనేక మంగళా శాసనములు కృపచేసి బయల్దేరారు. మధ్యాహ్నాము నుండి రాత్రి వరకు భాగ్యనగరంలోనే వివిధ భగవద్బంధువుల గృహాలకు వేంచేసి మంగళా శాసనం చేసారు. వారిలో శ్రీమతి లక్ష్మి సురేందర్ రెడ్డిగారు (కుందన్‌బాగ్) 2. శ్రీమతి సరళాకుమారి పున్నారావుగారు (అమీర్‌పేట), 3. శ్రీమతి రాజ్యలక్ష్మి భావన్‌కుమార్‌గారు (శ్రీనివాస్‌నగర్-వెస్ట్) 4. శ్రీమతి రమానవనీత కిషన్‌రావుగారు (బాకారం), 5. శ్రీమతి సుచరిత రత్నాకర్‌రావుగారు (హిమయత్ నగర్) 6. శ్రీమాన్ వినాయకరావు (చాదర్‌ఘాట్), రాత్రికి మహాసిమెంట్స్ అధినేత, జెట్ సొసైటి అధ్యక్షులు శ్రీమాన్ డా॥ జె. రామేశ్వరరావు గారి గృహంలో బస చేసారు. 21,22 తేదీల్లో జెట్ కార్యకలాపాలను సమీక్షించారు. 21వ తేది మధ్యాహ్నం 'మా' టి.వి అధినేత శ్రీమాన్ మురళీకృష్ణంరాజు శ్రీమతి దేవి దంపతుల అభ్యర్థన మేరకు జూబ్లిహిల్స్‌లోని వారి గృహానికి వేంచేసి మంగళాశాసనం చేసారు. అనంతరం మా టి.వి కార్యాలయాన్ని కూడా సందర్శించి స్టాఫ్ నుద్దేశించి అనుగ్రహ భాషణం కృపచేసి మంగళాశాసనము లందించారు. 22వ తేది సాయంకాలం శ్రీమాన్ రామానుజాచార్యులుగారి ఆహ్వానంపై శ్రీనగర్‌లోని Steel & Mines Complexకు శ్రీస్వామివారు విచ్చేసి ఆంగ్లంలో చక్కటి ప్రవచనాన్నను గ్రహించి రాత్రి 9.90 గంటలకు దోమల్‌గూడలోని జెట్ భవనానికి చేరుకున్నారు. అప్పటికే శ్రీమాన్ కల్కి అవతారంగారి ఆధ్యక్షంలో జంటనగరాల వికాసతరంగిణి కార్యకర్తలందరూ సమావేశమయ్యారు.

ఫిబ్రవరి 13వ తేదిన భీష్మ ఏకాదశిపర్వదిన సందర్భంగా విరాట్ పారాయణ కార్యక్రమాన్ని హైదరాబాద్ నగరంలో చేయాలని శ్రీవారు సంకల్పించి, ప్రకటించగానే జెట్ భవనమంతా కరతాళ ధ్వనులతో మారుమ్రోగింది. అందరూ తమ హర్షాతిరేకాన్ని వ్యక్తం చేసారు. కార్యక్రమానికి వేదిక NTR స్టేడియం బాగుంటుందని శ్రీమాన్ చిలకం రాంచంద్రారెడ్డిగారు సూచించగా

శ్రీమాన్ డా॥ రామేశ్వర్‌రావుగారు, శ్రీమాన్ పురుషోత్తమరావుగారు, శ్రీమాన్ వరకుమార్ గుప్తగారు, శ్రీమాన్ అవతారంగారు, జంటనగరాల వికాసతరంగిణు లంతా తమ అంగీకారాన్ని ప్రకటించడమే కాకుండా విరాళాలు కూడ వెంటనే ప్రకటించారు కూడా. శ్రీవారు కార్యక్రమాన్ని గూర్చి కార్యకర్తలకు సూచనలందిస్తూ **"విష్ణు సహస్రనామము స్తోత్రము"** ఒక శక్తివంతమైన ఆయుధము. మన కార్యక్రమమును గూర్చి జంట నగరాలలో ఇంటింటికి తెలియజేయాలి. కనీసం 1000 మంది కార్యకర్తలను ముందు సమాయత్తం చేసుకోవాలి. ఎవరెవరు ఏమేం చేయాలి? ఎక్కడుండాలి? ఎంతమంది ఉండాలి? అనే విషయాన్ని ముందే నిర్దేశించుకోవాలి. ఇది మొదటి వారంలో జరిగిపోవాలి. మొత్తం మూడు వారాల సమయం మాత్రమే ఉంది. రెండవ వారమునుండి ప్రచార కార్యక్రమాన్ని ప్రారంభించాలి. ఎంతమంది వస్తారు? అని ఆలోచించకుండా ముందు ప్రచారాన్ని ముమ్మరంగా సాగించాలి. జంటనగరాల హోదాకు దీటుగా వచ్చే లక్షలాది భక్తజనానికి తగ్గట్టు మనం ఏర్పాట్లు చేసుకోవాలి. వచ్చిన వారందరికీ ప్రవేశద్వారంలోనే గీతాజ్యోతి సూత్రాలతో కూడిన రెండు స్టిక్కర్లను అందించాలి. అందరిని ఇంటి వద్దనుండి దీపాలను తెచ్చుకోవాలని చెప్పాలి. అలా తెచ్చుకోలేని వారికి మనమిక్కడ ప్రమిదలను అందించే ఏర్పాటు చేయాలి. విరాట్ పారాయణం అనంతరం నేతి దీపాలు వెలిగించి గీతాజ్యోతి ప్రతిజ్ఞను అందరిచేత చేయిస్తాం.

కార్యక్రమంలో ముందుగా జగ్గయ్యపేట శ్రీపాంచ రాత్రాగమ విద్యార్థులు శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రంపై "అవధానం" చేస్తారు. అంతే కాకుండా ఒక్క తప్పులేకుండా సహస్రనామ స్తోత్రాన్ని ఆలపించినవారికి రూ. 10,000/- బహుమతిగా ఇస్తాము. ఈ విరాట్ పారాయణ కార్యక్రమానికి ఇస్లాం మతానికి సంబంధించిన ముఖ్యులను ఒకరిని, క్రీస్తు మతానికి సంబంధించిన ముఖ్యులను ఒకరిని కూడా ఆహ్వానించుకుంటే బాగుంటుందని కూడా సూచించారు. ఇప్పటినుండి కార్యకర్తలంతా ఈ బృహత్తర కార్యాన్ని భావిస్తూ కార్యాచరణలో ముందుకు సాగాలని మంగళాశాసనములందించి సమావేశాన్ని ఉపనిషత్ ప్రార్థనతో ముగించారు.

మధ్యాహ్నం శ్రీమాన్ జె. రామేశ్వరరావు- శ్రీకుమారి దంపతులు వారి కుటుంబ సభ్యులు శ్రీవారికి పాదపూజ మహోత్సవమును జరిపారు. వారందరికి మంగళాశాసన ములనుగ్రహించి ఖమ్మంజిల్లా పాల్వంచకు బయల్దేరారు.

24,25,26 తేదీలలో శ్రీస్వామివారు శ్రీమాన్ అశోక్ రమాదేవిగార్లు, శ్రీమాన్ విక్రమ్ రాజశ్రీ దంపతుల ఆహ్వానంపై పాల్వంచలో వేంచేసి ఉన్నారు. నవభారత్ ఫెర్రో విల్లాయిస్ కర్మాగారము ప్రారంభించి 16 సం॥లు పూర్తి అయిన సందర్భముగా శ్రీ సుదర్శనయాగాన్ని శ్రీ వేంకటేశ్వర ఆలయంలో చాలా వైభవంగా నిర్వహించారు. 24వ తేది కూరత్తాళ్వారు అవతరించిన రోజు. వైరాగ్య సంపన్నులు, పరమదయాళువు అయిన ఆ మహానుభావుల వైభవాన్ని భక్తగోష్ఠికి శ్రీస్వామివారు వివరించారు. అనంతరం పత్రికావిలేఖరులతో ముచ్చటించి నవభారత్ కర్మాగారాన్ని సందర్శించారు. మధ్యాహ్నం 2 గంటలకు భద్రాద్రికి వేంచేసి శ్రీ సీతారామచంద్రస్వామిని దర్శించి మంగళాశాసనం చేశారు. సాయంత్రం 6గం॥ల నవభారత్ ఆడిటోరియంలో శ్రీలక్ష్మీనారాయణ పూజలు చేయించారు. 25వ తేదీ నవభారత్ స్కూలు విద్యార్థులను ఉద్దేశించి సందేశాన్నందించారు. మధ్యాహ్నం 3గం.లకు బదరీ అష్టాక్షరీ క్షేత్రీయ అన్నదాన శాఖాసంఘము జీవిత సభ్యుల సమావేశం శ్రీస్వామివారి సమక్షమున జరిగినది. **BAKASS** నిర్వాహకురాలు కుమారి ఉషశ్రీగారు ఈ సమావేశాన్ని విలక్షణమైనరీతిలో విజయవంతంగా నిర్వహించారు. 26వ తేదీ మధ్యాహ్నం 2గం.టకు కొత్తగూడెం విచ్చేశారు. ప్రగతినగర్ కాలనీలో గీతాజ్యోతి సందేశాన్నందించి, శారదాకుటీర్‌లోని భక్తగోష్ఠికి మంగళాశాసనం అందించారు. రాత్రి 7 గంటలకు సీతానగరము ఆశ్రమమునకు చేరి ఆరాధనానంతరము తిరుపతికి బయలుదేరారు.

## జీయర్ హ్యూమానిటీస్ - తెనాలి

ప్రతినెల 3వ ఆదివారం, తెనాలి, జీయర్ హ్యూమనిటీస్ వారు నిర్వహిస్తున్న జీయరు 'ఉచితవైద్య శిబిరము' గత జనవరి 3వ తేదీన ప్రత్యేకంగా అమృతలూరు మండలం మోపర్రు గ్రామంలో 11 మంది వివిధ శాఖలలో నిపుణులైన తెనాలి వైద్యులు తమ సేవలను అందజేశారు. ఉచితంగా 4వేల రూపాయల మందులు







అందజేసిరి. 800 మంది పైగా సేవలను, వినియోగించు కున్నారు. శ్రీజీయరు స్వామివారు పిట్టలవానిపాలెం నుండి అధికశ్రమను కూడా లెక్కచేయక వేంచేసి, మంగళా శాసనములుచేసి, శిబిరమును ప్రారంభంచేసినారు. శాసనసభ్యులు, ఆలపాటి రాజేంద్రప్రసాద్‌గారుకూడా కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈశిబిరాన్ని అమెరికాలోనున్న డా॥ గూగినేని పుష్పలత తదితరులు సమర్పించారు.

తిరిగి జనవరి 19వ తేదీ ఆదివారం అమృతలూరు మండలం ప్యాపర్రు గ్రామంలో 7వ వైద్యశిబిరము U.S.A.లో ఉన్న శ్రీమాన్ సురేంద్రనాథ్ (బెనర్జి)గారి జన్మదిన సందర్భముగా నిర్వహించటం జరిగినది. ఈ శిబిరంలో 12 మంది డాక్టర్లు 1200 మందికి పైగా రోగులను పరీక్షించి, సుమారు 52 వేల రూపాయల మందులను పంపిణీ చేసారు. సత్యసాయి క్లినిక్ ల్యాబ్ తరపున ఉచిత రక్తపరీక్షలను శ్రీజ్ఞానేంద్ర ప్రసాద్‌గారు నిర్వహించారు.

ఈ కార్యక్రమానికి శాసన సభ్యులు ఆలపాటి రాజేంద్ర ప్రసాద్ (R.P.O., P.V. సూర్యనారాయణ, M.R.O. బాబూరావుగారు, బాలగంగాధర్ తిలక్ (D.S.P.) సందర్శించి, ప్రోత్సహించారు. జీయర్ హ్యూమనిటీస్ కార్యకర్తలు, శ్రీ N. సత్యనారాయణ, బదరీస్వామి, S. కిషోర్, K.జ్ఞానేంద్రప్రసాద్ తదితరులు నిర్వహించారు. ఈ క్యాంపులో పాల్గొని సేవలందించిన డాక్టర్లు :

డా॥ M.V. సుబ్బారావుగారు (కంటి), B. లవకుశులు (MD), K. వెంకటరమణ (MS), వేమూరి శేషగిరిరావు (Ortho), V. శివరామ ప్రసాద్ (ENT), జాష్టి సుబ్బారావు (Skin), V. విశ్వేశ్వరరావు (Dental), రాధాకృష్ణమూర్తిగారు (MS), తుకారామ్ (జనరల్), A. చక్రవర్తి (పిల్లలకు), R. శారదగారు, శ్రీ పుష్పలత (USA) గారు (స్త్రీలకు).

## వరంగల్ జిల్లా

**నర్సంపేట** :- వరంగల్ జిల్లా నర్సంపేట వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో గీతాజయంతి సందర్భముగ స్థానిక వేంకటేశ్వర దేవస్థానం నందు, కన్యకాపరమేశ్వరి అమ్మవారి దేవస్థానము నందు గీతాపఠన కార్యక్రమం నిర్వహించడం జరిగింది. విద్యార్థులకు శ్రీస్వామివారిచే నిర్వహించబడు గీతాజ్యోతి కార్యక్రమ 48 శ్లోకాల పోటీ పరీక్షలు నిర్వహించినారు. జై శ్రీమన్నారాయణ భక్త మండలిచే వందలాది మంది విద్యార్థులకు భగవద్గీతలను ఉచితంగ పంపిణీ చేయడం జరిగింది. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ డి. వీరేశలింగం, డా॥ సిహెచ్. ఉషారాణి, డా॥ వనజాగార్లు పాల్గొన్నారు.

**మహబూబాబాద్** :- మానుకోట వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యంలో స్థానిక శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయం నందు ధనుర్మాస వ్రత మహోత్సవం వైభవంగ నిర్వహించు కొన్నారు. 15-1-03 ఉ॥ 10గం॥లకు శ్రీ గోదారంగనాథుల కళ్యాణోత్సవము అతి వైభవంగా నిర్వహించు కోవడం జరిగినది. ప్రతిరోజు ఉ॥ తిరుప్పావై, సేవాకాలం, సా॥ విష్ణుసహస్రనామ పారాయణం చేయడం జరిగినది. వికాస తరంగిణి చైర్‌పర్సన్ శ్రీమతి అరుణ రాఘవేందరరెడ్డి, పి. రాజమౌళి, పరాంకుశం అనంతస్వామి, యాద నర్సింహారావు, శ్రీమతి కమలాజుగారెడ్డి, శ్రీ వెంకటేశ్వర్లు గారు దేవాలయ కమిటీ సభ్యులు, ఇతర వికాసతరంగిణి కార్యకర్తలు పాల్గొన్నారు.

## కృష్ణా జిల్లా

**పటమట** : పటమట వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో గీతాజ్యోతి ధర్మక్షేత్ర కార్యక్రమంలో భాగంగ ధనుర్మాస వ్రత కార్యక్రమం వైభవంగ నిర్వహించుకున్నారు.

శ్రీమాన్ శ్రీనివాస్‌గారి ఆధ్వర్యంలో 21 మంది దంపతులతో 200 మంది భక్తులతో గోదాకళ్యాణం వైభవంగా జరిగింది. కోనేరు ప్రసాదరావుగారి దంపతుల నేతృత్వంలో 15వ తేదీన 250 మందికి అన్నప్రసాద వినియోగం జరిగినది.

గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగా సీతానగరంలోని 30 గృహాలలో హనుమ ధ్వజాలను, స్టిక్కర్లను, గీతాజ్యోతి శ్లోకమాలికలను ఉచితంగ అందించడం జరిగింది. ఈ కార్యక్రమంలో శ్రీ కె. ప్రసాదరావుగారు, కె. అన్నపూర్ణ, రాణిసంయుక్త, పి. అన్నపూర్ణాదేవిగార్లు పాల్గొన్నారు.

**జగ్గయ్యపేట** :- కృష్ణాజిల్లా జగ్గయ్యపేట ధర్మక్షేత్ర కేంద్రముగ 3 మండలాల (జగ్గయ్యపేట, వత్సాయి, పెనుగంచిప్రోలు) లోని అన్ని గ్రామాలలో మొదటి విడతగ సుమారు 120 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం పూర్తి చేయడం జరిగింది. గీతా జయంతి సందర్భముగ

భగవద్గీత 18 అధ్యాయములు సామూహిక పారాయణం చేయడం జరిగింది. 'స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ' అంశముపై విరివిగ ప్రచారం జరుగుచున్నది. తత్వశాస్త్ర ప్రచారకులైన కుమారి నీళగారు, దమయంతిగారు, పుష్పావతిగారు, విజయలక్ష్మిగారు అన్ని గ్రామాలలో విస్తృత ప్రచారం జరుపుచున్నారు. అని కన్వీనర్ మల్లిఖార్జునరావుగారు తెలియజేసారు.

**కొత్తపేట :-** విజయవాడ నగర కొత్తపేట వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో శ్రీరమా సహిత శ్రీసత్యనారాయణ స్వామి కోవెలలో 'అర్ధ ఏకాహం' నిర్వహించబడినది. పటమట, మల్లిఖార్జునపేట భవానీపురం, లేబర్ కాలనీ వికాసతరంగిణి బ్రాంచీలు పాల్గొన్నారు. 600 మందికి తదీయారాధన జరుపబడినది.

**గుడివాడ :-** గుడివాడ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో ధనుర్మాస కార్యక్రమం స్థానిక కృష్ణమందిరంలో దివ్యంగ జరిగినది. ఉదయం 5గం॥లకు శ్రీగోదా కృష్ణుల అష్టోత్తర శతనామాలతో తిరుప్పావై సేవాకాలం, 7-00 గం॥లకు తీర్థగోష్ఠి, ప్రసాద వితరణ జరిగింది.

ఈ కార్యక్రమంలో భాగంగా 30 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం నిర్వహించారు. ఈ కార్యక్రమంలో తత్త్వశాస్త్ర ప్రచారకులు శ్రీ హైమావతిగారు, శ్రీమతి శ్రీవల్లిగారు, ఉమగారు, ప్రమీలగార్లు పాల్గొన్నారు.

**ముత్యాలంపాడు :-** విజయవాడ నగర ముత్యాలం పాడు వికాసతరంగణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగా 15 పాఠశాలల యందు విద్యార్థినీ, విద్యార్థులకు భగవద్గీత శ్లోక పోటీలను నిర్వహించారు. వైకుంఠఏకాదశి పర్వదినాన విజేతలకు బహుమతి ప్రదానం జరిగినది. ఈ కార్యక్రమంలో మాజీ M.L.A., శ్రీ కె. సుబ్బారాజు గారు, ఎ.వి. ఆనంద్‌గారు ముఖ్యఅతిథులుగా విచ్చేసినారు. శ్రీ వి.వి. నరసరాజుగారు అధ్యక్షత వహించినారు. శ్రీమాన్ హరివిఠల్‌గారు, శ్రీలక్ష్మీ నారాయణగార్లు పాల్గొన్నారు. వికాసతరంగిణి కార్యకర్తలు ఉద్యానవన మహోత్సవం సందర్భముగ మొక్కలు నాటడం జరిగినది. వికాసతరంగిణి ఛైర్‌పర్సన్ శ్రీమతి వెంకట రావమ్మ ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు.

**గన్నవరం :-** గన్నవరం వికాసతరంగిణి శాఖ శ్రీస్వామి వారి మంగళాశాసనములతో 15-12-02 నుండి 13-12-2003 వరకు ధనుర్మాస వ్రతమును గన్నవరం మరియు దావాజిగూడెం రామాలయము నందు జరుపుకొన్నది.

ఈ కార్యక్రమమును వికాసతరంగిణి సభ్యులు సీతారావమ్మగారు, ఆదిలక్ష్మిగారు, ముకుందరావు గారి దంపతులు, మరియు రామాలయ ట్రస్టీ జి. వెంకటరత్నం గారు నిర్వహించగా రోజూ తత్త్వ ప్రచారిక కుమారి నీళా తిరుప్పావై ఆధ్యాత్మిక ప్రవచనములను అందించినారు. ఈ కార్యక్రమములో భాగముగా నిర్వహించిన వివిధ సాంస్కృతిక కార్యక్రమములలో చిన్నారి భక్తులు ఎంతో శ్రద్ధగా పాల్గొని బహుమతులు అందుకున్నారు.

విశేషముగా ఎంతో ఉత్సాహముతో క్రమము తప్పక అన్వయించిన భక్తులకు 12వ తేదీన నిర్వహించిన (తిరుప్పావైలో విశేషాలు) పరీక్షల్లో పురుషులు ప్రథమ స్థానమును నెగ్గి తాము తిరుప్పావై వ్రతానికి నిజమైన యోగ్యులము అని నిరూపించు కున్నారు. అంతేకాక అర్చకస్వాములు శ్రీమాన్ రాముగారు మంగళహారతులు పట్టి గోదాదేవి అనుగ్రహ పాత్రులయినారు.

## పశ్చిమ గోదావరి జిల్లా

**సిద్ధాతం :-** పశ్చిమ గోదావరి జిల్లా సిద్ధాంతము వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజయంతి సందర్భముగ 50మంది భక్తులు సామూహిక భగవద్గీత, లక్ష్మినారాయణ పూజలు నిర్వహించినారు. గీతాజ్యోతి శ్లోకమాలికలను, విష్ణు సహస్రనామ స్తోత్రముల పఠన కార్యక్రమం జరిగినది. శ్రీమాన్ ముడుంబై వెంకటాచార్యులుగారు పూజా కార్యక్రమం నిర్వహించినారు.

**పాలకొల్లు :-** పశ్చిమ గోదావరి జిల్లా పాలకొల్లు వికాసతరంగిణి ఆధ్వర్యవంలో గీతాజయంతి సందర్భముగ శ్రీఅష్టభుజలక్ష్మీనారాయణ స్వామి దేవస్థానమునందు భగవద్గీత పారాయణం చేయడం జరిగింది. 125 మంది భక్తులు పాల్గొన్నారు. ప్రతిరోజు ఒక్కొక్క గృహంలోను, ఆలయప్రాంగణంలోను, వెనుకబడిన ప్రాంతాలలో గీతాజ్యోతి గోష్ఠులను ఏర్పాటు చేసినారు.

45 మంది చిన్నారులకు సాంస్కృతిక కార్యక్రమాలు, పాటలు, కోలాటం, నృత్యములు, నాటికలు ప్రదర్శన జరిపినారు. శ్రీమాన్ తూపురాణి ఉదయవర్లుస్వామివారిచే 'తిరుప్పావై' జరిగినది.







## మహబూబ్ నగర్ జిల్లా

**నాగర్ కర్నూల్ :-** మహబూబ్ నగర్ జిల్లా నాగర్ కర్నూల్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో భగవద్గీతలోని 18 అధ్యాయముల సామూహిక గీతాపారాయణం జరిగినది. గీతాజయంతి సందర్భముగ వివిధ పాఠశాలలోని విద్యార్థినీ విద్యార్థులకు భగవద్గీత యందలి దైవాసుర సంపద్విభాగ యోగము శ్లోకముల పోటీ నిర్వహించినారు. విజేతలైన విద్యార్థులకు బహుమతి ప్రదానం చేయబడినది. ఈ కార్యక్రమంలో శ్రీమాన్ వెంకటస్వామి, శ్రీమాన్ డి. బాలస్వామి, శ్రీమాన్ కొత్త కృష్ణయ్యగారు పాల్గొన్నారు.

స్థానిక రామమందిరంలో వైకుంఠ ఏకాదశి మహోత్సవాన్ని వైభవంగా నిర్వహించుకున్నారు. ఈ కార్యక్రమం సందర్భంగా సామూహిక కృష్ణపూజలు, విష్ణు సహస్రనామ పారాయణ చేయడం జరిగింది. గీతాజ్యోతి కార్యక్రమం సంపూర్ణ విజయవంతము చేయుటకు ప్రత్యేక కార్యాచరణం రూపొందించడం జరిగింది. ఈ కార్యక్రమాన్ని సంపూర్ణ విజయవంతం చేయుటకు ప్రత్యేక కార్యాచరణం రూపొందించడం జరిగింది. ఈ కార్యక్రమాలు వికాసతరంగిణి ఛైర్‌పర్సన్ టి. వెంకట రామయ్యగారు, కార్యదర్శి వెంకటరెడ్డిగారు ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు.

**వనపర్తి : -** మహబూబ్ నగర్ జిల్లా వనపర్తి వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతా జయంతి సందర్భముగ శ్రీవేంకటేశ్వర స్వామి దేవాలయ ప్రాంగణం నందు శ్రీమాన్ చంద్రమోహన్ RDO గారు జ్యోతిప్రజ్వలన గావించినారు. అనంతరం రామాచారి అర్చకుని ఆధ్వర్యవంలో గురుపూజ గావించగ 18 అధ్యాయములు 700 శ్లోకాలు పారాయణ చేయడం జరిగింది. జై శ్రీమన్నారాయణ నినాదంతో ఆ ప్రాంతమంత మారుమ్రోగి పోయినది. ఈ కార్యక్రమములో శ్రీమాన్ జి. చిన్నారెడ్డి MLA, మున్సిపల్ ఛైర్మన్ జి. ప్రమీలమ్మ, శ్రీమాన్ బి. కృష్ణ, శ్రీమాన్ శ్రీధర్‌గారు పాల్గొన్నారు. 1000 మంది భక్తులు పాల్గొన్నారు. వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ వి. కురుమూర్తి ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు.

## ప్రకాశం జిల్లా

**బొమ్మనంపాడు :-** ప్రకాశం జిల్లా బొమ్మనం పాడు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో స్థానిక శ్రీమాన్ కోదండ రామస్వామివారి దేవాలయంలో గీతాజయంతి సందర్భముగ శ్రీకృష్ణపూజలు నిర్వహించి నారు. ఆవునేతితో గీతాజ్యోతులను వెలిగించి గీతాజ్యోతి శ్లోకములు పారాయణం చేయడం జరిగింది. తత్త్వ ప్రచారకులైన శ్రీమతి అన్నపూర్ణ గార్లు గీతా వైభవమును గూర్చి వివరించినారు.

## కరీంనగర్ జిల్లా

**కరీంనగర్ :-** కరీంనగర్ పట్టణంలో ముకరంపుర వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజయంతి సందర్భముగ ఉ॥ 10గం॥లకు కృష్ణపూజలు కార్యక్రమం నిర్వహించినారు. భక్తులందరిచేత నేతిజ్యోతులు వెలిగించి గీతాజ్యోతిప్రతిజ్ఞ చేయించినారు. ధనుర్మాస కార్యక్రమ సందర్భముగ ఉ॥ తిరుప్పావై, సా॥ గీతాసారం ప్రవచనములు జరుగుచున్నవి. గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగా పాఠశాల విద్యార్థులకు దంత మరియు నేత్రవైద్య శిబిరములను నిర్వహించినారు. ఈ కార్యక్రమంలో శ్రీమాన్ కె. దేవేంద్రరావుగారు, శ్రీమాన్ యస్. ప్రభాకరరావుగారు, శ్రీమాన్ రఘునాథ్‌గారు, ప్రముఖ డాక్టర్లు పాల్గొన్నారు.

అనంతరం ఆండాళ్ గోష్ఠి భవనంలో శ్రీమాన్ కె. దేవేంద్రరావు M.L.A., గారితో అనేక మంది ప్రముఖులు విద్యార్థినీ విద్యార్థులకు గీతాశ్లోకమాలిక 48 శ్లోకాలు పఠించి కృష్ణపూజలు జరిపి నేతి జ్యోతులను వెలిగించినారు. 11-01-03రోజున కూడారై ఉత్సవము 108 వెండి పాత్రలలో పాయస నివేదన కార్యక్రమంలో అనేక మంది భక్తులు పాల్గొన్నారు. శ్రీమాన్ N.C. రఘునాథాచార్యస్వామి వారు పాఠశాలలను సందర్శించి గీతాజ్యోతి స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ గురించి వివరించడం జరిగినది. 15-1-03 శ్రీశ్రీశ్రీ పెద్దజీయరుస్వామి వారి పరమ పదోత్సవము పద్మనాయక కళ్యాణ మండపములో శ్రీమాన్ N.C. రఘునాథాచార్యస్వామి వారి ఆధ్వర్యవంలో వైభవంగా నిర్వహించుకొన్నారు. 32 రోజులపాటు ధనుర్మాస కార్యక్రమం అత్యంత వైభవంగా నిర్వహించుకొన్నారు.

**విద్యానగర్ :-** కరీంనగర్‌లోని విద్యానగర్ వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమం ప్రతి శుక్రవారం 20 గృహములలో గీతాజ్యోతి సామగ్రి అందజేసి శ్లోకమాలిక పారాయణం చేయించడం జరుగుతుంది. 100 మంది పాఠశాల విద్యార్థులకు శ్లోకమాలికలను నేర్పి రోజు పారాయణం చేయడం జరుగుతుంది.

**సుల్తానాబాద్ :** కరీంనగర్ జిల్లా సుల్తానాబాద్ ధర్మక్షేత్రంలో గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగా 19-1-03న భారీఎత్తున ఉచిత పశువైద్యశిబిరం నిర్వహించబడినది. ఈ శిబిరంలో 200 పశువులకు వైద్య సౌకర్యం అందజేసారు. పశుసంవర్ధక శాఖకు చెందిన 20 మంది డాక్టర్లు తమ సేవను అందించారు. ఈ కార్యక్రమంలో శ్రీమాన్ కె. దేవేంద్రరావుగారు M.L.A., శ్రీ గౌతంరావుగారు, భాస్కరరెడ్డిగారు, S. ప్రభాకరరావు గారు, నారాయణరావుగారు పాల్గొన్నారు. ఉ॥ సౌమిత్రి వేణు గోపాలాచార్య స్వామి, ఆరుట్ల శ్రీనివాసాచార్యులు వారి ఆధ్వర్యవంలో సామూహిక శ్రీకృష్ణపూజలు జరిగాయి. జీలకంటి గ్రామ గీతాగోష్ఠి, కంకణాల రాజారెడ్డిగారి సౌజన్యంతో 800 మందికి తదీయారాధన చక్కగా నిర్వహించడం జరిగింది. గ్రామ సర్పంచి శ్రీనివాసరెడ్డి ఆధ్వర్యవంలో సాయంత్రం 3గం॥లకు గ్రామమంతా భగవన్నామ స్మరణ చేసుకుంటూ శోభాయాత్ర జరిపినారు. ధర్మక్షేత్ర కన్వీనర్ శ్రీ వెంగానిచంద్రశేఖర్ కార్యక్రమమును చక్కగ సమన్వయం చేసినారు.

**కోరుట్ల :-** కరీంనగర్ జిల్లా కోరుట్ల వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గోదారంగనాథుల కళ్యాణ ఉత్సవాలు వైభవోపేతంగా జరిగినాయి. ఈ ఉత్సవాల్లో భాగంగ సుప్రభాతసేవ, ఊంజల సేవ తిరుప్పావై అనుసంధానం కార్యక్రమాలు జరిగాయి. వికాసతరంగిణి ఆధ్వర్యవంలో జరిగిన ఈ కార్యక్రమంలో శ్రీమాన్ టి. అనంతరాములు, రామాచార్యులు, అనంతాచారి, నారాయణ, రమాదేవి, సత్యసాగరరావు, సురేష్‌లు పాల్గొన్నారు.

**గోదావరిఖని:-** గోదావరిఖని వికాసతరంగిణిశాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగా 16-12-2002 నుండి 14-1-2003 వరకు ధనుర్మాసవ్రతకార్యక్రమం వైభవంగ నిర్వహించు కొన్నారు. స్థానిక లక్ష్మీనారాయణస్వామి దేవస్థానంలో ఉదయం సేవాకాలం, ప్రవచనం, సాయంత్రం ఎన్.టి.పి.సి. పైడిపల్లి సెంటర్ రామాలయంలో 6 గం॥లకు ప్రవచనం తత్వశాస్త్ర ప్రచారకులైన శ్రీమాన్‌గంగాధర్‌గారి ఆధ్వర్యవంలో నిర్వహించబ డినది.

## చిత్తూరు జిల్లా

**మునగమాకుల కొత్తూరు :-** చిత్తూరు జిల్లా యమ్. కొత్తూరు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో శ్రీపట్టాభి రామస్వామి దేవస్థానము నందు గీతాజ్యోతి కార్యక్రమాన్ని వైభవంగ జరుపుకున్నారు. ప్రతిరోజు సాయంత్రం శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం జరుపుకొను చున్నారు.

## విశాఖ పట్టణం జిల్లా

**అనకాపల్లి :-** విశాఖపట్టణం జిల్లా అనకాపల్లి వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో స్థానిక దలిత బహుజన సమాజస్కూలులో ఉచిత మెడికల్ క్యాంప్ నిర్వహించినారు. పిల్లలకు వైద్యపరీక్షలు నిర్వహించి ఉచిత మందులు పంపిణీ చేసారు. పిల్లలకు శారీరక వికాసంతోపాటు మానసిక వికాసం కొరకు గీతాజ్యోతి శ్లోకములు నేర్పించినారు.

ధనుర్మాస వ్రత కార్యక్రమం స్థానిక జనార్దన స్వామి సన్నిధిలో జరుపుకున్నారు. ఈ కార్యక్రమంలో వికాస తరంగిణి సెక్రటరీ శ్రీమతి శశికళగారు, ఇతర సభ్యులు పాల్గొన్నారు.

**విశాఖపట్టణం :** విశాఖపట్టణం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగ ఉచిత పశువైద్య శిబిరం నిర్వహించడం జరిగింది.

3-1-03తేదీన విశాఖ డైరీ ఆధ్వర్యవంలో 8 గ్రామాలకు సంబంధించిన 102 పశువులకు వ్యాధి నిర్ధారణ జరిగినది. ఈ శిబిరంలో శ్రీమాన్ డా॥ ఎ.బి. నరసింగరావు, డా॥ ముకుందరావు, డా॥ వాసుదేవగార్లు తమ అమూల్యమైన వైద్యసేవలను అందించినారు. ఈ కార్యక్రమం విశాఖడైరీ ఉద్యోగులు, శ్రీమతి లక్ష్మీ సత్యనారాయణ సహాయ సహకారం అందజేసినారు. వికాస తరంగిణి చైర్‌పర్సన్ శ్రీమాన్ యమ్. సుదర్శనస్వామి, ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు.

## తూర్పుగోదావరి జిల్లా

**చేబ్రోలు :-** తూర్పుగోదావరి జిల్లా చేబ్రోలు వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో ఉచిత నేత్రవైద్య శిబిరం







నిర్వహింపబడినది. 201 మందికి కంటి ఆపరేషన్లు చేసి మందులు పంపిణీ చేయడం జరిగింది. 731 మందికి కంటి పరీక్షలు నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి అధ్యక్షులు డా॥ G.V.S.S. సీతారామ స్వామిగారి ఆధ్వర్యవంలో నిర్వహించబడినది.

**కాకినాడ :-** శ్రీస్వామివారి మంగళా శాసనములతో కాకినాడ వికాసతరంగిణి ఆధ్వర్యవంలో ధనుర్మాస వ్రత కార్యక్రమం నిర్వహించారు. ప్రతిరోజు ఒక గృహంలో ధనుర్మాస సేవాకాలం నిర్వహించినారు. 1-1-03 కాకినాడ సబ్‌జైలుఖైదీలకు నూతన సం॥ సందర్భముగ పండ్లు పంచడం జరిగింది. 14-1-03తేదీన గోదారంగనాథుల కళ్యాణం నిర్వహించి సామూహిక కృష్ణపూజలు నిర్వహించి నారు. శ్రీమాన్ వేదాంతం నరసింహాచార్యులుగారి ఆధ్వర్యవంలో నిర్వహింపబడినది.

**రాజమండ్రి:-** రాజమండ్రి వికాసతరంగిణిశాఖ ఆధ్వర్యవంలో ధనుర్మాసవ్రత కార్యక్రమం శ్రీ తులసీ రామానుజకూటమునందు 16-12-02 నుండి 14-1-03 వరకు ఘనంగ నిర్వహించినారు. తత్వశాస్త్ర ప్రచారకులైన కుమారి శారదగారి ఆధ్వర్యవంలో ఉదయం తిరుప్పావై, సాయంత్రం భాగవతప్రవచనం నిర్వహించడం జరిగింది.

గీతాజ్యోతి కారక్రమాలలో భాగంగా 108 విద్యా సంస్థలకు గీతాజ్యోతి సామగ్రి అందించారు. బాల వికాస తరంగిణి శాఖ పునఃప్రారంభించబడినది. మహిళాజైలులో గీతాజ్యోతిని నిర్వహించారు.

రాజమండ్రి శాటిలైట్ సిటీలో కరపత్రములను, భగవద్గీతలను పంచారు.

**కోటి :-** ధనుర్మాస కార్యక్రమమును కుమారి శారదగారు, శ్రీమాన్ బాబిగారి ఆధ్యక్షంలో అత్యంత వైభవంగా నెలరోజులపాటు నిర్వహించారు.

## గుంటూరు జిల్లా

**పుల్లడిగుంట :-** గుంటూరు జిల్లా పుల్లడి గుంట ధర్మక్షేత్ర కార్యక్రమంలో భాగంగ నిడుముక్కల గ్రామంలో ఉచిత పశువైద్య శిబిరం నిర్వహించ బడినది. పశుసంవర్ధక శాఖ అధికార్లు డా॥ దుర్గాప్రసాదరావు మాట్లాడుతు పశువులలో వచ్చే వ్యాధులను వాటి యజమానులు గమనించి వెంటనే చికిత్స చేయాలని సూచించారు. నేషనల్ ఇన్సూరెన్స్ కంపెనీ మేనేజరు డా॥ రజనీకాంత్‌గారు శిబిరమునకు కావలసిన మందులను సరఫరా చేసినారు.

తాడికొండ, పల్లపాడు, కొర్నెపాడు గ్రామాలలో శ్రీశ్రీశ్రీ త్రిదండి అష్టాక్షరీ సంపత్కుమార రామానుజ జీయరు స్వామివారు పర్యటించి భగవద్గీత మానవుల సమస్యలకు పరిష్కారమార్గం సూచిస్తుందని చెప్పారు. చిన్నజీయర్ స్వామివారు ప్రారంభించిన గీతాజ్యోతి శ్లోకాలు పారాయణం చేసి విశ్వశాంతి మహా యజ్ఞంలో పాల్గొన వలసినదిగా కోరారు.

ప్రత్తిపాడులోని అన్ని పాఠశాలల విద్యార్థులకు గీతాజ్యోతి శ్లోకాలపోటీలు నిర్వహించినారు. గెలుపొందిన వారికి శ్రీమాన్ గుదిమెళ్ళ కూర్మనాథ్‌గారిద్వారా బహుమతి ప్రదానం చేసారు. విష్ణుసహస్రనామ అవధాన ప్రక్రియ చి॥ డి. రోహితాచార్యులువారు చాలా నూతనంగా ప్రారంభించి అందరిని ఆశ్చర్యచకితులను చేసినారు.

ఈ కార్యక్రమంలో శ్రీమతి బండ్ల కమలమ్మ నరసింహారావు, సాంబశివరావు, పున్నారావుగార్లు, గీతాజ్యోతి కన్వీనరు శ్రీమతి పి. లలిత కుమారిగార్లు పాల్గొన్నారు.

**తెనాలి :-** తెనాలి వికాసతరంగిణి శ్రీమాన్ గుదిమెళ్ళ బదరీనాథ్‌స్వామివారిచే 8వ ధనుర్మాస వ్రత మహోత్సవములు అత్యంత వైభవముగా, నాజరుపేట శ్రీలక్ష్మీనరసింహస్వామివారి దేవస్థానంలో గత 16-12-02 నుండి 14-1-2003 వరకు జరిగినవి.

14వ తేది ఉ॥ శ్రీగోదారంగనాథుల కళ్యాణ మహోత్సవము నిర్వహించుకొని శ్రీ జీయరుస్వామి వారు పిట్టలవానిపాలెంలో నిర్వహిస్తున్న గోదారంగ నాథుల కళ్యాణోత్సవములో పాల్గొన్నారు. 16వ తేదీ తదీయారాధనతో కార్యక్రమం సంపూర్ణమైనది. శ్రీ రావిపాటి వీరనారాయణరావుగారు, రామచంద్ర మూర్తిగారు, జంధ్యం రామారావుగారు, గొట్టిపాటి శేషగిరిరావుగారు, కొత్తమాసు గజలక్ష్మిగారు, భీమవరపు లక్ష్మయ్య సోమషిత కనకమహాలక్ష్మి, అంబాహరి హరరాయలు గారు, తదితరులు కార్యకర్తలుగా విశిష్ట సేవలు అందిస్తూ, పిట్టలవానిపాలెం, గీతాజ్యోతి కార్యక్రమానికి తెనాలి పరిసర ప్రాంతములలో 100పైగా గ్రామాలలో ప్రచారము నిర్వహించి, తెనాలి ధర్మక్షేత్రానికి అంకురారోపణ గావించారు.

## నల్గొండ జిల్లా

**మిర్యాలగూడ:-** నల్గొండజిల్లా మిర్యాలగూడ వికాస తరంగిణిశాఖ ఆధ్వర్యవంలో 16-12-02 నుండి 14-1-03 వరకు హనుమాన్‌పేటలోని శ్రీసీతారామాంజనేయస్వామి దేవస్థానమునందు వైభవంగా నిర్వహించుకొన్నారు. తత్త్వశాస్త్ర ప్రచారకులైన శ్రీమాన్ సి. హెచ్. కుమారరాజావారి ఆధ్వర్యవంలో ఈ కార్యక్రమంలో శ్రీమాన్ మార్గపురి శ్రీనివాసాచార్యులు, పురాణం గోపాలాచార్యులు, సురేష్‌బాబు వెంకటచైతన్య పాల్గొన్నారు.

**నల్గొండ :-** తత్త్వశాస్త్ర ప్రచారకులైన శ్రీమాన్ పీతాంబరం రఘునాథాచార్యస్వామివారి ఆధ్వర్యవంలో నల్గొండలోని రామగిరి శ్రీసీతారామ చంద్రస్వామివారి దేవస్థానంలో ధనుర్మాస వ్రత కార్యక్రమం వైభవంగ నిర్వహించుకొన్నారు. ఇక్కడే కాకుండ పానగల్లు,B.T.S. కాలనీ, షేర్ బంగ్లా ప్రాంతాలలో నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమంలో ఉమా మాధవరెడ్డిగారు M.L.A., సుజాత, సువర్ణ, శ్రీహరి పాల్గొన్నారు.

## ఆదిలాబాద్ జిల్లా

**మంచిర్యాల :-** మంచిర్యాల వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో శ్రీవారి మంగళా శాసనములతో తిరుప్పావై మహోత్సవము వైభవంగ నిర్వహించు కున్నారు.

**నిర్మల్, ఖాన్‌పూన్‌పూర్:-** శ్రీశ్రీశ్రీ స్వామివారి అనుజ్ఞతో తత్త్వప్రచారకులు శ్రీమాన్ శాంతారాంగారు ఈ సందర్భముగా రెండుచోట్ల ధనుర్మాస మహోత్సవాన్ని విజయవంతంగా నిర్వహించారు. ఉదయం భానాపూర్ లోని శ్రీవేంకటేశ్వరాలయంలో సాయంత్రం నిర్మల్, శాస్త్రీయనగర్‌లోని అభయ ఆంజనేయస్వామి ఆలయంలో తిరుప్పావై ప్రవచనాలు అందించారు. ఈ నెలరోజులలో 50 గ్రామాలలో గీతాజ్యోతి కార్యక్రమాన్ని కూడ ప్రచారం చేసారు.

## విజయనగరం జిల్లా

**విజయనగరం :-** విజయనగరం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమం 5 ధర్మక్షేత్రాలలో విస్తృత ప్రచారం జరుగుచున్నది. క్రొత్త ప్రాంతాలలో నెలకు 2 సార్లు చొప్పున గోష్ఠులను గీతాజ్యోతి కార్యక్రమం అందరికి అర్థమయ్యే రీతిలో ప్రచారం చేయడం జరిగినది. స్కూలు విద్యార్థులచేత గీతాజ్యోతి పారాయణం చేయడం జరిగింది.

ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమతి బేబిగారు, శ్రీమతి జానకి, శ్రీమతి తిరువేంగళమ్మగార్లు పాల్గొన్నారు. ధనుర్మాస కార్యక్రమం వైభవంగ జరుపుకొన్నారు.

## ఖమ్మం జిల్లా

**ఖమ్మం :-** శ్రీస్వామివారి మంగళాశాసనములలో ఖమ్మం వికాస శాఖ ఆధ్వర్యవంలో ధనుర్మాస వ్రత కార్యక్రమం నిర్వహించినారు. స్థానిక శ్రీస్వామిగురు నాథ్ కాంప్లెక్స్ నందు శ్రీమాన్ బదరీ నారాయణ స్వామివారి ఆధ్వర్యవంలో 500 మంది భక్తులతో సామూహిక భగవద్గీత పారాయణం చేయడం జరిగింది. వైకుంఠ ఏకాదశిరోజు సాయంత్రం 6 గం॥లకు శ్రీగోదా రంగనాథుల కళ్యాణం వైభవంగా జరుపుకొన్నారు. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి ఛైర్‌పర్సన్ శ్రీ వై. కృష్ణమూర్తిగారు, శ్రీమతి యం. జయప్రదగారు పాల్గొన్నారు.

**నారాయణపురం :-** ఖమ్మంజిల్లా నారాయణ పురం వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో ధనుర్మాస వ్రత కార్యక్రమం జరిపినారు. శ్రీకృష్ణాష్టోత్తరం, శ్రీగోదా అష్టోత్తరం, శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం, గీతాజ్యోతి శ్లోకాలు పఠనకార్యక్రమం జరిగినది. ముక్కోటి సందర్భముగ హరేరామ సంకీర్తనం చేయడం జరిగింది. వికాసతరంగిణి అధ్యక్షులు మందపాటి కేశవరెడ్డి సామ్రాజ్యం ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు.

## జంటనగరముల సమన్వయ కమిటీ నివేదిక

**వనస్థలిపురం :-** మన జంటనగరాలలోని వికాస తరంగిణి శాఖలలో ముఖ్యమైనది వనస్థలిపురం శాఖ. ఈ శాఖ కార్యదర్శి శ్రీమాన్ డా॥ పి. పద్మ నాభరావుగారు జంటనగరాల వికాస తరంగిణి సమన్వయకమిటికి ఆర్గనైజింగ్ సెక్రటరీగాకూడా వ్యవహరిస్తున్నారు. గీతాజ్యోతి కార్యక్రమం ప్రకటించినప్పటినుండి వనస్థలిపురంశాఖ కార్యకర్తలు తమ చుట్టుప్రక్కల గ్రామాలలో, కాలనీలలో చక్కటి ప్రచార కార్యక్రమాన్ని నిర్వహించారు.

98 కాలనీలను, 23 గ్రామాలను తిరిగి 25,000 కుటుంబాలకు గీతాజ్యోతి సందేశాన్ని అందించారు. 75,000 రూ॥లతో గీతాజ్యోతి సామగ్రిని ముద్రించి







ఉచితంగా పంచారు. గీతాజ్యోతి శ్లోకమాలిక పుస్తకాలను, శ్లోకాలను, స్టిక్కర్లను పంచడం, స్కూల్స్, కాలేజిల్లో గీతాజ్యోతి శ్లోకాల పోటీలను నిర్వహించడం వంటి కార్యక్రమాలు నిర్వహించి శ్రీస్వామివారికి తమ 'నివేదిక'ను అందించారు.

శ్రీస్వామివారు నివేదికను పరిశీలించి డిసెంబర్ 11,12 తేదీలకు వనస్థలిపురం ధర్మక్షేత్రానికి కేటాయించారు. తేదీ నిర్ణయం కావడంతో కార్యకర్తలకు ఉత్సాహం రెట్టింపయింది. కమిటీలను, సబ్ కమిటీలను ఏర్పరచుకొని 'గీతాజ్యోతి ధర్మప్రచార రథం'లోనూ, ఇతర వాహనాల్లోనూ 'ధర్మక్షేత్ర' గ్రామాలన్నీ తిరిగి శ్రీస్వామివారి ఆగమన సందేశాన్ని అందించారు. ఇంటింటికీ కరపత్రాలను పంచారు.

వనస్థలిపురం మన జెట్ భవనానికి చాలా దూరం కావడంచేత చాలామంది భక్తులు స్వామి వారిని దర్శించు కోలేకపోయినందుకు బాధపడేవారు. వారి కొఱత తీరే విధంగా శ్రీస్వామివారు వనస్థలిపురం విచ్చేయడం భక్తులకు పరమానందమైంది. డిసెంబర్ 11వ తేదీ మధ్యాహ్నం 5-30 ని॥లకు శ్రీస్వామివారు భక్తుల మంగళహారతులతో, జైశ్రీమన్నారాయణ..! నినాదాలతో స్వాగతం పలుకుతుంటే శ్రీమాన్ పద్మనాభరావుగారి ఇంటికి విచ్చేసారు.

పద్మనాభరావుగారి ఇల్లు శ్రీస్వామివారికి విడిదిగా ఏర్పాటైంది. అక్కడినుండి శ్రీస్వామివారు భక్తబృందంతో కలసి శ్రీసీతారామచంద్రస్వామి దేవాలయాన్ని దర్శించారు. అక్కడ మహా మండప నిర్మాణానికి పునాదిరాయిని వేసి శ్రీస్వామివారు 'శోభాయాత్ర'కు బయలుదేరారు.

**శోభాయాత్ర :** శ్రీసీతారామచంద్రస్వామివారి దేవస్థానం నుండి సాయంత్రం గం॥ 6-30 ని॥లకు 'శోభాయాత్ర' ప్రారంభమైంది. చక్కగా అలంకరించబడ్డ ఓపెన్ టాప్ వాహనంలో శ్రీస్వామివారు వేలాది భక్తులతో కలసి బయలు దేరారు. వనస్థలిపురం ప్రధాన వీథులు, సచివాలయ నగర్, ఎన్.జి.వో.స్. కాలనీ, సెక్టార్ 1&2, జె.సి. సెంటర్, రైతు బజార్, కమలానగర్, ద్వారకామయి నగర్, సుభద్రా నగర్, శారదానగర్, శాంతి నగర్ లమీదుగా శోభాయాత్ర సాగి చివరకు రాజపృనగర్‌లోని మైదానానికి చేరింది. దారిపొడవునా శ్రీస్వామివారికి భక్తులు మంగళహారతులు పట్టారు. భజన బృందాలు, కోలాట బృందాలు, సాంస్కృతిక బృందాలు శోభాయాత్రకు వింత అందాలనిచ్చాయి. నాలుగు కిలోమీటర్ల పర్యంతం సాగిన శోభాయాత్ర 8-30 గం॥లకు ప్రధాన స్థలానికి చేరింది. స్వామీజీ రాకతో ఆ ప్రాంతమంతా 'జైశ్రీమన్నారాయణ' నినాదాలతో మార్మోగింది.

స్థానిక శాసన సభ్యులు శ్రీమాన్ యన్. ఇంద్రసేనా రెడ్డిగారు, మున్సిపల్ ఛైర్మన్ శ్రీమాన్ ఆకుల రమేష్ గౌడ్‌గారు, కౌన్సిలర్లు, కాలనీ నాయకులు ఇతర పెద్దలు శ్రీస్వామివారికి సాదరంగా స్వాగతం పలికారు.

**సాంస్కృతిక కార్యక్రమాలు :** ధర్మక్షేత్ర కార్యక్రమంలో భాగంగా గంటన్నరపాటు సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటయ్యాయి. సెయింట్ మీరాస్ గ్రామర్ స్కూలు, శాంతి నికేతన్ స్కూలు, నవనీ స్కూలు, లయోల స్కూలు, నాగార్జున స్కూలు, సెంట్రల్ స్కూలు, గోల్కొండ లకు చెందిన విద్యార్థులు, ఇతర పాఠశాలల విద్యార్థులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. శ్రీస్వామివారు కార్యక్రమాన్ని దర్శించి విద్యార్థులకు మంగళాశాసనం చేశారు.

**సభాకార్యక్రమం :** సాంస్కృతిక కార్యక్రమాల అనంతరం శ్రీస్వామివారు శాసనసభ్యులు శ్రీమాన్ యన్. ఇంద్రసేనా రెడ్డిగారు, మున్సిపల్ ఛైర్మన్ శ్రీమాన్ ఆకుల రమేష్‌గౌడ్ గారు, శ్రీమాన్ రఘునాథాచార్యస్వామివారు, శ్రీమాన్ కల్కి అవతారంగారు, జంటనగరాల వికాసతరంగిణి శాఖల సమన్వయకమిటీ అధ్యక్షులు, శ్రీమతి వనజా చలపతిరావుగారు, కార్యదర్శి, ప్రొఫెసర్ పురుషోత్తంరావు గారు, జెట్ కార్యదర్శి వేదిక నలంకరించారు.

**'విష్ణుసహస్రనామ వ్యాఖ్యానం' పుస్తక ఆవిష్కరణ**

గోపాలోపాయన పురస్కారాన్ని, ప్రెసిడెంట్ మెడల్ పొందిన ఉభయవేదాంతాచార్యులు శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్య స్వామివారు రచించిన 'శ్రీవిష్ణు సహస్రనామ వ్యాఖ్యాన' గ్రంథాన్ని శ్రీజీయర్‌స్వామివారు ఆవిష్కరించారు. శ్రీస్వామివారి సమక్షంలో వికాసతరంగిణి కార్యకర్తలు రఘునాథాచార్య స్వామివారిని సమ్మానించారు. 'ఈ శతాబ్దంలో అతి ఉత్తమమైన గ్రంథం'గా శ్రీస్వామివారు పుస్తకాన్ని ప్రశంసించారు.

**కృష్ణపూజలు :** పుస్తక ఆవిష్కరణ అనంతరం 1500 మంది భక్తులతో సామూహిక శ్రీకృష్ణ పూజలను శ్రీస్వామివారు నిర్వహించారు. 12,000 మందికిపైగా

భక్తులు, శ్రీస్వామివారి ప్రవచనాన్ని విని ఆనందించారు. శ్రీస్వామివారు వికాసతరంగిణి కార్యకర్తలకు వేదిక పైనున్న పెద్దలకు జ్ఞాపికల నందించారు. కార్యక్రమం ముగిసేసరికి రాత్రి 11-30 గం॥లు అయింది.

**12-12-2002 - తీర్థగోష్ఠి - ఉచిత వైద్య శిబిరం**

భక్తులు ఎంతో శ్రద్ధాసక్తులతో ఎదురు చూస్తున్న 'తీర్థగోష్ఠి' ఉదయం 10గ॥లకు ప్రారంభమైంది. రెండు గంటలపాటు వచ్చిన భక్తులందరికీ శ్రీస్వామివారు తీర్థగోష్ఠి నిర్వహించారు. శ్రీమాన్ పద్మనాభరావుగారింట తీర్థగోష్ఠి కార్యక్రమాన్ని ముగించుకొన్న పిమ్మట శ్రీస్వామివారు 'ఉచిత పశువైద్య శిబిరం'లో పాల్గొనడానికి హయత్‌నగర్ మండలంలోని తుర్కాయాంజల్ గ్రామానికి బయలుదేరారు.

మండల పశువైద్య శాఖ వారి సౌజన్యంతో గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగా పశువైద్య శిబిరం జరిగింది. డా॥ రామచంద్రరావు, డా॥ వేణుగోపాలరావు, డా॥ మాణిక్‌రెడ్డి, డా॥ శ్రీహరి, డా॥ శ్రీనివాస్, డా॥ కోటిరెడ్డి ప్రభృతులు ఈ శిబిరంలో పాల్గొని 200 ఆవులకు, 600 గొర్రెలకు ఉచిత వైద్య సేవలను మందులను అందించారు.

ఈ సందర్భంగ శ్రీస్వామివారు అక్కడకు విచ్చేసిన భక్తుల నుద్దేశించి ప్రసంగించారు. అక్కడి నుండి వస్తూ దారిలో శ్రీస్వామివారు శాంతినికేతన్ మానసిక వికలాంగుల పాఠశాలను దర్శించి, నిర్వాహకులకు, విద్యార్థులకు మంగళాశాసనం చేశారు.

**గీతాజ్యోతి గోష్ఠి సమావేశం** : 108 కాలనీలకు సంబంధించి 2000 మంది కార్యకర్తలతో 'గీతాజ్యోతిగోష్ఠి సమావేశం' శ్రీ సీతారామచంద్ర స్వామివారి దేవస్థాన మైదానంలో మధ్యాహ్నం 2 గం॥లకు ప్రారంభమైంది. వివిధ పాఠశాలలో నిర్వహించిన గీతాజ్యోతి శ్లోకాల పోటీలలో విజేతలైన విద్యార్థులకు శ్రీస్వామివారు బహుమతి ప్రదానం చేశారు.

శ్రీమాన్ పద్మనాభరావుగారు సంకలనం చేసి ముద్రించిన 'నిత్య పారాయణ శ్లోకమాలిక' పుస్తకాన్ని ఈ సమావేశంలో ఆవిష్కరించారు. వికాస తరంగిణి అధ్యక్షులు శ్రీ సి. హెచ్. ఆర్. గోపాలాచారిగారు స్వాగత వచనాలు పలికితే, పద్మనాభరావుగారు తమ నివేదికను అందజేసారు.

శ్రీస్వామివారు 'గీతాజ్యోతి' కార్యక్రమాన్ని కార్యకర్తలకు ప్రవచనాన్ని అనుగ్రహించారు. వనస్థలిపురం శాఖ ఉపాధ్యక్షులు శ్రీ విజయ కుమార్‌గారు వందన సమర్పణ పలకటంతో కార్యక్రమం సుసంపన్నంగా ముగిసింది.

అనంతరం శ్రీస్వామివారు విడిదికి విచ్చేసిన శ్రీ పద్మనాభరావుగారి కుటుంబానికి పాదపూజను అనుగ్రహించి అనంతరం భక్తుల వీడ్కోలు నినాదం మధ్య వైరా బయలుదేరారు.

**కూకట్ పల్లి శాఖ :-** శాఖ తరపున బాలాజీ నగర్‌లో బీదపిల్లల పాఠశాలను 8-12-02 నుండి శ్రీమాన్ చలపతిరావుగారినేతృత్వంలో తిరిగి పునః ప్రారంభించారు. ఈ పాఠశాలలో ప్రస్తుతము 30 మంది విద్యార్థులకు ఒక టీచర్‌ను నియమించి వారికి విద్యాబోదనను చేయుచున్నారు. వారికి గీతాజ్యోతి శ్లోకపఠనమును, సుమతి శతకములు, దేశభక్తి గేయములను నేర్పిస్తున్నారు. 16-12-02 నాడు బాలాజీనగర్ అభిమన్యు పబ్లిక్ స్కూల్‌లో గీతాజ్యోతి శ్లోక పఠనపోటీ నిర్వహించి వారికి భగవద్గీత పుస్తకములను ఇచ్చినారు. జనవరి ఆఖరి వారంలో MNR హైస్కూల్‌లో గీతాశ్లోకపఠన పోటీలు నిర్వహించుటకు ఏర్పాటు చేయుటము జరిగినది. కూకట్‌పల్లి వికాసతరంగిణి పరిధిలోని రామాలయ ములో, వివేకానంద నగర్‌లోని వెంటేశ్వరాలయంలో తిరుప్పావై సేవాకాలము, తిరుప్పావై ప్రవచనము అతి వైభవముగా జరిగినది. 14-1-03నాడు సహస్ర నామ పుస్తకములను భక్తులకు పంచారు.

**అంబర్‌పేట :-** 16-12-02 నుండి 14-1-03 వరకు నెలరోజులపాటు చెన్నారెడ్డినగర్‌లోని శ్రీసీతా రామాంజనేయ స్వామి దేవాలయములో ధనుర్మాస ఉత్సవాలు అతి వైభవముగా జరిగాయి. శ్రీమాన్ ఉ.వే. ఆచ్చి శ్రీనివాసాచార్యులుగారు నెలరోజులపాటు ప్రతిరోజు సాయంత్రం తిరుప్పావై ప్రవచనమును భక్తులకు అందించినారు. 13-1-03 నాడు గోదారంగనాథుల కళ్యాణం జరిపించి, రాత్రి 12 గం॥లకు మంగళా శాసనములతో వైకుంఠ ఏకాదశి సందర్భముగా ఉత్తర ద్వారదర్శనం తదుపరి మానస సరోవర యాత్ర సిడి.ని భక్తులకు ప్రదర్శించారు.

**చార్మినార్ వికాసతరంగిణి శాఖ :** 23-7-02 నాడు ప్రారంభించిన ఈ శాఖలో ప్రస్తుత సభ్యుల సంఖ్య 40. ఈ శాఖ శ్రీ శారదా బాలికోన్నత పాఠశాలలో శ్రీసరస్వతి శిశుమందిర్‌లో 1500 మందికి ఉచిత నేత్ర దంత వైద్య శిబిరమును నిర్వహించినారు. 5 కాలనీలలో శ్రీరాంనగర్, గౌలిపుర, ఉప్పుగూడ, పూల్‌భాగ్, ఆలియాబాద్ కాలనీలలో గీతాజ్యోతి ప్రచారం కావించటం జరిగినది. 8 మంది కార్యకర్తలు ఎ.వి. కాలేజ్‌లో గోదాకళ్యాణం జరిపించినారు. శ్రీ సీతారామ చంద్ర స్వామివారి ఆలయములో తిరుప్పావై కార్యక్రమమును అతి విశేషముగా







వైభవముగా జరిగినది. 108 మంది వెండి దీపాలను ఇచ్చి వాటి ద్వారా దీపోత్సవము జరిపించారు.

**శ్రీ విజయలక్ష్మీ దేవాలయం :** ఈ నెల 6 కాలనీలలో గీతాజ్యోతి ప్రచారమును కావించి గీతాజ్యోతి శ్లోకమాలికలను అందిచారు. వైకుంఠ ఏకాదశినాడు భగవద్గీత యజ్ఞము నిర్వహించారు. ధనుర్మాసంలో ప్రతిరోజు తిరుప్పావై ప్రవచనము జరిపించారు. ఈ సందర్భముగా 50 మంది భక్తులు శ్రీకృష్ణపూలలో పాల్గొని శ్రీకృష్ణపరమాత్మ కృపకు పాత్రులయినారు.

**సంతోష్‌నగర్ శాఖ** : శ్రీ వెంకటేశ్వరస్వామి దేవాలయములో శ్రీమతి పరవస్తు కమలగారిచే తిరుప్పావై ప్రవచనము నెలరోజులపాటు వైభముగా జరిపించారు. తేది 19-12-02 రోజున, 2-1-03 రోజున శ్రీకృష్ణపూజలు నిర్వహింపజేశారు. 13-1-03నాడు గోదాకళ్యాణం సందర్భముగా శోభాయాత్ర నిర్వహించారు. బంపాట, శ్రానిది కాలనీలలో, మారుతీనగర్‌లలో తిరుప్పావై ప్రవచనము సాగించినారు.

ఎ.వి. కాలేజ్‌లో జెట్ ఆధ్వర్యవంలో నిర్వహించిన గోదాకళ్యాణములో 150 జతల మంగళ సూత్రములను, 150 మందికి ఉత్తర జంధ్యములను, రూ. 2500/- విలువ గలవి అందించారు.

**రామాంతపూర్ :** రామాంతపూర్ పరిధిలోగల శ్రీరామాలయము శ్రీసత్యనారాయణస్వామి దేవాలయము ఆంజనేయస్వామి దేవాలయములలో ధనుర్మాస కార్యక్రమములు అతి వైభవముగా జరిపినారు. 5-1-03నాడు పల్స్ పోలియో కార్యక్రమంలో కార్యకర్తలు పాల్గొని తగు సేవలందించినారు.

**మాసబ్‌ట్యాంక్ :** మాసబ్ ట్యాంక్ శ్రీవేంకటేశ్వర స్వామి దేవాలయములో ధనుర్మాస ఉత్సవాలను ఆలయ కమిటీవారి సహాయ సహకారాలతో అతి వైభముగా జరుపుకున్నారు. శ్రీమతి మంజులశ్రీగారు ఈ కార్యక్రమాన్ని నిర్వహింప జేశారు. ప్రతిరోజు ఉదయం తిరుప్పావై ప్రవచనము అందించారు. 14-1-03న గోదా కళ్యాణం అతి వైభముగా జరుపుకున్నారు. నేతాజీ కాలనీ, రింగ్‌రోడ్, మొహదీ పట్నంలలో గీతాజ్యోతి కార్యక్రమ ప్రచారము కావించినారు. ఉచిత దంతవైద్య శిబిరమును నిర్వహించినారు.

**చెన్నై :-** చెన్నై వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగా 25 పాఠశాలలో బాలబాలికలకు 48 శ్లోకాలను కంఠస్థపోటీలు నిర్వహించడం జరిగింది. అంతేగాక 6వ తరగతి నుండి 10వ తరగతి వరకు బాలబాలికలకు గీతాజ్యోతి చిత్రలేఖన పోటీలను నిర్వహించినారు. విజేతలైన విద్యార్థులకు బహుమతి ప్రదానం చేయడం జరిగినది. సాలగ్రామంలోని కావేరి పాఠశాలల నందలి విద్యార్థులకు దంతవైద్య శిబిరం, **ENT**శిబిరములు నిర్వహించినారు. మీనాక్షి అమ్మన్ దంత కళాశాలలో 10 మంది డాక్టర్లచే 1000 మంది విద్యార్థులకు పరీక్షలు జరిపి మందులు పంపిణీ చేయడం జరిగింది.

ధనుర్మాస ఉత్సవాలు శ్రీరంగ దేవస్థాన ఆస్థాన పురోహితులు శ్రీపరాశర లక్ష్మీనరసింహ భట్టాచార్యస్వామి వారిచే వైభవంగ ప్రారంభించబడినవి. వికాస తరంగిణి చైర్‌పర్సన్ శ్రీమతి ప్రేమధాత్రిరావు ఇతర ముఖ్య కార్యకర్తలు పాల్గొన్నారు.

**దావణగెరె:-** దావణగెరె వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో 16-12-02 నుండి 14-1-03 వరకు ధనుర్మాస వ్రత కార్యక్రమం వైభవంగ జరుపుకున్నారు. తత్వ ప్రచారకులైన శ్రీ సూర్యకుమారిగారి ఆధ్వర్యవంలో నిర్వహించినారు. వికాసతరంగిణి చైర్‌పర్సన్ శ్రీమాన్ వీరభద్రరావు గారు, ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు.

## జంటనగరాలలో నిర్వహించిన ధనుర్మాస వ్రత కార్యక్రమము

శ్రీస్వామివారి మంగళాశాసనములతో జెట్ కమిటి వారి ఆధ్వర్యవంలో డిసెంబర్ 15వ తేదీ సా॥ 6-30 గం॥లకు శ్రీమాన్ PVRKప్రసాద్‌గారు ముఖ్యఅతిథిగా అవతారికా కార్యక్రమంతో ఎంతో వైభవంగ ప్రారంభమైనది. శ్రీమాన్ శ్రీభాష్యం శ్రీనివాసాచార్యస్వామి వారు తమ మృదు మధుర ప్రవచనములను ఆరంభించారు.

అతి సుందరంగ మణిదీపపు కాంతుల మధ్య భగవంతుడికి మంగళాశాసన 'అన్నివ్వళగం' కైంకర్యాన్ని భక్తులంత కలసి రమ్యంగ అనుభవించారు. ఈ కార్యక్రమములో శ్రీమాన్ DS మూర్తిగారుIAS, చెన్నారెడ్డి మానవవనరుల అభివృద్ధి చైర్మన్, ఎండోమెంట్ కమీషనర్‌గారు, శ్రీమతి లక్ష్మిగారు శ్రీమాన్ GM రవీంద్రగారు, రెడ్డిల్యాబ్స్, శ్రీమతి డా॥ శోభారాజ్‌గారు ముఖ్య అతిథులుగ పాల్గొన్నారు.

14వ తేదీన శ్రీగోదారంగనాథుల వేడుకలు వైభవంగ జరుపుకొన్నారు. శ్రీమతి శ్రీకుమారి రామేశ్వరరావుగారి స్వాగతంతో ప్రారంభమై శ్రీమాన్ పురుషోత్తమరావుగారు సభ నిర్వహించడం జరిగింది. కార్యక్రమాన్ని శ్రీమాన్ శ్యామ్ మోహన్‌గారు, శ్రీమాన్ పి. వెంకటేశ్వర్లుగారు పెద్దలు పాల్గొన్నారు.




## విషయ సూచిక .....



## పంచాంగ వివరాలు

### మార్చి

4 యాదగిరి శ్రీలక్ష్మీనరసింహస్వామి వారి బ్రహ్మోత్సవారంభం

6 చవితి తిథి

7 శూన్య తిథి

8 పంచమి తిథి

11 తిరుక్కచ్చి నంబి తిరు॥
యాదగిరి శ్రీలక్ష్మీనరసింహ స్వామివారి కళ్యాణోత్సవం

12 యాదగిరి శ్రీలక్ష్మీనరసింహస్వామి వారి రథోత్సవం

13 కులశేఖరాళ్వార్ తిరునక్షత్రం

14 మీన సం॥ తె 4-2
సర్వేషామేకాదశి

16 కామదహనం

18 హోళి పండుగ

19 తిథి ద్వయం

20 తదియతిథి

28 సర్వేషామేకాదశి

### ఏప్రిల్

1 సర్వేషాం అమావాస్య

2 శ్రీ స్వభాను సంవత్సరాది ఉగాది, వసంత నవరాత్రారంభం
పెరియ పెరుమాళ్ తిరునక్షత్రం

6 మత్స్య జయంతి

11 శ్రీరామనవమి భద్రాచలం
శ్రీ సీతా రామచంద్రస్వామివారి కల్యాణోత్సవం


మా సేవలో....

**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 272929,
చందా: సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-,
విదేశాలకు సంవత్సరచందా $ 25,
E-mail : bhakthinivedana@yahoo.co.in Internet : www.chinnajeeyar.org
D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం,






# భక్తినివేదన




చిత్రభాను నామ సంవత్సరం ఫాల్గుణ మాసము

**సంపుటి 55 2003 మార్చి సంచిక 12**

వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు
**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు :

శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. **శ్రీరామచంద్రాచార్యులు**

# ఆర్జవం
(సంపాదకీయం)

మనిషికి ఉండవలసిన గుణాలలో అత్యావశ్యకమైనది ఆర్జవం. సాధారణంగా గుణాలు ఎక్కడైనా వెతుక్కోవల్సినవే. అంత సులభాలు కావు. అందునా ఈ ఆర్జవాన్ని చూడటం మరీ కష్టం.

ఆర్జవం అంటే ఋజువర్తనం. మనో-వాక్-కర్మలలో ఏకరూపంగా ఉండటం. దీన్నే త్రికరణ శుద్ధి అంటాం.

జంతువులు మనసులో భావించిన దాన్నే 'ధ్వనుల' ద్వారా వ్యక్త పరుస్తాయి. దానికి తగినట్టు ప్రవర్తిస్తాయి. మనష్యులకున్నట్టు స్పష్టమైన, సమర్థమైన వాక్కు వాటికి ఉండక పోవచ్చు. కాని తమ మనోగతాన్ని ఏవో అవ్యక్త ధ్వనులద్వారా అవి ప్రకటించటం చూస్తూనే ఉంటాం.

కుక్కకుసంతోషం కలిగింది. కుఁయికుఁయి మంటూ తోకాడిస్తూ వెనక వెనకే తిరుగుతుంది. కోపం వచ్చిందీ, భౌ.. భౌ.. మంటూ మీదపడి కండలు పీకుతుంది. ఏమీ దాచుకోదు.

మనిషి దగ్గరే వస్తుంది చిక్కు. వీడికి మనసుంది, మాటుంది. చేతా ఉంది. అయితే ఈ మూడూ ఒక్కలా ఉండాలని మట్టుకులేదు. మిగిలిన ప్రాణులకంటే మనిషిలో కనవచ్చే వైలక్షణ్యం ఇది.

మనసులో తాను భావన చేసినదొకటైతే దానికి విరుద్ధ భావనతో తానున్నట్టు మాటలాడ గలడు మనిషి. మాటకు విరుద్ధంగా ప్రవర్తించ గలడు. ఇదే వీడి గొప్ప.

మనోవాక్కర్మలలో ఏకరూపంగా ఉన్నవాణ్ణి సజ్జనుడని, మూడిటా మూడు రకాలుగా ఉన్నవాణ్ణి దుర్జనుడనీ నీతివేత్తలు నిరూపించే రనుకోండి. చమత్కారమేమిటంటే మూడిటా మూడు గుణాలుగా ఉంటూ ఏకరూపంగా ఉన్నట్టు జనాన్ని నమ్మించటం వీరి గొప్పతనం. జనం సజ్జనులనీ, ఋజువర్తనలనే వీళ్ళను విశ్వసిస్తుంది. వీరు మట్టుకు విశ్వసనీయ వర్తనులుకారు తమ ప్రతిభచేత జనానికి వారు అలా కనవచ్చేట్టు వర్తిస్తారు. వీరితోనే పెద్దచిక్కు.

భావనియంత్రణం, క్రియానియంత్రణం వీడు అభ్యసించిన విద్యలు. కలిగిన భావాన్ని అణచుకోగలడు. ఒక భావం ఏర్పడితే మరో భావం ఏర్పడినట్టు ప్రకటించగలడు. ప్రవర్తించ నూగలడు. ఇవి నటునిలో ఉంటే వాడు బాగా రాణిస్తాడు. మిగిలిన వారిలోనూ భావగోప కాదులు సందర్భాన్ని పట్టి ఔచిత్యం కోసం ఆవశ్యకతే కాదనం.

కాని నియంత్రణం వేరు. అన్యధా ప్రకటనంవేరు. కౌటిల్యం స్పృహణీయం కాదు. నటన రంగస్థలం మీద రాణిస్తుంది. జీవితం లోనూ నటిస్తారు కొందరు. అది నిసర్గమే అని ఇరువురూ నమ్మిస్తారు. నటుడు రంగస్థలం మీద పరిమిత సమయంలో నటిస్తాడు. నటిస్తున్నట్టనిపించకుండా. వీరు జీవితమంతా నటిస్తూనే ఉంటారు. అసంఖ్యాక జనాన్నీ కాస్తా





నమ్మిస్తూ, వీరు నిసర్గనటులు. రంగనటులు శిక్షాభ్యాస పాటవంవల్ల ఆరితేరిన వారవుతారు. వీరికా అవశ్యకత లేదు. తాము మనోవాక్కర్మల ఏకరూపంగా లేకుండా, అన్యోన్య విరుద్ధంగా ఉంటూనే త్రికరణశుద్ధిగా ఉన్నట్టు జనాన్ని అరకొరలు లేకుండా జంకుకొంకులు లేకుండా నమ్మించగలరు. అదీ వీరి నిసర్గ నైపుణి.

కొందరు లోకజ్ఞత పేర ఇల్లా ప్రవర్తిస్తారు. కొందరు జన్మ సంస్కార ప్రభావం వల్ల ప్రవర్తిస్తారు.

ఎంత విద్యావంతులయినా, ప్రాజ్ఞులయినా, ప్రముఖులయినా దీనికి అతీతులుకారు. అయితే వారు సామాన్యులకు సామాన్యంగా దొరకరు. అదే వారి కౌశలం. ప్రతిభ ఋజు వర్తనలు లేరని మా తలపుకాదు. అరుదని విన్నపం.

సత్యాన్ని పలుకు. అది ప్రియం, హితం, అనుద్వేగకరం కావాలి. అనికదా ఆర్యోక్తి. గుడ్డి వాణ్ణి గుడ్డివాడని నీ ఆర్జవాన్ని ప్రకటించుకో మనటంలేదు. అది ఆర్జవమూ కాదు.

లోకహితాన్ని తాను ఎదలో భావించాలి. దాన్నే ప్రియంగా పలకాలి. దీనికి తగినట్టు అనుద్వేగకరంగా ప్రవర్తించు. ఇదీ త్రికరణ శుద్ధి.

త్రికరణాలు ఏకరూపత మట్టుకుచాలదు. అది ఉద్వేజకం కాకుండా ప్రియంగా హితకరం కావాలి. అప్పుడే ఆ ఏకరూపతకు సార్థకత. ఇట్లాంటి ఋజువర్తనులు లోకంలో కనపబడటం కష్టం.

నిసర్గ ఋజువు భగవంతుడొక్కడే.

**వశీ, వదాన్యో గుణవాన్, ఋజుశ్శుచిః**
**మృదుర్దయాలుర్మధురస్థ్సిరస్సమః।**
**కృతీ కృతజ్ఞ స్త్వమసి స్వభావతః**
**సమస్త కళ్యాణ గుణా మృతోదధిః॥"**

అని ఋజుత్వాన్ని కల్యాణగుణంగా అభివర్ణిస్తారు యామునులు. ఇది భగవానునికి స్వభావం.

మిగిలిన వారు విద్యా, సంస్కార, సాంగత్య, సాధనల ద్వారా సముపార్జించుకోవాలి దీన్ని.

జంతువులలోనూ ఆర్జవం ఉంటుంది. అయితే అది మొరటుగా ఉంటుంది. ఉద్వేజకంగా ఉంటుంది.

మనిషిలో ఆర్జవం సుకుమారంగా, సుఖావహంగా ఉండాలి. అప్పుడే అది స్పృహణీయం. అట్లాంటి ఆర్జవాన్ని భగవంతునిలో దర్శించేరు మనవారు.

కల్యాణగుణంగా సర్వులూ సంతరించుకోవాల్సిన స్పృహణీయ గుణం 'ఆర్జవం' ప్రయత్నించుదాం దాన్ని సముపార్జించుకోవటానికి.

సహస్రదీధితుల చిత్ర చిత్రంగా జనావళిని అలరించి సెలవు తీసుకు వెళుతున్న '**చిత్రభానువు**'కు కృతజ్ఞతాంజలి ఘటిస్తూ....

విశ్వానికి వెలుగుబాట చూపవస్తున్న '**స్వభానువు**'కు స్వాగతాంజలి సమర్పిస్తున్నా

"భక్తినివేదన" పాఠకులకు నూతన సంవత్సరాది శుభాకాంక్షలతో.....

**- శ్రీరామచంద్రాచార్య**



# ఆంధ్రప్రభ సంపాదకీయం



N.Ch. Sri Rama Iyengar
Accounts Officer (Central) Retired.
40-232, Raghavendra Nagar,
Moula-Ali, Hyderabad-500040
Phone. 040-27123614.

**ఆంధ్రప్రభ**

సంపాదక మహాశయులకు,

నమస్కార పురస్సరంగా,

అయ్యా!

భావ ప్రకటనా స్వాతంత్ర్యం మీకు మాత్రమే జన్మహక్కనీ, తద్వినియోగంలోనూ నిత్యసత్యాన్వేషణలోనూ ఎంతటివారినైనా ఉపేక్షించేదిలేదనీ దండోరావేసి మరీ చెప్పింది 2003 జనవరి 19 ఆంధ్రప్రభలో "చిన్న జీయరు-పెద్ద కబుర్లు" శీర్షికతో వెలువడిన సంపాదకీయం. స్వర్గీయ నార్ల వెంకటేశ్వర రావు, నీలంరాజు వెంకట శేషయ్య, పురాణం సుబ్రహ్మణ్యశర్మ మొదలైన పూర్వ సంపాదకులెవరూ ఇంతటినిరంకుశ స్వేచ్ఛను ప్రదర్శించిన నిదర్శనం లేదు. మీ సాహసం అపూర్వం, అభినందనీయం.

మీ విమర్శలోని వాస్తవాలనూ నిష్పాక్షికతనూ పరామర్శించటమే ఈ లేఖలోని ఉద్దేశ్యం. మన ఇరువురి వాదనలలోని, ప్రతిపాదనలలోని లోతుపాతులను, లోటుపాట్లనూ గుణగ్రహణ పారీణులు, రసజ్ఞులైన పాఠకులే నిర్ణయించ గలరు.

మీ శీర్షికకి ప్రేరణ "చిన్న నోటికి పెద్ద మాటలు" అనే లోకోక్తి అని ఎవరికైనా స్ఫురిస్తుంది. ఇది నిమ్నస్థాయివారు వారి శక్తికీ యోగ్యతకూ అర్హతకూ మించిన విషయాలను గురించిగాని, పెద్దలను గురించిగాని వ్యాఖ్యానించినప్పుడు వారికి మందలింపుగా వాడే సామెత.

ఇక్కడ 'చిన్న' అనే పదం నీచమైన స్థాయినీ అనర్హతనీ సూచిస్తుంది. మతమార్పిడు లను గురించిన చర్చ సందర్భంగా చిన్న జీయరు అనే వ్యక్తినిగాని, ఆ పేరులోని 'చిన్న' అనే పదాన్ని గాని ప్రయోగించటంలోని ఔచిత్యాన్ని పాఠక మహాశయులు తప్పక గుర్తిస్తారు. వెంపటి చిననత్యం నాట్యంలో పెద్ద తప్పటడుగు వేశాడనో, షేక్ చినమౌలానా నాదస్వరం వాదనలో పెద్ద అపశ్రుతి పలికించాడనో పత్రికా సంపాద కత్వమే ఆల్‌రౌండ్ అర్హతగా స్వంత భావాన్ని విమర్శగా ప్రకటించినట్టే ఉంది మత విష యాలపై జీయరుస్వామివారు చిన్నవారనే మీ అభిప్రాయాన్ని పెద్దగా చూపించే ప్రయత్నం. పత్రికారంగం మిగతా అన్ని రంగాలపై వీరంగానికి వేదిక అనే భావన అహంభావన.

'కాకి చేత కబురంపటం', చావు కబురు చల్లగా చెప్పటం', 'పోచికోలు కబుర్లు' మొదలైన వాడుకలో ఉన్న ప్రయోగాలలో 'కబురు' అనే పదం ఏ అర్థంలో వాడబడుతోందో అందరికీ తెలిసిన విషయమే, బుద్ధి పూర్వకంగా పెడ ప్రయోగం చేసిన మీకు తప్ప. జీయరుస్వామి వారి ప్రవచనాన్నిగాని, అనుగ్రహభాషణాన్ని గాని, శ్రీసూక్తినిగాని 'కబుర్లు'గా వ్యవహరించటం, "చిన్న జీయరు-పెద్ద కబుర్లు" అనటంలో ఉద్దేశించిన వ్యంగ్యం, వ్యక్తికి ఉచిత గౌరవం ఇస్తూనే వారి అభిప్రాయంతో భేదించ వచ్చుననే కనీస సంస్కార రాహిత్యాన్ని తెలియ





జేస్తుంది. ఆంగ్ల భాషాప్రయోగం Loud mouthకి మీ అనువాద ప్రాభవమై ఉంటుంది. ఇది శీర్షిక వైశిష్ట్యం. వైలక్షణ్యం.

ప్రతిపద రసాభాసమైన మీ సంపాదకీయంలో ఒప్పులెక్కడున్నాయో గాలించినా పట్టుకోవటం దుర్లభం. "ఆధ్యాత్మిక ప్రపంచంలో భక్తులందరూ శ్రద్ధాళువులై త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి బోధలను వినడం పరిపాటి" ఇది మొదటి వాక్యం. ఈ వాక్యంలోని ప్రతి అక్షరమూ సత్యమేనని మీరు త్రికరణ శుద్ధిగా నమ్మి నట్లయితే ఇంతమంది భక్తులకు ఆరాధ్యుడైన వ్యక్తిని కించపరిచే వ్రాతలు వారి మనో భావాలను దెబ్బతీస్తాయని తోచలేదా? సల్మాన్ రష్దీ రచించిన "శాటానిక్‌వెర్సెస్" ముస్లింలు కూడా ఉన్న ఎన్నో దేశాల్లో లభిస్తుండగా అల్ప సంఖ్యాక వర్గంవారి మనో భావాలు దెబ్బతింటాయనీ, దాన్ని హిందూ దేశంలో నిషేధించి తీర వలసిందేననీ మిగతా సెక్యూలరిస్టులతో పాటు వాదించి సాధించిన మీకు అధిక సంఖ్యాకుల మనోభావాలు ఎన్ని దెబ్బలు తిన్నా ఫరవా లేదనిపించిందా? ఈ ఆటలు ఇకపైన ఎంతమాత్రం సాగబోవని తేల్చి చెప్పింది గుజరాత్ ఎన్నికల ఫలితం. అది మీకు బాధ కలిగిస్తోందే కాని బోధ కలిగించలేదు. పరిశీలనకీ, పరిశోధనకీ, యథార్థానికీ, పదార్థానికీ, తిలోదకాలిచ్చి అచ్చులో మనం ఏం చెబితే జనం అదే సత్యమనుకుంటారనే ధైర్యం తద్దిన పత్రికలకు మాత్రమే చెల్లుతుంది. ఆధ్యాత్మిక ప్రపంచంలో భక్తులందరూ శ్రద్ధాళువులై ఏకోన్ముఖంగా జియ్యర్‌స్వామి బోధలను వింటారనటం సత్యదూరం కాదా? అద్వైతులు, స్మార్తులు, శాక్తేయులు, సాంఖ్యులు, మధ్వులు, ఎందరెందరో బాబాల భక్తులు అందరూ శ్రద్ధాళువులై శ్రీజీయర్‌స్వామి బోధలు వినటం పరిపాటా? ముస్లిం, క్రిస్టియన్, సిక్కులలో భక్తులేలేరా? ఉంటే వారు ఆధ్యాత్మిక ప్రపంచంలో వారు కారా? తెలిసీ తెలియని నరులు మాత్రమే ఈ విధంగా నిర్ద్వందంగా ప్రతిపాదించగలరు.

పరిణామక్రమంలో తమ హద్దు పద్దు లెరుగక పోవటమే ఆధ్యాత్మిక లౌకిక సరి హద్దులు నిర్ణయించబోవటం "జీయరు స్వామి ఇటీవలి కాలంలో ఆధ్యాత్మిక సరి హద్దులు దాటి లౌకిక సరిహద్దులను కూడా తడుతూండడం శుభ పరిణామం" ఇది తల క్రిందులుగా ప్రపంచాన్ని చూసే సంపాదకుల మరొక వాక్య విన్యాసం. జీయరు స్వామి మాత్రమే కాదు ఏ ఆచార్య పురుషుడైనా లౌకికంలోంచే ఆవిర్భవిస్తారు. జీయరుస్వామి వారి కర్మభూమి మనందరం తిరుగాడే ప్రపంచమే. సామాన్యమానవులను ఉద్ధరించి, కర్తవ్యం బోధించి, వారి ఉజ్జీవనానికి తోడ్పడటం జీయర్‌స్వామివారి కఠోరదీక్షలో ముఖ్యభాగం. వారి నడవడి మనకు ఒరవడి. **'రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతాం అభివర్ధతామ్'** అనేది వారి ఆదర్శం. **రహస్యమైన మంత్రాన్ని వెల్లడి చేసినందు వల్ల తాను నరకానికి పోయినా సరే! వేలాది పామరజనులు తరించాలని గోపురంపై నిల్చుని కులమత భేదం లేకుండా అందరికీ అష్టాక్షరీ మహామంత్రాన్ని బహిరంగంగా ఉచ్చైస్వరంతో ఉపదేశించటమే కాక తరతమ భేదం లేకుండా సర్వులకూ వేయి ఏండ్ల క్రితమే ఆలయ ప్రవేశం కల్పించిన భగవద్రామానుజుల మార్గంలో నడిచే జీయర్ స్వామివారికి**

"మీ ఆధ్యాత్మిక సరిహద్దులు దాటి మా లౌకిక సరిహద్దులు తట్టిన శుభతరుణం"లో అంటూనే వాఘా చెక్‌పోస్ట్ వద్ద భారత ప్రధానికి స్వాగతం పలికి వెనుకనే కార్గిల్ వ్యూహం అమలు జరిపిన మిత్ర దేశంలాగా ఈ శుభ పరిణామాల్ని విపరీత వ్యాఖ్యానాలతో వక్రీకరించి యుద్ధకాండకు అంకురార్పణ చేస్తున్న మీ ప్రభకూ, ప్రతిభకూ జోహార్లు. బురదలో పుట్టి, బురదనించే శ్వాసిస్తూ, తూడు వలె నీటిలో మట్టం వరకూ మునిగి ఉన్నా, సూర్యమండలాంతర్వర్తి అయిన శ్రీమన్నారాయణుని వైపే ఉన్ముఖమైన వేయి రేకుల పద్మంలాంటివారు శ్రీజీయర్ స్వామి వారు. పంచతంత్రం కథలు ప్రతితరగతి లోనూ చదివినా నేలమీద జల్లిన నూకలకు ఆశపడి వలలో చిక్కుకున్న పావురాలలాగా ఇతరులు స్వప్రయోజనం కోసం చూపించే ఎరలకు, మేధావుల కుహనా లౌకిక వాదానికీ ఆకర్షితులమౌతున్న మాలాంటి జనసామాన్యాన్ని అధ్యాత్మ చింతన ద్వారా ఉజ్జీవింప జెయ్యటానికి అందరి శ్రేయస్సు కాంక్షించి అహరహం తపిస్తున్న ఔదార్యమూర్తి, అపార కరుణాసముద్రులు శ్రీ జీయర్ స్వామివారు. మా అందరి అభ్యుదయం కోసమే దుర్యోధనాదులు త్రాళ్ళతో బంధించటంలాంటి క్రూర చర్యలకు దిగుతారని తెలిసినా పాండవుల పక్షాన దూతగా వెళ్ళిన శ్రీకృష్ణ పరమాత్మని తలపిస్తూ బలవంతంగా మతమార్పిళ్ళకు పాల్పడుతున్న వారిలో సహృదయులకి తమ విన్నపం చేశారు. వ్యక్తిగత దూషణతో నిండిన ఇటువంటి సంపాదకీయాన్ని కూడా శిశుపాలుడి ఉద్ధతినిలాగా సహించారు.

యాదృచ్ఛికమే ఐనా అయోధ్యలో ప్రారంభమైనది కిష్కింధకాండ అని భూత భవిష్యద్వర్తమానాలకు చక్కగా అన్వయించే ఉపమానం చెప్పారు. భౌగోళికంగాఅయోధ్యకూ కిష్కింధకూ మధ్యదూరం మీ అంచనాకు అందకపోయినా మీ భావం మాత్రం సుస్పష్టం. బహుశా ఆ వానర మూకల తోకలకు నిప్పంటించటమే సరైన శిక్ష అని మీవంటి లౌకికవాదులు చేసిన సూచననే గోద్రాలో అమలు జరిపి ఉంటారు. లంకా దహనం అనంతరం అనివార్య పరిణామమని హ్రస్వదృష్టికి తోచకపోవటం రామాయణం తప్పుకాదు. కిష్కింధ అగ్నిసాక్షిగా చాచిన స్నేహహస్తానికీ, చేసిన వాగ్దానాన్ని ప్రాణాలకు తెగించి నిలబెట్టుకోటానికీ ప్రతీక. దయచేసి గుర్తించండి! పవిత్రతకి భంగం కలిగించాలను కున్నవాడు ముల్లోకాలనూ గడగడలాడించిన బలవంతుడైనా సరే వాడి తలదన్నగల వాడు కిష్కింధాపతి. ఇది కఠోర సత్యం.

మీరు వర్ణించిన కిష్కింధకాండ నాటికి కేంద్రంలో ఉన్నది కాంగ్రెస్ ప్రభుత్వం. దాని తర్వాత పరివార్ ప్రాబల్యంలేని మూడు ప్రభుత్వాలు గద్దెనెక్కాయి. దిగాయి. ఈ ప్రభుత్వాలుగాని దేశంలోని లౌకిక వాద మేధావులుగాని గొంగళిని వేసిన చోటునుంచి కొంచెమైనా కదపటానికి ఎలర్ట్ కాకపోవటం గమనార్హం. ఏ ఘరానాకి చెందిన స్వాములైనా అనైతికంగా ప్రలోభపెట్టి బలవంతంగా జరిపే మతమార్పిడులను ఏనాడూ ఆమోదించలేదు. మీ పరిభాషలో కిష్కింధకాండ నాటినించి 2003 జనవరి 17 వరకూ "ఈలోగా" చాలా స్వల్పకాలం. జీయరు స్వామివారూ మిగిలిన పీఠాధిపతులు గొంగళిదానంతటి అదే కదిలే





దాకా ప్రమత్తులై మత్తుగా పడి ఉండాలని మీ అభిమతం.

మీరు ఈ సంపాదకీయంలో 'చర్చి'ంచదలచిన విషయం మతమార్పిడు లైనప్పుడు అయోధ్య ప్రస్తావన అప్రస్తుత మనిపించకపోవటం అనల్పవంచనా శిల్ప నైపుణ్యానికి ప్రత్యక్ష నిదర్శనం. జయలలిత తమిళనాడులో తెచ్చిన బిల్లు "బలవంతపు మతమార్పిళ్ళను" నిషేధిస్తుంది. ఐచ్ఛికంగా జరిగే మతమార్పిడికి అది వర్తించదు. ఈ విషయాన్ని సంపాదకీయంలో స్పష్టం చెయ్యకపోగా బిల్లు పేరునే వక్రీకరించి మభ్యపెట్టటంలోని అంతరార్థమేమిటో వివరిస్తారా? ఈ చట్టం రాజ్యాంగ సూత్రాలకి అనుగుణంగానే ఉందని న్యాయస్థానం ఇచ్చిన తీర్పు మీకు గుర్తుండక పోదు. రాజ్యాంగం, శాసనసభ, న్యాయస్థానం వీటిలో దేనిమీదా మీకు నమ్మకం లేకపోవటం వాటి విజ్ఞతను శంకించటం ఆరోగ్యకర పరిణామం కాదు. బలవంతంగా మతమార్పిడి చేయించటానికి ప్రయత్నించటం ఎవరికీ ప్రాథమికహక్కు కాదని తేల్చిచెప్పింది న్యాయస్థానం. మతమార్పిడి తనంతతాను చేసుకోవటం తప్పుకాదు. చేయించటం నేరం. ఇందులో ఆక్షేపణకి తావులేదు.

ఆత్మహత్య ఐచ్ఛికమే ఐనా శిక్షాస్మృతిలో నేరంగా పరిగణింపబడుతోంది. ఐచ్ఛికంగా పార్శీమతంలోకి మారాలనుకున్నా అది సాధ్యంకాదు. దళితులకే కాదు ఎవ్వరికీ వారి ఆలయంలో ప్రవేశంలేదు. ఇది మానవహక్కుల ఉల్లంఘన అని ఎవరూ అనలేదు.

రామగుండం మండలంలోని ఈసాల తక్కెళ్ళపల్లి గ్రామంలో జరిగిందని చెబుతున్న ఘోరమైన సాంఘిక దురాచారాన్ని ఆధ్యాత్మిక వాదుల ఆలోచనకు "చిన్నవార్త" అని వివరిస్తూ తర్వాత పేరాలో దాన్ని ''ప్రకటన''గా ఉటంకించారు. ఇంతకీ ఇది వార్తా? ప్రకటనా? సంపాదకుల అనుభవంలో రెండూ ఒకటేనా? ఇది విశ్వసనీయతకు గీటురాయి. ఆస్తికవాదం నాస్తికవాదం విన్నాం గాని, ఆధ్యాత్మిక వాదులంటూ నూతనవర్గాన్ని సృష్టించటం మీ ప్రత్యేకత. అవమానింపబడ్డారని చెప్పబడే దళితయువకుల మతం మార్చుకున్నా ఆస్తికులే అవుతారు. అప్పుడైనా బోధింపబడేది ఆధ్యాత్మిక చింతే. నలభైమంది బస్సు ప్రయాణీకుల్ని ఇద్దరు దళితుయువకుల సరదాకోసం పెట్రోలు పోసి సజీవ దహనం చేశారు. వారికి సుప్రీం కోర్టు ఉరిశిక్ష విధించినా అప్పటి రాష్ట్రపతి క్షమాభిక్ష ప్రసాదించారు. సాంఘిక న్యాయం దృష్ట్యాచెయ్యవలసిన సదుపాయాలు ఇంకేమైనా ఉంటే మీరు పత్రికాముఖంగా వివరిస్తే బాగుంటుంది.

బంగారులేడి మీద భ్రమతో బందీ అయింది సీత. ఆమె స్థితికి కన్నీరు మున్నీరైనాడు హనుమంతుడు. రావణుడు చేసిన బలాత్కారానికి ఆగ్రహోదగ్రుడయ్యాడు. అయినా ఆ రాక్షసునికి హితవు చెప్పటానికి కూడా ప్రయత్నించి తప్పుదిద్దుకోటానికి ఒక అవకాశం ఇచ్చాడు, శ్రీరాముని దూతగా. వినటం వినకపోవటం **బుద్ధిః కర్మానుసారిణీ** వాని భవిష్యత్తుకు సంకేతం. పేదవర్గాల ప్రజలను ప్రలోభపెట్టి క్రైస్తవంలోకి లాగాలని ప్రయత్నించే వారి పట్ల జీయర్‌స్వామివారు చెప్పిన హితవు అల్లాంటిదే.

వాస్తవాలను విస్మరించటమే కాకుండా

యుక్తిగా వక్రీకరించగలగటం మీకు వరం. అవి చదవవలసి రావటం పాఠకులకు శాపం. బలవంతపు మతమార్పిళ్ళను ఊహించుకొని మతవిద్వేషం కొద్దీ మాత్సర్యంతో చర్చీలమీద, పాదరీల మీద, ముస్లిం మైనారిటీలమీద వాళ్ళ ప్రార్థనా స్థలాలపైన దాడులు చేసింది మన వాళ్ళయ్యులేనని తేల్చేశారు. చర్చీలమీద దాడులు చేసిందీ, దారుణ మారణకాండ సాగిస్తున్నదీ పాకిస్థాన్‌లో పుట్టి కాశ్మీరుమీదుగా నూజివీడు వరకు మల్లప్పురం వరకూ అల్లుకుపోయి విస్తరించిన ముస్లిం ఉగ్రవాద సంస్థలని మీరు విననేలేదా? ఇంతవరకూ ఏ హిందువూ ఒక ప్రార్థనా స్థలంలో విధ్వంసానికి పూనుకోలేదు. రాళ్ళు మారణాయుధాలూ అర్చనకోసం ఆలయానికి తీసుకు వెళ్ళే అలవాటు హిందువులకు లేదు. అయోధ్యలోని వివాదాస్పద కట్టడం ప్రార్థనాస్థలం కాదు. రామ్ నారాయణ్ టెంపుల్‌పై దాడి జరిపి హతులైన వారుగాని హైదరాబాద్ సాయిబాబా మందిర్ వద్ద బాంబుప్రేలుడుకి పాల్పడ్డవారుగాని కాశ్మీరులో బెరార్ ఎ. షరీఫ్ ధ్వంసం చేసిన మస్తగుల్ కాని హజరత్ బాత్ ష్రైన్‌లో జొరబడి ప్రార్థనలు చేస్తున్న వారిని బందీలుగా చేసి రాజలాంఛనాలు జరిపించుకున్నవారు కాని ఎవ్వరూ హిందువులు కారు. హిందువులకు మత విద్వేషం, మాత్సర్యం ఆపాదించిన మీరు, కత్తి చూపి కన్వర్ట్ (మతమార్పిడి) చేశారని చెప్పటం బుద్ధిలేని వాదన అని విశ్వసించే మీరు క్రైస్తవమత వ్యాప్తి జరిగిన తీరున పురస్కరించుకొని క్రిందటి సంవత్సరం పోప్ మహాశయుడు ఎందుకు ప్రపంచ దేశాలకు క్షమాపణ చెప్పాడో వివరిస్తారా? బుద్ధి అందరికీ ఉంటుంది. వినియోగంలోనే తేడా. న్యాయ స్థానం వెలువరించిన ఏ తీర్పులో హిందూత్వ చాటున దాగిన పరివార్ ముఠా స్టెయిన్స్‌నూ ఆయన ఇద్దరు పిల్లల్నీ పొట్టన పెట్టుకుందని నిర్ణయించిందో తెలియ జెయ్యండి. ఆరోపణల ఆధారంగా కోర్టుకంటే ముందే వెలువరించిన మీ తీర్పుకి “ఈలోగా” అనే కాలపరిమితి వర్తించదు. ప్రతిద్వందితో వాదించటానికి ద్వంద్వ నీతి అవసరమా? మీ ఊహలకి రెక్కలు తొడిగి విచ్చలవిడి విహారానికి వదలటం ఆగడం లేని ఆగడం.

2003 ఫిబ్రవరి 1,2 తేదీల దిన పత్రికలు మీరూ చదివే ఉంటారు. దారిన పోయే అమాయకులు, నిరపరాధులు అయిన పదిహేను మందిదాకా హిందువులను లిఫ్ట్ ఇచ్చి, కావాలని అడిగీ అమానుషంగా హత్య చేసిన ముస్లిం సంస్థ డిరెస్ కార్యకలాపాలు మీకు కించిత్తుకూడా నెప్పి కలిగించకపోవటంలో ఆశ్చర్యమేమీ లేదు. మహమ్మదీయ పేదలు కొందరు కారుని వాహనంగానూ సాధనంగానూ చేసుకొని ఈ మారణకాండ సాగించి చిత్రీకరించిన ఆ దృశ్యాలకు ప్రతిఫలంగా విదేశాలనించీ నిధులు పొందారు. ఐనా ఫరవాలేదు. హైందవ సంస్కృతిలోని మేలిమికి వారసులమయ్యే ప్రయత్నంలో ఈ దురదృష్టాన్నీ అవమానాన్నీ సహిస్తూనే ఉందాం. గాంధీజీ తర్వాత మీరు మాత్రమే ఇంత చక్కని సలహా ఇవ్వగలిగారు.

కష్టజీవులు, పేదలు, అభాగ్యులు హిందువుల్లో ఉండటానికి వారి మెడలపైన ఎక్కి హైందవంలాగా సవారీ చేసిన మరోమతం ప్రపంచంలో లేదని వివేకానందుని మాటలుగా ఉదాహరించారు. దీనికి పురోహితులూ, మతాధి పతులూ, పీఠాధిపతులూ కారణ మన్నారు. అంటే పేదరికానికీ, హిందూమతానికీ





సంబంధం అంటగట్టారు. పేదలు హిందువుల్లో అన్ని కులాల్లోనూ ఉన్నారు. అడుక్కు తినేవాడు బ్రాహ్మణుడైనా, దళితుడైనా ఆకలిబాధ ఇద్దరిదీ ఒకటే. హిందువుల్లో పేదరికానికి హిందూమతం కారణమన్నట్టే, ముస్లిములలో పేదరికానికి మాత్రం ఇస్లాం, మౌల్వీలు కారణం కాదట. అంతటితో ఆగలేదు. భారతదేశ పేదలలో ఎక్కువమంది మహమ్మదీయులెందుకున్నారు? అని వివేకానందుని మాటగా ప్రశ్నిస్తున్నారు. అందుక్కూడా హైందవమూ పీఠాధిపతులే కారణమైనట్టు. వివేకానందుని కాలంలో ఎందరో మహమ్మదీయులు నవాబుల పాలనలో ఉన్నారు. ఈ ప్రశ్న ఆ ప్రభువులను అడిగి ఉండవలసింది. క్రిస్టియన్ ఫాద్రీలు, బిషప్పులు వారి నిధులకు క్రైస్తవులలోని పేదలకోసం వినియోగించరు. హిందూ పేదలను వారి మతంలోకి మార్చటానికి ఆయుధంగా వాడతారు. ‘‘Love the neighbour” అనే వాక్యానికి ఇదే అర్థమా? ‘‘జమీందార్ల నుంచి పురోహిత పీఠాధి పతుల్నించి స్వేచ్ఛను పొందటం కోసమే పేదలు మతం మార్చుకున్నారు” అన్నారు. మతం మార్చుకున్నందువల్ల లభించిన స్వేచ్ఛ ఏమిటి? ఒక జమీందారు అదుపులోంచి ఇంకో అమీరుగారి ఆజ్ఞలోకి ఒక పీఠాధిపతి నమస్కరించే బదులు మరొక మౌల్వీగారికి సలాం చెయ్యటానికీ బదలీ అవటం స్వేచ్ఛా? దాని వల్ల పేదల బాధలు తీరతాయా? వారి పేదరికం తీరాలంటే డబ్బు కావాలి. మతం మార్చుకున్నందువల్ల ప్రయోజనం నెరవేరాలి. ఆ నిధులు విదేశాల్నించి పుష్కలంగా లభింపచేసుకొని ఆ ప్రలోభం చూపి క్రైస్తవంలోకి మతమార్పిడులు చేస్తున్నారంటే ఉలుకెందుకు? జీయర్‌స్వామివారు ఉన్నమాట అన్నందుకా? మతమార్పిడి కూడా ఒక అరడజను పత్రికలకి సంపాదకుడిగా మారినంత త్వరత్వరగా జరుగుతుంటే బాగుంటుందని మీ కోరిక ఐవుంటుంది.

“జీయర్ స్వామి బౌద్ధధర్మాన్ని మతంగా చూస్తున్నారు” అని అది ఏదో ఘోరమైన నేరమైనట్టు సూచించారు. ధర్మమూ సత్యము అనేవి మతానికోరకంగా ఉండవు. ఒక మతంలో అధర్మమైంది ఇంకో మతంలో ధర్మం కాబోదు. అసత్యం అంతటా అసత్యమే. సత్యం సర్వత్రా సత్యమే. ధర్మం ఒక్కటే ఉంటుంది. మతాలు వేరుకావచ్చు. మత భేదాలే కాని ధర్మభేదాలు ఉండకూడదు. **“ధర్మో రక్షతి రక్షితః”** అన్నారు కాని హిందూ ధర్మో రక్షతి రక్షితః అనలేదు. ధర్మపథాన్ని వదలి ‘ధర్మ’ పదాన్ని విధులు, న్యాయము, తత్త్వము, గుణము అనే వాటికి పర్యాయపదంగా, సంకుచితమైన అర్థంలో వాడుతున్నారు. రాజాశ్రయంతో ఆదరణతో వృద్ధి చెందిన బౌద్ధం ముమ్మాటికీ మతమే. నాస్తికులు తప్ప ఈ దేశంలో ప్రజలంతా భగవద్భక్తులు. భగవంతుణ్ణి వదలి “బుద్ధం శరణం గచ్ఛామి” అని మానవమాత్రుణ్ణి ఉజ్జీవనం కోసం ఆశ్రయించటమే ఆ మతం పతనానికి హేతువు. గౌతమబుద్ధుడు మానవుడు నిర్వర్తించవలసిన సామాజిక బాధ్యతలను గుర్తింపజేసి, కులవ్యవస్థ నడ్డి విరిచి, దాని చాటున దాగిన దోపిడీ వర్గంపై కలబడటానికి తగిన వ్యక్తిత్వాన్ని బౌద్ధం ద్వారా ఇచ్చాడన్నారు. ఒసే రాములమ్మా! ఒరేయ్ రిక్షా! లాంటి పేర్లతో నిరుపేదబ్రతుకుల మీద సినిమాలు తీసి కోట్లు గడించిన వాళ్ళు ఆ పేదలందర్నీ

ఉద్ధరించామ నటంలో ఎంత నిజం ఉందో ఆలోచించండి. మీరు ఆలోచించే చరిత్ర వివేకానందుడివద్ద, గౌతమబుద్ధుడివద్ద ఆగిపోయింది.

కలియుగం ఆరంభం నుంచీ వివిధ కాలాల్లో అవతరించి, భగవద్గుణ వైభవాన్ని అనుభవించి వరవశించి తమ దివ్య ప్రబంధాలలో గానం చేసిన పన్నిద్దరాళ్వార్లు ఆనాడు భగవద్రామానుజుల నుండి నేటి చిన్న జీయర్‌స్వామివారి వరకూ పూజలందుకుంటు న్నారు. ఆ ప్రబంధాల సారమే జీయర్‌స్వామి వారి ప్రవచనామృతం. ఈ ఆళ్వార్లలో ఇద్దరో, ముగ్గురో తప్ప తక్కిన వారందరూ ఈనాడు దళితులుగా వ్యవహరింపబడుతున్న కులస్థులే. వాస్తవంగా దళితవాణిని వినిపిస్తున్న వారూ, ఆ వైభవాన్ని ప్రచారం చేస్తున్నవారూ శ్రీ చిన్న జీయర్‌స్వామివారు. ఆ ఆళ్వార్లు భగవంతుణ్ణి కీర్తించటం మీ 'మనుస్సుకి సంబంధించిన ఐచ్ఛిక ప్రవృత్తికి' నచ్చక పోయినా ఇది తిరగరాయటానికి కుదరని చారిత్రక సత్యం. మొండివాదన, రెటమతం మీ అభిమతం కాకపోతే ఆ గౌతమబుద్ధుని కంటే వివేకా నందుని కంటే శ్రీ చిన్న జీయర్ స్వామివారు మహోన్నతులని గుర్తించండి. పరమపదించిన గొప్ప వాళ్ళంతా జీవించి ఉన్న గొప్పవాళ్ళ కంటె చాలా గొప్పవాళ్ళని ఒప్పుకు తీరాల్సిన అవసరంలేదు. లౌకికుల్లో అధ్యాత్మ రంగంలో లక్షలాది మందిచేత ఆరాధింపబడే వారికి ఏది అనౌచ్చో, ఏది అనకూడదో చెప్పగలిగిన మీవంటి మేధావులున్నట్లే వివేకానందుని కంటే గౌతమబుద్ధునికంటే గొప్ప వారు ఈనాడు మనమధ్య ఉండొచ్చు. ఉన్నారు కూడా. వారే శ్రీ జీయర్‌స్వామివారు.

మీరు ఉదాహరించినట్టే "జమిందార్ల నుంచి పురోహిత పీఠాధిపతుల్నుంచి స్వేచ్ఛను పొందటం కోసమే పేదలు మతం మార్చు కున్నారు" అని అంగీకరిద్దాం. ఇది యథా న్యాయంగా బౌద్ధానికి కూడా వర్తిస్తుంది. శంకర భగవత్పాదులు శంకరపీఠాలనూ కొంతకాలం తర్వాత వారి జయంతినాడే అవతరించిన భగవద్రామానుజులు విశిష్టాద్వైత ఆచార్య పీఠాలనూ వెలయించారు. వీరిద్దరికంటే ముందే ఈదేశంలో బౌద్ధారామాలూ విహారాలు కోకొల్లలుగా ఉన్నాయి. ఈ బౌద్ధపీఠాధిపతులు నించి పేదలు స్వేచ్ఛను పొందగా, బౌద్ధం ఈ దేశాన్నించి మహాప్రస్థానం చెయ్యటం స్వయంకృతం.

ఆత్మవిమర్శ, పునఃపరిశీలన చేసుకో వలసింది మీరే. సత్య సంకల్పులైన చిన్న జీయర్ స్వామివారి ప్రచార వైభవం దినదిన ప్రవర్ధమాన మవాలని భగవంతుని ప్రార్థిస్తూ..

స్వస్తి.



(నల్లాని చక్రవర్తుల శ్రీరామ అయ్యంగార్, హైదరాబాద్.)



## మానస సరోవరయాత్ర

శ్రీవారి మానస సరోవర యాత్రా వివరాలతో కూడిన పుస్తకములు, C.D.లు హైదరాబాద్, విశాఖపట్నం, మద్రాసు, రాజమహేంద్రిలోని మన జెట్ ఆఫీసులయందు స్వీకరించవచ్చును. తెలుగు, ఇంగ్లీషులలోకూడా లభిస్తున్నాయి. పుస్తకం రూ. 150/-, C.D. రూ. 150/-
**జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్, సీతానగరం, గుంటూరు జిల్లా ఫోన్ : 08645 - 272929, 272353.**





## గ్రంథ పరిచయం

**సోదర సోదరీమణులారా....!**

5వేల పుటలలో పది సంపుటాలుగా ఉన్న శ్రీ వివేకానంద సాహిత్యాన్ని పై పేరుతో సంగ్రహంగా ప్రటించేరు చెన్నై శ్రీరామకృష్ణ మఠంవారు.

భారతదేశానికి ప్రపంచంలో సముచిత గౌరవాన్ని, సమున్నతస్థానాన్ని కల్పించినవారు 'వివేకానందులు. వారి బోధలు మానవాళికి ఉద్దీప్తినిచ్చేవి. కరదీపికలుగా నిలిచేవి. శ్రీరామకృష్ణుల బోధలతో పాటు దయాసింధువయిన భగవద్రామానుజుల ఔదార్యం ఆయనను ముగ్ధులను చేసింది (పుటలు 377,399, అదే స్ఫూర్తితో ఆయన తను ఉద్యమాన్ని కొనసాగించి సర్వులకు చిరస్మరణీయులైనారు.

జన్మ చరితార్థం చేసుకోవాలనుకొనేవారు అంతా చదవదగిన గ్రంథం. మంచి కాగితం, మంచి ముద్రణ పుటలు 655. వెల రూ. 50/-, దొరకు చోటు : **శ్రీరామకృష్ణ మఠం, మైలాపూర్, చెన్నై 630004**

**శ్రీరామకృష్ణకథామృతం**

16వందల పుటలలో మూడు సంపుటాలుగా ఉన్న శ్రీరామకృష్ణ ఉపదేశాలను పాఠకుల సౌలభ్యం కోసం 500 పుటలలో సంగ్రహంగా ప్రకటించిన గ్రంథం. మేలయిన కాగితంపై చక్కగా ముద్రితమైన ఈ గ్రంథం వెల రూ. 30/-
దొరకు చోటు : **శ్రీరామకృష్ణమఠం, మైలాపూర్, చెన్నై, 630 004**

## భక్తినివేదన పాఠకులకు శుభవార్త

**రాబోవు 2003వ సంవత్సరం ఏప్రిల్ నెల భక్తినివేదన 'బదరీనాథ్ ప్రత్యేక సంచిక'గా వెలువడుతుందని తెలియజేయుటకు సంతోషించుచున్నాము. ఇందులో ......**

బదరీనాథ్ యాత్రా విశేషాలు, బదరీనాథ్ చుట్టుప్రక్కల ఉండే ప్రదేశముల గురించి, బదరీలో **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామి వారిచే** నిర్వహించే అష్టాక్షరీ క్షేత్ర వివరములు, అక్కడ ఏర్పాటు చేసిన వసతి మరియు అన్నదానము గూర్చిన వివరములు ఉండును. మరింత అందమైన బదరీనాథ్ పరిసర ప్రాంతాల కలర్‌ఫోటోలతో తెలుగు, హిందీ, ఇంగ్లీషు భాషలు ఒకే పత్రికగా ముద్రించబడును. మరింత అందముగా పాఠకులకు అందించడం కొరకు మార్చినెలకు బదులుగా ఏప్రిల్ నెలలో ప్రచురింపబడును.

మరిన్ని వివరములకు : జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్, సీతానగరం, గుంటూరు జిల్లా.
పిన్ : 522 501. ఫోన్ : 08645- 272929, 272353.

# సందేహాలు - సమాధానాలు

కె. రమాకుమారి

**ప్ర. ధర్మభూత జ్ఞానం అనగానేమి?**

జ. జ్ఞానమనేది ఆత్మకి ఒక అసాధారణ ధర్మము. పంచదారలో తీపిలాగ, ఉప్పుగడ్డ లోని ఉప్పదనంలా ఆత్మకి ఉండే ఒక అసాధారణ (Essential Feature) ధర్మాన్ని జ్ఞానం అంటారు. అయితే దృష్టాంతం కొంత వరకే సహకరిస్తుంది. పంచదార, ఉప్పుగడ్డ నీటిలో కలిసిపోయాక దానికొక రూపం ఉండదుకానీ, జ్ఞానం వస్తువులను విషయాలను తెలియ చెయ్యడానికి ఆత్మ నుండి ప్రసరిస్తూ వెనుతిరుగుతున్న ఆత్మ కరిగేది కాదని, మూడు కాలాల్లోనూ ఉండే నిత్యమైన పదార్థమని శాస్త్రం వలన మాత్రమే తెలుస్తోంది. ప్రత్యక్ష, అనుమానాల వల్ల తెలిసేది కాదు. పంచదారలో ఉండే తీపిని 'గుణము' లేక 'ధర్మము' అని అంటాము. పంచదార పలుకు ఒక ఘన ఆకృతిని కలిగి ఉంటుంది. అక్కడ తీపి అనే గుణమే ఆకృతిని ధరించి ఉంది. దానికంటూ ప్రత్యేక ఆకృతిలేదు. కానీ, ఆత్మవిషయం అలాకాదు. జ్ఞానమే స్వరూపంగానూ (ఆకృతిగానూ) దానిలో ఉండే జ్ఞానమునే గుణముగానూ కలిగి ఉంటుంది. స్వరూపమైన జ్ఞానం అచలంగా వుంటుంది. దానినే మనం ఆత్మ లేక జీవుడు అనిఅంటాం. ''నేను, నేను'' అని వ్యవహరించేది ఇదే. గుణముగావుండే జ్ఞానం ఆత్మనుండి వస్తువులపైకి ప్రసరిస్తూ ఉంటుంది. ఆ వస్తువులను తనుగ్రహించి మరల తనకాధరమైన ఆత్మకి అందిస్తు ఉంటుంది. గుణముగా వుండే ఈ జ్ఞానం నిత్యంకాదు. అనిత్యము. ఇది ఎప్పుడూ ఒక వస్తువును ఆశ్రయించు కొనే ఉంటుంది. ఒక వస్తువుకు పరస్పర విరుద్ధముకాని ఎన్ని ధర్మాలైనా ఉండవచ్చు. ఈ ధర్మములన్ని కలిగిన ఆ వస్తువును **"ధర్మి"** అని అంటారు. ఉదాహరణకు ఒక పండులో రంగు, రుచి, పరిమళము, గుండ్రని ఆకృతి కొంత బరువువంటి ఎన్నో ధర్మములు వుంటాయి. ఆ పండును **"ధర్మి"** అంటాం. దానిని ఆశ్రయించుకొన్న పైలక్షణాలన్నింటిని ధర్మములు అంటాము. ఇక ఆత్మ విషయానికి వస్తే ధర్మిగా వుండే జ్ఞానము ఒకటి. ఇది అణుస్వరూపము కలది. పుట్టుట, గిట్టుట లేనిది. నిత్యమైనది. శాశ్వతమైనది. దీనినే **"ధర్మిభూత జ్ఞానము"** అంటారు. దీనినుండి ప్రసరించే జ్ఞానాన్ని ధర్మభూతజ్ఞానము అంటారు. అది అనిత్యము. ఎంత మేరైనా ప్రసరించగల శక్తి కలది. అంతటా ప్రసరించగల శక్తిని **విభుత్వము** అని అంటారు. అయితే కర్మవల్ల కొన్ని చోట్ల ప్రసరించవచ్చు. కొన్ని చోట్ల





ప్రసరించలేక పోవచ్చు. **ధర్మిభూతజ్ఞానము** ఉన్నట్టు ఎవరూ చెప్పక్కరలేదు. తన ఉనికిని తానే తెలుపుతూ ఉంటుంది. అది ప్రకాశించడమనేది **"నేను"** అన్న జ్ఞానం వలన తెలుస్తుంది. ధర్మభూత జ్ఞానము **"నాది నాకు"** నాయొక్క, నా వలన, ఇలాంటి వ్యవహారాలను కలిగిస్తుంది. ఇక్కడ ధర్మిభూతజ్ఞానము అనగా ఆత్మ. దాని కుండేటువంటి తెలివిని ధర్మభూత జ్ఞానమని మనం సూక్ష్మంగా చెప్పుకోవచ్చు. దీనినే మరికొంచెం సంక్షిప్తంగా చెప్పుకో వాలంటే **"ధర్మి"**లేక **"గుణి"** అంటారు. ధర్మము లేక గుణము అయినది ఒక జ్ఞానము. ఇక్కడ మీరడిగిన పదంలో 'ధర్మభూత జ్ఞానము'' అని అంటే ధర్మమైవున్న జ్ఞానము అని అర్థము.

**ప్ర. పంచసంస్కారాలు చేయించే సమయంలో ఆచార్యులు మాచే శరణాగతి చేయించినట్టేనా?**

జ. మూడు మంత్రాలని ఇచ్చే సమయంలో ఉపదేశమయ్యాక **"నేను శ్రియఃపతికే సర్వసేవలు చేస్తానని"** మనచే ఒక ప్రతిజ్ఞ చేయిస్తారు. దానినే శరణాగతి చేయించటం అంటారు. అయితే **'శరణాగతి ఒక శారీరక క్రియకాదు'**. ఆచార్యులు నడిచే బాటలో మనం ఉందాం అని మానసికంగా వారిని ఆశ్రయిస్తూ వారిని ఆశ్రయిస్తే చేసుకొనే ఒక నిర్ణయము. తిరుమంత్రార్థములో చరమ శ్లోక ప్రకరణములో **'జానాన్మోక్షం యంగైయాలే...'** అనే సూత్రంలో ఈ విషయాన్నే మన పూర్వాచార్యులు తెలిపి యున్నారు.

**శ్రీమాన్ శ్రీనివాస్ - భద్రాచలం**

**ప్ర. జాతాశౌచము వచ్చినపుడు భగవదారాధన చేయక కేవలం స్నానానుష్ఠానము శ్రీపాదతీర్థము సేవించవచ్చునా?**

జ. ఆశౌచ సమయంలో స్నానం అర్ఘ్య ప్రదానం వరకే అనుష్ఠానం తప్ప గాయత్రీ జపాదులు, శ్రీపాదతీర్థం, అష్టాక్షరీ జపాదులు ఉండవు. ద్వయమంత్రం మాత్రమే అనుసంధించుకోవలెను. ఆరాధన కూడ తగదు.

**ప్ర. సమాశ్రితుడు కాని వ్యక్తికి పరమపదోత్సవం చేయవచ్చునా? వైదిక క్రియల్లో తేడా ఉందా?**

జ. వివాహమైన వ్యక్తికిగాని, ఉపనయనార్హ వయస్సు దాటిన తర్వాత ఆ వ్యక్తి దేహాన్ని చాలించినపుడు అతనికి వైదికంగా చేసే అపర సంస్కారాలు సమానమే. సమాశ్రయణాలు అయిన వారు పరమపదించినపుడు 12వ రోజుదాక చేసేవన్నీ పూర్తిచేస్తారు. మామూలుగానే ఆరోజు రాత్రి దివ్యప్రబంధ సేవా కాలాదులు మరునాడు ఇయల్‌గోష్ఠి, పరమపదోత్సవం చేస్తారు. అంతే తప్ప, ఇతర తేడాలు ఉండవు. అతను సమాశ్రితుడు కాకున్నా బంధువులు అతను తరించాలన్న ఉద్దేశంతో చేస్తే దోషంలేదు.

# మహర్షుల చరిత్ర - శ్రీ శుక మహర్షి

తమిళమూలం :
శ్రై.వా. నావల్‌పాకం దేవనాథ
తాతాచార్యస్వామి

తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూప్పురాణి
ఉడయవర్‌స్వామి, విజయవాడ

**చావంటే భయమే లేదు :**

ఇక ఏడు రోజులలో తాను మరణించుట నిశ్చయం అని తెలిసినా పరీక్షిత్తు ఏమీ కలత చెందలేదు. ప్రజలకు తాను చేయదలచుకున్న సత్కార్యాలని వేగంగా పూర్తిచేశాడు. తన ప్రియ పుత్రుడు జనమేజయునికి పట్టాభిషేకం చేసి రాజ్యాన్ని అప్పగించాడు. ఆహారము, నిద్ర విడచి పెట్టాడు. పవిత్ర గంగానది మధ్యలో ఏడు రోజులూ గడిపి అక్కడనే ప్రాణత్యాగం చేయాలని అనుకున్నాడు.

**ఒంటికాలి మండపం :-**

పరీక్షిత్తు శాపవార్త విని ఆ దేశంలో ప్రజలంతా చలించిపోయారు. "ఇది జరిగి తీరుతుంది అని ఎవరు నిశ్చయంగా చెప్పగలరు? తప్పకుండా పరీక్షిన్మహారాజు ఈ శాపాన్నుండి తప్పించుకుని బ్రతికి బయట పడతాడు", అనే ఆశతో వారు ఎదురు చూడసాగారు. రాజు కోరినట్లుగా గంగానది మధ్యలో ఎత్తైన స్తంభంపై విశాలమైన ఒక మంటపం ఏర్పాటు చేశారు. దానిలో ప్రవేశించాడు పరీక్షిత్తు. ఆ మంటపానికి పెద్ద కాపలా ఏర్పాటు చేయబడింది. ప్రతి ఒక్కరిని పరీక్షచేసి ఆ తర్వాతే మంటపంలోకి అనుమతించసాగారు. అంతరంగ రక్షకులు వేయికళ్ళతో ఆ మండపాన్ని కావలా కాస్తున్నారు.

**ముని సముదాయం :**

పరీక్షిత్తు మరణాన్ని గురించిన వార్త లోకమంతా కార్చిచ్చులా వ్యాపించింది. సర్వము త్యజించి అడవుల్లో ముక్కుమూసుకుని తపస్సు చేసుకునే మునులు అందరూ పరీక్షిత్తును దర్శించాలనే కోరికతో గంగ మధ్యలో నున్న అతని వద్దకు చేరారు. మహారాజ భోగాలలో మునిగి ఉండే పరీక్షిత్తు ఒక్క క్షణంలో విరక్తుడై తృప్తిగా మరణాన్ని ఆహ్వానించడం వారికి ఆశ్చర్యాన్నికలిగించింది. ఎన్నో సంవత్సరాలుగా ప్రయత్నిస్తున్నా తమకు అటువంటి మానసిక స్థితి కలుగనందుకు బాధ పడ్డారు. ఆనాటి ఋషులలో అచ్చటికి రాని వారెవ్వరూ లేరు. పరీక్షిత్తు పూర్వ పుణ్యఫలముగా వారంతా అక్కడకు చేరగా, మహారాజుకు మనశ్శాంతి ఏర్పడింది.

అత్రి, వసిష్ఠుడు, చ్యవనుడు, శరద్వానుడు, అరిష్టనేమి, భృగు, అంగిరసుడు, పరాశరుడు, ఉదథ్యుడు, ఇన్ద్రప్రమదుడు, ఇధ్మవాతుడు, విప్పులాదుడు, మైత్రేయుడు, ఔర్వుడు, కవషుడు, అగస్త్యుడు, వ్యాసుడు, నారదుడు మొదలగు మహా మునులంతా అచ్చటికి చేరారు.

పరీక్షిత్తు ఆ మునులనందరిని యథావిధిగా పూజించాడు. ఆతని మనోధైర్యం రెట్టింపు అయింది. "మహానుభావులారా! తక్షకుని (పాము) కాటు వలన నాకు మరణం నిశ్చయం





అని తెలిసినా నేను ఏ మాత్రం కలత చెందడం లేదు. మీరంతా ఆ పరమాత్మ దివ్యనామ సంకీర్తనం చెయ్యండి. ఆనందంగా వింటూ ప్రాణాలు విడుస్తాను" అని వారిని ప్రార్థించాడు. తూర్పు దిక్కుకు కొసలు ఉండేటట్లు దర్భలు పరచుకొని వాటిపై ఆసీనుడై ప్రాయోపవేశం ఆరంభించాడు. ఆహారం, నిద్రమాని కదలక మెదలక ఒకేచోట ఉండటాన్ని ప్రాయోపవేశం అంటారు.



# రామాయణంలో రమ్యగాథలు

## దాశరథి సతి కొఱకై ఉత్తర దిగన్వేషణ

-చెవుటూరి కుసుమ కుమారి, విజయవాడ.

వానర శ్రేష్ఠుడైన సుగ్రీవుడు మహావీరుడైన శతబలుడను వానరుని పిలిచి వానర పుంగవా! నీవంటి మహాశూరులైన లక్షమంది వానరుల తోను, యముని పుత్రులైన నీ మంత్రులతోనూ కలసి, హిమవత్పర్వతము, శిరోభూషణముగా గల ఉత్తరదిశను అన్వేషించి సీతజాడ తెలుసు కొనవలెను. కార్య శూరుడవైన వానర శ్రేష్ఠుడా! నీవు సీత జాడ తెలియచేసి రామునకు ప్రియము చేకూర్చిన ఎడల, రామచంద్రుడు మాకు చేసిన ఉపకారమునకు ప్రత్యుపకారము చేసి మా జన్మ సార్ధకము చేసికొందుము.

మా ప్రియము, హితము కోరువారైన మీరు మీ మనసులలో ఈ ఆలోచనను నింపుకొని, నరశ్రేష్ఠుడు, పూజనీయుడు, మా స్నేహితుడు అయిన రాముని పత్నిని అన్వేషించుట ఆరంభించుడు.

మీరు ఉత్తర దిక్కున మ్లేచ్ఛ, పులింద, శూరసేన, భరత, కురు, కాంభోజ, యవన, బాహ్లిక, ఋషిక, పౌరవ, టంకణ, చీన, పరమచీన, వరద, నీహార దేశములలో వెదకి, తరువాత హిమత్పర్వతము మీద కూడా వెదకుడు. అటుపిమ్మట దేవతల, గంధర్వుల నివాసమైన సోమాశ్రమమునకు వెళ్ళి అచట నుండి బంగారుమయ కాలపర్వతమును, నీలపర్వతమును దాటి సుదర్శన పర్వతము నందు బాగుగా వెదకి, పక్షుల నివాసమైన దేవసఖమను గిరిని చేరుడు. అక్కడి వనాలలో, గుహలలో, లోయలలో విస్తృతంగా అన్వేషించండి. దేవసఖ పర్వతము తరువాత నూరు యోజనముల వైశాల్యము కలిగిన శూన్యప్రదేశము ఉండును. అక్కడ నదులుగాని, వృక్షములు, అసలు ఏ ప్రాణులూ వుండవు.

**తత్తు శీఘ్రమతి క్రమ్య కాన్తారం రోమ హర్షణమ్**
**కైలాసం పాణ్డురం ప్రాప్య హృష్టా యూయం భవిష్యథ**

అంతటి రోమాంచము కలిగించు భయంకర శూన్యమును దాటి ముందుకు వెళ్ళి తెల్లని కైలాస పర్వతమును చూడగానే మీ మనస్సులకు మహదానందం కలుగుతుంది. అక్కడ తెల్లని మేఘము వంటి ఎత్తైన భవనము బంగారు నిర్మితమై అతి రమ్యముగా ఉండును. అది కుబేరునకు దేవశిల్పి విశ్వకర్మచేత నిర్మింప బడినది. అక్కడ అత్యధిక పద్మములు కలువలు హంస కారండ పక్షులతో కనువిందు చేసే పద్మసరస్సు అనుపేరుగల ఒక సరస్సు వున్నది. ఆ సరస్సులో అప్సరాంగనలు సేవిస్తూ వుంటారు. సర్వలోక నమస్కృతుడు, శ్రీమంతుడు అయిన ఆ కుబేరుని నివాస సమీపము నందలి చంద్రకాంత మణి మంటపములన్నిటా మీరు జానకిని జాగ్రత్తగా అన్వేషించవలెను.

వానర శ్రేష్ఠులారా! మీరు అటుపిమ్మట అతి కష్టమైన క్రౌంచ పర్వతమును అతి నేర్పుతో సమీపించి ఆ పర్వత రంధ్రములోనికి అతి జాగరూకులై ప్రవేశించవలెను. అది ప్రవేశింప శక్యము కానిదని అందరూ అనుకొను మాట. ఆ కైలాస పర్వతమున సూర్యసమాన తేజో విరాజమానులైన మహర్షులు దేవతలు ప్రార్థించగా అక్కడ నివసించుచున్నారు. వానర శ్రేష్టులారా! క్రౌంచగిరి రంధ్రములను, గిరి మధ్యమున కూడా పూర్తిగా వెదుకవలె.

**అవృక్షం కామ శైలం చ మానసం విహగాలయమ్**
**నగతిస్తత్ర భూతానాం దేవానానం చ రాక్షసామ్**

ఆక్రౌంచ పర్వతమునకు చెందిన మానసమను కోర్కెలను తీర్పు ఒక పర్వతము వున్నది. ఆ పర్వతము





మీద చెట్లు వుండవు. కాని అది పక్షులకు గొప్ప ఆవాసము. అక్కడికి దేవదానవులుగాని మరి ఏ ప్రాణులుగానీ చేరలేవు. క్రౌంచ పర్వతము తరువాత మైనాక పర్వతమున్నది. దాని మీద మయుడు అను దేవ శిల్పి నిర్మించు కొనిన గొప్ప భవన మున్నది అది కింపురుష స్త్రీల నివాసము. అది దాటిన తరువాత సిద్ధులు నివసించు ఆశ్రమములున్నవి.

**'సిద్ధావైఖానసాస్తత్ర వాలఖిల్యాశ్చ తాపసాం'**

అక్కడ సిద్ధులు, వైఖానసులు, వాలభిల్యాదులూ నివసిసస్తూ ఉంటారు. మీరు ఈషణ్మాత్రము పాపమంటని ఆ సిద్ధులకు నమస్కరించి, వినమ్రంగా సీతావృత్తాంతమును వారికి చెప్పి, వారి ఆదేశానుసారము ముందుకు సాగుడు. అక్కడ వైఖానసులకు చెందిన ఒక సరస్సు వున్నది. దానిలో బంగారు పద్మములుండును. ఆదిత్య సంకాశమైన హంసలు సహచరించు చుండును. అది దాటిన తరువాత సూర్య చంద్రులు, నక్షత్ర గణములుగాని, మేఘములు గాని, ఎటువంటి ధ్వనిగానీ లేని ఆకాశము మాత్రము ఉండును. తపస్సిద్ధుల ప్రభావం చేత ఆ ప్రదేశము సూర్యకాంతిలా ప్రకాశిస్తూ ఉంటుంది. ఆ ప్రదేశమునకు సమీపముననే శైలోదమను అనునది ఉన్నది. దాని ఇరు తీరములయందు కీచకములు అను వెదుళ్ళు ఉన్నవి. అవి సిద్ధులను ఆవలి ఒడ్డునకు, ఈవలి ఒడ్డునకు తీసుకొని వెళ్ళివచ్చుచుండును.

అచ్చటకీ పుణ్యాత్ములకావాసమైన ఉత్తర కురుభూమి ఉన్నది. అచ్చట నీల వైఢూర్యముల వంటి ఆకులతో, బంగారు పద్మములతో కలువలతో నిండిన అనేక నదులున్నవి. ఆ నదులు మణులకు, ముత్యములకు సాటిలేని రత్నములకు ఆలవాలములు. ఆ నదులఇసుక తిన్నెలు బంగారు మిశ్రితములు. ఆ నదుల లోనికి మునిగి బంగారు నిలయములైన పర్వతము లున్నవి. అక్కడి వృక్షములు దివ్యఫల పుష్పభరితములేగాక అనేక వస్త్రములు (నారచీరెలు) ప్రసాదించుచుండును. కొన్ని వృక్షములు రుచ్యమైన, చిత్రమైన భక్ష్యములను, పానీయములను ప్రసాదించును. కొన్ని వృక్షములు అమూల్య మణులను, సుగంధ మాలికలను రమ్యవస్తువులను ఫలించును. అచట అనేక మధుర వాద్యధ్వనులు వినిపించుచూ ప్రాణులకు సదా ఆహ్లాదము కలిగించుచూ వుండును. అచ్చట చెడ్డవాడు గానీ, సంతోషములేనివారు గానీ ఉండనే ఉండరు.

అది దాటిన తరువాత ఉత్తర సముద్రము, దాని నడుమ సోమగిరి అను హేమగిరి ఉన్నది. ఆ ప్రదేశమున సూర్యుడు లేకున్ననూ జాజ్వల్యమాన కాంతి వెలుగుతూ ఉంటుంది అచట విశ్వాత్మా, ఏకాదశమూర్తిమంతుడు అయిన శివుడు బ్రహ్మర్షులతో కూడి బ్రహ్మ వసించుదురు.



# శ్రీవిష్ణు మహాపురాణము

## షష్ఠాధ్యాయం - చాతుర్వర్ణ్యాది సృష్టి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, కొవ్వూరు.

**యధేచ్ఛా వాసనిరతాః సర్వబాధ వివర్జితాః ।**
**శుద్ధాన్తఃకరణాః శుద్ధాః కర్మానుష్ఠాన నిర్మలాః ॥**

చతుర్ముఖ బ్రహ్మరూపుడైన జనార్దనుడు చాతుర్వర్ణ్య వ్యవస్థ చేసిన ఆరంభ దశలో ఎవ్వరు ఏ వర్ణానికి చెందినవారైనా మనుష్య మాత్రులెవ్వరైనా, తమ మనుష్యతా దశ నుండే, తమకు అభిరుచితమైన ఉత్తమ స్థానాన్ని పొందగల యోగ్యత వారికి ఎలా వచ్చింది? దానికి నిమిత్తం వారు తమ కర్మలను శ్రద్ధతో ఆచరించడమేనని **సమ్యక్ శ్రద్ధా సమాచారీ ప్రవణాః** అనే మాటతో పరాశరుడు చెప్పాడు. ఎవ్వరు ఏ వర్ణంలో పుట్టి, ఆ వర్ణోచితమైన కర్మ చేస్తున్నా, చేసే కర్మయందు శ్రద్ధ దాన్ని సముచితంగా చేయాలనే దృఢభావన కలిగి ఉండడమే ఆ కర్మలో ఒక సిద్ధినిపొందడానికి కారణం అవుతుందన్నమాట. కనుకనే, ఎవరి విధ్యుక్త కర్మను వారు ఆచరిస్తూ ఉన్నప్పుడు వారి స్వేచ్ఛాయుతమైన జీవనానికి ఎలాంటి అడ్డూ లేనప్పుడు, ఒకరినొకరు బాధించుకోవలసిన అగత్యం కూడా లేదు కదా! **'యధేచ్ఛ వాసనిరతాః'** అనడంలో ప్రజల స్వేచ్ఛాయుత జీవన విధానం స్పష్టపడుచున్నది. **సర్వ బాధవివర్జితాః** అనడంచేత, వారికి ఎవరివల్లా ఎలాటి బాధలేదని అవగతం అవుతున్నది. దానికి **'అంతఃకరణం'** శుద్ధం కావాలి కదా! అది వారికి ఉంది. వారు ఆచరించే కర్మ వల్లనే వారికి మనః పరిశుద్ధి ఏర్పడుతున్నదన్నాడట.

ఇలా విశుద్ధ జీవనాన్ని సాగించే వారు ఏ వర్ణం వారైనా, అంతఃకరణ శుద్ధిమూలంగా, పరమ ప్రాప్యమైన పరమాత్మ శ్రీహరికి చెందిన విశుద్ధ జ్ఞానం వారికి కలిగి, వారు వైష్ణవస్థానాన్ని దర్శింపగలుగుతున్నారు. అంటే వారి విశుద్ధ కర్మాచరణం, విశుద్ధ జ్ఞానానికి, చివరికి పరమపద ప్రాప్తికి మూలం అవుతున్నదని తెలుస్తున్నది.

దీన్నే పరాశరుడు ఇలా అంటాడు.

**శుద్ధే చ తా సాం మనసి శుద్ధేన్తః సంస్థితే హరే ।**
**శుద్ధ జ్ఞానం ప్రపశ్యన్తి విష్ణ్వాఖ్యం యేన తత్పదమ్॥**

ఈ స్తోత్రం ఏకాలంలో అయినా అందరికీ వర్తిస్తుంది. ఈ సూత్రాన్ని మీరినప్పుడు అధః పతనం తప్పదు.

**అధర్మబీజానికి కారణం ఏమిటి?**

క్రమంగా ఈ స్థితి మారి మానవులలో తమోగుణ ప్రకోపం వల్ల క్రోధమోహాలు లోభం ఆచరించినప్పుడు వారిలో అధర్మబీజం పుడుతుంది. ఇలాంటి స్థితి కలిగినప్పుడు ఆ కాలమే స్వార్థభావనలకు నెలవైన రాగద్వేషాదికం 'సిద్ధి'కి విరోధంగా అధర్మకారణంగా ప్రజల్లో ప్రవేశిస్తుంది.

ఈ ధర్మగ్లానిదశలో సహజంగా సిద్ధి పొందగల స్థితి మానవుల చేజారిపోతుంది.





**కృతయుగ ధర్మ హ్రాసం-మనుష్యజాతి పతన హేతువు**

ప్రజలలో స్వధర్మనిష్ఠ, అంతఃకరణ శుద్ధి, విశుద్ధజ్ఞానం, సదాచారపరాయణత ఇవన్నీ క్రమంగా లోపించిన కొలదీ, పూర్వయుగాల్లో ఉండిన సిద్ధులు కనుమరుగైపోతాయి. ఏదీ తగిన ఫలాన్ని గల స్థితిలో ఉండదు.

ఈ దశను విష్ణు పురాణం ఇలా వర్ణిస్తుంది.

**అధర్మ బీజముద్భూతం తమో లోభ సముద్భవమ్।**
**ప్రజా సుతాసు మైత్రేయ రాగాదిక మసాధకమ్ ॥**
**తతస్సా సహజా సిద్ధిః తా సాం నాతీవ జాయతే ।**
**రసోల్లాసాదయశ్చాన్యా సిద్ధయోష్టే భవన్తి యాః॥**
**తాసు క్షీణా స్వశేషాసు వర్ధమానేచ పాతకే ।**
**ద్వంద్వభి భవదుఃఖార్తాస్తా భవన్తి తతః ప్రజాః ॥**

అధర్మబీజం పుట్టినప్పుడు కలిగే స్థితి ఎలాంటిదో పురాణం వివరించింది. కృత యుగానికి కొన్ని విశేషలక్షణాలున్నాయి. ప్రజలకు గల కర్మ-జ్ఞాన నిష్ఠలవల్ల కొన్ని సిద్ధులు సహజంగానే ఏర్పడతాయి. వీటి గురించి విష్ణుపురాణమేకాక, మరికొన్ని పురాణాలు కూడా చెప్పాయి. వీటిలో రసోల్లాస సిద్ధి, స్త్రీ సంబంధం లేకుండానే ఆనంద ప్రాప్తి దర్శనమాత్రంచేతనే సంతానోత్పత్తిని కలుగజేయ గల్గడం, సస్యవృద్ధి, వృష్టిని కల్గించడం, గృహవృక్షాదుల సృష్టించడం ఇలా చాలా సిద్ధులు చెప్పబడ్డాయి.

**"కృతేతు మిథునోత్పత్తిః, సిద్ధిశ్చాపి రసోల్లాసా।**
**సకృద్ వృష్టిమయీచాన్యా, గృహవృక్షాత్మికాపరా॥**
**పశ్చాత్ సంకల్ప సిద్ధిశ్చ, కల్పవృక్షాత్మికాపరా।**
**ప్రకామవృష్టి శ్చాకృష్ట పచ్య సిద్ధిః తథాష్టమీ॥**

ఇత్యాదిగా పురాణాలు వీటిని ఉద్ఘోషించాయి. అయితే ఈ సిద్ధులేవీ కర్మనిష్ఠ లేనివారికి ఫలించవు. ఈ సిద్ధులు క్రమంగా నశించి పాపం వృద్ధిచెందిన కొలది సుఖదుఃఖాలు, శీతోష్ణాలు, రాగద్వేషాలు ప్రజలను లోబరచుకొని నిర్వీర్యులను చేస్తాయి. అప్పుడు ఆత్మరక్షణ కొరకు మరుదుర్గాలు, జలదుర్గాలు, వనదుర్గాలు, పుర-ఖర్వాట - గృహాది నిర్మాణం చేసికొంటారు ప్రజలు. అంతేకాక క్షుత్పిపాసలను తీర్చుకోవడానికి కృష్యాది వృత్తులను కల్పించుకొంటారు. శిల్పాది హస్త నైపుణిని జీవికగా స్వీకరిస్తారు. అని అంటూ కృతధర్మం లోపించిన దశలో ఏర్పడే మార్పులను సామాజిక పరిణామా లను, మానవుల సామర్థ్యాలను వివరించింది పురాణం.






# భగవద్రామానుజ చరిత్ర

శ్రీమతి టి.కె. చూడామణి, విజయవాడ



ఒకనాడు వడుగనంబి రామానుజులకి పాలను కాచి ఇవ్వాలని లోపలికి వెళ్ళి పొయ్యి మీద పాలు పెట్టారు. సరిగ్గా అదే సమయంలో శ్రీరంగనాథుడు ఉభయనాచ్చి యారులతో తిరువీధికి వేంచేశాడు. ఊరేగింపు మహా వైభవంగా సాగుతోంది. స్వాములంతా అంత వరకు జరుగుతున్న కాలక్షేపాదులు విడిచి పరుగు పరుగున బయటికి వచ్చారు. శ్రీరంగ నాథుని సేవించాలనే తపన పరుగులు పెట్టించింది. ఊరేగింపు సరిగ్గా ఇంటి ముందుకు వచ్చింది. స్వాములంతా ఆనందంగా శ్రీరంగనాథుని సేవించారు. ఆ ఆనందాన్ని పంచుకుంటూ అందరివైపూ చూశారు. వారిలో వడుగనంబి లేరు. అయ్యో! వడుగనంబి ఇంకా రాలేదా! ఆలస్యమైతే ఊరేగింపు ముందుకి వెళ్ళిపోతుందే, స్వామి దర్శనం కాదే అని ఒక్క పరుగున మళ్ళీ లోపలికి వెళ్ళి వడుగనంబిని పిలిచారు. ఆయన పాలు పొంగిపోకుండా దింపాలని అక్కడే నిలబడి యున్నారు. స్వామి! రండి త్వరగా అన్నారు వారు. అయ్యా! మీ పెరుమాళ్ళను సేవించుకొనడానికి నేను వస్తే మా పెరుమాళ్ళకు కాచే పాలు పొంగిపోవూ? అందుకే నేను రాలేదు అన్నారు. ఆయ్యా ఆహా! వడుగనంబీ, భగవద్దర్శనం, సేవ కంటెకూడా ఆచార్య దర్శనం, ఆచార్యసేవ, ఆచార్యనిష్ఠ చాలా గొప్పవని ఆచరణలో ఎంత బాగా చూపించావయ్యా! నిజమే, భగవంతుడు కూడా ఆచార్యుని యందు భక్తి శ్రద్ధలున్నవారికే మోక్షాన్ని అనుగ్రహిస్తాడు. నిన్ను చూచి మేమంతా నేర్చుకొనవలసినదెంతయినా ఉంది అనుకుంటూ వెనుదిరిగారు స్వాములు.

ఒకసారి యతిరాజులు శిష్యబృందంతో కలిసి దివ్యదేశయాత్ర చేస్తున్నారు. వడుగనంబి తమ ఆచార్యులకు పరిచారకులుగా వెన్నంటి ఉంటారు కదా! వారు తమ ఆచార్యుల తిరువారాధన మూటని తమ తలపై ధరించారు. తాము చేసుకొనే ఆచార్యుల తిరువడిగళ్ళు తిరువారాధనని కుడిచేత్తో పట్టుకొని వెళుతున్నారు. అంతలో వారు కావేరీనదిని దాటవలసి వచ్చింది. నీరు కొంచెం ఎక్కువగానే ఉన్నట్లనిపిస్తోంది. జాగ్రత్తగా నీటిలో దిగి నడవాలికదా. అప్పుడేం చేశారంటే తమ తలమీద ఉన్న రామానుజుల తిరువారాధన మూటమీద తమ ఆచార్య తిరువారాధన (తాము పూజించే రామానుజుల శ్రీపాదములను) ఆ మూటపైన పెట్టారు. అంటే క్రింద రామానుజుల ఆరాధన, దానిపైన తమ ఆరాధన (రామానుజుల శ్రీచరణములు)పెట్టి నడుస్తున్నారు. రామానుజులే స్వయంగా చూశారీవనిని. అయ్యో! అయ్యో! ఎంత అపచారం, నా స్వామిపైన నా తిరువళిగళ్ళను పెట్టడమా, అయ్యో! ఎంత పనిచేశారీ వడుగనంబి అని కంగారుగా వడుగా... వడుగా! ఏమిటయ్యా ఆ పని అన్నారు. “ఏం చేశాను స్వామీ! ఏం చెయ్యడమేమిటి? నా ఆరాధన నా భగవంతుని మీద నీ ఆరాధన అంటే నా తిరువడిగళ్ళను పెట్టవచ్చా? అన్నారు. దానికి వడుగనంబి స్వామీ! మీ పెరుమాళ్ళు తడువకూడదు గానీ మా పెరుమాళ్ళు తడువవచ్చా? అందుకే అలా పెట్టాను అన్నారు. అవాక్కయ్యారు రామానుజులు. ఆనందాంబుధి లో ఓలలాడారు శిష్యబృందం. భగవదారాధన కంటె భాగవ దారాధన ఆచార్య ఆరాధన గొప్పదని చాటారు వడుగనంబి.

వడుగనంబి అంటే రామానుజులకెంతో వాత్సల్యం. వారు రోజూ స్నానం చేసి ఊర్ధ్వ పుండ్రాలు ధరించే సమయంలో తాము ధరించగా మిగిలిన తిరుమణ్‌కాప్పు వడుగ నంబిని పిలిచి అతని ముఖంపై పెట్టేవారు. తర్వాత ఒక్క నవ్వు నవ్వి వెళ్ళిపోయేవారు వడుగనంబి. ఒకసారి తిరుక్కురుం గుడికి వెళ్ళారు రామానుజులు. అక్కడ ఒక చెఱువులో స్నానం చేసి ద్వాదశోర్ధ్వ పుండ్రాలు ధరించారు. చేతిలో ఇంకా కాస్త తిరుమణి శ్రీచూర్ణం మిగిలాయి. అలవాటుగా వడుగా వడుగా అంటూపిలిచారు. ఆ పిలుపు విన్నాడు తిరుక్కరుం గుడిలో వేంచేసి యున్న స్వామి తిరుక్కురుం గుడినంబి. నేను కూడా ఒక్కసారి రామానుజులకి శిష్యరికం చేస్తే ఎంత బాగుంటుందో అనిపించింది ఆయనకి. అనిపించడమేమిటి, వెంటనే వడుగనంబి రూపంలో సాక్షాత్కరించాడు రామానుజుల ముందు. రామానుజులు వడుగనంబే పిలవగానే వచ్చాడని అనుకొని ఏదీ ఇలా తిరుగు అంటూ ఆ ముఖంమీద ఊర్ధ్వపుండ్రాన్ని అలంకరించారు. నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు స్వామి వడుగనంబి. అతడు వెళ్ళిన రెండు నిమిషాలలో వచ్చాడు అసలు వడుగనంబి. అదేమిటి! నీ ముఖంపై ఇపుడేగా ఊర్ధ్వ పుండ్రాలు పెట్టాను అన్నారు రామానుజులు. స్వామీ! నేనిప్పుడేగా వస్తున్నాను. ఇంకా పెట్టించుకోనిదే అన్నాడు శిష్యుడు. ఆశ్చర్య పోయారు రామానుజులు. ఇంతలో అర్చక స్వాములు వేంచేసి స్వామి ముఖమండలంపై ఈ రోజు ఊర్ధ్వ పుండ్రాలు క్రొత్తగా కనిపిస్తున్నా యనిఅన్నారు. రామానుజులకెంత ఆనందమో! స్వామీ! తండ్రీ, నా దగ్గరకి చిన్న బాలునిగా వచ్చి నా చేత బొట్టు పెట్టించుకున్నావా నాయనా! ఇలా అడుగడునా నాతో కలిసే నడుస్తున్నావు, నీ దయ అత్యద్భుతం అంటూ దాసోహంచేసారు.

చిరునవ్వు నవ్వుతూ చూశాడు స్వామి, రామానుజా నేను ఈ జీవులనందరిని రక్షించడం కోసం ఎన్ని అవతారాలెత్తానయ్యా! ఎన్నో బోధలు చేశానయ్యా! కానీ ఎవ్వరూ నా వైభవాన్ని గుర్తించడం లేదే, పైగా నన్నొక సామాన్యునిగా భావించారే! మరి నీ విషయంలో గొప్పదనం ఏమిటయ్యా? నీకింత మంది శిష్యులైనిన్నెలా అనువర్తిస్తు న్నారయ్యా? ఇందులో రహస్యమేమిటి? అన్నాడు దానికి రామానుజులు ‘స్వామీ! నా దగ్గర మంత్ర రత్నమొకటుంది’. అది మంత్రజాతిలోనే గొప్పది. దానికి అష్టాక్షరిలాగా నియమ నిబంధాలు కూడా ఏమీ లేవు. కాలదేశాచార ఫలాది నియమాలు లేవు. పెద్దలు మంత్రరత్నా నుసంధానం తోటే కాలాన్ని పవిత్రంగా గడిపేవారట. ఆ మంత్రంతో నేను లోకాన్ని ప్రభావితం చేస్తున్నాను అన్నారు.

అపుడు పెరుమాళ్ళు ‘అయితే నాకు కూడా ఆ మంత్రాన్ని ఉపదేశించవూ’ అని అడిగారు.

దాని కేముంది మీరు చెప్పినట్లు శిష్యాచార్య వ్యవస్థ ఎంతో అవసరం. అంటూ మౌనం వహించారు రామానుజులు అర్థం చేసుకున్నారు. తిరుప్పురుంగుళి స్వామి వెంటనే ఒక బంగారు సింహాసనాన్ని ఒక చిత్రాసనాన్ని తెప్పించారు. రామానుజులను ఆ బంగారు సింహాసనంపై కూర్చుండ పెట్టి తాము చిత్రాసనాన్ని కొంచెం కిందుగా వేసుకొని శిష్యభావంతో రామానుజుల ముందు ఆసీనులయ్యారు. రామానుజులు క్షణకాలం కన్నులు మూసుకున్నారు. తాము భగవంతునికంటె ఎత్తుగా కూర్చున్నారా! కాదు కాదు ఇప్పుడు ఇక్కడ కూర్చున్న వారు మా ఆచార్యులు పెరియనంబిగారు. వారే స్వామికి ఉపదేశం చేస్తున్నట్లు భావించుకున్నారు రామానుజులు. స్వామిని చూశారు. శిష్యులలో ఉండవలసిన వినయం, మంత్రోపదేశం కోసం ఆతృత, ఆనందం ఉట్టిపడుతున్నాయి స్వామిలో వెంటనే "తిరుక్కురుంగుడి నంబి పెరుమాళ్ళ" దగ్గరగా చేరి వారి కుడి చెవిలో స్పష్టంగా మంత్ర రత్నమనబడే ద్వయమంత్రాన్ని ఉపదేశించారు. స్వామి ఆనందంతో 'నేను రామానుజ దాసుడను' అంటూ గట్టిగా ఉద్ఘోషించారు. శ్రీరామానుజులు పెరుమాళ్ళకు ''శ్రీవైష్ణవ నంబి'' అని దాస్యనామాన్ని ప్రసాదించారు. తిరుక్కురుం గుడినంబి శ్రీరామానుజుల్ని బ్రహ్మరథం మీద వేంచేపు చేసి ఊరేగింపచేశారు. రామానుజులు స్వామికి దాసోఽహం చేసి, 'స్వామీ' నాకొక గౌరవాన్ని ఆపాదించాలని, ఈ మంత్రం గొప్పదనాన్ని లోకానికి తెలియజేయాలని ఎంతటి లీలను ప్రదర్శించారు. నన్ను మన్నించండి అంటూ స్వామిని మళ్ళీ మళ్ళీ సేవించుకుంటూ స్వామి అనుమతిని గ్రహించి తమ నెలవునకు వేంచేశారు. ⇨⇨⇨



## గీతాజ్యోతి ధర్మక్షేత్ర సదస్సు

### ఆహ్వానము

స్థలం : విజయవాడ - పటమటలోని కోనేరు బసవయ్య చౌదరి జిల్లా పరిషత్ హైస్కూల్ ప్రాంగణం, తేది : **30-03-2003, ఉ॥ 9-00గం॥ల నుండి**

పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి పర్యవేక్షణలో....

| | | |
|---|---|---|
| ధార్మిక సదస్సు | : | ఉ॥ **9-00** గం॥ల నుండి మధ్యాహ్నం **12-30** ని॥ల వరకు |
| శోభాయాత్ర | : | మ॥ గం॥ **2-00** నుండి సా॥ **4-00** గం॥ల వరకు |
| శ్రీకృష్ణపూజ, గీతాజ్యోతి ప్రతిజ్ఞ | : | సా॥ **4-00** గం॥లకు |

శ్రీవారి పర్యవేక్షణలో జరిగే ఈ ధార్మిక కార్యక్రమమునకు భగవద్బంధువులు వచ్చి శ్రీవారి అనుగ్రహభాషణము శ్రవణం చేసి మంగళాశాసనములు పొందవలసినదిగా కోరుచున్నారు.

ఇట్లు : **గీతాజ్యోతి ధర్మక్షేత్రం, వికాసతరంగిణి, విజయవాడ.**





## శ్రద్ధాంజలి

మధురవాగమృతవర్షి, భగవద్విషయ రసాభిజ్ఞ **ఉ.వే.ప్ర. శ్రీమాన్ పరాశర సుదర్శన భట్టర్ అయ్యావార్లం గారు** 2-2-2003 నాడు పరమ పదనాథుని కైంకర్య నిర్వహణానికి తిరునాడలంకరించినారు.

'అయ్యావార్లంగారు'గా తూర్పుగోదావరిజిల్లాలో ప్రఖ్యాతులయిన ఉ.వే. శ్రీమాన్ సుదర్శన భట్టర్ స్వామివారి పూర్వులు 14వ శతాబ్దంలో కోరుకొండ నాయకుల కోరికపై కోరుకొండ వేంచేసినట్లు చరిత్ర. నాటినుంచే ఈ వంశంవారు శ్రీరంగాన్ని వదలకుండానే శ్రీరంగని సేవలతో పాటు శ్రీ లక్ష్మీనృసింహుని సేవిస్తూ ఉభయవేదాంత ప్రచారం కావిస్తూ ఎందరికో పంచ సంస్కారాలు ప్రసాదిస్తూ ఆచార్యకుటుంబంగా ఎనలేని విఖ్యాతి గడించారు.

ఆ కుటుంబానికి చెందిన ఉ.వే. శ్రీమాన్ పరాశర సుదర్శన భట్టర్ స్వామివారు రమారమి డెబ్బది సంవత్సరాలుగా తమ జీవితాన్ని సంప్రదాయసేవలో గడిపి సహస్ర చంద్రదర్శన మహోత్సవం జరుపుకొన్నవారు ఆనువంశికంగా వచ్చే శ్రీరంగ బ్రహ్మరథ మర్యాదను పొందిన మహానుభావులు.

ఉ.వే. శ్రీమాన్ ఆ.చి. శ్రీమన్నారాయణాచార్య స్వామివారు (తరువాత పెద్దజీయరుస్వామివారు) ఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్య స్వామివారలతో 70సం॥ల క్రితమే కలసి శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘం నెలకొల్పి దానికి తాము అధ్యక్షులుగా దక్షిణ భారతం అంతటా సభలు, సమావేశాలు, నిర్వహించి సంప్రదాయ ప్రచారం కావించిన వారు.

ఇంతటి ఆభిజాత్య పూర్వరంగంలో వెలసిన శ్రీ భట్టరుస్వామివారు గీతాభాష్య సేవనం ద్వారా కులపతులు ఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్య స్వామివారి విద్యావంశంలో తమకు అనుబంధాన్ని ఏర్పరుచుకున్నారు. ఆ విషయాన్ని ఎంతో ఆదరంతో ప్రీతితో పలు సభలలో వారు ప్రస్తావించేరు కూడా.

సంప్రదాయాభిజ్ఞులు, సరస మధుర వచోనిధులు. శ్రోతలు వారి ప్రవచనాన్ని ఆనందంతో ఆలకించి పులకించేవారు. ఆచార్య పురుషులుగా, ప్రవచన శిరోమణులుగా, భట్టర్ వంశీయులుగా శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘాధ్యక్షులుగా శిష్యుల, సంప్రదాయపరుల, పండితుల, పామరుల సర్వుల హృదయాలలో మహోన్నతంగా నిలిచే మహానుభావులు వారు.

ప్రతిష్ఠా వహమైన గోపాలోపాయన పురస్కారాన్ని గ్రహించిన ఉభయవేదాంత విద్వన్మణులు వారు.

ఎంతటి సంప్రదాయ ప్రవణులో అంతటి లౌకిక ప్రతిభాశాలులు. సంభాషణ చతురులు. సామాన్యుల గోష్ఠులకు, ధీమాన్యుల గోష్ఠులకూ వారు చూడామణులే.

ఆభిజాత్య వైదుష్యాలు ఒడ్డులుగా వారి సౌలభ్యకూలంకష ఎప్పుడూ నిండుగా ప్రవహించేది. మార్దవం, సౌకుమార్యం, మర్యాద ఔచితి మొదలయిన కల్యాణ గుణాలకు నెలవువారు. శ్రీరంగధామేశ్వరి అనుగుబిడ్డని, వంశవల్లి విరబూసిన దివ్యపారిజాతం వారు.

వారి అతిథి సంసేవనం ఎన్నరానిది, ఎనలేనిదీని. ఎన్ని సభలలో వారు అగ్రాసనాధిపతులు. సరేసరి కోరుకొండలో వారు నిర్వహించిన సభలకు, ఉద్యమాలకు లెక్కేలేదు.

సత్ సంప్రదాయ సరస్వతీ శ్రీచరణ మంజీరాలు రెండూ ఇంతకు ముందే పరమపదంలో నినదిస్తున్నాయి. ఇప్పుడీ కాంచన గ్రైవేయకం పరమపదానికి పయనమైనది. గ్రైవేయకం నిత్యముక్తానుభావ్యం కావాలని కాంక్షిస్తున్నాం.

-భక్తినివేదన



# ఇతిహాసబోధ - 13

మనో వికారాలకు లొంగి వర్తించడం మనిషి యొక్క బలహీనత. అతడు ప్రధానంగా ఆత్మాశ్రయి. తనను తాను గౌరవించుకొనే స్వభావి. అతనికి ఇష్టమైనది మంచి. కష్టమైనది చెడు. కలతపెట్టేది కీడు. ఆనందపరిచేది మేలు. తోచిందే సత్యం. తదితర మసత్యం.

ప్రపంచంలో అతనికన్నా ప్రీతిపాత్రమైనది మరొకటి లేదు. అతని జీవిత సుఖం కన్నా అభిమానించే అంశం వేరొకటి ఉండదు.

వ్యక్తిలోని ఈ "అతిమానిత్వ" మనస్తత్వం సామాజిక జీవనంలో అనేక సమస్యలను సృష్టిస్తుంటుంది. నలుగురితో కలసిమెలసి జీవించాల్సి వచ్చినప్పుడు, పదిమందితో కలసి సమాజ కార్యం చేయాల్సి వచ్చినప్పుడు అతిమాని ఇతరులకు సమస్య అవుతాడు. ఇతరులతడికి సమస్య అవుతారు.

ఈ అతిమానిత్వ లక్షణం వల్ల మనిషి "ధార్మిక జీవనాన్ని" గుర్తించడంలో తరచు గందరగోళానికి గురై, తొందరపాటు తనంతో తప్పుడు మార్గంలో పయనిస్తుంటాడు.

మాధవుడిని తన బలంగా చేసుకొని మనో వికాసం పొందాలని కోరుకొనే సాధకుడు ఈ "అతిమానిత్వం" పట్ల బహు జాగ్రత్తగా ఉండాలి. 'అతిమానిత్వం' వల్ల కలిగే భంగ పాటు ఎట్లాంటిదో 'అశ్వత్థామ వృత్తాంతం" ద్వారా మనకు తెలియజేయడానికి ఈసారి ఇతిహాస బోధ ప్రయత్నిస్తుంది.

అశ్వత్థామ ద్రోణాచార్యుని కుమారుడు. కృపాచార్యుని సోదరి అయిన కృపి అతని తల్లి. కుమారుని ఆకలి తీర్చడానికి కనీసం పాలైనా ఇవ్వలేని తన దుస్థితికి బాధపడి ద్రోణాచార్యుడు పేదరికాన్నుండి బయటపడటానికి బాల్య మిత్రుడైన పాంచాలరాజు ద్రుపదుడిని ఆశ్రయించాడు. ద్రుపదుడి తిరస్కారానికి గురై తగిన జీవనాధారం కోసం హస్తినకు చేరాడు ద్రోణుడు.

అగ్నివేశుని వద్ద, పరశురామునివద్ద తాను ప్రావీణ్యాన్ని పొందిన ధనుర్విద్యలో కౌరవ పాండవాది రాజపుత్రులను నిష్ణాతులను చేసే ధనురాచార్య పదవి చేపట్టాడు ద్రోణాచార్యుడు.

రాజపుత్రులతో పాటుగా కుమారుడైన అశ్వత్థామకు కూడా సమస్త విద్యలూ ఎంతో ఆత్మీయంగా నేర్పాడు. అస్త్రవిద్యలో అగ్ర గణ్యుడైన ద్రోణాచార్యునికి ప్రియమైన, ఏకైక కుమారుడనని అశ్వత్థామకు గర్వం. పైగా అతడు చిరంజీవి. తండ్రి కష్టపడి సాధించిన దివ్యాస్త్ర శస్త్రాదులకు సహజవారసుడు. పైగా ఆకలిదప్పుల భయం, దేవరాక్షసుల భయం, దొంగల భయం, సర్పభయం లేకుండాచేసి, నిద్ర, రోగం వంటివి దరిదాపులకు కూడా రానీయని శిరోమణి అతని స్వంతం.

వీటి దృష్ట్యా బాల్యం నుండి అశ్వత్థామకు దురభిమానం జాస్తిగానే ఉండేది. అయితే ద్రోణాచార్యుడు కన్నకొడుకైన అశ్వత్థామను ప్రేమించినట్లే అర్జునుని కూడా అతనిగుణసంపత్తి కారణంగా గాఢంగా అభిమానించాడు. ఆదరించాడు. ప్రేమించాడు.

విద్య ప్రారంభిస్తున్న సమయంలో ద్రోణా చార్యుడు రాజపుత్రు లందరినీ ప్రశ్నించాడు. 'నావద్ద సమస్త అస్త్రవిద్యలు నేర్చుకొని నా కోర్కె తీర్చగల సమర్థుడు మీలో ఎవ్వరు? అని.

అందరూ తలవంచి మౌనంగా ఉంటే అర్జునుడు గురువుగారి కోరిక నెరవేర్చగలనని ధైర్యంగా ముందుకు వచ్చి ప్రతిజ్ఞ చేసాడు.





ఆనాటి నుండి ద్రోణాచార్యునికి అర్జునుని మీద అమితాసక్తి.

దానికి తగినట్టుగా అర్జునుని ప్రావీణ్యం, వినయ విధేయతలు రోజు రోజుకీ ద్రోణా చార్యుని మెప్పుపొందేటట్లు చేసాయి. ఇదంతా గమనిసన్తూ అర్జునుని పట్ల మాత్సర్యాన్ని పెంచుకొన్నవారిలో అశ్వత్థామ కూడా ఒకడు. కర్ణుడు, దుర్యోధనాది కౌరవబృందం అందరికీ తెలిసిపోయే విధంగానే తమ మాత్సర్యాన్ని ప్రదర్శించేవారు. అశ్వత్థామది మరొక శైలి.

అతనికి అర్జునుడు విలువిద్యలో తనను మించి పోరాదని పట్టుదల. అందుకోసం తన స్థాయిలో చేయగల ప్రయత్నాలన్నీ తాను చేసాడు. "అర్జునునికి ఎప్పుడూ చీకటిలో భోజనం వడ్డించకు" అని అన్నం వడ్డించే సేవకుడికి స్పష్టంగా హెచ్చరించాడు అశ్వత్థామ. ఎందుకు చెప్పాడో అర్థంకాక పోయినా సేవకుడు తు.చ. తప్పకుండా అశ్వత్థామ సూచనను అమలు పరిచేవాడు.

అయితే ఒక రోజు రాత్రి విధివశాత్తూ పెద్దగాలి వచ్చి దీపం ఆరిపోయింది. అర్జునుడు అలవాటు ప్రకారం భోజనం పూర్తి చేసాడు. అదే సమయంలో అశ్వత్థామ ఊహించిన ప్రమాదం కూడా జరిగిపోయింది. చీకటిలో భోజనం చేయగలిగినప్పుడు చీకటిలో లక్ష్య భేదనం మాత్రం ఎందుకు సాధ్యంకాదు అని తనలో తానే ప్రశ్నించుకున్నాడు అర్జునుడు.

ఇక అప్పటి నుండి రాత్రిపూట కూడా చీకటిలో అర్జునుని అభ్యాసం కొనసాగింది. రాత్రి పర్యవేక్షణలో భాగంగా తిరుగుతున్న ద్రోణాచార్యుడు అస్త్ర విద్య పట్ల అర్జునునికున్న పట్టుదలను గ్రహించాడు. ఆశ్చర్యపోయాడు. ఆనందించాడు. అతడు శిష్యుడిని దగ్గరకు తీసుకొని "నాయనా! ధనుర్విద్యలో నీకు సాటి ఎవ్వరూ లేని విధంగా నిన్ను తీర్చిదిద్దుతానని" ప్రతిజ్ఞచేసాడు. ఆరకంగా అర్జునుడిని తీర్చిదిద్దాడు కూడా.

పాండవుల శక్తి సామర్థ్యాలు ముఖ్యంగా భీమార్జునుల బలపరాక్రమాలు, గుణగణాలు కౌరవులకు కంటగింపయ్యాయి. అశ్వత్థామకు కూడా ఈ విషయంలో రెండవ అభిప్రాయం లేదు. కన్నకొడుకు మీద ఉన్న ప్రేమకొద్దీ తనవద్ద ఉన్న సమస్త దివ్యా స్త్రాలనన్నింటినీ అశ్వత్థామకు అందించాడు ద్రోణాచార్యుడు. అలాంటి దివ్యాస్త్రాలలో మహామహిమాన్విత మైనది. బ్రహ్మశిరోనామ కాస్త్రం! సమస్త లోకాలను భస్మీపటలం చేయగల భయంకరశక్తి ఆ అస్త్రానికి ఉంది.

అర్జునునిమీద తన పుత్రునికి ఉన్న మాత్సర్యం ద్రోణాచార్యునికి తెలుసు! అందు వల్ల ఆ దివ్యాస్త్ర రహస్యాన్ని ప్రయోగ ఉప సంహార సహితంగా అర్జునునికి తెలియ జేసాడు. పాండవులపై పెంచుకున్న ఈర్ష్యచేత తన కుమారుడు ఎక్కడ తొందరపడి వారిపై ఆ దివ్యాస్త్రాన్ని ప్రయోగిస్తాడోననే భయంతో ద్రోణాచార్యుడు కుమారునికి ముందుగానే తగిన హితబోధలు చేసాడు.

"నాయనా! నీకెలాంటి ఆపద వచ్చినప్పటికీ మానవులపై మాత్రం ఈ దివ్యాస్త్రాన్ని ప్రయోగించకు. అలా ప్రయోగిస్తే నీకు అశుభం కలుగుతుంది" అని తన మనసెరిగి తండ్రి చేసిన హెచ్చరికలు అశ్వత్థామ పెడచెవిన పెట్టాడు. దివ్యాస్త్ర శస్త్ర సంపన్నుడననే గర్వం అశ్వత్థామకు ఎంతగానో ఉండేది.

ద్రుపదుని బంధించి తన కాళ్ళముందు పడవేసి గురుదక్షిణ చెల్లించిన ప్రియశిష్యుడైన అర్జునునికి కూడా బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని అందజేస్తూ ద్రోణుడు అర్జునుని వద్దనుండి

"తాను యుద్ధం చేసేటప్పుడు ప్రతి యుద్ధము చేయరాదను" మాట తీసుకున్నాడు. దివ్యాస్త్ర ప్రయోగ ఉపసంహారాది కార్యక్రమాలలో, లక్ష్యభేదనంలో అర్జునుని చాకచక్యం, అభ్యాసం జగద్విఖ్యాతి చెందాయి.

పాండవులను శక్తితో వొంచలేక మోసంతో మాయజూదంలో ఓడించి అడవుల పాలు చేసారు కౌరవులు. ఆ సమయంలో అశ్వత్థామ ఒకసారి ద్వారక వెళ్ళాడు. అక్కడ యాదవ కుమారులతో కొన్నాళ్ళు వినోదకాలక్షేపం చేసి ఓ రోజు శ్రీకృష్ణుడిని ఏకాంతంగా కలుసు కొన్నాడు.

"కృష్ణా! నాతండ్రి కావించిన తపస్సుకు మెచ్చి అగస్త్య మహర్షి బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని అనుగ్రహించాడు. నా తండ్రి ప్రేమతో ఆ అస్త్రాన్ని నాకిచ్చాడు. ఈ అస్త్ర మహిమ నీకు కూడా తెలుసుకదా! అలాంటి దివ్యాస్త్రాన్ని నీకిస్తాను. నీ సుదర్శన చక్రాన్నినాకు అనుగ్రహించు" అన్నాడు.

కృష్ణుడు నవ్వుతూ, "గురుపుత్రా! మా యాదవులందరికీ నీవు ప్రీతిపాత్రుడవు నీవు అడిగితే మేము కాదంటామా! ఇదిగో నా చక్రం. ఇది నా గద. ఇవి ధనుర్బాణాలు. ఇవి నా ఖడ్గాలు. నా ఆయుధాగారంలో నీవుధరించగల దానిని, ప్రయోగించగల దానిని దేనినైనా సరే, తీసుకు పోయే స్వేచ్ఛనీకుంది. అంతేగానీ వస్తుమార్పిడి నాకు అభిమతం కాదు" అన్నాడు.

అశ్వత్థామ సంతోషంతో సుదర్శన చక్రాన్ని స్వీకరించ ప్రయత్నించాడు. అయితే ఎంత ప్రయత్నించినా దానిని కదిలించడం అతని వల్లకాలేదు. ప్రయత్నించి ప్రయత్నించి అలసిపోయి అతడు ఉక్రోషంతో బుసలు కొట్టాడు.

అప్పుడు కృష్ణుడు ప్రశాంతంగా అన్నాడు "చూడు మిత్రమా! హిమాలయ పర్వతాలలో నేను రుక్మిణీ సహితంగా పన్నెండు సంవత్సరాలు బ్రహ్మచర్యదీక్షతో సాగించిన ఘోర తపస్సు ఫలితంగా ఈ సుదర్శన చక్రం లభించింది. ఈ దివ్యాయుధం వల్ల దేవదానవ గంధర్వాదు లెవ్వరినైనా సరే జయించగల శక్తి నాకేర్పడింది.

ఈ ఆయుధాన్ని బలరామ, ప్రద్యుమ్న, సాంబాది యాదవవీరులెవ్వరూ నానుండి ఆశించలేదు. నాకు ప్రాణసమానుడైన అర్జునుడు కూడా ఎప్పుడూ దీనిని అడగలేదు. అలాంటి దివ్యాయుధాన్ని నీవు కోరావు. ఒకవేళ నేను నీకు దీనినిస్తే ఎవరితో యుద్ధం చేయాలను కుంటున్నావో చెప్పు?" అని అడిగాడు.

"కృష్ణా ! ఈ సుదర్శన చక్ర ప్రభావం లోకప్రసిద్ధం! నీవు దీనిని నాకు ఇచ్చినట్లయితే నిన్ను అంగీకరింపచేసి, నీతో యుద్ధం చేద్దామనుకొన్నాను. కృష్ణునితో యుద్ధం చేసి ఓడని వీరుడని లోకులు నన్ను ప్రశంసించాలని ఆశపడ్డాను. ఏం చేస్తాను? ఈ చక్రం నీకు మాత్రమే ధరించతగినది కాబోలు!

అయినా ఇది లేకపోయినా నాకేమిటి భయం? ఎట్లయినా సరే నీతో యుద్ధం చేయగలను" అన్నాడు అశ్వత్థామ.

అశ్వత్థామయొక్క దురభిమానం, తనపట్ల అతని మాత్సర్యం అర్థమైకూడా ఏమీ తెలియనట్లుగా కృష్ణుడు నవ్వుతూ అశ్వత్థామను గౌరవించి అమూల్య ఆభరణాలతో, శ్రేష్ఠమైన అశ్వరాజాలతో సత్కరించి పంపాడు.

అరణ్య అజ్ఞాత వాసాలు పూర్తిచేసి పాండవులు తమ పాలిమ్మని అభ్యర్థించారు. దుర్యోధనుని మొండి పట్టుదల యుద్ధాన్ని అనివార్యం చేసింది. దుర్యోధనుడు బలాలను సమకూర్చుకొని భీష్ముడిని సర్వసైన్యాధిపతిగా





చేసుకొన్నాడు. భీష్ముడు తమ సేనలోని వీరులశక్తి సామర్థ్యాలను దుర్యోధనునికి తెలియజేస్తూ అశ్వత్థామను అర్జునునికి సాటియైన వాడని యుద్ధంలో సాక్షాత్తు యముడని, ప్రశంసించాడు.

ఆ తర్వాత దుర్యోధనుడు పాండవుల బలాలను హతమార్చడానికి ఎవరికి ఎన్ని రోజులు పడతాయని ప్రశ్నిస్తే భీష్ముడు తనకు నెలరోజులు పడుతుందన్నాడు. ద్రోణుడూ తనకు నెలరోజులు సమయం కావాలన్నాడు. కృపాచార్యుడు రెండు నెలలు పడుతుందంటే అశ్వత్థామ మాత్రం తనకు పాండవ బలాన్ని నశింపచేయడానికి పదిరోజులు సరిపోతుంద న్నాడు. కర్ణుడైతే మరొకడుగు ముందుకేసి ఐదురోజుల్లో పాండవసైన్యాన్ని భస్మీపటలం చేస్తానని ప్రగల్భాలు పలికి భీష్ముని అపహాస్యానికి గురయ్యాడు.

యుద్ధం ప్రారంభమైంది. ఏడు అక్షౌహిణుల సైన్యంతో పాండవులు, 11 అక్షౌహిణుల సైన్యంతో కౌరవులు పరస్పరం సంహారేచ్ఛతో యుద్ధాన్ని సాగిస్తున్నారు. కౌరవుల సర్వసైన్యాధిపతి అయిన భీష్మాచార్యుడు పదిరోజులు యుద్ధం చేసి అంపశయ్యకు చేరాడు. ద్రోణాచార్యుని నాయకత్వంలో కౌరవవీరులు విజృంభించారు. దివ్యాస్త్రవేత్తల బాణజాలానికి బలహీనులు బలిపశువు లయ్యారు. పాండవసేనను క్షీణింపచేయడంలో అశ్వత్థామది అగ్రతాంబూలం. తన దివ్యాస్త్రాలతో అతడొక్కడే రెండు అక్షౌహిణులకు పైగా పాండవ సైన్యాన్ని పరిమార్చాడు.

వీరాధివీరుడైన తన పుత్రుడు నేలకూలాడన్న వార్తవిని ద్రోణాచార్యుడు అస్త్ర సన్యాసం చేసాడు. దీనిని అవకాశంగా తీసుకొని దృష్టద్యుమ్నుడు నిరాయుధుడైన ద్రోణుని శిరస్సును పాశవికంగా ఖండించాడు. ఆ విధంగా నాలుగు దినములు ఒక రాత్రియు, ఐదవ దినమున 20 ఘడియలు విజృంభించి పోరాడి 21వేలమందిని హతమార్చిన తన తండ్రి నేలబడిన తీరు అశ్వత్థామకు తీవ్ర ఆగ్రహం కల్గించింది. పితృవధకు తగిన ప్రతీకారం తీర్చుకోదలచి దివ్యాస్త్రాలతో పాండవసైన్యంపై విజృంభించాడు.

ప్రళయ భయంకరమైన నారాయణాస్త్రాన్ని అశ్వత్థామ పాండవసైన్యంపై ప్రయోగించాడు. గురుని మరణానికి గాఢవిచారంలో ఉన్న అర్జునుడు తగిన ప్రతిక్రియ చేయడానికి ఇష్టపడక ఉపేక్షవహించాడు. ఆ దివ్యాస్త్ర మహిమవల్ల రకరకాల మారణాయుధాలు అగ్నిమయాలుగా మారి పాండవసైన్యాన్ని భస్మీపటలం చేయసాగాయి. ఆ అస్త్రం తన ఎదుటివారు విజృంభించిన కొద్దీ తానూ విజృంభించి వారిని నశింపచేస్తుంది. అస్త్ర మహత్తుకు వ్యాకులపడిన ధర్మరాజు, అర్జునుని ఉపేక్షకు బాధపడి తానే అస్త్రానికి ఆహుతి అవడానికి సిద్ధపడ్డాడు.

అప్పుడు శ్రీకృష్ణుడు పాండవసైన్యాన్ని రక్షించే ఉపాయాన్ని అందరికీ బోధించాడు. 'నారాయణాస్త్రం వాహనాలు దిగి నిరాయుధులై నేలమీద ఉన్నవారిని ఏమీ చేయదు. కనుక అందరూ ఆ విధంగా నిల్వండి' అని కృష్ణుడు ఆజ్ఞాపించాడు. ఈ లోపల అర్జునుడు తేరుకుని వారుణాస్త్రంతో నారాయణాస్త్రాన్ని కొంత శాంతింపచేస్తాడు. అశ్వత్థామ ఆగ్రహించి మరల ఆ దివ్యాస్త్రాన్ని ప్రేరేపించాడు.

భీముడు మొండిగా నారాయణాస్త్రానికి ఎదురు తిరిగి యుద్ధం చేస్తుంటే కృష్ణార్జునులు బలవంతంగా రథాన్నించి అతనిని దించి నిరాయుధుడిని చేసారు. నారాయణాస్త్రం శాంతించడంతో కౌరవులకు ఆశాభంగం కలిగింది. దుర్యోధనుడు మరొక్కసారి ఆ

అస్త్రాన్ని ప్రయోగించమని అశ్వత్థామను కోరాడు. అయితే దానిని మరొకమారు ప్రయోగిస్తే తనకే ఆపద అని, ఆ సూచనను తిరస్కరించి పాండవ సైన్యంపై ఆగ్నేయస్త్రాన్ని ప్రయోగించాడు. అది అక్షౌహిణి సైన్యాన్ని హతమార్చింది. అర్జునుడు బ్రహ్మాస్త్రం ద్వారా ఆగ్నేయాస్త్రాన్ని ఉపశమింపచేసాడు.

తన దివ్యాస్త్రాలన్నీ కృష్ణార్జునుల ముందు వృధా అయ్యేసరికి అశ్వత్థామకు ఆశ్చర్యం, సిగ్గు వేసాయి. యుద్ధం మాని ప్రక్కకు వచ్చి పరితపిస్తున్న గురుపుత్రునికి వేదవ్యాసుడు కనపడ్డాడు. తన దివ్యాస్త్రాలు కృష్ణార్జునులను దహించలేక పోవడానికికారణమేమిట''ని వ్యాసుడిని అడిగాడు అశ్వత్థామ. "నీకన్నా అధిక తపశ్శక్తి సంపన్నులైన నరనారాయణులు అర్జున కృష్ణులు. ఆదిమునులైన వారు పరమేశ్వరానుగ్రహం వల్ల నీకన్నా అధిక బలవంతులయ్యారు. హద్దులు తెలుసుకొని వర్తించు. వారు నీకన్నా అధికుల"ని బోధించి అదృశ్యుడయ్యాడు వ్యాసుడు.

సత్యం అనుభవ పూర్వకంగా బోధపడినా దురహంకారపూరితుడైన అశ్వత్థామ పాండవుల పట్ల వైరభావాన్ని వీడలేదు. 18 రోజుల యుద్ధానంతరం దుర్యోధనుడు భీముని గదా ప్రహారానికి నేలకూలాడు. విజయం లభించిందని పాండవసేనలు ఆనందంతో విశ్రాంతి తీసుకొన్నాయి. శ్రీకృష్ణుడు సాత్యకీ సమేతంగా పాండవులను తీసుకొని ఆ రాత్రి ఓఘవతీ నదీ తీరాన విశ్రమించారు.

అశ్వత్థామ నేలకూలిన దుర్యోధనుని ఆజ్ఞ చొప్పున సేనాధిపతి బాధ్యతలు స్వీకరించి కృపాచార్య కృతవర్మల సహకారంతో అర్ధరాత్రి పాండవసైన్య శిబిరంపై దాడి చేసాడు. నిద్రావశులై ఉన్న దృష్టద్యుమ్ను, శిఖండి వంటి పాంచాలురు, మత్స్య, చేదివంటి మిగిలిన సైన్యాలు, ఉపపాండవసమేతంగా అశ్వత్థామ ఆగ్రహానికి హతమారిపోయారు. రెండు జాముల కాలంలో పాండవ శిబిరంలోని గజాశ్వ సహితంగా సర్వాన్ని నేలకూల్చాడు అశ్వత్థామ.

కృతవర్మ కరుణవల్ల ప్రాణాలతో బయట పడ్డ దృష్టద్యుమ్నుని సారధి ఈ దారుణ హత్యాకాండను పాండవుల వద్దకు వచ్చి వివరించాడు. గెలిచినా ఓడినట్లయింది పాండవులకు. అశ్వత్థామ వల్ల తమ పక్షాన మిగిలిన సమస్త బంధువులను వారు కోల్పోయారు.

తమకింత కష్టం కలిగించిన అశ్వత్థామ యొక్క శిరోమణిని తనకప్పగిస్తే తప్ప శాంతించనని ద్రౌపది ధర్మరాజుకి తేల్చి చెప్పింది. భీమునితో ఆమె అశ్వత్థామ అంతు చూడమని కోరింది. నకుల సారథ్యంలో భీమసేనుడు అశ్వత్థామ అంతుచూడడానికి గంగానదీతీరంలో అతడు తలదాచుకొన్న వ్యాసాశ్రమం వైపు బయలు దేరాడు.

అశ్వత్థామ ఎంత ప్రమాదకారో శ్రీకృష్ణునికి తెలుసు. అతని దురభిమానం, క్రూరత్వం, దివ్యాస్త్ర సంపదల వల్ల భీమునికి ప్రమాదం రాకూడదని కృష్ణ సారధ్యంలో ధర్మజార్జునులు వ్యాసాశ్రమం చేరారు. ముందుగా తనమీదికి దూకుడుగా వస్తున్న భీముని, వెనుకనున్న ధర్మజ, కృష్ణార్జునులను గమనించిన అశ్వత్థామ ప్రక్కనే ఉన్న ముండ్ల దుబ్బును పీకి బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని అందులో ఆరోపించి "అపాండవమగుగాక" అని ప్రయోగించాడు.

బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని మరొక అస్త్రం శాంతింపచేయలేదు కాబట్టి అర్జునుడు కూడా బ్రహ్మశిరోనామకాస్త్రాన్నే ప్రయోగించాడు. ఈ రెండు దివ్యాస్త్రాల సంరంభం వల్ల లోకం అతలాకుతలం కాసాగింది. మానవులపై





ప్రయోగించరాని ఈ దివ్యాస్త్రాలను ఉపసంహరించుకోవలసిందిగా నారద సమేతంగా వేదవ్యాసాది మునులు ఇరువురినీ కోరారు. ఋషుల ఆజ్ఞపై ఇంద్ర తనయుడు తాను ప్రయోగించిన దివ్యాస్త్రాన్ని ఉపసంహరించాడు. అశ్వత్థామకు అస్త్రాన్ని ఉపశమింప చేయడం చేతకాలేదు.

"అర్జునునికి ఈ అస్త్రాన్ని కూడా ఉపశమింప చేసేశక్తి ఉంది. అయితే ఒకరు ప్రయోగించి మరొకరు ఉపసంహరిస్తే దేశంలో 12 ఏళ్ళు అనావృష్టి సంభవిస్తుంది. కనుక నీవే ఏదో విధంగా అస్త్రాన్ని ఉపసంహరించు" మన్నాడు వేదవ్యాసుడు. అంతేకాదు అర్జునునికి అశ్వత్థామ తన శిరోమణిని అప్పగించి తీరాలని సంధి పద్ధతిని నిర్ణయించాడు వ్యాసుడు.

అశ్వత్థామ చేసేదిలేక అస్త్ర లక్ష్యాన్ని పాండవులపై కాకుండా పాండవస్త్రీల గర్భాలకు ఎక్కుపెట్టాడు. ఒక్క గర్భాన్నైనా ఉంచమని వ్యాసుడు కోరిన కోరికను తప్పుగా అర్థం చేసుకొని పాండవుల భార్యల గర్భాలకే కాకుండా పాండవ సంతానానికి చెందిన భార్యల గర్భాలను కూడా నాశనం చేయ సంకల్పించాడు అశ్వత్థామ. అశ్వత్థామ మనస్సు తెలుసుకొన్నారు వ్యాసుడు, కృష్ణుడు. 'ఒక్కనినైనా సరే వదలిపెట్టు. నేను పాండవ సంతానాన్ని రక్షిస్తాను అని అశ్వత్థామను కోరాడు'. కృష్ణుడు 'నీవు ఉత్తర గర్భాన్ని రక్షించాలనుకొంటున్నావేమో? నా అస్త్రంతో అదికూడా నాశనమౌతుంది. అస్త్ర దగ్ధుని నీవు బ్రతికిస్తే మంచిదే కదా!" అని కృష్ణుని హేళన చేసాడు అశ్వత్థామ.

కృష్ణుని, వేదవ్యాసుని అభ్యర్థనలకు తిరస్కరించి అశ్వత్థామ తన అస్త్రం ద్వారా సకల గర్భ ఛేదనం చేసాడు. కృష్ణునికి ఆగ్రహం కల్గింది. "తిండికి కరువై, ఒంటరిగా దుర్గంధ రక్తంతో మలినమైన దేహంతో మూడు వేల ఏళ్లు అలమటించమని'' అశ్వత్థామను శపించాడు. వ్యాసుడుశ్రీకృష్ణుని శాపాన్ని సమర్థించి, తన ఆశ్రమం నుంచి వెళ్ళిపొమ్మని అశ్వత్థామను మందలించాడు.

కృష్ణ శాపోపహతుడై, సహజంగా తనకు లభించిన అత్యంత ప్రభావ పూరితమైన శిరోమణిని పాండవులకర్పించి అశ్వత్థామ వెళ్ళిపోయాడు.

దురహంకారంతో, మాత్సర్యాన్ని పెంచుకొని, క్రోధంతో ఇతరులను హింసించి, తాను బాధపడి శ్రీకృష్ణ భగవానుని శాపానికి గురైన అశ్వత్థామ సామాన్యుడుకాడు. వైవస్వత మన్వంతరంలో 28వ మహాయుగానికి కృష్ణద్వైపాయనుడు వేదవ్యాసుడైతే 29వ మహాయుగంలో అశ్వత్థామ వైష్ణవాంశతో వేదవ్యాసుని బాధ్యతలు నిర్వహించనున్నాడు.

అశ్వత్థామతో పాటు ఆనాడు జీవించిన పాండవులు లేరు. కృష్ణ భగవానుడూ తన భౌతిక దేహం చాలించాడు. అయితే నలభై మూడు లక్షల ఇరవై వేల సంవత్సరాలపాటు కనీసం అశ్వత్థామ జీవిస్తాడు. శ్రీకృష్ణుని శాపాన్ని అనుభవించిన తర్వాతైనా సరే పశ్చాత్తాపంతో అతడు వైష్ణవత్వాన్ని పొందడం కోసం ఈ సుదర్ఘకాలాన్ని సద్వినియోగం చేసుకొంటూ ఉండి ఉంటాడు.

మనకు మన తప్పులను దిద్దుకొనేందుకు అశ్వత్థామకున్నంతటి ఆయుష్షులేదు. అయితే ఆయనకు మించిన దురభిమానం మాత్రం పుష్కలంగా మన నరనరాల్లో ఉన్నది.

సామాజిక జీవనంలో 'స్పర్థ'తో కాకుండా శాంతియుత సహజీవనం కోసం తోటి వారితో కలసి సాధన చేయడమెలాగో మనకు బోధపడటంలేదు. మాధవుడు మెచ్చే మానవులం

కావాలనే మన ప్రయత్నం ఫలవంతం కావాలంటే మనలో 'అతిమానిత్వం' దూరం కావాలి. అతిమానిత్వం వల్ల మనలో తలెత్తే మాత్సర్యాలు తత్ఫలితంగా ఏర్పడే వాక్పారుష్యాలు, వైరాలు మటుమాయం కావాలి! మనల్ని మనం తగ్గించుకొనేందు కోసం "మాధవసేవక" వ్రతదీక్షతో ముందుకు నడవాలి! అశ్వత్థామ యొక్క దూకుడును మననుండి తొలగించుకొని "అమానిత్వం" దిశగా అడుగులు వేసేందుకు ప్రేరణ కలిగించడమే ఈ "ఇతిహాస బోధ"కు లక్ష్యం!

ఈ నీతిని ఆచరించడంతోపాటు, యథాప్రకారం ఈ కథకు కూడా తగినపేరు సూచించడం మరువకండీ..!

## ఇతిహాసబోధ - 12 శీర్షికకు పాఠకులు పంపిన కొన్ని పేర్లు

1. అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు అహంకారము పనికిరాదు.
   -ఎస్. లక్ష్మీనరసింహారావు, గుంటూరు
2. శ్రీస్వామివారంతటి ఆచార్యుని నీడలో మనము ఉన్నామని గుర్తుంచుకొని చేసే సేవే సేవకవ్రతం.
   - జె. అమరయ్య, అమరావతి.
3. గర్వమే అజ్ఞానానికి మూలం.
   - ఎస్.ఆర్. పున్నయ్య, గుంటూరు
4. ఎవరికైనా అహంకారం పనికిరాదు.
   - ఎమ్. సూర్యనారాయణ
5. గర్వం జ్ఞానానికి శత్రువు, అహంకార చిత్తం అభివృద్ధికి ఆటంకం - సి.పాపిరెడ్డి , నిర్మల్
6. గర్వం అస్తి-సేవనాస్తి
   - ఎన్. లక్ష్మీనరసయ్య, కరీంనగర్
7. జ్ఞానోదయం - ఎమ్ జయప్రకాష్, హన్మకొండ
8. కంచుమ్రోగునట్లు కనకంబు మ్రోగనా
   - వి. సుజాత, హైదరాబాద్
9. గర్వభంగం జ్ఞానానికి మూలం
   - జి. నరసింహాచార్యులు, కందుకూరు
10. అహంకారం గర్వం వీడిన - పరమేశ్వరుని చేరును. - ఎన్. ఉమామహేశ్వరరావు, అనకాపల్లి
11. అహంకారం అభివృద్ధికి అవరోధం
    - ఎమ్. విశ్వనాధం, హన్మకొండ
12. అహంకారమును గర్వమును వీడుదాం - జ్ఞానమై భాసిల్లుతాం
13. నిగర్వియే నిక్కమైన బ్రహ్మ-పరబ్రహ్మ
    - ఆర్. చక్రపాణి, హనుమకొండ
14. ప్రాణులందరికి ప్రభువు -ప్రాణం పుండరీకాక్షుడే .
    - ఎస్. పుష్పలత కమలాకరరావు, కరీంనగర్
15. అహంకారం అదృశ్యం-జ్ఞానం సదృశ్యం
    - సిహెచ్. హనుమంతరావు, కరీంనగర్
16. భగద్భావ సేన భక్తిసమశ్రితః భగవద్బంధుః సమాజసేవా తత్పరత - యమ్. పాండురంగాచార్య, హన్మకొండ.
17. భగవద్భావనతో భగవద్బంధు సేవాశ్రితం
    - యమ్. శేషగిరి, హన్మకొండ.
18. గర్వం జ్ఞానానికి శత్రువు
    - జె. రాధాదేవి మధుసూదనరావు, కరీంనగర్.
19. నాపతనానికి కారణం నేనే
    - శ్రీవిఠల్, చిన్నబాడారం.
20. అహంకారులకు గర్వభంగం తప్పదు.
    - యమ్. విశ్వనాథం, విజయనగరం.
21. ఆత్మస్తుతి పరనింద పనికిరావు
    - కె. రామశేషమ్మ, హిల్‌కాలనీ.
22. గర్వాన్ని భంగపరచటమే గీతాజ్యోతి సత్సందేశం.
    - యమ్. విజయ శ్రీదుర్గాప్రసాదరావు, అడపర్లపాడు.

ఈ శీర్షికకు పేర్లు పంపిన భక్తులందరికీ శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములు తెలియజేస్తున్నాం.

- మీ వికాసతరంగిణి













# బదరికాశ్రమంలో పునర్నిర్మించే సత్సంగ సదనం నిర్మాణ నిమిత్తం విరాళములు సమర్పించిన దాతల కైంకర్య వివరములు

**మహారాజ పోషకులు :**

రూ. 1,50,000/- సమర్పించినవారు: శ్రీమాన్ జె. సంతోష్‌కుమార్, లీలా, ఆనంద్‌నగర్, హైదరాబాద్;

**లక్షరూపాయలు సమర్పించిన వారు :**

శ్రీమతి వి.రమాదేవి పద్మమోహనరావు, శ్రీమాన్ ఎ.వి.ఎస్ రాజు, శ్రీమాన్ ఎన్.ఎమ్. చౌదరి, విజయలక్ష్మి, హైదరాబాద్;

రూ. 50,000/- సమర్పించినవారు : శ్రీమతి జి. వనజా భాస్కరరావు, సికింద్రాబాద్; వీరు గతంలో రూ. 1,50,000/- సమర్పించారు.

**రాజపోషకులు : 10వేల నుండి 25వేల రూపాయలు సమర్పించినవారు**

శ్రీమాన్ ఎన్. అశోక్‌కుమార్, సికింద్రాబాద్; శ్రీమతి పద్మామన్మదకిషన్, హైదరాబాద్; శ్రీమాన్ ఆర్. మహాశంకర్, పుష్పలత, హైదరాబాద్; శ్రీమాన్ జి. నరసింగరావు, హైదరాబాద్; శ్రీమాన్ వి. అశోక్‌కుమార్, సికింద్రాబాద్; డా॥ బచ్చు మురళీకృష్ణ, శ్రీమతి బచ్చు మాధవి, వరంగల్; శ్రీమాన్ పి. కృష్ణారెడ్డి, శ్రీమాన్ పి. శివశంకర్; శ్రీమతి కె. సరళ, శ్రీమతి ఆర్. అనసూయ, శ్రీమతి పి. గోవిందమ్మ, హైదరాబాద్; శ్రీమాన్ సిహెచ్. నరహరి స్వామి జ్ఞాపకార్థం శ్రీమాన్ సి.హెచ్. జగన్నాథ స్వామి, హైదరాబాద్; శ్రీమాన్ కె. పార్థసారథి హిమవతి, హైదరాబాద్;

**జీవిత సభ్యులు : (2,500 నుండి సమర్పించినవారు)**

శ్రీమాన్ ఎస్.డి.వి. ప్రసాద్‌రావు; శ్రీమాన్ ఎస్. అశోక్; శ్రీమాన్ సి.వి.ఎ.ఎస్. సూర్యనారాయణ; శ్రీమాన్ పాండురంగారెడ్డి; శ్రీమాన్ ఎస్. రంగాచార్యులు, రమాదేవి, హైదరాబాద్;

**అభిమానులు : (250 రూపాయలు ఆపైన సమర్పించిన వారు)**

**హైదరాబాద్** : శ్రీమాన్ కె. ఈశ్వరరావు, నిర్మల; శ్రీమాన్ వెంకటేశ్వరరావు, విజిత; శ్రీమాన్ నాగేశ్వరరావు అబ్బమ్మ; శ్రీమాన్ ఆర్. ప్రభాకరరావు, రంగారెడ్డి; శ్రీమాన్ జగపతిరావు సుకన్య; శ్రీమతి కె. విమలాదేవి; శ్రీమతి ఎమ్. కృష్ణకుమారి; శ్రీమాన్ ఎమ్. వెంకటేశ్వరరావు; జె. శ్రీనివాసరరెడ్డి, శ్రీవాణి; శ్రీమాన్ మురళీధర్‌రెడ్డి; శ్రీమతి జి. వసుందరాదేవి; శ్రీమాన్ ఇ. రామభద్రరాజు; శ్రీమాన్ జి. శరత్‌కుమార్ నీరజ; శ్రీమతి అనూరాధ సురేంద్రరెడ్డి; శ్రీమాన్ అమృతకృష్ణారెడ్డి; శ్రీమాన్ వి. వెంకటాచారి; శ్రీమతి విలాసతి కుమారిరావు; శ్రీమాన్ సిహెచ్. శేషగిరిరావు; శ్రీ డా॥ జగన్మోహనరావు; శ్రీమాన్ పద్మనాభరావు; శ్రీమాన్ వై, అనసూయాదేవి; శ్రీమాన్ వై. రఘునాథన్; శ్రీమతి సుశీలా దత్తాత్రేయ ప్రసాద్; శ్రీమాన్ ఆర్. రాయల రామలింగమ్; శ్రీమాన్ సుఖేంద్రరెడ్డి లలిత; శ్రీమాన్ ఎస్. మల్లేశ్వరరావు; శ్రీమాన్ కె. సురంజనరెడ్డి; శ్రీమాన్ పి. జానకి చంద్రశేఖరరావు; శ్రీమాన్ బి. రాజారావు; శ్రీమతి శ్రీమాన్ ఎన్. మనోహర్ రెడ్డి; శ్రీమతి సిహెచ్. సుశీలాదేవి; శ్రీ సిహెచ్. భాస్కరరావు; శ్రీమాన్ ఆర్. విశాలకుమార్, శ్రీమతి గీత, సికింద్రాబాద్; శ్రీమాన్ పి. ప్రవీణ్‌కుమార్, హైదరాబాద్; శ్రీమాన్ పి. అనుజ రవీంద్రకుమార్, శ్రీమాన్. వి. ప్రతిభ రవీందర్‌రావు, శ్రీమాన్ వై. రవీంద్రబాబు, శ్రీమతి ఎమ్. మణెమ్మ, శ్రీమతి చంద్రకాంత రత్న, శ్రీమతి రామశేషమ్మ, శ్రీమతి సుమిత్రా రవీంద్రరెడ్డి, శ్రీ బి. హరిరామ్, ఈశ్వరమ్మ, శ్రీమాన్ ఎమ్. రమేష్‌రెడ్డి, శ్రీమతి ఎమ్. సుదేష్ణ, శ్రీమతి పి. శకుంతలా జగన్నాధరావు, శ్రీమాన్ పి. మహేంద్రరావు, శ్రీమతి జి. రాధికా గిరిధరరెడ్డి, శ్రీ వి. పుష్పమాలా పురుషోత్తమరెడ్డి, శ్రీ డి. రామసత్యన్నారాయణరాజు, శ్రీమాన్ డి. సూర్యమురళీధర్, శ్రీమాన్ కె. రాంబాబు, విజయభారతి, ఆర్. రామమోహనరావు,

ఆర్ భాస్కర్, వరలక్ష్మి, శ్రీమాన్ ఎమ్. రామిరెడ్డి, శ్రీమతి ఆర్. అరుణ, శ్రీమాన్ పి. వెంకట శ్రీనివాసరావు, శ్రీమాన్ వి. వరహాలు, శ్రీమాన్ ఎమ్. ప్రసాదరావు, శ్రీమతి పి. గజలక్ష్మి, శ్రీమాన్ మధుసూదన్, శ్రీమతి ఎమ్. సరోజ, శ్రీమతి ఎమ్ సుకన్య, శ్రీమతి ఎస్. అనసూయ, శ్రీమతి జి. కమలాదేవి, శ్రీమతి టి. పద్మజారాణి, శ్రీమాన్ వి. చంద్రశేఖర్, హైదరాబాద్.

శ్రీమతి అరుణా రాజేశ్వరరావు, మాదాపూర్, శ్రీమతి ఎన్. శకుంతలాదేవి, గోదావరిఖని, శ్రీమాన్ ఎ. పాండురంగం, విద్యావతి, సిద్ధిపేట; శ్రీమాన్ ఎల్.ఆర్.వి. ప్రసాద్, మచిలీపట్నం; శ్రీమాన్ సి.వి. రమణారావు నిర్మల, విశాఖపట్నం; శ్రీమతికె. రామకుమారి, బెంగుళూరు.

**పై నిర్మాణమునకు వాగ్దానం చేసిన కైంకర్యపరులు :**

**మహారాజ పోషకులు :**

**3 లక్షల రూపాయలు వాగ్ధానం చేసినవారు :** శ్రీమాన్ ఎ.ఎన్. సుదర్శన్ అండ్ బ్రదర్స్, గాంధీనగర్, హైదరాబాద్;

1 లక్షరూపాయలు వాగ్ధానం చేసినవారు : శ్రీమాన్ కె. రామకృష్ణారెడ్డి, శ్రీమాన్ వి. వరకుమార్గుప్త, శ్రీమాన్ తుడుపునూరి శ్రీరాములు, అంజమ్మ, శ్రీమాన్ దీకొండ శ్రీనివాస్, శ్రీమాన్ ఎమ్.వి గుప్త, రాజేశ్వరి, వేములపల్లి కోదండరామయ్య, లక్ష్మిఅన్నపూర్ణ జ్ఞాపకార్థం, శ్రీమాన్ మట్టపర్తి వెంకటసుబ్బారావు, శ్రీమతి రామచంద్రమ్మ హైదరాబాద్; శ్రీమాన్ నాగులపల్లి లక్ష్మణరావు, తార, సికింద్రాబాద్; శ్రీమాన్ సతీష్, అరుణకుమారి, శ్రీమతి కె. అనంతమ్మ సిస్టర్స్, శ్రీమాన్ ఎమ్.వి.ఎస్.ఆర్. ప్రసాద్, శ్రీమతి చెరుకూరి మైత్రేయి, విజయవాడ; శ్రీమతి ఎన్. విజయలక్ష్మి, శ్రీమాన్ డా॥ శోభ, జయంత్, జె.జె. హాస్పిటల్స్, సికింద్రాబాద్; శ్రీమాన్ బొమ్మెర్ల హనుమంతరావు భాగ్యలక్ష్మి, ఫీల్ కానా హైదరాబాద్;

**రాజపోషకులు** : రూ. 50,000/–లు ఆపైన వాగ్దానం చేసినవారు. శ్రీమాన్ పి. యాదయ్యగుప్త, మహబూబ్ నగర్; శ్రీమాన్ కట్టా నరసింహులు, మహబూబ్ నగర్; శ్రీ సి. సిమ్మయ్య అండ్ బ్రదర్స్, శ్రీమతి వాడాలి శాయిరాజేశ్వరి, కూకట్ పల్లి, హైదరాబాద్; శ్రీమాన్ చీకోటి జనార్ధన్, హిమయత్ నగర్ హైదరాబాద్;

**పోషకులు :** రూ. 20,000/–లు ఆపైన వాగ్దానం చేసినవారు. శ్రీమాన్ తుమ్మల పాండు స్వరాక్షమ్మ, శ్రీమాన్ చివనాళ్ళనరసింహస్వామి కుమార్, శ్రీమాన్ సి.హెచ్. జగన్నాథం, శ్రీమతి. వి. సుగణమ్మ, శ్రీమాన్ సిహెచ్. పాపారెడ్డి దిల్షుక్ నగర్, హైదరాబాద్; శ్రీమాన్ ఆర్. జగన్నాథం, వరలక్ష్మి జ్ఞాపకార్థం

## శుభవార్త

**ఏప్రిల్ నెలలో వెలువడు భక్తినివేదన బదరీ ప్రత్యేక సంచికలో మీ వ్యాపారాభివృద్ధికి ప్రకటనలు ఇవ్వదలచినవారికి అవకాశము కలదు.**

**ఒక పేజీ ప్రకటన (ఆర్టుపేపరుతో) మల్టీకలర్లో ప్రింటు చేయుటకు రూ. 6000/- మాత్రమే.**

**ఆసక్తికలవారు భక్తినివేదన కార్యాలయమును కానీ, ఈ క్రింది ఫోన్ నెంబర్లను గాని సంప్రదించగలరు.**

**శ్రీమాన్ టి. రమేష్గుప్తాగారు, హైదరాబాద్. ఫోన్ : 040 – 56532507 (మొబైల్), భక్తినివేదన కార్యాలయము, సీతానగరము, ఫోన్ : 08645 – 272929, 272353. JET హైద్రాబాద్, ఫోన్ : 04023224426**





శ్రీమాన్ ఆర్. నారాయణ, హైదరాబాద్; శ్రీమాన్ పి. రామమూర్తి, నల్లకుంట, హైదరాబాద్; శ్రీమతి ఎ. సీతాకుమారి, హైదరాబాద్; శ్రీమాన్ జయంత్ రెడ్డి జ్ఞాపకార్థం శ్రీమతి కె. సరళ, హైదరాబాద్; శ్రీమాన్ శేషం శ్రీనివాసా చార్యులు మలక్పేట, హైదరాబాద్.

రూ. 10,000/–లు ఆపైన వాగ్దానం చేసినవారు. శ్రీమాన్ దాచేపల్లి పాండురంగ సుభద్ర, మలక్పేట, హైదరాబాద్; శ్రీమతి గుండవల్లి సరస్వతి హైదరాబాద్; శ్రీమాన్ కంచర్ల ఆదిశేషయ్య, రామసీతమ్మ, ఉప్పల్, హైదరాబాద్; శ్రీమాన్ బి. సత్యనారాయణరావు, ధనలక్ష్మి, వాసవీ కాలనీ హైదరాబాద్; శ్రీమాన్ యస్. యల్లారెడ్డి, భారతి, హైదరాబాద్; శ్రీమాన్ వి. రమావసంతరావు, బేగంపేట, హైదరాబాద్; శ్రీమాన్ యస్. సామారెడ్డి, అచ్చమ్మ, హైదరాబాద్;

**జీవిత సభ్యులు :** రూ. 2,500/–లు ఆపైన వాగ్దానం చేసినవారు. హైదరాబాద్ : శ్రీమాన్ కట్టా మురళీ కృష్ణమూర్తి, శ్రీమతి లక్ష్మిగోపాలరెడ్డి, శ్రీమాన్ కేశవరెడ్డి, శ్రీమాన్ టి. మనోహరరావు, శ్రీమాన్ సి.హెచ్. రాజగోపాలాచారి, శ్రీమాన్ నడుదూరు రాములు.

**అభిమానులు :** రూ. 1,000/–లు ఆపైన వాగ్దానం చేసినవారు. హైదరాబాద్ : శ్రీమాన్ ఆర్. ప్రభాకరరావు, శ్రీమాన్ యన్. సత్యనారాయణ జయమ్మ, శ్రీమాన్ రామకృష్ణంరాజు మారుతీ, శ్రీమతి హిమవతి కోనరాయుడు, శ్రీమాన్ భరతరాజు పార్వతి, శ్రీమాన్ దేవులపల్లి వెంకటప్పారావు, శ్రీమాన్ యస్. కోదండ రామారావు, శ్రీమాన్ డి. నరసింహారావు, శ్రీమాన్ కె. గోపాల్ విజయ, శ్రీమాన్ సివిఎయస్. సూర్యనారాయణ, శ్రీమాన్ కె. మురళీధర్, శ్రీమాన్ జి. శ్రీనివాసరావు, శ్రీమాన్ వెంకటరామ ప్రభాకర శాస్త్రి,

సికింద్రాబాద్ : శ్రీమాన్ పాటిబండ్ల సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీమాన్ జి.వి.యస్. సీతారామశాస్త్రి, శ్రీమాన్ టి. సులోచన రావు, శ్రీమాన్ కె. గోపీధర్.

**జ్యోతి దర్శనం:** హిమగిరి శిఖరాలలో బదరికావనంలో 6 నెలలనుండి దేవతలచే పూజలను అందుకొని నారాయణుడు మనకి 2003, మే, 8వ తేదీన దర్శనమిస్తున్నాడు. మన అష్టాక్షరీ క్షేత్రంగూడ మే 8వ తేదీనుండి భగవద్బంధువులకు స్వాగతాన్ని పలుకుతోంది.

## గీతాజ్యోతి ధర్మక్షేత్ర మహోత్సవ

### శుభాహ్వానము

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో**

**వీరంకిలాకు వికాసతరంగిణివారు గీతాజ్యోతి ధర్మక్షేత్ర కార్యక్రమము మరియు అఖండ శ్రీవిష్ణుసహస్రనామ పారాయణం నిర్వహింపదలచినారు.**

**తేది : 29-03-2003, శనివారము**

**వేదిక : వీరంకిలాకు, పమిడిముక్కల మండలం, కృష్ణాజిల్లా.**

**వివరములకు : గీతాజ్యోతి ధర్మక్షేత్ర సమన్వయ మండలి, వీరంకిలాకు. ఫోన్ : (08676) 282254, 282249, 282219**

**అందరికీ శుభాహ్వానము**

# వికాస దర్శిని నివేదన

## పాల్వంచ-శ్రీసుదర్శనయాగం

ఖమ్మంజిల్లా పాల్వంచలోని నవభారత్ ఫెర్రోఎల్లాయిస్ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీమాన్ అశోక్-రమాదేవి దంపతుల ఆహ్వానంపై శ్రీస్వామివారు ఫిబ్రవరి 23 నుండి 26 వరకూ శ్రీ సుదర్శనయాగం జరిపించారు. శ్రీ పాంచరాత్రాగమ కళాశాల అధ్యాపకులు శ్రీమాన్ ఎమ్. మధుసూదనాచార్యులగారి యజ్ఞాచార్యత్వంలో సుదర్శనయాగానికి 23వ తేది రాత్రి అంకురారోపణ జరిగింది. (నవభారత్ శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయ ప్రాంగణంలో అగ్నిమథనంతో యాగమారంభమైంది. యజ్ఞాన్ని గురించి సుదర్శన భగవానుని వైభవం గురించి హృద్యముగా 3 దినాలు ప్రవచనాలు సాగాయి.

24వ తేదీ మధ్యాహ్నం భద్రాచల క్షేత్ర సందర్శనానికై E.O. శ్రీమాన్ మురళీధరరెడ్డిగారు అర్చకస్వాములు, పురప్రముఖులు ఆహ్వానించగా శ్రీస్వామివారు వేంచేసి పెరుమాళ్ళసేవ, పూజాదులను నిర్వర్తించి ఆలయంలో జరుగుతున్న నూతన నిర్మాణాలను గురించి తెలుసుకుని, తగు సూచనలను అందించారు. స్థానికంగా ఉన్న మన శ్రీజీయర్ మఠానికి వేంచేసి, వికాసతరంగిణి, గీతాజ్యోతి గోష్ఠులను ఉద్దేశించి గీతాజ్యోతి సందేశాన్ని అనుగ్రహించారు. శ్రీ జీయర్ మఠం నిర్వాహకులు శ్రీమాన్ వెంకటాచార్యులు (LIC) గారిని, మఠం ధర్మకర్తల గోష్ఠికి మంగళాశాసనాలను చేసారు. నవభారత్‌లోని ఆడిటోరింయలో 24నాటి లక్ష్మీపూజలు, 25నాటి సమాశ్రయణ కార్యక్రమాలు విలక్షణంగ జరిగాయి.

25వ తేదీనాడు పూర్ణాహుతి తరువాత నవభారత్ ఫ్యాక్టరీని సందర్శించి అధికారులను, కార్మికులను మంగళాశాసనం చేసారు. ఫ్యాక్టరీలోని ప్రతి అణువు ఎంతో పరిశుభ్రంగాను, పచ్చదనం చెదరకుండా ఉంచినందుకు శ్రీమాన్ అశోక్‌గారితో తదితర నిర్వాహకులను శ్రీవారు ప్రశంసించారు. శ్రీమాన్ అశోక్-రమ దంపతుల గృహాన్ని పావనం చేసి, మంగళాశాసనం చేసారు.

26వ తేదీన సుదర్శన యాగ పూర్ణాహుతి అత్యంత వైభవోపేతంగా జరిగింది. పెరుమాళ్ళ సన్నిధిలో మహాకుంభప్రోక్షణ, తీర్థగోష్ఠి కాగానే శ్రీస్వామివారు, శ్రీమాన్ అశోక్-రమ దంపతులకు శ్రీమాన్ విక్రమ్-రాజశ్రీ దంపతులకు, ఈ యాగ నిర్వహణకై అనుక్షణం శ్రమించిన శ్రీమాన్ ప్రసాద్‌గారు, శ్రీమాన్ చిన్న ప్రసాద్‌గారు ప్రభృతులకు, నవభారత్ కుటుంబానికి మంగళాశాసనాలను కృపచేసారు. శ్రీమతి రమాదేవిగారు తమతో కైలాసయాత్రలో పాల్గొన్న, అర్తమూరు పాపారాయుడు దంపతులను, దొరబాబు, దంపతులను, కాశీరాజుగారిని, విజయవాడ శ్రీమతి సత్యవతిగారిని ప్రత్యేకంగ ఆహ్వానించి ఆదరించడం, వారి సౌహార్దానికి ప్రతీక.

పాల్వంచనుండి తిరుగు ప్రయాణంలో కొత్తగూడెం ప్రాంత పరిసరంలోని గీతాజ్యోతి గోష్ఠిని పర్యవేక్షించి, ప్రయోజనవంతంగా నిర్వహిస్తున్న మహిళా కార్యకర్తలను, మార్గదర్శనం చేస్తున్న శ్రీమాన్ N.Ch. రామకృష్ణమాచార్యులుగారిని, వికాస తరంగిణి కొత్తగూడెంశాఖ వారిని మంగళాశాసనం చేసారు. అక్కడి నుండి శ్రీమాన్ J.V.V. రంగారావు



(బదరీ అన్నదాన కమిటి సభ్యులు) గారి ఆహ్వానంపై స్థానిక శారదాకుటీర్‌కు వేంచేసి, గీతాజ్యోతి సందేశాన్ని అనుగ్రహించారు. అక్కడ శ్రీమతి తనూజగారు, రాంప్రసాద్ ప్రభృతులకు మంగళాశాసనం చేసి సుమారు రాత్రి 8 గంటలకు సీతానగరం ఆశ్రమానికి చేరారు.

## శ్రీవారు తిరుమలలో...

అదే రాత్రి10 గం॥లకు బయలుదేరి ఉదయానికి తిరుపతికి చేరుకున్నారు. టిటిడి, E.O శ్రీమాన్ అజయ్‌కల్లాం IAS, శ్రీమాన్ బాలసుబ్రహ్మణ్యం IAS గార్లు శ్రీవారిని తిరుమల వేంచేసి, 5,6 దినాలుండి సాంప్రదాయిక విషయాలలో కొంత మార్గదర్శనం చేయవలసిందిగా అహ్వానించారు. దానిని మన్నిస్తూ శ్రీస్వామివారు 27-1-2003 నుండి 2-2-2003 వరకు తిరుపతిలో వేంచేసి ఉన్నారు.

27, 28, 29వ తేదీలలో తిరుమల అర్చక వర్గంలో శ్రీమాన్ వెంకటరమణ దీక్షితులుగారు, ముడంబాకం శ్రీనివాసాచార్య స్వామి, నిత్య సేవక వర్గానికి చెందిన శ్రీమాన్ శేషాద్రిగారు, ఏకాంగులు, జీయరుస్వాము లను, కొందరు ఆచార్య పురుషులను ప్రత్యేకంగా మఠానికి ఆహ్వానించి జరుగుతున్న, జరుగుతూ ఆగిపోయిన, జరుగవలసిన అనేక వైదిక, సాంప్రదాయిక పద్ధతులను గురించి చర్చించారు.

ఇదే సమయంలో కేరళకు సంబంధించిన శ్రీమాన్ ఉన్నికృష్ణన్, వారి పరివారంతో గూడ ఆలయ కట్టుబాట్ల సంస్కరణ విషయంలో కూలంకషంగా చర్చించారు. ఈ చర్చలలో E.O గారు మరియు JEO గారు గూడ పాల్గొని, ఆలయాభివృద్ధి గురించి దాపరికం లేకుండా తమ తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. మొదట్లో ఈ ప్రక్రియకు కొంత వ్యతిరేకత ఉన్నా JEO శ్రీమాన్ బాలసుబ్రహ్మణ్యంగారి చొరవతో ప్రక్రియ పూర్తిగ సానుకూలంగ జరగడానికి వీలయింది.

తిరుమలలో వేంచేసి ఉన్న శ్రీభూవరాహ స్వామి, శ్రీనివాసుడు, తిరుపతిలో వేంచేసి ఉన్న గోవిందరాజస్వామి, అలివేలుమంగాపురం (తిరుచానూరు)లో వేంచేసి ఉన్న పద్మావతీ అమ్మవారి సన్నిధికీ వైభవంలో సమానమైన ప్రాధాన్యం ఉంది. కొండపై ఉండే స్వామి పుష్కరిణికీ, ఆలయంలో ఉన్న బంగారు బావికీ, పాపవినాశనం, ఆకాశగంగ, క్రింద ప్రవహించే సువర్ణముఖీనదికీ గూడ సమానమైన గొప్పదనమున్నదనీ పురాణాలు ఉద్ఘోషిస్తున్నాయి.

తిరుమలంతా శ్రీవరాహస్వామివారిదే. శ్రీ వేంకటేశ్వరుడు అక్కడికి అతిథిగ వచ్చి స్థిరనివాసం ఏర్పరచుకొన్నాడు. కుమారస్వామి, పరమశివుడూ ప్రభృతి దేవతలంతా శ్రీనివాసుణ్ణి గురించి తపస్సు చేసి అక్కడ నిరంతరమూ ఆ స్వామి సేవలో తరిస్తున్నారని పురాణ ప్రసిద్ధి. తెలియని అల్పజ్ఞానులు శ్రీనివాసుణ్ణి శక్తియో, శివుడో, స్కంధుడో అని భావించారు. ప్రామాణికంగా అతడు విష్ణువేనంటూ పురాణాలలో స్పష్టం చేసిన మూర్తికి పునః శంఖచక్రాదులనిచ్చి భగవద్రామానుజులు అక్కడ ఆచార్య స్థానంలో విరాజిల్లుతూంటారు.

ఆ రోజుల్లో దురాచారంతో భ్రష్ఠులై రాజదండన పొందిన వైఖానసార్చకులను సంస్కరించి లోపాలను సవరించి ఆలయంలో విష్వక్సేనులనూ, నృసింహస్వామిని ప్రతిష్ఠించి వైఖానసాగమం ప్రకారం ఆరాధనలను సవరించి, తెన్నాచార్య సంప్రదాయం ప్రకారం వివిధ సేవలు జరిగే ఏర్పాటు క్రమబద్ధం చేసారు భగవద్రామానుజులు. తమ ఆచార్యులలో ఒకరైన శ్రీ శైలపూర్ణులకు, తమ శిష్యులైన అనంతాళ్వాన్‌లకు సంపూర్ణ అధికారమ ప్పగించి, అప్పటి యాదవరాజును ఆలయ సేవలను వృద్ధి చేయుడానికాజ్ఞాపించారు. కొందరు ఆచార్య పురుషులను దివ్యప్రబంధాదులు జరిపే సేవలలో నియోగించారు. వీరందరిపై అధికారిగ, విష్వక్సేన స్థానంలో కాషాయవస్త్రం మాత్రం ధరించే ఏకాంగులను నియమించారు. వారినే తదుపరి

జీయరుస్థానంలో ప్రతిష్ఠించి, వారి ఆధీనంలో సేవలను పర్యవేక్షిస్తూ సమర్ధవంతంగా నిర్వహించ డానికి ఏకాంగులను నియమించారు. వీరంతా అనంతాళ్వాన్ ఆజ్ఞాబద్ధులు కావాలని, ఎవరిలో లోపమున్నా వెంటనే తొలగించి, యోగ్యులను నియమించవచ్చనే అధికారాన్ని అనంతాళ్వాన్‌కిస్తూ, వారికి ఆజ్ఞాబద్ధులై ఉండాలని అప్పటి రాజును ఆదేశించారు భగవద్రామానుజులు.

వైఖానసార్చకులకు పంచ సంస్కారాలు ప్రసాదించి, సంప్రదాయాన్ని మరవద్దని స్వామి సేవను పునః ప్రకాశింపచేసారు. భగవద్రామా నుజులవారు తిరునాడు అలంకరించాక, భగవదా దేశం మేరకు, అనంతాళ్వాన్, ఆలయంలో ఆచార్యులుగా శ్రీరామానుజులు వారిచే స్వయంగ అందుకున్న వారి శిలామూర్తిని ప్రతిష్ఠించారు.

కొండపైనా, స్వామి పరివారాలయాలూ వైఖానసాగమంతో ఆరాధనలందుకున్నా, అమ్మవారి సన్నిధి మాత్రం శ్రీ పాంచరాత్రం ప్రకారం జరుగు తుంది. రెంటికీ శ్రీ జీయరుస్వామినే ప్రతినిధిగ, నిర్వాహకులుగా శ్రీరామానుజులు నియమించారు. ఆగమాలు వేరైనా, సంప్రదాయాలు తెన్నాచార్య తెంగలై సంప్రదాయమే. పంచసంస్కార సంపన్నులే ఆరాధనలు ప్రసాదాదులు చేసి సమర్పించాలనేది నియమం.

వీటిన్నింటికీ స్థిరమైన ఆధారాలున్నా ప్రస్తుతం అవన్నీ లుప్తప్రాయమైపోయాయి. సమస్తమూ వ్యాపారమయమై, సమస్త దురాచాచాలకీ మూల కేంద్రమై, కేవలం ప్రదర్శన తప్ప మంత్రభావ శుద్ధి అనేది అన్ని వర్గాలలోనూ పూజ్యమైపోయింది. దివ్యప్రబంధ పారాయణ సంకుచించుకుపోయింది. చివరికి దేమునికి చేసే ప్రసాదం గూడ అధికార, అనధికార ఉద్యోగులు, అయోగ్యులూగూడ తాకనిదే తయారు కాని స్థితి ఏర్పడింది.

రాత్రి శయనోత్సవంగూడ నామమాత్ర మైంది. రెండుపూటలా ఆరాధనానంతరం బంగారు వాకిలి తలుపులు తాళంవేసి, జీయరుమఠానికి చేరాలనే శాసనం ఉన్నా, అసలు తాళం వేసే అలవాటే 1996 నుండి మరచిపోయారు, శ్రీవరాహస్వామి, నృసింహుడు, వరదరాజస్వామి, రామానుజులు, విష్వక్సేనుల సన్నిధులలో ఆరాధనలే కూడదనే స్థితి ఏర్పడి 'చాలకాలంగ' ఆరగింపు తప్ప ఇతర ఉపచారాలు నిలిపే వేసారు. ఎంతకాలంగ ఆగిపోయిందో ఎవరూ చెప్పలేకపోయారు, మన స్వామివారు ప్రశ్నించినపుడు. ఇక ప్రసాదాల విషయానికి వస్తే 'లడ్డు' తప్ప మిగిలినవి ప్రసాదాలే కావనే రీతిలో ప్రచారం జరిగింది. అదో లడ్డు తయారీ ఫ్యాక్టరీ తప్ప పవిత్రతే లేదు.

ఇదంతా 1970 తర్వాత నుండి చాలవేగంగా పతన దశలో సాగింది. ఆగమ నియమానికి జరిగే వార్షిక కళ్యాణం ఒకేసారి. మిగిలినవి భక్తులకై చేసే ఆర్జిత సేవలు, అవి రోజూ వందల మంది చేసుకుంటూంటారు. నియమం ప్రకారం నివేదన చేసే ప్రసాదమును 'పడితరం' అంటారు. అది తప్ప భక్తులకై చేసేది అవసరాన్ని బట్టి మారుతూ ఉంటుంది.

భక్తులెప్పుడూ పవిత్రమైన, భక్తి శ్రద్ధలు కల్గిఉంటారు. అధిక సంఖ్యలో, వసతులుంటే పాల్గొనాలనే అనుకుంటారు. ఏ పరిమితిలో వారిని పాల్గొన నివ్వాలనేది అధికారులు నిర్ణయించాలి. సంప్రదాయ పరిచయము ఏమాత్రమూ అధికారుల కుండదు. వారికి కావలసింది, తమ పై అధికారులను, రాజకీయ నాయకులనూ తృప్తిపరచడమే. ఆ దిశలో సంప్రదాయమునూ, ఆచారాలను పట్టించుకోరు. అవసరమైతే అధికారికంగ తొలగించేస్తారు. విపరీతంగా, విరుద్ధంగానో గూడ మార్చేస్తారు. అది పూర్తిగ వారిదోషంకాదు. పై అధికారులు రాబడి పెంచమంటారు. రాజకీయనాయకులు ఓట్లకోసం ప్రజా సౌకర్యాలు పెంచమంటారు. ఈ సంఘర్షణలో అర్చకులు, అచార్య పురుషులు, సంప్రదాయ





పాలకులైన జీయర్లు, ఏకాంగుల వంటివారు యోగ్యులై, విషయపరిజ్ఞాన మున్నవారై, సంప్రదాయ రక్షణ బద్ధులైతే, అధికారులకు విషయాన్ని తెలియచేయాలి. లేదా, వారు అంగీకరించకపోతే ఆచారాన్ని రక్షించుకోవడానికి ప్రాణాన్నైనా పణంగ పెట్టి, దేముని సేవకు, వైభవానికీ లోపం రాకుండా కాపాడాలి. ఈ వైదిక వర్గాలవారు ధనాశాపరులూ, భ్రష్టాచారులూ అయితే అధికారులకు విషయాన్ని వివరించలేరు. అలాంటపుడు అధికారులు, తామాచరించేదే శాస్త్రం అనుకుంటారు తప్ప, తాము దోషం చేస్తున్నామని తెల్సుకోలేరు. అప్పుడు ఆ దేవుని సన్నిధిలో జరిగే అనాచారం, లోపం ఇటు ధర్మాన్ని, అటు దేశాన్నిగూడ నాశనం చేస్తుంది. అనావృష్టులు, దోపిడీలు, దుఃఖాలు, హత్యలూ వంటి ఈతి బాధలు పెరిగి ప్రజలంతా నిత్య శోక పరాయణులే అవుతారు. మన రాష్ట్రంలో, దేశంలోని ఈ స్థితి స్పష్టంగా గోచరిస్తూనే ఉంది. వైదిక వర్గమంతా, సంప్రదాయ శ్రద్ధ కలిగి ప్రవర్తిస్తే ఈ లోపాలుండవు. అందుచేత, రాష్ట్ర నాశనానికి ప్రథమ బాధ్యత నేతలది, అధికారులదీ అయినా, వారిని సరైన దిశలో శాసించలేకపోయిన వైదిక సాంప్రదాయిక వర్గానికే ఆ దోషం చెందుతుంది. అందుకే బాగుపడటం గూడ అక్కడే ప్రారంభం కావాలి. దానికి అధికారుల తోడ్పాటు చాల అవసరము. ప్రస్తుతమారకమైన వాతావరణం టి.టి.డి.కి ఏర్పడింది. బహుశః స్వామి ఈ వ్యవస్థను బాగుచేసుకోదలచుకున్నట్టు న్నాడు. అందుకే అధికారులైన E.O., J.E.O. యోగ్యులూ, వ్యవస్థనుబాగు చేయాలనే దీక్షకలవారిని తెచ్చుకున్నాడు.

31వ తేదీన మన స్వామివారి సన్నిధిలోనే E.O., J.E.O. అర్చకులూ, జీయర్లు ఇద్దరూ, ఏకాంగులూ, ఆచార్యపురుషులూ మొదలైన వారందరితో ఓ చారిత్రాత్మక సమావేశం జరిగింది. **ఒకరితో ఒకరు కలువక పోవడం, అందరూ కలిసి మాట్లాడుకోకపోవడం, సరియైన కార్యక్రమ రచన లేకపోవడం, నేనే గొప్ప** అనే అహంభావం అన్ని వర్గాల్లో నిండి ఉండటమే అన్ని అనర్థాలకూ మూలమని తేలింది. ఇవి మారితే అన్ని సవ్యంగా జరుగుతాయని, ఇకపై ఆ 'సద్భావనామయ భక్తి వాతావరణాన్ని' ఏర్పరచుకుందామని ఓ అవగాహనకు అంతావచ్చారు. 100 శాతం కాకపోయినా కొన్ని లుప్తమైన సంప్రదాయాలను వెంటనే పునః ప్రారంభించాలని నిర్ణయించారు.

1. దేమునికి పడితరంగ చేసే ప్రసాదాన్ని కట్టెలపై ఆచారంగ, బంగారు బావిదగ్గరి వంటశాలలో (పోటు)నే, శిఖాధారులైన స్వాములే చేస్తారు. అందులోఉన్న స్టీమ్ పొయ్యిలు, తొలగించేస్తారు. వైష్ణవ వైదికేతరులెవ్వరూ ఆ పోటులోనికి ప్రవేశించరు. వాటిలో, ప్రారంభంగా మాత్రప్రసాదాన్ని ఒకటవ తేదీనుండి ఆరంభిస్తారు. మిగిలినవి క్రమంగా తొలగించేస్తారు.
2. ఎంత మందిజనమున్నా రాత్రి 1 గంటకు బంగారు వాకిలి తాళం వేసి, గతంలోవలె తాళాలు, జీయరుమఠానికి ఒకటి, అర్చకులతో ఒకటి, పారేపత్తుదారు వద్దకు (ఓ అధికారి) ఒకటి వెడతాయి. తిరిగి 3 గం॥లకు సుప్రభాతం చేస్తారు. రెండు గంటల విశ్రాన్తి నివ్వడం 1996 తర్వాత తిరిగి ప్రారంభిస్తారు.
3. ఆలయ వైదిక వర్గమంతా, ఏకాంగులూ, అర్చకులతో సహా శిఖాధారులై ఉండాలి.
4. పడిభాష్యకారులు సన్నిధి జీర్ణోద్ధరణ జరిగింది. ఫిబ్రవరి 7వ తేదీన సంప్రోక్షణ జరగాలి. అది వైఖానసాగమం ప్రకారమే జరగాలి. శ్రీశఠారి, విష్వక్సేనులు అక్కడి ఆలయం నుండి వేంచేసి ఆ కార్యక్రమం జరపాలి. ఆ వెంటనే పెరుమాళ్ళ కళ్యాణం, ఆపై రథసప్తమీ ప్రయుక్త పెరుమాళ్ళ వివిధ

వాహన సేవలూ జరుగుతాయి.

5. మరల త్వరలో అందరూ కలిసి ఈ అమలును పరిశీలించి, మిగిలినవి నిర్ణయించాలి.

అందరూ దీనికి అంగీకరించారు. జనవరి 31వ తేదీ రాత్రి 1 గం॥కు మన శ్రీచిన్నజీయరుస్వామి వారు ఆలయానికి వేంచేసారు. శ్రీమాన్ శేషాద్రిగారు, ఏకాంగులూ, దగ్గర ఉండి బంగారు వాకిలి తాళాలను, శయనోత్సవానంతరమూ వేసి, సీలు (హనుమంతుని ముద్ర) వేసి, తాళాలన్నీ వేసి కుంచెకోల అర్చకులు పట్టుకు వెళ్ళారు. తాళాలన్నీ హనుమన్ముద్రతో సీలువేసి ఓ పెట్టెలో పెట్టి దానికీ టి.టి.డి. సీలువేసి గొల్లవాడు పెద్ద జీయరు మఠానికి పట్టుకువెళ్ళాడు. ఆ పై తాళాలు పారేపత్తుదారు స్థానానికి పంపారు. తిరిగి 2గం॥ల విశ్రాన్తి తర్వాత ఫిబ్రవరి 1వ తేదీ 3 గం॥లకు తిరిగి ప్రాచీన సంప్రదాయం ప్రకారం సుప్రభాతం పాడారు.

ఈ మధ్య టి.టి.డి.వారు క్రొత్త ప్రాకారాన్ని నిర్మాణం చేయాలని నిర్ణయించడం వివాదాస్పద మైంది. నిర్మాణావసరమేమని శ్రీమనస్వామివారు తెలుసుకోగోరారు. కళ్యాణోత్సవాల్లో పాల్గొనే భక్తులకు లోపల చోటు చాలటంలేదు. లడ్డూలు చేసే పోటులో వసతి చాలడంలేదు. ఇవి రెండూ ప్రాకారంలోపలే జరగాలి తప్ప, బయట వీల్లేదనేది ఆగమ సలహాదార్లు, అర్చకుల వాదన. ఈ కారణంవలన, పైగా రక్షణ దృష్ట్యాగూడ ప్రాకారం అవసరమని అధికార్లు తలచి నిర్మాణానికి రూ. 70కోట్లు ఖర్చు చేయదలచారు. సమగ్ర విషయ పరిశీలన చేసాక, ఆ ప్రాకార నిర్మాణం అవసరంలేదని మన శ్రీస్వామివారు స్పష్టం చేసారు. వార్షికంగ, ఆగమోక్తంగ జరిగే కళ్యాణం కావాలంటే లోపలే, ప్రస్తుతం జరిగేచోటనే జరుపుకోవచ్చు. ఆర్జితం భక్తులకై జరిగే నిత్యకల్యాణాలు, ప్రాకారం బయట చేయడం చాలా ప్రామాణికాలయాల్లో ఉందని అది తప్పుకాదని ఆర్జితం భక్తులకోసమే చేసే లడ్డూ ప్రసాదాలు, మడపళ్ళి తాయారును ప్రతిష్ఠించి సరియైన పాకశాలను ప్రాకారం బయటకూడా చేయడంలో ఆక్షేపణ లేదని గూడ తెలిపి, వీటికై ప్రాకార నిర్మాణం అనవసరమన్నారు.

ఇక రక్షణ దృష్ట్యాగూడ ప్రాకార నిర్మాణం మరోలాచేయాలనీ, వర్తమాన మాడవీథి వెనుకగా అన్ని హంగులతో మహాప్రాకారాన్ని నిర్మించాలని, అది స్వామి పుష్కరిణిని, వరాహ సన్నిధినిగూడ లోపలే ఉండేట్టుగ చేయవచ్చుని, స్థలం కావాలంటే, ఆలయపు ముందున్న గొల్ల మండపాన్ని ఓ 100 అడుగులు వెనక్కి జరుపదగునని సూచించారు. దీనిపై పరిశీలిస్తామని అధికారులు శ్రీవారికి హామీనిచ్చారు. ఫిబ్రవరి 1వ తేదీన టి.టి.డి. ధర్మ ప్రచారపరిషత్ అధికారులతో గూడ, వారి కార్యక్రమాల గురించి శ్రీవారు చర్చించారు.

27వ తేదీన శ్రీరంగనారాయణ రామానుజ జీయరుస్వామివారికి, దీర్ఘకాలంగ ఎదురు చూస్తున్న ఆలయమర్యాద సమర్పణ జరిగింది, ఆలయ ధర్మకర్త్ర మండలి, శ్రీచిన్నజీయరుస్వామివారుగూడ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. తమ ఈ మర్యాద భగవద్రామానుజులవారిదని, తమ జీవితాశయం నెరవేరిందనీ ఆ స్వామివారు సంతృప్తులైనారు. ఇది ఎప్పుడో జరుగవలసిందని, ఇప్పుడైనా జరిపి తమను తాము సమ్మానించుకొన్న బృహత్ గౌరవం వర్తమాన అధికారులందరికీ దక్కిందని మన శ్రీ చిన్న జీయరుస్వామివారీ సందర్భంగా ప్రవచించారు.

మన మత సంబంధ జీర్ణోద్ధరణను పర్యవేక్షించి శ్రీస్వామివారు క్రింది గోవిందరాజస్వామివారినీ, పద్మావతీ అమ్మవారి సన్నిధిని సేవించి, 2వ తేదీన తిరుమల నుండి తిరుగు ప్రయాణం చేసారు.

మధ్యలో మన వేదవిద్యాలయ అథర్వ విద్యార్థి, ఇప్పుడు టి.టి.డి. వేదపాఠశాల అధ్యాపకులు అయిన ఉ. సత్యనారాయణాచార్యులు నిర్మాణం చేసుకొన్న నూతన గృహాన్ని సందర్శించి మంగళా శాసనం చేసారు. దానికి ముందుగ మన వికాస తరంగిణి,





శ్రీ నాగేంద్రశాయిగారి గృహాన్ని సందర్శించి వారికి మంగళాశాసనాలు చేసారు.

**మంగళగిరిలో ....**

తిరుపతి క్షేత్రం నుండి 2వ తేదీ రాత్రి బయలుదేరి 3వ తేది ఉదయానికి ఆశ్రమానికి (సీతానగరం) చేరుకున్నారు. 3వ తేది ఉదయం 9-30కి మంగళగిరిలో 'చిల్లపల్లి వారి కల్యాణ మండపాన్ని' ప్రారంభంచేసి ఆ మండప నిర్మాతలయిన శ్రీమాన్ నాగేశ్వరరావుగారికి, వారి పరివారాన్ని మంగళాశాసనం చేసి, తిరిగి ఆశ్రమానికి వేంచేసారు.

**చిట్యాలలో....**

4వ తేది ఉదయం బయలుదేరి వరంగల్ జిల్లా, తొర్రూర్ ప్రాంతంలోని చిట్యాల గ్రామానికి వేంచేసారు. శ్రీమాన్ సముద్రాల వెంకటాచార్యులు గారి యాజ్ఞిక నిర్వహణలో జరుగుతున్న ప్రతిష్ఠా కార్యక్రమాలను పర్యవేక్షించి, రాత్రి సామూహిక లక్ష్మి నారాయణపూజలను ఆచరింపచేసారు. 5వ తేది ఉదయం శ్రీస్వామివారి సన్నిధిలో తీర్థగోష్ఠి తర్వాత ఉదయం 9-30ని॥లకు శ్రీరామాలయ ప్రతిష్ఠా కార్యక్రమం జరిగింది. శ్రీమాన్ శ్యామసుందర్‌రావు గారు, వారి అన్న శ్రీధరరావుగార్లు నిర్మించిన శ్రీరామాలయంలో శ్రీస్వామివారు శ్రీకరకమలాల ద్వారా యంత్రస్థాపన, ప్రతిష్ఠలను నిర్వహించారు. శ్రీమాన్ శ్యామసుందర్‌గారిని, వారి కుటుంబాన్ని, చిట్యాల గ్రామ ప్రజానీకాన్ని మంగళాశాసనం చేసి వరంగల్‌కి బయలుదేరారు.

**వరంగల్‌లో...**

శ్రీమాన్ బచ్చు మురళీకృష్ణ దంపతులు, శ్రీమాన్ బచ్చు రాధాకృష్ణ దంపతుల ఆహ్వానంపై వరంగల్ మట్టెవాడలోని శ్రీరామాలయానికి వేంచేసారు. అక్కడి వారు, ఆళ్వారాచార్యుల, శ్రీపెద్దజీయరుస్వామి వారు, శ్రీ చిన్న జీయరుస్వామివార్ల మూర్తులను చెక్కిన ఇత్తడి రేకులను ఆవిష్కరించారు. రామాలయ స్తంభాలకు అందమైన తొడుగులుగా వాటిని సమర్పించిన శ్రీమాన్ బచ్చు మురళీకృష్ణగారి కుటుంబ సభ్యులకు మంగళాశాసనం చేసి హనుమకొండకు బయలుదేరారు. ఈ కార్యక్రమంలో శ్రీ ఉ.వే.ప్ర. శ్రీమాన్ శ్రీ న.చ. రఘునాధాచార్య స్వామివారు కూడ వేంచేసి ఈ కార్యక్రమాన్ని సుసంపన్నం చేసారు.

**హనుమకొండలో...**

హనుమకొండ శ్రీమాన్ మహేంద్రరెడ్డిగారింటికి వేంచేసి పాదపూజను స్వీకరించారు. సమీపకాలం లోనే వివాహం చేసుకోబోతున్న వారి కుమారునికి మంగళాశాసనాలను కృపజేసినారు. శ్రీమతి జ్యోతి (వికాసతరంగిణి కేంద్ర కమిటి సభ్యురాలు)గారు వారి పెరుమాళ్ళ కోసం నూతనంగా నిర్మించు కుంటున్న గృహానికి వేంచేసి మంగళాశాసనాలను కృపచేసారు. ఆ రాత్రే భాగ్యనగరం మీదుగా శ్రీస్వామివారు బీచుపల్లి అనే గ్రామం చేరారు. శ్రీమాన్ కె.రామకృష్ణారెడ్డి (మన జెట్ సలహాదారులు) గారు, శ్రీమాన్ పద్మనాభరెడ్డిగార్లు, కర్నూలు హైవేలోని బీచుపల్లి గ్రామంలో కృష్ణానదీ తీరాన నూతనంగా నిర్మించిన శ్రీరామాలయ ప్రతిష్ఠా కార్యక్రమానికై శ్రీస్వామివారు వేంచేసారు. శ్రీమాన్ ముడుంబై రామానుజాచార్యస్వామివారి బ్రహ్మత్వంలో వారి కుమారులు శ్రీమన్నారాయణా చార్యులుగారు యజ్ఞాచార్యులుగా నిర్వహిస్తున్న ప్రతిష్ఠా కార్యక్రమంలో శ్రీ స్వామివారు పాల్గొన్నారు.

**బీచుపల్లిలో.....**

6వ తేదీ ఉదయం, 9-30 ని॥లలో సాంప్రదాయిక పద్ధతిలో సపరివారంగా వేంచేసిన శ్రీరామచంద్రుని ప్రతిష్ఠా కార్యక్రమాన్ని శ్రీస్వామి వారు నిర్వహించారు. వారి శ్రీకరకమలముల ద్వారా యంత్రప్రతిష్ఠ, కుంభాభిషేకం కార్యక్రమాలు జరిగాయి. అత్యంత వైభవోపేతంగా ప్రతిష్ఠా కార్యక్రమాన్ని నిర్వహించిన శ్రీరామకృష్ణారెడ్డిగారు ప్రభృతులకు మంగళాశాసనాలను కృపచేసి

శ్రీస్వామివారు వనపర్తి చేరుకున్నారు.

వనపర్తి 'గీతాజ్యోతి'లో పాల్గొని శ్రీస్వామివారు గీతాజ్యోతి సందేశాన్ని అందించారు. ఈ కార్యక్రమంలో విద్యార్థులు కూడా అధిక సంఖ్యలో పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో విద్యార్థులు కూడ అధిక సంఖ్యలో పాల్గొన్నారు.

నిర్వహణలో జరిగిన ఈ కార్యక్రమంలో శ్రీస్వామివారి శ్రీహస్తముల ద్వారా విద్యార్థులకు బహుమతులు అందజేయబడ్డాయి. ఈ కార్యక్రమాన్ని ముగించుకుని, అందరికీ మంగళాశాసనాలను కృపజేసి, శ్రీస్వామివారు భాగ్యనగరంలోని జూబ్లీహిల్స్ పైనున్న అపోలో హాస్పిటల్స్ దేవాలయానికి చేరుకున్నారు.

**అపోలో, హైదరాబాద్‌లో...**

సుమారు 15 సం॥ల క్రితం శ్రీస్వామివారు తమ శ్రీకరముల ద్వారా ప్రతిష్ఠించిన ఆమోదగిరి శ్రీవేంకటేశ్వరస్వామివారి పుష్కరోత్సవాల కార్యక్రమానికై శ్రీస్వామివారు వేంచేసారు. సుమారు మూడు సం॥రాల క్రితమే జరుగవలసిన ఈ ఉత్సవాలను జీర్ణోద్ధరణ దృష్ట్యా మరియు శ్రీస్వామి వారి సాన్నిధ్యాన్ని కోరుతూ శ్రీమాన్ **P.C.** రెడ్డి సుచరితారెడ్డి దంపతులు ఓపిక పట్టి ఇప్పుడు శ్రీస్వామివారి పర్యవేక్షణలో అత్యంత వైభవోపేతంగా నిర్వహిస్తూండడం. వారికి శ్రీస్వామివారిపై గల భక్తి విశ్వాసాలకు నిదర్శనం.

సహస్ర కలశాభిషేకం, మహాకుంభాభిషేకాలు ప్రధానంగా జరుగుతున్న ఈ పుష్కరోత్సవాలను స్థానికాచార్యులుగా శ్రీమధ్యాభూల సముద్రాల రమాకాంతాచార్యులుగారు ఆగమోక్తంగా జరిపారు.

శ్రీమాన్ సముద్రాల శ్రీనివాసాచార్యులు గారు (జగ్గయ్యపేట శ్రీపాంచరాత్రాగమ కళాశాల అధ్యాపకులు) బ్రహ్మగా, శ్రీమాన్ గోవర్ధనం భట్టరాచార్యులు గారు (అపోలోభట్టర్‌గారు) ఉపబ్రహ్మగా ఈ పుష్కరోత్సవాలు వైభవోపేతంగా జరిగాయి. 7వ తారీకు ఉదయం ధ్వజస్తంభ యాత్రా ప్రతిష్ఠా కార్యక్రమం శ్రీస్వామివారి శ్రీహస్తముల మీదుగా జరిగింది. అన్ని రోజులు యాగకార్యక్రమాలు శ్రీవారు స్వయంగా ఉండి పర్యవేక్షించారు. 8వ తేదీ శ్రీమాన్ పురుషోత్తమ్ గారు (జెట్ సెక్రటరీ, హైదరాబాద్) ఆహ్వానంపై వారు, వారి మిత్రబృందం నిర్వహిస్తున్న **"శాంతినికేతన్ విద్యాలయాన్ని"** సందర్శించి, విద్యార్థులను ఉద్దేశించి చక్కని సందేశం అనుగ్రహించారు. తిరుగివస్తూ, శ్రీమాన్ డా॥ జె. రామేశ్వరరావుగారి (జెట్ కోశాధికారి) మహాసిమెంట్స్ ఆఫీసులో జరిగిన ప్రెస్ మీట్‌లో విరాట్పారాయణ విశేషాలను వివరించారు. అపోలోవారు ఏర్పాటు చేసిన సాంస్కృతిక కార్యక్రమాల్లో భాగంగా జరిగిన చి॥ గుదిమెళ్ళకళ్యాణ రామస్వరూప్ భగవద్గీతా వధానంలో మంగళా శాసనం చేసారు. శ్రీస్వామి వారు, నెల్లూరుకు చెందిన శ్రీమాన్ డా॥ రాజశేఖర్-అరుణగార్లు భాగ్యనగరంలో నడిపిస్తున్న 'గోమతి' స్కూల్‌ను సందర్శించారు.

**బదరీ మీటింగ్...**

9వ తేది శ్రీస్వామివారు అపోలో వేదిక వద్ద **'బదరీక్షేత్ర అన్నదానం'** కమిటి సభ్యుల మరియు **'అన్నదాన కైంకర్య పరుల సమావేశం'** జరిపారు. శ్రీస్వామివారు బదరీక్షేత్ర ప్రశస్తిగురించి అక్కడి అన్నదాన మహిమ గురించి భక్తిభావ బంధురంగా ప్రవచించారు. ఆ ప్రవచనంయొక్క ప్రభావంతో అక్కడ నూతనంగా చేపట్టబోతున్న నిర్మాణాలకుతగిన పరిపుష్టత సమకూరింది. శ్రీ రమేష్‌గుప్త (బదరీ క్షేత్ర అన్నదాన కమిటి సమన్వయకర్త గారి వాక్చాతుర్యం కూడ ఈ స్పందనకు సహకరించింది. నూతన సత్సంగ సదన నిర్మాణానికి దాతలు సుమారు రూ. 30 లక్షలు వాగ్దానం చేసారు (వివరాలు త్వరలో...) వెంటనే జంటనగరాల వికాసతరంగిణి శాఖల కార్యకర్తల సమావేశం జరిగింది. 13వ తేది భీష్మ ఏకాదశినాడు జరుగుబోయే 10వ విష్ణు సహస్రనామ స్తోత్ర విరాట్పారాయణ మహోత్సవ





నిర్వహణ విషయంలో విధి విధానాల గురించి చర్చించారు. సర్వసమన్వయ కర్త శ్రీమాన్ కల్కి అవతారంగారు మరియు వికాసతరంగిణి ఆర్గనైజింగ్ సెక్రటరీ భవానిప్రసాద్ గార్లు కార్యకర్తలకు తగిన సూచనలను అందించారు. చివర శ్రీస్వామివారు అక్కడ ఉన్న వారికి మంగళా శాసనాలను అనుగ్రహిస్తూ... తక్కువ వ్యవధిలో చక్కని ప్రచారాన్ని నిర్వహించి, విరాట్పారాయణానికి సకలవిధ బాధ్యతలను స్వీకరించిన కార్యకర్తలకు, శిక్షకులను సానందంగా అభినందించారు.

అక్కడి నుండి, సీతారాంబాగ్‌లోని శ్రీరామా లయంలో చరిత్రాత్మకంగా నిర్వహిస్తున్న శ్రీ ఉ.వే.ప్ర. శ్రీమాన్ కోయిల్ కందాడై శఠకోపరామానుజా చార్యస్వామి వారి శతజయంతి ఉత్సవాలలో అన్వయించారు. "సీతారాంబాగ్ వేదాంత వివర్ధినీ కళాశాల స్థాపకులై, అధ్యాపకులై ఎందరో దిగ్గంతులైన శ్రీ న.చ.రఘునాథాచార్యస్వామి వై.వా॥ మరింగంటి శ్రీరంగాచార్యస్వామి శ్రీమాన్ డా॥ కందాడై రామానుజాచార్యస్వామి వంటి విద్వాంసులను తీర్చిదిద్దిన కీర్తిమూర్తులు. శ్రీశఠగోపా రామానుజా చార్యస్వామివారిని, శ్రీ వైష్ణవ సంప్రదాయ మహో పకారకులయిన శ్రీస్వామివారి శతజయింతి ఉత్సవాలను, వారి శిష్యులు, ప్రశిష్యులు ఎంతో వైభవంగా నిర్వహిస్తున్నారు.

వారి పుత్ర నిర్విశేషులు, అల్లుడు అయిన శ్రీమాన్ అణ్ణంగరాచార్యస్వామివారి ఆధ్యక్ష్యంలో శ్రీరఘునాథాచార్యస్వామివారి.... శ్రీ వైష్ణవ సంప్రదాయాన్ని, ఆచారాలను వ్యక్తి స్థాయినుండి తప్పనిసరిగా పాటించడమే వారికి నిజమైన కార్జ్ఞ్యం అని పునరుద్ధరిస్తున్న ఈ కళాశాలకు 25వేలరూ॥ల నిధిని సమర్పిస్తున్నామని ప్రకటించారు. శ్రీస్వామి వారి శ్రీకరకమలాల ద్వారా శతజయింతి ప్రత్యేక సంచిక ఆవిష్కరణ జరిగింది. ఇదే సమయంలో శ్రీమాన్ ఆచ్చి శ్రీనివాసాచార్యస్వామి వారు రచించిన శ్రీ వైష్ణవ సంప్రదాయ సౌరభాలనే మరో చిన్న పుస్తకాన్ని కూడ శ్రీస్వామివారు ఆవిష్కరించారు. శతాబ్దాల నాటి చరిత్రకల శ్రీరామాలయాన్ని సేవించుకుని తిరిగి అపోలోకి చేరారు. అపోలో వేదికవద్ద శ్రీమాన్ ఉషాకాంత్‌గారి సంగీత, సాహిత్య సృష్టి అయిన 'శ్రీగోదా కల్యాణం' నృత్య రూపకంలోని చివరి ఘట్టాన్ని వీక్షించి, కళాకారులందరికీ మంగళాశాసనాలను అందించారు. మన భారతీయ కళాప్రాభవం గురించి ఆలోచనాత్మకమైన రీతిలో ప్రవచించారు.

10వ తేది తీర్థగోష్ఠి, యాగశాల కార్యక్రమాలను ముగించి 'అపోలో హాస్పిటల్స్' సందర్శనానికై బయులుదేరారు. అక్కడ ఉన్న రోగులందరి సంపూర్ణారోగ్యానికై శ్రీస్వామివారు చికిత్సాలయంలో అడుగు పెట్టాలని శ్రీమాన్ పి.సి. రెడ్డిగారు, వారి కుమార్తె శ్రీమతి శోభగార్ల ప్రార్థన. శ్రీస్వామివారు, తమ రాక ద్వారా సాంత్వనను, స్వాస్థ్యాన్ని కలిగించడం బాధ్యతగా వేంచేసారు. ఆసుపత్రి ఆసాంతం తిరిగారు. శ్రీమాన్ పి.సి.రెడ్డిగారు, వారి కుమార్తె శ్రీస్వామివారి వెంటనే ఉండి హాస్పిటల్ మొత్తాన్ని చూపించడమే కాకుండా వివరించారు కూడా.

అక్కడి నుండి శ్రీ వసుమతీ భాస్కరరావుగార్ల కోరికపై వారి ఇంజనీరింగ్ కాలేజిని సందర్శించారు. దానికి అనుబంధమైన డెంటల్ కాలేజి యొక్క నూతన భవనాన్ని ఆవిష్కరించారు.

11వ తేదినాడు తీర్థగోష్ఠి, యాగశాల కార్యక్రమాన్ని ముగించుకుని శ్రీమాన్ చింతల రామచంద్రారెడ్డిగారి ఆహ్వానంపై విజయలక్ష్మి దేవాలయాన్ని సందర్శించి, కల్యాణమండపం, కొత్త వసతి భవనం వంటి నిర్మాణాలతో ఆలయాన్ని అభివృద్ధి దిశగా నడుపుతున్న శ్రీమాన్ రెడ్డిగారిని, కమిటీవారిని శ్రీస్వామివారు మంగళాశాసనం చేసారు.

12వ తేదిన యాదగిరిగుట్ట క్షేత్ర సందర్శనానికై వేంచేసారు. దాని మధ్యలో 'నింబోలి అడ్డ' ప్రాంతంలో మన కార్యకర్త అయిన శశి-శశాంకల నూతన గృహప్రవేశాన్ని చేసి, పాదపూజను స్వీకరించారు. దారిలో ఘట్‌కేసర్ వద్ద నూతనంగా రూపొందిస్తున్న జన్మభూమి హౌసింగ్ కాలనీలో శ్రీలక్ష్మి అమ్మవారి ఆలయానికి శంఖుస్థాపన చేసి, నిర్వాహకులయిన శ్రీమాన్ ఎ. యాదవరెడ్డి, శ్రీమాన్ కె. లింగారెడ్డి ప్రభృతులను, ఈ కార్యక్రమ సంధాత అయిన శ్రీమాన్ బి. రమణారెడ్డిగార్లకు మంగళా శాసనాలను అనుగ్రహించారు.

శ్రీమాన్ వడ్డేపల్లి నరసింగరావు దంపతులచే దేవస్థానానికి సమర్పణగా నిర్మించిన అతిథిగృహానికి శ్రీస్వామివారు ప్రారంభోత్సవం చేసారు. ఆలయ వ్యవస్థ గురించి ప్రసంగించారు. ఈ కార్యక్రమాలలో పి.సి.సి. అధ్యక్షులు శ్రీమాన్ ఎమ్. సత్యనారాయణ గారు, కుకట్‌పల్లి రామారావుగార్లు పాల్గొన్నారు.

శ్రీమాన్ గోపాలకృష్ణారెడ్డి (యాదగిరిగుట్ట దేవస్థానం కార్యనిర్వహకాధికారి)గారు, అర్చక స్వాములు, వేద పండితులు, శ్రీస్వామివారిని ఆలయ మర్యాదలతో స్వాగతించారు.

శ్రీలక్ష్మీనృసింహస్వామివారిని సేవించుకుని, ఆలయవిధులలో తగు సూచనలను **E.O.** గారికి అందించి తిరుగు ప్రయాణమైనారు. దారిలో ఉప్పల్‌వద్ద శ్రీమాన్ శంకరమంచి రామకృష్ణశాస్త్రి గారింట్లో పాదపూజను స్వీకరించి, అనుగ్రహభాషణం చేసారు. సాయంత్రానికి మళ్ళీ అపోలో నివాసానికి చేరారు.

### 13వ తేది విరాట్పారాయణం వైభవోపేతంగ 2 లక్షల మందితో జరిగింది.

14వ తేదీ శ్రీస్వామివారి శ్రీహస్తములమీదుగ మహాపూర్ణాహుతి, మహాకుంభాభిషేకం జరిగింది. ఈ కార్యక్రమాలలో శ్రీమాన్ చంద్రస్వామిగారు (యు.పి) కూడ పాల్గొన్నారు. మహాకుంభాషేకం తరువాత శ్రీస్వామివారి సాన్నిధ్యంలో ప్రధమారాధన జరిగింది. శాత్తుముఱై పూర్తయిన తర్వాత ప్రత్యేకంగా అలంకరించిన అపోలో వేదికపై శ్రీశ్రీనివాస కల్యాణం రంగరంగవైభోగంగా జరిగింది. ఆసాంతం శ్రీస్వామివారు ప్రత్యేక్ష వ్యాఖ్యానం చేయడం ఓ విశేషం. కల్యాణం కాగానే శ్రీమాన్ పి.సి.రెడ్డి, సుచరితారెడ్డిగార్లకు వారి నలుగురు కుమార్తెలకు, అపోలో కుటుంబానికి శ్రీస్వామివారు మంగళా శాసనాలను అనుగ్రహించి, **రాత్రి వైదేహీ ఆశ్రమమనే అనాధ బాలికల సంఘం 10వ వార్షికోత్సవంలో పాల్గొని, వారికి రూ.50వేలు మూలధనాన్నిగూడ అందించారు.**

సపరివారంగా డా॥ రామేశ్వరరావుగారి అపార్ట్‌మెంట్స్‌ని చేరుకున్నారు.







**15 ఉదయమే శ్రీస్వామివారు 6గురు పరివారంతో ఆస్ట్రేలియా బయలుదేరారు. ప్రస్తుతం మెల్‌బార్న్, సిడ్నీ కార్యక్రమాలను ముగించుకొని బ్రిస్‌బేన్‌లో వేంచేసి ఉన్నారు. శ్రీస్వామివారు 'కంగారుదీవి' (ఆస్ట్రేలియా)లో జరిగే కార్యక్రమాల్లో ఉన్నారు.**

### 10వ విరాట్ విష్ణు సహస్రనామ పారాయణం

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చిన్న జీయరుస్వామివారు జనవరి 26న, భీష్మ ఏకాదశి సందర్భమును పురస్కరించుకొని **"10వ విరాట్ విష్ణు సహస్రనామ పారాయణం"** ఈ సంవత్సరం హైదరాబాద్‌లో అతి వైభవంగా జరపాలని నిర్ణయం తీసుకొని, ఈ కార్యక్రమాన్ని జెట్-హైదరాబాద్‌శాఖ మరియు వికాసతరంగిణి-జంటనగరముల సమన్వయ కమిటి సంయుక్తంగా నిర్వహించాలని ప్రకటించి, తమ మంగళాశాసనములను అనుగ్రహించారు. ఈ కార్యక్రమ నిర్వహణకు సమయం కేవలం 17 రోజులు ఉండటం వలన, అదే రోజున జంటనగరాలలోని అన్ని **VT** శాఖలను సమావేశపరచి, ఈ కార్యక్రమాన్ని చేపడదామనే ఉద్దేశాన్ని శ్రీస్వామివారు ప్రకటించారు. అన్ని వికాసతరంగిణి శాఖలు, శ్రీస్వామివారి అనుగ్రహానికి సంతోషాన్ని వ్యక్తపరచి, ఈ కార్యక్రమాన్ని విజయవంతం చేయడానికి శాయశక్తుల కృషి చేస్తామని విన్నవించుకున్నారు. శ్రీస్వామివారుతమ అనుగ్రహ భాషణంలో, తేనె దగ్గర ఈగలు వస్తాయిగాని తేనెను ఈగల వద్దకు చేర్చుము కదా, అదే విధంగా భక్తులు మన కార్యక్రమమునకు వచ్చునట్లు సందేశం అందచేయటమే మన లక్ష్యమని వివరించినారు. మన విశ్వాస బలంతోనే, విశ్వశాంతి కొఱకు, లోక కల్యాణం కొరకు చేపట్టిన ఏ కార్యక్రమమైనా తప్పక విజయవంత మవుతుందని, ఇందుకు ఉదాహరణ **"మంగళ తరంగిణి"** అని విశదీకరించారు. శ్రీవిష్ణు సహస్రనామ పారాయణముతో ప్రజలకు సరియైన సందేశం అందించటం వలన, పారాయణమునకు ప్రకృతి స్పందించి ఎన్నో సత్ఫలితాలను అందించగలదని శ్రీస్వామివారు సెలవిచ్చారు. జంట నగరముల స్థాయిలో జనులు ఈ కార్యక్రమములో పాల్గొనగలరని శ్రీస్వామివారు మంగళాశాసనములను కావించినారు.

ఈ కార్యక్రమం నిర్వహణ కొరకు శ్రీమాన్ చింతల రామచంద్రారెడ్డిగారి నేతృత్వంలో 18మంది సభ్యుల కమిటీని ఏర్పాటు చేసుకొని, కార్యక్రమ పర్యవేక్షణ చేపట్టడం జరిగింది. జెట్ కేంద్ర కమిటి నుండి శ్రీమాన్ జె. రామేశ్వరరావుగారు, శ్రీమాన్ పి. వెంకటేశ్వర్లు గారు, శ్రీమాన్ సంత్వాల్‌గార్లు. హైదరాబాద్ జెట్ నుండి అధ్యక్షులు శ్రీమతి శ్రీకుమారి రామేశ్వరరావుగారు, కార్యదర్శి శ్రీమాన్ డా॥ పి. పురుషోత్తమరావుగారు, కోశాధికోరి శ్రీమాన్ విజయకుమార్‌గారు, బదరీ కమిటి సభ్యులు శ్రీమాన్ రమేష్‌గుప్తగారు, శ్రీమాన్ చంద్రశేఖర్‌గారు, వికాసతరంగిణి జంట నగరాల సమన్వయ కమిటి అధ్యక్షులు శ్రీమాన్ కల్కిఅవతారంగారు, శ్రీమాన్ వరకుమార్ గుప్తగారు, డా॥ పి. పద్మనాభరావుగారు, శ్రీమతి వనజ చలపతిరావుగారు, ప్రచార విభాగం కొరకు 'మా' టి.వి. శ్రీమాన్ మురళీ కృష్ణంరాజుగారు, శ్రీమాన్ ప్రియదర్శిని రాంరెడ్డిగారు శ్రీమాన్ జె. వినాయకరావుగారు. మొదలగు ప్రముఖులను సభ్యులుగా కమిటినీ ఏర్పాటు చేసుకొని, కార్యకర్తల బాధ్యతలను విభజనచేసి, ఏర్పాట్లు పర్యవేక్షణ చేపట్టడం జరిగింది. ఈ కార్యక్రమానికి 2 లక్షలమంది భక్తులు వచ్చి పాల్గొనగలరని అంచనావేసి దానికి కావలసిన ఏర్పాట్లను చేయడానికి నిర్ణయం జరిగింది.

ఈ కార్యక్రమం విస్తృత ప్రచారం కోసం రెండు రకాల పోస్టర్లు సుమారు 20వేలు, 2 లక్షల కరపత్రాలు, 1000 బానర్లు, 60 డిస్‌ప్లే బోర్డులు,

50 బస్ షెల్టర్లపై ప్రకటనలు, బస్సులపై ప్రకటనలు, సినిమాలలో స్లైడ్సు ఉపయోగించడం జరిగింది. టి.విలలోను, వార్తా పత్రికలలోను కూడా విస్తృత ప్రచారం జరిగింది. వికాసతరంగిణి కేంద్రాలు ప్రచారం చేసే నిమిత్తం సీతానగరం నుండి వచ్చిన గీతాజ్యోతి ధర్మరథాలు, జంటనగరాల ప్రచార రథంను ఉపయోగించారు. జంటనగరాలు, పరిసర ప్రాంతాలలో మూల మూలలా, వాడవాడలా ప్రచారం సాగించారు. అన్ని శాఖల కార్యకర్తలు, స్త్రీలు, పురుషులు, పిల్లలు, వారి వారి స్థాయిలో చక్కని ప్రచారం చేశారు.

ఈ కార్యక్రమానికి ఏర్పాట్లు ఎలా జరుగుతున్నవని పునర్విమర్శ చేయడానికి ఫిబ్రవరి 2,3,9,12వ తేదీలలో కార్యాచరణ కమిటి సభ్యులు సమావేశం కావటం జరిగింది. శ్రీమాన్ చింతల రామచంద్రారెడ్డిగారు, శ్రీమాన్ జె. రామేశ్వరరావు గారు, శ్రీమాన్ పి. వెంకటేశ్వర్లు ప్రభృతులు ఈ సమావేశాలను నిర్వహించి, అవసరమయిన సూచనలు, మార్గదర్శనంచేశారు.

ఫిబ్రవరి 9న జరిగిన సమావేశానికి శ్రీమాన్ భవానిప్రసాద్‌గారు ముఖ్య అతిథిగా విచ్చేసి వారి అమూల్యమైన సలహాలను ఇచ్చారు. అదే రోజుసాయంత్రం 4 గం॥లకు అపోలో హాస్పిటల్ ప్రాంగణంలో జరిగిన వికాసతరంగిణి కార్యకర్తల ప్రత్యేక సమావేశంలో శ్రీస్వామివారు కార్యకర్తలను ఉద్దేశించి ప్రసంగించారు. కార్యక్రమ సక్రమ నిర్వహణకై సూచనలను యిచ్చారు.

ఈ కార్యక్రమ నిర్వహణకు జంటనగరాల లోని 18 వికాసతరంగిణి కేంద్రాల నుండి 1030 మంది కార్యకర్తలు, 30 మంది పర్యవేక్షకులుగా స్వచ్ఛంద సేవలను అందించారు. ఈ కార్యర్తలకు శ్రీమాన్ కల్కిఅవతారంగారి మార్గదర్శనంలో వికాసతరంగిణి ఉపాధ్యక్షులు శ్రీమాన్ వరకుమార్‌గుప్త, కార్యదర్శులు డా॥ పి. పద్మనాభరావు, శ్రీమతి వనజ చలపతిరావు గార్ల నేతృత్వంలో ప్రత్యేక శిక్షణ కూడ ఇచ్చారు.

12వ తేదీనాడు కార్యక్రమ స్థలం NTR స్టేడియంలో అందరి కార్యకర్తలకు సమావేశపరచి, వారి వారి బాధ్యతలను విపులీకరించి, సర్వ సమన్వయ కర్తగా శ్రీమాన్ కల్కిఅవతారంగారు ఫుల్ డ్రెస్ రిహార్సల్స్ చేయించారు.

13-2-2003 భీష్మ ఏకాదశిరోజు, కార్యక్రమం సా॥ 5 గం॥లకు ప్రారంభం కావలసి ఉండగా, 3 గంటలనుండే భక్తులు రావటం ప్రారంభించారు. స్టేడియం 4 ప్రధాన ద్వారాల నుండి భక్తులు లోపలకు వస్తున్నపుడే పోలీసు శాఖ అందరినీ లోహపరిశీలన యంత్రాలతో పూర్తిగా గమనించి ఒక క్రమంలో ప్రాంగణంలోకి పంపడంతో, జనాలు వరుసలలో లోపలికి ప్రవేశించేటప్పుడు కొంత అసౌకర్యం కలిగినా, కార్యకర్తలకది సామగ్రిని అందించడంలో తోడ్పడింది. మన కార్యకర్తలు భక్తులకు 'విష్ణు సహస్రనామం' పుస్తకాలు, నేతి వత్తులతో ప్రమిదలు, తులసి మొక్కలు, పూజసామాగ్రి, ప్రసాదాలు

## అభినందనలు



భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషిచేస్తున్న వారిలో ఒకరు **శ్రీమాన్ మందపాటి కేశవరెడ్డిగారు (నారాయణపురం పోస్టు, ఖమ్మం జిల్లా)**, తమ వంతు కైంకర్యముగా మన భక్తినివేదన కుటుంబాన్ని మరింతపెంచే దిశగా కృషిచేస్తున్నారు. వీరికి

శ్రీశ్రీశ్రీస్వామివారు అనేక మంగళాశాసనములను కృపచేసారు.





అందించారు. టి.టి.డి. వారు తెలుగులో 2లక్షలు, ఆంగ్ల, హిందీ, తమిళ, కన్నడ లిపులలో కలిపి ఒక లక్ష శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రము పుస్తకాలను వేయించడంతోపాటు ప్రసాదాలు కూడ వితరణ చేయించే ఏర్పాటు చేయడం మన కార్యక్రమానికి పవిత్రతనిచ్చింది. శ్రీవిజయలక్ష్మీ అమ్మవారి (హైదరాబాద్) సన్నిధినుండి శ్రీమాన్ రామచంద్రారెడ్డి గారు మధుర ప్రసాదాన్ని ఏర్పాటు చేయించారు.

సాయంత్రం 5 గం॥లకు శ్రీస్వామివారు మంగళ వాద్యములతో, పూర్ణకుంభం, భజన కోలాటాల సుస్వాగతాలతో, సభాస్థలికి చేరి వేదిక నలంకరించారు. కార్యక్రమం ప్రారంభ సూచకంగా, వేదపాఠశాలల విద్యార్థులు, వేద పఠనం చేస్తుండగా, శ్రీస్వామివారు దీపారాధన కావించారు. కార్యక్రమానికి ముఖ్య అతిధిగా అఖిలభారత, భారతీయ జనతాపార్టీ అధ్యక్షులు శ్రీమాన్ వెంకయ్యనాయుడుగారు విచ్చేశారు. ప్రత్యేక అతిథులుగా కేంద్ర రైల్వేమంత్రి శ్రీమాన్ బండారు దత్తాత్రేయ గారు, రాష్ట్ర హోం శాఖామాత్యులు శ్రీమాన్ దేవేంద్ర గౌడ్‌గారు, శ్రీమాన్ విద్యాధరరావు గారు, రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీమాన్ సత్యనారాయణగారు, మాజీమంత్రి శ్రీమాన్ బాపిరాజుగారు, శ్రీమాన్ దైవజ్ఞ శర్మగారు, శ్రీరామకృష్ణ మఠం, హైద్రాబాద్‌శాఖ అధ్యక్షులు శ్రీస్వామి పరమార్థానందగారు, తిరుమల తిరుపతి దేవస్థానం తరపున సంయుక్త కార్య నిర్వాహణా ధికారి (JEO) శ్రీమాన్ అప్పారావుగారు, 'అపోలో హాస్పిటల్' అధినేత డా॥ పి.సి. రెడ్డిగారు, 'వైశ్రాయ్ హోటల్' అధినేత శ్రీమాన్ ప్రభాకరరెడ్డిగారు, 'వార్త' పత్రిక అధినేత సుధీర్ సాంఘిగారు, 'మా' టి.వి అధినేత శ్రీమాన్ మురళీకృష్ణం రాజుగారు, శ్రీమాన్ రామిరెడ్డి గారు, ప్రభృతులు విచ్చేసి, వేదికను అలంకరించారు.

కార్యక్రమం శ్రీమాన్ చింతల రామచంద్రారెడ్డి గారి స్వాగత వచనాలతో ప్రారంభమయినది. శ్రీమాన్ ముదుంబై రామానుజాచార్యులుగారు, భక్తినివేదన సంపాదకులు శ్రీమాన్ రామచంద్రా చార్యులు గారు, శ్రీమాన్ రంగరామానుజాచార్య స్వామివారు ప్రసంగించారు. కార్యనిర్వాహకుల తరపున శ్రీమాన్ జె. రామేశ్వరరావుగారు, శ్రీమాన్

## ॥ పరమపదవార్త ॥



**శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల వేంకట రామలక్ష్మి తిరుమలా చార్యులుగారు**, S.B.H.లో Dy.G.M.గ పదవీ విరమణ తరువాత శ్రీస్వామివారి మంగళాశాసనములతో 01-10-2000 నుండి సీతానగరం ఆశ్రమంలోను మరియు శ్రీరంగ క్షేత్రము నందలి శ్రీవీరరాఘవ రామానుజ కూటం నందు నిర్వహణ బాధ్యత లను చేపట్టినారు. వీరు 18-02-2003న ఆచార్య తిరువడికి చేరుకున్నారు.

వీరికి శ్రియఃపతి సన్నిధిలో సాయుజ్యం లభించాలని ఆకాంక్షిస్తూ

జై శ్రీమన్నారాయణ..!

 

-భక్తినివేదన

పి. వెంకటేశ్వర్లుగారు ప్రసంగించారు. భక్తినివేదన సంపాదకులు శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామి 'ఈ కార్యక్రమం దేశ, ప్రపంచ సుఖ శాంతుల కోసం సాగేది కనుక హస్తినాపురిలో (న్యూఢిల్లీ) దీనిని జరిపించడంశ్రీమాన్ వెంకయ్య నాయుడుగారి వంటి బాధ్యత', అని చేసిన ప్రస్తావనను ఆపై అందరూ సమర్థించారు. ముఖ్య అతిథి తమ ప్రసంగంలో, తాను ఈ కార్యక్రమానికి ఒక రాజకీయ నాయకుడిగా కాక, ఒక భక్తునిగా శ్రీస్వామివారి శిష్యునిగా వచ్చినానని విన్నవించారు. దేశ యశస్సుకై, ప్రపంచ మానవాళి శ్రేయస్సుకై విశ్వశాంతికై శ్రీస్వామివారు చేపడుతున్న అన్ని కార్యక్రమాలకు తాము అన్ని విధాల సహాయ, సహకారములను అందజేయగలమని సభాముఖంగా తెలియపరిచారు. శ్రీస్వామి వారు అనుగ్రహిస్తే, వచ్చే భీష్మ ఏకాదశిని, దేశ రాజధాని ఢిల్లీలో నిర్వహించగలమని తెలియ పర్చారు. శ్రీమాన్ కల్కిఅవతారంగారివందన సమర్పణతో సభాకార్యక్రమ భాగం ముగిసింది.

శ్రీస్వామివారు భక్తులనుద్దేశించి అనుగ్రహ భాషణం ప్రసాదించి మంగళాశాసనాముల కావించినారు. శ్రీ విష్ణు సహస్రనామ వైభవమును, విశిష్టతను, ఆవశ్యకతను దాని వలన ప్రాప్తించే సత్ఫలితాలను గురించి విపులీకరించి చెప్పారు. "గీతాజ్యోతి" కార్యక్రమాన్ని గురించి విశదీకరించి చెప్పారు. సుమారు 7-30 గం॥కు సామూహిక శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం ప్రారంభమయి నది. శ్రీస్వామి వారు నామాలను చెబుతూండగా, సమావేశమైన 2 లక్షలమందికి పైగా చేరిన భక్తులు నామాలను ప్రతిపఠనం చేశారు. ఆ నామ పఠన ఘోష విన్న చెవుల ఆనందమే ఆనందం. అది వర్ణించనలవికానిది. పారాయణమయిన తర్వాత, ఆవునెయ్యిలో ముంచిన వత్తులతో వెలిగించిన దీప ప్రమిదలను భక్తులందరు వెలిగించారు. ఆ దీపాలను చేయెత్తి పట్టుకొనగా శ్రీస్వామివారు భక్తులందరితోను "గీతాజ్యోతి" ప్రతిజ్ఞను చేయించారు. తదనంతరం కార్యక్రమం విజయవంతంగా ముగిసింది. కన్నుల పంటగా బాణాసంచాను కాల్చడం జరిగింది.

నగర నడిబొడ్డున రెండు లక్షల మంది భక్తుల సమావేశంతో జరిగిన ఈ కార్యక్రమం జంట నగరాల ప్రజలలో ఎంతో ఉత్తేజాన్ని తీసుకు వచ్చింది. టి.వి., స్థానిక పత్రికలవారు చక్కగా స్పందించి ఈ కార్యక్రమం గురించి చక్కని వార్తలు ప్రచురించారు. పత్రికలు "విశ్వశాంతి అర్చనకు వెల్లువెత్తిన స్పందన", "అంతా శ్రీమన్నారాయణ మయం", స్వార్థాన్ని వీడితేనే విశ్వమంతా శాంతి", "ఆస్తిక జనంతో కళకళ" **"Lighted spectacle for Universal Peace"** వంటి శీర్షికలతో ప్రజలలోని ఆధ్యాత్మిక చింతనను ప్రోత్సహించే విధంగా చక్కని వ్యాసాలను వ్రాశారు.

శ్రీస్వామివారి కృపా కటాక్షాల వలన, సంకల్ప బలం వలన, భక్తులకు అసౌకర్యాలు కలగకుండా, నిరాటంకంగా, నిర్విఘ్నంగా, ప్రశాంతంగా ఈ కార్యక్రమం జరిగింది.



### ఆదిలాబాద్ జిల్లా

**నిర్మల్ ధర్మక్షేత్రం :** ఆదిలాబాద్ జిల్లా నిర్మల్ ధర్మక్షేత్ర కేంద్రం ఆధ్వర్యవంలో మన్మద్ గ్రామంలో ఉచిత పశువైద్య, ఆరోగ్య వైద్య శిబిరములు 31-10-03న నిర్వహించ బడినవి. 200 పశువులకు నట్టలవ్యాధి నివారణ, గర్భకోశ వ్యాధులకు చికిత్సలు చేయబడినవి. ఈ శిబిరంలో డా॥ కె. గంగారెడ్డిగారు, డా॥ జఫర్ ఆలీ, డా॥ గోవర్ధన్‌గార్లు వారి సిబ్బంది పాల్గొన్నారు. హోమియో శిబిరంలో 250 మంది వ్యాధి గ్రస్థులకు పరీక్షలు చేసి మందులు పంపిణీ చేయడం జరిగింది. ఈ





శిబిరంలో డా॥ డి. గుండయ్య, డా॥ కాంతారావు గార్లు, డా॥ ప్రవీణ్‌కుమార్‌గార్లు పాల్గొని తమ అమూల్యమైన సేవలను అందజేసినారు. సాయంత్రం గీతాజ్యోతి కార్యక్రమం నిర్వహించబడినది. 500 మంది భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ ఎల్. జనార్థనరెడ్డిగారు, శ్రీమతి అలివేలు, శ్రీమతి కోమల, వారిజ, వ్యామల, అనసూయగార్లు పాల్గొన్నారు. శ్రీమాన్ డా॥ లింబగిరిగారు గీతాజ్యోతి ప్రాముఖ్యాన్ని వివరించినారు.

**ఉట్నూరు :** ఆదిలాబాద్‌జిల్లా ఉట్నూరు ఆంధ్రప్రదేశ్ 'గిరిజన సంక్షేప ఉపాధ్యాయ సంఘం' ఆధ్వర్యవంలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం 5 మండలాలలో 108 గ్రామాలు సందర్శించినారు. ఈ ఉపాధ్యాయ సంఘము వారు మంచిర్యాల ధర్మక్షేత్ర ఆధ్వర్యంలో ప్రచారం కావించుచున్నారు.

**మంచిర్యాల:** మంచిర్యాల ధర్మక్షేత్ర కేంద్రముగ గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగ ధనుర్మాస కార్యక్రమం వైభవంగ నిర్వహించుకొన్నారు. ప్రతిఇంట్లో గీతాజ్యోతి కార్యక్రమం అమలు జరిగింది.300 మంది భక్తులు గీతాజ్యోతి ప్రతిజ్ఞ చేసినారు. గిరిజన ప్రాంతాలలో పాఠశాలలో స్కూలు విద్యార్థులు భగవద్గీత శ్లోకాలు చక్కగ పఠిస్తున్నారు. ఈ కార్యక్రమంలో శ్రీ ధర్మారావు, శ్రీ కనకయ్య, శ్రీరాజేశం, శ్రీమతి ఉమగార్లు పాల్గొన్నారు.

### గుంటూరు జిల్లా

**వట్టి చెరుకూరు :** గుంటూరుజిల్లా వట్టిచెరుకూరు వికాసతరంగిణి శాఖ అధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగ భీష్మాష్టమి సందర్భముగ స్థానిక శ్రీవేణు గోపాలస్వామి ఆలయ ప్రాంగణంలో శ్రీలక్ష్మీ అష్టోత్తర శతనామ స్తోత్రమును, శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణం40 రోజులు చేయడం జరిగినది. శ్రీమాన్ నాదెండ్ల అప్పారావు గారు ధన్యవాదాలు సమర్పించి నారు. వికాస తరంగిణి శాఖ అధ్యక్షులు శ్రీమతి కొలసాని శివకుమారిగారు పర్యవేక్షణలో ఈ కార్యక్రమం చక్కగ నిర్వహించబడినది.

### వరంగల్ జిల్లా

**చెర్లపల్లి:** వరంగల్ జిల్లా చెర్లపల్లి వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగ 'గృహ వికాస్' ఏర్పాటు చేసికొని వారానికి ఒకరోజు ఒక్కక్కరి ఇంటిలో గీతాజ్యోతి శ్లోకపఠనం జరుపుకున్నారు. భీష్మ ఏకాదశి పర్వదినాన సామూహిక విష్ణు సహస్రనా పారాయణం చేయడం జరిగింది.

**మహబూబ్‌బాద్ :** వరంగల్‌జిల్లా, మహబూబ్‌బాద్ ధర్మక్షేత్ర కేంద్రముగ గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగ 'కురివి' మండలములో ఉచిత నేత్రవైద్య శిబిరములను ఏర్పాటు చేయడం జరిగింది. 398 పురుషులకు, 302 స్త్రీలకు నేత్రపరీక్షలు నిర్వహించి నారు. ఈ శిబిరంలో బి.పి., మూత్రపరీక్షలు కూడ చేసి సలహాలు యివ్వడం జరిగినది. వికాస తరంగిణి కార్యదర్శి శ్రీమతి నాయిని అరుణా రాఘవేంద్రరెడ్డి గారి ఆధ్వర్యంలో నిర్వహింపబ డినది. శ్రీమాన్ గార్లపాటి వెంకటరెడ్డి 100మందికి కంటి అద్దాలు అందజేస్తామని హామిఇచ్చారు. సూర్య ఆప్టికల్స్ 200 మందికి 50% రాయితితో కంటి అద్దాలు అందజేస్తామని ప్రకటించినారు. ఈ కార్యక్రమంలో డా॥ బి.కె. వినోదకుమార్, డా॥ రాథోడ్, డా॥ రవి ప్రసాద్, డా॥ జి. రామకృష్ణ గార్లు వైద్య పరీక్షలు నిర్వహించినారు.

**ఆత్మకూరు :** వరంగల్ జిల్లా ఆత్మకూరు ధర్మక్షేత్రం కేంద్రముగ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో భీష్మఏకాదశి రోజున స్థానిక శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయంనందు విశ్వశాంతిని కోరుచు కన్నుల పండుగగ శ్రీవిష్ణు సహస్రనామ పారాయణాన్ని నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమంలో 500 మంది భక్తులు పాల్గొన్నారు. చిన్నారులు భగవద్గీత

శ్లోకాలను కంఠస్థంగా పఠించడం జరిగింది. ఛైర్ పర్సన్ శ్రీమాన్ కేశవమూర్తిగారు భక్తులచేత పారాయణాన్ని చేయించారు. ఆలయ అర్చకులు, గీతాజ్యోతి కార్యక్రమ ప్రతినిదులు కార్యక్రమాన్ని చక్కగ నడిపించినారు.

ఆత్మకూరు మండల కేంద్రములో శరత్ లేజర్ హాస్పిటల్ సౌజన్యంతో ఉచిత నేత్ర వైద్య శిబిరం నిర్వహించబడినది. వికాసతరంగిణి ఆశయాలలోని "దీనులకు ఆర్తులకు సేవలందించుట" అనే ఆశయాన్ని సాధించడానికి ఈ శిబిరం నిర్వహించడం జరిగింది. ఈ శిబిరంలో 250 మందికి నేత్ర పరీక్షలు జరిపి 50 మందికి శస్త్ర చికిత్సలు చేయడం జరిగింది. డా॥ శరత్ బృందం చక్కటి సేవలను అందించినారు.

## కరీంనగర్ జిల్లా

**గోదావరిఖని:** లోకకల్యాణార్థం శ్రీస్వామివారు సంకల్పించిన గీతాజ్యోతి కార్యక్రమం కరీంనగర్ జిల్లా గోదావరిఖని పట్టణంలోని శ్రీసీతా రామాలయంలో శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ, గీతాజ్యోతి పారాయణం శ్రీమాన్ గంగాధర్‌గారి ఆధ్వర్యవంలో ఘనంగ నిర్వహించుకొన్నారు. స్వీయ ఆరాధన-సర్వ ఆదరణగురించి భక్తులందరికి వివరించినారు. శ్రీవేంకటేశ్వర విద్యాలయంలో విద్యార్థులచే భగవద్గీత శ్లోకములు చదివించి, గీతాజ్యోతి ప్రాముఖ్యాన్ని గురించి పాఠశాలలో తెలిపినారు. కొన్ని గ్రామాలలో ఉచిత వైద్య శిబిరములు నిర్వహించుచున్నారు. మేడిపల్లి సెంటర్ గ్రామంలో 60మంది ఎస్.టి. మహిళలతో శ్రీకృష్ణపూజలు జరిపించి గీతాజ్యోతి ప్రాముఖ్యాన్ని తెలుపుచు అందరిచేత గీతాజ్యోతి శ్లోకములు చదివించినారు ఈ కార్యక్రమంలో శ్రీ గిరిజా ఆగమరావు, శరణ్‌రావు, రమాపతిరావు, శ్రీరామారావు, డా॥ వి. ప్రభాకర్‌రావు, వెంకటరామా రావు, రవీందరరావుగార్లు పాల్గొన్నారు.

**జూలపల్లి :** జూలపల్లి వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో శ్రీమాన్ కృష్ణంరాజు మధుసూద నరావుగారిచే తిరుప్పావై ప్రవచనం జరిగినది. కూడారై ఉత్సవమును 216 గిన్నెలతో శంఖం, చక్రం, నామాలుగ ఏర్పాటు చేసి కనుల విందుగ జరుపుకొన్నారు. శ్రీమాన్ శ్రీనివాసా చార్యులు గారిచే కల్యాణం వైభవంగ నిర్వహించు కొన్నారు. ఈ కార్యక్రమంలో శ్రీ కవిత, శ్రీమతి ఊర్మిళ, వెంకన్న, మధుసూదన రెడ్డి, రంగనాధా చార్యులు, మన్‌మోహన్ సింగ్, రవిగోపాలరెడ్డి గార్లతో ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు.

**సుల్తానాబాద్ :** కరీంనగర్ జిల్లా సుల్తానాబాద్ ధర్మక్షేత్రం శ్రీస్వామివారి మంగళా శాసనములతో 6 మండలాలలో 108 గ్రామాలు పూర్తి చేసికొని గీతాజ్యోతి ప్రచారం విస్తృతంగా జరుగుచున్నది. శ్రీమాన్ గుజ్జుల రామకృష్ణరెడ్డిగారిచే 9-2-2003 ఆదివారం ధర్మక్షేత్ర కార్యాలయం ప్రారంభించబడి నది. కొదురుపాక గ్రామంలో శ్రీనంబులాద్రి స్వామి దేవాలయంలో శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం, గీతాజ్యోతి 48 శ్లోకాలు పారాయణం చేయడం జరిగింది. 108 గ్రామాల నుండి వచ్చిన కార్యకర్తల నుండి ధర్మక్షేత్ర అభిప్రాయాలు తెలుసుకొని గీతాజ్యోతి ప్రచారం ముమ్మరంచేశారు. ఈ కార్యక్రమంలో వికాసతరంగిని అధ్యక్షులు శ్రీమాన్ గౌతంరావు, రాజశేఖరగౌడ్, ఎస్. ప్రభాకరరావు, శ్రీమాన్ గోపాలరావు, వెంకటరాంరెడ్డి, రామ కృష్ణయ్య, ఎమ్. నారాయణరావు గార్లు, యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

ధర్మక్షేత్ర కార్యక్రమంలో భాగంగ పెద్దపల్లి మండలం నిమ్మనపల్లి నిట్టూరు గ్రామంలో 31-1-03 ఉచిత పశువైద్య శిబిరం నిర్వహించడం జరిగింది.





1202 గేదెలకు, 289 గోవులకు, 1300 గొర్రెలకు, 68 మేకలకు, 308 కోళ్ళకు, 89 గేదె దూడలకు 63 పందులకు ఉచితంగ చికిత్స చేయడం జరిగింది. 60,000/-రూ. విలువగల మందులను పంపిణీ చేయడం జరిగింది. 10 మంది వైద్యులు తమ సేవలను అందించినారు.

ఈ కార్యక్రమంనకు శ్రీమాన్ కఠారి దేవేంద్ర రావుగారు జ్యోతి ప్రజ్వలన గావించి వైద్యశిబిరాన్ని ప్రారంభించారు. అనంతరం శ్రీకృష్ణ పూజలు నిర్వహించడం జరిగింది. పూజా కార్యక్రమాన్ని శ్రీమాన్ గోపాలా చార్యులు నిర్వహించారు.

## ఖమ్మం జిల్లా

**మణుగూరు :** మణుగూరు ధర్మక్షేత్రం కేంద్రముగ మొత్తం 3 మండలాలలో 108 గ్రామాలలో ప్రచార కార్యక్రమం, పూర్తి గీతాజ్యోతి గోష్ఠులను ఏర్పాటు చేయడం జరిగింది. 10 పాఠశాలలో గీతాజ్యోతి శ్లోకమాలికలు కంఠస్థపోటీలను నిర్వహించి విజేతలకు బహుమతి ప్రదానం చేయడం జరిగింది. తీవ్రవాద నివారణార్థం డిసెంబర్ 15వ తేదిన గీతాయజ్ఞం నిర్వహించడం జరిగింది. స్థానిక శ్రీరామాలయం నుండి రామానుజ పురంలో వేంచేసి శ్రీ వేణుగోపాల స్వామి ఆలయం వద్దకు హరే రామ, హరే కృష్ణ దీక్షలు చేసిన భక్తులు పాదయాత్ర చేసినారు. ఈ కార్యక్రమంలో శంకర్‌కుమార్ గారు, ఎస్.వి. మాధవవర్మ, శ్రీనివాసరావు, వెంకన్న, డా॥ శేషగిరిరావు, ఎమ్.రంగనాధ శర్మగార్లు పాల్గొన్నారు.

**ఖమ్మం :** ఖమ్మం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో భీష్మఏకాదశి పర్వదినాన స్థానిక శ్రీసీతారామచంద్రస్వామి వారి ఆలయంలో శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణ "ఏకాహం" జయప్రదంగ జరిపినారు. తదీయారాధనతో కార్యక్రమం ముగిసినది.

**వెంకటాపురం :** ఖమ్మం జిల్లా వెంకటాపురం ధర్మక్షేత్ర కేంద్రముగ భీష్మ ఏకాదశి శ్రీవేంకటేశ్వర స్వామివారి దేవస్థానంలో 300 మందితో గీతా జ్యోతులను వెలిగించి , ఊరేగింపులో పాల్గొన్నారు. శ్రీమాన్ చెన్న కృష్ణమాచార్యులు వారు అందరిచేత శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం చేయించడం జరిగింది. ధర్మక్షేత్ర కన్వీనర్ శ్రీ ఎస్.ఆర్.ఆర్. రంగరాజు జమిందార్‌గార్లు పాల్గొన్నారు.

**నారాయణపురం :** ఖమ్మం జిల్లా నారాయణ పురం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో భీష్మ ఏకాదశి కార్యక్రమం వైభవంగ జరుపు కొన్నారు. హరేరామ, హరే కృష్ణ సంకీర్తనం, గీతాజ్యోతి శ్లోక పఠన కార్యక్రమం జరిగినది. ప్రతిరోజు ఒకొక్కరి యింటివద్ద విష్ణు సహస్రనామ పారాయణం చేయడం జరుగుతుంది. ఈ కార్యక్రమంలో మందపాటి కేశవరెడ్డి, సామ్రాజ్యం,కాంతమ్మ, నాగమణి యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

## కృష్ణాజిల్లా

**జగ్గయ్యపేట :** కృష్ణాజిల్లా జగ్గయ్యపేట ధర్మక్షేత్ర కేంద్రముగ గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగ భీష్మ ఏకాదశి పర్వదినాన 1000 మంది భక్తులతో విష్ణు సహస్ర నామ పారాయణం చేయడం జరిగింది. ఈ కార్యక్రమంలో శ్రీ మల్లిఖార్జునరావుగారు, శ్రీరాం విజయలక్ష్మి పాల్గొన్నారు.

**జగ్గయపేట :** గీతాజ్యోతి కార్యక్రమంలోని భాగంగా జగ్గయ్యపేట ధర్మక్షేత్రంలో స్థానిక శ్రీఓంకారేశ్వర స్వామి వారి దేవాలయ ప్రాంగణంలో 48 శ్లోకాల పోటీలు నిర్వహించడం జరిగింది. నవాబ్‌పేట గ్రామంలో 27-11-02 ఉచిత వైద్యశిబిరం నిర్వహించబడినది.

ధర్మవరప్పాడు తండాలలో పర్యటించి స్వీయ ఆరాధన- సర్వ ఆదరణ సందేశాన్ని అందించారు. గీతాజ్యోతి ప్రచార కార్యక్రమంలో శ్రీమతి పుష్పావతి, దమయంతి, కుమారి, కళ్యాణిగార్లు పాల్గొన్నారు.

శ్రీచేగు శ్రీవెంకటకృష్ణరావు, శ్రీకొత్తమాసు మల్లిఖార్జున రావు, శ్రీరాం విజయలక్ష్మిగార్లు ముందుండి ప్రచార కార్యక్రమాలు నిర్వహించుచున్నారు.

**కొత్తపేట :** విజయవాడ పట్టణ కొత్తపేట వికాస తరంగిణిశాఖ ఆధ్వర్యవంలో ధనుర్మాస కార్యక్రమం వైభవంగ నిర్వహించుకొన్నారు. శ్రీకృష్ణపూజలు, గీతాజ్యోతి దీపోత్సవం, 508 నేతిదీపాలతో నిర్వహించడం జరిగింది.

విజయవాడ ధర్మక్షేత్రంలో విస్తృత ప్రచారంలో కార్యకర్తలు పాల్గొన్నారు. వికాసతరంగిణి కార్యదర్శి సిహెచ్. నాగమణి, శ్రీమాన్ పార్థసారధిగారు, ఝాన్సీలక్ష్మి, రాధకృష్ణమూర్తి గార్లు పాల్గొన్నారు.

**గుడివాడ :** గుడివాడ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో13-02-03న భీష్మ ఏకాదశి పర్వదినం స్థానిక స్టేడియంలో వైభవంగా నిర్వహించు కొన్నారు. 38 గ్రామాల భక్తులతో గీతాజ్యోతి సమీక్ష జరిగినది. శ్రీమాన్ సిహెచ్ జనార్ధనాచార్యులు గారిచే 1000 మంది భక్తులచే శ్రీ విష్ణు సహస్ర నామస్తోత్ర పారాయణం జరిగినది. సాయంత్రం 5.30గం॥ శ్రీమతి టి.కె. చూడామణిగారిచే శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్ర వైభవమును గూర్చి ప్రవచనం జరుగును.

## విశాఖపట్నం జిల్లా

**అనకాపల్లి :** అనకాపల్లి వికాసతరంగిణిశాఖ ఆధ్వర్యవంలో ధనుర్మాసవ్రత కార్యక్రమం వైభవంగ నిర్వహించుకొన్నారు. కృష్ణాపురంలో దళిత బహుజన కాలనీలో స్కూలు పిల్లలకు మధ్యాహ్న భోజన పథకము సందర్భముగ స్టీలు బిందెలు, గ్లాసులు, పంపిణీ చేయడం జరిగింది.

డా॥ నాగరాజు కుమార్‌గారి సహకారంతో మహిళలకు ఉచిత వైద్య పరీక్షలు చేసి మందులు ఇవ్వడం జరిగింది. శ్రీమాన్ రఘునాధాచార్యస్వామి వారి ఆధ్వర్యంలో గీతాజ్యోతి కార్యక్రమ ప్రాముఖ్యము వివరించడం జరిగింది. వికాస తరంగిణి సెక్రటరీ జి. శశికళగారు యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

**"ఓం అచ్యుతాయన నమః"** అను నామంతో బియ్యపు గింజలు ఏరడం జరిగింది.

**వేంపాడు :** వేంపాడు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో భీష్మ ఏకాదశి కార్యక్రమం వైభవంగ నిర్వహించుకొన్నారు. ఉదయం 4 గం॥లకు 30 మంది భక్తులతో గ్రామంలోని నాలుగు వీధులలో నగర సంకీర్తన చేయడం జరిగింది.

స్థానిక శ్రీ వేంకటేశ్వర ఆలయంనందు 50 మంది భక్తులతో విష్ణు సహస్రనామ పారాయణం

## పరమపదవార్త

మండపేట - కామత్ గ్రూప్ అధినేత శ్రీమాన్ కర్రిపాపారాయుడిగారి శ్రీమతి **కర్రి కాత్యాయినిగారు** 25-2-03 తేదీన పరమపదించినారు. వారికి శ్రియః పతి సన్నిధిలో సాయుజ్యం లభించాలని ఆకాంక్షిస్తూ....

- భక్తినివేదన





108 సార్లు పారాయణం చేయడం జరిగింది.

**విశాఖపట్నం :** విశాఖపట్నం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో స్థానిక యమ్.వి.పి. కాలనీలో యాదవల కొరకు చిన్న గాదెల వద్ద పశువైద్య శిబిరం నిర్వహించబడినది. గాజువాకలోని రెండు కళాశాలలో గీతాజ్యోతి శ్లోకమాలిక పోటీ పరీక్షలను నిర్వహించబడినవి.

## అనంతపురం జిల్లా

**తాడిపత్రి :** అనంతపురం జిల్లా, తాడిపత్రి వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో 13-02-03 నిర్వహించిన భీష్మ ఏకాదశి పర్వదినాన స్థానిక చింతల వెంకట రమణస్వామి వారి దేవాలయం నందు శ్రీవిష్ణు సహస్రనామస్తోత్ర ప్రవచనములు నిర్వహింపబడినవి. "ఏకాహ్ దీక్షతో" అఖండ విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణం చేయడం జరిగింది. పాఠశాలలయందు మధ్యాహ్న భోజనం పథకం పేరిట వికాసతరంగిణి ఆధ్వర్యంలో పాఠశాల విద్యార్థులకు భోజన సదుపాయం కలగజేసినారు. గీతాజ్యోతి శ్లోకాలను పాఠశాల విద్యార్థులకు కంఠస్తం చేయడం జరిగింది.

ఈ కార్యక్రమం శ్రీస్వామివారి శిష్యులు శ్రీమాన్ హనుమాన్‌స్వామివారి ఆధ్వర్యంలో నిర్వహించబడినవి. ఛైరపర్సన్ రవి ప్రసాద్‌గారు, దామోదరదాస్, నరసింహా చార్యులు, శ్రీనాధకవిగారు పాల్గొన్నారు.

## నెల్లూరుజిల్లా

**నెల్లూరు :** నెల్లూరు వికాసతరంగిణిశాఖ ఆధ్వర్యంలో భీష్మఏకాదశి కార్యక్రమం వైభవంగ నిర్వహించుకొన్నారు. శ్రీమాన్ హనుమాన్‌స్వామివారి ఆధ్వర్యంలో గీతాజ్యోతి ప్రచారం విస్తృతముగా జరుగుచున్నది.

## పశ్చిమ గోదావరి జిల్లా

**కొవ్వూరు :** కొవ్వూరు ధర్మక్షేత్ర కేంద్రముగ శ్రీవిజయరాఘవాచార్యులువారి ఆధ్వర్యంలో 4 మండలాలలో గీతాజ్యోతి ప్రచారం జరుగుచున్నది.

## మహబూబ్ నగర్ జిల్లా

**వనపర్తి :** మానవసేవగ సర్వప్రాణిసేవ అన్నది ప్రతిమనిషి గుర్తించ గలగాలని వనపర్తి వికాస తరంగిణి శాఖ ఏర్పాటు చేసిన గీతాజ్యోతి కార్యక్రమానికి ముఖ్య అతిథిగా హాజరైన శ్రీశ్రీశ్రీ జీయరుస్వామివారు ప్రవచించారు. మాధవసేవగ సర్వప్రాణిసేవ అన్న నినాదం గీతాజ్యోతి కార్యక్రమం ద్వారా ప్రజలందరికి చేరేందుకు ఏర్పాటు చేసినట్లు శ్రీస్వామివారు తెల్పారు. నీరు, చెట్లు, పక్షులు, పశువులు లేకుండ మనిషి జీవించగల్గుతాడా? కాని మనిషిలేకపోతే పైవన్నీ బాగా అభివృద్ధి చెందుతా యన్నారు. గీతాజ్యోతి ప్రజల్లోకి మహోద్యమంగా వెళ్ళాలని, ఏ కులమైనా, జాతిలో ఉన్న, ఏ మతంలో ఉన్నవారు దానిని పూజిస్తూ ఇతరులకు చెందిన వాటిని గౌరవించే అలవాటు ప్రతిమనిషి అలవర్చు కోవాలని సూచించారు. మనస్సును, గ్రామాన్ని శుభ్రం చేసుకుంటు పోవాలన్నది గీతాజ్యోతి వెల్లడిచేస్తుందని నిజాయితీని ప్రతివ్యక్తి గౌరవించాలని, అలా లేనివారికి నేర్పించడమే ఈ కార్యక్రమ ముఖ్యోద్దేశ మన్నారు. స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ. మానవ జీవన సూత్రం కావాలన్నారు.

ఈ కార్యక్రమానికి హాజరైన M.P. శ్రీమాన్ G.చిన్నారెడ్డి, రావుల రవీంద్రనాథరెడ్డి, మున్సిపల్ చైర్‌పర్సన్ ప్రమీలమ్మ, వైస్ చైర్మన్ శ్రీమాన్ B. కృష్ణ యంగన్న శెట్టి, శ్రీనివాసులు గౌడ్, శ్రీధర్ మొదలగువారు శ్రీస్వామివారి దివ్య హస్తముల మీదుగ మెమెంటోలను అందుకున్నారు.

వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ వి. కురుమూర్తి ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు.

## నిజామాబాద్ జిల్లా

**నిజామాబాద్ :** గీతాజ్యోతి ప్రచార కార్యక్రమంలో భాగంగ నిజామాబాద్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో ఉచిత ఆరోగ్య శిబిరం నిర్వహించ బడినది. గవర్నమెంట్ జూనియర్ కాలేజి ఆవరణలో శిబిరం నిర్వహించినారు. వ్యాధులను గురించి వివరించి వాటికి గురికాకుండ తీసుకోవలసిన జాగ్రత్తలు తెలియజేసినారు. 1163 రోగులకు ఉచిత వైద్య సౌకర్యాలు అందించినారు. ఈ శిబిరంలో డా॥ విద్యాసాగర్, డా॥ మణిపాల్ రెడ్డి, జి. లక్ష్మీరెడ్డిగార్లు పాల్గొన్నారు.

## చిత్తూరు జిల్లా

**తిరుపతి:** తిరుపతి ధర్మక్షేత్ర కేంద్రముగ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో జనవరి 5, ఫిబ్రవరి 9న వికాసతరంగిణి కార్యకర్తలు 70 మంది చిన్న పిల్లలకు పోలియో చుక్కలు వేయడం జరిగింది. అంతేకాక **T.T.D** వారు వారు నిర్వహించిన 25కేంద్రాలలో కూడ 30వేల మందికి పోలియో చుక్కలు వేయడం జరిగింది.

వేపంజరి శ్రీలక్ష్మీనారాయణ స్వామి సన్నిధిలో, తిరువతిలో జరిగిన 'శ్రీసుదర్శన యాగ' సందర్భముగ వికాసతరంగిణి సభ్యులు 100మంది భగవద్గీత 18 అధ్యాయములు, విష్ణుసహస్రనామ స్తోత్ర పారాయణం చేసినారు. ఈ కార్యక్రమానికి శ్రీమాన్ ఎమ్. కొండమా చార్యులుగారు నేతృత్వం వహించారు.

ధర్మక్షేత్రంలో భాగంగ 60 కాలనీలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం పూర్తి అయినది. ఒక్కొక్క కాలనీలోలో ఒక్కొక్క గృహస్థునికి గీతాజ్యోతి ప్రచార బాధ్యత అప్పగించడం జరిగింది. 48 శ్లోకాల పారాయణం, వారపు శ్లోక భాష్యం పారాయణం చేయడం జరుగుచున్నది. తిరుపతి వికానతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ నాగేంద్రశాయిగారు, మహిళా కో-ఆర్డినేటర్ శ్రీమతి ఎన్. హేమలతగార్లు పూర్తి ప్రచార బాధ్యతను నిర్వహించుచున్నారు.

**భువనేశ్వర్ :** హనుమాన్ పల్లి ధర్మక్షేత్ర కేంద్రముగ మాధవసేవగ – సర్వప్రాణిసేవ, స్వీయ ఆరాధన – సర్వఆదరణ గురించి హనుమాన్ పల్లిలో సమావేశం ఏర్పాటు చేసినారు. ఈ కార్యక్రమంలో బి.డి.ఓ. శ్రీమాన్ ఎ.కె. భూయన్, 85మంది ఉపాధ్యాయులు, 400 మంది గ్రామ ప్రజలు పాల్గొని గీతాజ్యోతి యొక్క ప్రాముఖ్యతను గూర్చి వివరించినారు. వైద్యశిబిరములు భవిష్యత్తులో చేపట్టుటకు తగు నిర్ణయాలు తీసుకొన్నారు.

**బెంగుళూరు :** బెంగుళూరు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో భీష్మఏకాదశి రోజున సామూహిక శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణం శ్రీనారాయణస్వామి ఆలయ ప్రాంగణం నందు భక్తి ప్రపత్తులతో చేసిరి. శ్రీ యతిరాజ రామానుజ మహాసంస్థాన మఠాధిపతులు శ్రీశ్రీశ్రీ త్రిదండి వెంకట రామానుజ జీయర్ స్వామివారు భీష్మ ఏకాదశి యొక్క ప్రాశస్త్యము గూర్చి, శ్రీవిష్ణుసహస్ర నామ స్తోత్ర పారాయణ మహాత్మ్యం గూర్చి ఉపన్యసించిరి. ఈ కార్యక్రమంలో శ్రీ జయరాం, యమ్.యస్. రామయ్య కాలేజి బృంద సభ్యులు భజన కార్యక్రమం నిర్వహించడం జరిగింది.












**భాగవతోత్తములారా!**

**"మరో భూమాతయా"** అనునట్లు నేడు లక్షలాది ప్రజానీకానికి తాను ఆధారభూతమై రేయి-పగలు నడిచే మన చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారికి నిత్యం ఆ సూర్య-చంద్రులే తమ వెలుగుతో మంగళహారతులు ఇస్తారు! అంతటి స్వామి శ్రీచరణ సంబంధము మనం పొందగలిగామంటే అది మన అందరి జన్మ జన్మల పుణ్యఫలం.

అలాంటి మనస్వామివారి కృపచే **ఈనాడు మనదేశంలో మరియు విదేశాలలో మానవాళిని తరింపచేసే స్తోత్రమైనటువంటి "శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రము"** కోట్లాది ప్రజలు పఠించుచున్నారు. మరి అంతటి వైభవోపేతమైన **"శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రానికి సరితూగగల నామము కేవలం శ్రీరామనామమే సుమా"** అనికదా పరమశివుడు తెలుపుతున్నాడు.

42 సంవత్సరాల పూర్వము దేశమంతటా శ్రీరామనామ లిఖిత లేఖనలు కోటానుకోట్లు నిక్షిప్తపరచి నిర్మించబడినవే ఈ 108 శ్రీరామస్తంభాలు. **ఈ భూమి ఉన్నంతవరకు అవి మనకి రక్ష! సౌభాగ్యం! సంపద!**

మన జగదాచార్యుల కృపావిశేషముచే నేడు మనమంతా ఈ శ్రీరామనామ నిర్మాణాలను (శ్రీరామకోటి స్తంభాలు) జీర్ణోద్ధరణ గావించుచుకుంటున్నాము **భావితరాల వారికి అందంగా పదిలంగా అందించుటకు.**

మరి, రాబోవు తరాలవారు **ఈ 108 శ్రీరామస్థూపాలకి బంగారు తొడుగులే వేస్తారు కాబోలు!**

ఆనాడు భూమాత పులకింప దేవతలంతా పైనుండి **పూలవర్షం** కురిపిస్తారు కాబోలు! మరి పెద్దజీయరు స్వామివారి **కృపావర్షం** ఈ భువిపై కురుస్తుంది. ఈ బాట ఇలా కొనసాగుటకై నేడు మన అందరి ద్రవ్యముచే **"శ్రీరామ క్రతుస్థూప-మూలనిధి"** ఏర్పాటు అగుచున్నది. ఒక సదాచార్యుని శ్రీచరణ సంబంధము వలన కదా! మనకీ భాగ్యం! ఇంతటి వైభవం!

మరి మనమంతా మన మన ద్రవ్యమును సమర్పించే అపురూపమైన ఈ యజ్ఞమును (ప్రతి మంచి కార్యం ఒక యజ్ఞం కదా!) **అతి తొందరగా పూర్తి చేసుకుందాము.** మన ఆచార్యుల కృపకి సదా పాత్రులము అవుదాము.

జై శ్రీమన్నారాయణ !

యం. విజయలక్ష్మి రామానుజదాసి, కార్యకర్త, **శ్రీరామ క్రతుస్థూప జీర్ణోద్ధరణ ప్రాజెక్టు**

## విషయ సూచిక .....



## పంచాంగ వివరాలు

### ఏప్రిల్

1 సర్వేషాం అమావాస్య

2 శ్రీ స్వభాను సంవత్సరాది, ఉగాది
వసంత నవరాత్రారంభం
పెరియ పెరుమాళ్ తిరు॥

6 మత్స్య జయంతి

11 శ్రీరామనవమి, భద్రాచలం
శ్రీ సీతారామ చంద్రస్వామివారి
కల్యాణోత్సవం

13 సర్వేషామేకాదశి

14 అశ్వనికార్తె, మేషసంక్రమణం
ప.12.42 సౌర(తమిళ)వత్సరాది.

22 సప్తమి తిథి

27 భరణికార్తె తె.5.0 సర్వేషామేకాదశి

29 చతుర్దశితిథి, మాసశివరాత్రి

30 శూన్యతిథి

### మే

1 సర్వేషాం అమావాస్య

4 అక్షయ తృతీయ సింహాచలం
శ్రీలక్ష్మీనరసింహస్వామివారి చంద
నోత్సవం, వాస్తుకర్తరీ ప్రా॥

6 ఎంబెరుమానార్ తిరు॥
శంకరజయంతి.

మీ సేవలో....


**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 272929,
చందా: సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-,
విదేశాలకు సంవత్సరచందా $ 25,
E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org
D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం,








# స్వభాను నామ సంవత్సర ఉగాది మంగళాశాసనములు



ప్రియభగవద్బంధువులారా....!

చిత్రభానునామసంవత్సరానికి వీడ్కోలు పలికి. స్వభానునామసంవత్సరానికి స్వాగతించే ఈ శుభ తరుణంలో భగవానుడు మనల నందరిని చల్లగా కరుణించాలని, దేశాన్ని, జాతిని సమర్ధవంతంగా ముందుకు నడిపించేటట్లు అనుగ్రహించాలి అని ప్రార్ధన చేస్తున్నాం.

చల్లటి వానలు, చక్కటి పంటలు మనకు ప్రసాదించి, ఆరోగ్యవంతంగా తనయొక్క సేవలు మనం చేసుకో గలిగేటట్లుగా పరస్పరం ప్రేమానురాగాలతోటి కలిసి మెలసి జీవించేటట్లుగా అనుగ్రహించాలి అని భగవంతుని ప్రార్ధన చేస్తూ అందరికీ అనేకానేక మంగళాశాసనాలు చేస్తున్నాం.

ఉగాది పండుగ వచ్చింది అనగానే అందరికీ అనందం. ఉగాది పండుగనాడు మూడు పనులు చెయ్యాలి అని మన శాస్త్రం చెపుతోంది. అవి మొదటిది **అభ్యంగన స్నానం, నింబకుసుమ భక్షణం, పంచాంగ శ్రవణం** అని అంటారు. అంటే దేహగతం అయిన దోషాలన్ని తొలగేటట్లుగా మనం అభ్యంగనస్నానం చేయటం, ఆంతరంగికమైన వ్యాధి నివారణకోసం నింబకుసుమ భక్షణం. అంటే వేపపువ్వు పచ్చడి తినటం. మానసికమైన స్థిరత ఏర్పడడం కోసం పంచాంగ శ్రవణం ఏర్పాటు చేసిఉంటారు మన మహర్షులు, పండితులు చాంద్రమానాన్నిబట్టి ఈ ఉగాది నుండి ఏడాది కాలాన్ని 'స్వభాను' అనిపిలుస్తాం.

చంద్రుడు పూర్ణిమనాడు ఏ నక్షత్రంతో కలిసి ఉంటే ఆ పూర్ణిమనాటికి 15 రోజులు ముందర శుక్లపక్షంగా, పూర్ణిమ నాటి తరువాత 15 రోజులు కృష్ణపక్షంగా దానిని ఒక నెలగా భావనచేసి చిత్తా నక్షత్రంతో చంద్రుడు చేరిన నాటి నుంచి ప్రారంభం చేసి క్రమంగా 12 నెలలను ఏడాదిగా నిర్ణయం చేశారు. వైదిక నియమం ప్రకారం కృత్తిక నక్షత్రంతో చంద్రుడు కలసి ఉండే కార్తీకమాసంతో ఏడాది ప్రారంభ అవుతుందేమో అని అనిపిస్తుంది. నక్షత్రాల క్రమాన్ని గురించి వేదం వర్ణిస్తూ **'అగ్నిర్నః పాతు కృత్తికా...'** అంటుంది. పాలకడలిలో పవళించిన పరంధాముడు మేలుకొని లోకాలను కరుణించే కాలం కార్తీకమాసం.ఆవెంటనే వచ్చే మార్గశీర్షం పంటలు ఇంటికి చేరే కాలం, అది కాగానే ఉత్తరాయణం వచ్చి దేవతలకి పగలు ఆరంభమంటారు. అప్పుడు మార్గశిరం బ్రాహ్మముహూర్తంలా అయింది. అందుకే నెలల్లో కార్తీకం మొదటిదని గతంలో ఉండి ఉంటుంది. ఇప్పటికీ ఉత్తర భారతీయులు కార్తీకమాసం నుండే క్రొత్త చిట్టాలెక్కలు ప్రారంభిస్తారు. అయితే ప్రస్తుతం మనకి చైత్రమాసం మొదటిది అక్కడి నుండి 12నెలలు ఓ ఏడాది. ఆ సంవత్సరాలకి





ప్రభవాది పేర్లు ఏర్పరచుకున్నాం. అలాంటి గణనలో మనం ఇప్పుడు స్వభానులోకి ప్రవేశించాం.

మనం మానవులం. మానవుడికి అనుకరణ ప్రధానమైనది. ఎవరైనా ఒక పనిని చేస్తుంటే మనం కూడా చూచి అలానే చేద్దాం అను కుంటాడు. అది సులభంగూడ. ఈ లోకంలో ఎలా జీవిస్తే చరిత్రలో తనపేరు చిరస్థాయిగా ఉండవచ్చును అనేది ఆచరించి మానవునికి చూపించడం అవసరం అనే భగవంతుడు స్వయంగా శ్రీరామచంద్రుడిగా అవతరించాడు.

శ్రీరామచంద్రుడు ఆదర్శ వంతమైన మానవుడు. అందుకోసమే ఆయన్ని మర్యాదా పురుషోత్తముడు అంటారు. పురుషోత్తముడు అని అంటే మనుష్యుల్లో చాలా మంచివాడు అని అర్థం. స్వార్థం ఏమాత్రం లేకుండా ఇతరుల ప్రయోజనానికై జీవిస్తే వాడిని పురుషోత్తముడు అంటారు. రామచంద్రుడి జీవితంలో ఎక్కడా స్వార్థం అనేది మనకు కనిపించదు. కేవలం తను ఇతరుల కోసమనే జీవించాడు. చిన్నప్పుడు తండ్రి, తల్లిని సంతృప్తి పరచడం కోసం, వనవాసం చేస్తూ ఋషుల కోసం, ఆపై వానరాలకి ఉండే ఆటంకాలు తొలగించాడు. వాటి జీవితాలను సుఖమయం చేశాడు. మరికొంచెం పైకివెళితే రాక్షసుల జీవితాలను సుఖమయం చేయాలి అని అనుకున్నాడు. నరుడా! వానరుడా!! మనిషా!!! రాక్షసుడా!!!! అనే తారతమ్యాన్ని పాటించలేదు. తనుతోటి ప్రాణికోటి నంతటిని సంతృప్తి పరచి వారిని సుఖజీవనం సాగించగలిగేటట్లుగా చేసి, ఆ విధంగా ప్రపంచం మొత్తం ప్రాణికోటి నంతటిని సుఖ జీవన వ్యవస్థకు అనుగుణంగా తీర్చిదిద్దడం తన జీవిత ధర్మంగా భావించిన మహనీయుడు. అందుకే ఆదర్శమానవుడు.

యాస్క మహర్షి **'మత్వా కర్మాణి శీవ్యతి ఇతి మనుష్యః...'** అనే నిర్వచనం చెప్పాడు. తనేమిటో, తన సమాజ మేమిటో, తన లక్ష్యం ఏమిటో **'మత్వా'** గుర్తించి, మనసులో దాన్ని ధ్యానించి, దానికి తగినట్టుగా 'కర్మాణి శీవ్యతి' తన పనులను ఆచరించేవాడు మనుష్యుడు. సమాజం అనేది చింపిపారవేసిన రంగు రంగుల గుడ్డముక్కలైతే వాటినన్నింటిని ఒక దగ్గరికి చేర్చి అందంగా ధరించగలిగే వస్త్రంలా అల్లగలిగే వ్యక్తిని మనుష్యుడని అంటాం. భిన్న భిన్నమైన ప్రవృత్తులతోటి, వృత్తులతోటి, స్వభావాలతోటి చిందరవందరగా పడిఉండే ఈ సమాజవ్యవస్థను గమనించి, ఆ సమాజంలో ఉండే మనుష్యులే కాదు తన చుట్టూ ఉండే ప్రాణికోటి నంతటిని ఒకే త్రాటిపైకి వాటి వాటి క్రమంలో అవి నిలబడగలిగేటట్లుగా తనపనిని తాను దిద్దుకుంటూ, వాటికి ఉపకారం చేయగలిగే వ్యక్తిని మనుష్యుడు అనవచ్చు.

అలాంటి మనుష్యులలో మర్యాదా పురుషోత్తముడు శ్రీరామచంద్రుడు. 'మర్యాద' అంటే హద్దులు అని గుర్తించినవాడు శ్రీరామ చంద్రుడు. ఒక రాక్షసుని సంహరించినా, ఒక జంతువుని సంహరించినా, ఒక మానవుని సంహరించినా, మర్యాదకు భిన్నం కానీయక, అంటే, తన హద్దులు మీరలేదు శ్రీరాముడు. ఈ మర్యాదా పురుషోత్తముడిని ముందర నిలుపుకొంటే మన జీవితాన్ని చక్కబరచు కోవచ్చు. 'ఆదర్శం' అంటే అద్దము. అద్దాన్ని మన ముందర పెట్టుకుంటే మాలిన్యాలను కడుక్కోవచ్చు, దిద్దుకోవచ్చు. బాహ్యమైన

లోపాలను సరిదిద్దుకోవచ్చు, అందాల్ని సంతరించుకోవచ్చు, మనిషికి ఉదయం లేచినప్పటినుంచి అద్దంలేకపోతే ఒక రోజుకూడ గడవదనేది మనందరికితెలుసు. శ్రీరామాయణం మానవజాతికే ఒక ఆదర్శము. దాన్ని ఏడాది మొదట్లో స్మరిస్తే ఆ ఏడాదంతా జీవితాన్ని దిద్దుకోవచ్చు. **'ఆత్మానం మానుషం మన్యే...'** ఒక మానవునిగా ఈ లోకంలో జన్మించి, మానవ జీవితాన్ని కళంకం లేకుండా గడిపాడు శ్రీరామచంద్రుడు. అందుకే ఆ రామచంద్రుని యొక్క అవతారం మన జీవితానికి ఆరంభం అని భావన చేస్తూ చైత్రమాసం నుండి నెలలను లెక్కించడం ప్రారంభించి ఉంటారు. మానవత్వ సౌరభాలను నవనవోన్నతముగా తీర్చిదిద్దు కుంటూ సంవత్సరాన్నారంభించ వీలయ్యేట ట్లుగా శ్రీరాముడు అవతరించే నవమికి ముందుకి శుక్ల ప్రతిపత్‌తో సంవత్సరాన్ని ఆరంభించుకోవాలి. ఆనందమైన జీవితాన్ని మనం సాధించగలగాలి అని మన పెద్దలు రామావతారం తర్వాత చైత్రం నుండే సంవత్సరాన్ని ప్రారంభించి ఉంటారు.

ఏది ఏమైనా క్రొత్త ఉగాది 'స్వభాను' ప్రారంభమైంది. పంచాంగ శ్రవణం చేసిఉంటాం. అన్నీ విపరీతాలే వినిపిస్తున్నాయి. శుభదాయకంగా ఏమీ చెప్పడంలేదు. ప్రకృతి వైపరీత్యాలూ, పాలకుల ప్రతాపాలూ, మత కల్లోలాల విజృంభణలూ, ఆర్థిక పరిస్థితిలో ఒత్తిళ్ళు ఇవే పంచాంగాలు సూచిస్తున్నాయి. ప్రత్యక్షంగా కన్పిస్తున్నాయిగూడ. అయినా మన బ్రతుకుబండి ఆగరాదుకద! అలాసాగేటపుడు బాహ్య పరిస్థితుల్లో విపరీతాలు పొడసూపినా మానసిక స్థైర్యం మాత్రం సడలి పోరాదు కద! దానికే మన నియమాలను వదలకుండా ఆరాధించుకుంటూ ఇతరుల నియమాలను గౌరవించగలిగే **'స్వీయ ఆరాధన - సర్వఆదరణ'** అనేది మానవ జీవన సూత్రం కావాలి. అంతే కాదు పశువులు, తనచుట్టూ ఉండే వృక్షాదులు తనతోపాటు తన ఉనికిని అవసరము అనుకో గలిగితే వాటిని పాడుచేయకుండా సవ్యంగా ఉండనిస్తే, చేతనైతే వాటికి కూడా కొంత సేవ చేయగల్గితే, అంతటా వ్యాపించిన భగవంతునికది సేవగా భావించగల్గితే **'మాధవసేవ'** అనే భావంతోటి సర్వప్రాణులకి సేవ చేయగల్గితే అదీ ఒక జీవన సూత్రం కాగలిగితే తద్వారా మాత్రమే మానవులం జీవితాన్ని ఆనందమయం చేసుకో గల్గుతాము. మన **'గీతాజ్యోతి'** అందుకా రంభించినదే దాని పరిమితిని మరికొంచెం ముందుకి పొడిగించుకుంటున్నాం. ఈ 'గీతాజ్యోతి'ని అందరూ వెలిగించే ప్రయత్నం చేయగలిగితే ఈ సంవత్సరం మన జీవితాన్ని ప్రశాంతంగా గడపడానికి అవకాశం ప్రసాదిస్తుంది. కాల రూపుడైన భగవానుడు మనకు ఆ శక్తినిచ్చి మన జీవితాన్ని సార్ధకం చేయుగాక, సఫలం కావించు గాక మనందరిని కలిపి ఉంచుతూ ముందుకు నడిపించుగాక అని ప్రార్థన చేస్తూ....

**భగవద్బంధువులందరికీ అనేకానేక మంగళాశాసనాలు చేస్తున్నాం.....**

జై శ్రీమన్నారాయణ...!







# సందేహాలు - సమాధానాలు

**ప్ర. పరమ పదోత్సవ సేవాకాలంలో ఏమేమి చదువుతారు? సత్సంగాత్ భవనిస్పృహో; ఉపదేశ రత్నమాల వంటివి చదివితే సరిపోతుందా? వివరించగలరు?**

జ. పరమ పదోత్సవంలో సేవాకాలం పూర్తయ్యాక 'ఇయల్ గోష్ఠి' చేస్తారు. ఇందులో స్వాములకు 'చందన మాల్యాదులు' అర్పించి; చెఱకు దండాలు చేతికిచ్చి కర్త, కలశంతో ముందు నడుస్తూండగా **'ఇయఱ్పా'** అనే ప్రబంధం సేవిస్తూ స్వాములు నిర్దేశించి నంత పరిధిలో యాత్ర చేస్తారు. ఒకవేళ ఆ ప్రబంధం రాకపోతే **"ఉపదేశరత్నమాల"** స్తోత్రాలు చదువుతారు. తిరిగి రాగానే ద్వారం దగ్గర ఇయఱ్పా లేదా ఏ ప్రబంధం చదివితే దాని శాత్తుముఱై జరిపి ఆ ఇక్షు దండాల అంచులు విరిచి, వాటిని విసర్జించి స్వాములకి పాదప్రక్షాళనాదులు చేసి **'ఇయల్'** సంభావన సమర్పించి ఆపై కర్తకూడా పాదప్రక్షాళన చేసికొని గృహంలోకి వెడతారు. ఆపై స్వర్గపాథేయము ఆచార్యులకి సమర్పించి **"అర్వాంచః. సత్సంగాత్; జ్ఞానమను ట్టానమ్"** ఇత్యాదులు అనుసంధించి వారిని సాగనంపుతారు. ఇక్కడ స్వర్గము అని అంటే పరమపదమని అర్థము. ఆపై పెరుమాళ్ళకు నైవేద్యం, తీర్థప్రసాదగోష్ఠి జరుపుతారు. ఇది నియమం.



**ప్ర. చనిపోయినవారికి మనం చేసే తిరువధ్యయన ఫలం ఎలా చేరుతుంది?**

జ. దీనికి సమాధానం మనం గతంలో భక్తినివేదలో యిచ్చి ఉన్నాము. పోయిన వారికి మనం చేసేవి అందుతాయా? లేదా? అనేది మన బుద్ధిని బట్టికాక శాస్త్రమును, ఆచారమును బట్టి చేస్తున్నాం. అయితే యుక్తివాదాన్ని ప్రయోగించే వారికి తగిన సమాధానం కూడా ఉంది. ఇక్కడ చేసేది అర్పించిన వస్తురూపంలోకాక, మంత్రశక్తితో ఆ జీవుడు ఏ దేహంలో ఉంటే ఆ దేహానికి అవసరమైన ద్రవ్యంగా మారి అందుతుంది కనుక చేయవచ్చు. ఒకవేళ ఆ జీవి మోక్షానికి వెళ్ళిపోతే తిరిగి చేసిన కర్తకే మరింత సంపత్ప్రదంగా అందుతుంది. కనుక చేయడం కర్తకి వ్యర్థం కాదు.



**ప్ర. 'శ్వేతవరాహ కల్పం' తదుపరి శ్రీవేంకటేశ్వరుని మహిమ తగ్గుతుందని పురాణ, ఇతిహాసాల్లో చదివాను నిజమా?**

జ. శ్వేత వరాహకల్పంలోని 14 మంది మనువుల్లో 7వ మన్వంతరం జరుగుతోంది. ఇంకా 7 మన్వంతరాల కాలం ఉంది. వైవస్వతమన్వంతరం గడవడానికి '43' చతుర్యుగాలు గడవాలి. ఒక్కొక్క చతుర్యుగానికి 43,20,000 సం॥లు. అలాంటివి '43' చతుర్యుగాలు ఇంకా ఉన్నాయి. అపుడు ఒక వైవస్వత మన్వంతర మౌతుంది. ఆ తర్వాత '7' మన్వంతరాలు జరగాలి. అపుడు శ్వేత వరాహకల్పం పూర్తవుతుంది. అప్పటికి ఇంకా ఏమౌతుందని ఇపుడు మనం దిగులు పడాల్సిన అవసరంలేదు.



# మహర్షుల చరిత్ర - శ్రీ శుక మహర్షి

తమిళమూలం :
వై.వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి

తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూపురాణి ఉడయవర్‌స్వామి, విజయవాడ

'ప్రాయోపవేశం' చేయడానికి సిద్ధపడిన పరీక్షి న్మహారాజు మునులను ఈ విధంగా ప్రార్థించాడు.

శ్లో॥ **తతశ్చ వః పృచ్ఛ్యమిమం హి పృచ్ఛే**
**విస్రభ్య విప్రా ఇతికృత్యతాయామ్**
**సర్వాత్మనా మ్రియమాణైశ్చ కృత్యం**
**శుద్ధం చ తత్రాామృశతాభియుక్తాః**

మునులారా "చనిపోయేవాడు చేయ వలసినదిఏమి? ఇదే నేను మిమ్ములను అడగాలని అనుకుంటున్నాను. వేదములన్నీ ఒకేచోట చేరినట్లు మీరంతా ఇచ్చటకువచ్చి నన్ను అనుగ్రహించారు. నా ప్రశ్నకు తమరు బాగా ఆలోచించి సమాధానం ఇయ్యవలసి నదిగా ప్రార్థిస్తున్నాను" అనిజాలిగా ప్రార్థించాడు.

**శుకుని రాక :–** ఇంతలో అక్కడకు శుకమహర్షి వచ్చి చేరాడు. అక్కడ ఉన్న ఋషులందరి మధ్యలో ఈయన నాయకమణిలాగా ప్రకాశించాడు. ఒక గమ్యం అంటూ ఏమీలేక దేశమంతా చుట్టి తిరుగుతూ ఉండే సాధువు ఈయన. వీరివంటివారిని " అవధూత" అని అంటారు. పుట్టిన వెంటనే సన్యాసం స్వీకరించినవాడు. ఇప్పుడీతని వయస్సు 16 సంవత్సరాలు. ఈ మహర్షి మహిమకు ఆకర్షితులై ఎప్పుడూ ఆయన చుట్టూ చిన్న పెద్ద అనే భేదం లేకుండా అనేకమంది చేరిఉండే వారు. గంభీరమైన సుందరదివ్యమంగళ విగ్రహం నిర్మలమైన, పరిశుభ్రమైన మనస్సు. మనసులోని అందం ముఖంలో ప్రతిబింబిస్తూ ఉండేది. పచ్చని శరీరఛాయ, నేత్రద్వయం వర్ణనాతీతం. శరీరంమీద వస్త్రం అనేదేలేదు.

ఈ మహర్షిని దర్శించడం దుర్లభం. ఏ సమయంలో ఎక్కడ ఉంటాడు అనేది అంతు చిక్కని విషయం. మనకు గోచరించినా, ఎక్కువ సేపు ఒకేచోట ఉండడం అనేది ఆయనకు అలవాటు లేదు.

అలా ఒకచోట కాలునిలువక తిరిగేవ్యక్తి ఈయన. ఏదైనా ఒక పనిమీద ఒకచోటకు వెళితే ఆపని అయేంతవరకైనా అచ్చట ఉండవచ్చు. కాని ఈయనకు చేయవలసిన పని అనేదే ఏమీ లేదు. ఈయనకు కావలసినదల్లా భగవానుడే. ఆ భగవానుడు ఈయన హృదయంలో మంచి ప్రకాశంతో వెలుగుతూ ఉండేవాడు. ఆ భగవదనుభవంతో తనను తాను మరచిపోయేవాడు. ప్రపంచంలోని ప్రతివస్తువు భగవత్ స్వరూపంగానే కనిపించేది. రాయి–రప్పా, వెండి–బంగారం, చీమ–దోమ, పశువు–పక్షి, ఆడ మగ – వీటిభేదమే ఎరుగడు. ఇటువంటి స్థితిలో ఆకలి అనేదే ఎరుగడు. దాహం అసలే లేదు. ఆభరణాలు లేవు. వస్త్రాలు లేవు ఇల్లులేదు, వాకిలి లేదు. ఇటువంటివాడు కావడం చేతనే ప్రజలంతా భక్తి శ్రద్ధలతో ఆయన చుట్టూచేరి అనుసరిస్తూ ఉండేవారు. ఇంత పరిపూర్ణజ్ఞానికి పట్టుమని పదహారేళ్లు లేవే!

*4 Bn.Mar.03.pmd*



శుకమహర్షి, గంగాతీరంలో పరీక్షిత్తు ప్రాయోపవేశం చేయబోయే చోటికి చేరగానే అచ్చట ఉన్న మునులంతా ఒక్కసారి లేచి నిలబడి స్వాగతం పలికారు. సృష్టి ఆరంభం నుంచి ఉన్నవారు, జననమరణాలే ఎరుగని వారు, తపోజ్ఞాన అనుష్ఠాన సంపన్నులు, లోకములకు మార్గ దర్శకులు. వీరంతా ఈ చిన్ని శుకమహర్షిని గౌరవభావంతో ఆహ్వానించారు. శుకుని తండ్రి వ్యాసుడు, వ్యాసుని తండ్రి పరాశరమహర్షి, పరాశరుని తాత వశిష్ఠుడు వీరుకూడ అక్కడ ఉండే మునులతో చేరి శుకునికి మర్యాదలు చేసారు. వీరందరి మధ్యలో శుకుడు తేజో రాశిలాగ వెలిగిపోతున్నాడు. ఆకాశంలో నక్షత్రాలు గ్రహాలమధ్య ప్రకాశించే పూర్ణిమనాటి చంద్రునివలే ఉందా దృశ్యం.

**భాగ్యశాలీ :–** చావు అనేది ఎవరికీ చెప్పిరాదు. అటువంటిది పరీక్షిత్తు భాగ్యమా అన్నట్లు, ముని శాపంతో తాను వారం రోజులలో చనిపోవడం నిశ్చయం అని తెలిసింది. శుకమహర్షి అక్కడకు రావడం జరిగింది. ఎక్కడా కొద్ది సమయం కంటే నిలువనివాడు ఏడు రోజులు పరీక్షిత్తు దగ్గర ఉండడం, ఒక్కక్షణం విశ్రాంతి లేకుండా ఆ ఏడు రోజులూ భగవంతుని కళ్యాణ గుణాలను సవిస్తరంగా అనుగ్రహభాషణం చేయడం – ఇదే పరీక్షిత్తు బాగ్యం. పరీక్షిత్తుకు పూర్వంగాని తరువాత గాని ఇటువంటి భాగ్యశాలురు లేరనే చెప్పవచ్చు. దీనికంతటికి కారణం కృష్ణునికి పాండవులమీద ఉండే అభిమానమే' పరీక్షిత్తు కూడ తనకు ఇంతటి భాగ్యం లభించడానికి కారణం కృష్ణపరమా త్మయే అని, తన తాతల మీద ఉండే అభిమానాన్నే తనమీద కూడ కృష్ణభగవానుడు వర్షింపచేశాడని చెప్పినట్లు భాగవతంలో మనకు కనబ డుతుంది. పరమాత్మ అనుగ్రహంతో బ్రహ్మరాతుడు (శుకుడు) విష్ణురాతుడు (పరీక్షిత్తు) ఒకచోట చేరారు.

**ఒకే ప్రశ్న :–** పరీక్షిన్మహారాజు శుకమహర్షికి అర్ఘ్యపాద్యాదులిచ్చిసత్కరించి నమస్కరించాడు. ఎత్తైన ఆసనం మీదకు శుమహర్షిని ఆహ్వానించాడు.

శ్లో॥ **యేషాం సంస్మరణాత్ పుంసాం**
**సద్యః శుద్ధ్యన్తి వై గృహాః**
**కిం పునర్దర్శన స్పర్శ**
**పాద శౌచా సనాదిభిః**

మహర్షీ! మహానుభావులను స్మరించినంత మాత్రంచేతనే తమ నివాసాలతోపాటు తాము పరిశుద్ధులౌతున్నారో, అటువంటి మహా నుభావుల దర్శనం, పాదస్పర్శ, పూజ, ఆసన సమర్పణ మొదలగునవి అనేకములైన శ్రేయస్సులను కలిగిస్తాయనడంతో సందేహం లేదు.

అని శుక మహర్షిని స్తోత్రంచేసి, నమస్కరించి, ఇంతకు ముందు ఋషులను తాను ఏవిషయం తెలుపమని ప్రార్థించాడో అదే విషయాన్ని గుఱించి తెలుపమని శ్రీశుక మహర్షిని ప్రార్థించాడు పరీక్షిత్తు.

శ్లో॥ **అతః పృచ్ఛామి సంసిద్ధిం**
**యోగినాం పరమం గురుం।**
**పురుషస్యేహ యత్ కార్యం**
**మ్రియమాణస్య సర్వథా ॥**

**యత్ శ్రోతవ్య మథోజప్యం**
**యత్ కర్తవ్యం నృభిః ప్రభో।**
**స్మర్తవ్యం భజనీయం వా**
**బ్రూహి యద్వా విపర్యయమ్ ॥**

"యోగులందరికి పరమగురువులైన మీరు దాసుడనైన నాకు దీనిని స్పష్టంగా తెలియ చేయండి. 'కొద్దిరోజులలో మరణం నిశ్చయం' అని తెలుసుకున్న నాబోటి మానవులు

ఆచరించతగిన దేది? వినదగినదేది? జపింప తగినదేది? భావించదగినదేది? విడువక ధ్యానింపతగినదేది? " అని రాజు శుకమహర్షి పాదాలను పట్టి ప్రార్థించాడు. దానికి శుక మహర్షి మనసు కరిగింది. సకల శాస్త్రవేత్త, వేదవ్యాసమహర్షి కుమారుడు ఐన శుకమహర్షి తనసుమధుర గంభీరస్వరంతో పరీక్షిన్మహా రాజుకు సమాధానం చెప్పడం ఆరంభించాడు.

శుకమహర్షి ఉపదేశాన్ని పరీక్షిన్మహారాజే కాక అక్కడే చేరిఉన్న వారంతా విని ఆనందించారు. వయసులో తనకంటే చాల పెద్దవారు ఉండగా, ఆ సభలో తాను ఉపదేశం చేయడమనేది శుకుడు అన్ని విధాలా అర్హుడని సూచిస్తుంది. అక్కడ ఋషులంతా దాన్నే అంగీకరించారు. భగవానును కళ్యాణ గుణాలను వర్ణించడానికి శుకుడే తగినవాడు అనే ప్రసిద్ధి ఏర్పడింది.

**శుకుని ప్రసంగం ఇలా సాగింది.**

" రాజా! నీవు చాల ఉత్తమమైన ప్రశ్న వేశావు. దీనివల్ల లోకానికి క్షేమం కలుగు తుంది. శ్రీమన్నారాయణునే ఏప్పుడూ ధ్యానించాలి. ఆయన కళ్యాణ గుణాలనే సదా స్మరించాలి. అవే వినాలి. శ్రేయస్సు కోరుకునే వారు. చేయ వలసినది ఇదే. దుర్లభమైన మనుష్య జన్మఎత్తి తిండి, నిద్రలతోను విషయసుఖ అనుభవంతోనూ జన్మను వృధాచేసుకుంటున్నారు, లోకులు. నిజంగా ఇది అన్యాయం. హరినామమొక్కటే మనుష్యులను కాపాడగలదు. నీవు మహా భాగ్యశాలివి. ఏడు రోజులు నిశ్చయముగా జీవించి ఉండగలవు. ఈ ఏడురోజులలో భగవదనుగ్రహం సంపాదించు కోవడానికి కావలసినదంతా చేయవచ్చు. ఒకే ముహూర్త కాలం హరినామ భజనచేసి సద్గతి పొందిన వాని కథ చెబుతాను విను" అని ఆ కథ చెప్పనా రంభించాడు.

### ఖట్వాంగుడు

ఇతడొక రాజు. దేవాసుర యుద్ధంలో అతడు అపార శక్తిసామర్థ్యాలు ప్రదర్శించి దేవతలకు విజయం చేకూర్చాడు. దానికి దేవతలు సంతోషించి "ఏదైనా వరం కోరుకో ఇస్తాం" అన్నారు. "ఇక నా ఆయుర్దాయం ఎంత ఉందో చెప్పండి, ఇదే నేకోరుకునే వరం" అన్నాడు రాజు. నిజానికి అతడు ఏమి అడిగినా ఇచ్చేవారే. కాని ఆ రాజు ఇంతకంటే ఏమీ అడగలేదు......

*(సశేషం)*









## శ్రీవారి పర్యటనా వివరాలు

| | | |
|---|---|---|
| 11-4-2003 | : | శ్రీరామ నవమి కళ్యాణోత్సవం, కుచలాంబాల్ కళ్యాణ మండపం, చెన్నైలో వేంచేస్తారు. |
| 12-4-2003 | : | శ్రీమాన్ సదాశివరెడ్డిగారి గృహములో (హోస్‌పేట) సుదర్శన యజ్ఞంలో వేంచేస్తారు. |
| 13-4-2003 | : | బళ్ళారి, హుబ్లీల కార్యక్రమములలో అన్వయిస్తారు. |
| 15-4-2003 | : | దావణగేరెలో లక్ష్మీనారాయణ పూజలు నిర్వహిస్తారు. |
| 16-4-2003 | : | రాత్రికి మేల్కోట చేరుకుంటారు. |
| 17-4-2003 | : | 16 తెల్లవారితే 17 అనగా మేల్కోటలో నూతనంగా కట్టబడిన జీయర్ మఠము ప్రారంభిస్తారు. |
| 18-4-2003 | : | హైదరాబాద్‌లోని కందికల్‌మెట్ శ్రీరామాలయంలో దీపార్చన కార్యక్రమంనకు వేంచేస్తారు. |
| 19-4-2003 | : | గుజరాత్, భుజ్‌వద్ద వల్లభాపురం చేరుకుంటారు. |
| 20-4-2003 | : | వల్లభాపురం, గుజరాత్ భుజ్ వద్ద మన జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్‌వారిచే నూతనంగా నిర్మించిన గృహసముదాయాన్ని అక్కడి ప్రజలకు అంకితమిస్తారు. |
| 21-4-2003 | : | హైదరాబాద్ వేంచేస్తారు. |
| 22-4-2003 | : | ఏటూరులో ప్రతిష్ఠాకార్యక్రమమును పర్యవేక్షించి, విజయవాడ చేరుకొంటారు. |
| 23-4-2003 | : | శ్రీమాన్ పాతూరి నాగభూషణంగారు పొన్నూరు పట్టణంలో నిర్వహించే ధూళిపాళ్ళ వీరయ్య చౌదరి మెమోరియల్ కళ్యాణ మండపం ప్రారంభోత్సవం కావిస్తారు. |
| 24-4-2003 | : | చెన్నై మార్గంగా మస్కట్ సుల్తానా, ఒమెన్‌కు ప్రయాణం. |
| 4-5-2003 | : | ఆదిలాబాద్ జిల్లా అల్లంపల్లివద్ద గిరిజన పాఠశాల ప్రారంభోత్సవం కావిస్తారు. రాత్రికి హనుమకొండ చేరుతారు. |
| 5-5-2003 | : | హనుమకొండలో శ్రీరామానుజులవారి తిరునక్షత్రం మరియు 9 ధర్మక్షేత్రముల గీతాజ్యోతి కార్యక్రమమును ప్రారంభిస్తారు. |
| 6-5-2003 | : | శ్రీరామానుజులవారి తిరునక్షత్ర మహోత్సవం |
| 11-5-2003 | : | భద్రాచలం ప్రయాణం. |

# రామాయణంలో రమ్యగాథలు

## దాశరథి సతి కొఱకై ఉత్తర దిగన్వేషణ

-చెవుటూరి కుసుమ కుమారి, విజయవాడ.

**"నకథంచన గన్తవ్యం కురూణా ముత్తరేణ వః**
**అన్యేషామపి భూతానాం నానుక్రామతి వైగతిః "**

మీరు ఎట్టి పరిస్థితులలోనూ కురుదేశమునకు ఉత్తరముగా వెళ్ళరాదు. మీరు ఊరక దానిని చూచి వెనుతిరిగిరండు. నేను చెప్పిన ప్రదేశములు కాక, మీకు మీరుగా యోచించి కూడా జానకిని అన్వేషింపుడు. కార్యసాధనచేసి, నాచే ఈయబడు పురస్కారములు అందుకొని దార పుత్రాదులతో సుఖముగా జీవించుచూ, ఇతర ప్రాణులను కూడ పోషించుడు అని మన్ననగా ఆదేశించినాడు సుగ్రీవుడు. అనంతరము సుగ్రీవుడు హనుమంతుని చేరబిలచి, హనుమా!

**"గతిర్వేగశ్చ లాఘవంచ మహాకపే**
**పితుస్తే సదృశం వీర మారుతస్య మహౌజసః"**

గమనము, వేగము, తేజస్సు, కార్య లాఘవలలోనూ కూడా నీవు మహాతేజశ్శాలివి అయినా నీతండ్రి వాయుదేవునితో సమానుడవు. హనుమా! సీతాన్వేషణ ఉపాయమును మహాబుద్ధి శాలివి అనియ నీవే యోచించవలే. పండితుడవు, నియతాత్ముడవు నీతిశాలివి అయిన నీవు బుద్ధి బలముచేత కాలాను గుణముగా ప్రవర్తించగలవు. కనుక సీతాన్వేషణ భారమును నీవే వహించవలెనని పలుకుటను శ్రీరామచంద్రుడు విని

**"దదౌ తస్య తతః ప్రీతః స్వనామాద్యుపశోభితమ్**
**అఙ్గులీయ మభిజ్ఞానం రాజపుత్ర్యాః పరంతపః "**

ఎంతో సంతోషించి శ్రీరామ నామధేయము చెక్కిన తన అంగుళీయకమును సీతకు ఆనవాలుగా ఇచ్చి హనుమా, ఈ అభిజ్ఞానమును చూచి, నీవు నావద్ద నుండి వచ్చినావని సీత భయపడకుండ వుండగలదు. వీరుడవైన హనుమా! నీన్ను గురుంచి సుగ్రీవుడు పలికిన మాటలు విని నీ ఉత్సాహము, బలపరాక్రమములు వినగా నీకు తప్పక కార్యసిద్ధి కలుగునని నామనసుకు తోచుచున్నది సుమా! అని వాత్సల్యాదరములు ఉట్టిపడునట్లు పలుకగానే

**సతద్గృహ్యా హరిశ్రేష్ఠః కృత్వా మూర్ధ్ని కృతాంజలిః**
**వందిత్వా చరణం చైవ ప్రస్థితః ప్లవ గర్షభః**

వానర శ్రేష్ఠుడైన హనుమ శ్రీరామచంద్ర ప్రభువునకు పాదాభివందనం చేసి ఆ అంగుళీయకమును గ్రహించి, చేతులు జోడించి శిరసున ఉంచుకొని సీతాన్వేషణకై పయనం సాగించినాడు. అశేష వానర గణములతో వెళ్ళుచున్న ఆ వాయుపుత్రుని చూచిన రామప్రభువు హనుమతో ఇలా పలికినాడు.





**"అతిబల మాశ్రితస్తవాహం**
**హరి వర విక్రమ విక్రమైరనల్పైః**
**పవన సుత యధా ధిగమ్యతే సా**
**జనక సుతా హనుమం స్తథా కురుష్వ "**

ఓ మహాబలశాలీ ! సింహ విక్రముడా! వాయుసుతా నేను నీ పరాక్రమముమీద ఆధారపడి వున్నాను. బుద్ధిమంతుడవు అయిన నీవు నీ బల పరాక్రమములతో సీత నాకు లభించునట్లు చేయుము. ఓ వీరుడా! నీ పరాక్రమము, నీ ఉత్సాహము సుగ్రీవుడు నీతో చెప్పిన మాటలు అన్నీకూడి నీవై కార్య సిద్ధిని పొందగలవని నాకు తోచుచున్నది.

అహో! విధి విలాసమెంత విచిత్రము. పుడమిన పుట్టిన తరువాత పురుషోత్తముడైన కానిండు కర్తవ్యములు-కష్టములు తప్పవు కాబోలు)

ఆ గొప్ప వానరసేనను తీసుకుని వెళ్ళుచ్ను మహావీరుడైన వాయుసుతుడు హనుమంతుడు నిర్మలాకాశమున నక్షత్రగణములతో ప్రకాశించే చంద్రునిలా నిశ్చలంగా ప్రకాశించాడు.





## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషిచేస్తున్న వారిలో ఒకరు శ్రీమాన్ గుళ్ళపల్లి రాధాకృష్ణమూర్తిగారు (ఎక్స్ మిలటరీ), తమ వంతు కైంకర్యముగా మన భక్తినివేదన కుటుంబాన్ని మరింతపెంచే దిశగా కృషిచేస్తున్నారు. వీరికి

శ్రీశ్రీశ్రీస్వామివారు అనేక మంగళాశాసనములను కృపచేసారు.

# శ్రీవిష్ణు మహాపురాణము

## ప్రథమాంశం - ఆరవ అధ్యాయం

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, కొవ్వూరు.

కాలం మారుతున్నకొలది ప్రాణుల, ముఖ్యంగా మానవుల జీవన విధానాలు ఎలా క్రమంగా రూపు దాల్చినాయో పురాణం స్పష్ట పరస్తున్నది. 'వార్త'లో కృషి-వాణిజ్యం అనేవి ప్రధాన అంశాలుకాగా కృషి (వ్యవసాయం) బహుముఖంగా విస్తరించినట్లు పురాణం చెప్పుతున్నది. వడ్లు, యవలు, గోధుమలు, మినుములు, శనగలు ఇలా ఎన్నో రకాల ధాన్యాలను పండించారు కర్షకులు. గ్రామ్యాలు, యజ్ఞియములు ఆరణ్యకాలు అని మూడు రకాలుగా ఒక్కొక్క రకానికి పదునాల్గు రకాలుగా ధాన్యాలు ఏర్పడ్డాయి. వీటినన్నింటికి యజ్ఞమే మూలం. అంటే యజ్ఞనిష్పత్తి లేనిదే ధాన్యాలు ఆవిర్భవించవని తాత్పర్యం. కనుక, వివిధ ధాన్యాలను యజ్ఞనిష్పత్తికై మానవులు పండించారు.

**ఏతాశ్చ సహయజ్ఞేన ప్రజానాం కారణం పరమ్।**
**పరావర విదుః ప్రాజ్ఞాః తతో యజ్ఞాన్ వితన్వతే॥**

అంటుంది పురాణం. ఈరకరకాలైన ఓషధులు, యజ్ఞాలు ఇవే ప్రజోత్పత్తికి హేతువులు. అందువల్ల ప్రాజ్ఞులు యజ్ఞాలను నిర్వహించారట.

**యజ్ఞాలను ద్వేషించేవారెవరు?**

**యేషాంతు కాలసృష్టోఽసౌ**
**పాపబిందు ర్మ హామునే ।**
**చేతస్తు వవృధే చక్రుః**
**తేన యజ్ఞేషు మానసమ్॥**

ఎవ్వరికి కాలంచేత సృజింపబడిన "పాపబిందువు" మనస్సులలో వృద్ధిచెందిందో వారు యజ్ఞాలపట్ల మనస్సు ఉంచరు అంటుంది పురాణం. మనస్సుల్లో "పాపబిందువు" చేరకుండా ఉండాలంటే యజ్ఞాచరణం అనివార్యం.

**అహ న్యహ న్యనుష్ఠానం**
**యజ్ఞానాం మునిసత్తమ।**
**ఉపకారక పుంసాం**
**క్రియమాణాఘ శాన్తిదమ్ ॥**

ఈ మానవులు చేసే పాపాలు శ్రమించాలి, వారిమనస్సు పాపాలవైపు ప్రసరించకుండా ఉండాలి, అంటే యజ్ఞాలు నిరంతరం సాగాలి.

వేదాలను, వేదవేద్యమన పరమాత్మ తత్త్వాన్ని, ఆయనకు అధీనపడి ఉండి వివిధ కృత్యాలను నిర్వహించే దేవతలను, పరమా త్మకు, ఆ దేవతలకు ప్రీతికారణాలైన యజ్ఞాది క్రియాకలాపాన్ని వీటన్నిటినీ నిందిస్తూ పాప పంకిలమైన మనస్సుకల మానవులే యజ్ఞధ్వంస (ప్రతిబంధ) కారకులౌతు న్నారంటుంది పురాణం.

**వేదాన్ వేద్యం తథా దేవాన్**
**యజ్ఞకర్మాదికంచయత్'**
**తత్సర్వం నిందమానాస్తే**
**యజ్ఞన్యాసేధ కారిణః ॥**





యజ్ఞం అనేది మానవుల ప్రవృత్తిమార్గం. యజ్ఞాలు ఈ ప్రవృత్తి మార్గంలోని సదాచారానికి నిరూపకాలు. కనుక, వేదాలను యజ్ఞాలను నిందించి, వాటిని సాగనివ్వనివారు దురాచార పరులు దురాత్ములు అంటుంది పురాణం.

**ప్రవృత్తి మార్గ వృచ్ఛేదకారిణో వేదనిందకాః।**
**దురాత్మానో దురాచారాః బభూవుః కుటిలాశయాః॥**

కనుక, సృష్టిచేసినతరువాత, బ్రహ్మరూపి అయిన జనార్ధనుడు "మర్యాదను" ఏర్పరచాడు. ఆయా స్థానులకు గుణాలకు తగిన విధంగానే "మర్యాద" (కట్టుబాటు) ఏర్పరచబడింది.

**వర్ణాశ్రమ ధర్మాలు మానవులకేర్పరచిన కట్టుబాట్లే**

మానవుల ఆలోచనలు, ప్రవృత్తులు సక్రమంగా సాగేలా 'వార్త' (కృషి-వాణిజ్యాలు, కులవృత్తులు మొదలైనవి, క్రమబద్ధంగా సాగేలా, ఎక్కడాకూడా 'ప్రవృత్తిమార్గం కుంటు పడని విధంగా పరమాత్మ బ్రహ్మరూపియై ఏర్పరచిన కట్టుబాట్లే వర్ణాశ్రమ ధర్మాలు.

**వర్ణానామాశ్రమాణాంచ**
**ధర్మాన్ ధర్మభృతాంవర ।**
**లోకాంశ్చ సర్వవర్ణానామ్**
**సమ్యగ్ ధర్మానుపాలినామ్ ॥**

ఇలా వర్ణాశ్రమధర్మాలను ఏర్పరచి మానవజీవన విధానం నియత క్రమంలో సాగాలని కట్టుబాట్లు ఏర్పరచిన భగవానుడు - వాటిని యథానియమంగా ఆచరించిన నాల్గు వర్ణాలవారికి నాల్గు ఉత్తమస్థానాలను కూడా ఏర్పరచాడు.

**ప్రాజాపత్యం బ్రాహ్మణానాం**
**స్మృతంస్థానం క్రియావతామ్ ।**
**స్థానమైంద్రం క్షత్త్రియాణాం**
**సంగ్రామేష్వనివర్తినామ్ ॥**

**గాంధర్వం శూద్రజాతీనాం**
**పరిచర్యా నువర్తినామ్ "**

యజ్ఞాది వైదిక క్రియాశీలులైన బ్రాహ్మణులకు ప్రాజాపత్య" మనే స్థానం, సంగ్రామంలో వెన్నుచూపని క్షత్రియులకు "ఐంద్ర" స్థానము, స్వధర్మ నిరతులైన వైశ్యులకు "మారుత" స్థానం, స్వధర్మ నిరతులైన శూద్రులకు "గాంధర్వ" స్థానం ఏర్పరచాడు.

ఇంతేకాదు, ఆయా ఆశ్రమాలలో నిష్ఠులైన వారికి ఉపాసనా స్వభావంలోని తారతమ్యాన్ని బట్టి వివిధోత్తమలోకాలు కల్పించాడు స్వామి.



# భగవద్రామానుజ చరిత్ర

శ్రీమతి టి.కె. చూడామణి, విజయవాడ



శ్రీభాష్యకారులు శ్రీరంగక్షేత్రంలో శ్రీభాష్య ప్రవచనం చేసే రోజుల్లో ఒక శ్రీవైష్ణవ స్వామి ఆయన్ని సేవించుకోడానికి వచ్చారు. శ్రీవైష్ణవులెలా ఉండాలో చెప్పండి? అని అడిగారు, రామానుజులు ఆయన్ని పెరియ తిరుమల నంబిగారి దగ్గరకి వెళ్ళి తెలుసుకోండి అంటూ పంపించారు.

ఆ స్వామి పెరియ తిరుమల నంబి గారి దగ్గరికి వెళ్ళారు. ఆయన ఎంతో ఆదరించి మాట్లాడారు. అపుడు "శ్రీవైష్ణవులెలా ఉండాలో సెలవియ్యండి స్వామి'' అని వినయంగా అడిగారు ఈ శ్రీవైష్ణవ స్వామి. దానికాయన 'మీరు నాల్గురోజులు వేంచేసి ఉండగలరా' అన్నారు. తప్పక ఉంటానంటూ అంగీకారాన్ని తెలిపారు.

మొదటి రోజున పెరుమాళ్ళకి ఉత్సవ మొకటి బ్రహ్మాండంగా జరిగింది. ఆ సందర్భంగా స్వాములందరికీ తదీయారాధన జరిగింది. అందులో ఈ స్వామిని పిలిచి బ్రహ్మచారుల గోష్ఠిలో సాపాటును ఏర్పాటు చేశారు. చిన్నవారితో సాపాటా? అనిపించ లేదాయనకు' ఆనందంగా సాపాటు చేశారు'

రెండవ రోజున అధ్యాపకులందరితో కలిసి సాపాటు చేసేలా ఏర్పాటు చేశారు. ఓహో పెద్దలతో కలిసి కూర్చుని సాపాటు చేసే భాగ్యం కలిగిందంటూ తృప్తికలిగింది. అయినా ఏం పొంగిపోలేదు.

మూడవ రోజున బ్రహ్మవేత్తల మధ్య వారందరితో సాపాటు ఏర్పాటు చేయబడింది. ఈరోజులాగ స్వామిప్రసాదం లభించిందను కుంటూ సాపాటు చేశారు శ్రీవైష్ణవస్వామి.

నాల్గవరోజు వారు "స్వామీ! ఉత్సవాలయి పోయాయి గదా ఈరోజు నా ప్రశ్నకు సమాధానం చెప్పడం కుదురుతుందా మీకు. ఇబ్బందేమీ లేదుకదా" అంటూ వినయంగా ప్రశ్నించారు పెరియ తిరుమలనంబిగారిని. "స్వామీ! శ్రీవైష్ణవుడు ఉప్పులాగ, కొంగలాగ, కోడిలాగ, నీలాగా ఉండాలి అని ఒక్కవాక్యం చెప్పారు. శ్రీవైష్ణవ స్వామికాయన మాటలేమాత్రం అర్థంకాలేదు. కాని ఏమీ అడుగలేకపోయారు. స్వామికి దాసోహం చేసి శ్రీరంగం చేరుకున్నారు. రామానుజుల వద్దకు పోయి దాసోహం చేశారు. ఏమయింది వెళ్ళినపని అన్నారు వారు. "స్వామీ! వారేదో ఒక వాక్యం చెప్పారు. కానీ నాకేమీ అర్థం కాలేదన్నారు. వారేం చెప్పారో చెప్పండి అంటే వారన్నమాటలు అన్నవి అన్నట్లుగా చెప్పారు. ఒక్కసారిగా నవ్వారు రామానుజులు. స్వామీ! చాలా చక్కని ఉపదేశముంది ఆ మాటల్లో.

ఉప్పులా ఉండాలి శ్రీవైష్ణవుడు- అంటే ఏమిటో తెలుసా!

ఉప్పు ఎన్ని విధాల మార్చినా తన ఉప్పదనాన్ని విడిచి పెట్టదు. అలాగే శ్రీవైష్ణవుడు ఇతరులు తిట్టినా, కొట్టినా తనలో ఎలాంటి మార్పులు కలిగించే పనులు చేసినా తనలో ఉండే





దయా గుణాన్ని విడిచి పెట్టకూడదు. ఇదిఒక సందేశం '

ఉప్పు లోపల-వెలుపల కూడా ఒకే విధమైన రసం-అంటే ఉప్పదనం కలిగి యున్నట్లే శ్రీవైష్ణవుడు కూడా త్రికరణములలో ఏక రూపంగానే ఉండాలి గాని ఒకటి ఆలోచించి, ఒకటి చెప్పి, మరొకటి చేసే స్వభావం కలిగి ఉండకూడదు. త్రికరణశుద్ధి (మనస్సు, వాక్, కాయములతో శుద్ధి) ఉండాలి.

ఇంకా-ఉప్పు తానే వస్తువతో కలిసినా తను రుచిని ప్రకాశింపచేస్తూ - ఆ వస్తువుకి రుచిని ప్రకాశింపచేస్తూ - ఆ వస్తువుకి ఒక విలక్షణమైన రసాన్ని కూరుస్తుంది. అలాగే శ్రీవైష్ణవుడు ఎవరితో కలిసి యున్నా తన ధర్మాలని విడిచిపెట్టకుండా ఉండాలి. తన ధర్మాలని ప్రకాశింప చేయాలి. తన బోధనల చేత వారికి మంచి గుణములు కలిగేలా, వారిలో మంచి ప్రకాశించేలా చేయాలి. తెలిసిందా అన్నారు రామానుజులు. ఎంతో ఆనందంగా తల ఊపారు శ్రీవైష్ణవ స్వామి .

ఇంక కొంగలా ఉండడమంటే ఏమిటో తెలుసా? కొంగ ఎంత తెల్లగా ఉంటుందో శ్రీవైష్ణవుడు తన మాటలోను చేష్టలోను సాత్త్వికతను కలబరుచుకొంటూ ఉండాలి. అంతేగాదు - కొంగ నీటిలో నిలిచినపుడు ఆ నీటి తరంగాలు తనను తాకినా తన కోరిక తీరేవరకు ఏమాత్రం చలించదు. స్థిరంగా నిలిచి ఉంటుంది. అలాగే శ్రీవైష్ణవుడు తాను అవలంబించిన శ్రీవైష్ణవ ధర్మానికి ఎన్ని ఆటంకాలు ఎదురైనా సమాజంలో ఒడు దుడుకులు ఎన్నివచ్చినా ఆ ధర్మాన్నుండి తప్పక స్థిరంగా దానినే నమ్మి ప్రచారం చేస్తూ ఉండాలి.

ఇంకొక విశేషం. కొంగ తన కడుపు నిండిందిగదా అని తృప్తి పడి ఊరుకోదు. తన సంతానానికి కూడా కొంత ఆహారాన్ని స్వయంగా తీసికొనివెళ్ళి నోటికి అందిస్తుంది. అలాగే శ్రీవైష్ణవుడు నేను తరిస్తేచాలు - అందరి గొడవ నాకెందుకు అని అనుకొన కూడదు. తనతోపాటు, తన తోటి సమాజాన్ని, తన సంతానాన్ని, అందరిని మంచి మార్గంలో పెట్టే ప్రయత్నం చెయ్యాలి. ఏవి మంచివి అనే విషయాలని శాస్త్రాలలో నుండి తాను గ్రహించి వారికి ప్రత్యేకంగా అందించాలి. తెలిసిందా అన్నారు రామానుజులు. శిరస్సువంచి దాసోహం చేశారు శ్రీవైష్ణవస్వామి.

ఇంక కోడివలె ఉండడం ఎలాగంటే - కోడి తుక్కు కుప్పని కాళ్ళతో చిమ్మి చిమ్మి దూరం చేసి, తనకు కావలసిన దానిని ముక్కుతో ఎత్తి తింటుంది. అలాగే శ్రీవైష్ణవుడు ఆహారాన్ని ప్రాకృతిక వస్తువులను ప్రపంచంలో గ్రహించే టప్పుడు రజోగుణం, తమోగుణం ఉన్న పదార్థాలని పారవేసి సాత్త్వికమైన వాటినే స్వీకరించాలి. అదీ వారి మాటలలో ఉద్దేశ్యం అన్నారు. చేతులు జోడించారు శ్రీవైష్ణవస్వామి 'మరి నాలా ఉండాలన్నారేమిటి?' ఆశ్చర్యంగా ప్రశ్నించారు. రామానుజులు ఆయనకేసి చూసి నవ్వారు.

"మీరు వారిదగ్గర నాలుగు రోజులున్నారు గదా ! అప్పుడు ముందురోజు చిన్న పిల్లలతో కలిసి సాపాటు పెట్టారు. రెండోరోజు అధ్యాపకు లతో, మూడోరోజు మహాపండితులతో కలిసి పెట్టారు గదా? ఇలా ఎందుకు చేశారు అని మీరు వారిని ప్రశ్నించలేదు. పైగా మీలో ఇలా

చేశారే అనే అసంతృప్తికూడా ప్రదర్శితం కాలేదు. శ్రీవైష్ణవుడు పెద్దలు ఏమి చేసినా ఇందులో ఏదో అంతరార్ధముంటుంది అని తెలుసుకోవాలి. దేనికి తొందర పడకూడదు. తెలియని వారు నిందించినా – అదీ మన మంచికే అని గ్రహించే ఓర్పు కలిగి ఉండాలి. ఈ లక్షణం మీలో వారికి కన్పించింది. అందుకే మీలాగ ఉండాలని అన్నారు. అని వివరించిచెప్పారు రామానుజులు. శ్రీవైష్ణవులు ఎలా ఉండాలో తెలియచేసిన ఈ ఘట్టం వైష్ణవులందరికీ శిరోధార్యం'.

**శ్రీవైష్ణవులు అంటే ఎవరు ?**

**శ్లో ॥ యే కంఠ లగ్న తులసీ నళినాక్ష మాలాః**
**యే బాహు మూల పరిచిహ్నిత శంఖచక్రాః**
**యే వా లలాట ఫలకే లస దూర్ధ్వ పుండ్రాః**
**తే వైష్ణవాః భువన మాశు పవిత్రయంతి.**

శ్రీమహావిష్ణువును భక్తితో సేవించే వారంతా వైష్ణవులు. వారి కంఠాలలో తులసి మాలలు విరాజిల్లుతూ ఉంటాయి. వారి భుజద్వంద్వంపైన శంఖచక్రాలు విరాజిల్లుతూ ఉంటాయి. వారి తిరుముఖ మండలం ఊర్ధ్వ పుండ్రశోభతో విరాజిల్లుతూంటుంది. వారు వైష్ణవులు. వారి ఉనికి లోకాలనే పవిత్రం చేస్తుంది. ఇటువంటి రూపధారణతో అష్టాక్షరీ, ద్వయమంత్రాల అనుసంధానంతో నిరంతరం శ్రీమన్నారాయణుని ధ్యానించే వారంతా శ్రీవైష్ణవులే. వీరంతా ఒక ఉప్పుకల్లులాగా ఒక కొంగలాగ, ఒక కోడిలాగ ఉండాలనే సందేశం అత్యుత్తమం. అటువంటి భావ సంపద పెంపొందించుకున్నప్పుడు ఈ భూమండలమే పరమపదమౌతుంది. శ్రీమన్నారాయణుని కటాక్షం వెల్లివిరుస్తుంది.







# ఇతిహాసబోధ - 14

పుట్టిన దగ్గరనుండి మరణించేదాకా మనిషి నిరంతరం ఏదో ఒకటి పొందాలని ప్రయత్నిస్తూనే ఉంటాడు. ఎంత నీరుపోసినా ఇంకిపోయే ఇసుక ఎడారిలాగా ఎన్ని పొందినా, ఇంకా కావాలనే ఆరాటపు బ్రతుకు మనిషిది. 'భగవంతు'డంటే ఏకాగత్ర పెంచుకోడానికి ఉపయోగపడే ఒక అందమైన భావన అనీ, కోరిన వస్తువుకోసం, తనకు నచ్చిన రూపంలో ఆరాధించేందుకు వీలైన ఒక శక్తి స్వరూపం అనేది చాలా మంది అభిప్రాయం. ఈ జగత్తులో అందరూ అదీ, ఇదీ కావాలని అంగలార్చే ఆస్తికులే తప్ప నాస్తికులెవ్వరూలేరు.

"సీతమ్మను" చెఱపట్టిన రావణాసురునికీ 'దైవభక్తి' ఉంది. ద్రౌపదిని అవమానించిన దుర్యోధనునికీ దైవభక్తి ఉంది. 'వరాల'ను కోరుకునే విషయంలో వారూ మనలాంటి వారే అయితే కోరుకోవడంతో మాత్రమే ఊరుకోక, దానిపై మరికొంత కష్టపడటంతో దైవానుగ్రహం వల్ల సిరీ సంపద, శక్తీ, సామర్థ్యమూ, కీర్తీ ప్రతిష్ఠా వారికి లభించాయి. తీరా అవన్నీ వచ్చాక, అదంతా తమ "ఘనకార్యం" అనుకొని విఱ్ఱవీగి, చేయగూడని తప్పలన్నీ చేసి వాళ్ళు ఆత్మ వినాశనం పొందారు.

'మీరంతా అలా వారిలా ఏడ్వకండిరా బాబూ' అని ఋషులు వారిగాధలను, ఇతిహాసాలుగా, పురాణాలుగా మార్చి మనముందుంచినా, మనం మాత్రం వాటిని దూరంగ ఉంచాము. ఎందుకంటే మన స్థాయికి మనమూ బుల్లి అసురులమే కదా!

'నాకదిస్తే నీకిదిస్తా'ననే వ్యాపారపు ప్రతిపాదనలతో మనం సాగించే విన్నపాలూ, ప్రార్థనలూ వినీవినీ భగవంతుడుకూడా మనకోసం గడుసరి వ్యాపారే అయిపోయాడు. మన భక్తి అంగడి వస్తువైపోయింది.

వ్యాపారమన్నాక లాభనష్టాలు తప్పవుగదా! లాభమొస్తే మాత్రం తన ప్రతిభ. నష్టమొస్తే మాత్రం ఎదుటివాడి మోసం. సుఖాలకు పొంగి పోయి, కష్టాలకు కృంగిపోయి భగవంతుడి పట్ల అవిధేయతతో మెసిలే మన బ్రతుకులోని రోతను గుర్తుకు తెచ్చుకొనేందుకు ఈమాసం 'జరాసంధుని జీవిత గాధ'ను నెమరు వేసుకొందాం!.

జరాసంధుడనగానే మనకు ధర్మరాజు యొక్క రాజసూయయాగం గుర్తుకొస్తుంది. ఎందుకంటే ధర్మరాజుచే రాజసూయ యాగాన్ని నిర్వహింపచేసేందుకు భగవానుడు మొదటగా చేసినపని జరాసంధుడి అడ్డుతొలగింప చేయడమే గదా! రాజసూయ యాగమంటే సామాన్యమైన వ్యవహారం కాదు. యావత్ భరత ఖండంపై ఎవరికి సార్వభౌమాధికార మున్నదో నిరూపించే బలప్రదర్శన.

తాను ఆవిర్భవించిన యాదవజాతిలోని వీరులచే భగవానుడు రాజసూయ యాగాన్ని నిర్వహింపచేయలేదు. స్వామి సంకల్పిస్తే ఏ ఉగ్రసేనుడో, ఏ బలరాముడో భరతఖండ సార్వభౌమునిగా ప్రకటితమయ్యేందుకు వీలుగా రాజసూయయాగం సాగేది.

అయితే స్వామి వీరందరికన్నా మేలైన ఉపకరణంగా, తనకు భక్తుడూ, దైవీసంపదకు ప్రతినిధీ అయిన పాండవాగ్రజుడైన ధర్మరాజును ఎంచుకొన్నాడు. నిరంతరం దైవం పట్ల కృతజ్ఞతాభావంతో ప్రవర్తిస్తూ మాధవుడు మెచ్చే సేవకుడుగా ఎవరుంటారో వారే కదా భగవానుని దృష్టిలో సార్వభౌమాధికారానికి, లోక పాలనానికి అర్హులు.

రాజుసూయయాగ సంకల్పానికి పూర్వం హస్తినాపురం, లేదా, కౌరవ ప్రాభవం కొద్ది ప్రాంతానికే పరిమితమై ఉన్నది. భీష్మాచార్యుడి లాంటి వీరాధివీరుడు, అజేయుడు రాజ్య రక్షకుడుగా ఉన్నా చాలాకాలంపాటు కురు రాజ్యం బలహీనంగా ఉన్నది. శంతనుడు మరణించిన వెంటనే కౌరవరాజ్యాన్ని కబళించడానికి పాంచాలరాజు ఉగ్రాయుధుడు హస్తినాపురంపై దండెత్తాడు. దండయాత్రను విరమించుకోవడానికి అతడు శంతనుని భార్య అయిన సత్యవతిని తన కర్పించాలనే షరతును విధించాడు. వరబలంతో తాను పొందిన చక్రాయుధాన్ని చూచుకొని ఉగ్రాయుధుడు అంత కండకావరంతో వ్యవహరించాడు. అప్పటికి తండ్రియొక్క ఉత్తరక్రియలు కూడా పూర్తికాకపోవడంతో, ఆశౌచం పోయేదాకా ఓపిక పట్టి భీష్ముడు, ఆ తర్వాత భీకర యుద్ధంలో ఉగ్రాయుధుడిని వధించి ద్రుపదుడి తండ్రి అయిన పృషతుడిని పాంచాలరాజును చేసాడు.

శంతనుని కాలంవరకూ ఆర్యావర్తంలో ఉన్నతస్థానంలో ఉన్న హస్తిన పరిస్థితి ఎంత ప్రమాదంలో ఉందో ఉగ్రాయుధుడి ఉదంతం మనకు తెలియజేస్తున్నది. భీష్ముడు రాజుకాడు. రాజ్యరక్షకుడు మాత్రమే. సత్యవతి పుత్రులు చిత్రాంగద, విచిత్రవీర్యులు ఇరువురూ వేర్వేరు కారణాలవల్ల పిన్నవయస్సులోనే కాలం చేసారు. వ్యాసుని ద్వారా వంశాన్ని నిలబెట్టు కున్నది సత్యవతి. అయితే పుట్టిన వారిలో పెద్దవాడు ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు, రాజ్యార్హత లేనివాడు కావడంతో పాండురాజు రాజై హస్తిన ప్రాభవాన్ని ప్రకాశింపచేసేప్రయత్నంచేసాడు. అయితే ఆ వెలుగులు క్షణకాలవే అయ్యాయి. శాపోపహతుడైన పాండురాజు అడవికి వెళ్ళి తపస్సు చేసుకొంటూ అక్కడే మరణించాడు. కనుక సరైన 'రాజ' వ్యవస్థ లేనికారణంగా కురురాజ్యం ఎదుగూబొదుగూ లేని స్థితిలో ఉండిపోయింది.

ఈ పరిస్థితిని అవకాశంగా చేసుకొని ఆర్యావర్తంపై సార్వభౌమాధికారాన్ని నిర్మాణం చేసుకున్నాడు మగథరాజు జరాసంధుడు. మూడు అక్షౌహిణుల సైన్యంకల బృహద్రథుడికి ఛండ కౌశికుని వరప్రభావంచేత జన్మించిన ఏకైక కుమారుడు జరాసంధుడు. రెండు మాంసఖండాలుగా పుట్టి, **జర** అనే రాక్షసి అనుసంధానం చేస్తే 'జరాసంధుడి'గా మారి, గొప్పవీరుడుగా అచిరకాలంలోనే అతడు ఖ్యాతివహించాడు.

అతని రాజ్యకాంక్షకు అంతులేదు. పరమశివుడిని తపస్సుచేత ప్రసన్నంచేసుకొని ఆయుధ యుద్ధంలో తన నెవ్వరూ గెలువలేని విధంగా వరాన్ని పొందాడు జరాసంధుడు. సకల రాజవంశాలన్నీ అతనికి బలపరాక్ర మాలకు తలలువంచాయి. మహాబలవంతుడైన చేదిరాజు శిశుపాలుడు అతని సైన్యాధిపతి. కారూష రాజైన దంతవక్త్రుడు, అవంతి రాజులైన విందాను విందులు అతనికి ఆత్మీయ అనుచరులు.

కౌశిక, చిత్రసేనులనే నామధేయాలతో మెలిగే హంస డిభకులనే వీరులు జరాసంధునికి కుడి, ఎడమ భుజాలు. పశ్చిమ దేశాధిపతి, మహావీరుడూ అయిన భగదత్తుడు పాండు రాజుకు స్నేహితుడే అయినప్పటికీ భయంతో జరాసంధునికి విధేయుడిగా ప్రవర్తించేవాడు. అంగ, వంగ, పుండ్ర, కిరాత రాజులలో ప్రముఖుడైన పౌండ్రక వాసుదేవుడు జరాసంధుని అనుచరునిగా, శ్రీకృష్ణ ద్వేషిగా ఖ్యాతిగడించాడు.

తూర్పు, దక్షిణ దిక్కులలో ఉన్న ప్రముఖ రాజులు పురుజితుడు, కురూశుడు, కలభుడు, నకులుడు, సంకర్షణుడు, సూపహితుడు,





మనోదత్తుడు, చక్రసాల్వేయుడు, యవనుడు మొదలైనవారంతా జరాసంధునికి విధేయులే. ఇక ఉత్తర దిక్కున ఉన్న 18 రాజవంశాల వారు, ఉత్తర కురు, పాంచాల, శూరసేన, పుష్కర, పుళింద, కళింగ, కుంతి, మత్స్య రాజులు అందరూ జరాసంధుని భయంతో తమ తమ దేశాలను విడచిపెట్టారు.

అలాంటి వీరాధివీరుడైన జరాసంధుడు ఒకసారి యమునా నదీతీరంలో విహరిస్తున్నాడు. అదే సమయంలో అటుగా వచ్చిన కంసుని మీదికి జరాసంధుని మదపుటేనుగు 'కువలయాపీడం' దూసుకెళ్ళింది. కంసుడు చాలా తేలికగా దానిని నేలకూల్చడం గమనించిన జరాసంధుడు, అతనికి తన కుమార్తెలైన అస్తి, ప్రాస్తిలనిచ్చి వివాహం చేసాడు. ఈ విధంగా కంసుడిని అల్లుడిగా చేసుకుని జరాసంధుడు యాదవులపైకూడా తన ఆధిపత్యాన్ని పూర్తిగా నెలకొల్పాడు.

తన శక్తికి తిరుగులేదనే గర్వంతో రాజులను ఓడించి, బంధించి చెఱసాలలో ఉంచి, తాను గిరివ్రజపురంలో రోజూ చేసే భైరవపూజలో 'నరబలి'కై వారిని వినియోగించడం అతనికి నిత్యకృత్యమైంది.

బంధుత్వాలచేత, రాజనీతిచేత, బలంచేత తిరుగులేని పాలకుడుగా కొనసాగుతున్న జరాసంధుని ఆధిపత్యానికి **'కంస వధ'** ద్వారా గండి కొట్టాడు శ్రీకృష్ణుడు. కంసుని వధించడం ద్వారా కృష్ణుడు తన అధికారానికి సవాలు విసిరాడని భావించాడు జరాసంధుడు. పైగా భర్తను పోగొట్టుకొన్న కుమార్తెల రోదన అతనిలో ప్రతీకార జ్వాలలను ప్రజ్వలింప చేసింది.

బలరామకృష్ణుల యువనాయకత్వంలో యాదవులు ఉగ్రసేనుని తమరాజుగా చేసుకొని, కంసుని పీడ విరగడైందని ఆనందించారు. అయితే జరాసంధుడి రూపంలో పెనుప్రమాదం మధుర ముంగిట ప్రత్యక్షమయింది. జరాసంధుడి అండవుండడంచేత అయితేనేమి, తన బలపరాక్రమాలమీద అపరిమిత విశ్వాసాలు ఉండటంచేతనేమి. కంసుడు మధుర కోటను శక్తివంతం చేయడంలో నిర్లక్ష్యం చూపాడు. సైన్యంఅంతగా సమర్ధవంతమైనది కాదు. కోటకు రక్షణలేదు.

అసంఖ్యాక సైన్యంతో వచ్చిపడ్డ జరాసంధుడిని ఆస్థితిలో ఎదిరించడం యాదవ జాతికి కష్టమే అయింది. మధురకు ఏర్పడ్డ ప్రమాదాన్ని గమనించిన బలరామకృష్ణులు మధురను వదలి పారిపోయి ప్రవర్షణగిరి చేరారు. అక్కడికీ జరాసంధుడు వెంటపడ్డాడు. తెలివిగా తప్పించుకున్నారు బలరామకృష్ణులు. భంగపడ్డ జరాసంధుడు మరల మరల మధురను ముట్టడిచేసాడు.

మధురలో యాదవుల బ్రతుకు జరాసంధునివల్ల 'దినదినగండం – నూరేళ్ళ ఆయుష్షులా మారిపోయింది. ఈ పరిస్థితులలో యాదవుల రక్షణ ముఖ్యమని గుర్తించిన శ్రీకృష్ణుడు యముననుదాటి సౌరాష్ట్రం చేరాడు. కుశస్థలి ప్రాంతంలోని రైవతక పర్వతం మీద గిరి దుర్గాన్ని నిర్మించాడు కృష్ణుడు. కృష్ణుడు ఇక్కడ నిర్మించిన ద్వారక నగరము మూడు దుర్గాల సమూహం. రైవత కాద్రిపర్వతంమీద, పర్వతానికి, సముద్రానికి మధ్య, సముద్రం లోపల విస్తరించి శత్రుదుర్భేద్యంగా మారింది ద్వారక. గిరిదుర్గ, స్థలదుర్గ జలదుర్గాల సమ్మేళనమిది. కృష్ణుని దూరదృష్టి, సమయ స్ఫూర్తులవల్ల యాదవులకు ద్వారకరూపంలో చక్కని రక్షణ లభించింది.

ప్రస్తుత బీహార్‌లోని పాట్నా ప్రాంతంలో ఉన్న గిరివ్రజపురం నుండి ప్రస్తుత గుజరాత్‌లో సముద్రపు ఒడ్డున ఉన్న ద్వారకమీదికి తరచుగా దండెత్తడం జరాసంధుడికీ కష్టంగానే మారింది. అయితే జరాసంధుని శతృత్వం యాదవులను తమకు ప్రీతి పాత్రమైన మధురను, యమునానదీ జలాలను వదలి వెళ్ళేటట్లు చేసింది.

అలాగే జరాసంధుడిని బలహీనపరచ డానికి కృష్ణుడు కూడా తాను చేయగలిగిందల్లా చేసాడు. జరాసంధుడి కార్యాన్ని చక్కబెట్టే వీరాధివీరులు హంస డిభకులు. ఓటమి ఎరుగని వారిని ఎలా వధించాలో యాదవులకు బోధపడ లేదు. హంస డిభకులు ఇద్దరూ ప్రాణ స్నేహితులు. ఒకరిని వీడి మరొకరు బ్రతుకలేరు. అదొక్కటే వారి బలహీనత. ఈ బలహీనతను కృష్ణుడు చక్కగా వినియోగించు కున్నాడు.

హంసుడిని యుద్ధంలో చంపేసారనే వార్తను డిభకుడి వద్దకు చేర్చాడు. డిభకుడు పాపం అది నిజమేనని నమ్మి హంసుడు లేని బ్రతుకు వ్యర్థమని భావించి నదిలో మునిగి ప్రాణాలు విడిచాడు. డిభకుడి మరణవార్త విన్న హంసుడుకూడా ఆత్మహత్య చేసుకున్నాడు.

హంస, డిభకులు హతమారిపోయినా, జరాసంధుడి పొగరు, ప్రాభవం, పీడన ఎంత మాత్రమూ తగ్గలేదు. తగ్గించే ఘడియకోసం ఎదురుచూస్తున్న శ్రీకృష్ణునికి ఇంద్రప్రస్థం నుండి కబురువచ్చింది.

హస్తిన నుండి వేరుపడి ఇంద్రప్రస్థాన్ని రాజధాని నగరంగా చేసుకొని పరిపాలిస్తున్న ధర్మరాజువద్దకు నారదుడు వచ్చి 'రాజసూయ యాగాన్ని' చేయవలసిందిగా ప్రబోధించాడు. అనుమతినిచ్చి, కార్యాన్ని నిర్వహింపచేయ వలసినవాడు కృష్ణుడే కాబట్టి ధర్మరాజు ద్వారకకు కబురుచేసాడు.

కమలాక్షుడు ఇంద్రప్రస్థానికి వచ్చి ధర్మరాజుకు ధైర్యం చెప్పి 'రాజసూయ' యాగానికి సన్నద్ధుడిని చేసాడు. ఆ క్రమంలో భాగంగానే భీమార్జునులను వెంటపెట్టుకొని గిరివ్రజపురం చేరాడు కృష్ణుడు. బ్రాహ్మణ వేషధారులై వెళ్ళిన భీమార్జున కృష్ణులను సాదరంగా ఆహ్వానించి ఏంకావాలో కోరుకోమన్నాడు జరాసంధుడు.

'బ్రాహ్మణ భక్తుడనైన నన్ను శత్రువుగా మీరు ఎందుకు భావిస్తున్నారు? నా నగరంలో మీ ప్రవర్తన మరీ వింతగా, విపరీతంగా ఉంది. కారణం తెల్పండ'ని అడిగాడు జరాసంధుడు.

'జరాసంధా! నీవు ఉత్తమ క్షత్రియుడవని ప్రకటించుకొంటున్నావు. కానీ నీవు నిరపరా ధులైన రాజులను బంధించి పశువులవలె పశుపతికి బలిస్తున్న క్రూర కర్ముడివి. సాధు హింస సమంజసమైన చర్యా? నిర్దయతో నీవు సాగించే క్షత్రియ వధను మన్నించడం ధర్మం కాదు. కనుక నీకు దగిన బుద్ధి చెప్పటానికి మేమిక్కడికి వచ్చాం.

నీవు బాగుపడాలనుకొంటే "నరబలితో కూడిన భైరవ పూజ మాని రాజులను వదలి పెట్టు. అట్లుకాదందువా? నీ పాపాగ్నిని చల్లార్చడానికి ఈ వీరులు సిద్ధంగా ఉన్నారు. ఈ భీమార్జునులు నీమదమణచి రాజులను విడిపించగలర'ని కృష్ణుడు జరాసంధుడికి హితవు పలికాడు.

విపరీతమైన కోపంతో జరాసంధుడు మండిపడ్డాడు. 'శత్రువులను మర్దించి జయంతో గర్వించడం దోషమా! జనార్దనా! అది ఉత్తమ

11
Bn.Mar.03.pmd



క్షత్రియునికి ఉచితమైన కర్మకాదా? ఈ భూమి మీద నా అంతటి బలపరాక్రమ వంతుడు మరెవడున్నాడు? నా దైవానికి నైవేద్యం పెట్టటంకోసమే నేను ఇతరులను జయించి బంధించాను. ఇప్పుడు మీరు వదలి పెట్టమంటే వారిని వదలిపెట్టేవాడినా?

కనుక కృష్ణా! పోరుకు ఈ జరాసంధుడు ఎప్పుడూ జంకడు. ఆ సంగతి నీకు అనుభవమే కదా! జయంకోసం మీరు కోరిన విధంగా నేను కయ్యానికి సిద్ధమ'ని గర్జించాడు జరాసంధుడు.

''జరాసంధా! మాముగ్గరిలో మిక్కిలి బలశాలిని నీవే ఎన్నుకో! అతడు మల్ల యుద్ధంలో నిన్ను నేలకూలుస్తాడు''- అని నిర్ణయం ప్రకటించాడు కృష్ణుడు. జరాసంధుడు భీమసేనునితో మల్లయుద్ధానికి సిద్ధమయ్యాడు కార్తీకమాస ప్రారంభంలో మొదలై 12రోజుల పాటు ప్రళయ భయంకరంగా సాగింది యుద్ధం. పదమూడవనాడు ఇద్దరూ మల్ల యుద్ధంలో పరస్పరం జయేచ్ఛతో పోరాటం సాగిస్తుండగా, చతుర్దశినాటి రాత్రికి జరాసంధుడు అలసిపోయాడు.

కృష్ణుడు దీనిని గమనించి వాయునంద నుని ప్రోత్సహించడంతోభీముడు విజృంభించి జరాసంధుని వధించి అతని కళేబరాన్ని రాజ భవనద్వారం ముందు పడవేసాడు.

ఆతర్వాత శ్రీకృష్ణుడు జరాసంధుని కుమారుడైన సహదేవునికి అభయమిచ్చి, అతనిని మగధకు పాలకునిగాచేసి, చెఱలో ఉన్న రాజులందరినీ విడిపించాడు.

ఆయుధాలతో చావులేనివాడు, అజేయుడు అయిన జరాసంధుని "క్రూర ఆరాధనం" ఆ విధంగా భీమబలప్రదర్శనంతో ముగిసింది. సమకాలీన రాజలోకాన్ని శాసిస్తున్న మగధ సార్వభౌముని మరణం ధర్మరాజు రాజసూయ యజ్ఞ ఆరంభానికి శుభంపలికింది.

తన యజమాని మరణంతో ప్రారంభమైన రాజసూయయజ్ఞం తన మరణంతో ముగియాలనే పట్టుదలతో చేది భూపతి కృష్ణుని తూలనాడి 'సుదర్శ'నానికి బలిఅయ్యాడు.

జరాసంధ, శిశుపాలుల మరణం ఆ పరంపరకు చెందిన రాజలోకానికి గుణపాఠాన్నివ్వలేదు. 'ధర్మ' ద్రోహులై, కృష్ణ ద్వేషంతో వారు సాగించిన చైద్యాలకు ముగింపును కురుక్షేత్రం పలికింది.

ఇదంతా ముగిసిపోయిన కథ అనుకుంటే మనం పొరపడ్డట్లే. తన ఆధిక్య ప్రదర్శనం కోసం ఎదుటివాడు ఏమైపోయినా ఫరవాలేదనే మనస్తత్వం జరాసంధుడిది. ఒక ప్రక్క పరపీడనత్వంతో, పాప కర్మలతో బ్రతుకు సాగిస్తూ, మరొక ప్రక్క దైవప్రీతికోసం 'మంచి' పనులు చేస్తున్నానని భ్రమపడే జరాసంధుని జీవనవిధాన ఛాయలు మన నీడల్లో దాగున్నాయి. అవి మన ప్రవృత్తులతో వీడని అనుబంధాన్ని పెంచుకున్నాయి. వీటిని గుర్తించి త్రుంచుకొనే సాహసానికి, స్ఫూర్తికి ఈ "ఇతిహాస బోధ" పునాదివేస్తుందని భావిద్దామా?

**యథాప్రకారం ఈ కథకు కూడా తగినపేరు సూచించడంతోపాటు మీరుకూడా ఈ "శీర్షిక"కు ఇలాంటి కథలు పంపే ప్రయత్నం చేయండి.**

## ఇతిహాసబోధ - 13 శీర్షికకు పాఠకులు పంపిన కొన్ని పేర్లు

1. **అతి మానిత్వం తెచ్చిన అనర్థం**
   -ఎం.పార్థసారథి అయ్యంగార్, బొబ్బిలి
2. **అతి మానిత్వం నుండి అమానిత్వం వైపు ప్రయాణం**
   -టి. తిరుపతయ్య, హన్మకొండ
3 **పశ్చాత్తాపం శాంతయుత సహజీవనానికి సోపానం**
   -సి. పాపిరెడ్డి, నిర్మల్
4. **అతి మానిత్వం అణిగితేనే దైవత్వం**
   -ఎం. శంకరరావు, వేకనూరు
5. **క్రోధ మాత్సర్యములు మానవులను ప్రమాదంలో పడవేయును** - కె. రామశేషమ్మ, హిల్ కాలనీ
6. **మాధవుడు మెచ్చే మానవులం కావాలనుకుంటే మనలో 'అతిమానిత్వం' దూరం కావాలి**
   - జె. రాధమధుసూదనరావు, కరీంనగర్
7. **అహంకార-అస్త్రప్రయోగం, గురుపుత్ర గౌరవభంగం**
   - వి. బాపిరాజు, విశాఖపట్నం
8. **వినయము లేని విద్య - విద్య కాదు**
   - డా॥. ఎం. గణేశ్వరరావు, విజయవాడ
9. **దురభిమానం వీడిన - శాంతియుత సహజీవనం గడిపిన మోక్షం పొందుట**
   - ఎన్ ఉమామహేశ్వరరావు, అనకాపల్లి
10. **ఎవరు దగ్గరున్న జరుగునది జరుగక మానదు**
   - ఎస్. లక్ష్మీనరసింహారావు, గుంటూరు.
11. **గీతాజ్యోతి ద్వార అశ్వత్థామ వంటి వాళ్ళను మార్చే ప్రయత్నం ప్రతి ఒక్కరం చేయాలి.**
   - వి. విష్ణువర్ధన్, మామిళ్ళగూడెం
12. **మనిషికి తిండి ఎంత అవసరమో - మనస్సులో మాలిన్యం తొలగించుకోవడం కూడ అంతే ప్రధానం**
   - రంగనాయికి, సికింద్రాబాద్
13. **అనర్థాలకు హేతువు - దురహంకారం**
   - ఎం. జయప్రకాష్, హన్మకొండ
14. **పరమార్థమును తెలుసుకొందాం, అనర్థాలన్నింటిని తొలగించుకొందాము.**
   - ఆర్. అనసూయ, అనంతపురం
15. **అసూయ దురంహంకారంకలవారు భగవంతుని శాపమునకు తప్పక గురికాగలరు.**
   -బి. వీర్రాజు, జగ్గంపేట
16. **బ్రహ్మలిఖితాన్ని ఎవరు మార్చలేరు.**
   -ఎం. విశ్వనాథం, హన్మకొండ
17. **అశ్వద్థామ - అతిమానిత్వం**
   - బి. శ్రీవల్లీ ఆండాళ్, విజయవాడ
18. **అనువుకానిచోటు అధికులమనరాదు అహంకారం పతనానికి మూలం**
   - జె. రాధకృష్ణ అప్పారావు , బి. సావరం
19. **దురహంకారం వినాశనానికి హేతువు**
   - ఎం. విజయదుర్గ ప్రసాద్, అడసర్లపాడు
20. **అశ్వత్థామ - అసూయపర్వం**
   -ఆర్. రామలక్ష్మి, దుగ్గుదుర్రు
21. **త్యజించు అతిమానిత్వ మనస్తత్వం అనుభవించు మాధవ తత్వం** -ఆర్. చక్రపాణి, హనుమకొండ
22. **శ్రీకృష్ణుని ఆగ్రహమే అశ్వత్థామకు శాపం, శ్రీకృష్ణుని అనుగ్రహమే పాండవ వంశరక్షణ**
   -జె. అమరయ్య, అమరావతి
23. **దురహంకారం పతనానికి హేతువు**
   -వి. సుజాత, హైదరాబాద్
24. **దురహంకారము దుఃఖానికి మూలం**
   -ఎస్. పుష్పలత కమలాకరరావు, కరీంనగర్
25. **ఎవరికైన ధర్మపరమైన తత్వజ్ఞానము అవసరం**
   -ఎం. సుర్యనారాయణ, మెళియపుట్టి
26. **అతిమానిత్వం గలవారు ఎంతటి ప్రాజ్ఞులైనను ఎంతటి ప్రతాపవంతులైననూ వారికి పతనం తప్పదు**
   - జి.వి.ఎస్. రామచంద్రరావు, కళ్యాణదుర్గం
27. **ఉద్రేక స్వభావం గలవారికి అవే విచ్ఛిన్నకర శాదిశ నిర్దేశాలౌతాయి**
   - ఎం. పాండరంగాయార్యులు, హన్మకొండ
28. **మాత్సర్యముతో భంగపడిన అశ్వత్థామ**
   -ఎం.జగ్గారావు, గారకుమ్మరిపేట
29. **శక్తి ఉన్నంతమాత్రాన గెలుపు నాదికాదు దైవానిదే**
   -ఎస్. సుగుణవతి, చిన్నబాదారం
30. **అహంకారం ఉన్నవారు పెద్ద చిన్న తారతమ్యం, న్యాయం, అన్యాయం, ధర్మము, అధర్మము అనువానిని గురించి ఆలోచించరు. తాము చేసినదే సరియైనదని అనుకుంటారు. చివరకు అపకారం చేయుటకు కూడ వెనుకాడరు.**
   - కె. కృష్ణయ్య, నాగర్ కర్నూలు
31. **అహంకారము మాత్సర్యములు వ్యక్తి పతనమునకు లోకహానికి కారణమగును.**
   - ఎం. విశ్వనాథం







## బదరి అష్టాక్షరీ క్షేత్రంలో జరుగు అన్నదానమునకు, నిర్మాణమునకు వివిధ పోషకులుగా కైంకర్యమును సమర్పించిన భక్తుల వివరములు

**బదరీ ఆఫీసునకు వచ్చిన విరాళాలు**

**అభిమానులు :**

శ్రీమాన్ జి. వెంకటేశ్వర్లు; శ్రీమతి ఎన్. ఉదయమ్మ; శ్రీమాన్ కె. అంబరీష్; శ్రీమాన్. వి. వెంకటేశ్వర్లు; శ్రీమాన్ ఓ. రామనరసింహయ్య; శ్రీమాన్ రామలింగం, సూర్యపేట; శ్రీమాన్ భాగవతాచార్య, న్యూఢిల్లీ; శ్రీమాన్ జి. కృష్ణమోహన్, తాపేశ్వరం; శ్రీమతి జ్ఞాన ప్రసూనాంబ, కాకినాడ; శ్రీమాన్ ఎస్. వీరరాఘవరెడ్డి, శ్రీమాన్ టి. కృష్ణారెడ్డి, అనపర్తి; శ్రీమాన్ పి. కృష్ణారావు, ఇప్పనపాడు; శ్రీమాన్వి. నరసింహారావు, నేలటూరు; శ్రీమాన్ వి.కృష్ణారావు, మండపేట; శ్రీమతి పి. సత్యన్నారాయణమ్మ, గుమ్మలూరు; శ్రీమతి వి. అన్నపూర్ణమ్మ, మండపేట; జి. కృష్ణవేణి సత్యన్నారాయణ,చెల్లూరు; శ్రీమాన్ వి. రామసుబ్బారావు, రామచంద్రాపురం; శ్రీమాన్ కె. రామకృష్ణారెడ్డి, మహేంద్రవాడ; శ్రీమాన్ జి. వీరరాఘవరెడ్డి, అనపర్తి; శ్రీమతి పి. సత్యవతి, కాటేరు; శ్రీమాన్ జి. సుబ్బారావు, ఏడిద; శ్రీమాన్ సిహెచ్. వెంకట్రావు, మండపేట; శ్రీమాన్ టి. త్రినాధరెడ్డి, అనపర్తి; శ్రీమాన్ పాండురంగారావు, విజయవాడ; శ్రీమాన్ కె. స్వర్ణకుమారి, విజయవాడ; శ్రీమాన్ జి. నరసింహస్వామి, వేదాయపాలెం. శ్రీమాన్ ఎమ్.వి. నాథమ్మ; శ్రీమాన్ ఎమ్ బలరామ్, శ్రీమాన్ ఎమ్. నరసింహయ్య, శ్రీమాన్ ఆర్ సావరి, శ్రీమాన్ ఎ. మురళీ మనోహర్, శ్రీమతి ఎ. అరవింద, శ్రీమాన్ ఎ. రవీంద్రనాథ్, శ్రీమ ఎన్ సరస్వతి, చెన్నై; శ్రీమాన్ జి. ఆదినారాయణ, ఖమ్మం; శ్రీమాన్ ఎన్ రఘురామ్, చెన్నై, శ్రీమతి విమలమ్మ, శ్రీమాన్ ఆర్. తిరువేంగడం, శ్రీమాన్ ఎమ్. చైతన్య చెన్నై; శ్రీమాన్ డి. రాఘవులు, నేలకొండపల్లి; శ్రీమాన్ కె. నారాయణమూర్తి, మహబూబాబాద్; శ్రీమాన్ సుదర్శన్, కె. సముద్రం; శ్రీమాన్ పి. రామచంద్రరావు, ఖమ్మం; శ్రీమతి పి. వాగ్దేవి, ఖమ్మం; శ్రీమాన్ పి.ఎల్. విలాసరావు, హైదరాబాద్; శ్రీమాన్ ఎమ్ లక్ష్మీనారాయణరావు, బాలపల్లి గంగారామ్; శ్రీమాన్ కె. వెంకటేశ్వరరావు, కొంజర్ల; శ్రీమాన్ రామచంద్రరావు, హన్మకొండ; శ్రీమాన్ జి. ఆంజనేయులు, హిందూపూర్; శ్రీమతి సుమతి, అనంతపూర్; శ్రీమతి పద్మావతి, నెల్లూరు; శ్రీమాన్ ఎన్ చలపతి, అనంతపూర్; శ్రీమతి ఎన్ లక్ష్మీదేవి, అనంతపూర్; శ్రీమతి ఎ. లక్ష్మీదేవమ్మ ఇప్పెరి; శ్రీమాన్ జి. రవీంద్రరెడ్డి, నిజామబాద్; శ్రీమతి కె.లలితమ్మ, హైదరాబాద్; శ్రీమతి ఎన్. లక్ష్మి, మైసూర్; శ్రీమాన్ పి. సత్యన్నారాయణ, అల్లిపురం; శ్రీమాన్ వి. వెంకట సుబ్రహ్మణ్యం, కోలంక; శ్రీమాన్ ఎమ్. వెంకటరాజులు, మద్దికర; శ్రీమాన్ ఎ. శ్రీరంగనాయకులు, వైజాగ్; శ్రీమాన్ జి, గోపీకృష్ణ మండపేట; శ్రీమాన్ ఎన్.ఆర్.ఆర్. మోహనరావు, రామచంద్రపురం; శ్రీమాన్ ఆర్.వి. భాస్కరనారాయణమూర్తి, కాకినాడ; శ్రీమాన్ పి. సంజీవరావు, విశాఖపట్నం; శ్రీమాన్ కె.సిబ గణపూర్; శ్రీమాన్ వి. నాగేశ్వరరావు, నెల్లూరు; శ్రీమాన్ డా. బదరీ వెంకట నారాయణగుప్త, గూడూరు; శ్రీమాన్ జి. సరస్వతి, సికింద్రాబాద్; శ్రీమాన్ డా॥ ఎస్. పరశురాములు, సికింద్రాబాద్; శ్రీమతి జి. సరస్వతి, శ్రీమాన్ డా. ధర్మాచారి, సికింద్రాబాద్; శ్రీమతి బి. సుజాతమ్మ, అనంతపూర్; శ్రీమతి జి. సరస్వతమ్మ, సికింద్రాబాద్; శ్రీమతి యు. పద్మసోమ గౌడ్, దేవగం; శ్రీమతి జి. కొండాయమ్మ, చెల్లాయమ్మపేట; శ్రీమతి వై. శేషమాంబ, వెంకటాయపాలెం; శ్రీమతి పద్మావతి, సికింద్రాబాద్; శ్రీమాన్ పి. కొండలరావు, ఖమ్మం; శ్రీమాన్ పి. పద్మనాభశెట్టి, మదనపల్లి; శ్రీమాన్ కె. వడిరాజాచార్య, తిరుపతి; శ్రీమాన్ కె. శ్రీకృష్ణారావు, నూతక్కి; శ్రీమాన్ వి. హరికృష్ణారావు, కొప్పురావురు; శ్రీమాన్ ఎమ్. నరసింహారావు, నడిగడ్డపాలెం; శ్రీమతి జి. ప్రమీల సుబ్బారెడ్డి, చుండూరు; శ్రీమాన్ కె. శ్రీనివాసరెడ్డి, మున్నంగివారిపాలెం చుండూరు; శ్రీమతి బి. వెంకట సుబ్బమ్మ, కొల్లిపర;

శ్రీమాన్ పి. కొండయ్య, అనంతపూర్; శ్రీమాన్ డా|| రామలక్ష్మమ్మ, అనంతపూర్; శ్రీమాన్ ఎన్. పూర్ణచంద్రరావు, గుంటూరు; శ్రీమాన్: ఎన్. అప్పారావు, ఏటుకూరు; శ్రీమాన్ ఎ. సంజీవ వరప్రసాద్, గుంటూరు; శ్రీమాన్ టి. వెంకటేశ్వర్లు, కడప; శ్రీమాన్ ఎ. వేణుగోపాలాచార్యులు, శ్రీమాన్ ఎమ్. దక్షిణామూర్తి, జి. అంకాలప్ప, శ్రీమాన్ బి.సి. పుల్లయ్య, శ్రీమాన్ పి. జయశంకర్, గూటి ఆర్ఎస్. శ్రీమాన్ టి. రత్తయ్య, చీమకుర్తి, శ్రీమాన్ ఎమ్. పెద్దన్న, లచ్చున్నపల్లి; శ్రీమతి బి. సామ్రాజ్యమ్మ, శ్రీమతి జి. విజయలక్ష్మి, శ్రీమాన్ జి. వెంకటకృష్ణ, పెదగొట్టిపాడు; శ్రీమతి జి. రుక్మిణమ్మ, ఉలవపాడు, శ్రీమతి ఎమ్ బాపమ్మ, శ్రీమాన్ డి. రామారావు, సింగరాయకొండ; శ్రీమతి కె. శ్రీదేవమ్మ, కందుకూరు; శ్రీమాన్ కె. చిన్నవెంకయ్య , తిరువత్తూరు; శ్రీమాన్ డి. సత్యన్నారాయణరెడ్డి, దుగ్గుదుర్రు; శ్రీమాన్ ఆర్. చంద్రశేఖరరావు, శ్రీమతి పి. సత్యవతి, విశాఖపట్నం; శ్రీమాన్ ఆర్. మురళీధర్, నాగపూర్, శ్రీమాన్ ఆర్ వెంకట్రావు, కశింకోట; శ్రీమతి జి. లక్ష్మి, విశాఖపట్నం, శ్రీమాన్ కె. గోపాలకృష్ణ, కాకినాడ; శ్రీమతి పి. భారతి, వెలగలేరు; శ్రీమతి పి. రాజ్యలక్ష్మి, మోర్త; శ్రీమతి ఎస్. అరుణ, మాచవరం అగ్రహారం; శ్రీమాన్ సిహెచ్ సుబ్రహ్మణ్యశర్మ గోపాలపట్నం; శ్రీమాన్ ఎమ్ కోటేశ్వరరావు, గుంటూరు, శ్రీమాన్ ఎమ్. వెంకట్రామయ్య గుంటూరు; శ్రీమతి డి.కృష్ణకుమారి విశాఖపట్నం; శ్రీమతి డి.వి. రంగనాయకమ్మ, తిరువూరు; శ్రీమతి వి.వి. విజయలక్ష్మి, తిరువూరు; శ్రీమతి వి. విజయలక్ష్మి, హన్మకొండ; శ్రీమాన్ డి. నరసింహమూర్తి, మచిలీపట్నం; శ్రీమాన్ పి. హరిప్రసాదరావు, ఒంగోలు; శ్రీమాన్ పి. శ్రీనివాసరావు, ఒంగోలు; శ్రీమాన్ పి. రవిచంద్ర, ఆదోని; శ్రీమాన్ వై. వెంకట పుల్లయ్య, పిడుగురాళ్ళ; శ్రీమాన్ డి. జానకిరామమూర్తి, బ్రాహ్మణపల్లి; జె. నందయ్య కరీంనగర్, శ్రీమాన్ వి. వెంకటేశ్వర్లు, పిడుగురాళ్ళ; శ్రీమాన్ కె. సత్యన్నారాయణ, సత్తెనపల్లి; శ్రీమాన్ కె. ఆదినారాయణ, మాచవరం; శ్రీమాన్ వై. పుల్లారావు, శ్రీమాన్ కె. ఆంజనేయులు, బ్రాహ్మణపల్లి; శ్రీమాన్ కె. వెంకటపతిరాజు, విజయనగరం; శ్రీమాన్ జి. వెంకటరమణ, వేల్పూరు; శ్రీమాన్ కె. విజయభాస్కరరెడ్డి, మహేంద్రవాడ, శ్రీమాన్ ఎమ్. సుజిత్, రామచంద్రపురం; శ్రీమాన్ కె. సుబ్బారావు, ఉండ్రాజవరం; శ్రీమాన్ పి. సత్యన్నారాయణ, వెంటూరు; శ్రీమాన్ కె. అమ్మిరెడ్డి, ఆరవిల్లి; శ్రీమతి ఎస్ సుబ్బలక్ష్మి, సఖినేటిపల్లి ; శ్రీమాన్ ఎస్. నరసింహరావు, పాలకొల్లు; శ్రీమాన్ వి. పుష్పరాజు, శ్రీమాన్ ఆర్. కృష్ణ సత్యన్నారాయణ, శ్రీమాన్డి. వెంకట్రావు, శ్రీమాన్ వి. లక్ష్మీనారాయణరావు, మండపేట; శ్రీమతి కె. నాగమహాలక్ష్మి, ఆరవిల్లి; శ్రీమాన్ వి. నాగేశ్వరరావు, శ్రీమాన్ ఎన్. సత్యన్నారాయణమూర్తి, రాజమండ్రి, శ్రీమతి వై. వెంకాయమ్మ, మందపాక; శ్రీమాన్ జి. వెంకటేశ్వరరావు, శ్రీమాన్ పి. సత్యన్నారాయణ మూర్తి, శ్రీమాన్ ఎ. రామారావు, కృష్ణాయపాలెం; శ్రీమతి పి. అనూరాధ, అమలాపురం; శ్రీమతి జి. వెంకటసుబ్బమ్మ, శ్రీమాన్ జి. లక్ష్మీనరసింహరాజు, జువ్వలపాలెం; బి. కృష్ణమూర్తి తణుకు; శ్రీమాన్ ఎమ్. కృష్ణమూర్తి, శ్రీమాన్ బి. శ్రీరాములు, బసవన్న కేంప్; శ్రీమాన్ ఎన్ సుబ్బారావు, వేల్పూరు; శ్రీమాన్ సిహెచ్. నాగేశ్వరరావు, నేదూరు; శ్రీమాన్ వై. పరశురామన్న, వేల్పూరు; శ్రీమాన్ కె.వి. ఆర్.కె. సర్వేశ్వరరావు, తణుకు; శ్రీమాన్ కె. సాయిబాబా, తణుకు; శ్రీమతి వి. కమలమ్మ హైదరాబాద్, శ్రీమాన్ పి. శ్రీకాంత్ హైదరాబాద్; శ్రీమాన్ కృష్ణఫణికుమార్, శ్రీమాన్ కె. శ్రీరామూర్తి, గాంధీనగర్; శ్రీమాన్ బి. నరసింహారవు, రాజమండ్రి; శ్రీమాన్ సి ప్రకాశశర్మ హైదరాబాద్; శ్రీమాన్ సి. నాగేశ్వరరావు, శ్రీమాన్ సి. సత్యన్నారాయణ నరసరావుపేట; శ్రీమాన్ ఎమ్ పద్మజా చెన్నారెడ్డి హైదరాబాద్; శ్రీమతి ఎల్. విజిత సీతారామరెడ్డి, హైద్రాబాద్; శ్రీమతి కె. సత్యవతి రామకృష్ణరాజు హైద్రాబాద్; శ్రీమాన్ సిహెచ్ నారాయణరాజు కైకారం; శ్రీమాన్ కె. సర్వేశ్వరరావు, తణుకు; శ్రీమాన్ కె.వి. రత్నాజీరావు నిడదవోలు; శ్రీమాన్ టి. రామకృష్ణారెడ్డి పెనుమండ్ర; శ్రీమాన్ ఎస్. వీరిరెడ్డి తాడేపల్లి గూడెం; శ్రీమాన్ కె. విజయభాస్కరరెడ్డి తాడెపల్లి గూడెం; శ్రీమాన్ కె. ధనలక్ష్మి, తణుకు; శ్రీమాన్ ఎన్.వీరారెడ్డి పేరిరామచంద్రపురం; శ్రీమాన్ ఎస్. అమ్మిరెడ్డి పూలమూరు; శ్రీమాన్ టి. బాలాత్రిపుర సుందరి రాజమండ్రి; శ్రీమాన్ కె. వెంకటేశ్వరరావు అత్తిలి;





శ్రీమాన్ బి. కొండయ్య, ఏలూరు; శ్రీమాన్ జి. అప్పారావు, నూజివీడు; శ్రీమాన్ సిహెచ్ సుబ్బాయమ్మ, రామకృష్ణాపురం; శ్రీమాన్ ఎస్. విజయమోహన్, శ్రీమాన్ ఎస్., జగన్‌మోహన్, శ్రీమాన్ కె. సురేష్, శ్రీమాన్ కె. శ్రీనివాసరావు, శ్రీమతి బి. నారాయణమ్మ, ఏలూరు; శ్రీమాన్ కె. శ్రీనివాసరావు, శ్రీమతి బి. నారాయణమ్మ, ఏలూరు; శ్రీమాన్ టి. రమేష్, సత్తుపల్లి; శ్రీమాన్ ఎ. నాగవెంకట శిరామకృష్ణ, పెద్దపల్లి; శ్రీమాన్ ఎన్. కృష్ణమోహన్‌రావు, శ్రీమాన్ సిహెచ్. చంద్రహాసరెడ్డి, శ్రీమాన్ సిహెచ్ శ్రీనివాసరెడ్డి, చి|| అర్జిత; శ్రీమాన్ యు. రామమూర్తి, హైద్రాబాద్; శ్రీమాన్ జి. గోవిందరాజులు, వరంగల్; శ్రీమతి కె. గోవిందమ్మ, త్రిపురాంతకం; శ్రీమాన్ వి. బాలసుబ్బారాయుడు, శ్రీమాన్ వి. సుబ్బారాయుడు, శ్రీమాన్ వి. ప్రసాద్, శ్రీమాన్ వి. వెంకటసుబ్బమ్మ, మార్కాపురం; శ్రీమాన్ సి.సి. రత్నం, నెల్లూరు; శ్రీమతి జి. సూర్యకుమారి, శ్రీమతి పి. వసుంధర, చెన్నై; శ్రీమాన్ ఎమ్. శ్రీరామచంద్రమూర్తి, గుంటూరు; శ్రీమాన్ ఎస్. పద్మామాధవరెడ్డి, ఆత్మకూరు; శ్రీమాన్ డి. వెంకటసుబ్బమ్మ, బాపట్ల; శ్రీమతి కె. శకుంతల, శ్రీమాన్ కె. వెంకట సాయిబాబు, తెనాలి; శ్రీమాన్ బి. సాంబశివరావు, కొల్లిపర; శ్రీమాన్ ఎమ్. రామకృష్ణమూర్తి, తెనాలి; శ్రీమాన్ ఆర్. సూర్యప్రకాశరావు, గుంటూరు; శ్రీమతి టి.వి. రావమ్మ, శ్రీమతి జె. నాగమ్మ, భైరన్నపాడు; శ్రీమతి వై. లక్ష్మి వరంగల్; శ్రీమాన్ ఎన్. కాశీనాథం, శ్రీమాన్ వై. రాములు, జగిత్యాల; శ్రీమాన్ బి. లక్ష్మీనారాయణ, మల్యాల; శ్రీమాన్ బి. అంజిరెడ్డి, ఒంగోలు; శ్రీమాన్ బి. శేషయ్య, శ్రీమాన్ బి. కొండయ్య, శ్రీమాన్ ఎన్. కోదండరామయ్య, శ్రీమాన్ బి. వెంకటేశ్వర్లు, శ్రీమతి బి. రత్తమ్మ, శ్రీమాన్ పి. రత్తయ్య, శ్రీమాన్ సిహెచ్ హరిబాబు, శ్రీమాన్ ఎన్. సుబ్బమ్మ, శ్రీమాన్ వి. వెంకటేశ్వర్లు, శ్రీమాన్ బి. సుబ్బారావు, చంద్రపాలెం; శ్రీమాన్ కె. చంద్రశేఖర్, చీరాల; శ్రీమాన్ సిహెచ్. రామారావు, విస్సన్నపేట; శ్రీమాన్ పి.వి. వరలక్ష్మి, వేపగుంట; శ్రీమాన్ జె. అప్పారావు, కిష్టారాం; శ్రీమాన్ డి. సత్యన్నారాయణ, కొత్తగూడెం; శ్రీమాన్ హరి అనంతరామశర్మ, హైద్రరాబాద్; శ్రీమతి కె. వెంకటరమాదేవి, ఎల్లాపువాని పాలెం; శ్రీమతి వి. సూర్యకాంతం, విశాఖపట్నం; శ్రీమాన్ టి. సంపత్ శ్రీనివాసన్, బెంగుళూరు; శ్రీమాన్ జి. రఘునాధరావు, తాటపూడి; శ్రీమాన్ సిహెచ్. రామతులసమ్మ, తిమ్మరాజపాలెం; శ్రీమతి బి. నాగరాజకుమారి, గుంటూరు; శ్రీమాన్ ఎమ్. కృష్ణమాచార్యులు, చెన్నై; శ్రీమాన్ జె. వెంకయ్య చౌదరి, విజయవాడ;

శ్రీమతి ఎమ్. సూర్యకుమారి, విజయనగరం; శ్రీమాన్ ఎ. సోమయ్య, విజయవాడ; శ్రీమతి ఐ. ప్రభావతిదేవి, తాటిపూడి; శ్రీమతి సిహెచ్. లక్ష్మీనరసమ్మ, శ్రీమాన్ ఆర్. సూర్యనారాయణ, తిమ్మరాజపాలెం; శ్రీమాన్ జి.వి. సన్యాసరాజు, శ్రీమాన్ బి. నాగేశ్వరరావు, శ్రీమతి ఎ. రాజేశ్వరి, శ్రీమాన్ కె. చెల్లారావు, బాలాజీ భక్తబృందం; శ్రీమతి వి. ఆండాళ్ళమ్మ, శ్రీమాన్ డి. రమావతి, శ్రీమాన్ బి. కృష్ణమూర్తి, శ్రీమాన్ ఎన్. ఎల్లారావు, విజయనగరం; శ్రీమతి సిహెచ్. విజయ, రామాపురం;

**జ్యోతి ర్దర్శనం : హిమగిరి శిఖరాలలో బదరికావనంలో 6 నెలలనుండి దేవతలచే పూజలను అందుకొన్న నారాయణుడు మనకి 2003, మే 8వ తేదీన దర్శనమిస్తున్నాడు. మన అష్టాక్షరీ క్షేత్రంగూడ మే 8వ తేదీనుండి భగవద్బంధువులకు స్వాగతాన్ని పలుకుతోంది. ఈ సంవత్సరం తదీయారాధనకు కొంత సామగ్రి శ్రీమాన్ యమ్. అరవిందరెడ్డిగారు (హైదరాబాద్) ద్వారా సమకూరినవి.**

**ఇంకా బియ్యం 70 క్విం., కందిపప్పు 12 క్విం., పెసరపప్పు 3 క్విం., నెయ్యి 10 డబ్బాలు, మరియు ఇతర అపరములు సమకూరవలసి ఉన్నది.**

# BHAKTHI NIVEDANA

**PHILOSOPHICAL MONTHLY**

**C/o. JET, Sitanagaram, Guntur Dt., Andhra Pradesh - 522 501.**

**Hon. Editor H.H. Sri Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamy**

## *FORM IV*

(See rule 8)

| | | |
|---|---|---|
| 1. Place of publication | : | Vijayawada |
| 2. Periodicity | : | Monthly |
| 3. Printer's Name | : | Sriman Printers & Processers, Sitanagaram, |
| Nationality | : | Indian |
| Address | : | **JET**, Sitanagaram, Guntur Dt. Andhra Pradesh - 522 501 |
| 4. Publisher's Name | : | T.P. Sreeramachandracharyulu |
| Nationality | : | Indian |
| Address | : | S/o. Sitaramacharyulu, 7-48, Brindavani, Visakhapatnam-530 028. |
| 5. Editor's Name | : | T.P. Sreeramachandracharyulu |
| Nationality | : | Indian |
| Address | : | S/o. Sitaramacharyulu, 7-48, Brindavani Visakhapatnam-530 028. |
| 6. Name and address of individuals who own the news paper and partners or share holders holding more than one percent of the total Capital | : | **H.H. Sri Sri Sri Tridandi Srimannarayana Ramanuja Jeeyar Swamyji** |
| 7. R.N.I.No. | : | 52762/91 |

I T.P. Sreeramachandracharyulu, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/-

***T. P. SREERAMACHANDRACHARYULU***














**యువత సమన్వయంతో సాగితే సాధించలేనిది ఏదీ లేదు. సరియైన దిశానిర్దేశంలేక నేటి యువతలో విశృంఖల ప్రవృత్తి చోటుచేసుకుంటుందే తప్ప, మనం సన్మార్గదర్శనం చేయగలిగితే ఆ యువత అసాధ్యాలనెన్నింటినో సాధ్యం చేస్తుంది... అద్భుతాలనెన్నో సాధిస్తుంది. ఇదిగో..... వీరిలా...**

ఇవి వాత్సల్య రసార్ద్రమైన శ్రీస్వామివారి హృదయంనుండి వెలువడిన మాటలు... మంగళాశాసనాలు....

ఇలా మన స్వామివారు ఎదలనిండా పదిలంగా దాచుకొని వారి వాత్సల్యాన్ని పదింతలుగా దోచుకున్నది ఎవరోకాదు జెట్ ఆస్ట్రేలియా యువత... వారి విధేయత...

మూడుపదులైనా సరిగ్గానిండలేదు. నిలువ నీడ ఇంకాదొరకలేదు. చదువులింకా సమగ్రంగా పూర్తికాలేదు. చదువులకు సరిపడా ఫీజులను సంపాదించుకునే చాకిరీలయినా ఇంకా చేజిక్కలేదు. ఒక్కమాటలో చెప్పాలంటే వారు ఆస్ట్రేలియాలో ఏ రకంగానూ నిలదొక్కుకొన లేదు. అలాంటి యువత సాధించిన ఘనత... మన స్వామివారి ఆస్ట్రేలియా పర్యటన.

ఆ యువత ఆలోచన ఆవేదనలే ఈ పర్యటనకు ప్రధానకారణాలు.

ఈ ఆస్ట్రేలియాలో ఉంటున్న భారతీయులలో వైదిక ధర్మాచరణపట్ల ముఖ్యంగా మన సనాతన సంప్రదాయం పట్ల భక్తి శ్రద్ధలు సన్నగిల్లుతున్నాయి. ఈ 'కంగారు' జీవితాలలోపడి, డాలర్ల మత్తులో 'కోవ్‌లా' కోవలోపడి మన భారతీయతకు దూరమయ్యే వారందరికీ 'మన గురించి' చెప్పే మహాత్ముడు కావాలి. కొందరికి గుండెలోతుల్లో ఎక్కడో కాస్త ఆసక్తి ఉన్నా అంతకుమించిన అనుమానాలు... సందేహాలూనూ... ఇవన్నీ తీర్చేలా మన ఆశలను నెరవేర్చేలా మహానుభావులను ఆస్ట్రేలియాకు స్వాగతించాలి. ఆ మహానుభావుడు తమ కవళికలతో, కదలికలతో అందరినీ ఆకర్షించగలగాలి. తమ మృదుమధురమైన వచో విలాసంతో అందరి సందేహాలను పటాపంచలు చేయగలగాలి. మన వేదాలపట్ల, శాస్త్రాలపట్ల, ధర్మాల పట్ల సదవగాహన కలిగి విషయగంభీరమైన తమ ప్రవచనాలద్వారా ప్రబోధించే ప్రవక్త కావాలి. ఇది ఆ యువత ఆలోచన... ఆవేదన.

'కోఽన్వస్మిన్ సాంప్రతం లోకే....' అన్నట్లుగా వారి అన్వేషణలో 'జనైః శ్రుతః..' అన్నట్లు మన త్రిదండ రాముడు తారసపడ్డాడు. ఎలాగైనా స్వామివారిని తీసుకురావాలి అనే

పట్టుదలతో మూడుఏళ్ళుగా 'తెలిగ్రామాయణా'న్ని రచిస్తున్నారు.

చిన్నపిల్లలు పిలిస్తేనే వెళ్ళి ఇసుక ఆటలో దేవుని వద్ద శాత్తుముత్తైని జరిపిన రామానుజుల అంశ కావడంతో శ్రీస్వామివారూ అంగీకరించారు.

కానీ, ఆస్ట్రేలియాలో ఎవ్వరికీ ఈ 'కుర్రచేష్టలు' నమ్మబుద్ధికాలేదు. వీళ్ళుపిలవడం ఏమిటి శ్రీ చిన్నజీయరుస్వామివారు రావడమేమిటి? అంతా వీళ్ళ భ్రమ అనుకొని వూరుకొన్నవారు కొందరు. శ్రీస్వామివారి పేరు చెప్పి గూడు, గుడ్డలేని ఈ కుర్రవాళ్ళు ఏదో కూడబెట్టుకుందామనుకుంటున్నారని నోరు పారేసుకున్నవాళ్ళు మరికొందరు. ఇలా 'శ్రేయాంసి బహువిఘ్నాని...' అన్నట్లయింది వారి ప్రయత్నం. ఆ పెద్దలందరికి నమ్మకం కుదిరేటట్లు చేయాలి. ఎలాగైనా అనుకున్నది సాధించాలి అని నడుము కట్టిన యువత రెండేళ్ళక్రితం జెట్ ఆస్ట్రేలియాను ప్రారంభించింది. వారు ఉదయం చదువులు కాగానే రాత్రిపూట్ల హోటల్‌లోనో, మోటెల్‌లోనో, పెట్రోల్ బంకుల్లోనో, టాక్సీడ్రైవర్లగానో కాయకష్టంతో సంపాదించుకున్న కాసుల్ని కూడబెట్టి గోదా కళ్యాణం, శ్రీరామనవమి కళ్యాణం, ఉగాది పండుగ వంటి కార్యక్రమాలను ఎంతో నిరాడంబర వైభవంగా నిర్వహించారు. మన వాళ్ళ ముఖ్యంగా తెలుగువాళ్ళ చిరునామాలను సేకరించి ఇంటింటికీ వెళ్ళి 'గోదాకళ్యాణం చేస్తున్నాం తప్పక వచ్చి తీర్థ ప్రసాదాలను స్వీకరించి వెళ్ళండి' అని సాదరంగా స్వాగతించారు. ప్రసాదాలను పెట్టి పంపించారు. వీళ్ళ ప్రయత్నానికి ముందునుండి అండగా ఉండి నడిపించిన శ్రీమాన్ ప్రభుగారు శ్రీమాన్ విక్రమ్‌గారు వంటి వారి ప్రోత్సాహంతో రెండు మూడు కార్యక్రమాలు అయ్యేటప్పటికి పెద్దలలో 'సం'చలనం కలిగింది. అందరూ ఒక్కటయ్యారు యువతను ప్రశంసించారు. ఆశీర్వదించారు. విశ్వసించారు. వెన్నంటి ఉండి నడిపిస్తామని ప్రోత్సహించారు. ఇలా 'హార్దికంగా' ప్రోత్సాహం దొరికింది. అదే కొండంత వరంగా శ్రీస్వామి వారి ఆస్ట్రేలియా పర్యటనకు అంకురార్పణ చేసారు. 'హార్దికమైన' ప్రోత్సాహంతోనే ఆశలు నెరవేరవుకదా..! ఆర్థికంగా కూడా ఆ యువతే పూనుకొని శ్రీస్వామివారి ఆస్ట్రేలియా పర్యటనకు కావలసిన పూర్వరంగాన్ని సిద్ధపరచింది.

యువత బంగారానికి మరింత మెరుగులు పెట్టించాలనుకున్నారో ఏమో..! శ్రీస్వామివారు ఆసక్తిని అనాసక్తినికూడా చూపక ఉదాసీనంగా ఉండిపోయారు.

'దానః సఖా వాహనం...' అన్నట్లు శ్రీస్వామివారి అన్ని కైంకర్యాలకు ఉపస్థితులై ఉండి సమర్థవంతంగా నిర్వహించే 'రామదూత' శ్రీమాన్ గుదిమెళ్ళ వేణుగోపాలాచార్యులుగారు ఆస్ట్రేలియా యాత్రకు సంబంధించిన అన్ని సమాచార సంబంధాలను స్వయంగా పర్యవేక్షించారు. వీసాల విషయంలో విసుగు విరామం లేకుండా శ్రమించినవారు శ్రీమాన్ (ఢిల్లీ) శ్రీనివాస్‌గారు, వీసాల విషయంలో అందరికీ అనుమానమే... మూడు రోజులలో ప్రయాణం... వీసాలు వచ్చే నమ్మకం లేదు... 13వ తేదీ భీష్మఏకాదశినాటి శ్రీవిష్ణుసాహస్రనామపారాయణంలోకూడ ఆ యువతకు 'వి.సా'లే దర్శనమిచ్చాయట. వారి ప్రార్థనే ఫలించిందో శ్రీస్వామివారే సంతృప్తి పడ్డారో వీసాలపర్వంలో విజయాన్ని సాధించారు. వారి 'సత్య' సంకల్పం నెరవేరింది. 'రఘు' రాముని కరుణ కూడ లభించింది. ఆ యువత





ఆనందానికి అవధులు లేవు. ఆస్ట్రేలియా దీవిపై ఆచార్యుల శ్రీపా స్పర్శకోసం వారు తహ తహలాడుతున్నట్లుగా క్షణక్షణానికి గణగణమ్రోగిన సెల్ బెల్‌లే సాక్ష్యం...

సపరివారంగా మన శ్రీరామచంద్రుడు శ్రీస్వామివారి సారథ్యంలో ఆస్ట్రేలియా యాత్రకు బయలుదేరాడు. శ్రీస్వామివారికి పరివారంగా మరో ఆరుగురు బయలుదేరారు. యాత్ర మొదలైంది.... పదండి మాతో మీరుగూడ!

15వ తేదీన శ్రీమాన్ రామేశ్వరరావుగారి అపార్ట్ మెంట్స్ (సోమాజిగూడ)లో తిరువారాధన, తీర్థగోష్ఠి ముగించుకుని ఉ॥ 7-30కి బయలుదేరి బేగంపేట విమానాశ్రయానికి చేరాము. శ్రీమాన్ రామేశ్వరరావు, శ్రీ కుమారి దంపతులు JET కార్యవర్గం, శ్రీమాన్ రామచంద్రారెడ్డిగారు, భక్తులు మన విద్యార్థులు మమ్మల్ని సాగనంపడానికై విమానాశ్రయానికి విచ్చేశారు. అందరి వీడ్కోలును అందుకుంటూ ఉదయం 9-40ని॥కు ఆకాశ యానంగా బయలు దేరాము. సుమారు మ॥2 గం॥కు అందచందాల సింగపూర్ చాంగీ ఎయిర్‌పోర్ట్‌కి చేరాము. పరిశుభ్రతలో ప్రపంచస్థాయి ప్రశంసలను పొందిన విమానాశ్రయము ఇది. ఆస్ట్రేలియా విమానం మారటానికై సుమారు రెండు గంటలు అక్కడ గడిపాము. మేమిక్కడకు చేరేసరికి సింగపూర్ సమయం 4-30 ని॥లు అయింది. సింగపూర్ ఎయిర్‌పోర్ట్ సింగారాలను పరికిస్తూ రెండు గంటల్ని అరగంటలా గడిపేసాము. మళ్ళీ తిరుగు ప్రయాణంలో ఇక్కడ జరుగబోయే కార్యక్రమాలకు శ్రీస్వామివారిని స్వాగతించడానికై శ్రీమాన్ హరీష్, శ్రీమాన్ వర్మ దంతులు ఎయిర్‌పోర్ట్‌కి వచ్చి శ్రీస్వామివారిని సేవించారు. అందరినీ స్వాగతించారు.

సుమారు రాత్రి 7 గం॥లకు ఆస్ట్రేలియా విమానమెక్కాము. కస్టమ్స్ చెకింగ్ అప్పుడు శ్రీ స్వామివారి త్రిదండం గురించి పలువురు అధికారులు పరిపరివిధాల ప్రశ్నించడం (చూపులతోనే) పరిశీలించడం ఎంతో ఇబ్బందిగా అనిపించిది. శ్రీ స్వామివారు మాత్రం అందరకీ చిరునవ్వు చెదరకుండానే బదులిస్తున్నారు నిశ్చలంగా. శ్రీవారి నిశ్చలతలో ఎవరో వచ్చి ఈ సమస్యను పరిష్కరిస్తున్నారనే ధీమా కనిపించింది. అనుకున్నట్లుగానే మూడు పదుల వయస్సుగల ఒక యువ అధికారి వచ్చాడు. అదంతా 'స్వధర్మం'గా భావించి అందరికీ నచ్చచెప్పాడు. అన్ని పనులనూ చక్కబెట్టాడు. మార్గం సుగమం అయింది. ఆ సమయంలో అతను చేసిన ప్రయత్నానికి శ్రీ స్వామివారు చిందించిన చిరునవ్వే అతనికి మంగళాశాసనం. సకల విధ సౌకర్యాలతో వున్న ఆ అతిపెద్ద విమానంలో ప్రయాణం హాయిగా సాగింది. సుమారు రాత్రి 2-40 ని॥కు ఆస్ట్రేలియా ఖండంలోని **మెల్‌బోర్న్** (MELBOURNE) నగరానికి చేరాము. విహంగ వీక్షణంతో చూస్తే మహాభారతంలో వర్ణించినట్లు సముద్రం మధ్యన నిర్మించుకున్న శ్రీకృష్ణుని మహానగరం ద్వారకలా కనిపించింది. ఆస్ట్రేలియా ఖండం లోనికి ప్రవేశించే మాకు ఇది **'ద్వార'**కే అయింది. పసి(డి)ఫిక్ సముద్రం ఒక **'మాల'**గా దాని మధ్య 'ఆభరణం' లా అందంగా ఉన్న ఈ 'నగరం' మెల్‌బోర్న్' కాకుండా **'మాలభరణం'**గా పిలుచుకుంటే బాగుంటుందనిపించింది. శ్రీస్వామివారు చేసిన ఈ నామకరణం, పేరుపోలికకి – ఊరు పోలికకు కూడా ఎంతో చక్కగా సరిపోయినది. సింగపూర్ సమయం రాత్రి '2-40' ని॥ అయింది. కాని ఆస్ట్రేలియా కాలమానం ప్రకారం తెల్లవారు ఝామున 5-45 అయింది. సుమారు అరగంటకు పైగా కస్టమ్స్ శాఖవారి

కష్టమ్స్ దాటి సుఖంగా బయట పడ్డాము. ఈ దీవిలో దాదాపు అన్నీ చక్కని చెక్క ఇళ్ళే. చక్కిలిగింతలు పెట్టే చలిపులి నుండి రక్షణకై వారు చెక్క ఇళ్ళను నిర్మించుకుంటారు. అన్ని చెక్కఇళ్ళే కావటంతో వారికి అతిపెద్ద శత్రువు చెదపురుగు. అందుకే ఏదేశంనుండి అయినా చెక్క వస్తువులు దిగుమతి అవుతున్నా 'చెద' పురుగు రాకుండా జాగ్రత్తను వహిస్తూ 'చెక్కి'ంగ్ ఎక్కువ చేస్తారు. మన శ్రీ స్వామివారి హస్తాభరణమైన 'త్రిదండం' కూడా ఈ బాదరాయణ సంబంధం బారిన పడింది. అయినా శ్రీ వారి వచోవిలాసంతో వారికి ఆవేశం – ఆయాసం రెండూ తప్పాయి. చెక్క(ని) పెట్టెలోని పెరుమాళ్ళ సుప్రభాత దర్శనాన్ని చేసుకొనే అదృష్టం పట్టింది అధికారులకి.

బయటకు వచ్చామోలేదో జయ శ్రీమన్నారాయణ నినాదాలతో మనవాళ్ళు స్వాగతాన్ని సమర్పించారు. శ్రీమాన్ సత్య, శ్రీమాన్ విక్రమ్, శ్రీమాన్ చార్య చిగురాల, శ్రీమాన్ ముదుంబచార్యగారు, సంపత్ మొ॥గు వారందరినీ శ్రీ స్వామివారు మంగళాశాసనం చేశారు. వారు ఏర్పాటుచేసిన అయిదు వాహనాల్లో ..'మాలాభరణ్'(మెల్‌బోర్న్) యొక్క అందచందాలను చూస్తూ సుమారు 40ని॥ల ప్రయాణంతో చార్య చిగురాలగారింటికి చేరాము.

సత్య మొ॥గు కార్యకర్తలనుండి కార్యక్రమాల వివరాల గురించి శ్రీ స్వామివారు తెలుసుకున్నారు. సుమారు 11 గంటలకు తిరువారాధన, సేవాకాలం, తీర్థగోష్ఠి కార్యక్రమాలు వరుసగా జరిగాయి.

మధ్యాహ్నం 2–30ని॥కి బయలుదేరి WARRIGALROAD (వారిగల్‌రోడ్)లోని బాబు ఆకులుగారింటికి వెళ్ళాము. ఉయ్యూరు ప్రాంతానికి చెందిన వీరి పూర్వులంతా శ్రీ వైష్ణవ సంప్రదాయానికి చెందినవారే కానీ వీరి వరకు సంప్రదాయం అందలేదు. వారు శ్రీ స్వామివారిని డ్రైవ్ చేస్తూ స్వానుభవ పూర్వకంగా ఆస్ట్రేలియా విశేషాలనునెన్నో వివరించారు.

అబ్ ఆరిజీన్స్ అనే గోండ్ జాతికి చెందిన వీరే ఆస్ట్రేలియాఖండ ఆదిమవాసులు. 'గోండ్' అనేది భారతదేశపు అవాంతర జాతులలోని ఒకజాతి. వారియొక్క రూపురేఖలు కాని – ఆచార వ్యవహారాలు కాని దాదాపుగా తమిళ గ్రామీణ జాతులను పోలివుంటాయి. సౌర మానాన్ని పాటించే ద్రావిడులవలే ఈ ఆదిమ వాసులకు కూడా సూర్యుడే ప్రధాన ఆరాధ్య దేవుడట. రెండు వందల సం॥ల క్రితం ఈ ఖండాన్ని కూడా దురాక్రమించిన బ్రిటిషర్స్ వీరిని చిత్రహింసలకు గురిచేసారు. ఈ గడ్డను స్వాధీనం చేసుకోడానికి, స్వసంతతితో నింపివే యడానికై పన్నాగం పన్ని ఎదురు తిరిగిన ఆనాటి అమాయకులనందరినీ అమానుషంగా కాల్చి చంపేసారు. కాళ్ళా వేళ్ళా పడ్డవారిని కనికరించి వదిలేసారో, కర్కశులుగా మార్చి బానిసలుగా చేసుకోడానికి విడిచిపెట్టారో కాని, కొందరు బ్రతికి బట్ట కట్టారు. వాళ్ళకు కుక్కలకు బిస్కెట్లు వేసినట్లుగా, వారి మొహాన నెలకు కొంత పారితోషికాన్ని పారేసి వారిని మాదక ద్రవ్యాలకు బానిసలను చేసి 'స్వాతంత్ర్యోద్యమానికి' ఒడిగట్టకుండా చూసారు. వారికి ఇది **'తమదే'** అనే భావాన్నే లేకుండా చేసారు. ఇదీ అక్కడి ఆదిమవాసుల గతి... సంగతి...

శ్రీమాన్ బాబు గారింట్లో పాదపూజ, వారి శ్రీమతి గారి ఆనందానికి అవధుల్లేవు. కారణం వారు ఐదు సం॥లక్రితం 5 నెలలపాటు క్రమం తప్పకుండా ప్రతిరోజు సత్యనారాయణ వ్రతాన్ని చేసారుట. ఐదు నెలల వ్రతంకాగానే వెండి తమలపాకులలో బంగారాన్ని పెట్టి ఒక





సద్బ్రాహ్మణునికి దానం చెయ్యాలని మొక్కుకున్నారుట. ఆ మొక్కు తీరలేదు. క్రమంగా అది మరచిపోయినట్లయింది. నిన్నరాత్రి కలలో స్వామి కనిపించి, మీ ఇంటికి మహాత్ముడు విచ్చేస్తున్నాడు. ఆయన ఆశీస్సులను పొందు అని చెప్పాడుట. **అది మీరే స్వామీ! నా ఆనందాన్ని మాటల్లో చెప్పలేను** అంటూ ఆవిడ శ్రీ స్వామివారిని సేవించారు. పాదపూజ పూర్తయ్యాక అందరికీ మంగళాశాసనాలను అనుగ్రహించారు శ్రీ స్వామివారు.

అక్కడినుండి శ్రీమాన్ జనార్దనరావు గారింటికి వెళ్ళాము. వీరు విజయనగర ప్రాంతానికి చెందినవారు. వీరి తాతగారు, తండ్రిగారు కూడా బ్రిటీష్ వారి కాలంలో మన రాష్ట్రంలో పలుచోట్ల సబ్ కలెక్టర్స్ గా పదవీ బాధ్యతలను చేపట్టినారుట. బ్రిటీష్‌వారి హయాంలో కలెక్టర్ హోదా అంటే ఇప్పటి ముఖ్యమంత్రి కన్నా విలువ ఉండేదని శ్రీ స్వామివారు చమత్కరించారు. శ్రీమాన్ రావుగారు గత 35 ఏళ్ళుగా జనరల్ సర్జన్‌గా వైద్య సేవలను అందిస్తున్నారు. ఈ ప్రభుత్వం వీరియొక్క సేవలను ప్రతిభను గుర్తించి వీరికి IAM అనే బిరుదు ప్రదానం చేసిందట. మన దేశపు పద్మశ్రీ బిరుదంతో ఇంచుమించు సమానమైన IAM అంటే "ఇంపార్టెంట్ ఆస్ట్రేలియా మ్యాన్" అని పుల్‌ఫామ్. అంతేకాక ఇక్కడి ఇండియన్స్‌కి ప్రతినిధిగా గుర్తించి, వీరిని గౌరవ సలహాదారునిగా స్వీకరించింది. వీరు ఇక్కడి మన భారతీయులందరికి సామాజిక పరమైన, రాజకీయపరమైన అన్ని అవసరాలకు ఆసరాగా ఉండి చక్కని సేవలను అందిస్తున్నారు. వీరు ఆధ్యాత్మిక విషయంలో కూడా శ్రద్ధకలవారు. మెల్‌బోర్న్‌లోని అతిపెద్ద వైదిక దేవాలయమైన శివ – విష్ణు టెంపుల్ యొక్క వ్యవస్థాపక ధర్మకర్తలలో ప్రధానులుకూడా.

శివ – విష్ణు టెంపుల్ అమెరికాలోని ఆలయాల్లా బొత్తిగా పాడుచేయకుండా రెండు ఆలయాలకు రెండు రాజగోపురాలు, ఆలయాలలో ఆయా ఆగమానుగుణమైన ఆరాధనాదులను ఏర్పరచినందుకు సంతోషాన్ని వ్యక్తపరిచారు శ్రీ స్వామివారు.

శ్రీమాన్ రావుగారి వంటివారికి కూడా **'సర్వ దేవతా ఏకాలయాల'** విషయంలో ఉన్న సమర్థింపును – సందేహాలను తీరుస్తూ శ్రీ స్వామివారు.

ఒకే దేవుడు, ఒకే పూజా విధానం, ఒకే ఆగమంతో జరిగే ఆలయాలు లేకపోవడం వల్లనే భారతీయులలో అనైక్యం, అనవగాహన పెరిగిపోయాయని, ఆయా భగవన్మూర్తులకు చెందిన ఆగమాలను సరిగ్గా పాటించక దేవతా సాంకర్యం, అర్చనా సాంకర్యం చేయడంవల్లనే మనలో విశ్వాసాలు సన్నగిల్లుతాయని ఆవేదనతో ప్రవచించారు.

ఫలానా విగ్రహం పెడితే మేం డబ్బిస్తాం అనే వారికి భక్తి ఉన్నట్లు కాదని అది ఈగో (అహంకారం) అవుతుందని వివరించారు. ఇలా విగ్రహం పెట్టడానికి తమ 'ఈగో' ప్రదర్శించిన వారు, నిర్వహణ విషయంలో నిమ్మకు నీరెత్తినట్లు ఊరుకుంటారని సూచించారు. ఇలాంటి వారివల్ల – ఇలాంటి వారి ఈగోలను సమర్థిస్తూ ఆలయాలను నిర్మించే స్థపతులవల్లనే మన ఆలయాలు శాస్త్రీయతకు దూరమై **'షాపింగ్ కాంప్లెక్స్'** ల్లా తయారయ్యాయని వివరించారు.

శ్రీమాన్ రావుగారు కూడా శ్రీవారి బోధ విన్న తరువాత ఏకీభవించారు. అనారోగ్యంగా వున్న వారి శ్రీమతి గారిని మంగళాశాసనంచేసి శ్రీ స్వామివారు శ్రీమాన్ వాసన్ శ్రీనివాసన్ గారింటికి వేంచేశారు. VERMONT SOUTH

(వేర్‌మంట్ సౌత్)లో ఉంటున్నవీరు యువకులే అయినా లబ్ధ ప్రతిష్ఠులు. ఇండియన్స్‌కై కేటాయించిన M.P సీటుకోసం లిబరల్ పార్టీ నుండి పోటీ చేస్తున్నారు. సేవా తత్పరతకల వ్యక్తిగా అందరి మన్ననలను పొందారు. అడిగినవారికి లేదనకుండా, కాదనకుండా ఎలాంటి సహాయం సహకారానికైనా వెనుదీయనివ్యక్తిగా మన వారంతా శ్రీనివాసన్ గారని కొనియాడారు.

శ్రీ స్వామివారి ఆస్ట్రేలియా యాత్రకు సంబంధించిన విసాల సాధన విషయంలో వీరెంతో శ్రమతీసుకొని, మన వారికి సహకరించారుట.

వీరి సేవలను ప్రశంసించి, వారిద్వారా శ్రీపాద పూజను స్వీకరించారు శ్రీ స్వామివారు. మళ్ళీ చిగురాల గారింటికి చేరాము. రాత్రి 7 గం॥కు కాంబే వేవర్లీలోనే గల బ్లూ హిల్ ఎవెన్యూ (BLUE HILL - AVENUE) లోని శ్రీమాన్ అనిల్ సింఘ్‌గారింట్లో 'సాయకాల సందేశం' కృప చేసారు శ్రీ స్వామివారు. సందేశం తరువాత వారడిగిన సందేహాలకు సమాధానాలను అదించారు.

మెల్‌బోర్న్‌లో ఉన్న వారంరోజులు ఎందరో భక్తుల గృహాలకు వేంచేయడంతో చాలామంది భగవద్బంధువులతో పరిచయం అయింది. పూజామందిరంకాని, పూజకాని లేని ఇంటివారిని ఏదోఒక భగవత్పూజను చేసుకొన వలసినదిగా ఆదేశించేవారు. శ్రీ స్వామివారు పాదపూజకై ఇంటికి వేంచేసినప్పుడు వారి ప్రశ్నలను, సూచనలను జాగ్రత్తగా గమనిస్తే **'వారి దేశ పర్యటన'** లోని ఆంతర్యం మనకు అవగతమవుతుంది. వారి ఇళ్ళకు వెళ్ళి, వారి జీవన విధానాన్ని గమనించి, వ్యక్తిగతంగా వారికి వైదిక ధర్మం పట్ల ఆసక్తిని పెంపొందించడమే.

17వ తేదీన శ్రీమాన్ కోటేశ్వరరావు (గుంటూరు) గారింటికి వెళ్ళినపుడు ఒక చిన్న సంఘటన జరిగింది. ఆ ఇంటికి పెయింటింగ్ వేయడానికై వచ్చిన **'దీ'** (DEY) , COVRY (కావ్రే) అనే ఇద్దరు ఆస్ట్రేలియన్స్ (PARE పెయింటర్స్) కూడా పాదపూజలో పాల్గొన్నారు. అందులో 'దీ' మంచి చమత్కారి. శ్రీ స్వామివారు పండును ఇస్తున్నప్పుడు ఎడమ చేతిని జాపిన 'దీ' ని అందరూ వారించినా అతను ఎడమ చేతితోనే ప్రసాదాన్ని అందుకున్నాడు. పైగా వారించినవారితో గుండెకు ఆనుకొని ఉండే ఎడమ చెయ్యి కుడిచేతి కంటే మంచిదని వేదాంతం చెప్పాడు. అతని విచిత్ర ధోరణి శ్రీవారికి నచ్చింది. ప్రత్యేకంగా గీతాజ్యోతి ప్రతిమను ఇచ్చి అనుగ్రహించారు.

మరో చోట మరో సన్నివేశం. WALSA STREET దగ్గరలోని శ్రీమాన్ దీనానంద రాంబాబు గారింటికి శ్రీ స్వామివారు వేంచేసారు. ఆ సమయంలో వారి తల్లిదండ్రులు చూపించిన భక్తి ప్రపత్తులు ఆశ్చర్యంగా అనిపించాయి. పాదపూజ తర్వాత శ్రీమాన్ దశరథరాంబాబుగారు వారి అబ్బాయి చేయి పట్టుకొని **'పితృఋణం తీర్చుకున్నావు బాబూ'** అంటూ ఆర్ద్రంగా అన్నారు. హైదరాబాద్ ప్రాంతాలలో లక్షలాదిమంది మధ్య శ్రీ స్వామివారి దర్శనానికైనా నోచుకోని మాకు పాదపూజ చేసుకొనే భాగ్యం కలిగించావు. మాకు ఇంక దిగులు లేదు. పితృఋణం తీరిపోయిందని అన్నారు. **'పితృఋణం'** గురించి వారు అలా పదే పదే అనడానికి గల కారణం తర్వాత మాకు తెలిసింది. దీనానంద్ గారికి సంతానం లేదని, వారి **'పితృఋణం'** అనేమాట వారి కుటుంబంలో **'సంతాన లేమి'** యొక్క పెద్ద చర్చను





బయటపెట్టింది. ఇంగితజ్ఞులైన శ్రీవారు మీ పిల్లలద్వారా కూడా పాదపూజ స్వీకరిస్తాం అని చమత్కరించిన మాట వారికి 'వరం'గా వినిపించింది.

17వ తేది 'సాయం సందేశం' శ్రీమాన్ ముదుంబై చార్యగారింట్లో జరిగింది. ప్రధాన కార్యకర్తల్లో ఒకరయిన శ్రీ ముదుంబగారింట్లో సందేశం అంతా చిన్న పిల్లలను లక్ష్యంగా ఉంచుకునే సాగింది. పాదపూజ కాగానే చార్యగారి శ్రీమతి పిల్లలకు, పూజ, నమస్కారం విషయంలో ప్రాధాన్యాన్ని ఎలా చెప్పాలో తెలియడం లేదని అనడంతో ఆరాధన యొక్క ఆవశ్యకతను ఎంతో మృదుమధురంగా వివరించారు. సందేహాల సమయంలో పిల్లలడిగిన సందేహాలకు శ్రీవారి సమాధానాలు ఎంతో ఆసక్తికరంగా, చమత్కారంగా సాగాయి. 18వ తేది 'సాయం కాలం సందేశం' HAMPTON PARK లోని కమ్యూనిటీ హాల్లో జరిగింది. శ్రీమాన్ MR చార్యగారు 'నారాయణతే నమోనమో' అంటూ కీర్తనంతో కార్యక్రమాన్ని ప్రారంభించారు వారు ప్రసంగవశాత్తు వాడిన 'మోక్షం' అనే పదం మీదనే శ్రీ స్వామివారి ప్రవచనమంతా సాగింది. శ్రీవారి సమయస్ఫూర్తి అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తింది. 'సందేహాల సమయం' చాలా సూటిగా, ఘాటుగా సాగింది. మతత్రయంలోని విశేషాలను, మర్మాలను అరటిపండు ఒలిచి ఇచ్చినట్లు విశదీకరించారు.

19వ తేదీ సాయంకాల సందేశం DELAHEY ప్రాంతంలోని శ్రీమాన్ విద్యా మోహన్ గారింట్లో జరిగింది. విద్యా మోహన్ గారి స్వాగత వచనాల్లో ఈరోజు వారి పెళ్ళిరోజు అని తెలియడంతో శ్రీవారి ప్రవచనమంతా పెళ్ళి - భారతీయత - సాంప్రదాయ పరంపరల గురించి ఆదర్శ జీవనం గురించి సాగింది. సమయజ్ఞత శ్రీ స్వామివారి స్వంతం.

రాత్రి శ్రీమాన్‌చార్య చిగురాల గారింటి నుండి మా వసతి, WHEELERS HILL లోని శ్రీమాన్ అనుమర్లపూడి అమర్‌నాథ్ గారింటికి మార్చాము. ఈ నాలుగు రోజులు కూడా చక్కని వసతి సౌకర్యాలను సమకూర్చిన శ్రీమాన్ చిగురాల లక్ష్మణాచార్యులు, శ్రీమతి శ్రీలత గార్లకు, చిగురాలగారి తమ్ముడు శ్రీమాన్ రాజగోపాలాచార్యులకు శ్రీ స్వామివారు అనేక మంగళాశాసనాలను కృపజేసారు.

శ్రీమాన్‌అమరనాథ్‌గారు శాంత స్వభావులు. ఆస్ట్రేలియా జీవన విధానాన్ని బాగా ఆకళింపు చేసుకొన్న వ్యక్తి. చక్కని భక్తి శ్రద్ధలు కలవారు. వారు వసతిలోనికి స్వాగతిస్తూనే 'ఇది మీ ఆశ్రమం నేను స్వాగతించడం ఏదో ఫార్మాలిటీ మాత్రమే' అన్నారు.

20వ తేదిన నగర సందర్శనం కోసం కేటాయించారు. ఆస్ట్రేలియా బ్రిటీష్ దురాక్రమణకు గురికావడంలో కారణమైన బంగారు గని బల్లారట్ (BALLARAT) గ్రామానికి బయలుదేరాము. బల్లారట్ బంగారు భూమి. 200 సం॥రాల పాటు అవిశ్రాంతంగా త్రవ్వి ఎత్తుకుపోయినంత బంగారాన్ని కన్నతల్లి బల్లారట్.

2 గంటలు ప్రయాణించి, బల్లారట్ గ్రామ సమీపంలోని *WILD LIFE PARK* కు చేరాము. ఆస్ట్రేలియన్ల ప్రకృతి వనంగా పిలువబడే ఈ పార్క్ చాలా ప్రాచీనమైంది. పార్క్‌ను చూడాలంటేనే 15 డాలర్ల టికెట్. అందరం 15మంది వరకు ఉన్నాము. టికెట్స్‌తో పాటు అందరికీ తలో ప్యాకెట్‌లో కాస్త మేతకూడా ఇచ్చారు. ఎండిపోయిన మొక్కజొన్న గింజలు, ఏవో చిన్న చిన్న తయారీ గొట్టాలతో ఉన్న ఆ మేత కంగారు (KANGAROOS) జంతువులకు,

కోవ్‌లా (KOALAS) జంతువులకు పెట్టడానికి.

చిన్న విషయాన్ని కూడా చిత్రాతి విచిత్రంగా మలచి అద్భుతంగా చూపించ డంలో వీరికివేరేసాటి. చీమను కూడా టూరిజం బూతద్దంలో మనకు పెద్ద ఏనుగంత చూపించడంలో సిద్ధహస్తులు. పార్కుముందు ఎంట్రన్స్ బిల్డింగులోనే చిన్న చిన్న గదులను కట్టారు. ప్రతిగదికి లావైన అద్దాలను బిగించారు. వాటిలో ఆయా జంతువులకు కావలసిన కృత్రిమ ప్రకృతిని కల్పించారు. వాటిమధ్య రకరకాల విషసర్పాలను ఉంచారు. నాచు రంగులో ఉన్న త్రాచుపాములు ఉన్నాయి. కోబ్రాజాతికి చెందిన కోరల పాములున్నాయి. సుమారు 5 మీటర్లకు పైగా పొడవైన బండల్లాంటి కొండ చిలువలున్నాయి. మరొక గదిలో పారుతున్న ఏరు, చుట్టూ చెట్లుగల మరో కృత్రిమ ప్రకృతిలో కుప్పలు కుప్పలుగా రంగు రంగు కప్పలున్నాయి. అన్నీ చూచు కుంటూ ఆ గదులనుండి బయటపడి పార్కు లోనికి ప్రవేశించాము. సుమారు 15 హెక్టార్ల విస్తీర్ణమయిన పార్కులో 'కంగారూలు', ఏ కంగారు లేకుండా చెంగు చెంగున దూకుతూ కన్పించాయి. ఇది ఆస్ట్రేలియాలో మాత్రమే కనిపించే ప్రత్యేక జంతువు. ముందు చిన్ని కాళ్ళతో, వెనుక పెద్ద కాళ్ళతో నేలను అదిమిపెట్టిన బలమైన తోకతో ఉండే ఈ జంతువు ముఖాన్ని పరీక్షిస్తే అమాయకమైన బెదురుచూపులతో కనిపించే లేడి, జింకలు గుర్తుకు వస్తాయి. ఏ జంతువుకూ లేని ప్రత్యేకత కంగారూస్‌కు ఉంది. అదే స్వచ్ఛంద ప్రసవం. 10 నెలలు మోసిన తరువాత కడుపులోని పిల్లను వాతావరణం బాగున్నప్పుడు, తనకు ఇష్టమైనప్పుడే ప్రసవించగలిగే శక్తి. అంతే కాదు ప్రసవించిన తరువాత తన కడుపువద్ద ఏర్పడ్డ చక్కని స్కిన్‌బాగ్ (సంచి) లో ఆ **పిల్ల కంగారు** పరుగెత్తగలిగే వరకు కూడా జాగ్రత్తగా చూచుకోగలిగే మరో విచిత్రమైన అవకాశంకూడా ఈ కంగారూలకుంది.. మనం మేతకు పిలువగానే ముందు రెండు కాళ్ళనెత్తి తోకతో నేలను బలంగా అదిమి వెనుక రెండు కాళ్ళతో చెంగు చెంగున ఎగురుతూ మన వద్దకు వచ్చే కంగారూలను చూస్తుంటే చిన్న పిల్లలకైనా ముచ్చటగా ఉంటుంది. ఇవి కాక SEEWOMBATS TASMANIAN DEVILS, GOANNAS, AUSTRALIAN BIRDS ఇవన్నీ కూడా కనులవిందు చేస్తాయి. ప్రత్యేకంగా ఏర్పరచిన ఒక కొలనులో ఉన్న మొసళ్ళు మాత్రము ఆశ్చర్యకరంగా, భయంకరంగా







ఉంటాయి. సుమారు 15 అడుగుల పొడవైన మొసలిని చూచి అది నిజమా, బొమ్మా అని అరగంటసేపు చూశాము. ఆ మకరాన్ని చూసి గజేంద్రమోక్షాన్ని గుర్తుకు తెచ్చుకొన్నాము. అక్కడినుండి మరోవైపు ఇనుప పొదల్లో ఉంచిన KOALAS (కోవ్‌లాస్) ను చూశాము. ఇవి ఆస్ట్రేలియా ప్రత్యేక జంతువులే. కొంత కుందేలుగా, కొంత ఎలుగుబంటి పిల్లలా **"అదృశ్యశ్చాభి గమ్యశ్చ"** అన్నట్లుగా కనిపించే ఈ కోవ్‌లా కుంభకర్ణుడికి సంతానమా అన్నట్లు రోజులో 19గం॥ నిద్రపోయి 2గం॥ తిండితిని, 3గం॥లపాటు మాత్రమే మేల్కొంటాయి. ఇవి ఉండే ఫెన్సింగ్ పైన ఎవరైనా చేతులనుపెట్టి వేళ్ళను లోపలుంచితే చటుక్కున వేళ్ళను కొరికి తినేస్తాయట. 'నేను వ్రేళ్ళు తింటాను' (IAM EATING FINGERS) అని బోర్డులు కూడా ఉన్నాయి. ప్రత్యేకంగా పావురాళ్ళలా ఉండే పక్షులను కూడా చూశాము. ఆ రోజు గురువారం కావడంతో ఈ పార్కులో ఉండగానే శ్రీ స్వామివారు US భక్తులతో టెలిబ్రిడ్జ్‌ను నిర్వహించారు. పార్కులో తిరుగుతూనే గీతాజ్యోతి సందేశాన్ని అందించారు. అక్కడినుండి సుమారు 3గం॥కు బయలుదేరి 5ని॥ల ప్రయాణంతో బల్లారట్ గ్రామానికి చేరాము.

ప్రాచీనమైన ఆ గుర్తులు చెడిపోకుండా ఆధునీకరించిన చారిత్రక గ్రామము అది. ఈ గ్రామానికి సుమారు 150 సం॥ల ప్రత్యేక చరిత్ర ఉంది. SOVEREIGN HILL అనే సువర్ణ గిరి. ఈ గ్రామాన్ని బంగారు గ్రామంగా తీర్చి దిద్దింది. క్రీ.శ 1851 సం॥లో ఈ ప్రాంతాన్ని గోల్డ్ మైన్స్ ఉన్నట్లుగా బ్రిటీష్ వాళ్ళు గుర్తించారు. 1856 సం॥నుండే ఈ బంగారు గనుల్లో త్రవ్వకాలు మొదలయ్యాయి. 1854లో లండన్ నుండి కెప్టెన్ బుల్లీఫోర్స్ సారధ్యంలో లివార్ పూల్ షిప్ ఈ ప్రాంతానికి వచ్చినది. సుమారు 17 వేలమంది బ్రిటీషర్స్, 4వేలమంది చైనీస్ ఈ బంగారు గనుల త్రవ్వకాల్లో ప్రధాన పాత్ర వహించారు. సముద్ర యానంలోను, సముద్ర సంబంధమైన పరికరాల విషయంలోను ఎంతో నైపుణ్యాన్ని సాధించిన చైనీయుల సహకారాన్ని బ్రిటీషర్స్ తీసుకున్నట్లుగా ఒక ఉదంతం ఉంది. 1859లో గనుల పరీక్షకోసం బంగారాన్ని కరిగించే విధానంకోసం యూరోపియన్ గవర్నమెంట్, చైనీస్ అక్కడ ఒక గ్రామాన్ని ఏర్పరచుకోడానికి తగిన సౌకర్యాలను చేసింది. 1854 నుండి 1861 వరకు ఈ గ్రామాన్ని ప్రత్యేక టౌన్ షిప్‌గా ప్రకటించారు. సుమారు 1860 నుండి 1918 వరకు గోల్డ్ మైన్స్ నుండి బంగారం ముడి సరుకును వెలికి తీయటం, దాని పుటం వేయటం, ప్రత్యేక రసాయనాలను కలిపి దానిని స్వచ్ఛమైన బంగారంగా రూపొందించడం వంటివి సాధించారు. 1861 సం॥ని (WINNING GOLD) **బంగారు విజయంగా** ప్రకటించారు. బంగారాన్ని తయారు చేయడానికై వాడిన పనిముట్లను యంత్రాలను ఆ గృహాలను ఇప్పటికీ అదే విధంగా ఉంచారు. ఆ SOVEREIGN HILLS ప్రాంతంలో అడుగు పెడితే మనం సుమారు 200 సం॥ల క్రితం ఉన్న ఫీలింగ్ మనకు కలుగుతుంది. అప్పటి ప్రాచీన వాతావరణాన్ని చూస్తూ ఒక హాలు లోనికి ప్రవేశించాము. బంగారాన్ని తయారు చేసే విధానాన్ని తెలిపే ఒక ప్రదర్శనను చూపారు. మనఊళ్ళలో కంసాలులు బంగారం కాచే విధానమే అది. ముడి సరుకును తీసుకొని నిప్పుల్లో కరిగించి రసాయనిక చర్యతో బంగారు బిస్కెట్ తయారు చేయడం అక్కడి వారికది ఆశ్చర్యం. అంతకు మించి అతను చేసే వ్యాఖ్యానం మరింత ఆసక్తికరంగా అనిపించినది.

అక్కడినుండి గోల్డ్ మ్యూజియంకు వెళ్ళాము. ఆ బంగారంతో తయారుచేసిన రకరకాల నగలు, వస్తువులు, వస్త్రాలు మొ॥గు వాటిని చూశాము. ఇవన్నీ ఒక ఎత్తు. వాటిని ఉన్నది ఉన్నట్లుగా చారిత్రాత్మక రీతిలో వారు చూపించే విధానం ప్రజంటేషన్ పద్ధతి చాలా ఆదర్శవంతమైనది.

ఆ సాయంత్రం RUSSELL STREET లోని THEOSOPHICAL SOCIETY హాల్‌లో సందేశం. ఈ కార్యక్రమాన్ని సొసైటీ వాళ్ళే నిర్వహించారు. సొసైటీ నిర్వాహకుడు యూరప్ దేశానికి చెందినవారు. ఆయన తన తుది పలుకులలో శ్రీ స్వామివారి ప్రవచనధారను ప్రశంసించి, మళ్ళీ మరోసారి తాము నిర్వహించబోయే కార్యక్రమంలో పాల్గొన వలసినదిగా ప్రార్థించాడు. ముగింపులో **ఓం కృష్ణాయ, గోవిందాయ, గోపీజనవల్లభాయ నమః** అని ఉచ్చరించడం ఆశ్చర్యంగా అనిపించింది. 'సందేహాలసమయం' కూడా ప్రయోజన వంతంగా సాగింది.

21వ తేదీన సాయంత్రం CLAYTON HALL లో శ్రీ స్వామివారి ప్రవచనం సాగింది.

22వ తేది ఉ॥ తీర్థగోష్ఠి సమయంలో ఒక దుర్వార్త విన్నాము. రాత్రి క్లెమ్‌టన్ హాల్‌లో ప్రవచనం అవుతున్న సమయంలో చిగురాల గారింట్లో దొంగలుపడి కొంత బంగారాన్ని, రెండు ల్యాప్‌టాప్‌లను దొంగిలించినట్లు తెలిసింది. క్యారం డౌన్ శివ విష్ణు టెంపుల్‌కు వెళ్ళి శ్రీ స్వామివారు చిగురాలగారింటికి వేంచేసారు. దంపతులను పరామర్శించారు. ఎవరూలేని సమయంలో ఇంటికి రక్షణగా ఏర్పాటు చేసుకొన్న 'అలారం' కూడా వాళ్ళు కట్‌చేసి వెనుక దారినుండి ప్రవేశించి, మామూలు డబ్బాల్లో మూటగట్టి పడేసిన బంగారాన్ని ఎత్తుకుపోవడం ఆశ్చర్యకరంగా అనిపించింది. ఎవరో బాగా పరిశీలించి చేసిన పనే అని తెలుస్తుంది. అదీకాక ఇండియన్స్ బంగారాన్ని ఎక్కడెక్కడ దాస్తారోబాగా అధ్యయనం చేసి ఆరితేరిపోయిరట ఆస్ట్రేలియన్ దొంగలు. శ్రీ స్వామివారు పరామర్శించి శివ - విష్ణు టెంపుల్‌కి బయలుదేరారు. 40ని॥ల ప్రయాణంతో ఆలయానికి చేరుకున్నాము. శ్రీస్వామివారి శ్రీసుదర్శనయజ్ఞ వైభవ ప్రవచనము తోపాటు శ్రీ సుదర్శనయాగం ఆగమోక్తంగా జరిగింది. ఇలా వైదికంగా విలక్షణంగా యజ్ఞం జరగడం ఇదే మొదటిసారి అని, సాక్షాత్తు తిరుమలలో ఉన్నట్లుందని చాలామంది ఆనందించారు.

శివ-విష్ణు ఆలయాలను సందర్శించి శ్రీస్వామివారు సాయంకాల సందేశానికై దుర్గామందిర్‌కి వెళ్ళారు. అక్కడ శ్రీ స్వామివారి ప్రవచనం, యథాప్రకారం 'సందేహాల సమయం' కూడా నిరాఘాటంగా జరిగాయి.

23 ఉ॥ తిరువారాధన, తీర్థగోష్ఠి కార్యక్రమాలు పూర్తికాగానే MULGRAVE COMMUNITY CENTRE కి వేంచేశారు. అక్కడ 11గం॥లకు ప్రారంభమైన శ్రీ లక్ష్మీనారాయణ సామూహిక పూజ, ప్రతి ఉపచారాన్ని వివరించడంతోపాటు పూజా విధానాన్ని నేర్పిస్తూ జరగడంతో సుమారు 3గం॥సేపు సాగింది. ఒక గంట వ్యవధిలో అదే హాల్‌లో 'చిన్న పిల్లలతో స్వామీజీ' కార్యక్రమం పెద్దవాళ్ళకు సైతం విజ్ఞానదాయ కంగా సాగింది. పిల్లల ప్రశ్నలకు, సందేహాలకు శ్రీ స్వామివారు వారికి తగినస్థాయిలో సమాధానాలను చమత్కార పూర్వకంగా అందించడంతో ఆద్యంతం ఈ కార్యక్రమం వినోదదాయకంగాను, విజ్ఞానాత్మకంగాను సాగింది. రాత్రి శ్రీమాన్





అమరనాథ్ గారి దంపతులు శ్రీ స్వామివారికి పాదపూజను సమర్పించారు. అంతకు ముందువరకు (సుమారు 9-00P.M)వసతిలో ఉపదేశాత్మకంగా శ్రీవారి పరివారం విష్ణు సహస్రనామ స్తోత్రాన్ని నేర్పించారు. శ్రీమాన్ ఆకులబాబు రేడియో ఛానెల్ తరపున శ్రీ స్వామివారిని ఇంటర్వ్యూ చేసారు. ఆసక్తికరమైన ప్రశ్నలతో, సమాధానాలతో ఇంటర్వ్యూ సాగింది. రాత్రి శ్రీమాన్ అమరనాథ్‌గారి కోర్కెపై శ్రీ స్వామివారు 'తెలుగువారి-ప్రాభవం' గురించి చురకులతో పాటు సూచనలను కూడా చేస్తూ పూర్తి తెలుగులో ప్రవచనం చేసారు. ఆస్ట్రేలియాలో మొదటి తెలుగు ప్రవచనం ఇదే. రాత్రి 1గం. వరకు ఈ సత్సంగంతోనే సాగింది.

24వ తేది ఉదయం తిరువారాధనా దులను ముగించుకొని ఉ॥9గం॥కు మెల్‌బోర్న్ ఎయిర్‌పోర్ట్‌కి చేరాము. JET కార్యవర్గమంతా ఎయిర్‌పోర్ట్‌కి సాగనంపడానికై వచ్చారు. క్వాంటస్ ఫ్లైయిట్‌లో 11గం॥కు బయలు దేరాము. సుమారు గంటన్నర ప్రయాణంతో ఆస్ట్రేలియాలోని అతిపెద్ద నగరమైన సిడ్నీకి చేరాము. 4మిలియన్ల జనాభాకల ఈ రాష్ట్రంలో మన భారతీయ కుటుంబాలు వేల సంఖ్యలోనే ఉన్నాయి. మన భారత దేశానికి 3 రెట్ల విస్తీర్ణమైన ఈ ఖండంలో మొత్తం 20 మిలియన్ల జనాభా మాత్రమే ఉండడం వీరి అదృష్టం. భూభాగం ఎక్కువ జనాభా తక్కువ కావడంవల్ల సోషల్ సెక్యూరిటీని ప్రవేశపెట్టిందీ ప్రభుత్వం. నిరుద్యోగులయిన వారందరికీ ఆడయినా, మగయినా సరే నెలకు 400 డాలర్ల వరకు ప్రభుత్వం ఇస్తుంది. వాళ్ళ వివరాలతో అప్లికేషన్ పెడితే చాలు. ఉద్యోగమొచ్చినా వీరు సెక్యూరిటీ డాలర్లపై మోజుపడితే శిక్ష కఠినంగానే ఉంటుంది. విద్యార్థులు కూడా వారాంతపు దినాలలో టాక్సీ నడుపుకోవడమో, పెట్రోల్ బంక్స్‌లో పనిచేయడమో, హోటల్స్‌లో సర్వరింగ్ చేయడమో చేస్తూ సంపాదించు కొంటున్నారు. మనవారు ఇండియానుండి పంపే డబ్బు వాళ్ళకు సరిపోవడం కష్టం కావడంతో మనదేశంలో ఉన్నతకుటుంబంలోని వారయినా, ఈ దేశంలో ఏమాత్రం సిగ్గుపడకుండా, బిడియపడకుండా అన్ని పనులకు సిద్ధపడుతున్నారు. ఇది ఒకరకంగా మంచిదే. పాశ్చాత్యులకు శని, ఆదివారాలంటే స్వర్గ దినాలు. ఈరెండు రోజులు సుఖంగా గడపడానికి తక్కిన ఐదురోజులు శ్రమిస్తారు. ఈ రకమైన సుఖమయజీవితం, వ్యక్తి స్వేచ్ఛల వల్ల వీరికి సరియైన కుటుంబ వ్యవస్థలేదు. ఒకవేళ ఏదో రకమైన ఒప్పందంతో దాంపత్యజీవనంసాగించినా అది ఏ 'సూత్రానికి' కట్టుపడని జీవనమే. సుమారు 15, 16 ఏళ్ళు వచ్చిన పిల్లలు ఇళ్ళను వదలి తల్లిదండ్రుల సంబంధాలు లేకుండా స్వేచ్ఛావృత్తిని స్వీకరిస్తారు. 'పేరెంట్స్ దే' ఒకటి ఏర్పాటు చేసుకొని ఏడాదికొకమారు మొక్కుబడిగాను, సరదాగానూ కలుస్తారు. మళ్ళీ **ఎవరికివారే యూరాతీరే** (YARRAఈ దేశపు నది) ఇలా కన్నబిడ్డల ప్రేమకు కరువై, మనుమలను చూసే అదృష్టంలేని ముసలి తల్లిదండ్రులు 'స్కూల్స్ జోన్స్ వద్ద స్టాప్ (STOP) బోర్డులను పట్టుకొని ప్రత్యేకమైన దుస్తులతో స్కూళ్ళకు వచ్చిపోయే చిన్నారులను చూసుకుంటూ, వారికేప్రమాదాలు రాకుండా చూసుకొనే స్వచ్ఛంద సేవను చేస్తారు. లాలీపప్పా (తినే చాక్లెట్) లాంటి స్టాప్ బోర్డ్‌లను చేతపట్టుకొని స్కూళ్ళజోన్స్ వద్ద ట్రాఫిక్ సేవలనందించే ఈ వృద్ధులను పిల్లలు ముద్దుగా "లాలీపప్పాస్" అని పిలుచుకుంటారు. ఆ పిల్లలు ఆప్యాయంగా పిలిచే ఆ ముద్దు పలుకులను వినడానికే అంతటి ముసలితనం

లోను వారు ఆ సేవలను చేసుకుంటున్నారు. మన పెద్దలకు ఈబాధలేదు. భవిష్యత్తు ఇలా భయంకరంగా మారకుండా చూసుకొనే బాధ్యత మాత్రం చాలా అవసరం.

కుటుంబాల అవస్థ ఎలా ఉన్నా, సమాజ వ్యవస్థ ఎలా ఉన్నా తక్కువ జనాభాతో, ఎక్కువ వనరులతో ఉన్న ఈ దేశం సంపన్నంగానే ఉంటుంది. సిడ్నీ, మెల్‌బోర్న్ కంటే పెద్ద నగరం. విస్తీర్ణంలోను, అందచందాలలోను మెల్‌బోర్న్‌కి ఏమాత్రం తీసిపోని తీరులో ఠీవిగా ఉంటుంది ఈ నగరం. బ్రిటిషర్స్ ఈ ఖండాన్ని కనుక్కునే ప్రయత్నంలో ముందుగా దిగింది ఈ సిడ్నీలోనే. వాళ్ళ ఆశయాలు **"సిద్ధించిన** నేల, వాళ్ళ, 'బంగారు' ఆశలు కూడా **"సిద్ధించిన"** నేల కావడం వల్ల 'సిద్ధిని' అనే పేరు పెడదామనిపించింది. సిడ్నీకి SYDNEY పదసామ్యం కూడా కావాలికదా! మరి.

మమ్మల్ని ఎయిర్‌పోర్ట్ నుండి స్వాగతించిన శ్రీమాన్ హృషీకేశ భట్టర్‌స్వామి, శ్రీమాన్ వినోద్ రెడ్డిగారు , గోపిగారు, రమేష్ గారు, శ్రీమాన్ నారాయణరెడ్డి ప్రభృతుల ద్వారా సిడ్నీ విశేషాలను వింటూ స్ట్రాత్ ఫీల్డ్ (STRATH FIELD) లోని శ్రీమాన్ వరదరాజన్ కోకిలమ్మ గారింటికి చేరాము. వారంరోజుల మకాం ఇక్కడే. మంచి దంపతులు. ఆదర్శపూర్వకంగా మాట్లాడుతారు. డాక్టరుగారు ఇల్లంతా మాకిచ్చేసి ఒక మూల గదిలో ఒదిగిపోయారు. అతిథులంగా వచ్చిన మాకు వారు అతిథులై మా ఆతిథ్యంతోనే గడిపేసారు. అన్ని సౌకర్యాలతో ఉన్న పెద్ద ఇంట్లో ఏ ఇబ్బందీ లేకుండా గడిపేసాము.

శ్రీమాన్ హృషీకేశ భట్టర్‌గారి మార్గ దర్శకత్వంలో శ్రీ స్వామివారితో పాటు అందరం శ్రీమాన్ వినోద్ గారింటికి చేరాము. అక్కడ పాదపూజ కాగానే భట్టర్ గారింట్లోను, వారి బావమరిదిగారింట్లోను కూడా పాదపూజలు జరిగాయి. సాయంకాలం 'సందేశం' దండాస్ ప్రాంతంలోని శ్రీమాన్ వినోద్ రెడ్డిగారింట్లోనే జరిగింది. శ్రీమాన్ వినోద్‌గారు మంచి వ్యక్తిత్వం కలవారు. తొణకని మాట, బెణకని పని, మాటలో కాఠిన్యం వినిపిస్తున్నా చేతలో సిన్సియారిటీ కనిపిస్తుంది. 'సిడ్నీ' కార్యక్రమావళి మొత్తం భట్టర్‌గారి ప్రేరణతో వీరే చేపట్టారు. క్రమశిక్షణగా కార్యక్రమాన్ని నడపించగల సత్తా కలవారు.

25వ తేదీ సిడ్నీనగర సందర్శనానికై బయలుదేరాము. శ్రీమాన్ శ్రీనివాస్‌గారు మా గైడ్ సిడ్నీ నగర సౌందర్యాలనాస్వాదిస్తూ హార్బర్ బ్రిడ్జి ప్రాంతానికి చేరాము. కాలినడకతో దాని చుట్టూ నడుస్తూ దాని విశేషాలను తెలుసు కున్నాము.

హార్బర్ బ్రిడ్జిని 70సం॥ క్రితం నిర్మించినా చాల కొత్తగానే ఉంది. ఇద్దరు పెయింటర్స్ ఈ చివరినుండి రంగులు వేస్తూ ఆ చివరకు చేరే సరికి ఏడాది అవుతుందిట. రెండు నెలల వ్యవధిలో మళ్ళీ ఆ వైపు నుండి రంగులను వేయడం ప్రారంభిస్తారు. వాళ్ళకది చారిత్రాత్మక మైన ఆ వంతెన అని నిత్య నూతనంగా ఉంచుకుంటున్నారు. అదీ వారి ప్రత్యేకత. ఇక్కడి వారికి 100 ఏళ్ళ క్రితం గృహం అన్నా, వస్తువన్నా అపురూపం. అదే ఒక కళాఖండం. అందుకే వీళ్ళకి పాత ఇంటిని పడగొట్టుకో వడానికి పర్మిషన్స్ - ఆంక్షలు ఎక్కువ. క్రొత్త ఇల్లు కట్టుకోవడం చాలా తేలిక. ఆ 'పాత' మధురంగా చూస్తారు పాశ్చాత్యులందరూ, మనవాళ్ళు 'పాతది' అనగానే పారవేయ బుద్ధౌతుంది. ఇలానే మనం మన చారిత్రక సంపదను దాదాపు కోల్పోయాము. ఇంకా కోల్పోతూనే ఉన్నాం.





ఆ హార్బర్ బ్రిడ్జి ప్రక్కన సముద్రపు క్రీక్‌లో కట్టిన ఒపేరా హౌస్ ఒయ్యారాలు ఒలకబోస్తూ పగలు ధవళ శిఖరాల్లాగ రాత్రి చిత్రవర్ణాలతోనూ కాంతులీనుతుంటుంది.

సుమారు 30 ఏళ్ళక్రితం కట్టిన ఈ ఆడిటోరియంలాంటి ఈ ఒపేరా హౌస్ ఇంజనీరింగ్ వరంగా ఓ అద్భుతమైన కళాఖండం. చుట్టూ రేకులు విచ్చుకున్న ఒక పద్మంలాంటి ఆకారంలో కనిపించే ఈ ఒపేరా హౌస్ ఢిల్లీలోని లోటస్ టెంపుల్‌కు కాస్త దగ్గర పోలిక కలిగి ఉంటుంది.

హార్బర్ బ్రిడ్జిని ఆనుకుని ఉన్నట్లుగా దూరం నుండి కనిపించే ఒపేరా హౌస్‌ను చూస్తూ... 'ఛైర్‌పాయింట్' అనే ప్రదేశానికి చేరాము. 150 సం॥ల క్రితం ఆస్ట్రేలియాకు మొదటి గవర్నర్ అయిన మిస్సెస్ మెకోరీ సాయంవేళ ప్రకృతి సౌందర్యాన్ని వీక్షిస్తూ కూర్చునే ఛైర్ పాయింట్ కావడంతో ఆ ప్రదేశానికి ఆ పేరే స్థిరపడిపోయింది.

అక్కడ కుడి ప్రక్క మూలంగా పరికిస్తే సముద్రం మధ్య 'డెన్నెస్ ఫోర్ట్' అనే చిన్న కోటలాంటి గృహమున్నది. రాజధిక్కారం చేసిన వారిని, దొంగలను ఆ గృహములో నిర్బంధించే వారట. సముద్రం మధ్య నుండి మొసళ్ళు ఆ గృహములోనికి వచ్చి, వారిని చంపివేసేవిట. బ్రిటీష్‌పాలనలో అదొక భయంకర శిక్షాస్థానం.

18వ శతాబ్దపు ఉత్తరార్థంలో ఈ ఖండాన్ని దర్శించిన మొట్టమొదటి నావికుడు కెప్టెన్ కుక్. అతడు ముందు నివాసానికై సముద్రంలో తన ఓడను ఆపిన ఒడ్డుకు సమీపంలోనే చిన్న పెంకుటిల్లు కట్టుకున్నాడు. ఆ ఇల్లు ఇప్పటికీ జాగ్రత్త పెట్టారు. ఈ ఖండంలో బ్రిటీషర్స్ యొక్క మొదటి ఇట్లు ఇదే. ఈ హార్బర్ బ్రిడ్జివద్ద సందర్శకులు సముద్రంలో సరదాగా నౌకా విహారం చేయడానికై ఏర్పాటు చేసిన లాంఛీలకు, స్టీమర్లకు అన్నిటి పైన 'కెప్టెన్ కుక్' అనే పేరు పెట్టారు. కెప్టెన్ కుక్ అప్పుడు వచ్చిన అతి పెద్ద ఓడ **ORIANA** అనే పేరుతో ఇప్పటికీ అక్కడ ఉంది. చారిత్రకమైన వాటిని జాగ్రతచేయడంలో వారి శ్రద్ధ శ్లాఘించ తగినదే. ఈ ఖండానికే ఈ 'ఆస్ట్రేలియా' అనే పేరు పెట్టిందికూడ కెప్టెన్ కుక్ అనేవాడే. అతను ఇక్కడి ఆదిమవాసులను పేరు అడిగితే వాళ్ళు 'అస్త్రలయ' అనే ప్రాచీన కాలంగా వారు పిలుచుకునే పేరును చెప్పి ఉండవచ్చు. మన భారతీయ నామాలను 'బ్రిటీషర్స్' వారి ఇంగ్లీష్ భాషా స్పర్శతో విచిత్రంగా పాడుచేసినట్టు, ఈ కుక్ తాను విన్న 'అస్త్రలయ' పేరును కూడ తనపలుకుబడితో ఆస్ట్రేలియా' గా పిలిచి ఉండవచ్చు. అంతేగాక గోండ్ జాతికి చెందిన ఇక్కడి ఆదిమవాసులకు ప్రత్యేకమైన భాష ఉన్నది. ఆ భాష మన భారతదేశంలోని కొండ – కోయ జాతుల వారి భాషతో పోలిక కూడ కలిగిఉందట. వారి నివాసం వల్ల ఈ ఖండాన్ని 'గోండ్‌వానా' అనీ గోండ్ ల్యాండ్ అని కూడ పిలిచేవారట.

అక్కడి నుండి విక్టోరియా భవనం మీదుగా సిడ్నీ టవర్ ప్రాంతానికి చేరాము. విక్టోరియా భవనం కూడ ప్రాచీనమైన పెద్ద భవనం. మన మైసూరు కోటను తలపించే విధంగా ఉన్న ఆ భవనంపై ప్యారిస్ దేశంలో కట్టినట్లు బురుజులు, శిఖరాలు కట్టారు. వాటిపై బంగారు పూత పూసినట్లుండే ఆ శిఖరాలు కూడ సందర్శకులను ఇట్టే ఆకట్టుకుంటాయి. దీని సమీపంలోనే 'టౌన్ హాల్'కూడ ఉంది. చాలపెద్దది. చాలా అందమైనది కూడ. సిడ్నీకి దీనిని కేంద్రస్థానంగా ఉంచుకుని కిలోమీటర్ల దూరాన్ని గుర్తిసారుట.

సిడ్నీ టవర్ చాలా అందమైనది. దాదాపు 250 మీటర్ల పొడవైన ఈ టవర్ అన్నిరకాల హంగులతో రంగులతో ఆకర్షణీయంగా ఉంటుంది. సిడ్నీ నగరం యొక్క సమగ్రమైన సౌందర్యాన్ని, సముద్రంయొక్క ఒంపుసొంపులను చూడాలంటే తప్పక ఈ టవర్‌ను ఎక్కాల్సిందే. సిడ్నీ టవర్‌లో ఒక భాగంగా ఉన్న EYE MAX షోకి వెళ్ళాము. ఆస్ట్రేలియా ఖండ సమగ్ర చరిత్రను సంక్షిప్తంగా చూపించారు. చూపించే విధానం అద్భుతంగా అనిపించింది. ఆస్ట్రేలియా భౌగోళికాంశాలతోపాటు, కంగారూల జీవన విధానం, ఎప్పుడూ తెల్లని స్వచ్ఛమైన నీటితో ప్రవహించే టుల్లీ (TULLY) నది యొక్క పుట్టుక, ఇంతేగాక సిడ్నీకి ఉత్తరాన ఈ ఆస్ట్రేలియా ఖండానికి సరిగ్గా మధ్యన ఎర్రటి కొండ, నాలుగు శిఖరాలతో వెడల్పుగా ఉంది. సువిశాల మైదానం మధ్య ప్రత్యేకంగా ఎవరో తెచ్చిపెట్టినట్లు ఎర్రగా ఉన్న ఈ కొండకే ఉలురు అని పేరట. అబ్ ఆరిజన్స్ ఈ కొండను వాళ్ళ దైవంగా భావిస్తారట. చూడగానే మనలో ఏవో దైవికమైన భావాలను రేకెత్తించే ఈ ఉలురు విశేషాలను కూడ ఆ ఐ-మాక్స్‌లో చూపిస్తూ వివరించారు. తర్వాత 'స్కైటూర్' షోకి వెళ్ళాం. కూర్చున్న కుర్చునే, కుదుపుతూ ఆకాశంలోనూ, ఆస్ట్రేలియా లోని ప్రధానమైన అన్ని సందర్శన స్థలాలలోను మనల్ని విహరింపజేస్తూ... ఆ విహారంలో ఆయా ప్రాంతాలలో ఎదురయ్యే అన్ని ఆటంకాలకు మనల్ని గురిచేస్తూ (కుదుపుల మాయతో) భయభ్రాంతులను, ఆశ్చర్య చకితులను చేసే షో.

అక్కడి నుండి చాలా ఫాస్ట్‌గా టవర్ పైనున్న రివాల్వింగ్ హౌస్‌లోకి తీసుకెళ్ళే లిఫ్ట్‌సాయంతో కొన్ని సెకన్లలోనే చిట్టచివరి పాయింట్‌కి చేరుకున్నాము. ఆ టవర్ నుండి సిడ్నీ నగరాన్ని చూస్తే... వర్ణించనలవికాని విధంగా ఉంటుంది. చుట్టూ సముద్రం మధ్య అధునాతనమైన అందమైన నగరం. నగరం మధ్య పజిల్‌లోని వంకర టింకర గీతల్లా క్రీక్స్, ఆ క్రీకులలో చిన్న చిన్న నౌకా విహారాలు... పార్కులు, ఆకాశాన్ని చుంబించే అందమైన సౌధాలు. ఇలా ఎంతో అందంగా ఉంది సిడ్నీ, చుట్టూ సముద్రం ఉండి, మధ్యన ఉన్న ఈ నగరానికి మన హృషీకేశ్ భట్టర్‌గారు 'సింధుపురి' అని పేరుపెట్టడం ఎంత సమంజసమో ఈ టవర్ ఎక్కాక తెలిసింది. సిడ్నీ టవర్ పైన ఏర్పాటు చేసిన 'పోస్టల్' సౌకర్యాన్ని వినియోగించుకుంటూ మన వేద విద్యార్థులకు, ఆగమ విద్యార్థులకు, ఓ కంగారున్న సందేశాన్ని శ్రీస్వామివారు పంపారు. అన్నిటి మీద శ్రీస్వామివారు వ్రాస్తూ ఈ ఆస్ట్రేలియాను 'కంగారు దీవి'గా అభివర్ణించడం ఎంతో సమంజసంగా అనిపించింది. ఈనాటి సాయంకాల సమావేశం వాటెల్ గ్రూప్‌లో జరిగింది.

26వతేదీ సిడ్నీ తూర్పు ప్రాంత సందర్శనానికి వెళ్ళాం. మొదట బుల్గాయిపాస్ అనే ప్రాంతానికి చేరాము. పసిఫిక్ మహాసముద్ర తీర ప్రాంతమిది. ఈ సముద్రం పేరులోనే 'పసి' తనం తప్ప ఆకారంలో పెద్దది. పేరులో 'చిన్న' పదమున్నా మన స్వామివారు 'జ్ఞాన సముద్రమైనట్లన్నమాట'. అక్కడి నుండి 'ఉల్లంగాన్గ్' (ULLANGANG) అనే చిన్న పల్లెటూరుకి చేరాము. పేరుకు పల్లెటూరే కానీ.. సిటీలన్ని దీనిముందు బలాదూరు.... తీర్చిదిద్దిన చక్కని చెక్కఇళ్ళతో, తీరైన పూలమొక్కల, పచ్చికల ముంగిళ్ళతో చాలా అందంగా ఉంది. క్రమబద్ధమైన దారులు, ఖరీదయిన కారులు, 'బారు'లు తీరిన





షాపులతో... పట్టణాన్ని మరపిస్తున్నా ప్రశాంతంగానే ఉంది. సిటీ కాలుష్యాలకి దూరంగా ఉండాలనుకునే కోటీశ్వరులు... నివాసాలను ఏర్పరచుకున్న 'వాన ప్రస్థాశ్రమం' ఈ గ్రామం. డా॥ కృష్ణారెడ్డి గారింట్లో పాదపూజ జరిగింది. ప్లాస్టిక్ సర్జరీ చేయడంలో సుప్రసిద్ధ వైద్యులు వీరు. విద్యావేత్తలయిన చాల మంది డాక్టర్లు 'సందేహాల సమయాన్ని' సద్వినియోగం చేసుకున్నారు. శ్రీస్వామివారు 'ఆత్మ ప్రయాణం' గురించి వారికి వివరించిన విధానంతో విస్మయ చకితులయ్యారు. దాదాపు సా॥ 4-30గం॥లకు బయలుదేరి కయానా (KAINA) అనే గ్రామానికి చేరాము. చక్కని పర్యాటక స్థలం. 360 రోజులూ సందర్శకుల సందడితో నిండిపోయే ఈ ఊరు నిండా హోటల్ను, మోటెల్ను, బారుషాపులు, మ్యూజిక్ సెంటర్లు.... చాలా అధునాతనమైన రీతిలో ఆకర్షిస్తుంటాయి. అక్కడ ఎత్తయిన టూరిస్ట్ పాయింట్ వద్ద దిగాము. చాలా ఆహ్లాద కరంగా ఉన్న సముద్ర ప్రాంతమిది. ఇక్కడి బ్లోహోల్ (BLOW HOLE) పెద్దవింత. సముద్రానికి ఆనుకుని ఉన్న కొండంతా ఓనాటి అగ్ని పర్వతమే. ఒకప్పుడు లావా పొంగి ప్రవహించిన లక్షణాలు ఇంకాకనిపిస్తున్నాయి. అక్కడ 'లావా' వల్ల ఉడికిన రాళ్ళన్నీ కొంత నల్లగా, కొంత మెరూన్ కలర్లో తుప్పుపట్టిన ఇనుపరాళ్ళ గుట్టల్లా ఉంది ఆ గట్టంతా. దీనిని 'ఐరెన్ హిల్' అని అంటారని హృషీకేశస్వామి చెప్పారు. సముద్రం పైకి వంతెన వేసిన కొండలా ఉన్న దానిక్రింద పెద్ద సొరంగం, ఆ సొరంగం గుండా వీరంగం చేస్తున్నట్లుగా సముద్రపు అలలు హోరెత్తుకుంటూ దూరి... కొండలమధ్యన ప్రాకృతికంగా ఏర్పడ్డ ఒక పెద్ద కన్నం (HOLE) నుండి ఉవ్వెత్తున పైకిలేస్తాయి. అలల వేగాన్ని బట్టి సుమారు 20 అడుగుల ఎత్తుపైకి స్ప్రింగ్‌లా లేచే ఆ నీళ్ళను చూడడానికై సందర్శకులు తండోప తండాలుగా తరలివస్తారు. ఆహ్లాదకరమైన ఈ ప్రదేశంలో అరగంటకు పైగా గడిపి మళ్ళీ 'సిడ్నీ' దారిపట్టాము. దారిమధ్య ఉల్లాంగాన్గ్ సబ్ అర్బ్‌లోని హెలెన్స్ బర్గ్‌లో శివ-విష్ణు దేవాలయానికి వెళ్ళాము. ఊరికి చాలా చివరిలో ఉంది. ఇక్కడే కొంత కాలం మన హృషీకేశ్ భట్టర్‌స్వామి అర్చకత్వం చేసి... ఇప్పుడు ఫ్రీలాన్స్ పురోహితునిగా, అందరికీ 'తలనాలుక'లా విశేషాదరాన్ని పొందారు. మెల్‌బోర్న్‌లోని శివవిష్ణు టెంపుల్ 20సం॥ల క్రితం ఈ నగరంలోనే మొదటి ఆలయమైనా అంత ఆకర్షణీయంగా లేదు. సరైన ప్లానింగ్ లేకపోవడంవల్ల కాబోలు సమగ్రమైన ఆలయ సౌందర్యం ఇంకా సమకూరలేదు.

ఇంకా.... ఇంకా... ఆస్ట్రేలియా గురించి
ఆసక్తికరంగా చెప్పిన మరిన్ని విశేషాలను
వచ్చే సంచికలో తెలుసుకుందాం!
**'కంగారు'** పడకండీ.... ఇంకావుంది...





# వికాస దర్శిని నివేదన

విదేశీ ప్రయాణం ముగించుకొని శ్రీస్వామివారు, మార్చి 17వ తేది చెన్నైలో స్వదేశం చేరారు పరివారంతో. జెట్ సభ్యులందరూ శ్రీవారికి స్వాగతంపలికారు.

**ఇసుకపాలెంలో...**

ఇసుకపాలెం, శ్రీమాన్ శ్రీనివాసులు రెడ్డిగారు వారి గృహానికి తీసుకువెళ్ళి, సాయంకాలపు ఆరాధనను అక్కడనే జరుపుకొని, రాత్రికి నెల్లూరు జిల్లా నరసింహులు కొండలోని మన వేదపాఠశాలకు చేరారు. శ్రీమాన్ హనుమ, వేదాధ్యాపకులు శ్రీమాన్ ప్రసాదు, వేద విద్యార్థులు, హార్ధమైన స్వాగతాన్ని పలికారు. 18వ తేదీ నుండి అక్కడ హనుమదాలయ నిర్మాణం జరిగిన సందర్భంగా విగ్రహ ప్రతిష్ఠకై అంకురార్పణ జరుగుతోంది. దీని నిర్మాణం శ్రీమతి రమణమ్మగారు ప్రధాన దాతగ ఉండి జరిపించారు.

18వ తేదీనాటి యాగారంభ కార్యాలను జరిపించి 19 తేది ఆరాధనానంతరం శ్రీస్వామివారు సోమశిల వేదపాఠశాలకు చేరారు. అక్కడి మన శ్రీలక్ష్మీనృసింహస్వామి వారి దేవాలయంలో 19వ తేదీ రాత్రి కళ్యాణ మహోత్సవం జరిగింది.

**సోమశిలలో...**

ఆశ్రమంలోనికి నీటి వసతిని కల్పించడానికి తగుఏర్పాట్లను చేయమని అక్కడి చైర్మన్‌గాని పెన్నానదిలో స్నానఘట్టాన్ని ఏర్పాటు చేయమని సోమశిలడ్యామ్ ఇంజనీరుగారిని శ్రీవారు కోరారు. వారలానే చేస్తామని అంగీకరించారు.

20వ తేదీ ఆరాధనానంతరం నెల్లూరుజిల్లా ఇసుకపాలెంలో జరిగే శ్రీసీతారామ చంద్రస్వామి వారి ఆలయ ప్రతిష్ఠపాల్గొనడానికై విచ్చేసారు. దీనిని పునరుద్ధరణ చేసి, నూతనమూల మూర్తి ప్రతిష్ఠ చేసే కార్యక్రమ బాధ్యతను శ్రీమాన్ శ్రీనివాసులరెడ్డిగారు స్వీకరించారు. గ్రామం చిన్నదే అయినా చాలా పెద్దఎత్తున ఏర్పాట్లు చేసారు. భక్తులుగూడ చుట్టూ సుమారు 25 గ్రామాలనుండి ఇందులో పాల్గొన్నారు. ప్రతిష్ఠకాగానే అక్కడనే ఒక పశు వైద్య శిబిరం జరిగింది.

22వ తేదీ రాత్రికి అక్కడి నుండి తిరిగి నరసింహులకొండ విచ్చేసారు. 23 తేది హనుమ విగ్రహ ప్రతిష్ఠ, గోపుర ప్రతిష్ఠ చాలా బాగా జరిగాయి. తిరిగి 23వ తేది ఇసుకపాలెం వెళ్ళి అక్కడి గీతాజ్యోతి వైద్య శిబిరంలో పాల్గొన్నారు.

అనంతరం శ్రీమాన్ శ్రీనివాసులురెడ్డిగారికి, వారి పరివారానికి (జ్ఞాపికలు) వస్త్రాలనందించి మంగళాశాసనము చేసారు. అక్కడ కార్యక్రమం పూర్తిచేసుకొని నెల్లూరు మీదుగా రాత్రికి సీతానగరం చేరారు.

**సీతానగంలో....**

24వ తేదీ తీర్థగోష్ఠి అనంతరం ఆశ్రమంలోని ఉచిత ఆయుర్వేద వైద్యశిబిరాన్ని ప్రారంభించారు. అనంతరం గిరిజన విద్యార్థులు గత నెలరోజులుగా అభ్యసిస్తున్న సంస్కృత శిక్షణ తరగతుల ముగింపు మహోత్సవంలో





పాల్గొన్నారు. విద్యార్థులు ప్రదర్శించిన సంస్కృత నాటిక ఉపన్యాసాదులను తిలకించి వారికి మంగళాశాసనములు కావించారు.

**ఇబ్రహీంపట్నంలో...**

ఇబ్రహీంపట్నంలోని తూర్పు కొండపైనున్న రామాలయాన్ని సందర్శించి, అక్కడి భక్తులకు గీతాజ్యోతి సందేశాన్నందించి తెల్లవారు ఝామున్కి మేళ్ళచెరువు చేరారు. 25వ తేదీనుండి 28వ తేదీ వరకు శ్రీమాన్ రామేశ్వరరావుగారి మేళ్ళచెరువు మహాసిమ్మెంట్స్ ఆవరణలో శ్రీనివాస పెరుమాళ్ బ్రహ్మోత్సవాలలో పాల్గొన్నారు.

**మేళ్ళచెరువులో...**

25వ తేదీన కళ్యాణము, 26న గరుడ సేవలు, అత్యంత వైభవముగా జరిగినవి. 27వ తేదీ అవబృథస్నానానంతరము, కాకతీయ సిమ్మెంట్స్ అధినేత శ్రీమాన్ పి. వేంకటేశ్వర్లుగారి కుమార్తె అయిన శ్రీమతి త్రివేణిగారు నిర్వహిస్తున్న సువర్ణ సిమెంట్స్‌కి వేంచేసారు. అక్కడ అధిక సిమెంట్ ఉత్పత్తి కోసం కొత్తగా ఏర్పరచిన 'కెలన్' ను ప్రారంభించి మంగళా శాసనంకావించారు. తిరిగి రాత్రికి మేళ్ళచెర్వులో శ్రీనివాసుని సన్నిధిలో శ్రీ పుష్పయాగము, ద్వాదశారాధనలతో బ్రహ్మోత్సవములు సంపూర్ణమయ్యాయి. 28వ తేదీన శ్రీనివాస పెరుమాళ్ళకి తిరుమంజన మహోత్సవం కాగానే తిరిగి శ్రీస్వామివారు సీతానగరం మీదుగా రాత్రికి వీరంకిలాకు ధర్మక్షేత్రానికి వేంచేసారు. మార్గమధ్యంలో శ్రీస్వామివారిని ఆపి మంటాడ, కపిలేశ్వర పురపు గీతా మందిర భక్తజనులు మంగళాశాసనా లందుకున్నారు.

28వ తేది రాత్రి సుమారు 11-30కి వీరంకిలాకు చేరుకున్నారు. శ్రీమాన్ నాగేశ్వరరావుగారు పూర్ణకుంభంతో స్వాగతించి దీపాలు పట్టుకొని భక్తులతో ఓ చిన్న శోభాయాత్రగా శ్రీస్వామివారు విడిదికి వేంచేసారు.

**వీరంకిలాకులో....**

29వ తేదీ ఉ॥ 8గం॥లకి సేవాకాలం, అనంతరం గీతాజ్యోతి ధార్మిక సదస్సు జరిగాయి. సదస్సులో శ్రీమాన్ నాగేశ్వరరావు గారు, శ్రీమాన్ బాబుగారు ఒకరిద్దరు కార్యకర్తల అనంతరం శ్రీస్వామివారు గీతాజ్యోతి సందేశం అందిస్తూ అనుగ్రహభాషణం కావించారు. అనంతరం సుమారు 11గం॥కి ప్రారంభమైన తీర్థగోష్ఠి మధ్యాహ్నం 2-30 ని॥లకి తరువాత నిలిపి వేయవలసివచ్చింది. సాయంత్రం 5-30 కి శ్రీవిష్ణుసహస్ర నామ పారాయణ అనంతరం శ్రీకృష్ణపూజలు జరిగాయి. 108 గ్రామాల నుంచి వచ్చిన సుమారు 5 వేల మందితో గీతాజ్యోతులు వెలిగించి ప్రార్థన చేయించారు. అనంతరం ధర్మక్షేత్ర ప్రచారం చేసిన శ్రీమతి సక్కుబాయమ్మ గారికి, ఇతర కార్యకర్తలకి మంగళాశాసన పూర్వక జ్ఞాపికలందించి పటమట ధర్మక్షేత్రానికి బయలుదేరారు. రాత్రికి శ్రీమాన్ కోనేరు ప్రసాద్‌గారింటికి వేంచేసారు. 29వ తేదీ ఉ॥ పటమట రైతు బజార్ ప్రక్కనున్న స్థలంలో కార్యక్రమం జరిగింది. ఉ॥ తీర్థగోష్ఠి అనంతరం గీతాజ్యోతి సదస్సు, అనంతరం వివిధ గ్రామాలనుండి వచ్చిన అర్చకులతో కూడా శ్రీస్వామివారు ముచ్చటించారు. తిరిగి సాయంత్రం 4-30 ని॥లకు వివిధ గ్రామాల నుండి వచ్చిన జానపద కళాకారుల డప్పునృత్యం, పటమట వికాసతరంగిణివారు చేసిన కోలాటాది కార్యక్రమాలు శ్రీస్వామివారు తిలకించి మంగళాశాసనం కావించారు. అనంతరం గురునానక్ నగర్ మీదుగా శోభాయాత్ర వైభవంగా 2 1/2 గం॥పాటు జరిగింది. గీతాజ్యోతి జండాలు, ప్లేకార్డ్స్ చేత ధరించి భక్తులు ఈ యాత్రలో పాల్గొన్నారు.

అనంతరం 8 వేలమంది ప్రజలచే తులసి కుండీలనిచ్చి శ్రీకృష్ణ, తులసి పూజలు జరిపించారు. 'గీతాజ్యోతులు' ప్రమాణానంతరం శ్రీస్వామివారు కార్యకర్తలందరికీ మంగళా శాసనములుగావించి సీతానగరం చేరారు.

**మోటూరులో...**

31వ తేదీ ఉ॥ తీర్థగోష్ఠి అనంతరం శ్రీఉ.వే.శ్రీమాన్ రఘునాథాచార్య స్వామివారి ఆహ్వానంపై మోటూరులో శ్రీసీతారామచంద్ర స్వామి వారిని దర్శించి వచ్చారు. అక్కడికి శ్రీశ్రీశ్రీ రంగరామానుజ జీయర్‌స్వామివారు, శ్రీశ్రీశ్రీ రామచంద్ర జీయర్ స్వామివారు కూడా వేంచేసారు.

గూడూరు మీదుగా రాత్రికి తిరుపతి చేరారు. తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారి యైన శ్రీమాన్ అజయ్ కల్లాంగారితో శ్రీస్వామివారు సమావేశ మయ్యారు. శ్రీమాన్ భవానీ ప్రసాద్‌గారు, శ్రీమాన్ రంగనాథంగార్లు కూడా ఈ సమావేశంలో పాల్గొన్నారు.

**తిరుమలలో...**

1వతేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం తిరుమలలోని ఆస్థాన మండపములో గీతాజ్యోతి సమీక్షా సదస్సు కార్యక్రమం ఆరంభమైంది. ఈ సభలో టి.టి.టి.ఇ.ఓ. శ్రీమాన్ అజయ్ కల్లాంగారు, డి.పి.పి. కార్యదర్శి శ్రీమాన్ బ్రహ్మానందంగారు, తిరుపతి జె.ఇ.ఓ. గారు శ్రీమాన్ అప్పారావుగారు వివిధ జిల్లాల గీతాజ్యోతి సమన్వయ కార్యకర్తలు పాల్గొన్నారు. ఇ.ఓ. శ్రీమాన్ అజయ్ కల్లాంగారు గీతాజ్యోతి ధర్మప్రచార పరిషత్ తరపున నిర్వహించడానికి త్వరలోనే ఒక ప్రణాళికను తయారు చేయనున్నామని చెప్పారు. డి.పి.పి.కార్యదర్శి శ్రీమాన్ బ్రహ్మానందంగారు, డి.పి.పికి తగిన వనరులున్నా గ్రామాలలో తగినంత ప్రభావవంతంగా కార్యక్రమాలు నిర్వహించ లేకపోతున్నామన్నారు. గీతాజ్యోతి అతి తక్కువ సమయంలోనే గ్రామాలలో ప్రజలలో ఎక్కువ ప్రభావం చూపించడం ఆనందకరంగా ఉందని, ఇంత ఉత్తేజకరమైన కార్యక్రమానికి తగిన ప్రచారం జరిగేటట్లు చూసే బాధ్యత డి.పి.పి. స్వీకరించవలసి ఉందన్నారు. వివిధ జిల్లాల గీతాజ్యోతి సమన్వయ కార్యకర్తలు తమ జిల్లాల్లో జరిగిన ప్రచార కార్యక్రమ నివేదికలను అందించారు. ఇంతవరకు కమలాపూర్, రాజోలు, జగిత్యాల, వనస్థలిపురం, రామాంతపూర్, పి.వి. పాలెం, వీరంకిలాకు, పటమట – 9 ధర్మక్షేత్రాలు జరిగాయి. తొమ్మిది క్షేత్రాలకుగాను అయిన ఖర్చు మొత్తం రూ. 1,46, 50,000లు కాగా సమాచారం అందుకున్న భక్తుల సంఖ్య 25,50,000మంది.

అనంతరం శ్రీస్వామివారు కార్యకర్తలందరికీ మంగళాశాసనాలు చేస్తూ గీతాజ్యోతిని మరొక ఏడాది పొడిగించు కుంటున్నామని, గీతాజ్యోతి శ్లోకమాలికతోపాటు, భగవద్గీతనుండి తయారు చేసిన **దైవీ సంపదకి సోపానాలు** పట్టిక – 1ని కూడా ఆచరణలోకి తెచ్చుకునేట్లు ప్రచారం చేయవలసి ఉంటుందన్నారు. భగవంతుని ఆజ్ఞతో మనమీ కార్యక్రమాన్ని పొడిగించుకొని మరింత సమర్థవంతంగా, వేగంగా ధర్మక్షేత్రాలను నిర్వహించుకుందామని మంగళాశాసనాలు చేసారు. అనంతరం తిరుమలలోని హాథీబాబా మఠాన్ని శ్రీస్వామివారు సందర్శించి వచ్చారు. సాయంత్రం బయలుదేరి తిరుచానూరు అమ్మవారిని దర్శించారు. అక్కడ అర్చకస్వామియైన శ్రీమాన్ కాండూరి శ్రీనివాసాచార్యులుగారి ప్రార్థనపై వారి గృహానికి వేంచేసి మంగళాశాసనం కావించారు. Ex. Income Tax Commissioner అయిన శ్రీమాన్





శ్రీనివాసులుగారి ఆహ్వానంపై రేణిగుంట వద్ద ఒక రామాలయాన్ని సందర్శించి జీర్ణోద్ధరణకి తగు సూచనలు చేసి రాత్రి 1 గం॥కి శ్రీరామాయణ తరంగిణి కార్యక్రమానికై చెన్నై వేంచేసారు.

**జంటనగరాలలో :-** శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి మంగళాశాసనములతో జంటనగరాల సమన్వయ కమిటీ మార్చి 16, ఆదివారం 2003న వార్షికోత్సవమును జరుపుకున్నది. శ్రీమాన్ పి. వెంకటేశ్వర్లుగారు (కాకతీయ సిమెంట్స్) శ్రీమతి జె. శ్రీకుమారిగారు, శ్రీమాన్ జె. రామేశ్వరరావుగారు ముఖ్య అతిథులుగా పాల్గొనిరి. సమన్వయ కమిటీ ప్రెసిడెంట్ శ్రీమాన్ కల్కిఅవతారంగారు సభను నడిపించారు.

**వివిధ వికాస తరంగిణి శాఖల రిపోర్టు :-**

**1. బోయినపల్లి :-** 30 మార్చిన, సాధారణ ఉచిత వైద్య శిబిరమును జరిపి 5000 శ్లోక మాలికలను పంచిరి.

**2. సరూర్ నగర్ :-** 53 వేల శ్లోకపత్రాలను పంచి, సాధారణ ఉచిత వైద్య శిబిరమును, ఉచిత నేత్ర వైద్య శిబిరమును ఏర్పాటుచేసిరి.

**3. దోమలగూడ :-** శ్రీమతి వీణా జనార్ధన్‌గారు "గీతాజ్యోతి" కార్యక్రమము గురించి గాంధీ నగర్‌లో ప్రచారంచేసిరి.

**4. కుకట్ పల్లి :-** సాధారణ ఉచిత వైద్య శిబిరము 60 పాఠశాలలలో 'గీతాజ్యోతి' కార్యక్రమ ప్రచారంనిర్వహించిరి.

**5. వనస్థలిపురం :-** 9, 10 మార్చి తేదీలలో 'కనుముక్కల' అనే గ్రామంలో 'గీతాజ్యోతి' ప్రచారమును నిర్వహించి 1000 కుటుంబాల వారికి గీతాజ్యోతి శ్లోకపత్రాలను అందించిరి. రెండు పాఠశాలలో చిత్రలేఖన పోటీలను గూడా నిర్వహించిరి.

**సేవా కార్యక్రమములు**

13 మార్చి నుండి 15 మార్చి వరకు శ్రీవేంకటేశ్వరస్వామివారి దేవాలయ సచివాల నగర్‌లో 72 గంటలు శ్రీవిష్ణు సహస్రనామ పారాయణ జరిగింది. ఈ సందర్భంలో అక్కడ జరుగుతున్న బ్రహ్మోత్సవ కార్యక్రమములో కార్యకర్తలు అత్యంత శ్రద్ధాసక్తులతో తమవంతు సేవలను అందించిరి.

**ధర్మక్షేత్ర కార్యక్రమమునకు సిద్ధపడుతున్నశాఖలు**

సంతోష్‌నగర్, మాసాబ్‌టాంక్, సికింద్రా బాద్, సరూర్ నగర శాఖలు "గీతాజ్యోతి" కార్యక్రమము గురించి వివిధ పాఠశాలలలో, చుట్టుప్రక్కల ప్రాంతాలలో చక్కటి ప్రచారమును అందిస్తూ ఉచిత వైద్యశిబిరములను, పశువైద్య శిబిరము లను నిర్వహిస్తూ "ధర్మక్షేత్ర" కార్యక్రమమునకై, శ్రీస్వామివారి రాకకై ఎదురు చూస్తున్నవి.

**వరంగల్ జిల్లా**

**నర్సంపేట :-** వరంగల్ జిల్లా నర్సంపేట ధర్మక్షేత్ర కేంద్రముగ 108 గ్రామాలలో 'గీతాజ్యోతి' ప్రచార కార్యక్రమం పూర్తి అయినది. చంద్రయ్యపల్లెలో ఉచిత దంత, నేత్ర, సాధారణ వైద్య శిబిరాలు నిర్వహించడం జరిగింది. 145 మంది గర్భిణీ స్త్రీలకు, పరీక్షలు జరిపి ఉచితమందులు,642 మంది పిల్లలకు దంత పరీక్షలు నిర్వహించి మందులు యివ్వడం జరిగింది. 120 మందికి కంటి పరీక్షలు చేసి ఉచిత మందులు పంపిణీ చేసారు. ఈ కార్యక్రమంలో డా॥ఎం. భరత్, డా॥ జె. ఉదయసింగ్ పాల్గొన్నారు. కోమకుంట్ల వీరేశలింగంగారు ఆర్థికసహాయం అందజేసారు.

ఈ కార్యక్రమం శ్రీఎం.వి. కృష్ణారావు ఆధ్వర్యవంలో నిర్వహించబడింది. 5 మండలాల లోని పాఠశాలలలో గీతాజ్యోతి 48 శ్లోకాలు పోటీలు నిర్వహించబడినాయి. ముఖ్య అతిథులుగా కె. రామకృష్ణయ్య, డా. ఎ. వనజ, సి. హెచ్. ఉషారాణి, నారాయణరెడ్డి గార్లు పాల్గొన్నారు.

**బొమ్మకల్లు** ః- వరంగల్ జిల్లా బొమ్మకల్లు ధర్మక్షేత్ర కేంద్రముగ ప్రచారం పూర్తైంది. ఒక వైపు కరువు తాండవిస్తున్నా ఇంటింటా శ్రీకృష్ణపూజా కార్యక్రమం, 48 శ్లోకాల పారాయణం, నగర సంకీర్తన కార్యక్రమాలు నిర్వహించారు. ధర్మక్షేత్ర కన్వీనర్ కె. ఇందిరాదేవిగారు, రజిత, సత్యనారాయణగారు పాల్గొన్నారు.

**తొర్రూర్** ః- వరంగల్ జిల్లా తొర్రూర్ ధర్మక్షేత్ర కేంద్రముగ 108 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచారం నిర్వహించుచున్నారు. భీష్మఏకాదశి పర్వదినాన స్థానిక శ్రీవేంకటేశ్వర ఆలయంలో శ్రీవిష్ణుసహస్రనామ పారాయణం 16వ తేదీన ఉచిత నేత్రవైద్య శిబిరంలో 650 మంది ప్రాథమిక పరీక్షలు జరిపినారు. 150 మందికి కాటరాక్ట్ ఉన్నట్లు గుర్తించి వారికి శరత్ లేజర్ కంటి ఆసుపత్రిలో ఉచితంగ శస్త్రచికిత్స చేసారు. ఆ కార్యక్రమం డా॥ శరత్‌కుమార్, డా॥ శ్రీమతి అన్నపూర్ణగార్లు తమ వైద్య బృందముతో సేవలను అందించారు. వికాసతరంగిణి ఛైర్‌పర్సన్ శ్రీమతి గీతారెడ్డిగార్లు, రాజేంద్రరెడ్డిగార్లు పాల్గొన్నారు.

### కరీంనగర్ జిల్లా

**సుల్తానాబాద్** ః- కరీంనగర్ జిల్లా సుల్తానాబాద్ ధర్మక్షేత్ర కేంద్రముగా 108 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం నిర్వహించడం జరిగింది. గ్రామగోష్టులు, మండల గోష్టులు ఏర్పాటుచేసి, స్కూలు పిల్లలకు చిత్రలేఖన శ్లోకమాలికలు కంఠస్థ పోటీలను నిర్వహించారు.

శ్రీ స్వామివారి తిరునక్షత్రోత్సవ సందర్భంగా శ్రీ వేణుగోపాలస్వామివారి దేవాలయం నందు అష్టోత్తర తనియ పూజాకార్యక్రమం నిర్వహించారు. ప్రభుత్వ టి.బి. ఆసుపత్రినందు బీదవృద్ధులకు పండ్లు, పాలు, రొట్టెలు పంచినారు. ఈ కార్యక్రమంలో ధర్మక్షేత్ర కన్వీనర్ ఎం. చంద్రశేఖర్ యితర ముఖ్య కార్యకర్తలు పాల్గొన్నారు.

**సిరిసిల్ల** ః- ఇక్కడి వికాసతరంగిణి శాఖవారు స్థానిక శ్రీ వేంకటేశ్వరఆలయంలో 9వ వార్షికోత్సవము జరుపుకొన్నారు. భీష్మఏకాదశి పర్వదినాన ఉదయం గం॥5.30 ని॥ నుండి సాయంత్రం 5-00 గం॥ల వరకు అఖండ శ్రీవిష్ణుసహస్ర నామ పారాయణం చేసారు. ఈ కార్యక్రమంలో ఎం. జగన్నాధాచార్యులు, ప్రభాకరరావు గార్లు యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

**సుల్తానాబాద్** ః- కరీంనగర్ జిల్లా సుల్తానాబాద్ ధర్మక్షేత్ర కేంద్రముగా గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం జరుగుచున్నది. శ్రీమతి వైదేహి గారి గృహంలో శనివారంరోజు విష్ణుసహస్రనామం, 48 శ్లోకాలు పారాయణం చేశారు. శ్రీమాన్ సాగి కాంతారావు, శ్రీ వేంకటేశ్వరరావు, రాజేశ్వరరావు గార్లు, ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు. జై శ్రీమన్నారాయణ నామాలతో 500 మంది పాదయాత్ర జరిపారు. పెద్దపల్లి మండలంలోని రాగినేడు గ్రామంలో శ్రీమాన్ బల్మూరు రామారావు గారు పశువైద్యశాలకు 20 వేల రూ॥లు విరాళం అందించారు.

### ఖమ్మం జిల్లా

**బొట్లకుంట** ః- ఖమ్మం జిల్లా బొట్లకుంట వికాసతరంగణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి





ప్రచార కార్యక్రమం విస్తృతంగా జరిగింది. ఖమ్మం ధర్మక్షేత్ర కేంద్రంగా ఏర్పడుతోంది. అప్పారావు, సుబ్బరాజు, సీతారామాచార్యులు, జె. బ్రహ్మయ్య ప్రచారాన్ని నిర్వహించుచున్నారు.

**భీమవరం** ః- ఖమ్మం జిల్లా భీమవరం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి శ్లోకమాలిక పఠన కార్యక్రమం జరుగుతోందని రాంబాబు, సీతమ్మగార్లు తెలిపారు.

**బేతుపల్లి** ః- ఖమ్మం జిల్లా బేతుపల్లి వికాస తరంగిణి శాఖ సత్తుపల్లి ధర్మక్షేత్ర కేంద్రముగ 60 గ్రామాలలో ప్రచార కార్యక్రమం పూర్తి చేసింది. ఈ కార్యక్రమాన్ని సత్యనారాయణ, సీతారామమ్మ, అననూయ తదితరులు నిర్వహిస్తున్నారు.

**నారాయణపురం** ః- ఖమ్మం జిల్లా నారాయణ పురం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో సాయనరావు పాలెం గ్రామంలో శ్రీరామాలయ ప్రాంగణంలో సత్తుపల్లి ధర్మక్షేత్ర కేంద్రముగా నిర్వహించుచున్న గీతాజ్యోతి ప్రచారం జరుగుతోంది. ఈ కార్యక్రమంలో వికాస తరంగిణి అధ్యక్షులు శ్రీమందపాటి కేశవరెడ్డి గార్లు, సామ్రాజ్యం, వరలక్ష్మిగార్లు యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

**భద్రాచలం** ః- భద్రాచలం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి ప్రచారం బాగ జరుగుచున్నది. 108 గోష్ఠి కమిటీలను ఏర్పాటు చేసి ప్రచారం నిర్వహించుచున్నారు. శ్రీమాన్ అల్లూరి సీతారామరాజుగారు, సౌమిత్రి కృష్ణమా చార్యులగారు ప్రచార నిర్వహణలో బాధ్యతను నిర్వహిస్తున్నారు.

### కృష్ణాజిల్లా

**కొత్తపేట** ః- విజయవాడ పట్టణ కొత్తపేట మరియు మల్లిఖార్జునపేట వికాసతరంగిణి శాఖలు, 21-2-2003న స్థానిక శ్రీరమాసమేత శ్రీసత్యనారాయణ స్వామివారి కోవెలలో ఉచిత హోమియో వైద్య శిబిరం జరిపాయి.

ప్రముఖ హోమియో వైద్యులు శ్రీమాన్ ఓ.వి.డి. ప్రసాద్‌గారు వందలాది రోగులను పరీక్షించి ఉచితంగా మందులు పంపిణీ చేసారు.

**జగ్గయ్యపేట** ః- కృష్ణాజిల్లా జగ్గయ్యపేట ధర్మక్షేత్ర కేంద్రముగా 108 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం పూర్తైంది. పశువైద్య, దంత, నేత్ర, సాధారణ వైద్య శిబిరములు జరిగాయి. సబ్‌జైలు ఖైదీలకు స్వీయ ఆరాధన సర్వఆదరణ, మాధవ సేవగా సర్వప్రాణి సేవ పై సందేశమును అందించినారు. ఖైదీలకు పండ్లు, స్వీట్లు, శ్లోకమాలిక పుస్తకములను అందించారు.

**వీరంకిలాకు** ః- 29-3-03 గీతాజ్యోతి ధర్మక్షేత్రం వీరంకిలాకు వారు గీతాజ్యోతి 48 శ్లోకాలపై విద్యార్థులకు 23-3-03న స్థానిక ఆర్యవైశ్య కళ్యాణమండపం నందు పోటీలు నిర్వహించినారు. విజేతలైన విద్యార్థిని విద్యార్థులకు 29-3-03 న శ్రీశ్రీశ్రీ స్వామి వారిచే బహుమతి ప్రదానం చేయబడింది. 6 మండలాలలో పాఠశాలల విద్యార్థిని, విద్యార్థులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**గుడివాడ** ః- కృష్ణాజిల్లా గుడివాడ ధర్మక్షేత్ర కేంద్రముగ 108 గ్రామాలలో మొదటివిడత ప్రచార కార్యక్రమం నిర్వహించబడినది. ఈ కార్యక్రమంలో భాగంగ 10-3-03 నందివాడ మండలంలోని తమిరిశ గ్రామంలో ఉచిత "మెగామెడికల్ క్యాంప్" నిర్వహించడం జరిగింది.

నందివాడ మండలంలో 24 గ్రామాలలోని ప్రజలకు గీతాజ్యోతి వైభవము గూర్చి మరొకసారి వివరించారు. ఈ ప్రచార కార్యక్రమానికి తత్త్వప్రచారకులైన కుమారి కల్పన, నీళాగార్లు పాల్గొన్నారు.

10మంది ప్రముఖ వైద్యులు 500 మంది రోగులకు వైద్య పరీక్షలు నిర్వహించి మందులను పంపిణీ చేయడం జరిగింది. షుమారు 20 వేల రూపాయల విలువగల మందులను పంపిణీ చేసారు. ఈ కార్యక్రమంలో మండల అధ్యక్షులు శ్రీమాన్ వెంకట కృష్ణారావుగారు, తమిరిశ గ్రామ సర్పంచి, మునసబ్‌గార్లు పాల్గొన్నారు.

18-3-03 లక్ష్మీ జయంతి సందర్భంగా 168 మహిళలచో లక్ష మల్లెలచే సహస్రార్చన జరిగింది. 300 మంది భక్తులు ఈ కార్యక్రమంలో పాల్నున్నారు.

**మల్లిఖార్జున పేట ః-** కృష్ణాజిల్లా, మల్లిఖార్జున పేట వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో కొత్తపేట శ్రీసత్యనారాయణ స్వామి దేవస్థానమునందు ఉచిత హోమియో వైద్యశిబిరంలో 140 మంది రోగులను పరీక్షలు నిర్వహించి ఉచితంగ మందులు అందించారు. డా॥ ఒ.వి.డి. ప్రసాద్‌గారు, వికాసతరంగిణి అధ్యక్షులు లంకపల్లి షణ్ముఖరావుగారు, భాస్కరరావు, నారాయణరావు, నాగరాజు, రేవతి, నారాయణరావు, ధర్మరాజు, నరేంద్రవర్మ పాల్గొన్నారు.

### అదిలాబాద్ జిల్లా

**ఖానాపూర్ ః-** అదిలాబాద్ జిల్లా, ఖానాపూర్ ధర్మక్షేత్ర కేంద్రముగా 50 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచారం జరుగుచున్నది. ప్రతిరోజు సామూహిక శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం, శ్రీకృష్ణపూజలు ఘనంగా నిర్వహించుచున్నారు. తత్వప్రచారకులైన శ్రీమాన్ శాంతారాంగారు దీన్ని నిర్వహించారు. వికాస తరంగిణి కార్యదర్శి శ్రీ వేంకటరమణా చార్యులు, డి. విజయకుమార్ గారు, తుకారాం, దేవేందర్, రాము, వేంకటేష్, సుమలత, పద్మ, వాణి, నారాయణ యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

**చెన్నూరు ః-** అదిలాబాద్ జిల్లా చెన్నూరు ధర్మక్షేత్ర కేంద్రముగ 108 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచారం జరిగింది. ముక్కోటి ఏకాదశి పర్వదినాన స్థానిక జగన్నాధస్వామివారి దేవస్థానమునందు లక్షదీపారాధన పూజలు, గోదారంగనాధుల కళ్యాణం, భీష్మఏకాదశి సందర్భంగా శ్రీవిష్ణుసహస్రవిరాట్ పారాయణం జరిపారు. ఈ కార్యక్రమంలో వానమామలై రవీంద్రచారిగారు, డా॥ ఆర్. తాయారమ్మగారు, వి. నందకుమార్ గార్లు పాల్గొన్నారు.

### చిత్తూరు జిల్లా

**ఎం. కొత్తూరు ః-** చిత్తూరు జిల్లా ఎం.కొత్తూరు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో రధసప్తమి సందర్భముగ "శ్రీవారి కళ్యాణమహోత్సవము" సామూహిక దంపతులచే నిర్వహించబడినది. శ్రీపట్టాభి రామస్వామి వారి దేవస్థానమునందు భీష్మఏకాదశి పర్వదినం వైభవంగ నిర్వహించు కొన్నారు. వికాసతరంగణి అధ్యక్షులుకుప్పు స్వామి నాయుడు ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు.

**తిరుపతి ః-** చిత్తూరు జిల్లా తిరుపతి వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యంలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం విస్తృతంగా జరుగుతున్నది. జిల్లాలో ప్రచార నిమిత్తం శ్రీవారు పంపిన ధర్మరధమునకు తత్త్వశాస్త్రప్రచారకులు శ్రీమాన్ శాంతారాం, జిల్లా కన్వీనర్ శ్రీమాన్ నాగేంద్ర సాయి, ప్రచార నిర్వహణ బాధ్యతను స్వయంగా నిర్వహిస్తున్నారు. ప్రతిగ్రామంలో గీతాజ్యోతి రథానికి గ్రామప్రజలు అధికసంఖ్యలో తరలివచ్చి జై శ్రీమన్నారాయణ..!, కృష్ణంవందే జగద్గురుమ్, భజనతో ఘనంగ స్వాగతం పలికారు. మానవసేవగ-సర్వప్రాణిసేవ, స్వీయారాధన - సర్వఆదరణ ఆశయాలతో ప్రచారం జరుగుతోంది.

నవజీవన్ నేత్రవైద్యశాలలో అంధ విద్యార్థులకు విని నేర్చుకోవడానికి క్యాసేట్స్ శ్రీ





నాగేంద్రసాయిగారు బహుకరించారు. ఈ వైద్యశాల సహకారంతో వైద్యశిబిరాలు ఏర్పాటు చేయడానికి సన్నాహాలు జరుగుచున్నవి. టి.టి.డి వారు యాత్రికులకొరకు నిర్వహించిన 25 పోలియో నివారణ కేంద్రాలలో తిరుపతి ధర్మక్షేత్రకార్యకర్తలు తమ సేవలను అందించారు.

పుత్తూరులో శ్రీమాన్ ఏళుమలై మహాయంతో అనేక హరిజన, గిరిజన వాడలలో గీతాజ్యోతి ప్రచారం నిర్వహించారు. శ్రీమాన్ డా॥రామయ్య గారి ఆధ్వర్యంలో తిరుపతి హరిజనవాడలలో ప్రచారం జరుగుచున్నది.

రాజాపాలెం గ్రామంలో పుత్తూరు శల్యవైద్యులు శ్రీమాన్ ఎస్.వి.రాజాగారు. గీతాజ్యోతి ప్రచార బాధ్యతను నిర్వహిస్తున్నారు. పుత్తూరు పట్టణంలో డా॥ సత్యనారాయణ, ప్రసాద్‌గారు, శ్రీతోట రామచంద్రయ్య చురుకైన పాత్రను పోషిస్తున్నారు. చంద్రగిరిలో మళయాళ సమాజంవారు గీతాజ్యోతి ప్రచారం నిర్వహిస్తున్నారు.

### గుంటూరు జిల్లా

**పొన్నూరు ః-** గుంటూరు జిల్లా పొన్నూరు వికాసతరంగిణి శాఖ గ్రామాలలో "ఎయిడ్స్" పై అవగాహన సదస్సు జరిపారు. ఎయిడ్స్ రోగిపట్ల కుటుంబసభ్యులు సమాజం చిన్నచూపు చూడకుండ ఆదరించడంవలన రోగి ఎక్కువ కాలం జీవించే అవకాశం కల్పించవచ్చు నన్నారు. ముఖ్యంగా యువకులు ఈ వ్యాధిబారి పడకుండ జాగ్రత్త వహించాలన్నారు. ఈ కార్యక్రమంలో వికాస తరంగిణి అధ్యక్షులు పి.వి.ఆర్. అప్పారావు, వీరయ్యచౌదరి, వేదాంతం కోదండ రామాచార్యులు, శ్రీనివాస రావుగార్లు పాల్గొన్నారు.

**పుల్లడిగుంట ః-** గుంటూరు జిల్లా పుల్లడిగుంట ధర్మక్షేత్ర కేంద్రముగ 108 గ్రామాలలో ప్రచారం పూర్తైంది. కొన్ని గ్రామాలలో పాఠశాల విద్యార్థులకు గీతాజ్యోతి శ్లోకాల పోటీలను నిర్వహించారు. శ్రీమాన్ రామపిచ్చయ్యగారు విజేతలకు బహుమతులందించారు. 22-2-03 పల్లపాడు గ్రామంలో ఉచిత పశువైద్య శిబిరం జరిగింది. ముఖ్యఅతిథిగ శ్రీమాన్ మల్లిఖార్జున రావుగారు విచ్చేసారు. ప్రస్తుత కరువు పరిస్థితులలో పశువులకు ఉచిత పశుగ్రాసం ఏర్పాటు చేస్తామని పశువైద్యశాఖాధికారి శ్రీదుర్గా ప్రసాదరావుగారు చెప్పారు. ఈ కార్యక్రమంలో డా॥. చంద్రశేఖర్ రావు, డా॥ సారధిగార్లు, డా॥ విఠల్‌గార్లు అనేకమంది ప్రముఖులు పాల్గొన్నారు. అతిథులకు ధర్మక్షేత్ర కన్వీనర్ శ్రీమతి లలితకుమారిగారు మెమెంటోలను అందించినారు.

**తెనాలి ః-** గుంటూరు జిల్లా మోదుకూరు గ్రామంలో శ్రీస్వామివారి మంగళా శాసనములతో జీయర్ హ్యూమానిటీస్ తెనాలి వారి ఆధ్వర్యంలో "జీయర్ ఉచిత పశువైద్య శిబిరం" 16-3-03న స్థానిక ఎలిమెంటరీ స్కూలో జరిగింది. సెక్రటరీ శాఖమూరు కిషోర్‌గారు ముఖ్యులు పాల్గొన్నారు.

**వినుకొండ ః-** గుంటూరు జిల్లా వినుకొండ ధర్మక్షేత్ర కేంద్రముగ 113 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచారం నిర్వహించినారు.

7 దంత, నేత్ర, సాధారణ వైద్య శిబిరములను నిర్వహించబడినది. 105 కుటుంబాలకు బియ్యం, దుప్పట్లు పంపిణీ చేసినారు. పాఠశాల విద్యార్థులకు పేస్టులు, బ్రష్‌లు, పెన్నులు ఉచితంగా పంపిణీ చేసారు. ఈ కార్యక్రమంలో ధర్మక్షేత్ర కన్వీనర్ బి. మల్లిక, ప్రసాదరావుగార్లు పాల్గొన్నారు. తత్త్వ ప్రచారకులు కుమరి కల్పనగార్లు ప్రచార బాధ్యతను నిర్వహించినారు.

### నడిగడ్డపాలెం ఆశ్రమంలో

అర్చమూర్తులుగా వేంచేసియున్న శ్రీలక్ష్మీనారాయణ, శ్రీకోదండరామ చంద్ర స్వామివార్ల బ్రహ్మోత్సవములతోపాటు రాజ్యలక్ష్మి తయార్లకు లక్షమల్లెపుష్పార్చనతో శ్రీలక్ష్మీ నారాయణయాగాన్ని ప్రతి సంవత్సరం జరుగుతున్నట్లుగా శ్రీశ్రీశ్రీ చిన్న జీయరుస్వామి వారి దివ్య మంగళాశాసనములతో తేది. 11-3-2003 సాయంత్రం అంకురారోపణ కావించినారు.

12వ తేది నుండి 18వ తేదీవరకు అత్యంత వైభవముగా జరిగినవి ప్రతిరోజు ప్రాభోదిక గోష్ఠి అనంతరం శాంతిపాఠంతో యాగం ప్రారంభమై పెరుమాళ్ళకు తాయార్లకు తిరుమంజనము, సమష్టి మల్లెపుష్పార్చన, ఋగ్, మైత్రాయణీ, తైత్తిరీయ యజుర్వేదములు, రామాయణ, దివ్య ప్రబంధాది పారాయణలు, అష్టాక్షరి, శ్రీలక్ష్మీ మూలమంత్ర జపములు, సాయంత్రం సమిష్టి ఇష్టి, సహస్రనామ స్తోత్ర పారాయణ, తాయార్లకు పెరుమాళ్ళకు విశేష అలంకరణలతో సహస్ర దీపార్చనతో ఊంజలి సేవ విశేషంగా జరిగినవి. ప్రతిరోజు రాత్రి విశేష వాహనములపై తిరువీథి వైభముగా జరిగినవి ఒక హంసవాహనము తప్ప అన్ని సొంత వాహనములపై స్వామి తిరువీథి నిర్వహించటమైనది. అవి వరుసగా 12వ తేది శేషవాహనసేవ (శ్రీమాన్ ఎర్రబల్లి దామోదరరావు, సరస్వతమ్మ హైదరాబాద్), 13వ తేది గజవాహన సేవ (శ్రీమాన్ గండవరపు లక్ష్మీనారాయణరెడ్డి, ఇందిరమ్మ నెల్లూరు), 14వ తేది హంసవాహన సేవ (కైంకర్యం జరుగవలెను). 15వ తేది హనుమంత సేవ (ఆశ్రమ భక్తులు), 16వ తేది గరుడసేవ (ప్రత్యకుండి భక్తులు సమర్పించిరి), 17వ తేది అశ్వవాహన సేవ (శ్రీమాన్ సూరెడ్డి సూర్యమోహనరావు తెనాలి), 18వ తేది రథోత్సవము.

గత సంవత్సరములాగానే ఈ సం॥కూడా ప్రత్యేక 'ఇష్టి' కార్యక్రమాలను నిర్వహించటమైనది. 12న వైనతేయ ఇష్టి, 13న సుదర్శన ఇష్టి, 14న లక్ష్మీనారాయణ ఇష్టి, 15న హయగ్రీవ ఇష్టి, 16న విష్వక్సేన ఇష్టి, తిరిగి 17న సుదర్శన ఇష్టి నిర్వహించిరి, 17న మధ్యాహ్నం శ్రీకోదండరామ చంద్రప్రభువుకు కళ్యాణము, 18న తాయార్ల తిరునక్షత్ర సందర్భముగా శ్రీలక్ష్మీనారాయణ కళ్యాణము వైభవముగా జరిగినది. రాత్రి ధ్వజారోహణ, ద్వాదశార్చన, శ్రీపుష్పయాగంతో కార్యక్రమములు వైభవంగా జరిగినవి. శ్రీ జీయరుస్వామివారు ఆస్ట్రేలియా పర్యటనలో ఉండటంచే వారి దివ్య మంగళాశాసనములతో మన జగ్గయ్యపేట ఆగమ అధ్యాపకులు శ్రీమాన్ యుగంధరా చార్యులుగారి ఆధ్వర్యవంలో పై కార్యక్రమములు చక్కగా జరిగినవి. మన వేద అధ్యాపకులు, శ్రీమాన్ ముండుంబై శ్రీకాంత్ ఆచార్యులు, శ్రీమాన్ దరూరి రాజగోపాలాచార్యులు, శ్రీమాన్ హనుమాన్ ఆచార్యులు మరియు దివ్యప్రబంధ అధ్యాపకులు శ్రీమాన్ మారుతీ స్వామిగారు, శ్రీమాన్ వేంకటేశ్ స్వామిగారు తదితరులు పాల్గొన్నారు. 16వ తేదీన అష్టాక్షరీ పీఠాధిపతులు పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి సంపత్కుమార రామానుజ జీయరుస్వామివారు సాయంత్రం వేంచేసి పెరుమాళ్ళ, భక్తులకు మంగళాశాసనములు అనుగ్రహిస్తూ మన జీయరుస్వామి మనచే అచరింపజేస్తున్న గీతాజ్యోతి కార్యక్రమాన్ని దాని వైభవాన్ని, మన కర్తవ్యాన్ని గుర్తుచేసారు. హైదరాబాద్ వాస్తవ్యులు సమర్పించిన శ్రీరామచంద్రప్రభువుకు రజిత మకరతోరణాన్ని ఆవిష్కరించి, పెరుమాళ్ళకు మంగళాశాసనము సమర్పించిరి.

### తూర్పుగోదావరి జిల్లా

**గోకవరం :-** తూర్పుగోదావరి జిల్లా గోకవరం





ధర్మక్షేత్రం 108 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం తత్వప్రచారకులైన శ్రీకుమార రాజాగారిద్వారా జరుగుతోంది.

**రామచంద్రపురం :-** తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో గీతాజయంతి రోజున శ్రీకృష్ణ పూజలు నిర్వహించారు. గీతాజయంతి ముక్కోటి ఏకాదశి రోజున భగవద్గీత 18 అధ్యాయములు పారాయణం చేయడం జరిగింది. భీష్మఏకాదశి రోజున స్థానిక రామాలయంలో శ్రీవిష్ణు సహస్ర నామ పారాయణం చేసారు. ఈ కార్యక్రమంలో బి.వి.రత్నావతి, అలివేలుమంగగార్లు పాల్గొన్నారు.

### విశాఖపట్నం జిల్లా

**అనకాపల్లి :-** విశాఖపట్నం జిల్లా అనకాపల్లి వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో గవరపాలెంలో అన్ని వికాసతరంగిణి శాఖలు కలిసి శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం చేసినారు. శంకరం గ్రామంలో పాఠశాల విద్యార్థులకు "చికెన్‌పాక్స్'. వ్యాధిరాకుండ హోమియో వైద్యం నిర్వహించినారు. ఈ కార్యక్రమంలో డా॥ నాగరాజు కుమార్‌గారు తోడ్పడ్డారు. విద్యార్థుల చేత గీతాజ్యోతి శ్లోకాలను పఠింపచేసారు.

**మాడుగుల :-** విశాఖపట్నం జిల్లా మాడుగుల ధర్మక్షేత్రం కేంద్రముగ 9 ప్రభుత్వ మరియు ప్రైవేట్ పాఠశాలలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం తత్వప్రచారకులైన శ్రీమాన్ రఘు నాథాచార్యులుగారు నిర్వహిస్తున్నారు.

**చోడవరం :-** విశాఖపట్నం జిల్లా చోడవరం వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యంలో భీష్మ ఏకాదశి పర్వదినాన 200 మంది శ్రీవిష్ణుసహస్రనామ పారాయణం చేసారు. వికాసతరంగిణి వార్షికోత్సవ సందర్భంగా "ముకుందమాల" మండల దీక్షా కార్యక్రమం నిర్వహించారు.

**విశాఖపట్నం :-** విశాఖపట్నం ధర్మక్షేత్ర కేంద్రముగ విశాఖపట్నం, మద్రిపాలెం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో 35 కాలనీలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమ నిర్వహించబడినది. అనకాపల్లి, గాజువాక ప్రాంతాలలో 15 వేలు గీతాజ్యోతి కరపత్రాలను పంచడం జరిగింది. 3 కాలేజీల పాఠశాల విద్యార్థులను కార్యక్రమంలో భాగస్వామ్యము లుగా చేసారు. శ్రీమాన్ పీతాంబరం రఘు నాథాచార్యులుగారుకూడా ప్రచారం చూస్తారు.

### మహబూబ్ నగర్ జిల్లా

**వనపర్తి :-** మహబూబ్‌నగర్ జిల్లా వనపర్తి ధర్మక్షేత్ర కేంద్రముగ 108 గ్రామాలలో ప్రచారకార్యక్రమం పూర్తైంది. ఈ కార్యక్రమంలో భాగంగ 15-3-03 నాగార్జున విశ్వవి ద్యాలయం, మరియు సి.వి. రామన్ పాఠశాల విద్యార్థులకు ఉచిత దంత వైద్య శిబిరం నిర్వహించారు. 800 మందికి పరీక్షలు నిర్వహించి ఉచిత మందులు పంపిణీ చేయడమైనది. ఈ కార్యక్రమంలో దంతవైద్య నిర్వాహకులు శ్రీమాన్ మల్లిఖార్జునగారు, జా॥ శ్రీనివాసచౌదరిగారు, డా॥ విశ్వేశ్వరరెడ్డి గార్లు పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో గౌరవ అధ్యక్షులు శ్రీ ఎస్. సుబ్బారెడ్డి, ముఖ్య అతిథిగా శ్రీ చంద్రమోహన్ గారు ఆర్.డి.ఓ. శ్రీ వెంకటరెడ్డిగార్లు, వి. కురుమూర్తిగార్లు పాల్గొన్నారు.

### ప్రకాశం జిల్లా

**మార్కాపురం :-** ప్రకాశం జిల్లా మార్కాపురం శ్రీలక్ష్మీ చెన్నకేశ్వరస్వామి వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో మహిళా దినోత్సవం సందర్భంగా గవర్నమెంటు ఆసుపత్రిలో రోగులకు ఉచితంగా రొట్టెలు, పండ్లు పంపిణీచేశారు. ఈ కార్యక్రమంలో వికాస తరంగిణి చైర్‌పర్సన్ కె.

వెంకటలక్ష్మీదేవి, ఇతర వికాసతరంగిణి కార్యకర్తలు పాల్గొన్నారు.

**నెల్లూరు జిల్లా**

**చవటపాలెం** :- నెల్లూరు జిల్లా చవటపాలెం ధర్మక్షేత్రకేంద్రముగ 53 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచారకార్యక్రమం నిర్వహించడం జరిగింది. నెల్లూరు వికాసతరంగిణి శ్రీహనుమాన్ స్వామి వారు తగుసూచనలు యిస్తూ ప్రచారం నిర్వహిస్తున్నారు. శ్రీమాన్ వెంకటాచలంగారు, స్వర్ణలతగారు తదితరులు పాల్గొన్నారు.

**ఇసుకపాలెం** :- నెల్లూరు జిల్లా చవటపాలెం ధర్మక్షేత్రం ప్రచారంలో భాగంగా ఇసుకపాలెం గ్రామంలో 22-3-03న పశువైద్య శిబిరం నిర్వహించబడినది. మొత్తం 473 పశువులకు పరీక్షలు నిర్వహించారు. వీటిలో 59 పశువులు చూడి పరీక్షలు నిర్వహించారు. ఈ కార్యక్రమంలో 24 మంది పశువైద్య నిపుణులు యితర సిబ్బంది పాల్గొన్నారు. శ్రీమాన్ శ్రీనివాసులురెడ్డి ఆధ్వర్యవంలో సాగింది.

**కర్నూలు జిల్లా**

**డోన్** :- కర్నూలు జిల్లా డోన్ ధర్మక్షేత్ర కేంద్రముగా గీతాజ్యోతి ప్రచారం ముమ్మరంగా జరుగుచున్నది. 28-2-03 తేదీన శ్రీవేంకటేశ్వర దేవస్థానమునందు జరిగిన లక్ష్మీపూజల్లో 200 మంది మహిళలు భాగంపంచుకొన్నారు. ఉచితంగా పూజా ద్రవ్యములు వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీపాతాళం సుబ్బారావుగారు, విజయలక్ష్మీగార్లు అందించారు.

**మద్రాసు** :- చెన్నై వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో గీతాజ్యోతి ప్రచారం విస్తృతంగా జరుగుచున్నది. త్యాగరాయనగర్ ప్రాంతములో 300 మంది కుటుంబాలవారికి గీతాజ్యోతి వైభవమును గూర్చి వివరించడం జరిగింది. తిరంవత్తియూరు ప్రాంతములో 3,750 మంది భక్తులకు, తులసి కుండీలు, గీతాజ్యోతి శ్లోకాలను అందించారు.

9-3-03 మాట్టుమందలో ఉచిత పశువైద్య శిబిరం నిర్వహించ బడినది. 4000 పసువులకు పరీక్షలు నిర్వహించారు. చెన్నై ప్రభుత్వకళాశాల డాక్టర్‌గా పనిచేస్తున్న వి. వెంకటరామానుజం, ఎన్.ఆర్. సందీప్ కుమార్ మరియు 15మంది కళాశాల విద్యార్థులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

రాయపురం ప్రాంతంలో శ్రీమాధవన్ స్వామివారిచే భక్తులకు తులసికుండీలు, గీతాజ్యోతి శ్లోకమాలికలు పంపిణీ చేయడం జరిగింది.

రాయపేట ప్రాంతంలో శ్రీ వేంకటేశ్వర పెరుమాళ్ కోవెలలో రోజూ సాయంత్రం 6 గం॥కు గీతాజ్యోతి శ్లోకమాలికల అర్థసహిత ముగా వివరిస్తున్నారు.

నుంగంబాకం ప్రాంతంలో శ్రీ వేంకటేశ్వర ప్రాథమిక తెలుగు పాఠశాలలో బాలబాలికలకు గీతాజ్యోతిలోని శ్లోకమాలికలు అర్థసహితముగ నేర్పించుచున్నారు. వీరికి సీతారామఫోటోలు, తులసి కుండీలు పంపిణీ చేసారు.

**నిజామాబాద్ జిల్లా**

**నిజామాబాద్** :- నిజామాబాద్ ధర్మక్షేత్ర కేంద్రముగా వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో చంద్రశేఖర్ కాలనీలో జరిగిన ఉచిత నేత్ర దంత, సాధారణ వైద్యశిబిరములో ఎందరో రోగులను పరీక్షించారు. ఈ కార్యక్రమంలో నేత్రవైద్య నిపుణులు డా॥ ముత్తన్న, చర్మవైద్యనిపుణులు డా॥విద్యానగర్, డా॥ అరుణ కుర్దూకర్, డా॥ శ్రీధర్, డా॥ నితిన్ కుమార్లు గార్లు పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి అధ్యక్షులు గంపశ్రీనివాస్, సెక్రటరీ జి. లక్ష్మీరెడ్డిగార్లు పాల్గొన్నారు.





**విజయనగరం జిల్లా**

**విజయనగరం** :- విజయనగరం ధర్మక్షేత్ర కేంద్రముగా 108 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం పూర్తిచేసారు. జనవరి 29వ తేదిన కలవచర్ల ధర్మక్షేత్రము నందు ప్రచార కార్యక్రమములు నిర్వహించారు. కార్యక్రమంలో భాగంగ లక్ష్మీపూజలు, గీతాజ్యోతి లక్ష్యాలను వివరించడం జరిగింది.

రథసప్తమి రోజున ఆదిత్య హృదయ పారాయణము సామూహికంగా ప్రతి గీతాజ్యోతి గోష్టిలో జరిగింది.

టి. శ్రీనివాసరామానుజంగారు శ్రీవిష్ణు సహస్రనామపారాయణం కార్యక్రమం విజయవంతంగ జరిపించారు. నేత్ర విద్యాలయ విద్యార్థులు కూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. వికాసతరంగిణి అధ్యక్షురాలైన పి. లక్ష్మీగారు నిర్వహణ బాధ్యతలను చేపట్టారు.

**హనుమాన్‌పల్లి** :- ఒరిస్సారాష్ట్రంలోని హనుమాన్ పల్లి ధర్మక్షేత్రకేంద్రముగ 117 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచారం నిర్వహించారు.

27 గ్రామ పంచాయతీ పాఠశాలలలో విద్యార్థులకు గీతాజ్యోతి శ్లోకమాలికల పోటీలను 8-12-2002న నిర్వహించడం జరిగింది. ఏప్రిల్ నెలలో పశువైద్య శిబిరములు జరుగు చున్నాయి. ధర్మక్షేత్ర కన్వీనర్ శ్రీమాన్ పి.వి. రమణారావుగార్ల ఆధ్వర్యంలో కార్యక్రమాలు నిర్వహించారు.



**పరమపద వార్త**

మన పెద్దజీయరుస్వామివారి శిష్యులు. మానికొండ వాస్తవ్యురాలు శ్రీమతి దామెర వెంకట సత్య విద్యుల్లత గారు ది. 23-2-2003న ఆచార్యతిరువడి నలంకరించినారు.

వీరికి శ్రియఃపతి సన్నిధిలో సేవాభాగ్యం లభించాలని ఆశిస్తూ..

-భక్తినివేదన

**పరమపదవార్త**

శ్రీమతి మద్ది సరస్వతిగారు (మందసా గ్రామం) తేది : 2-12-2002న పరమపదించినారు. వీరు శ్రీమాన్ MRK. ప్రసాద్ (BAAKS సంఘం. మెంబరు)గారి మాతృశ్రీ. వీరి స్మృతి చిహ్నముగా భక్తినివేదన పత్రికకు ప్రోత్సాహక కైంకర్యమును సమర్పించినారు.

-భక్తినివేదన

జై శ్రీమన్నారాయణ..! జై శ్రీమన్నారాయణ..!

## విషయ సూచిక



## పంచాంగ వివరాలు

### మే

6 ఎంబెరుమానార్ తిరు॥ శంకరజయంతి.
11 కృత్తిక కార్తె రా. 12-00
12 సర్వేషామేకాదశి
14 తిథిద్వయం
15 వృషభ సం॥ ఉ॥ 11-8, శ్రీవైష్ణవ శ్రీనృసింహ జయంతి సింహాచలం యాదగిరి మొదలగు క్షేత్రములలో జయంతిఉత్సవం
25 రోహిణి కా॥ రా॥9-26, హనుమజ్జయంతి.
26 సర్వేషామేకాదశి
29 వాస్తుకర్తరీ త్యాగం, మాసశివరాత్రి
30 సర్వేషాం అమావాస్య

### జూన్

2 బౌద్ధ కల్కిజయంతి
8 మృగశిర కార్తె రా॥ 9-19
10 శ్రీవైష్ణవానామేకాదశి, కూర్మజయంతి అళహసింగర్ తిరు॥
12 నమ్మాళ్వార్ తిరు॥

### ముఖచిత్రపరిచయం

గుజరాత్‌లో భూకంపం వచ్చిన సమయంలో శ్రీవారు అచటి పరిస్థితులు సమీక్షించి ఆ ప్రదేశంలో ఒక గ్రామంలో నూతనంగా గృహములు నిర్మించి సమర్పించారు.

- వార్త 41వ పేజీలో....

మద్రాసులో శ్రీరామనవమి సందర్భంగా శ్రీరామపట్టాభిషేక సమయంలో శ్రీవారు సందేశాన్ని భక్తులకు అనుగ్రహించారు.

మీ సేవలో....


**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, (08645) 272929,
చందా: సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-,
విదేశాలకు సంవత్సరచందా $ 25,
E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org
D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం,






శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాస పత్రిక


స్వభాను నామ సంవత్సరం వైశాఖ మాసము

**సంపుటి 56** **2003 మే** **సంచిక 2**



వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు :

శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. **శ్రీరామచంద్రాచార్యులు**

సంపాదకీయం

# సుమిత్రానందవర్ధనః ..



లోకంలో కొరగాని పుట్టువు కలవారు కొల్లలు. కొందరు తాము పుట్టి లోకుల నేడిపిస్తారు. కొందరు తమ పుట్టువుకు తామే ఏడుస్తారు. తమ పుట్టువువల్ల తామానందిస్తూ ఒరులనూ ఆనందింపచేసేవారు అరుదు. పరులతో ఆగక పరాత్పరునీ ఆనందింపచేసేవారు మరీ అరుదు.

అట్లాంటి అరిది పుట్టువు కలవాడు లక్ష్మణ స్వామి.

### లక్ష్మణస్వామి పరమ యోగి

**'బాల్యాత్ప్రభృతి సుస్నిగ్ధః'** - అంటారు వాల్మీకులు. అంతేనా, ఆ స్నేహంవల్లనే ఆయన వినయ సంపన్నుడట! ఏమిటా వినయం? శేషత్వ జ్ఞానమే వినయం. రామ కైంకర్య రూపాచారం వినయం. కనుకనే కైంకర్య హేతువై నిలిచింది ఈ వినయం ఆయనలో.

నెరసులులేని దొసగులులేని కైంకర్యం ఆయన పొందిన పెన్నిధి. అదే ఆయన సంపద, లక్ష్మీ కనుకనే కైంకర్య లక్ష్మీసంపన్నుడు కనుకనే 'లక్ష్మణుడ'న్నారుట వసిష్ఠులవారు.

స్వామిని తాము ప్రేమించవచ్చు. కానీ, స్వామి ప్రేమకు తాము పాత్రులవటం మాటలుకాదు.

అట్లా స్వామి రామ ప్రభువు ప్రేమకు తానే ఏకతానముగా నిలచినాడు లక్ష్మణస్వామి. **'దయితో భ్రాతుః'** అంటారు వాల్మీకులు. రామస్య ఇష్టతమః. - **యమేవ ఏష వృణుతే తేన లభ్యః** అన్న శ్రుతి శిరః పారిజాతం పరీమళించిన నందనం ఇది. రామలక్ష్మణుల సౌభ్రాత్ర వల్లికలు అన్యోన్య మల్లుకొన్న నందనారామం ఇది. అసదృశమే కాదు అద్భుతమూను ఇది! **'తం తు దేశం న పశ్యామి'** అని ఊరకే విలపించేడా స్వామి? **"భ్రాతా భర్తా చ బంధుశ్చ పితా చ మమ రాఘవః"** అని ఉబుసు పోకన్నాడా లక్ష్మణస్వామి?

సర్వదా సర్వథా రామానుగమనమే లక్ష్మణస్వామికి స్వరూపం. ఈ అనుగమనాన్ని చూచి ఎంత మురిసిపోతారో వాల్మీకులు! **'తం వ్రజంతం ప్రియో భ్రాతా లక్ష్మణోऽనుజగామ హ'** అని. **ధనుష్పాణిర్లక్ష్మణోऽనుజగామ హ"** అని కేవలానుగమనం కాదు లక్ష్మణస్వామి కావించేది మరి సకలవిధ కైంకర్య సమర్పణం.

అన్నగారుగా పరిచరించేడు. భగవంతుడని సేవించేడు. ఆయన గుణాలకు మోహపడి దాసుడయినాడు.

కైంకర్యం వైధమేకాక భోగ్యమూ అయిందా యనకు. తమ్ముడు సమర్పించేవన్నీ **'భోగ్యాలే'.** అన్నగారికీ అన్నీ **'భోగ్యాలే'.** ఈ **'భోగ్యతానుబంధం'** అనన్య సాధ్యం. నిసర్గ సిద్ధం. భోగ్యం గానూ కైంకర్యాన్ని సమర్పిస్తున్నాడు కనుకనే **"రమమాణా వనే త్రయః"** అంటారు వాల్మీకులు.

ఇంతటి యోగ్యత లక్ష్మణస్వామికి ఎట్లా లభించింది?

వాల్మీకులకు గోచరిస్తుంది దీనికి కారణం! **'న చ తేన వినా నిద్రాం లభతే పురుషోత్తమః'**

రామ ప్రభువుకు పక్కగా సౌమిత్రి లేకపోతే నిద్రపట్టదట! ఎట్లా పడుతుంది? సెజ్జలేక పవళింపు ఎట్లా? ఆయన శేషుడు. నివాస శయ్యాసన ప్రభృతి వివిధ శరీర భేదాలతో స్వామికి సకల విధ కైంకర్యములలో తానుపయోగ పడేవాడు.





లక్ష్మణస్వామి లేకపోతే ఇనకులేశునికి ఇష్టమృష్టాన్నాలూ ఇంపుకావు. నోట పెట్టడు. చేత ముట్టడు. స్వామికి కుడి చేయి ఆయన. **'రామస్య దక్షిణో బాహుః'.** కుడిచేయి, కూడా లేకపోతే అభ్యవహారం అందేది ఎట్లా?

ఈ తత్త్వమెరిగిన తల్లి సుమిత్ర. **'సృష్టస్త్వం వనవాసాయ'** అంటుంది. వనవాసం కోసం కాదు, **'వనవాసుని'** కోసం **'నారాయణుని'** కోసం నువ్వు ఇలకు ఇక్ష్వాకు కులానికి వచ్చేవు సుమా అంటుంది. ఆయన పుట్టువు చరితార్థం కావటం ఆమెకు ఆనందదాయకం. అందుకే ఆయనను వాల్మీకులు సైతం సుమిత్రానంద వర్ధనులుగా దర్శించేరు.

రామచంద్రుడు లక్ష్మణస్వామిని చూచి నప్పుడల్లా **'వీని తల్లిగా సుమిత్ర ధన్యురాలు'** అనుకొంటాడు. **'సుమిత్రా యేన సుప్రజాః'** సౌమిత్రీ అని తమ్ముణ్ణి పిలుచుకొంటూ ఎంత మురిసిపోతాడో రామచంద్రప్రభువు.

రామలక్ష్మణుల కల రూపు నెరిగిన లలన సుమిత్ర. **'స్వనురక్త స్సుహృజ్జనే'** అని ఇరువురి తత్త్వాన్ని రసగుళికకావించి యిస్తుంది. తన ఎద కొలన విరిసిన అరవిందాన తేనలాను తుమ్మెదను మన కనుల నిలుపుతుంది.

### ఆయన సుహృజ్జనుడు

ఈయన ఆయనకు అనురక్తుడు. అనురక్తుడు మట్టుకేకాదు **'స్వనురక్తుడు'.**

సుహృజ్జనుడంటే?

సుహృత్తయిన జనుడా? కావచ్చు. కాని, కాదు. మరి? సుహృత్ - జనానాం. జనసుహృత్తు అని కాక సుహృజ్జనుడు. అని. సుహృదం సర్వభూతానాం. సర్వభూత సుహృత్తు ఆయనే. ఆయనను గురించి తెలిసి, ప్రీతితో శరణాగతుడై, కైంకర్య సమర్పణం కావించే ఈయన స్వనురక్తుడు.

అందుకే ఈయనంటే ఆమెకేకాదు ఆయనకూ ఎంతో ఇష్టం. **'దయితో భ్రాతుః'** వాల్మీకులవునంటున్నారు.

ఆయన సుమిత్రుడు. సుష్ఠుమిత్రం.

ఆయనకు ప్రియతముడు. వరణీయుడు ఈయన కనుకనే ఆనంద వర్ధనుడు - సుమిత్రా నంద వర్ధనుడు.

లోకంలో నిర్వ్యాజ మిత్రం భగవానుడొక్కడే. ఆయనే నిసర్గ సుహృత్తు.

**.... నివాస శ్శరణం సుహృత్.** ఆ సుహృత్త్వం నిస్సమాభ్యధికం. కనుకనే ఆయన సుమిత్రం. స్వరూప జ్ఞానం కలిగి ఆయనకు ప్రీతి కలిగేట్టు మనసు మెప్పుదల మేరకు వర్తించేవాడు కనుక - ఈయన సుమిత్రానంద వర్ధనుడు.

విలక్షణమైన సుహృజ్జన పదబంధం ఆయన పదానుబంధాన్ని గుబాళింప చేస్తుంది.

**మానవులంతా సుమిత్రానంద వర్ధనులు కావటం ఎంతైనా స్పృహణీయం.**

- **శ్రీరామచంద్రాచార్య.**

# మహర్షుల చరిత్ర - శ్రీ శుక మహర్షి

తమిళమూలం :
వై.వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి

తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూపురాణి ఉడయవర్‌స్వామి, విజయవాడ

'నీ ఆయుర్దాయం ఇంకా ఒక ముహూర్తకాలం మాత్రమే'అని దేవతలు ఖట్వాంగునికి తెలిపారు. ఈ ముహూర్త కాలంలోనే మోక్షం పొందే ప్రయత్నం చేద్దాం అని అనుకున్నాడు ఖట్వాంగుడు. వేగంగా భూమికి తిరిగి వచ్చాడు. తన ఆస్తిపాస్తుల నన్నిటినీ అందరికీ పంచిపెట్టి నిరాడంబరుడై హరినామ స్మరణ చేస్తూ ముహూర్తకాలం గడవగానే మోక్షసామ్రాజ్యాన్ని పొందాడు. దృఢమైన మనస్సుఉండి, ఆ మనస్సులో ఇతరమైన ఆశలకు చోటివ్వక హరిభక్తితోపాటు ఆ భగవానుని పొందితీరాలి అనే కోరిక ఉంటే తప్పక భగవానుని అనుగ్రహం లభిస్తుంది.

'లోకంలో వస్త్రాలు, ఆభరణాలు, ఇళ్ళు, వాకిళ్ళు విందుభోజనాలు మొదలైన విషయాలలో ఆడంబరాలకు పోయి, మనస్సును విషయములకు స్వాధీన పరచి మనిషి తన పతనానికి తానే మార్గం ఏర్పరచుకుంటున్నాడు. శ్రీమన్నారాయణుని అనవరతము ధ్యానించుటకే భగవానుడిచ్చిన ఈ మనస్సును చెడు ఆలోచనలవెంట పరుగెత్తించి పాపరాశిని మూటగట్టుకుంటున్నాడు. ఇదే రీతిగా కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మము అను ఐదు జ్ఞానేంద్రియములు కూడ పరమాత్మ యొక్క దివ్య మంగళ విగ్రహమును, దివ్య చేష్టితములను చక్కగా అనుభవించుటకు ఏర్పడినవే అను విషయమును మరచి వాటిని చెడుమార్గములో పయనింపచేసి జన్మపరంపరలలో దుఃఖితుడై తిరుగుచున్నాడు. ఇట్లుకాక తన ఇంద్రియ సంపదను శ్రీమన్నారాయణుని సేవకే వినియోగించి, మనస్సును ఆయన పాదారవింద ములందు లగ్నమగునట్లు చేసి ఆ ధ్యానముతో ప్రాణమునువిడుచువానికి చావులేదు. శాశ్వతమైన బ్రహ్మ పదమును (పరమపదమును) పొంది ఆనందస్వరూపుడగుట తథ్యము. చనిపోయిన వానివెంట ఇళ్ళు వాకిళ్లు భార్య, పిల్లలు, ధనము, ధాన్యము మొదలైనవి ఏవీ వెళ్ళవు. పోయేవాడు వీటిని వెంట తీసికొని వెళ్ళాలని కూడ అనుకోడు. తాను అత్యంతం ప్రేమించిన శరీరాన్నే ఇక్కడ వదలి వెడుతూ ఉంటే వీటిమాట చెప్పేదేముంది. మన కళ్ళముందే ఎంత మంది చనిపోవడం మనం చూడడంలేదు. ఏ ఒక్కడూ తన వెంట ఏమీ తీసుకొనిపోవడం లేదే! కళ్ళు ఉండి కూడ గ్రుడ్డివాళ్ళలాగా ప్రవర్తిస్తున్నారు లోకులు. ఇదే భగవంతునిమాయ. తామరాకు మీది నీటిబిందువులవలె అతి చంచలమైన ఈ సంసార సుఖాలలో మునిగి నశించుచున్నారు. దీని నుండి బయట పడాలంటే చక్కటి దృఢమైన మనస్సు కావాలి. అటువంటి మనః పరిపక్వాన్ని తద్వారా భగవద్‌భక్తిని, విషయములందు విరక్తిని చేకూర్చి భగవదనుగ్రహమునకు పాత్రులమగునట్లు మనలను తీర్చిదిద్దగల పురాణము ఒకటి ఉన్నది. దానిని ద్వాపర యుగారంభంలో నా తండ్రి వ్యాసుడు చెప్పగా నేను విన్నాను. పరీక్షిన్మహారాజా! నిజంగా నీవు మహాభాగ్యశాలివయ్యా! ఆ పురాణాన్ని నేను ఇప్పుడు నీకు చెబుతున్నాను, విను' అంటూ శుకమహర్షి పరీక్షిన్మహారాజుకు భాగవత పురాణాన్ని చెప్ప నారంభించాడు.





**నిగమకల్పతరోర్గళితం ఫలం**
**శుకముఖా దమృతద్రవసంయుతం।**
**పిబత భాగవతం రసమాలయం**
**ముహురహో రసికా భువి భావుకాః॥**

వేదములనన్నిటిని కల్పవృక్షంగా భావిస్తే, ఆ కల్ప వృక్షానికి కాసిన మధురఫలమే భాగవత పురాణము.

తీయని పళ్ళను చెట్టుమీద ఉండగానే చిలుకలు కొట్టడం, అలా చిలుక కొట్టిన పళ్ళు మంచి రుచిగా ఉండడమేకాదు, మంచి రసం కూడా నిండిఉంటాయి. అలాగే ఈ 'భాగవతం' అనే ఫలం కూడ శుకమహర్షి అనే చిలుక ముఖం నుండి భూమియందు అవతరించింది. భూమి యందున్న ఓ రసికులారా! మంచి మనసుకలవారలారా! పరమానంద రసమయ మైన ఈ భాగవత పురాణఫలాన్ని సేవించి ఆనందించండి. ఇది ఈ భూలోకంలోనే కాక మనం పరమపదం చేరిన తరువాత కూడ మనలను ఆనందింపచేయు మహిమ కలది. ఇందులో భగవంతుడు లోకక్షేమంకోసం అవతరించి ప్రజలహృదయాలను ఆకర్షించునట్లు చేసిన అద్భుత చేష్టలు, భగవంతుని తప్ప వేరెరుగని యోగిపుంగవులు భక్తులు మొదలగువారి చరిత్రలు, విపులంగా వర్ణించబడినవి. ఇక ఏ ఇతర విషయములకు ఇందులో ప్రాముఖ్యం మనకు కనబడదు.

అందుచేతనే (భగవంతుని కథలు, భాగవతోత్తముల కథలు నిండి ఉండుటచేతనే) దీనిని 'భాగవతం' అనే పేరుతోనే వ్యవహరిస్తున్నారు.

భాగవతపురాణంలో రుచి తెలిసేంత వరకు ఇతర పురాణాలయందు ఆసక్తి. ఒకసారి భాగవత పురాణం రుచి చూశారా, ఇంక ఇతర పురాణాల జోలికి పోనేపోరు. 'భక్తి విరక్తీ భాగవతేన' అని పెద్దల సూక్తి. భాగవతం చదివితే భక్తి వైరాగ్యాలు కలుగుతాయి అని దాని భావము.

ఈనాడు ఈ భాగవతం ఈ భూలోక వాసులందరికీ లభించి ఆనందింప చేస్తున్నందుకు కారణాలలో కొన్ని.

1. పరీక్షిత్తుమహారాజు పుణ్యం.
2. ఆయన చేసిన ప్రాయోపవేశ మహిమ.
3. శమీకుడు తన కుమారుడిచ్చిన శాపాన్ని వెంటనే పరీక్షిత్తుకు తెలుపడం.
4. పుట్టుక నుంచే సర్వసంగ పరిత్యాగి యైన శుకమహర్షి యాదృచ్ఛికంగా ఆ సమయంలో పరీక్షిత్తు వద్దకు రావడం.
5. అక్కడ చేరిన వేలాదిమందిలో సూత పౌరాణికుడు ఉండడం.
6. నైమిశారణ్యంలో జరిగిన సత్ర యాగంలో శౌనకమహర్షి చెప్పిన భాగవతాన్ని అనేక వేలమంది భక్తి శ్రద్ధలతో ఆలకించడం మొదలగునవి.

తత్త్వాన్ని ప్రతిపాదించడంలో సాటిలేనిదీ భాగవతపురాణం. శ్రీకృష్ణపరమాత్మ లీలను విస్తరంగా తెలిపినదీపురాణం. భగవంతుని పాదారవిందమునుండి ప్రవహించే గంగకు ఒక ప్రత్యేకత ఉంది. ఆ మహిమను చెప్పాలని అనుకున్నవాడు, చెప్పేవాడు, వినేవారు కూడ ఆ గంగ మహిమచే పునీతులు కాగలరు. భాగవతం కూడ అటువంటిదే శ్రీమన్నారాయణుని ఈ కథను చెప్పినవాడు శుకుడు, విన్నవాడు పరీక్షిత్తు, ఈ విధంగా ఈ పురాణంలో వక్తృ, శ్రోతృ, విషయవైలక్షణ్యాలు మూడుచేరి ఉన్నాయి. ఈ భాగవతాన్ని మనకు అందించి నందుకు ఈ పుణ్యభారతభూమి వాసులందరూ శుకమహర్షికి ఋణపడి ఉంటారు.

వసిష్ఠ వంశంలో చివరివాడైన ఈ శ్రీశుక మహర్షికి ఈ భాగవతపురాణమే గొప్ప వైభవాన్ని కలిగించింది.

**(శ్రీశుకమహర్షి చరిత్ర ముగిసింది)**

# రామాయణంలో రమ్యగాథలు

## దాశరథి సతి కొఱకై ఉత్తర దిగన్వేషణ

-చెవుటూరి కుసుమ కుమారి, విజయవాడ.

ఒక మాసం గడచుసరికి తూర్పు-పడమర-ఉత్తరదిక్కులకు వెళ్ళిన వానర యోధులు సీత జాడ తెలియక ప్రస్రవణ గిరికి మరలి వచ్చి సుగ్రీవునికి తమ నిరాశను వ్యక్తపరచినారు.

హనుమంతుడు సుగ్రీవాజ్ఞానుసారము తారుని తోనూ అంగదుని తోనూ కలసి దక్షిణ దిక్కునంతనూ వెదకినారు కాని సీతమ్మజాడ తెలియరాలేదు. అయిననూ కార్యశూరులు, నిర్భీతులు అయిన ఆ వానరులు ఒకానొక చొరరాని ప్రదేశమును చేరినారు. అక్కడ నదులలో నీరు లేదు. చెట్లకు పూలు-పండ్లు-కాయలు కడకు ఆకులు కూడా లేవు.

**'న సన్తి మహిషా యత్ర న మృగా న చ హస్తినః**

**శార్దూలాః పక్షిణోవాపి యే చాన్యే వనగోచరాః**

ఆ ప్రదేశమున పెద్దపులులుగానీ ఏనుగులు గానీ, దున్నపోతులు కడకు లేళ్ళు పక్షులు కూడా లేవు. ఎటువంటి ప్రాణికోటీ అక్కడలేదు. లతలు లేవు. తుమ్మెదలు లేవు కానీ

**'కందూర్నామ మహాభాగః సత్యవాదీ తపోధనః**

**మహర్షీ పరమామర్షీ నియమైః దుష్ప్రధర్షణః**

మహాతపశ్శాలీ, మహాకోపిష్టి, నియమనిష్ఠల చేత ఎదిరింప శక్యముకాని కందూక మహర్షి ఒకే ఒక్క ప్రాణివున్నాడు. ఆ కందు మహర్షి పుత్రుడు పది సంవత్సరముల ప్రాయమువాడు ఆ బాలుడు ఆ వనమున మరణించినాడు. పుత్రశోక సంతప్తుడైన ఆమహర్షి ఆ వనము ఏ ప్రాణులకు ఆశ్రయము కాకుండుగాక అని శపించినాడు. ఆవానర శ్రేష్ఠులు అటువంటి వనములను కూడా అన్వేషించినారు.

ఒక గుహాముఖమున పర్వతాకారుడైన ఒక దానవుని చూచి వీడే రావణుడని వానిని యమపురికి పంపినారు. అతి భయంకరములైన అనేక గుహలను, దుర్గమారణ్యములను మరల మరల వెదకి, సుగ్రీవుడు పెట్టిన గడువు దాటిపోయినదని దిగులు చెందసాగారు. ఆకలి దప్పులు అమితంగా పీడించగా అలసిపోయి ఎక్కడైనా గ్రుక్కెడు నీరు దొరుకునేమో అని వెదకుచూ వెళ్ళి వెళ్ళి ఋక్షబిలమనే ఒక బిలాన్ని చూచారు. క్రౌంచ, చక్రవాక పక్షులు పుప్పొడి అంటిన తడిరెక్కలతో బిలమునుండి బయటికి వచ్చినవి. బుద్ధిశాలి అయిన హనుమ వానరులారా! ఇచట చెట్లు పచ్చగానే వున్నవి. కనుక లోపల బావిగాని, చెఱువుగాని తప్పక వుండి ఉంటుంది, అని చెప్పగా చంద్రసూర్య దర్శనమే లేనిదీ, రోమాంచము కలిగించే అంధకారబంధురమైన ఆ బిలమున ఒక యోజనదూరము వెళ్ళినారు. అలసిపోయి, ఆకలి దప్పుల చేత కృశించి, జీవితము మీద నిరాశ చెందిన ఆ వానర వీరులకు ఒక వెలుగు కనిపించింది. ఆ వెలుగు ననుసరించి వెళ్ళగా ఒక అద్భుత వనము దర్శనీయమైనది. అగ్ని సదృశకాంతితో ప్రకాశించే సాల, తమాల, పున్నాగ చంపక నాగాది వృక్షాలతో, చిత్ర విచిత్ర పల్లవాలతో పువ్వులతో నిండిన లతలు, ఆ





వృక్షముల క్రింద వజ్రవైఢూర్య ఖచిత వేదికలు, బహువిధ పక్షులు, సువర్ణవర్ణ మత్స్యములతో కూడిన పద్మసరస్సులు జాలువారుతున్న మధువులు, మధుర ఫలాలు, స్వర్ణగృహాలు, కంబళ్ళు, ఇంతింత అననేల కొన్ని కొన్ని చోట్ల బంగారము కుప్పలు కుప్పలుగా పెట్టి వున్నది.

అక్కడక్కడ ఆ బిలమున వెదకుచుండగా

**తాం చ తే దదృశుస్తత్ర చీరకృష్ణాజినాంబరామ్**

**తాపసీం నియతాహారాం జ్వలంతీ మివ తేజసా**

నార చీర, కృష్ణాజినము ధరించి, ఆహార నియమ నిష్ఠలచేత గలిగిన అద్భుత కాంతితో ప్రజ్వలించే ఒక వృద్ధ తాపసిని చూచినారు. హనుమంతుడు ఆ వృద్ధతాపసికి నమస్కరించి "తల్లీ! నీవెవరవు? ఈ భవనము ఈ రత్నరాశులు, ఈ దివ్యవనము ఎవరివి?" అని అడిగినాడు. అంతట ధర్మచారిణి, సకల భూత హితురాలు అయిన ఆ తాపసి ఓ కపివరా!

**పురా దానవముఖ్యానాం విశ్వకర్మా బభూవ హ**

**యేనేదం కాఞ్చనం దివ్యం నిర్మితం భవనోత్తమమ్**

పూర్వము మాయలు తెలిసినవాడు, మహా తేజశ్శాలీ అయిన మయుడను నాతడు దానవరాజుల శిల్పి. అతడు తన మాయాబలము చేత ఈ బంగారు భవనమును నిర్మించినాడు. అతడు ఈ వనమునందే బ్రహ్మను గూర్చి అనేక వత్సరములు తపమాచరించి, పితామహుని చేత వరము పొంది, శుక్రాచార్యుని సమస్త సంపదలను పొంది జీవించుచూ హేమ అను అప్సరస యందు కామ మోహితుడైనాడు. అది తెలిసిన ఇంద్రుడు తన వజ్రాయుధంతో వానిని చంపి, ఆ స్వర్ణ భవనమును హేమకు దత్తము చేసినాడు. ఆ హేమ నాకు ప్రియసఖి. నేను మేరుసావర్ణి కుమార్తెను.నా పేరు స్వయంప్రభ. నా ప్రియసఖి హేమ ఈ భవనమును నాకు ఇచ్చినది. నేను ఈ అద్భుత భవనాన్ని కాపాడుతూ వుండి పోయినాను. కపివరా! ఎక్కడో బిలము లోపల వున్నదీ, ఎవరికీ చూడసాధ్యము కానిదీ అయిన ఈ భవనము మీకెట్లు కనిపించింది? మీరే కార్యమున ఈ వనములను బట్టి తిరుగుతున్నారు. నాయనలారా? మిమ్ములను చూడ ఆకలి దప్పులతో డస్సిపోయినట్లున్నారు. ముందుగా ఈ వనములోని పరిశుద్ధ ఫలములను తిని, మధుర జలములను త్రాగి తరువాత మీ వృత్తాంతమునంతనూ నాకు చెప్పుడు, అని ఆదేశించినది. ⇨⇨⇨

## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషిచేస్తున్న వారిలో ఒకరు **శ్రీమాన్ వి. జనార్ధన్‌గారు** (టీచర్) బాన్సువాడ, నిజామాబాద్ జిల్లా, తమ వంతు కైంకర్యముగా మన భక్తినివేదన కుటుంబాన్ని మరింత పెంచే దిశగా కృషిచేస్తున్నారు. వీరికి

శ్రీశ్రీశ్రీస్వామివారు అనేక మంగళాశాసనములను కృపచేసారు.

# శ్రీవిష్ణు మహాపురాణము

## ప్రథమాంశం - షష్ఠాధ్యాయం, సప్తమాధ్యాయం

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, కొవ్వూరు.

యజ్ఞనిర్వహణ నిమిత్తంగానే చాతుర్వర్ణ్య వ్యవస్థ జనార్దనునిచే చేయబడిందని చెప్పుకున్నాం. ఈ వ్యవస్థననుసరించి స్వకర్తవ్య పాలనం చేసేవారు ఏయే లోకాలకు వెళ్తారో కూడా చెప్పుకున్నాం. ఇక ఆయా ఆశ్రమ ధర్మాలను పాటిస్తూ నియతజీవనం సాగించిన వారు పొందే స్థానాలేమిటో పురాణకర్త విశద పరుస్తున్నాడు.

**ఉపాసనా భేదం చేత పొందే స్థానం కూడా భిన్నంగా ఉంటుంది.**

బ్రహ్మచర్య దీక్షవహించి స్వాశ్రమోచిత కర్మానుష్ఠాన పరులైన వారికి (గురువాసులకు) కలిగేస్థానం ఊర్ధ్వ రేతస్కులై 88వేల సంవత్సరాలు మల నివృత్తులై తపశ్చరణం చేసిన వారికి కలిగేస్థానమే కలుగుతుంది.

ఇక, వానప్రస్థులకు కలిగే స్థానం సప్తర్షుల స్థానమే. గార్హస్థ్య ధర్మాన్ని లెస్సగా పాటించిన గృహస్థాశ్రములకు కలిగే స్థానం ప్రాజాపత్య స్థానం. ఇవే భృగ్వాదిలోకాలు.

ఇక, **'న్యాసులకు'** అంటే సర్వసంగ త్యాగం చేసిన యతీశ్వరులకు బ్రహ్మస్థానం. అంటే అర్చిరాది గతిలో పొందే చిట్టచివరి స్థానమైన సత్యలోకం. (ఇది పరమాత్మ స్థానంకాదు).

ఇక, ఆత్మారాములు, ఆత్మ పరితృప్తులు అయిన యోగులకు అంటే, ఆత్మదర్శన పరితృప్తులైన కేవలులకు కలిగేస్థానం **'అమృతస్థానం'**. ఇదే కైవల్య మన్నమాట.

ఇక, ఈ యోగులకంటే పై స్థాయిలో కేవలం ఆత్మ పరితృప్తులు మాత్రమేకాక, పరమాత్మను ఏకాన్తతాబుద్ధితో (అవ్యభిచరిత బుద్ధితో అనన్య భావనతో) ధ్యానించినవారికి కలిగే స్థానం **'పరమపదమే'** ఈ పరమపదమునే 'సదా పశ్యన్తి సూరయః' అని శ్రుతి ఉద్ఘోషిస్తున్నది.

**'అష్టాశీతి సహస్రాణి మునీనామూర్ధ్వ రేతసామ్।**
**స్మృతం తేషాం తు యత్స్థానం తదేవ 'గురువాసినామ్'॥**

**సప్తర్షీణాంతు యత్ స్థానం స్మృతం తద్వై 'వనౌకసామ్'।**
**ప్రాజాపత్యం 'గృహస్థానాం', 'న్యాసినాం' బ్రహ్మ సంజ్ఞితమ్॥**

**'యోగినామ్' అమృతం స్థానం స్వాత్మసంతోష కారిణామ్।**
**ఏకాన్తినః సదా బ్రహ్మధ్యాయినో యోగినశ్చ యే।**
**తేషాం తత్పరమం స్థానం యద్వై పశ్యన్తి సూరయః॥'**

**ఎక్కడకు వెళ్ళినా తిరిగిరాక తప్పదు పరమాత్మోపాసకులు తిరిగిరారు**

**గత్వా గత్వా నివర్తం తే చంద్రసూర్యాదయో గ్రహాః।**
**అద్యాపి న నివర్తంతే ద్వాదశాక్షర చింతకాః॥**

సూర్యచంద్రాది గ్రహాలు ఆయా బ్రహ్మ ప్రలయాల్లో లయించి, మళ్ళీ సృజింపబడుతూంటాయి. కనుక నశ్వరాలు, ఈలోకాలకు వెళ్ళినవారు మళ్ళీ తిరిగి ఇక్కడకే రాక తప్పదు. అయితే ద్వాదశాక్షర చింతకులు అంటే అష్టాక్షరీ, షడక్షర - ద్వాదశాక్షర వైష్ణవ మంత్రాలనుపాసించినవారు (ఆమంత్రాల ద్వారా సాక్షాత్తుగా శ్రీమన్నారాయణునే





ఆశ్రయించిన వారు) ఇక తిరిగిరానవసరంలేని దివ్యధామాన్నే చేరుతారు. శ్రీ గీతలో స్వామి ఈ విషయాన్నే ఇలా చెప్పాడు.

**'ఆబ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోర్జున।**
**మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే॥**

అని

**మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్**
**నాప్నువన్తి మహాత్మానః సంసిద్ధింపరమాంగతాః**

అని

**యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ॥**

అని

తన దివ్య ధామానికి చేరినవారు, ఇక ఈ దుఃఖభాజనమైన జన్మ మరణపరంపరా రూపమైన ఈలోకాల్లో ప్రవేశింపరన్నాడు స్వామి.

**వర్ణాశ్రమ ధర్మాలను విడచి విశృంఖల ప్రవృత్తి కలవారికి నరకాలే శరణ్యం**

వెనుక చెప్పిన వర్ణధర్మాలను బ్రహ్మచర్య - గార్హస్థ్య - వానప్రస్థ- యతిధర్మాలనే ఆశ్రమధర్మాలను పూర్తిగా విడచి, శాస్త్రానికి విరుద్ధంగా అధర్మాచరణ ప్రవృత్తులైన జీవులు చేరేది 'నరక' స్థానమే నంటుంది పురాణం.

**తామిస్ర మంధతామిస్రం మహారౌరవ రౌరవౌ।**
**అసి పత్రవనం ఘోరం కాలసూత్ర మవీచికమ్॥**

**వినింద కానాం వేదస్య యజ్ఞవ్యాఘాత కారిణామ్।**
**స్థానమేతత్ సమాఖ్యాతం స్వధర్మత్యాగినశ్చ యే॥**

తామిస్రము, అంధతామిస్రం, మహారౌరవం, రౌరవం, అసిపత్రవనం, కాలసూత్రం, అవీచికం అనే ఏడు నరకాలు అధార్మికుల కంటుంది పురాణం.



# భగవద్రామానుజ చరిత్ర

శ్రీమతి టి.కె. చూడామణి, విజయవాడ



యతిరాజులు తిరువారాధన పూర్తి చేసికొని శ్రీమన్నారాయణునికి దాసోహం సమర్పించారు. వారి మనుస్సులో కూరేశులు నిండియున్నారు. వారి ఆలోచనలే రామానుజులను వదలకుండా వెంటాడు తున్నాయి. ఎంతటి త్యాగమూర్తి కూరేశులు...! ఎంతటి ఆచార్య నిష్ఠ కూరేశులకి! లోకానికి ఆదర్శవంతమైన జీవితాన్ని గడుపుతున్న కూరేశులెంతటి ధన్యమూర్తి. వారు నా భాగ్యవిశేషం చేత నాకు శిష్యులుగా లభించారు. వారి భావనలో శిష్యులే కాని నాకు అంతకంటె చెప్పలేని ఏదో అనుబంధం. కంచి వరదుణ్ణి ప్రార్థించి నేత్రాలు తెచ్చు కుంటారనుకుంటే ఆ స్వామిని ఆచార్యులైన మమ్ము చూస్తే చాలు. ఈ ప్రపంచ దర్శనం అవసరం లేదన్నారే. కూరేశా! ఏం చేస్తే మీకున్న మానసిక స్థైర్యం మానవులకి అలవడుతుంది. కూరేశా! మీ త్యాగ జీవనం అనితరసాధ్యం. మీకు ఆ శ్రియఃపతి కరుణా కటాక్షం సదా లభిస్తుంది అనుకుంటున్నారు.

కూరేశులు ఒంటరిగా స్వామి సన్నిధికి చేరారు. స్వామికి కూరేశుల్ని చూస్తే ఎంత ప్రేమో! మా రామానూజులను కాపాడిన తండ్రీ, ఆచార్య పారతంత్ర్యమనే సంప్రదా యానికి మార్గ దర్శకుడవైన కూరేశా ఏమిటీ ఇలా ఒంటరిగా వచ్చారు. అని పలకరించాడు స్వామి హే! శ్రీరంగనాథా! నేను ధన్యుణ్ణి అయ్యాను భగవద్రామానుజులను నాకు ఆచార్యులుగా కూర్చి మహోపకారం చేశావు తండ్రీ. ఈ జన్మకీ తృప్తిచాలు. నాకు పరమ పదాన్ని ప్రసాదించవూ అన్నారు. కురేశా తొందరెందుకు అన్నాడు స్వామి నవ్వారు కూరేశులు. తొందరా! ఇంతకాలం ఈ శరీరాను భవం కలిగాక కూడా ఇంకా ఉండ మంటావా స్వామీ! నా ఆచార్యుల కటాక్షం పొంది వారి కంటె ముందు మోక్షాన్ని పొందడం కంటె భాగ్యమేముంటుందయ్యా. నన్ను కరుణించు అన్నారు. అర్చకుల ద్వారా స్వామి తన మెడలోని తిరుమాలని కూరేశుల మెడలో వేసి అనుగ్రహించారు. అపరిమితమైన ఆనందాన్ని పొందారు కూరేశులు. తనివితీరా స్వామి దివ్యమంగళ స్వరూపాన్ని సేవించి, సేవించి... సెలవు తీసికొని గృహోన్ముఖులయ్యారు.

యతిరాజులకీ విషయం తెలిసింది. గుండెల్లో ఏదో చెప్పలేని బాధ? బెంగా? పూరించలేని లోటా? ఏవో గబాగబా కూరేశుల ఇంటికి వచ్చారు రామానుజులు. జీవితంలో అప్పుడే మొదటిసారి చూచినంత ఆనందంగా ఆచార్యులను సేవించుకొని దాసోహం సమర్పించారు కూరేశులు. కూరేశా! స్వామి సన్నధికి వెళ్ళి వచ్చారట! నవ్వుతూ చూశారు కూరేశులు. ఏమేమో ప్రార్థించారట!





తలవంచుకున్నారు శిష్యులు. నాతో ఒక్కమాట కూడా చెప్పాలని అనిపించలేదా? ఎందుకలా కోరు కున్నారు. మాటాడలేక పోయారు రామానుజులు. భగవత్ ప్రేరణ. ఇది కూరేశుల మనస్సులో భావన. పైకి మాట రాలేదు. మీ చరణ సంబంధం చేత మోక్షంపొందే భాగ్యం కలిగింది. మీఆజ్ఞ అయితే...... ఆగారు కూరేశులు. ఆ శ్రీరంగనాథుని ఆజ్ఞ అయింది కదా అన్నారు రామానుజులు. మనస్సు ఆగడం లేదు. ఆచార్య పాదాలు పట్టుకున్నారు. కూరేశులు 'స్వామి ఆజ్ఞ మీ తరువాతే కదా స్వామి, మీరు పంపితేనే ఈ జీవుడు ఆనందంగా తృప్తిగా బయలుదేరుతాడు'. అయితే నన్ను విడిచి వెళ్ళి పోవాలని ఎలా అనుకొనగలిగారు? ఎందుకు అనుకున్నారు? పైకి అంటున్నా గొణుగు కుంటున్నట్లున్నాయి రామానుజుల మాటలు.

ఆచార్యా! శిష్యులు ఆచార్యులకి స్వాగతం చెప్పడం సంప్రదాయం కదా. అందుకే నేను ముందుగా పరమపదానికి వెళ్ళి నా ఆచార్యులు వచ్చేసమయానికి, వారి సేవకోసం సిద్ధంగా ఉంటాను అక్కడ కూడా మీసేవ చేసుకొనే భాగ్యాన్ని కలిగించండిస్వామీ..! గురుశిష్యులు మౌనం. కూరేశులు నెమ్మదిగా లేచి భగవద్రామానుజుల చరణపద్మాలకు శిరస్సును ఆన్చి దాసోహం చేశారు. తమ నుదురు ఆ శ్రీపాదాలపై పెట్టి ఆనంద బాష్ప ధారలతో కడిగారు. చేతులతో ఆపాదాలు స్పృశించి తమ శరీరమంతా రాసుకున్నారు. భగవద్రామానుజ కటాక్షం నాలో అంతటా వ్యాపించింది. హే ఆచార్యా! హే యతిరాజా శ్రీరామానుజులు మెల్లగా లేచి బయలుదేరారు మఠానికి.

కూరేశుల పుత్రులు తండ్రి దగ్గరగా వచ్చారు. ప్రేమగా దగ్గరకు తీసుకున్నారు కూరేశులు. నాయనలారా! ఆ శ్రీరంగనాథుడే మీ తండ్రి. ఆ రామానుజులే సర్వరక్షకులు. మీ అమ్మ మహాపతివ్రత నామాటని వేద వాక్కుగా భావించిన స్త్రీ. శ్రీ రంగనాథుని ప్రసాదరుడిగా పొందిన ధన్య. ఆమె మాటని పాటించండి తండ్రులారా। శ్రీ వైష్ణవులను త్రికరణ శుద్ధిగా ఆదరించండి పొరపాటున కూడా వారియెడల అపచారంగా వించకండి ఉడయవరుల శ్రీ చరణ సంబంధం మన నిధి. అదే శ్రీరామరక్ష నెమ్మదిగా చెప్తున్నారు కూరేశులు. వారి ధర్మపత్ని ఆండాళ్ళమ్మ గారు వారి పాదాల్ని తమ ఒడిలో పెట్టుకొని తలవంచి వారి మాటలు వింటున్నారు. ఆమె కన్నులు వర్షిస్తున్నాయి. ఈ మహనీయుని భర్తగా పొంది నా జీవితానికొక అస్తిత్వాన్ని పొందాను. భగవత్ భాగవత ఆచార్యకటాక్షం పొందిన ఈ స్వామి నాకు భర్తగా లభించడం వారి జీవిత భాగస్వామినిగా నేను పొందిన ఈ ఆనందం ఈ తృప్తి ఓహ్..! ఇపుడు స్వామి ఎలా ఉంది... నవ్వారు కూరేశులు పుళ్ళెపుళ్ళె ఆళ్వార్ కూరేశుల శిష్యులు, కూరేశుల శిరస్సును తమ ఒడిలో పెట్టుకున్నారు. ఆనందంగా అందరిని పలుకరించి. శ్రీ రంగనాథుని పాదపద్మాలు మనసులో నిలుపుకొని భగవద్రామానుజుల శ్రీచరణాలు స్మరించారు. హే యతిరాజా! రామానుజా చార్యవర్యా...! స్వామిన్... వారి చేతులు దాసోహం చేసి నెమ్మదిగా పక్కకి వాలాయి... ద్వయమంత్రాను సంధానం చేస్తూ శిష్య వర్గం కన్నులు మూసుకున్నారు.

యతిరాజులకి వార్త అందింది. వారు బయలుదేరి వచ్చారు. కూరేశపుత్రుల్ని ఆండాళ్ళమ్మ వారిని పరామర్శించారు. నాయనా భగవదాజ్ఞ వచ్చింది. నాయనగారు ధన్యులు మీ పితృఋణాన్ని చక్కగా తీర్చుకోండి అన్నారు. ఎంబారును పిలిచారు. గోవిందా. ఇటుచూడు. ఈ కూరేశపుత్రుల్ని నీకు అప్పగిస్తున్నాను. నా తరువాత శ్రీవైష్ణవ సిద్ధాంతాన్ని నిలబెట్టే వారిగా వీరిని తీర్చదిద్దే బాధ్యత నీకు అప్పగిస్తున్నాను అన్నారు. ఆజ్ఞని శిరసావహించారు ఎంబారు. శ్రీరామానుజల పర్యవేక్షణలో తమ పితృదేవుల సంస్కార కార్యక్రమాలన్నింటిని యథావిధిగా నిర్వర్తించారు కూరేశ పుత్రులు.

కూరేశుల జీవితం భగవద్రామానుజుల జీవితంతో ముడిపడిన కథ. శిష్య ఆచార్య సంప్రదాయం కూరేశ, రామానుజుల జీవితాలను ఆదర్శంగా గ్రహించి తెలుసుకొన వలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఏ శ్రీవైష్ణవుడు బొట్టుసరిగా పెట్టుకొనకపోతే చూచి నవ్వానో నాకన్నులు పోయాయి అని భావించిన కూరేశుల భావ సంపద సంప్రదాయ సౌరభాన్ని జల్లులు జల్లులుగా గుబాళించింది. ఆచార్య సంరక్షణార్థం నాప్రాణాలయినా సమర్పిస్తాననే దృఢ సంకల్పం శ్రీవైష్ణవ సిద్ధాంతానికే ప్రతీకగా నిలిచింది. నాకు కలిగే మోక్షం నా శత్రువుకి కూడా కలగాలనే కూరేశుల ఔదార్యం సంప్రదాయ వైశిష్ట్యాన్ని సకల జగత్తుకి చాటి చెప్పింది. మోక్షం పొంది పరమపదంలో కుడా ఆచార్యసేవ చేసుకోవాలనే కూరేశుల ఆచార్యనిష్ఠ శ్రీ వైష్ణవ సంప్రదాయాన్ని స్థిరంగా చాటింది.

**కూరేశులు సంప్రదాయ పరిరక్షకులు**
**కూరేశులు పరమభాగవతోత్తములు**
**కూరేశులు శ్రీ వైష్ణవాగ్రేసరులు**
వారి శ్రీచరణాలు సదా శిరోధార్యాలు

## బదరీనాథ్ జ్యోతిర్దర్శనం

**మే 8న బదరీ క్షేత్రం తెరువబడుతోంది.** కావలసిన సామాన్లతో మనవారు ముందుగానే బయలుదేరి వెళుతున్నారు. ఆనాటి నుండి విచ్చేసే భక్తులకి వసతి కల్పించడం కోసం అష్టాక్షరీ క్షేత్రం సిద్ధంగా ఉంటుంది. ఈ సంవత్సరం సత్సంగ సదనం పునర్నిర్మాణం చేయవలసి ఉంది. **శ్రీస్వామివారు మే 28న** అక్కడ వేంచేసి ఉండు సమయంలో శంకుస్థాపన జరిపిస్తారు.

గమనిక : బదరీనారాయణ ప్రత్యేక సంచిక త్వరలో మీకు అందిస్తాం. ఇంతవరకు జరిగిన ఆలస్యానికి చింతిస్తున్నాం. సర్వాంగ సుందరంగా ఈ సంచిక తయారౌతోంది. త్వరలో మీ కరకమలాలను అలంకరిస్తుంది.

బదరీ విశాల్ భగవాన్ కీ జై





## శ్రీశ్రీశ్రీ స్వామివారి పర్యటన వివరాలు

| | |
|---|---|
| 11-5-2003 : | రాత్రికి సీతానగరం మన ఆశ్రమానికి వేంచేస్తారు. |
| 12-5-2003 : | రాజమండ్రిలో పుష్కరాల కార్యక్రమమును సమీక్షించి, వైజాగ్ వేంచేస్తారు. |
| 13-5-2003 : | వైజాగ్‌లో ఆరాధన చేసుకొని రాత్రికి ఒరిస్సాలోని హనుమాన్‌పల్లిలో గీతాజ్యోతి కార్యక్రమంలో వేంచేసి ఉంటారు. |
| 14-5-2003 : | హనుమాన్‌పల్లిలో గీతాజ్యోతి కార్యక్రమము. రాత్రికి భువనేశ్వర్ వేంచేస్తారు. |
| 15-5-2003 : | భువనేశ్వర్‌లో ఆరాధన కావించుకొని, గీతాజ్యోతి కార్యక్రమములో ప్రవచనం ప్రసాదించి, బీహార్ లోని రాంచి పట్టణము వేంచేస్తారు. |
| 16నుండి21వరకు : | జార్ఖండ్‌లో వనవాసీ కళ్యాణమంచ్ కార్యక్రమంలో అన్వయిస్తారు. |
| 21-5-2003 : | రాత్రికి టాటానగర్ వేంచేస్తారు. |
| 22-5-2003 : | టాటానగర్‌లో శ్రీవేంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవ కార్యక్రమంలో అన్వయింస్తారు. సాయంత్రం భద్రాచలం ప్రయాణం. |
| 24-5-2003 : | రాత్రికి భద్రాచలంలోవేంచేస్తారు. |
| 25-5-2003 : | భద్రాచలంలో ప్రతిష్ఠ. కుంభాభిషేకాలను నిర్వహిస్తారు. రాత్రికి హైదరాబాద్ చేరి ఋషీకేశ్ బయలు దేరుతారు. |
| 27-5-2003 : | ఋషీకేశ్ నుండి బదరీ ప్రయాణం. |
| 28-5-2003 : | బదరీనాథ్‌లో వేంచేసియుంటారు. |
| 30-5-2003 : | ", హృషీకేశ్ ప్రయాణం. |
| 31-5-2003 : | హృషీకేశ్ నుండి ఢిల్లీకి వేంచేస్తారు. |
| 1-6-2003 : | ఢిల్లీ నుండి హైదరాబాద్ వేంచేస్తారు. |
| 2-6-2003 : | హైదరాబాద్ నుండి విశాఖపట్నం వేంచేస్తారు. |
| 3-6-2003 : | విశాఖపట్నంలో సాయంత్రం శ్రీశ్రీశ్రీ రంగరామానుజ జీయరుస్వామివారి యాగకార్యక్రమంలో అన్వయిస్తారు. |
| 4-6-2003 : | పాడేరు మరియు నర్సీపట్నం ధర్మక్షేత్రముల కార్యక్రమంలో పాల్గొంటారు. |
| 6-6-2003 : | గీతామందిరము సందర్శన, చెన్నై |
| 7-6-2003 : | సా॥ 3గం॥లకు తిరుచ్చి వద్ద తిరుక్కూడలూర్ జగద్రక్షక పెరుమాళ్ సంప్రోక్షణ కార్యక్రమం ప్రారంభోత్సవం. |
| 11-6-2003 : | సంప్రోక్షణ, సాయంత్రం బెంగుళూరు ప్రయాణం. |

## మానస సరోవరయాత్ర

శ్రీవారి మానస సరోవర యాత్రా వివరాలతో కూడిన పుస్తకములు, **C.D.**లు హైదరాబాద్, విశాఖపట్నం, మద్రాసు, రాజమహేంద్రిలోని మన జెట్ ఆఫీసులయందు స్వీకరించవచ్చును. తెలుగు, ఇంగ్లీషులలోకూడా లభిస్తున్నాయి. పుస్తకం రూ. 150/-, **C.D.** రూ. 150/-
**జియర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్, సీతానగరం, గుంటూరు జిల్లా ఫోన్ : 08645 - 272929, 272353.**

గ్రంథపరిచయం

## శ్రీమదనంత స్తవః

ఉభయ వేదాన్త వాచస్పతి, వాచస్పతి, ఉ.వే.శ్రీమాన్ కె.ఎస్. రామానుజాచార్య స్వామివారు స్తోత్రవాఙ్మయానికి సమర్పించిన అద్భుతమైన కానుక 32 సంస్కృత శ్లోకాల ఈ చిన్ని స్తుతి ప్రబంధం.

అనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరులలో గరుడునిపై పర్యాప్తమైన స్తుతి వాఙ్మయం ఉన్నది. విష్వక్సేనులపై పాంచరాత్రాగమాలలో ప్రస్తావం ఉన్నది. నిత్యసూరిగణంలో ఆద్యుడిగా అభివర్ణితుడౌతున్న అనంతుని విషయంలో ఇంతవరకూ ప్రత్యేక స్తుతి ప్రబంధం లేని కొరతను తీర్చినారు ఉ.వే.శ్రీమాన్ రామానుజాచార్యస్వామివారు.

'బహువన పాద పాదాబ్ధికుల పర్వత..... అనంతుడు మాకు ప్రసన్నుడయ్యెడున్' అని తెలుగులో నన్నయ్యగారు అనంత స్తుతికి శ్రీకారం చుట్టినారు.

ఎన్నో సంప్రదాయ విశేషాలతో సారస్వత వైలక్షణ్యాలతో అలరారే యీ స్తుతి ప్రబంధం భక్తులకు, జిజ్ఞాసువులకు కూడా ఉపాదేయం. ప్రసూనద్భిః, వర్షత్రీభూయ, ఛత్రయిత్వా వంటి ప్రౌఢ ప్రయోగాలున్నా మృదుమధుర వచః ఫణితిలో జాలువారిన యీ స్తుతి ప్రబంధం సంప్రదాయ పరులకు నిత్యానుసంధేయం.

బంగారానికి తావి వంటిది దీనికి **ఉ.వే.శ్రీమాన్ డా॥ ఈ.ఏ. సింగరాచార్యస్వామి** సమకూర్చిన శ్రీసేవా వ్యాఖ్య. దివ్య ప్రబంధవ్యాఖ్యానాల సరణిలో సాగిన యీ వ్యాఖ్య యీ స్తవానికి అనన్త గరిమను సమకూరుస్తుంది. వ్యాఖ్యతో పాటు శ్రీమాన్ సింగరాచార్యస్వామి సంతరించిన ప్రస్తావన – నాగజాతికి చెందిన బహు సంప్రదాయ చారిత్రక రహస్యాలను ఆధునిక పరిశోధన ఫలితాలను తవ్వి తలకెత్తుతోంది. సర్వులూ ఆదరించదగిన సుమారు 60 పుటల యీ పుస్తకం మూల్యం రూ. 10 మాత్రమే.



ప్రతులకు

1. **ఉభయవేదాన్త సభ, పెంటపాడు, ప.గో.జిల్లా – 534 166.**
2. **సాధన గ్రంథ మండలి, తెనాలి, గుంటూరు జిల్లా – 522 201**
3. **శ్రీమాన్ కె. ఎస్. రామానుజాచార్యులు, రిటైర్డ్ ప్రిన్సిపాల్, భువనేశ్వరి అగ్రహారం, మూలపేట, నెల్లూరు.**

## శుభవార్త

సింహాచలములో **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి** లక్షరూపాయల భూరి విరాళముతో, శ్రీహరి మంగళాశాసనములతో **శ్రీవైష్ణవ వెల్ఫేర్ అసోసియేషన్ వారు** నిర్మించిన **శ్రీమన్నారాయణ రామానుజ కూటం** నూతన భవన ప్రారంభోత్సవము తేది : 25-4-03 తేదీన వైభవముగా సంప్రదాయముగా నిర్వహింప బడినది.

జై శ్రీమన్నారాయణ...!





జై శ్రీమన్నారాయణ...! శ్రీసీతారామచంద్ర పరబ్రహ్మణే నమః శ్రీమతే రామానుజాయ నమః

## శ్రీ సీతారామచంద్రస్వామివారి దేవస్థానం, భద్రాచలదివ్యక్షేత్రం

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి వారి ప్రత్యక్ష పర్యవేక్షణలో....**

## ప్రతిష్ఠాపూర్వక మహాకుంభాభిషేక మహోత్సవములు

**21-05-2003 నుండి 25-05-2003 వరకు**

భగవద్బంధువులారా...!

శ్రీ భద్రాచల దివ్యక్షేత్రంలో వేంచేసియున్న శ్రీసీతారామచంద్రస్వామివారి దివ్యసన్నిధిలో శ్రీ ఆండాళ్ అమ్మవారి, పన్నిద్దరాళ్వారుల మరియు ఆచార్యుల ఆలయ, విగ్రహ ప్రతిష్ఠా మహోత్సవములు - తూర్పు, దక్షిణ, ఉత్తర, గోపుర, ప్రాకారమండపముల కుంభాభిషేకములు శ్రీశ్రీశ్రీచిన్నజీయర్‌స్వామి వారి దివ్యకరకమలములచే నిర్వహించబడును. కావున భగవద్బంధువులందరూ శ్రీపాంచరాత్రా గమోక్తముగా, ఐదు రోజులపాటు జరిగే ఈ కార్యక్రమములలో అన్వయించి, శ్రీ భద్రాద్రి శ్రీరామచంద్ర మహాప్రభువుల అనుగ్రహాన్ని, శ్రీస్వామివారి మంగళాశాసనములను పొందవలసినదిగా సాదరముగా స్వాగతిస్తున్నాము.

### కైంకర్య వివరములు

| | | |
|---|---|---|
| **ఒక్క రోజు ఉత్సవ ఉభయమునకు** | **రూ.** | **1,516/-** |
| **ఐదురోజుల ఉత్సవ ఉభయమునకు** | **రూ.** | **5,016/-** |

**ఒక్క రోజు ఉభయదాతలకు** : శ్రీరామచంద్రస్వామివారి శేషవస్త్రములు, పది లడ్డుల ప్రసాదము, వెండిప్రతిమ, ఒక్క రోజు వసతి సౌకర్యములు ఏర్పాటు చేయబడును.

**ఐదురోజుల ఉభయదాతలకు** : శ్రీరామచంద్రస్వామివారి ప్రత్యేక శేషవస్త్రములు, 20 లడ్డుల ప్రసాదము, వెండిప్రతిమ, భద్రాద్రి క్షేత్రజ్ఞాపిక, ఐదురోజుల వసతి సౌకర్యములు ఏర్పాటు చేయబడును.

'భద్రాద్రి నిలయం రామం నత్వాపాపైః ప్రముచ్యతే'

భద్రాచల నిలయుడైన శ్రీరాముని సేవించినవారు, సర్వపాపవిముక్తులై తరించెదరు.– బ్రహ్మాపురాణం

రండి..! అన్వయించండి..!! రామానుగ్రహంతో తరించండి...!!!

## అందరికీ ఇదే మా శుభాహ్వానం

**తాళ్ళూరి వెంకటేశ్వరరావు,**
ధర్మకర్తల మండలి అధ్యక్షులు మరియు సభ్యులు

**డి. మురళీధర్ రెడ్డి, M.Tech.,**
స్పెషల్ గ్రేడ్ డిప్యూటీ కలక్టర్,
మరియు కార్యనిర్వహణాధికారి




(గత సంచికతరువాయి)

ఆలయ మర్యాదలతో శ్రీస్వామివారికి స్వాగతాన్ని సమర్పించారు. శ్రీవేంకటేశ్వరాలయాన్ని సేవించాం. ఆలయానికి గోపుర నిర్మాణం జరుగుతోంది. గోపుర దేవతల విగ్రహాలన్నీ సిద్ధమైఉన్నాయి. ప్రామాణికమైన మూర్తులతోపాటు, కాల్పనికమైన క్రొత్త క్రొత్త విగ్రహాలు కూడ కనిపించాయి. ఉదా॥ ఒకే శ్రీనివాసుని విగ్రహంలో శక్తి (దుర్గా అమ్మవారి) లక్షణాలతో శాస్త్రదూరమైన సొంత పోకడలు కన్పిస్తున్నాయి.

ప్రక్కనే శివాలయాన్నికూడ సందర్శించాము. కుంభకోణం నుండి వచ్చిన అర్చకులు శ్రద్ధగానే చేస్తున్నట్లనిపించింది. ఈ రెండు ఆలయాల్లోనూ సమగ్రత ఏర్పడవలసి ఉంది.

ఈ ఆలయంలోనే శ్వేత జాతీయు లిద్దరిని వైదిక వేషంతో చూశాము. ఒకరు 'దయానంద' స్వామి ప్రభావంతో అద్వైతి. మరొకరు పెరుంబుదూరు జీయర్‌స్వామివారి కృపతో విశిష్టాద్వైతి. ఇద్దరిలోనూ 'మాకు బాగ తెలుసును' అనేభావం స్పష్టంగానే గోచరిస్తోంది. శ్రీవాసుదేవానందలో 'అహం బ్రహ్మాస్మి' తత్త్వంలోని ముందు 'సగం' వంటపట్టినట్లుంది. అతను శ్రీస్వామివారితో మాట్లాడుతూ 'నేను రామానుజ ఫిలాసఫీలో Ph.d., చేసాను. వారి మీద నాకు సింపతి ఉంది. అన్నాడొక పెద్ద తత్త్వవేత్తలా. శ్రీస్వామివారు స్పందిస్తూ.... చిరునవ్వులు చిందిస్తూ... **రామానుజ సిద్ధాంతాన్ని చదివాక కూడ దానిని అర్థం చేస్కొని ఆచరించ లేని అజ్ఞానానికి మీ మీద మాకు 'సింపతీ' కలగాలి. అంతేకాని రామానుజుల వారికి మనలాంటి వాళ్ళ 'సింపతి' అక్కర్లేదు.** అనేసరికి ఆయన కాస్త సిగ్గుపడ్డాడు. 'వాసుదేవానంద' సంస్కృతంలో సరళంగా మాట్లాడుతున్నాడు. లుంగీకట్టుకుని వల్లెవాటుగా ఉత్తరీయాన్ని కప్పుకుని, నుదుట భస్మరేఖ, చుక్కబొట్టుతో భుజాన ఓ సంచీని వేసుకుని తత్త్వాన్వేషకుడిలా కనిపించాడు.

రెండవ వ్యక్తి తన్ను తాను 'రామానుజ దాసన్' గా పరిచయం చేసుకున్నాడు. నుదుట ఊర్ధ్వ పుండ్రంతో నడుముకి బట్టకట్టుకుని, సంప్రదాయంలోంచి వినయాన్ని గుర్తించినట్లు కనిపించాడు. అతను కాస్త తమిళం కూడ నేర్చాడు. అంచు పంచెలను అలంకరించుకునే అభ్యాసం బాగానే చేసాడాయన.

ఆలయం నుండి వస్తూంటే హృషీకేశ భట్టర్‌స్వామి చెప్పారు... 2001 సం॥లో సిడ్నీ నుండి హెలెన్స్‌బర్గ్ దేవాలయం వరకు ఉన్న





యూకలిప్టస్ చెట్లతోటలో కార్చిచ్చు (బుష్‌ఫైర్) లేచి సుమారు 40 కి.మీ. పరిధిలో ఉన్న చెట్లన్నీ మాడిపోయాయిట. హెలెన్స్ బర్గ్ ఆలయం కూడ మంటల మధ్య ఉండిపోయిందట నేషనల్ పార్క్ కూడ బూడిదైపోయింది ఎన్నో జింకలు, జంతువులు కూడ కాలిపోయాయిట.

ఆ వైకుంఠైకాదశి నాడు ఆలయాన్ని తెరవడంకూడ కష్టమైపోయిందిట. పచ్చని కొండల మధ్య మాడిన చెట్ల నల్లని అందాలు గూడ ఆకర్షణీయమే. మనిషి చేయిపడనంత వరకూ ప్రకృతి ఎలా ఉన్నా సుందరమే. ఒక గంట ప్రయాణం చేసి ఛెర్రీబ్రూక్ చేరాక శ్రీస్వామివారు అక్కడి భక్తులకు సాయం సందేశాన్ని అనుగ్రహించారు.

27వ తేదీ అంతా పరమట్టా (PARAMATTA) నదీ ప్రాంతంలోని పలుగృహాల సందర్శన ఏర్పాటు చేసారు. స్థానికులు పేరామట్ అంటారు. కానీ పటమట అంటే బాగుంటుందని పించింది మాకు. సిడ్నీకి ఇది పడమర లోనే ఉంది. అది మంచినీటిని అందించి ఆదుకునే నదీ ప్రాంతం కావడంతో దీని అసలు పేరు 'పరమాప్త' అయిఉండాలి. అనగానే ఒకరు అన్ని పేర్లు సంస్కృతంలోకి మార్చేయడమేనా! అంటూ విరుచుకుపడి, సామ్యాన్ని బట్టీ అదీ సబబే కావచ్చునేమో అని సర్దుకున్నారు. ఈ బ్రిటీషర్స్ వైదికమైన సంస్కృత శబ్దాలకు ప్రపంచ నలుమూలలా ఇంగ్లీష్ పలుకుబడిని అంటగట్టి అపభ్రంశం చేసేసారు. రాజమహేంద్రిని రాజమండ్రి అన్నట్లు. అలాగే వ్రాస్తున్నాం అదీగాక ఇంగ్లీష్ లిపిలో 'RAJAHMUNDRY'అని వ్రాయడాన్ని గమనిస్తే 'H' యొక్క స్థితిని ఊహిస్తే వర్ణవిపర్యయదోషం మనకు తెలుస్తుంది. MU తర్వాత HE గా ఉండవలసినది ముందుపడి రాజహ్‌మండ్రి అయి ఉచ్చారణ సౌకర్యంతో H సైలెంట్ అయిపోయింది. ఉదా॥కు కొందరు 'పగిలింది' అనడానికి 'పలిగింది' అనడం వింటూంటాం. గి-లి.. తారుమారై కూర్చున్నాయి. దీన్ని భాషా శాస్త్రప్రకారం వర్ణవిపర్యయ అని అంటారు. ఏభాషలోనైనా కాలక్రమేణ కొన్ని కొన్ని పదాలలో ఇది తప్పని సరి అవుతుంది. ఈ దృష్టితో ఆలోచిస్తే, పరిశీలిస్తే.... మన 'కపిలారణ్య' పదం కాలిఫోర్నియా ఎలాగైందో అర్థమైపోతుంది.

అలానే 'పరమాప్త' పదమే 'పరమట్టా' అయింది. అని మనం అనుకుంటే తప్పేముంది? అనగానే అందరూ ఆలోచనల్లో పడ్డారు. ప్రయాణం సాగుతుంది.

కానీ మేం అనుకున్నట్లు 'పరమాప్త' నదివల్ల ప్రస్తుతం పెద్దగా ప్రయోజన మేమీలేదుట. సిడ్నీ మొత్తానికి ఎక్కువ శాతం నీళ్ళిచ్చే నది.... 'మారి' (MARRY) నది, 'హాక్స్ ప్రీ' అనే నది కూడ నీరిచ్చే మరో నది. నీటిని నిల్వ చేయడానికై 60 ఏళ్ళ క్రితం వరగొంబ (WARRAGONBUE) డ్యామ్‌ను నిర్మించుకున్నారు. ఈ డ్యాం కనుక నిండితే 8సం॥లపాటు రోజంతా వాడకాన్కి సరిపోయేంత నీటిని సప్లై చేయవచ్చునట. ఈ విధంగా జలసమృద్ధిని పొందిన నగరం ఈ సిద్ధిని (SYDNEY) ఉదయంTHORNLEIGH ప్రాంతాన్ని కూడ భగవద్బంధువుల పరిచయ యాత్రలో సందర్శించాము.

సాయంకాలం సందేశం ఆల్ఫర్డ్‌పాయింట్ ప్రాంతంలో ఆసక్తికరంగా, ఆలోచనాత్మకంగా సాగింది. శ్రీస్వామివారు ఎందరికో సందేహాల దాహాలను తీరుస్తూ సమాధానాల సుధను అందించారు. ఈ రోజు టెలిబ్రిడ్జ్ కార్యక్రమం స్ట్రాత్‌ఫీల్డ్‌లోని మా వసతిలోనే జరిగింది.

28వ తేదీ క్వాకర్స్‌హిల్ ప్రాంతాన్ని, మధ్యాహ్నమంతా మార్స్‌ఫీల్డ్ ప్రాంతాన్ని భగవద్బంధు పరిచయ యాత్రలో చూచాము. శుక్రవారం కావడంతో రైడెల్ మేర్ విక్టోరియా రోడ్‌లోని హాల్‌లో సామూహిక లక్ష్మీనారాయణ పూజలను ఏర్పాటు చేసారు. లక్ష్మీనారాయణ పూజ లోటుపాట్లు లేకుండా 4గం॥ల పాటు జరిగినా ఎవ్వరిలో అసహనంలేదు. శ్రీస్వామి వారి వర్చస్సును, వచస్సులను, కళ్ళతో, చెవులతోనే జుఱ్ఱు కుంటున్నట్లుగా అందరూ ఆసక్తిగా విన్నారు.

మార్చినెల 1వ తేదీ అదే హాల్లో శ్రీసుదర్శన యాగాన్ని ఏర్పాటు చేసారు. యజ్ఞవేదికను, హోమకుండాన్ని, అష్టమంగళ ద్రవ్యాలను, ఏర్పాటు చేయడంలో శ్రీహృషీకేశ భట్టర్‌గారి శ్రద్ధ అబ్బురపరిచింది. వినోద్‌గారు, గోపి, అరవింద, శ్రీలత, ఆత్రేయజీ దంపతులు, ముఖ్యంగా వరదరాజన్‌గార్ల ప్రణాళికాబద్ధమైన పద్ధతిలో శ్రీసుదర్శనయాగం 'ఆరుగంటలపాటు' అద్భుతంగా జరిగింది. మధ్యాహ్నం ఆ హోమకుండం వద్దనే 'సమాశ్రయణాలు' కూడ జరిగాయి. సాయంత్రం సందేశంగా వినోద్‌గారి కోర్కెపై 'విశ్వశాంతి మతసామరస్యం' విషయాలపై శ్రీస్వామివారు 'గీతాజ్యోతి' సందేశాన్నిచ్చారు. శ్రీవినోద్‌గారి సారథ్యంలో కార్యకర్తలకు శ్రీస్వామివారు మంగళా శాసనాలను అనుగ్రహించారు.

**ఈ రోజు శ్రీస్వామివారు ఉదయం 10గం॥ల నుండి రాత్రి 10గం॥ల వరకు నిర్విరామంగా శ్రీసూక్తులను కృపచేస్తూ ఉన్నారనేది... నమ్మవలసిన నిజం. అది అనితర సాధ్యమైన వారి నైజం. వారు సాక్షాత్ భగవద్రామానుజ తేజం.**

2వ తేదీ ఆదివారం శ్రీహృషీకేశ భట్టర్ వారి నిస్వార్థమైన కోర్కెను మన్నించి శ్రీస్వామివారు అంగీకరించారు. ఆస్ట్రేలియా రాజధాని అయిన కేన్‌బెరాలోని మౌనన్ అనే ప్రాంతంలోని శ్రీబాలాజీ మందిర్‌లో శ్రీనివాసునికి నవకలశస్నపనం. మేమున్నచోటుకి 3గం॥ల ప్రయాణం. ఆలయం కట్టి చాలాకాలం అవుతున్నా విగ్రహాలకు ఆరాధనాదులేమీ లేవు.

**యన్మనీషి పదాంభోజ రజః కణ పవిత్రితం।**
**తదేవ భవనం నో చేత్ భకారస్తత్ర లుప్యతే॥**

అన్నట్లుగా మహాత్ములయిన శ్రీస్వామివారి చేతుల మీదుగా పెరుమాళ్ళకు తిరుమంజనం జరిగితే మళ్ళీ కళాకాంతులు వస్తాయనే 'దివ్య' భావనతో హృషీకేశభట్టర్ అడిగారు. శ్రీస్వామి వారు సరేనన్నారు.

కేన్‌బెరా ఆస్ట్రేలియాకు రాజధాని. మెల్‌బోర్న్ – సిడ్నీల పోటీని నివారించడానికి నూతనంగా నిర్మించుకుని రాజధాని చేసుకున్న సుందర నగరం ఈ.... కేన్‌బెర. 1600 ఎకరాలలో 150సం॥ల క్రితమే ఎంతో ప్లాన్డ్‌గా నిర్మించారు. రాచబాటలు కానీ, రాజభవనాలుకానీ, పార్కులుకానీ... అన్నీ ఎంతో క్రమబద్ధంగా నిర్మించుకున్నారు, మన గుజరాత్‌లోని గాంధీనగర్, చండీగడ్ వలె మనదేశంలోను ఇలాంటి ప్లాన్డ్ నగరాలున్నాయని తలచుకోగానే తెలియని తృప్తికలిగింది.

ఈ మార్గంలో సుమారు 5 కిలోమీటర్ల దూరం నుండే పార్లమెంట్ భవనం కనిపిస్తోంది. చాలా ఎత్తు మీద రాజప్రాసాదంలాగా ఉంది ఎంతో అధునాతనంగా ఉంది. ఫ్రీవేకి సరిగ్గా ఎదురుగా (అడ్డంగా) సుమారు 150 అడుగుల ఎత్తయిన గుట్టపైన 100 అడుగుల ఎత్తయిన ఇనుపస్తంభానికి వీరి జాతీయ పతాకం





రెపరెపలాడుతూ కనిపించింది. దాని కట్టుబాటు, చుట్టుబాటు, వారి దేశభక్తికి నిలువెత్తు నిదర్శనంగా ఉంది. ప్రక్కనే అక్కడి ప్రధానిగారిల్లు చుట్టూ అందమైన చెట్ల మధ్య చిన్న చెక్క ఇల్లు సకల విధ సౌకర్యాలతో చాలాబాగుంది. కానీ ఆయన మాత్రం సిడ్నీలోనే ఉంటాడుట. ఇక్కడ ఉండాలని నియమమున్నా ఆయనకు సిడ్నీలోనే ఉండడం ఇష్టమట. మనవారి భాగోతం లాగానే అనిపించింది.

ఈ ఫ్రీవేకి ఎడమ ప్రక్క దాదాపు పార్లమెంట్ భవనానికి ఎదురుగా పెద్దచెరువు. నిండు నీటితో నీటుగా చాలా అందంగా ఉంది. ఆశ్చర్య మేమిటంటే ప్రాకృతికంగానే కొండల మధ్య, చెట్లమధ్య ఏర్పడ్డ చెరువులా కనిపించే ఇది కృత్రిమ తటాకంట. ఎప్పటికప్పుడు నీటిని మార్చిడి చేస్తూంటారట. అ'చెరువు' మధ్య ఆశ్చర్యకరంగా వాటర్ స్ప్రింగ్ రమారమి 100 అడుగుల పైకి ఎగజిమ్ముతోంది. ఆ ఫోర్స్‌కి 'కెప్టెన్ కుక్ ఫోర్స్' అనిపేరుపెట్టారు. ఆస్ట్రేలియాను కనుగొన్న 'కుక్' గారిపేరు పెట్టడం సమంజసంగానే ఉంది.

మౌనన్, బాలాజీ మందిర్‌కి చేరాము. శ్రీస్వామివారి నేతృత్వంలో నవకలశస్నపనం ఆగమోక్తంగా జరిగింది. శ్రీస్వామివారి పరివార మంతా సొంత దేవాలయంలా ఆలయంలో మార్జన కైంకర్యం నుండి తిరుమంజన కార్యక్రమం వరకు అన్నీ నిర్వహించారు. వేదపారాయణం జరుగు తూండగా తిరుమంజనం కన్నుల పండువగా 'అపూర్వంగా' జరిగిందని అందరూ ఆనందించారు. శ్రీస్వామివారి ప్రవచనం తర్వాత విష్ణు –శివ మందిరం ఛైర్మన్ శ్రీ ఆగర్వాల్‌జీ శ్రీస్వామివారి మంగళాశాసనములను ఆలయాభివృద్ధికి తగు సూచనలను పొందారు. అర్చకుల అశ్రద్ధే అభివృద్ధికి అవరోధం అనేది అక్కడ చూడవచ్చు. అర్చకులకు శ్రీవారు తిరువారాధన పుస్తకాన్ని, మహోత్సవ విధిని కూడ బహుకరించి, శ్రద్ధగా చేయమని ఆదేశించారు. తీర్థగోష్ఠి కాగానే బయలుదేరాం. 290 కి.మీ. ప్రయాణాన్ని 3గం॥లలో ముగించుకుని మళ్ళీ మా (వరదరాజన్‌గారి) ఇంటికి చేరాము.

రాత్రి స్ట్రాత్ ఫీల్డ్‌లోనే ఉన్న శ్రీమాన్ నారాయణ రెడ్డిగారింటికి వెళ్ళాము. పాదపూజకాగానే ప్రవచనం ప్రారంభమైంది. సృష్ట్యాది గతాబ్దాల గురించి, ప్రాచీన కాలమానాల గురించి శ్రీస్వామివారు సంవత్సరాలు, మాసాలు, రోజులు కూడ చెప్తూంటే అందరూ చిత్తరువులయ్యారు. ముఖ్యంగా అందరికంటే ముందుగా ప్రపంచం యొక్క స్వరూపాన్ని గుర్తించిన వారు మన

మహర్షులని, కొలంబస్, హ్యూయన్‌త్సాంగ్, కెప్టెన్‌కుక్ వీరు కాదని, మనవారు కొన్ని వేల సం॥ల క్రితమే ఆ 'బొమ్మను' మనకు అనుగ్రహించారని చెపుతూ, మన పురాణాలు 'ఈ భూగోళం యొక్క స్వరూపాన్ని వర్ణిస్తూ' ఒక పెద్ద కుందేలు పొదవద్దకు చేరి ఆకులను తింటున్నట్లుగా ఉంటుందని వర్ణించాయి. అని చెప్పి వరల్డ్ మేప్ తెప్పించి అందరికీ ప్రత్యక్షంగా చూపించారు.

ఇది విశ్వద్రష్టలయిన 'మనపెద్దల' గొప్పతనం... అనే సరికి అందరిలో కలిగిన గర్వానికి ఆనందానికి అవధుల్లేవు. అక్కడే కార్యకర్తల సమావేశం జరిగింది. శ్రీమాన్ నారాయణరెడ్డి గారికి, వారికుటుంబానికి మంగళాశాసనాలను చేసారు శ్రీస్వామివారు.

శ్రీమాన్ నారాయణరెడ్డిగారు తెలుగుదనం కల వ్యక్తి. ఈ నగరంలోని తెలుగు అసోసియేషన్ స్థాపకులే అయినా పదవులకు దూరంగా ఉంటారు. అంతర్గతమైన, వ్యక్తిగతమైన కలహాలవల్ల ఈ సంస్థ రెండుగా విడిపోయినప్పటికీ ఈ రెండు తెలుగు సంఘాలకి అజాత శత్రువైన అండవీరే. వీరికి శ్రీస్వామివారిపై ఉన్న ఆరాధనాభావం చాలాగొప్పది. మేము సిడ్నీ ఎయిర్‌పోర్టులో దిగిననాటి నుండి నేటివరకు కూడ ప్రతిరోజు కార్యక్రమాల్లో అన్వయిస్తూనే ఉన్నారు. రాత్రి స్ట్రాత్ ఫీల్డ్‌లోనే విశ్రాంతి.

3వ తేది తిరువారాధనాదులను ముగించుకుని Toongarbbi (తూంగార్ బీ) Girrween (గిర్వీన్) ప్రాంతాలలో భగవద్బంధు పరిచయాన్ని పొందిన తర్వాత యువకుడు, ఉత్సాహవంతుడు అయిన చి॥ నవనీత్ గదిని శ్రీవారు పావనం చేసారు. అక్కడి నుండి హృషీకేశ్ స్వామి సారథ్యంలో New South wales, Australia లోని జెనాలెన్ కేవ్స్ (Jenalan caves)ని సందర్శించడానికి బయలుదేరాము. దట్టమైన చెట్లతో నిండిన కొండల్లో నుండి ప్రయాణం. చిన్న చిన్న జలపాతాలు పడుతూ ఉండే ఆ కొండలను ఎక్కుతూ ప్రయాణిస్తూంటే... మళ్ళీ మాకు మానస సరోవర యాత్రలోని 'జంగ్ము' (Jungmu) ప్రాంతం గుర్తుకువచ్చింది. దాదాపు రెండుగంటల ప్రయాణంతో ఆ కేవ్స్ వద్దనున్న Grand Arch గ్రాండ్ ఆర్చ్ వద్దకు చేరాము. చారిత్రాత్మకమైన ఈ జెనాలెన్ కేవ్స్‌ను James wahalan అనే సాధారణమైన రైతు 1883లో కనుగొన్నాడు. అంతకుముందు వరకు ఆ గుహల్లో ఆస్ట్రేలియన్ ఆదిమ వాసులు ఉండేవారనడానికి ఆధారాలు దొరికాయిట. ఈ గుహలను కనుగొనడం కూడ చాలా విచిత్రంగా జరిగిన సంఘటన. James - Mckeown అనే దొంగను పట్టుకోవడానికై ప్రయత్నిస్తూ ఈ గుహలను కనుగొన్నారు. అప్పటి నుండి ఈ గుహల ఉనికిని కాపాడుతూ James whalan మరియు అతని సోదరుడు కూడా 1886 వరకు వీటి సంరక్షకులుగా ప్రభుత్వంచే నియమించబడ్డారు. ఈ గుహలలోకి నడిచి వెళ్ళగలిగినంత వరకు వెళ్ళి ఆ గుహలోపల పై భాగంలో కొన్ని 'ఐస్' తో తయారైన సహజ కళాఖండాలను కనుగొన్నారు. ఎంతో విచిత్రములయిన వివిధాకారాలతో కూడిన ఆ అద్భుతమైన కళాఖండాలను చూచి ఆశ్చర్యపోయారు. 1870 ప్రాంతంలో ఆ గుహలను పూర్తిగా పరిశోధించే ఉద్యమాన్ని చేపట్టారు. ధైర్యవంతురాలయిన 10 ఏళ్ళపాప నడుముకి తాడుకట్టి, నెత్తిపై బెల్ట్‌కి ఆటోమేటిక్ కెమేరాలను, లైట్లను అమర్చి లోపలకు దింపారు. చిమ్మచీకటిలో ఆ పాప పెద్ద పెద్ద మనుషుల ఆకారాలను, ముఖాలను చూచినట్లుగా చెప్పింది. ఫోటోలసాయంతో గుహల్లో ఇంకా ఎన్నో సహజ





కళాఖండాలు న్నాయని గుర్తించి, సహజత్వానికి భంగం కాని రీతిలో, దారులను చెక్కుకుంటూ 7 రకాల గుహలను గుర్తించారు. అన్ని గుహలలోని విద్యుత్ సౌకర్యాన్ని కల్పించారు. Lucas cave, Temple of Baal, Imperial cave, River cave, Orient cave, Chifley cave, Ribbon cave, ఈ ఏడు గుహల్లో బడబాగ్నితో ఉడికిన ఉప్పునీరు కొండలను కరిగించుకుంటూ పొరగా ఏర్పడ్డ అద్భుతమైన హిమఖండ కళాకృతులు ఉన్నాయి. కొన్ని వేల సం॥లక్రితం... ఈదీవి అంతా సముద్రంలో ఉండి, జల ప్రళయాల వల్ల, భౌగోళికమైన సంచలనంవల్ల నీటిపైకి తేలినది కావడంతో సముద్ర గర్భస్థాలయిన ఈ వింతలను ఈనాడు మనం ఈవిధంగా చూడగలగుతున్నాం.

మన శిల్పశాస్త్రంలో చెప్పినట్లు 32 సన్నని కోణాలతో చెక్కిన వజ్రస్తంభంలాంటి ఓ హిమాకృతి... కానీ ఆ స్తంభం మధ్య సుమారు 5,6 అంగుళాల ఖాళీ ప్రదేశం.... 'Broken Column'గా పిలిచే ఈ ఆకృతి ఎంతో ముచ్చటగా ఉంటుంది. ఇంకా Minaret, Indian canopy, Nellies - Grotto, Gabriel's wing, Lucinda cavern, Shrine వంటి పేర్లతో, ఆకారాలతో, విస్మయాన్ని కలిగించే వింతలెన్నో..! మనం జంతికలు వేసుకునేటప్పుడు వాటి గొట్టంలో నుండి పిండిన తర్వాత గొట్టానికి అంటుకుని వ్రేళ్ళాడే పిండి ధారల్లాంటి డిజైన్లు అన్ని గుహల్లో సర్వసాధారణంగా కనిపిస్తాయి. అణువణువున శిల్ప కళాశోభితమైన కోణార్క సూర్య దేవాలయ శిఖరాన్ని పోలిన హిమశిఖరాలు... మహారాజులు, మహారాణులు మెడ వెనుక ధరించిన వల్లెవాటుల్లా మడతలు పడ్డ మంచు బట్టల్లాంటి ఆకృతులు, ముత్యాల పందిరి పైనుండి క్రిందకు వ్రేళ్ళాడే చినన, పెద్ద ముత్యాల హారాలవంటి మంచు ధారలు... వాటి సొగసులు వర్ణించనలవికాని అందాలతో నిండిన జెనాలిన్ కేవ్స్‌ను పాక్షికంగా సందర్శించాము. దాదాపు 1881 సం॥ నుండి ఇది పర్యాటక స్థలంగా క్రమేణా రూపుదిద్దుకుంది. దీనిని పర్యాటక కేంద్రంగా కావడానికి విశేషంగా కృషి చేసిన వ్యక్తి పేరులోని పద గ్రహణంతో దీనిని 'జెనాలిన్' అనేపేరుపెట్టారుట. అక్కడి నుండి 'బ్లూ మౌంటెన్స్' చూద్దామని బయలుదేరాము. దూరంగా కనిపించే కొండలు ఆకాశాన్ని అంటుకుని నింగిరంగులోనే 'బ్లూ'గా కనిపిస్తూండడంతో వాటిని బ్లూ మౌంటెన్స్ అని పేరు పెట్టారు. ఇది సాధారణంగా అన్ని చోట్ల కనిపించే ప్రకృతి సౌందర్యమే అయినా ఇలా సొమ్ము చేసుకోవడానికి దమ్ములుండాలి కదా! ఈ నీలగిరుల పేరుతో వారక్కడి పర్యాటకులను ఆకర్షించేవిధంగా కొన్ని సౌకర్యాలు.... ఏర్పరచి సొమ్ము చేసుకుంటున్నారు. మన వద్ద ఎన్ని వింతలున్నా ప్రకటీకరించలేని పరిస్థితి మనది... వింతలను కల్పించుకుని దాన్ని పదింతలు చేసి ప్రకటీకరించుకునే నైపుణ్యం వారిది. అక్కడే ఉన్న 'త్రీ సిస్టర్స్'ను చూశాము. ఇది శక్తిత్రయం అని మహాలక్ష్మీ, మహాగౌరి, మహా సరస్వతులు వీరే అని భట్టర్‌స్వామి చమత్కరించినా అందులో కొంత సత్యం దాగి ఉందేమోననిపించింది... కారణం ఆ మూడు చిన్ని చిన్ని కొండలు 'ముగ్గురమ్మలు' అన్నట్లే ఉన్నాయి. మన తిరుమల కొండపైని 'శిలాతోరణం' వంటి రాళ్ళ ఆకృతిలో ఉన్న ఆ 'త్రీ సిస్టర్స్' ఇక్కడి ఆదిమ వాసుల ఆరాధ్య దేవతలట. మన ఆచార వ్యవహారాలతో కొన్ని మౌళికమైన పోలికలు కనిపించే వీరి ఆరాధ్య దేవతలయిన ఈ 'ముగ్గురు' 'ముగ్గురమ్మలు' ఎందుకు కాకూడదు? 'విష్ణుః పర్వతానామధిపతిః' అని వేదం చెప్పినట్లు ఆ కొండలబొమ్మలలో దాగున్న దైవశక్తికి మనసా

నమస్కరించాము. ఆ కొండల వద్దకు వెళ్ళడానికి 'రోప్‌వే'ను ఏర్పాటు చేసారు. వేమున్న ఐపాయింట్ నుండి క్రిందకు చూస్తే అంతు తెలియని అగాధం. మరో స్థలం నుండి అయితే త్రీ సిస్టర్‌ను చేరుకోవడానికి ప్రాకృతికమైన రాతి వంతెన ఉన్నది. దాన్నివారు 'ఈకో వాక్' అని పిలుస్తారట. అంటే 'పవిత్రమార్గం' అని అర్థం... శ్రీస్వామివారు 'సుపథా' అని పేరు పెట్టారు.

'గృహంగచ్ఛేత్ జనార్దనః' అంటూ భట్టర్ స్వామి ఇంటి దారి పట్టించారు. అంటే.... అర్థం ఏమిటండీ! అని అడిగాం. అనర్థం కాదుగా ఇదో భగవన్నామస్మరణ... అని నవ్వేశారు. 'లెట్స్‌గో' అన్నట్లుగా ఆయన సరదాగా ఈ పదాన్ని తరచు వాడుతూంటారు. కార్య దక్షతకల కార్యకర్త. అలుపు సొలుపు, లేకుండా నవ్వుతూ, నవ్విస్తూ నడిపించే కార్యనిర్వాహకుడుకూడ. మేము సరదాగా ఆ 'హృషీకేశు' గారికి 'ఖుషీకేసు' అని పేరుపెట్టుకున్నాము. రాత్రి వరదరాజన్ గారింటిని చేరాము.

4వ తేదీ అంతా భగవద్బంధువు పరిచయాలతోనే జరిగిపోయింది. దండాస్ ప్రాంతంలోని శ్రీ హేమంత్ గారింటికి వెళ్ళాము. నల్లగా, పొట్టిగా ఉండే ఈయన 'స్వచ్ఛమైన' హృదయంతో 'ఉన్నతు'డైన వ్యక్తి. శ్రీవారంటే చక్కని భక్తి శ్రద్ధలు కలవారు. 4 రోజుల క్రితం వీరింటినుడే సుమారు 25 పేజీల భక్తినివేదన మేటర్‌ను ఫాక్స్‌ద్వారా పంపించాము. సాయంత్రం Westroy ప్రాంతంలో సందేశం... సిడ్నీలో చివరి ప్రవచనం.

5వ తేదీ తిరువారాధనాదులను ముగించుకుని బ్రిస్‌బేన్‌కు బయలుదేరాము. సుమారు వారం రోజులుగా సకలవిధ సౌకర్యాలతో కూడిన ఇంటిని మా సొంతం చేసిన వరదరాజన్, కోకిలమ్మ దంపతులను ఎంతో శ్లాఘించారు శ్రీస్వామివారు. ప్రత్యేకంగా శేషవస్త్రాలను బహుకరిస్తూ మంగళాశాసనం చేసారు. ఆ దంపతులు ఆనంద బాష్పాలతో శ్రీస్వామివారిని సేవించారు.

శ్రీనారాయణరెడ్డిగారు, హేమంత్, ఆత్రేయ దంపతులు, గోపీ, రాధ, నవీన్, శ్రీమాన్ 'ఖుషీకేస్' భట్టర్‌స్వామి, ప్రభృతులు మమ్మల్ని సాగనంపడానికై ఎయిర్‌పోర్ట్‌కి వచ్చారు.

మధ్యాహ్నం 2-20 ని॥లకు గాలిలోకి ఎగిరిన విమానం గంట ప్రయాణంతో 3-10 ని॥లకు బ్రిస్ బేన్ నగరానికి చేరింది. మమ్మల్ని స్వాగతించడానికై శ్రీమాన్, రాజా హేమమాలిని దంపతులు, శ్రీమాన్ పద్మన్, లక్ష్మీ దంపతులు వచ్చారు. పద్మన్ దంపతులు జన్మతః బ్రిటిషర్స్, అయినా వారిని జన్మాంతర భాగ్య విశేషంచేత మన వైదిక ధర్మంమీద ఆసక్తి కలిగింది. ముఖ్యంగా వీరు శ్రీ పెరుంబుదూర్ జీయర్‌స్వామివారి శ్రీపాద సంబంధీకులు. మైఖేల్ అని పేరుగల వీరుసమాశ్రితుడై పద్మనాభన్ అని పేరు మార్చుకున్నారు. వీరి భార్య లక్ష్మీగారు వారి ముందుపేరు చెప్పడానికే ఇష్టపడలేదు. ఎప్పుడూ తన పేరు లక్ష్మియే... ఎప్పటికీ తన పేరు లక్ష్మియే అనడం మాకు ఆశ్చర్యంగా అనిపించింది. వీరితోపాటు వచ్చినవారు రాజా హేమ దంపతులు. బ్రిస్ బేన్‌లోని కార్యక్రమమంతా శ్రీపద్మన్‌గారే నిర్వహిస్తున్నారు. వీరి శ్రీమతి, లక్ష్మిగారు పూనాలోని బి.కె.యస్. అయ్యంగారి యోగా ఇన్‌స్టిట్యూట్‌లో కొద్దికాలం 'యోగా'ను నేర్చుకున్నారుట. ఆవిడ ద్వారా పద్మన్‌గారు నేర్చుకుని బ్రిస్ బేన్‌లో అయ్యంగార్ యోగా సెంటర్‌ను నడుపుతున్నారు. ఇద్దరు మన భారతీయ వేషధారణతోనే ఉంటున్నారు.

ఎయిర్‌పోర్ట్ నుండి సుమారు అరగంట ప్రయాణంతో ప్రకాష్‌గారింటికి చేరాము. 'ఫిజి' దేశానికి చెందిన భారతీయ కుటుంబాలలోని వీరు 'ఇస్కాన్' సంప్రదాయాన్ని స్వీకరించారు. ప్రకాష్





– కరుణ దంపతులు చక్కని భక్తిశ్రద్ధలు కలవారు. వారింట్లో పాదపూజకాగానే నార్త్‌వెల్లీ ప్రాంతంలోని 'భారతీయ టెంపుల్‌కి' వెళ్ళాము. కీర్తనతో ప్రారంభమైన కార్యక్రమంలో శ్రీస్వామివారు 'పరత్వాది పంచకం' పేరు చెప్పకుండానే భగవంతుని ఐదు స్థానాల గురించి, అర్చావతార వైభవం గురించి, ఆలయం యొక్క ఆవశ్యకత గురించి ప్రవచించారు. ఆలయం నుండి తిరిగి వస్తూ ఒక నార్త్ ఇండియన్ విశాల్‌జీ గారింటికి వెళ్ళాము. వీరు చాలా శ్రీమంతులు. చాలామంది భారతీయులు వీరి ఆశ్రయంలో జీవిస్తున్నారుట. వారి శ్రీమతి సుధేష్ణగారు, మాటల మధ్యలో ఆవిడ విగ్రహారాధనపై తనకు గల అనాసక్తతను ప్రకటిస్తూ... నిత్యం ఆవిడ చేసే శూన్యంలో ప్రణవోపాసన గురించి ప్రస్తావించారు. శ్రీస్వామివారికి వెంటనే కోపం వచ్చింది...... చెడిపోతున్న సంతానాన్ని చూచి కన్నతండ్రి తెచ్చుకునే కోపంలా హితకరంగా ఉంది ఆ కోపం. ఐదు నిముషాల కంటే ఎక్కువ ఉండవద్దనుకున్న శ్రీస్వామివారు, వారి అపోహ తీర్చడానికై అరగంటకుపైగా ఉన్నారు. ధ్యానం గురించి, విగ్రహారాధ వైశిష్ట్యం గురించి, సందేహ నివారణ పూర్వకంగా వివరించారు. ఆ దంపతులు కళ్ళలో 'జ్ఞానోదయం ఇప్పుడే అయిందన్న కవళికలు కనిపించాయి. శ్రీవారిని స్వాగతించేటప్పుడు ఔదాసీన్యంగా ఉన్న వారిద్దరూ ఎంతో విధేయతతో, మర్యాదగా ప్రవర్తించారు. వారి పూజా గదిలో చక్కని శ్రీకృష్ణ విగ్రహమున్నది. శ్రీస్వామివారు ఆరాధనను నిత్యం చేసుకోమని ఆజ్ఞాపించి రాత్రి ప్రకాష్ గారింటికి చేరాము. రేపటి యజ్ఞానికి పూర్వరంగాన్ని సిద్ధంచేసుకున్నారు మనవాళ్ళు.

6వ తేది ఉదయం తిరువారాధన తీర్థగోష్ఠి కాగానే వారింట్లోనే వెనుక ప్రక్క శ్రీసుదర్శన యాగం మొదలయ్యింది. వానపడే సూచనలు కనిపించినా మూడు గంటలపాటు యజ్ఞం పూర్తయిన తర్వాత వాన పడింది. పూర్ణాహుతి కాగానే పడిన ఆ వానను శ్రీస్వామివారు అవబృథస్నానంగా అభివర్ణించారు. ఎండతో కూడిన వాన దివ్యమైనదిగా శాస్త్రం చెప్పడాన్ని సూచించారు.

డా॥ చామల శంకరయ్యగారు, శ్రీమాన్ రాజా, హేమగారిళ్ళల్లో పాదపూజలను స్వీకరించి శ్రీవారు పద్మన్‌గారి కోర్కెమేరకు బ్రిస్‌బేన్ బీచ్ వద్దకు సపరివారంగా చేరారు. శ్రీమాన్ పద్మన్‌గారి నేతృత్వంలో సముద్రతీరంలోనే 'శాంతియాత్ర' సాగించాము. ఈ పాదయాత్రలో మన వారితోపాటు, లోకల్ పీపుల్‌కూడా పాల్గొన్నారు. శాంతియాత్ర ఆరంభంలోనే శ్రీవారు గీతాజ్యోతి సూత్రాలను వివరించారు. శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రం పారాయణం చేస్తూ శాంతి యాత్రను సాగించాము. అలాంటి ప్రదేశాల్లో ఇలాంటివి అరుదుగా ఉంటాయేమో... మమ్మల్ని అనుమానిస్తూ (పరిశీలిస్తూ) ఒక పోలీస్, జీపులో ఆద్యంతం అనుసరించాడు. 'శాంతి' యాత్రగా గుర్తించి వెళ్ళిపోయాడు. ఆ బ్రిస్ బీచ్ ప్రాంతం చాలా ఖరీదయినదట. ఇలాంటి సెంటర్లో అప్పర్ ఫ్లోర్‌ని అద్దెకు తీసుకుని అయ్యంగార్ యోగా సెంటర్‌ను నడిపిస్తున్నారు. పద్మన్ దంపతులు. వారి యోగా సెంటర్‌లోనే సాయంకాల సందేశాన్ని అనుగ్రహించారు. దాదాపు 150 మంది ఆస్ట్రేలియన్లు (వైట్స్) పాల్గొన్నారు.. తత్త్వ నిరూపణంతోపాటు తమాషాగా సాగింది ప్రవచనం. మనుష్య పదానికి యాస్కమహర్షి చెప్పిన 'మత్వా కర్మాణి సీవ్యతి ఇతి మనుష్యః' అనే నిర్వచనాన్ని జోడిస్తూ 'గీతాజ్యోతి' సూత్రాలను విశదీకరించారు.

యోగా సెంటర్‌లో భగవద్రామానుజులవారి అందమైన పెద్ద తైలవర్ణ చిత్రం. ప్రక్కనే వారి యోగాచార్యులు అయిన బి.కె.యస్. అయ్యంగారి ఫోటో... వారి వివిధాసనాల భగవంతులతో కూడిన ఫోటోలు నాలుగు వైపుల గోడల నిండా ఉంచారు. ద్వారం వద్ద చక్కని స్వరూపం. శంఖచక్రాలతో కూడిన తెన్గళ తిరునామం. చాలా సాంప్రదాయికంగా ఉంది ఆ యోగాభ్యాసమందిరం.

అక్కడి నుండి శ్రీ పద్మన్‌గారి కోర్కెను కాదని అనలేక ఆ రాత్రి వారింట్లో విశ్రాంతి తీసుకోవడానికి అంగీకరించారు. రాత్రి వారింట్లో విశ్రాంతి బి.కె.యస్. అయ్యంగారి యోగ ప్రదర్శన వి.సి.డి.ని వీక్షించాము. రబ్బరు బొమ్మలా వారు శరీరాన్ని త్రిప్పుతూ, ఆశ్చర్యకరంగా యోగాసనాలను ప్రదర్శించారు. ముఖ్యంగా వారు ఎంతటి కష్టమైన ఆసన స్థితిలో ఉన్నా ఎలాంటి మార్పు లేని గొంతుతో ఆ ఆసనాన్ని వివరిస్తూ వ్యాఖ్యానించడం... మరింత ఆశ్చర్యకరంగా అనిపించింది.

శ్రీపద్మన్‌గారిల్లు... సంప్రదాయాన్ని బాగా అర్థంచేసుకున్న వారి 'తిరుమాళిగలా' ఉంది. ఇంటి ముందు పూజకు పనికి వచ్చే పూలతోట. ఇంటిముందు 'స్వరూపం' ఇత్తడి ఫ్రేమ్. ఎక్కడ చూచినా శ్రీవైష్ణవ చిత్రాలే తప్ప.... మచ్చుకైనా దేవతాంతర చిత్రం లేక పోవడం... ముఖ్యంగా భగవద్రామానుజుల చిత్రానికి ప్రాధాన్యాన్ని కలిగించి ఉంచడం... ఇలా వారి 'తిరుమాళిగ' ఎంతో సంప్రదాయంగా ఉంది. సాత్త్వికాహార సంపన్నులై, సత్సంప్రదాయ ప్రపన్నులై అన్యోన్యంగా ఉన్న ఆ దంపతులను చూస్తే చాలా ఆనందం కలిగింది.

7వ తేది ఉదయం తిరువారాధన కాగానే శ్రీస్వామివారు పద్మన్ – లక్ష్మిగార్ల కోర్కెమేరకు యోగాసెంటర్‌ని మళ్ళీ వేంచేసారు. వారి వద్ద అభ్యసించేవారు సుమారు 150 మంది వరకు ఉన్నారు. వారందరి యోగాసనాలను శ్రీస్వామివారు చూసి సూచనలు ఇచ్చారు. 'యోగం' యొక్క ప్రాశస్త్యాన్ని వివరించారు. శ్రీపద్మన్ గారింట్లో తీర్థగోష్ఠిని ముగించుకుని ఎయిర్ పోర్ట్‌కి బయలుదేరాము. దారిమధ్యలో పద్మన్‌గారు శ్రీస్వామివారితో మాట్లాడుతూ **'భగవద్రామానుజులవారికి పెద్ద ఆలయాన్ని నిర్మించాలని ఉందని'** విన్నవించారు. వారి ఆచార్య భక్తి శ్లాఘనీయమనిపించింది.

సుమారు 11-30 ని॥లకు ఎయిర్‌పోర్ట్ నుండి బయలుదేరి దాదాపు 4 గం॥ల ప్రయాణంతో 'న్యూజిలాండ్' ద్వీపానికి చేరాము.

**'కంగారు'పడకండీ...!! ఇంకాఉంది....!!!**









## బదరికాశ్రమంలో పునర్నిర్మించే సత్సంగ సదనం నిర్మాణ నిమిత్తం విరాళములు సమర్పించిన దాతలు

**అభిమానులు :** శ్రీమాన్ టి. మరిడయ్య, విశాఖపట్నం, శ్రీమతి కె. రాములమ్మ, బోడివలస; శ్రీమాన్ కె. వెంకటేశ్వర్లు పల్లపాడు; శ్రీమతి జె. బుల్లమ్మాయి, జి.మేడపాడు; శ్రీమాన్ ఎమ్. బుచ్చిరాజు, శ్రీమాన్ వి. అప్పారావు, శ్రీమతి ఎమ్. సుప్రియ, శ్రీమాన్ ఎన్. సత్తిరాజు, విశాఖపట్నం; శ్రీమాన్ జె.ఎన్.మూర్తి, కాకినాడ; శ్రీమతి ఎమ్. సరోజనమ్మ, పత్తికొండ; శ్రీమతి సిహెచ్. సుభద్రమ్మ, ప్రత్తికొండ; శ్రీమాన్ బి. వెంకటరాజు, విజయవాడ; శ్రీమాన్ ఎ. విశ్వేశ్వరరావు, చెన్నై; శ్రీమాన్ డి. సిద్ధారెడ్డి, హైద్రాబాద్; శ్రీమాన్ ఎమ్. సరోజినీదేవి, శ్రీమాన్ జి. హన్మంతరెడ్డి, శ్రీమతి పి. లక్ష్మి, శ్రీమాన్ జి. మోహన్‌రెడ్డి, నిజామాబాద్; శ్రీమాన్ డి. సీతారామలింగేశ్వరరావు, చెన్నై, శ్రీమాన్ బి.వై. కృష్ణమూర్తి, శ్రీమాన్ ఎస్. నాగమల్లేశ్వరరావు, శ్రీమాన్ వై. సుబ్బారావు, శ్రీమాన్ కె. రంగారావు, శ్రీమాన్ కె. వెంకటరత్నం, విజయవాడ; శ్రీమతి జి. విమల, హైద్రాబాద్; శ్రీమతి బి. వసుమతి, శ్రీమతి కె. సరసమ్మ వడ్లపూడి; శ్రీమాన్ ఎస్.వి. త్రినాథ్, పాలకొల్లు; శ్రీమాన్ సిహెచ్. శంకరరావు, శ్రీమాన్ ఎ. బంగారుబాబు, రాజమండ్రి; శ్రీమాన్ జి.వి. లక్ష్మీకాంతారావు, అమలాపురం; శ్రీమాన్ వై. వెంకటరత్నాజీరావు, తాళ్ళపూడి; శ్రీమాన్ జి.వి. రెడ్డయ్య, పాలకొల్లు, శ్రీమాన్ కె.వి. బాలకృష్ణారావు, విజయవాడ; శ్రీమాన్ సిహెచ్. సత్యన్నారాయణ మూర్తి, భీమవరం; శ్రీమాన్ ఎ. విశ్వేశ్వరరావు, దొడ్డిపట్ల; శ్రీమాన్ జి. వెంకట్రావు, అప్పనపల్లి; శ్రీమతి పి. సుజాత, శ్రీమాన్ కె. వెంకటేశ్వర్లు, ఏలూరు; శ్రీమాన్ డి.ఎల్. నరసింహారావు, పాలకొల్లు; శ్రీమాన్ బి. చిన్న అప్పారావు, శ్రీమాన్ వై. కృష్ణమూర్తి, భీమవరం; శ్రీమాన్ ఎమ్. రామకృష్ణారెడ్డి, శ్రీమాన్ ఎ. సుందరం, శ్రీమతి సిహెచ్. రాజేశ్వరి, శ్రీమతి జి. లక్ష్మమ్మ, శ్రీమతి కె. రమణమ్మ, శ్రీమతి జి. సుబ్బమ్మ, శ్రీమాన్ కె. సుబ్బరామయ్య, నెల్లూరు; శ్రీమాన్ డా॥ యం. కృష్ణారావు, లావేరి; శ్రీమాన్ బి. శ్రీనివాసులు, విజయవాడ; శ్రీమాన్ జి. మల్లుశాస్త్రి, గుడివాడ; శ్రీమాన్ సిహెచ్. సత్యన్నారాయణ, గుంటూరు; శ్రీమాన్ పి. కృష్ణంరాజు, ఏలూరు; శ్రీమాన్ బి. తిరుమలాశ్రీనివాస్, భట్టిప్రోలు; శ్రీమాన్ పి. సూర్య నారాయణరాజు ఏలూరు; శ్రీమాన్ కె. శివరామరాజు, హైదరాబాద్; శ్రీమాన్ డి. సూర్యకాంతమ్మ, విజయవాడ; శ్రీమాన్ టి. రమణమ్మ, విజయవాడ; శ్రీమతి సిహెచ్. వరహాలమ్మ, విజయవాడ; శ్రీమాన్ యు. పరశురామయ్య, సిరిసిల్ల; శ్రీమాన్ ఎమ్.వి. సోమరాజ్, నరసాపూర్; శ్రీమాన్ ఎమ్. శేషవతారం, తాడేపల్లి; శ్రీమతి ఎమ్. సూర్యవతి, విజయవాడ; శ్రీమాన్ టి.వి.వి. సత్య నారాయణరెడ్డి, విజయవాడ; శ్రీమాన్ కె. లచ్చిరాజు, భీమవరం; శ్రీమాన్ ఎమ్. సత్యన్నారాయణ రాజు, తాడేపల్లిగూడెం; శ్రీమాన్ కె. సాంబశివరావు, కొత్తపేట; శ్రీమాన్ బి. బిందుమాధవి, భీమవరం; శ్రీమాన్ ఆర్. శంకరయ్య, జొన్నలగడ్డ; శ్రీమాన్ ఎమ్. రామకృష్ణయ్య, శ్రీమాన్ వై. నరసింహరావు, ఖమ్మం; శ్రీమాన్ పి. గంగిరెడ్డి, వైజాగ్; శ్రీమాన్ డి. హనుమాన్‌రెడ్డి, రుద్రాక్షపల్లి; శ్రీమాన్ ఆర్. సత్యన్నారాయణ, తాడివాయ్; శ్రీమతి వై. కోటమ్మ, గౌరిగూడెం; శ్రీమాన్ టి. ప్రసాదరావు, గంగవరం; శ్రీమాన్ పి. రంగారెడ్డి, మార్లపూడి; శ్రీమాన్ ఎన్. సత్యన్నారాయణ, లింగగూడెం; శ్రీమాన్ ఎస్. మల్లయ్య, బేతుపల్లి; శ్రీమాన్ సిహెచ్. కృష్ణమూర్తి, ధర్మవరం; శ్రీమాన్ ఎమ్. రాఘవాచారి, బేతుపల్లి; శ్రీమాన్ జి. జగన్నాధగుప్త, విశాఖపట్నం; శ్రీమాన్ డి. ఆదిశేషు, శ్రీమతి లక్ష్మి, కంకిపాడు; శ్రీమాన్ జి. లక్ష్మీకాంతం, హైదరాబాద్; శ్రీమతి కె. గాయత్రిదేవి, హైదరాబాద్; శ్రీమాన్ టి. నాగేశ్వరరావు, శ్రీమాన్ జి. బాపారావు, శ్రీమాన్ వి. సాంబశివరావు, గుంటూరు; శ్రీమాన్ శ్రీరామచంద్ర జీయర్‌స్వామివారు, భీమవరం; శ్రీమాన్

కె. ప్రభాకరరావు, విశాఖపట్నం; శ్రీమాన్ పి. సుబ్బారావు, గుంటూరు; శ్రీమాన్ కె. రామ కోటేశ్వరరావు, గుంటూరు; శ్రీమాన్ టి. వెంకట సుబ్బారావు, గుంటూరు; శ్రీమాన్ జి. నారాయణ మూర్తి, గంగలకుర్రు; శ్రీమాన్ జి. రాఘవయ్య, కోదాడ; శ్రీమాన్ బి. ప్రేమ్‌కుమార్, హైదరాబాద్; శ్రీమాన్ బి. వి. వెంకటేశ్వర్లు, సంగం; శ్రీమాన్ ఎ.వి. మల్లిఖార్జునరావు, గుంటూరు; శ్రీమాన్ జి. చక్రపాణి, హన్మకొండ; శ్రీమాన్ కె. సూర్యమాణిక్యరావు, నరసాపూర్; శ్రీమాన్ ఎన్. వెంకటేశ్వర్లు, తాడేపల్లిగూడెం; శ్రీమతి యు. లక్ష్మి, హైదరాబాద్; శ్రీమాన్ జి. నాగయ్య, హన్మకొండ; శ్రీమాన్ డి.వి. సుబ్బారావు, హన్మకొండ; శ్రీమాన్ డి. కోదండరామిరెడ్డి, నెల్లూరు; శ్రీమతి ఎ.రంగమ్మ, నెల్లూరు; శ్రీమాన్ జి. లక్ష్మీనారాయణరెడ్డి, చెర్లపాలెం; శ్రీమాన్ ఎమ్. గోపాలరెడ్డి, నెల్లూరు; శ్రీమాన్ రుద్రరాజు సూరపరాజు, సికింద్రాబాద్; శ్రీమాన్ వై. రంగారావు, హైదరాబాద్; శ్రీమాన్ డి. మహేశ్వరరావు, నూజివీడు; శ్రీమాన్ కె.ఆర్.వి. సుబ్బారావు, నూజివీడు; శ్రీమాన్ ఎ. రామ్‌మోహన్, నెల్లూరు; శ్రీమాన్ బి. హేమలతా జయకర్, హైదరాబాద్; శ్రీమాన్ ఎస్. నరసారావు, దిబ్బలపాలెం; శ్రీమాన్ కె. మాధవనారాయణ గుప్త, శ్రీమాన్ కె. శాంతభూషణ్ రావు, బెరహంపూర్; శ్రీమాన్ ఎల్. మనోహరదాసి, చవటపాలెం; శ్రీమాన్ ఎ. శివకుమార్‌రెడ్డి, చెన్నై; శ్రీమాన్ ఎన్.వెంకటరామరెడ్డి, నెల్లూరు; శ్రీమాన్ కె. శ్రీనివాసాచార్యులు, శ్రీమాన్ కె. శ్రీరంగచార్యులు, శ్రీమాన్ ఎ. నరసింహాచార్యులు, శ్రీమాన్ వై. శ్రీనివాసాచార్యులు, శ్రీమాన్ పి. రంగాచార్యులు, శ్రీమాన్ సిహెచ్. తిరుమలాచార్యులు, శ్రీమాన్ ఎ. వెంకటాచార్యులు, శ్రీమాన్ జి. రాఘవాచార్యులు, హైదరాబాద్; శ్రీమాన్ ఎ. రాఘవాచార్యులు, యాదగిరిగుట్ట; శ్రీమాన్ టి. శ్రీనివాసాచార్యులు, హైదరాబాద్; శ్రీమాన్ ఎ. అప్పలాచార్యులు, హైదరాబాద్; శ్రీమాన్ జె. లక్ష్మీనరసింహాచార్యులు, కుక్కునంపల్లి; శ్రీమతి ఎ. గోదాదేవి, హైదరాబాద్; శ్రీమాన్ పి. సత్యన్నారాయణ, తాడేపల్లిగూడెం; శ్రీమతి కె. రాజ్యలక్ష్మి, నెల్లూరు; శ్రీమాన్ టి.కె. శ్రీహరి, చెన్నై; శ్రీమాన్ ఎస్. సుబ్బారెడ్డి, గొల్లలమామిడాడ; శ్రీమాన్ బి. బాబులు, గొల్లలమామిడాడ; శ్రీమాన్ పి.ఎమ్. ప్రసాదరావు, నెల్లూరు; శ్రీమాన్ టి. గోపాలరావు, సాలూరు; శ్రీమాన్ వి.వెంకటరమణమూర్తి, సాలూరు; శ్రీమాన్ వి. సత్యన్నారాయణ, సాలూరు; శ్రీమాన్ కె. పాపారెడ్డి, కుమ్మరపాలెం; శ్రీమాన్ ఎమ్. సత్యనారాయణరెడ్డి, కొమరపాలెం; శ్రీమాన్ ఎస్. శివతేజరెడ్డి, కాకినాడ; శ్రీమాన్ ఎస్. భువనేష్‌రెడ్డి, కాకినాడ; శ్రీమాన్ ఎమ్. సత్యనారాయణ, కమరపాలెం; శ్రీమాన్ ఎ. వీరభద్రరావు, వైజాగ్; శ్రీమతి ఆర్. భద్రమ్మ, వైజాగ్; శ్రీమాన్ ఎస్. వెంకటరెడ్డి, కమరపాలెం; శ్రీమాన్ ఎస్. వరప్రసాద్, విజయవాడ; శ్రీమాన్ ఎ.కె. యాదగిరియ్య, వీరధి; శ్రీమతి ఎ.కె. సీతమ్మ, శ్రీమాన్ ఎన్.సిహెచ్. వేదాంతా చార్యులు, సిద్ధిపేట; శ్రీమాన్ సిహెచ్. వీరరాఘవయ్య, రేబాల; శ్రీమాన్ వి. రఘునాధరెడ్డి, ఈదగాలి; శ్రీమాన్ కె. శివనారాయణ, వనపర్తి; శ్రీమాన్ ఎమ్. రఘు, చెన్నై; శ్రీమాన్ ఎమ్. నిఖిల్, శ్రీమతి పి. బుజ్జమ్మ, కొవ్వూరు; శ్రీమాన్ జి. హనుమాయమ్మ, మనగుంటపాడు; శ్రీమతి జి. బుజ్జమ్మ, మణిగుంటపాడు; శ్రీమాన్ జి. యానాదిరెడ్డి, మానెగుంటపాడు; శ్రీమాన్ ఎస్. బాలరామిరెడ్డి, బుచ్చిరెడ్డిపాలెం; శ్రీమతి బి. అన్నపూర్ణమ్మ, ఒంగోలు; శ్రీమాన్ జి. రాధాకృష్ణమోహన్, కొవ్వూరు; శ్రీమాన్ ఎమ్. గోపాలరావు, జోగిపోట; శ్రీమాన్ సిహెచ్. నరసింహస్వామి, జోగిటేట; శ్రీమతి సిహెచ్. సుశీలాబాయి, జోగిపేట; శ్రీమాన్ కె. కన్నబాబు, చింతలపాలెం; శ్రీమాన్ ఎమ్. ప, బెంగుళూరు; శ్రీమాన్ కె.ఎస్.ఎన్.చౌదరి, విశాఖపట్నం; శ్రీమాన్ జి. గోవిందరాజు, విశాఖపట్నం; శ్రీమాన్ డి. సత్యనారాయణ, మూరమల్ల; శ్రీమాన్ ఎమ్. వరాలమ్మ, కాకినాడ; శ్రీమాన్ వి. సోమేశ్వరరావు, కాకినాడ; శ్రీమాన్ పి. నారాయణమూర్తి, నర్సీపట్నం; శ్రీమాన్ జె. వెంకటేశ్వరరావు, కాకినాడ; శ్రీమతి పి. అమ్మాజీ, నర్సీపట్నం.
















# ఇతిహాస బోధ - 15

సాధారణంగా సామాజిక జీవితంలో వ్యక్తులు తమ యోగ్యతలకు తగ్గ విధంగా గుర్తింపును పొందుతూంటారు. వారు తమ వృత్తులలో రాణించే విధానాన్ని బట్టి సమాజం వారిని గౌరవిస్తూంటుంది. పంచాయతీలోని వార్డు మెంబర్ దగ్గరనుండి ప్రైమ్ మినిస్టర్ వరకూ ప్రజాసేవకులుగా తమ యోగ్యతలను నిరూపించుకొనే ఆయా పదవుల్లో కొనసాగగలుగుతున్నారు. ప్రభుత్వోద్యోగులుగా పనిచేసే బిళ్ళ బంట్రోతు నుండి బడాబడా ఐ.ఎ.ఎస్., ఐ.పి.యస్. ఆఫీసర్ల వరకూ కూడా తమ అర్హతలకు తగ్గ పరిధిలోనే సేవలందించగలుగుతున్నారు.

కర్మాగారంలో కార్మికుడూ, హోటల్లో సర్వరూ, హాస్పిటల్‌లో డాక్టరూ, పొలంలో రైతూ - అంతా తమ తమ అస్తిత్వాన్ని నిలబెట్టుకునేందుకై తమదైన శైలిలో సేవలందిస్తున్నవారే... దేశకాలమాన పరిస్థితులకు అనుగుణంగా వారి సేవల 'నాణ్యత'ను గుర్తించి, అందుకు తగ్గ 'ప్రతిఫలాన్ని' సమాజం అందిస్తూంటుంది. అయితే చాలామంది వ్యక్తులు తామందించే 'సేవ'ల విలువలను తామే మదింపు చేసుకొని, తమ శ్రమకు తగ్గ గుర్తింపు, గౌరవం, ప్రతిఫలం లభించడంలేదని వాపోతుండటం మనం గమనిస్తూంటాం.

నిత్యజీవితంలో సాగే సణుగుళ్ళు, గొణుగుళ్ళు, గందరగోళాలు, శాపనార్థాలు, తగాదాలు, తన్నులాటల వెనుక ఉన్న రహస్యం ఈ 'ఐడెంటిటీ క్రైసిస్సే' - అచ్చ తెనుగులో చెప్పాలంటే గుర్తింపుకై జరిగే గందరగోళమే.

ఈ సంక్షోభంలోఇరుక్కొన్న ప్రతివాడూ ప్రక్కవాడు తన హక్కులను, వ్యక్తిత్వాన్ని, ప్రయోజనాలను గుర్తించటంలేదనీ, అధః పాతాళానికి తనను అణగద్రొక్కడానికి ప్రయత్నిస్తున్నాడనీ అనుమానపడుతుంటాడు. ఆందోళన చెందుతుంటాడు. పర్యవసానంగా పరస్పర విద్వేషం.... విధ్వంసం. వ్యక్తులమధ్య, జాతులమధ్య, దేశాలమధ్య చెలరేగే హింసాకాండకు, మారణ హోమానికి - వెనుక ఉన్న మూల కారణం - 'మానవ అహంకారపు ఆధిపత్యపు ఆరాటమే'.

ఎదుటి వాడినుండి ఏదో ఒకటి ఆశించడం అది పొందినప్పుడు పరవశించడం, భంగపడ్డప్పుడు బాధపడటం దీనికి అలవాటు. తానెంత చేసినా తనకు లభించింది ఇదేనా అని ఆక్రోశించడం, అసంతృప్తి పడటం దీని సహజలక్షణం. కాసేపు నవ్వులతో మరికాసేపు ఏడ్పులతోసాగే ఈ 'అహంకారపు మూసబ్రతుకు' పట్ల విసుగు కలిగి, విడుదల పొందే మార్గాన్ని వెతుకులాడే క్రమంలోనే మానవుడు మాధవుని శరణువేడే ప్రయత్నం చేస్తుంటాడు.

సర్వవ్యాపకమైన, సర్వశక్తివంతమైన 'పరమ అస్తిత్వం' ఒకటి ఉన్నదని, దానిని తాను ఆశ్రయించవలసి ఉందనీ గ్రహించ గలిగినప్పటికీ, జీవుడు తన అజ్ఞానంచేత ఆ మహాశక్తి ద్వారా తన 'అహంకారాన్ని' మరింతగా తృప్తిపరచుకోవాలని విఫల ప్రయత్నం చేస్తుంటాడు. పర్యవసానంగా మాధవునికి అతడందించే సేవలు తక్షణ ప్రయోజనాన్ని ఆశించే 'కూలీ' సేవలుగా మిగిలిపోతుంటాయి.

ఈ కూలీలల్లో ఎవడో, కోటికొక్కడు 'తెలివి'గలవాడుంటాడు. వాడు తన యజమాని 'సత్తా' తెలిసినవాడు. తన 'తప్పు' లెరిగినవాడు అయితే తనను తాను సవరించు కొంటూ 'యజమాని'కి 'షరతులు' లేని సేవకుడుగా మారే సాధన చేస్తూంటాడు. ఏకాఎకిన మాధవుడిని పొందాలనుకొనే 'బుద్ధిమంతుడైన ఈ పెద్దకూలీ' నిరంతరం తన యోగ్యతలను పెంచుకుంటూనే. సర్వప్రాణుల లోను మాధవుడిని దర్శించి, సేవించడానికి ప్రయత్నిస్తుంటాడు.

ఈ క్రమంలో అతడు స్పర్థకు బదులు స్నేహాన్ని, ద్వేషానికి బదులు ప్రేమను, క్రోధానికి బదులు శాంతాన్ని, లోభానికి బదులు త్యాగాన్ని, సంఘర్షణకు బదులు సహజీవనాన్ని, హింసకు బదులు అహింసను - ఒక్క ముక్కలోచెప్పాలంటే ఆసురీ సంపత్తికి బదులు దైవీ సంపత్తిని పెంచుకుంటూ ఉంటాడు. అలాంటి జీవుడు మనిషైతేనేం, మృగమైతేనేం, చెట్టైతేనేం, పక్షైతేనేం - మనకు అత్యంత ఆదరణీయుడు ఆదర్శ ప్రాయుడున్నూ.

అలాంటి 'ఆదర్శవంతమైన జీవితాన్ని' గడిపిన ఓ పక్షి గాథను ఈ సారి 'ఇతిహాస బోధ - 15' లో మనం తెలుసుకొనే ప్రయత్నం చేద్దాం.

దాక్షాయణీ కశ్యప ప్రజాపతుల పుత్రుడైన నాడీజంఘుడనే పక్షిరాజు గంగానదీ సమీపానగల కీకారణ్యంలోని ఓ పెద్ద మఱ్ఱిచెట్టు మీద జీవిస్తూండేవాడు. అందరినీ రంజింప చేసే ధార్మిక వర్తనం కలిగినవాడు కావడంచేత అతడిని 'రాజధర్ముడ'ని కూడ పిలుస్తూండే వారు. పరమ భాగవతోత్తముడూ, మహా విద్వాంసుడూ అయిన అతడి సాంగత్యాన్ని చతుర్ముఖ బ్రహ్మ కూడా కోరుతూండే వాడట. అందుచేత ప్రతిరోజూ నాడీ జంఘుడు బ్రహ్మలోకానికి వెళ్ళి బ్రహ్మను దర్శించేవాడు.

సృష్టికర్త అయిన బ్రహ్మకు ఇష్టసఖుడననే గర్వం అతనిలో ఈషణ్మాత్రమైనా లేదు. తానుజీవించే అడవిలో మూడు యోజనాల అవతల ఉన్న మధువ్రజపురాధీశుడైన విరూపాక్షుడనే రాక్షసరాజుతో కూడా రాజ ధర్ముడు ఎంతో ఆత్మీయతతో మెలిగేవాడు. ఆ రాక్షసరాజు రాజధర్ముని సాంగత్యం చేత తమ జాతిసహజమైన క్రూరకర్మలను మాని సాధువర్తనంతో జీవిస్తూండేవాడు.

ఒక రోజు నాడీజంఘుడు యథాప్రకారం తన బ్రహ్మలోక యాత్రను, విరూపాక్షుని దర్శనాన్ని పూర్తిచేసుకొని సాయం సంధ్యా సమయానికి తన నివాసస్థానమైన మఱ్ఱిచెట్టు మీదికి చేరాడు. అతడికి చెట్టుక్రింద ఆకలి దప్పులతో బాధపడుతూ మూలుగుతున్న ఓ మానవుడు కన్పించాడు. అతనికి ఆశ్చర్యమూ, ఆనందమూ కలిగాయి.

'నాయనా! నీ వెవరివో కాని ఈ కీకారణ్యంలో ఈ సంధ్యాసమయంలో నా నివాసానికి చేరావు. నీకు స్వాగతం పలుకు తున్నాను. నాకు అతిథి సేవాభాగ్యాన్ని కల్గించి నందుకు నీకు కృతజ్ఞతలు దయచేసి నా సేవలు స్వీకరించు' - అని అప్పటికప్పుడు ఆ మానవాతిథి కోసం చితుకులతో చలిమంట వేసి, గంగానదిలోని చేపలతో అతని ఆకలి తీర్చాడు.

రకరకాల పూలతో అతనికి శయ్యను ఏర్పరచి తన ఱెక్కలతో విసురుతూ ఆ మానవాతిథి యొక్క శ్రమను పోగొట్టాడు. ఆ రాత్రి నాడీ జంఘుని సపర్యల కారణంగా ఆ కారడవిలో నిర్భయంగా నిద్రించాడా మానవుడు.

నాడీ జంఘుడు ఆతిథ్యానికి ముందే అతిథి వివరాలు తెలుసుకున్నాడు. దారి తప్పి





వచ్చిన ఆ వ్యక్తి పేరు గౌతముడు. మధ్య దేశంలోని ఓ విప్రకుటుంబంలో అతడు పుట్టినప్పటికీ, బ్రాహ్మణ సంస్కారాలు ఒక్కటీ అతనికి అలవడలేదు. దుర్వ్యసనాలకు లోనై వేదాధ్యయనాన్ని విడచి మ్లేచ్ఛవాడల్లో యథేచ్ఛా విహారం సాగించాడు. ఒక బోయ వనితను వివాహమాడి వేటను వృత్తిగా చేసుకొని కిరాత జీవనాన్ని అలవరచుకొన్నాడు.

అతని భోగలాలసత్వాన్ని తృప్తి పరిచేంతటి సంపద అతని వృత్తి వల్ల లభించకపోవడంచేత ఎలాగైనా ధనాన్ని సంపాదించాలని భావించాడు. వ్యాపారమే ఇందుకు సరైన మార్గమని నిశ్చయించుకొని తమ పల్లె ప్రక్కగా వెళుతున్న వ్యాపారులగుంపులో తానూ చేరాడు.

ఆ సార్థవాహుల బృందం అడవిలో ప్రయాణిస్తూ ఓ పర్వత గుహావద్ద విశ్రమించింది. వారి దురదృష్టం కొద్దీ ఓ మదపుటేనుగు వారిమీదికి ఉరికి, దొరికిన వారిని దొరికినట్లుగా మట్టగించసాగింది. మరణించినవారు మరణించగా మిగిలినవారు ప్రాణరక్షణకోసం తలా ఒక దిక్కూ పరుగెత్తారు. అదృష్టవిశేషంచేత గౌతముడు అలా పరుగెత్తి నాడీజంఘుడి ఆశ్రయాన్ని పొందగలిగాడు.

మరుసటిరోజు ఉదయం తెల్లవారాక నాడీజంఘుడు తన అతిథికి మరింత ఆనందాన్ని కల్గించాలని నిర్ణయించుకొన్నాడు.

'మిత్రమా! సంపదకోసం నీవు ఎన్నో అగచాట్లు పడ్డావు. దేవగురువు బృహస్పతి సంపద నాలుగు రకాలుగా లభిస్తుందంటాడు.

1. వంశ పారంపర్యంగా పూర్వీకుల నుండి సంక్రమించేది.
2. మన ప్రారబ్ధానుకూలంగా సంప్రాప్తించేది.
3. సకామకర్మ మూలంగా లభించేది.
4. స్నేహితుని వల్లపొందేది.

నీవు నాకు మిత్రుడివయ్యావు. కొన్ని గంటలపాటు నీ సాహచర్యపు మాధుర్యాన్ని నాకు చవిచూపించావు. ఆ ఋణాన్ని తీర్చుకొనే అవకాశాన్ని నాకివ్వు.

ఈ కనపడే బాటలో నీవు ముందుకు సాగితే మూడు యోజనాల తర్వాత మధు వ్రజమనే నగరమొస్తుంది. నా ప్రియనేస్తమైన విరూపాక్షుడు ఆ పట్టణానికి ఏలిక. రాజ ధర్ముని మిత్రుడనని చెప్పి అతడిని ఆశ్రయించు. అతడు తప్పక నిన్ను సంపన్నుడిని చేస్తాడు.' అని నాడీజంఘుడు గౌతముడికి మాట ఇచ్చాడు.

గౌతముడు నగరాన్ని చేరి విరూపాక్షుని ఆతిథ్యం స్వీకరించాడు. గౌతముడి అవలక్షణాలను, ధూర్తత్వాన్ని గ్రహించినప్పటికీ విరూపాక్షుడు తన మిత్రుడైన రాజధర్ముని మీద ఉన్న వాత్సల్యంచేత గౌతముడిని ఎంతగానో గౌరవించాడు.

మరుసటి రోజు కార్తీక పౌర్ణమి కావడంతో వేలాది బ్రాహ్మణులకు విరూపాక్షుడు బంగారు పళ్ళాలలో పంచ భక్ష్యపరమాన్నాలతో పసందైన విందు భోజనాన్ని ఏర్పాటు చేసాడు. ఆ బంగారు పళ్ళాలతోపాటు అంతులేని సంపదలను వారికి దక్షిణగా ఇచ్చి సాగనంపాడు.

గౌతముడు కూడ మోయలేనంతటి బంగారాన్ని మూట కట్టుకొని ఆయాస పడుతూ ఆ రాత్రి నాడీజంఘుడి నివాసానికి చేరాడు. యథాప్రకారం నాడీ జంఘుడు గౌతమునికి ప్రేమతో సకల సేవలూ చేసాడు. గౌతమునితో కబుర్లు చెబుతూ అతని ప్రక్కనే నాడీజంఘుడు కూడా నిద్రించాడు.

తెల్లవారు ఝామున గౌతముడు నిద్రలేచాడు. 'ఇక్కడికి నా పల్లె ఎంతో దూరం. ఇంత బంగారాన్ని మోసుకు వెళుతూ, దారిలో

ఎక్కడని ఆహారం కోసం వెతుకులాడేది. నా ప్రక్కన నిద్రిస్తున్న ఈ వెఱ్ఱికొంగ బ్రహ్మాండమైన మాంసంతో క్రొవ్వెక్కి నన్ను ఊరిస్తున్నది. దీని మాంసమే నా మార్గ మధ్యానికి తగిన ఆహారం. కనుక ఇప్పుడే దీనిని సంహరిస్తాను'. అని నిర్ణయించుకొని రాజధర్ముడిని నిర్దయతో చంపివేసాడు గౌతముడు.

ఆ కొంగ ఈకలను, ప్రేగులను తీసివేసి మాంసాన్ని మూటకట్టుకొని మఱ్ఱిచెట్టును వీడి తన ఊరి మార్గం పట్టాడు గౌతముడు.

ఆ రోజు విరూపాక్షుడికి అన్నీ దుశ్శకునాలే ఎదురైనాయి. 'ఈపాటికి రావాల్సిన నాప్రియ మిత్రుడు' రాజధర్ముడు ఇంకా ఎందుకు రాలేదా' అని అతడు వ్యాకులపడసాగాడు. కుమారుడిని పిలిచి 'నాయనా! రాజధర్ముడు ఇంకా రాకపోవడం నాకు ఆందోళన కల్గిస్తున్నది. ఒక్కసారి అతని నివాసానికి వెళ్ళి అతడి క్షేమసమాచారాన్ని తెలుసుకొనిరా...! ఎందుకంటే మిత్రుడని అతడు పంపిన నరుడు అంత నమ్మదగిన వ్యక్తిగా నాకు తోచడం లేదు. రాజధర్ముడికి అతని వల్ల ఏదైనా కీడు జరిగిందేమోనని నాకు భయంగా ఉంది. వేగంగా వెళ్ళు' అని శాసించాడు.

భటులతో పాటుగా వెళ్ళిన రాజ కుమారుడు మఱ్ఱిచెట్టు వద్దఉన్న ఈకలను, ప్రేగులను గమనించి, జరిగిన దారుణాన్ని అర్థంచేసుకొన్నాడు. వెంటనే భటులను పంపి పారిపోతున్న గౌతముడిని, రాజధర్ముని మాంసంతో సహా పట్టుకొని తండ్రి ముందుంచాడు.

విరూపాక్షునితోపాటు మధుప్రజ ప్రజలంతా రాజధర్ముని దుర్మరణానికి తీవ్రంగా శోకించారు. విరూపాక్షుడు ఆగ్రహంతో 'గౌతముడిని చంపి తినం'డని రాక్షసభటులను ఆజ్ఞాపించాడు.

'ఇలాంటి కృతఘ్నుడైన మహాపాపి శరీరాన్ని భుజించి పాపాన్ని మేము మూట కట్టుకోలేము. మన్నించండ'ని రాక్షస భటులు ప్రభువు ఆజ్ఞను సున్నితంగా తిరస్కరించారు. రాక్షస భటులు గౌతముడిని చితకబాది అతనిపైకి వేటకుక్కలను ఉసికొలిపారు. అయితే ఆశ్చర్యకరంగా ఆ కుక్కలు కూడా ఈ కృతఘ్నుడి దేహ మాంసాన్ని భుజించడానికి వెనుకంజ వేసాయి. కుక్కలు కూడా ముట్టనొల్లని మలిన దేహమైంది గౌతముడిది.

దుఃఖిస్తూనే, విరూపాక్షుడు రాజధర్ముడి దేహానికి దహనసంస్కారాలు ఏర్పాటు చేసాడు. అదే సమయంలో దేవేంద్రుడు అక్కడకు వచ్చాడు. విరూపాక్షుడు మిత్రవియోగ దుఃఖంతో సంకట పడుతూ, దేవేంద్రునికి జరిగిన దారుణాన్ని వివరించే ప్రయత్నం చేసాడు.

మహేంద్రుడు 'విరూపాక్షా! దిగులు చెందకు. రాజధర్ముడు నీకేకాదు, నాకూ, బ్రహ్మదేవునికీ కూడా ఇష్టసఖుడని నీకు తెలియదా...! నీకో మాహాత్మ్యం తెలుపుతాను. ఆలకించు.

ఆకాశమార్గాన కామధేనువు పయనిస్తూ తన దూడకు పాలిస్తున్నది. ఆ దూడ నోటినుండి జారిపడ్డ పాలనురుగు నీవు ఏర్పరచిన రాజధర్ముడి చితిని చేరి అతడిని పునరుజ్జీవితుడిని చేసింది. బ్రహ్మదేవుడి అనుగ్రహ విశేషంచేత ఈవిధంగా నాడీజంఘుడు బ్రతికి నీవద్దకు వస్తున్నాడు చూడు.' అని మహేంద్రుడు విరూపాక్షునికి నాడీజంఘుని చూపి ఆనందం కల్గించాడు.

నిద్రనుండి లేచి వచ్చిన వానివలె ఎటువంటి వికారాలు లేకుండా నాడీ జంఘుడు మిత్రులను కలుసుకొన్నాడు. 'మిత్రులారా! ఈ బ్రాహ్మణుడు తెలియక అజ్ఞానంతో వ్యవహరించాడు. దయచేసి ఇతనిని మీరు మన్నించి, ధనరాశితో అతనిని





ఇంటికి పంపండి.' అని నాడీజంఘుడు మహేంద్రుని, విరూపాక్షుడిని గౌతముని క్షేమంకోసం ప్రార్థించాడు.

మిత్రుని మనసెరిగి వారూ వర్తించారు. రాజధర్ముని దయకారణంగా గౌతముడు సంపదతో తన గూడు చేరి గంపెడు సంతానంతో యథాప్రకారం తన పాపకర్మలను పెంచుకొంటూ పోయాడు. ఆవగింజంత పశ్చాత్తాపమైనా లేని బ్రతుకు బ్రతికి నరకంలో శాశ్వతంగా నివాసానికి తగిన అర్హతను సంపాదించుకొన్నాడు.

రాజధర్మునిరూపంలో సత్సాంగత్యం లభించినా వికాసమెరుగని వికారాల బ్రతుకు గౌతముడిది. ప్రాణహాని కల్గించిన వాడిని కూడా ప్రేమించే తత్త్వం రాజధర్ముడిది. స్వీయ భోగానికే ప్రపంచమని భావించి ఇంద్రియ లోలత్వానికి పరిమితమైన అహంకార జీవితం ఒకడిదైతే, ఇతరుల ఆనందంలో తన ఆనందాన్ని దర్శించే అవధులెరుగని దివ్యప్రేమ మరొకడి సొంతం. ఎండమావి సౌఖ్యాలకోసం వెఱ్ఱిపరుగులెత్తే కట్టుబానిస ఒకడైతే జగత్స్వరూపుడైన జగదీశ్వరుడికి ఊడిగంచేసే స్వచ్ఛంద సేవకుడు మరొకడు.

ఇక మన విషయానికొస్తే.... రోజుకు 16 గం॥లకుపైగా నిర్విరామంగా శ్రమిస్తూ లోకసంగ్రహంకోసం దేశ, విదేశాలు సంచరిస్తూ ధార్మికప్రబోధం కావిస్తున్న ఆచార్యుని సాంగత్యం పూర్వజన్మ సుకృతవిశేషం కొద్దీ మనకు లభించింది.

ఈ అనుబంధాన్ని బలోపేతం చేసుకోవడం కోసం వాడవాడల్లోనూ మనం 'వికాస తరంగిణు'లు ఏర్పరచుకొంటున్నాం. మనకు తోచిన, చేయగలిగిన సేవలేవో చేస్తున్నాం. అయితే కలసి ఈ సేవలందించే కొన్ని సందర్భాలలో కార్యకర్తల మధ్య స్పర్థలు పెరిగి, మాటలతో మనసులను గాయపరచుకొని ముఖం ముఖం చూసుకోవడానికి కూడా ఇష్టపడని పరిస్థితులేర్పడుతున్నాయి.

వికాసంకోసం గోష్ఠిగా ఏర్పడి, వికారాలతో బాధపడే విచిత్ర పరిస్థితి ఇది. వాడంటే వీడికిపడదు. వీడంటే వాడికి పడదు. గోష్ఠిని పెంచుకోవడానికి బదులు, త్రుంచుకొని, 'వేరుకుంపటి' పెట్టుకొని, సేవలొలక పోయాలని కొందరు 'కార్య'కర్తలు పట్టుదలలకు పోతూంటారు. వారికీ, వీరికీ అందరికీ తమ అహానికి ఆటంకం కానంతవరకూ 'స్వామి' వారంటే ప్రాణం. కానీ, స్వామివారు ఆశించేది మాత్రం అహాన్ని అణచి అందరితో కలసి అణకువగ మసిలే మానసిక పరివర్తన అది పండించుకునే ప్రయత్నం చేయకపోతే స్వామివారిపై ప్రేమకు అర్థం శూన్యం.

ఈ సందర్భంగా మనం గుర్తుంచు కోవాల్సింది ఒకటుంది. స్వామివారిపట్ల మన అభిమానాన్ని సాష్టాంగ నమస్కారాల ద్వారా సంభావనల సమర్పణలద్వారా మాత్రమే మనం ప్రకటిస్తే చాలదు. ఉత్తమమైన 'మాధవుని సేవకులు'గా మనం మారాలనే శ్రీస్వామివారి సంకల్పానికి అనుగుణంగా మన జీవన విధానం మారాలి.

మన మనసు మారాలి. మాట మారాలి. చేత మారాలి. ఎదుటివాడు చేసే చప్పుడుకు మనం చిందులు త్రొక్కడం మానాలి. అప్పుడే 'మాధవసేవగా - సర్వప్రాణి సేవ' చేయగల యోగ్యత మనకు లభిస్తుంది. ఈ దిశగా మనం ఆలోచించి, మన యోగ్యతలను పెంచుకోవడానికి 'నాడీజంఘునికథ' ఉపయోగపడుతుందని ఆశిద్దాం.

**యథాప్రకారం ఈ కథకు కూడా తగినపేరు సూచించడంతోపాటు మీరుకూడా ఈ "శీర్షిక"కు ఇలాంటి కథలు పంపే ప్రయత్నం చేయండి.**

## ఇతిహాసబోధ - 15 శీర్షికకు పాఠకులు పంపిన కొన్ని పేర్లు

1. **ఎంత ఆత్మసాక్షాత్కారం, భగవత్ ప్రాప్తి సంపాదించిన భక్తుడైన అహం ఉన్నంత వరకు ఫలితము ఉండదు.** -డా॥ యమ్. గణేశ్వరరావు, విజయవాడ
2. **బలవంతమైన సర్పం చలిచీమల చేత చిక్కి చావదే సుమతి** - ఆర్.సుమ, హనుమకొండ.
3. **పరపీడకోరని హృదయం పరమాత్ముని నిలయం** -యస్. పుష్పలత, కరీంనగర్.
4. **తన ఆధిపత్య ప్రదర్శనం కోసము ఎదుటివాడు ఏమైపోయినా ఫరవాలేదనే మనస్తత్వం జరాసంధుడు.** -యమ్.సూర్యనారాయణ, మెళియాపుట్టి
5. **మూఢభక్తి అయినా ఫరవాలేదు కాని ఆత్మవంచన చేసుకుంటు స్వార్థ పూరితమైన క్రూర ఆరాధన, క్షుద్ర పూజలువంటివి ఎప్పటికైనా జరాసంధునిలా పతనమవక తప్పదు** - కె. రామశేషమ్మ, హిల్‌కాలనీ.
6. **ధర్మద్రోహం - దైవ ద్వేషం పతనానికి కారణం** - యమ్. జయప్రకాశ్, హన్మకొండ.
7. **'నరబలులు దైవాను గ్రహానికి తోడ్పడవు అనేది మన గీతాజ్యోతి మొదటి నియమం' మాధవ సేవగ సర్వప్రాణిసేవ' ముఖ్య ఉద్దేశ్యం** - వి. విష్ణువర్ధన్, మామిళ్ళగూడెం.
8. **అధర్మ వర్తనుడి అంతమే భగవదేచ్ఛ** - యమ్. చంద్రమౌళి, నాగర్ కర్నూల్.
9. **క్రూర ఆరాధన ఆధిక్య బల ప్రదర్శన కలవారు ఎంతటి ప్రతాప వంతులైన వారి చేతలచే నశించుదురు** - జె. రాధాకృష్ణ అప్పారావు, బి.సావరం.
10. **బలము, అధికారగర్వము ఉన్నవారికి దైవభక్తి ఉన్న వ్యర్థమే అట్టివారికి పతనము తప్పదు.** - కొత్త కృష్ణయ్య, నాగర్ కర్నూల్.
11. **దుష్టరాక్షస పాలనకు శ్రీకృష్ణ దండం శిష్టరక్షణ** - వి. బాపిరాజు, విశాఖపట్నం.
12. **ఏపనిచేసిననూ దైవం దృష్టిలో నుండి తప్పించుకోవడం అసాధ్యం.** - వి. సుజాత, హైదరాబాద్.
13. **నరబలి నైవేద్యం, దైవం మెచ్చని అధర్మ కార్యం** - ఆర్. చక్రపాణి, హనుమకొండ.
14. **బలపరాక్రమవంతులకు వినయ విధేయతలు దైవానుగ్రహంను, బలగర్వితులకు ప్రాణహాని కలిగించును.** - యమ్. విశ్వనాథం,విజయనగరం.
15. **దుష్ట శిక్షణ భక్తరక్షణ భగవంతుని బాధ్యత**
16. **నేలపై జీవించడంకంటే నలుగురి నోళ్ళలో (మంచిగా) జీవించడం గొప్ప..** - యస్. చైతన్య, గుంటూరు.
17. **స్వధర్మం వీడితే పతనము ఖాయం** - ఆండాళ్ భాస్కర్, తోటపాలెం.
18. **అహంకారానికి అంతిమ ఫలితము పతనమే** - ధప్పూరి శ్రీధరాచార్య, అదిలాబాద్.
19. **ధర్మద్రోహులకు, దైవద్వేషులకు మరణమేగతి** - బొండా వీర్రాజు, జగ్గంపేట
20. **స్వార్థచింతనతో, పాపకర్మలతో దైవానికి సమర్పించే నైవేద్యము వృధా ప్రయాస** - సి. పాపిరెడ్డి, నిర్మల్
21. **జరాసంధుని 'క్రూర ఆరాధన' భీమ బల ప్రదర్శనతో ముగుస్తుంది. ధర్మరాజు వారి ఆరాధన శ్రీకృష్ణ కరుణతో రాజసూయ యజ్ఞం చేయిస్తుంది.** - జె. అమరయ్య, అమరావతి.
22. **గీతాజ్యోతి ద్వారా మనలోని 'జరాసంధుని అహంకార ఛాయలు తొలగించాలి.** - బి. శ్రీవల్లి ఆండాళ్, విజయవాడ.
23. **సమదృష్టి అలవరచుకొందాం - మానవతా విలువలు పెంపొందించు కొందాం.** - ఆర్. అనయసూయ, అనంతపురం
24. **జరాసంధ తత్త్వానికి తిలోదకాలిద్దాం నిర్మల ధర్మ కర్మని నిర్మాణం చేద్దాం.** - వి. శ్రీనాథకవి, తాడిపత్రి
25. **అహంకారం, గర్వము, కోరికలు తగ్గించుకొనుట వలన దైవభక్తి సిద్ధించి అందరియందు ప్రేమ జనించును.** - యన్. ఉమామహేశ్వరరావు, అనకాపల్లి.
26. **ధర్మో భ్రంశతి భక్షితః - ధర్మో భ్రష్టతి భక్షితః** - యమ్. పాండురంగాచార్య, హన్మకొండ.
27. **విషద్వేషాల్ని విరిచేద్దాం - కృష్ణ తత్త్వాన్ని స్థాపిద్దాం.** - వి. శేషాచార్య, హైదరాబాద్.
28. **చెడును త్రుంచుదాం, మంచిని పెంచుదాం.** - వి. నరసింహాచార్య, శ్రీరంగపురం
29. **భగవంతుని ప్రేమ పొందాలనుకొనే వ్యక్తి అహంకారం గర్వంను విడిచిపెట్టాలి.** -ఐ.రంగనాయకీ,సికింద్రాబాద్
30. **జరాసంధుని కథ - ధర్మానికి తీరని వ్యధ** - యన్. వియజదుర్గా ప్రసాద్, అడసర్లపాడు.
31. **ధర్మయుద్ధానికి ఆరంభం జరాసంధవధ - ముగింపు కురుక్షేత్ర సంగ్రామం** - ఆర్. రామలక్ష్మి, దుగ్గుదూరు.
32. **ఆత్మను క్షోభింపచేసి పరమాత్మను చేరుకోలేవు** - డా॥ సిహెచ్. హనుమంతరావు.
33. **ధర్మోరక్షిత రక్షితః**– జి.వియస్ఆర్.రావు, రాజమండ్రి
34. **భక్తుడైనను బలవంతుడైనను నీతిని ధర్మాన్ని వదల కూడదు.** - యమ్.విశ్వనాథం, హన్మకొండ.
35. **త్రికరణ శుద్ధే మోక్షానికి సోపానము** - జె. రాధామధుసూదనరావు, కరీంనగర్.
36. **భగవంతునిపట్ల అవిధేయత - దానికి శాస్తి** - కె. అప్పలరాజు, బొబ్బిలి.
37. **దైవ ప్రీతికొరకు అని భావించి పాపకర్మలు చేయరాదు.** - ఎ.వీరాచార్యులు, మచిలీపట్నం.

**వీరందరికీ శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములను అందజేస్తున్నాం. - వికాసతరంగిణి**





# వికాస దర్శిని నివేదన

### ఉగాది, శ్రీరామనవమి

ఉగాది నుండి శ్రీరామనవమి వరకు శ్రీరామాయణ తరంగిణి నిర్వహించడానికి శ్రీశ్రీశ్రీస్వామివారు ఏప్రిల్ 1వ తేదీ రాత్రికి చెన్నై చేరారు. కుచిలాంబాళ్ కళ్యాణమండపాన్ని మన వికాసతరంగిణివారు చాలా చక్కగా అలంకరించి శ్రీసీతారాములకి, శ్రీశ్రీశ్రీ స్వామివారికి స్వాగతం పలికారు.

2వ తేదీ ఉగాదినాడు ఉ॥ శ్రీసీతా రాములకి పరివారానికి తిరుమంజనం కావించి శ్రీస్వామివారు పంచాంగశ్రవణం చేయించారు. చిత్రభాను కన్నా 'స్వభాను' నామ సంవత్సరం కొంత మెరుగుగానే ఉంటుందన్నారు. అయినా కాలం పెట్టే పరీక్షలని దైవ ప్రార్థనతో, ఆచార్యకటాక్షంతో ఎదుర్కొని ముందుకు సాగగలగాలని మంగళాశాసనాలు కావించినారు. అనంతరం శ్రీరామాయణ పారాయణం శ్రీరామనవమి నాటికి పూర్తిచేయాలన్న సంకల్పంతో శ్రీస్వామివారు ప్రారంభించారు. అనేక మంది భక్తులు శ్రీస్వామివారిని అనుసరించి పారాయణలో పాల్గొన్నారు.

ఉదయం పారాయణ చేసిన సర్గలలోని సారాన్ని, విశేష అంశాలను సాయంత్రం ప్రవచన రూపంలో శ్రీస్వామివారు అనుగ్రహించారు. శ్రీరామనవమినాటికి యుద్ధకాండ తప్ప మిగిలిన కాండలన్నీ సంపూర్ణమైనాయి.

4వ తేదీ సా॥ పారాయణ క్రమాన్ని అనుసరించి పాదుకా పట్టాభిషేక మహోత్సవాన్ని నిర్వహించారు. చిన్ని చిన్ని వెండి పాదుకలను శ్రీస్వామివారు స్వయంగా భక్తులకి అనుగ్రహించి, ఆయా శ్లోకాలను పఠింపచేసి, పూజాకార్యక్రమాన్ని అనుగ్రహించారు.

### శ్రీమద్ భగవద్రామానుజ తిరునక్షత్ర వేడుకలు హన్మకొండలో...

హనుమకొండ వికాసతరంగిణివారు నిర్వహించు గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగా శ్రీమద్ భగవద్రామానుజ తిరునక్షత్ర వేడుకలను **శ్రీశ్రీశ్రీ స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో** జరుపుటకు **మే 6వ తేదీన** నిర్ణయించినారు. ఈ కార్యక్రమంతో **9 ధర్మక్షేత్రముల గీతాజ్యోతి** కార్యక్రమమును శ్రీవారు ప్రారంభిస్తారు.

కావున భగవద్బంధువులందరూ విరివిగా పాల్గొని భగవత్ రామానుజులవారి కృపకు, శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములకు పాత్రులకాగోరిక....

ఇట్లు........ **వికాసతరంగిణి - హన్మకొండశాఖ**

5వ తేదీ రాత్రి ప్రవచనానంతరం రాయపేటలోని శ్రీవేంకటేశ్వర ఆలయాన్ని దర్శించి రథోత్సవాన్ని ప్రారంభించారు. గత కొన్ని సంవత్సరాలుగా అక్కడ జరుగుతున్న ఆండాళ్ గోష్ఠివారికి మంగళాశాసనాలు కావించారు. అదే రోజు మధ్యాహ్నం బదరీ అష్టాక్షరీ క్షేత్రీయ అన్నదాన శాఖా సంఘ సమావేశ కార్యక్రమం జరిగింది. శ్రీస్వామివారి నేతృత్వంలో కుమారి ఉషశ్రీ ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

6వ తేది పారాయణ అనంతరం మధ్యాహ్నం స్థానిక ఆంజనేయనగర్‌లోని హనుమ ఆలయాన్ని సందర్శించి అక్కడి భక్తగోష్ఠికి గీతాజ్యోతి సందేశాన్ని అందించి మంగళాశాసనాలు కావించారు. అనంతరం వాణీ మహల్‌కి శ్రీమాన్ చల్లా ప్రకాశ్‌గారి ఆహ్వానంపై విచ్చేసారు. అక్కడ వారి అభ్యర్థన మేరకు, నిత్యం సంతోషంగా ఉండగలగడానికి, శాంతికి మనం చేయాల్సిన సాధన ఏమిటి? అనే అంశంపై ప్రవచించి, ఆపై శ్రోతల సందేహాలకి సమాధానాలు అనుగ్రహించారు.

7వ తేదీ తెల్లవారు ఝామున ఆలయంలో కుంభ ప్రోక్షణ కావించారు. సా॥ సభలో శ్రీమాన్ నిరంజన్ గారు ఎంతో శ్రద్ధతో తయారు చేసిన **Purana Padakeli** పుస్తకాన్ని ఆవిష్కరించారు.

8వ తేదీ ఉ॥ ఆకాశమార్గంగా వైజాగ్ చేరి శ్రీ ఉ.వే.శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారి తిరునక్షత్ర మహోత్సవంలో పాల్గొని, వారికీ, వారి పరివారానికి మంగళాశాసనాలు కావించి తిరిగి సా॥ సభకి చెన్నై చేరుకున్నారు.

9వ తేది సా॥ శ్రీఉ.వే.శ్రీమాన్ కె.యస్. రామానుజాచార్యస్వామివారి 'యతిరాజ సప్తతి' పుస్తకావిష్కరణ చేసారు. రాత్రి ప్రవచనానంతరం బయలుదేరి శ్రీమతి & శ్రీమాన్ రుక్మిణీ పార్థసారథిగారి గృహానికి వేంచేసి మంగళాశాసనాలందించారు. అనంతరం తుకారాం వీధి, హరిజన కాలనీలో సుమారు 100 సం॥ల నుండి వేంచేసి ఉన్న శ్రీరామచంద్ర స్వామివారి ఆలయాన్ని సందర్శించారు. అక్కడి వారు శ్రీశ్రీశ్రీ పెద్దస్వామివారు వేంచేసిన నాటి నుండి మన స్వామివారెప్పుడు వేంచేస్తారా అని శబరిలాగా ఎదురుచూస్తున్నారు. వారందరి తపన తీరేటట్లుగా శ్రీస్వామివారు తమ దివ్య







దర్శనాన్ని అందిస్తూ, ఆత్మీయమైన అనుగ్రహభాషణంతోపాటు గీతాజ్యోతి సందేశాన్ని అందించారు. అనంతరం తిరువత్తియూర్ మాతుమండలోని పశువైద్య శిబిరానికికూడా వేంచేసి అర్ధరాత్రి అయినా సహనంగా ఎదురుచూస్తున్న భక్తులందరికీ గీతాజ్యోతి సందేశపూర్వక మంగళాశాసనాలు కావించారు.

10వ తేది మధ్యాహ్నం చెన్నై యూనివర్సిటీలోని 'డిపార్ట్‌మెంట్ ఆఫ్ వైష్ణవిజమ్'కి వేంచేసారు. దానికి ప్రారంభకులుగా ఉండి తగిన గుర్తింపు తెచ్చిన ఫౌండర్ శ్రీమాన్ యమ్. నరసింహాచార్య పేర మెమోరియల్ ఎండోమెంట్ లెక్చర్‌ని ప్రారంభించారు. వైష్ణవ సంప్రదాయ విలువలను, విశిష్టాద్వైత వైభవాన్ని గురించి ప్రసంగించి శ్రీస్వామివారు నిర్వాహకులందరికీ మంగళాశాసనాలు కావించారు.

13వ తేదీ గంగావతి చేరారు. శ్రీమాన్ రామారావుగారు శ్రీమాన్ కృష్ణమూర్తిగార్లు ఏర్పాటు చేసిన సమావేశంలో పాల్గొని మేల్కోట తదీయారాధన ఏర్పాట్ల గురించి చర్చించి 14 సా॥ హుబ్లీ చేరారు. శ్రీమాన్ చిగురుపాటి వెంకట సత్యవరప్రసాద్, శ్రీమాన్ వాసిరెడ్డి గోపాలకృష్ణగార్లు ఏర్పాటు చేసిన కార్యక్రమంలో పాల్గొని మంగళాశాసనాలు కావించారు.

15వ తేదీ దావణగేరె వేంచేసారు. అక్కడి మన వికాసతరంగిణి సమన్వయకర్త శ్రీమాన్ వీరభద్రరావుగారు, శ్రీమాన్ సత్యనారాయణ గారు కార్యక్రమాన్ని ఏర్పాటు చేసారు. 9సం॥ల క్రితం శ్రీస్వామివారు దావణగేరెవేంచేసినప్పుడు వేసవిలో చలివేంద్ర నిర్వహణచేయాలని, అలాగే అక్కడ మన ఆంధ్రప్రదేశ్‌కి చెందిన వైద్య విద్యార్థులు ఎందరో ఉన్నందువలన 2 నెలలకొకసారైనా ఒక్కొక్క విభాగానికి చెందిన ఉచిత వైద్య శిబిరాలని నిర్వహించాలన్న సూచనలను ఆజ్ఞగా భావించి మన వికాసతరంగిణి వారు నిర్వహిస్తూ వస్తున్నారు. ప్రతీ సంవత్సరం ఏప్రిల్ నెల మొదలుకొని వేసవి ఎండలు తగ్గేవరకు చలివేంద్రాలను ఏర్పాటు చేసి దాహార్తుల తాపానికి ఉపశమనం కలిగిస్తున్నారు. అందులోనూ అందరిలా మంచినీళ్ళతో కాక చల్లటి మజ్జిగతో గత 9సం॥లుగా ఈ చలివేంద్రాలని నిర్వహిస్తూండడం దావణగేరే వికాసతరంగిణి ప్రత్యేకత. ఇలా చలివేంద్రాల పద్ధతి మన ఆంధ్రలో అలవాటే కానీ, అక్కడి వారికి కొత్త. అందులోనూ ఉచితంగా చల్లటి మజ్జిగ నిరంతరంగా అందించడమనేది అక్కడి వారందరికీ ఆశ్చర్యంగాను ఆనందంగాను అన్పించి స్థానిక వార్తా పత్రికలన్నీ కూడా మన వికాసతరంగిణి సేవలను కీర్తించాయి. స్థానిక స్వామీజీలంతా కూడా ఆయా కేంద్రాలకి వచ్చి స్వయంగా చూచి మంగళాశాసనాలందించారు.

రోజూ నాలుగువేల రూపాయల పాలుకొని కాచి పెరుగుచేసి, వెన్నతీసి, ఆ మజ్జిగను వితరణ చేయడం జరుగుతోంది. ఏ రోజుకారోజు ఉభయదారులు 4,000 సమర్పించడమేకాక, వారే స్వయంగా వచ్చి కొంత సేపు మజ్జిగ వితరణ చేసి వెళ్తున్నారు. ఏ రోజు వచ్చిన వెన్న ఆరోజు ఉభయదారులకి అందించడం జరుగుతోంది. గత 2సం॥లుగ అక్కడ మంచినీటికి కూడా కొరత ఏర్పడినా మన వికాసతరంగిణివారు రోజుకి 7,000

నుండి 10,000 మందికి చల్లని మజ్జిగని అందించడం ఎనలేని సేవాకార్యక్రమంగా ఆ ప్రాంతం వారందరూ అభినందిస్తున్నారు. మన శ్రీస్వామివారు కూడా 15వ తేది ఆ సేవా కేంద్రాన్ని సందర్శించి మంగళాశాసనం కావించారు. 16వ తేదీ శ్రీమాన్ వీరభద్రరావుగారి రైస్ మిల్లుని సందర్శించి అక్కడి ఆలయాలని సందర్శించి రాత్రికి మేల్కోట చేరారు.

1977వ సం॥లో మేల్కోట తిరు నారాయణ పెరుమాళ్ ఆరాధనా సమితిని శ్రీశ్రీశ్రీ పెద్దజీయరుస్వామివారు నైవేద్యం, నిత్య ఆరాధనలు సక్రమంగా జరగాలని ప్రారంభించారు. రోజుకి 15 కిలోల బియ్యం, దానికి తగిన కూరగాయలు, పప్పులు ఇతర పదార్థాలన్ని మన సమితి తరపున ఆలయానికి ఇచ్చేట్లుగా ఏర్పాటు చేసారు. అప్పట్లో శ్రీశ్రీశ్రీ పెద్దజీయరుస్వామివారు ఏదైనా ఒక చిన్న గృహం మేల్కోటలో తీసుకొని అక్కడి నుండి ఈ వస్తుసామగ్రినంతటినీ ఏ రోజుకారోజు ఆలయానికి అందిస్తే బాగుంటుందను కొన్నారు. కానీ, దానిమీద అంత దృష్టిపెట్టే అవకాశం లేదు. శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్‌స్వామి వారు ఆ సంకల్పానికి, కార్యరూపంతెచ్చే బాధ్యతని దావణగేరే వికాసతరంగిణికి అప్పగించడంతో శ్రీమాన్ వీర భద్రరావుగారు 1 లక్ష రూపాయలతో ఆలయ వెనుక భాగంలో కొంత స్థలాన్ని కొని సమితికి సమర్పించారు. గత సం॥ ఏప్రిల్ నెలలో భగవద్రామానుజ జయంతికి శ్రీస్వామివారు మేల్కోట వేంచేసి ఆ స్థలంలో శంకుస్థాపన చేయడం జరిగింది. నీటికోసం ఆ స్థలంలో బోర్‌వేస్తే చక్కటి నీరు పడింది. ఈ సం॥ 'వైరముడి' సందర్భముగా దర్శనానికి వచ్చిన భక్తులందరికీ 2 క్వింటాళ్ళ ప్రసాదంతోపాటు మన బోరింగ్‌లోని నీటితో ఎంతో మంది దాహార్తికి ఉపశమనం కలిగించే అవకాశం ఏర్పడింది. ఈ నెల 17వ తేదీ ఆ స్థలంలో నిర్మాణం పూర్తి చేసుకొన్న బిల్డింగ్ గృహ ప్రవేశం జరుపాలని నిర్ణయించారు.

భవనం క్రిందిభాగంలో 200 మంది కూర్చోగలిగే మండపం, మొదటి అంతస్థులో 4 గదులు, 1 హాల్ నిర్మించారు. ఇవికాక వెనుక వైపు నిర్వాహకులు ఉండటానికి వీలుగా నిర్మాణం ఇప్పుడే ప్రారంభం చేసారు. ఇంతవరకు చేసిన నిర్మాణమంతా ఏడాది లోపులోనే సుమారు 10 లక్షలు విరాళాలుగాను, 5 లక్షలు లోను రూపంలోను సేకరించి నిర్మించడం జరిగింది. ఇంకొక 5 లక్షలు ఉంటే నిర్మాణం సమగ్రంగా పూర్తయి యాత్రికులకి చక్కటి వసతి ఏర్పడుతుంది. ప్రతి గదిలోను కావలసిన మిగతా సామగ్రి తోపాటు నిత్య తదీయారాధనకి ఏర్పాట్లు చేయాలని 16వ తేదీ నాటి రాత్రి సమావేశంలో సభ్యులంతా నిర్ణయించగా శ్రీస్వామివారు దానికి ఆమోదముద్ర వేసారు.

17వ తేదీ ఉ॥ ప్రారంభోత్సవానంతరం మంగళాశాసనాలుకావిస్తూ, నిర్మాణం పూర్తిచేసుకొన్న భవనానికి అవసరమైన 10 లక్షలు ధనాన్ని కూడా ఉత్సాహం అవకాశం కలిగిన దాతలకి తెలియజేద్దామని అన్నారు.

ఇక్కడి నుండి ఈ భవనం రెండు సేవలకి వినియోగించాలని శ్రీస్వామివారన్నారు. 1. కోవెలలో పెరుమాళ్ నిత్యఆరాధనలో భాగంగా బియ్యంతోపాటు తగిన ఇతర ఆహారపదార్థాల్ని సమకూర్చడం. 2. సామాన్య దినాల్లో రోజుకి 25 మందికి, వారాంతపు దినాల్లో, విశేష





ఉత్సవాలలో 150 నుండి 200 మందిదాక తదీయారాధనకి కావలసిన సామగ్రి పరికరాలు ఏర్పాటు చేయాలి. ప్రస్తుతం బదరికాశ్రమంలో తదీయారాధన జరిపిస్తున్నట్లుగానే దక్షిణ బదరీగా పేరొందిన మేల్కోట తిరు నారాయణుని సన్నిధిలో కూడా తదీయారాధన ఆరంభమవుతుంది.

17 ఉ॥ శ్రీస్వామివారు నిత్య ఆరాధన కాగానే పెరుమాళ్ సన్నిధికి వేంచేసి దర్శించి, సంపత్కుమారులుగా ప్రసిద్ధిగాంచిన తిరునారాయణ పెరుమాళ్‌తో తిరువీధి ఉత్సవంగా బయలుదేరి మన భవనంలోకి వేంచేసారు. అక్కడ శాత్తుముత్తై, తీర్థ ప్రసాద గోష్ఠి జరిగాయి. అదే సమయంలో మన భవన నిర్మాణానికి కైంకర్యాన్ని అందించిన తిరునారాయణ సమితి సభ్యులైన వరంగల్ వాసులైన శ్రీమాన్ రాధాకృష్ణగారిని, హైదరాబాద్‌కి చెందిన శ్రీమతి శోభాజయంత్ దంపతులను, శ్రీమతి వనజా భాస్కరరావు దంపతులకి, అలాగే అక్కడ నిర్మాణం చేసిన ఇంజనీర్‌కి, మేస్త్రీలకి, వికాసతరంగిణి సభ్యులుగా కైంకర్యం నిర్వహిస్తున్న శ్రీమాన్ వీరభద్రరావుగారికి శ్రీమాన్ సత్యనారాయణ గారికి, గంగావతికి చెందిన శ్రీమాన్ రామారావు గారు, శ్రీమాన్ కృష్ణమూర్తిగార్లకి, పెరుమాల్ మరియు శ్రీస్వామివారు మంగళాశాసనాలు అందించారు. అక్కడి అర్చకస్వాములందరికీ వస్త్రాలు సమర్పించి మంగళాశాసనాలు చేసారు.

ఇదేసందర్భముగా శ్రీమతిశోభాజయంత్ గారు కన్నడ లిపిలో తమ తల్లిదండ్రుల పేరుమీద ముద్రింపచేసిన 'శ్రీపతి స్తుతిమాల' ఆవిష్కరించి, ఆ దంపతులకి మంగళాశాసనాలు చేసారు. ఇంతవరకు తెలుగు, నాగరి లిపిలో మాత్రమే ఉన్న ఈ పుస్తకాన్ని మన రామానుజవాణి ద్వారానే కన్నడలోకూడా ముద్రింపజేసారు. అనంతరం శ్రీస్వామివారు ప్రసంగిస్తూ, భగవద్రామానుజుల వారి అంతిమ సందేశంలో జీవితాన్ని ఎలాగడపాలి అని తమ అంతేవాసులకి చెప్పిన ఆరు విషయాల్లో 'యదుశైల నిత్య వసతిః శ్రేయః' మేల్కోటలో ఒక చిన్న కుటీరాన్నైనా ఏర్పాటుచేసుకొని నిత్యం ఉండగలగడం శ్రేయస్సుకి మూలము, సంప్రదాయ శ్రద్ధకలవారు ఈ మాత్రమైనా చేయండి అన్న ఆదేశాన్ని ఉటంకిస్తూ, ఇక్కడ ఈ నిర్మాణానికి తమ ధనాన్ని అందించిన వారికి తప్పక శ్రేయస్సు కలుగుతుందని, అవకాశం ఉండే

**మంచిమాట : నరకంలో స్వర్గాన్ని చూస్తాడు జ్ఞానం కలవాడు. స్వర్గాన్ని కూడ నరకం చేస్తాడు జ్ఞానం లేని మూర్ఖుడు**

మిగిలిన భగవద్బంధువులు కూడా ఈ సేవలో పాల్గొనే అదృష్టం పొందవచ్చని సూచించారు. నిత్యం ఇక్కడ ఉండలేకపోయినా అవకాశం లభించినపుడైనా మనమిక్కడకి వచ్చి ఏ సంకోచం లేకుండా ఉండి పెరుమాళ్‌ని సేవించుకోవచ్చని, దానికి తగిన వసతి ఏర్పాట్లు మన సమితి చేస్తుందని సూచిస్తూ మంగళాశాసనాలు చేసారు.

17సా॥ మేల్కోట నుండి బెంగుళూరుకి 23 కి.మీ. ముందుగా మన వికాసతరంగిణికి శ్రీమాన్ రావుగారు దంపతులు విరాళంగా అందజేసిన సుమారు ఒక ఎకరపు స్థలాన్ని సందర్శించి, అక్కడ చేరిన మన వికాస తరంగిణి బెంగుళూరు శాఖ సభ్యులందరినీ మంగళాశాసనం చేసి 18వ తేదీ ఉదయానికి హైదరాబాద్ చేరారు.

18వ తేదీ మధ్యాహ్నం సికిందరాబాద్ లోని పారడైజ్ దగ్గర ఉన్న 'చరక ఆయుర్వేద కేంద్రం' ప్రారంభించి మంగళాశాసనాలు చేసారు. సా॥ చార్మినార్ దగ్గర యున్న చంద్రాయణి గుట్టదగ్గర నందికల్ మెట్ట దేవాలయంగా ప్రసిద్ధిగాంచిన శ్రీకోదండ రామాలయాన్ని శ్రీస్వామివారు సందర్శించారు. అక్కడి భక్తుల్ని ఉద్దేశించి మంగళాశాసనాలు చేస్తూ సుమారు 200 సం॥ చరిత్ర కలిగిన ఆలయాన్ని వైభవోపేతంగా చేసుకోవడం ప్రజలందరి బాధ్యత అనీ, ఆ ప్రాంతపు సుభిక్షం కోసమైనా ఆ ఆలయం బాగుచేసుకోవాల్సిన అవసరం ఉందనీ రాజకీయ నాయకులీ బాధ్యత స్వీకరించాలని తెలిపారు. ఆలయాలు కేవలం అర్చకుల కోసం మాత్రమే కాదన్నారు. ప్రయాణించే యాత్రికులకి ఆలయం బస్ అయితే, అర్చకులు కండక్టర్, డ్రైవర్ వంటివారని, వారికోనమే బస్ కాకపోయినా, డ్రైవర్, కండక్టర్ లేందే బస్ నడవనట్లుగానే ఆలయం కేవలం అర్చకులకోసం కాదనీ, కానీ అర్చకులు లేకుంటే ఆలయాలు నడవవన్నారు. కనుక, అర్చకులకి తగిన వసతులు కల్పించి, వారు తృప్తిగా ఆరాధనాదులు నక్రమంగా నిర్వర్తించేట్లుగా చూడడం తద్వారా ఆలయాలనీ అర్చకులనీ సంరక్షించుకోవడం మనందరి బాధ్యత అనీ తెలిపారు.

### భూకంప బాధితులకు చేసిన వాగ్దానం నెరవేరింది.

19వ తేదీ ఉ॥ శ్రీస్వామివారు మన జెట్ కోశాధికారి శ్రీమాన్ రామేశ్వరరావుగారు, జెట్ సభ్యులు శ్రీమాన్ సిహెచ్.రామచంద్రారెడ్డి గారు, ప్రియదర్శిని ఎడ్వర్టైజర్స్ నిర్వాహకులు, మన కార్యక్రమాల ప్రోత్సాహకులైన శ్రీమాన్ రామిరెడ్డిగారు తదితర సభ్యులతో ముంబై మీదుగా గుజరాత్‌లోని భుజ్‌కి చేరారు. అక్కడ నుండి కారులో సుమారు 5గం॥లకి కచ్ జిల్లాలోని రాపూర్ పట్టణానికి 6 కి.మీ. దూరాన ఉన్న వల్లభాపూర్ గ్రామానికి చేరారు. విద్యార్థులు రాసలీల నృత్యంతో, గ్రామ యువత గ్రామీణ మహిళలందరూ అలంకరించిన పచ్చటి కలశాలను శిరస్సున ధరించి గుజరాతీ సంప్రదాయం ప్రకారం శ్రీస్వామివారిని పరివారాన్ని స్వాగతించి నూతనంగా నిర్మించిన కమ్యూనిటీ హాలుకి తీసుకువెళ్ళారు. గుజరాత్ భూకంపం తరువాత మన జెట్ మరియు వికాసతరంగిణి 108 గృహాలు నిర్మించాలి అని అనుకోవడం దానికి ప్రభుత్వం ఇతర సంస్థలు నిర్మాణంలో ఆర్థిక





వనరులు చేకూరుస్తామని వాగ్దానం చేసి వెనక్కి తీసుకోవడం చేసిన వాగ్దానానికి కట్టుబడి శ్రీస్వామివారు నిర్మాణాన్ని జరుపదలచి 2001లో అమెరికా వేంచేసినపుడు అక్కడి వివిధ రాష్ట్రాలలో ఉండే మన జెట్ యు.యస్.ఎ. శాఖలు అక్కడి భక్తుల ద్వారా విశేషించి మనకు తెలుగు వారి ద్వారా సుమారు 70లక్షలు సేకరించడం మన పాఠక బంధువులందరికీ తెలిసినదే. భూకంపం తరువాత నుండి విభిన్న సేవలలో భాగంగా గృహనిర్మాణ బాధ్యతని నిర్వహిస్తున్న ఒక సేవా సంస్థ 'సేవా భారతి'. మన హైదరాబాద్‌కు చెందిన శ్రీమాన్ సిహెచ్. రామచంద్రారెడ్డిగారి ద్వారా మనం జరుప దలచిన గృహనిర్మాణ బాధ్యతని కూడా 'సేవాభారతి'కే అప్పగించారు. 100 పై చిలుకు గృహాలు కలిగిన గ్రామమే వల్లభాపూర్ అయినా అందులో కొందరు ప్రభుత్వం ఇచ్చే ధనాన్ని తీసుకొని తమ గృహాన్ని ఆ ధనంతో బాగుచేసుకొనే అభిప్రాయంతో వేరే ఉండిపోయారు. 86 గృహాలవారు మాత్రం పూర్తిగా శిథిలమైపోయిన తమ గృహాల పునర్నిర్మాణ కార్యక్రమాన్ని మన ద్వారా జరిపించుకోవడానికి సిద్ధపడ్డారు. జార్ఖండ్ ప్రభుత్వం మాత్రం ఒకకోటి రూ॥లు ఇవ్వగా, మన జెట్ 85 లక్షలు చేర్చి ఇంకొంత ధనం సేకరించి నుమారుగా ఒకకోటి (1,94,77,100రూ॥) తొంబై నాలుగు లక్షల డెబ్భైఏడు వేల నూరు రూపాయల ఖర్చుతో శ్రీస్వామివారి ఆదేశానుసారం వల్లభాపూర్‌లోనే సేవాభారతి వారు 86 గృహాలను నిర్మించారు. ఇలా ఆ సంస్థవారు ఇంకా 14 గ్రామాలని కొన్ని పాఠశాలలని ఇతరత్రాకూడా నిర్మించారు. ఎన్నో సేవాసంస్థలవారు నిర్మించిన గృహాలకంటే ఈ గృహాలు సౌకర్యపరంగానూ, చూడటానికి కూడా అందంగా అమరాయి. రెండు గదులు ఒక వంటశాల, చిన్న వరండా, సెపరేట్ బాత్‌రూమ్ లతో పాటూ చుట్టూ కొంత స్థలం ఆపై ఒక ప్రాకారం ఇలా నిర్మాణం జరిగింది. గృహాలతో పాటు ఒక రామాలయం, ఒక చాముండేశ్వరి ఆలయం, ఒక బస్టాండు, ఒక పక్షిగృహం, ఒక స్మశాన వాటిక, ఒక సామాజిక భవనం, ఈ ఊర్లో నిర్మించారు. గ్రామానికి ప్రవేశ ద్వారాన్ని ఏర్పరచడంతోపాటు ప్రతి గృహానికి విద్యుచ్ఛక్తి సౌకర్యం, జలవసతి, డ్రైనేజీలు కూడా ఏర్పరచారు. ప్రతి ఇంటిలోనూ ఒక వేపచెట్టు, ఒక ఫలవృక్షాన్ని కూడా నాటారు. 19వతేదీ రాత్రి జరిగిన నగర సభా కార్యక్రమములో 86 గృహాలని స్వీకరించబోయే మహిళలకు ఒక్కొక్క కుంభాన్ని, శ్రీవెంకటేశ్వరస్వామివారు అందజేసి గ్రామంలో అంతా కలసి మెలసి సంస్కారవంతంగా ఉండవలసిన అవసరాన్ని గురించి చెప్పారు. 86 గృహాలలో నివసించే వారందరూ వెనకబడ్డ తరగతులకి చెందినవారే.

20వ తేదీ గుజరాత్ గృహమంత్రి శ్రీమాన్ అమిత్ భాయీషా, కేంద్ర రైల్వేశాఖ మంత్రి శ్రీమాన్ బండారు దత్తాత్రేయ, రాష్ట్ర మాజీస్పీకర్ శ్రీమాన్ ధీరూభాయిషా వల్లభాపూర్ శ్రీస్వామివారిని సందర్శించ విచ్చేశారు. ఉ॥ తీర్థగోష్ఠి కాగానే ముందుగా రామాలయంలో శ్రీస్వామివారు సీతారాముల ప్రతిష్ఠా కార్యక్రమాన్ని నిర్వహించారు. ఆపై జరిగిన సభాకార్యక్రమంలో పై అతిథులతోపాటు శ్రీమాన్ సిహెచ్. రామ చంద్రారెడ్డిగారు, శ్రీమాన్ జె. రామేశ్వరరావు

గారు, సేవాభారతి కేంద్ర కార్యదర్శి శ్రీమాన్ సోమనాథ్ కార్యక్రమంలో పాల్గొన్నారు. గ్రామ అధికారులు శ్రీమాన్ పాంచాభాయ్, తాతాభాయ్ సభాకార్యక్రమంలో పాల్గొన్నారు. గ్రామ అధికారులు గుజరాతీ సంప్రదాయం ప్రకారం శ్రీస్వామివారికి అతిథులకి పగిడి అలంకరించారు. తరువాత 86 గృహాలకీ సంబంధించిన తాళాలని శ్రీస్వామివారు ఆ గ్రామాధికారులకి అందజేశారు. అంత దూరం నుంచి మా ప్రాంతానికి రావడం ఇక్కడ ఇంత విశిష్టమైనసేవలని, అందించడం మా అదృష్టం అని భూకంపం రావడం వలన ఇబ్బందులు పడినా, శ్రీస్వామివారు దక్షిణాది నుండి ఇక్కడకు వచ్చి దర్శన భాగ్యం కల్గించడం అదృష్టమని ముక్త కంఠంతో కృతజ్ఞతలు తెలిపారు. శ్రీస్వామివారు తమ సందేశంలో గృహనిర్మాణాలకి పూర్వరంగాన్ని వివరించి తాము చేసిన ఈ సేవ అతి చిన్నదైనా ఇందులో ఆంధ్రరాష్ట్రంలో విదేశాల్లోనూ ఉండే తెలుగువారి యొక్క స్నేహసౌహార్దాలు నిండిఉన్నాయని కష్టకాలంలో ఉండే గుజరాతీయులకు గుండెలు నిండిన ప్రేమతో అందించే చిరు ఓదార్పే ఈ 86 గృహాల నిర్మాణమని వీటిని సవ్యంగా నిర్వహించిన సేవాభారతి కార్యకర్త లందరికీ మంగళాశాసనాలు చేసారు.

సేవాభారతి తరపున శ్రీమాన్ సోమనాథ్ గారు చేసిన కృషిని శ్రీస్వామివారు

 **కృతజ్ఞతలు** 

శ్రీశ్రీశ్రీ స్వామివారి ఆధ్యక్షతలో 2002 నవంబర్ 14వ తేదీన శ్రీ భద్రాచల దివ్యక్షేత్రంలోని శ్రీ జీయర్ మఠంలో జరిగిన ట్రస్ట్ ప్రథమ సమావేశంలో ప్రకటించిన విధంగా ట్రస్ట్ సభ్యులు మఠం యొక్క సర్వతోముఖాభివృద్ధికై తమ వంతు కైంకర్యాలను సమర్పించారు. అందరికీ పేరుపేరునా శ్రీస్వామివారి దివ్య మంగళాశాసనములతోపాటు మా కృతజ్ఞతలు.

ఆ సమావేశంలో గౌరవాతిధిగా పాల్గొన్న శ్రీమాన్ ఎర్నేని రామారావుగారు (ఖమ్మంజిల్లా గీతాజ్యోతి కన్వీనర్) ఖమ్మం పట్టణంతరపున లక్షరూ॥లను ప్రకటించారు. ఆ ప్రకటనలో తమవంతుగా ఇ. రామారావు, సుభద్రా దంపతుల పేరిట 20,000 రూ.లను సమర్పించారు. వీరి ప్రేమతో ఖమ్మం పట్టణానికి చెందిన జూపూడి సంయుక్త, శ్యమంతక కృష్ణ దంపతులు, శ్రీ రాయపూడి సత్యవాణి, లక్షణరావు దంపతులు, శ్రీ వేములపల్లి సామ్రాజ్యలక్ష్మి, వేంకటేశ్వర రావు దంపతులు, శ్రీ యాదా ప్రమీల, కృష్ణమూర్తి దంపతులు 20,000 రూ.ల చొప్పున సమర్పించారు.

శ్రీవారి సన్నిధానంలో ప్రకటించిన విధంగా భద్రాచల నగరానికి చెందిన శ్రీమాన్ ఈలేటి రంగారెడ్డి దంపతులు 50,000 రూ॥లను, శ్రీమాన్ యశోద రామచంద్రరావు దంపతులు 10,116 రూ.లను, శ్రీమాన్ పొడిచేటి రామచంద్రాచార్యుల దంపతులు 5,000 రూ.లను, శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యులు, సీతాదేవి దంపతులు 5,000 రూలను సమర్పించారు.

శ్రీస్వామివారిచే నియమించబడి గత 5సం॥లుగా శ్రీజీయర్ మఠం యొక్క సర్వవిధ బాధ్యతలను స్వీకరించి, ఆశయ సాధనదిశగా ప్రయోజనవంతంగా, సేవా భావంతో నిర్వహిస్తున్న శ్రీజీయర్ మఠం ట్రస్ట్ అధ్యక్షులు శ్రీమాన్ పి.జె. భట్టర్ MVI గారికి, కోశాధికారి శ్రీమాన్ గట్టు వేంకటాచార్యులు (LIC) మా ప్రత్యేక కృతజ్ఞతలు.





ప్రశంసించారు. గ్రామాన్ని గృహాల అందంతో మాత్రమే కాక సంస్కారంతోటి సుందరంగా తీర్చిదిద్దాలని, ఇందులోని వారు పొగాకు సంబంధమైన హుక్కా, సిగరెట్ వంటి వ్యసనాలకి దూరంగా ఉంచాలని విశేషించి ఏదో కొద్ది సమయం ప్రతిరోజూ ఆలయంలో చేరి ఆధ్యాత్మిక విషయ చర్చతో జీవితాన్ని ఆనందమయం చేసుకోవాలని ఉద్బోధించారు. అక్కడ ఉండే ఒక పండితులు, తమ కవకాశం కల్పిస్తే అక్కడి గ్రామ వాసులకి సంస్కృతం, రామాయణ, భారతాల్లాంటి ప్రవచనాలని రోజూ చెప్తానని సంసిద్ధత వ్యక్తం చేశారు. అది నిరంతరంగా జరిగే వ్యవస్థను శ్రీస్వామివారికి వసతిగా ఇచ్చిన కమ్యూనిటి హాలులోనే ఏర్పాటు చేసి ఆ సమాచారం మనకి తెలియజేస్తే దానికి కావలసిన ఆర్థిక వనరులు కూడా సమకూర్చుతామని శ్రీస్వామివారు వాగ్దానం చేశారు. సేవాభారతి కార్యకర్త శ్రీమాన్ సోమనాథ్‌గారిని తదితర కార్యకర్తలని శ్రీస్వామివారు సత్కరించి మంగళాశాసనాలు చేశారు. 20వ తేదీ సా॥ అక్కడికి 20 కి.మీ. దూరంలో ఉండే విద్యాసంస్థను సందర్శించి అక్కడి విద్యార్థులకు మంగళాశాసనాలు చేసి వారు చేసే సేవాకార్యక్రమాలని పరిశీలించారు. 21వ తేదీ ఉ॥ ఆరాధనానంతరం భుజ్ పట్టణంలోని తెలుగువారందరి కోరికపై అక్కడి హనుమ మందిరంలో ఒక గంట గీతాజ్యోతి సందేశాన్ని అందించి తిరిగి ముంబై మార్గంగా 21వ తేదీ సా॥నికి శ్రీస్వామివారు హైదరాబాద్ జెట్‌కి చేరారు.

**హైదరాబాద్ జెట్‌లో....**

21వ తేదీ రాత్రి జెట్ కార్యాలయంలో జెట్ సొసైటీ ప్రథమ కార్యవర్గ సమావేశం జరిగింది. వారిలో శ్రీమాన్ రామేశ్వరరావుగారు, శ్రీమాన్ సిహెచ్. రామచంద్రారెడ్డిగారు, శ్రీమాన్ కల్కిఅవతారంగారు, శ్రీమాన్ విజయ్‌కుమార్ గారు, శ్రీమాన్ రమణాచారిగారు, శ్రీమాన్ రాముగారు, శ్రీమాన్ పుల్లనగారు ఇంకా ఇతర జెట్ సభ్యులు పాల్గొన్నారు.

గిరిజనుల సేవగా నిర్మించదలచిన స్కూల్స్ ఈ సంస్థద్వారానే జరుగుతాయి. ఇంతవరకూ జరిగిన కార్యక్రమం గత చాతుర్మాస్యంలో ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లాలలోని కొన్ని ప్రాంతాలలో పాఠశాలలకి శిలాన్యాసం చేశారు. అందులో అదిలాబాద్ జిల్లాలో అల్లంపల్లి, ఉట్నూరు అనే మారుమూల పట్టణంలో 15 మైళ్ళలోపల అడవిలో ఉన్న ప్రాంతం దాని చుట్టూ సుమారు 30 గిరిజన తండాలున్నాయి. ఆంధ్రలో మొదటి ఎన్‌కౌంటర్ జరిగిన ప్రాంతంగా అల్లంపల్లికి పేరుంది. ఇప్పటికీ ఒంటరిగా ఆ ప్రాంతానికి వెళ్ళాలంటే అధికారులెవరికైనా భయమే. అక్కడ ఒక పాఠశాల హాస్టల్ భవనం నిర్మించాలని శ్రీస్వామివారు ప్రారంభం చేశారు. నిర్మాణం ఆరంభమై పునాదులు పూర్తయి గోడలపై స్లాబ్ పోసే స్థాయికి చేరింది. ఇంత వరకూ ఈ నిర్మాణానికి 19 లక్షలు ఖర్చు అయింది. దీనికి కొద్దిగా మనవారు, ముఖ్యంగా అమెరికాలో ఉండే భక్తులు 5 లక్షల ధనాన్ని ఇచ్చారు. దీని నిర్మాణం పూర్తయి ఉపయోగించే స్థాయికి చేరడానికి సుమారుగా మరో 15 లక్షల నుండి 20 లక్షల దాకా అవసరం ఉంటుంది. బీర్‌సాయి అనే గ్రామంలో పునాదులు మాత్రం పూర్తయ్యాయి. నిర్మాణం పైకి లేవవలసి

ఉంది. జూన్ నెల నాటికి అన్నింటినీ ప్రారంభించాలి అని అనుకున్నా ఆర్థిక వనరుల అందుబాటును బట్టి అల్లంపల్లి పాఠశాలను మాత్రం జులై నెలాఖరునాటికి ముగించి ఆగష్టులో పాఠశాలను ప్రారంభించాలని నిర్ణయం చేశారు. ఉపాధ్యాయులుగా శిక్షణ పొందుతున్న యువకులను కూడా ఈ నిర్ణయానికి అనుకూలంగానే తయారు చేయాలని నిర్ణయించారు.

**ప్రెస్‌మీట్‌లో....**

22వ తేదీ ఉ॥ తీర్థగోష్ఠి అనంతరం జరిగిన ప్రెస్‌మీట్‌లో శ్రీస్వామివారు గుజరాత్‌లో గృహాలను లోకార్పణం కావించిన కార్యక్రమ వివరాలను విలేఖరులకి అందజేశారు. ఈ సందర్భంగా విలేఖరుల ప్రశ్నలకి సమాధానం చెప్తూ రోజూ దర్శనార్థులై తిరుమల చేరే వేలాది మంది భక్తులకి సౌకర్యాలు కల్పించడం దర్శనం చేయించడానికి అవకాశం లేనపుడు, టూరిజం డిపార్ట్‌మెంట్ వారు కోట్ల ఖర్చుతో నిర్మించదలచిన తిరుపతి నుండి తిరుమల పైకి రోప్‌వే (Rope Way) నిర్మాణాన్ని అనుమతించడం T.T.D. కిగానీ, ప్రభుత్వానికి కానీ తగని పని. ఈ రకమైన చర్య ఇప్పటికే తిరుమల కొండపై జరిగే అనేక దురభ్యాసాలను, విలాసాలను మరింతగా పెంచుతుందే తప్ప అక్కడి ఆధ్యాత్మిక, పవిత్ర వాతావరణానికి ఏమాత్రం అనుకూలం కాదని ఆ చర్యను వెంటనే మానుకోవడం అవసరం అని సూచించారు.

మరొక ప్రశ్నకి సమాధానం చెప్తూ ప్రభుత్వం T.T.D. నుండి 100కోట్ల ధనాన్ని తీసుకొని MLA ద్వారా ప్రతి నియోజక వర్గంలోనూ 15 చొప్పున 7,000 వేంకటేశ్వర మందిరాలను లేదా అలాంటి ఇతర ఆరాధనా మందిరాలను నిర్మించాలని తీసుకొనే నిర్ణయాన్ని ఖండించారు. ఆంధ్రరాష్ట్రంలో ఉన్న 40,000 ఆలయాలలోనూ సుమారు 25,000 ఆలయాల్లో నిత్యనైవేద్యంలేక అర్చకులకు కనీస సౌకర్యాలు లేకుండా అలమటిస్తున్న దశలో మరిన్ని ఆలయ, మందిరాలను నిర్మించదలచడం ఆలోచనా రహితమైన చర్య అని అన్నారు. అర్చకుల సంక్షేమ నిధికోసం సుప్రీంకోర్టువారు గతంలో 75 కోట్లు డిపాజిట్ చేసి దానితో వారి పోషణను చూడాలని అన్న ఆదేశాన్ని ఇంతవరకూ ప్రభుత్వ అధికారులు పాటించలేదు. ఆ రకమైన నిధికి 12 కోట్ల ధనాన్ని మించి చేర్చడానికి అవకాశం లేదని అమాయకత వెలిబుచ్చే ప్రభుత్వానికి 7,000 మందిరాలకోసం 100 కోట్ల ధనాన్ని T.T.D నుండి తీసుకోవడానికి ఇసుమంతైనా సంకోచం లేకపోవడం అత్యంత ఆశ్చర్యకరమని అన్నారు.

అయితే ఈ మందిరాలు దళితుల కోసం కదా! నిర్మించాలి అని ఒక విలేఖరి ప్రశ్నకు సమాధానం చెప్తూ దళితులకు నిజంగా ఉపయోగపడేట్టు ఒక సేవ జరగాలి అనేది తమకు చాలా ఇష్టమని, కానీ, ఇపుడు తీసుకున్న నిర్ణయం కేవలం రాజకీయ లబ్ధికోసం తీసుకున్న నిర్ణయమే తప్ప దళితుల లబ్ధికోసం కనపడటం లేదని నిజంగా వారికి సేవలందాలి అనుకుంటే అది రాజకీయ నేతల ద్వారా జరగరాదని అన్నారు. అన్ని మతాలకీ చెందిన రాజకీయ నేతలుంటారు. T.T.D ధనాన్నిచ్చి వారిచేత వైదిక ఆరాధనా మందిరాలే నిర్మింపజేయడం మత స్వాతంత్ర్యానికి ఒక





విరుద్ధమైన చర్య. పైగా T.T.D ధనంతో ఇతర మత ఆరాధనా మందిరాలే నిర్మింపజేయడం కూడని చర్య. అదలా ఉండగా అందరు MLAల నియోజక వర్గాల్లోనూ ఇలాంటి మందిరాల అవసరం ఉండి ఉండకపోవచ్చు. అపుడు వారు ఈ ధనాన్ని దేనికి వినియోగించాలో ఆలోచించ వలసిఉంది. కొందరికి మందిరాల అవసరం లేదు కనుక ధనాన్ని ఇవ్వము అనడం ఎంతవరకు వీలవుతుందో కూడా నేతల ద్వారా ఈ నిర్మాణం చేయించాలనుకున్నా అధినేతలు ఆలోచించవలసి ఉంటుంది. ఇవన్నీ ఒక ప్రక్కకు పెట్టినా డ్రైవింగ్ వచ్చిన వాడికి కారు కొనిస్తే ఉపయోగమే తప్ప అదిరానివాడి కివ్వడం కోతికి కొబ్బరికాయ ఇవ్వడమే కదా! ఉత్సాహం కలిగిన ప్రాంతాలలో బాధ్యతగా ఆరాధన చేసుకొనే ఉత్సాహం కలిగిన దళిత యువకులను పెద్దలను ముందుగా వెతుక్కోవాలి. వారికి తగిన శిక్షణ ఇవ్వాలి. అపుడు ఆరాధనా మందిరాల అవసరం అన్వేషించి నిర్మాణపు ఏర్పాట్లు చేయాలి. వీటిని వేటినీ ఆలోచించకుండా ధర్మానికి, దైవ సేవకి కూలీ నాలీ చేసుకొనే కష్టజీవులనుండి ఎందరో భక్తులు కష్టార్జితంగా అర్పించిన కోట్లరూపాయల దేవుడి హుండీ సొమ్మును యథేచ్ఛగా స్వార్థానికి వినియోగించుకోవాలను కోవడం అధికార దుర్వినియోగం అవుతుంది. ఇది ఎంత మాత్రమూ సహించరానిది అని శ్రీస్వామివారు స్పష్టంచేసారు. ఇలాంటి వాటినే ప్రజలు కూడా తీవ్రంగా ప్రతిఘటిస్తారని శ్రీస్వామివారు హెచ్చరించారు.

T.T.D లో జరిగే ఆరాధనా లోపాల గురించి, వైఖానసాన్ని పాంచరాత్రంగా వారు మార్చాలను కుంటున్నారని కంచి స్వాము లంటున్నారే అని విలేఖర్లు వేసిన ప్రశ్నకు సమాధానం చెప్తూ తిరుపతి విషయానికి సంబంధించిన అవగాహన వారికే మాత్రం లేదనటానికి ఈ స్టేట్‌మెంట్ ఒక సూచన అన్నారు. వైష్ణవ సంప్రదాయాన్ని 11వ శతాబ్దంలో భగవద్రామానుజులు, 15వ శతాబ్దంలో మణవాళ మహామునులు ఎలా ఉండాలో శాసించారు. 106 దివ్యదేశాలలోనూ అదే పద్ధతి అప్రతిహతంగా సాగుతోంది. అందులోనూ వైఖానస ఆగమ పరంపర ఉన్న ఆలయాల్లో అదే సాగుతుంది. పాంచరాత్ర ఆగమం ఉన్నచోట అదే సాగుతుంది. ఇవి రెండూ రెండు నేత్రాల వంటివి ఒకదానిని మార్చడం, ఒకదానిని చేర్చడం ఉండదు. లోపం లేకుండా సవరించడం మన కర్తవ్యం. తిరుమలలో అలాంటి కొన్ని లోపాలు ఉన్నాయి. అనేది అక్కడి అధికారులు, అర్చకులు, ఆచార్యులు అందరూ అంగీకరించే వాటిని సవరించుకునే కార్యక్రమాన్ని ప్రారంభించారు. వీటిలో ఏమాత్రం సంబంధం లేని వ్యక్తులెవరైనా వీటికి సంబంధించి ప్రకటనలివ్వడం అప్రస్తుతము, అనుచితము అని శ్రీస్వామివారు తెలియజేసారు. 22వ తేదీ సా॥ శ్రీస్వామివారు సీతానగరం చేరి అక్కడి కార్యక్రమాన్ని శ్రీస్వామివారు సమీక్షించారు.

23వ తేదీ గుంటూరు జిల్లాపరిషత్ ఛైర్మన్ శ్రీమాన్ పాతూరు నాగభూషణంగారి చొరవతో సీతానగరంలో నిర్మించిన రహదారికి ప్రాంతీయ MLA తదితర అధికారుల సమక్షంలో శ్రీస్వామివారు ఉద్ఘాటన చేసారు. అక్కడి నుండి పొన్నూరు MLA శ్రీమాన్

నరేంద్ర కుమార్‌గారి ఆహ్వానంపై వారి తండ్రిగారైన శ్రీమాన్ ధూళిపాళ్ళ వీరయ్య చౌదరిగారి పేరు మీద నిర్మించిన విశాల కళ్యాణ మండపాన్ని ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో రాజ్యసభ సభ్యుడు శ్రీమాన్ యడ్లపాటి వెంకట్రావ్‌గారు, శ్రీమాన్ ఎలమంచి శివాజీగారు, ప్రాంతీయ రాజకీయ ప్రముఖులు పాల్గొన్నారు. అనంతరం శ్రీస్వామివారు ప్రసంగిస్తూ శ్రీమాన్ నరేంద్రకుమార్‌గారు తమ తండ్రిగారి అడుగు జాడలో సమాజ శ్రేయస్సుకు కృషి చేస్తున్నారని ఇదిలానే సాగాలని మంగళాశాసనాలు చేశారు.

అక్కడి నుండి శ్రీస్వామివారు బయలుదేరి చెన్నై మీదుగా మస్కట్ చేరారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు విశ్వశాంతియాత్రకై మస్కట్ వేంచేస్తున్నారు. మస్కట్‌లో ఉండే పారిశ్రామికవేత్తలైన శ్రీమాన్ ఖీమ్జీ వారి మిత్ర బృందం మన జగిత్యాల గీతాజ్యోతి ధర్మక్షేత్ర కార్యక్రమాన్ని చూచి ఉత్తేజితులై తమ ప్రాంతంలో కూడా శ్రీసుదర్శన హోమ కార్యక్రమాన్ని చేయ సంకల్పించారు. 14 మందితో శ్రీస్వామివారు శాంతికోసం హోమం చేయడానికి మస్కట్ వేంచేసారు.

**మస్కట్‌లో జరిగే కార్యక్రమ వివరాలు**
**పై సంచికలో తెలుసుకోగలరు.**

## కరీంనగర్ జిల్లా

**గోదావరిఖని :-** కరీంనగర్ జిల్లా గోదావరిఖని ధర్మక్షేత్ర ప్రచారంలో భాగంగా గోదావరిఖని పట్టణ 8వ కాలనీలో గల శ్రీవేంకటేశ్వర దేవాలయంలో ఉచిత అయస్కాంత శిబిరం నిర్వహించబడినది. 1600 మందికి చికిత్స చేయడం జరిగింది. డా॥ శ్యాంసుందర రావుగారి ఆధ్వర్యంలో నిర్వహింపబడినది. 2000 ఖర్చు చేయడం జరిగింది.

**కరీంనగర్ :-** కరీంనగర్ పట్టణ వావిలాలపల్లి వికాసతరంగిణి శాఖ గీతాజ్యోతి కార్యక్రమ ఒక సంవత్సరము పూర్తిచేసుకున్న సందర్భముగ మొదటి వార్షికోత్సవమును వైభవంగ పూర్తిచేసుకున్నారు. 1-4-03 చక్కగ అలరించిన వాహనముపై శ్రీకృష్ణ భగవానుని, శ్రీశ్రీశ్రీ స్వామివారి చిత్రపటాన్ని అలంకరింప జేసినగర సంకీర్తన కార్యక్రమం చేపట్టినారు. మంగళవాయిద్యాలు, గీతాజ్యోతి శ్లోకమాలికా పఠనం, కథాగానం ప్రదర్శించినారు. ఉగాది పర్వదినాన వేదభవనంలో 'గీతాజ్యోతి వార్షికోత్సవ సభ' నిర్వహింపబడినది. శ్రీవిష్ణు సహస్రనామ పారాయణ, గీతాజ్యోతి శ్లోకమాలికా పఠనం చేయడం జరిగింది. అనంతరం 1008 నేతి దీపాలు వెలిగించి కృష్ణభగవానునికి అర్చన నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమంలో శ్రీమాన్ కె. దేవేంద్రరావు(MLA)గారు, డా॥ బి. జగన్నాథరెడ్డి గార్లు, పుర ప్రముఖులు, వికాసతరంగిణి కార్యవర్గ సభ్యులు ఉత్సాహంగా పాల్గొన్నారు.

**ముకరంపుర :-** కరీంనగర్ పట్టణ ముకరంపుర వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో చిత్రభాను నామ సంవత్సరంలో ప్రారంభించిన గీతాజ్యోతి కార్యక్రమం ఏడాది పూర్తిఅయిన సందర్భముగ 28-03-2003న ఏకాదశి సందర్భమును పురస్కరించుకొని శ్రీ విష్ణు సహస్రనామ పారాయణం, శ్రీమద్భగవద్గీత 18 పర్యాయములు పఠనం చేయడం జరిగింది. అనంతరం శ్రీకృష్ణపూజలు నిర్వహించి 1008 నేతి జ్యోతులు వెలిగించి గీతాజ్యోతి ప్రతిజ్ఞ చేయడం జరిగింది. అనేకమంది భక్తులు, విద్యార్థులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.





**వావిలాలపల్లి :-** కరీంనగర పట్టణ వావిలాలపల్లి వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో వేసవికాలంలో ప్రజల దాహార్తిని తీర్చుటకు స్థానిక ప్రభుత్వ హాస్పిటల్ ఆవరణయందు చలివేంద్రం ఏర్పాటు చేసినారు. కీ.శే. శ్రీమతి మేచినేని శాంతమ్మగారి స్మృత్యర్థం వారి కుటుంబ సభ్యులచే చలివేంద్రం ప్రారంభించబడినది.

ఈ చలివేంద్రం ప్రారంభోత్సవ కార్యక్రమంనకు కరీంనగర్ శాసనసభ్యులు శ్రీమాన్ కఠారి దేవేంద్రరావుగారు విచ్చేసినారు. మున్సిపల్ ఛైర్మన్ వావిలాల హన్మంతరెడ్డి గారు, డా॥ నరేంద్ర, డా॥ సిహెచ్. హనుమంత రావు, డా॥ విఠల్‌రెడ్డి, యమ్. అశోకరావుగార్లు, యితర పుర ప్రముఖులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## ఖమ్మం జిల్లా

**ఖమ్మం :-** ఖమ్మం ధర్మక్షేత్ర కేంద్రముగ గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం వైభవంగ నిర్వహించుకొనుచున్నారు. 35 గ్రామాలలో ప్రచారం జరుగుచున్నది. ఇ. రామారావు, డా॥ రాజేష్, డా॥ ఆది శంకరరావుగార్లు ఆర్థిక సహాయ సహకారాలు అందజేయుచున్నారు. 25 వేలు యిప్పటివరకు ఖర్చుచేయడం జరిగింది. అనావృష్టి కారణంగ పంటలు లేకపోయిన ఎంతో ఉత్సాహంతో గీతాజ్యోతి కార్యక్రమం జరుపుకొనుచున్నారు. భజన, శ్రీకృష్ణ పూజా కార్యక్రమాలు నిర్వహించుకొను చున్నారు.

**మణుగూరు :-** ఖమ్మం జిల్లా మణుగూరు ధర్మక్షేత్ర ప్రచార కార్యక్రమంలో భాగంగా 15 పాఠశాలల విద్యార్థులకు గీతాజ్యోతి కంఠస్థ పోటీలు నిర్వహించినారు. తీవ్రవాద నివారణార్థం గీతాజయంతి సందర్భముగ 'గీతా యజ్ఞం' నిర్వహించినారు. ప్రతి వారం సత్సంగాన్ని ఏర్పరచి శ్రీస్వామివారు అందించిన 48 శ్లోకాలను కంఠస్థం చేయిస్తూ, శ్లోకం, అర్థము, భాష్యములను చెప్పటం జరిగినది. ప్రచారమునకు స్కూటరే వారికి గీతారథ మైనది. గీతాజ్యోతి సందేశమును ఊరు ఊరు వాడవాడలా ప్రచారం చేయాలనేది వారి సంకల్పము. ఈ కార్యక్రమంలో డా॥ పి. శేషగిరిరావు, మరుదం రంగనాథ శర్మ, కె. లక్ష్మీనారాయణ మున్నగు వారు పాల్గొన్నారు.

**వెంకటాపురం :-** ఖమ్మంజిల్లా వెంకటాపురం ధర్మక్షేత్ర ప్రచార కార్యక్రమంలోభాగంగ ఉగాది పర్వదినాన పంచాంగ శ్రవణం, గీతాజ్యోతి కార్యక్రమం నిర్వహించబడినది. 10సం॥ల విద్యార్థులకు గీతాజ్యోతి పోటీలు నిర్వహించి నారు. గెలుపొందిన వారికి బహుమతి ప్రధానం చేయబడినది. తరువాత వికాసతరంగిణి సభ్యులతో శ్రీవిష్ణుసహస్ర నామ పారాయణం, జై శ్రీమన్నారాయణ భజన కార్యక్రమం నిర్వహించారు. ఈ కార్యక్రమంలో ధర్మక్షేత్ర కన్వీనర్ శ్రీ యస్.ఆర్.ఆర్. రంగరాజు జమిందారుగారు, యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

**మద్దుకూరు :-** ఖమ్మం జిల్లా మద్దుకూరు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో ఉగాది పర్వదినాన వేసవి దాహార్తిని తీర్చుటకు చలివేంద్రం ఏర్పాటు చేసినారు. ఈ కార్యక్రమంను శ్రీరామారావుగారు మయ్.డి.ఓ. ప్రారంభించినారు. దాహార్తులకు చల్లని మజ్జిగ, మంచినీరు వికాసతరంగిణి కార్యకర్తలు స్వయంగ సప్లై చేసినారు.

**నారాయణపురం :-** ఖమ్మం జిల్లా నారాయణ పురం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో

స్థానిక కృష్ణాలయంలో 18-03-03తేదీన రుక్మిణీ శ్రీకృష్ణ కళ్యాణం వైభవంగా నిర్వహించినారు. శ్రీరామనవమి సందర్భముగ సీతారాముల కళ్యాణం నిర్వహించి శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం చేయడం జరిగింది. ఈ కార్యక్రమం మందపాటి కేశవరెడ్డి, సామ్రాజ్యం ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు.

**భద్రాచలం :-** శ్రీభద్రాచల రాముని దివ్య సన్నిధిలో ప్రతి ఏటా శ్రీరామనవమి సందర్భంగా జరిగే బ్రహ్మోత్సవాలలో భాగమైన 'ధ్వజపట ఆరాధనం' అనే కార్యక్రమం ది 8-4-03నాడు మన శ్రీ జీయర్ మఠంలో వైభవోపేతంగా జరిగింది. గత మూడు సం॥రాలుగా మన మఠంయొక్క సమర్పణలో జరుగుతున్న ఈ ఉత్సవంలో ఆలయ అధికారులు, ప్రధానార్చకులు, వేద పండితులు, వికాసతరంగిణి సభ్యులు పాల్గొన్నారు. 'గీతాజ్యోతి' వార్షికోత్సవంగా జరిగిన ఈ కార్యక్రమంలో శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యులుగారు, శ్రీమాన్ స్థలశాయి (స్థానాచార్యులు)గార్లు గీతాజ్యోతి గురించి వివరించారు. ఈ సందర్భంగా SSRD కార్యనిర్వహణాధికారి శ్రీమతి హేమమురళీ ధరరెడ్డిగారు మన మఠంలోని ప్రపాస్థలి (చలివేంద్రము)ని ప్రారంభించారు. అందరికీ వడపప్పు,పానకం, ప్రసాదముల వినియోగంతో ఈ కార్యక్రమం సుసంపన్నమైంది. శ్రీమాన్ గట్టు వెంటకటాచార్యులు, శ్రీమాన్ కోటి రామన్వరూప్‌గార్లు ఎంతో చక్కగా నిర్వహించారు. వికాసతరంగిణి సభ్యుల సేవలతో 'ప్రపాస్థలి' ప్రయోజనవంతంగా జరిగింది.

శ్రీరామనవమినాడు మన మఠం ద్వారా సుమారు 50 కేజీల దధ్యోదనాన్ని, వందలాది మందికి పానకాన్ని, చల్లని మంచితీర్థాన్ని వికాసతరంగిణి - ప్రపాస్థలి పేరిట వినియోగం చేయడం జరిగింది. శ్రీమాన్ గట్టు కృష్ణమాచార్యులు, శ్రీమాన్ రామానుజం, శ్రీమాన్ మధుగార్లు ఈ కార్యక్రమాల్లో చక్కని సేవలను అందించారు. శ్రీ జీయర్ మఠం - వికాసతరంగిణిల అధ్యక్షులయిన శ్రీమాన్ పి.జె. భట్టర్‌గారి సమర్థవంతమైన పర్యవేక్షణలో అన్ని కార్యక్రమాలు ప్రయోజన వంతంగా జరుగుతున్నాయి.

**భద్రాచలంలో.......** వికాసతరంగిణి 67వశాఖ మొత్తం 131 గ్రామాలలో గీతాగోష్ఠులను ఏర్పాటు చేసింది. ఈ శాఖ అధ్యక్షులు, భద్రాచలం, మణుగూరు, వెంకటాపురం, కూనవరం నాలుగు ధర్మక్షేత్రాల సమన్వయ సారధి అయిన శ్రీమాన్ పి.జె. భట్టర్‌గారు సమర్పించిన మారుతీ వ్యాన్‌ని 'గీతారథం'గా ఏర్పాటు చేనుకొని శ్రీమాన్ జి. వెంకటాచార్యులుగారి ఆర్థిక సహకారంతో ఈ గీతాజ్యోతి ప్రచారం ముమ్మరంగా సాగుతోంది. శ్రీమాన్ అల్లూరి సీతారామరాజుగారు మారుమూల ప్రాంతాలలో కూడ చక్కని ప్రచారం చేస్తున్నారు. ఈ గిరిజన ప్రాంతాలలో ITDA, వంటి ప్రభుత్వ సంస్థలు తరచుగా నిర్వహించే వైద్యశిబిరాలవల్ల.... వైద్యశిబిరాల కంటే ఆధ్యాత్మిక సామాజిక సేవా ప్రబోధనకు ఈ ప్రాంతాలలో ఎంతో ఆవశ్యకమై ఉన్నందున ఆ దిశగా ఈ భద్రాచలంశాఖ గీతాజ్యోతిని ప్రచారం చేస్తున్నది.

## నల్గొండ జిల్లా

**నల్గొండ :-** నల్గొండ జిల్లా త్రిపురాం మండలంలో 40 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచారం పూర్తిచేయడం జరిగింది. ప్రతి యింటికి 'మానవసేవగ మాధవసేవ, స్వీయ





ఆరాధన సర్వ ఆదరణ' స్టిక్కర్లు, హనుమ ధ్వజాలు అందజేసినారు. గీతాజ్యోతి వైభవం గూర్చి అందరికి వివరించడం జరిగింది. శ్రీమాన్ జె.యల్.యన్. ఆచార్యులు, యాదగిరిస్వామి, నరసింహాచార్యులు, లక్ష్మణాచారి, శ్రీనివాసాచార్యులు, రమణ, నవీన్, మధుసూదనాచార్యులు ఆధ్వర్యవంలో ప్రతిరోజు ఒక గ్రామంలో దేవాలయ ప్రాంగణంలో గీతాజ్యోతి కార్యక్రమం నిర్వహించుచున్నారు.

**సూర్యాపేట :-** నల్గొండ జిల్లా సూర్యాపేట ధర్మక్షేత్ర గీతాజ్యోతి ప్రచార కార్యక్రమంలో భాగంగ 108 గ్రామాలలో గీతాజ్యోతి 25 గోష్ఠులను ఏర్పాటు చేసి 8 గ్రామాలలో శ్రీకృష్ణ పూజలు నిర్వహించడం జరిగింది. సూర్యాపేట పాతబస్టాండ్ దగ్గర వేసవి దాహార్తిని తీర్చుటకై చలివేంద్రం ప్రారంభించినారు. ఈ కార్యక్రమానికి ఇద్దరు జడ్జీలు హాజరైరి. పుర ప్రముఖులు ఎ. జనార్దన్ రావుగారు, యమ్. అప్పయ్య, డా॥ ఆచార్యగార్లు, వికాసతరంగిణి అధ్యక్షులు మిలలా సత్యనారాయణగార్లు, యితర కార్యకర్తలు పాల్గొన్నారు. చలివేంద్రం నందు ప్రతిరోజు మధ్యాహ్నం 60 లీటర్లు మజ్జిగ అందించుటకు నిర్ణయించడమైనది.

**త్రిపురారం :-** నల్గొండ ధర్మక్షేత్ర కేంద్రముగ గ్రామాల వారీగ గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం నిర్వహించుచున్నారు. గీతాజ్యోతికి సంబంధించిన శ్లోకములు పుస్తక రూపంలో ముద్రించి భక్తులకు ఉచితంగ పంపిణీ చేయడం జరిగినది. కొన్ని ప్రాంతాలలో గీతాశ్లోక పఠనానంతరము ఆయా వారమునకు సంబంధించిన శ్లోకమునకు ప్రతిపదార్థ తాత్పర్యము కూడ ఉపన్యాసము ద్వారా తెలుపడం జరుగుచున్నది. ధర్మక్షేత్ర ప్రచార కార్యదర్శి శ్రీమతి యరమాడ సుజాత గార్లు ఆధర్వర్య వంలో ప్రచార కార్యక్రమం నిర్వహించు చున్నారు.

గీతాజ్యోతి కార్యక్రమ నిర్వహణలో భాగంగా 11 మండలాలలోని గ్రామాలలో ప్రచార కార్యక్రమం నిర్వహించారు. పర్యటనలో శ్రీమాన్ గంగాధరంగారి ఉపన్యాసము, గీతాజ్యోతి పఠనం, గీతాజ్యోతి శ్లోకమాలిక పుస్తకములు, ఇతర ప్రచార సామగ్రి గ్రామాలలో ఉచితంగా పంపిణీ చేయడం జరిగింది.

**జాజిరెడ్డి గూడెం :-** నల్గొండ జిల్లా జాజిరెడ్డి గూడెం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమంలో భాగంగ స్థానిక లక్ష్మీనరసింహస్వామివారి దేవాలయంలో శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం, గీతాజ్యోతి శ్లోకాలు, భజన కార్యక్రమం నిర్వహించినారు. పిల్లలకు గీతాజ్యోతి శ్లోక మాలికలను నేర్పించడం జరిగింది. పశు, దంత వైద్యశిబిరములు నిర్వహించుటకు సన్నాహాలు జరుగుచున్నవి. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి చైర్‌పర్సన్ గండ్రమాధవి యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

**కేసారం :-** నల్గొండ జిల్లా కేసారం వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగ సింగిరెడ్డి పాలెం గ్రామంలో కృష్ణపూజలు నిర్వహించడం జరిగింది. జన్మభూమి కార్యక్రమంలో భాగంగా 600 గొర్రెలను పరీక్షించి ఉచిత మందులు పంపిణీ చేసారు.

## శ్రీకాకుళం జిల్లా

**రాజాం :-** శ్రీకాకుళం జిల్లా రాజాం ధర్మక్షేత్ర కేంద్రముగ స్థానిక రాజగోపాలస్వామివారి

దేవస్థానమునందు శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణం 1008 సార్లు పారాయణం చేసినారు. వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో రాజాం వేదర వీధిలో జరిగిన అగ్ని ప్రమాదంలో 18ఇళ్ళు దగ్ధం కాగ వారికి ఉచిత దుస్తులు, మందులు పంపిణీచేసినారు. 9-2-2003 రాజాం గవర్నమెంట్ హాస్పిటల్ నందు శ్రీమాన్ కిమిడి గణపతిరావు MLA గారి ఆధ్వర్యవంలో నేత్ర వైద్య శిబిరం నిర్వహించ బడినది. కార్యకర్తలు రోగులకు తగువసతి ఏర్పాట్లు చేసినారు. 8-3-03 శ్రీమాన్ చెలికాని హరనాథ్‌గారి ఆధ్వర్యవంలో నేత్రవైద్య శిబిరం ఏర్పాటు చేసినారు. 15 మంది రోగులకు పరీక్షలు నిర్వహించడం జరిగింది.

బుద్దాం గ్రామంలో పశువైద్య శిబిరం నిర్వహించడం జరిగింది. 2000 పశువులు, గొర్రెలకు వైద్యం అందజేసినారు. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి శ్రీమతి చెలికాని సీతాదేవి యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

## గుంటూరు జిల్లా

**పాలపర్రు :-** గుంటూరు జిల్లా పాలపర్రు వికాసతరంగిణి ఆధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమంలో 16 గ్రామాలలో పాఠశాల విద్యార్థులకు చిత్రగీత పరిచయం చేయడం జరిగింది. చుట్టుప్రక్కల గ్రామాలలో 'మాధవసేవగ సర్వప్రాణిసేవ' 'స్వీయ ఆరాధన సర్వఆదరణ' స్టిక్కర్లు, హనుమధ్వజాలు అందించడం జరిగింది. మార్టూరు ధర్మక్షేత్ర కేంద్రముగ ప్రచార కార్యక్రమం నిర్వహించుచున్నారు.

**వేల్పూరు :-** గుంటూరుజిల్లా వేల్పూరు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో శ్రీకృష్ణాష్టమినాడు స్థానిక గీతా మందిరంలో శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం, ఏకాహం, భజన కార్యక్రమములు నిర్వహించినారు. ఉగాది రోజున గీతాజ్యోతి పఠన కార్యక్రమం నిర్వహించినారు. ఈ కార్యక్రమంలో జె. శ్రీనివాస్ వికాస తరంగిణి కార్యకర్తలు పాల్గొన్నారు.

## కృష్ణాజిల్లా

**గుడివాడ :-** కృష్ణాజిల్లా ధర్మక్షేత్ర కేంద్రముగ గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం రెండవ విడత ప్రతి గ్రామంలో గీతాజ్యోతి లక్ష్యాలను వివరించడం జరుగుచున్నది. ఆర్.టి.సి. బస్టాండ్ దగ్గర వేసివిలో దాహార్తి తీర్చుటకు 2 చలివేంద్రాలను ఏర్పాటు చేసినారు. 25 గ్రామాలలో గీతాజ్యోతి గోష్ఠులను ఏర్పాటు చేసి కృష్ణపూజలు నిర్వహించిరి.

ఫాల్గుణ పౌర్ణమి సందర్భముగ లక్షమల్లె పూలతో పెరుమాళ్‌కు అర్చన చేయడం జరిగింది. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి కార్యకర్తలు యితర ముఖ్యులు పాలొన్నారు.

**జగ్గయ్యపేట :-** కృష్ణాజిల్లా జగ్గయ్యపేట ధర్మక్షేత్ర కేంద్రముగ గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం నిర్వహించబడినది. 28-03-2003న ఢిల్లీలోని సుధగారి గృహములో గీతాజ్యోతి సందేశం అందించడం జరిగింది. 4-04-03 తేదీన శ్రీ చేగు ధనుంజయుగారి గృహములో కృష్ణపూజలు, అనంతరం శ్రీవిష్ణుసహస్రనామ పారాయణం, గీతాజ్యోతి సందేశము వివరించడం జరిగింది. 11-04-03 తేదీన కాకతీయ సొసైటీ యందు, గురుగామ్‌లోని చక్రపూర్ ఆలయంలో శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం చేయడం జరిగింది. ధర్మక్షేత్ర ప్రచార కార్యకర్త శ్రీరాం విజయలక్ష్మి గార్ల ఆధ్వర్యవంలోఈకార్యక్రమం నిర్వహించినారు.





**కొండపల్లి :-** కృష్ణాజిల్లా కొండపల్లి ధర్మక్షేత్ర కార్యక్రమాలలో భాగంగా 70 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం పూర్తిచేయడం జరిగింది. 800 మంది పాఠశాల విద్యార్థులకు గీతాజ్యోతి సమాచారం అందజేసినారు. ధర్మక్షేత్ర కన్వీనర్ బొర్రా జయలక్ష్మిగారు ప్రచార కార్యక్రమ బాధ్యతలను నిర్వహించు చున్నారు.

**కృష్ణలంక :-** విజయవాడ పట్టణ కృష్ణలంక వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమంలో భాంగా శ్రీస్వామివారి మంగళాశాసనములతో శ్రీమద్భాగవతోవన్యాసాలు ఏర్పాటు చేయబడినవి. ప్రహ్లాదచరిత్ర, శ్రీకృష్ణలీలలు, వామన చరిత్ర, శ్రీమద్భాగవతం నారాయణ కవచం అంశాలపై శ్రీమాన్ సాతులూరి గోపాలకృష్ణమాచార్యులు, శ్రీమతి టి.కె. చూడామణిగారు, శ్రీమాన్ టి. ఉడయవర్లు స్వామివారు, శ్రీమాన్ డా॥ యన్.వి. రంగరామానుజాచార్యస్వామివారు ప్రవచనములు అందించడం జరిగింది. శ్రీమాన్ పూర్ణానందస్వామిజివారిచే గీతాజ్యోతి కార్యక్రమ ఉపన్యాసం నిర్వహించడం జరిగింది.

గీతాజ్యోతి 24 శ్లోకమాలికలు 5000 కాపీలు ప్రింట్‌చేసి పిల్లలకు భక్తులకు ఉచితంగ పంపిణీ చేయడం జరిగింది. అల్లంపల్లి గిరిజన పాఠశాలలకు 3వ తరగతి పిల్లల కథల పుస్తకములు, కైంకర్యంగా సమర్పించడం జరిగింది. బట్టలు ఐడియల్ పబ్లిక్‌స్కూల్ టీచర్స్ కైంకర్యం ఇవ్వడం జరిగింది. ముగింపు రోజున 800 మందికి తదీయారాధన ఏర్పాటు చేయడం జరిగింది.

ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి చైర్ పర్సన్ శ్రీమతి సీతామహలక్ష్మీగారు యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

## పశ్చిమ గోదావరి జిల్లా

**పాలకొల్లు :-** పశ్చిమ గోదావరి జిల్లా పాలకొల్లు ధర్మక్షేత్ర కేంద్రముగ గీతాజ్యోతి ప్రచార కార్యక్రమంలో భాగంగ వాసవీ మహిళ క్లబ్ ఆధ్వర్యవంలో ఉ॥ 11గం॥ల నుండి సా॥ 4 గం॥ వరకు వేసవి చలివేంద్రం ఏర్పాటు చేసినారు.

లూయిన్ హాస్పిటల్ వారి వైద్య బృందముచే ఉచిత నేత్ర వైద్య శిబిరం ఏర్పాటు చేయడం జరిగింది. రోగులను పరీక్షించి కళ్ళజోళ్ళు యివ్వడం జరిగింది. గాదె జనార్ధన గుప్తగారు ఆర్థిక సహాయం అందజేసినారు. కాలేజి విద్యార్థులకు చిత్రగీత, గీతాజ్యోతి శ్లోకమాలికలు యివ్వడం జరిగింది. విశ్వహిందు పరిషత్ వారి సహకారంతో స్లమ్ ఏరియాలో 48 శ్లోకాలు పంపిణీ చేయడం జరిగింది.

**కొవ్వలి :-** పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వలి వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం వైభవంగ నిర్వహించుకొను చున్నారు. కార్యక్రమంలో భాగంగ గ్రామ పంచాయితి కార్యాలయం వద్ద వేసవి 'చలివేంద్రం' ఏర్పాటు చేయడమైనది.

డా॥ శ్రీమాన్ ముక్కామల పార్థసారథి గారు, డా॥ ఆర్. చంద్రశేఖరరావుగార్ల ఆధ్వర్యవంలో 2-11-02 తేదీన పాఠశాల విద్యార్థిని, విద్యార్థులకు దంతవైద్య శిబిరం నిర్వహించ బడినది. ఈ కార్యక్రమంలో 1200 మంది పాల్గొన్నారు. విద్యార్థులకు ఉచితంగ బ్రష్, పేస్టులు యివ్వడం జరిగింది. గీతాజయంతి సందర్భముగ శ్రీవేంకటేశ్వర స్వామివారి దేవాలయంలో సామూహిక గీతా పారాయణం చేయడం జరిగింది. ఈ కార్యక్రమం సత్యనారాయణాచార్యులు వారి ఆధ్వర్యవంలో నిర్వహించుచున్నారు.

## తూర్పు గోదావరి జిల్లా

**కోటి :-** కోటి వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో రాజమండ్రి ధర్మక్షేత్ర ప్రచార కార్యక్రమంలో భాగంగా కోటి గ్రామంనుండి భద్రాచలం వరకు గీతాజ్యోతి ప్రచార సైకిలు యాత్ర నిర్వహింపబడినది. గోకవరం, రాజమండ్రి వికాసతరంగిణి శాఖలు సహాయ సహకారాలు అందించినారు. ధర్మ రథంతోపాటు 150 మంది కార్యకర్తలు ఉత్సాహంగా పాల్గొన్నారు.

**గొల్లప్రోలు :-** గొల్లప్రోలు వికాసతరంగిణి వారు గీతాజ్యోతిలో భాగంగా ధనుర్మాసం నుండి ప్రతి పర్వదినాన శ్రీవిష్ణు సహస్రనామ పారాయణతో పాటు గీతాజ్యోతులను వెలిగించి వైభవంగా జరుపుకొంటున్నారు.

శ్రీరామనవమి కళ్యాణంరోజు గ్రామంలోని వారందరూ కలసి వైభవోపేతంగా జరుపుకున్నారు.

## విశాఖ జిల్లా

**మర్రిపాలెం :-** విశాఖపట్నం మర్రిపాలెం వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యంలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం వేగంగా జరుగుచున్నది. పట్టణంలోని 9 వికాసతరంగిణి శాఖలను భాగస్వామ్యం చేస్తు విశాఖపట్టణం ధర్మక్షేత్ర కేంద్రముగ ప్రచారం నిర్వహించుచున్నారు. ప్రతిరోజు ఒక్కొక్క గ్రామానికి వెళ్ళి విష్ణు సహస్రనామములు, గీతాజ్యోతి శ్లోక మాలికలను నేర్పించడం జరుగుచున్నది. ఈ కార్యక్రమంలో కె. పద్మావతిగార్లు యితర ముఖ్య కార్యకర్తలు పాల్గొన్నారు.

**చోడవరం :-** విశాఖపట్నం జిల్లా చోడవరం ధర్మక్షేత్ర కేంద్రముగ శ్రీమాన్ రఘునాథా చార్యులుగారి ఆధ్వర్యంలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం జరుగుచున్నది. ప్రతి గ్రామంలో అందరిచేత గీతాజ్యోతి శ్లోకాలు నేర్పే ఏర్పాటు చేయుచున్నారు. ప్రతి గ్రామంలో కృష్ణపూజలు నిర్వహించుచున్నారు. ప్రతి దేవాలయం నందు భజన కార్యక్రమములు చేయించుచున్నారు. హాస్టల్ విద్యార్థులకు కార్యక్రమంలో భాగంగ 'శ్రీహయగ్రీవ' మంత్రోపదేశం చేయడం జరిగింది.

**MVP కాలనీ :-** విశాఖపట్నం MVP కాలనీ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో గీతాజ్యోతి ప్రచార పాదయాత్ర నిర్వహించడం జరిగింది. స్లమ్ ఏరియాల్లో శ్రీకృష్ణపూజలు చేయించి తులసిమొక్కలు, డాలర్లు, విష్ణుసహస్రనామ పుస్తకాలను అందజేయడం జరిగింది. 12సం॥ వయస్సుగల బాల కార్మికులకు బాలవికాస్ ఫౌండేషన్ వారి ఆధ్వర్యంలో 50 స్టీలు కంచాలు, పంపిణీ చేయడం జరిగింది. గంగపుత్రుల కుంటుంబాలతో శ్రీకృష్ణపూజలు నిర్వహించడం జరిగింది. బొంబాయి తెలుగు మహాసభ ప్రాంగణానికి వెళ్ళి గీతాజ్యోతి పేపర్లు 48 శ్లోకాలు, స్టిక్కర్లు పంపిణీ చేయడం జరిగింది. ప్రతినెల 2వ శనివారం ఉచిత వైద్య శిబిరం నిర్వహించడం జరుగుచున్నది.

**అనకాపల్లి :-** విశాఖపట్నం జిల్లా అనకాపల్లి ధర్మక్షేత్ర కేంద్రముగ గీతాజ్యోతి ప్రచార కార్యక్రమంలో భాంగా షెడ్యూల్ తెగ, వెనుకబడిన తరగతుల పిల్లలకు ఉచిత వైద్య పరీక్షలను నిర్వహించడం జరిగింది. శ్రీమాన్ డా॥ నాగరాజుగారిచేత పరీక్షలు నిర్వహింప జేసారు. వేసవికాలంలో వచ్చే జబ్బులను అరికట్టేందుకు నమ్మర్ టానిక్‌లను పిల్లలందరికి యివ్వడం జరిగింది. వైద్యశిబిరం చేసిన ప్రతిచోట గీతాజ్యోతి శ్లోకాలను పారాయణం చేయడం జరుగచున్నది. శ్రీమాన్





రఘునాథాచార్యస్వామి వారు తగుసూచనలను, సలహాలను అందజేసినారు.

## వరంగల్ జిల్లా

**అప్పరాజుపల్లి :-** వరంగల్ జిల్లా అప్పరాజుపల్లి ధర్మక్షేత్ర కేంద్రముగ గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం 40 గ్రామాలలో, మరియు గిరిజన తండాలలో ప్రచారం జరుగుచున్నది.

23-03-03 తేది మానుకోట వికాస తరంగిణి శాఖ సహాయ సహకారములతో అప్పరాజుపల్లి గ్రామంలో ఉచిత వైద్య శిబిరం నిర్వహించినారు. 800 మందికి ఉచిత వైద్య సేవలు అందించి మందులు పంపిణీ చేసినారు. ఇందులో భాగంగ ఉచిత కంటి పరీక్షలు నిర్వహించి 15 మందికి ఆపరేషన్లు చేయించినారు. 100 మందికి కంటి అద్దాలు సగం ధరకు సరఫరా చేసినారు. వికాస తరంగిణి అధ్యక్షులు మన్నెం వెంకన్న యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

**ఎరిజర్ల :-** వరంగల్ జిల్లా ఎరిజర్ల వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యంలో శ్రీస్వామివారి మంగళాశాసనములతో శ్రీసీతారామ చంద్రస్వామివారి 'తిరుకళ్యాణ మహోత్సవము వైభవముగా నిర్వహించుకొన్నారు. ఈ మహోత్సవములను శ్రీమాన్ నంబి వేణుగోపాలాచార్యులుగారి పర్యవేక్షణలో శ్రీమాన్ సముద్రాల శ్రీనివాసాచార్యులుగారు యజ్ఞ కర్తృత్వములో నిర్వహించబడినది. సుందరాకాండ, శ్రీవిష్ణు సహస్రనామ పారాయణాదులు జరిగినవి. ఈ సందర్భముగ శ్రీస్వామివారికి లక్ష తులసీ అర్చన, శతకలశస్నపనం, అమ్మవారికి కుంకుమార్చనలతో ఆలయ పవిత్రోత్సవము నిర్వహించినారు. సుమారు 80 మంది స్వాములు 'శ్రీరామ పునర్వసు' దీక్ష తీసుకున్నారు.

## పరమపద వార్త

శబరిగా విఖ్యాతురాలైన **శ్రీమతి కాకర్లపూడి రంగనాయకమ్మ గారు** తేది : 8-4-03న ఉ॥ 6-00 గం॥లకు ఆచార్య తిరువడి చేరినారు. వీరు మన పెద్దజీయరుస్వామివారి శిష్యులు వీరు అనేక కార్యక్రమములలో కైంకర్యము గావించి పాల్గొనినారు.

**శ్రీమతి దేవులపల్లి రాధాదేవిగారు** తేది : 28-3-03 రోజున (శుద్ధ ఏకాదశి) ఉ॥ 8-45, ని॥లకు ఆచార్య తిరువడి చేరినారు. వీరు వానమామలై జీయర్‌స్వామివారివద్ద సమాశ్రితులైనారు. మన పెద్దజీయరుస్వామివారి అనేక కార్యక్రమాలలో అన్వయించి మంగళాశాసనాలు పొందారు.

వీరికి ఆశ్రియఃపతి సాన్నిధ్యం నిత్యం కలగాలని ప్రార్థిస్తున్నాము.

## మహబూబ్‌నగర్ జిల్లా

**వనపర్తి :-** వనపర్తి వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో ఉగాది పర్వదినాన శ్రీవేంకటేశ్వర స్వామివారి దేవాలయం నందు పంచాంగ శ్రవణ కార్యక్రమం నిర్వహించ బడినది. ఈ సందర్భములో శ్రీస్వామివారి సందేశమును గీతాజ్యోతి పొడగింపు కార్యక్రమం తెలుపుచు 1000 మంది భక్తులకు గీతాజ్యోతి శ్లోకమాలికలు యివ్వడం జరిగింది. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి అధ్యక్షులు వి. కురుమూర్తిగారు, జి. వెంకటరామిరెడ్డి గారు, రామచంద్రయ్యలు యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

## నిజామాబాద్ జిల్లా

**నిజామాబాద్ :-** శ్రీస్వామివారి మంగళా శాసనములతో నిజామాబాద్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో అర్బన్ హెల్త్ సెంటర్ నిర్వహించబడుచున్నది. ప్రతిరోజు 100 మంది రోగులకు ఉచిత వైద్య పరీక్షలు నిర్వహించి మందులు పంపిణీ చేయుచున్నారు. నెలకు రెండు సార్లు కుటుంబ నియంత్రణ కార్యక్రమ హాస్పిటల్‌యందు నిర్వహించుచున్నారు. 7గురు డాక్టర్లు, 6 స్టాఫ్ తమ అమూల్యమైన వైద్యసేవలను అందజేయుచున్నారు. శ్రీమాన్ జి. లక్ష్మారెడ్డిగారు హాస్పిటల్ ప్రాజెక్ట్ కో-ఆర్డినేటర్‌గా వ్యవహరించుచున్నారు.

## జంటనగరాల నివేదిక

ఏప్రిల్ 20వ తేదీన జంటనగరాల వికాసతరంగిణి కార్యకర్తల సమావేశం శ్రీమాన్ కల్కిఅవతారంగారి అధ్యక్షతన జెట్ భవనంలో జరిగింది. వికాసతరంగిణి కేంద్రకార్యాలయ ఆర్గనైజింగ్ సెక్రటరీగారైన శ్రీమాన్ కె. భవానీ ప్రసాద్‌గారు ఈ సమావేశంలో పాల్గొన్నారు. గీతాజ్యోతి కార్యక్రమ కొనసాగింపు భవిష్యత్ కార్యాచరణ ప్రణాళిక శ్రీస్వామివారి అభిప్రాయాలను ఈ సమావేశంలో విపులంగా కార్యకర్తలకు వివరించడం జరిగింది. తిరుమలకు వాలంటీర్లుగా వెళ్ళబోయే వికాసతరంగిణి కార్యకర్తలకు సూచనలు, విధులను వివరించడం జరిగింది. శ్రీమాన్ కల్కి అవతారంగారు శ్రీ భవానీ ప్రసాద్‌గారు 7వ తేదీన వనపర్తి శాఖను 19వ తేదీన సుల్తానాబాద్ ధర్మక్షేత్ర కేంద్రమును సందర్శించి సమీక్షించినారు.

**బోయినపల్లి :-** బోయినపల్లి వికాసతరంగిణి ఆధ్వర్యవంలో న్యూ సిటీ కాలనీలోకల లంబాడీ బస్తీలో ఉచిత వైద్యశిబిరం నిర్వహించినారు. ఈ కార్యక్రమంలో 300 మంది రోగులను పరీక్షించినారు. డా॥ వి. సూర్యనారాయణ ఆధ్వర్యవంలో ఈ శిబిరం నిర్వహించబడినది.

**దోమలగూడ :-** వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో తిలక్ నగర్ ప్రాంతంలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం నిర్వహించుచున్నారు. 250 కుటుంబాలకు గీతాజ్యోతి శ్లోకమాలికలను అందజేయడం జరిగినది. వికాసతరంగిణి మెంబర్ లీలా గీతాజ్యోతి ప్రచార కార్యక్రమమును నిర్వహించుచున్నారు.

**వనస్థలిపురం :-** గీతాజ్యోతి ప్రచార కార్యక్రమంలో భాగంగా హిల్‌కాలనీలోని రామాలయంలో శ్రీవిష్ణుసహస్రనామ పారాయణం, గీతాజ్యోతి శ్లోకమాలిక పారాయణం కావించినారు. ఈ కార్యక్రమంలో 150 మంది భక్తులు పాల్గొన్నారు. శాలివాహన నగర్‌లోని శ్రీవేంకటేశ్వరాలయంలో సామూహిక ఉపనయన కార్యక్రమం నిర్వహించబడినది. వేసవి దాహార్తిని తీర్చుటకు వనస్థలిపురం బస్టాండ్‌నందు చలివేంద్ర కేంద్రమును ఏర్పాటు చేసినారు. ఈ కార్యక్రమంలో యల్.బి. నగర్ మున్సిపల్ చైర్మన్ ఆకుల రమేష్ గౌడ్‌గారు ఇతర కౌన్సిలర్‌లు పాల్గొన్నారు.

**మూసాబ్ టాంక్ :-** ఈశాఖ ఆధ్వర్యవంలో శ్రీవేంకటేశ్వర దేవాలయంనందు శ్రీమాన్ నరసింహాచార్యులుగారి ఆధ్వర్యవంలో విష్ణుసహస్రనామ పారాయణ, గీతాజ్యోతి శ్లోకమాలిక పారాయణను నిర్వహించడం జరిగింది. శ్రీరామనవమి కళ్యాణోత్సవం సందర్భంగా 200 మంది భక్తులు పాల్గొన్నారు.

**రామంతపూర్ :-** ఈ శాఖ ఆధ్వర్యవంలో ఉచిత కాల్షియం డిఫిసెన్సీ టెస్ట్ మరియు టి.బి. వైద్యశిబిరం ఏప్రిల్ 4వ తేదీన నిర్వహించబడినది. ఈ శిబిరంలో 110 మంది రోగులకు పరీక్షలు నిర్వహించబడినవి. రామంతపూర్ గవర్నమెంట్ ప్రైమరీ స్కూల్ 300 మంది విద్యార్థులకు స్టీల్‌ప్లేట్లు గ్లాస్‌లు పంపిణీచేయడం జరిగింది.

ఏప్రిల్ 14వ తేదీ ఈ శాఖ ఆధ్వర్య వంలోనే జలయజ్ఞం కార్యక్రమం నిర్వహించ బడినది. ఈ కార్యక్రమమునకు వెంకటేశ్వర భక్త ప్రచార పీఠంవారు సహకారం అందించారు. ఈ కార్యక్రమంలో హోమ్ శాఖామాత్యులు శ్రీమాన్ దేవేందర్‌గౌడ్‌గారు, ఉప్పల్ మున్సిపల్ చైర్మన్ శ్రీమాన్ డి. శ్రీనివాస్‌గారు, ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు.

## విజయనగరం జిల్లా

**విజయనగరం :-** గీతాజ్యోతి కార్యక్రమంలో స్వామివారి ఆజ్ఞమేరకు గీతాజ్యోతి శ్లోకమాలికలతోపాటుగా అభ్యాసపట్టికలను కూడా భక్తులకు అందజేయడం ప్రారంభించారు. 3వ తేదీన అఖండ శ్రీవిష్ణు సహస్రనామ పారాయణ 24 నిర్విరామంగా జరిపారు. 4వ తేదీన ఉచిత నేత్ర వైద్యశిబిరం నిర్వహించి, 5వ తేదీనుండి నాలుగు రోజులపాటు 58 కంటి ఆపరేషన్స్‌చేయించి వారికి ఉచిత మందులు, కళ్ళద్దాలు, భోజన వసతి ఏర్పాటు చేయించారు. ఈ చికిత్సా శిబిరాన్ని రాష్ట్ర రెవిన్యూశాఖా మాత్యులు శ్రీమాన్ పి.అశోక గజపతిరాజు గారు ప్రారంభించారు.

శ్రీరామనవమి సందర్భంగా శ్రీమాన్ సిహెచ్. రమణమూర్తిగారు (కలెక్టరా ఫీసులోని ఉద్యోగుల సహకారంతో) 11వ తేదీన నేత్ర విద్యాలయంలో పిల్ల లందరకూ వస్త్రాలను పంచారు.

శివరాత్రి నుండి శ్రీరామనవమి వరకు 41 రోజులపాటు జరిగిన శ్రీరామాయణ పారాయణలో 760 మంది భక్తులు పాల్గొన్నారు.

పట్టాభిషేక మహోత్సవానికి శ్రీమాన్ దాశరథిగారు, శ్రీమతి కర్రి తిరువేంగళమ్మ గారు వేంచేసారు.

జై శ్రీమన్నారాయణ..!  జై శ్రీమన్నారాయణ..!

## విషయ సూచిక .....



## పంచాంగ వివరాలు

### జూన్

2 భౌద్ధకల్కి జయంతి.

8 మృగశిరకార్తె రా. 9-19

10 స్మార్తనిర్జలైకాదశి

11 శ్రీవైష్ణవానామేకాదశి

(10వ తేదీనాటి ఏకాదశి, దశమితోకలిసి ఉండుటచే విద్ధమైయున్నది. కావున శ్రీవైష్ణవులు 10వ తేదీన కాక 11వ తేదీనే ఏకాదశి ఉపవాసం పాటించాలి.)

కూర్మజయంతి, అళహసింగర్‌తిరు॥

12 నమ్మాళ్వార్ తిరునక్షత్రం

15 మిధున సంక్రమణం రా॥ 9-13, తిథిద్వయం

16 తదియ తిథి

22 ఆర్ద్ర కార్తె రా. 9-50

23 దశమి తిథి

24 శూన్యతిథి

25 సర్వేషామేకాదశి

29 సర్వేషాం అమావాస్య

### జూలై

6 పునర్వసు కార్తె రా. 11-3

8 తిథి ద్వయం, పెరియాళ్వార్ తిరు॥

9 ఏకాదశి తిథి, పితృకార్యాదులకు

10 సర్వేషాం శయనైకాదశి, తొలైకాదశి చాతుర్మాస్యారంభం. ఏకాదశి ఉపవాసం ఈరోజే చేయాలి.


మీ సేవలో....

**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 272929,
చందా: సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-,
విదేశాలకు సంవత్సరచందా $ 25,
E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org
D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం,






శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాస పత్రిక


స్వభాను నామ సంవత్సరం జ్యేష్ఠ మాసము

**సంపుటి 56 2003 జూన్ సంచిక 3**

వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు :

శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు

సంపాదకీయం

# వారు దేవతలే

మనిషిని కొందరుమనిషిగా గుర్తిసారు **'వాడండీ మనిషంటేను'** యోగ్యతాపత్రం! కొందరు మనిషిని మనిషే కాదంటారు **'వాడూ మనిషేనుటండీ'!** అభిశంసాపత్రం. ఇంకొందరు మనిషిని రాక్షసుడంటారు. **'వాడా వాడు వట్టి రాక్షసుడుకాట్టండీ'!** – ఇది కుత్సాపత్రం. వేరొక కొందరు మనిషిని దేవుడంటారు. వాడు దేవుడు కాదుటండీ! ఇది ప్రశంసాపత్రం.

**ఇంతకూ మనిషి ఎవరు? మనిషా?**

**రాక్షసుడా? దేవుడా?**

వాస్తవానికి మనిషి మనిషయితే చాలు, మనిషిగా మనగలిగితే చాలు, మనిషిగా మన్నన పొందగలిగితేచాలు. వాడు రాక్షసుడు కాకూడదు, దేవుడు కానక్కరలేదు.

ఐతే జనం ఊరుకుంటారా? వాళ్ళ అభిప్రాయాలు వాళ్ళవి. నచ్చేదూ, వారు మెచ్చేరూ ఏనుగంబారీ ఎక్కిస్తారు. నచ్చలేదు మెచ్చలేదూ. నూరు తాళ్ళలోతుల గొయ్యి తీసిపాతేస్తారు. ఏదొచ్చినా కష్టమే.

వీడంటాడు ఎందుకొచ్చిన ప్రశంసలు, అభిశంసలూనూ, నామానాన్న నన్ను బతకనీండి, ఈ ఎత్తేయటాలెందుకు! ఆ పాతెయ్యటాలెందుకు? అని.

అయినా పొగడినా తెగడినా సమస్యకాని ఉన్నమాటన్నప్పుడు ఉలికిపడటమెందుకు?

అయితే ఉన్నమాటకూడా కొన్నిచోట్ల వింతగా విద్దూరంగా అత్యుక్తిగా భాసిస్తున్నందు వల్ల సత్యాలు కూడా అసత్యాల్లా ప్రశంసా వాక్యాల్లా వినవస్తున్నాయి.

అందుక్కారణం ఉండాల్సినవి సరిగా ఉండకపోవటం.

ఇవేళ రైలు రైట్‌టైముకు వచ్చిందనుకోండి. ఎంత వింత! ఇవేళ ఒకడు సత్యవ్రతుడుగా కనపడ్డాడనుకోండి ఎంత ఘోరం!

ఎవరి పనులువారు సక్రమంగా సలక్షణంగా చేసుకోవటం కూడా సంచలనమే అయికూచుందివేళ. కాలం తీరు లోకం పోకడ అట్లా ఉన్నాయి.

ఓ మూడు లక్షణాలు చెప్పి అవి కలవారు తాము మనుషులే అయినా దేవతలవంటివారే అంటున్నాడు నీతికారుడు.

**పరపరివాదన మూకాః**
**పరదారనిరీక్షణేషు జాత్యంధాః ।**
**యే పరరహస్య బధిరాః**
**తే పురుషా దేవతా సదృశాః॥**

**పరుల దోషాలు చెప్పటంలో మూగవారు, పరభార్యలను చూట్టంలో పుట్టుగుడ్డివారు, పరరహస్యాలు వినటంలో చెవిటివారు – వీరు దేవతలవంటివారు.**

మనిషి మంచిగానూ చెడ్డగానూ నిలబెట్టే గొప్పసాధనం మాట. ఎన్ని జన్మల తపఃఫలంగా వచ్చిందో కాని యీ మాట దీని శక్తి ఇంతా అంతా కాదు. ఇది కాపురాలు కూలుస్తుంది, సామ్రాజ్యాలు పడగొడుతుంది. నెత్తురుటేరులు ప్రవహింపచేస్తుంది. ఏం చేయదని? అన్నీ చేస్తుంది.

ఈ మాటనే పొందికగా వాడుకుంటే ఎగిరేతలలు నిలుస్తాయి. కూలే కొంపలు





నిలుస్తాయి. పడబోయే సామ్రాజ్యాలు భద్రంగా సాగుతాయి.

**ఏం చేయలేటిమాట. అన్నీ చేస్తుంది.**

మాటలు వచ్చును కదా అని ఇష్టం వచ్చినట్లు విసురుతాం. కొందరు నిరంతరం ఏదో వాగుతూనే ఉంటారు. తెలిసినవారు తెలియనివారు తేడాలు పాటించకుండా ఏమేమో అవాకులు చెవాకులు పలుకుతూనే ఉంటారు. ఎక్కణ్ణించో నిందాప్రచారాలు మోసుకు వచ్చివేస్తారు. వాటికి ఋజువా సాక్ష్యమా! ఎవరో అన్నారు – సమాధానం, ఇది సరికాదు.

ఆ ధోరణి వద్దు, మంచిదికాదు, వారు నిందార్హులా కాదా కూడా మనకనవసరం. ఒక వేళ నిందార్హులే అయినా వారి నిందకు కారణభూతమయిన దాన్ని తొలగించే ప్రయత్నం చెయ్యగలిగితే చెయ్యి అంతేకాని నలుగురితోపాటు నువ్వూ ఒక రాయి విసరటం ఏ మాత్రం సమంజసం కాదు, సమర్ధనీయమూ కాదు. వింటున్నావు. ఏం చెయ్యలేక పోతున్నావు. మౌనంగా ఉండు. అక్కడ నుంచి తొలగిపో, తలదూర్చకు, వాణ్ణి నువ్వూ నిందించకు. నువ్వుగా అసలు ఎవరినీ నిందలాడకు, నీకు నోరు లేదనుకో.

ఇక పరదాల ప్రసంగం. ఒరుల ఆడువారు కన్పించినపుడు కన్నెత్తి చూడకపోవటం పల్లెత్తి పలకరించకపోవటం, కాస్త ముందుగానే పెడగా తొలగిపోవటం మన తాతలనాటి నుంచి వస్తున్న మర్యాద. అట్లాంటిది గుడిమెట్ల దగ్గరో నిలాటి రేవుకడనో, బస్సుస్టాపుల్లోనో పనిగట్టుకు పదిమంది పోకిరీలతో కలసి లేకి చూపులు చూడటం, ఊరికట్టుబాటుకు వ్యతిరేకం. మానవతకు మచ్చ, నాగరికతకు నగుబాటు. అన్యభామలడ్డంబైన మాతృభావంబున మలగువాడు అంటారు పోతరాజుగారు ప్రహ్లాదుణ్ణి. ఈ లలితమర్యాదలు మన సంస్కృతి మనకిచ్చిన నిక్షేపాలు. అట్లాంటివేళ వారినెరగనట్టే ఉండాలి. అట్లా అన్నామని ఆపదలలో ఆర్జవంతో ఆదుకోవద్దని కాదు.

ఇహ రహస్యాలు వినటం, ఎవరో ఏదో గుట్టుగా మాటలాడుకొంటూ ఉంటారు. మంత్రాంగం అషట్కర్ణం అన్నారు. మంత్రాగంలో మూడో మనిషే ఉండరాదు. రాచకార్యం కావచ్చు, ప్రణయప్రసంగం కావచ్చు, ప్రళయాన్ని సృజించే వార్తకావచ్చు. నిన్ను పిలవకుండా నువ్వు అక్కడికి వెళ్ళటం వెళ్ళి చెవి ఒగ్గటం మహాపచారం.

అది రహస్యమని తెలిసేక కుతూహలంతో చెవులు రిక్కించుకొని వినబూనటం మరీ ఘోరం. అత్తమాటలు కోడళ్ళు, కోడళ్ళ మాటలు అత్తలు వినటం దగ్గర నుంచి శత్రు స్థావరాల్లో మాటలు వినేవరకూ ఉన్నాయి యీ రహస్యాలు వినటం.

వైయక్తిక రహస్యాలు వినరాదు, అట్లాంటి కుతూహలం కూడా పనికిరాదు. అయితే మనిషి దౌర్బల్యం ఎంతటి వాణ్ణయినా ఈ మూడు పనులూ చేయిస్తుంది.

అట్లా చేయకుండా తమ సంస్కారం రక్షగా నిలవగలిగే మనుషులు నిజంగా దేవతలే.

**– శ్రీరామచంద్రాచార్య.**



# సందేహాలు - సమాధానాలు

శ్రీవేదాంతం భార్గవాచార్యులు, ఆర్వకొండ

**ప్ర. రామకోటి, కృష్ణకోటి ఈ రెంటిలో ఏది వ్రాస్తే మంచిదో తెలుపుతారా? బయటి పుస్తకాలు సంతృప్తికరంగ లేవు.**

జ. మిగిలిన నామాలు జపించినా, స్మరించినా మంచిదే... వాటికి ప్రత్యేకించి వ్రాయాలనే నియమాన్ని చెప్పలేదు. కానీ 'శ్రీరామ' నామాన్ని వ్రాస్తే చాలా మంచిదని రామాయణంలోనే చివర శ్రీవాల్మీకి మహర్షియే చెప్పడం వల్ల దాన్ని వ్రాయడమే ఉచితం. దొరికే పుస్తకాల్లోనే వ్రాయాలనే నియమంలేదు. మీ ఇంట్లో ఉండే పత్రాలపై వ్రాసినా మంచిదే.

శ్రీ వి. రామకృష్ణ, చీరాల

**ప్ర. దత్తాత్రేయుడు ఎవరు? ఈయన్ని గురించి రకరకాలుగ చెప్తున్నారు? వాస్తవమేమి? ఆరాధించవచ్చా?**

జ. అత్రిమహర్షికి, అనసూయ ద్వారా జన్మించిన భగవదవతారాన్నే 'దత్తాత్రేయు'డంటారు. ఈ దంపతుల తపస్సుకి మెచ్చి భగవంతుడు తనని ఇచ్చివేసుకున్నాడు. "అత్రికి తనను పుత్రునిగ ఇచ్చివేసుకున్నవాడు" కనుక దత్తాత్రేయుడు అన్నారు. ఈయన 24 అవతారాలలో ఒకరని శ్రీశుకమహర్షి పరీక్షిన్నరేంద్రునికి చెప్పినట్లు శ్రీమద్భాగవతం స్పష్టం చేస్తోంది. క్షీణించిపోయే వేదవిజ్ఞానాన్ని పునరుద్ధరించడం కోసం అవతరించి, ప్రస్తుత కర్నాటకలోని మేల్కోట క్షేత్రంలో పుష్కరిణీ తీరంలో తపస్సులో ఉండిపోయాడని అక్కడి క్షేత్ర చరిత్రలో ఉంది. ఈయన కృతయుగానికి చెందిన విష్ణ్వవతారమే. అలానే ఆరాధించవలె.

శ్రీ అమరయ్య, అమరావతి.

**ప్ర. సమాశ్రితుడు ఎవరెవరికి సాష్టాంగం చేయవచ్చు? వయస్సులో చిన్నవారికి చేయవచ్చా? సమాశ్రయణం కానివారు ఊర్ధ్వపుండ్రం ధరిస్తున్నారు వారికి చేయవచ్చా?**

జ. వయస్సు చిన్నదైనా, పెద్దదైనా, ఏ కులజుడైనా, సమాశ్రితుడై, ఊర్ధ్వపుండ్రం ధరించి ఉంటే వారికి వెంటనే సాష్టాంగం చేయతగును. సమాశ్రయణం కాకున్నా పుండ్రాన్ని గౌరవిస్తాం. మీకో కథ చెప్పాలి. కర్నాటకలో షోలాపూర్‌లోని మార్వాడీ వైష్ణవులు చాల నిష్ఠగ, పుండ్రధారులెవరు కనపడ్డా సాష్టాంగ పడేవారట. మిగిలిన వారికది హాస్యాస్పదంగ ఉండేది. వారినెలాగైనా అవమానించాలని ఓసారి ఓ గాడిదకి ఊర్ధ్వపుండ్రం పెట్టి ఆ వైష్ణవాగ్రేసరుల షాపు దగ్గరకు తెచ్చి వదిలారట. బొట్టు చూడగానే ఆ భక్తుడు ఆ గాడిదకు సాష్టాంగం చేసాడట. తిండి పెట్టాడు. అందరూ ఆ భక్తికి ఆశ్చర్యపడ్డారు. ఆ గాడిదను పంపినవారికి





బుద్ధి చెప్పేడారకంగా ఆ భక్తమార్వాడీ. దాని బొట్టును కడిగివేసి, పంపించివేసాడట ఆ తర్వాత. **"వైష్ణవో వైష్ణవం దృష్ట్వా దండవత్ ప్రణమేత్ భువి"** అనేది సూక్తి.

శ్రీ ఎల్. అప్పారావు, బొబ్బిలి.

**ప్ర. బ్రాహ్మణులు కాక ఇతరులు మంత్ర పుష్పం చదువవచ్చా?**

జ. స్వరంతో ఉండే వేదమంత్రాలకు సంబంధించినదేదైనా సుశిక్షుతుల ద్వారా సక్రమంగ నేర్చుకున్న వారే తప్ప ఇతరులు చదువరాదు. తప్పు స్వరాలవల్ల మంచికి బదులు చెడు జరుగుతుంది. ఆ స్వరాలు గూడ ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరకంగ ఉంటాయి. అందులో మనకేస్వరంతో తగునో తెలిసిన పండితులు వాటిని నేర్పితే తప్ప చదవడం మంచిది కాదు. అయితే, చదవడమనేది చాలారకాలు. ఊరికే సరదాకి చదవడం, అర్థం తెలుసుకుందామని చదవడం, అసలందులో ఏముందోననే జిజ్ఞాసతో చదవడం, అందులోని మంచిని గుర్తించి ఆచరిద్దామని చదవడం, చదివితే పుణ్యమట అనుకొని చదవడం, వాళ్ళెవరో చదివేసి ఏదో సంపాయించేసుకుంటున్నారట, మనమెందుకు కోల్పోవాలనే అక్కసుతో చదవడం, డబ్బు ఎవరో యిస్తారనే కామనతో చదవడం. ఏ ఫలితం లేకున్నా, ఆశించకుండా దానిని రక్షించుకోవడం కర్తవ్యమనే భావనతో చదవడం. ఇలా ఎన్నెన్నో రకాలు. వీట్లల్లో మీరేరకానికి చెందినవారో తెలిస్తే అపుడు మిగతావి నిర్ణయించవచ్చు. ఇందులో మొదట ఆరు రకాలూ ఎవరినీ సంప్రదించనవరంలేదు. క్యాసెట్లు, పుస్తకాలతో వాళ్ళ పని చేస్కోవచ్చు. మిగిలిన వారు మాత్రం ఆచార నియమాలుకల పెద్దల నియమాన్ని గౌరవిస్తూ వైదిక ధర్మాలను పాటిస్తూంటారు.

ఇప్పుడంతా ఏమి చేస్తున్నారనేది ప్రధానం కాదు. ఎలా ఉండాలనేదే గుర్తించదగినది. స్వరంతో ఉన్న ఏ మంత్రాన్నైనా సంధ్యాది నియమాలను పాటించే పురుషులే చదవాలి. స్వరంలేనివాటిని ఎవ్వరైనా పఠించవచ్చు.

శ్రీ కె. రామారావు, హైదరాబాదు, శ్రీ బి. బలరామప్రసాద్, కోప్లా, కర్నాటక.

**ప్ర. తల్లిదండ్రులలో ఎవరైనా పరమపదించినపుడు ఏడాదిలో ఆలయాలను దర్శించడం, ఇంట్లో దేవుణ్ణి పూజించడం కానీ చేయవచ్చా? క్రొత్త షాపు ప్రారంభించవచ్చా?**

జ. శ్రీవైష్ణవ సంప్రదాయంలో కర్మకాండ పూర్తికాగానే 12 నెలల కార్యక్రమాన్ని సంక్షిప్తంగ ముగించి, పరమపదోత్సవం చేసేస్తారు. అపుడు వారికి సంవత్సరం సూతకం ఉండదు. అట్టి స్థితిలో ఆలయదర్శనానికి అడ్డేమీ ఉండదు. ఇంట్లో ఆరాధనైతే ఎప్పుడూ నిలిపే అవసరంలేదు. అయినప్పటికీ శుభకార్యాలవంటివి క్రొత్త షాపు ప్రారంభంవంటివి ఏడాదిదాక చేయరు. మిగిలినవారికి పరమపదోత్సవం ఉండదు కదా! వారు సంవత్సరసూతకం పాటిస్తారు. ఆలయాలదర్శనం చేయరు కానీ ఇంట్లో పూజమానరాదు. క్రొత్త వ్యాపారాదులు ప్రారంభించడం కూడా తగదు.

# మహర్షుల చరిత్ర - శౌనక మహర్షి

తమిళమూలం :
వై.వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి

తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూపురాణి ఉడయవర్‌స్వామి, విజయవాడ

**వాసుదేవ కథా ప్రశ్నః**
**పురుషాన్ త్రీన్ పునాతి హి ।**
**వక్తారం పృచ్ఛకం శ్రోతౄన్**
**తత్పాద సలిలం యథా॥**

వాసుదేవ భగవానుని కథ మూడు రకములైన మనుష్యులను పవిత్రులనుగా చేస్తుందట. 1. భగవత్ కథలను చెప్పేవారు, 2. భగవత్ కథలను వినాలనే కుతూహలంతో పెద్దలను వినయంగా సమీపించి ఆ కథలను చెప్పమని కోరేవారు. 3. విని ఆనందించే ఇతరులు.

భగవంతుని పాదమునుండి బయలుదేరిన గంగానదీ తీర్థమువలె ఆయన కథలు కూడ పవిత్రులనుగా చేయునని దీని భావము.

పైన చెప్పిన మూడు రకములలో మధ్యమశ్రేణికి చెందినవాడు శౌనక మహర్షి. అనుకోకుండా ఎవరైనా మహానుభావులు వేంచేసినపుడు వారికి కావలసిన సేవలను ప్రీతితో అందించి అటుపిమ్మట భగవత్ కథలను చెప్పమని ప్రార్థించేవాడు. వారు కూడ ఈతని ఆసక్తికి సంతోషించి ప్రీతితో పుణ్యమైన భగవత్కథలను చెప్పేవారు. రసికులైన శ్రోతలు కూడ గుంపులు గుంపులుగా చేరి ఆ కథలను వినేవారు.

సూత పౌరాణికుడు మొదటి వర్గానికి చెందినవాడు. ఎవరైనా తనను భగవత్ కథలను చెప్పమని అడిగితేచాలు, విసుగు విరామం లేకుండా గంగా ప్రవాహంవలె కథలను చెప్పడంలో దిట్ట. ఆ కథలు చెప్పడం అంటే అతనికి చాలా ఇష్టం. పురాణాలను అన్నిటినీ వ్యాసుని వద్ద వినిన రోమహర్షుని కుమారునిగ ఆయన దగ్గర వినడమేకాక, ఆ పురాణాలను ప్రచారం చేయుటకు వ్యాసునిచే నియమింపబడిన వ్యక్తి ఈతడు. ఇప్పుడు మనకు లభిస్తున్న పురాణాలన్నీ సూత పౌరాణికునిచేత శౌనక మహర్షికి చెప్పబడి శిష్య ప్రశిష్య పరంపరగా వచ్చినవే. అందుచే శ్రావ్యమైన ఈ పురాణాలను మనం వినే ముందు వీరిరువురికి (సూత, శౌనకులకు) కృతజ్ఞతాంజలి సమర్పించుట మన విధి.

## నైమిశారణ్యము

మన భారతదేశంలోని ముఖ్యమైన పుణ్యస్థలాలలో నైమిశారణ్యం ఒకటి. దీనిని నైమిషారణ్యం అని కూడ పిలుస్తారు. ఈ రెండు పేర్లూ సరి అయినవే. చతుర్ముఖ బ్రహ్మ





తన సంకల్పంతో ఒక చక్రాన్ని సృష్టించి వదిలాడట, స్థల పరీక్షకోసం. ఆ చక్రం అంచు (నేమి) ఎక్కడ నేలనితాకి చెల్లాచెదురు అవుతుందో ఆ స్థలం తపస్సు చేసుకోవడానికి చాల యోగ్యమైనదని తెలిపాడట. ఆ చక్రం వెంట కొంతమంది శిష్యులు పరుగుపెట్టారు. అనుకున్నట్టుగానే అది ఒక చోట నేలను తాకింది. ఈ సంఘటన గుర్తుకువచ్చేటట్లు ఆ స్థలానికి 'నైమిశారణ్యం' అని పేరు ఏర్పడింది. నేమిః + శర్యతే అను రెండు పదాల చేరికతో ఏర్పడినదే 'నైమిశ' అనే పదం.

శ్రీమహావిష్ణువు 'ఒకే నిమిషంలో రాక్షసులనందరినీ సంహరిస్తాను అని అట్లే చేశాడట ఈ ప్రదేశంలో.' అందుచేతనే 'నిమిష' అనే పదాన్ని గుర్తుగాపెట్టుకుని 'నైమిషారణ్యము' అనే పేరుకూడ వాడుకలోకి వచ్చిందట. అతిప్రాచీన కాలం నుంచీ కూడ ఈ పుణ్యక్షేత్రం మిక్కిలి ప్రసిద్ధి చెందింది. ఈ క్షేత్రం భారత దేశానికే ముఖమునకు తిలకమువలె అలంకార ప్రాయమైనది. భారతీయులు ఏ మంచి కార్యాన్నైనా ఇక్కడకు వచ్చి నిర్వహించాలని కోరుకుంటూ ఉంటారు.

నైమిశారణ్యము అనే ఈ పుణ్యక్షేత్రంలో శౌనకుడు మొదలైన మహర్షులు వేయి సంవత్సరాలు కొనసాగే సత్రయాగాన్ని నిర్వహించారు. ఆ సత్రయాగంలోనే సూత పౌరాణికుడు ఇతిహాస పురాణముల నన్నింటిని విస్తరంగా ఉపదేశించడం జరిగింది. ఈవిధమైన పరంపరా ప్రాప్తంగా మనకు లభించినవే ఈనాటి ఇతిహాసాలు పురాణాలు.

**దీనినే తెలియజేస్తోంది ఈ క్రింది శ్లోకం.**

**నైమిశేఽనిమిష క్షేత్రే మునయః శౌనకాదయః**
**సత్రం స్వర్గాయలోకాయ సహస్ర సమమాసత**

## దీర్ఘసత్రము

యాగములు అనేక విధాలుగా ఉంటాయి. వాటిలో సత్రయాగం ఒకటి. దీనికి కొన్ని ప్రత్యేకతలు ఉన్నాయి. మిగతా యాగాల్లో యజమాని వేరు, ఋత్విక్కు వేరుగా ఉంటారు.

(ఋత్విక్ అనగా యజమాని నుండి దక్షిణను తీసికొని ఆ యజమానికోసం యాగమును నిర్వహించువాడు) సత్రయాగంలో అలాకాక దానిని నిర్వహించే 17 మందికూడ యజమానులే. వారే ఋత్విక్కులుగా కూడ ఉండి యాగాన్ని నిర్వహిస్తారు. యాగఫలం అందరికి సమానంగా లభిస్తుంది. మిగతా యాగాలలోవలె దీనికి ఒక కాలవ్యవధి అంటూ ఏమీ లేదు. యాగం నిర్వహించే వారు తమ ఇష్టప్రకారం ఎన్ని వందల సంవత్సరాలయినా నిర్వహించవచ్చు. మధ్యలో ఎవరైనా ఒక యజమాని మరణిస్తే ఆయనకు బదులు ఇంకొకరిని చేర్చుకోవచ్చు. ఈ విధమైన దీర్ఘసత్రాన్ని శౌనకుడు మొదలైన ఋషులు నైమిశారణ్యంలో నిర్వహించారు.

ప్రతిరోజూ యాగ కార్యం ముగిసిన తరువాత విశ్రాంతి సమయంలో సత్కథలు చెప్పేవారు చెపుతూ ఉంటే వినేవారు వింటూ కాలం గడిపేవారు. ఈ క్రమంలో మనకు లభించినవే, భారతము, భాగవతము మొదలైన ఇతిహాస పురాణాదులు. ఈ ఇతిహాస పురాణములను భక్తిశ్రద్ధలతో చదువువారు, నిజంగా చదవడం వ్రాయడం రానివారే అయినా, మంచి జ్ఞానులుగా పరిగణించ బడతారు. సముద్రం లాంటి గంభీరమైన జ్ఞానం వారికి ఉంటుంది. ఈ సంప్రదాయానికి మూలకర్తయైన సూత పౌరాణికుడు, శౌనక మహర్షి కూడ ఇటువంటివారే.

### వేద ప్రసిద్ధి

శౌనకమహర్షి ప్రసిద్ధి పురాణాలలో మాత్రమే కాకుండా వేదాలలో కూడ మనకు గోచరిస్తుంది. అతి ప్రాచీనులై ఋగ్వేద ప్రవర్తకులైన ఋషులలో శౌనక మహర్షికూడ ఒకరు. ఋగ్వేదం రెండవ మండలంలోను, తొమ్మిదవ మండలంలోను అనేక సూక్తములు శౌనకుడు దర్శించినవే.

ఈయన భృగువంశానికి చెందిన వాడని వైదిక సంప్రదాయజ్ఞులు తెలుపుచున్నారు. ఋగ్వేద సంబంధమైన అనేక గ్రంథములను వ్రాసి వీరు లోకానికి గొప్ప ఉపకారం చేసి ఉన్నారు. ఈ గ్రంథాలవల్ల ఋగ్వేద సంప్రదాయానికే గొప్ప ఉపకారం జరిగింది. ఆ గ్రంథాల పేర్లు.

1. ఆర్షానుక్రమణీ
2. ఛందోను క్రమణీ
3. దైవతాను క్రమణీ
4. అనువాకాను క్రమణీ
5. సూక్తాను క్రమణీ
6. ఋక్ విధానమ్
7. పాద విధానమ్
8. బృహద్దేవతా
9. ప్రాతి శాఖ్యమ్
10. శౌనక స్మృతి

ఈ గ్రంథాలలో ప్రతి ఒక్కటి ఋక్ వేదాన్ని అధ్యయనం చేసేవారికి కరదీపికలా ఉపయోగపడుచున్నవి.



## పరమపదవార్త



(లేటు) ముడుంబి వెంకటరాఘవాచార్యులుగారి సతీమణి ముడుంబి లక్ష్మిగారు తేది : 22-04-2003న లండన్‌లో పరమపదించినారు.

వీరికి ఆ శ్రియఃపతి సాన్నిధ్యం ప్రతినిత్యం కలగాలని ప్రార్థిస్తున్నాం.





## శ్రీవారి పర్యటనా వివరాలు

**11-6-2003** : సాయంత్రం బెంగుళూరు ప్రయాణం.

**12-6-2003** : శ్రీమాన్ శివరావుగారి గృహంలో నమ్మాళ్వార్ తిరునక్షత్రం.

**13-6-2003** : శ్రీమాన్ చీకోటి జనార్దనంగారి (హైదరాబాద్) షష్టిపూర్తి కార్యక్రమములో వేంచేస్తారు.

**14-6-2003** : నల్గొండ గీతాజ్యోతి ధర్మక్షేత్రము, ఆండాళ్ ఆలయంలో నూతన రథం ప్రారంభోత్సవము కావిస్తారు.

**15-6-2003** : (కృష్ణాజిల్లా, మండవల్లి మండలం) ఉనికిలి అభయరామాలయం ప్రతిష్ఠలో అన్వయిస్తారు.

**16, 17&18-6-2003** : ప॥గో॥ జిల్లా, యడవల్లి శ్రీరామాలయం ప్రతిష్ఠ కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తారు.

**19-6-2003** : ఏలూరు బైపాస్‌రోడ్డులో శ్రీహనుమాన్ విగ్రహమునకు శంకుస్థాపన.

**20-6-2003** : మహబూబ్ నగర్ జిల్లా, షాద్‌నగర్ ధర్మక్షేత్రంలో పాల్గొని పర్గిరోడ్‌లో శ్రీసత్యనారాయణ స్వామివారి ఆలయ ప్రతిష్ఠా, వెటర్నరి క్యాంప్‌లలో పాల్గొంటారు.

ఈ నెలాఖరుకి అమెరికా వేంచేస్తున్నారు.

**జూలై 6 నుండి 12వ తేదీదాక చికాగో సమీపంలోని లేక్‌జెనావాలో 7 దినాలు జరిగే ఆధ్యాత్మిక శిబిరం, ఆపై మరికొన్ని కార్యక్రమాలలో పాల్గొని జూలై 27 నాటికి భారతదేశం తిరిగివిచ్చేస్తారు.**

**29-7-2003** : రాజమహేంద్రిలో గోదావరీ పుష్కర ప్రయుక్త బ్రహ్మయజ్ఞాన్ని ప్రారంభిస్తారు.

**4-8-2003** : మంచిర్యాలలో జరిగే గోదావరీ పుష్కర ప్రయుక్త బ్రహ్మయజ్ఞంలో పాల్గొంటారు.
ఆపై విశాఖపట్నంలో చాతుర్మాస్య వ్రతాన్నారంభిస్తారు.

## గుంటూరు జిల్లా గుండవరం వికాసతరంగిణిశాఖ

గుండవరం వికాసతరంగిణి శాఖవారు బదరీలోని అష్టాక్షరీ క్షేత్రమునకు 5 క్వింటాళ్ళ ఊరగాయ పచ్చళ్ళు కైంకర్యముగా సమర్పించినారు.

**వారికి శ్రీస్వామివారి మంగళాశాసనములను తెలియజేస్తున్నాము.**

# రామాయణంలో రమ్యగాథలు

## దాశరథి సతి కొఱకై ఉత్తర దిగన్వేషణ

-చెవుటూరి కుసుమ కుమారి, విజయవాడ.

ఫలమూలములను కడుపార భుజించి విశ్రమించిన వానరులు తమ ఆగమన కారణమును, సీతాన్వేషణలో ఫలించని తమ ప్రయత్నమును, కాలాతీతమగుటనూ, సుగ్రీవాజ్ఞను సవిస్తరముగా ఆ తాపసికి చెప్పినారు. అమ్మా! మేము ఆకలి దప్పులచేత చావకుండా మమ్ము కాపాడినావు. అందుకు ప్రత్యుపకృతిగా మేము నీకేమి చేయగలమో శెలవిమ్మని కోరినారు. ఆ మాటలకు సర్వజ్ఞురాలు అయిన స్వయంప్రభ ఎంతో సంతోషించినది.

వానర శ్రేష్ఠులారా! బలవంతులు, రామకార్యార్థులు అయిన సమస్త వానర వీరులనూ చూచి ఎంతో సంతసించినాను. నాయనలారా! కేవలము ధర్మాచరణమున కాలము గడుపుచున్న నాకు కావలసినది ఏముండును!అని పలుకగా హనుమంతుడు ఆమెనిలా ప్రార్థించినాడు. తల్లీ! ధర్మచారివైన నిన్ను మేము శరణు వేడుకొనుచున్నాము. మేము ఈ బిలమున తిరుగుచున్నప్పుడే సుగ్రీవుడు పెట్టిన గడువు దాటిపోయినది. విఫలయత్నులమై, సుగ్రీవునిచేత భయ భీతులమై, అసువులు బాయవలసిన మమ్ములను ఎటులైన ఈ బిలమునుండి దాటించుము అని ప్రార్థించినాడు. ఆ మాటలు విన్న తాపసి హనుమా! ఈ బిలమున ప్రవేశించిన వారెవరూ తిరిగి బయటకు వెళ్ళజాలరు. అయిననూ నియమము తప్పక చేసిన నా తపః ప్రభావముచేత వానరులనందరినీ ఈ బిలము దాటించగలను.

**నిమీలియత చక్షూంషి సర్వే వానర పుంగవాః**

వానర శ్రేష్ఠులారా! మీరందరూ కన్నులు మూసుకొనుడు.

**న హి నిష్క్రమితుం శక్యమనిమీలిత లోచనైః**

కనులు మూసుకొనని వారెవరూ బయటకు వెళ్ళుట సాధ్యపడదు. అని చెప్పగా, ఎటులైననూ ఆ బిలమునుండి బయటపడువలెనన్న కోరిక మిక్కిలిగా గల ఆ వానర వీరులు కనులు గట్టిగా మూసుకొనినారు. అంతట ఆ తపస్విని స్వయంప్రభ రెప్పపాటు కాలములో వారినా బిలము నుండి బయటకు తీసుకొని వచ్చినది.

వానరవీరులారా! ఇటు వింధ్య పర్వతము అటు ప్రస్రవణగిరి అదిగో అటు మహా సముద్రము. ఇంక భయమును వీడి మీమీ కార్యములను ధైర్యముతో నిర్వర్తించుడు. వానర యోధులారా! మీకు క్షేమమగుగాక అని తిరిగి తన భవనమునకు మరలినది. ఆ వానరులు వింధ్యగిరిని నలువైపులా పరికించినారు. ఫలపుష్ప భారంతో వంగిన తరులతో వెల్లివిరుస్తున్న వసంతశోభను గుర్తించినారు. అదిచూచి వ్యాకులుడైన అంగదుడు ''వానర వీరులారా! సుగ్రీవుని ఆనతి ప్రకారము మనము బిలములో వుండగానే గడువు దాటిపోయినది.

మనము అశ్వయుజ మాసములో బయలుదేరినాము. ఇదిగో ఇది వసంతము. రామకార్యమును సుగ్రీవాజ్ఞానుసారము పూర్తిచేయలేని మనము జీవించుట కల్ల. కనుక మనము ఏమి చేయవలెనో





సరిఅయిన నిర్ణయము చేయవలె. మీరందరూ ప్రభువులకు విశ్వాసపాత్రులు, సమర్థులు, నీతిమంతులు ప్రభుకార్య హితాసక్తులు, కార్యసాఫల్యదక్షులు. అంటూ, మహాబుద్ధిశాలి, సింహ వృషభములవంటి మూపు అతి ధృడము, దీర్ఘము అయిన బాహువులు, భుజములు గలవాడు యువరాజు అయిన అంగదుడు వృద్ధులు, శిష్టులు అయిన వానరశ్రేష్ఠులతో సత్కార పూరితంగా, మృదుమధురంగా విషయమును వారికి వివరిస్తూ ఇలా పలికినాడు. కాలమూ దాటిపోయింది. కార్యమూ సాధించలేక పోయినాము. సుగ్రీవుని ఆజ్ఞ పాటించని వాడెవడూ బతికి బట్టకట్టినవాడుండడు. సుగ్రీవుడు చాలా తీక్ష్ణస్వభావి. పైగా ఇప్పుడు రాజుకూడా. సీత వార్త తెలియకుండా వెళ్ళిన మనలను సుగ్రీవుడు చిత్రవధ చేయును.

**"న చాహం యౌవరాజ్యేన సుగ్రీవేణాభిషేచితః**
**నరేంద్రే ణాభిషిక్తోऽస్మి రామేణాక్లిష్టకర్మణా"**

నన్ను సుగ్రీవుడు యౌవరాజ్యాభిషిక్తుని చేయలేదు. మహారాజు అయిన రామచంద్రుడు నాకు అభిషేకము చేసినాడు. యిప్పుడు నాచే జరిగిన ఈ పొరపాటునకు కఠినముగా దండన విధించి పూర్వవైరమును స్మరించి నన్ను తప్పక వధించును.

నాజీవితము ఆవిధంగా అకాలంగా నడిమధ్యన ముగిసిపోవుటను నా స్నేహితులు, ఆప్తులు అయిన మీరంతా చూచుటెందులకు? కనుక ఈ సముద్ర తీరముననే ప్రాయోపవేశము చేసి జీవితము చాలించెదను. అనగా

యువరాజైన అంగదుని మాటలువిని ఆ వానరులందరూ దీనులై నిజమే. సుగ్రీవుడు కోపస్వభావి. రామచంద్రుడు భార్యను పొంద వలెనన్న నిశ్చయ మనస్కుడై వున్నవాడు. సుగ్రీవుడు రామునకు ప్రియముచేసి ప్రత్యుపకృతి చేయవలెనని వేచివున్నాడు. కనుక రాముని ప్రియముకొరకై మనలను తప్పక చంపును.

అపరాధముచేసి ప్రభువు దగ్గరకు వెళ్ళుట మంచిదికాదు. సుగ్రీవుడు ప్రధానమైన మనలనందరనూ కూర్చి యిక్కడకు పంపినాడు. మనము సీతను వెదుకకున్న యమలోకమునకు వెళ్ళుట తథ్యము. వానరులందరూ భయపీడితులైనారు. వారి మాటలు విన్న తారుడు, వానరశ్రేష్ఠులారా!

**ఇదం హి మాయా విహితం సుదుర్గమం**
**ప్రభూత పుష్పోదక భోజ్యపేయమ్।**
**ఇహాస్తి నో నైవ భయం పురందరాత్**
**న రాఘవా ద్వానర రాజతోऽపివా॥**

ఫలపుష్ప భోజ్యపానీయాదులచేత సమృద్ధమైన ఈ బిలము ప్రవేశింప సాధ్యము కానిది. మాయచేత నిర్మించబడిన ఈ బిలమును వానరరాజైన సుగ్రీవుడు గాని మానవ ప్రభువైన రామచంద్రుడుగాని కడకు దేవవేంద్రుడైననూ కానిండు ప్రవేశించలేరు. మనము నిర్భయముగా, మరణ భయము లేకుండా ఈ బిలమున నివసించవచ్చు. అని పలుకగా విశ్వాసముగల ఆ వానరవీరులు మనము చంపబడకుండుటకు ఆలస్యము చేయక ఏదో ఒక ఉపాయమును వెంటనే ఆచరణలోకి తేవలెనని ముక్త కంఠమున పలికినారు. అది అంతనూ విన్న బుద్ధిశాలి అయిన హనుమంతుడు

**అథమేనే హృతం రాజ్యం హనూమానంగదేనతత్**

ఈ అంగదుడు ఈ వానర రాజ్యమును అపహరించదలచుచున్నాడని గ్రహించినాడు.



# శ్రీవిష్ణు మహాపురాణము

## సప్తమాధ్యాయం

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, కొవ్వూరు.



చతుర్ముఖ బ్రహ్మ స్వరూపుడైన పరమాత్మ నుండి ఆయన సంకల్పానికి తగిన విధంగా మానససృష్టిసాగింది. స్వామియొక్క గాత్రం నుండి వివిధేంద్రియ దేహాదులతో క్షేత్రజ్ఞులు, జీవులు ఆవిర్భవించారు. ఈ సృజింపడిన ప్రాణికోటివలన సృష్టి విస్తృతంగా సాగని కారణంగా చతుర్ముఖ రూపి అయిన జనార్దనుడు, 'నవబ్రహ్మ'లుగా కీర్తింపబడే తొమ్మిదిమంది ప్రజాపతులను సృజించాడు తన మానసపుత్రులుగా.

**'భృగుం పులస్త్యం పులహం క్రతుమంగిరసం తథా।**
**మరీచిం దక్షమత్రించ వసిష్ఠం చైవ మానసాన్ ॥**

భృగువు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, అంగిరసుడు, మరీచి, దక్షుడు, అత్రి, వసిష్ఠుడు అనే తొమ్మండుగురు అనంతర సృష్టిని సాగించారు.

**ఖ్యాతిం భూతిం చ సంభూతిం క్షమాం ప్రీతిం తథైవచ ।**
**సన్నతిం చ తథైవోర్జామ్ అనసూయాం తథైవచ ॥**

ఖ్యాతి, భూతి, సంభూతి, క్షమ, ప్రీతి, సన్నతి, ఊర్జ, అనసూయ, ప్రసూతి అనే తొమ్మండుగురు కన్యలనుకూడా బ్రహ్మ, మనస్సంకల్పంచేతనే సృజించాడు. భృగ్వాదులు, ఖ్యాత్యాదులు ఇరువురూ బ్రహ్మమానస సంతానమే అయినా వీరికి 'రక్తసంబంధం' లేదు. కేవలం మనస్సంకల్ప సృష్టి మాత్రమే అవడం చేత ఈ స్త్రీ పురుష ద్వంద్వాలకు క్రమంగా దాంపత్య బంధాన్ని బ్రహ్మ అనుగ్రహించాడు.

ఇక పూర్వమే సృజింపబడిన సనంద నాదులు సృష్టిని చేయడం పట్ల అంతగా సుముఖత కల వారు కాకపోవడంవల్ల, వారంతా జ్ఞాన సంపన్నులు విరాగులు, విమత్సరులు అయ్యారు.

ఈ దశలో వీరి ప్రవృత్తిని గమనించిన బ్రహ్మ, తన సృష్టి ప్రయత్నం కుంటుపడటం గమనించి క్రోధపడ్డాడు. క్రోధావేశంలో ఆయన కనుబొమలు ముడివడ్డాయి. కనుబొమల నడుమ భయంకర క్రోధాగ్ని జ్వాల ఆవిర్భవించింది.

### ఏకాదశ రుద్ర సృష్టి

**భృకుటీ కుటిలాత్ తస్య లలాటాత్ క్రోధదీపితాత్।**
**సముత్పన్న స్తదా రుద్రో మధ్యాహ్నార్క సమప్రభః ॥**

ఇలా బ్రహ్మయొక్క భృకుటి నుండి పైకెగసిన క్రోధాగ్ని జ్వాలనుండి మధ్యాహ్న సూర్య సమకాంతి అయిన ఒక దివ్య పురుషుడు ఆవిర్భవించాడు. ఆయన సగం స్త్రీ శరీరంతోను, సగం పురుష దేహంతోను





ప్రచండ స్వభావుడై, విస్తృత దేహంతో ఆవిర్భవించాడు. 'నీవు దేహాన్ని రెండుగా విభజించు' అని ఆ దివ్యపురుషుని ఆదేశించి చతుర్ముఖ బ్రహ్మ అంతర్హితుడైనాడు.

**అర్ధనారీశ్వరవపుః ప్రచండో అతి శరీరవాన్ ।**
**విభజాత్మాన మిత్యుక్త్వా తం బ్రహ్మ అంతర్దధే తతః॥**

**తథోక్తోసౌ ద్విధాస్త్రీత్వం పురుషత్వం తథా కరోత్।**
**బిభేద పురుషత్వం చ దశథా చైకథా పునః ॥**

బ్రహ్మయొక్క ఆదేశంతో తన తనువును ఆ దివ్య పురుషుడు రెండుగా స్త్రీ పురుషులుగా విభజించాడు. తెల్లగాను, నల్లగాను, ఇలా వివిధ వర్ణాలతో రూపాలతో తనవంటి మరొక పది మొత్తం పదకొండు రూపాలుగా తనను తానే ఆవిర్భవింప చేసికొన్నాడు. ఈయనయే రుద్రుడు.

రుద్రావిర్భావం వేరువేరు పురాణాల్లో వేరువేరుగా ఉన్నా విష్ణుపురాణంలో బ్రహ్మ క్రోధాగ్ని సముద్భవునిగానే రుద్రుని వర్ణించడం మనం గమనించవచ్చు.

ఉపనిషత్తులలో సుబాలోపనిషత్తు ఇలాంటి రుద్రోత్పత్తినే వర్ణించింది.





## అభినందనలు



భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషి చేస్తున్నవారిలో **శ్రీమాన్ సి.పాపిరెడ్డి** (కరీంనగర్‌జిల్లా).

ప్రస్తుతము రహదారులు భవనముల శాఖలో ఉద్యోగము రీత్యా నిర్మల్ పట్టణంలో నివసిస్తున్నారు. భక్తినివేదన పాఠకుల సంఖ్యను పెంచేందుకు విశేష కృషిచేస్తున్నారు.

శ్రీశ్రీశ్రీస్వామివారు అనేక మంగళాశాసనములను కృపచేసారు.



# భగవద్రామానుజ చరిత్ర

శ్రీమతి టి.కె. చూడామణి, విజయవాడ



**'శ్రీపాదతీర్థ మహిమ'**

ముద్దు మొగంబు కెంజివురుమోవి దయా
రసమొల్కు గన్నులున్
నిద్దపు(జెక్కులున్ పసిడి నిగ్గులు దేఱెడు
మేను బాగుగా
దిద్దిన యూర్ధ్వపుండ్రములు తెల్లని
జన్నిదమున్ త్రిదండమున్
దద్దయు నొప్పు చిన్ని శిఖ దాల్చిన మా
యతిరాజు(గొల్చెదన్

ఒక రోజు యతిరాజులు శ్రీరంగనాథుని కోవెల వెనుక ఉన్న చంద్రపుష్కరిణిలో స్నానం చేస్తున్నారు. శిష్యబృందం ఆచార్యులతో కలసిస్నానం చేస్తుండగా ఆ చంద్ర పుష్కరిణిలో క్రిక్కిరిసి ఉన్న చేపలు చుట్టూ తిరగడం మొదలు పెట్టాయి. బహుశః అవి శ్రీరామానుజుల పాదాలను ఆశ్రయించాయి కాబోలు. ఆ దృశ్యాన్ని చూస్తూ స్నానం చేస్తున్నారు రామానుజులు. శిష్యులు వారితో "స్వామీ ఈ జల జంతువులు మిమ్మల్ని తమకి కూడా మోక్షాన్ని ప్రసాదించండని ప్రార్థిస్తున్నాయని పిస్తోంది. వాటిని కరుణించండి'' అన్నారు. రామానుజులు ఒక్కసారి కన్నులు మూసుకొని శ్రీరంగనాథుని ధ్యానించారు. స్వామీ! ఈ జలజంతువులన్నింటికి మోక్షాన్ని ప్రసాదించండి అంటూ కన్నులు మూసుకొని ప్రార్థించి కన్నులు తెరిచేటప్పటికి వారి శ్రీపాదతీర్థాన్ని సేవించిన ఆ జంతువులన్ని తమ జంతు శరీరాలు విడిచి దివ్య రూపాలు పొందాయి. చూస్తూండగా దేవ విమానం వచ్చింది. దివ్యదేహధారులందరూ రామానుజుల శ్రీచరణాలకు దాసోహములు సమర్పించి ఆ దివ్య విమానాలనధిరోహించి పరమపదం చేరుకున్నారు. జై రామానుజ.. జై శ్రీ భాష్యకారా... జై యతిరాజ... జై ఎంబెరు మానారే... జై లక్ష్మణార్య... అంటూ ఆ దేవ స్వరూపులంతా చేసిన జయజయ నినాదాలతో ఆ ప్రాంతమంతా మారుమ్రోగిపోయింది. ఆ దృశ్యాన్ని దర్శించిన శిష్యకోటి, వారినందరిని చూస్తున్న ప్రజలు ఇటువంటి మహనీయుడు మన కనులముందు వెలిగే స్వామి. మనమెంత భాగ్యవంతులమనుకుంటూ రామానుజులకు నమస్కరించి ఈ మహిమాన్విత సంఘటనని అందరికీ చెప్పడం కోసం ఆనందంగా బయలుదేరారు. భగవంతుని పాదతీర్థం కంటె భాగవతోత్తముని శ్రీపాదతీర్థమెంత ప్రభావం కలదో.

**"తీర్థాదచ్యుత పాదజాద్గురుతరం తీర్థం తదీయాంఘ్రిజమ్"** భాగవత శ్రీపాద తీర్థసేవ సకల పాపనాశకం మోక్షప్రదం .





## మూగబాలుని కథ

కాంచీపురంలో ఒక వైష్ణవ కుటుంబంలో ఒక బాలుడు జన్మించాడు. ఆ ముఖ వర్చస్సు చూసిన వారంతా ఎంత కాంతి ఎంత కళ. అంటూ ముక్కున వేలు వేసుకున్నారు. విచిత్రం ఏమిటంటే ఆ అబ్బాయికి మాటలు రాలేదు. మూగవాడయ్యాడు. ఇలా ఐదేళ్ళు గడిచాయి. ఉన్నట్టుండి కనపడకుండా పోయాడు. ఎంత వెదికినా, వెదికించినా లాభం లేకుండా పోయింది. అలా రెండేళ్ళు గడిచి పోయాయి. ఓనాడు హఠాత్తుగా ఆ బాలుడు వీధిలో పిల్లల మధ్య ఆడుతూ ప్రత్యక్ష మయ్యాడు. అందరికి ఆశ్చర్యమైంది అతని దర్శనం. ఏమయ్యా ఈ రెండేళ్ళు ఏమై పోయావు అంటూ చుట్టు ముట్టారు. ఓ నేనా.. అంటూ మొదలు పెట్టాడు అరే మూగవాడివి కదా! మాటాలెలా వచ్చాయి. ఇంకా ఆశ్చర్యమైంది అందరికి.

చెపుతా వినండి. ఆ రోజు నేనలా బయలు దేరి క్షీరసముద్రంలో పవళించియున్న స్వామిని చేరాను. ఆయన్ని సేవిస్తూ అక్కడే ఉండి పోయాను. స్వామి ఆదిశేషుని పిలిచి భూలోకంలో అవతరించి తన తత్వాన్ని ప్రచారం చేసి బద్ధులనుద్ధరించిరా అంటూ ఆజ్ఞాపించాడు. ఆ ఆదిశేషుడే శ్రీపెరుంబూదూరులో రామానుజులుగా అవతరించారు, అంటూ చెప్పడం పూర్తిచేశాడు. ఈ కథవిని అందరూ అతని తల్లిదండ్రులకి చెప్పి వారిని పిలుచుకొని వచ్చేటప్పటికి ఏడీ బాలుడు... ఎపుడో అదృశ్యమైపోయాడు. భగవద్రామాను జులు శేషాంశ సంభూతులని తెలుపడానికే వచ్చిన దేవతామూర్తి అయి ఉంటాడని ప్రజలంతా వైభవోపేతంగా ఆ కథను చెప్పుకున్నారు. యతీంద్రులు గురుపరంపరా ప్రాప్తమైన విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని ఆసేతుశీతాచలం అప్రతిహతంగా ప్రచారం చేశారు. తమ అనంతరం ఈ రామానుజ దర్శనం అవిచ్ఛిన్నంగా సాగడం కోసం 74గురు సింహాసనాధిపతులని, 4గురు భాష్య సింహాసనాధిపతుల్ని ఏర్పాటుచేశారు భగవద్రామానుజులు. తిరుక్కురుకై పిరాన్ పిళ్ళాన్, నడాదూరాచ్చాన్, మొదలియాండాన్, కిడాంబి ఆళాన్ అను నలుగురు శ్రీభాష్య సింహాసనాధిపతులు. 700మంది సన్యాసులు, 12,000 మంది పరమైకాంతులు, అసంఖ్యా కులైన భగవత భాగవత కైంకర్య పరులు వారినాశ్రయించారు.

1)బ్రహ్మసూత్రాలకి వ్యాఖ్యానంగ శ్రీభాష్యాన్ని రచించారు. 2) వేదాంతసారం,3) వేదాంత దీపం అనే గ్రంథాలు రెండు శ్రీభాష్యానికి ప్రవేశికగ రచించారు. అందులో ఆ బ్రహ్మ సూత్రాలకు లఘు వ్యాఖ్యవ్రాశారు. అవేగాక 4). నిత్య గ్రంథం అనే భగవదా రాధనం, 5). వేదార్థసంగ్రహం, 6). భగవద్గీతా భాష్యం అనే మహోత్తమ గ్రంథాలు కూడా జాతికి లభించాయి. ఇంక రామానుజులు రచించిన గద్యత్రయం అపూర్వ కవితా చమత్కారాలకి నిధి "గద్యం కవీనాం నికషం వదంతి'' అంటారు. కవి ప్రతిభాసామర్థ్యాలని నిరూపించే కవిత్వం గద్యంలో కనిపిస్తుంది.

వారి గద్యత్రయం 1) శరణా గతి గద్యం, 2)శ్రీరంగ గద్యం, 3). శ్రీ వైకుంఠ గద్యం. ఇలా 9 గ్రంథాలు రామానుజులు లోకానికి అనుగ్రహించారు.



# ఇతిహాసబోధ - 16

'గీతాజ్యోతి' కార్యక్రమాన్ని మరొక్క సంవత్సరం కొనసాగిస్తూ శ్రీస్వామివారు "ఈ సంవత్సరమంతా మంచిని పెంచే శాంతి పట్టికను సాధన చేయండ''ని ఆదేశించారు. గీతలోని 13వ అధ్యాయమైన "క్షేత్ర క్షేత్రజ్ఞ యోగం'' లోని క్షేత్రజ్ఞుని లక్షణాలైన అమానిత్వ, అదంభిత్వాది గుణాలు ఈ శాంతిపట్టికలో ఉన్నాయి.

"మేము ప్రతిరోజూ గుళ్ళూ, గోపురాలకు వెళుతున్నాం. పూజలు, పురస్కారాలు చేసుకొంటున్నాం. స్తోత్రాలు, పారాయణాలు వల్లె వేస్తున్నాం. ఆడియోల్లో, వీడియోల్లో, టి.విల్లో సభల్లో స్వాములు, పండితులు ప్రవచనాలు చెబుతుంటే చెవులు రిక్కించి వింటున్నాం. ఉపవాసాలు, వ్రతాలు, జపాలు, దీక్షలు ఎడాపెడా చేసేస్తున్నాం. చదివినా, చదవకపోయినా పవిత్రగ్రంథమన్న ప్రతిదాన్నీ తెచ్చుకొని ఇంట్లో భద్రపరచుకొంటున్నాం. వీలైనంత మేరకు దానాలు, ధర్మాలు చేస్తున్నాం.

'భగవద్భక్తులం' అనుకోవడానికి మాకింకా అదనపు అర్హతలేం కావాలి? ఇప్పటికీ ఎంతో సమయమిచ్చి భక్తి ప్రపత్తులను మేము లీటర్లు లీటర్లుగా బకెట్లు బకెట్లు కార్చేస్తుంటే మళ్ళీ మమ్మల్ని 'పట్టిక'లను బట్టీపట్టమంటారేమిటి? అని సందేహపడే భక్తశిఖామణులు మనలో కొంతమంది ఉండవచ్చు. అలాంటివారెటూ ఈ పట్టికను పట్టుకోవడానికి తటపటాయిస్తుంటారు.

మరికొందరు మొక్కుబడిగా 'పట్టిక'ను అటూ ఇటూ తిప్పి టిక్కులు పెట్టే కార్యక్రమంలో ఉండవచ్చు. చాలామందికి అస్సలు ఈ పట్టిక ఊసే తెలియక పోవచ్చు, ఇలాంటి పట్టికలు సాధన కోసం ఉన్నాయని వాటి జోలికి వెళ్ళే తీరికా, ఓపికా మనలో చాలమందికి లేదు.

మేము సంతోషంగా ఉండటం కోసం, మా వాళ్ళను సంతోషపెట్టడం కోసమే మాకున్న సమయం సరిపోవడంలేదు. మా సుఖం కోసం, మా సంతోషం కోసం, మా సమస్యల పరిష్కారం కోసం, మా దిగుళ్ళ బరువును దించుకోవడం కోసం మేము వెతుక్కొనే సాధనాలలో, అనేక మార్గాలలో భగవంతుడు కూడా ఒకడు.

మా కోర్కెలు తీర్చేవాడు కాబట్టి మొక్కుతాం. తీర్చేదాకా ప్రార్థనలు చేస్తాం. తీర్చాక మొక్కుబడులిస్తాం. భగవంతుడితో మా సంబంధం అంతవరకే. దట్సాల్ అనే తర్కాన్ని వినిపించే వారూ మనలో ఉన్నారు. అలాగే 'భగవంతుడిని మా యజమానిగా గుర్తిస్తున్నా, ఎందుకో ఆయనకు మంచి సేవకులుగా ఉండలేకపోతున్నాం. ఆయనతో అనుబంధాన్ని స్పష్టపరచుకోవడంలో తడబడుతున్నాం. తప్పటడుగులు వేస్తున్నాం. ఆయన వైపు ఎగబ్రాకుతున్నట్లే ఉంటున్నాం. అంతలోనే దిగజారుతున్నాం అంటూ బెంగపడే సాధనాపరులూ మనలో ఉన్నారు. మనకు భగవంతుడి విషయంలో





తరగకుండా సాగుతున్న ఈ ఎగుడుదిగుడు ప్రయాణం ఈనాటిది కాదు. మానవేతిహాసంలో మన ఆలోచనలకు ఆవేశాలకు, ప్రలోభాల ప్రతీకలై ఉత్థాన, పతనాలను రుచిచూచి, బ్రతుకు పాఠాలను మనకు నేర్పటానికి నిలచిన 'బాటసారు'లు ఎందరో ఉన్నారు. అలాంటి వారిలో ఒకరైన 'యయాతి చక్రవర్తి' గాథే ఈసారి మన 'ఇతిహాసబోధ'.

మహానుభావుడైన నహుష చక్రవర్తికీ, విరజాదేవికీ కలిగిన ఆరుగురు కుమారులలో రెండవవాడు యయాతి. పెద్దవాడు యతి ముక్తి మార్గాన్ని అభిమానించి మునియై అడవులకు వెళ్ళడంతో, యయాతి, తండ్రి అనంతరం రాజయ్యాడు. శక్తిసామర్థ్యాల చేత, సౌశీల్యం చేత తండ్రికి తగినవాడని ప్రజలమెప్పును, దేవతల అనుగ్రహాన్ని యయాతి పొందాడు.

యయాతిపై ప్రీతితో దేవేంద్రుడు 'సంవర్తవసువ'నే స్వర్ణమయమైన దివ్యరథాన్ని అనుగ్రహించాడు. ఆ రథాన్ని అధిరోహించి యయాతి భూమండలాన్నంతా జయించి చక్రవర్తి అయ్యాడు.

ఒకనాడు వేటపై మక్కువతో అడవికి వెళ్ళిన యయాతికి ఒక విచిత్ర సన్నివేశం ఎదురైంది. మృగయా వినోదంలో అలసి మంచినీటికై వెతుకుతున్న యయాతికి ఓ దిగుడు బావి వద్ద ఒక వనిత ఆర్తనాదం వినిపించింది. బావిలోకి తొంగిచూస్తే అక్కడ విషాదవదనంతో ఒక అతిలోక సుందరి అతనికి కనిపించింది. క్షణమాలస్యం చేయక ఆమెను బావినుండి వెలికితీసి వివరాలు అడిగి తెలుసుకున్నాడు యయాతి.

ఆమె అసురచక్రవర్తి అయిన వృషపర్వుని కులగురువైన శుక్రాచార్యుని కుమార్తె. పేరు దేవయాని. రాక్షస రాజుకూతురు శర్మిష్ఠతో కలసి ఆమె వనవిహారానికి వచ్చింది. అతివలందరూ కలసి విహారానంతరం అక్కడ ఉన్న సరస్సులో జలకాలాడారు. పెనుగాలికి సరస్సు ఒడ్డున వారుంచిన బట్టలు కలసిపోవడంతో పొరపాటున దేవయాని బట్టలను శర్మిష్ఠ ధరించింది.

అక్కడే వచ్చింది తంటా! తన బట్టలను ధరించినందకు 'దేవయాని శర్మిష్ఠను హీనంగా మాట్లాడింది. రోషంతో రాచకూతురూ వాగ్యుద్ధం చేసింది. మాటా మాటా పెరిగి కోపంతో చెలికత్తెల సాయంతో శర్మిష్ఠ దేవయానిని పాడుబడ్డ బావిలో త్రోసివేసి తన దారిన తాను పోయింది.

బావిలో పడ్డవిధానాన్ని యయాతికి వివరించడంతో పాటుగా, దేవయాని యయాతిపై తనకు ఏర్పడ్డ అనురాగాన్ని కూడా వ్యక్తం చేసింది. "శుక్రాచార్యుని కుమార్తెవు. బ్రాహ్మణస్త్రీవి. నీతో వివాహం శాస్త్ర సమ్మతం కాదన్నాడు యయాతి. తండ్రిని పిలిపించింది దేవయాని.

శుక్రాచార్యునికి కూతురుపై వెఱ్ఱి అభిమానం. దేవయానిది మొండి పట్టుదల. ప్రపంచాన్ని దగ్ధం చేసి బ్రతికించగల తపశ్శక్తి సంపన్నుడు శుక్రాచార్యుడు. అతని మాటను కాదనే ధైర్యం యయాతికి లేదు. శాస్త్ర అతిక్రమణదోషం అంటదు. వరమిస్తున్నాను. నా కూతురుని వివాహమాడు'' అన్నాడు శుక్రాచార్యుడు. సరేనని తల ఊపాడు

యయాతి.

యయాతిని వివాహమాడటం ద్వారా ఒక పంతం నెగ్గించుకొన్నది దేవయాని. అలాగే పట్టుబట్టి శర్మిష్ఠపై కూడ తన ఆధిపత్యాన్ని నెగ్గించుకొన్నది. శుక్రాచార్యుని అనుగ్రహం కోసం వృషపర్వుడు తన కుమార్తె శర్మిష్ఠను ఆమె వేయిమంది చెలికత్తెలను దేవయానికి దాసీలుగా చేసాడు.

కూతురుతోపాటు వారందరినీ యయాతికి అప్పగిస్తూ జాగ్రత్తగా చూసుకోమన్నాడు శుక్రాచార్యుడు. శర్మిష్ఠతో శయన సుఖానికి పాల్పడవద్దని అల్లుడిని హెచ్చరించాడు. యయాతి శర్మిష్ఠకూ, ఆమె చెలికత్తెలకూ చక్కని వసతి సదుపాయాలు కల్పించాడు.

దేవయాని వల్ల యయాతికి, యదువు, తుర్వసులనే ఇద్దరు కుమారులు కలిగారు. శుక్రాచార్యుని హెచ్చరికను విస్మరించి యయాతి, శర్మిష్ఠలు రహస్యంగా దంపతులయ్యారు. శర్మిష్ఠ ద్వారా యయాతికి ద్రుహ్యుడు, అనువు, పూరువు అనే ముగ్గురు కుమారులు కలిగారు.

ఒక ఋషి ప్రభావంచేత తాను సంతానవంతురాలనయ్యానని శర్మిష్ఠ బొంకటంతో నిజమని దేవయాని నమ్మింది. ఒకనాడు దేవయాని యయాతితో ఉద్యానవనంలో విహరిస్తుండగా శర్మిష్ఠ తనయులు తండ్రి వద్దకు వచ్చి పలుకరించడంతో రహస్యం బట్టబయలైంది.

భర్త తనకు చేసిన ద్రోహాన్ని భరించలేక పోయింది దేవయాని. ఆగ్రహంతో ఏడుస్తూ పుట్టింటికి వెళ్ళింది. పెనిమిటీ భార్యవెంటే వెళ్ళాడు బ్రతిమిలాడుకోవడానికి. కూతురు కన్నీరుకు కారణం తెలిసిన శుక్రాచార్యుడు కోపం పట్టలేకపోయాడు.

'యౌవన మదంతో మాట ధిక్కరించినందుకుగాను ముసలివాడివి కమ్మ"నమని అల్లుడిని శపించాడు. వార్ధక్యం ఆవరించింది యయాతిని. ''ఇంకా సుఖభోగాలపై మమత తీరనే లేదు. నీ కూతురును సుఖపెట్టడానికైనా వార్ధక్యాన్ని తొలగించమని మామను వేడుకొన్నాడు.

''నీ కొడుకెలవ్వరైనా వృద్ధాప్యాన్ని స్వీకరించడానికిష్టపడితే వారి యౌవనం నీకు లభించే వీలుంద''న్నాడు శుక్రాచార్యుడు. రాజ్యానికి వచ్చి వరుసగా కొడుకులనడిగాడు యయాతి. యదు, తుర్వస, ద్రుహ్య, అనువులు నలుగురూ తండ్రి కోర్కెను తిరస్కరించారు. తన మాట ధిక్కరించినందుకుగాను రాజ్యార్హత లేదని శపించి నలుగురు కుమారులనూ దూరదేశాలకు పంపాడు.

పెద్దకుమారుడైన యదువు సంతానం యాదవులుగా, తుర్వసుని సంతతి వారు యవనులుగా ద్రుహ్యుని సంతానం భోజజాతీయులుగా, అనువు సంతానం మ్లేచ్ఛులుగా తదనంతరకాలంలో ప్రసిద్ధికెక్కారు.

చివరి కొడుకైన పూరుడు తండ్రికోర్కెకు అంగీకారం పలికి, తండ్రి ముదిమిని స్వీకరించాడు. ఒకసారి పోయి రావడం వల్ల యయాతికి యౌవన కాలంలో అనుభవించే సుఖాలపట్ల మమకారం మరింత బలపడింది. ఒకటికాదు, రెండుకాదు వేయి సంవత్సరాల





పాటు యధేచ్ఛగా విషయ సుఖాలను అనుభవించాడు.

పుత్రుని పుణ్యమా అంటూ తాను పొందిన విషయ సుఖాల అనుభవాన్ని గూర్చి ఆత్మవిమర్శ చేసుకొన్నాడు యయాతి. తన కుమారుని ఔన్నత్యం, తన హీనత్వం అర్థమైంది అతనికి.

"నాయనా! పురూ! నీవెంతో యోగ్యుడివి. నీవు అన్ని రకాల శత్రువులను జయించిన వీరుడవు. నీ వల్ల లభించిన యౌవనంతో వేయేండ్లు యధేచ్ఛగా భోగాలు అనుభవించాను. అయితే ఈ కోర్కెలు ఎన్నడూ తీరేవి కావని తెలుసుకొన్నాను. ఎంత అనుభవించినా తృప్తి చెందదీ బ్రతుకు. భూమిమీదున్న సమస్త సంపదలూ, స్త్రీ జనమూ లభించినప్పటికీ తృప్తిలభించడం అసాధ్యం. ముసలితనం ఈ దేహానికేగాని కోర్కెలకు కాదు. తెలిసి వచ్చింది. కోర్కెను విడచినవాడే నిజంగా సుఖి. ఈ ఆశామోహా లబారి నుండి బయటపడే సాధన చేయాల్సిన తరుణమేర్పడింది. వానప్రస్థాశ్రమానికి వెళుతున్నాను. నీ యౌవనాన్ని, ఈ రాజ్యాన్ని కూడా స్వీకరించు'' అని కుమారుని ఆశీర్వదించి యయాతి అడవులకు వెళ్ళాడు.

గతంలో విషయ సుఖాలపై చూపిన శ్రద్ధను ఇప్పుడు యయాతి భగవంతునిపై చూపసాగాడు. భృగుతుంగ పర్వత శిఖరంపై శిలోంఛ వృత్తితో జీవనం సాగిస్తూ, అరిషడ్వర్గాలను జయించి వేయి సం॥లు కఠోర తపస్స చేసాడు యయాతి. అటు పిమ్మట శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వాలకు అతీతంగా కేవలం జలాన్ని ఆహారంగా స్వీకరించి మూడేండ్ల పాటు తీక్షణంగా ధ్యానం చేసాడు.

ఆ తర్వాత పంచాగ్నుల మధ్యనిలచి సంవత్సర కాలంపాటు వాయు భక్షకుడై భగవదనుగ్రహం కోసం పరితపించాడు. మరుసటి సంవత్సరమంతా ఒంటికాలిపై నీటి మధ్య నిలిచి ఘోర తపస్సు చేసాడు.

ఆ విధంగా తపమాచరించిన పిమ్మట యయాతి పాంచ భౌతిక శరీరాన్ని విడచి తోజోమయ స్వరూపుడై దివ్యలోకాలను చేరాడు. తన తపోబలం చేత పొందిన పుణ్యశక్తితో యయాతి వివిధలోకాలలో ఇచ్ఛానుసారం విహరించాడు. అలా దేవలోక, బ్రహ్మలోకాదులలో యయాతి లక్ష సంవత్సరాలు గడిపాడు.

దివ్యతేజో విలాసంతో కాలం గడుపుతున్న యయాతితో దేవేంద్రుడు ఓసారి ఇష్టాగోష్ఠి నిర్వహించాడు. "రాజా! నీ చరిత మహాద్భుతం. పోయిన యౌవనాన్ని పుత్రుని వల్ల పొంది నీలా సుఖాలను అనుభవించిన వారు భూలోకంలో ఇంకెవరున్నారు? అనుభవశాలివైన నీవు పూరునికి రాజ్యమప్పగిస్తూ, ఎలాంటి హితబోధచేసావో తెలుసుకోవాలని ఉంది చెప్పు'' అన్నాడు ఇంద్రుడు.

యయాతి కొడుకుకు చేసిన ఉపదేశాన్ని సవివరంగా తెలియజేసాడు ఇంద్రుడికి.

"నహుష పుత్రా! పూరునికి పట్టాభిషేకం చేసిన అనంతరం నీవు చేసిన తపస్సు సామాన్యమైనదా? ఆ తపోమహిమవల్లే కదా నూరువేల సంవత్సరాలపాటు దివ్య సుఖాలను అనుభవించగలిగావు! తపస్సులో నీకు సాటి

ఎవ్వరో తెలియచేయి" అన్నాడు ఇంద్రుడు.

"దేవేంద్రా! తపస్సులో నాకు సాటి ఎవ్వడూ లేడు. దేవ, దైత్య, రాక్షస, ఖేచర, సిద్ధ, నాగ, ఋషిగణాలలో, మానవమాత్రులలో నేను చేసినంత ఘోరమైన తపస్సు మరెవ్వరూ చేయలేదన్నాడు గర్వంగా యయాతి.

తన తపస్సు పట్ల దురభిమానంతో పెద్దలను తిరస్కరించి మానిత్వ, దంభత్వాలతో యయాతి పలికిన వదరుబోతు మాటలకు దేవేంద్రుడు ఆగ్రహించాడు. "రాజా! ఇంతటితో నీ పుణ్యం చెల్లు. దురహంకారివై మానిత్వంతో, దంభంతో నీవు పల్కిన ప్రేలాపనలకు అధోలోక గమనమే నీకు తగిన శాస్తి" అని యయాతిని శపించాడు దేవేంద్రుడు.

"మహేంద్రా! తెలివి తప్పి చేసిన తప్పు ముప్పు తెలిసి వచ్చింది. మానవలోకాన మనజాలను. దయచేసి అంతరిక్షలోకాన సజ్జన సాంగత్యంలో ఉండే అవకాశం కల్పించమని" ప్రార్థించి దేవేంద్రుని అనుమతితో స్వర్గలోకచ్యుతుడై అంతరిక్ష లోకంలో అడుగుపెట్టాడు యయాతి.

దివ్యకాంతులు వెదజల్లుతూ తేజోస్వరూపుడై తమ మధ్య ప్రత్యక్షమైన యయాతిని చూసి ఆశ్చర్యపోయారు అంతరిక్షవాసులు. అష్టకుడు, ప్రతర్దనుడు, వసుమంతుడు, శిబి అనే నలుగురు అంతరిక్ష వాసులు చకచకా యయాతిని చేరి నమస్కరించారు.

"దివ్య తేజోమూర్తీ! మీకివే ప్రణామాలు. మమ్మల్ని తరింపజేయడానికి మీరు ఎక్కడ నుండి ఇక్కడకు వచ్చారు? మీ సాంగత్యంలో సద్గతిని పొందే భాగ్యాన్ని మాకు ప్రసాదించండి అంటూ వినయంతో వారు యయాతిని ప్రశ్నించారు.

యయాతి తన చరిత్రను సవివరంగా వారికి తెలియజేసాడు. "కొద్ది అహంకారమే అయినా దీర్ఘకాలపు తపోఫలాన్ని ఎలా చెఱచగలదో తన స్వర్గలోకచ్యుతే చక్కని ఉదాహరణమన్నాడు.

"నాయనలారా! దురభిమానం వల్ల అజ్ఞానమూ, తత్ఫలితంగా వినాశనమూ తప్పదని పెద్దల వాక్కు. స్వీయ అనుభవం కూడా అదే.

ఇతరులు ఆదరించినప్పుడు ఉబ్బిపోక, అవమానించినప్పుడు విషాద మొందక నిలిచిన వాడే లోక పూజ్యుడైన సజ్జనుడు. ఫలాపేక్షతో సాగించే వ్రతాలు, దానాలు, అధ్యయనాలు, ఆరాధనలు, అనుష్ఠానాలు ఏవీ 'మృత్యు భయం' నుండి ఎవరినీ రక్షించలేవు.

గర్వరహితులై, దంభాన్ని విడనాడి ఎవరు తన చిత్తవృత్తి యందు స్థిరంగా పరమాత్మను నిలిపి ఆరాధిస్తుంటారో వారికే ఇహమూ, పరమూ, పరమశాంతీ, శ్రేయస్సూ లభ్యమౌతాయి" అంటూ తత్త్వోపదేశం చేసాడు యయాతి.

అష్టకాదులు యయాతి ద్వారా సమస్త ధర్మాధర్మాలు, సుగతి, దుర్గతుల స్వరూపాలు తెలుసుకొన్నారు. కృతజ్ఞతతో వారు తమ

11
BnJUN. 03.p65



పుణ్యఫలాన్నిచ్చి యయాతిని ఊర్ధ్వలోకాలకు పంపటానికి సిద్ధమయ్యారు. దానంగా స్వీకరించి, పుణ్యలోకాలకు వెళ్లడానికి యయాతి అంగీకరించలేదు.

ఎదుటివారి ఔన్నత్యం కోసం ప్రేమతో సాగుతున్న ఆ "సత్సంగపు" వివాదాన్ని చూసి పులకరించిపోయిన దేవేంద్రుడు ఊర్ధ్వ లోకాలకోసం వారైదుగురికీ దివ్యరథాలను పంపాడు.

కృతయుగ ప్రముఖుడైన యయాతి చక్రవర్తి అనుభవం మానిత్వం, దంభత్వాల వల్ల వచ్చే ప్రమాదమెలాంటిదో మనకు తెలియజేస్తున్నది. ఉచితానుచితాలను మరచిపోయేట్లు చేసే ఈ రెండు దుర్గుణాలూ మనిషి పతనానికి దారులు తెరుస్తాయి.

తాను సాగించే కర్మలకు, కర్తగా, భోక్తగా తనను భావించుకొనే విషయ లంపటుడైన జీవుడెన్నడూ 'మానిత్వం, దంభత్వం మాయాజాలంలో పడి మునకలు వేసేవాడే కాని తేలేవాడు కాదు.

నిత్యం విషయాల ఆజ్యాన్ని నిరంతరాయంగా అహంకారపు అగ్ని గుండంలో వేసి కోర్కెల అగ్నిజ్వాలలను ప్రజ్వలింపచేస్తూ మనిషి సాగించే మనోయజ్ఞానికి ఫలం-జనన మరణాల రూపంలో సాగే పాపపుణ్యాల చక్రభ్రమణమే కదా!

ఈ చక్రభ్రమణంలో చిక్కుకుని, సుఖ దుఃఖాల అనుభూతుల బంధంతో దేహాభిమాని సాగించే సుదీర్ఘ జీవనయానంలో అమానిత్వసిద్ధి ఆకాశకుసుమమే!

అమానిత్వమనేది ఒక పరిణితి చెందిన ఆధ్యాత్మిక స్థాయి. 'నేను' 'నాద'ను భావాన్ని పలుమార్లు నిగ్గదీసి, నిర్దాక్షిణ్యంగా కాచి, వడబోస్తే, మిగిలే జ్ఞానౌషధం- అమానిత్వం!

గౌరవానికి పొంగక, అగౌరవానికి కృంగక జీవన సంబంధాలలో అహంకారపు వికారాలను దరికి రానీయక ద్వంద్వాతీతంగా సాగే 'ఎఱుక'గల బ్రతుకు సాధనకు కొలమానం-అమానిత్వం. అంతటా వ్యాపించిన పరమ సత్యాన్ని అంతర్నేత్రంతో దర్శించిన అనుభవం యొక్క ఘనిష్టత వల్ల తన "పరిమిత సత్తా" యొక్క గుర్తింపుకు, ఆభిజాత్యానికి సంబంధించిన మూర్ఖపు, మొండి పట్టుదల మాయమైతే, ప్రత్యక్షమయ్యే సహజసిద్ధ సుపరిణామమే అమానిత్వం.

తిరస్కార, పురస్కారాలకు, దూషణ భూషణలకు చలించని భగవన్నివేదితమైన స్థిర, శుద్ధ చిత్తవృత్తియే అమానిత్వం.

మాధవునికి నిజమైన సేవకులుగా మారాలనుకునే వారందరూ ఈ దిశగా సాధన చేయాల్సిన వారే! 'ఇతిహాస బోధ' ఈ సత్యాన్ని గుర్తు చేస్తూ మంచిని పెంచే శాంతి పట్టిక'ను మననం చేయమని సవినయంగా విజ్ఞప్తి చేస్తున్నది.

**యథాప్రకారం ఈ కథకు కూడా తగిన పేరు సూచించడంతోపాటు మీరుకూడా ఈ "శీర్షిక"కు ఇలాంటి కథలు పంపే ప్రయత్నం చేయండి.**

## ఇతిహాసబోధ - 15 శీర్షికకు పాఠకులు పంపిన కొన్ని పేర్లు

1. **అకృతజ్ఞుడిని కుక్కలు గూడ కానవు**
 - యమ్. జయప్రకాష్, హన్మకొండ.
2. **పరోపకారమే పరలోక మార్గం - భోగ లాలసత్వమే అధోగతికి మార్గం**
 - డి. శారదాంబ, చిన్నబాడారం.
3. **ఆశ అనంతం మంచికి లేదు అంతం**
 - జె. రాధాకృష్ణ అప్పారావు, బి.సావరం.
4. **మానవుడిగా సృష్టించావు ప్రభూ కొద్దిగ మానవత్వం ప్రసాదించు**
 - డా॥ చెన్నమనేని హనుమంతరావు, కరీంనగర్.
5. **కృతఘ్నుని మాంసం కుక్కలు కూడ ముట్టవు**
 - కె. రామశేషమ్మ, సాగర్.
6. **అపకారికి ఉపకారం నెపమెన్నక చేయువాడు ధన్యుడు సుమతి.** -గుండాశ్రీనివాస్, కోదాడ.
 - ఆర్.సుమ,హన్మకొండ.
7. **అహాన్ని వదలి అణుకువ అలవర్చుకున్నప్పుడే భగవంతుని ప్రేమకు అర్హులం.**
 - సి. అరుణ పాపిరెడ్డి, నిర్మల్
8. **సదా పరుల శ్రేయస్సు కోరేవాడు పరమాత్మ నిర్హేతుక కృపకు పాత్రుడు.**
 - జె. రాధ మధుసూదనరావు, కరీంనగర్.
9. **ఉద్ధతులు గారు బుద్ధులు సమృద్ధిచేత జగతి నుపకర్తలకు ఇది సహజ గుణము**
 - వి. రంగాచార్య, కొత్తకోట.
10. **అపకారికి నుపకారం నెపమెన్నక చేయువాడు రాజ ధర్ముడు**
 - వి. శ్రీనాథకవి, తాడిపత్రి
11. **విశ్వాస ఘాతకులను ప్రేమతో క్షమించడం మహానుభావుల స్వభావము**
 -బొండా వీర్రాజు, జగ్గంపేట.
12. **మానవత్వం లేని మనిషి ప్రేమ స్వరూపమైన పక్షి**
 - వి. వంశీ, భీమునిపట్నం.
13. **అసురీ గుణం కలవారికి మేలు చేసిన వ్యర్థమే నిర్లక్ష్యం ప్రదర్శిస్తారు.**
 - కె. కృష్ణయ్య, నాగర్ కర్నూలు.
14. **సత్ సాంగత్య ఫలితము**
 - యస్. తిరుపతిచారి, హేమ్లాతండా
15. **స్వార్థ స్పర్థలతో మసిబారుతున్న మానవత్వము**
 - టి. తిరుపతయ్య, హన్మకొండ
16. **ఉదాత్త చరితుడు నాడీజంఘుడు - అధమ మానవుడు గౌతముడు**
 - యమ్. చంద్రమౌళి, నాగర్ కర్నూల్.
17. **మనస్తత్వ ఫలితము**
 - కె. సూర్యనారాయణ, మిర్యాలగూడ
18. **దుస్సాంగత్యంలో పొంచి ఉన్న ప్రమాదం**
 - కె. లలిత కుమారి, బొబ్బిలి
19. **ఆదర్శవంతమైన జీవితము**
 - కె. అప్పలరాజు, బొబ్బిలి
20. **అపకారికి ఉపకారం చేయుట ఉత్తముని లక్షణం.** - ఆర్. అనసూయ, అనంతపురం.
21. **సత్ప్రవర్తనలేని వారిని నమ్మరాదు.**
 - యస్. చైతన్య, గుంటూరు.

**వీరందరికీ శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములు అందజేయుచున్నాము.**

- వికాసతరంగిణి.



12 BnJUN. 03.p65



# మస్కట్, దుబాయి నగరములలో స్వామివారి యాత్రా వివరములు

శ్రీమాన్ కనక్ జి ఖిమ్ జీ (మస్కట్) గారి ప్రార్థనా ఫలంగా, శ్రీమన్ నంబి వేణుగోపాలా చార్యులుగారి సారథ్యంలో ఈ పర్యటన విజయవంతంగా సాగింది. గత సం॥రం జగిత్యాలలో జరిగిన ధర్మక్షేత్ర కార్యక్రమంలో శ్రీస్వామివారిని, సకుటుంబ పరివారంగా సేవించుకున్న శ్రీమాన్ ఖిమ్‌జీగారు ధర్మక్షేత్ర వైభవాన్ని చూచి శ్రీవారి మస్కట్ పర్యటనను సంకల్పించారు. దుబాయ్‌వంటి గల్ఫ్ దేశాలలో వైదిక సిద్ధాంత వైశిష్ట్యాన్ని, భారతీయ జీవన ఔన్నత్యాన్ని చాటి చెప్పగల సమర్థులయిన సదాచార్యులు శ్రీస్వామివారే అని నిర్ణయించుకుని శ్రీవారిని ప్రార్థించారు. గీతాజ్యోతి ద్వారా సర్వజనహితమైన భగవత్సందేశాన్ని విశ్వానికి అందించడమే లక్ష్యంగా నిశ్చయించుకున్న శ్రీస్వామివారూ ఆమోదించారు. శ్రీమాన్ ఖిమ్‌జీ గారికి ఆప్తతములయిన శ్రీమాన్ వేణుగోపాలాచార్యులుగారు కార్యక్రమాన్ని రూపొందించారు. పర్యటన ప్రయోజనవంతంగా జరిగింది.

ఏప్రియల్ 24వ తేదీ గ॥ 7గం॥లకు చెన్నై నుండి విమానయానంగా శ్రీస్వామివారు మస్కట్ దేశానికి బయలుదేరారు. శ్రీస్వామివారి పరివారం 6గురు, యజ్ఞనిర్వహణానికై వేణుగోపాలాచార్యులు గారు, వారి పరివారం 8 మంది కూడ శ్రీవారి వెంట ప్రయాణించారు. 3గం॥ల ప్రయాణంతో ఉ॥ 10గం॥లకు మస్కట్‌కి చేరారు. అక్కడి కాలమానం ప్రకారం ఒక గంట తేడాతో 11గం॥లయ్యింది. శ్రీవారిని స్వాగతించడానికై శ్రీమాన్ ఖిమ్‌జీ గారు, వారి పరివారం విమానాశ్రయానికి విచ్చేసారు. నెత్తిపై ప్రత్యేకమైన గుండ్రని గుడ్డటోపీని పెట్టుకుని, మెడ నుండి మోకాళ్ళ క్రింది వరకు బురఖాలా ఉండే కోటును ధరించి దేశీయమైన వేషధారణతో శ్రీమాన్ ఖిమ్‌జీగారు శ్రీవారిని స్వాగతించారు.

శ్రీమాన్ ఖిమ్‌జీ గారి వంశం సుమారు 200 సం॥ల నుండి ఈ దేశంలో స్థిరపడి ఎంతో మంచిపేరు ప్రతిష్ఠలను సంపాదించింది. మస్కట్‌లోని కోటీశ్వరులలో వీరొకరు. ఎంతటి సంపన్నులయినా నిరాడంబరత, నిజాయితీలు కలవారు. పెద్దల విషయంలో వినయవిధేయతలు కలవారు. భగవంతుని పట్ల అచంచలమైన భక్తి శ్రద్ధలు కలవారు. ముఖ్యంగా వీరు చేసే 'గోసేవ' అనిర్వచనీయమైనది. ఆవు కనిపిస్తేచాలు... దాన్ని చంపి దాని మాంసాన్ని ఆవురావురు మంటూ ఆరగించే దేశాలలో సుమారు 400కు పైగా ఆవులకు చక్కని గోశాలను నిర్మించి వాటిని కన్నబిడ్డల్లా చూచే వారి వ్యక్తిత్వం చాలా ప్రశంసనీయమైనది.

వారి హార్దిక స్వాగతాన్ని స్వీకరించి, శ్రీవారు సపరివారంగా శ్రీమాన్ ఖిమ్‌జీగారి గృహానికి వేంచేసారు. వారి కుటుంబ సభ్యుల పూర్ణకుంభ స్వాగతాన్ని కూడ స్వీకరించి వారందరికీ మంగళాశాసనాలను చేసారు. సాయంకాలం వారి గృహంలోనే శ్రీవిష్ణుసహస్రనామ పారాయణను ముగించుకుని, స్థానికంగా ఉన్న హనుమదాలయాన్ని, శివాలయాన్ని, కూడ సందర్శించారు. అక్కడి నుండి బయలుదేరి దగ్గరలో ఉన్న శ్రీకృష్ణాలయాన్ని సేవించారు. చాలా అందంగా నిర్మించారు ఈ ఆలయాన్ని. దీనిని నిర్మించుకోవడానికి అవసరమైన స్థలంతోపాటు కార్ పార్కింగ్ కోసమని సుమారు 200లకు పైగా కార్లు పట్టే స్థలాన్ని కూడ అక్కడి షేక్ బహూకరించాడు. ఆ దేశపాలకుడినివారు 'షేక్' అని సంభావిస్తారు. ముస్లిమ్ మతానికి చెందినవాడే అయినా 'సర్వాదరణ' సూత్రం తెలిసిన వ్యక్తి. ఏది ఏమైనా ఆదర్శవంతమైన సేవాకార్యం చేశాడు. ఆ

ఆలయ విశేషాలను శ్రీమాన్ ఖీమ్‌జీగారిద్వారా తెలుసుకుంటూ వారి కుమారులయిన శ్రీమాన్ పంకజ్‌గారింటికి శ్రీస్వామివారు వేంచేసారు. వారి స్వాగతాదులను స్వీకరించి మంగళాశాసనాలను కృపచేసి వసతికి వేంచేసారు.

25వ తేదీ ఆరాధనాదులను ముగించుకుని శ్రీమాన్ ఖింజీగారి గృహంలోనే మూడు రోజుల శ్రీలక్ష్మీనారాయణ సుదర్శనయాగాన్ని ప్రారంభించారు. యాగకార్యక్రమం జరుగుతూండగా శ్రీస్వామివారు సామూహిక లక్ష్మీపూజలను నిర్వహించారు. సుమారు 300 మందికిపైగా ఈ పూజల్లో పాల్గొన్నారు. ఇంత మంది మనవాళ్ళు ఒకచోట ఇలా కలవడం చాలా అరుదైన విషయంట. సాయంత్రం నిత్యపూర్ణాహుతిలో పాల్గొని భగవత్ బంధు పరిచయాలనుపొందారు.

26వ తేదీ ఉదయం ఆరాధనాదులను ముగించుకుని రెండవ రోజు యాగ కార్యక్రమాలను ప్రారంభించారు. శ్రీమాన్ ఖీమ్‌జీగారి వ్యాపారాలను, కర్మాగారాలను సందర్శించారు. ఖీమ్‌జీగారికి మిషనరీకి సంబంధించిన పరికరాలను తయారు చేసే ఫ్యాక్టరీలతో పాటు పిల్లలకు ఎంతో ఇష్టమైన రకరకాల బిస్కట్లను,చాక్లెట్లను,వేఫర్స్‌ను తయారు చేసే ఫ్యాక్టరీలు కూడ ఉన్నాయి. శ్రీస్వామివారు అన్నిటి విశేషాలను తెలుసుకుంటూ మంగళాశాసనాలను కృపచేసారు. సాయంత్రం నిత్యపూర్ణా హుతిని చేయించి,శ్రీకృష్ణాలయం లోని ప్రవచన మండపంలో గీతాజ్యోతి సందేశాలను వివరిస్తూ మృదుమధురంగా ప్రవచనాన్ని కృపచేసారు.

27వతేది ఉదయం ఆరాధనాదులను ముగించుకుని మూడవనాడు యాగ కార్యక్రమాన్ని ప్రారంభించారు. శ్రీస్వామివారి పర్యటనకు మరో ముఖ్యకారకులయిన శ్రీమాన్ కిరణ్ అషేర్(కాజి) గారింటికివేంచేసి,వారి వ్యాపార స్థలాలను, యంత్రాగారాలను, కర్మాగారాలను సందర్శించారు. శ్రీమాన్ కిరణ్‌గారు కూడ చాలా సం॥రాలుగా ఈదేశంలోనే స్థిరపడిన సంపన్నులు ఉత్సాహవంతులు. ఈదేశపు విశేషాలను వింతలను శ్రీస్వామివారికి వివరించే బాధ్యతను స్వీకరించారు. వారిద్వారా అన్ని విశేషాలను శ్రీస్వామివారు తెలుసుకున్నారు. మధ్యాహ్నం మహాపూర్ణాహుతిలో పాల్గొన్నారు. యాగకార్యక్రమం ఆగమోక్తంగా, శ్రీమాన్ వేణుగోపాలా చార్యులు గారి ప్రత్యేక హవనాలతో పాటు ఎంతో వైభవంగా జరిగింది. సాయంత్రం శ్రీకృష్ణాలయంలో మరోమరు సామూహిక లక్ష్మీనారాయణ పూజను నిర్వహించారు. మస్కట్ దేశంలో **"నభూతో నభవిష్యతి"** అన్నట్లుగా ఆకార్యక్రమం ఎంతో వైభవంగా జరిగింది. శ్రీస్వామివారు కూడ వారి ఉత్సాహన్ని గమనించి ఎంతో ఓపికతో పూజావిధానాన్ని,విశేషాంశాలను వివరించారు. శ్రీమాన్ కిరణ్‌గారిట్లో స్వాగతాదులను స్వీకరించి వసతికి చేరారు.

28వతేది ఉదయం తిరువారాధనాదులను ముగించుకొని కార్యకర్తల సమావేశాన్ని ఏర్పరచి, అందరికీ ప్రత్యేక మంగళాశాసనాలను కృపజేసారు. శ్రీమాన్ ఖీమ్‌జీ గారి 10ఎకరాల ఖర్జూరపు చెట్ల తోటకి వేంచేసారు. ముఖ్యంగా అందులో ఉన్న గోశాల శ్రీస్వామివారికి ఎంతో సంతోషాన్ని కలిగించింది. ఆవు మాంసానికై అర్రులుచాచే ఈ దేశంలో ఆరాధనాభావంతో ఆవులను సంరక్షిస్తూ వాటిని ఎంతో ప్రేమతో పోషిస్తున్నారు ఈ గోశాలలో. సుమారు 400కు పైగా ఆవులిక్కడ ఉన్నాయి. కొన్ని పాలిచ్చేవి. మరికొన్ని వట్టిపోయినవి. అయినా కూడ 'గోమాతను' ఎంతో ప్రేమతో పోషిస్తున్నారు. గీతాజ్యోతి రెండవ సూత్రమైన 'మాధవసేవగా సర్వప్రాణిసేవ' సూత్రాన్ని అక్షరాల ఆచరణాత్మకంగా నిరూపిస్తున్న గోశాల, శ్రీస్వామివారి హృదయాన్ని ఎంతో ఆకట్టుకుంది. వాటిని ఖర్జూరాలవంటి ఖరీదైన ఆహారంతో పోషించడం మరింత ఆనంద దాయకమైన విషయం. ఇంతటి భక్తి శ్రద్ధలుకల శ్రీమాన్ ఖీమ్‌జీగారికి ప్రత్యేక మంగళాశాసనాలను కృపచేసారు. అక్కడి నుండి సాయంత్రం





3-30ని॥లకు దుబాయ్‌కి బయలుదేరారు. సమారు 4గం॥లకు విమానాశ్రయంలో శ్రీస్వామివారు సపరివారంగా దుబాయ్‌కి చేరుకున్నారు. అక్కడ కూడ ఖీమ్‌జీగారే వసతి ఏర్పాట్లను గావించారు. అక్కడి వారి ప్రత్యేక గృహాన్ని శ్రీస్వామివారి వసతికై ఏర్పాటు చేసారు.

29వ తేదీ ఉదయం తిరువారాధనాదులను పూర్తిచేసుకుని దుబాయ్‌లో ఉన్న శ్రీమాన్ ఖీమ్‌జీగారి ఎస్టేట్స్‌ను సందర్శించారు. దుబాయ్‌లోని మన వారందరినీ పరిచయం చేసారు. శ్రీమాన్ ఖీమ్‌జీగారు.

30వ తేదీ ఉదయం ఆరాధనాదులు ముగించుకుని శ్రీమాన్ కిరణ్‌జీగారి మార్గదర్శనంలో సముద్రప్రాంతానికి వేంచేసారు. ఏడు వింతలు కల ఈ విశ్వానికి ఇక్కడివారు 8వ వింతను బహుకరించడానికై పరిశ్రమిస్తున్నారు.

బంగాళాఖాతం సముద్రంలో తీరం నుండి సుమారు 125 కి.మీ.ల విస్తీర్ణంలో ఒక Date Palm (ఖర్జూరపు చెట్టు) ఆకారంలో ఒక 'ఐలాండ్'ను సృష్టిస్తున్నారు. చెట్టుయొక్క కాండాన్ని ఆ ద్వీపానికి వెళ్ళడానికి సేతువులా నిర్మిస్తున్నారు. ఈ సేతువు అంతా దుబాయ్ దేశీయమైన వింతలకు విశేషాలకు స్థానంగా నిలుస్తుంది. ప్రపంచంలోనే 8వ వింతగా సృష్టిస్తున్న ఈ 'పామ్'లో మిగిలిన 7 వింతలను కూడ మనం నమూనాల ఆకారంలో దర్శించవచ్చునట. దానిపై జాతీయమైన ఎన్నో ప్రత్యేక కతలతో ఆ లాండ్ అద్భుతమైన ఐలాండ్‌గా తీర్చిదిద్దుతున్నారు. వాళ్ళ దేశంలో విరివిగా పుట్టి, పెరిగే విలువయిన ఖర్జూరపు చెట్టు ఆకృతినే ఈ ఐలాండ్‌కి ఆదర్శంగా తీసుకోవడం వారి సంస్కారానికి నిదర్శనం. ఖర్జూరపు చెట్టు ఆకృతిలో తయారవుతున్న ఈ చెట్టు కాండం నుండి 17 Villas ఉన్నాయి. అంటే 17 పొడవైన ఆకుల మండలున్నాయి. ఈ 17 సంఖ్యకు 1+7 మిగిలిన వింతలు ఏడింటికి సమానంగా తయారవుతున్న ఈ ఒక్కొక్క వింత కలిపితే మొత్తం 8 వింతలు అని చెప్పడం తాత్పర్యమో ఏమో, కానీ, ప్రతి విల్లాకు మధ్యన సముద్రం హూరెత్తుతూ ప్రవహిస్తూంటుంది. ఈ విల్లాస్ మీద కొన్ని అపార్ట్ మెంట్స్, విల్లాస్ చివరిభాగంలో రెసిడెన్స్ కట్టుతున్నారు. కొన్ని కోట్ల రూ॥ల ఖరీదుచేసే ఈ అపార్ట్‌మెంట్స్ ప్లాట్స్, రెసిడెన్స్, ఇప్పటికే సగానికి పైగా కొనేయడం జరుగుతోంది. ఇలా 17 పొడవాటి ఆకులు కల ఈ చెట్టుపైన అర్ధచంద్రా కృతిని బోర్లించినట్లు కనిపించే మరో అందమైన ఐలాండ్. ఈ ఐలాండ్‌ని Jumerah (జమెరహ) అని వ్యవహరిస్తారుట. ఈ చెట్టుకి మకుటంపెట్టినట్లు కనిపించే ఈ అర్ధవృత్తాకారంలో ఉన్న జమెరహపై 50 పెద్దపెద్ద ఫైవ్‌స్టార్ హోటల్స్‌ని కడుతున్నారుట. అంటే ప్రపంచ దేశాలకు పెద్ద పర్యాటక కేంద్రంగా దీన్ని తీర్చిదిద్దుతున్నారట. ఇప్పటికీ ప్రపంచ దేశాలు ఎన్నో ఈ 'వింత' సృష్టిలో భాగస్వామ్యానికి - భోగస్వామ్యానికి ఉవ్విళ్ళూరుతున్నాయట. 2001 ఆగస్ట్‌లో ప్రారంభమైన ఈ పా(దప)మ్ సృష్టిలో నిత్యం 500 మంది కూలీలు అహోరాత్రాలు పరిశ్రమిస్తున్నారు. 50 మంది నిపుణులైన ఇంజనీర్లు అనుక్షణం పర్యవేక్షిస్తున్నారు. చంద్రమండలం మీది నుండి చూచినారు. పామ్‌ట్రీ, కనిపించేటంత అద్భుతంగా రూపుదిద్దుకొంటోంది ఈ ఐలాండ్.

చాలా చిన్న దేశం దుబాయ్. త్రాగడానికి సరిగ్గా మంచినీళ్ళయినా దొరకని దేశం... గల్ఫ్ కంట్రీలలో సాధారణంగా కనిపించే పెట్రోలు గనులు కూడ ఈ దేశంలో లేవు. సముద్రంలోని ఉప్పునీటినే శుభ్రం చేసుకుంటూ, సంస్కరించుకుంటూ వాటినే మంచినీటిగా త్రాగుతున్నారు. ఇక్కడివాళ్ళు అలాంటి కనీసపు వనరులు లేని ఈ దేశం పట్టుదలతో పరిశ్రమతో ప్రపంచ పటంలోనే ప్రత్యేక స్థానాన్ని పొందే దిశగా ఈ 8వ వింతను సృష్టిస్తోంది. అన్ని వనరులు ఉండి ఏవిధమైన అద్భుతాన్ని, కనీస

అవసరాలను తీర్చుకోలేని మనలాంటి చాలా దేశాలకు వీరి ఆత్మ విశ్వాసం ఆదర్శవంతమైనవి అనడంలో ఏమాత్రం అతిశయోక్తి వాక్యంకాదు. ఇది ఆ దేశపు రాజయిన షేక్ మోహమ్మద్ బీన్ సంకల్ప కల్పవృక్షం. ఈ ఖర్జూరపు వృక్షం.

ఈ పామ్ ట్రీయొక్క విల్లాస్ పై మన శ్రీమాన్ ఖిమ్‌జీగారు రెండు ప్లాట్స్ తీసుకున్నారుట. వాటిని శ్రీస్వామివారికి చూపించి వారి శ్రీపాదవిన్యాసంతో ఆ పామ్‌ని పావనమ్ చేయించాలని ఖిమ్‌జీ గారికోరిక శ్రీస్వామివారు ఆ పామ్‌ట్రీ నిర్మాణం వెనుక వారి ఆత్మవిశ్వాసానికి మంగళాశాసనాలను చేసారు. ఈ ఖర్జూరం చెట్టుయొక్క నడినెత్తిన ఉండే విల్లాపై 12000 ఖర్జూరపు చెట్లనర్సరీని కూడ తయారు చేయాలని వాళ్ళు ప్లాన్ చేసారుట. ఆ వింతను విశేషాలను శ్రీమాన్ కిరణ్‌గారిద్వారా తెలుసుకుంటూ వసతికి చేరారు. రాత్రి 7-30 నుండి 9 గం॥ల వరకు స్థానిక దేవాలయంలో శ్రీస్వామివారి ప్రవచనం ఆసక్తికరంగా సాగింది. ఇది వరకెన్నడు అక్కడి వారు చూడని శ్రీస్వామివారి వర్చస్సు, వచస్సు వారి మనస్సులను దోచుకుని ఉంటాయనడంలో ఏమాత్రం సందేహం లేదు. ప్రవచనంలో పాల్గొన్న వారినందరినీ పలుకరిస్తూ మంగళాశాసనాలను వర్షిస్తూ వసతికి చేరారు.

మే 1వ తేది ఉదయం తిరువారాధన తీర్థగోష్ఠులను ముగించుకుని శ్రీమాన్ వినేష్ కె. భీమానిగారింటికి వెళ్ళారు. శ్రీమాన్ వినేష్, శ్రీమాన్ రాజేష్ కె. భీమాని ఇద్దరూ అన్నదమ్ములు. శ్రీస్వామివారి దుబాయ్ పర్యటనకు ముఖ్యకారకులు. మంచి ఉత్సాహవంతులయిన కార్య నిర్వాహకులు. వీరింట్లోనే పెరుమాళ్ళకు ఆరగింపు కార్యక్రమాలు జరిగాయి. వారిని వారి కుటుంబ సభ్యులను అందరినీ మంగళాశాసనం చేసి సా॥ 4 గం॥లకు మస్కట్‌కి బయలుదేరారు. 8గం॥లకు మస్కట్ చేరారు. రాత్రి ఆరాధనాదులు శ్రీమాన్ ఖిమ్‌జీ గారింట్లోనే ముగించుకుని రాత్రి 10-40కి మస్కట్ ఎయిర్‌పోర్ట్‌ని చేరుకున్నారు. శ్రీస్వామివారిని పంపించేయడం... వారికెంత విచారంగా ఉందో... వారిని విడిచిరావడానికి శ్రీస్వామివారి పరివారానికీ అంతే విచారంగా ఉంది.

శ్రీస్వామివారు, ఒక వారంగా, సపరివారంగా సాగించిన ఈ పర్యటన, మస్కట్, ఒమన్ ప్రాంతాలలోని మన వారికి ఎంతో సంతోషాన్ని దివ్యానుభూతులను పంచింది. ముఖ్యంగా వారికి ధార్మిక పరమైన అవగాహనను కలిగించింది. ఆధ్యాత్మిక మైన ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించింది.

వారందరి భక్తి పూర్వకమైన ఉద్యాపనను (సెండాఫ్) సౌహార్దంగా స్వీకరిస్తూ... రాత్రి 12-40 ని॥లకు మస్కట్ నుండి శ్రీస్వామివారు చెన్నైకి బయలుదేరారు. 5-40కి చెన్నై విమానాశ్రయానికి చేరుకున్నారు. 'యావత్ప్రపంచ సంపూజ్య చరణాయమహాత్మనే' అంటూ చెన్నై భక్తకోటి శ్రీస్వామివారి శ్రీపాదాలకు మంగళాశాసనం చేసింది. శ్రీస్వామివారితో ఈ పర్యటనలో పాల్గొన్నవారు.

1. శ్రీమాన్ గుదిమెళ్ళ వేణుగోపాలాచార్యులుగారు
2. శ్రీమాన్ నంబి వేణుగోపాలాచార్యులుగారు
3. శ్రీమాన్ నేపాల్ భాగవతాచార్యులుగారు
4. శ్రీమాన్ రావూరి వెంకట వరదన్‌గారు
5. శ్రీమాన్ ముడుంబై శ్రీకాంతాచార్యులుగారు
6. శ్రీమాన్ సముద్రాల శ్రీనివాసాచార్యులుగారు
7. శ్రీమాన్ దిట్టకవి గోపాలాచార్యులుగారు
8. శ్రీమాన్ నంబి రామగోపాలాచార్యులుగారు
9. శ్రీమాన్ నంబి సత్యనారాయణాచార్యులుగారు
10. శ్రీమాన్ నంబి మధుసూదనాచార్యులుగారు
11. శ్రీమాన్ సముద్రాల రవీంద్రాచార్యులుగారు
12. శ్రీమాన్ గుదిమెళ్ళ రంగనాథాచార్యులుగారు
13. శ్రీమాన్ ఉడాల రాజేష్‌గౌడ్ గారు

జై శ్రీమన్నారాయణ...!





# నచికేతుడు

# నచికేతుడు








(గత సంచిక తరువాయి)

**న్యూజిలాండ్‌లో....**

మార్చి 7వ తేదీ సాయంత్రానికి న్యూజిలాండ్‌కి చేరాము. విమానాశ్రయంలో శ్రీమాన్ మల్లెల గోవర్థన్, పద్మ దంపతులు, శ్రీమాన్ టి.యస్.వి. అవధాని, లక్ష్మీదంపతులు, శ్రీమాన్ రఘురామ శర్మగారు, శ్రీమాన్ ప్రభాకర్‌గారు, శ్రీమాన్ రవికుమార్ (పటమట) మొదలగువారు సభక్తికంగా స్వాగతాన్ని సమర్పించారు. వారి మార్గ దర్శనంలో ఆక్‌లాండ్‌లోని ల్యాన్సింగ్ రోడ్‌లోగల గోవర్థన్ గారింటికి చేరాము. మానాలుగు రోజుల వసతి వీరింట్లోనే మంచి దంపతులు. వైదిక కుటుంబాలలోని వారు కావడంతో మన సంస్కృతి, సంప్రదాయాలపట్ల చక్కని ఆసక్తి, అవగాహనలను అలవరచుకున్నారు. అవధాని దంపతులూ ఇంతే. ఈ ఇద్దరు దంపతుల కుమార్తెలు చి॥ విష్ణుప్రియ, చి॥ వ్రత్యూష లిద్దరూ పద్మగారివద్దనే సంగీతాన్ని అభ్యసిస్తున్నారు. ఈ ఇద్దరి గాత్రకైంకర్యంలో మన శ్రీరామచంద్రుడు రోజూ తిరునామ సంకీర్తనాన్ని అవధరించాడు. వందలాది తెలుగు కుటుంబాలు జీవించే ఈ దేశంలో ఉన్న నాలుగు రోజులు... మన ఆంధ్రదేశంలోనే ఉన్నట్లనిపించింది.

8వ తేదీ ఉదయం Ellersile ఆలయంలో శ్రీ సుదర్శనహోమం జరిగింది. ఉదయం 7 గం॥ శ్రీస్వామివారు వేంచేసే సరికి అక్కడి భక్తులంతా ఆసక్తితో ఎదురుచూస్తూ ఉన్నారు. ఆలయ యాజమాన్యం శ్రీస్వామివారిని పూర్ణకుంభంతో స్వాగతించారు. మధ్యాహ్నం సుమారు 1-30 ని॥లకు హోమం పూర్తయింది. అనంతరం అక్కడి భగవద్బంధువుల నిర్బంధంపై శ్రీస్వామివారు వారి వారి గృహాలకు వేంచేసి మంగళాశాసనం కావించి అందరినీ ఆనందింపచేసారు. సాయంత్రం సుబ్రహ్మణ్యయ్యర్ ఆలయంలో శ్రీవిష్ణు సహస్ర నామ స్తోత్ర పారాయణ అనంతరం శ్రీస్వామివారు శ్రీవిష్ణు సహస్ర నామ స్తోత్ర ప్రాశస్త్యాన్ని వివరించి శ్రోతల సందేహాలకు సమాధానాలనుగ్రహించారు. అనంతరం రాత్రి తిరిగి భగవద్బంధువుల గృహసందర్శన కార్యక్రమం కొనసాగింది. శ్రీవారు ఎంతో ఓపికతో ఎవరూ నిరుత్సాహ పడకుండా అందరి ఇండ్లకీ వేంచేసారు.

9వ తేదీ ఉదయం 9-30 ని॥ల నుండి ఆలయంలో మంత్రరాజయాగము, శ్రీయాగము నిర్వహించారు. యాగములో ప్రతిక్రియ వెనుక ఉండే అర్థాన్ని శ్రీస్వామివారే స్వయంగా వివరిస్తూ సాగిన ఈ యాగ కార్యక్రమంలో పాల్గొన్న భక్తులెంతో ఆనందానికి లోనయ్యారు.

మధ్యాహ్నం కొందరు భగవద్బంధువుల ఇండ్లకు వేంచేసి శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేసారు. సాయంత్రం 6గం॥ **Mt' Roskill intermediate school** లో శ్రీస్వామివారు ప్రపంచశాంతిని గురించి ప్రవచించారు. అనంతరం అక్కడి భక్తుల వివిధ సందేహాలను తీర్చి శ్రీమాన్ రాఘవన్‌గారి గృహానికి వేంచేసారు.

10వ తేదీ ఉదయం నుండి వాతావరణం అంత అనుకూలంగా లేదు. అయినప్పటికీ శ్రీస్వామివారు ఆ రోజంతా కూడా అక్కడి కార్యకర్తల గృహాలకు

వేంచేసి వారిని మంగళా శాసనములుకావించి ఆనందపరిచారు.

11వ తేదీ కూడ వానతగ్గలేదు. ఏకధారగా కురుస్తూనే ఉంది. న్యూజిలాండ్ సందర్శనానికై గోవర్థన్‌గారు ఏర్పాటుచేసిన కార్యక్రమాన్ని శ్రీవారు వానకారణంగా క్యాన్సిల్ చేసారు. తీర్థగోష్ఠి సమయంలో అవధాన్లుగారమ్మాయి ప్రత్యూష, గోవర్థన్‌గారమ్మాయి విష్ణుప్రియలు కీర్తనలుపాడారు. గోవర్థన్ గారి శ్రీమతి పద్మగారు, శ్రీధరన్‌గారి శ్రీమతి హేమగార్లు కూడ శ్రోత్రపేయంగా గానం చేసారు. శ్రీవారు ప్రశాంతంగా, పెరుమాళ్ళ సన్నిధిలో ఈ గానకచ్చేరి ఆలకించారు. చాలాకాలం తరువాత ప్రశాంతంత లభించింది శ్రీవారికి కంప్యూటర్ వద్ద కూర్చుని ఇ.మెయిల్ చూసుకున్నారు. అయినా ఆగంతుకుల ఆటంకం తప్పలేదు. విసుగు విరామం లేకుండా అందరికీ మంగళాశాసనాలు అనుగ్రహించారు.

మధ్యాహ్నమంతా ఉత్తరాలను చూసుకోవడం లోను, ఉత్తరాలకు సమాధానాలను వ్రాసుకోవడం లోను గడిపారు. ఇన్నాళ్ళకు వారికి తీరిక దొరికింది. మనకు తీరిక దొరికితే హాయిగా పడుకొని రిలాక్స్ అవుదామనిపిస్తుంది వారికిలా వ్యక్తిగతమైన పని చేసుకోవడానికి అనుకూలం కుదరడమే విశ్రాంతి. అవిశ్రాంతంగా శ్రీవారు నిర్వహిస్తున్న ఈ వైదిక ధర్మప్రచారంలో 'విశ్రాంతి' దొరకడం చాలా అరుదుగా ఉంటోంది.

సాయంత్రం లాన్సింగ్ రోడ్ దగ్గరలోనున్న Flunketకి వేంచేసారు. ఫ్లంకెట్‌అంటే శిశువిహార కేంద్రం లాంటిది... లేదా శిశు సంరక్షణ స్థలం.. తల్లి దండ్రులు ఉద్యోగాలకు వెళ్తూ వారిపిల్లలను ఇలాంటి కేంద్రాల్లో ఉంచుతారు. సాయంకాలం తిరిగి వస్తూ వారిని పికప్ చేసుకుంటారు. అక్కడ పిల్లలకు కావలసిన అన్ని ఆటవస్తువులను ఉంచుతారు. నెలకు కొంత ఫీజును తీసుకుంటూ కొందరు ఆయాలు, అయ్యలు పిల్లలను ఆడిస్తూ ప్రాథమిక శిక్షణను కూడ ఇవ్వడం ఇక్కడి విశేషం.

ఈనాటి ఉదయమే లక్ష్మీపూజా కార్యక్రమాన్ని సంకల్పించడం వల్ల, కార్యకర్తలు అందరికీ సమాచారం తెలియజేయలేక పోయారు. కానీ సంకల్ప బలం వల్ల దాదాపు వందమందికి పైగా కార్యక్రమానికి హాజరయ్యారు.

పూజయొక్క ఆవశ్యకత గురించి, విగ్రహారాధన యొక్కవైశిష్ట్యం గురించి శ్రీవారు హృదయంగ మంగా వివరించారు. ఉపచారాలను వివరిస్తూ... అపచారాలను సవరిస్తూ శ్రీవారు పూజను చేయించారు.

వసతికి చేరేసరికి 11 గం॥ల రాత్రి అయ్యింది. ఈ కార్యక్రమాలను విజయవంతంగా నిర్వహించిన శ్రీమాన్ మల్లెల గోవర్థన్, పద్మ దంపతులను శ్రీమాన్ టి.యస్.ఆర్. అవధాని, లక్ష్మీ దంపతులను శ్రీమాన్ రఘుగారిని, శ్రీ హేమశ్రీధరన్‌గారికి శ్రీస్వామివారు ప్రత్యేకముగా మంగళాశాసనాలను కృపచేసారు.

12వ తేదీ తెల్లవారు ఝామున 3 గం॥లకే ప్రయాణ సంరంభం. ఉ॥ 6 గం॥లకే విమానం కావడంతో 4 గం॥ల కల్లా ఎయిర్ పోర్ట్‌కు చేరాము. మమ్మల్ని సాగనంపడానికై గోవర్థన్ దంపతులు, అవధాని దంపతులు, రఘుగారు, శ్రీ ప్రభాకర్ సంగీత గార్లు ఎయిర్ పోర్ట్‌కి వచ్చారు. సరిగ్గా సమయానికే విమానం విహంగంలో ఎగిరింది. సుమారు 4గం॥ల ప్రయాణం చేసి ఉ॥ 8 గం॥ 30 ని॥లకు మళ్ళీ మాలాభరణ్.... అదేనండి 'మెల్‌బోర్న్'కు చేరాము.

మమ్మల్ని స్వాగతించడానికై మనప్రధాన కార్యకర్తలు అందరూ ఎయిర్‌పోర్ట్‌వద్ద ఎదురు తెన్నులు చూస్తున్నారు. వాళ్ళందరి ద్వారా హార్దికమైన ఆనంద స్వాగతాన్ని అందుకున్నాము ఆ క్షణంలో... ఎందుకో 'మన' భారతదేశానికి చేరుకున్నంత సంతోషం కలిగింది. ఎయిర్ పోర్ట్ నుండి గంట ప్రయాణంతో Glenvaverly గ్రామంలోని శ్రీమాన్ శ్రీనివాస ప్రభు (కొప్పరపు) వారింటికి చేరాము. నిగర్వి, నిరాడంబరుడు... శ్రీవారి ఆస్ట్రేలియా పర్యటనానికి ముఖ్య కారకులయిన మన 'యువత'కు కొండంత అండ... శ్రీమాన్ ప్రభుగారు. చక్కని కార్యదక్షత కలవారు. మా అన్నిదేశాల వీసాల విషయంలోను అవిశ్రాంతసేవలను అందించిన క్రియాశీలి. మనం శ్రీస్వామివారిని సంబోధిస్తూ శ్రీస్వామివారు అనో, దేవరవారు అనో అంటూంటాం.. కానీ ప్రభుగారు





శ్రీస్వామివారిని పదే పదే వినయ విధేయతలతో కూడిన లలిత గంభీరస్వరంతో 'శ్రీవారు ఎలా చెప్తే అలా, శ్రీవారికి ఇది విన్నపం.... ఇలా ఆయన 'శ్రీవారు' అని అంటూంటే... మళ్ళీ మళ్ళీ వినాలని పిస్తుంది. వారిల్లు కూడా మా సొంత ఇల్లే. ఇంటి మొత్తాన్ని మా కప్పజెప్పి వారు వేరే వారింట్లో ఉన్నారు.

సాయంత్రం గ్లెన్ వేవర్లీ విలేజ్‌లోనే మరో ప్రాంతంలోని చంద్రశేఖర్ గారింటికి వెళ్ళాము. రేపు ఉదయం జరిగే ఉపనయనానికి పూర్వాంగంగా ఈ రోజు ఉదకశాంతి కార్యక్రమం జరిగింది. సిడ్నీనుండి శ్రీమాన్ హృషీకేశ భట్టర్‌గారు విచ్చేసారు ఈ మానుష యాజ్ఞికానికై. వారికి శ్రీస్వామివారి పరివారం సహాయంగా వైదికంగా ఆ తంతు ముగిసే సరికి రాత్రి 10 గం॥లయ్యింది. శ్రీస్వామివారు ఉపనయనం యొక్క ప్రాశస్త్యాన్ని వివరించారు.

13వ తేదీ తెల్లవారుఝామునన ఉపనయన కార్యక్రమం ప్రారంభమైంది. ఉదయం 6-40 ని॥లకు శుభముహూర్తము శ్రీస్వామివారు సరిగ్గా బ్రహ్మోపదేశ సమయానికి వేంచేసారు. ఆ నూతన వటువులిరువురికీ బ్రహ్మోపదేశాన్ని పితృద్వారకంగాచేసారు. ఆస్ట్రేలియాలో శ్రీవారు తొలిసారిగా చేసిన బ్రహ్మోపదేశమిది. శ్రీమాన్ చార్యచిగురాల గారి తమ్ముడైన రాజగోపాలాచార్యులు, శ్రీమాన్ చంద్రశేఖర్, నిర్మల గార్ల కుమారుడైన అభిషేక శర్మ... ఈ వటువులిద్దరూ అదృష్టవంతులు.

ఈ రోజు కులశేఖరాళ్వార్ల తిరునక్షత్రోత్సవం కావడంతో విశేష తిరువారాధనతోపాటు, విశేష సేవా కాలంగా ఉపదేశరత్తినమాలను కూడ అనుసంధానం చేసాము. 'కులశేఖరుల' వైభవాన్ని గురించి ప్రవచించారు. తీర్థగోష్ఠి జరిగింది.

సరిగ్గా 11గం॥లకు బయలుదేరి హాథాన్ ప్రాంతంలోని ఇరాసమ్స్ విద్యాలయంను సందర్శించారు. ముఖద్వారం వద్దకు చేరేసరికి 12 ఏళ్ళ ప్రాయంకల ఇద్దరు బాలబాలికలు మమ్మల్ని సాదరంగా స్వాగతించారు. ఆ విద్యాయలంలో ఇద్దరూ కెప్టెన్స్‌ట. వారిలో బాలుడు, మన భారతీయుడే. ఎక్కడ ఉన్నా, ఎందరిలో ఉన్నా మనవాడు ముందుంటాడనే నమ్మికను నిజంచేసాడా బాలుడు.

ఇంతలో ఆ స్కూల్ ప్రిన్సిపాల్ శ్రీమాన్ జొనాథన్ టిక్నర్‌గారు శ్రీవారిని స్వాగతించారు. స్కూల్ విశేషాలను వింటూ వారివెంట నడిచాము.

'ఇరాసమ్స్' వారు ఆస్ట్రేలియా ఖండంలోనే సుమారు 7 చోట్ల ఇలాంటి విద్యాలయాలను నిర్వహిస్తున్నారు. ఆదర్శవంతమైన ఈ ఇరాసమ్స్ వ్యవస్థాపకులు మన భారతదేశంలోని బదరికాశ్రమ ప్రాంతంలోకల జ్యోతిర్మఠ పీఠాధి పతులయిన శ్రీశాంతానంద సరస్వతిగారి ఆశీర్వాద బలంతో స్ఫూర్తితో ఈ స్కూల్స్‌ను నెలకొల్పారు. మన భారతీయ తత్త్వ దృక్పథంతో, ఆదర్శవంతమైన రీతిలో సంస్కృతాన్ని నేర్పిస్తూ. మామూలు చదువులను కూడ నేర్పించడం ఈ విద్యాలయాల ప్రత్యేకత. ఈ విద్యాలయంలో సెకండరీ వరకు బోధిస్తున్నారు. ఇక్కడివారు 1వ తరగతి నుండి 5వ తరగతివరకు ప్రైమరీగా 5 నుండి 7 వరకు సెకండరీగా ఆపై అన్ని తరగతులను యూనీగా పిలుస్తారట.

వీరు భగవద్గీత శ్లోకాలను భావయుక్తంగా నేర్పడమే కాక అభినయాన్ని కూడ నేర్పడం మరీ విశేషం. ఒక తరగతికి వెళ్ళాం. అక్కడి టీచర్ గీతలోని 'యచ్ఛ్రేయ స్స్యాత్ .... త్రపన్నమ్' అనే శ్లోకాన్ని మాముందు ప్రదర్శింపజేసింది. వారు ఆ శ్లోకాన్ని ప్రత్యేక శైలిలో, అర్థభంగం కాని విరుపులతో, తమాషాగా అభినయం తోపాటు పఠించారు. ఆ శ్లోకభావాన్ని ఇంగ్లీష్‌లో ఇంచుమించు అదే బాణిలో చదివారు. వారు శ్లోకం చదువుతున్నా, ఇంగ్లీష్ భావం చెపుతున్నా ఒక లాగానే అనిపించాయి. కానీ వారి ఆలోచన ఆశయసాధన ఎంతో ఆదర్శంగా అనిపించాయి.

మరో తరగతిని సందర్శించాము. సంస్కృత పాఠం జరుగుతోంది. సుమారు 30 మంది చిన్నపిల్లలు న్నారు. ఈశోపనిషత్ పాఠం చెపుతున్నారు సంస్కృతం మాష్టారు. శ్రీస్వామివారు వేంచేయడంతో అందరితో ఉపనిషత్ కొంత చదివించారు. ఆంగ్లపద్యాలలాగానే వినిపిస్తున్నా శ్రావ్యంగానే అనిపించింది. అదే ముక్త కంఠంతో అందరూ ఆ మంత్రాల భావాలను కూడ చెప్పారు. ఆశ్చర్యంగాను, మరింత ఆనందంగానూ అనిపించింది. అందరికీ గీతాజ్యోతి సమాచారాన్ని

అందించాము. మరో తరగతిలో పట్టుమని పదేళ్ళయినా నిండని పసివాళ్ళు వేసిన ప్రశ్నలు ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఒక పిల్లవాడు త్రిదండం గురించి, మరో పాప స్వరూపం గురించి, ఇంకొక పాప మరణం తరువాత ప్రయాణం గురించి.... ఇలా ప్రశ్నించారు. అందరికీ శ్రీస్వామివారు సంక్షిప్త సుందరంగా సమాధానాలను చెప్పారు. తొమ్మిదవ తరగతికి వెళ్ళాము. పిల్లలంతా ఏకకంఠంతో శ్రావ్యంగా 'వెల్‌కమ్ టు స్వామీజీ' అంటూ స్వాగతించారు. ప్రిన్సిపాల్ కోర్కెపై శ్రీస్వామివారు ప్రవచనం చేసారు. తమాషాగా తమను తావే పరిచయం చేసుకున్నారు.

**'సర్వ ప్రాణిహితాన్ని కోరే వాడే స్వామి అని, అలాంటి వారిలో తాము స్మాల్ స్వామి అని, అందుకే తమను 'చిన్న' అని అంటారని, నుదుటిపై ఈ మార్క్ (స్వరూపం) వల్ల మాకు జీయర్ అని పేరని.... కలిపి మమ్ము చిన్నజీయర్ స్వామి అని అంతా పిలుస్తారని వివరించారు.'**

శ్రీస్వామివారు పరిచయం చేసుకునే విధానంలోనే వారి జీవన విధానం, ఆశయాలు, విశ్వశాంతి కామన అన్నీ ప్రస్ఫుటంగా గోచరించాయి.

భారతదేశంలోని మాతృదైవత్వం గురించి, సంస్కృతి వైభవం గురించి, గీతాజ్యోతి గురించి వివరించారు.

పిల్లల ఆర్ట్ రూమ్‌కి వెళ్ళాము. పిల్లలు వేసిన రకరకాల రంగుల బొమ్మలను చూసాము. వారు వేసిన బొమ్మల ఒరిజినల్స్‌ను కూడ ప్రక్కనే పెట్టి అలంకరించడంతో వారి ప్రయత్నం - నైపుణ్యం తెలిసాయి. వారు అలా వేయడంలో యాజమాన్యం వారి ప్రోత్సాహం చాలాబాగున్నది. మరో గదిలో పిల్లలు తయారు చేసిన చెక్కబొమ్మలను చూసాము. చెక్క బొమ్మలే కాకుండా, ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్‌తో చేసిన పువ్వులు, లతలు, గిన్నెలు, చెంచాలు, చిన్న చిన్న డిజైన్లు, ఇళ్ళు.... వాటికి పిల్లలు అద్దిన రంగులు... చూస్తుంటే ఎంతో ఆశ్చర్యంగా అనిపించింది. పిల్లల్లో ఇలాంటి ఆసక్తిని - ఆ శక్తిని పెంపొందించేలా యాజమాన్యం, సౌకర్యాలు, పరికరాలతోపాటు, సమయాన్ని కూడ కేటాయించింది. ఇవిగాక పిల్లలు మ్యూజిక్‌ను కూడ నేర్చుకుంటున్నారు. వారు కలసి శ్లోకాలను చదువుతున్నప్పుడే వారి లయబద్ధతలో ఈ విషయాన్ని శ్రీవారు గుర్తించారు. ఇలా ఆదర్శ వంతమైన రీతిలో పిల్లలను తీర్చిదిద్దుతోంది ఇరాస్మస్. ప్రిన్సిపాల్ గారి పిలుపును కాదనలేక లంచ్‌రూమ్‌కివెళ్ళాము. టైంకావడంతో అప్పటికే పిల్లలంతా అక్కడికి చేరి ఉన్నారు. అద్దంలా ఉంది రూమ్ అంతా... కిచెన్ రూమ్ పరిశుభ్రంగా ఉంది అందరూ టేబుల్స్‌పైన ఆహారాన్నితీసుకుంటున్నారు. అందరూ కట్టిపడేసినట్లు కాకుండా చాలా స్వతంత్రంగా, సంతోషంగా ఉన్నారు. ఆహారం తీసుకునే ముందు ఇంగ్లీష్‌లో ప్రార్థన చేసారు. 'ఓ దేవుడా! నీ దయతో ఈ ఆహారం లభించింది. దీనిని పవిత్రం చెయ్యి' అనిఅర్థంట... అందరికీ శాకాహారమే, కూరగాయలతోనే చేసిన పదార్థాలు... చపాతీలు, జామ్స్, వడ్డించు కోవడంలో కూడా వారికి స్వేచ్ఛ ఉంది. చపాతీల మడతల్లో బీట్‌రూట్, క్యారెట్ చిప్స్, తేనెలో కలిపిన ముద్దను పెట్టుకుని తింటున్నారు. విచ్చలవిడిగా మాంసమే తినే ఈ దేశంలో వీరి శాకాహార పద్ధతి మరింత ఆశ్చర్యంగా అనిపించింది. మరో విశేషం. ఏ తరగతి ఉపాధ్యాయులు ఆ తరగతి విద్యార్థులతో కూర్చుని (వారిమధ్య ఆహారాన్ని స్వీకరిస్తారుట. ఈ చర్య... పిల్లలో మరింత స్వత్వభావనను కలిగిస్తుంది).

ప్రిన్సిపాల్ గారి కోర్కెపై శ్రీస్వామివారు కూడ లంచ్ రౌండ్‌లో కూర్చున్నారు. వారికి కూడ ఒక ప్లేటు ఉంచి ద్రాక్ష పండ్లను ఉంచారు. ప్రిన్సిపాల్‌తో మాట్లాడుతూ అందరి అనుయాగం (లంచ్) పూర్తయ్యేదాక శ్రీస్వామివారు అక్కడే కూర్చున్నారు. అసలు విశేషమేమిటంటే... లంచ్‌రూమ్‌లో వడ్డన, పాత్ర శోధనలు అన్నీ ఆ పిల్లల తల్లిదండ్రులే చేస్తారుట. ఇది ఆ పేరెంట్స్ చేసే స్వచ్ఛందసేవ. మాతో వచ్చిన సంపత్ వారం కోసారి ఇలా వచ్చి మా JET తరపున సేవచేస్తానని వారితో అన్నాడు. అంత స్ఫూర్తిగా అక్కడి వాతావరణం కనిపిస్తోంది. అనుయాగం తర్వాత పదార్థాలను సర్దడంలోను, టేబుల్స్‌ను క్లీన్ చేయడం లోను ఎవరి ప్రేరణ లేకుండానే క్రమశిక్షణతో చేసారు ఎవరో ఒకరు వెనకపడి చెప్తున్నట్లుగా ఎవరికి వారే అందరూ పనులు చేసారు. పావుగంట తర్వాత





ఒకమ్మాయి ఆగమార్థం తు బాలానాం... అన్నట్లుగా చేతిలో గంటను వాయించుకుంటూ గ్రౌండ్ అంతా తిరిగింది. పదినిముషాల్లో అందరూ క్యూపద్ధతిని పాటిస్తూ ఎవరి క్లాస్ రూమ్‌కి వారు వెళ్ళిపోయారు. ఈ దైనందిన చర్య శ్రీస్వామివారికెంతో ఆనందాన్ని కలిగించింది. బయలుదేరబోతూ శ్రీస్వామివారు, ప్రిన్స్‌పాల్‌తో 'మీ స్కూల్స్ ప్రపంచానికే ఆదర్శవంతాలు అవుతాయి' అని మంగళాశాసనం చేసారు.

బయలుదేరి గంట ప్రయాణంతో మళ్ళీ శ్రీనివాస ప్రభుగారింటికి చేరాము. గురువారం టెలిబ్రిడ్జి కార్యక్రమం పూర్తయిన తర్వాత 'యువత' అంతా శ్రీస్వామివారి పాదపూజను చేసుకోవడానికి సిద్ధమైంది.

సత్యం, వేణు, సంపత్, ప్రకాష్, హరీష్ మొదల యిన యువకార్యకర్తలంతా కూర్చుని పాదపూజను సమర్పించారు. శ్రీస్వామివారు అందరికీ ప్రత్యేక మంగళాశాసనములను కృపజేసారు.

సా॥ 6గం॥లకు **Wantirna** ప్రాంతంలోని హిందీ వాళ్ళ 'రాం' మందిర్‌కివెళ్ళాము. అక్కడి మార్‌వాడీ సేఠ్ గారి కోర్కెపై శ్రీస్వామివారు హిందీలోనే శ్రీరాముని మానవత్వం గురించి ఆసక్తికరంగా ప్రవచించారు. శ్రీమాన్ శేఠ్‌జీ లోకల్ ఇండియన్స్ పత్రికకు విలేఖరి కావడంతో శ్రీస్వామివారిని ఇంటర్వ్యూ చేసారు. గీతాజ్యోతిని వివరిస్తూ సమాజ శ్రేయస్సుకై సిద్ధపరచిన రెండు సూత్రాలను వివరించారు. రాత్రి విక్రమ్ గారింటికి మకాం పూర్తిగా మార్చుకున్నాము.

**14**వ తేదీ విక్రమ్, శ్రీదేవిగారింట్లోనే తిరువారాధన, శ్రీమాన్ విక్రమ్‌గారు, మన కస్టమ్స్ శ్రీనివాస్ (డిల్లీ) గారి బావమరిది. చాలా మంచి దంపతులు. శ్రీస్వామి వారి ఆస్ట్రేలియా పర్యటనకు ముఖ్య కారకులలో ఒకరు, ఏకాదశి కావడంతో తీర్థగోష్ఠి కాగానే శ్రీస్వామివారు జెట్ సమావేశం ఏర్పాటు చేసారు. సుమారు నాలుగు గంటలపాటు సమావేశం జరిగింది. మధ్యాహ్నం రెండు గంటలకే ప్రయాణమై ఎయిర్‌పోర్ట్‌కి చేరాము. ఇమ్మిగ్రేషన్స్, కస్టమ్స్ అన్ని పూర్తయ్యేసరికి సా॥ **5** గం॥లు అయ్యింది. **5-30** ని॥లకు ఫ్లైయిట్, ఏదో సాంకేతిక లోపంవల్ల **3** గం॥ల ఆలస్యమైంది. మమ్మల్ని సాగనంప డానికై వచ్చిన వారందరికీ ఇదొక సువర్ణావకాశంలా అనిపించింది. శ్రీస్వామివారితో సన్నిహితంగా గడప వచ్చుననే ఆనందంతో అందరూ శ్రీవారి చుట్టూ గుమ్మిగూడారు. ధర్మసందేహాలతో జెట్ కార్యక్రమ సూచనలతో గడిచింది.

మధ్యాహ్నం మాతో పాటు వచ్చిన వారంతా రాత్రి **9** గం॥ల వరకు మాతోనే ఉండి పోయారు. **9**గం॥లకు విమానంలోకి చేరాము. సుమారు రా॥ **10-30** ని॥లకు బయలుదేరి ఆస్ట్రేలియా టైం ప్రకారం ఉదయం **6**గం॥లకు సింగపూర్‌కి చేరాము. లోకల్ టైం **3** గం॥లు అయ్యింది.

### సింగపూర్‌లో.....

సింగపూర్ తెలుగు సమాజం అధ్యక్షులు శ్రీమాన్ పి. సాంబశివరావుగారు, శ్రీమాన్ హరీష్‌గారు, వర్మ దంపతులు, గోపాలరాజ దంపతులు హార్దికస్వాగతాన్ని అందించారు. **40**ని॥ల ప్రయాణంతో ఉడ్‌లాండ్స్‌లోని శ్రీధరన్‌గారింటికి చేరాము. వారు, వారి తమ్ముడు రాఘవన్‌గారింట్లో సర్దుకుని, ఇల్లంతా మాకు అప్పచెప్పారు. ఉదయం తిరువారాధన, సేవాకాలం, తీర్థగోష్ఠి ముగించుకుని సరంగూన్ (Surongoon) ప్రాంతంలోని వాటర్ లూ స్ట్రీట్ (Water loo Street)లో ఉన్న శ్రీకృష్ణాలయానికి వెళ్ళాము. సాంప్రదాయికమైన శోభతో 'సువర్ణ' కాంతులను విరజిమ్ముతూ సుందరంగా ఉంది ఆలయం. ఆలయంలోని ప్రతిభాగాన్ని పవిత్రంగా - పరిశుభ్రంగా ఉంచారు. చుట్టూ పాలరాతి పలకలపై చెక్కబడి, బంగారు రంగులతో అద్దిన తిరుప్పావై **30** చిత్రాలతో మరింత సంప్రదాయ శోభను సంతరించుకుంది. సంప్రదాయబద్ధమైన స్వాగతోత్సవాన్ని స్వీకరించి, శ్రీస్వామివారు పెరుమాళ్ళను సేవించుకున్నారు.

**1870**లో సింగపూర్‌లో హిందూ కమ్యూనిటీ సెంటర్‌గా ఒక రేకుల షెడ్‌తో ప్రారంభమైన ఈ మందిరం ఈనాడు లక్ష్మీనారాయణ మందిరంగా అద్భుతంగా రూపుదిద్దుకుంది. ఈ మందిరంలోనే ఆ పూట శ్రీస్వామివారు ప్రవచనంఅనుగ్రహించారు.

**మరునాడు ఉదయం భారత్‌కు వేంచేసారు.**



శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో...

# గోదావరి పుష్కర ప్రయుక్త బ్రహ్మ యజ్ఞము

**SKVTకాన్వెంట్, దానవాయిపేట, రాజమహేంద్రిలో..**

**తేది : 28-7-2003 నుండి 4-8-2003 వరకు**

పవిత్ర గోదావరి పుష్కరాలలో జరిగే సప్తాహ్నిక పంచకుండాత్మక బ్రహ్మ యజ్ఞంతోపాటు వివిధేష్టులు మరియు వికాసతరంగిణి జన్మదిన వేడుకల్లోనూ అన్వయించి తరించవలసినదిగా సాదరముగా ఆహ్వానిస్తున్నాం.

**ప్రతిరోజూ కారక్రమాల వివరములు**

ఉ॥ 7-30 తీర్థగోష్ఠి, బ్రహ్మ యజ్ఞం వివిధ పారాయణారంభం
ఉ॥ 9-00 శ్రీస్వామివారి ప్రవచనం మరియు ఆహూతులైన పెద్దల ప్రవచనాలు
మ॥12-00 పూర్ణాహుతి, సా॥ 4-6 టి.టి.డి. ఆళ్వారు ప్రాజెక్టుపక్షాన శ్రీపురాణేతిహాసగోష్ఠి
సా॥ 6-45 శ్రీస్వామివారిప్రవచనము, రా॥ 8-30 సాంస్కృతిక కారక్రమాలు.

| | | |
|---|---|---|
| 29-7-03 : విష్వక్సేనేష్టి | 30-7-03 : వైనతేయేష్టి | 31-7-03 : హయగ్రీవేష్టి |
| 1-8-03 : లక్ష్మీనారాయణేష్టి | 2-8-03 : సుదర్శనేష్టి | 3-8-03 : నారసింహేష్టి |
| 4-8-03 : మహాపూర్ణాహుతి. | | |

ఇష్టిహోమాలలో 5,116/- రూ॥లు చెల్లించి, అన్వయించి సిద్ధిని పొంది తరించండి.

**కైంకర్య వివరములు**

| | | |
|---|---|---|
| ఒక రోజు తదీయారాధనకు 500 మందికి | రూ. | 10,000/- |
| ఒక రోజు ప్రసాద కైంకర్యమునకు 2500 మందికి | రూ. | 10,000/- |
| ఒక రోజు హోమగుండ యాజమాన్యమునకు | రూ. | 1,116/- |
| ఒక రోజు ఐదు హోమగుండముల యాజమాన్యమునకు | రూ. | 5,116/- |
| అన్ని రోజులూ యజ్ఞ యాజమాన్యమునకు | రూ. | 10,000/- |
| 1-8-03 శ్రీ ఆండాళ్ తిరు॥ - గోదాపూజ, సామూహిక లక్ష్మీపూజా | రూ. | 58/- |
| 2-8-03 సామూహిక శ్రీకృష్ణాష్టోత్తర పూజా కార్యక్రమానికి | రూ. | 58/- |

ఇవియేకాక మీ కైంకర్యములను వస్తురూపములో కూడా సమర్పించి శ్రీ లక్ష్మీనారాయణుల కృపాకటాక్షములను, శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి పరిపూర్ణ మంగళాశాసనములను పొంది తరించండి

సదా ఆచార్య సేవలో
**జెట్, వికాసతరంగిణి**, రాజమహేంద్రి,
ఫోన్ : 0883 -2479000
E-mail : jetphuskar@yahoo.com





# బదరీనాథ్

మే నెల 8వ తేది ఉదయం గం॥ 4-00కు సూర్యభగవానుని దివ్య కిరణాలు హిమగిరి శృంగాలను తాకే వేళ, నీలగిరి పర్వత శిఖరం బంగారు కాంతులీనే శుభతరుణంలో బదరీనాథుని దివ్యదేవాలయంలో ద్వారాలను వేదఘోష, వాయిద్యాల ఘోషలతో తెరచి జ్యోతిర్దర్శనాన్ని భక్తులకు కావించారు. 6 నెలలు దేవతారాధనాకాలం సమాప్తమై... మానవారాధనలను స్వీకరించి తరింపచేయడానికి బదరీనాథుడు అనుగ్రహించి తన నిజరూపాన్ని దర్శింపచేసాడు. వేలాది భక్తులు బదరీ చేరి ఆ దివ్య క్షణాలననుభవించి తరించారు.

శ్రీ చిన్నజీయరుస్వామివారి మంగళాశాసనాలను గైకొని బదరీ చేరిన కుమారి ఉషశ్రీ మన అష్టాక్షరీ క్షేత్ర ద్వారాలను గూడ తెరచి, శ్రీశ్రీనివాస పెరుమాళ్ళను భాష్యకారులను క్షేత్రంలో వేంచేపుచేసి నిత్యారాధనను ఆరంభింపచేసారు. మన ఆగమ విద్యార్థి శ్రీమాన్ కూర్మనాథాచార్యులు స్వామి తిరువారాధనను ప్రారంభించారు. ఈసారి మరో ఇద్దరు ఆగమ విద్యార్థులు చిరంజీవులు వరప్రసాద్, హరికృష్ణలు ఆరాధనకు సహరిస్తూ, అనుష్ఠానం చేసుకొనే నిమిత్తం బదరీనాథ్ చేరారు. వారు కూడా శ్రద్ధగా సహకరిస్తున్నారు. క్షేత్ర తదీయారాధన బాధ్యతను శ్రీమాన్ శ్రీధరాచార్యులు చూస్తున్నారు. మిగిలిన నిర్వహణ కార్యక్రమాలు గతంలోని వారే కుమారి ఉషశ్రీకి సహకరిస్తున్నారు.

ఈసారి మనక్షేత్రంలో 9 అడుగుల ఎత్తున మంచుపడి ఉండటంవల్ల, విపరీతమైన చలి ఆక్రమించింది. పైగదులన్ని తెరచి, వాసయోగ్యంగ చేసారు. పైపులైన్లన్నీ పగిలిపోయాయి. కరెంటు లైన్లు ఊడిపోయాయి. యుద్ధప్రాతిపదికన వాటినన్నింటినీ 3 దినాలలో బాగుచేయించి, భక్తులకు యథోచిత సౌకర్యం కల్గించారు. వివిధ భక్తుల సేవగ పంపిన తదీయారాధన సామగ్రితో, ప్రసాదములను, తదీయారాధనను ప్రారంభించారు. మంచంతా తొలగించడానికి వారం రోజులు పట్టి ప్రస్తుతం మన క్షేత్రం పూర్తి ఉపయోగంలోకి వచ్చింది. ప్రతిరోజు సుమారు 3,4 వందలమందికి తదీయారాధన, 120 మంది వరకు సాధు సమారాధన సక్రమంగ జరుగుతున్నాయి. శ్రీ చిన్నజీయరుస్వామివారు 28, 29, 30 తేదీలలో బదరీనాథ్‌లో వేంచేసి ఉంటున్నారు. 29వ తేదీన **'బదరీ అన్నదాన శాఖా సంఘం'** సమావేశం కూడా ఈసారి యిక్కడ శ్రీస్వామివారు నిర్వహిస్తారు. సత్సంగ సదన పునర్నిర్మాణ కార్యక్రమాన్నిగూడ ఈ సందర్భంగా శ్రీస్వామివారు ప్రారంభిస్తారు.

హృషీకేశంలోని జీయరు మఠంలో వేదపాఠశాల సక్రమంగా జరుగుతున్నట్లు బదరీ వెళ్ళి తిరిగివచ్చే భక్తుల సేవ గూడ సక్రమంగ జరుగుతున్నట్లు వేదాధ్యాపకులు శ్రీమాన్ ఆర్. గోపాలాచార్యులుగారు తెలియచేసారు. నేపాలీ శ్రీమాన్ హరికృష్ణగారు వీరికి సహాయంగ యిక్కడనే ఈసారి ఉన్నారు.

# వికాస దర్శిని నివేదన

శ్రీశ్రీశ్రీ స్వామివారు ఝార్ఖండ్ రాష్ట్రంలో 'వనవాసీ కళ్యాణ కేంద్రం' కార్యక్రమములో పాల్గొనడానికి మే నెల 12వ తేదీ మధ్యాహ్నం మన సీతానగరం ఆశ్రమం నుండి బయలుదేరారు. మధ్యలో ఏలూరు సమీపంలో త్వరలో నిర్మించనున్న 135 అడుగుల శ్రీఅభయాంజనేయస్వామి విగ్రహ ప్రతిష్ఠకు నిర్ణయింపబడిన స్థలాన్ని పరిశీలించి అక్కడి కార్యకర్తలకు తగు సూచనలిచ్చారు. సా॥ 4 గం॥లకు రాజమహేంద్రిలో వికాసతరంగిణి వారు ఏర్పాటు చేసిన **'గోదావరి పుష్కర ప్రయుక్త బ్రహ్మ యజ్ఞ'** కార్యక్రమానికి పూర్వరంగంగా ఏర్పాటు చేసిన కార్యకర్తల సమావేశంలో పాల్గొన్నారు. స్థానిక టి.టి.డి. కళ్యాణ మండపంలో జరిగిన ఈ కార్యక్రమంలో డా॥ రాజారాంగారు పుష్కర సమయంలో సేవలు నిర్వహించవలసిన వివిధ విభాగాల నిర్వహణ బాధ్యత స్వీకరించిన కార్యకర్తల పేర్లు తెలిపారు. శ్రీస్వామివారు అందులో కొన్ని సవరణలు సూచిస్తూ, మహిళా కార్యకర్తలకి కూడా పురుషులతో సమానంగా నిర్వహణ భాధ్యత ఇవ్వాలి అన్నారు. సరిగ్గా 12సం॥ల క్రితం ఇదే పుష్కరసమయంలో యువవాలంటీర్ల శ్రద్ధాకృషులను ప్రోత్సహించి కొనసాగింపచేయాలన్న శ్రీస్వామివారి అనుగ్రహఫలంగా 'వికాసతరంగిణి' సంస్థ ఆవిర్భవించింది. అలాంటి మాతృస్థానంలో జరుపుకోబోతున్న ఈ పుష్కర మహోత్సవము చాలా జాగ్రత్తగా, మరింత కట్టుదిట్టంగా, మిగతా వికాసతరంగిణి శాఖలకు ప్రేరకంగా చేయాలని శ్రీస్వామివారు కార్యకర్తలను ఉత్తేజపరిచారు.

'వికాసతరంగిణి' అవతరించి 12 సం॥లు అవుతున్న సందర్భంగా ఇప్పటి వరకు వివిధ వికాసతరంగిణి శాఖలు చేసిన కార్యక్రమాల వివరాలను, సందర్శకులు చూడటానికి వీలుగా ఒక ఫొటో ప్రదర్శన, వీడియో ప్రదర్శన కూడా ఏర్పాటు చేయాలన్నారు. అంకితభావం కలిగిన 600 మంది వాలంటీర్లు ఉండాలన్నారు. వారంతా పుష్కరాలలోపు నాలుగైదు సార్లైనా కలిసి ప్రణాళిక తయారుచేసుకోవాలని, మంగళాశాసనాలు కృపచేసారు. రాత్రి 12 గం॥కు విశాఖ చేరి శ్రీమాన్ రమేష్‌గారింట బస చేసారు. రాత్రి ఒంటి గం॥కు శ్రీశ్రీశ్రీ రంగరామానుజ జీయరుస్వామివారు విచ్చేసి జూన్ 3వ తేదీన జరుగబోవు యతి సమ్మేళన వివరాలు తెలిపి శ్రీవారిని ఆహ్వానించారు. శ్రీవారాహ్వానాన్ని అంగీకరించారు.

13వ తేదీ రాత్రి 7 గం॥లకు శ్రీస్వామివారు హన్మాన్ పల్లి దగ్గరగా ఒరిస్సాలోని మాండియా గ్రామం చేరుకున్నారు. శ్రీమాన్ పరాంకుశం రమణారావుగారు, గ్రామవాసులంతా మేళ తాళాలతో భజనతో శ్రీస్వామివారికి స్వాగతం పలికారు. స్థానిక రామాలయాన్ని సందర్శించి అక్కడి వారి నుద్దేశించి 'అందరి హృదయ మందిరాల్లో రాముడు ఉన్నాడు. అతని స్మరణే నిరంతరం చేయాలి. ఎటువంటి జీవితాలనైనా దివ్యంగా మార్చే శక్తి రామనామానికే ఉందని' శ్రీస్వామివారు సందేశమనుగ్రహించారు. ఆ రాత్రికి అక్కడే బస చేసారు. మరునాటి ఉదయం ఆరాధనానంతరం హన్మాన్ పల్లి (శ్రీరమణారావుగారి స్వగ్రామము) వేంచేసారు. మధ్యలో బ్రాహ్మణ శాసన్





అనే ఒక పల్లెను సందర్శించారు. అక్కడ ఉన్నవాళ్ళంతా బ్రాహ్మణులేనట. కాని వారి సూత్రము, గోత్రము, ప్రవర ఏమీ తెలియవట. అదేమంటే మా పెద్దలు చెప్పలేదన్నారు. శుక్లయజుర్వేదానికి సంబంధించిన వారమని చెప్పారొకరు. స్వామీజీ వారితో మీ పిల్లలను కొంతమందిని మా వద్దకు పంపిస్తే వారిని వేదపండితులను చేసి మీ వద్దకు పంపిస్తామని అనగానే, వారు తప్పకుండా పంపిస్తామని అన్నారు.

హన్మాన్ పల్లి పునరుద్ధరించిన హనుమదాలయాన్ని సందర్శించి మంగళాశాసనం చేసారు. శ్రీమాన్ రమణారావుగారు హన్మాన్‌పల్లి పరిసరగ్రామాల్లో 27 వికాసతరంగిణులను ప్రారంభించి గీతాజ్యోతి కార్యక్రమాన్ని ప్రచారం చేసారు. ముఖ్యంగా ప్రతి గ్రామంలో ఒక ఉపాధ్యాయుడిద్వారా అక్కడి పిల్లలకు ఆసక్తి కలవారందరికి గీతాజ్యోతి శ్లోకమాలికలోని 48 శ్లోకాలను నేర్పించారు. శ్రీస్వామివారు హన్మాన్‌పల్లి వేంచేసిన సందర్భంగా 27 గ్రామాల నుండి వికాసతరంగిణి ప్రతినిధులు వచ్చి పాల్గొని స్వామివారి సూచనలు స్వీకరించి ఆచరణలో పెడతామని కార్యకర్తలందరు ప్రతిజ్ఞ చేసారు. ఈ గ్రామాల్లో ప్రచారం చేయడానికి శ్రీమాన్ రమణారావుగారికి, బరంపురం వికాసతరంగిణి కార్యకర్తలందరికీ మంగళాశాసనములందించి భువనేశ్వర్ మీదుగా 15వ తేదీ అర్ధరాత్రి ఒంటిగంటకు ఝార్‌ఖండ్ రాజధాని 'రాంచీ' నగరానికి చేరుకున్నారు.

## శ్రీవారి ఝార్ఖండ్ పర్యటన

బీహార్ నుండి 'ఝార్ఖండ్' ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడి రెండున్నర సంవత్సరములు అవుతుంది. మతాంతరీకరణ ముమ్మరంగా జరుగుతున్న ప్రాంతంగా ప్రసిద్ధిచెందిన 'ఝార్ఖండ్' రాష్ట్రంలోని ఆదివాసీ ప్రాంతాలను సందర్శించి, నైతిక ఆలంబన కోసం వారికి ఒక లక్ష హనుమాన్ ప్రతిమలతో కూడిన లాకెట్లను ప్రదానం చేయడం కోసం

శ్రీస్వామివారు అక్కడకు వేంచేసారు.

ఆర్.యస్.యస్.కు చెందిన 'వనవాసీ కళ్యాణ కేంద్రం' అనే సంస్థ రాంచీ కేంద్రంగా ఇక్కడే ఆదివాసీ ప్రాంతాలలో విద్యాలయాలు, వైద్యాలయాలు స్థాపించి విధర్మీయుల ప్రభావాన్ని తగ్గించడానికి, మన సనాతన ధర్మాన్ని తెలుపుతూ జనులను సంఘటిత పరచడానికి తీవ్ర కృషి చేస్తోంది. ప్రస్తుతం ఝూర్ఖండ్ రాష్ట్రంలో ఈ సంస్థ ముఖ్యనిర్వాహకులుగా శ్రీమాన్ సోమయాజులుగారు ఉన్నారు. వీరు గుంటూరు జిల్లాలోని చెరుకుపల్లి వాస్తవ్యులు. గత ధనుర్మాసంలో వీరు స్వామివారిని తమ కార్యక్రమాలను మంగళాశాసనం చేయడానికి ఝూర్ఖండ్ విచ్చేయమని ప్రార్థించారు.

హైదరాబాద్ శ్రీమాన్ చింతల రామచంద్రా రెడ్డిగారి అభ్యర్థన మేరకు శ్రీస్వామివారు మే 16 నుండి 21వ తేదీవరకు ఝార్ఖండ్‌లో పర్యటించడానికి సమయాన్ని కేటాయించారు. శ్రీమాన్ సోమయాజులు గారితోపాటు హైదరాబాద్ బి.జె.పి. అధ్యక్షులు శ్రీమాన్ రామచంద్రారెడ్డిగారు సాంప్రదాయిక వేషధారణతో ఈ ఆరు రోజులు శ్రీస్వామివారితో పర్యటనలో పాల్గొన్నారు. గీతాజ్యోతి స్టిక్కర్స్‌ని, హనుమాన్ ప్రతిమలను శ్రీస్వామివారితో అందరికీ ఇప్పించారు.

వనాలు, గ్రామాలే దేశసంస్కృతిని, ఉన్నతిని చాటడానికి పట్టుకొమ్మలు. కేవలం నగరాల అభివృద్ధి, పారిశ్రామిక ప్రగతులవల్లనే దేశాభివృద్ధి ముడిపడిఉందనుకోవడం అవివేకం. వనాలను రక్షించుకొంటూ, మారుమూల గ్రామాలలోని ప్రజలకు అందుబాటులో ఉన్న వనరులను సదుపయోగం చేసుకొనే విధానం తెలుపడం విలువలు నిండిన విద్య, వైదిక సంస్కారాల పట్ల అవగాహనల ద్వారా వారిలో వికాసాన్ని కలిగించాలి. దురాచారాలైన త్రాగుడు, జూదం వంటి వాటికి దూరంగా, సంఘటితంగా ఉంటూ తమ తమ సమస్యలను తామే పరిష్కరించుకొంటూ గ్రామీణ ఆరోగ్యాన్ని దృఢంగ ఉంచుకోగలగాలి. ఈ విధంగా గ్రామ వికాసం వన్యవాతావరణ సంరక్షణ తద్వారా దేశ వికాసం జరుగుతుంది.

ఆదివాసీయులను అవసరాలకు వాడుకోవడం, వారి బాగోగులంతా పేపర్లమీదే తప్ప ప్రత్యక్షంగామాత్రం దానికి విరుద్ధంగా ఉంటుంది. ఆదివాసీయులకు కేటాయించిన కోట్ల రూపాయల నిధులు, వనరులు వారివరకు చేరనే చేరవు. ఇది అదనుగా విధర్మీయులు ఆ ప్రాంతాలలో ప్రవేశించి వారికష్టాలు తీర్చి విద్య, వైద్యం, తిండివంటి ప్రాథమిక అవసరాలు తీర్చి మతాంతరీకరణ చేస్తున్నారు. ఇదెంతో బాధించే విషయం.

వీరి ప్రభావాన్ని తగ్గించడానికి 'వనవాసీ కళ్యాణ కేంద్రం' చేస్తున్న కృషిని సందర్శించి, మీ వెనుక మేం ఉన్నాం అని నైతిక ఆలంబనను అభయహస్తాన్ని అందించడమే శ్రీవారి ఝూర్ఖండ్ పర్యటన లక్ష్యం.

ఆంధ్రప్రదేశ్‌లో ప్రారంభించే గిరిజన గురుకుల పాఠశాల నిర్వహణానుభవానికి శ్రీవారి ఝూర్ఖండ్ పర్యటన ఉపయోగపడింది.

12వ తేదీ మధ్యాహ్నం సీతానగరం నుండి బయలుదేరిన శ్రీస్వామివారు వైజాగ్, భువనేశ్వర్‌ల మీదుగా 15 రాత్రి 1 గం॥కు ఝూర్ఖండ్ రాష్ట్ర రాజధాని 'రాంచీ' నగరానికి చేరుకొని 'వనవాసీ కళ్యాణ కేంద్ర' ముఖ్యకార్యాలయంలో బస చేసారు. ఈ పర్యటనలో భాగంగా శ్రీవారు 16వ తేదీన తప్కారా గ్రామంలోని ఆదివాసీయులను అక్కడి బీర్‌సా శిశువిద్యాలయాన్ని సందర్శించారు. 'బీర్‌సా ముండా' అనే గిరిజన నాయకుడి నిలువెత్తు విగ్రహం అక్కడ ఉంది. ఝూర్ఖండ్‌లో చాలాచోట్ల మనం ఇతని విగ్రహాన్ని చూడవచ్చు. ఝూర్ఖండ్‌లో 'ముండా'తెగ ఆదివాసీయులు అధికం. ఆ తెగకు చెందిన మిగిలిన





వనవాసీయులందరికీ ప్రాతినిధ్యం వహించిన ఇతడు వంద సం॥ల క్రితం అల్లూరి సీతారామరాజువలే బ్రిటీష్‌వారితో స్వాతంత్ర్యం కోసం వీరోచితంగా పోరాటం సల్పి వీరమరణం పొందిన మనీషి. బ్రిటీష్‌వారు ఇతణ్ణి జైలులోపెట్టి విషమిచ్చి చంపారట. 'భగవాన్ బీర్‌సా ముండా'గా కొలిచే ఇతని విగ్రహానికి మాలార్పణతో పర్యటన ప్రారంభమైంది. తప్‌కారాలో రెండు గం॥ ఉండి అక్కడి నుండి 'సాలెహాతు' అనే గ్రామంలోని ఆదివాసీయులను అక్కడి విద్యాలయాన్ని కూడ శ్రీస్వామివారు సందర్శించారు. ఇక్కడి చిన్నారులు 'మూక సందేశ్' అనే వింతకళను ప్రదర్శించి స్వామివారిని ఆశ్చర్యచకితులను చేసారు. ఒక కాగితంపై 'GOD IS IN OUR HEART IF REALISED SUCCESS IS OURS' అని శ్రీస్వామివారి వ్రాసివ్వగా ఒక విద్యార్థి 10 మీ॥ దూరంలో ఉన్న మరొక విద్యార్థికి సంజ్ఞల ద్వారా తెలుపగా ఒక్క తప్పులేకుండా బోర్డుపై వ్రాసి శ్రీస్వామివారి మంగళాశాసనములు అందుకున్నారు. ఇలా హిందీ భాషలోకూడా వ్రాసారు. ఇలా ఆరురోజులు రాష్ట్రరాజధాని రాంచీ నగరం నుండి 200కి.మీ పరిధిలో ఉన్న వివిధ వనవాసీ గ్రామాలను వారి జీవన విధానాలను శ్రీస్వామివారు పరిశీలించారు.

'వనవాసీ కళ్యాణ కేంద్ర' సంస్థ మొత్తం 600 ఏకోపాధ్యాయ పాఠశాలలను 91 శిశుమందిరాలను వ్యయప్రయాసలకోర్చి విజయవంతంగా నిర్వహిస్తోంది. వీటిలో 14000 మంది విద్యార్థులు పాఠ్యాంశాల తోపాటు సాంస్కృతిక ధార్మిక శిక్షణ కూడా స్వీకరిస్తున్నారు. శ్రీస్వామివారు సందర్శించిన ప్రతిచోట ఆదివాసీ విద్యార్థులు తమ పరంపరాగతమైన సంప్రదాయ నృత్య గీత వాద్యములతో స్వాగతించారు. వారి భక్తిశ్రద్ధలు ప్రకటించారు. ఇక్కడి గ్రామ ప్రముఖులు చూడటానికి వీరేమి మాట్లాడుతారులే అన్నట్లు కన్పిస్తారు. కానీ సభలో స్వామివారి ముందు ఏమాత్రం తడుముకోకుండా, నేర్పుగా, మధురంగా మాట్లాడడం చాలా ఆశ్చర్యకరమైన విషయం. వందన సమర్పణ కూడా చాలా బాగా చేసి శ్రీవారి మంగళాశాసనాలు పొందారు. అక్కడి విద్యార్థులు అనేక సాంస్కృతిక కార్యక్రమాలు ప్రదర్శించి స్వామివారి ప్రేమను చూరగొన్నారు.

స్వాతంత్ర్యం వచ్చి 55 సం॥లు అయిన ఈ ప్రాంతంలో చాలా గ్రామాలకు విద్యుత్ సౌకర్యంలేదు. కనీస అవసరాలకు చాలా దూరంగా ఉన్నారు. నాగరిక ప్రపంచానికి అత్యంత దూరంగా అడవుల్లో ఉన్నా వారిలోని ధార్మికత, దేశభక్తి,

దైవభక్తి, ప్రాచీనపరంపరపై విశ్వాసం ఆశ్చర్యాన్ని కల్గిస్తాయి. ఈ విధమైన వారి విశ్వాసమే దేశాన్ని కాపాడుతుంది అన్నారు శ్రీస్వామివారు. ఝార్ఖండ్ ఆదివాసీ ప్రాంతాలలో 'సంథాల్', 'ముండా', 'హో', 'నగేస్యా', 'పహాడియా', 'ఉరావ్', 'బిర్జియా', 'అసుర్', 'కొరవ', 'పరహియా', 'బిడ్‌హోర్', 'లోహ్రా', 'ఖాడియా', 'భోక్తా', 'గోండు', అనే జాతులు కలసి నివాసం చేస్తున్నాయి. ప్రభుత్వాలు పట్టించుకోకున్నా, ఆర్థికంగా కడుగదీనస్థితి తాండవిస్తున్నా, విధర్మీయుల వత్తిడి భరించరానంత ఉన్నా మన సనాతన వైదిక ధర్మాన్ని వదలకుండా పాటించుకుంటున్నామని వారి ద్వారానే శ్రీస్వామివారు విని చాలా ఆనందించారు.

ఆ మరునాటి ఉదయం శ్రీస్వామివారు రాంచీ నగరంలోని మన తెలుగువారు నిర్మించుకున్న రామాలయాన్ని సందర్శించి తెలుగు భాషయొక్క గొప్పతనాన్ని వివరించి మంగళాశాసనాలు కృపచేసారు.

అనంతరం 'కరుణ' అనే పేరుతో వనబంధు పరిషత్‌వారు నిర్వహిస్తున్న అనాథ శరణాలయాన్ని సందర్శించారు. చాలా చిన్నపిల్లలు, ఒక ముగ్గురు పసికందులు కూడా ఉన్నారు. స్వామివారు వారితో కొంత సమయం ఆనందంగా గడిపి, వారి బాగోగులు చూస్తున్న డా॥ మహేష్ మధ్వానిగారిని అభినందించారు. ప్రక్కనే ఏకోపాధ్యాయ పాఠశాల అధ్యాపక శిక్షణ శిబిరాన్ని సందర్శించారు. 'మీరందరు హనుమంతుని వలె పౌరుషం, విక్రమం, బుద్ధి కలిగి ఉండి దుష్కరకార్యములను సాధించాలి.' అని అక్కడి కార్యకర్తలను ఉద్దేశించి శ్రీస్వామివారు మంగళాశాసనములను చేసారు. మధ్యాహ్నం పార్లమెంటు సభ్యులు శ్రీమాన్ వ్రజ్ మోహన్ రామ్‌గారు శ్రీస్వామివారి సేవించు కున్నారు.

సాయంకాలం 5గం॥లకు 'బుండుబేడా' అనే వనవాసీ గ్రామాన్ని సందర్శించారు. రాంచీ చేరుకున్నాక ఎ.యస్.పి. శ్రీమాన్ యమ్.వి. రావుగారు శ్రీవారిని సేవించుకున్నారు. వీరు గుంటూరు వాస్తవ్యులేనట. ఎలాంటి వత్తిడులకు వెరవకుండా విధినిర్వహణ చేయగల అధికారి అని సోమయాజులుగారు చెప్పగా స్వామివారి విని సంతోషించి మంగళాశాసనాలు చేసారు.

18వ తేదీ ఆదివారం ఉ॥ 10 గం॥లకు వనవాసీ కళ్యాణ కేంద్ర కార్యాలయం ముందే 'రాంచీ మహానగర సమితి' వారందరూ సమావేశమయ్యారు. శ్రీస్వామివారు సందేశాన్ని కృపచేస్తూ గీతాజ్యోతి కార్యక్రమాన్నికూడా పరిచయం చేసారు. పచ్చని చెట్లక్రింద చక్కటి ఆశ్రమవాతావరణాన్ని తలపింపచేసే దృశ్యం దీన్ని చూసి స్వామివారు ఈ దృశ్యం నైమిశారణ్యాన్ని తలపింప చేస్తోందన్నారు.

అనంతరం పత్రికావిలేఖరుల సమావేశం జరిగింది. అన్ని ప్రధాన పత్రికా విలేఖరులు, ప్రముఖ టి.వి. ఛానల్సు వాళ్ళు ఇందులో పాల్గొన్నారు. శ్రీస్వామివారు తమ ఝార్ఖండ్ పర్యటనా విశేషాలను తెలిపారు. రాంచీ నుండి 120 కి.మీ. దూరంలోని 'నౌడీహ' అనే గ్రామాన్ని సందర్శించి 'ప్రాంతీయ ఆచార్య సమ్మేళనం'లో పాల్గొని, అధ్యాపకుల పాత్ర, సమాజాభివృద్ధికి, ప్రగతికి ఎంత ముఖ్యమో హృదయానికి హత్తుకునేట్టుగా వివరించారు. సహనశీలత అనేది అధ్యాపకునికి చాలా అవసరం విద్యార్థులను రాముడు, కృష్ణుడు, గార్గి, మైత్రేయిల వలె తీర్చిదిద్దాలని సందేశాన్నందించారు. ఈ సమ్మేళనాన్ని ఏర్పాటు చేసిన ప్రాంతీయ శిక్షాప్రముఖ్ శ్రీమాన్ వ్రజమోహన్ మండల్ జీని, నిరీక్షక్ శ్రీమాన్ సుభాష్ చంద్ర దూబే గారిని అభినందించి అందరికీ మంగళాశాసనాలు, హన్మాన్ లాకెట్‌లను అందించారు.

19వ తేదీ, ఉ॥ తీర్థగోష్ఠిలో గ్రామీణ రహదారుల మంత్రి శ్రీమాన్ నీలకంఠ్ సింగ్ ముండా శ్రీవారిని





సేవించుకుని మంగళాశాసనాలు పొందారు. అనంతరం శ్రీస్వామివారు 150 కి.మీ. ప్రయాణించి మహావీర్‌టోలీ అనే వనవాసీ గ్రామం చేరుకున్నారు. స్థానిక భజనబృందాలు నాగ్‌పురి భాషలో భజనగీతాలు శ్రావ్యంగా ఆలపించారు. ఏకల్ విద్యాలయం పిల్లల్లో ప్రదీప్ కుమార్‌అనే విద్యార్థి శ్రీస్వామివారిని కీర్తిస్తూ తన అనుభవాన్ని నిర్భయంగా చాలా బాగా చెప్పాడు. శ్రీస్వామివారు తమ సందేశాన్ని అందిస్తూ ఈ రోజు గుహుని యొక్క ఆస్థానానికి వచ్చిన అనుభూతి కలుగుతోందన్నారు. రోజూ తల్లియొక్క ఆశీర్వాదం తీసుకొనే మీ దిన చర్యను ప్రారంభించండి. తల్లి ఆశీర్వాదంతో సాధించలేనిదంటూ లేదని మంగళాశాసనం చేసి గుంలా నగర పరిసరాలలోని 'వాల్మీకి ఛాత్రావాస్'లను సందర్శించారు. అనంతరం శ్రీ పవన్‌కుమార్ మంత్రిగారి గృహంలో పాదపూజ స్వీకరించి రాత్రికి రాంచీ చేరుకున్నారు.

20వ తేదీ ఉ॥ శ్రీస్వామివారు వనవాసీ కేంద్ర ప్రముఖులు శ్రీమాన్ సతీష్ చంద్ర భార్గవ్‌గారి గృహానికి వేంచేసారు. అనంతరం 90 కి.మీ.ప్రయాణించి లోహర్‌దగా నగరంలోని 'బీర్‌సా' వైద్యాలయాన్ని సందర్శించారు. ఇదే ఆవరణలో నూతనంగా నిర్మించిన ప్రార్థనా మందిరాన్ని ఉద్ఘాటన కావించి హనుమంతుని విగ్రహాన్ని ఆవిష్కరించారు. హనుమంతుడు ఆచార్య స్వరూపమని చూడటానికి ఆచార్యులు మనలాగే అనిపించినా, వారి చేసే దుష్కరకార్యములను బట్టి ఆశ్చర్యకర చేష్టలను బట్టి వారి విలక్షణతను గుర్తించవచ్చని సందేశమిచ్చి అక్కడి వైద్యసేవా సమితివారికి మంగళాశాసనం చేసారు. వారి ప్రార్థనపై వైద్యాలయ నిర్మాణ లోపాలను సూచించి త్వరలో వాటిని సరిచేస్తే పూర్వవైభవం వస్తుంది, ఇంకా బాగా సేవలందించ గలుగుతారని మంగళాశాసనాలు చేసారు. సమీపంలోని మహిళా గృహ ఉద్యోగ కేంద్రాన్ని కూడా సందర్శించారు.

సా॥ 4-30 ప్రాంతంలో 'గజనీ' అనే వనవాస గ్రామాన్ని సందర్శించారు. అక్కడ సందేశమిస్తూ మన ధర్మాన్ని సంస్కృతిని కాపాడుకోవడానికి దురభ్యాసాలకు దూరంగా ఉండాలని శ్రీస్వామివారు సూచించారు. రాత్రికి రాంచీ చేరుకున్నారు.

21వ తేదీ ఉ॥ తీర్థగోష్ఠిలో వనమంత్రి శ్రీమాన్ జమునాసింగ్, సెక్రటేరియేట్ వ్యవహారాల మంత్రి శ్రీమాన్ సుదర్శన్ భగత్‌గారు, శ్రీస్వామివారిని సేవించుకున్నారు. వనమంత్రిగారు చేసిన సేవలను శ్రీస్వామివారు శ్లాఘించారు. మన రాష్ట్రంలో ఎంతో ప్రగతి సాధిస్తున్నామంటూ రోడ్స్ వైడెన్ చేస్తున్నామంటున్నారు. అందులో భాగంగా చక్కటి

నీడనిచ్చే చెట్లన్నిటినీ కొట్టివేస్తున్నారు. కానీ అక్కడ రోడ్డుకు పది అడుగులు అటు ఇటు కూడా స్థలాన్ని వదలివేసి మొక్కలను నాటించి వాటి రక్షణకోసం కంచె వేయించారు. అందులోను ఏవేవో మొక్కలు వేయడం కాక ఫలవృక్షాలైన, ఉపయోగ కరములైన పనస,మామిడి, వేప లాంటి మొక్కలనే వేసారు. వాటి సంరక్షణార్థం తక్కువ ఖర్చుతో అయ్యేవిధంగా రోడ్డుకిరువైపులా కర్రలతో కంచె వేయించారు. మన రాష్ట్రంలో ప్రగతి మాటల్లో మాత్రమే వినిపిస్తూంటే ఇక్కడ ప్రగతి ప్రాక్టికల్‌గా కనిపిస్తుందని వనమంత్రిగారు అన్న మాటలు అక్షరాల నిజమనిపించింది వాటిని చూస్తుంటే. ఝార్ఖండ్‌లోని 'బెట్లా'ప్రాంతంలో ఏనుగుల ఉద్యానవనం చాలా బాగా అభివృద్ధి చేసాం. ఇంత వరకు రాష్ట్రప్రగతి కాగితాలపై ఉండేది ఇప్పుడు ప్రత్యక్షంగా చూపుతున్నాం. మీరు తప్పకుండా చూడాలి అని వన మంత్రిగారు శ్రీస్వామివారిని అభ్యర్థించారు. మళ్ళీ వచ్చినపుడు తప్పకుండా చూస్తామని శ్రీస్వామివారు చెప్పారు.

'వనవాసీ కళ్యాణ కేంద్రం' ముఖ్య కార్యాలయం రాంచీ నుండి బయలు దేరుతున్న సందర్భంగా కార్యకర్తలు, పిల్లలు, మహిళలు నృత్యగీత వాద్యములతో చాలా వైభవంగా వీడ్కోలు పలికారు. ప్రముఖ కార్యకర్తలందరికీ శ్రీస్వామివారు పేరు పేరున మంగళా శాసనాలను అందించారు. మధ్యాహ్నం 12-30 ని॥లకు చాండిల్ అనేగ్రామంలోని శిశుమందిరాన్ని సందర్శించి చిన్నారులందరికీ చక్కటి సందేశాన్ని అందించారు. సాయంకాలం టాటానగర్‌లోని శ్రీమాన్ అశోక్ అగర్వాల్‌గారి గృహానికి వేంచేసారు. స్నానం సంధ్యావందనం పూర్తిచేసుకొని స్థానికంగా ఆంధ్రా అసోషియేషన్ శ్రీరామాలయాన్ని, శ్రీ వేంకటేశ్వర ఆలయాన్ని బ్రహ్మోత్సవాల సందర్భంగా సందర్శించి గీతాజ్యోతి సందేశాన్ని అందించారు.

## ప్రతిష్ఠాపూర్వక మహాకుంభాభిషేకములు
### భద్రాచలం

ది. 21-5-2003 నుండి 25-5-2003 వరకు భద్రాచలం, శ్రీసీతారామచంద్రస్వామి వారి దేవస్థానంలో శ్రీ ఆండాళ్, ఆళ్వారుల, విగ్రహ ప్రతిష్ఠలు, తూర్పు, దక్షిణ, ఉత్తర ద్వార గోపుర కుంభాభిషేకములు నిర్వహించ బడినాయి.

ది. 23-5-2003 మ॥ 3గం॥లకు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు ప్రతిష్ఠా మహోత్సవాలను పర్యవేక్షించి మంగళాశాసనములు చేయుటకు విచ్చేసారు. శ్రీస్వామివారికి మన శ్రీ జీయర్ మఠంలోనే వసతి ఏర్పాటు జరిగింది. సా॥ గం॥ 7-00 లకు దేవస్థానం ఇ.ఓ., డి. మురళీధర రెడ్డి దంపతులు, ఆలయ ప్రధానార్చకులు ఆహ్వానించగా శ్రీస్వామివారు ఆలయానికి వేంచేసి పెరుమాళ్ళను సేవించుకుని, ఆ రోజు ప్రతిష్ఠా కార్యక్రమంలోని జలాధివాసాన్ని జరిపించి మఠానికి వేంచేసారు.

ది. 24-5-2003న శ్రీజీయర్ మఠంలో ఉ॥ 7-00గం॥లకు తీర్థగోష్ఠి నిర్వహించుకొని భద్రాచలంలోని శ్రీయోగానంద లక్ష్మీనృసింహ స్వామివారి కోవెలకు వెళ్ళి సేవించుకొన్నారు. అక్కడి నుండి శ్రీ సీతారామచంద్ర స్వామివారి దేవస్థానమునకు విచ్చేసిన శ్రీస్వామివారిని ఆలయం అధికారులు, అర్చకులు, వేదవిద్వాంసులు ఆలయమర్యాదలతో స్వాగతించారు. ప్రతిష్ఠా మూర్తులకు జరుగు కర్మాంగ స్నపనంలో పాల్గొన్నారు. దేవస్థానం పాఠశాలలో సంస్కృతాధ్యాపకులైన శ్రీమాన్ యస్.టి.జి. శ్రీమన్నారాయణాచార్య స్వామివారి గృహానికి వారి ఆహ్వానంపై వేంచేసి వారికి మంగళాశాసనములు చేశారు.

మ॥ గం॥ 3-30లకు శ్రీ జీయర్ మఠంలో నిర్వహింపబడిన నూతన జీయర్‌మఠ సభ్యుల





సమావేశంలో పాల్గొని మత అభివృద్ధికి 'గీతాజ్యోతి' ప్రచారానికి తగిన సూచనలను సభ్యులకు చేశారు.

సా॥ 7-00గం॥లకు దేవస్థాన కల్యాణ మండపం గ్రౌండ్‌వద్ద ఏర్పాటు చేయబడిన ఉపన్యాస వేదికపై శ్రీశ్రీశ్రీ స్వామివారు భక్తుల నుద్దేశించి ఆళ్వారుల వైభవాన్ని గురించి తమ దివ్య సందేశాన్ని అనుగ్రహించి, లయన్స్ క్లబ్ వారి కార్యక్రమాలలో విశిష్ట అతిథిగా పాల్గొని లయన్స్ నుద్దేశించి తమ సందేశాన్ని అనుగ్రహించారు. సుమారు రాత్రి గం॥ 10-30 ని॥లకు ప్రతిష్ఠలలో 'తత్త్వన్యాస' కార్యక్రమాన్ని పర్యవేక్షించి మఠానికి విచ్చేసారు.

ది. 25-5-2003న ప్రతి ఆదివారం దేవస్థానంలో శ్రీ సీతారామచంద్రస్వామివారి మూల మూర్తులకు నిర్వహింపబడు అభిషేక కార్యక్రమంలో శ్రీస్వామివారు ప్రత్యేకంగా పాల్గొన్నారు. ప్రతి ఆదివారం ఉ॥ గం॥ 7-00లకు ఈ అభిషేకం నిర్వహింప బడుతుంది. కానీ, ప్రతిష్ఠా మహోత్సవాల కారణంగా ఒక గంట ముందుగా 6-00గం॥లకే దీనిని నిర్వహించటం జరిగింది. శ్రీసీతారామ లక్ష్మణ స్వాముల మూలమూర్తులకు శ్రీస్వామివారే స్వయంగా ప్రధాన అర్చకులతోపాటు అభిషేకాన్ని నిర్వహించటం గొప్ప విశేషం. ఈ సందర్భంగా శ్రీశ్రీశ్రీస్వామివారి శిష్యులు, హైదరాబాద్ వాస్తవ్యులైన శ్రీమాన్ రవిదేవ్‌గారు శ్రీస్వామివారి కరకమలముల మీదుగా బంగారు తులసీ దళాలను దేవస్థానానికి సమర్పించారు. బంగారు తులసీదళాలతో శ్రీస్వామివారే స్వయంగా అలంకారానంతరం అష్టోత్తరశతనామ పూజను నిర్వహించారు. ఈ సందర్భంగా శ్రీస్వామివారి శిష్యురాలు, హైదరాబాద్ వాస్తవ్యురాలు అయిన డాక్టర్ శ్రీమతి శోభా జయంత్, శ్రీమతి వనజా భాస్కరరావుగార్లు పెరుమాళ్ళకు 11,000/- రూ. ఖరీదుచేసే పట్టువస్త్రాలను శ్రీస్వామివారి దివ్య హస్తముల మీదుగా సమర్పించారు. అభిషేకానంతరం శ్రీస్వామివారు మఠానికి వేంచేసి, పెరుమాళ్ళకు తిరువారాధన సమర్పించి తీర్థగోష్ఠి నిర్వహించారు.

మ॥ గం॥ 11-45ని॥లకు కోవెలకు వేంచేసి పూర్ణాహుతిలో పాల్గొన్నారు. అనంతరం మ॥ గం॥ 12-08 ని॥లకు శ్రీఆండాళ్, ఆళ్వారుల విగ్రహ ఆలయ ప్రతిష్ఠను ముగించి, మ॥ గం॥ 12-45 ని॥లకు తూర్పు, దక్షిణ, ఉత్తర ద్వార గోపుర కుంభాభిషేకాన్ని నిర్వహించారు. ఎంతో శ్రద్ధతో ప్రతిష్ఠా కార్యక్రమాలను జరిపించిన ఆలయ ఇ.ఓ. శ్రీమాన్ డి. మురళీధర రెడ్డిగారికి, ప్రధానార్చకులకు, స్థానాచార్యులకు ప్రతిష్ఠలో పాల్గొన్న ఋత్విక్కులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేసారు. ప్రతిష్ఠా కార్యక్రమానికి విచ్చేసిన శ్రీస్వామివారి కార్యక్రమాలను జీయర్ మఠం అధ్యక్షులు శ్రీమాన్ పి. జనార్దన భట్టర్, కార్యదర్శి శ్రీమాన్ జి. వెంకటాచార్యులు, సభ్యులు శ్రీమాన్ ఇ. రంగారావు గారులు, తదితర సభ్యులు క్రమబద్ధంగా నిర్వహింపచేశారు.

### గుంటూరు జిల్లా

**పొనుగుపాడులో :-** తత్త్వప్రచారకులు శ్రీ **హైమవతి**గారి ప్రచారంతో ప్రభావితమైన ఈ గ్రామంలో **గీతాజ్యోతి** గోష్ఠిప్రారంభమై చక్కని కార్యక్రమాలను నిర్వహించింది. శ్రీమతి కొదమగుళ్ళ లక్ష్మీగారు నిర్వహించిన శిబిరంలో గీతాజ్యోతి శ్లోకాలతో పాటు శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రాన్ని కూడ చాలామంది గ్రామస్థులు నేర్చుకున్నారు. సుమారు 20 మంది మహిళలు భగవద్గీతను పూర్తిగా నేర్చుకున్నారు. వీరిలో **పుట్టుగ్రుడ్డిఅయిన శ్రీ కట్టా పార్వతి (32సం॥ములు) లక్ష్మీ గారి వద్ద గీతను నేర్చుకుని కంఠస్థంచేయడమే కాకుండా, అన్ని అధ్యాయాలలోని శ్లోక సంఖ్యను చెప్పడం ఎంతో ఆశ్చర్యం! ఆమె ఇదే విధంగా సహస్రనామస్తోత్రాన్ని కూడ అధ్యయనం చేసింది.** ఇదంతా శ్రీస్వామి వారి అనుగ్రహమని, లక్ష్మీగారి బోధనా పుణ్యమని అంటోంది.

### తూర్పుగోదావరి జిల్లా

**చేబ్రోలు :-** తూర్పుగోదావరిజిల్లా చేబ్రోలు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో చేబ్రోలు గ్రామంలో ఉచిత కంటివైద్యశిబిరం నిర్వహించబడినది. ఈ కార్యక్రమంలో 230మందికి పరీక్షలు నిర్వహించి 60 మందికి కంటి ఆపరేషన్లు నిర్వహించినారు. శ్రీమాన్ డా॥సీతారామస్వామిగారు తమ మారుతి నర్సింగ్‌హోం ఆధ్వర్యంలో తమ ఘనమైన వైద్య సేవలను అందజేయుచున్నారు.

**వీరభద్రాపురం :-** తూర్పుగోదావరి జిల్లా వీరభద్రాపురం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం వైభవంగ నిర్వహించారు. శ్రీవెంకటేశ్వర దేవాలయంలో సాయంత్రం శ్రీవిష్ణుసహస్ర నామ పారాయణ, ఆధ్యాత్మిక ప్రవచనములు జరిపారు. శ్రీలంక పాపారావు దంపతులచే శ్రీజీయర్ చలివేంద్రము ఏర్పాటుచేసి వేసవి దాహార్తిని తీర్చుచున్నారు. శ్రీమాన్ వరదాచార్యులు పర్యవేక్షణలో కార్యక్రమ ములు నిర్వహించుచున్నారు. ఈ కార్యక్రమంలో లంక సత్యవతి, లక్ష్మణస్వామి యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

### చిత్తూరు జిల్లా

**యం.కొత్తూరు :-** చిత్తూరు జిల్లా తిరుపతి ధర్మక్షేత్ర కేంద్రముగా గీతాజ్యోతి ప్రచార కార్యక్రమంలో భాగంగ యం.కొత్తూరు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో నగరి గ్రామంలో ఉన్న శ్రీ కరియ మాణిక్యం స్వామివారి దేవాలయంలో శ్రీస్వామివారి శిష్యులైన శ్రీమాన్ శాంతారాం గారిచే గీతాజ్యోతి కార్యక్రమం మూడు రోజుల పాటు జరిగింది. కుల, మత, విపక్షలకు అతీతంగ దేశ సమైక్యతను ఆశిస్తూ సకల ప్రాణికోటికి సేవ చేయడమే మాధవసేవ అవుతోందని భక్తులకు వివరించినారు. ఈ కార్యక్రమాలు పి.పాపట్‌రావు, చిత్తూరు జిల్లా గీతాజ్యోతి కన్వీనర్ యన్. నాగేంద్రశాయి, కుప్పుస్వామి, సుధాకర్, ధనుంజరావులు పాల్గొన్నారు.

### కరీంనగర్ జిల్లా

**కరీంనగర్:-** కరీంనగర్ పట్టణ వావిలాలపల్లి, ఆండాళ్‌గోష్ఠి, విద్యానగర్, సప్తగిరికాలనీ వికాస తరంగణిశాఖల ఆధ్వర్యంలో శ్రీభగవద్రామానుజుల వారి తిరునక్షత్రోత్సవమును వైభవంగ నిర్వహించుచున్నారు. శ్రీమాన్ అమరవాది వేంకటనరసింహచార్య స్వామివారు భగవద్రామానుజుల వైభవముగూర్చి వివరించినారు. ఈ కార్యక్రమమునకు శ్రీమాన్ నారాయణరావు, శ్రీప్రభాకర్‌రావు,గౌతంరావు, టి.రంగాచార్యులు యితర ముఖ్యులు పాల్గొన్నారు.

**సప్తగిరికాలనీ :-** కరీంనగర్ పట్టణ సప్తగిరి వికాసతరంగిణి శాఖ కార్యకర్తలు 4వ తేదీన సుల్తానాబాద్ ధర్మక్షేత్ర సేవా కార్యక్రమంలో ఉత్సాహంగ పాల్గొని శ్రీస్వామివారి మంగళా శాసనములు అందుకున్నారు.





### ఖమ్మం జిల్లా

**ఖమ్మం :-** ఖమ్మం ధర్మక్షేత్రప్రచార కార్యక్రమంలో భాగంగ ఏప్రిల్ భక్తినివేదన పత్రికలో బదరీక్షేత్రానికి 70 క్వింటాళ్లు బియ్యం అవసరమన్ని ప్రకటనకు స్పందించి వికాసతరంగణి శాఖ $16^{1/2}$ క్వింటాళ్ల బియ్యం నకు సరిపడ 25,000రూ॥ భక్తుల తరఫున బదరీనాథ్ పెరుమాళకు సమర్పించినారు.

భగవద్రామానుజుల తిరునక్షత్రోత్సవ సందర్భముగ శ్రీవేంకటేశ్వరస్వామివారి దేవస్థానమునందు "తిరువాయ్ మొజి" సేవించి తిరునక్షత్ర వేడుకలను వైభవంగ నిర్వహించుచున్నారు. ఈ కార్యక్రమాలు జయప్రద, కృష్ణమూర్తిగార్లు సౌజన్యంతోజరిగాయి.

### కృష్ణా జిల్లా

**జగ్గయ్యపేట :-** కృష్ణాజిల్లా జగ్గయ్యపేట ధర్మక్షేత్ర ప్రచారకార్యక్రమంలో భాగంగ ఎంబెరుమానారు తిరునక్షత్రంసందర్భముగా స్థానిక గవర్నమెంట్ హాస్పటల్ యందు రోగులకు పాలు, రొట్టెలు ఉచితంగ పంపిణిచేసినారు. గీతాజ్యోతి సందేశాన్ని వివరించి రంగనాథస్వామిఆలయంలో శ్రీభగవద్రామానుజాచార్య స్తోత్రములు వందల మందితో సామూహిక పారాయణం చేసారు. 11-05-03 స్థానిక వరదరాజస్వామి ఆలయం వద్ద వైశాఖ మాస సందర్భముగా పేదలకు తదీయారాధన, పాదరక్షలు ఉచితంగా పంపిణీ చేసారు. గీతాజ్యోతి ప్రచార విభాగప్రెసిడెంట్ శ్రీరాంవిజయలక్ష్మీ పర్యవేక్షిస్తున్నారు.

**మల్లికార్జునపేట :-** విజయవాడ పట్టణ మల్లికార్జున పేట వికాసతరంగణి శాఖ ఆధ్వర్యంలో 11వ తేదిన రాణిగారి తోట, కొత్తవంతెన సెంటర్, కొత్తబస్టాండ్, కనకదుర్గ అమ్మవారి గుడిమెట్లవద్ద, రాజస్థాని స్కూలువద్ద వేసవి చలివేంద్రాలను ఏర్పాటు చేసినారు. శ్రీమాన్‌డా॥O.V.Dప్రసాద్ గారు, L.షణ్ముఖరావు, నీలవేణి, గోవిందరావు, M.నారాయణరావు యితరముఖ్యకార్యకార్తలు పాల్గొన్నారు.

**పటమట :-** విజయవాడ పటమట వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యంలో గత 2 మాసాలుగ పటమట బస్టాండ్ సెంటరునందు వేసవి దాహార్తిని తీర్చుటకు చలివేంద్ర కేంద్రం ఏర్పాటు చేసినారు. ఉ॥ 11 గం॥ల నుండి సా॥ 5 గం॥ల వరకు మజ్జిగ, మంచినీరు వితరణ కార్యక్రమం జరుగుతుంది. ఈ కార్యక్రమంలో శ్రీమతి సీతమ్మ, విమలమ్మ, కుమారి ఇంకా ఇతర కార్యకర్తలు పాల్గొనుచున్నారు.

### నిజామాబాద్ జిల్లా

**నిజామాబాద్ :-** నిజామాబాద్ ధర్మక్షేత్ర ప్రచార కార్యక్రమంలో భాగంగా జిల్లా జైలులోని 150 మంది ఖైదీలకు గీతాజ్యోతి శ్లోకమాలికలను పంచారు. బాస్టర్ స్కూలు విద్యార్థులకు అధ్యాపక సిబ్బందికి కూడ శ్లోకమాలికలను పంచారు. వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ జి. లక్ష్మారెడ్డిగారు స్వీయ ఆరాధన సర్వ ఆదరణ, గీతాజ్యోతి వైభవం గూర్చి ఖైదీలకు చక్కగ వివరించారు. జైలు సూపరిండెంట్ గారైన కె. ఆర్.నారాయణరెడ్డిగారు పూర్తి సహాయ సహకారములు అందజేసినారు.

**కామారెడ్డి :-** నిజామబాద్ జిల్లా కామారెడ్డి ధర్మక్షేత్రప్రచార కార్యక్రమంలో భాగంగ 65గ్రామాలలో గీతాజ్యోతిప్రచార కార్యక్రమం నిర్వహించినారు. 10పాఠశాలలో దంత,నేత్ర సాధారణ వైద్యశిబిరములు నిర్వహించినారు. బాల కార్మికులను గుర్తించి వారిని పాఠశాల లో చేర్పించి ఆపాఠశాలలను దత్తత తీసుకోవడం జరిగింది. రాజాజినగర్ మురికి వాడలలో వైద్య, ఆరోగ్య అవగాహన సదస్సులు ఏర్పాటుచేసినారు. ప్రతిరోజు రామాలయంలో నిరంతరం శ్రీవిష్ణుసహస్రనామ పారాయణం, గీతాజ్యోతి శ్లోకపఠన జరుగుచున్నది.

### అదిలాబాద్ జిల్లా

**మంచిర్యాల :-** అదిలాబాద్ జిల్లా మంచిర్యాల ధర్మక్షేత్ర ప్రచార కార్యక్రమంలో భాగంగా ఆదివాసీ ప్రాంతమైన రొంపల్లి గ్రామంలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమములతోపాటు సామూహిక వివాహ కార్యక్రమాలు నిర్వహించారు. ఈ కార్యక్రమాలకు అవసరమైన వస్త్ర సామగ్రి, బట్టలు, మంగళసూత్రాలు, భోజన సదుపాయాలు ఏర్పాటు చేసారు. గ్రామ పెద్దలైన లచ్చిరాం, ధర్మారావుగార్లు, సహకారం అందజేసినారు. ఈ కార్యక్రమంలో వికాస తరంగిణి అధ్యక్షులు యన్. వేంకటేశ్వరరావు, రామారావు, కిషన్‌రావు, శ్యామ్ సుందరరావు, ప్రభాకరరాజులు పూర్తి సహాయం అందజేసినారు.

### మహబూబ్ నగర్ జిల్లా

**వనపర్తి :-** మహబూబ్ నగర్ జిల్లా వనపర్తి ధర్మక్షేత్ర ఆధ్వర్యంలో చిట్యాల గ్రామంలో శ్రీవేంకటరావు గారి ఆధ్వర్యంలో గీతాజ్యోతి పారాయణం గీతాజ్యోతి శ్లోకమాలికలను పంపిణీ చేసారు. స్వీయ ఆరాధన సర్వ ఆదరణ, స్టిక్కర్లు పంపిణీ చేసారు. 26వ తేదీన స్థానిక శ్రీవేంకటేశ్వరస్వామివారి దేవాలయం నందు శ్రీకృష్ణపూజలు నిర్వహించారు. పశువైద్య శిబిరము నిర్వహణకు సన్నాహాలు జరుగుచున్నవి.

### నెల్లూరు జిల్లా

**చవటపాలెం :-** నెల్లూరుజిల్లా చవటపాలెం ధర్మక్షేత్ర కేంద్రముగ 108 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం పూర్తిచేయడం జరిగింది. తత్వశాస్త్ర ప్రచారకులైన కుమారి సూర్యకుమారిగారి ఆధ్వర్యవంలో 10 మండలాలలో ప్రచారం పూర్తిచేసినారు. స్వీయ ఆరాధన సర్వఆదరణ, శ్రీస్వామివారి ఆశయాలను వివరించడం జరిగింది. బాగ వెనుకబడిన గ్రామాలలో కూడ విస్తృత ప్రచారం చేసినారు. 23-5-2003న చవట పాలెం గ్రామంలో లక్ష్మీపూజ కార్యక్రమం సాయంత్రం 8గం॥లకుస్థానిక కోదండ రామస్వామివారి దేవస్థానములో నిర్వహించినారు. ఈ కార్యక్రమములో 80 మంది భక్తులు పాల్గొన్నారు. ఈ ప్రచార కార్యక్రమంలో శ్రీమతి వైదేహి, శ్రీబి. శ్రీనివాసులు, శ్రీ మురారి ఇతర కార్యకర్తలు ఉత్సాహంగా పాల్గొన్నారు.

## ధర్మక్షేత్రములు

**శ్రీశ్రీ స్వామివారి నేతృత్వంలో**

**14-6-2003వ తేదీన నల్గొండలోను**

**15-6-2003వ తేదీన కృష్ణాజిల్లా ఉనికిలిలోను**

**20-6-2003వ తేదీన మహబూబ్ నగర్ జిల్లాలోని షాద్‌నగర్‌లోను**

**ధర్మక్షేత్ర కార్యక్రమములు జరుగును.**







# గీతాజ్యోతి ధర్మక్షేత్రముల నివేదిక

### సుల్తానాబాద్ - 10వ, ధర్మక్షేత్రము,

తేది 4.5.2003 న జరిగిన ధర్మక్షేత్రమునకు 15రోజుల ముందు నుండి జిల్లా కమిటి సభ్యులు మరియు సుల్తానాబాద్, పెద్దపల్లి సభ్యులు కలిసికట్టుగా ధర్మక్షేత్ర పూర్వరంగాన్ని అన్ని విధముల సిద్ధం చేయడానికి పూనుకొని మే 3వ తేదీన సిద్ధంగా ఉన్నారు. స్థానిక ప్రభుత్వ జూనియర్ కళాశాల గ్రౌండ్స్ అయిన 4 ఎకరాల ఆవరణ లోపల 3వైపుల 20ఫీట్ల దారిని వదిలి వేదిక,క్లాత్ పెండాల్స్, పందిల్లువేసి భక్తులకు చక్కని నీడను ఏర్పాటు చేసినారు.

మే 3వ తేదీన శ్రీశ్రీశ్రీ స్వామివారు సీతానగరం నుండి బయలు దేరి మే 4వ తేదీ తెల్లవారుజామున 5.30గం.లకు సుల్తానాబాద్ చేరారు. శ్రీశ్రీశ్రీస్వామివారు రాక కొరకు చూస్తున్న జిల్లా మరియు ధర్మక్షేత్ర కమిటి సభ్యులతో పాటు అనేక మంది మహిళలు హారతులతో,భజన బృందాలు యక్షగాన బృందములు మరియు మంగళ వాయిద్యములతో శ్రీశ్రీశ్రీస్వామివారికి స్వాగతం పలుకుతూ దారిలో ధర్మక్షేత్ర కార్యాలయము పరామర్శించిన తదుపరి శ్రీశ్రీశ్రీస్వామివారికి బస ఏర్పాటు చేసిన శ్రీ పల్ల మురళి గారింటికి వేంచేపు చేశారు.

ధర్మక్షేత్ర 108గ్రామాల భక్తులేకాకుండా కరీంనగర్ జిల్లా మరియు ఇతర ప్రాంతాల వారంతా ఉదయం 6గంటలనుండి కళాశాల గ్రౌండ్సుకు చేరుకోవడం మొదలయింది.

ప్రభుత్వ జూనియర్ కళాశాల గ్రౌండ్సు అయిన విశాల ప్రాంగణానికి ఒకే ఒక్క సింహద్వారాన్ని అధునాతన రీతిలో రంగురంగుల క్లాతులతో అలంకరించిన ద్వారం లోపలికి వెళ్లగానే తూర్పు ముఖంగా, అందంగా అలంకరించిన వేదికకు ముందుగా కాషాయ,తెలుపు రంగుల క్లాత్ పెండాల్స్ వాటినానుకొని పలానా అని తెలుపు ప్లే కార్డుతో అలంకరించిన ఆవరణలో వైద్య పుస్తక, మరెన్నో స్టాల్సును కూడ పెట్టడము, మండు వేసవిని దృష్టియందుంచుకొని పలుచోట్ల త్రాగునీటి మరియు మజ్జిగ ప్యాకెట్లు వితరణచేయు వసతులు కల్పించబడింది.

సుల్తానాబాద్ చరిత్రలో కనివిని ఎరుగని జనం మే4వ తేది రోజున గ్రౌండ్సులో 8 గంటల నుండి శ్రీశ్రీశ్రీస్వామివారి దర్శనార్థం చేరారు. శ్రీశ్రీస్వామి వారు 9 గంటలకు విచ్చేసారు. తీర్థగోష్ఠి 12గం॥కు ముగిసింది. శ్రీ గుజ్జుల రామకృష్ణారెడ్డి పెద్దపల్లి యం.ఎల్.ఎ గారు దేవేందర్ రావు యం.ఎల్.ఎ కరీంనగర్ గారు శ్రీరాజేశ్వర్‌రావు జడ్.పి. చైర్మన్ కరీంనగర్ గారు ఇతర అధికారులు, అనధికారులు ఎంతో మంది తీర్థగోష్ఠిలో పాల్గొని సదస్సు ముగిసేంతవరకు ఆసీనులై ఉన్నారు. 12.15 గంటలకు సదస్సు ఆరంభమయింది. పలుగ్రామాల భక్తులు స్త్రీలు, పురుషులు వేదికపైకి ఒక్కొక్కరుగా వచ్చి వారి వారి అనుభవాలను వివరించారు. సదస్సు మ॥2.30 వరకు జరిగింది.నిముష కాలం భరించ రాని మండువేసవిని శ్రీ స్వామివారు సన్నిధిలో పండువెన్నెలగా భావిస్తూ అత్యంత ఆనందంతో సమయాన్ని తెలియకుండా గడిపారు.మ॥ 2.30 నుండి సా॥ 4.30 వరకు భోజన విరామం దాదాపుగా 15వేల మంది భోజనాలు చేసారు. తిరిగి సాయంత్రం 4.30 గం॥లకు సామూహిక శ్రీవిష్ణుసహస్ర నామ పారాయణం చేయడం 5.00గంటలకు శ్రీశ్రీశ్రీస్వామివారు వేదికపై వేంచేసి వారు అనుగ్రహ భాషణం చేసిన తదుపరి శ్రీకృష్ణ

పూజ జరిపించి నేతి దీపాలతో గీతాజ్యోతి ప్రతిజ్ఞ చేయించారు. 9.00 గంటలకు నిలయం చేరి 11.00 గం॥లకు పెద్దపల్లి ప్రయాణం చేశారు.

రాత్రి 11.00 గంటలకు పెద్దపల్లి కమాను వద్ద నుండి మంగళ హారతులతో మంగళ వాయిద్యములతో శ్రీ స్వామివారికి స్వాగతం పలికారు. శ్రీ స్వామివారికి డా॥ టి.వెంకటేశ్వరరావు గారింట్లో బస ఏర్పాటు చేశారు. రాత్రే శ్రీవారి పాదపూజ సమర్పించారు.

5.5.2003 ఉదయం 9.00గం॥కు వరకు తీర్థగోష్ఠి ముగించుకొని ఆలయాలు సందర్శించి నేత్ర వైద్య శిబిరం మరియు చందపల్లి గ్రామములో దంత, స్త్రీ వైద్య శిబిరములను పరామర్శించి కొదురుపాక గ్రామంలో నంబులాద్రి నర్సింహస్వామివారిని సేవించుకొని అక్కడి ఆలయంలో కొన్ని మార్పులను సూచిస్తూ పూజారులకు కూడ కొన్ని సూచనలిస్తూ గ్రామాల ప్రజలకు గీతాజ్యోతి సందేశాన్ని అందించారు. తదుపరి పెద్దపల్లి లో సీతారామస్వామి ఆలయంలో సమాశ్రయ ణములు జరిపిరి. సుమారు 1000మంది భక్తులు శ్రీవారి ఉపదేశాన్ని అందుకున్నారు. వచ్చిన వారందరికి చక్కటి భోజన నీటి వసతులు కల్పించారు. సాయంత్రము 5.00గంటలకు శ్రీస్వామివారు నిలయం చేరుకొని మరోకసారి అందరికి మంగళా శాసనములు అందించి హన్మకొండ బయలుదేరారు. ఇంతటి వేసవిలో,పెళ్లిళ్ళ రోజులలో చిన్న ప్రాంతమైన సుల్తానాబాద్ లో అధిక సంఖ్యలో జనం గీతాజ్యోతికి స్పందించి రావడం వచ్చినవారికి భోజన, నీటి వసతులు లోటుపాటు లేకుండా ఉండడం చూసి శ్రీస్వామివారు కార్యకర్తల కృషికి చాల ఆనందించారు. శ్రీవారి సంకల్ప బలమే మనందరికి అండ, కనుక వారు లేనిదే మనము లేము. అంతా వారి మంగళ శాసనములతో జరిగేవని అని కార్యకర్తలు దృఢ విశ్వాసాన్ని ప్రకటించుకున్నారు.

## వరంగల్ జిల్లా హన్మకొండ, వికాసతరంగిణి

శ్రీశ్రీశ్రీ జీయర్‌స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో మేనెల 5 నుండి 11 వరకు తొమ్మిది గీతాజ్యోతి ధర్మక్షేత్రాల సమ్మేళనాన్ని నిర్వహించింది.

శ్రీశ్రీశ్రీ జీయర్ స్వామివారు ఇందులకై సోమవారం సాయంత్రం వరంగల్ నగరానికి వేంచేసినారు. వేలాది మంది భక్తులు జయ జయ ధ్వానాలతో శ్రీస్వామివారిని స్వాగతించారు. వేదపండితులుపూర్ణకుంభంతో ఎదురేగి సభాస్థలికి తోడ్కొని వచ్చారు. ఈ తొలినాటి ప్రారంభ సమావేశానికి ప్రభుత్వ విప్, వర్ధన్న పేట నియోజకవర్గ శాసన సభ్యులు శ్రీ ఎర్రబెల్లి దయాకర్‌రావుగారు హనుమకొండ శాసనసభ్యులు శ్రీ ధర్మారావుగారు, వరంగల్ జిల్లా కలెక్టర్ ప్రభాకరరెడ్డి గారు. టి.టి.డి బోర్డ్‌మెంబర్ శ్రీమతి గుండు సుధారాణి గారు, జిల్లాగ్రంథాలయ కమిటీ అధ్యక్షులు శ్రీ పోలా నటరాజ్‌గారు మొదలైన ప్రభుత్వ ప్రతినిధులు,అధికారులు, శ్రీమాన్ శ్రీ ముడుంబై రామానుజాచార్యులుగారు, శ్రీనముద్రాల పురుషోత్తమాచార్యులు గారు, శ్రీ నరసింహ రంగాచార్యులుగారు శ్రీమన్నారాయణా చార్యులుగారు, మొదలైన సంప్రదాయి ప్రవర్తకులు, పండితప్రకాండులు వేంచేసినారు. శ్రీ స్వామివారు జ్యోతి ప్రజ్వలనం చేసి కార్యక్రమాన్ని ప్రారంభం చేశారు. శ్రీస్వామి వారు తమ అనుగ్రహ భాషణంలో గీతాజ్యోతి ఆశయాలను వివరిస్తూ మానవజాతి శ్రేయస్సు దృష్ట్యా "స్వీయ ఆరాధన సర్వఆదరణ" "మాధవసేవగా సర్వప్రాణిసేవ" అన్నవి మానవజీవన సూత్రాలు కావాలని, ఆదిశగా మానవజాతి పయనించాలని, సమాజరూపమైన భగవంతుని సేవించాలని ఉద్బోధించారు.

ఏకార్యక్రమమైనా తాము సూచించగానే వెంటనే వరంగల్ జిల్లా వికాసతరంగిణి వారు శిరసావహించి,అంకిత భావంతో అకుంఠిత దీక్షతో,





ఆకార్యక్రమం సాఫల్యం కోసం నిరంతరం శ్రమించి విజయ వంతంచేసి అగ్రగామిగా నిలుస్తుందని ప్రశంసించారు. గీతాతరంగిణి,రామాయణ తరంగిణి, భాగవత తరంగిణి,ఉపనిషత్తరంగిణి, శ్రీ స్వామివారి తిరునక్షత్రోత్సవం, ధనుర్మాసోత్సవం,కృష్ణం వందేజగద్గురుమ్ వంటి బృహత్తర కార్యక్రమాన్నింటిని సమర్థవంతంగా నిర్వహించి ఇప్పుడు కూడ 18 ధర్మక్షేత్రాలను ఏర్పరచి అన్ని జిల్లాల కంటే ముందు నిలచిందన్నారు.

మరునటిరోజు భగవద్రామానుజుల వారి తిరునక్షత్రోత్సవ వేడుకలు ఘనంగా జరిగాయి. శ్రీ స్వామివారు తమ శ్రీహస్తాలతో అతి సుందరమైన భగవద్రామానుజుల వారి విగ్రహాలను భక్తులకు అందించి అష్టోత్తర శతనామార్చన కార్యక్రమం నిర్వహించారు. ఈ వారం రోజులు జగదాచార్యులైన భగవద్రామానుజుల వారి వైభవాన్నే శ్రీస్వామి వారు అనుగ్రహించి 9ధర్మక్షేత్రాల కార్యక్రమాన్ని పర్యవేక్షించారు **'తస్మిన్ రామానుజార్యే గురురితిచ పదం భాతి'** అన్నట్లు భగవద్రామానుజులే ఈ రూపంలో అవతరించి లోకానికి మార్గం చూపుతున్నారనే గాఢానుభూతిలో భక్తకోటి తన్మయత్వం చెందింది.

వరంగల్ పట్టణ జనాభాప్రాతిపదికన, చుట్టుప్రక్కల భీమారం, హసనపర్తి మండలం మొదలైనవి కలుపుకొని ఐదు ధర్మక్షేత్రాల కార్యక్రమం పట్టణంలో నిర్వహింపబడింది. 7,8,9,10 తేదీలలో శ్రీస్వామివారు ఉదయం పూట హనుమకొండలో ప్రవచనం అనంతరం వరుసగా నర్సంపేట, ఘనపూర్ (స్టే) వర్ధన్న పేట, ఆత్మకూరు ధర్మక్షేత్రాలకు వెళ్లి కార్యక్రమాలను ఎంతో వైభవంగా నిర్వహించారు. గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగా నాలుగు ఉచిత వైద్య శిబిరాలు నిర్వహింపబడినాయి. అందులో రెండు పశువైద్య శిబిరాలు,ఒకటి అర్థోపెడిక్ (ఎముకల సాంద్రతను పరిశీలించే విధానానికి సంబంధించినది) మరొకటి తల్లి,పిల్లలకు సంబంధించినది. ఘనపూరు ధర్మక్షేత్రంలో నిర్వహింపబడిన పశువైద్యశిబిరంలో 1395 పశువుల చికిత్సలు జరిగాయి. 1115 పశువులకు గుండెవాపుకు జబ్బవాపు,గాలి కుంటువ్యాధికి సంబంధించి చికిత్సలు జరిగాయి. సాధారణ చికిత్సలు 107 పశువులను, గర్భకోశ వ్యాధులకు సంబంధించి 72, రిల్లకాలు 8 కృత్రిమ గర్భధారణ 11పశువులకు, 82 దూడలలో ఏలిక పాముల నిర్మూలన, 3000 మేకలకు, గొర్రెలకు డి వార్మింగ్ మొదలైన చికిత్సలు నిర్వహింపబడి దాదాపు 45వేల రూపాయిల మందులు ఉచితంగా అందజేయబడినాయి. అదేవిధంగా హన్మకొండ వికాసతరంగిణి, ఆత్మకూరు వికాసతరంగిణి శాఖవారి ప్రోత్సాహంతో ఆత్మకూరులో పశువైద్యశిబిరం నిర్వహించింది. ఈ శిబిరంలో 1150 పశువులకు చికిత్సలు జరిగాయి. సాధారణ చికిత్సలు,వ్యాక్సినేషన్ 940 పశువులను,111 దూడలలో ఏలక పాముల నిర్మూలన, 99 పశువులకు గర్భకోశ వ్యాధులకు సంబంధించిన చికిత్సలు నిర్వహింప బడినాయి. ఈ శిబిరంలో కూడా దాదాపు 40వేల రూపాయిల విలువైన మందులు ఉచితంగా పంపణిచేయిడం జరిగింది. డా॥సురేష్ కుమార్ గారు జే.డి, వెటర్నరీ అసోసియేషన్ వైస్‌ప్రెసిడెంట్ (ఆల్ ఇండియా) డా॥చాడ సుభాష్‌రెడ్డిగారు, డా॥కృష్ణమాచారి గారు ఎ.డి, డా॥పి.శంగర్‌రెడ్డి గారు ఎ.డి, డా॥నరసింహ గారు ఎ.డి, డా॥సత్యనారాయణ గారు ఎ.డి, డా॥ విజయగారు, డా॥ప్రవీణ్‌గారు, డా॥వేంకటరమణా రెడ్డిగారు. డా॥బి.ప్రకాశ్‌గారు, డా॥దేవేందర్‌గారు, డా॥బి.నవీన్‌రెడ్డిగారు, డా॥విజయభాస్కర్ గారు, డా॥సుదర్శనరావు గారు,డా॥వై. రాధాకిషన్‌గారు, డా॥రవికుమార్ గారు, డా॥యాసూబ్‌రెడ్డిగారు, డా॥భగవాన్‌రెడ్డి గారు, డా॥శ్రీనివాస్‌గారు, డా॥నర్సయ్యగారు, మొదలైన వారేకాక పారామెడికల్ సిబ్బంది సహాయంతో ఈ రెండుమెగా క్యాంపులు నిర్వహించబడినాయి. ఈ శిబిరాలకు ఇంటాన్,

టి.టి.కె ఫార్మసిటికల్ సారాబాయి, ఫైజర్, అల్వెడ్,డాబర్, నేచురల్ రెమిడీస్, హిమీలయ డ్రీగ్, నోవార్టీన్, గ్లాక్సో, సారాబాయి జైడర్స్, వెన్సర్,రాన్‌బాక్సీ, కాకతీయ హోమియో లాబ్స్,స్టెర్లింగ్ లాబ్స్,హెక్ట్స్ అలంబిక్, హెర్బల్, ఇంటర్‌నెట్, ప్రణవ్, అగ్రోకెమికల్స్, మొదలైన కంపెనీలు తమ ఉదారతను ప్రకటించు కున్నాయి.

డా॥బచ్చురాధాకృష్ణ గారి నేతృత్వంలో అర్థోపెడిక్ వైద్యశిబిరం నిర్వహింపబడింది. ఈ శిబిరంలో 150 మందికి ఎముకల సాంద్రతకు సంబంధించిన పరీక్షలు, చికిత్సలు జరిగాయి. 30 శాతం నార్మల్ కేసులు, 60శాతం ఆస్టియో పీనియాకు సంబంధించిన కేసులు (ఆహారలోపం వల్ల ఎముకలలో సాంద్రత లోపించడం) 10శాతం ఆస్టియోపొరోసిస్ (ఆహర లోపంతో పాటు తక్కిన లోపాలు) కేసులు గుర్తింప బడి వారికి తగిన చికిత్సలు,సూచనలు ఉచిత మందుల పంపిణీ చేయిడం జరిగింది. ఒక్కొక్కరికి పరీక్షకే 1000రూ॥ల వరకు ఖర్చువస్తుంది. 150మందికి చికిత్సలు జరిగాయి. లక్షాయాభైవేల రూపాయల ఖర్చుతో ఈ శిబిరం నిర్వహింపబడింది. CFL ఫార్మ స్యూటికల్ లిమిటెడ్ వారి సహకారంతో డా॥బి. రాధాకృష్ణగారు సమర్థవంతంగా ఈ క్యాంప్ నిర్వహించారు.

మాతా శిశువులకు సంబంధించిన మరొక ఉచిత వైద్యశిబిరం డా॥బి. వీణ, డా॥గీత గార్ల నేతృత్వంలో నిర్వహింపబడింది. 310 మందికి చికిత్సలు జిరిగాయి. 140 మంది పిల్లలలో వ్యాధులను గుర్తించి తగిన చికిత్సలు. సూచనలు అందజేయబడినాయి. 170మంది స్త్రీలకు గర్భకోశ వ్యాధులకు సంబంధించిన పరీక్షలు స్కానింగ్ చేసి చికిత్సలు నిర్వహించి 40వేల రూపాయిల మందులు ఉచితంగా అందించడం జరిగింది.

ఎపెక్స్ కంపెనీవారు తమ సహాయ సహకారాల్ని అందించారు. సత్య హాస్పిటల్ వనమాల క్లినిక్, విరల్ క్లినిక్ సిబ్బంది ఈ శిబిర నిర్వహణను తొడ్పడ్డారు. అంతేకాక గీతాజ్యోతి శ్లోక పఠన పోటీలలో చిత్రగీత పోటీలలో పొల్గొనిన వారికి అందమైన బహుమతులు అందచేయటమే కాక ప్రకటించిన ప్రకారం రూ॥5000/ రూ॥ 3000/- రూ॥2000/- 1,2,3, వచ్చినవారికి క్యాష్ ప్రైజ్ స్వామివారి చేత అందించడం జరిగింది మన కార్యక్రమానికి సహకరించిన వారికి శ్రీస్వామివారు మంగళా శాసనాలు అందజేసినారు.

వరంగల్‌లో ఏడురోజుల పాటు సాగిన ఈ గీతాజ్యోతి కార్యక్రమంలో సాయంత్రాలు రామాయణం, జడకోలాటం, తోటిపటం కథ, చిందు భాగవతం, మందెచ్చుల కథ మహా ధన్వంతరి మొదలైన జానపద కళారూపాల ప్రదర్శనతో పాటు ప్రసిద్ధ ధ్వన్యనుకరణ కళాకారుడు సదాశివగారి ప్రదర్శన మైమ్ మధు మూకాభినయం,బాలబాలికల కూచిపూడి నృత్య ప్రదర్శలు, సురభివారి ప్రదర్శనలు అందరినీ అలరించాయి.వరంగల్ జిల్లా కలెక్టర్ శ్రీప్రభాకర్ రెడ్డిగారు కోరిక మేరకు శ్రీస్వామి వారు వారి గృహానికి వేంచేసి వారు చేసిన పాదపూజను స్వీకరించి వారికి మంగళశాసనాలు అనుగ్రహించారు.

ఇంకా ఈ కార్యక్రమానికి నగర మేయర్ డా॥టి. రాజేశ్వరరావుగారు, కొడకండ్ల శాసన సభ్యులు డా॥సుధాకర్‌రావుగారు, బి.జె.పి జిల్లా అధ్యక్షులు వేణుగోపాలరెడ్డిగారు, ఎండోమెంట్ కమీషనర్ శ్రీమూర్తిగారు, సి.టి.ఓ అశోక్‌రెడ్డి గారు, హైదరాబాద్ జెట్ J.రామేశ్వరరావుగారు. శ్రీ కుమారిగారు, రామచంద్రారెడ్డిగారు, పురుషోత్తమరావుగారు. విజయకుమార్‌గారు, ఇంకా ఆయా వికాసతరంగిణి శాఖల వారు పాల్గొన్నారు.

చివరిరోజు మే 11వతేది తొమ్మిది ధర్మక్షేత్రాల వారితో కలసి వరంగల్ చైత్రరథ గార్డెన్స్ నుండి హన్మకొండ జూనియర్ కాలేజి గ్రౌండ్ వరకు దాదాపు 8మైళ్లు శోభాయాత్ర నిర్వహింపబడింది. వేలాది మంది భక్తులు ఎండను సైతం లెక్కచేయక





శ్రద్ధాభక్తులలో మితిమీరిన సంతోషంతో శోభాయాత్ర లో పాల్గొని ఉత్సవశోభను రెట్టింపు చేశారు. జానపదకళాకారుల బృందాలు నృత్యగానాలతో ముందు నడుస్తుండగా, భజనలతో సంకీర్తనలతో, విష్ణుసహస్రనామస్తోత్ర పారాయణలతో భక్తబృందాలు శ్రీస్వామివారి ననుసరిస్తూ వరంగల్ నేల నంతా భక్తి రసార్ద్రం చేశారు. పుడమి తల్లి పులకరించింది. శ్రీస్వామివారి చిరునగవు వెన్నెలలో తడిసి అందరూ సేద దీరినారు. అది ఒక అపూర్వమైన సన్నివేశం. అందరిలో నూతనోత్తేజం ఆత్మవిశ్వాసాలు వెల్లి విరిసాయి. శ్రీ స్వామివారి శ్రీ చరణాలను మోకరిల్లి అంతా తమ కృతజ్ఞతలు ప్రకటించు చున్నారు. శ్రీస్వామివారు నేతి దీపాలతో గీతాజ్యోతి ప్రతిజ్ఞను చేయించారు. ఆ ప్రకాశంలో పరమాత్మను తమ చల్లని శ్రీ హస్తాలతో పైకెత్తి తమ కందరికి సాక్షాత్కరింప చేసి నట్లుగా భావించిన భక్తుజనుల ఆనందం వర్ణనాతీతం. మనం ఏం చేసి మన ఆచార్యుల ఋణం తీర్చుకోగలం?ఆ దయామయుల పాద పద్మాల చెంత మోకరిల్లడం తప్ప!

## వర్ధన్నపేటలో "గీతాజ్యోతి" ధర్మక్షేత్రకార్యక్రమము.

తేది 9.5.2003 శుక్రవారం నాడు వరంగల్‌జిల్లా వర్ధన్నపేటలో గీతాజ్యోతి ధర్మక్షేత్ర కార్యక్రమం శ్రీస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో ఘనంగా జరిగింది. ఉ.10గం.లకు శ్రీస్వామివారు గ్రామమునకు విచ్చేయగానే పూర్ణకుంభ స్వాగతంతో పాటు ప్రత్యేకంగా తెప్పించబడిన ఏనుగుతో స్వామి వారికి పుష్పమాలాంకృతులను చేసి స్వాగతించారు. ప్రభుత్వ విప్ శ్రీమాన్ యెర్రబెల్లి దయాకర్ రావుగారు, కలెక్టరు శ్రీమాన్ ప్రభాకర్ రెడ్డిగారు, స్వాగతం పలికారు. శ్రీస్వామివారు శోభయాత్రగా బయలుదేరి సుమారు 60లక్షల ఖర్చుతో నిర్మించబడిన నూతన "రూరల్ హెల్త్ సెంటర్" కు ప్రారంభోత్సవం చేసారు. వెంటనే స్థానికంగా వికాసతరంగిణి ఆధ్వర్యంలో ఏర్పాటు చేయబడిన "ఉచిత ఆరోగ్యశిబిరము" ప్రారంభోత్సవము చేసారు.

ఈ శిబిరంలో 700మంది రోగులకు చికిత్స చేయడం జరిగినది. దంతవైద్య శిబిరం వరంగల్ జయ హాస్పిటల్ సౌజన్యంతో ఏర్పాటుచేయబడింది. ఈ శిబిరంలో స్థానిక డాక్టర్లు శ్రీమాన్ కుందూరు వెంకటరెడ్డి, మహేందర్. తిరుపతి రవీందర్ రెడ్డి గార్ల ఆర్థిక సహాయముతో సుమారు 75 వేల విలువ గల మందులు పంపిణీ చేయడం జరిగింది. అలాగే ప్రభుత్వం అందించిన సహాయంతో టి.బి రోగులు నలుగురికి 40,000 విలువగల "కిట్"లను స్వామివారిచే ఇప్పించడం జరిగినది. అలాగే ప్రభుత్వం అందించిన సహాయంతో టి.బి రోగులు నలుగురికి 40,000 విలువగల "కిట్" లను స్వామివారిచే ఇప్పించడం జరిగినది. వరంగల్ లోని "Elite" సొసైటి వారి ఆర్థిక సహాయం కూడా లభించింది. ఇంకా ఈ శిబిరంలో డా॥కె. రాధిక, డా॥యస్.రమ,వెంకట్రావ్, డా॥తిరుపతి రెడ్డిగార్లు కూడ పాల్గొన్నారు.

మధ్యాహ్నం 11గం॥లకు స్థానిక శ్రీ సీతారామచంద్రస్వామి దేవాలయం యందు శ్రీమతి యెర్రబెల్లి స్వర్ణ, యెరబెల్లి వరద రాజేశ్వర్‌గారలు పూర్ణకుంభంతో స్వాగతం వలుకగా శ్రీసీతారామచంద్ర స్వామివారిని దర్శించి ప్రత్యేకంగా దేవాలయం ప్రక్కన ఏర్పాటు చేయబడిన విశాలమయిన ఆవరణలో "గీతాజ్యోతి" ధర్మక్షేత్రకార్యక్రమంలో శ్రీస్వామి వారు పాల్గొన్నారు.

శ్రీస్వామివారిచే జ్యోతి ప్రజ్వలన అనంతరం ప్రభుత్వ విప్ శ్రీమాన్ దయాకర్ రావు ప్రసంగిస్తూ మా ప్రాంతమైన వర్ధన్న పేటకు శ్రీస్వామివారు రావడం మాకు పూర్వజన్మ సుకృతమని మన జన్మలుధన్యమై నాయని అన్నారు. ఇంకా ఈ కార్యక్రమంలో శ్రీమాన్ యెర్రబెల్లి వరదరాజేశ్వర్ రావు గారు యెర్రబెల్లి స్వర్ణగారు ప్రసంగించారు.

అనంతరం శ్రీస్వామివారు అనుగ్రహ భాషణం చేస్తూ మాధవసేవగా సర్వప్రాణిసేవ అన్నది ప్రతిమనిషి గుర్తించగలగాలని స్వీయ ఆరాధన, సర్వ

ఆదరణ అనే ఈ రెండు సూత్రాలు ఆధారంగా గీతాజ్యోతి కార్యక్రమం రూపొందించడం జరిగింది అన్నారు. గీతాజ్యోతి ప్రజల్లోకి మహోద్యమంగా వెళ్ళాలని మన అమ్మను మనము ఎలాగయితే ఆరాధిస్తూ ఆదరిస్తామో అలాగే ఏకులమైన, జాతైన, ఏ మతంలో యున్న వారైన వారు పూజిస్తూ ఇతరులకు చెందిన వాటిని గౌరవించాలని అన్నారు.

108 గ్రామాలనుండి విచ్చేసిన సుమారు 10వేలమంది భక్తులచే శ్రీస్వామివారు గీతాజ్యోతి ప్రతిజ్ఞ చేయించారు. ఈ సందర్భంగా శ్లోకపఠనం లోని విజేతలకు, జానపద కళాకారులకు వికాసతరంగిణి కార్యకర్తలకు శ్రీస్వామివారు మంగళా శాసనములు చేసినారు.

## ఘనపూర్ గీతాజ్యోతి ధర్మక్షేత్రనివేదిక

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామనూజ జీయర్ స్వామివారి పర్యవేక్షణలో తేది 8.5.2003 గురువారం రోజున శ్రీవాణి గురుకుల విద్యాలయ ఆవరణ,ఘనపురంలో జరిగిన గీతాజ్యోతి కార్యక్రమానికి ఐదు మండలాల వారు 1)ఘనపురం 2) జఫర్ గడ్ 3) ధర్మసాగర్ 4) రఘునాధపల్లి 5) పాలకుర్తిల నుండి సుమారు 8 వేలకు పైగా భక్తులు పాల్గొన్నారు.

గీతాజ్యోతి కార్యక్రమంలో శ్రీకృష్ణపూజలో సుమారు 415 మంది పాల్గొన్నారు. శ్రీశ్రీశ్రీ స్వామివారిని ఆశేష భక్తజనం స్వాగతం పలుకుతుండగా వేదమూర్తులు పూర్ణ కలశంలో, మేళ తాళాలతో ఎదురేగి ఆహ్వానించారు. శ్రీస్వామివారు మొదట శ్రీసరస్వతీ ఆలయాన్ని సందర్శించారు. ఆ తరువాత హన్మకొండ వికాసతరంగిణివారి సహాయ సహకారాలతో పశువైద్య శిబిరం నిర్వహింప బడింది. శ్రీ స్వామివారు శిబిరాన్ని ప్రారంభించారు. గోపూజ చేశారు. ఈ శిబిరంలో సుమారు 1395 పశువులను చికిత్సలు జరిగాయి పాల ఉత్పత్తికి సంబంధించి, పశుగణాభివృద్ధికి సంబంధించిన అవగాహనా సదస్సు కూడ నిర్వహింపబడింది. ఈ క్యాంపును 45వేల రూపాయిల విలువైన మందులు ఉచితంగా పంపిణీ చేయడం జరిగింది.

శ్రీశ్రీశ్రీస్వామివారు వేదిక నలంకరించి, జ్యోతిప్రజ్వలనం చేసి కార్యక్రమాన్ని ప్రారంభించారు. శ్రీమతి ప్రణయ మరియు విద్యార్థినీ బృందం స్వాగత గీతాన్ని ఆలాపించారు. వికాసతరంగిణి ఘనపురం శాఖ అధ్యక్షులు కందికొండ రంగయ్యగారు ముందుగా స్వాగత వందనాలు తెలిపి తమ వికాసతరంగిణి శాఖ చేసిన, చేస్తున్న కార్యక్రమాల వివరాలను, ధర్మక్షేత్రానికి సంబంధించిన నివేదికను సమర్పించారు.

హన్మకొండ వికాసతరంగిణి తరవున జిల్లా అధ్యక్షురాలు శ్రీమతి పాకనాటి జ్యోతి గారు శ్రీస్వామివారి గురించి వారి ఆశయాలను, లక్ష్యసాధనము వివరించారు. ఆ తరువాత శ్రీ స్వామివారు శ్రీకృష్ణ పూజను నిర్వహించి అనుగ్రహభాషణం చేసినారు. వికాసతరంగిణి శాఖ ఏర్పడిన నాటి నుండి చక్కటి కార్యక్రమాలు నిర్వహిస్తున్న ఘనపురం వారిని అభినందించారు. వేలాది మందితో నేతి దీపాలు వెలిగించి శ్రీస్వామివారు గీతాజ్యోతి ప్రతిజ్ఞ చేయించి అందరిచే మంగళాశాసనాలు అందించారు. ఈ కార్యక్రమం అన్ని గ్రామాల నుండి వచ్చిన భక్తులలో ఒక నూతన ఉత్తేజాన్ని కలిగించింది. వారి నుండి చక్కటి స్పందన లభించింది. సమిష్టి వికాసాన్ని అందించే గీతాజ్యోతి స్పందన లభించింది. సమిష్టి వికాసాన్ని అందించే గీతాజ్యోతి ఆశయాలు భగవంతుని పట్ల అంచంచల భక్తి విశ్వాసాలను సమాజం పట్ల శ్రద్ధను కలిగించడానికి ఎంతో తోడ్పడ్డాయిని ఈ కార్యక్రమం వల్ల అవగతమైంది.

## ఆత్మకూరు గీతాజ్యోతి ధర్మక్షేత్ర కార్యక్రమ నివేదిక

మే 10 వ తేదీన ఆత్మకూర్ మండల కేద్రంలోని శ్రీవేణుగోపాలస్వామి ఆలయ ప్రాంగణంలో అతివైభవంగా కన్నుల పండుగగా పరమహంస





పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదణ్డి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయర్ స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో వికాసతరంగిణి ఆత్మకూర్ శాఖ సమర్పణలో జరిగింది.

ధర్మక్షేత్రకార్యక్రమ మహోత్సవం ప్రారంభం రోజున తెల్లవారు జామున వేసవికాలం అయినా శ్రీవారి రాకనుపురస్కరించుకొని ప్రకృతిసైతం పులకరిస్తూ వర్షపు చిరుజల్లు ధర్మక్షేత్ర పరిధిని పావనం చేసి శ్రీస్వామివారికి స్వాగతం పలికింది.

గ్రామంలో మహిళలంతా తమ ముంగిళ్ళలో రంగురంగుల రంగవల్లులను వేసుకొని శ్రీస్వామికి స్వాగతం పలికారు.

గీతాజ్యోతి కార్యకర్తలు సుమారు నూరు ద్విచక్రవాహనాలతో శ్రీజీయరుస్వామి వారిని శోభాయాత్ర ద్వారా గీతాజ్యోతి ధర్మక్షేత్ర ప్రాంగణానికి తీసుకొని వచ్చారు. శ్రీస్వామివారు ముందుగా శ్రీవేణుగోపాల స్వామిని దర్శించుకున్నారు. చినజీయరుస్వామి వారి రాకతో గ్రామమంతా సంతోషం వెల్లివిరిసింది. ఆధ్యాత్మిక, సామాజిక సౌహార్ధ పరిమళాలు నలుదిశలా విరజిమ్మినాయి ధర్మక్షేత్ర పరిధిలోని 108 గ్రామాల భక్తులు ధర్మక్షేత్రా ప్రాంగణానికి సమయానికి చేరుకున్నారు.

గీతాజ్యోతి ప్రాంగణంలో భక్తులంతా క్రమశిక్షణలో కూర్చొని శ్రీస్వామివారి అనుగ్రహభాషణకు వేచిచూస్తుండగా సమీపంలోనే గీతాజ్యోతిలో భాగంగా ఏర్పాటు చేసిన "ఉచిత పశువైద్యశిబిరము" నకు శ్రీస్వామివారు వేంచేశారు. హన్మకొండ వికాస తరంగిణి సహాయ సహకారముతో పశువైద్యశిబిరము చినజీయరుస్వామివారి కరకమలములతో ప్రారంభించబడింది. శిబిరములో స్వామివారు రైతులతో మరియు వెటర్నరీడాక్టర్స్ చే ముచ్చటించారు.

శ్రీస్వామివారు ఆవులకు ఫలములను తినిపించారు. ఇది వైద్యశిబిరానికి విచ్చేసిన రైతులను విశేషంగా ఆకర్షించింది.

పశువైద్య శిబిరములో సుమారు 1150 పశువులకు చికిత్స జరిపి 40వేల రూపాయిల మందులు పంపిణి చేయడం జరిగింది. దీనితో రిల్లా ఆపరేషన్లు మరియు 580 వ్యాక్సినేషన్ చేయడం 99గర్భకోశవ్యాధి చికిత్సలు చేయడం జరిగింది. ఈ శిబిరంలో స్థానిక డాక్టర్ రాధాకిషన్‌గారు, డా॥వెంకట రమణారెడ్డిగారు, అసిస్టెంట్‌డైరెక్టర్ సుభాష్ రెడ్డిగారు, సురేష్‌గారు,J.V.O సాంబశివరావు గారు పాల్గొని చక్కటిసేవలు అందించారు. అందరికి శ్రీస్వామివారు అనేకానేక మంగళా శాసనాలను అందచేశారు. పశువైద్యశిబిరం నుండి శ్రీస్వామివారు నేరుగా గీతాజ్యోతి ధర్మక్షేత్రమహోత్సవ ప్రాంగణానికి చేరుకున్నారు. స్వామివారు వేదిక పైకి రాగానే జ్యోతిప్రజ్వలన కార్యక్రమం సుమారు పదివేల భక్తులు జైశ్రీమన్నారాయణ హర్షధ్వానాల మధ్య అతివైభవంగా జరిగింది. భక్తులు కోలాటాలు సాంస్కృతిక కార్యక్రమాలను ప్రదర్శించారు. తరువాత వికాసతరంగిణి ఆత్మకూర్ శాఖ చైర్‌పర్సన్ ఆరుట్ల కేశవమూర్తి గారు స్వాగత ఉపన్యాసం చేశారు. తదుపరి వికాసతరంగిణి సెంట్రల్ జాయింట్ సెక్రటరి వరంగల్ జిల్లా వికాసతరంగిణి కో-ఆర్డినేటర్ శ్రీమతి డా॥వి.జ్యోతిగారు శ్రీస్వామివారి పరిచయాన్ని భక్తులకు అందచేశారు.

ఆ తరువాత వికాసతరంగిణి ప్రధాన కార్యదర్శి పోలు రాజేష్‌కుమార్‌గారు ఆత్మకూర్ శాఖ 12/12/1997న ఏర్పడినప్పటి నుండి నిర్వహించిన (కార్యదర్శి నివేదిక) కార్యక్రమాల నివేదికను అందచేశారు.

తదుపరి వికాసతరంగిణి ఫైనాన్షియల్ కోఆర్డినేటర్ మరియు గీతాజ్యోతి కన్వీనర్ శ్రీనాగబండి శివప్రసాద్ గారు సంక్షిప్త నివేదిక (గీతాజ్యోతి నివేదిక) ను అందచేశారు.

ఆ తర్వాత అతిధులు వరంగల్ అర్బన్ B.J.P జిల్లా అధ్యక్షులు శ్రీ వంగాల సమ్మిరెడ్డి గారు, సర్పంచ్ కానుగంటి. సంపత్‌కుమార్ గారు ప్రసంగించారు.ఇక తర్వాత పదివేల భక్తులు ఆసక్తిగా ఎదురు

చూస్తూండగా పరమహంస పరివ్రాజకాచార్యులు గీతాజ్యోతి కార్యక్రమం గురించి అలాగే మాధవసేవగ సర్వప్రాణిసేవ మరియు స్వీయ ఆరాధన సర్వఆదరణ అనేరెండు జీవన సూత్రాల గూర్చి చక్కగా వివరించారు.

తర్వాత శ్రీస్వామివారు భక్తులచే సమాజ మంతాబాగుండాలని శ్రీకృష్ణపూజ చేయించారు. శ్రీకృష్ణపూజలో పాల్గొన్న భక్తులు విశేష అనుభూతిని పొందారు. తరువాత భక్తులు చిరుతల రామాయణాన్ని ప్రదర్శించారు. చివరలో స్వామివారు గీతాజ్యోతి ప్రతిజ్ఞ భక్తులచే చేయించారు. తదుపరి కార్యక్రమానికి సహకరించిన దాతలు శ్రీమతి ఇనుగాల హేమలతారెడ్డి తదితరులకు మరియు కార్యకర్తలకు శ్రీ స్వామివారు అనేకానేక మంగళాశాసనాలను అందచేశారు, స్థానికM.L.A కొండా సురేఖగారు,B.J.Y.M రాష్ట్ర బాధ్యులు జి.ప్రేమేందర్‌రెడ్డి గారు మంగళాశాసనాలు పొందారు. చివరగా వికాసతరంగిణి ప్రతినిధి శ్రీటి.సత్యనారాయణ గారు. వందనసమర్పణ చేశారు. ప్రసాద మరియు మంచినీరును వికాసతరంగిణి ప్రోగ్రాం కో–ఆర్డినేటర్ సతీష్, భజనమండలి అధ్యక్షులు వాసు, R&D కో ఆర్డినేటర్ వంగల రాజేంద్రప్రసాద్ గార్లుఅందించికార్యక్రమం నడిపించటంలో చక్కని కృషిచేశారు. మహిళాసంఘాలు,యువజనసంఘాలు, 108 గ్రామాల ప్రతినిధులు,ప్రజాప్రతినిధులు కార్యక్రమంలో చక్కటి సేవలు అందించారు. ఈ విధంగా గీతాజ్యోతి ధర్మక్షేత్రమహోత్సవం కన్నులపండుగగా జరిగింది.

### నర్సంపేట ధర్మక్షేత్రనివేదిక

ఉదయం 10గం॥లకు స్థానిక ఇండస్ట్రియల్ ఏరియావద్ద స్వామివారికి వికాసతరంగిణి అధ్యక్షులు డి. వీరేశలింగం. ఉపాధ్యక్షులు డా॥Ch.ఉషారాణి, కార్యదర్శి యం.వి.కృష్ణా రావు మరియు రైస్‌మిల్లర్స్ వారు వేలాదిమంది ఎదురుగా ఘనస్వాగతం పలికారు. నర్సంపేట పట్టణపురవీధులగుండా శోభయాత్రలో భాగంగా శ్రీవాసవికన్యకాపరమేశ్వరీ ఆలయమును, వేంకటేశ్వరాలయమును సందర్శించినారు. ప్రధానఅర్చకులు స్వామివారి గూర్చి తెలుపుతూ గత 22సం॥ల క్రితం శ్రీస్వామి వారిచే విగ్రహప్రతిష్ఠ చేయబడిందని మరల ఈనాడు మనకు స్వామివారి దర్శన భాగ్యం కల్గిందని తెల్పినారు. స్వామివారిని అమ్మవారిదేవాలయ అర్చకులు వేంకటేశ్వరాలయ కమిటి చైర్మన్ నూతన వస్త్రములు సమర్పించినారు. పిమ్మట ఉచిత దంత నేత్ర వైద్యశిబిరాలను శ్రీనివాస నర్సింగ్‌హోంలో ప్రారంభించారు. M.భరత్‌రెడ్డి, జె.ఉదయ్‌సింగ్ గార్లు వైద్యపరీక్షలు జరిపినారు దంతవిభాగంలో 76మందికి నేత్రవిభాగంలో 82 మందికి పరీక్షలు చేసి 10వేలరూపాయిలు మందుల పంపిణీ చేయడంజరిగింది.

అనంతరం స్థానిక శ్రీధర్మశాస్తా అయ్యప్ప స్వామి ఆలయంలో ఏర్పాటయిన సభాస్థలిని స్వామిజీ చేరులోగానే భక్తులు జై శ్రీమన్నారాయణ నినాదాలతో మంగళ వాయిద్యాలతో, గిరిజనుల జానపద నృత్యములతో, వేదఘోషలతో, పూర్ణ కుంభములతో ఘనస్వాగతం పలికారు. సుమారు 10వేల లోపు భక్తులు ఈ సందర్భంగా విచ్చేసినారు. స్వామిజీ జ్యోతి ప్రజ్వలన గావించారు సభప్రారంభమైంది.

వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీ డి. వీరేశ లింగం తమతొలిపలుకలతో స్వామివారి ఆశయాలకు అనుగునంగా తమశాఖపనిచేస్తుందని పేర్కొన్నారు. అనంతరం ప్రధానకార్యదర్శి M. వి.కృష్ణారావు గత ఏడాది పాటుగా నిర్వహించిన కార్యక్రమాలను తమని





వేదికలో పేర్కొన్నారు. వరంగల్ జిల్లా వికాసతరంగిణి చైర్‌పర్సన్ ప్రొఫెసర్ శ్రీమతి జ్యోతి ప్రసంగిస్తూ స్వామి వారి ఆశయాలను ప్రస్తుతించారు.

స్వామివారి అనుగ్రహభాషణంలో అధర్మాన్ని అక్రమాలను సహించడానికి ప్రకృతికి కూడా ఒక హద్దు ఉంటుందని అది కోల్పోయినపుడు జరిగే విపరీత పరిణామాలను సమాజమంతా అనుభవించవలసి ఉంటుందని, భూమి ఇచ్చే వాటితో సంతృప్తి చెందని మనజుడు తన అవసరానికి మించిన అత్యాశతో పుడమితల్లికి క్లేశాన్ని కలుగజేసే చర్యలకు పాల్పడడం శోచనీయం అన్నారు. ఎక్కువ ఫలసాయం అంటూ సారం లేని ఆహారాన్నిపండించుకొని వారుతమ శక్తినంతా వృధా చేస్తున్నారని సమానత్వం కోసమే దైవారాధన ఆవశ్యకత ఎంతో ఉందని భక్తులను ద్దేశించి పల్కినారు.

ఈ సందర్భంగా భక్తులచే సామూహిక కృష్ణపూజలు జరిపించి నేతిజ్యోతులను చేబూనిన భక్తులందరితో గీతాజ్యోతి ప్రతిజ్ఞను చేయించారు. గతంలో నిర్వహించిన శ్లోకపఠన పోటీలోవిజేతలైన విద్యార్థులకు ప్రశంసా పత్రాలు అందజేసినారు. దాతలకు జ్ఞాపికలను అందజేసి భక్తులందరికే మంగళా శాసనముల తెల్పినారు.

వరంగల్ వికాసతరంగిణి శాఖ కార్యదర్శి కె. మహేందర్‌రెడ్డి. డా॥బచ్చు మురళీకృష్ణ, గీతాభవన్ ఆచార్యులు,స్థానిక నర్సంపేట, M.P.DO సారయ్య, సర్పంచి రజనీభారతీ, సబ్‌ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోలీస్, సర్కిల్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్‌పోలీస్, B.గోపాలరెడ్డి మొదలగు వారు పాల్గొన్నారు.

K.V.R నర్సింహారావు వందనసమర్పణతో సభముగిసినది.

✕✕✕✕✕





## ప్రథమ వర్ధంతి

**శ్రీమాన్ వద్దే కనకరాజుగారు 20-6-2002న ఆచార్య తిరువడి చేరినారు. 9-6-2003న ప్రథమవర్ధంతి సందర్భముగా వారి కుటుంబ సభ్యులు శ్రీవారి మంగళాశాసనములు కోరుతూ భక్తినివేదన పత్రికకు కైంకర్యము గావించినారు.**

జై శ్రీమన్నారాయణ..! జై శ్రీమన్నారాయణ..!

# విషయ సూచిక.....



# పంచాంగ వివరాలు

## జూలై

8 తిథి ద్వయం, పెరియాళ్వార్ తిరు॥

9 ఏకాదశి తిథి, (పితృకార్యాదులకు)

10 సర్వేషాం శయనైకాదశి, తొలి ఏకాదశి, చాతుర్మాస్యారంభం.

(ఏకాదశి ఉపవాసం ఈరోజే చేయాలి.)

13 శుక్రమౌఢ్యారంభం

17 కర్కాటక సంక్రమణం ప. 12-42 దక్షిణాయన పుణ్యకాలం

20 పుష్యమి కా॥ రా. 1-0

25 సర్వేషామేకాదశి

26 శనిత్రయోదశి

27 మాసశివరాత్రి

30 రా. 7-27 గోదావరీ పుష్కరారంభం.

## ఆగష్టు

1 ఆండాళ్ తిరునక్షత్రం నాగచతుర్థి

3 ఆశ్రేషకార్తె రా. 1-25 బదరీనారాయణ పెరుమాళ్ తిరు॥

5 గురుమౌఢ్యారంభం

8 సర్వేషామేకాదశి, వరలక్ష్మీవ్రతం

9 తిథిద్వయం

10 చతుర్దశి తిథి, వరాహ జయంతి

శ్రీశ్రీశ్రీ స్వామివారు ప్రస్తుతం అమెరికా పర్యటనలో వేంచేసి ఉన్నారు. తిరిగి వచ్చేనెల 27వ తేదీ నుండి పుష్కర కార్యక్రమములో భాగంగా రాజమహేంద్రి మరియు మంచిర్యాలలో నిర్వహించు బ్రహ్మయజ్ఞములో అన్వయిస్తారు. అనంతరం శ్రావణ పూర్ణిమ నుండి చాతుర్మాస్యదీక్ష సందర్భముగ విశాఖపట్టణం సమీపంలోని భీమిలిలో వేంచేసి ఉంటారు.

మీ సేవలో....


**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 272929,
చందా: సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-,
విదేశాలకు సంవత్సరచందా $ 25,
E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org
D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం,






శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాస పత్రిక






స్వభాను నామ సంవత్సరం — ఆషాఢ మాసము

**సంపుటి 56** — **2003 జూలై** — **సంచిక 4**


వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు :

శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. **శ్రీరామచంద్రాచార్యులు**

సంపాదకీయం

# ఱాతివ్రాత - నీటివ్రాత

జనులు బహువిధాలు. ఈ వైవిధ్యానికి వారివారి బుద్ధి తారతమ్యాలు కారణాలు కావచ్చు. వారి వారి విద్యాభ్యాసాలు కారణాలు కావచ్చు. వారు సంచరించే సమాజం కారణం కావచ్చు. వారి మిత్రులు కావచ్చు. వారాశ్రయించే గురువులు కావచ్చు. తల్లిదండ్రుల జీవితాలు కావచ్చు. వారి సంస్కారగరిమలు కావచ్చు.

ఇట్లా ఇవి విడిగానో కొన్నో అన్నీనో కలసీ కారణం కావచ్చు.

ఈ తేడాలవల్లనే కొందరు బుద్ధిమంతులు, కొందరు మందమతులు, కొందరు సజ్జనులు, కొందరు దుర్జనులు, కొందరు దాతలు, కొందరు ప్రాణహర్తలు కావటమూను.

ఇల్లు నిలబెట్టేవారు కొందరు, ఇల్లు కూలగొట్టేవారు కొందరూను.

కూడు పెట్టేవారు కొందరు, ఆ కూటిలోనే దుమ్ముపోసేవారు కొందరు. రక్తానిచ్చేవారు కొందరు. రక్తాన్ని తాగేవారు కొందరు.

ఎంత చెప్పమీ సమాజవైవిధ్యాన్ని, విశ్వరూపాన్ని.

కొందరు శత్రువులు, కొందరు మిత్రులు. ఒకడి శత్రువు అతడొక్కనికే శత్రువు కావచ్చును. ఒకని మిత్రుడు పలువురకు మిత్రుడు కావచ్చు.

ఇట్లా శత్రుమిత్ర పరిగణనంలోనే ఉంటుంది యీ వైలక్షణ్యం. ఏదో వ్యాజం వల్ల శత్రుత్వం వచ్చింది యిద్దరి మధ్య, బాగుంది. కాని అట్లా బతికి ఉన్నంత కాలమూ వారిరువురూ శత్రువులుగా ఉండిపోవాల్సిందేనా?

వారిని కలిపే యోగ్యత, బాధ్యత ఎవరికీ లేదా?

అది కాదండీ వాణ్ణెంత చెప్పినా తిప్పలేకపోతున్నాం. తా బట్టిన కుందేటికి మూడేకాళ్ళంటున్నాడు. ఇట్లాంటి వాళ్ళు వీళ్ళు.

అసలు శత్రుత్వమిత్రత్వాదులెట్లా ఏర్పడతాయి. కారణం ఉంటుందా? అవ్యాజంగానా? నిజానికి మైత్రికి కారణాలుండవు. వైరానికి కారణాలుంటే ఉండవచ్చు. ప్రయోజనాలు ఉండవచ్చు. అంచేత మైత్రిలో ఉన్న ఉదారత వైరంలో ఉండదు. ప్రతిదానికీ ఆ యిద్దరూ వీధినపడేట్టు పోట్లాడుకోవటం, చాలా అనుదాత్తంగా, అవాంఛనీయంగా కూడా ఉంటాయి కొన్ని సన్నివేశాలు.

ఎందుకో పగపెట్టుకుంటాడు ఒకడు, వాడిలాంటివాడే మరొకడు. వాడితో ఆ మధ్య కాస్త వైమనస్యం వచ్చింది. అప్పుడే మరచిపోయాడేవో ఏం బాబాయ్ కులాసానా? సాయంకాలం వచ్చి కలుస్తానంటూ సైకిలెక్కిపోతాడు. మొదటివాణ్ణి వద్దన్నామా? రెండోవాణ్ణి బొట్టూకాటుకాపెట్టి పిలచేమా?

ఇవన్నీ వారి వ్యక్తిగత సంస్కారఫలాలు. సంస్కార వైలక్షణ్యాన్ని పట్టి వ్యక్తులలో భేదాలుండవచ్చు. వైరి వర్గానికే చెందిన

\2/
Mydocuments\
Bnjulyo3.p65



యిరువురిలోని వైరం ఏకరూపం గానూ ఉండకపోవచ్చు. ఇందుకు బోలెడు కారణాలుంటాయి.

ఇవన్నీ అట్లా ఉంచి సాధారణంగా మూర్ఖులు ప్రాజ్ఞులు అని రెండుగా మానవులను వారి వర్తనాన్ని పట్టి బుద్ధిని పట్టి శీలగుణాదులనుపట్టి వేర్పరిస్తే ఈ రెండు వర్గాలవారిలో వైరం ఎట్లా ఉంటుందో చెపుతున్నాడు.

మనుషులు రెండే రకాలు

మూర్ఖులు - ప్రాజ్ఞులు.

ఏమీ తెలియని మొండివారు, అన్నీ తెలిసిన నాగరికులు. వారివైరరేఖల్ని చూపిస్తున్నాడు.

**పాషాణేష్వివ రేఖా**
**మూర్ఖేవైరం దృఢం చిరం భవతి**
**జలమధ్యేష్వివ రేఖా**
**ప్రాజ్ఞేన చిరం భవతి వైరమ్ ॥**

ఈ ఇరువురిలో వైరం ఎంత భిన్నంగా ఉంటుందో స్పష్టంగా చెపుతున్నాడు. రాతి మీద గీసిన గీతలా చెరక్కుండా తరక్కుండా ఎన్నేళ్ళయినా మూర్ఖులలో వైరం అట్లా నిలిచే ఉంటుంది. ప్రాజ్ఞులతో వైరం నీటిరాత లాటిది. వెంటనే పోతుంది.

ఎన్ని ఒడుదుడుకులు రానీండి, తామెన్ని యిక్కట్టులకు గురికానివ్వండి. వైరానిక్కారణమైన సంఘటన సమసిపోనీండి, ఆ వ్యక్తులనే మరణించనీండి. ఱాత రాసిన గీత లాంటిది మూర్ఖులతో వైరం. దీన్ని తొలగించటం ఓ పట్టాన అయ్యేదికాదు.

మరి ప్రాజ్ఞులతోడి వైరం నీటిమీద రాతలాంటిది. నీళ్ళపై వ్రాసన్తాంటేనే చెరిగిపోయే గీతలాంటిది.

వెనకటిమాట అట్లా పక్కన పెట్టండి. ఇప్పుడే వ్రాసన్తాంటేనే నీళ్ళలో అక్షరాలు నిలవ్వు, అంత తొందరగా ప్రాజ్ఞుల తోడి వైరం సమసిపోతుంది.

ప్రాజ్ఞులయిన వారితో అసలు వైరమేరాదు. కాలవశాన కాస్త భేదం ఏర్పడినా క్షణాల మీద యోగ్యుల అనునయంతో సమసిపోతుంది.

నీళ్ళల్లోరేఖలా త్వరగా పోతుంది సజ్జన వైరం.

- శ్రీరామచంద్రాచార్య.

# హరిపద భక్తుల గురుపదప్రాప్తి

అది స్వభాను జ్యేష్ఠ శుక్ల అష్టమి, స్థిరవారము ఆంధ్రదేశానికి ఆపద ముంచుకు వచ్చినరోజు.

సనాతన ధర్మానికి సంక్షోభం సంప్రాప్తించిన సమయం ఆస్తిక్యమూ, భక్తీ అనదలైన వేళ. తన ఒడిలో ఆడుకున్న పసివాడు **అనంతప్పడు** మరి లేడని విన్న గోస్తని కుతకుతలాడిపోయింది. చలువల వేల్పు, చందనపు తాల్పు, సింగంపు దొర నెలవున నెలకొన్న నెలరాళ్ళు తమ అనుంగు నెచ్చెలి మరి కనరాదని కరిగి కన్నీళ్ళు కార్చినై. అయ్యయ్యో! అనుకుంది రాజమహేంద్రి గోదావరి. విశాఖలో, కాకినాడలో చెన్నపట్నంలో సముద్రం తమ నెచ్చెలికాడిక కనరాదని నిస్తరంగంగా, నిశ్శబ్దంగా, నిస్సత్తువగా నిట్టూర్పులు విడువను చాలక నిశ్చేష్టమై పోయింది. భద్రగిరి దాశరథి వోమున కరిమబ్బొకటి కమ్ముకుంది. స్వీయోదంత ప్రవచన శిరోమణి మరి లేదని. తల్లి సీతమ్మ రామయ్య ఎద మోము గ్రుచ్చి కన్నీటి కలువమాలను చేర్చింది సీతావృత్తాంత కోవిదుడిక లేడని. విల్లిపుత్తూరు వటపత్రశాయి నెలవునానుకున్న నందనంలో చంపకశాఖలపై నున్న పక్షులు ధ్వజస్తంభపు మువ్వల సవ్వడులు లేకుండానే హఠాత్తుగా ఉలికిపడి పెరురొద కావింపసాగినై. గోదా వాగ్వైభవాన్ని వివరించేవారు వెళ్ళిపోయారే అని.

ఏంజరిగింది? ఎందుకిలా అవుతున్నాయ్? ఏమి ఉపద్రవం వచ్చింది? ఏమి ఆపద ముంచుకు వచ్చింది? అవును ఉపద్రవమే! ఆపదే! ఏమా ఇక్కట్టు? ఇక్కట్టు కాక! ఆకసాన పునర్వసువును కారుమబ్బు కమ్మింది. అప్పలాచార్యస్వామి మరి లేరయ్యా! ఎవరూ? ప్రవచన శిరోమణి మహామహోపాధ్యాయ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారు ఆచార్య తిరువడికి చేరుకున్నారు ఆఁ! నిజమా!!

రామకథా సుధా స్రవంతులను తెలుగునేల ప్రవహింపచేసిన అప్పలాచార్యస్వామి మరి లేరా! తిరుప్పావై ప్రవచనాలతో నేతివాసనల ఆండాళును తెలుగునేల ఊరూరా వాడవాడా నెలకొల్పిన అప్పలాచార్యస్వామి ఇకలేరా?! ఇలలేరా?!

శాంతప్రసన్నమైన ఆ దివ్యమంగళ విగ్రహం కనరాదా! హృద్యానవద్యమైన, మృదుమధురమైన, పరమ ప్రామాణికమైన, అనుద్వేగకరమైన ఉద్దీపకమే కాదు. ఉజ్జీవకమూ అయిన ఆ ఆప్తవాక్కు ఇక వినపడదా! ఎంత దురదృష్టం! తెలుగునేలకు ఎంత నష్టం! తెలుగుజాతికి ఎంత కష్టం!

ఆస్తిక జనావళికి వారు మకుటం లేని మహారాజులు. రామకథా సామ్రాజ్యానికి వారు ఏకచ్ఛత్రాధిపతులు. తెలుగునాట ఇంటింటా తిరుప్పావై వారి భిక్ష. అసత్యం కాదు, అతిశయోక్తీ కాదు ఈ మాట.

వారి అవతారం, అధ్యయనం, అనుష్ఠానం, అధ్యాపనం అన్నీ అద్భుతాలే విశాఖజిల్లాలోని పద్మనాభం వారి జన్మస్థలం. అనంత పద్మనాభుడు అక్కడ వెలసిన పిలిస్తే పలికే వేలుపు. ఆ కొండ పక్కగా జలజల గోస్తనీ జాలువారుతూంటుంది. ఉభయవేదాంత ప్రవర్తకులైన శ్రీవైష్ణవ స్వాములు దండిగా విలసిల్లిన గ్రామం.

అప్పలాచార్యస్వామి పితరులు పుత్ర సంతానం కోసం వయసుడిగినాక సింహాద్రి నాథుని ప్రార్థించి గిరిప్రదక్షిణం కావింపగా ఆ అప్పని కరుణవల్ల అవతరించినవారు వారు. తాము అనంతుని లెంకలు కావడాన, అప్పని కరుణవల్ల జనించిన బిడ్డను **"అనంతప్పడు"** అని పిలుచుకున్నారా

\3/
*Mydocuments\ Bnjulyo3.p65*



దంపతులు. ఈ అనంతప్పడే తరువాత తరువాత ప్రవచన శిరోమణి, మహామహోపాధ్యాయ ఉ.వే.ప్ర. శ్రీమాన్‌అప్పలాచార్యస్వామివారుగా సుగృహీత నామధేయులు, సుప్రతిష్ఠిత భాగధేయులుగా విశ్రుతులైనారు.

విజయనగర మహారాజ సంస్కృత మహా పాఠశాలలో బ్రహ్మశ్రీ పేరి వేంకటేశ్వరశాస్త్రి గారు, ఉ. వే. శ్రీమాన్ కో. కం. వెంకట రామానుజాచార్యస్వామివారు, బ్రహ్మశ్రీ కర్రి శ్రీరామమూర్తి శాస్త్రిగారు మొదలైన మహానుభావుల సన్నిధిని భాష్యాంతం పాణినీయ వ్యాకరణం అధిగమించి వ్యాకరణ విద్యాప్రవీణులైనారు.

గురువుల చేత సహపాఠులచేత, సతీర్థుల చేత, సన్నిహితులచేత, బంధువులచేత, సర్వుల చేతా **"అనంతప్పడు బుద్ధిమంతుడు, విద్యావంతుడూ అయినాడు"** అని కతపత్రం పొందినాడు.

చదివిన శాస్త్రం, ఉన్న ప్రతిభ, జన్మతో లభించిన దివ్యసంస్కారం, లభించిన సాంగత్యం, కావించిన సాధన, సము పార్జించున్న బహువిధజ్ఞానం, సనాతన ధర్మ నిరతి, ఆచార్యానుగ్రహం అన్నిటిని మించి తెలుగువారు చేసుకున్న అదృష్టం అన్నీ కలసికట్టుగా ఈ మితభాషిని, ఈ బుద్ధి మంతుణ్ణి ఈ విద్యా వంతుణ్ణి, ఈ మృదు ప్రకృతిని, ఈ సాధుస్వభావుణ్ణి దేశానికి **"ప్రవచన శిరోమణి"**గా లభింపచేశాయి.

సామాన్యుల్ని, ధీమాన్యుల్ని, సమంగా ఆకట్టుకున్న అసామాన్యులు వారు. పండితుల చూపులు వారికి సిగపూవులైనాయి. జనావళి చూపులు వారి చరణాలకు సుమాంజలు లైనాయి.

భిన్నవృత్తులవారిని, భిన్న ప్రవృత్తులవారిని, భిన్న విద్యలవారిని, భిన్న విచారాలవారిని, భిన్నసంప్రదాయాలవారిని, భిన్న వయస్సుల వారిని సర్వులనూ సామరస్యంతో ఆధ్యాత్మిక పథంలో పురోగమింపచేసిన మహానుభావులు వారు. నిజానికి ఇట్టాంటివారే జగదాచార్యులు. రెండుమూడు తరాల విస్తృతమైన బహుముఖ మైన సమాజాన్ని ఆధ్యాత్మికనందనంలో శ్రీరామ కల్పవృక్షచ్ఛాయలో కదలక, మెదలక నిలువ చేసిన ఉజ్జీవింపచేసిన మహోదార మహా దేశికులు వారు. కొన్ని తరాలకు సరిపడిన నిక్షేపాలను ఎదముంగిలితో పాటు కనుల ముందూ నిలిపిఉంచిన మహోపకారకులు వారు.

ఏ తండ్రి తన సంతానానికి ఇవ్వగలడు ఇంత సంపద? ఏ ఆచార్యుడు తన శిష్య వ్రాతానికి ఇవ్వగలడు ఇంత విజ్ఞానాన్ని? ఏ రాజు తన ప్రజకు ఇవ్వగలడు ఇంత శాశ్వతసుఖాన్ని, అపూర్వానందాన్ని.

ఎన్ని తరాలవరకూ ఈ జాతి అప్పలా చార్యస్వామికి ఋణపడి ఉండాలో! ఈ ఋణం తీరేది కాదు. తీరాలనీ కాదు. ఇది ఇట్లా పెరుగుతూనే ఉండాలి.

అవునూ వామనుడు త్రివిక్రముడైనట్లు ఆ అనంతప్పడు ఈ అప్పలాచార్యస్వామిగా ఎలా రూపు దిద్దుకున్నారు?

ఆ వైనం చిత్తగించండి.........

విజయనగర మహారాజ సంస్కృత విద్యా కళాశాలలో వ్యాకరణ విద్యాప్రవీణులైన అప్పలాచార్యస్వామి అక్కడక్కడ ఉన్నత పాఠశాలలలో ఉపాధ్యాయులుగా ఉంటూ గవర్నమెంట్ సర్వీసులకు సెలక్ట్ అయినారు. మదరాసు ప్రెసిడెన్సీ కాలేజీలో సంస్కృత పండితులుగా ప్రవేశించారు.

మదరాసులో వారున్న రోజుల్లో సాహితీ సుమహితుల సాంగత్యం వారికి లభించింది. **'తిరువల్లిక్కేణి మీసాలపార్థసారథి'** వారి ఎదలో కాపురం పెట్టేడు. సనాతన ధర్మాన్ని నడుస్తున్న కాలానికి అనుగుణంగా మలచి చెప్పుకోవాలి అన్న తలపు వారిలో మొలకెత్తింది. రోజూ సాయంకాలం మెరీనాబీచ్‌లో సముద్రం కావించే తరంగనాదం వారికి శ్రుతి శుభగమైంది. అంతతో ఊరుకుందా?! తనను గిలిగింతలు పెట్టి, ఎదను లోనకల్లోలం

కావించిన రామప్రభుని రమణీయ రసోదంతాన్ని ఆ నాదాల్లో వినిపించిందేమో కూడాను సముద్రుడికీ రామచంద్రుడికీ ఉన్న సంబంధం రసోదంచితం. ఆ రసబంధం చూసి రావణుడు సైతం తోయధీ! ధన్యుడవు నీవు అంటాడు.

ఆ రోజుల్లో స్వామి శివశంకరులు, కాటూరివారు, కృష్ణశాస్త్రిగారు మొదలైన భావుకులంతా వినిపించే కవితలు వారి ఎదచేరి విహరిస్తూండేవి. ఈ కవితలు లోన చేరి పొరలు తొలగించుకొని, లోలోపలకు కొనసాగినై. చమత్కారం! దూడలను చూసిన నవప్రసూత సురభుల్లా జనిపరంపరలుగా ఎదలోపలి పొరల్లో పదిలంగా నెలకొన్న మధురభావుకులు భక్తిరస చక్రవర్తులు ఆళువారల శ్రీసూక్తుల వాసనలవి కట్టు తెంచుకుని వెలికి వచ్చి స్వామి ఎదనే కాదు, తలపులనూ పలుకులనూ దివ్య పరిమళాధి వాసితములనుచేసినై.

సహజంగా వారు వైయ్యాకరణులు కావడం వల్లనో, తెలుగువారి భవితవ్యం వారి పలుకుల్లో ఉండడంవల్లనో వారు రామకథా ప్రవచన శిరోమణులు కావాలసి ఉండడం వల్లనో వారు కవులు కాలేదు. కాని మంచి భావుకులు వారు. తరువాతి రోజుల్లో ఒక గోవిందరాజుగా, ఒక వీరరాఘవ దేశికులుగా ఒక పెరియ ఆచ్చాన్ పిళ్ళగా జనావళి ఎదలలో వారు నిలిచిపోవడానికి పూర్వరంగం ఇట్లా ఏర్పడింది.

సముద్రం పక్కనే ఉన్నా సర్వదా స్నానీయం కాదు. పానీయమసలేకాదు దర్శనరామణీయకం తప్ప ఉపభోగయోగ్యత లేదు. అన్నీ ఉన్న గోదావరిపిలుపునందుకున్నారు. రాజమహేంద్రి చేరుకున్నారు. వ్యాసులవారు సంచరించిన భూములు గౌతమీ తటస్సీమలు.

**బహువన పాదపాబ్ధి కులపర్వతపూర్ణ**
**సరస్సరస్వతీ**
**సహిత మహా మహిభర మజస్ర సహస్ర**
**ఫణాలిదాల్చి దు**
**స్సహతర మూర్తికిన్ జలధిశాయికి బాయక**
**శయ్యయైన అ**
**య్యహిపతి మష్కృతాంతకుడనంతుడు మాకు**
**ప్రసన్నుడయ్యెడన్**

అని నన్నయగారు కావించిన అనంత స్తవాన్ని గోదావరి వినిపించిందేమో తన అనంత స్వరూపం లీలగా గోచరించిందేమో వేయి పడగల విజృంభణానికీ వల్మీకం అయిందేమో రాజమహేంద్రి.

అధ్వరధామ కోనసీమ. శ్రుతి సీమంతినీ చరణ మంజు మంజీరశింజా ముఖరితం గౌతమీ సీమ. జయంతి భగీరథ శాస్త్రులవారు, మండలీకం వెంకటశాస్త్రిగారు. బులుసు అప్పన్నశాస్త్రిగారు ఎంతమంది విపశ్చి దపశ్చిములో శాస్త్రాలు వెదజల్లిన సీమ అది. ఆ గాలిలో వ్యాకరణముంది, ఆ గాలిలో తర్కముంది. ఆ గాలిలో వేదాంతముంది, ఆ గాలిలో భరతముంది, ఆ గాలిలో గాంధర్వ ముంది, ఆ గాలిలో వేదముంది.

కందుకూరిగారు, చిలకమర్తివారు మొక్కపాటి వారు, పానుగంటివారు, శ్రీపాదవారు ఇట్లాంటివారి వ్యక్తిత్వాలతో సంపన్నమైనది రాజమహేంద్రి. రాజమహేంద్రిపై కూర్బేదొర ప్రభావమూ తక్కువది కాదు. చెన్నా ప్రగడవారింట్లో తోలేటివారింట్లో నిడమర్తి వారింట్లో, గౌతమీ గ్రంథాలయంలో సాహిత్య గోష్ఠులతో అసలే గౌతమీ తరంగ శీకరాసారాలతో ఇవతళించిన రాజమహేంద్రి రసపిచ్ఛిలం అయింది. అప్పలాచార్యస్వామి ఎద రసతరంగితమైంది.

అప్పలాచార్యస్వామి పూర్తిపేరు. అనంత అప్పలాచార్యస్వామి. అనంతుడికి శేషుడని వ్యవహారం. పాణినీయ మహాభాష్యకారుడు పతంజలి శేషుని అవతారంగా విఖ్యాతుడు.





అనంతనాములప్పటికే పాతంజల మహా భాష్యాన్ని అధికరించారు.

**"మహాభాష్యం వా పాఠయేత్ మహారాజ్యం వా పాలయేత్"** అన్న ఆభాణకం మహాభాష్య వైభవాన్ని సూచిస్తుంది. అయితే, శ్రీ మహచ్ఛబ్ద భూషితాలుగా శేషభాషితాలు రెండు భాష్యాలు ఉండగా ఒక్క భాష్య సేవనంతో ఆనంత్యం ఎల్లా సిద్ధిస్తుందనుకుంటున్నారేమో స్వామి అంతరంగంలో. ఇంటిపేరులో శ్రీభాష్యం ఉంది. పేరులో అనంతుడు ఏదో కొరత ఉన్నట్టు అనిపిస్తుందేమో ఎదలో కల్పవృక్షం ఉంది. దాని నీడను కామధేనువును నిలిపితే బాగుండుననిపించిందేమో.

నిజమే! కాని,

**"సుమనసో భౌమాః పిబంత్వన్వహం"** అని ఇదిగో వేల్పుగిడ్డి పాలు త్రాగండి అని దాన్ని తోలుకుని వచ్చి నిలిపేవారుండవద్దూ! ఔను! ఉండాలి. దివ్యసంబంధం కలవారి కోరికలూ దివ్యంగానే ఉంటాయి. అవి నెరవేరే తీరూ దివ్యంగానే ఉంటుంది.

స్వామిని వెతుక్కుంటూవారి తిరుమాళిగకు వేంచేసినారు ఓ సుప్రభాతాన శ్రీ గోపాల దేశికులు. "మాకడ దేవసురభి తానున్నది. పాలు కావాలని మీ ఎదనున్నది. మీ ఎద పొలిమేరల సారస్వత శాద్వలములు సాంద్రమ్ముల నంతమ్ములు అతిశయముగ తామున్నవి. సురభి తిరుగనవి చాలును. మీ ఎదలో కుదురుకున్న మహాభాష్య కల్పతరువు మా సురభికి కట్టుకొయ్య. మీ ఎదలోనికి మము రానిచ్చిన మేమే సకలము నెరవేర్పగలము. పేయమ్ములు శ్రేయఃప్రేయోదములు ఆ దుగ్ధము లారగించి జనావళికి చూరలిడుడు" అన్నారు గోపాలదేశికులు.

శ్రీభాష్యంవారు శ్రీభాష్య మధిగమించారు. దేవ పారిజాత పరిమళాలతోపాటు వకుళ ప్రసూన వాసనలూ వారి ముకుపుటాలను తాకినై. పద్మనాభంలో బాల్యంలో వాకిటిలోకి రాగానే నేలరాలి సుమ వితర్దికలుగా నేర్పడి తావులు విరజిమ్ము పొగడలు గుర్తువచ్చినై. ఆళువారుల శ్రీసూక్తులనాప్యాయనంగా, అతృప్తామృతంగా ఆస్వాదించారు. గోపాల దేశికులు భగవద్విషయాన్నీ అనుగ్రహించారు. అరకొరలు లేకుండా సాధికారంగా శంకాతంకాలకు, విచికిత్సలకు, తావులేకుండా ఆచార్యసన్నిధిని ఉభయవేదాంతాలను సమగ్రంగా గ్రహించి, అంతరంగ దఘ్నమైన ఆచార్యుల ఆప్యాయనానికి ఆస్పదమైనారు అప్పలాచార్యస్వామి.

మళ్ళీ సముద్ర తీరానికి చేరారు స్వామి. కాకినాడ సాహితీ రంగస్థలం. కళావాటిక. సాంస్కృతిక కేంద్రం, పిఠాపురం రాజావారి కళాశాల పేరుమోసినదారోజుల్లో కాకినాడలో. తెలుగునాడును అఖిల భారతానికీ చూపినది కాకినాడే. రఘుపతి వెంకటరత్నం నాయుడు గారు, కాకినాడకు సిగపువ్వు. వారణాశి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు మొదలైనవారి ప్రభావం కాకినాడపై ఎంతగానో ప్రసరించింది.

అంతకు ముందువారైన జయంతి రామయ్య పంతులుగారు, పిఠాపురం రాజావారు వీరంతా కలిసి నెలకొల్పిన ఆంధ్ర సాహిత్య పరిషత్తు అక్కడ నుంచి వెలువడే ద్వైమాసిక సాహిత్య పత్రిక కాకినాడనే కాదు, మొత్తం అవిభక్త మదరాసు రాష్ట్రాన్నే ఒక ఊపు ఊపినై. పరిషత్సభలు పరమ ప్రామాణికంగా, ఉదాత్తంగా సాగేయి.

కృష్ణశాస్త్రిగారి భావకవితా ఝరీమాధురిని చవిగొన్నది కాకినాడ. ఆంధ్రవారోత్సవాలకు కాకినాడ పెట్టినది పేరు. 'వింజమూరి సిస్టర్స్' పాడే కృష్ణశాస్త్రిగారి భావగీతాలతో కాకినాడే కాదు, దేశమంతా ఉర్రూతలూగింది.

ఇది, అది అనికాక అన్ని రంగాలలోనూ ఆంధ్రదేశానికి సిగపూవుగా నిలిచినది కాకినాడ.

అదిగో – ఆ కాకినాడకు చేరినారు అప్పలాచార్యస్వామివారు. సంప్రదాయ పరంపరాయాతమైన ఆభిజాత్యమొకటి తమకుంది. తాము చదివినది పాణినీయ వ్యాకరణ శాస్త్రం. గౌతములతో కణాదులతో పరిచయముంది. యోగశాస్త్రకారునితో చెలిమి చేసుకున్నారు. బాదరాయణులను కూర్చోపెట్టి భాష్యకారులు గోష్ఠి సాగిస్తూంటే ఆ వంక ఈ వంక చేరి నిలిచి ఏవో కొన్ని మాటలాడి, కడకు పెదవులు విడక రాపడి చూస్తున్న కపిల జైమినులు జినసుగతులు మొదలైనవారి అంతరంగాలు అవగతం చేసుకున్నారు. భర్తృహరితో (వాక్యపదీయం) ఎంత మైత్రి ఉందో భరతునితోనూ (నాట్యశాస్త్రం) అంత చెలిమి చేసుకున్నారు. తమకు విస్రంభస్థానం సనాతన ధర్మమే దర్శనమే, అయినా పాశ్చాత్య తత్త్వధోరణులనూ నిశితంగా పరిశీలించేరు.

ఎదవాకిట ఎందరు కవులు తచ్చాడినా, వారు లోనికి పిలిచి పీటవేసి కూచోపెట్టేది మటుకు కాళిదాసునే వారి సాగంధ్యం జన నాంతర సౌహృద ఫలం. సరేసరి. వాల్మీకికి వారి ఎద సింహాసనమే ఆయె. కులశేఖరులంటే ఎంత గౌరవవో గోపన్నగారన్నా అంత గౌరవమూను వారికి. రామాయణానికీ వారు వ్యాఖ్యానాన్ని ప్రసాదించేరు. రామదాసుగారి దాశరథి శతకానికీ వారు వ్యాఖ్యానాన్ని కూర్చేరు. ముకుంద మాలను వారు వ్యాఖ్యానించేరు.

స్వామివారి నేటి వ్యక్తిత్వం రూపు కట్టడానికి కాకినాడ ప్రసాధన మందిరమైన ఇక్కడ వారొక తపశ్చర్య కావించేరు. బహుముఖీనమైన విజ్ఞానం తమలో నెలవు చేసుకుంది. తమ అభిరుచి, అభిగమ్యం, ఆధ్యాత్మికాలుగా అగపడుతున్నై. కానీ, తాము మనుగడ సాగిస్తున్న సమాజముంది. అందు తమకొక పరిగణనీయత ఉంది. దాన్ని వదిలి నేలవిడిచి సాము చేయలేరు. అట్లాగే తమ ఎదలో కిక్కిరిసిన విజ్ఞానం శివజటాజూటంలోంచి జడముడులు విదిలించుకుని ఎల్లా వెలికి వచ్చి పడదామా అని సందులు వెతుకుతున్న వియద్గంగలా విరుచుకు పడడానికి సిద్ధంగా ఉంది. ఇప్పట్టున వారు పాటించిన సంయమనం, సాధించిన సమన్వయం అనితర సాధ్యాలు. అక్కరలేనివి తమకు కనబడకుండా చేసుకున్నారు. సజావుగా ఉన్నవాటిని తమ అదుపులో పెట్టుకున్నారు. బహుముఖీనమైన విజ్ఞానాన్ని ఏకాభిముఖం చేసుకున్నారు. సత్యమైన, ప్రియమైన, హితమైన, అనుద్వేగ కరమైన వాక్కును వారు సాధించుకున్నారు. జలజలపారు సెలయేరులా వారిభాష ప్రవహింపసాగింది. మనసులో లాలసలేదు. వైయగ్ర్యం లేదు. అన్నిటినీ ఆదరిస్తారు. పర్యాప్తంగా అదే పరమార్థంకాదు. గమ్యమేదో మనసులో దృఢంగా నెలకొంది. అందుకనువైన భావనం ఏర్పడింది. భాష రూపుదిద్దుకుంది. వర్తనం కొనసాగింది. లౌకికాలౌకికాలకు నడుమ తాముండి ఉభయగోష్ఠీమిత్రులై సత్పథ నిర్దేశకులైనారు.

సుమారు 1970నాటికి ఈ పూర్వరంగ ప్రసాధనం పూర్తి అయింది. శ్రీశ్రీశ్రీ పెద్దజీయరు స్వామివారి కార్యక్రమాలు అప్పటికీ 35 సం॥లుగా సాగుతున్నై. గోపాలదేశికుల ద్వారా వారితో మనస్వామి వారికి అంతకుముందే అనుబంధం ఏర్పడింది. వారి కార్యక్రమాల్లో అన్వయించుకోసాగినారు. ఇప్పటిలా ఊరూరా ప్రతివారూ తిరుప్పావై ప్రవచనాలు ప్రసాదించడం అప్పటిలో లేదు. శ్రీజీయరు స్వామివారు శ్రీసీతారామ యతీంద్రులు ధనుర్మాసవ్రతాలు ప్రారంభం చేసారు. మహావిద్వాన్ కాంచి ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారు సంస్కృతంలో అనుగ్రహించిన తిరుప్పావై వ్యాఖ్యానాన్ని ఆంధ్రదేశంలోని చాలామంది పండితులు అనుసంధించుకొని ఆనందిస్తూండేవారు. అప్పలాచార్యస్వామి ఆ వ్యాఖ్యననుసంధించు కుంటూ ఆనందిస్తూంటే





వారుంటున్న ఇంటి యజమానులు మంచి సంప్రదాయాభిరతి కలవారు కావడంవల్ల 'ఏమిటాచార్యులవారూ, ఆ గ్రంథమంత దీక్షతో చదువుతూ ఆనందిస్తున్నారు, మాకూ వినిపించవచ్చు కదా' అన్నారట. స్వామి శాలీనతతో కాస్త తటపటాయించి సరేనన్నారు. అణ్ణంగరాచార్య స్వామి వ్యాఖ్య వారినోట వెలికి వచ్చింది. ఆ బంగారానికి తావులు కూర్చినారు వారు. మరునటేడు బహిరంగంగా ప్రవచనం కావించారు స్వామి. కాకినాడ శ్రోతలు విజ్ఞులు, ఉదారులు, సంస్కారులు, రసికులు, లోకోపకారకులూను. స్వామి ప్రవచిస్తూ ఉంటే 'టేప్ రికార్డర్' పెట్టి క్యాసెట్లలో వారి ప్రసంగాన్ని రికార్డు చేసేరు. తరువాతి సంవత్సరం అంటే 1974లో ఉ.వే.శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారి తిరుప్పావై వ్యాఖ్యానం గ్రంథరూపంలో వచ్చింది.

అప్పటికి తిరుప్పావై వ్యాఖ్యానాలు తెలుగులో చాలా వచ్చేయి. ప్ర.భ. స్వామివారికి చాలా ముందే మతత్రయ మిత్ర పండిత టి. లక్ష్మణాచార్యులవారి తిరుప్పావై ప్రవచనాలు ముద్రితాలు. 1954 నాటికి ఆనందమ్మగారి మధురోపన్యాసాలు వచ్చేయి. జగ్గయ్యపేట అయ్యవార్లంగారి రుచిరార్థబోధిని సంస్కృతంలో ఏర్పడింది. వీటన్నంటికీ ముందు 1874లో శ్రీమత్పరవస్తురంగా చార్యులయ్యవార్లగారి మువ్వాయిరప్పడి ఆంధ్రానువాదం ప్రకటితం. కందాళ శేషా చార్యులవారి అనువాదమూ వెలికి వచ్చింది. ఇన్నింటినీ ఆకళింపు చేసుకొని తమ వ్యక్తిత్వాన్నీ, ప్రతిభనూ మేళవించి చక్కటి పరిష్కారంతో తమదైన ఒకానొక విలక్షణ ముద్రతో శ్రీభాష్యంవారు తిరుప్పావై భాష్యాన్ని వెలయించేరు.

తిరుప్పావై తరువాత శ్రీభాష్యం స్వామి వారు తమ మనసును శ్రీరామాయణం వైపు మళ్ళించారు. సత్సంప్రదాయపరులలో నిత్యమూతిరువారాధనమైనాక శ్రీరామాయణం అనుసంధించుకోవడం చిరసమాయాతమైన అలవాటు. పర్యాప్తమైన పరికరం కలవారు కావడంచేత గోవింద రాజీయం, తనిశ్లోకి వంటి వ్యాఖ్యానాలతో పాటు తిరుమల నంబిగారు, కూరత్తాళ్వాన్ వంటి వారి నుంచి పెరియ ఆచ్చాన్ పిళ్ళగారి వరకు ప్రాస్తావికంగా వారు శ్రీరామాయణ ఘట్టాలకు, శ్లోకాలకు, పదాలకు ప్రసాదించిన పరిష్కరణాలు కావించిన నిర్వాహాలు ఎరిగిన వారు కావడంచేత నిత్యానుసంధానంలో ఉన్న శ్రీరామాయణాన్ని ప్రచారం చేస్తే జనం మనస్సులు ఆర్ద్రాలయి, ఉపదేశం ఫలించి మానవత మారాకు తొడిగి, సౌహార్దపు విరులు విరిసి, సౌశీల్యం దశదిశల గుబాళిస్తుంది అని తలపోసేరు.

శ్రీరామాయణం అంతా సమానంగా ఉపాదేయమే అయినా 'తత్రాపి చ' అన్నట్టుగా సుందరకాండ ఉపాదేయతమం గాభావించారు. శ్రీమన్నిగమాంత మహాదేశిక స్వాములు రూపకం ఎదకుదురుకుంది. వ్యుత్పత్తి సింహాసన మైంది, ప్రతిభ ముత్యాల వెల్లగొడుగైంది. రామకథా వ్యాఖ్యాతలందరూ మూలబలంగా నిలిచారు. శ్రీభాష్యంవారు శ్రీరామాయణ వ్యాఖ్యాన సామ్రాజ్యం స్థాపించారు. తమ ఏకచ్ఛత్రాధిపత్యంలో. సుందరకాండతో ప్రారంభమై శ్రీరామాయణ మంతా వారి వ్యాఖ్యానంతో పరిష్కృతమైంది. ఇవేళ ఆంధ్ర దేశంలో శ్రీరామాయణమనగానే అప్పలాచార్య స్వామి, శ్రీభాష్యం వారి పేరు వినగానే శ్రీరామాయణమూ గుర్తురాక తప్పదు. వారు శ్రీరామాయణ వ్యాఖ్యాన చక్రవర్తులు.

తరవాత వారు భాగవతానికీ వ్యాఖ్యానాన్ని ప్రసాదించినా జనం మట్టుకు వారిని శ్రీరామాయణ వ్యాఖ్యాతగానే స్మరించు కుంటారు.

సుమారు రెండు దశాబ్దాలపాటు తిరుప్పావై ప్రవచనాలతో శ్రీరామాయణ ప్రవచనాలతో ఆంధ్రదేశాన్ని భక్తిరసాంచితం కావించేరు వారు.

తాము ఏ సంప్రదాయానికి చెందినా శ్రీరామాయణం మట్టుకు శ్రీభాష్యంవారి వల్లనే వినాలని దేశంలోని చాలామంది పెద్దలు

అనుకొనేవారంటే వారి యోగ్యత ఎట్లాంటిదో ఎంతగా శ్రోతలను వారు తమవైపు ఆకర్షించుకొనేవారో తెలుస్తుంది.

కులపతులు ఉ.వే.శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామివారి శిష్యులలో ప్రముఖులు. అంతేకాదు, అంతేవాసులందరిలో ఆచార్యులకు ప్రీతిపాత్రులైన వారూను.

శ్రీ పెద్దజీయరుస్వామివారి వాత్సల్యాన్ని చూరగొన్నవారు శ్రీమాన్ అప్పలాచార్యస్వామి వారు. వారి తిరుప్పావై ప్రవచనాలను విని వ్యాఖ్యానాన్ని చూచి, చాలా ఆనందించి ప్రశంసించినారు శ్రీవారు.

కంచి పరమాచార్య శ్రీశ్రీశ్రీ చంద్ర శేఖరేంద్ర సరస్వతీ స్వాములవారికి అప్పలా చార్యస్వామివారి పట్ల చాలా ప్రీతి, వారు తమ ప్రవచనాల ద్వారా సనాతన ధర్మ ప్రచారం కావిస్తున్నారని వారిని ప్రోత్సహించా లని విశాఖ ప్రముఖులకు ఒకసారి వారు సూచించినారు కూడాను.

ముముక్షు జన పీఠాధిపతులు సీతారామ యతీంద్రులకు, లక్ష్మణ యతీంద్రులకు వారిపట్లగల మక్కువ ఇంతా అంతాకాదు. లక్ష్మణ యతీంద్రులు వారిని ఆచార్యులుగా వరించి వారికడ భగవద్విషయాన్ని సేవించినారు కూడా.

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగరామానుజ జీయరుస్వామివారికి వారు ఆచార్యులు. శ్రీస్వామివారు అప్పలాచార్యస్వామివారిని ఎంతగానో సంభావించేవారు.

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారికి శ్రీమాన్ అప్పలాచార్యస్వామివారి యందు ఆచార్య ప్రతిపత్తి. సుమారు రెండు దశాబ్దాలపాటు శ్రీవారి వెన్నంటి నడిచినారు అప్పలాచార్య స్వామి.

అప్పలాచార్యస్వామివారి తిరుప్పావై వ్యాఖ్యానాన్ని తమ శిష్యులకు పాఠ్యగ్రంథంగా నిర్దేశించినారు శ్రీ చిన్న జీయరుస్వామివారు. అప్పలాచార్యస్వామివారితో పాటు ఉ.వే. శ్రీమాన్ డా॥ కందాళ వెంకటాచార్యస్వామి వారు శ్రీవారి ననుసరించినారు. ఇప్పటికీ శ్రీవారి ననుసరిస్తూనే సేవించుకుంటున్నవారు ఉ.వే. శ్రీమాన్ శ్రీరామచంద్రాచార్యస్వామి వారు. ఈ ముగ్గురూ శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారి ఆస్థానిలో ఉత్తరాంధ్రత్రయంగా ఖ్యాతిగాంచినవారు.

ఎంతటి శాస్త్రీయమైన జటిలమైన, వివాదగ్రస్తమైన విషయాన్నైనా ఏ చిక్కులూ లేకుండా ఏ ముడులూ ముళ్ళూ అడ్డకుండా ఏ తిప్పలూ పడకుండా ఎవరి మనస్సూ నొప్పింపక సరళంగా విశదంగా సులభంగా ప్రవచించే శ్రీభాష్యంవారి శైలిపట్ల శ్రీశ్రీశ్రీ చిన్నజీయరుస్వామివారికున్న మక్కువ ఇంతా అంతాకాదు.

కవిశాబ్దిక కేసరి, మహామహోపాధ్యాయ, శాస్త్రరత్నాకర ఉ.వే.ప్ర. శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామివారికి అప్పలాచార్య స్వామి వారిపట్ల, కల గౌరవం అపారమైనది. ఉ.వే.ప్ర. శ్రీమాన్ ఎస్.టి.పి.వి. కోనప్పాచార్య స్వామివారు, ఉ.వే.ప్ర.శ్రీమాన్ ఆచి శ్రీనివాసా చార్యస్వామివారు, ఉ.వే.ప్ర. శ్రీమాన్ సిరిసినగళ్ వేంకటాచార్యస్వామి వారు మొదలైన ఉభయవేదాంత విద్వాంసులందరకూ అప్పలాచార్య స్వామివారిపట్ల కల గౌరవాదరాలు ఎనలేనివి. ఉ.వే.ప్ర. శ్రీమాన్ డా॥ ఎస్.వి. రంగరామానుజాచార్యస్వామి వారికి, ఉ.వే.ప్ర. శ్రీమాన్ డా॥ఎస్.టి.కె. రంగాచార్యస్వామి వారికి శ్రీభాష్యంవారు సంస్కృత వేదాంతాచార్యులు.

అప్పలాచార్యస్వామివారు పొందిన సత్కారాలు, అందుకున్న పురస్కారాలు అసంఖ్యాకాలు.

మొన్న ఏప్రియల్‌లో శ్రీభాష్యంవారి **'వేయి నెలవంకల చూపుల పండుగ'** ఘనంగా సార్వభౌమ వర్చస్కంగా దివ్యవైభవసనాథంగా సాగింది విశాఖలో. ఆ తిరునాళ్ళలో తిరుపతిలోని రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం విశాఖకు తరలివచ్చి





అప్పలాచార్యస్వామిని **మహామహోపాధ్యాయ** బిరుదంతో సత్కరించింది. చెన్నై నుంచి శ్రీశ్రీశ్రీ చిన్న జీయరుస్వామివారు విశాఖకు వేంచేసి తమ ఉపస్థితితో ఈ ఉత్సవానికి శోభను చేకూర్చినారు.

తెలుగువారి ఎదలలో నేతివాసనల ఆండాళును నెలకొల్పిన మహానుభావులు వారు. తెలుగునేల రామకథా సుధా స్రవంతులను ప్రవచింపచేసిన మహోదారులు వారు. తమ ప్రతిభను వేయిపడగల విప్పి భవతప్తమైన తెలుగు నేలకు ఆధ్యాత్మిక ఛాయను ప్రసాదించిన అనంతులు ఉ.వే.శ్రీమాన్ అప్పలాచార్యస్వామి.

వారు కృతకృత్యులు. **'కృతకృత్యాః ప్రతీక్షంతే మృత్యుం ప్రియమివాతిథిం'** అల్లా అని వారు మూతి మూసుకు కూచోలేదు. కాలు కదలనీయక పోయినా ఎద ఉప్పొంగు తూనే ఉంది. పెదవులు స్పందిస్తూనే ఉన్నాయి. వాక్కు క్రమగంభీరంగా చేరినవారి చెవుల నినదిస్తూనే ఉంది.

**శ్రీభాష్యంవారి చరమయాత్రాలోకోత్తరమే**

విశాఖలో శ్రీశ్రీశ్రీత్రిదండి శ్రీరంగ రామానుజ జీయరుస్వామివారు జూన్ 2 నుండి 10 వరకు లోకకల్యాణం కోసం శ్రీలక్ష్మీ నారాయణ క్రతువు నొకదానిని తలపెట్టినారు. **'జీయరుల మంత్రోపదేశములు'** అని 3వతేదీన వారొక విలక్షణాద్భుతమైన కార్యక్రమాన్ని రూపొందించినారు.

రహస్యత్రయ సార ప్రతిపాదకమైన శ్రీపరాశరభట్టరుల అష్టశ్లోకిని ఆ సందర్భంగా **ఎనమండుగురు జీయరులు జనావళికి ఉపదేశం కావించినారు.** ఆ నారాయణ స్వరూపుల్ని అవలోకించినారు అప్పలాచార్య స్వామి. అష్టాక్షరాలు స్వరూపంతో వారికి గోచరించినై. వారి ఉపదేశంతో ఎదముడులు విడిపోయినై. ఎడద ఆనందజలధి అయిపోయింది.

అప్పలాచార్య శరీరాన్ని నెలవు చేసుకొన్న జీవుడు దేశికానుగ్రహంతో పరమపదానికి ఉత్క్రమించడానికి ఉపక్రమించినాడు. బంధువులు పాపం బాధపడు తున్నారు అనుకున్నారు.

జీయరుల సాక్షాత్కారంతో, సందేశంతో, పాంచాహ్నిక దీక్షతో రహస్య త్రయాన్ని భావన చేసిచేసి 7వ తేదీన పరమపదానికి పయనమైన పంచమోపాయనిష్ఠులు వారు.

మన వైభవాన్ని లోకానికి చాటి చెప్పిన ప్రియపుత్రుడు వచ్చినాడని సంబరపడిపో తున్నారు శ్రీ శ్రియఃతులు పరమపదంలో. జనంలో నైతికవర్తనాన్ని నెలకొల్పినావయ్యా చాలా సంతోషంగా ఉంది నిన్ను చూస్తే అంటున్నారు పరమ ఋషులు.

వారిలో ఆజానుబాహువొకరు నొసట ఊర్ధ్వపుండ్రంతో, వెండిగడ్డంతో కళ్ళల్లో కరుణతో ఎవరూ! ఆc! వాల్మీకులేమో దగ్గరగా వచ్చి అప్పలాచార్యస్వామిని బిగ్గ కౌగలించుకొని ఇక నిత్యముక్తులకు రామకథ నువ్వే వినిపించాలి సుమా అన్నట్టున్నారు. వెంటనే మఠం వేసుక్కూచుని అప్పలాచార్యస్వామివారు.

**ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్**
**లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్**

అని రామకథా ప్రవచనానికి ఉపక్రమిస్తున్నారు ... అక్కడ...

**అబ్దే శ్రీమత్సుభానౌ వసతి వృషగృహేభాస్కరే**
**జ్యేష్ఠమాసే**
**అష్టమ్యాం శుక్లపక్షే రవిసుత దివసే**
**హ్యప్పలాచార్య వర్యః**
**శ్రీమద్గోపాల సూరేరధిగత నిగమాంతద్వయో**
**దేశికాగ్ర్యః**
**ప్రాగాత్కౌండిన్య గోత్రో గురుపద యుగళం**
**శ్రీనివాసాత్మజాతః ॥**

# మహర్షుల చరిత్ర
## శౌనక మహర్షి

తమిళమూలం :
వై.వా. నావల్పాకం దేవనాథ
తాతాచార్యస్వామి

తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూపురాణి
ఉడయవర్స్వామి, విజయవాడ

శౌనక మహర్షి వ్రాసిన గ్రంథాల్లో **'బృహద్దేవతా'**అనే గ్రంథం చాల గొప్పది. పాశ్చాత్య దేశీయుడైన **'మాక్డొనాల్'** దీనిని ఆంగ్లంలో అనువదించాడు. పదివేల మంత్రాలతో మహాసముద్రంలాగా ఉన్న ఋక్వేదంలో ఏ మంత్రం ఏ దేవతను ఉద్దేశించి చెప్పబడింది మొదలైన విషయాలను సుస్పష్టంగా తెలియజేస్తుంది ఈ గ్రంథం. మంత్రంలో సగభాగమో లేక నాలుగవ భాగమో వేరు వేరు దేవతలను తెలియ జేసేవిగా ఉంటాయి ఋగ్వేదంలో. శౌనకుడు తన శక్తి సామర్థ్యాలతో వీటినన్నిటిని చాల స్పష్టంగా వివరించాడు తన గ్రంథం (బృహద్దేవతా)లో ఒక్కొక్క మంత్రాన్ని స్వాధీనం చేసుకోవడానికి అవలంబించవలసిన క్రమాన్ని కూడ ఇందులో తెలియజేశాడు, శౌనకమహర్షి. మంత్రాన్ని ఉచ్చరించాలి అంటే ముందుగా **1. ఋషి, 2. ఛందస్సు, 3. దేవతా** – వీటిని ఉచ్చరించిన తరువాతనే మంత్రోచ్చారణ చేయాలి. ఈ మూడింటిని విడిచి ముందుగనే మంత్రాన్ని ఉచ్చరించకూడదు. అలాచేస్తే అది నిష్ఫలమే అవుతుంది. ఈ పద్ధతిని ఇంత వరకు అందరూ అనుసరించి వస్తున్నారు. ఇలాచేయడానికి కారణం ఏమి? అనుదానికి శౌనక మహర్షియే సమాధానం చెప్పి ఉన్నాడు.

పూర్వం ఋషులు ఆయా ప్రయోజనములకు తగినట్టుగా వేరు వేరు ఛందస్సులలో దేవతలను స్తోత్రం చేస్తూ మంత్రాలను దర్శించడం జరిగింది. అందుచేతనే **'మంత్రోచ్చారణకు ముందు ఋషులను, తరువాత ఛందస్సును, తరువాత ఆయా దేవతను'** చెప్పి అటు తరువాతనే మంత్రాన్ని ఉచ్చరించవలెను అనే క్రమం ఏర్పడినట్లు శౌనక మహర్షి తన బృహద్దేవతా అనే గ్రంథంలోని ఈ శ్లోకం ద్వారా తెలియ జేయు చున్నాడు.

**ఋషిం తు ప్రథమం బ్రూయాత్ ఛందస్తు తదనన్తరమ్।**
**దేవతా మథ మన్త్రాణాం కర్మస్వేవమితిశ్రుతిః ॥**
**(బృహద్దేవతా – 8- 138)**

### శౌనకుడు – వైష్ణవోత్తముడు

**'శౌనకీయం'** అనే పేరుతో ఇంకొక గ్రంథం ఉన్నది. మంత్రశాస్త్రగ్రంథంగా పేరుపొందింది. ఇందులో అనేక ఋక్వేద మంత్రాలకు అనుష్ఠాన ప్రక్రియ స్పష్టంగా తెలియజేయ బడింది. అందుచేత ఇది చాల ప్రయోజన కారిగా ప్రసిద్ధి చెందింది. ఈ గ్రంథం చివరలో శౌనకుడు **'విష్ణుపూజ ప్రతినిత్యము విడువక చేసుకోవలెను'** అని తెలియజేస్తూ గ్రంథాన్ని ముగించాడు. అనేక విధములైన యాగాలలో పూర్ణాహుతి విష్ణువుని ఉద్దేశించే చేయబడు చున్నట్లుగా, ఈ శౌనకుని గ్రంథం కూడ విష్ణువు యొక్క అర్చనా ప్రాముఖ్యాన్ని తెలియజేస్తూ ముగిసింది.

**శౌనకోऽహం ప్రవక్ష్యామి నిత్యం విష్ణ్వర్చనం మహత్।**
**ప్రవః పాన్త మంధస ఇత్యృచాభ్యర్చ్య విధానతః ॥**
**(శౌనకీయమ్ 2-21-1)**





పై శ్లోకంలో **'ప్రవః పాన్తమ్'** అనే ఋక్, విష్ణుపూజ ఆవశ్యకతకు అనుగుణంగా చూపబడింది. గొప్పవైష్ణవుడైన విఖనస మహర్షి కూడ ఈ ఋక్వేదమంత్రాన్నే ముందుగా గ్రహించడం గమనించ తగిన విషయం. ఆ విఖనస మహర్షి వలెనే శౌనకమహర్షికూడ భగవానుని దివ్యమంగళ విగ్రహ సౌందర్యాన్ని మనకు చక్కగా దర్శింపచేస్తాడు.

**శంఖ చక్ర గదా పద్మవనమాలా విభూషితం**
**పీతాంబరముదారాఙ్గం ప్రసన్నేన్దు నిభాననమ్।**
**శ్యామలం పుణ్డరీకాక్షం కిరీటేన విరాజితం**
**శ్రీభూమి సహితం విష్ణుం, పద్మస్యోపరి సంస్థితమ్ ॥**
**(శౌనకీయమ్ 2-21-5,6)**

పై శ్లోకములలో చెప్పబడిన విధంగా నిర్మించబడిన శ్రీమన్నారాయణుని విగ్రహము చాల ఆకర్షణీయంగా ఉంటుంది అని చెప్పబడింది.

ఈ క్రింది శ్లోకంతో ఈ గ్రంథం పూర్తి అవుతుంది.

**ఏతద్ విష్ణ్వర్చనం సమ్యక్ ప్రతిష్ఠా విధి సంయుతమ్।**
**యేన ప్రోక్తం సదా తస్మై శౌనకాయ నమో నమః ॥**

ఈ శ్లోకం శౌనకుని శిష్యులలో ఒకరిచేత రచించబడి చివర చేర్చబడియుండవచ్చు. ఈ గ్రంథంలో విష్ణుపూజతో బాటు ఇతర దేవతల పూజలుకూడ క్రమంగా చెప్పబడి ఉన్నా, ఈ మహర్షికి విష్ణుపూజయందున్న వ్యామోహం ఇతర దేవతాపూజయందు మనకు గోచరించదు. అంతేకాక చివరగా విష్ణుపూజా ప్రాశస్త్యంతోనే గ్రంథాన్ని ముగించడంచేత శౌనకుని 'ఉత్తమోత్తమ వైష్ణవుడు' అని అనడం సమంజసంగానే అనిపిస్తుంది. ఈయన అనుగ్రహించిన అనేక గ్రంథాలలో 'విష్ణుధర్మం' అనే గ్రంథం ప్రసిద్ధి చెందింది.

### వంశప్రశస్తి

శౌనక మహర్షి భృగువంశంలో జన్మించాడు. ఈయన తండ్రిపేరు శునకుడు. శునకుని కుమారుడు అనే అర్థం వచ్చేటట్లు **'శౌనకుడు'** అని పేరు పెట్టబడింది. శునకుడు గొప్ప కీర్తి ప్రతిష్ఠలు కలవాడు. మహా తపస్వి. ఋక్వేద సంబంధమైన కార్యములను నిర్వహించు వ్యక్తికి **'హోతా'** అని పేరు. ఈ పేరుతో ఈయన పేరు కలిసి ప్రసిద్ధిచెందింది. **'శున హోత్రిరమ్'**'**శౌన హోత్రమ్'** **'శౌనహోత్రి'** అనే పేర్లు సాధారణం అయ్యాయి. హోతలలో ఈయన చాలా ముఖ్యుడుగా పరిగణింప బడడమే దీనికి కారణం. అంతే కాదు వేదశాస్త్రాన్ని శిష్యులకు నేర్పడంలో ఈయనకు సాటి అయిన వాడు లేడు. తండ్రి వలె శౌనకుడు కూడఅంత గొప్పవాడే. ఉపాధ్యాయులుగా ఉండుటకు ఈ వంశంవారే తగినవారు అనే భావనతో 'శౌనకేయులు'గా వీరు అనేకులు ఆనాడు ప్రసిద్ధి చెందినారు.

ఋక్వేదంలోని పాష్కల – శాకల అనే రెండు శాఖలను ఒకటిగా కూర్చినవాడు శౌనకుడు అని తెలిసిన పెద్దలు అంటారు. ఈ శౌనకుడు తన పూర్వుల చరిత్రలు తెలుపమని సూత పౌరాణికుని మాటి మాటికీ అడుగుతూ ఉండేవాడట. ఆ సూత పౌరాణికుడు కూడ విసుగు విరామం లేకుండా చెబుతూ ఉండేవాడట. తన పూర్వుల చరిత్రలు వినడం అంటే అంత ఆసక్తి ఉండేదట శౌనక మహర్షికి. ప్రసిద్ధుడైన చ్యవన మహర్షి కూడ వీరి వంశానికి చెందినవాడే. ఈ శౌనకమహర్షి తండ్రి జన్మ కథ అద్భుతం. ఈయన తాత కూడ ఒక విచిత్ర వ్యక్తి.

# రామాయణంలో రమ్యగాథలు

## దాశరథి సతి కొఱకై ఉత్తర దిగన్వేషణ

-చెవుటూరి కుసుమ కుమారి, విజయవాడ.

**బుద్ధ్యా హ్యష్టాంగయా యుక్తం**
**చతుర్బల సమన్వితం ।**
**చతుర్దశ గుణం మేనే**
**హనూమాన్ వాలినః సుతమ్॥**

వాలి సుతుడైన అంగదుడు సామాన్యుడు కాడు. వీనియందు ఎనిమిది అంగములు గల బుద్ధి, నాలుగు బలములు, పదు నాలుగు గుణములు వున్నవి.

శుశ్రూష, వినుట, గ్రహించుట, ధారణము, ఊహ, అపోహ, విషయ జ్ఞానము, యధార్థ పరిజ్ఞానము అనునవి ఎనిమిది బుద్ధిగుణములు.

**శుశ్రూషా శ్రవణం చైవ గ్రహణం ధారణం తథా**
**ఊహాపోహార్థ విజ్ఞానం తత్త్వ జ్ఞానం చ ధీగుణాః**

(ఊహ అనగా ఆలోచించి విషయమును గ్రహించుట, అపోహ అనగా అయుక్త విషయమును పరిత్యజించుట)

సామ,దాన,భేద, విగ్రహములను నాలుగు లేక బాహుబల మనోబల - ఉపాయబల - బంధుబల అను నాలుగు బలములు.

**చతుర్దశ గుణములు :-** దేశకాలములను చక్కగా గుర్తెరుగుట క్లేశములు భరించుట, ధృఢత్వము, విషయమును పరిపూర్ణముగా తెలుసుకొనుట, నేర్పు, ఆలోచనను రహస్యముగా వుంచగలుగుట - బలము - వాదమునకు దిగకుండుట, ఇతరులు తన యందు చూపుభక్తిని గుర్తించుట- శౌర్యము - శరణాగత వాత్సల్యము - సమయమెరిగిన కోపము, కృతజ్ఞత, చపలత్వము లేకుండుట. ఇవి పదునాలుగు గుణములు.

ఈ అంగదుడు పరిపూర్ణ బల పరాక్రమ ముల చేత శుక్లపక్ష ప్రథమ దినముల చంద్రునివంటి ప్రకాశము కలవాడు. బుద్ధిలో బృహస్పతితోనూ, పరాక్రమమున తండ్రివాలి తోనూ సమానుడు. అయిననూ రాక్షస గురువైన శుక్రుని మాటలువినగోరిన ఇంద్రు నివలె ఈ తారుని చెప్పుడు మాటలు విని సక్రమమార్గమును ఎన్నుకొనకున్నాడు. తన కర్తవ్యమును విస్మరించుచున్నాడు. యువకుడు, ప్రభువు, సుగ్రీవుని శాసనము నిర్వర్తించుటలో అలసి పోయివున్నాడు. కనుక ఈతనిని కర్తవ్యో న్ముఖుని చేయుట ఆవశ్యమని భావించినాడు హనుమంతుడు.

సామ, దాన, భేద, దండోపాయములను నాలుగు ఉపాయములు కార్యసాధక సాధనములు. అందులోని మూడవది అయిన భేదోపాయముచేత....

**భేద యామాస తాన్ సర్వాన్ వానరాన్ వాక్యసమ్పదా**

తన వాక్చాతుర్యశక్తి చేత ఆ వానరులను విడగొట్టినాడు.

**తేషు సర్వేషు భిన్నేషు తతో అభీషయ దంగదమ్।**
**భీషణైర్వివిధై ర్వాక్యైః కోపోపాయ సమన్వితైః॥**

ఆ వానరులందరూ విడిపోయిన తరువాత అంగదునిలా భయపెట్టినాడు. "అంగదా! నీవు యుద్ధమున నీ తండ్రిని మించిన తనయుడవు. నీతండ్రివలే ఈ వానరరాజ్యమును పాలించు ధ్రడిమగల





వారు నీవుకాక వేరెవ్వరున్నారు? అంగదా!

**నిత్యమస్థిర చిత్తాహి కపయో హరి పుంగవ! ।**
**నా జ్ఞాప్యం విసహిష్యంతి పుత్రదారం వినాత్వయా॥**

ఓ వానర శ్రేష్ఠుడవైన అంగదుడా! నీవా ఈ వానరులు నీ ఆజ్ఞకు లోబడి వుందు రనియూ భావించుట. ఈ వానరులు. జన్మతః చపలచిత్తులు. దారపుత్రాదులకు దూరముగా వుండి వీరు నీమాట ఏ మాత్రము మన్నించరు. అంగదా! నేను నీకొక ప్రత్యక్ష సత్యమును చెప్పుచున్నాను. సావధా నుడవైవిను. మహాత్ముడైన జాంబవంతుడు, నీలుడు, మహాబలశాలిఅయిన సుహోత్రుడు నీతో కలసివుండరుగాక వుండరు. నేను కూడా నీ పక్షమున వుండను. సామదానభేద దండోపాయములచేతనైనా సరి నీవు మమ్ములను సుగ్రీవుని నుండి విడదీయ లేవు.

అంగదా! ఒక బలవంతుడు ఒక దుర్బలుని విరోధముచేత విడిచిపెట్టిననూ వానికి జరుగు నష్టములేదు. కాని దుర్బలుడు మాత్రము తన రక్షణను పోగొట్టు కొనును. అంగదా! ఈ ప్రదేశము బహు రక్షిత ప్రదేశమనీ, ఈ బిలము బహు రక్షిత ప్రదేశమని తారుడు చెప్పిన మాటలను విని నీవు బుద్ధికుశలుడవు అయికూడా సరిఅయిన నిర్ణయము చేయజాలకున్నావు.

అంగదా! పూర్వము యమునిని చంపుటకు ఇంద్రుడు వజ్రాయుధం విసరుటను చాల గొప్ప విషయముగా చెప్పుకొందురు కదా! కాని ఈ బిలమును లక్ష్మణుడు తన వాడి బాణముచేత ఆకుదొప్పను చీల్చినట్లు బ్రద్దలు చేయును. లక్ష్మణునివద్ద ఆ వజ్రాయుధముతో, పిడుగుతో సమానమైనవి, పర్వతములను కూడా చీల్చునట్టివి అయిన నారాచరములు అనేకములున్నవి.

నీవు ఎవరిని ఆప్తులుగా భావిస్తున్నావో ఆ వానరులు

**స్మరంతః పుత్రదారాణాం నిత్యోద్విగ్నా బుభుక్షితాః**
**ఖేదితా దుఃఖ శయ్యాభిస్త్వాం కరిష్యంతి పృష్ఠతః**

ఆకలిచేతా, భార్యాపుత్ర వియోగమును సదా స్మరించుటచేత కంటికి కునుకులేక దుఃఖించుచూ నిన్ను నిరాదరించి వదలివేసి ఏకాకిని చేయుదురు. అప్పుడు నీవు ఒక్క స్నేహితుడుగాని, హితబంధువుగాని లేక గడ్డిపోచకు కొరగాక భయభీతుడవై దుర్భర జీవితము గడుపవలసి వచ్చును. కర్తవ్య విముఖుడువై, ఏకాకివైన నిన్ను అతి తీవ్రము అతివేగముగల లక్ష్మణుని వాడి బాణములు నిన్ను చంపుటకై ప్రయోగింపబడగా నిన్ను రక్షించువారు ముల్లోకాల్లో ఎవరూ వుండరు.

నాయనా! అంగదా! అటులకాక నీవు కూడ మాతోపాటు వచ్చి వినయముతో సుగ్రీవునికి విషయమంతా చెప్పితివేని, ధృఢనియమశాలి, ధర్మనిరతుడు, సత్య ప్రతిజ్ఞా నిష్ఠుడు, పరిశుద్ధాత్ముడు, అన్నిటికన్న మిన్నగా నీయందు మిక్కలి ప్రేమకలవాడు, నీ తల్లికి ప్రియము చేకూర్చుటయే ధ్యేయముగా కలవాడు అయిన సుగ్రీవుడు ఎన్నటికీ నిన్ను చంపడు. అంగదా! నిన్ను చంపినచో అతనికి నీవుకాక మరొక సంతానము కూడలేదు. కనుక అంగదా! మనము తప్పకతిరిగి కిష్కింధకు వెళ్ళుదము రమ్ము అనినాడు.





# శ్రీవిష్ణు మహాపురాణము

## సప్తమాధ్యాయం

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, కొవ్వూరు.

చతుర్ముఖ బ్రహ్మ నుండి ఆవిర్భవించిన సంతానం, దానినుండి వితతమైన సంతితిని గురించి పరాశరుడు విస్తృతంగా వర్ణించాడు. రుద్ర సృష్టి తరువాత మళ్ళీ బ్రహ్మ తనను స్త్రీపురుషులుగా సృజియించుకున్నాడు. బ్రహ్మ మొట్టమొదటగా క్రోధాన్ని విడచిన తరువాత తననుండి ఆవిర్భవించిన స్వాయం భువ మనువునే ప్రజాపాలనలో నియమించాడు. ఏ దివ్యపురుషుని దేహం రెండుగా స్త్రీ పురుష రూపాలుగా ఆవిర్భవించిందని పూర్వం చెప్పుకున్నామో వాటిలో పురుష రూపమే స్వాయం భువ రూపంకాగా, స్త్రీరూపం **'శతరూప'**గా అయింది. ఈ శతరూప నుండి స్వాయంభువ సంబంధంగా ప్రియ వ్రతోత్తాన పాదులు - ప్రసూత్యాకూతులు ఆవిర్భవించారు. (అర్ధనారీశ్వర రూపంగా వెనుక చెప్పుకున్న బ్రహ్మ సృష్టికంటే ఇది వేరుఅని గుర్తించాలి.) వీరిలో ప్రసూతిని దక్ష ప్రజాపతికి, ఆకూతిని రుచి ప్రజాపతికి పత్నులుగా ఇచ్చాడు బ్రహ్మ. ఆకూతి - రుచి అనే దంపతులకే దక్షిణ - యజ్ఞ నామకులైన ఇరువురు ఆవిర్భవించారు. ఈ పేర్లు చాలా అర్థవంతంగాను మార్మికంగాను కనిపిస్తాయి.

కొంత ఈ నామనిర్దేశంలోని రహస్యం ఏమిటో గమనిద్దాం.

చతుర్ముఖ బ్రహ్మ స్వాయం భువమనువైనవాడు.

**'స్వాయం భువ'** శబ్దానికి తనంతతానుగా ఆవిర్భవించిన వాడని అర్థం. ఇది బ్రహ్మ యొక్క ప్రథమ సృష్టి సంకల్పంగా చెప్పవచ్చు. ఈ సంకల్పం - **'శతరూప'** అంటే అనేక రూపాలు కలిగి ఉంటుంది.

అయితే ఈ రూపాలలో దక్షత్వం - రుచిత్వం అనేవి ప్రధానాలు. ఏసంకల్పమైనా సమర్థమై ఉండాలి. ప్రీతి మంతమై ఉండాలి. దక్షత - రుచి లేనిచోట ఎట్టి కార్యారంభం కాదు. జగచ్చక్రం నడవదు.

రక్షకుడైనవానికే 'ప్రసూతి' అంటే ఉత్తమ కార్య నిష్పత్తి. కనుక దక్ష - ప్రసూతులు దంపతులు. ఇలాగే 'రుచి' ఉన్నచోటనే కృత్య నిర్వహణానికి చెందిన హృదయాభిప్రాయం అంటే ఆకూతి ఉంటుంది. కనుక రుచి - ఆకూతులు దంపతులు.

రుచ్యాకూతులున్నచోట అంటే ఒక కార్యాన్ని సాధించాలనే ప్రీతీ - తద్విషయకమైన దృఢాభిప్రాయం ఉన్నప్పుడే - యజ్ఞ రూపమైన కర్మ ఆవిర్భవిస్తుంది. ఆ కర్మ నిర్వాహకునకు ఒక ప్రతిఫలం అదే 'దక్షిణ' అనేది తప్పక ఉండితీరాలి కనుక యజ్ఞము - దక్షిణ అనేవి రుచ్యాకూతుల సంతానం యజ్ఞ - దక్షిణలు ఇరువురు రుచ్యా కూతుల సంతానమే అయినా - వీరిది రక్త సంబంధం కాదు. కనుక, వెనుక చెప్పుకొన్నట్లు వావి వరుసల ప్రస్తావన ఇక్కడ లేదు. వీరు సంకల్ప రూపంగా ఆవిర్భవించిన వారు కనుక వీరిరువురు మళ్ళీ మిథునం అయినారు.

\9/
*Mydocuments*
*Bnjulyo3.p65*



యజ్ఞం పురుషుడైతే - అది నిర్వహించిన వారికీయ వలసిన ప్రతిఫలం 'దక్షిణ' కాగా - దక్షిణ లేని యజ్ఞం నిష్ఫలమన్నమాట. ఇలా జంటగా ఏర్పడిన యజ్ఞ - దక్షిణలకు పంద్రెండుగురు పుత్రులు పుట్టారు. వీరే యములు 'యమ' అనే శబ్దంతో వ్యవహరింపబడే వీరిగురించి విష్ణుపురాణంలో వివరాలు లేవు. వ్యాఖ్యాతలు కూడా పేర్కొనలేదు. అయితే వీరే 'శ్రీభాగవతంలో 'తుషితులు'గా చెప్పబడ్డారు. వీరంతా దేవతలేనని నిర్ణయం.

ఇక - దక్ష- ప్రసూతులనే - మిథునానికి కలిగిన సంతానం గురించి పరాశరుడు ఇలా విశదపరచాడు. వీరి పేర్లూ చాలా అర్థవంతంగా ఉంటాయి గమనించండి.

దక్షుని భార్య ప్రసూతి.

సంకల్పం సమర్థవంతమైనప్పుడు ఆ సంకల్పం నుండి వివిధ ఫలాలు ఆవిర్భవించడం సహజమే కదా. కనుక దక్ష - ప్రసూతుల నుండి 24 మంది కన్యలు ఆవిర్భవించారు. వీరి పేర్లనూ విష్ణుపురాణం ఇలా నిర్దేశించింది.

**శ్రద్ధా, లక్ష్మీః ధృతిః తుష్టిః, పుష్టిర్మేధా క్రియా తథా।**
**బుద్ధిర్లజ్జా వపుః శాంతిః సిద్ధిః కీర్తి స్త్రయోదశ॥**

శ్రద్ధ (దక్షుడైనవానికి మొట్టమొదటిగా ఉండేది శ్రద్ధే.) శ్రద్ధ కలవానికి లక్ష్మితప్పదు - లక్ష్మీవంతునికి ధృతి (చిత్త స్థైర్యం ఉంటుంది.) వానికి తుష్టి (పరితృప్తి ఉంటుంది) పుష్టివానికే. వానికే! **'మేధ'** (ఆలోచింపగల బుద్ధిశక్తి) తదనుకూలమైన **'క్రియ'** (కర్మాచరణం) దానికి కావలసిన నిశ్చయాత్మకమైన **'బుద్ధి'**, తన్మూలంగా ఇది చేయవచ్చునో లేదో అనే జంకుతోపాటు సిగ్గు, (లజ్జ) ఉంటుంది. దక్షుడైనవానికి దృఢమైన దేహం దానిలో కీర్తి (మంచిపేరు) ఈ 13 ఉంటాయి. ఈ పదముగ్గురిని **'ధర్మ ప్రజాపతి'** తన భార్యలుగా స్వీకరించాడు. **(పత్న్యర్థం ప్రతిజగ్రాహ ధర్మో దాక్షాయణీః ప్రభుః)** వీటినే లౌకికంగా చెప్పుకుంటే శ్రద్ధ - **Faith**; **లక్ష్మి** - **Prosperity**; **ధృతి** - **Steadiness**; **తుష్టి** - **Resignation**; **పుష్టి** - **Thriving**; **మేధ** - **Inteligence**; **క్రియ** - **Actiar and Devotion**; **బుద్ధి** - **Intellect**; **లజ్జ** - **Modesty**; **వపు** - **Body**; **శాన్తి** - **Expiatine**; **సిద్ధి** - **Perfection**; **కీర్తి** - **Fame**; ఇవన్నీ దక్షుడైన వ్యక్తికి ఉండే లక్షణాలే అని మనం గుర్తింపవచ్చు.



## ఉభయవేదాంత సభలు

ఉభవేదాంత ప్రవర్తకులు ఉ.వే.ప్ర. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామివారి ప్రియ శిష్యులైన ఉ.వే.ప్ర.శ్రీమాన్ కందాళ వెంకటాచార్యులుగారి స్మృతి చిహ్నముగా ఉభయవేదాంత సభలు విజయనగరం, త్రైవర్ణిక రామానుజ కూటంలో నిర్వహించబడుతున్నాయి. ఈ సందర్భముగా ప్రతి సం॥ ఒక విద్వాంసునికి సమర్పించే విశేష సమ్మానం ఈ సం॥ భక్తినివేదన సంపాదకులు ఉ.వే.ప్ర. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారికి సమర్పింపబడుతుంది. ఈ సమావేశంలో అందరూ పాల్గొనవలెనని నిర్వాహకుల కోరిక.

ఇట్లు
**ఉభయవేదాంత ఆచార్యపీఠం శాఖ, విజయనగరం**



# భగవద్రామానుజ చరిత్ర

శ్రీమతి టి.కె. చూడామణి, విజయవాడ



## భగవద్రామానుజులు అనుగ్రహించిన గద్యత్రయము

## శరణాగతి గద్యము

ఓమ్ భగవన్నారాయణాభిమాతానురూప, స్వరూప రూప, గుణ విభవ, ఐశ్వర్య శీలాద్యనవధికాతిశయ, అసఙ్ఖ్యేయ, కల్యాణగుణగణాం, పద్మ వనాలయాం, భగవతీం, శ్రియం, దేవీం, నిత్యానపాయినీం, నిరవద్యాం, దేవదేవదివ్యమహిషీం, అఖిలజగన్మాతరం, అస్మన్మాతరం, అశరణ్య శరణ్యాం, అనన్యశరణః శరణ మహం ప్రపద్యే, ॥

పారమార్థిక భగవచ్చరణారవిన్ద, యుగళైకాన్తి కాత్యన్తిక, పరభక్తి పరజ్ఞాన, పరమభక్తి కృత, పరిపూర్ణానవరత, నిత్యవిశదతమానన్య, ప్రయోజనా నవధికాతిశయ, ప్రీతికారిత, అశేషావస్థోచితాశేష, శేషతైక రతిరూప, నిత్య కైఙ్కర్యప్రాప్త్యపేక్షయా, పారమార్థికీ భగవచ్చరణారవిన్ద, శరణాగతి ర్యథావస్థితాఽవిరతాస్తు మే ॥
అస్తు తే, తయైవ సర్వం సమ్పత్స్యతే ॥

అఖిలహేయప్రత్యనీక కల్యాణైకతాన, స్వేతర సమస్త వస్తు విలక్షణ, అనన్త జ్ఞానానన్దైక స్వరూప! స్వాభిమాతానురూపైక రూపాచిన్త్య, దివ్యాద్భుత నిత్యనిరవద్య నిరతిశయౌజ్జ్వల్య, సౌన్దర్య సౌగన్ధ్య సౌకుమార్య, లావణ్య యౌవనాద్యనన్తగుణనిధి దివ్యరూప!, స్వాభావికానవధికాతిశయ, జ్ఞాన బల ఐశ్వర్య వీర్య శక్తి తేజస్సౌశీల్య, వాత్సల్య మార్దవార్జవ సౌహార్ద సామ్యకారుణ్య, మాధుర్య గామ్భీర్య ఔదార్య, చాతుర్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమ సత్యకామ సత్యసఙ్కల్ప కృతిత్వ కృతజ్ఞతాది, అసఙ్ఖ్యేయ కల్యాణగుణ గణౌఘమహార్ణవ!, స్వోచిత వివిధ విచిత్ర అనన్తాశ్చర్య నిత్యనిరవద్య నిరతిశయ సుగన్ధ, నిరతిశయ సుఖస్పర్శ, నిరతిశయౌజ్జ్వల్య కిరీటమకుట చూడావతంస మకర కుండల గ్రైవేయక హార కేయూర, కటక శ్రీవత్స కౌస్తుభ ముక్తాదామ ఉదరబన్ధన, పీతామ్బర కాఞ్చీగుణ నూపురాది, అపరిమిత దివ్యభూషణ!, స్వానురూపాచిన్త్య శక్తి





శఙ్ఖ చక్ర గదాసి శార్ఙ్గాది, అసఙ్ఖ్యేయ నిత్య నిరవద్య, నిరతిశయ కల్యాణదివ్యాయుధ!, స్వాభిమత నిత్య నిరవద్యానురూప స్వరూప రూప గుణ విభవ ఐశ్వర్య శీలాద్యనవధికాతిశయ, అసంఖ్యేయ కల్యాణగుణగణ శ్రీవల్లభ! ఏవంభూత భూమీ నీళానాయక !

స్వచ్ఛన్దానువర్తి స్వరూప స్థితి ప్రవృత్తి భేదాశేష, శేషతైక రతిరూప నిత్య నిరవద్య నిరతిశయ జ్ఞాన క్రియైశ్వర్యాది, అనన్త కల్యాణ గుణ గణ శేష శేషాశన గరుడ ప్రముఖ, నానావిధానన్తపరిజన పరిచారికా పరిచరిత చరణయుగళ! పరమయోగి, వాఙ్మనసాపరిచ్ఛేద్య స్వరూప స్వభావ స్వాభిమత వివిధ విచిత్ర, అనన్త భోగ్య భోగోపకరణ భోగస్థాన సమృద్ధానన్త ఆశ్చర్యానన్త మహావిభవానన్త పరిమాణ, నిత్య నిరవద్య నిరతిశయ వైకుణ్ఠనాథ!, స్వసఙ్కల్పానువిధాయి స్వరూప స్థితి ప్రవృత్తి, స్వశేషతైక స్వభావ ప్రకృతిపురుష కాలాత్మక, వివిధ విచిత్రానన్త భోగ్య భోక్తృవర్గ భోగోపకరణ భోగ స్థాన రూప నిఖిల జగదుదయ విభవ లయలీల! సత్యకామ! సత్యసఙ్కల్ప! పరబ్రహ్మభూత! పురుషోత్తమ! మహావిభూతే! శ్రీమన్నారాయణ! శ్రీవైకుణ్ఠనాథ! అపార కారుణ్య సౌశీల్య వాత్సల్య ఔదార్య ఐశ్వర్య సౌన్దర్య మహోదధే! అనాలోచిత విశేషాశేషలోక శరణ్య! ప్రణతార్తిహర! ఆశ్రిత వాత్సల్యైకజలధే! అనవరత విదిత నిఖిల భూతజాత యాథాత్మ్య! అశేష చరాచర భూత నిఖిల నియమన నిరత! అశేష చిదచిద్వస్తు శేషిభూత! నిఖిలజగదాధార! అఖిలజగత్స్వామిన్! అస్మత్స్వామిన్! సత్యకామ! సత్యసఙ్కల్ప! సకలేతరవిలక్షణ! అర్థికల్పక! ఆపత్సఖ! శ్రీమన్నారాయణ! అశరణ్య శరణ్య! అనన్యశరణః, త్వత్పాదారవిన్దయుగళం శరణమహం ప్రపద్యే!॥





## గుజరాత్ రాష్ట్రంలోని ద్వారక లోని శ్రీరామ స్థూపము

"గత 4సం॥ల నుండి భారతదేశమంతటా పలుప్రాంతాలలో **శ్రీరామస్థూపాల జీర్ణోద్ధరణ** శ్రీశ్రీశ్రీస్వామివారి ఆదేశానుసారం **కుమారి విజయలక్ష్మి** (హైదరాబాద్) గారు చేయుచున్నారు. మిగిలిన ఇంకా 40శాతం స్థూపాల పని మరో 2సం॥ల లోపు అందముగా పూర్తి అగును.

ముంబాయి, హైదారాబాద్‌లలో జోర్ణోద్ధరణ కావింపబడినవి. ఆయా ప్రాంతాల వారు జీర్ణోద్ధరణ కావించు సమయమున శ్రీరామస్థూపాల వైభవము వాటి ప్రాముఖ్యత తెలుసుకొని దానిలో పాల్గొనుట వారియొక్క మహాభాగ్యముగా ఎంచి ముందుకు వస్తున్నారు. వారి ప్రాంతానికి శోభగా, సౌభాగ్యంగా వాటిని గుర్తించు చున్నారు. నామ సంకీర్తనలు, హోమాలు, సంతర్పణలు జరుపుకుంటున్నారు. ఆనందముతో స్వామివారికి కృతజ్ఞతలు తెలుపు చున్నారు."

**ముఖచిత్రములో జీర్ణోద్ధరణ కావింపబడిన స్థూపము గమనించగలరు.**







శ్రీరంగనాయకీ సమేత శ్రీరంగనాథ పరబ్రహ్మణే నమః    శ్రీమతే రామానుజాయ నమః

## శ్రీరంగనాథ దేవాలయ ఉత్సవ విశేషాలు, శ్రీరంగమ్

| | |
|---|---|
| 11-7-03 | : **జ్యేష్టాభిషేకం** (ఏకాంతం) |
| 13-8-03 | : **ఆడి 28 ఉత్సవం** (పెరుమాళ్ళు, అమ్మా మండపానికి వేంచేస్తారు కావేరీ నదీ దేవతను మాలిక, పసుపు, కుంకుమ, చీర మొదలగు వాటితో పూజిస్తారు.) |
| 21-8-03 | : **శ్రీ జయంతి** (శ్రీకృష్ణాష్టమి) |
| 22-8-03 | : **పాతాళ కృష్ణుని సన్నిధి వద్ద ఉట్టిగొట్టుట** |
| 6 నుండి 14 వరకు | : **నంబెరుమాళ్ పవిత్రోత్సవం** (పవిత్రోత్సములలో అలంకరణ, మూల వరులకు పట్టు, ఉత్సవవరులకు నూలు పవిత్రముతో అలంకరణ |
| 5-10-03 | : **నంబెరుమాళ్ విజయ దశమి ఉత్సవం** (కాట్టు అళగియ సింగర్ పెరుమాళ్ కోయిలకు నంబెరుమాళ్ వేంచేసి విజయోత్సవాన్ని జరిపి మనమఠం వీధిగుండా రంగనాథ సన్నిధికి వేంచేస్తారు.) |
| 13నుండి 21వరకు | : **పెరుమాళ్ డోలోత్సవము** (ఊయలసేవ) |
| 24-10-03 | : **నంబెరుమాళ్ దీపావళి తిరునాళ్** (చందన మండపంలో తిరుమంజనం, జాలి అలంకారం) |
| 4-12-03 | : **నంబెరుమాళ్ కౌశిక ఏకాదశి** (చందన మండపంలో తిరుమంజనం, రెండవసారి పురప్పాడు నంబెరుమాళ్ళకి 365 వస్త్రాలు కప్పుతారు. భట్టర్ స్వామి కౌశిక పురాణం చెబుతారు. |
| 18-12-03 | : నంబెరుమాళ్ తిరుక్కార్తిగై (చందన మండపంలో తిరుమంజనం శ్రీ ఉత్తమనంబికి మర్యాదలు ఉంటాయి.) |
| 24-12-03నుండి | : **వైకుంఠ ఏకాదశి ఉత్సవం** |
| 2-1-04 వరకు | : **పగల్ పత్తు**, 2-1-04 రోజున మోహినీ అలంకారం. |



## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషి చేస్తున్నవారిలో **శ్రీమాన్ కృష్ణమాచార్యులు** (భద్రాచలం) గారు, మన జీయర్ మఠంలోనే ఉంటూ చక్కని సేవలు అందించడమే కాక మన భక్తినివేదన పాఠకుల సంఖ్యను పెంచేందుకు విశేష కృషిచేస్తున్నారు.

శ్రీశ్రీశ్రీస్వామివారు అనేక మంగళాశాసనములను కృపచేసారు.

# విశాఖ యతిగోష్ఠి

భగవంతుడందరివాడూ అందరూ భగవంతుని వారే. ఆయనను అందరూ ఉపాసించవచ్చు అందర్నీ ఆయన ఆదరిస్తాడు అని ఆప్యాయనంగా పలికి ఆర్తితో అందరనూ చేరదీసి తాను నరకానికి పోయినాసరే పదిమంది తరిస్తే కావలసినదేమున్నదని కారుణ్యం ఉప్పొంగి వాత్సల్యంతో జనాన్ని ఉద్ధరించడానికి పూనుకొన్న మహానుభావులు భగవద్రామానుజులు.

వద్దెనిమిదిమార్లు గోష్ఠీపూర్ణులను ఆశ్రయించి ఎట్టకేలకు తాము పొందిన మంత్రార్థాన్ని ఆచార్యాజ్ఞనుల్లంఘించి, ఫలితం తెలిసీ తాము ఏమైపోయినాసరే ఇంతమంది జనం తరిస్తూంటే ఇంకా చూసేదేమిటి అన్న అనుకంపాతిశయంతో తెగువతో మంత్రార్థాన్ని గుడిగోపురమెక్కి మీరు రండి, మీరు రండి, మీరూరండి అంటూ ఎలుగెత్తి పిలిచి చేరిన వారందరి జన్మలూ చరితార్థాలు కావించిన మహోదారులు శ్రీమద్రామానుజులు.

మంత్రార్థాన్ని తరణోపాయాన్ని భవతరణోపాయాన్ని తెలుసుకున్నాక ఆ ఆనందం ఎదలో పొంగుతూంటే ఉప్పొంగుతూంటే తామొక్కరూ ఏకాకిగా దాన్ని పొందడంకాదు. పలువురుకు పంచి ఇవ్వాలని తపనపడిపోయిన జగదాచార్యులు రామానుజులు

**"స్వయం తీర్త్వా పరాంస్తారయతి"** అని ఆభాణకం బరులకు చెప్తే నరకానికి పోతావు అని గురువులు కక్కటి ఇంకా స్వతరణమేది? పోతే పోనీ! నేనొక్కణ్ణి నరకానికి పోతాను అంతేగా! కాని ఇంతమంది గట్టెక్కిపోతారే! ఇంతకంటే ఏంకావాలి అని జనావళి కోసం తపించిన ఆచార్యులు ఎక్కడ కనవస్తారు?

భగవద్రామానుజుల ఈ కారుణ్యానికి ముగ్ధులైనారు వివేకానందులు.

వేయి ఏండ్లనుండి ఈ శ్రీరామానుజ సంప్రదాయం విశాలంగా ఉదారంగా దశదిశలా తావులు చిమ్ముతూ నేల నాలుగు చెరగులా భక్తిరసవాహినులను ప్రవహింపచేసి, భారతావనిని ఆస్తిక్య సస్యశ్యామలంగ కావిస్తూనే ఉంది. ఇటు ఆళువారుల శ్రీ సూక్తులను, అటు ప్రస్థానత్రయాన్నీ సమన్వయ పరచి, ఉభయ వేదాంతశాఖల నేర్పరచి ఆ రెండింటి అద్భుత మేళనంతో సామరస్యాన్ని ఘటించి శ్రీరామానుజలు ప్రసాదించిన సత్సంప్రదాయం నాటినుండి నేటివరకూ అవిచ్ఛిన్నంగా సాగివస్తూనే ఉంది.

గృహస్థులైన ఆచార్యపురుష కుటుంబాల వారు, మఠాధిపతులైన జీయరుస్వాముల వారలు దీని పరిరక్షణ ప్రచారభారాన్ని వహించి సమర్థంగా కొనసాగిస్తున్నారు.

మనవాళమహామునుల తరువాత అంతటి వైభవంతో ఉద్యమస్ఫూర్తితో ఈ భారాన్ని వహించి ఆసేతుశీతనగం సంప్రదాయ వాహినిని ప్రవహింపచేసి శకస్థాపకులుగా నిలచిన మహానుభావులు శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్ స్వామివారు.

వారు చేపట్టిన ఉద్యమాన్ని అదే స్ఫూర్తితో బహుముఖంగా దేశవిదేశాలలో విస్తరింప చేస్తున్న మహానుభావులు శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారు.





మనకు సంప్రదాయ నిధులున్నాయి. ఆస్తిక్యం, ఆర్తీకల అర్థులూ ఉన్నారు. ఇవి వెళ్ళలేవు, వారువచ్చితీసుకోలేరు. ఈ నిధులను తవ్వి వారి తలకెత్తే మహానుభావులు కావాలి, వారు ఉదారులు కావాలి. సమర్థులు కావాలి. విశ్వహితకాములు కావాలి.

అట్లా ఆ నిధులను తవ్వి సామాన్యుల తలకెత్తనమకట్టిన మహానుభావులలో పేర్కొనదగినవారు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారు. వీరు ఉపనిషత్సిద్ధాంత పీఠాన్ని నెలకొల్పి లోక కల్యాణం కోసం యజ్ఞాలు కావిస్తూ, సనాతన ధర్మ పరిరక్షణం కోసం పాఠశాలను నిర్వహిస్తు సంప్రదాయ గ్రంథప్రకటనంచేస్తూ ప్రవచనాలు చేస్తూ చేయిస్తూ బహుముఖాల సత్సంప్రదాయ సేవ చేస్తున్నారు.

వీరు జూన్ 2వతేదీ నుండి 10వ తేదీవరకు విశాఖపట్టణంలో లోకకల్యాణం కోసం శ్రీలక్ష్మీ నారాయణ క్రతువునొకదానిని అద్భుతంగా నిర్వహించినారు.

ఆ క్రతువులో ఆధ్యాత్మిక సంప్రదాయ చరిత్రలో నిలచిపోమే అపూర్వమైన సన్నివేశ మొకటి చోటు చేసుకున్నది. ఈ సన్నివేశం అలనాటి భగవద్రామానుజులు గోష్ఠీపురగోపురం మీదనుంచి జనావళికి మంత్రార్థాన్ని వెదజల్లిన సన్నివేశాన్ని తలపించింది.

## జీయరుల మంత్రోపదేశములు

విశాఖలో డా॥లంకపల్లి బుల్లయ్య కళాశాల ప్రాంగణం సుమారు ముప్పైవేలమంది చేరదగిన మైదానంసమున్నతము పర్యాప్తమూ అయిన వేదిక. పెద్ద అలంకరణలు లేవు. అట్లా అని బోసిగానూ లేదు. తెలిదీవిలా, మంచు తిన్నెలా, మల్లెల రాసిలా చూడముచ్చటైన వేదిక. వెనక రాగరంజితమైన యవనిక. ఆ యవనిక నడుమ శ్రీస్వామివారి ఆరాధ్యదైవం వైకుంఠ పెరుమాళ్ చిత్రం కుడి ఎడమల శఠకోప రామానుజులు, వారికిరుప్రక్కలా సుదర్శన పాంచజన్యాలు యవనికోపరిభాగాన చమత్కారంగా మూడు చిన్న గోపురాలు. రహస్యత్రయానికివి సంకేతాలేమో!

వేదికపై ఎనమండుగురు జీయరులు సమాసీనులైనారు, మనవాళమహామునుల అష్టదిగ్గజ శిష్యులను తలపిస్తూ.

1. ప.ప. శ్రీశ్రీశ్రీ వానమామలై చిన్న కలియన్ రామానుజ జీయర్ స్వామి, 2. ప.ప. శ్రీశ్రీశ్రీ మన చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి, 3. శ్రీశ్రీశ్రీ పెరుంబుదూర్ వాదికేసరి అఝకియ మణవాళ జీయర్స్వామి, 4. కాంచీపురం శ్రీశ్రీశ్రీ ఎంబార్ జీయర్స్వామి, 5. భీమవరం శ్రీశ్రీశ్రీ శ్రీరామచంద్ర రామానుజ జీయర్స్వామి, 6. విజయవాడ శ్రీశ్రీశ్రీ అష్టాక్షరీ సంపత్కుమార రామానుజ జీయర్ స్వామి, 7. హైదరాబాద్ శ్రీశ్రీశ్రీ వ్రతధర రామానుజ జీయర్స్వామి, మరియు వీరందరినీ ఎన్నో ప్రయాసలకోర్చి, ఒకచోట కూర్చిన యజ్ఞ నిర్వాహకులు 8. శ్రీశ్రీశ్రీ రంగరామానుజ జీయరుస్వామి.

ఈ స్వాములందరకూ మేళతాళాలతో వేదస్వస్తివచనాలతో పూర్ణకుంభాలతో శ్రీరంగ రామానుజ జీయరు స్వామివారు భాగవతగోష్ఠీ పురస్సరంగా క్రతు సమాయాత ఋత్విగ్బృంద సమేతంగా స్వాగతోపచారం నెరపి అందరినీ వేదికపైకి తోడ్కొని వచ్చినారు.

ఎనమండుగురు జీయరులు విశాఖలో ఒకవేదికమీద సమాసీనులు కావడం విశాఖ

చరిత్రలో అపూర్వం విశాఖపురప్రజలు మేయరు, మాజీమేయరులతో పాటు ఈ సన్నివేశాన్ని ఆర్ద్రచిత్తాలతో,భక్తివినమ్రులై, పులకితగాత్రులై, అశ్రుభర నేత్రులై సందర్శించి పరవశులైనారు.

ఉపనిషత్సిద్ధాంత పీఠం పక్షాన శ్రీమాన్ కృష్ణప్రసాద్‌గారి స్వాగతం, తరువాత మేయర్ శ్రీమతి రాజానరమణి ఆర్ద్రంగా హార్దంగా, వినమ్రంగా సభక్తికంగా స్వాములకు విశాఖ పురప్రజలపక్షాన స్వాగతోపచారం నెరపినారు.

నిర్వాహకులు శ్రీశ్రీశ్రీత్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్‌స్వామివారు ప్రవచనం కావించి శ్రీశ్రీశ్రీవానమాములై స్వాములను అధ్యక్షులుగా సభానిర్వహణం కావింపమని శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజజీయరు స్వామివారిని మంత్రోప దేశ కార్యక్రమాన్ని నిర్వహించవలసినదని కోరినారు.

రహస్యత్రయసార ప్రతిపాదకంగా శ్రీ పరాశరభట్టారకులు ప్రసాదించిన అష్టశ్లోకిని ఒక్కొక్క స్వామి ఒక్కొక్క శ్లోకంగా ఎనమండు గురు ఉపదేశించడం కార్యక్రమం. శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారు ఎక్కువసేపు మాటలాడాలని తామూ జనమూ అదే కోరుకుంటామనీ, అందుకే వారిని ఈ ఉపదేశ నిర్వహణాన్ని చేపట్టమని కోరినామనీ శ్రీశ్రీశ్రీ రంగరామానుజ జీయరు స్వామివారు తెలిపినారు.

**అకారార్థో విష్ణుః - జీయరులు**
**అకారార్థో విష్ణుః - జనం**
**జగదుదయ రక్షా ప్రళయకృత్-జీయరులు**
**జగదుదయ రక్షా ప్రళయకృత్ - జనం**

ఇట్లా ఉచ్చారణ - అనూచ్చారణ రూపంగా శ్లోకం సాగించి తరువాత ఆ శ్లోకసారాన్ని స్వాములు వివరిస్తూంటే జనావళి భక్తిపరవశులై ఆలకించేరు.

సుమారు 5 గంటలసేపు సాగిన ఈ కార్యక్రమం సత్సంప్రదాయ చరిత్రలో ఒక అద్భుత సన్నివేశ మనడంలో సందేహంలేదు విశాఖవాసుల సౌభాగ్యఫలమిది.

ప్రారంభం నుంచి పరిసమాప్తి వరకు ప్రతివారూ ఏకరూపమైన శ్రద్ధతో , భక్తితో, ఆసక్తితో, పారవశ్యంతోఇందులో పాల్గొన్నారు. 5 గంటలసేపు కదలక, మెదలక రెప్పపడితే ఏమి కనుమరుగౌతుందో ఏమరి ఉంటే ఏమి వినకపోతామో అని కనులువిచ్చుకొని, చెవులు జోరగించుకొని మరీ పాల్గొన్నారు.

శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందిన ఎనమండుగురు జీయరులను ఒకచోట చేర్చటం వారితో రహస్యత్రయాన్ని జనావళికి ఉపదేశింప చేయడం.

అదీ భట్టారకుల అష్టశ్లోకి రూపంలో.

అది కూడా విశాఖవంటి పారిశ్రామిక మహానగరంలో.

గంటకాదు, రెండుగంటలుకాదు- ఐదుగంటలు.

జనం నిస్తరంగ సముద్రంలా ఉండడం- ఇవన్నీ అద్భుతాలే ఈ సన్నివేశాన్ని చూచి తమ ఎడద ఆనంద మందాకిని కాగా శ్రీ వానమాముల స్వాములన్నారు.

**'ఆవల జలసముద్రం-ఈవల జన సముద్రం'** అని

ఇంత **వరవామద్భుతమ్మైన ఆధ్యాత్మిక** కార్యక్రమాన్ని రూపొందించి జనావళిని ఉద్ధరించడానికి ఉద్యమిస్తున్న శ్రీశ్రీశ్రీ రంగ రామానుజ జీయరు స్వాములకు కైమోడ్పు ఘటిస్తున్నారు విశాఖ జనులు.





# సందేహాలు - సమాధానాలు

శ్రీమతి ఎల్. లక్ష్మి, బొబ్బిలి

**ప్ర. శ్రీరాముని జననం త్రేతాయుగంలో, అంటే, కొన్ని లక్షల సంవత్సరాలకు ముందు. యుగము మారే సరికి నైసర్గికంగా ఎన్నో మార్పులు చోటు చేసుకుంటాయని భూగర్భశాస్త్రజ్ఞులంగీకరిస్తారు. అలాంటపుడు అయోధ్య రామాలయ విషయంలో ఎందుకంత పట్టుదల వహిస్తున్నారు?**

జ. శ్రీరాముడు త్రేతాయుగానికి చెందినవాడే. మనమిపుడు 28వ చతుర్యుగపు కలియుగంలో ఉన్నాం. కానీ శ్రీరాముడు 24వ చతుర్యుగపు త్రేతాయుగానికి చెందినవాడని చరిత్రకారులంటున్నారు. ఒక్కొక్క చతుర్యుగానికీ 48,20,000 సంవత్సరాలు. ఈ లెక్కన చాల లక్షల సంవత్సరాలైనమాట వాస్తవం. భౌగోళికంగ ఎన్నో మార్పులూ వచ్చే ఉంటాయి. అయితే సరయూనది అదే. చిత్రకూటము అదే. ఖచ్చితంగ ఫలానా చోటనే శ్రీరాముడు పుట్టాడనే నిర్ణయం కష్టసాధ్యమైనదే అయినా ఈ దేశానికీ, ఆ నదికీ, ఆనదీతీర పట్టణమైన అయోధ్యకీ వెనుక ఓ చరిత్ర వస్తోంది. ప్రతీదేశానికీ, జాతికీ వెనుక ఓ చరిత్ర ఉంటుంది. వ్యక్తిగత విశ్వాసాలతో చరిత్ర నడవదు. వ్యక్తులు నమ్మకపోయినా చరిత్ర ఆగదు. మారదు. వ్యక్తిగత విశ్వాసాలకతీతంగ చారిత్రక చిహ్నాలను సంరక్షించుకోవడం అందరి కర్తవ్యం. మతాలకతీతంగ వీటిని ఉంచాలి. అయోధ్య గూడ దశరథుని, శ్రీరాముని రాజ్యంగ చరిత్ర చెప్తోంది. శ్రీరామాయణంలో వర్ణించిన గుర్తులన్నీ ఇప్పటికీ సజీవంగ ఉన్నాయి కనుక ఎవరిమతం ఏదైనా అయోధ్యను చారిత్రక చిహ్నంగ, దశరథరాజ్యంగా రూపొందించి రక్షించడం చారిత్రకులందరి కర్తవ్యం. ప్రభుత్వాలకు అది బాధ్యత గూడ. ఇందులో ఓ మతాన్ని ఔననడం. మరో దాన్ని కాదనడం వంటివేమీ ప్రమేయాలు కావు. రాజకీయాలకతీతంగా ఇది జరగాలి. జెరూసలెంను క్రీస్తు పుట్టిన స్థలంగ, మక్కాను ఇస్లామీల ఆరాధ్యస్థలంగానూ అందరూ అంగీకరించడం లేదూ! అలాగే అయోధ్య శ్రీరాముని జన్మస్థలం.

శ్రీ టి. నారాయణస్వామి, పర్లాకిమిడి

**ప్ర. గరుడపురాణంలో వ్యక్తి చనిపోయిన 12వ రోజున జీవిని తీసుకుపోతారని ఉంది. వైష్ణవ సంప్రదాయంలో 13వ రోజున పరమపదోత్సవం చేస్తారేమి?**

జ. వ్యక్తి చనిపోయాక 12వ రోజుదాక శారీరకంగ ఆచరించవలసిన కర్మకాండ బంధువులు చేస్తారు. అది తీరిన తర్వాత ఆ జీవి, ఆచార్యుల ద్వారా సంస్కరింపబడినవాడైతే తిరిగి మరో జన్మనెత్తనవసరం లేకుండా చేరాల్సిన

చోటు పరమపదమనుకుంటే అపుడు దానికనుగుణమైన ప్రక్రియగ శాంతిపాఠం, సేవాకాలం మొదలైనవి చేస్తారు. దేహసంబంధమైౖ చేయవలసినవి మొదట పూర్తి చేస్తారు. పురాణాదులు అంతవరకే చెప్తాయి. ఆపై ఆ జీవికర్మననుసరించి తిరిగి మరోజన్మనెత్తుతాడని అవి చెప్పి వదలుతాయి. కర్మను నశింపచేసి మోక్షాన్నిచ్చే ఉత్తమ సంస్కారాన్ని గురించి ఆగమగ్రంథాలు చెప్తాయి. వాటి ప్రకారం ఆశౌచం తీరాక ప్రారంభించి చేసే పరమపదోత్సవం వల్ల ఆ జీవి మరి తిరిగి కర్మకృతమైన జన్మనెత్తడు. అంచేత మనవాళ్ళు చేసేది సరి అయినదే.



శ్రీ వి. ఈశ్వరయ్య, హైదరాబాదు.

**ప్ర. వైష్ణవ పూజలో తులసిని ఎక్కువగ వాడటానికి కారణం. అందులోని ఔషధగుణమా? ఆధ్యాత్మిక శక్తియా?**

జ. శ్రీతులసిని విష్ణుదేవతా సంబంధమైన ఆరాధనలలోనే వాడాలి. ఇతరత్రా కూడదు. దానికి మొదటి కారణం అది సాత్త్వికతను పెంచే ఆకు కావడమే. రెండవది ఆగమగ్రంథాలలో దానినే అధికంగ ప్రస్తావించి, స్వామికి తులసినే సమర్పించాలని స్పష్టం చేయడం గూడ. శ్రీమద్భాగవతంలో గూడ 6,7 స్కంధాలలో తులసిపై స్వామికుండే ప్రీతిని ప్రస్తావించారు. ఓషధీసంబంధమైనదనే భౌతిక దృష్టి శాస్త్రీయమైన వాటిపై పెట్టడం ఉచితం కాదు. అదీగూడ ఉంటే మనం కాదనం. మంచిదే. కానీ దానికి ప్రాధాన్యాన్నివ్వము.



శ్రీరాజ, విజయవాడ

**ప్ర. పదార్థం వండి, ఆరగింపుచేసేలోపు చీమలు పడితే వాటిని తొలగించి ఆరగింపు చేయవచ్చా?**

జ. కూడదు. ఆ పదార్థాన్ని ఆరగింపు చేసాక చీమలు పడితే, ప్రసాదమైంది కనుక వాటికి కొంత ప్రసాదాన్ని వదిలేసి మిగతాది తీస్కోవచ్చు. ఆరగింపు ముందే చీమల్లాంటివి పడితే, ఆ పదార్థం వదలి, వేరే ఏదైనా నైవేద్యం పెట్టి కావాలంటే దీనిని ఆ మొదటి దానిలో కలుపుకోవచ్చు, మరి, అది పారవేయలేరు గద!



**ప్ర. 'సత్తా' అంటే ఏమిటి? వైష్ణవులు హార్లిక్స్‌వంటివి త్రాగవచ్చా?**

జ. ఏ పదార్థమునకైనా ఉండే ఏదో రకమైన 'ఉనికి'ని సత్తా అంటారు. బయట వండనివి. డ్రై పదార్థాలైన హార్లిక్స్ వంటివి తీసుకున్నా దోషమేమీలేదు. అయితే అలా ఖర్చు చేసి బయట కొని త్రాగేకంటే రకరకాల పండ్లు మొక్కజొన్నల వంటి, పప్పదినుసులను, మిరియాలు, జీలకర్రవంటి సుగంధద్రవ్యాలు వేసి తయారు చేసికొని అది కలుపుకొని త్రాగడం చాలా మంచిది.







నచికేతుడు

నచికేతుడు





# పరమాచార్య చరమ స్మరణం




శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారికి (పెద్ద స్వామివారికి) కులపతులు ఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామివారికి, శ్రీభాష్యాచార్యులు ఉ.వే. శ్రీమాన్ తె.కం. రామానుజాచార్య స్వామివారు వీరు శ్రీశ్రీశ్రీ కుండలం స్వాముల శిష్యులు. 'మందసా రామానుజాచార్యస్వామి'గా ప్రసిద్ధులు. ఆంధ్రదేశంలోనే కాక కాశీ మొదలైన ఉత్తరాది విద్యాకేంద్రాలలో బహువాదాలలో పాల్గొని విజయంపొందిన విద్వదగ్రేసరులు. వీరు పందొమ్మిది వందల ఏభై ఎనిమిది (1958)లో నరసాపురంలో ఆచార్యతిరువడిని చేరుకొన్నారు. ఆ సందర్భంగా అక్కడ వేంచేసి ఉన్న మహావిద్వాన్ కాంచి ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారు మందసా స్వామివారి విషయంలో సమర్పించిన 'చరమ శ్లోక పత్రికను' ఆచార్యపౌత్రులైన శ్రీమాన్ టి.కె. శ్రీనివాసాచార్యులుగారు మన పత్రికలో ప్రచురణార్థం వారి ఫొటోతోపాటు పంపినారు. పరమాచార్యుల విద్యావంశ్యుల పరితోషణార్థం వారి ఫొటోను ఉ.వే.శ్రీమాన్ జగదాచార్య ప్ర.భ. అణ్ణంగరాచార్య స్వామివారు వారి విషయంలో సమర్పించిన చరమశ్లోక పత్రికను యథాతథంగా ప్రకటిస్తున్నాము.

సంపాదకులు

**శ్రీమతే రామానుజాయ నమః**

**శ్రీమదుభయ వేదాంత ప్రవర్తకాచార్యులైన మహావిద్వాన్ తె.కం. రామానుజాచార్య స్వాములవారి**

# చరమశ్లోక పత్రిక

**అబ్దేఽస్మిన్ హేవిలమ్బిన్యుపయతి మకరం భాస్కరే కృష్ణపక్షే**
**పఞ్చ మ్యాఖ్యాత తిథ్యాం రవిసుత దివసే కూరనాథార్యతారే**

ఆచార్యో గౌతమాఖ్యాన్వయ జలధివిధుస్సర్వవిద్యా ప్రవీణో
విద్వాన్ రామానుజార్యో నృహరి గురుదృశా దివ్యధామ ప్రపేదే ॥ 1

హేవిలమ్బి గ్రాహకృష్ణ పఞ్చమ్యాం శనివాసరే ।
గౌతమాన్వయ రామానుజార్య వర్యోదివంయయౌ ॥ 2

స్వామీ రామానుజార్య శ్శుభగుణ నిలయ స్సర్వవిద్యా నిషద్యా
శాన్త్యా దాన్త్యా విరక్త్యా భగవతి చ తదీయేషు భక్త్యా సమృద్ధః ।
విశ్వ ప్రఖ్యాత కీర్త్యా సురభిత సకలగ్రామ పుర్యగ్రహారః
హాహా లీలావిభూతిం నిజహదభజత స్వాం విశుద్ధాం విభూతిమ్ ॥ 3

న్యాయే వేదాన్త శాస్త్రేపి చ జలధియుగే నిత్యగాధావగాధః
వాదే వాక్యార్థ వర్త్మన్యపి చ భుజగ రాణ్ణిర్వి శేష ప్రవక్తా ।
స్వామీ శ్రీగౌతమాఖ్యాన్వయ విపుల పయోరాశి రాకా శశాఙ్కో
విద్వాన్ రామానుజార్యో బతబతవిజహౌ మాదృశానాత్మ బన్ధూన్ ॥ 4

శ్రీమద్భూతపురీ విభూషణ వర శ్రీకుణ్డల స్వామినాం
పాదాబ్జేవరివస్యయా తదధిక జ్ఞానేన వేదాన్త యోః ।
ఆసేతో రాచ శీతాచల మమలయశస్స్తోమ సౌరభ్యపూర్ణః
స్వామీ రామానుజార్యః క్షితితల తరణి ర్భ్రాజతే దివ్యధామ్ని ॥ 5

శఠవైరి కలివైరి యతిరాజ జగదార్య
వరయోగిముఖ పూర్వ గురువర్యఫణితీః ।
అనిశం చ హృది బిభ్రదభిజాత గురురా
డయమద్య దివిసామ మృదుగాన నిరతః ॥ 6

యోదుర్వాది మదావలే పహరణోయం ప్రాహురత్యుత్తమ
ప్రజ్ఞం యేన సురక్షితం యతిప తేస్సద్దర్శనం వాదిషు ।
యస్మై సర్వ విపశ్చితో నతి మదుర్యస్మాన్న తుఙ్గోబుధః
యస్యోక్తి ర్విమలా బభౌ మమ మనో యస్మింశ్చ భక్త్యుజ్జ్వలమ్ ॥ 7

ఏతాదృఙ్మహితానుభావజలధే జ్ఞానేన శీలేన చ
ప్రోత్తుఙ్గ! స్మితపూర్వ భాషణ పటో! సాక్షాత్స్వయం గౌతమ ।





శ్రీరామానుజ సూరివర్య భగవన్ హాహాకథం మాదృశాన్
భక్తాన్ బన్ధు జనానుపేక్ష్య నిరగాః? కీర్తిస్తు తే శాశ్వతీ ॥ 8

శ్రీమన్నారాయణార్యో యతిపతి పదవీ సన్నివిష్టో మహాత్మా
శ్రీమాన్ గోపాలసూరి స్త్వితిగురు యుగళం యస్యపాదాబ్జ సేవామ్ ।
కృత్యాలోకేఽతిమర్త్యాం కృతి తతిమనఘాం సంవిధత్తే సమన్తాత్
సోయం రామానుజార్యో గురువర ఇహ కిం మాదృశాం స్తుత్యభూమా ॥ 9

శ్రీవత్స చిహ్నగురువర్య సమప్రభావః
స్వామిన్ భవాన్ విలసతిస్మ తతశ్చ పేతోః ।
తస్యావతారదివసే ఘటతేస్మ వాదైః
వైకుణ్ఠ ధామగమనం గురుసార్వభౌమ ॥ 10

హాహన్త ఖేదసమయేపి చ మోదమేకం
దైవాదహో సమధిగచ్ఛతి దాసఏషః
వైదేశికోపి యదహం సమయేఽధునాత్ర
సంజగ్మివాన్ నిజగిరాం సఫలత్వమాపమ్ ॥ 11

నరసాపురస్య మహిమాచిరాదభూ
ర్గురుసార్వభౌమ ఇహదివ్య తీత్యహో।
సగురుస్తు సర్వనయనాతిథిర్భవ
న్నధునా నిలీవ ఇతి దూయతే జనః ॥ 12

శ్రీయామునార్య యతిరాజవరో పయన్తృ
మున్యాదయో గురువరా ఇవ సోయమార్యః ।
దిక్సోధ క్షైత్రయశసా సుచిరం విరాజన్
విద్వన్మనస్సు నియతం వసతీతి మోదే ॥ 13

కాఞ్చీవాది భయఙ్కరవంశీయాణ్ణఙ్గరార్య దాసోఽయమ్ ।
గౌతమ రామానుజగురుగుణ గణ కథనేన ధన్య జన్మాఽభూత్ ॥ 14

శ్రీరస్తు నరసాపురమ్ 20-2-58

# ఇతిహాసబోధ - 17

గత 'ఇతిహాసబోధ - 16'లో మనం 'యయాతి చక్రవర్తి' అనుభవాన్ని గూర్చి తెలుసుకొన్నాం. పాంచభౌతిక శరీరాన్ని విడచిపెట్టి, తన తపోమహిమచేత యయాతి తేజోమయ స్వరూపుడై దివ్యలోకానుభవాన్ని పొందగలిగాడు. అంతటి పుణ్యశక్తి సంపన్నుడు కూడా 'మానిత్వం'తో పలికిన దుడుకు పలుకు కారణంగా స్వర్గలోక భ్రష్టుడైన విధం, తిరిగి సంయమనంతో వివేక శీలియై మెనలి ఊర్ధ్వలోకాలను పొందిన విధం మనం తెలుసుకున్నాం.

దేహపరిత్యాగానంతరం కూడా జీవుడు ఎంత జాగ్రత్తగా ఉండాలో, అజాగ్రత్తగా ఉంటే క్షేత్రానికి సంబంధించిన లేదా ప్రకృతికి సంబంధించిన అహంకారాది వికారాలు జీవుడిని ఎలా ఇబ్బందుల పాలు చేస్తాయో మనకు 'యయాతి' వృత్తాంతం' వివరించింది.

'నేను, నేను' అనే అహంకారం ప్రకృతి సహజంగా ప్రతి జీవుడిలోనూ ఉంటుంది. ఈ 'అహంకారం' తనని వ్యక్త పరచుకోవడానికి తన అందుబాటులో ఉన్న ప్రతి అంశంతోటీ తాదాత్మ్యం చెందుతుంటుంది. 'ఇది నాదేహం, నా కులం, నా మతం, నా తెలివి తేటలు, నా ఇష్టం, నా కష్టం, నా మంచి, నా చెడు, నా బంధువులు, నా శత్రువులు' అంటూ సమస్త విషయాలలోనూ బుద్ధి, మనస్సుల యొక్క సహకారంతో 'అహంకారం' తనను ప్రదర్శించుకొంటూనే ఉంటుంది.

'తన'ను బహిర్గత పరిచేందుకు వీలైన ప్రతిసాధనంతోను 'అహంకారం' ఏర్పరచుకొనే అనుబంధమే 'మానిత్వ'రూపంలో మనకు గోచరిస్తుంది. దేహాభిమానం, కులాభిమానం, కర్తృత్వాభిమానం.... అంటూ మానిత్వపు పోకడలు ఎన్నోరకాలుగా మనలో బయటపడుతుంటాయి. వీటిని అంటి పెట్టుకొన్నంత కాలం జీవుడికి దుఃఖం తప్పదని తత్త్వవేత్తలు హెచ్చరిస్తున్నారు.

వేద వ్యాసుడు శుకునికి పరమశాంతిని పొందే మార్గాన్ని బోధిస్తూ దుఃఖాన్ని వీడే మార్గాన్ని ఒక చక్కని పోలికతో వివరించాడు. 'మోహమనే బీజం నుండి కామమనే వృక్షం పుట్టి అజాగ్రత్త అనే నీటి సాయంతో పెరుగుతుంది. అజ్ఞానమే ఈ చెట్టుకు ఆధారం. 'మానం' దీనికి ధృడమైన కాండం (బోదె) శోకం దీనికి కొమ్మలు. అనేక చింతలు దీని ఉపశాఖలు. అసూయ దీని ఆకులు. దుఃఖఫలాలను అనుభవింపచేసే ఈ 'కామ' వృక్షాన్ని వైరాగ్యమనే శస్త్రంతో ఖండించే జ్ఞానే శాంతిని పొందుతాడు'.

దుఃఖం నుండి, అశాంతి నుండి విముక్తి పొంది శాంతిని పొందాలనుకునే ప్రతి ఒక్కరూ వ్యాసుని బోధను శిరసావహించవలసిందే.

తనలోని దుఃఖ స్వరూపాన్ని, దాని కారణాన్ని తెలుసుకొని తొలగించుకోగలిగిన వాడే కదా 'తెలివిగలవాడు'. తన హృదయ క్షేత్రాన్ని ఆక్రమించిన, దుఃఖఫలదాయని యైన 'కామ' వృక్షాన్ని కూల్చడానికి సాధకునికి 'శ్రద్ధ' ఎంతో అవసరం. ఎంతో ఓర్పుతో, నేర్పుతో 'వైరాగ్య'మనే గొడ్డలిని పదును పెట్టుకొని, ముందుగా మానిత్వమనే బోదెను లేదా కాండాన్ని సాధకుడు కూల్చివేయగలిగితే, ఆ తర్వాత అజ్ఞానపు వ్రేళ్ళను పెళ్ళగించడం పెద్దకష్టమేమీకాదు.





ఎందుకంటే మనసా, వాచా, కర్మణా ప్రదర్శితమయ్యేది ఈ 'మానిత్వమే' కదా. ఈ 'మానిత్వపు' బోదె లేక కాండం బలిష్టంగా పెరగడంవల్లనే మాత్సర్యపు ఆకులు చిగురిస్తున్నాయి. శోకం, చింతలు అనే కొమ్మలు, ఉపకొమ్మలు వికసిస్తున్నాయి.

ఈ 'మానిత్వపు' బోదెను కూల్చే విషయంలో మనకు ఎంతశ్రద్ధ అవసరమో, మన ఏరకంగా ఉండాలో తెలియజేసేందుకు 'జాజలి - తులాధారు'లు ఈ సారి ఇతిహాసబోధ-17' ద్వారా మనముందు కొస్తున్నారు.

పూర్వం జాజలి అనే బ్రాహ్మణుడు నివృత్తి మార్గాన్ని స్వీకరించి సముద్ర తీరం చేరి ఘోరంగా తపస్సు చేయనారంభించాడు. దేహభావనను జయించడం కోసం కఠోర నియమాలను పాటించసాగాడు. కొంతకాలం పరిమితాహారంతో, ఆ తర్వాత నీరు మాత్రమే తీసుకొని కొన్నాళ్ళు, వాయుభక్షణంతో మరికొంత కాలం తీవ్ర సాధన చేసాడు. శీతోష్ణాది బాధలను అతి క్రమించడం కోసం జాజలి చేసిన కృషి వర్ణనాతీతం. భయంకరమైన వర్షాకాలంలో ఆరుబయటే పడుకొనే వాడు. చలి కాలంలో నీటిలో ఉండి, వేసవి కాలంలో మండుటెండలో నిలబడి తపస్సు కొనసాగించాడు.

అలా జాజలి ఒక వర్షాకాలం కుండపోత వర్షానికి తడుస్తూ, ఎండుతూ, సాధన చేస్తుండగా ఓ తమాషా జరిగింది. కదలకుండా నిలబడి రోజుల తరబడి నిరాహారంగా తపస్సు చేస్తున్న జాజలిని చూచి పక్షులు కూడా భ్రమించి అతనిని 'మానను'కున్నాయి కాబోలు తమ కాపురం నిమిత్తంగా జాజలి నెత్తిమీద ఏకంగా గూడు కట్టనారంభించాయి.

సంస్కార రహితంగా పెరిగిపోయిన అతని జడలు పిచ్చుకలకు మంచి గూడుకట్టు కోవడానికి సహకరించాయి. జాజలి తన తలపై జరుగుతున్న తంతును గమనించి నప్పటికీ, పిచ్చుకలను తోలటానికి ఏమాత్రం ప్రయత్నించలేదు.

పిచ్చుకలకు ఆ వానాకాలం హాయిగా గడిచిపోయింది. తామున్న 'తలగూడు' లోనే అవి తమ సంతానాన్ని కూడా కని పెంచుకోసాగాయి. చూస్తుండగానే పిల్లపిచ్చుక లుకూడా పెద్దవయ్యాయి. అవికూడ తమ తల్లి తండ్రుల్లాగానే యధేచ్ఛగా గూడు వదలి ఆహార సంపాదన కోసం బయటకెగర సాగాయి. కొంతకాలం గడిచేసరికి పిచ్చుకలకు 'తలగూడు' మీద మోజుపోయిందేమో, ఎక్కడికో ఎగిరిపోయాయి.

ఇదంతా జాజలి గమనిస్తూనే ఉన్నాడు. పిచ్చుకలు తిరిగి వస్తాయేమోనని కొన్నాళ్ళు ఎదురుచూచాడు. పిచ్చుకలు రాలేదుకాని జాజలి మనస్సులోకి మాత్రం రాకూడని భావాలు రాసాగాయి. 'నా అంతటి తపశ్శక్తి సంపన్నుడు, దయాళువు, ధార్మికుడు, గొప్పవాడు, సిద్ధుడు మరెవ్వడైనా ఈ ప్రపంచంలో ఉన్నాడా? నన్ను మించిన నిష్ఠాపరుడెవ్వడున్నాడు ఈ జగత్తులో?' అని తనలో తానే ప్రశంసించుకోసాగాడు.

జాజలి మనో భావాలను గుర్తించి హేళన చేస్తున్నట్లుగా ఆకాశవాణి పలుకులు అతనికి కర్ణకఠోరంగా వినిపించాయి. "జాజలీ! నీ హెచ్చు తగ్గించుకో! పరమ ధార్మికుడైన తులాధారుడు ఎప్పుడూ నీ వలె గొప్పలకు పోలేదు. కాశీనివాసియై, వ్యాపారం చేసుకొంటున్న తులాధారుడి ధర్మ నిష్ఠ ముందు నీ ధార్మిక వర్తనం ఏపాటి?"

ఆకాశవాణి పలుకులు ములుకుల్లా జాజలి మనస్సుకు తాకాయి. తన సాధనను తక్కువచేసి మరెవరినో ఎక్కువ చేసి ఆకాశవాణి పలకటం అతనికి ఈర్ష్యను, బాధను, స్పర్థను కల్గించింది.

మనుషులకు దూరంగా కఠోర నియమాలతో ఇన్నేళ్ళూ తాను సాగించిన సాధన కన్నా, నగరంలో జనం మధ్య, అందులోనూ వ్యాపారం చేస్తూ ఎవడో గొప్పగా సాధన చేసాడన్న వార్తను విని దాన్ని జీర్ణంచేసుకోలేకపోయాడు జాజలి.

తులాధారుడిని కలిసి అతని సాధన వెనుక ఉన్న రహస్యం తెలుసుకోవాలనే పట్టుదలతో జాజలి వారణాసి ప్రయాణ మయ్యాడు. వచ్చే పోయే జనంతో ఉక్కిరి బిక్కిరిగా వ్యాపారం చేస్తున్న తులాధారుడు తన దుకాణం ముందు ప్రత్యక్షమైన జాజలిని చూచి సాదరంగా ఆహ్వానించాడు. లోపలికి తీసుకొని వెళ్ళి చేయవలసిన అతిథి సత్కారాలన్నీ చేసాడు.

'మహానుభావా! తమ తపమెంత గొప్పది? పిచ్చుకల జంట తమ పిల్లలతో సహా మీ తలపై కట్టుకున్నగూడులో సుఖంగా జీవించగలిగాయంటే అందుకు మీ సహన మహిమయొక్క గొప్పదనమే కదా కారణం! ఎటువంటి వికారాలకు లోనుకాక దయతో పక్షులకు ఆశ్రయమిచ్చిన మీకు సాటి ఎవ్వరు?' అంటూ అంతా చూచినట్లుగా మాట్లాడుతున్న తులాధారుడిని చూచి విస్తుపోయాడు జాజలి.

'తాను నివృత్తి మార్గాన్ని ఎన్నుకొన్న బ్రాహ్మణ సన్యాసి. తులాధారుడు ప్రవృత్తి మార్గంలో జీవించే వ్యాపారి. తనకు తపోనిష్ట వల్ల లభించని పరమ జ్ఞానం ఈ తులాధారుడికి ఏ విశేష ధార్మిక వర్తనం వల్ల సంక్ర మించింది?' తులాధారుడిని దర్శించాక ఈ సందేహం జాజలికి వేయిరెట్లయింది.

'మహానుభావా! నా సాధన యొక్క అల్పత్వాన్ని ఆకాశవాణి ఎలుగెత్తి చాటింది. నా సాధనలోని లోపాన్ని సవరించుకొనేందుకై మిమ్మల్ని ఆశ్రయించాను. దైవం ప్రశంసించేంతటి ధార్మికవర్తనం వ్యాపారం చేస్తూ కూడా, మీకు ఎలా అలవడిందో నాకు బోధపడటం లేదు. దయచేసి తమ జీవన విధానాన్ని తేటతెల్లం చేయండ'ని తులాధారుడిని ప్రార్థించాడు జాజలి.

'మునీంద్రా! నా జీవనం ఈ తులాధారమే! ఈ త్రాసు దుకాణానికి వచ్చిన సర్వజనులకూ – వివక్షలేకుండా సమానంగా, న్యాయంగా తూస్తుంది. నా క్రయ విక్రయాలలో మోసంలేదు. తగు లాభాన్నే స్వీకరిస్తాను. ఇది నా బాహిరమైన జీవన విధానం.

సమస్త జీవరాశినీ మిత్ర భావంతో ప్రేమిస్తాను. దేనినీ కావాలనుకోను. అక్కరలేదనుకోను. నిందించను. పొగడను. మట్టీ, బంగారమూ రెండూ నాదృష్టిలో సమానమే! సుఖభోగాలను కీర్తి ప్రతిష్ఠలను ఆశించను. ఇతరులకు 'ఇంత మేలు చేసాను, అంత మేలు చేసాను' అని మిడిసిపడను, నిర్భయుడను. సత్యాహింసలను పాటించెడివాడను. సాక్షీభూతుడనై లోక వ్యవహారాలను చిత్రాకారంగా దర్శిస్తాను. నా మనస్సు తామరాకుపై నీటిబొట్టువలె సమస్త కార్యాలయందు అంటీ అంటనట్లు నిర్లిప్తంగా ఉంటుంది.'

అంటూ తులాధారుడు తన జీవన విధానాన్ని జాజలికి వివరించాడు.

జాజలి ఆశ్చర్యపోయాడు. 'తులాధారా! నీవు తపస్సు కానీ, యజ్ఞ యాగాదులు కానీ





నిర్వహించదంలేదా? ఇవేమీ చేయకుండానే నీకింతటి ధార్మిక నిష్ఠ సాధ్యపడిందా? నీ జీవన విధానాన్ని వేదాంతులు గౌరవిస్తారా? ఇది శాస్త్ర సమ్మతమైనదేనా?' అంటూ తన సందేహాలను బైటపెట్టాడు జాజలి.

తులాధారుడు చిరునవ్వు నవ్వి 'తాపసీ! ధర్మము అతి సూక్ష్మమైనదని తమకు తెలియదా? అహంకార, మమకారాలతో కామ, లోభాలతో చేసే తపస్సును కానీ, యజ్ఞాన్నికానీ దైవం మెచ్చదు. అలాంటి కర్మలవల్ల వచ్చే ఫలాలెప్పుడూ అల్పమైనవే. అవి జనన, మరణ చక్రభ్రమణం నుండి జీవులను రక్షించలేవు.

నిత్యతృప్తుడై, సత్యవ్రతుడై జీవించేవాడినే దైవం మెచ్చుతుంది. దైవం మెచ్చి అనుగ్రహించడమే కదా మన జన్మకు సార్థకం!' అన్నాడు తులాధారుడు. 'ఇంతటి జ్ఞానివి నీవు ఇంకా కర్మల నెందుకాచరిస్తున్నావు? ఈ వ్యాపారాదులన్నింటినీ కట్టిపెట్టి తపస్సును ఆశ్రయించ వచ్చుకదా!' అని జాజలి మరల ప్రశ్నించాడు.

'మహర్షీ! ఆత్మోద్ధరణకు అరణ్యాలను, పర్వతాలను, నదులను పట్టుకు తిరుగనవసరం లేదు. ధర్మాన్నే ప్రేమిస్తూ, ధర్మాన్నే ప్రాణంగా భావించే సంగరహితునికి కర్మలెప్పుడూ బంధనాలు కావు. అహంకార మమకారాలనే బురదలేని ఆత్మ తీర్థంలో మునకలు వేసే అకల్మషుడాచరించే సమస్త కర్మలూ పుణ్యకర్మలే అవుతాయి.

నా మాటలలోని యదార్థాన్ని తెలుసుకోవాలనుకుంటే నీవు తండ్రివలె నీ తలపై పెంచిన పక్షులను పిలిచి అడుగు. అవిగో! అవి ఇక్కడనే ఉన్నాయి' అన్నాడు తులాధారుడు.

జాజలి ఆకాశంలో ఎగురుతున్న ఆ పక్షులను చూచి ఆప్యాయంగా పిలిచాడు. ఆ పక్షులు ఆకాశంలో నిలిచి 'మహర్షీ! తమ ధర్మదీక్షను పరీక్షించడానికి ధర్మదేవత పంపిన దూతలం మేము.

జ్ఞాన లబ్ధికి, శుభప్రాప్తికి 'శ్రద్ధ' ఎంతో అవసరం మనస్సును మలినం చేసే మాత్సర్యం వల్ల ఈర్ష్యాద్వేషాలు, ఏర్పడతాయి. వాటి వల్ల హింస పుడుతుంది. హింస 'శ్రద్ధ'ను నాశనం చేస్తుంది. శ్రద్ధ నశిస్తే సర్వమూ నాశనమే. కనుక శ్రద్ధ విషయంలో జాగ్రత్తవహించు. శ్రద్ధ మనశ్శుద్ధి రూపంలో వ్యక్తమౌతుంది. నిర్మల చిత్తంతో చేస్తే ప్రతి కర్మా ముక్తికి మార్గాన్ని చూపేదే. 'శ్రద్ధ' ఉంటే సమస్త దోషాలు తొలగిపోతాయి. ఈ విషయాన్ని తెలియజేసే బ్రహ్మగీతలను వివరిస్తాము విను' అంటూ జాజలికి హితబోధ చేసాయాపక్షులు.

తులాధారుడు నాయనా! జాజలీ! పాము కుబుసాన్ని విడిచినట్లుగా నిర్మలమైన 'శ్రద్ధ' కలవాడు పాపాల్ని విడుస్తాడు. శ్రద్ధనిండిన మనస్సులో మాలిన్యాలకు చోటుండదు. కనుక నీవు చేసే 'కర్మ'లు మానిత్వాది దోషాలతో మలినం కావడానికి అవకాశం లేకుండా శ్రద్ధతో నిర్వహించు అని బోధించాడు.

'తులాధారా! పెద్దల వల్ల తత్త్వాన్ని తెలుసుకోకపోవడం వల్ల నాకీ చేటు కల్గింది. నీ బోధ నాకు శాంతి మార్గం చూపింది. కర్తవ్యం అర్థమైంది' అన్నాడు జాజలి.

సంతోషించాడు తులాధారుడు. 'మిత్రమా! మనం నివృత్తి మార్గంలో కర్మలాచరించినా, ప్రవృత్తి మార్గంలో కర్మల నాచరించినా, నిర్మల శ్రద్ధతో నేర్పుకలిగి మెలగడమే మన హితదాయకం అది గుర్తించి మన సాధనను కొనసాగిద్దాం' అన్న

తులాధారుని మాటలకు సమ్మతించి జాజలి తృప్తిగా తన దారిన తానుబయలుదేరాడు.

వారిరువురూ ఆ విధంగా నిర్మలశ్రద్ధతో కర్మల నాచరించి ఉత్తమలోకాలను పొందాడు.

తానున్న స్థితి నుండి ఉన్నత స్థితికి ఎగబ్రాకాలనుకొనే సాధకులెప్పుడూ సదా జాగరూకులై ఉండాలి. పర్వతశిఖరాలపైకి ఎక్కేవాడు ఏ చిన్న పొరపాటు చేసినా పల్టీలు కొట్టుకుంటూ పాతాళానికి పడిపోయే ప్రమాదముంటుంది. నేలను కరచుకునే జీవించే వాడు ప్రత్యేకంగా జారి ఎక్కడ పడతాడు?

యయాతి, జాజలిల వంటి ఉత్తమ సాధకులకు ఎదురైన అనుభవాలు, అందులోంచి వారు స్వీకరించిన గుణపాఠాలు వారి వికాసాన్ని సుస్థిర పరిచాయి వేగిర పరిచాయి.

మరి మన సంగతేంటి? మన మనస్సులను మరమ్మత్తు చేసుకొనే విషయంలో మనం ఏపాటి శ్రద్ధ వహిస్తున్నాం? అమానిత్వంతో చిందులు త్రొక్కుతున్నామా? అమానిత్వ సాధనకోసం అడుగులు వేస్తున్నామా? మనస్సును ఈ ర్ష్యా ద్వేషాది మలిన భావాలకు నిలయంగా మార్చు కుంటున్నామా? మాధవునికి ఆలయంగా మార్చుకుంటున్నామా? ఆలోచించండి. మన నిత్యనైమిత్తిక వ్యవహారాలలో, సామాజిక సంబంధాలలో మన ప్రవర్తనను పరిశీలించుకుని సరిదిద్దుకొనేందుకు ఈ 'ఇతిహాసబోధ' చిన్న దర్పణంగా ఉపయోగపబడుతుందని ఆశిస్తూ వచ్చే సంచికలో మళ్ళీ కలుద్దాం...

**యథాప్రకారం ఈ కథకు కూడ తగిన పేరు సూచించడంతోపాటు మీరుకూడ ఈ 'శీర్షిక'కు ఇలాంటి కథలు పంపే ప్రయత్నం చేయండి..**



## ఇతిహాసబోధ - 16 శీర్షికకు పాఠకులు పంపిన కొన్ని పేర్లు

1. **గర్వమునకు ఫలితము అధఃపతనము**
 - బి. వీర్రాజు, జగ్గంపేట.
2. **పరమశాంతిని కోరుకునే మానవుడుచిత్త వృత్తి యందు పరమాత్మను నిలిపి ఆరాధించ వలెను.**
 - డా॥ యమ్. రాజేశ్వరరావు, విజయవాడ
3. **దురభిమానం - దురహంకారం పతనానికి కారణం** -యమ్. జయప్రకాశ్, హన్మకొండ
4. **దంభం, అమానిత్వాలనుండి నన్ను రక్షించు ప్రభూ!!**
 -డా॥సిహెచ్.హనుమంతరావు, కరీంనగర్.
5. **ఇసుక రవ్వంత అహంకారము, కొండంత పుణ్యాన్ని దహించివేస్తుంది.** -వి. విష్ణువర్ధన్, మామిళ్ళగూడెం.
6. **దురహంకారం, కపటం, మానవ పతనానికి దారి తీస్తుంది.** - య్స్.ఆర్.పున్నయ్య, గుంటూరు.
7. **తృష్ణను విడనాడి విష్ణునామంతో పునీతుడైన వాడే అమానిత్వముతో వర్ధిల్లగలడు.**
 - కె. రమశేషమ్మ, హిల్‌కాలనీ.
8. **దురభిమానం దుఃఖానికి మూలము.**
 - యస్. పుష్పలత కమలాకరరావు, కరీంనగర్.
9. **తపస్సు ఊర్ధ్వలోకం చేరిస్తే, అహం అధోలోకం తొక్కింది.**-వి. శ్రీనాథకవి, తాడిపత్రి
10. **నాఽహంకారోభవతి పుణ్యలోకాదిష్టః యయాతి ఉవాచ** -వి.రమ్యభార్గవి, తాడిపత్రి
11. **సిద్ధ్య సిద్ధ్యోస్సమో భూత్వా, సమత్వంయోగ ఉచ్యతే.** - ఆర్. చక్రపాణి, హనుమకొండ.





12. **కామితార్థి కన్న కొడుకులను సైతం కానలకు పంప వెనుకాడరాదు.**
 -ఆర్. రమేష్, హనుమకొండ.
13. **సాధన చేయర నరుడా, సాధించలేనిది లేదురా** - ఆర్. రంగనాథ్, హనుమకొండ.
14. **అరి షడ్వర్గాల త్యాగి అసలైన యోగి**
 - ఆర్. లక్ష్మి, హన్మకొండ.
15. **నిండు కుండ తొణకదు.** - ఆర్. సుమ హన్మకొండ
16. **మానిత్వం, దంభత్వమనే రెండు దుర్గుణాలు మానవ పతనానికి మూలం** - జె. రాధాకృష్ణమూర్తి, గుంటూరు.
17. **అహంకారం, అజ్ఞానం వల్ల వినాశనం, భగవత్ భక్తివల్ల పరమపదం లభించును.**
 - జాలిగం రాధకృష్ణ అప్పారావు, బి.సావరం.
18. **అనంతునిచేర్చే దివ్యజ్ఞానౌషధం అమానిత్వం**
 - యమ్. శంకరరావు, వేకనూరు.
19. **అధోలోక పతనం మానిత్వం, ఊర్ధ్వలోక పయనం అమానిత్వం** - యమ్. లక్ష్మీరవికుమార్, వేకనూరు
20. **దంభత్వానికి శాస్తి**
 -వి.వాసవి, భీమునిపట్నం.
21. **మనిషి దురహంకారమే మనుగడను మంటగలుపుతుంది.**
 - ఎ. రామయ్య, హనుమకొండ.
22. **సత్సాంగత్యమువలన మేలేకాని కీడు జరుగదు.** - సి. అరుణ పాపిరెడ్డి, నిర్మల్.
23. **ఇతరులు అవమానించిన కృంగిపోక నిలచినవాడే సజ్జనుడు.**
 - టి.యస్. ఆళ్వందార్, విజయవాడ.
24. **మానిత్వం మాధవుని చేర్చును.** - యమ్. విశ్వనాథం, హన్మకొండ.
25. **అన్నికోర్కెలు విడిచిన వాడికే సుఖము, పరమశాంతి, మోక్షం లభించును.**
 - యన్. ఉమామహేశ్వరరావు, అనకాపల్లి
26. **ఇతరులు ఆదరించినపుడు పొంగిపోక అవమానించినప్పుడు విషాదమొందక నిలచిన వాడు సజ్జనుడు.**-జె.అమరయ్య, అమరావతి
27. **ఆహంకారము అధోలోకాలకు-సత్సంగము ఊర్ధ్వలోకాలకు బాట**
 - యల్. అప్పారావు, బొబ్బిలి.
28. **అహంకారాలు వదలి శ్రీహరిదరిచేరుకో!!**
 - వి. బాపిరాజు, విశాఖ
29. **ఎవరైతే సుఖదుఃఖాలలో తత్త్వజ్ఞానం తెలుసు కొంటారో వారు శ్రీహరి గమ్యం చేరుకుంటారు.**
 -యమ్. సూర్యనారాయణ, మెళియా పుట్టి.
30. **మానిత్వం, దంభత్వం అనే దుర్గుణాలు పతనానికి దారులు తెరుస్తాయి.**
 - జె. రాధమధుసూదనరావు, కరీంనగర్.
31. **అహంకారం, మమకారం, ఎంతటి సాధకుడినైన లక్ష్యం చేరనీయవు.**
 -డి.కిషన్‌రావుగారు,రామచంద్రాపురం.
32. **నిర్వికారం, నిర్వికల్పం రామనామము**
 - వి. సుజాత, హైదరాబాద్.
33. **నేను నాది లేకపోవుటకు పరజీవి హితవు కోరుటయే అమానిత్వము**
 - డి. శ్రీనివాసు నాయుడు, చిన్నబాడాం
34. **మాధవునికి నిజమైన సేవకునిగ మారు**
 - యమ్. జీయర్‌స్వామి, ఇందుకూరు
35. **పూరుడు త్యాగం - యయాతి భోగం**
 - యమ్. ఇందిర, ఇందుకూరు పేట.
36. **చతురతిః దివ్యచరణాల సన్నిధిని పొందాలను కోవడమే సర్వశ్రేష్టమైన కోరిక**
 - ఆర్. అనసూయ, అనంతపురం
37. **బుద్ధే మనిషిని శాసిస్తుంది.**
 - యమ్.వి. కృష్ణారావు, మిర్యాలగూడ.
38. **మహానుభావునికైన అహం పతనానికి నాంది.** - యస్. జయలక్ష్మి, విశాఖ.
39. **కొద్దిపాటి అహంకారమే దీర్ఘకాలపు తపః ఫలాన్ని చెఱచగలదు.** - కె. వనజ, ఖానాపూర్.
40. **కోర్కెలకు కళ్ళెం అవసరం.** - చైతన్య, గుంటూరు.

**వీరందరికీ శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములు అందజేయుచున్నాము.**

- వికాసతరంగిణి.





శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో...

# గోదావరీ పుష్కర ప్రయుక్త బ్రహ్మ యజ్ఞము

**SKVTకాన్వెంట్, దానవాయిపేట, రాజమహేంద్రిలో..**

**తేది : 28-7-2003 నుండి 4-8-2003 వరకు**

పవిత్ర గోదావరీ పుష్కరాలలో జరిగే సప్తాహ్నిక పంచకుండాత్మక బ్రహ్మ యజ్ఞంతోపాటు వివిధేష్టులు మరియు వికాసతరంగిణి జన్మదిన వేడుకల్లోనూ అన్వయించి తరించవలసినదిగా సాదరముగా ఆహ్వానిస్తున్నాం.

**ప్రతిరోజూ కారక్రమాల వివరములు**

ఉ॥ 7-30 తీర్థగోష్ఠి, బ్రహ్మ యజ్ఞం వివిధ పారాయణారంభం
ఉ॥ 9-00 శ్రీస్వామివారి ప్రవచనం మరియు ఆహూతులైన పెద్దల ప్రవచనాలు
మ॥12-00 పూర్ణాహుతి, సా॥ 4-6 టి.టి.డి. ఆళ్వారు ప్రాజెక్టుపక్షాన శ్రీపురాణేతిహాసగోష్ఠి
సా॥ 6-45 శ్రీస్వామివారిప్రవచనము, రా॥ 8-30 సాంస్కృతిక కారక్రమాలు.

29-7-03 : విష్వక్సేనేష్టి 30-7-03 : వైనతేయేష్టి 31-7-03 : హయగ్రీవేష్టి
1-8-03 : లక్ష్మీనారాయణేష్టి 2-8-03 : సుదర్శనేష్టి 3-8-03 : నారసింహేష్టి
4-8-03 : మహాపూర్ణాహుతి.

ఇష్టిహోమాలలో 5,116/- రూ॥లు చెల్లించి, అన్వయించి సిద్ధిని పొంది తరించండి.

**కైంకర్య వివరములు**

| | | |
|---|---|---|
| ఒక రోజు తదీయారాధనకు 500 మందికి | రూ. | 10,000/- |
| ఒక రోజు ప్రసాద కైంకర్యమునకు 2500 మందికి | రూ. | 10,000/- |
| ఒక రోజు హోమగుండ యాజమాన్యమునకు | రూ. | 1,116/- |
| ఒక రోజు ఐదు హోమగుండముల యాజమాన్యమునకు | రూ. | 5,116/- |
| అన్ని రోజులూ యజ్ఞ యాజమాన్యమునకు | రూ. | 10,000/- |
| 1-8-03 శ్రీ ఆండాళ్ తిరు॥ - గోదాపూజ, సామూహిక లక్ష్మీపూజా | రూ. | 58/- |
| 2-8-03 సామూహిక శ్రీకృష్ణాష్టోత్తర పూజా కార్యక్రమానికి | రూ. | 58/- |

ఇవియేకాక మీ కైంకర్యములను వస్తురూపములో కూడా సమర్పించి శ్రీ లక్ష్మీనారాయణుల కృపాకటాక్షములను, శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి పరిపూర్ణ మంగళాశాసనములను పొంది తరించండి

సదా ఆచార్య సేవలో
**జెట్, వికాసతరంగిణి,** రాజమహేంద్రి,
ఫోన్ : 0883 -2479000
E-mail : jetphuskar@yahoo.com










ఎప్పుడూ లేనంత తీవ్రంగ ఈ ఏడాది ఎండలు మండిపోయాయి. రాళ్ళుపగిలేట్టు కాచాయి. వడగాడ్పులు ప్రభావం ఎందరినో అసువులు బాసేట్టు చేసింది. మన వేద విద్యార్థులు గూడ ఆ గాడ్పుల బారినపడక తప్పలేదు. సీతానగరపు వేదవిద్యార్థి చి॥ లక్ష్మీకాంత్ రెండురోజులు ప్రపంచ స్మృతి లేకుండా బాధపడి, హోమియోవైద్య ప్రభావంతో తిరిగి స్వస్థితికి చేరుకున్నాడు. మొత్తం మీద ఆందోళనకరంగ సాగిన వేసవి ఉద్ధృతి ఉపశమించింది. ఋతుపవనాలు పలుక రించాయి. అక్కడక్కడ కురిసిన చిరుజల్లులు పుడమి తల్లిని చల్లబరిచాయి. సంతృప్తికరంగఎప్పుడు వర్షాలు కురుస్తాయో...

ఇంత తీవ్రంగ వాతావరణం విలవిల్లాడిస్తున్నా శ్రీచిన్నజీయరుస్వామివారి ప్రచార కార్యక్రమాలు విస్తృతంగ సాగుతూనే ఉన్నాయి. రాంచీ ప్రయాణం ముగించి, భద్రాద్రి ప్రతిష్ఠకు చేరేసమయానికి 52 డిగ్రీల సెంటి గ్రేడ్ పైనే ఎండ ఉంది. అయినా 'అక్కడక్కడి కార్యకర్తలు చక్కటి వసతి సౌకర్యాలు చేయడంవల్ల ఏశ్రమతెలియ కుండా కార్యక్రమాలు హాయిగా చేసుకుపో గలగుతున్నా' మన్నారు స్వామివారు.

**హైదరాబాద్‌లో....**

మే 25వ తేదీ రాత్రికి భద్రాచలం నుండి హైదరాబాదు వెంగళరావు నగర్ చేరారు. అక్కడ శ్రీమాన్ యమ్.టి. ఆళ్వార్ గారిద్వారా శ్రీమాన్ సిహెచ్. వివేకానందగారు నిర్వహించే 'శ్రీరామాయణోపన్యాసా'లను ప్రారంభించి జెట్‌కిచేరారు.

**బదరీలో...**

26వ తేదీ ఉదయం విమానంలో ఢిల్లీచేరి, అప్పటికే అక్కడ చేరి ఉన్న భక్తబృందంతో నేరుగ హృషీకేశ్ బయలుదేరారు. అమెరికా శాన్‌ఫ్రాన్సిస్కో నుండి శ్రీమాన్ హరి దంపతులు వారి పిల్లలతో వచ్చి ఉన్నారు. శ్రీమాన్ మండవ జానకి రామయ్య దంపతులు, సత్యవతిగారు తదితరులు శ్రీవారితో కలిసారు. హైదరాబాద్ నుండి శ్రీమాన్ సుదర్శనంగారు, మాధవరావు గారు, శ్రీమాన్ ఆనందరావు దంపతులు, శ్రీరామేశ్వరరావుగారి అబ్బాయి చి॥ వినోద్, శ్రీమాన్ పురుషోత్తమ రావు దంపతులు అన్నదానకమిటీ సభ్యులు శ్రీమాన్ రమేష్ గుప్తాగారి దంపతులు, ఖమ్మం నుండి శ్రీమాన్ ఇ. రామారావుగారు ప్రభృతులున్నారు. ఢిల్లీ శ్రీమాన్ జి. శ్రీనివాస్ ఉమ దంపతులు వీరందరికీ వాహనాదులను ఏర్పాటు చేసి తమ తల్లిదండ్రులతో పాటు వారూ బదరీ యాత్ర శ్రీవారితోపాటు పాల్గొన్నారు.

26వ తేదీ రాత్రికి హృషీకేశ్ చేరేటప్పటికి అనేక ప్రాంతాల నుండి అక్కడ చేరి ఉన్న భక్త సముదాయం శ్రీవారికి స్వాగతం పలికింది. అక్కడ ఉన్న మన మఠ నిర్వాహకులు శ్రీమాన్ హరికృష్ణగారు, దాసుగారు, మన విద్యార్థులతో ఆగంతకులందరికీ వసతి, ఆహార సదుపాయా లను బస్ మొదలైన వాహన సౌకర్యాలు శ్రద్ధగా చేస్తున్నారు. వారందరినీ శ్రీవారు పరామర్శించారు.

హృషీకేశ్ మఠంలో బసచేసే భక్తులకు సామూహిక భోజన సదుపాయం చాలటం లేదు. దానికై వాయవ్యం మూల ఉన్న సుమారు 350 గజాల స్థలం తీస్కొని దానిలో ఒక వంటశాల, తదీయారాధన మండపం నిర్మిస్తే, సీజన్ సమయంలో ఒకేసారి వచ్చే జన సముదాయానికి కొంతైనా సౌకర్యంగా ఉంటుంది కనుక ఆ స్థలాన్ని కొందామని శ్రీమాన్ సుదర్శనంగారు, ఆనంద్ మొదలైన వారంతా ప్రోత్సహిస్తే శ్రీవారంగీక రించారు. గజం రూ. 2000/- పైగా ఖరీదు చేసే ఈ స్థలాన్ని కొనడానికి సుమారు రూ. 7లక్షల పైగా అవుతుందని శ్రీమాన్ శుద్ధానందస్వామి నిర్ణయించారు. ఆపై అందులో తగిన నిర్మాణం చేయాలి. శ్రీస్వామివారు శ్రీ శుద్ధానందస్వామికి కొంత ధనాన్ని ఇచ్చి ఆ స్థలాన్ని రిజిష్ట్రేషను చేయించే ఏర్పాటు ప్రారంభించమని ఆదేశించి,
27వ తేదీ ఉదయం బదరీనాథ్ బయలుదేరారు.

28, 29, 30 తేదీలలో మన అష్టాక్షరీ క్షేత్రంలో ఉండి సాధు సమారాధన, భక్తజన తదీయారాధనలను పర్యవేక్షించారు. ఒక రోజు సాధువులకు, బీదలకు వస్త్రదానం నిర్వహించారు. సుమారు 60 సం॥లుగా బదరీనాథునితో ఉంటూ కైంకర్యం చేసే నేపాలీ మాయీ, శ్రీవారి శిష్యురాలు అయిన భాగవతా మాయీనీ పరామర్శించారు. గత 5,6 నెలలుగా ఆమె అనారోగ్యంతో లేవలేని స్థితిలో మాటరాక బాధపడుతున్నారు. శ్రీవారిని ఆమె సేవించి మాటరాక శోకిస్తూ ఇంతకాలం తానారాధించుకొన్న సాలగ్రామ శ్రీమూర్తులను శ్రీవారికి సమర్పించి తనను కడతేర్చమన్నట్లుగ ప్రార్థించుకున్నారు. ఆమెను ఓదార్చి శ్రీవారు ఆ మూర్తులను స్వీకరించారు.

బదరీనాథ్‌లో ఉన్న భవనాలన్నింటిలో విశాలమైనది, పురాతనమైనదీ మన స్వామి వారు గతంలో నిర్మించిన సత్సంగ సదనం. అందులోనే ఇపుడు శ్రీశ్రీనివాస పెరుమాళ్ళు తన పరివార మండలితో ఆరాధనలందు కుంటున్నారు.

ప్రతి ఏటా శీతాకాలంలో కురిసే విపరీతమైన మంచువల్ల, గతంలోనే రెండు సార్లు మంచు తుఫాన్ల బారినబడటంవల్ల సదనానికి ఎన్నో రిపేర్లు చేయవలసి వచ్చింది. అయినా నిరంతరం కురిసే వానలవల్ల అంతా కారుతూ ఇబ్బంది కరంగ ఉంది. ఈ ఏడాది ఈ సత్సంగ సదన జీర్ణోద్ధరణను ద్దేశించే 'బదరీ అన్నదాన శాఖా సంఘ' సమావేశాన్ని 29వ తేదీన మొదటిసారిగ బదరీనాథ్‌లో నిర్వహించారు. సమన్వయకర్త శ్రీమాన్ రమేష్ గుప్తా, శ్రీమాన్ యమ్.ఆర్.కె. ప్రసాద్ గుంటూరు, శ్రీమాన్ జి. వేణుగోపాలా చార్యులుగారు, శ్రీమాన్ పాతాళం సుబ్బారావు డోన్, వరంగల్ నుండి బి. మురళీకృష్ణ, క్షేత్ర నిర్వహణ చూచే కుమారి ఉషశ్రీ పాల్గొన్నారు. మిగిలిన విషయాలనన్నింటినీ చర్చించాక ఈ సత్సంగ సదనాన్ని సుమారు రూ. 90 లక్షలతో జీర్ణోద్ధరణ గావించవలసి ఉంటుందని నిర్ణయించారు. సుమారు 3000 చ॥ అ॥ విస్తీర్ణంతో గ్రౌండు ఫ్లోరులో వంటశాల, తదీయారాధన శాల, స్టోరు, మొదటి అంతస్థులో భక్తులుండే గదులు, సౌకర్యాలు మొదలైనవి, రెండవ అంతస్థులో పెరుమాళ్ళ సన్నిధి సంప్రదాయ సిద్ధంగ విమానంతో నిర్మించాలి. సన్నిధికి ముందుండే హాలు భక్తులకు ఉపయోగపడాలి. ఇలా మొత్తం 9వేల చదరపు అడుగులు 3 అంతస్థులుగ నిర్మించే ఈ జీర్ణోద్ధరణను వెంటనే చేపట్టాలని, ప్లాను వగైరా శ్రీమాన్ రమేష్‌గుప్తా తయారు చేస్తారని శ్రీవారు నిర్ణయించారు. శ్రీమాన్ ఆనంద్ గారితో వచ్చిన





ఇంజనీర్ శ్రీమాన్ రెడ్డిగారు తమవంతు సేవలను పూర్తిగ అందిస్తామని వాగ్దానం చేసారు. ఈ నిర్మాణానికి అవసరమైన కొంత ద్రవ్యాన్నిది వరకే హైదరాబాద్ భక్త బృందం, కొన్ని జిల్లాలలోను అక్కడ జరిగిన సమావేశాల్లోనూ భక్తులు వాగ్దానాలు చేసి ఉన్నారు. కొందరు వాగ్దాన ధనాన్ని సుమారు రూ. 20 లక్షల వరకు అందించి ఉన్నారు గూడ.

ఈ జూన్ చివర నుండి నిర్మాణ కార్యాలు ప్రారంభించాలని, కమిటీ సభ్యులు తీర్మానించారు. క్షేత్ర నిర్వహణ సమర్థవంతంగ చేస్తున్నందులకు అందరూ కుమారి ఉషశ్రీని ప్రశంసించారు. క్రింద ప్రాంతాలలో ఎండకు దీటుగా బదరీలో చలిగూడ అధికంగానే ఉంది. అయినా మన ఆగమ విద్యార్థులు, అర్చకులు, తళియస్వామి చాల శ్రద్ధగ ఆరాధన, భక్తుల గోత్రనామాలతో పూజలు మొదలైన సేవలు చేస్తున్నారు.

30వ తేదీ రాత్రికి హృషీకేశ్ చేరిన శ్రీస్వామివారు 31వ తేదీనాడక్కడి మఠకార్యక్ర మాలను సమీక్షించారు. తగు సూచనలు చేసి 1వ తేదీన ఢిల్లీకి బయలు దేరారు. సుమారు గం॥ 3-00కి ఫరీదా బాద్‌లో సిద్ధదాత ఆశ్రమంలో గత ఏడాదిన్నర నుండి అస్వస్థులై ఉన్న జగద్గురు శ్రీస్వామి సుదర్శనాచార్యజీని పరామర్శించి రాత్రికి శ్రీ శ్రీనివాస్‌గారి గృహంలో బసచేసారు.

2వ తేదీ ఉదయం ఆరాధన కాగానే బయలుదేరి భువనేశ్వర్ మీదుగ విశాఖ పట్నంలో వివిధ కార్యక్రమాలలో పాల్గొనే నిమిత్తం చేరారు. ముందుగ యమ్.వి.పి. కాలనీ వికాసతరంగిణి, శ్రీమతి ఛాయాదేవి గారు ఏర్పాటు చేసిన, సెంట్రల్ జైలులో ఖైదీలకు సందేశం యిచ్చే నిమిత్తం విమానం దిగగానే నేరుగ, ఆసియాలోఅతి అందమైన జైలైన విశాఖ జైలును సందర్శించారు. అక్కడి 200 మందికీ గీతాజ్యోతి శ్లోకమాలికలూ, పత్రికలూ వితరణ చేయించి 1 సమాజంలో రావలసిన మార్పులు ఎలా ఉంటే మంచిదో సూచించారు.

ఖైదీలందరికీ స్వయంగ పండ్లను శ్రీవారనుగ్రహించారు. అక్కడి నుండి శ్రీమాన్ దాసుగారు నిర్వహించే శ్రీలక్ష్మీనారాయణ పెరుమాళ్ కోవెలలో శ్రీ దాసుగారి ప్రార్థనపై బసచేసారు. అక్కడ మొదటి బ్రహ్మోత్సవాలు ప్రారంభమవు తున్నాయి. 2వ తేది రాత్రి సింహాచలేశుని దివ్యాలయ సందర్శనము చేసారు శ్రీస్వామివారు.

**సింహాచలంలో ...**

సుమారు 30 సం॥ల క్రితము సింహాచలంలో 'శ్రీవైష్ణవ రామానుజ కూటం' నిర్మించాలని మన శ్రీపెద్దజీయరుస్వామి కొంత నిధిని చేర్పించారు. అది క్రమంగా ఒక లక్షగ చేరగ దానిని అక్కడ నిర్మాణ బాధ్యత చేపట్టిన సభ్యులకు అందించగా ఓ కళ్యాణ మండపం వంటిది నిర్మించారు. ఈ సారి చందన యాత్రకు వచ్చిన స్వాములకు ఆ మఠంబాగ ఉపయోగపడిందని అంతా సంతోషించారు. శ్రీస్వామివారు మరోలక్ష రూపాయల నందచేసి తగు పాత్రలను మొదలైనవాటిని సేకరించమన్నారు.

**విశాఖపట్నంలో....**

విశాఖలో శ్రీమాన్ అప్పనబాబు (శ్రీ యు.ఎ.యన్. రాజుగారు) గారిపేరు తెలియని ధార్మికులుండరు. వారి కుమారులు, బంధువులు నిర్మించిన కళ్యాణ మండప సముదాయాన్ని 3వ తేదీ జూన్ ఉదయం శ్రీవారు ఉద్ఘాటన గావించారు. ఆపై శ్రీలక్ష్మీ నారాయణ ఆలయంలో బ్రహ్మోత్సవ ప్రయుక్త కార్యక్రమాలను ప్రవచనంతో ప్రారంభించారు. శ్రీమాన్ దాసుగారు ఆలయ

నిర్మాణ నిర్వహణ లో చూపే శ్రద్ధను పలువురు ప్రశంసించగ శ్రీస్వామివారు అందరికీ మంగళా శాసనాలు అనుగ్రహించారు.

కాకినాడవద్ద ఉన్న శ్రీ ఉపనిషాదాచార్య పీఠ నిర్వాహకులు ప.ప.ఉ.వే.ప్ర. శ్రీశ్రీశ్రీ రంగ రామానుజ జీయరుస్వామివారు విశాఖ పట్నంలో ఓ అద్భుతమైన కార్యక్రమాన్ని ప్రపన్నులకు ఉజ్జీవన కరంగ జరిపారు. అది 7 దినాల దీక్షతో సాగే శ్రీలక్ష్మీనారాయణ క్రతువు. అందులో భాగంగ 3వ తేదీన 8 మంది శ్రీవైష్ణవ యతీశ్వరులతో నారాయణ మహామంత్ర తాత్పర్యమును వివరించారు. శ్రీపరాశరభట్టర్ అనుగ్రహించి అష్టశ్లోకిలో ఒక్కొక్క శ్లోక సారమునూ ఒక్కొక్కరిచేత భక్తులకుపదే శింపచేయుట. ఇదొక అపురూప సన్నివేశం. చరిత్రలో మొదటి సారి 8 మంది జీయర్లు విశేషించి తెన్నాచార్య సంప్రదాయా నువర్తనులు ఒకచోట చేరడమే కాక, ఒక ఉపదేశమునుగూడ ప్రసాదించునట్లు చేయుట. ముగ్గురు ఒకచోట చేరితేనే అదో దివ్యదేశ మంటారు. మరి అలాంటి 8 మంది యొక్క దర్శనము, వారి శ్రీసూక్తి శ్రవణమూ విశాఖ జనులకు లభించిన మహోపకారం శ్రీశ్రీశ్రీ రంగరామానుజ జీయరు స్వామివారు చేసారు.

(వివరణ **'విశాఖయతిగోష్ఠి'** 23వ పేజీలో చూద్దాము)

3వ తేదీ సాయంకాలం, బుల్లెయ్య కాలేజి విశాలమైదానం కిటకిటలాడుతూండగ, వేలాది భక్తుల సమక్షంలో శ్రీవానమామలై జీయర్ స్వామి ఆధ్యక్ష్యంలో సభారంభమై, శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు నిర్వహిస్తూండగ ప్రతీ జీయరుస్వామి ఒక్కొక్కశ్లోకం శ్రోతలతో అనిపించడం, ఆయా శ్లోక వివరణ ఓ 15 నిముషాలలో ప్రవచించి అనుగ్రహించడమూ, సాయం కాలం సుమారు గం॥ 6-00 లకు ఆరంభమై రాత్రి గం॥ 10-45లకు ముగిసినా, భక్తులంతా శ్రద్ధతో ఆలకిస్తూ, ఆలపిస్తూనే ఉన్నారు. శ్రీ ఉ.వే.శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలా చార్యస్వామివారుగూడ వీల్ ఛైర్‌లో విచ్చేసి కార్యక్రమాన్ని సందర్శించి ఓ అరగంట ఉండి, శక్తి సహకరించకపోవడంతో ఇంటికి తిరిగి వెళ్ళి, ఆయాసంగ ఉండటంతో కేర్ హాస్పిటల్ లో చేర్చారు. వారు పాల్గొనిన చివరికార్యక్రమం అదే.

శ్రీచిన్నజీయరుస్వామివారు కార్యక్రమా నంతరం ఈ విషయం తెలిసి అనకాపల్లికి వెడుతూ, హాస్పిటల్‌కి వెళ్ళారు. స్వామివారిని పలుకరించి, మంగళాశాసనం చేసి అనకాపల్లి బయలు దేరారు. ఇదే వారి చివరి చూపు! ఆ తర్వాత హాస్పిటల్‌లోనే 3 దినాలుండి తమ ఆచార్య శ్రీచరణ సన్నిధానానికి 7వ తేదీరాత్రి సుమారు గం॥ 9-00కి వారు చేరారు.

**అనకాపల్లిలో...**

4వ తేదీ ఉదయం అనకాపల్లికి తెల్లవారుతూనే శ్రీ చిన్నజీయరుస్వామివారు చేరారు. మునిసిపల్ ఛైర్మన్ శ్రీమాన్ జగన్ గారింట శ్రీవారు బస చేసారు. ఇక్కడ భక్తులు అధికసంఖ్యలో శ్రీవారి తీర్థగోష్ఠిలో పాల్గొన్నారు. శ్రీమాన్ టి. రామాచార్య, తత్త్వ ప్రచారకులు శ్రీమాన్ రఘునాథాచార్యులు, శ్రీమాన్ వర్మ నెలరోజులు పైగా 120 గ్రామాలను గీతాజ్యోతితో ఉత్తేజపరచి, 'అనకాపల్లిలో 20వ ధర్మక్షేత్రం నిర్వహించే పూర్వరంగం సిద్ధంచేసారు. పశువైద్యశిబిరం, కంటివైద్య శిబిరం ప్రారంభించి, వివిధ ప్రాంతాల ప్రతినిధులతో సమావేశమై వారి వారి అనుభవాలను శ్రీవారు విన్నారు. మధ్యాహ్నం తదీయారాధన కాగానే నగర శోభాయాత్ర 3 గం॥ల సేపు పురవీధుల గుండా ఉత్సాహంతో సాగింది. యాత్రా రంభానికి శ్రీవారు వాహనంపై చేరగానే పుష్పవృష్టియా అన్నట్లు చిన్న చిరుజల్లు వాన కురిసి ఆహ్లాదాన్ని కల్గించింది. సా॥ స్టేడియం గ్రౌండులో





శ్రీకృష్ణ పూజలు, ధర్మక్షేత్ర ప్రతిజ్ఞ వేలాది దీపాల కాంతిలో జరిగింది. కార్యక్రమ నిర్వాహకులైన శ్రీమాన్ జగన్, వారి పరివారానికి, కార్యకర్త బృందానికీ శ్రీరామాన్ రామానుజం, రఘు గార్లనూ శ్రీవారు ఘనంగా మంగళాశాసనాలు చేసారు.

**పాడేరులో...**

5వ తేదీ ఉదయం విశాఖ జిల్లా పాడేరు ఆదివాసీ ప్రాంతానికి శ్రీవారు వేంచేసారు. అక్కడొక ప్రాచీన రామాలయాన్ని దర్శించారు. వనవాసీ కళ్యాణ కేంద్ర అనే సంస్థకు చెందిన ఆంధ్ర విభాగం 11 మండలాలకు చెందిన సుమారు 25 వేల మంది ఆదివాసీ బంధువులను శ్రీవారిరాక సందర్భంగ అక్కడ సమావేశపరచింది. ఆ 11 మండలాలకు 11 శ్రీరాముడి పేర్లను శ్రీవారు సూచించి, భజన గోష్ఠులలో ఆ మంత్రాన్ని జపించమని ఆదేశించారు. వనవాసీ జనులలో ఆధ్యాత్మిక కార్యక్రమాల అవసరాన్ని, వైదిక ధర్మ ప్రాచీనతను తెలిపి, ఆదివాసీ ప్రాంతాలలో, కాలనీలలో ఎక్కడ భగవదాలయాలు శ్రీరామ మందిరాలు నిర్మించుకున్నా టి.టి.డివారు ఆరాధ్య విగ్రహాలను యిస్తామన్నారని, దానిని వినియోగించు కొమ్మని సూచించారు.

5వ తేదీ సాయంకాలం అనకాపల్లిలోని శాఖలలో ఒక వికాసతరంగిణి శాఖ వార్షికో త్సవంలో సందేశాన్నందించిరి. చోడవరం, కన్యకాపరమేశ్వరి ఆలయం దర్శించి, భక్తులను పరామర్శించి, రాత్రికి విశాఖపట్నం యమ్.వి. పి.కాలనీ, శ్రీవెంకటేశ్వరాలయం, చేరి బసచేసారు.

6వ తేదీ ఉదయం ఆలయంలో నూతన ధ్వజస్తంభ ప్రతిష్ఠగావించి, సుమారు 60 మంది భక్తులకు సమాశ్రయణములు జరిపారు. మధ్యాహ్నం విమానంలో మదరాసు చేరారు. తిరుక్కూడలూరు వేంచేయవలసి ఉంది. ఇంతలో తిరుమల పెద్దజీయరుస్వామి మఠాన్ని, ప్రాకార నిర్మాణాల నిమిత్తం తొలగించి, కాస్త వెనుకకు జరుపుతున్నారని సమాచారం అందడంతో, విమానాశ్రయం నుండే నేరుగ తిరుపతి వేంచేసి ఇ.ఓ. శ్రీమాన్ అజయ్ కల్లాం ఐ.ఎ.యస్., గారితో 2,3, గం॥లు చర్చించి, తిరుమల ఆలయ వ్యవస్థ చేసిన భగవద్రామానుజులే స్వయాన ఏర్పాటు చేసి, వేంచేసిఉన్న ఆ మఠానికి చారిత్రక ప్రాముఖ్యం, సాంప్రదాయక విలువలున్నాయి కనుక, దాని స్థానాన్ని మార్పు చేయతగదని, ఆ స్థానంలోనే దానిని అందంగ పునర్ని ర్మాణాన్ని చేయాలని, అందులోని భగవద్రామా నుజులు ప్రసాదించిన శ్రీరాముని ఆరాధనా మూర్తులు ఆ నిర్మాణం చేసే మఠానికి ఏదో ఒక మూలకాకుండా మధ్యలో ఉండేట్టుగ నిర్మాణం చేయాలని, స్థలమార్పిడి మాత్రం వద్దని, అలానే కొండపై ఎన్నెన్నో ఆలయాలు నిర్మాణం చేసేవారినీ నిలువరించాలని, అక్కడ శ్రీనివాసుని సన్నిధి, వరాహస్వామి సన్నిధి తప్ప, ఏ ఇతర మఠాలుగానీ మరెవ్వరుకానీ ఆలయాలు, నిర్మించరాదని, అవి వైష్ణవ దేవతాకమైనవైనా సరే ఉండరాదని, తిరుమల నంబి తిరుమాళిగై (గృహం) ఉన్నచోట వారి ఆలయం కట్టారు, అదీ తగదని, దానిని తిరిగి వారి గృహంగ నిర్మించి చరిత్రను కలుషితం కాకుండా చూడాలని స్పష్టం చేసారు.

శ్రీమాన్ఇ.ఓ.గారు దానికి అనుకూలంగ స్పందించి, తగిన మార్పులు చేస్తామని వాగ్దానం చేసారు. తిరుమల పెద్దజీయరు వారిని సేవించి జరిగిన విషయం వివరించి తిరుక్కూడలూరు కారులో రాత్రి 1 గం॥కు బయలుదేరారు.

**కుంభకోణంలో...**

7వ తేదీ ఉదయానికి కుంభకోణం, శార్ఙ్గపాణి పెరుమాళ్ సన్నిధి అర్చకులు, యువకులు,

మంచి కార్యకర్త అయిన పాంచరాత్ర భట్టాచార్య శ్రీమాన్ సుధాగారింటి లో బస, ఆరాధనాదులు జరుపుకున్నారు.

8వ శతాబ్దంలో శ్రీనాథమునులు కుంభ కోణం సందర్శించి, శార్ఙ్గపాణి సన్నిధికి విచ్చేసారట. ఇక్కడ ఆలయ పరిచారిక ఒకామె నేలను ఊడుస్తూ 'ఆరావముదే......' అతృప్తామృతమా! అని ఆరంభమయ్యే పాశురాలను పాడుకుంటూ 'శఠకోపులు పాడిన వేయిలో ఇవి ఒక పది' అని ముగించిందట. అది విని ఆ వేయి ఎక్కడ, ఎలా లభిస్తాయో తెల్సుకొని, వాటిని శ్రీ నమ్మాళ్వార్ల ద్వారా వారు దర్శించి, ఆలయాలలో ఈనాటికీ ఆ ప్రబంధ పరిమళాలు గుభాళించేట్టు వ్యవస్థితం చేసారు. నాథమునులకు ఆ ప్రేరణ కల్గించిన ఆలయం కుంభకోణంలోని శ్రీశార్ఙ్గపాణి దేవాలయాల చతుర్భుజుడైన పెరుమాళ్ళు, ధనస్సును ప్రధానంగ కల్గిఉంటాడక్కడ, ఎంత సుందరమైన మూర్తియో! ఆ స్వామి చిత్ర పటాన్ని చూస్తూంటేనే ఇంకా ఇంకా అలా చూస్తూనే ఉండాలని పిస్తూంటుంది. కన్ను ప్రక్కకే త్రిప్ప మనసు రానే రాదు. బహుశః శ్రీరాముణ్ణి దర్శించిన ఆనాటి వారలానే పిచ్చివారైపోయి ఉంటారు. ఆ స్వామిని సందర్శించి, సాయంకాలానికి తిరుక్కొ డలూర్, శ్రీ జగద్రక్షక పెరుమాళ్ సంప్రోక్షణకై చేరారు.

ఏడాదిన్నరక్రితం శ్రీస్వామివారు శ్రీరంగం వెడుతూ రాత్రి 1 గం॥కు ఈ సన్నిధిని దర్శించారు. అడుగు వేయడానికే సంకోచించేట్టు, పురుగు పుట్రాతో భయం కొలిపేట్టు ఉన్న ఆ ఆలయాన్ని జీర్ణోద్ధరణ చేయాలని శ్రీమాన్ తిరుక్కోటియార్ మాధవన్ స్వామి సంకల్పించి శ్రీవారికి చెప్పారు. ఆలయ ప్రాకార విషయంలో తగాదా పెట్టే ఊరివారిని పరిచయం చేసారు శ్రీవారికి. ఆ రాత్రి వారిని పరామర్శించి ఊరిబాగుకోసం, పాడి పంటల అభివృద్ధికోసం ఆలయ జీర్ణోద్ధరణ జరుపు కుందాం, మీరు సహకరించండి అన్నారు, వారందరూ అంగీకరించారు. జీర్ణోద్ధరణ ప్రారంభమై సుమారు రూ. 70 లక్షలతో ఆలయం నూతన కాంతులు విరజిమ్మింది. 7వ తేదీన అక్కడకు స్వామివారు చేరేసరికి 'అదేనా ఈ ఆలయం?!' అనేంత అందంగ రూపు దిద్దుకొంది. ఇంతలో అక్కడ ప్రాంగణంలో వాయవ్యంమూల ఉన్న ఓ పనస చెట్టుమీద శంఖాకృతిలో కాండం మధ్య ఒక భాగం పెరగ నారంభించింది. ఇప్పటికీ ఆ శంఖ మట్లామెల్లగా పెరుగుతూనే ఉంది. శ్రీవారి పాదధూళి ఆ ప్రాంతమంతా చల్లిన తరువాతనే ఎంతో కాలంగ, డబ్బున్నా జరగని జీర్ణోద్ధరణ అద్భుతంగ పూర్తైందనే విశ్వాసం శ్రీమాన్ మాధవన్ స్వామిది. అందుకే ఆలయ కార్యక్రమాలన్నీ శ్రీవారిపైనే కర్తృత్వం పెట్టి జరిపించారు. 5 దినాలూ శ్రీవైఖానస సూత్రం ప్రకారం ఆలయ ప్రతిష్ఠ జరిగింది. 5 దినాలు శ్రీవారు వేంచేసి ఉన్నారాకార్యక్రమంలో, శ్రీవారు 'సాదిత్తరుళ' అంటూ ప్రారంభిస్తేనే నాలాయిర దివ్యప్రబంధం సేవాకాలం జరిపించారు. క్షేత్ర మహాత్మ్యాన్ని 2001 డిశెంబరులో మన పత్రిక తెలిపింది. ఈ క్షేత్రంలో జరిగిన ప్రచారగోష్ఠి అంతటా జరిగినంత ఆనందాన్నిచ్చింది.

యాగశాల నిర్వహణ, నిర్మాణం చూపరుల హృదయాలను దోచుకునేట్టు ఏర్పరచారు. వైఖానస భట్టాచార్యులందరూ సుప్రసిద్ధ దివ్యక్షేత్రాలైన తిరుక్కొట్టియూర్, శ్రీవిల్లిపుత్తూర్ వంటి ప్రాంతాల నుండే విచ్చేసారు. వారందరూ సంప్రదాయ నిష్ఠతో, పరంపరాగతమైన ఆగమనియమాలతో పెరుమాళ్ళను, ఆళ్వార్లను, భగవద్రామానుజా చార్యస్వామిని, శ్రీమణవాళమామునులను సేవిస్తూ ప్రతిష్ఠాదులను కడురమ్యంగ నిర్వహించారు. వారి సంప్రదాయ శ్రద్ధ మన ఆంధ్రప్రాంత అర్చకులందరికీ అనుసరణీయం.





వారిని చూచి నేర్చుకోవలసిన దెంతో ఉందనేది స్పష్టము. ఈ ప్రతిష్ఠ కాలంలో శ్రీస్వామివారు ప్రక్కనే ఉన్నా తిరుక్కుండియార్ సంప్రోక్షణను ప్రారంభించి, వారికందరికీ వస్త్రాదులు అందించి వచ్చారు. వానమామలై మఠ అధీనంలోఉన్న నాథన్ కోవెలను సందర్శించారు. 8వ తేదీన కపిస్థలం సేవించి, విగ్రహాలను చెక్కి మనకందించే శిల్పిగృహాన్ని గూడ పవిత్రం కావించారు. నాథమునులు అవతరించిన కాట్టుమన్నార్‌గుడి అనే దివ్యస్థలం దర్శించి వారి ప్రార్థనపై అక్కడ ప్రాకార నిర్మాణానికి రూ. లక్ష సమర్పించారు. ఇక్కడే కాలిఫోర్నియాకి చెందిన హరి దంపతులు రాజగోపుర జీర్ణోద్ధరణ కైంకర్యం చేయిస్తున్నారు.

అదేరోజు దివ్యప్రబంధ పరిక్షలు, మహా సంప్రోక్షణ కార్యక్రమాన్ని నిర్వహించారు శ్రీవారు.

ఇక్కడ ఉండే సమయంలోనే 7వ తేదీ రాత్రి శ్రీభాష్యంస్వామివారి పరమపదవార్త అశనిపాతంలా విన్పించింది. సీతానగరం నుండి పెరుమాళ్ళ శేషమాల పంపించారు శ్రీస్వామివారు. చెన్నై నుండి వారికి బ్రహ్మ మేధ సంస్కారం చేయించేందుకు వెడదామనుకున్నా అవకాశం లభించలేదని ఆ



తర్వాత శ్రీమాన్ రాజహంసస్వామి (శ్రీఅణ్ణంగరాచార్యస్వామి వారి మనుమలు) ఎంతో బాధపడ్డారు. శ్రీస్వామివారుగూడ వీరిచరమ కైంకర్యంలో పాల్గొనే అవకాశం లభించక ఎంతో విలపించి, అయినా 3వ తేదీన వారి చివరి దర్శనం లభించినందుకు కొంత ఓదార్చునందారు. శ్రీవైష్ణవ సంప్రదాయానికి తలమానికగ ఉన్న కొద్దిమంది పెద్దలలో మరో తార రాలిపోయింది. ఇదిమన సంప్రదాయానికి తీరని మరోలోపమని శ్రీస్వామివారు ఆవేదనను వ్యక్తం చేసారు.

## పదవీ విరమణ శుభాకాంక్షలు

మెదక్ జిల్లా, నారసింగి వాస్తవ్యులు **శ్రీమాన్ కెక్కరకుంట రంగాచార్యులుగారు** 39 సం॥లుగా ఉపాధ్యాయ వృత్తిలో అంకితమై 31-5-2003 తేదీన పదవీవిరమణ కావించినారు. వీరు ఉపాధ్యాయ వృత్తిలో ఉంటూ శ్రీశ్రీశ్రీస్వామివారి కార్యక్రమములలో పాల్గొని శ్రీవారి కృపకు పాత్రులయ్యారు. ఈ సందర్భముగా స్వరాజ్యలక్ష్మి గారు వారి కుటుంబ సభ్యులు మన పత్రికాభివృద్ధికి కైంకర్యము సమర్పించినారు. వారిశేషజీవితాన్ని ఆధ్యాత్మిక సేవలో గడపాలని మన భక్తినివేదన ఆకాంక్షిస్తూ... శ్రీస్వామివారి మంగళాశాసనాలను పత్రికాముఖంగా అందజేయుచున్నాము.



11వ తదీన శ్రీ చిన్నజీయరుస్వామివారి కరకమలముల మీదుగ యంత్ర ప్రతిష్ఠ, విగ్రహ ప్రతిష్ఠ, కలశప్రతిష్ఠ కుంభాభిషేకం సర్వాంగ సుందరంగ జరిగాయి. శ్రీవారు వారందరికీ మంగళాశాసనాలు చేసి శ్రీమాన్ మాధవన్‌స్వామిని ప్రత్యేకించి మంగళా శాసనాలు చేసారు. శ్రీమాన్ మాధవన్ స్వాములందరికీ తదీయారాధనా, వస్త్రసంభావ నాదులను సంతృప్తికరంగ జరిపారు. మధ్యలో 9, 10తేదీలలో శ్రీపాంచరాత్ర, వైఖానసాగమాల వైలక్ష్యణ్యాన్ని గురించిన సదస్సు ఆయా ఆగమ విద్వాంసులచే, శ్రీవారి ఆధ్యక్ష్యంలో విలక్షణంగ జరిగింది. పండితులు, భట్టాచార్యులు ఆయా ఆగమాల ఆవిర్భావం, అవసరం, ప్రయోగ విశేషాలను అందంగ వివరించారు. అందరూ శ్రీవైష్ణవ సత్సంప్రదాయానికి భగవద్రామానుజులు ఈ ఆగమాలద్వారా చేసిన మహోపకారాన్ని, ఆళ్వారుల పాటలవల్ల ఆలయాలకు కలిగే దివ్యత్వాన్ని, ఆగమ ప్రయోగం ద్వారా పెరుమాళ్ళలో ఏర్పడే శక్తి విశేషాన్ని స్పష్టంగ ప్రతిపాదించారు.

11వ తేదీ సాయంకాలం శాంతి కళ్యాణాన్ని జరిపించి శ్రీవారు రైలులో బెంగుళూరు వేంచేసారు.

12వ తేదీన శ్రీమాన్ కోనేరు సదాశివరావు, కరుణకుమారి దంపతులు నూతన భవన సముదాయాన్ని ప్రారంభించి. అందులో మన విద్యార్థులతో శ్రీలక్ష్మీనారాయ ణేష్ఠిని జరిపించారు. కంప్యూటర్ కృష్ణగారి సోదరులైన శ్రీమాన్ గిరి, దీప దంపతుల గృహాన్ని సందర్శించి హైదరాబాదు వేంచేసారు. రాత్రి విమానం నుండే సికిందరాబాదు లోని రాజస్థానీ భవనం, నూతన నిర్మాణాన్ని ప్రారంభించి, మంగళా శాసనం చేసారు. మన శ్రీమాన్‌లక్ష్మీనారాయణ శుంథ్వాల గారు దీనిని ఏర్పరచారు. రాత్రి జెట్ భవనంలో 'భీమిలి స్థలంలో నిర్మాణం ఎలా. ఎంత చేయాలనే విషయాన్ని చర్చించడానికి శ్రీమాన్ రామానుజంగారు, శ్రీ యమ్. యస్. యన్. రాజుగారు, శ్రీమాన్ కాశీరాజుగారు, శ్రీసుదర్శన్ రాజుగారు, శ్రీమాన్ నాయుడుగారు ప్రభృతులు వచ్చారు.

1995 నుండి భీమిలి రోడ్డులో ఓ ఆశ్రమం ఏర్పాటు చేయాలని శ్రీమాన్ యు. ఎ. యన్. రాజుగారు ప్రార్థించగా స్థల సేకరణకు ప్రయత్నించారు. అప్పట్లో 65 ఎకరాలు తీస్కోడానికి ఏర్పాట్లు జరిగినా, రాజకీయ కారణాల వల్ల అదినిలిచిపోయింది. ఆ తర్వాత 5 సం॥లకు విశాఖ జాయింట్ కలెక్టర్‌గా ఉన్న శ్రీమాన్ కృష్ణబాబు విషయ వివరాలు తెల్సుకొని 7 ఎకరాల స్థలానికై ప్రభుత్వానికి రికమెండ్ చేసారు. అది క్రమంగ కార్యరూపం ధరించి ప్రభుత్వనిర్ణయానికి వెళ్ళింది. ముఖ్యమంత్రిగారి ఔదార్యంవల్ల ఒక లక్షరూపాయలుమాత్రమే చెల్లించి ఆ స్థలాన్ని తీసుకోవడానికి నిర్ణయించింది ప్రభుత్వం. శ్రీమాన్ కృష్ణబాబుగారే ఆ ధనాన్ని తమ సోదరి జ్ఞాపకార్థం సమర్పించారు. మొత్తానికి ఇంత కాలం అయిన తర్వాతనైనా శ్రీమాన్ యు.ఎ. యన్.రాజుగారి ఆశనెరవేరే అవకాశానికి ద్వారం తెరుచుకుంది. ఈ విషయం నిర్ణయం కాగానే శ్రీస్వామివారు అదేస్థలంలో ఈ ఏడాది చాతుర్మాసం చేయాలని భక్తుల కోరికపై నిర్ణయించారు. అందులకవసరమైన కనీస నిర్మాణాన్ని వెంటనే ప్రారంభించాలని విశాఖ కార్యకర్తలు వచ్చారు. శ్రీమాన్ రామేశ్వరరావు గారి బృందంతో కలిపి చర్చించి శ్రీవారు కొన్ని సూచనలందజేసారు. రాత్రికి శ్రీవారు చీకోటి భిక్షపతిగారి నూతన గృహం చేరి అక్కడే బసచేసారు.

13వ తేదీన శ్రీమాన్ భిక్షపతి దంపతుల షష్ట్యబ్దిపూర్తి సందర్భంగ హోమాదులను శ్రీమాన్





స. శ్రీనివాసాచార్యస్వామి వారి నేతృత్వంలో ప్రారంభింపచేస్తే వారిని మంగళా శాసనాలు చేసి, కొందరు భక్తుల గృహాలను సందర్శించారు. ఎండోమెంట్సువారి 'రెలిజియ ఆడిట్ మీటింగ్', కమీషనరుగారి నేతృత్వంలో జరుగగ శ్రీవారు అందులో పాల్గొని తమ సూచనలందించారు. అలానే జెట్ (యస్) మిటింగ్ గూడ, అదిలాబాద్, అల్లంపల్లి ట్రైబల్ స్కూల్‌నిర్మాణాన్ని చర్చిస్తూ జరిగింది. ఇవన్ని ముగించుకొని శ్రీవారు రాత్రి సుమారు 1 గం॥కు నల్గొండ చేరారు.

### నల్గొండలో...

21వ ధర్మక్షేత్ర కార్యక్రమం నల్గొండలో 14వ తేదీన జరిగింది. ఆనాటి ఉ॥ 9–30ని॥లకు నూతన రథాన్ని, శ్రీకోదండ రామాలయంలో శ్రీవారు ప్రారంభించారు.

తదనంతరం ఉ॥ 11–30 ని॥లకు గీతాజ్యోతి సదస్సులో శ్రీవారు తమ సందేశాన్ని అందించారు. ప్రతివారు తమ తమ బాధ్యతలను శాస్త్రప్రకారం ధర్మమార్గంలో ప్రవర్తించినట్లయితే మనం ప్రస్తుతం ఎదుర్కొంటున్న తీవ్ర సంక్షోభపరిస్థితులకు లోనుకాకుండా ఉండేవాళ్ళమని ఇప్పటికైనా మనం కళ్ళు తెరచి భగవద్గీతలో స్వామి అందించిన సందేశాన్ని ఆచరణలోకి తెచ్చుకోగలిగినట్లయితే ఈ పరిస్థితి నుండి తప్పక బయటపడగలుగుతామని అపురూపమైన ఈ మానవ జన్మ సార్థకమౌతుందని శ్రీస్వామివారు తమ సందేశంలో అనుగ్రహించారు.

ఈకార్యక్రమములో, 108 గ్రామముల నుండి సుమారు వేలాది మంది భక్తులు పాల్గొన్నారు. మండలాల వారిగా గ్రామాల వివరాలు, ప్రచారకార్యక్రమ నివేదిక శ్రీశ్రీశ్రీ స్వామివారికి సమర్పించటం జరిగింది. తీర్థగోష్ఠి తదనంతరం సామూహిక శ్రీకృష్ణ పూజలలో వందలాది మంది భక్తులు పాల్గొనటం జరిగింది.

కార్యక్రమమును జయప్రదంగా నిర్వహించిన కార్యకర్తలందరికీ శ్రీస్వామి వారు మంగళాశాసనములు అందజేసినారు.

### ఉనికిలిలో...

14వ తేదీన సాయంకాలం బయలుదేరి రాత్రికి 11 గం॥లకు కృష్ణాజిల్లా ఉనికిలి గ్రామానికి శ్రీవారు చేరారు. శ్రీరామాలయ ప్రతిష్ఠకై శ్రీవారిని ఆహ్వానించారు. శ్రీమాన్ సిహెచ్. శ్రీనివాస్‌గారు తమ వాహనంలో శ్రీవారిని తీసుకువెళ్ళారు. అంతరాత్రైనా అక్కడ భక్తులు ఆనందోత్సాహాలతో శ్రీవారిని స్వాగతించారు. శ్రీమాన్ పెద్దజీయరు స్వామివారి శిష్యులైన శ్రీమతి బొమ్మన ఈశ్వరమ్మ జోగేశ్వరరావు దంపతుల శ్రద్ధ, ఏర్పాట్లతో, వారి నిర్బంధంతో శ్రీవారీ గ్రామం విచ్చేసారు. అక్కడొక ధర్మక్షేత్రం జరగాలని, అలాఅయితే ఆలయ ప్రతిష్ఠకు వస్తామని శ్రీవారన్నారు. ఆ గ్రామస్థుల కోరికపై మన తత్త్వప్రచారకులక్కడికి ధర్మరథాలతో వెళ్ళి ప్రచారం చేసారు. 108 గ్రామాలూ సందర్శించి ప్రచారం చేసారు. పర్యవసానంగ ప్రతిష్ఠా కార్యక్రమంతోపాటు ధర్మక్షేత్ర కార్యక్రమమూ జరిగింది. శ్రీవారు 15వ తేదీన సుమారు 30 మంది భక్తులకు పంచసంస్కారాలు చేసి, ఆలయ ప్రతిష్ఠకావించి భక్తులతో కృష్ణపూజలు, గీతాజ్యోతి ధర్మక్షేత్ర ప్రతిజ్ఞ చేయించారు. చాలా ఉత్సాహంగ కార్యక్రమమంతా జరిగింది. దీనిని ఇలా జరిపించడంలో మన బెంగుళూరు వికాసతరంగిణి సభ్యులు, ఐ.టి. కమీషనర్ అయిన శ్రీమాన్ చౌదరిగారి పురుషకారం చాల ఉంది. ఉనికిలి గ్రామ కార్యకర్తలైని శ్రీ జోగేశ్వరరావు దంపతులు అలాగే శ్రీ అంకినీడుగారు, శ్రీ లక్ష్మీనారాయణ దంపతులకు

స్వామివారు మంగళాశాసనములందించి, శ్రీమాన్ పిన్నమనేని కోటేశ్వరరావుగారి కోరికపై రుద్రపాకలో శ్రీరామాలయం, గుడివాడలోని రైస్‌మిల్లు, ఎనికేపాడులోని రైస్‌మిల్లు, పామర్రు దగ్గర కురుమద్దాలిలో విద్యుత్‌ప్లాంట్‌లను సందర్శించి మంగళాశాసనం చేసారు. ఇది ఒక నాన్ కన్వెన్షనల్ పవర్ ప్రాజెక్ట్.

మార్గమధ్యంలో మన కల్వపాముల విద్యార్థులకు వేసవి విడిదిగా తమ గృహంలో వసతి కల్పించిన శ్రీమాన్ సూర్యనారాయణ, రాజేశ్వరి దంపతుల గృహానికి వేంచేసి మంగళాశాసనాలు కావించారు. అలాగే శ్రీపెద్దస్వామివారి శిష్యురాలైన శ్రీమతి చాపరాల సంపూర్ణమ్మ గారు శ్రీవారికి ఫోనుచేసి శ్రీవారిని చూడాలని ఉందని ప్రార్థించడంతో శ్రీవారు, ఆమెను పరామర్శించారు. ఈమె జమ్మిగొల్వేపల్లి హనుమంతరావుగారి సోదరి.

రాత్రికి విజయవాడ వస్తూ, పటమటలో ఉండే శ్రీమాన్ సదాశివరావుగారి బంధువులైన చి॥ యన్.వి. నగేష్, హేమ దంపతుల గృహాన్ని సందర్శించి వారిని అక్కడి భక్తులనందరినీ మంగళాశాసనం చేసి రాత్రికి సీతానగరం వేంచేసారు.

**తూర్పు యడవల్లిలో...**

16 మధ్యాహ్నం పశ్చిమ గోదావరి జిల్లా తూర్పుయడవల్లి గ్రామంలో భారీ పరిశ్రమల మంత్రి శ్రీమాన్ విద్యాధరరావుగారు నిర్మించిన శ్రీ సీతారామ చంద్రస్వామివారి ఆలయ ప్రతిష్ఠా మహోత్సవానికి వేంచేసారు. అప్పటికే మన ఆగమ పండితులు శ్రీనివాసాచార్యస్వామివారు, శ్రీమాన్ మధుసూదనాచార్యస్వామి బృందం ప్రతిష్ఠాంతర్గత పాంచాహ్నిక యాగకార్యక్రమాన్ని ఆరంభించి ఉన్నారు. శ్రీస్వామివారు ఆలయ సౌందర్యాన్ని నిర్మాణ శైలిని పరిశీలించి మంత్రిగారి కృషిని శ్లాఘించారు. సా॥ 6 గం॥లకు విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణానంతరం, అనుగ్రహభాషణం కావించి, రాష్ట్రమంత్రివర్యులు శ్రీమాన్ అశోక గజపతి రాజుగారిని ఇతర ప్రముఖులకి మంగళాశాసనాలు గావించి ఆలయానికి వేంచేసారు.

అక్కడ శ్రీసీతారామచంద్రస్వామివారిని సపరివారంగా జలాధివాసం కావించి పూర్ణాహుతితో ఆనాటి కార్యక్రమాన్ని సంపూర్ణం చేసారు.

17 ఉ॥ తీర్థగోష్ఠి అనంతరం ఆర్తితో చేరిన భక్తబృందానికి మంత్రోపదేశం కావించారు. ఉ॥పూర్ణాహుతి అనంతరం విచ్చేసిన రాజకీయనాయకులతో ముచ్చటించి వారికి మంగళాశాసనాలు అనుగ్రహించారు.

సా॥ పారాయణానంతరం సామూహిక పూజా కార్యక్రమాన్ని నిర్వహించి గీతాజ్యోతి ప్రమాణాన్ని కావించి ఏలూరు మీదుగా హైదరాబాద్ చేరారు.







18 ఉ॥ శ్రీమాన్ రామేశ్వరరావుగారు నూతనంగా నిర్మిస్తున్న పృథ్వీ వాయు అగ్నిభవన సముదాయంలో శ్రీకూర్మ మత్స్య లక్ష్మీనారాయణ పెరుమాళ్ ఆలయానికి శంకుస్థాపన కావించారు. తిరిగి మధ్యాహ్నానికి శ్రీమాన్ గంగరాజుగారి విమానంలో యడవల్లి చేరారు. సా॥ పారాయణ, అనుగ్రహ భాషణం అనంతరం పూర్ణాహుతి కావించుకొని ధ్వజస్తంభ, యంత్ర, శిఖర ప్రతిష్ఠలను పూర్తికావించారు.

19 ఉ॥ మహాపూర్ణాహుతి తదనంతరం సపరివారంగా శ్రీ సీతారామచంద్రస్వామివారి మూర్తులను ప్రతిష్ఠను కావించి శ్రీమాన్ విద్యాధర రావు దంపతులకి వారి కుటుంబానికి పరివారానికి మంగళాశాసనాలు కావించి ఏలూరు బయలు దేరారు. మధ్యాహ్నం ఏలూరు బైపాస్‌వద్ద సుమారు 153 అడుగుల హనుమ విగ్రహానికి శంకుస్థాపన కావించారు. ఈ కార్యక్రమాన్ని శ్రీమాన్ పార్థసారథిగారు తదితర ప్రముఖులు పూనుకొని నిర్వహిస్తున్నారు. ఇది ప్రపంచంలోనే అతి ఎత్తైన హనుమ విగ్రహంగా రూపుదిద్దుకోనున్నది. ఎంత ఎత్తైన మూర్తిని నిర్మిస్తే అంత ఎక్కువ నైవేద్యం సమర్పించవలసి ఉంటుందని శ్రీస్వామివారు ప్రవచిస్తూ ఇక పై అక్కడ ప్రతిరోజు కనీసం ఒక క్వింటాల్ ప్రసాదం ఆరగింపు జరిగి అన్నార్తులకు వితరణ జరగాలని అది శ్రేయోదాయకమని ఆశీర్వదించారు.

అక్కడినుండి విమానమార్గంగా హైదరాబాద్ చేరి రాత్రికి షాద్ నగర్ చేరారు.

**షాద్ నగర్‌లో....**

శ్రీశ్రీశ్రీస్వామివారు 20వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీమాన్ కట్టా నరసింహులు గారిచే నిర్మించబడిన శ్రీరమాసమేత సత్యనారాయణ స్వామి ఆలయ శిఖర, విగ్రహ ప్రతిష్ఠాకార్యక్రమాన్ని శ్రీమాన్ రమాకాంతాచార్యస్వామివారి నేతృత్వంలో నిర్వహించారు. ధ్వజస్తంభ ప్రతిష్ఠ సమయంలో వ్రేలికి గాయమైనా శ్రీమాన్ రమాకాంతాచార్యస్వామివారు శాస్త్రోక్తంగా ఈ కార్యక్రమాన్ని వైభవోపేతంగా నిర్వహింపచేసారు. 10 గం॥లకు వికాసతరంగిణి వారు ఏర్పాటు చేసిన పశువైద్యశిబిరంలో పాల్గొన్నారు. అనంతరం తిరిగి ఆలయంలో ఎదురు చూస్తున్న భక్తజనులనుద్దేశించి గీతాజ్యోతి సందేశాన్ని అందించారు. ఈకార్యక్రమంలో శ్రీమాన్ శంకరరావు గారు ఎం.ఎల్.ఏ, షాద్‌నగర్ సర్పంచి శ్రీమాన్ నరేందర్ ఇతర ప్రముఖులు పాల్గొన్నారు. అదే రోజు కోయదొర ఆశ్రమంలోని ఆంజనేయ ఆలయాన్ని సందర్శించారు.

చేవెళ్ళమండలం గొల్లపల్లి గ్రామంలో బండారి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీస్‌ని సందర్శించి అక్కడ చేరిన భక్తజన బృందానికి సందేశానన్ను గ్రహించారు.

21వ తేదీ ఉదయం మండవ జానకి రామయ్యగారు కరీంనగర్‌వారి ఆహ్వానంపై పాల ఉత్పత్తిదారుల సంఘంవారు నిర్మించుకున్న ఆంజనేయస్వామి ఆలయానికి కలశ ప్రతిష్ఠ కావించారు. 21వ తేదీ రాత్రికి హైదరాబాద్ మీదుగా హోస్‌పేటకు బయలుదేరారు.

22న అక్కడి నుండి శ్రీమాన్ సదాశివరెడ్డి గారితో కలిసి దావణగేరె చేరి, మన వికాసతరంగిణి నిర్వాహకులైన శ్రీమాన్ వీరభద్రరావుగారి నూతన రైస్‌మిల్లుని ప్రారంభించి మంగళాశాసనాలు కావించారు. అనంతరం యాక్సిడెంట్‌లో బాగా

గాయపడిన వారి అబ్బాయిని పరామర్శించి, కారులో బయలుదేరి 23 ఉ॥నికి హైదరాబాద్ చేరారు.

అక్కడ రాజకీయనాయకులైన శ్రీమాన్ ఎ. నరేంద్రగారి ప్రార్థనపై శంకరపల్లి మండలం దొంతలపల్లి గ్రామంలో శ్రీమాన్ మంగళం పల్లి జనార్ధన్‌గారు నిర్మించిన శ్రీవెంకటేశ్వరస్వామి ఆలయ ధ్వజస్తంభ ప్రతిష్ఠ, ఆలయ ప్రతిష్ఠను శ్రీమాన్ రమాకాంతాచార్య స్వామివారి నేతృత్వంలో నిర్వహించి నేరుగా జెట్‌కి వేంచేసారు.

24,25 తేదీలలో ఆఫీసుకార్యక్రమాలు సమీక్షించుకొని 26వ తేదీ రాత్రికి చెన్నై మీదుగా అమెరికాకు పయనమైనారు......

## శ్రీరంగం.... శ్రీరంగనాథుని సేవలో...

## లక్ష్మీ లక్ష కుంకుమార్చన - దీప పూజ

శ్రీ సంప్రదాయ క్షేత్రాలలో ముఖ్యమైన మొదటిదైన భూలోక వైకుంఠంగా వ్యాప్తియున్న శ్రీరంగ క్షేత్రంలోని శ్రీశ్రీశ్రీ స్వామివారి, యస్.వి.ఆర్. రామానుజ కూటంలో శుక్ర వారం 23-5-2003న లోక కళ్యాణార్థం, 108 మంది సుమంగళినులు చేత శ్రీలక్ష్మీ సహస్రనామ అష్టోత్తర పూజా కార్యక్రమం శ్రీవారి మంగళాశాసనములతో అత్యంత వైభవంగా నిర్వహింపబడినది. శ్రీలక్ష్మీ కుంకుమార్చన పూజ పూర్వరంగంగా 22న గోపూజా కార్యక్రమం జరిగినది.

ఈ కార్యక్రమములో అష్టోత్తర పూజా కార్యక్రమాన్ని శ్రీరంగేశ పురోహితులు శ్రీ పరాశర్ భట్టర్ స్వామివారు స్వయంగా నిర్వహించారు. పూజా కార్యక్రమాన్ని చేయవలసిన పద్ధతి తెలుపుతూ మన మఠ నిర్వాహకులు కార్యక్రమాన్ని చేయించారు.

ముఖ్యంగా ఉభయ కావేరీ మధ్యన వేంచేసి యున్న శ్రీరంగనాథ క్షేత్రంలోని కావేరీ నదిలో నీరులేని పరిస్థితి ఏర్పడినది. లోకక్షేమాన్ని ఆకాంక్షిస్తూ ముత్తైదువలందరూ వరుణ భగవానుని శీతల జల్లులకై, జడివానలకై 'ఆళిమ్మళై కణ్ణా' అని పాశుర అనుసంధానం మనస్ఫూర్తిగా చేయగా, చేసిన వెంటనే వర్షంఎడతెరిపిలేక 3 గం॥ల పాటుపడింది. అప్పటి నుండి వరుసగా వర్షం కురుస్తూండటం శ్రీరంగనాథుని, ఆచార్య వర్యులైన శ్రీస్వామివారి మంగళాశాసనాలుగా భక్తులు కొనియాడుతున్నారు.

డా॥ శ్రీమతి ప్రేమానంద కుమారిగారు దీపారాధన చేయడంతో కార్యక్రమం ఆరంభమైంది. వార్డు కౌన్సిలర్ శ్రీమతి అనసూయ కుప్పుస్వామిగారు, నగర మహిళా పోలీస్ ఇన్స్పెక్టర్ శ్రీమతి ఉషారాణి గారు, శ్రీ విష్ణుదాస్ నాయుడుగారు, (తిరుచ్చి - కార్పోరేటర్) శ్రీ పి.యమ్. సుందరం, రామనాథన్, బి. హేమనాథన్, యస్. రాజగోపాలన్, మురళి మొదలగువారు పూజా కార్యక్రమంలో పాల్గొని అన్వయించారు.

డి.పి.పి. కో- ఆర్డినేటర్ శ్రీమాన్ టి.యన్. శ్రీరామచంద్రరావుగారిని, కె. నాయుడుగారిని మన మఠ నిర్వాహకులు వేదాధ్యాపకులు, శ్రీమాన్ గుదిమెళ్ళ సురేంద్రాచార్యులుగారు శాలువాతో సత్కరించారు.

శ్రీమాన్ కన్నభిరాన్ నాయుడుగారు (**సేవారత్నం** - పెద్దజీయరుస్వామివారు ఇచ్చినపేరు) కార్యక్రమానికి కావల్సిన ఏర్పాట్లు, మరియు పత్రికలు, టి.వి.లకు న్యూస్‌ను సమర్పించారు. చివరగా నాయుడుగారి కృతజ్ఞతా విష్కరణతో ఈ కార్యక్రమం సుసంపన్నమైనది.

## తిరుమలలో శ్రీవారిసేవ

తిరుమలలో 'శ్రీవారి సేవ' ఏప్రిల్ 1వ తేదీనుండి ప్రారంభమైనది. వికాసతరంగిణి వివిధ శాఖల నుండి శ్రీవారి సేవలో పాల్గొంటున్నారు.





ఇప్పటివరకు పిట్టలవాని పాలెం, గుంటూరు, హైదరాబాదు, జహీరా బాదు, కరీంనగర్ శాఖల నుండి పాల్గొన్నారు. ఒక్కొక్క శాఖ నుండి 100 మంది సభ్యులు 'శ్రీవారిసేవ'లో పాల్గొంటున్నారు.

ఈ పర్యాయం, వికాసతరంగిణి కార్యకర్తలను అన్నదానంకు పరిమితం చేయకుండా, అనేక గురుతరమైన బాధ్యతలను అప్పగించినారు. కల్యాణకట్టలో తలనీలాల సమర్పణ వివరాలు కంప్యూటర్‌లో సక్రమంగా నమోదు చేయించే బాధ్యతను అప్పగించినారు. అంతేకాకుండా, కళ్యాణ కట్టలో డబ్బులు కొరకు, యాత్రికులను వేధించకుండా చూస్తున్నారు. ఇంకా, వైకుంఠం 1వ క్యూ కాంప్లెక్స్‌లో, రెండవ 'క్యూ' కాంప్లెక్స్‌లో 'క్యూ' నియంత్రణ, పిలిగ్రిమ్ అమెనిటీస్ కాంప్లెక్స్‌లో 'లాకర్ల' వద్ద అవకతవకలు జరగకుండా చూస్తున్నారు.

విశేషంగా మే 17వ తేదీనుండి, ఆలయ ప్రాంగణంలో సేవా భాగ్యం లభించినది. పడికావలి వద్ద 'క్యూ' నియంత్రణ, విమాన ప్రాకారం వద్ద యాత్రికులు చతికిలబడకుండ బయటకు పంపించటం, ఉచిత ప్రసాదాల పంపిణీ స్థలంలో పరిశుభ్రతను కాపాడటం మున్నగు బాధ్యతలను నిర్వర్తిస్తున్నారు. రక్షణ భయం వలన, ఆలయ ప్రాంగణంలో శ్రీవారిసేవకులను ఇటీవల కాలంలో ఉపయోగించుకొనటం లేదు. కానీ, వికాసతరంగిణి పట్ల విశ్వాసంతో, ఇ.ఓ. అజయ్ కల్లాంగారు స్వామివారిని కోరిన మీద, పంపించటం జరుగుతున్నది. వికాస తరంగిణి భోజన, వసతులను ఎటువంటి ఇబ్బందులు లేకుండా జె.ఇ.ఓ. బాల సుబ్రహ్మణ్యంగారు ఏర్పాట్లు చేస్తున్నారు. ఈ సేవా కార్యక్రమానికి శ్రీ ఎన్. నాగేంద్రశాయి (తిరుపతి) నేతృత్వం వహిస్తున్నారు.

## ఖమ్మం జిల్లా

**మద్దుకూరు** : ఖమ్మం జిల్లా వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో హనుమ జ్జయంతి సందర్భముగ స్థానిక రామాలయంలో 108 సార్లు హనుమాన్ చాలీసా పారాయణం చేసినారు. ఉగాదినాడు చలివేంద్రం ప్రారంభించి నిత్యం మజ్జిగ, మంచినీరు దాహార్తులకు అందజేయుచున్నారు.

**కిష్టారం** : వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో హనుమ జయంతి సందర్భముగ స్థానిక రామాలయంలో 108 సార్లు హనుమాన్ చాలీసా పఠన కార్యక్రమం నిర్వహించబడినది. వేసవి దాహార్తిని తీర్చుటకు శ్రీమాన్ సత్యంగారి సహాయ సహకారాలతో వేసవి చలివేంద్రం ఏర్పాటు చేయబడినది. సత్తుపల్లి ధర్మక్షేత్రానికి సంబంధించిన ప్రచార కార్యక్రమంలో విస్తృత ప్రచారం జరుపుచున్నారు.



## పరమపదవార్త

**శ్రీమాన్ చిలకమర్రి జగన్నాథాచార్యులుగారు తేది:26-5-2003న ఆచార్య తిరువడినిచేరినారు.**

వీరు మన పెద్దజీయరుస్వామివారి శిష్యులు, వీరు సాంప్రదాయ నిష్ఠులేకాక అనేక కార్యక్రమములలో కైంకర్యమును సాయించి శ్రీవారి మన్ననలు అందుకున్నారు.

**వీరికి ఆ శ్రియఃపతి సాన్నిధ్యం లభించాలని ప్రార్థిస్తున్నాము.**

## కృష్ణాజిల్లా

**జగ్గయ్యపేట** : కృష్ణాజిల్లా జగ్గయ్యపేట ధర్మక్షేత్ర కేంద్రముగ 15-05-03వ తేదీన శ్రీ నృసింహజయంతి సందర్భముగ శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణము భక్తులచే జరిపించడం జరిగింది. 30 మంది బీదలకు పాత వస్త్రములు, క్రొత్త గ్లాసులు పంచడం జరిగింది.

హనుమ జ్జయంతి సందర్భముగ ప్రసన్నాంజనేయ దేవస్థానము నందు 200 మంది భక్తులచే హనుమాన్ చాలీసా 108 పర్యాయములు పారాయణం చేయడం జరిగింది.

## గుంటూరు జిల్లా

**పొన్నూరు :** గుంటూరు జిల్లా పొన్నూరు వికాస తరంగిని శాఖ ఆధ్వర్యవంలో మే 28వ తేదీన తాళ్ళపాలెంలో జరిగిన ఘోరఅగ్నిప్రమాదంలో సర్వస్వం కోల్పోయిన 12 కుటుంబాల బాధితులకు బియ్యం, స్టీలు గుండిగ, స్టీలు కంచం, గ్లాసులు పంపిణీ చేసారు.

వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ అప్పారావుగారు, వి.కె. రామాచార్యులు, వీరయ్య చౌదరిగారు, శ్రీనివాసరావుగారు, సాంబ శివరావుగారు, శివలీల ఇతర ముఖ్యకార్యకర్తలు పాల్గొన్నారు. భారత్‌గ్యాస్ అధినేతలు కె. ఆంజనేయులు, మౌలాలి, మల్లిఖార్జునరావుగార్లు తమ యొక్క సహాయ సహకారాలు అందజేసినారు.

**చిలకలూరిపేట :** చిలకలూరిపేట వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమంలో భాగంగా శ్రీకోదండ రామస్వామి దేవాలయంలో 16వ తేదీ సాయంత్రం శ్రీవిష్ణు సహస్రనామ, తిరుప్పావై పారాయణం చేయడం జరిగింది. కుల మత భేదాలులేకుండ హనుమాన్ చాలీసా కార్యక్రమం నిర్వహించినారు.

## నెల్లూరు జిల్లా

**నెల్లూరు :** నెల్లూరు జిల్లా నెల్లూరు వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో శ్రీస్వామివారి మంగళా శాసనములతో గీతాజ్యోతి సందేశాలైన స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ, మాధవసేవగ సర్వప్రాణి సేవలను వివరించి 300 మంది శ్లోక పత్రములను పంపిణీ చేసారు.

శ్రీరామనవమి వసంతోత్సవాల సందర్భముగ 200 మందికి గీతాజ్యోతి సందేశమును అందించినారు. మహాలక్ష్మీ మందిరంలో గీతాజ్యోతి ఆశయములను వివరించి 1000 మంది శ్లోకములను అందజేయడం జరిగింది. సంతపేట, రంగనాయకుల పేట, విజేత చిల్డ్రన్స్ స్కూలు, మున్సిపల్ ఆఫీసులలో, చిన్న బజారు వీధిలో అన్ని దేవాలయాలలో గీతాజ్యోతి శ్లోక మాలికలను అందజేయడం జరిగింది. రామానుజులవారి 986వ తిరునక్షత్రం, హనుమజ్జయంతి కార్యక్రమములు వైభవంగ నిర్వహించుకున్నారు. ఈ కార్యక్రమంలో మునగా వెంకటాచలం, స్వర్ణలత, సిహెచ్. వెంకట రత్నం మొదలైన కార్యకర్తలు పాల్గొన్నారు.

## కరీంనగర్ జిల్లా

**గోదావరి ఖని** : కరీంనగర్ జిల్లా గోదావరిఖని ధర్మక్షేత్ర కార్యక్రమంలో భాగంగా యన్.టి. పి.సి. జ్యోతి నగర్ వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో 15-5-03 నుండి 25-5-03 వరకు యన్.టి.పి. సి. శ్రీ ఆంజనేయ స్వామివారి ఆలయంలో తత్త్వ ప్రచారకులైన శ్రీమాన్ గంగాధర్‌గారి ఆధ్వర్యవంలో 11 రోజులపాటు రామాయణ ప్రవచనములు నిర్వహించినారు. ఉదయం ఒక్కొక్క గృహంలో గీతాజ్యోతి ప్రవచనము నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమంలో శ్రీమాన్ సత్యనారాయణ, సుజాతగార్లు, ఆలయ కమిటి మెంబర్లు పాల్గొన్నారు.





## తూర్పుగోదావరి జిల్లా

**రామచంద్రాపురం** : తూర్పుగోదావరి జిల్లా రామచంద్రాపురం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో 6వ తేదీన శ్రీరామానుజా చార్యులవారి జయంతి సందర్భముగ ప్రభుత్వ, ప్రైవేట్ హాస్పిటల్స్‌నందలి 100 మంది రోగులకు పండ్లు, బిస్కట్స్ వస్త్రములు పంచిపెట్టినారు. సంస్కృత పండితులచేత శ్రీరామానుజా చార్యుల వైభవమును గూర్చి వివరించి సామూహిక విష్ణు సహస్రనామ పారాయణం చేయడం జరిగింది.

25వ తేదీన శ్రీ హనుమ జ్జయంతి సందర్భముగ స్థానిక రామాలయంలో 'హనుమాన్ చాలీసా' పారాయణం చేసినారు. ఈ కార్యక్రమమునకు యమ్.ఆర్.యస్. వీరభద్రరావు, శ్రీమతి వై. రామలక్ష్మి గార్ల ఆధ్వర్యవంలో నిర్వహించారు.

## నిజామాబాద్ జిల్లా

**నిజామాబాద్** : నిజామాబాద్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో ధర్మక్షేత్ర ప్రచార కార్యక్రమంలోభాగంగ స్థానిక రామాలయంలో ప్రతిరోజు గీతాజ్యోతి శ్లోకాలు, శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం చేయుచున్నారు. వికాసతరంగిణి సెక్రటరి జి. లక్ష్మారెడ్డిగారు, ప్రధాన అర్చకులు శ్రీమాన్ నరసింహాచార్యులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## వరంగల్ జిల్లా

**హరిప్రియాల** : హరిప్రియాల వికాసతరంగిణి శాఖ అధ్యక్షులు శ్రీమాన్ రావుల బాలకృష్ణా రెడ్డిగారు పరమపదించినారు. వికాసతరంగిణి శాఖ నిర్వహించిన అనేక కార్యక్రమాలలో వీరు చురుకుగ పాల్గొన్నారు.

## మహబూబ్ నగర్ జిల్లా

**వనపర్తి** : మహబూబ్‌నగర్ జిల్లా వనపర్తి ధర్మక్షేత్ర కేంద్రముగ 16-6-03వ తేదీన వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో మనిగిల్ల గ్రామంలో శ్రీఆంజనేయస్వామివారి దేవాలయంలో గీతాజ్యోతి సందర్భముగ 'మాధవ సేవగ - సర్వప్రాణిసేవ', స్వీయ ఆరాధన సర్వ ఆదరణ దీనివలన జరగవలసిన ఐక్యత గురించి వివరించారు. శ్రీకృష్ణపూజలు, శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి కార్యదర్శి వి. కురుమూర్తి గారు, జి. వెంకటరామా౨ండ్డిగారు, ప్రమీలమ్మ గారు ఇతర ముఖ్యకార్యకర్తలు పాల్గొన్నారు.

## జంటనగరాల నివేదిక

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి మంగళా శాసనములతో... జెట్ - వికాసతరంగిణి



## పరమపదవార్త

**శ్రీమతి అన్నె కృష్ణ కుమారిగారు తేది : 9-6-2003న ఆచార్య తిరువడిని అలంకరించారు.**

కృష్ణా జిల్లా, చిన్న ఓగిరాల గ్రామస్తులు వీరు, వీరికి ఆ శ్రియఃపతి సాన్నిధ్యం లభించాలని ప్రార్థిస్తున్నాము.

జంటనగరముల సమన్వయ కమిటీ సంయుక్త ఆధ్వర్యవములో జెట్ - హైదరాబాద్ బిల్డింగులో ది. 3-5-03 నుండి 18-5-03 వరకు 16 రోజులపాటు 6-18 సం॥ల వయస్సుగల బాలబాలికలకు వేసవి శిబిరమును నిర్వహించారు. ఈ శిబిరములో ప్రతిరోజు ఉ॥ 8 గం॥ల నుంచి మధ్యాహ్నం 1గం॥ వరకు గీతాజ్యోతి శ్లోకపఠనం, కృష్ణాష్టకం, హయగ్రీవ స్తోత్రం, యోగ అభ్యాసం, చిత్రలేఖ్యం, మరియు హస్తకళలలో శిక్షణను25 మందివిదార్థులకు అందించారు. విద్యార్థులు ఎంతో ఉత్సాహముగా ఈ శిబిరములో పాల్గొని అన్ని విషయములను చక్కగా అవగాహన చేసుకుని శిబిర ఉద్దేశ్యమునకు సార్థకత చేకూర్చినారు. ఈ శిబిరంలో శిక్షకులుగా కుమారి కమల, శ్రీమతి ఉషానాగరాజ్, శ్రీమాన్ సుశాంత్, శ్రీమతి కృష్ణకుమారి, శ్రీమాన్ కల్కి అవతారం గారలు తమ సేవలను అందించారు. శిబిరం చివరిరోజున శ్రీమతి కర్రి తిరువేంగళమ్మ గారు, శ్రీమతి శ్రీకుమారి రామేశ్వరరావు గారలు ముఖ్యఅతిథులుగా విచ్చేసి విద్యార్థుల యొక్క శ్లోకపఠనము, చిత్రలేఖనము మరియు సాంస్కృతిక కార్యక్రమాలను తిలకించారు. కార్యక్రమ వీడియో ద్వారా విశేషాలను శ్రీమాన్ కల్కిఅవతారంగారి ద్వారా విచ్చేసిన అతిథులకు (సుమారు 100 మంది) వివరించారు. శ్రీస్వామివారు కూడ ఈ కార్యక్రమ వివరాలను సిడి ద్వారా తిలకించి చాలా చక్కగా నిర్వహించారని తమ సంతోషమును తెలియచేసి కార్యకర్తలకు, పిల్లలకు, శిక్షకులకు తమ మంగళాశాసనములను తెలియ చేసినారు, ఈ కార్యక్రమములో జెట్ సభ్యులు, వికాసతరంగిణి కార్యదర్శి శ్రీమాన్ పద్మనాభరావు గారు పాల్గొన్నారు. ఈ శిబిర నిర్వాహకులుగా శ్రీమతి వనజా చలపతిరావు గారు, శ్రీమతి సుచరిత గార్లు వ్యవహరించి శిబిరము విజవంతము అగుటలో తోడ్పడినారు.

జంటనగరములలోని ప్రధాన శాఖలయిన సికింద్రాబాద్ వనస్థలిపురం, సరూర్‌నగర్, సంతోష్ నగర్ శాఖలుకూడ తమ తమ శాఖల పరిధిలో విద్యార్థులకు వేసి శిక్షణాశిబిరము తరగతులను నిర్వహించినారు. ఈ శిబిరము 15-20 రోజులపాటు నిర్వహించారు. సరూర్ నగర్‌లో 45 మంది, వనస్థలిపురం శాఖలో 38 మంది ఈ శిబిరములో పాల్గొన్నారు. వనస్థలిపురం వికాసతరంగిణి శాఖవారు శ్రీస్వామివారి మంగళా శాసనములతో వేసవి శిబిరము కొరకు ప్రత్యేకముగా ముద్రించిన పుస్తకము 'విజ్ఞాన వికాసం'ను శిబిరములో బోధించవలసిన అన్ని పాఠ్యాంశాలను పొందు పరచి శిక్షకులకు, విద్యార్థులకు ఉపయోగ పడేలా రూపొందించినారు. శ్రీస్వామివారు ఈ పుస్తకాన్ని చూచి దీన్ని ప్రామాణికంగా తీసుకుని అందరికి ఉపయుక్తంగా ఉండునట్లు చిన్న చిన్న మార్పులతో రామానుజవాణి ద్వారా ఒక పుస్తకమును తయారు చేయమని చెప్పినారు. ఈ పుస్తకము జెట్ శిబిరములోను మరియు కొన్ని శాఖలలోను విద్యార్థులకు అందించారు.

**సికింద్రాబాద్ :** వేసవి శిబిరము మే 20-30 వరకు పెద్దవారికొరకు యోగ శిక్షణ, చిన్న పిల్లలకొరకు గీతాజ్యోతి శ్లోకమాలికను నేర్పించిటము జరిగినది.

**వనస్థలిపురం :** వేసవిలో దాహార్తిని తీర్చుటకు ప్రతి సం॥ వలెనే ఈ సం॥కూడా వనస్థలిపురం కాంప్లెక్స్ స్టాప్‌వద్ద ఏప్రిల్ 27 నుండి జూన్ 9వ వరకు సుమారు 40 రోజులపాటు చలివేంద్రము నిర్వహించారు. ఈ చలివేంద్రములో ప్రతిరోజు





సుమారు 300 మందికి చల్లని మంచినీరు, మధ్యాహ్నం 1-3 గం॥ల వరకు చల్లని మజ్జిగను అందించటము జరిగినది. సుమారు 30 మంది కార్యకర్తలు ఈ మంచినీటి శిబిరములో పాల్గొని తమవంతు సేవలను అందించారు. ఈశిబిరమునకు కావలసిన నీటిని హైదరాబాద్ మహానగరం మంచినీటి శాఖవారు అందించటము జరిగినది. ఈ శిబిరమును ప్రజలవద్దనుండి, దుకాణదారుల నుండి అనేక ప్రశంసలు అందుకొన్నది.

జూన్ 12న నమ్మాళ్వార్ తిరునక్షత్రమును శ్రీమాన్ డా॥ పి.పద్మనాభరావుగారి ఇంటిలో 100 మంది భక్తుల సమక్షంలో అతి వైభవముగా జరుపుకున్నారు. శ్రీవిష్ణు సహస్రనామ పారాయణము, తిరుప్పల్లాండు, సేవాకాలం చేసినారు. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల సత్యనారాయణా చార్యుల నమ్మాళ్వార్‌యొక్క చరిత్ర, వైభము భక్తులకు వివరించారు.

**బోయిన పల్లి :** 6-6-03 శుక్రవారంనాడు పార్కు న్యూ ఎన్‌క్లేవ్ కాలనీలో సామూహిక విష్ణుసహస్ర నామపారాయణం, గీతాజ్యోతి శ్లోక పఠనం, ప్రవచనం చేయుట జరిగినది. ఈ కార్యక్రమములో 150 మంది భక్తులు పాల్గొన్నారు. ది. 10-6-03 రోజున డా॥ సూర్యనారాయణ గారి ఆధ్వర్యంలో ఆరోగ్య శిబిరమును నిర్వహించటం జరిగినది. ఈ శిబిరంలో 100 మంది రోగులకు చికిత్స సేవలను అందించారు. వేసవి తాపపీడితులకు చలివేంద్రము ఏర్పాటు చేసారు.

**చార్మినార్ :** 14-6-03నాడు శ్రీకోదండరామ స్వామి దేవాలయములో 108 సార్లు శ్రీసామూహిక విష్ణు సహస్రనామ పారాయణం శ్రీ నడుమూరి నివాసాచార్యులుగారి బృందం ఆధ్వర్యవములో నిర్వహించినారు. ఈ కార్యక్రమములో అనేక మంది భక్తులు పాల్గొనటం జరిగినది. ఈ కార్యక్రమమును ప్రతి శనివారం ఒకరి ఇంట్లో జరపాలని నిశ్చయించి ఆచరించుచున్నారు.

**డి.డి. కాలనీ :** ఈ నెలలో డా॥ మన్‌మోహన్ రావుగారి పర్యవేక్షణలో సుమారు 100 మందికి ఉచిత నేత్ర పరీక్షలు నిర్వహించి కొందరికి మందులు, అద్దాలను అందచేసినారు. ఈ కార్యక్రమములో వికాస తరంగిణి అధ్యక్షులు సంతోష్‌కుమార్ గారి ఆధ్వర్యంలో నిర్వహించినారు.

## పరమపదవార్త



**శ్రీ నాయిని రాఘవేందర్‌రెడ్డిగారు తేది : 29-5-03 గురువారము ఉ॥ 5-00 గం॥లకు ఆచార్య తిరువడి నలంకరించారు.**

శ్రీస్వామివారు సంకల్పించిన అనేక కార్యక్రమములలో కైంకర్యమును మరియు వారి అమూల్య సేవను అందించి శ్రీవారి మన్ననలను అందుకున్న వీరికి ఆ శ్రియఃపతి నిత్యకైంకర్యశ్రీ లభించాలని ప్రార్థిస్తున్నాము.

**జై శ్రీమన్నారాయణా...!**

## విషయ సూచిక.....



### పంచాంగ వివరాలు

#### ఆగస్టు

8 సర్వేషామేకాదశి, వరలక్ష్మీవ్రతం
9 తిథిద్వయం
10 వరాహ జయంతి, చతుర్దశి తిథి
11 ఋగ్వేదోపాకర్మ
12 యజుర్వేదోపాకర్మ, రాఖీపూర్ణిమ, శ్రీహయగ్రీవ జయంతి
15. భారతదేశ స్వాతంత్ర్యదినోత్సవం
16 శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి తిరునక్షత్రం
17 మఖ కార్తె సింహ సం॥ 10-52
18 సప్తమి తిథి
19 శూన్యతిథి, స్మార్త శ్రీకృష్ణజయంతి
20 అష్టమి తిథి,
21 శ్రీవైష్ణవ శ్రీకృష్ణజయంతి
23. సర్వేషామేకాదశి
26 మాస శివరాత్రి
27 సర్వేషాం అమావాస్య
30 బలరామజయంతి, కుడుముల తదియ, సామవేదోపాకర్మ
31 పుబ్బకార్తె, రా 8-36, వినాయకచతుర్థి విష్వక్సేనారాధన

#### సెప్టెంబర్

1 తిథిద్వయం
2 సప్తమి తిథి
5 గురుమౌఢ్యత్యాగం
6 సర్వేషాం పరివర్తనైకాదశి
7 వామనజయంతి

శ్రీవారు 12-8-03 శ్రావణపూర్ణిమనుండి విశాఖపట్టణములోని భీమిలిలో మన జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ ప్రాంగణమున చాతుర్మాస్య దీక్షలో వేంచేసియుంటారు.

మీ సేవలో....


**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 272929,
**చందావివరాలు** :- సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-, విదేశాలకు సంవత్సరచందా $ 25,
E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org
D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం,






శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాస పత్రిక






స్వభాను నామ సంవత్సరం శ్రావణమాసం

**సంపుటి 56** **2003 ఆగస్టు** **సంచిక 5**

వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు
**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు :

శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. **శ్రీరామచంద్రాచార్యులు**

సంపాదకీయం

# అంతరంగ తరంగాలు

మా పుట్టిల్లు మహారాష్ట్రం. మెట్టినిల్లు ఆంధ్రప్రదేశం. నాకు తారుణ్యం ఏర్పడిందీ, పరిపుష్టి ఏర్పడిందీ ఆంధ్రప్రదేశంలోనే. అంతేకాదు నేను పరితుష్టి చెందిందే యిక్కడనే! నాకు సక్షజనం సమకూరింది యిక్కడే. నాకు వల్లభసమాగమం ఏర్పడిందీ ఇక్కడే! నా జీవనానికి ధన్యత చేకూరిందీ యిక్కడనే.

జనావళికి స్నానీయంగా, పానీయంగా నేను ఉపకరించేను. నేలతల్లి నన్ను తాకి మేనుపులకించి సస్యవతి అయింది. జనులకు ఇష్టమృష్టాన్నాలు సమకూరినాయి. ఏం కావాలి నా జీవన చారితార్థ్యానికింతకన్నా?

నా అంతరంగంలోకి ఒక్కమారు చూసుకుంటే ఎన్నెన్ని స్మృతులు వెలికి వస్తాయి! కొన్ని తలచుకుంటే ఒడలు ప్పొంగిపోతుంది. కొన్నిటిని తలచుకుంటూ కృశించి పోతాను.

అయినా యుగాలు చూసేను. నిమ్నోన్నతాలు చూసేను ఒడుదుడుకులు చూసేను. ఇరుకులు పడ్డాను. విశాలధరాతలాల విహారాలు చేసేను. నా జీవనం అలా సాగిపోతూనే ఉంది.

నేలా, నింగీ, నిప్పూ, గాలీ అన్నిటికీ నా జీవనం కావాలి. ఒక్కోదానికి ఒక్కో ప్రయోజనం. అన్నిటికీ ఉపయోగపడటమే నా ప్రయోజనం. అందుకే నా జీవనం!

ఇక్ష్వాకులనాటి కథ చెపుతున్నాననుకోకండి. సీతారాముల ప్రణయోదంతాలకు నేను రహస్సాక్షిని. నాతో గడపటమంటే పాపమాసీతకు ఎంత సంతోషమో చెప్పలేను! ఆమెను రావణుడెత్తుకు పోయేడన్న మాటను రామయ్యతో నేను చెప్పలేదని ఇప్పటికీ నన్ను దెప్పుతూనే ఉంటారు కొందరు. నియతి అల్లా ఉంది. నేనేం చెయ్యను? అయినా అందుకునేనెంత బాధపడ్డానో మీకేం తెలుసు? ఆ సన్నివేశం తలుచుకుంటూ గుండె నీరై జలజలనేల పారుతుంది. ఎంత విలవిలలాడిపోయేను?

భద్రగిరిదరి రామప్రభువుతో, సీతమ్మతో నా అంతరంగవేదనను తరంగనాదంతో ఇప్పటికీ నిత్యం నివేదించుకొంటూనే ఉన్నాను తెలుసా?

నాఅంతస్సారమెరిగినవారు **పానసోదార గోదావరీవాః పూరమణరునన్మా**– ఆధ్యాత్మికంగా నా పావనత్వాన్ని, భౌతికంగా నా ఔదార్యాన్నీ తెలుచుకొంటూ.

నా ఒడ్డున నిలిచి కవికుమారులు నా తరగల గుసగులు విని ముచ్చట పడిపోయి నన్నేమనే వారో తెలుసా? **'గద్గదనదద్గోదావరీ'** అని.

నాముంగిట చేరి నన్నయ్యగారు నారాయణ భట్టుకు భారతం తెలుగులో వినిపించి నాడు కదయ్యా ! తెలుగుభారతానికి మొదటి శ్రోతను నేను కాదూ!

ఆ తపశ్శాలి, ఋషిప్రవరుడు నన్నయ్యగారు కటిదఘ్నంగా నా నీటనిలిచి సూర్యోపాసన కావిస్తూంటే ఉల్లోల కల్లోలంగా ఉప్పొంగి ఆనంద తాండవం చెయ్యాలనిపించినా ఆ గాంభీర్యానికి, ఆ తేజస్సుకు, ఆ ప్రసన్నతకు, ఆ దివ్యత్వానికి జిచ్చపడి, వడిలేక, సవ్వడిలేక దావడి నిలిచిపోయేదాన్ని కాదూ! వ్యాసులవారు! వారణాశి వేదవిని వారికి మా అక్కగంగను చూసినట్టుండేది నన్ను చూస్తే 'దక్షిణగంగ'గా నన్నెంత ప్రీతితో సంభావించేవారని.

అగస్త్యులవారు లోపాముద్రతో నాదరికి వస్తే వారికి జలాభిషేకం సమర్పించి ఎంతమురిసి పోయేనో నా అదృష్టానికి! అంతేనా నాకీభాగ్యం కలిగించిన వింధ్యాచలానికి ఎంతకృతజ్ఞత నివేదించుకున్నానో?

ఎందరెందరు సనాతనధర్మనిరతులు

\2/
Mydocuments\
BnAugust o3.p65



స్వాధ్యాయప్రవరణులు నాలో అఘమర్షణ స్నానాలు కావించేవారో, వారి స్పర్శకానాడు పులకించేను. అది తలచుకొని నేడు పులకిస్తున్నాను.కోనసీమ మరకత ద్వీపంలా, దక్షిణకాశ్మీరంలా విరాజిల్లుతూంటే నాకెంత ఆనందమని!

అయితే రోజులు మారినాయి. మారతాయి. అది సహజం. కాని ఆ మార్పు ఔన్నత్యం వైపు తీసుకువెళితే మంచిది అధోగతికి కారాదు.

నానీటి గరిమతో మధురిమతో జనం ఈవేళ తృప్తిపడటంలేదు. నానేలలోని స్నేహం నూనె కోసం గోతులు తవ్వుతున్నారు నూతులే ఇకంటూ నా జీవనాన్ని కలుషపరుస్తున్నారు.

పరిశ్రమలంటున్నారు. కర్మాగారాలంటున్నారు. ఎక్కడెక్కడి కాలుష్యమూ తెచ్చినాలో కలుపుతున్నారు. సకల కాలుష్యాలకూ దారి గోదావరి అయింది ఈవేళ. ఎవరితో చెప్పుకోవాలి? ఏమని చెప్పుకోవాలి?

ఒకనాడు నిద్రలేస్తూ నేలమీద కాలు పెట్టేప్పుడు నేలతల్లిని దేవతగా భావించి "అమ్మా నా పాదస్పర్శను క్షమించు ఓర్పుతల్లివిగా నువ్వు" అనేవారు.

నీటమునిగేటప్పుడు జలదేవతాభావంతో మేని పులకలతో పునీతులయ్యేవారు జనం. పితరులకు దేవతలకు ఋషులకు తర్పణాలు కావించేవారు. ఇది నిత్యకృత్యం ఆనాడు. వారికి నేనోదేవత. ఇవేళ్టివారికి నేనో నిత్యావసర వస్తువు.

ఆనాడు ఏ నీట క్రుంకువిడినా "గంగేచ, యమునేచైవ గోదావరి, సరస్వతి, నర్మదే, సింధు, కావేరి, జలేస్మిన్ సన్నిధింకురు" అని భక్తిభావనంతో సకల మహానదులనూ ఆనీట ఆవాహన చేసుకొనేవారు అది కూపవారి కానీండి, కుల్యావారి కానీండి,తటాకోదకం కానీండి, దీర్ఘికాంబువు కానీండి. ఈవేళ ఆ అమలికాంతరంగాలు నా తరంగాలకెక్కడా తగలటం లేదు. ముప్పొద్దుల మాటలేమి ప్రాతఃస్నానాలవారూ కరువయ్యారు.

తెలుగు జనం అంటే ఏమిటో పిచ్చిప్రేమ నాకు. వారిని సర్వాంగీణ పరిష్వంగం చేసుకోవాలని తపన. కాస్సేపు నా ఎదలో వారిని పొదివి పట్టుకోవాలని గాటంపుకోరిక.

ఇట్లా తపించిపోతున్న నాకు పుష్కరాలు కాస్త ఊరట నిస్తాంటాయి. పుష్కరవేళ నాతోబుట్టువులందరూ నాలో వచ్చిచేరతారు. నాతోపాటు వారినీ కలవవచ్చు. అనుదిన స్నానాలు లేకపోయినా పుష్కరస్నానాలయినా చేయకపోతారా అని ఓ ఆశ. 12 ఏళ్ళకోమారు లభించే ఈ అదృష్టం నా జీవనాన్ని ధన్యం చేస్తుందన్న సంబరంతో పొంగిపోతున్నాను.

రండి. నాలో తలలు ముంచండి. తర్పణాలు వదలండి. పుట్టువునిచ్చిన పితరులను, జ్ఞానాన్ని ప్రసాదించిన ఋషులను, జీవన సౌభాగ్యాన్ని ప్రసాదించిన దేవతలను తనియించండి. సనాతన ధర్మదీప్తితో వెలుగొందండి. తర్పితులై సుప్రసన్నులయిన దేవర్షిపితృగణాలు మీ పాలిట వరదులౌతారు.!

మీరు ముద్దుగా పిలుచుకొనే గోదావరిని నేనే ఎలుగెత్తి పిలుస్తున్నాను. నా ఎదలో మీ పదముద్రలు నిలపండి. పదిలంగా నిలుపుకొంటాను.

నాదారి నాకెట్లాగూ ఉంది. మీకూ ఓ దారి ఏర్పడుతుంది. ఓనాడు నా ఒడిలో నడయాడిన శిశువు ఈనాడు త్రివిక్రమ వైభవంతో శ్రీచిన్న జీయరు స్వాములుగా నా దరి రాజమహేంద్రిలో మంచిర్యాలలో పుష్కర బ్రహ్మ యజ్ఞాలు నిర్వహించారు.

**"మీ గోదారి"**

**మా ఎద తాకిన గోదావరి సవ్వడులవి**
**నుడికోవగమీ కనులముందు పెడుతున్నాం**
**– శ్రీరామచంద్రాచార్య.**





శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యోనమః

పరమపదవాసులైన, మన పరమాచార్యులు

## శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి

## 95వ తిరునక్షత్ర మహోత్సవములు

## 12-8-2003 నుండి 16-8-2003 వరకు

**శ్రీవారి బృందావనం, వాసుదాసాశ్రమము, నడిగడ్డపాలెంలో**

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి**

**దివ్యమంగళా శాసనముతో**

దేశంలో నెలకొనివున్న అనావృష్టి తొలగి నదులు, జలాశయములు సువృష్టితో పరిపూర్ణమై సస్యశ్యామలముగా దుర్భిక్షం తొలగి 'సర్వేజనా సుఖినోభవన్తు' అను పరమాత్ముని అనుగ్రహించకోరుతూ...

## వరుణ యజ్ఞము - మరియు సమిష్ఠి లక్ష శ్రీ చూర్ణ - లక్ష్మీ పూజ

**వరుణ యజ్ఞము ః-** **13-8-2003** నుండి **15-8-2003** వరకు

**సమిష్ఠి లక్ష శ్రీ చూర్ణ లక్ష్మీ పూజ ః- 12-8-2003** నుండి **16-8-2003**వరకు

### నిత్యకార్యక్రమములు

**ఉదయం. 6గం॥** ప్రాతః ఆరాధన, సేవాకాలం, గోష్ఠి. **8.30గం॥** వేదపాఠ, యితిహాస, పురాణ స్తోత్రములు, దివ్యప్రబంధ పారాయణాలు, హోమ కార్య క్రమములు ప్రారంభం. **9.00గం॥** సమిష్ఠి 108 సార్లు **"ఆజామజై కణ్ణా"** పాశురం పారాయణ **10గం॥** సమిష్ఠి శ్రీ చూర్ణముతో - లక్ష్మీపూజ **12.30** నివేదన, నిత్య పూర్ణాహుతి, గోష్ఠి, తధియారాధన **సాయంత్రం 4గం॥** ప్రవచన కార్యక్రమము. **6గం॥** సమిష్ఠి శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణ. సమిష్ఠి 108 సార్లు **"ఆజామజై కణ్ణా"** పాశురం పారాయణ**08.00** నివేదన, నిత్య పూర్ణాహుతి, శాత్తుముఱై - గోష్ఠి

### విశేషకార్యక్రములు

**12-8-2003 ఉ॥8.00**గం॥కువేద ఇతిహాస పురాణ, దివ్యప్రబంధ **మంగళవారం** పారాయణలతో వేద జపహోరం. **రాత్రి7.00**గం॥కు విష్వక్సేన పూజ, పుణ్యాహవచన, అంకురార్పణ. **13-8-2003 బుధవారం** వరుణ యజ్ఞమునకు అగ్నిప్రతిష్ఠ, హోమ కార్యక్రమము. **14-8-2003 గురువారం ఉదయం:-** వరుణ యజ్ఞం, పూర్ణాహుతి. **15-8-2003 శుక్రవారం రాత్రి:-** గరుడవాహన సేవ - శ్రీ జీయరుస్వామివారి ఉత్సవమూర్తి తిరువీధి ఉత్సవం. **16-8-2003 శనివారం** **ఉదయం:-** శ్రీ జీయరు స్వామి వారి ఉత్సవ, మూలమూర్తులకు అభిషేకం, పాదార్చన - శాత్తుముఱై, గోష్ఠి సన్మానములు.

### కైంకర్యములు:

1. సమిష్ఠి శ్రీ చూర్ణార్చనకు 100/-రూ. 2. గరుడ వాహన సేవ (తిరువీధి) 4,000/-రూ. 3. 1 రోజు వరుణ యజ్ఞ యాజమాన్యమునకు 1000/-రూ. 4. 3 రోజుల వరుణ యజ్ఞ యాజమాన్యమునకు 2,500/-రూ. 5. తిరునక్షత్ర ఉత్సవము 1 రోజుకు 10,000/-రూ.

**పై విధముగా కాకుండా ధన, వస్తురూపములో వారి అవకాశానుసారము సమర్పించి, ఆచార్య అనుగ్రహపాత్రులు కాగోరుచున్నాము. విరాళములు** M.O **ద్వారా కాని,** D.D/Check**లు ద్వారాకాని** పంపవచ్చును.

**వివరములకు**

**బృందావన నిత్యారాధన సమితి,** శ్రీ వాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం
వయా చుండూరు, గుంటూరు జిల్లా. **ఫోన్: (08644) 276522, 276150**

a

\3/
*Mydocuments*
*BnAugust o3.p65*



# ఉభయవేదాంత పండిత సభలు

## విజయనగరం

శ్రీమదుభయవేదాన్తాచార్యపీఠం - విజయనగరం శాఖవారి నిర్వహణలో ఉభయ వేదన్త ప్రవర్తక శిరోమణి, వై.వా ఉ.వే. శ్రీమాన్ డా॥ కందాళ వేంకటాచార్య స్వామివారి తిరునక్షత్ర సందర్భంగా జులై 11, 12, 13 తేదీలలో విజయనగరం త్రైవర్ణిక శ్రీ వైష్ణవ రామానుజ కూటంలో 15న ఉభయ వేదాన్త పండత సభలు వైభవంగా జరిగినాయి.

కవి శాబ్దిక కేశరి, మహామహో పాధ్యాయ, శాస్త్ర రత్నాకర ఉ.వే. శ్రీమాన్ న.చ. రఘునాధాచార్యస్వామివారి ఆధ్యక్ష్యంలో ఉభయవేదాన్తాచార్య పీఠ కార్యదర్శి ఉ.వే. శ్రీమాన్ డా॥ సముద్రాల వేంకట రంగరామానుజాచార్య స్వామివారి నిర్దేశకత్వంలో త్రైవర్ణిక రామానుజ కూటం ధర్మకర్తల ప్రోత్సాహంతో జెట్ - వికాసతరంగిణి వారి భాగస్వామ్యంతో శ్రీమాన్ వేంకటాచార్య స్వామివారి కుటుంబం, అందునావిశేషించి వేంకటాచార్యస్వామివారి సుపుత్రిక శ్రీమతి జానకి ఈ సభలను స్పృహణీయ రీతిలో స్మరణీయ రీతిలో నిర్వహించారు.

ఇందులో ఉ.వే. శ్రీమాన్ డా॥టి.కె.వి. అయ్యంగార్ స్వామి, ఉ.వే. శ్రీమాన్ తూపురాణి ఉడయవర్ స్వామి, ఉ.వే. శ్రీమాన్ డా॥ కందాడై రామానుజాచార్య స్వామి, ఉ.వే. శ్రీమాన్ కళాంబి వేంకటాచార్యస్వామి, ఉ.వే. శ్రీమాన్ వంగల వేంకటాచార్యస్వామి, ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి, ఉ.వే. శ్రీమాన్ సాతులూరి గోపాల కృష్ణమాచార్య స్వామి, ఉ.వే. శ్రీమాన్ టి.పి. శ్రీ రామచంద్రాచార్య స్వామి, శ్రీమతి టి.కె. చూడామణి గారలు వివిధ విషయాలపై ప్రవచనాలు కావించినారు.

స్థానికంగా సంప్రదాయ గ్రంధాలను సేవిస్తున్న త్రైవర్ణిక శ్రీ వైష్ణవ కుటుంబాలకు చెందిన స్త్రీలు, పురుషులు, చిన్నపిల్లలు కూడా భగవద్విషయ వ్యాఖ్యాన పంక్తులను అవగాహన చేసుకొని చక్కగా ధారణచేసి సత్ ప్రసంగాలు కావించి సహృదయు లయిన పెద్దల మంగళాశాసనాలకు పాత్రులైనారు. 12వ తేదీ ఉదయం ఉ.వే. శ్రీమాన్ న.చ. రఘునాధాచార్యస్వామివారి సన్నిధిలో భగవద్విషయం ద్వితీయ శతకం శాత్తుముఱై, మూడవ పది తొడంగం జరిగింది.

డా॥ కందాళ వేంకటాచార్యస్వామివారి తిరునక్షత్రసభ జరిగింది. ఇందులో రామానుజ కూటం ధర్మకర్తల మండలి అధ్యక్షులు శ్రీమాన్ దాసరి కృష్ణాజీ గారి అధ్యక్ష్యంలో శ్రీమాన్ దాసరి యతిరాజు సంపత్ కుమార్ గారి కుటుంబం 'ఆచార్య వరివస్య' ను కావించుకున్నారు. కాంచి ప్ర.భ అణ్ణంగరాచార్యస్వామివారి మణిప్రవాళ వ్యాఖ్యతో యతిరాజ వింశతిని ముద్రించి ఆచార్య కైంకర్యముగా సమర్పించినారు శ్రీమాన్ కుమార్‌గారు. 'ఉత్తరాంధ్ర విద్వత్త్రయం'లో ఒకరైన ఉ.వే. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామివారిని తమ ఆచార్య వరివస్యగా సత్కరించినారు. శ్రీరామ చంద్రాచార్య స్వామివారిని విజయనగరం - వికాసతరంగిణ ివారు కూడా సమ్మానించారు.

విజయనగరంలో శ్రీశ్రీశ్రీ త్రిదండిచిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి వారి మంగళాశాసనాలతో జెట్-వికాస తరంగిణి వారు నిర్వహిస్తున్న నేత్ర విద్యాలయం. విద్యార్థులకు యతిరాజ వింశతి. పఠనంలో పోటీలు నిర్వహించి బహుమతులందజేసారు. నిర్దుష్టంగా, శ్రావ్యంగా అసంభ్రమంగా అంధ విద్యార్థులు యతిరాజ వింశతిని అనుసంధిస్తూంటే విన్నవారంతా చాలా ముచ్చట పడినారు. శ్రీమాన్ కృష్ణజీగారు ప్రసంగిసన్తూ శ్రీ స్వామివారు ఉపదేశిసన్తూ ఆచరింపచేస్తున్న 'మాధవసేవగా సకల ప్రాణిసేవకు' సర్వులూ ఉద్యమించాలని ఉద్బోధించారు.

# సంపాతి

డా॥ శ్రీనివాస రామానుజమ్
శ్రీకాకుళం

సీతాన్వేషణకోసం వెళ్ళిన వానరులంతా ఆమె జాడ కానక వెనుతిరిగారు. దక్షిణదిక్కుకి వెళ్ళినవాళ్ళు మాత్రం ఇంకా ఆమెకోసం అన్వేషిస్తూనే ఉన్నారు. చెట్లు, పుట్టలూ, కొండలూ, కోనలూ, అన్నీ వెతికి వెతికి చివరికి వారు రామగిరిని చేరారు. జటాయువు సోదరుడు సంపాతి వారికి అక్కడ కలిశాడు.

సంపాతిని చూసి సంభ్రమాశ్చర్యాల్లో మునిగిపోయారు వారు. రామకార్యంపై వచ్చామన్నారు. దాంతో సంపాతి, సాదరంగా ఆహ్వానించాడు. వానరులు తమ రాకలోని ఆంతర్యం చెప్పగానే – రావణాపహరణ వార్త చెప్పాడు. జటాయువు రక్తంతో ఎఱ్ఱనైన రథంపై, సీతను గొలుసులతో బంధించి తీసుకొనిపోతున్నాడు. ఆమె, నన్ను చూసి, రక్షించమని వేడుకొంది. జటాయుమరణాన్నీ ఆమే తెలిపింది. ఐనా, అశక్తుణ్ణి నేను, ఎగురలేకపోయాను అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

అంగదుడు ఆత్రంగా అడుగుతాడు – 'ఏం? ఎందుకు నీవెగరలేక పోయావ్?' సంపాతి నిర్లిప్తంగా అంటాడు – 'నీకు తెలియదా? సూర్యుడు నారెక్కల్ని కాల్చేశాడు కదా !' ' మాకెవ్వరికీ తెలియదు'. అన్నారు వానరులంతా. ఒక్క ఆంజనేయుడు తప్ప. 'ఓహ్! సంపాతీ! క్షమించు. నేనే వీరికి చెప్పాల్సింది. నీవే వీళ్ళకా కథ వివరంగా చెప్పు' – అన్నాడు, హనుమ. 'ఓ వానరులారా! వినండి, నా కథ. నాకూ సూర్యుడికీ మధ్య జరిగిన పందెం గురించి. ఉండండసలు ముందునుంచీ చెప్తాను.

మా తల్లిదండ్రులకు మేమిద్దరమే సంతానం– నేనూ, మా తమ్ముడూను. మా తమ్ముడు తెలుసు కదా, జటాయువు! మే మిద్దరం మా తల్లిదండ్రులతో కలిసి ఆకాశంలో హాయిగా విహరించే వాళ్ళం. పొద్దస్తమానం అదే పని. గాలిలో తేలుతూ, కిలకిలాకూస్తూ ఆకాశంలో గిరికీలు కొట్టేవాళ్ళం. అలా రోజులు గడిచిపోయాయి. తల్లిదండ్రులు వృద్ధులై పోయారు. మేమూ పెరిగి పెద్దవాళ్ళమైనాం. మా తండ్రికీ జీవితం వెగటనపించింది. తను త్యాగం చెయ్యాలనుకున్నాడు.

మేం గ్రద్దలం కదా! సూర్యునితో పాటుగా అంత ఉన్నతంగానూ, అంతవేగంగానూ ఎగరగలం. మా తండ్రి సూర్యకిరణాల్లో దగ్ధమవ్వాలనుకున్నాడు. చివాలున సూర్యుని దాటాడు. ఇంకా పైపైకి పోసాగాడు. సూర్యునికి కోపం వచ్చింది. 'ఒక పక్షి తనని దాటి ఎగరటమా? ఛత్!' అనుకున్నాడు. తన వాడి, వేడి కిరణాలతో మా నాన్నను మాడ్చేశాడు. అంతే, నూతిలో పెద్దరాయి పడ్డట్లు – మా నాన్న, భూమిమీదకు వచ్చి పడ్డాడు. రెక్కలు ఒంటికి అతుక్కుపోయి ఉన్నాయి. సూర్యుని అసహనం గురించి మాకు తెలీదు. పక్షేమిటి? ఎగరడమేమిటి? ఎగరలేక పడి చనిపోవడమేమిటి? ఏం ఆలోచించలేకపోయాం. మా అమ్మ దాచిందీ విషయాన్ని. బలవంతునితో విరోధం మంచిదికాదనో, ఏమో!

పిల్లలకోసం మనసు రాయి చేసుకున్నా – భర్తని మరచిపోలేని ఆమె – అతనిలాగే సూర్యుని క్రోధానికి గురై తనువు చాలించింది. తానూ తండ్రిలాగే మృతి చెందాలను కుంటున్నానంది. తమ్ముణ్ణి జాగ్రత్తగా చూసుకో అంది. ఏడ్చింది. మీ తండ్రిలేక నేను బ్రతకలేన్రా అంది. పసికూనలు, మిమ్మల్ని విడిచి పోనూ లేను అంది. అదిగో, అప్పుడే చెప్పింది – సూర్యుడు తీవ్రస్వభావి. తనతో సమానంగా ఎగిరితేనే సహించడు. తనను మించితే ఊరుకుంటాడా? – అంటూ తండ్రి మరణ హేతువుని చెప్పింది. ఎన్నో హితవుల్నీ చెప్పింది. ఇంకెన్నో జాగ్రత్తలూ చెప్పింది.





భోరుమని విలపిస్తూ, తమ్ముణ్ణి నా కప్పగించి తానెగిరిపోయింది. తండ్రిలాగే సూర్యుని కోపాగ్నిలో కాలినేల కొరిగిపోయింది.

నాటినుండి మేమిద్దరం దిక్కులేని వాళ్ళ మైనాం. తమ్ముడిప్పుడిప్పుడే ప్రయోజకు డౌతున్నాడు. తన శక్తి తెలిసికోవాలన్న ఉత్సాహం ఉరకలు వేస్తోంది. ఆకాశమంతా ఎగురుతానంటాడు. నిట్టనిలువునా నింగిలోకి వెడతానంటాడు. ఏమేమో అంటాడు. ఎప్పటికప్పుడు ఏవేవో మాయమాటలు చెప్పి, వాడి మనసు మారుస్తూ వచ్చాను. ఇవాళ ఎగురుదాం, రేపెగురుదాం అని వాయిదాలు వేస్తూ వచ్చాను. కానీ వాడు నన్ను అర్థం చేసుకోలేదు. తనతో సరికాలేకనో, తన గొప్పదనం ఒప్పుకోలేకనో ఏవో సాకులు చెప్తున్నానని రెచ్చగొట్టాడు. ఇక తప్పనిసరై, ఎగరడానికి అంగీకరించాను.

మరునాడు ఉదయాన్నే ప్రారంభించాం. సూర్యుడు పొడుపుమలకి రాగానే మేమూ చేరాం. సూర్యునితోపాటుగా ఆకాశమంతా ఆక్రమించి ప్రయాణిస్తున్నాం. ఇది, మాకు అలవాటే! కానీ, జటాయువు క్రమంగాఎత్తుకెగరడం ప్రారంభించాడు. నేనూ వాడి దరిదాపులకు చేరుకొని హెచ్చరిస్తున్నాను. ఇంక ఎత్తుకి పోవద్దని!

నన్ను మించిపోవాలనో, నా కంటే అధికుణ్ణి అని నిరూపించుకోవాలనో ఇంకా పైకెగురుతూ, వాడు సూర్యుణ్ణి దాటిపోయాడు. సూర్యుడుకది నచ్చలేదు. కోపం వచ్చేసింది. తన దగ్గరున్న ఆయుధాన్ని ప్రయోగించాడు. మా తల్లిదండ్రుల్లాగే, వీడూ, సూర్యక్రోధానికి ఎర అవుతున్నాడు. అనుకున్నంతా అయిందిరా, భగవంతుడా! అనుకొని– నే నడ్డం నిలుద్దామని వెళ్ళాను. చావకపోయినా, చచ్చినంత పనయింది. అదిగో, అది మొదలు మరి ఎగరలేను. రెక్కలు పూర్తిగా కాలిపోయాయి. మాకున్న శక్తుల్లో – ఎగిరే శక్తిని కోలుపోయినా, చూసే శక్తిని మాత్రం కోలుపోలేదు. ఇదిగో, శతాబ్దాలుగా ఇక్కడ పడి వుండి– స్వర్గాన్ని, అరణ్యాలనీ గమనిస్తున్నాను. అలాగే రావణాసురుడు అపహరించుకొని పోతున్న సీతనూ చూశాను.' అన్నాడు నిస్త్రాణంగా సంపాతి.

హనుమ – 'పక్షిరాజా! అలసిపోయావా ఈ సంభాషణవల్ల?' –అంటాడు.

'ఔనయ్యా! హనుమా! నా మరణం ఆసన్నమైంది. జటాయు మరణం నుంచి, నాకూ మరణం దగ్గరైంది. ఈ వార్త అందించడానికే ప్రాణాలతో నిల్చి ఉన్నాను. రామునికి సాయపడినవాడు – నిద్రిస్తున్నవాడు కలలోకి వెళ్ళినట్లు – స్వర్గానికి వెడతాడు. అనుమానవేం లేదు. అదిగో, సముద్రపొడ్డు. అక్కడే అదిగో లంక. అందులో ఉంది, సీత. నేను చనిపోయిన వెంటనే నన్ను దహించండి. సమయాన్ని వ్యర్థం చెయ్యవద్దు. లంకను వెంటనే ప్రవేశించండి'. అంటూ కనుమూసాడు, సంపాతి.

'ఏం సౌజన్యం, నిజంగా?' ఆశ్చర్యపోయి అతని కుత్తర క్రియలు జరుపుతారు, వానరులు.

(వంగీయుల జానపద రామాయణ గాథలాధారం)



## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషి చేస్తున్నవారిలో **శ్రీమాన్ కృష్ణమాచార్యులు** (భద్రాచలం) గారు, మన జీయర్ మఠంలోనే ఉంటూ చక్కని సేవలు అందించడమే కాక మన భక్తినివేదన పాఠకుల సంఖ్యను పెంచేందుకు విశేష కృషిచేస్తున్నారు.

శ్రీశ్రీశ్రీస్వామివారు అనేక మంగళాశాసనములను కృపచేసారు.

# మహర్షుల చరిత్ర

## శౌనక మహర్షి

తమిళమూలం :
వై.వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి

తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూపురాణి ఉడయవర్‌స్వామి, విజయవాడ

శౌనక మహర్షి తండ్రి, తాతల వైభవాన్ని గురించి కొంచెం తెలుసుకుందాం.

విశ్వావసు అనే గంధర్వుడికి మేనక అనే అప్సరసయందు ఒక కుమార్తె జన్మించింది. మేనక ఆ కుమార్తెను అలవాటు ప్రకారం ఒక అడవిలో విడచి వెళ్ళిపోయింది. ఆ పాపని స్థూలకేశుడు అనే ఋషి ప్రేమతో పెంచి పెద్ద చేశాడు. ఒకనాడు భృగు వంశానికి చెందిన రురు అనే మహానుభావుడు వారి ఆశ్రమానికి వచ్చాడు. అక్కడ పెరుగుతున్న అందాల బొమ్మ అయిన ఆ అమ్మాయిని చూచి ప్రేమలో పడ్డాడు. ఆమెను తనకిచ్చి వివాహం చేయవలసినదిగా స్థూలకేశుని అడిగాడు. ఆయన సరేనన్నాడు. వివాహ ఏర్పాట్లు జరుగుతూ ఉండగా ఆ అమ్మాయిని పాము కరిచింది. ఆ విషంతో ఆమె చనిపోయింది.

ఆమె పేరు 'ప్రమద్వర' ఆడవారందరిలో అందమైనదని ఆమాటకు అర్థం. ఇంత అందమైన ఈ అమ్మాయి చనిపోయినందుకు అంతా దుఃఖించారు. ఆమెను వివాహం చేసుకోవాలి అని అనుకున్న 'రురు' కూడ వారికంటే వేయిరెట్లు అధికంగా దుఃఖించాడు. ఆమె తిరిగి బతకాలని వేయిదేవుళ్ళకు మొక్కుకున్నాడు. దేవతలు వచ్చి అతణ్ణి ఓదార్చారు. "పోయిన ప్రాణం పోవడమే తప్ప తిరిగి రాదు. ఆమె గురించి దుఃఖించడం తగదు" అన్నారువారు. అయినా 'రురు' మనసు శాంతించలేదు. ఆమెకోసం అనేక విధాల పరితపిస్తున్న 'రురు' తో దేవతలు ఇలా అన్నారు.

"ఆమె మరణం దైవనిర్ణయం ప్రకారం జరిగింది. దీనికి ప్రతిక్రియ కూడ నిర్ణయించబడింది. మేము చెప్పబోయేదానికి నీవు అంగీకరిస్తే ఈమెను తిరిగి బ్రతికించడానికి ప్రయత్నం చేస్తాం" అన్నారు దేవతలు. ఓ, అలాగే తప్పకుండా అంగీకరిస్తాను. ఆమె బ్రతికితే చాలు మీరు ఏం చేయమంటే అది చేస్తానన్నాడు 'రురు'. 'నీ ఆయుర్దాయంలో సగభాగం ఈమెకు ఇస్తానంటే, మేం యమ ధర్మరాజుని ఒప్పించి ఈమెను బ్రతికింపచేస్తాం' అన్నారు వారు. అలాగే తప్పకుండా అంటూ సంతోషంతో అంగీకరించాడు రురు. దేవతలు యమధర్మరాజు దగ్గరకు వెళ్ళారు. విషయమంతా ఆయనకు చెప్పి ప్రమద్వరను బ్రతికించవలసినదిగా కోరారు. సరేనంటూ యమధర్మరాజు ఆమెను బ్రతికించాడు. నిద్రలోంచి లేచినట్లు లేచి కూర్చుంది ప్రమద్వర. 'రురు' ఆనందానికి అవధుల్లేవు. తరువాత వారిద్దరికి వైభవంగా వివాహం జరిగింది. కొంతకాలం ఆ దంపతులిద్దరూ ఆనందసాగరంలో మునిగి తేలారు. ప్రమద్వరకు ఒక మగశిశువు కలిగాడు. వానికి 'శునకుడు' అని పేరు పెట్టారు. మంచి తేజస్సుతో కూడి శునకునకు తపస్సు, కీర్తి వేదాధ్యయనం, ఆత్మజ్ఞానం,ధర్మం, సత్యం, ఇంద్రియనిగ్రహం మొదలైన ఆత్మగుణ సంపత్తి పరిపూర్ణంగా వచ్చి





చేరింది.

ఈ విషయాన్నే క్రింది శ్లోకాలు తెలుపుతున్నాయి.

**శ్లో॥ రురోరపి సుతో జజ్ఞే, శునకో దేవపారగః ।**
**ప్రమద్వరాయాం ధర్మాత్మా, తవ పూర్వ పితామహత్ ॥**
**తపస్వీచ యశస్వీచ, శ్రుతవాన్ బ్రహ్మ విత్తమః ।**
**ధర్మిష్ఠః సత్యవాదీచ, నియతో నియతేన్ద్రియః ॥**

మహాభారతం 1-5.8,9.

ఇంతగొప్ప మహాత్మ్యముకల శునకుని కుమారుడే శౌనకుడు. ధర్మరాజు రాజసూయయాగం చేసినపుడు అక్కడకు గుంపులు గుంపులుగా చేరిన మహర్షులలో శౌనకమహర్షి కూడ ఉన్నాడట. వేదవ్యాస మహర్షి వేదాలను విభజించి ఒక క్రమంలో ఏర్పాటు చేయుటకుముందే ఈ శౌనక మహర్షి అన్ని వేదాలను అధ్యయనం చేయడం జరిగింది. వేద వ్యాసమహర్షి సమకాలంలో ఉన్నవాడే ఈ మహర్షి. జ్ఞానంలో, అనుష్ఠానంలో, కులంలో, గుణంలో అన్నిటియందు వేదవ్యాసునికి సమ ఉజ్జీగా ఉండేవాడు. అయినా, అతివినయంతో తన ఉనికి ఇతరులకు తెలియనీకుండా జీవించిన కర్మవీరుడు.

ఋక్‌వేద ప్రవర్తకులైన ఆశ్వలాయనునికి, కాత్యాయనునికి శౌనకుడు ఆచార్యుడు.

అధర్వ వేదంలో కూడ శౌనకుడు దిట్ట. దానికి సంబంధించిన ప్రాతిశాఖ్య(లక్షణ గ్రంథం)ను ఒకదానిని ఈయన వ్రాయడం జరిగింది.

శతపథ బ్రాహ్మణం మొదలగు వేద భాగాలలో అనేకచోట్ల ఈయన చరిత్ర ప్రస్తావించబడివున్నది. 'శౌనక యజ్ఞం' అనే ఒక యజ్ఞం ఈయన పేరుతోనే ప్రసిద్ధి చెందింది.

ఈయన అనుగ్రహించిన 'పాద విధానం' అనే చిన్న పుస్తకం ఋక్ వేదంలోని ఛందస్సుల రహస్యాలను వెలువరించేదిగా ఉంది. ఈయన జీవితకాలంలో అనేక వేలమందికి వేదాన్ని అధ్యయనం చేయించాడు. అదే తమ జీవితలక్ష్యంగా భావించారు. తరువాత కాలంలో వీరి శిష్యులు అధ్యాపకులై శౌనకీయులు, శౌనక పుత్రులు, శౌనకులు అను పేర్లతో ప్రసిద్ధిచెందారు.

సుదీర్ఘమైన వీరి జీవితకాలంలో జరిగిన అనేక సంఘటనలు, కథలుగా పురాణాలలో ప్రసిద్ధిచెందాయి. ఋక్‌వేదము, వీరి ప్రచార ప్రభావంచేత, సాటిలేని గ్రంథాలచేత ఈనాటికి అద్వితీయంగా ప్రకాశిస్తూ లోకక్షేమాన్ని చేకూరుస్తూ ప్రజలకు ఉపకరించుచున్నది.

**ఇంద్రప్రియుడు:**

ఈ మహర్షికి ఇంద్రుడంటే మహాప్రీతి. ఆవిధంగానే ఇంద్రునికి కూడ ఈయనంటే మహాప్రీతి. ఈ కారణంగా ఇంద్రుడు అనేకసార్లు ఈయన వేషాన్ని ధరిస్తుండేవాడట. ఈయనకూడ ఇంద్రుని వేషాన్ని ధరించేవాడట. ఈ సందర్భంగా ఋక్‌వేదంలో ఒక కథ ఇలా చెపుతోంది.

ఒకసారి శౌనకుడు యాగం చేస్తూఉంటే, ఆయన ఆహ్వానాన్ని మన్నించి ఇంద్రుడు యాగశాలకు వచ్చాడట. ఇలా ఇంద్రుడు యాగశాలకు వచ్చినట్లు రాక్షసులకు తెలిసి వారు అతణ్ణి సంహరించాలని అనుకున్నారు. యాగశాలను చుట్టుముట్టారు. ఒంటరిగా శత్రువుల మధ్యలో చిక్కుకున్న ఇంద్రుడు ఎలా తప్పించుకోవడమా అని ఆలోచించాడు. శౌనకమహర్షివలే వేషం మార్చేశాడు. మెల్లగా యాగశాలనుండి బయటకు వచ్చి ఎలాగో స్వర్గలోకం చేరాడు.





# రామాయణంలో రమ్యగాథలు

## సీతాన్వేషణలో అద్భుత కథలు

-చెవుటూరి కుసుమ కుమారి, విజయవాడ.

హనుమంతుని స్వామి భక్తి సంయుక్తమైన మాటను విన్న అంగదుడు ‘‘కేసరినందనా! నీవనుకొనుచున్నట్లు సుగ్రీవునిలో సాధుత్వము, ఋజుత్వము, సాధువర్తనము, ఆత్మశుద్ధత్వము ధైర్యము ఇవి ఏమియు లేవు.

మాతండ్రి వాలి, దుందుంభి బయటకు వచ్చినచో యుద్ధము చేయుమని సుగ్రీవుని గుహబయట వుంచగా, బిలమును రాతితో మూసి తిరిగి వచ్చి రాజుగా చాటుకున్నవాడు, ధర్మానుసారము తల్లివంటి తారను సోదరుని బార్యను పత్నిగా స్వీకరించినవాడు. మహాయశశ్శాలి అయిన రామునితో స్నేహముచేసి చేసిన ఉపకారమును విస్మరించి సీతాన్వేషణ ఉపక్రమించక లక్ష్మణునికి భయపడి సీతాన్వేషణకు గతిలేక మనలను నియోగించినవాడు. అట్టివాడైన ఆ సుగ్రీవునిలో ఎక్కడి ధర్మము?

**“తస్మిన్ పాపే కృతఘ్నేతు స్మృతి హీనే చలాత్మని**
**ఆర్యః కో విశ్వసే జ్జాతు తత్కులీనో విశేషతః”**

ఆ సుగ్రీవుడు పాపాత్ముడు - కృతఘ్నుడు -చంచల మనస్కుడు. అటువంటి వానిని పూజ్యుడెవడూ విశ్వసించడు. అటువంటి వానిని వాని కులముననే పుట్టినవాడెట్లు విశ్వసించగలడు! వానరశ్రేష్ఠా! గుణశ్రేష్ఠుడు అయిననూ గుణహీనుడైననూ స్వపుత్రునే రాజ్యాధికారిగా నియమించవలెనని తలచుట సహజము. కనుక తన పుత్రుడు కాని నన్నెందుకు బ్రతుకనిచ్చును? తప్పక వధించును. లేదా రాజ్యము కొఱకై నన్ను రహస్యముగా బంధించి దండించును. యింతఏల? నావలన అపరాధము జరిగినది. నా ఆలోచనలు కూడా భగ్నమైనవి. నాశక్తి కూడ నశించినది. ఇటువంటి నేను కిష్కింధకు వచ్చి దుర్బలుడనై అనాధునివలె ఎట్లు జీవించగలను? బంధింపబడి దీనుడనై దుఃఖమునూ అనుభవించలేను. కనుక నాకు ప్రాయోపవేశమే ఉత్తమ మార్గము. నేను ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను. ముమ్మాటికీ నాకు మరణమే మేలు. నేను కిష్కింధలో కాలుపెట్టను. వృద్ధులు-శ్రేష్ఠులు అయిన వానరవీరులారా! మీరందరూ మీమీ గృహములకు తరలండి.

మీరు వెళ్ళి బలశాలురైన దాశరధులకు, నా పినతండ్రి, వానరరాజు అయిన సుగ్రీవునకు నమస్కార పూర్వకముగా నేను క్షేమమును అడిగినానని చెప్పుడు. నాతల్లి తారను, మాత రుమను కూడ ఆరోగ్యపూర్వక కుశలమునడిగినానని తెలియచేయుడు. నాతల్లి తారకు మీరే ఓదార్పు కలిగించవలెను. నాతల్లి తార మిక్కిలి జాలి స్వభావము కలది. ఎనలేని పుత్రప్రేమ నాయందు కలది. నేను ఇక్కడ మరణించినట్లు విని ఆమె దీనురాలై తప్పక మరణించును. అయిననూ నాకు వేరు దారిలేదు. అని ఏడ్చుచూ వృద్ధులైన వానరులకు నమస్కరించి దక్షిణాగ్రముగా దర్భలు పరచుకొని ఆచమించి తూర్పు దిక్కునకభిముఖముగా కూర్చొని ప్రాయోపవేశము ప్రారంభించినాడు. మిగిలిన వానరులు కూడా అంగదుని అనుసరించినారు. అందరూ రామ వనవాసము, దశరధుని మరణము, జటాయువు అశువులు బాయుట,

\6/
Mydocuments\
BnAugust o3.p65



దండకావనంలో రాక్షస వధ-సీతాపహరణం వాలివధ వీటన్నిటి గురించి పెద్దపెద్ద పర్వతాల్లా వున్న ఆ వానరులు భయంతో ముచ్చటించుకుంటూ వుండగా, ఆ గుహ ముఖం మార్మోగిపోయింది. ఆ ధ్వని చెవిన పడిన జటాయువు సోదరుడు, అమిత బలవంతుడు, చిరంజీవి అయిన సంపాతి అనే పక్షిరాజు అక్కడికి వచ్చి ప్రాయోపవిష్టులైన ఆ వానరులను చూచి ఎంతో సంతోషించాడు. యింత కాలానికి నాకు ఇంత ఆహారము లభించినది. వీరిలో మరణించిన వారినందరినీ ఒక్కొక్కరుగా భక్షించెదను. పూర్వ కర్మానుసారము కాలము కలశి వచ్చిననే గాని ఇటువంటి అవకాశము లభించదు. అని పలికిన ఆ భయంకర పక్షిమాటను విన్న అంగదుడు మరింత దుఃఖపూరిత మనస్కుడై హనుమతో

చూచితివా! సాక్షాత్తూ యముడు ఈ భయంకర పక్షివంకతో వానరులను చంపవచ్చినాడు. మనమా రామకార్యమును సఫలము చేయలేకపోతిమి. సుగ్రీవ శాసనమునూ పాలించలేకపోతిమి. పైగా ఇప్పుడీ పక్షి బెడద ఒకటి వచ్చిపడినది. అయ్యో తిర్యగ్జంతువులు కూడా రామునకు ప్రియము చేయుచుండగా, మనమేమియూ చేయలేకపోవుచున్నాము కదా! ఆ జటాయువు చూడు ప్రాణములు ఒడ్డి రామునకు ప్రియము కూర్చినాడు. మనము కూడ ప్రాణములకు తెగించి అడవులబడి తిరిగినాము. అయిననూ రామపత్నిని కనుగొనలేకపోయినాము. చేసిన ప్రయత్నము అంతయు నిష్ఫలమైనది. ఆ రావణునితో యుద్ధముచేసి అశువులు బాసిననూ ఆ జటాయువు ధన్యజీవి. శ్రీరామచంద్రుని చేతులమీదుగా ఉత్తమగతిని పొందినాడు. ఇంతకూ ఈ సమస్త సంకటములకూ మూలకారణము ఆ దశరధ మహారాజు భార్య కైకేయికిచ్చిన వరదానమే కదా! అని చెప్పుకొనుచున్న ప్రాయోపవిష్టులైన వానరుల మాటలువిన్న సంపాతికి దుఃఖము భయము ముప్పిరిగొన్నవి. వాడి అయిన పెద్ద ముక్కుతో, గొప్ప ధ్వని కలిగిన ఆ సంపాతి

**“కోఽయం గిరా ఘోషయతి ప్రాణైః ప్రియతరస్య మే**
**జటాయుషో వధం భ్రాతుః కమ్ప యన్నివ మేమనః”**

నాకు ప్రాణముకన్న మిన్న అయిన నా సోదరుడు జటాయువు మరణము గురించి నా మనస్సు వణికిపోవునట్లు చెప్పుచున్న వారెవరు? జనస్థానమున జటాయువుకు రాక్షసులకు రణము ఏల జరిగినది. అయ్యో! ఇన్ని రోజుల తరువాత నా సోదరుని పేరు ఈవిధముగా వినుచున్నాను. కదా! యింత కాలము తరువాత మీరు నా తమ్ముని గొప్ప గుణములను శ్లాఘించుటచేత ఎంతో సంతోషించినాను. గురుజన ప్రియుడైన రాముని తండ్రి దశరధ మహారాజు యశో విశాలుడు. నా సోదరునికి ప్రాణ మిత్రుడు. ఆ దశరధుడేల దివికేగినాడు? ఆ జనస్థానమున నివశించే నా సోదరుడు ఎట్లు సద్గతి నొందినాడు. ఈ విషయములు వినవలెనని నామనసెంతో త్వరపడుచున్నది. నా రెక్కలు సూర్యకిరణ జ్వాలచేత కాలిపోవుటచేత నేను కదలజాలకున్నాను. మహాబలశాలులైన వానరశ్రేష్ఠులారా! నన్ను ఈ గిరి శిఖరము నుండి క్రిందికి దింపుడని కోరుచున్నాను. అని శోకగద్గద కంఠముతో వేడుకొనిననూ, సంపాతి యొక్క భయంకరాకారమును చూచి వెంటనే క్రిందకు దించక మిన్నకున్నారు. కాని కొంతవడికి వానర నాయకులందరూ ఈ విధముగా చింతన చేసినారు.

# శ్రీవిష్ణు మహాపురాణము

## సప్తమాధ్యాయం

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, కొవ్వూరు.



ఇక పదకొండు మంది సులోచనలైన పుత్రికలను (**Brighty**) **Younger Dauthters**) కూడా పరాశరుడు ఇలా నిర్దేశించాడు.

**ఖ్యాతి స్సత్యథ సంభూతిః స్మృతిః ప్రీతిః క్షమాతథా।**
**సన్నతిశ్చాన సూయాచ, ఊర్జా, స్వాహా, స్వధాతథా॥**

అని **ఖ్యాతి** - **Elebrity**; **సతి** -**Truth**; **సంభూతి**-**Fitness**; **స్మృతి**-**Memory**; **ప్రీతి** - **Affection**; **క్షమ**- **Patience**; **సన్నతి**- **Humility**; **అనసూయ** -**Charity**; **ఊర్జ**- **Energy**; **స్వాహా**- **Offring**; (నిర్మలంగా దైవానికి సమర్పించడమనే భావన) **స్వధ** - **Oblasiar**; అనేవి కూడా జీవునికి ఉండవలసిన ఉత్తమ లక్షణాలేనని మనం గుర్తించాలి.

ఖ్యాత్యాది కన్యకలను భృగువు మొదలైన మునులు తమపత్నులుగా గ్రహించారు. 'శ్రద్ధ' మొదలైన పదు నలుగ్గురు కన్యలను ధర్మప్రజాపతి తన పత్నులుగా స్వీకరించాడని చెప్పుకున్నాం. వారికి ధర్మ ప్రజాపతి మూలంగా కలిగిన సంతానం, వారి పేర్లను కూడా చాలా సముచితంగా పరాశరుడు సూచించాడు.

**శ్రద్ధ** - కామునికన్నది (ఏదైనా విషయ మందు శ్రద్ధ ఉన్నప్పుడు దానిపట్ల కోరిక మిక్కుటమవడం సహజం కదా).

**లక్ష్మి** - దర్పుణ్ణి కన్నది. (లక్ష్మి ఉన్నచోట అంతే ఉత్తమ లక్షణాలున్న చోట కొంత గర్వం కూడా తప్పకుండ ఉంటుంది.).

**ధృతి** - నియముణ్ణి కన్నది (ధృతి లేదా ధైర్యం స్థిరంగా ఉండాలంటే నియమం తప్ప దన్నమాట).

**తుష్టి** - సంతోషుణ్ణి కన్నది. ఎక్కడ తుష్టి (**Content revert**) ఉన్నదో అక్కడ సంతోషం (**Plearness**) ఉంటుంది.)

ఇక **పుష్టి** - అనే పడతి లోభుణ్ణి కన్నదట. (ఏదైనా ఒక విశేష లక్షణం అతిశయంగా ఉన్నప్పుడు, దాన్ని పెంచుకోవాలనే అత్యాశ, తన్మూలంగా లోభం ఎక్కువౌతుంది.)

మేధావి శ్రుతుణ్ణి కన్నది. (శాస్త్ర వివేకం మేధా సంపదయొక్క ఫలమే)

ఇక, **క్రియ** - దండుణ్ణి కన్నది. (క్రియ ఉన్నచోట దాన్ని నియమించే దండంకూడా తప్పదుకదా!) ఈ క్రియయే నయ- వినయాలనుకూడా సంతానంగా పొందింది. క్రియదగ్గరే నియమనోపయోగియైన దండం - నయ వినయాలు ఉంటాయన్నమాట.)

**బుద్ధి** - బోధుణ్ణి కన్నది. బోధ అంటే జ్ఞానం. బుద్ధి వల్ల కలిగేది నిశ్చయాత్మకజ్ఞానం.

ఇక, **లజ్జ** - వినయుణ్ణి కన్నది. లజ్జ అనే ఒక చక్కని గుణం. ఎంత గొప్ప పనిచేసినా తన గొప్పతనమేదీ అందులో లేదు అని భావింపగల వినమ్ర భావాన్ని లజ్జా మూలంగా సిగ్గుపడే లక్షణంచేత మానవుడు పొందగలుగుతాడు.

ఇక, **వపుః** - (శరీరం) వ్యవసాయుణ్ణి కన్నది. (వ్యవసాయం అంటే పనిలోఉద్యమించడం. శరీరం ఉన్నందుకు ఫలం క్రియోద్యోగమే కదా.)

ఇక, **శాన్తి**- క్షమాన్ని కన్నది. (ఇది





సహజవేం. శాన్తి ఉన్నచోటే క్షమా ఉంటుంది.)

**సిద్ధి** - సుఖాన్ని కన్నది. (సిద్ధివలన కలిగేది సుఖమే)

ఇక, **కీర్తి** - అనే ఆమె యశస్సును కన్నదట. కీర్తి యశస్సులు ఒకటే అయినా శబ్దగతమైన లింగ భేదంచేత భేదాన్ని చూడడం జరిగింది.

ఇవన్నీ ధర్మ ప్రజాపతి సంతానమే. దీన్నిబట్టి ధర్మబద్ధంగా బ్రతికే జీవునికి శ్రద్ధాదుల ద్వారా కామాదులు కలుగుతా యన్నమాట. ధర్మమూలమైన కామ దర్పాదులు కూడా స్పృహణీయాలే.

**కాముడు** - తనపత్నియైన 'నంది' ద్వారా 'హర్షుడనే పుత్రుణ్ణి పొందాడు.

**అధర్మానికి** - హింసయే భార్య 'తన్మూలంగా' **'అనృత'** నామకుడైన సంతానాన్ని ఆతడు పొందాడు. అధర్మంతో అనుబద్ధమైందే హింసా ప్రవృత్తి. అది ఉన్నచోట అనృతం (అసత్యం) ఉండితీరుతుంది.

ఇక, **'నికృతి'** అనే కన్యక - (నికృతి అంటే అపకారం అని అర్థం)కూడా అధర్మునికి కలిగింది. ఈ కన్య (నికృతి) ద్వారా భయ- నరక నామక సంతాన ద్వయం కలిగింది. అంటే అధర్మం - పరాపకార సాధకమైనప్పుడు, భయము, చివరికి నరకము తప్పదన్నమాట.

భయుని భార్య మాయ. భయ స్వభావుడు పరావమానానికి పాల్పడతాడు. ఇక 'నరక' నామకుడైన అధర్మ పౌత్రుడు 'వేదన' ను భార్యగా స్వీకరించాడు. నరకానికి వేదనకు అవినాభావం కదా. భయయొక్క సంతానమే మృత్యువు. ఇదే సర్వప్రాణి వినాశకం. వేదనకు దుఃఖమే పుత్రుడు. వీడి తండ్రి రౌరవ నరకుడే. మృత్యువుకు సంతానాలే వ్యాధి. జర (ముసలితనం) శోకం (దుఃఖం) తృష్ణ (లోభం) క్రోధం (మితిమీరిన కోపం) 'అధర్మ' వంశంలో పుట్టిన ఈ వ్యాధ్యాధుల న్నింటికీ భార్యలు లేరు. ఇవన్నీ పరమాత్మ అయిన శ్రీమన్నారాయణుడు ప్రళయాన్ని సాధించ దలచినప్పుడు దానికి ఉపకరిస్తాయి. అందువల్ల ఇవన్నీ వైష్ణవ రూపాలే నంటుంది విష్ణుపురాణం.

**రౌద్రాణి తాని రూపాణి విష్ణోః మునివరాత్మజ।**
**నిత్య ప్రళయహేతుత్వం జగతోஉస్య ప్రయాన్తి వై॥**

### ప్రజాపాలకులు - స్థితి కారకులు

దక్షుడు,మరీచి, అత్రి, భృగువు మొదలైన వారంతా ప్రజాపాలకులు. వీరే **'ప్రజాపతులు'** గా వ్యవహరింపబడతారు. వీరంతా నిత్య సృష్టికి కారకులు. ఇక, మనువు, ఆతని పుత్రులు. వీర్య ధనులైన ప్రభువులు, సన్మార్గ నిష్ఠులై శౌర్యపరాక్రమాలతో స్థితి'కి కారణం అవుతూ ఉంటారు.



## పరమపదము

**శ్రీమతి మాడభూషి జానకీదేవి** గారు, మాడభూషి ద్వారకానాథ్ గారి సతీమణి ది. **6-6-2003** నాడు, ఆచార్య తిరువడి చేరినారు.

వీరు భక్తినివేదనకు చిరపరిచితులు. బదరీలో నిత్యాన్నదాన వగైరాలకు ధనము సమర్పించినారు.



# భగవద్రామానుజ చరిత్ర

శ్రీమతి టి.కె. చూడామణి, విజయవాడ



## అత్ర ద్వయమ్.

పితరం మాతరం దారాన్ పుత్రాన్ బన్ధూన్ సఖీన్ గురూన్ ।
రత్నాని ధనధాన్యాని క్షేత్రాణి చ గృహాణి చ ॥

సర్వధర్మాంశ్చ సన్త్యజ్య సర్వకామాంశ్చ సాక్షరాన్ ।
లోకవిక్రాన్త చరణౌ శరణం తేఽవ్రజం విభో! ॥

త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బన్ధుశ్చ గురుస్త్వమేవ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ॥

పితాఽసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్।
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమ ప్రభావ॥

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ ॥

మనోవాక్కాయై రనాదికాల ప్రవృత్త, అనన్తాకృత్యకరణ కృత్యాకరణ భగవదపచార భాగవతాపచార, అసహ్యాపచారరూప నానావిధా నన్తాపచారాన్, ఆరబ్ధకార్యాన్, అనారబ్ధకార్యాన్, కృతాన్, క్రియమాణాన్ కరిష్యమాణాంశ్చ సర్వానశేషతః క్షమస్వ॥ అనాదికాలప్రవృత్త విపరీతజ్ఞాన మాత్మవిషయం, కృత్స్న జగద్విషయఞ్చ,





విపరీతవృత్తఞ్చ, అశేషవిషయ మద్యాపి వర్తమానం, వర్తిష్యమాణఞ్చ సర్వం క్షమస్వ॥ మదీయానాది కర్మప్రవాహ ప్రవృత్తాం, భగవత్స్వరూప తిరోధానకరీం, విపరీతజ్ఞానజననీం, స్వవిషయాయాశ్చ భోగ్యబుద్ధేర్జననీం, దేహేన్ద్రియత్వేన భోగ్యత్వేన సూక్ష్మరూపేణ చావస్థితాం, దైవీం గుణమయీం మాయాం, దాసభూతం శరణాగతోఽస్మి తవాఽస్మి దాసః ఇతి వక్తారం మాం తారయ॥

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః ॥

ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।
ఆస్థిత స్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ ॥

బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే

వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః
ఇతి శ్లోకత్రయోదిత జ్ఞానినం మాం కురుష్వ,

పురుషస్స పరః పార్థ! భక్త్యా లభ్యస్త్వనన్యయా ।
భక్త్యా త్వనన్యయా శక్యః - మద్భక్తిం లభతే పరామ్ ॥

ఇతి స్థానత్రయోదిత పరభక్తి యుక్తం మాం కురుష్వ, పరభక్తి పరజ్ఞాన పరమభక్త్యేకస్వభావం మాం కురుష్వ, పరభక్తి పరజ్ఞాన పరమభక్తి కృత పరిపూర్ణానవరత, నిత్యవిశదతమానన్య, ప్రయోజనానవధి కాతిశయ, ప్రియ భగవదనుభవోఽహం, తథావిధ భగవదనుభవజనితా నవధికాతిశయ ప్రీతికారితా శేషావస్థోచితాశేష, శేషతైకరతి రూపనిత్య కిఙ్కరో భవాని. ॥





# మహాభారతం - ఆర్థిక వ్యవస్థ

రచయిత డా॥ పి. జ్యోతి, వరంగల్.

ఆది సభారణ్య పర్వాలు, ధర్మాన్ని; విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలు అర్థాన్ని; అనుశాసనిక పర్వం కామమోక్షాలను ప్రతిపాదిస్తాయని మహాభార తానికి వ్యాఖ్యానం వ్రాసిన నీలకంఠుల వారి అభిప్రాయం. "భారతః పంచమోవేదః" అని ప్రశస్తి. ప్రభు సమ్మితాలైన వేదాల సారాన్ని వ్యాసుడు మహాభారతంలో నిక్షేపించినాడు.

**ధర్మేచార్థేచ కామేచ, మోక్షేచ భరతర్షభ,**
**యది హాస్తితదన్యత్ర, యన్నే హాస్తిన తత్క్వచిత్ ॥**

మానవులందరికీ అత్యంత ఆవశ్యకమైన ధర్మార్థ కామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాలను మహాభారతం బోధిస్తుంది. భారతంలో లేనిదేమీలేదు. ఇందులో లేని అంశం ప్రపంచంలోలేదు. ప్రపంచంలో ఉన్నవి ఉండేవి అన్నీ దీనిలో ఉన్నాయి. అయితే కాలాన్ని బట్టి వ్యక్తులనుబట్టి ధర్మాలు మారినా సనాతన ధర్మమనేది ఎప్పటికీ నిలిచే ఉంటుంది. దాని అనువర్తనం భారతంలో భిన్న భిన్న పార్శ్వాలలో కనిపిస్తుంది. "ధర్మంబు బహుమార్గ దృష్టంబయి సూక్ష్మంబయి యుండు"నని మహాభారతం (భార. అర. చేతు. వ. 25) చెప్పింది.

మహాభారతేతివృత్తంలో కీలకభాగం కురుపాండవ రాజ్యాధికార సమస్య సంస్కృత భారతం (ఆదిపర్వం) ధృతరాష్ట్రుడు అంధతవల్ల, విదురుడు పారవశవత్వంవల్ల రాజ్యానికి అనర్హులైనారని పాండురాజే రాజైనాడని చెప్పింది.

ధృతరాష్ట్రుని జన్మ సందర్భములో వ్యాసునితో సత్యవతి అంధుడు ప్రభువు కాదగినవాడు కాదు కనుక వంశవర్ధనుని, కురువంశానికి రాజు కాదగినవానిని మరొకరిని ప్రసాదింపుమని అడిగింది.

**నాథః కురూణాం నృపతి రనురూపస్తపోధనః**
**జ్ఞాతి వంశస్య గోప్తారం పితౄణాం వంశవర్ధనమ్**
**ద్వితీయం కురువంశస్య రాజానం దాతుమర్హసి**

సం. మహా. ఆది 106

అంతేకాని పాండురాజు రాజ్యార్హుడు కాదని ఆమె భావం కాదు. సంస్కృత భారతంలో శ్రీకృష్ణ రాయబార సభలో ధృతరాష్ట్రుని అంధతను, రాజ్యానర్హతను వివరించి కురురాజ్యానికి అధికారి పాండురాజేనని, పాండవులకు అర్ధరాజ్య మిమ్మని హితోక్తులు పలుకుతాడు. ద్రోణాచార్యులు, గాంధారీ ధృతరాష్ట్రులు పాండురాజుదే రాజ్యమని, అది పాండవులకు పితృ పితామహక్రమాగతమే కాక, పుత్ర పౌత్రానుగామి కూడా అవుతుందని దుర్యోధనునితో చెపుతారు. కర్ణుడు కూడా ద్రుపద పురోహితుని రాయబార సందర్భంలో రాజ్యం పాండవులకు చెందినదేనని పైతృకమని చెపుతాడు.

ధృతరాష్ట్రుడు ధర్మరాజుకు యౌవ రాజ్యాభిషేకం చేయ సంకల్పించినపుడు దుర్యోధనుడు తండ్రి దగ్గరకు వెళ్ళి తన దుఃఖాన్ని ఈ విధంగా వ్యక్తం చేసినాడు. తండ్రి నుండి సంక్రమించిన రాజ్యానికి నీవు పుట్టంధుడవు కావడం వల్ల అధికారివి కాలేకపోయినావు. రాజ్యాన్ని పాండురాజు పాలించడం వల్ల అతని కుమారుడైన ధర్మరాజు రాజై రాజ్యభారాన్ని వహిస్తాడు. ఆ తరువాత ధర్మరాజు కుమారుడు రాజవుతాడు. క్రమంగా రాజ్యపాలనకు పాండురాజు వంశంవారే అర్హులవుతారు. మేము పుత్ర పౌత్ర పర్యంతం ఇతరులను ప్రేమించి, ఉదరపోషణం చేసుకోలేము. పాండురాజు రాజై తనపాలనలో ప్రజల అనురాగం చూరగొన్నాడు కనుక సకల ప్రజలు ధర్మరాజు రాజ్యాన్నే కోరుతారు. అది తెలిసే నేను నిత్యం దానధర్మాలతో ప్రజలకు సంతోషాన్ని కలిగిస్తున్నాను.





దుష్టజనుల పక్షపాతపు మాటలు మానిపోయేంత వరకు నీవు కుంతిని, పాండవులను వారణావతానికి పంపుమని తండ్రిని వేడి చివరకు ధృతరాష్ట్రుని అంగీకరింపచేసినాడు. రాజు అధర్మవర్తనుడైనపుడు ప్రజలు వానిని తొలగించే రాజ్యాంగ పద్ధతి నాడున్నట్లు తెలుస్తున్నది. ధృతరాష్ట్రుడు అరణ్యాలకు వెళ్ళేటప్పుడు ప్రజల అనుమతి తీసుకున్నాడు. వారిని ఒప్పించి వానప్రస్థాశ్రమం స్వీకరించినాడు. లాక్షాగృహం నుండి పాండవులు సజీవులై బయట పడినందుకు గ్రామాలలోని ప్రజలు, నగర ప్రజలు యావత్ప్రజానీకమూ సంతోషిస్తున్నారని, అటువంటి ప్రజలకు ప్రియాన్ని చేకూర్చడమే మనవిధి అని విదురుడు దుర్యోధనునితో అంటాడు. దుర్యోధనుడు రాజ్యం అవిభాజ్యమని భావించినప్పటికి పాండవులకు అర్ధరాజ్యమివ్వక తప్పలేదు.

పాండవులు అరణ్యవాసాన్ని, అజ్ఞాత వాసాన్ని పూర్తిచేసి తమ అర్ధరాజ్యాన్ని కోరినపుడు ఏక ఛత్రాధిపత్య సంప్రదాయాన్ని స్థాపించాలనే ఆకాంక్ష దుర్యోధనుడు రాజ్యం అవిభాజ్యమని, జ్యేష్ఠుడే సర్వాధికారి అని చెపుతాడు. కాని పాండవులు తండ్రి భాగాన్ని మాత్రమే వాంఛించారు. ధృతరాష్ట్రునికి రాజ్యార్హత లేని కారణంగా తమ తండ్రే రాజ్యాన్ని పాలించినప్పటికి తమకు ఏకచ్ఛత్రాధిపత్యాన్ని వారు కోరలేదు. అర్ధరాజ్యాన్నే కాంక్షించి భ్రాతృ సమజీవనమనే న్యాయాన్ని ప్రతిపాదించారు.

కౌరవ పాండవుల మధ్య ఏర్పడిన రాజ్యాధికార వివాదానికి పూర్వం ధర్మశాస్త్ర విధానాలు ఎన్నో రూపాలు పొందుతూ వచ్చాయి. ఆదిపర్వంలో ఒక ఉపాఖ్యానంలో గరుత్మంతుడు తల్లి దాస్యం నివృత్తి చేయడానికి అమృతంకోసం వెళుతూ తన తండ్రి కశ్యపుని తనకు కలిగిన క్షుద్బాధ నివారణకు ఉపాయం చెప్పమంటాడు. కశ్యపుడు అతనితో ఒకచోట ఘోర సంగ్రామం సలుపుతున్న గజకచ్ఛపాలను ఆహారంగా స్వీకరించమంటాడు. వాటికి పూర్వవైరం ఎందుకున్నదో వివరిస్తాడు.

విభావసుడనే వాడికి తండ్రి నుండి సంక్రమించిన ఆస్తిలో తనకు భాగమిమ్మని అతని తమ్ముడు సుప్రతీకుడు అడుగగా, అది ధర్మవ్యతిరేకమని కోపించి తమ్మునితో ఏనుగవుకమ్మని శపిస్తాడు. దానికి బదులుగా సుప్రతీకుడు నీవు ధనలోభం వల్ల ఆ విధంగా ప్రవర్తిస్తున్నావని కూర్మం కమ్మని అన్నకు శాపమిస్తాడు. ఈ ఉపాఖ్యానం వల్ల కౌరవ పాండవుల రాజ్య వివాదానికి పూర్వమే ఇటువంటి ధర్మప్రస్తావన జరిగినట్లుగా తెలుస్తున్నది. శంతనుని కాలం వరకు కూడ జ్యేష్ఠాధికారమే ధర్మంగా ప్రవర్తిల్లిందని భీష్మ ప్రతిజ్ఞ చెపుతున్నది. కాని అందుకు పూర్వమున్న యయాతి కాలంలో పూరూరవుడు అతనికి జ్యేష్ఠపుత్రుడు కాకపోయినా అతనికి రాజ్యాన్ని ఇచ్చినాడు.

**తనయుడు తల్లిదండ్రులు**
**పనిచిన పనిసేయడేని బలుకెదలో జే**
**కొసడేని వాడు తనయుం**
**డనంబడునే పితృధనమున కర్హుండగునే !**

(ఆది-3-199)

అన్న మాటలనుబట్టి ఏ రకంగా చూసినా తనకిష్టులైన వారికి రాజ్యాన్ని ఇచ్చే అధికారం రాజుకు (తండ్రికి) ఉంటుందనడంలో సందేహం లేదు. మను ధర్మశాస్త్రం కూడా తండ్రి తదనంతరం ఆస్తి పెద్దకుమారునికే సంక్రమిస్తుందని, వాడినే మిగతా సోదరులు అనుసరించి ఉండాలని చెప్పింది. యాజ్ఞవల్క్యస్మృతి పుత్రులందరూ ఆస్తి పంచుకోవాలని, పెద్దవాడికి కొంత అధికంగా ఇవ్వాలని చెప్పింది. నారద బృహస్పతి స్మృతులలో అన్నదమ్ములంతా సమానంగానే ఆస్తికి హక్కుదారులని పేర్కొనబడింది. కురు పాండవ దాయభాగ వివాద కాలంనాటికి పాండవులకే రాజ్యాధికారం ఉందని భీష్ముడు మొదలైనవారు ఉద్ఘాటించినప్పటికి దుర్యోధనాదులు పాండవుల దాయభాగాన్ని తిరస్కరించారు. అందుకే యుద్ధం

ఆవశ్యకమైంది. ఈ సంఘటనలు సమాజంలోని ఆస్తి విభాగ నీతిశాస్త్రాల ఆవిష్కారాలకు కారణాలైనాయి. కురుక్షేత్ర యుద్ధం తరువాతనే నారద బృహస్పతి స్మృతులు అవతరించి పాండవులు సాధించిన ధర్మానికి సుస్థిర స్థితిని కల్పించాయి. రాజ్యావిర్భావం గురించి, రాజ్యాంగ యంత్రం గురించి, రాజనీతి శాస్త్రజ్ఞులు ప్రాచీన కాలంలో ఎన్నో సిద్ధాంతాలు ప్రతిపాదించారు. రాజ్యం సప్తాంగాలతో వర్ధిల్లాలని ఆంధ్ర మహాభారతం పేర్కొన్నది. "స్వామ్యమాత్య జనపదకోశ సైన్యమిత్ర దుర్గంబులను రాజ్యాంగ సప్తకంబు గన్నిడి యరయవలయునది" అని భారతం (శాం-2-వ, 285) చెపుతున్నది. అంతేకాక మనుస్మృతి, కౌటల్యుని అర్ధశాస్త్రం, యాజ్ఞవల్క్యస్మృతి, విష్ణుధర్మసూత్రం, గౌతమస్మృతి-సరస్వతీ విలాసం, శుక్రనీతిసారం మొదలైనవన్నీ రాజ్యం సప్తాంగ సంయుతమని, రాజ్య నిర్వహణలో ఇవి సమప్రాధాన్యాన్ని కలిగి ఉంటాయని చెప్తున్నాయి. కోశం గురించి మనుస్మృతి ఈక్రింది విధంగా పేర్కొంటున్నది.

**అమాత్యేదండ అయత్తౌ దండే వైనయికీ క్రియా !**
**నృపతౌ కోశ రాష్ట్రేచ దూతే సంధి విపర్యయౌ!!**

రాజ్య సంరక్షణ, సామ్రాజ్య విస్తరణ, వర్తక వాణిజ్యాల అభివృద్ధి, దుర్భిక్ష నివారణలు కోశం మీదనే ఆధారపడి ఉంటాయి. కోశం రాష్ట్రానికి గుండె లాంటిది. కోశం ఖాళీగా ఉన్నప్పుడు యుద్ధంలాంటి ఉపద్రవాలు ముంచుకొనివస్తే అధర్మ మార్గాల ద్వారానైనా రాజు ద్రవ్యాన్ని సేకరించాలని, వివిధ పద్ధతులవల్ల కోశాన్ని నింపుకోవాలని కౌటిల్యుడు పేర్కొన్నాడు. సమకాలీన ధర్మసూత్రాల అనుసరణకంటే, రాజ్య భద్రతయే ప్రధాన లక్ష్యమని దానికొరకు ధర్మోల్లంఘనం జరిగినా జరుగవచ్చని దైనందిన పరిపాలనా నిర్వహణలో అటువంటి ఉల్లంఘనలు అనివార్యమని అన్నాడు.







# సందేహాలు - సమాధానాలు

జులై నెల తరువాతి భాగము

**ప్ర. ఉల్లి, వెల్లుల్లి, గోంగూర, ఆనప వంటి కాయకూరలు, బంగాళదుంప, టొమాటో, కొత్తిమీర, బీర, దొండ, కేరట్, పుదీనా, చుక్కకూర, రాగులు, జొన్నలు.... ఇలా చాలా తినవద్దంటున్నారు. ఇక తినదగినవేమి? మానవలసినవైనా సరిగ్గా చెప్పండి.**

జ. సత్త్వాన్ని పెంచేవన్నీ తినవచ్చు. రజోగుణాన్ని, తమోగుణాన్ని పెంచేవన్నీ దూరంగ పెడతాం. ఇది సాత్వికంగ పెరగాలనే కోరికకలవారి కోసం చెప్పిన నియమం సుమా! మీరు వ్రాసినట్టు, ఉల్లి, వెల్లుల్లి, సొర, గోంగూర, దొండ, క్యారెట్, తినరాదు. మీరు వ్రాసిన వాటిల్లో మిగిలినవి ఆక్షేపణీయాలు కావు. తినవచ్చు.

ప్ర. తిన్నది బాగ అరగడానికి, బద్ధకం లేకుండటానికి ఏం చేయాలి?

జ. శ్రమించి పని చేయాలి. ఇది మొదటి నియమం. సులభంగ అరిగే ఆకుకూరలు, పప్పదినుసులూ ఆహారంగ తినాలి. ఉన్నత లక్ష్యం కలిగి, పెద్దల ఛాయలో ఉన్నంత వరకూ మంచి ఆరోగ్యంతో ప్రగతి పథంలో సాగగలుగుతాం.

శ్రీ డి. రామసుబ్రహ్మణ్యం,

**ప్ర. నాకు 80 సం॥రాలు. సమాశ్రయణం అయ్యాను. బ్రాహ్మణుడను. అష్టాక్షరీ చేస్తున్నాను. గాయత్రీ కూడ చేయాలా?**

జ. శారీరక ధర్మం ప్రకారం ఉపనయనం కాగానే యిచ్చిన గాయత్రీ మంత్రం వదలరాదు. ఆత్మధర్మం ప్రకారం లభించినది అష్టాక్షరీ మంత్రం. రెండూ కలిపి మీరు చేసుకోవాలి. గాయత్రికి చివర అష్టాక్షరీని జోడించి జపించాలి. ఇది సంధ్యావందనం చేసేటపుడు. అయిపోయాక మీకు ఓపిక ఉంటే అష్టాక్షరీ మంత్రాన్ని విడిగా ఎంతసేపైనా జపించవచ్చు. అపుడు గాయత్రీ అవసరంలేదు.

శ్రీ ఆర్. నరసింహస్వామి, సికిందరాబాదు

**ప్ర. క్షేత్రాలలో జుట్టు సమర్పిస్తే, మాతాపితరులు చనిపోయినపుడు జుట్టు తీసేటపుడుపూర్తి గుండు చేయించుకోవాలా? పిలక ఉంచాలా?**

జ. జుట్టు ఎపుడు తీసినా శిఖాస్థానంలోని జుట్టును తొలగించరాదు. అది వదిలి వేసే మిగిలిన జుట్టు అర్పించాలి, పురుషులు. స్త్రీలైతే జుట్టు తొలగించడం శాస్త్రవిరుద్ధం. జుట్టునిస్తామని మ్రొక్కుకోవడం గూడ ఓ దోషమే. అదోరకమైన వ్యాపారం గద!

శ్రీ బి.వి. చలపతిరావు, ఒంగోలు.

ప్ర. **'మనం' మాయలో ఎప్పుడు చిక్కామో చెప్పలేం. మాయలో పుట్టిన మనసు ఈ రహస్యాన్ని ఎన్నటికీ ఛేదించజాలదు. అని ఓ పుస్తకంలో చదివాను. మన ప్రామాణికగ్రంథాలు ఏమంటున్నాయి ఈ విషయంలో?**

జ. 'మాయ' అంటే ప్రకృతి అని ఉపనిషత్తు చెప్తోంది. మన మనస్సు ఆ ప్రకృతికి చెందినదనేది వాస్తవం. స్వప్రయత్నంతో ఈ మాయలోంచి బయటపడటం అసంభవమనే దాంట్లో సందేహమేలేదు. అందుకే భగవద్గీత 7వ అధ్యాయంలో "మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే" అని చెప్పాడు శ్రీకృష్ణుడు. సదాచార్యుని ద్వారా శ్రీమహావిష్ణు సమాశ్రయణం పొందితే మాత్రమే, ఈ మాయనుండి బయటపడగలుగుతారని గీతాచార్యుని నిర్ణయం. ఈ విషయాన్ని శాస్త్రగ్రంథాలన్నీ సమర్థిస్తాయి.

శ్రీ ఎమ్ఎల్ఎన్ రావు, హైదరాబాద్

ప్ర. **శ్రీవిష్ణు అష్టోత్తరము అన్ని అవతారాలకూ ముందుంది కదా! అందులో రామ, కృష్ణాది అవతార నామాలు ఎందుకున్నాయి? ఈ స్తోత్రం అవతారాల తర్వాతిదా?**

జ. పురాణాలలోంచి ఈ అష్టోత్తరాలు, సహస్రనామ స్తోత్రాలను ఉద్ధరిస్తారు. పురాణాలను రచించినవాడు శ్రీవేదవ్యాసబాదరాయణ మహర్షి. ఆయన సమయానికి చాల అవతారాలు ఏర్పడి ఉన్నాయి కనుక వారి వారిని స్తుతించేటపుడు ఏ అవతరాలకి చెందిన నామాలైనా ఉండచ్చు. అదికాక ఆయా పేర్లు అవతారాలవరకే పరిమితమవ్వాలని, అవతారం తర్వాతే ఆ పేరు ఏర్పడిందనేదిలేదు. 'రామ'అంటే అందరినీ ఆనందింప చేయువాడు, 'కృష్ణ' అంటే నిరతిశయానంద ప్రదుడు అని అర్థం. ఇలా ప్రతి నామానికీ యోగికార్థాన్ని అంటే ఆ నామంలోని శబ్దాలను, ధాతువులను బట్టి అర్థం చెప్పకొంటే అన్ని నామాలు అన్ని అవతారాలకీ వాడవచ్చు. అదలా ఉంచి, ప్రతీ మన్వంతరంలోనూ ఈ అవతారాలుంటాయి కనుక ప్రాచీన మన్వంతరాలలోని శ్రీవిష్ణులీలలను స్మరించి ఋషులు కీర్తించి ఉండవచ్చు.

శ్రీ ఆర్.వి. సుబ్బారావు, బాపట్ల

ప్ర. **శ్రీపాదతీర్థం ఎన్నిసార్లు, ఏం చదువుతూ తీసుకోవాలి? చరమశ్లోకం ఎలా ఎన్నిసార్లు జపించాలి?**

జ. ఆచార్య శ్రీపాద తీర్థాన్ని సమాశ్రితులు రెండుసార్లు ఆచార్యులను స్మరింప చేసే శ్లోకాలను చదువుకొంటూ తీస్కోవాలి. చరమశ్లోకం ఒక్కసారి జపించితే చాలు. కాని దాని అర్థం మాత్రం అనుక్షణమూ స్మరించుకోవడం అవసరం. ఏ పని మనం చేస్తున్నా అదీ భగవంతుడు ఇచ్చిన శక్తితో మాత్రమే జరుగుతోంది కనుక, ఫలితాన్ని ఆతని శ్రీపాదాలవద్దే సమర్పిస్తున్నా. దీని లాభనష్టాలతో నాకేమీ సంబంధంలేదు. నీ దయ అని విశ్వాసంతో భగవదర్పణబుద్ధితో జీవితాన్ని సాగించడమే కదా చరమశ్లోక తాత్పర్యం. అలాంటి వారి బాధ్యత తానే వహిస్తానని ప్రతిజ్ఞ చేసారు. అదే ఆతనికి జ్ఞాపకం చేస్తూంటామన్నమాట.












# బదరికాశ్రమంలో పునర్నిర్మించే సత్సంగసదనమునకు విరాళాలు సమర్పించిన దాతలు

**శ్రీమాన్ డా॥ మురళీకృష్ణ గారి ద్వారా**

**రాజపోషకులు:**

శ్రీమాన్ ఎమ్. శ్రీనివాసులరెడ్డి, మద్రాసె
వికాసతరంగిణి, ఖమ్మం.
శ్రీమాన్ ప్రమీలా ఆనంద్ చెన్నై

**జీవిత సభ్యులు:**

శ్రీమాన్ దాసరి జగన్నాథం హనుమకొండ. శ్రీమాన్ డా॥. జి.రాజారామ్. శ్రీమాన్ ఎన్. రమణా సత్యనారాయణరెడ్డి, వరంగల్. శ్రీమాన్ గండే గోవిందరాజులు, వరంగల్. శ్రీమాన్ ఒ.జయరాజేశ్వరరావు,హనుమకొండ. శ్రీమాన్ పి. నాగేశ్వర రావు,ఖమ్మం. శ్రీమాన్ ఒ.లక్ష్మీ నారాయణ,వరంగల్.

శ్రీమతి వై. సరోజినీ మదుసూధనరావు, చెన్నై శ్రీమతి వి. మంగతాయారు & సన్స్ చెన్నై, శ్రీమతి ప్రతిమా చెన్నై, శ్రీమాన్ కె. రామచంద్రారెడ్డి కోడంబాకం, శ్రీమతి పి అనూరాధ నెల్లూరు, శ్రీమాన్ కె. ధర్మారావు నెల్లూరు, శ్రీమాన్ కె. సూర్యనారాయణ మిర్యాలగూడెం, శ్రీమతి వి. వైదేహి నెల్లూరు, శ్రీమాన్ సి.హెచ్. రఘు, నిఖిల్, మద్రాస్, శ్రీమాన్ ఎన్. గోవిందస్వామి చెన్నై, శ్రీమాన్ వై.వి. శ్రీకృష్ణ చెన్నై, శ్రీమతి డా॥ అమృతవల్లి చెన్నై, శ్రీమాన్ బి. రుంపారెడ్డి చెన్నై, శ్రీమాన్ పి. వెంకటసుబ్బారెడ్డి చెన్నై, శ్రీమతి పి. చెన్నమ్మ చెన్నై శ్రీమాన్ ఎన్. లక్ష్మణరెడ్డి నెల్లూరు, శ్రీమతి బి. వెంకట సుబ్బమ్మ గూడూరు

**అభిమానులు:**

శ్రీమతి సూర్యదేవర సరస్వతి, వరంగల్. శ్రీమాన్ పి. రామచంద్రారెడ్డి, హనుమకొండ. శ్రీమాన్ జి. నరసింహారావు, హనుమకొండ. శ్రీమాన్ వి. ఆంజనేయులు. శ్రీమతి ఎన్. జయలక్ష్మి. శ్రీమాన్ రామానుజదాసుడు, హనుమకొండ. శ్రీమాన్ సి.వై. రామానుజాచార్యులు,వరంగల్.
శ్రీమాన్ డా॥ సోమ మహదేవరావు,హనుమకొండ. శ్రీమాన్ శీల వెంకటేశ్వర్లు,వరంగల్. శ్రీమతి కె. ప్రేమలత,వరంగల్. శ్రీమాన్ టి. ముకుంద స్వామి, హనుమకొండ. శ్రీమాన్ ఎ. శ్రీనివాసరావు, వరంగల్. శ్రీమాన్ రామానుజాదాసులు, హైదరాబాద్. శ్రీమతి వి.వరాలమ్మ, హైదరాబాద్. శ్రీమాన్ మేడిచర్ల సమ్మయ్య, వరంగల్. శ్రీమాన్ ఆర్సి నాగేశ్వరరావు,కాజీపేట. శ్రీమాన్ ఎ. సుదర్శనం, వరంగల్. శ్రీమాన్ పి.వెంకటేశ్వర్లు,హనుమకొండ. శ్రీమతి ఆర్.లక్ష్మి,వరంగల్. శ్రీమాన్ అక్కినపల్లి శ్రీరాములు,వరంగల్. శ్రీమాన్ వట్లూరి సుగుణావెంకటనారాయణ,హనుమకొండ. శ్రీమాన్ డి. ఉపేంద్రనాధ్,హనుమకొండ. శ్రీమతి పి.అనసూయమ్మ,హనుమకొండ. శ్రీమాన్ డి.వెంకట రాజేశం,హనుమకొండ. శ్రీమాన్ డా॥ ఎమ్.మురాలయ్య,హనుమకొండ. శ్రీమాన్ వై.తిరుమలరెడ్డి,హనుమకొండ. శ్రీమాన్ సి.హెచ్.వీరభద్రయ్య,హనుమకొండ. శ్రీమాన్ కె.కృష్ణమూర్తి,హనుమకొండ. శ్రీమాన్ మండల అగారెడ్డి,వరంగల్. శ్రీమాన్ జి. అప్పారావు, హనుమకొండ. శ్రీమాన్ లంకశెట్టి సత్యనారాయణ, హనుమకొండ. శ్రీమతి వి.సుమతీవెంకట్రామ్, హనుమకొండ. శ్రీమాన్ శిరివోలు సత్యనారాయణరావు, హనుమకొండ. శ్రీమాన్ ఐ.ప్రభాకర్,సిరిపూర్ కాగజ్‌నగర్. శ్రీమాన్ ఐ. రాఘవన్‌రెడ్డి, హనుమకొండ. శ్రీమాన్ బిల్లా మల్లారెడ్డి. శ్రీమాన్ మంచాల రామయ్య,వరంగల్. శ్రీమతి గుండా ఆండాళ్, వరంగల్. శ్రీమాన్ కె. అశోక్ కుమార్ పద్మ, వరంగల్. శ్రీమతి పి.అనసూయాదేవి, హనుమకొండ. శ్రీమాన్ ఎన్. సత్యనారాయణ, ఖమ్మం. శ్రీమతి వి. సరోజని, హనుమకొండ. శ్రీమాన్ ఎ.రమేష్,భళ్ళారి. శ్రీమాన్ సి.హెచ్. వెంకటేశ్వరరావు,హనుమకొండ. శ్రీమాన్ బాలా రాశిరెడ్డి,హైదరాబాద్. శ్రీమాన్ జయప్రకాష్,

హనుమకొండ. శ్రీమాన్ వై. చంద్రయ్య,వరంగల్. శ్రీమాన్ శ్రీనివాసరెడ్డి,హనుమకొండ.
శ్రీమాన్ టి.హరిప్రసాద్,హైదరాబాద్. శ్రీమాన్ ఆర్.శ్రీహరిరావు,హనుమకొండ. శ్రీమాన్ కె.కృష్ణమూర్తి,హనుమకొండ. శ్రీమాన్ జె.భగవాన్‌రెడ్డి,హనుమకొండ. శ్రీమతి భక్తురాలు,వరంగల్. శ్రీమాన్ ఆర్.రామ్మూర్తి, వరంగల్. శ్రీమాన్ కె.లక్ష్మారెడ్డి,వరంగల్. శ్రీమాన్ జి.పుల్లారెడ్డి,హనుమకొండ. శ్రీమాన్ ఎన్.వెంకటయ్య, రంగల్. శ్రీమతి.జి.దుర్గాంబ, వరంగల్. శ్రీమాన్ ఇ.సూర్యారెడ్డి,వరంగల్. శ్రీమాన్ టి.గౌతమరావు, వరంగల్. శ్రీమాన్ ఇ.గోపాలరెడ్డి,మోదులు. శ్రీమాన్ బొల్లు దివాకరరెడ్డి,చరకపల్లి. శ్రీమతి ఎమ్.లీలమ్మ. శ్రీమాన్ బి.నాగేందర్. శ్రీమాన్ కె. రఘుపతి.

శ్రీమాన్ కె.రాజగోపాలం రంగనాయకి,చెన్నై. శ్రీమతి వై.సరోజిని మదుసూధనరావు, చెన్నై, శ్రీమతి. ఆర్. ప్రమీల, చెన్నై, శ్రీమాన్ జి. వేదగిరి, చెన్నై, శ్రీమాన్ జ. రమేష్, చెన్నై, శ్రీమతి ఆర్. సూర్యకుమారి చెన్నై, శ్రీమతి జి. రత్నం జెన్నై, శ్రీమాన్ టి. శ్రీరామస్వరూప్ ప్రవీణ్, చెన్నై, ఎన్ సూబ్రహ్మణ్య ఆచార్య చెన్నై, టి. వేదవల్లి చెన్నై, కె. శ్రీదేవి చెన్నై, శ్రీమాన్ వి. సుబ్బారావు చెన్నై, శ్రీమాన్ టి. వరదరాజులు చెన్నై, శ్రీమాన్ ఎస్. జయకృష్ణ పుష్ప చెన్నై, శ్రీమతి ఎల్ అమృతవల్లి, వైదేహి చెన్నై, శ్రీమతి కె. కావ్యమయూరి మింజూర్, శ్రీమాన్ వి. శోభనాద్రి, చెన్నై, శ్రీమాన్ ఎల్ మురళీధర చెన్నై, శ్రీమాన్ ఎస్. గణేష్ రామచంద్రమూర్తి చెన్నై, శ్రీమాన్ టి. శ్రీకాంత్ చెన్నై, శ్రీమాన్ వంశీకృష్ణ కార్తీక్ చెన్నై, శ్రీమాన్ కె. పాండురంగారావు చెన్నై, శ్రీమాన్ ఆర్ కులశేఖర్ చెన్నై, శ్రీమతి బి. శమంతకమణి చెన్నై, శ్రీమతి మర్కటవల్లి చెన్నై, శ్రీమతి వి. సీతారామాంజనేయ చౌదరి చెన్నై, శ్రీమతి ఎల్ అమృతవల్లి చెన్నై, శ్రీమాన్ ఎస్. ప్రభాకరన్ యు.ఎస్. ఎ. , శ్రీమాన్ టి.వి. గోపాలరావు, చెన్నై, శ్రీమాన్ శ్రీమతి లక్ష్మి చెన్నై, శ్రీమాన్ లక్ష్మి నరసింహారావు కార్తీక్, చెన్నై, శ్రీమతి టి.ఎన్. వీణ చెన్నై, శ్రీమాన్ జె. సుబ్బారావు, శారదాంబ చెన్నై, శ్రీమతి కె. జ్యోతిర్ శశాంక, చెన్నై, శ్రీమాన్ కె. రామచంద్రాచారి చెన్నై, శ్రీమాన్ జి. బదరీనారాయణ చెన్నై, శ్రీమతి ఆర్. ప్రమీలమ్మ చెన్నై, శ్రీమతి పి. షణ్ముఖవల్లి చెన్నై, శ్రీమతి ఎస్. సరస్వతి చెన్నై, శ్రీమాన్ సీతారామస్వామి జయశ్రీ చెన్నై, శ్రీమతి సుబ్బలక్ష్మి, శ్రీమాన్ వి. రామచంద్రరావు మాధవవరం, శ్రీమాన్ కె. సురేష్ చెన్నై, శ్రీమాన్ ఎ. శాంతి స్వరూప్ చెన్నై, శ్రీమతి సి. శ్రీదేవి చెన్నై, శ్రీమాన్ కె. చంద్రశేఖర్ విజయ, శ్రీమాన్ పి.ఎస్. చిత్తరంజన్ చెన్నై, శ్రీమతి వి. వి. కనకవల్లి కుప్పం, శ్రీమతి బి. కనకవల్లి కుప్పం, శ్రీమతి వై. ఆళ్వార్ చెన్నై శ్రీమతి బి. ఇందిరమ్మ చెన్నై, శ్రీమతి టి. ప్రమీళమ్మ, నెల్లూరు, శ్రీమతి పి. దుర్గాలక్ష్మి యగ్నూరు, శ్రీమాన్ శ్రీరాములు శెట్టి చెన్నై, శ్రీమతి లీలాకుమారి చెన్నై, శ్రీమతి ఎం. శకుంతలమ్మ చెన్నై, శ్రీమతి వి. శాంతా శ్రీధర్ చెన్నై, శ్రీమాన్ లీగాసుబ్రహ్మణ్యారెడ్డి, తిరువళ్లూరు, శ్రీమతి ఎస్. సీతమ్మ, చెన్నై శ్రీమాన్ ఎన్ అశోక్ కుమార్ చెన్నై, శ్రీమతి కె. సుధామణి చెన్నై, శ్రీమతి వి. సురేంద్రమ్మ చెన్నై, శ్రీమతి వి. ఆండాళ్ గోష్టి చెన్నై, శ్రీమాన్ రఘురామిరెడ్డి చెన్నై, శ్రీమాన్ డి. లక్ష్మణరెడ్డి చెన్నై, శ్రీమాన్ ఎమ్. ఆర్ గిరిధర్ చెన్నై, శ్రీమాన్ బి. జనార్ధనరావు చెన్నై, శ్రీమతి నీలవేణమ్మ చెన్నై, శ్రీమాన్ వి. రాఘవరెడ్డి కోవూరు, శ్రీమతి పి. సుశీలరెడ్డి చెన్నై, శ్రీమాన్ జి. రత్నం చెన్నై, శ్రీమాన్ దర్శి సుబ్బారావు వైజాగ్, శ్రీమాన్ డి. నరసింహారావు పద్మావతి నెల్లూరు, శ్రీమాన్ ఎస్. రంగనాధన్ చెన్నై, శ్రీమాన్ పి.వి. రంగారెడ్డి సికింద్రాబాద్, శ్రీమతి డి. శ్యామల నెల్లూరు, శ్రీమాన్ జె. కాంతారావు చెన్నై,







# శ్రీ రామచంద్ర ప్రభువుకు సామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవము

**శ్రీ రామస్వామివారి దేవస్థానము - రామతీర్థం, విజయనగరం జిల్లా.**

**10-10-2003 నుండి 19-10-2003 వరకు**



| | | |
|---|---|---|
| **తేది: 10-10-2003 సా॥ 6గం॥కు** | : | విష్వక్సేనారాధనము, అంకురారోపణము, ఋత్విగ్వరణము,అగ్ని ప్రతిష్ఠాపన |
| **తేది: 11-10-2003 ఉ॥ 7గం॥నుండి నుండి మ॥ 12గం॥వరకు 18-10-2003** | : | 60మంది ఋత్విగ్వరేణ్యులచే 24 శ్రీమద్రామాయణ పారాయణలు, 108 సుందరకాండ పారాయణలు, శ్రీభాష్యం, భగవద్విషయాది దివ్య గ్రంథముల పారాయణలు, మరియు శ్రీమత్సుందరకాండ సంక్షేప రామాయణ, గాయత్రీ రామాయణ హవనము. |
| **తేది: 14-10-2003 ఉ॥ 9గం॥లకు** | : | మహాస్నపనము |
| **తేది 19-10-2003 ఉ॥ 9గం॥లకు** | : | పూర్ణాహుతి, శాంతి కళ్యాణము, సామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవము |

ప్రతీరోజూ సాయంత్రం సమయములలో పండితుల ఉపన్యాసములు, సంగీత, నృత్య కార్యక్రమములు జరుగును.

ఆస్తిక భగవద్భాగవత బంధువులగు భక్తవరేణ్యులు దర్శించి భగవత్కృపకు పాత్రులు కావలసినదిగా కోరుచున్నాము.

-నిర్వాహకులు

మరిన్ని వివరములకు: **08922 - 244036**
**08922 - 244468**

# శ్రీ వైకుంఠ స్తవము

శ్రీమాన్ K.E. స్థలశాయి, భద్రాచలం.

భగవన్నామ సంకీర్తనమే భవతాప హరమని శాస్త్రాలు బోధిస్తున్నాయి. భగవానుని స్వరూప రూపగుణ విభూతులను మనసా భావించి, వాక్కుతో కీర్తించుట పరమార్థమని శ్రీ ఆండాళ్ అమ్మవారు 'తిరుప్పావై' ప్రబంధములో **"ఎన్నైన్నుమ్ శేవగమే ఏత్తి ప్పరైకొళ్వాన్"** "స్వామీ! నీ వీరచరితను స్తుతించటమే మాకు కావలసిన పురుషార్థము అంటారు. వేదాలన్నీ భగవత్‌స్తుతి రూపాలే.

**ఇన్ద్రమిత్‌గాథినో బృహదింద్రమర్కేభిరర్కిణః।**
**ఇంద్రంవాణీ రనూషత ।**
**గాయంతిత్వా గాయత్రిణః ।**
**అర్చంత్యర్కమర్కిణః ।**
**(యజుః - తైత్తిరీయ సంహిత)**

గాథినః=సామగాయకులు; బృహత్= గొప్పదైన సామవేదముతో; ఇంద్రమిత్= భగవానుని; అనూషత=స్తోత్రంచేశారు; అర్కిణః=ఋగ్వేదులు; అర్కిభిః అనూషత= ఋక్కులతో స్తోత్రం చేశారు; వాణీః= యజూరూపమైన వాక్కులు; అనూషత = భగవానుని స్తోత్రం చేశాయి. ఎంత స్తోత్రం చేసినా పరిపూర్ణంగా వేదాలు కూడ భగవ ద్విభూతిని కీర్తించలేవు. అనంత కల్యాణగుణ పరిపూర్ణుడైన భగవానుని వేదాలనుండి మనవరకు యథాశక్తిగా మాత్రమే వర్ణించగలం కానీ, సంపూర్ణంగా వర్ణించటం ఎవ్వరికీ శక్యంకాదని శ్రీయామునాచార్యులు 'స్తోత్ర రత్నంలో' **"వేదాఃచతుర్ముఖ ముఖాశ్చ మహార్ణవాన్తః"** అంటారు.

**నమోనమో వాఙ్మనసాతిభూమయే"** అని భగవంతుని పరత్వాన్ని **"నమో నమో వాఙ్ మనసైక భూమయే"** అని ఆతని సౌలభ్యాన్ని కూడ అభివర్ణించారు. మనం చేసే స్తోత్రం భగవానునికి చాలా ప్రీతిని కలిగిస్తుంది అంటే అది మనం చేసే స్తోత్రం యొక్క గొప్పతనం కాదు. ఆయన మన పొగడ్తలకు పొంగిపోవటం కాదు. ఆయనకున్న సౌలభ్యగుణమే ఆయనను మనం చేసే స్తోత్రానికి సంతోషించేటట్లు చేస్తుంది.

శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రంలో **"స్తవ్యః స్తవ ప్రియః"** అనే నామాలు భగవానునికి ఉన్నాయి. స్తవప్రియః అంటే **"యథా కథంచిత్, యయాకయాచిద్భాషయా యేనకేనాపి తేజస్కరః తిరస్కారీవా గుణ సంకీర్తనాభిమానేన క్రియమాణః స్తవః స్వవిషయః ప్రియతమోఽస్యేతి స్తవప్రియః"** అని శ్రీపరాశర భట్టారకులు సహస్రనామ భాష్యంలో అంటారు. దానికి భావం ఏమిటంటే ఏదో ఒక విధంగా ఏ భాషలోనైనా సరే భగవంతుని ప్రభావాన్ని పొగడినా లేక తెగడినా "నేను దేవుని గుణాలను, దోషాలను లెక్కిస్తాను అని ఆరంభించినది స్తోత్రమై భగవత్ప్రీతిహేతువ వుతుందట కనుకనే

**సాంకేత్యం పారిహాస్యం చ**
**స్తోభం హేళనమేవ వా**
**వైకుంఠనామగ్రహణం**
**అశేషాఘ హరం విదుః"** అంటారు.

ఎవరిపేరునో పిలుస్తున్నట్లుగా దేవునిపేరు ఉచ్చరించటాన్ని **'సాంకేత్యం'** అంటారు. సమానులైన







స్నేహితులు ఒకరినొకరు ఎగతాళి చేసుకొంటూ తమకున్న దేవునిపేర్లను ఉచ్చరించటాన్ని **'పారిహాస్యం'** అంటారు. ఆవులించినపుడూ, క్రిందనుండి లేస్తున్నపుడు మొదలైన సమయాల్లో "అయ్యో! రామ, హా రామ్, నాయనోయ్ మొదలైనవి ఉచ్చరించటాన్ని **'స్తోభం'** అంటారు. "నాయన" "పదం నారాయణ" పదానికి వికృతి. తనకంటే అన్ని విధాలుగా తక్కువైన వాడిలోని లోపాన్ని వెక్కిరిస్తూ వాడికి పెట్టిన దైవనామాన్ని ఉచ్చరించటం **'హేళన'.** వీటిల్లో ఏ విధంగానైనా శ్రీవైకుంఠుడైన భగవానుని నామోచ్చారణ అన్ని పాపాలనూ పోగొడుతుందట. కనుక భగవ న్నామ కీర్తన చేయటం సర్వదా శ్రేయో దాయకం, సర్వసులభమూకూడ. ఈ భగవ న్నామంలో ఆతని స్వరూప రూప గుణ విభూతులనుబట్టి ఏర్పడి వాటిని ఒక క్రమ పద్ధతిలో ఉచ్చరించుట స్తోత్రం అవుతుంది.

**'ష్టుఞ్‌స్తుతే'** అనే సంస్కృత ధాతువు ద్వారా స్తోత్రం అనే పదం ఏర్పడింది. **"స్తూయతే అనే నేతి స్తోత్రం"** అనే సంస్కృత వ్యుత్పత్తి ద్వారా భగవంతుణ్ణి కీర్తించే పదజాలానికి **"స్తోత్రము"** పేరు. శ్రీవత్సాంక మిశ్రులు అనే పూర్వాచార్యులు.

**స్తోత్రం నామ కిమామనంతి కవయః**
**యది అన్యదీయాన్ గుణాన్ ।**
**అన్యత్రతు అసతః అధిరోప్యఫణితిః**
**సాతర్హి వంధ్యా త్వయి॥**

ఓ తల్లీ! స్తోత్రమంటే లేని గుణాలను ఆరోపించి పొగడుట అని కవులంటూంటారు. అది నీ విషయంలో కుదరదు. ఎందుకంటే నీవు అనేక కల్యాణగుణ పూర్ణవు.

**సమ్యక్ సత్యగుణాభివర్ణన**
**మథో బ్రూయాః కథంతాదృశీ ।**
**వాక్ వాచస్పతినాఽపి**
**శక్యరచనా త్వత్సద్గుణార్ణో నిధౌ ॥**

నీ అనంత కల్యాణ గుణములను ఉన్నదున్నట్లుగా వర్ణించుటకూడ ఎవ్వరికీ శక్యం కాదు. చివరికి బృహస్పతి కూడ వర్ణించలేడు అంటారు.

సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు అయిన భగవంతుణ్ణి సూర్యునితోను, చంద్రునితోనూ పోల్చటం, ఆతని నేత్రాలను, పాదాలను, చేతులను, పద్మములుగా అభివర్ణించటం వాటికి గొప్పతనాన్ని కల్గిస్తుంది కానీ భగవంతునికి అతిశయాన్ని కల్గించదు. సర్వవ్యాపకుడై తనకంటే అధికులుగానీ సమానులుకానీ లేని భగవంతుణ్ణి స్తోత్రం చేయాలని ప్రయత్నించటం మన ఉనికిని కాపాడు కోవటం కోసమే తప్ప ఆతని స్వరూపాన్ని పరిపూర్ణంగా ఆవిష్కరించటం మనకే కాదు వేదాలకు కూడా సాధ్యంకాదు.

## సంప్రదాయాభిమానులకు శుభవార్త

శ్రీమదుభయవేదాన్తాచార్య పీఠం ఆధ్వర్యవంలో, సంప్రదాయ అభివృద్ధి కోసం పిన్నలను, పెద్దలను, ప్రోత్సహించాలన్న దృష్టితో **సంప్రదాయ విషయాలలో పరీక్షలు** ఉభయవేదాన్త పండిత సభలు (27-9-03 నుండి 1-10-03 వరకు) యధావిధిగా శ్రీశ్రీశ్రీ స్వామివారి చాతుర్మాస్య దీక్షాసమయములో జరుగును. ఈ సంప్రదాయ స్తోత్ర, దివ్యప్రబంధములలో జరిగే ఈ పరీక్షలు ధారణ, ఉచ్చారణ, శ్రవ్యత, నిర్దుష్టత అంశాలపై నిర్వహిస్తారు.

పరీక్షలలో ఉత్తీర్ణులకు ప్రోత్సాహబహుమతులు శ్రీవారు అందిస్తారు. పరీక్షార్థులు తమపేరు, వయస్సు, చిరునామా, గురువుగారిపేరు, ఇతర విద్యార్హతలతో పూర్తిచేసిన దరఖాస్తును పంపించగలరు.

**ప్రణాళిక కావలసిన, ఇతర వివరములకు వెంటనే సంప్రదించండి**

**శ్రీకార్యం, శ్రీమదుభయవేదాన్తాచార్యపీఠం, వేదవిశ్వవిద్యాలయం, జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్**
**సీతానగరం, తాడేపల్లి (పోస్ట్ & మండలం), గుంటూరు జిల్లా -522501**
ఫోన్స్ (0845 - 272929, 272353

# ఇతిహాసబోధ - 18

"మృతశిశువు! మృతశిశువు" అంతఃపురమంతా ఒక్కసారిగా గగ్గోలైంది. చెప్పవలసిన వారందరికీ ఈ దుర్వార్తను చేరవేసేందుకు హడావుడి పడుతున్నారు వృద్ధాంగనలు. బలభద్రాది యాదవ ప్రముఖులతో కలసి అంతకు ముందే హస్తినకు విచ్చేసి విడిదిమందిరంలో విశ్రాంతి తీసుకుంటున్న శ్రీకృష్ణుడు ఈ వార్త వినగానే నివ్వెరపోయాడు. సమయానికి పాండవులు కూడా నగరంలో లేరు. అశ్వమేధయాగ నిర్వహణ కవసరమైన నిధులను త్రవ్వితెచ్చుకొనేందుకై హిమాలయాలకు వెళ్ళినవారు ఇంకారాలేదు.

నారీజనాన్ని సాంత్వన పరచడానికి పెద్దదిక్కుతానేనని గ్రహించి తక్షణమే సాత్యకి సమేతంగా హుటాహుటిన సూతికా గృహానికి పరుగెట్టాడు మాధవుడు. నిశ్చేష్టురాలై ధారాపాతంగా కన్నీరు కారుస్తూ ప్రసూతి మందిరం ముందు నిలబడ్డ కుంతి కృష్ణుడిని చూడగానే బావురుమంది.

"గోవిందా! గురుపుత్రుడి రోషాగ్నికి బలపశువైన నీ మేనల్లుని పుత్రుని చూడవయ్యా చూడు! ఉత్తర గర్భాన్ని రక్షిస్తానని నాడు నీవు చేసిన ప్రతిజ్ఞను నిలబెట్టుకోవాల్సిన సమయమొచ్చింది. వంశాంకురం నశించిందని తెలిస్తే పాండవులు జీవించగలరా! ద్రౌపదీ, సుభద్రల గతి ఏమౌతుంది? పుత్రవియోగాన్ని తట్టుకొని పాపం ఉత్తర బ్రతుకగలదా? కృష్ణా! ఇన్నాళ్ళూ ఈ వంశాన్ని రక్షించినవాడవు. ఈ ఆపదనుండి గట్టెక్కించలేవా? బాలుడు బ్రతుకకపోతే నేను బ్రతికి వ్యర్థం! అంటూ కుంతి నేలకూలింది. మేనత్తను లేపి మాధవుడు ధైర్యం చెప్పాడు.

చుట్టూమూగి రోదనలతో ఆక్రందనలు చేస్తున్న నారీ జనానికి అభయ హస్తమిస్తూ గోపాలుడు గంభీరంగా పాదప్రక్షాళన, ఆచమనాలు కావించి మృతశిశువును పునరుజ్జీవితుడిని చేయడానికి సిద్ధమయ్యాడు.

"వినండి! నేనాడిన మాట అసత్యం కాదు. మీకందరికీ ఆనందాన్ని కల్గిస్తూ ఈ బాలుడు జీవిస్తాడు. చూడండి!

శత్రువుల విషయంలోనైనా సరే నేనసత్యవాదిని కాకున్నట్లైతే, ఎన్నడైనా యుద్ధంలో భయపడి వెనుకడుగు వేయనివాడనైతే ఈ శిశువు పునరుజ్జీవుడగు గాక!

నేను సదా బ్రాహ్మణ భక్తుడనైతే, ధార్మికుడినైతే ఈ ఉత్తర కుమారుడు జీవించుగాక!, మనస్సునందు అర్జునునిపై ఏ పరిస్థితులలోనూ విరోధభావము లేనివాడనైతే ఈ బాలుడు బ్రతుకుగాక!

పెద్దలు నేను ధర్మముగనే కంసాదులను వధించానని నిజంగా భావించినట్లైతే ఈ చిన్నారి ఇప్పుడే ప్రాణములు పొందుగాక!

సత్యధర్మములు, బ్రహ్మచర్యము నాయందు సుస్థాపితమై ప్రకాశించినట్లైతే ఇప్పుడే ఈ పసివాడు చైతన్యవంతుడగుగాక!" అని శ్రీకృష్ణుడు పలికిన మరుక్షణం ఆశ్చర్యకరంగా బాలుడు ఒడలు కదిలించాడు. అక్కడున్న ఆడవారందరూ ఆ దృశ్యాన్ని చూసి పులకించిపోయారు.

కృష్ణుడు బాలుడిని చేతిలోనికి తీసుకొని ఆప్యాయంగా చూస్తూ "వంశం పరిక్షీణమైన సమయంలో అవతరించిన వాడు కనుక ఈ అభిమన్యుని సుతుడు పరీక్షిత్తు" నామంతో లోక ప్రసిద్ధుడగుగాక ! అని ఆశీర్వదించాడు.

ఈ విధంగా పుండరీకాక్షుని పరమానుగ్రహవిశేషంతో బ్రహ్మశిరోనామకాస్త్ర మహిమను ధిక్కరించి బ్రతికిన 'పరీక్షిత్తు'నకా తర్వాత నామకరణోత్సవం రోజున జ్యోతిష్కులు జన్మనక్షత్రాదులను పరిశీలించి "విష్ణురాతుడ"ని పేరు పెట్టారు. అయితే అందిరినోటా కృష్ణుని పలుకే అలవాటైంది.

బాలుడు పెరిగి పెద్దవాడయ్యాడు. చూస్తూండగానే





36 సంవత్సరాలు గడిచాయి. శ్రీకృష్ణుని నిర్యాణవార్త విన్న ధర్మరాజు రాజ్యవిముఖుడయ్యాడు. అన్నమనసెరిగి అన్నను అనుసరించడానికి సిద్ధమయ్యారు మిగిలిన పాండవులు. ధర్మరాజు యుయుత్సునికి రాజ్యరక్షణభారాన్ని అప్పగించి పరీక్షిత్తును పట్టాభిషిక్తుడిని చేసాడు. కృపాచార్యుడిని, పరీక్షిత్తుకు ఆచార్యునిగా నిలబెట్టాడు. సుభద్రకు బాధ్యతలనప్పగించి సోదరులతో, ద్రౌపదితో కలసి ధర్మరాజు మహాప్రస్థానానికి బయలుదేరాడు.

ఆవిధంగా హస్తినకు రాజైన పరీక్షిత్తు పెద్దల మార్గాన నడచి ప్రజలమెప్పుపొందాడు. ఉత్తరుని పుత్రిక అయిన ఇరావతిని వివాహ మాడి నలుగురు పుత్రులను పొందాడు. గంగానదీ తీరాన పరీక్షిత్తు మహారాజు నిర్వహించిన మూడు అశ్వమేధయాగాలకు దేవతలే స్వయంగా వచ్చి తమవంతు హవిర్భాగాలను స్వీకరించారంటే అతడెంత గొప్ప మహిమాన్వితుడో అర్థమౌతుంది. పరిపాలనలో అతడు ఇక్ష్వాకువును గుర్తుకు తెచ్చాడు. సత్యవాక్పరిపాలనలో బ్రాహ్మణభక్తిలో అతడు శ్రీరామచంద్రుని తలపించాడు. ఆ పన్నులను రక్షించడంలో అతడు శిబిచక్ర వర్తిని మరిపించాడు.

తన రాజ్యంలోని ప్రజలంతా ధర్మార్థకామాలను వీడకుండా జీవించేటట్లు కట్టడి చేసిన రాజశ్రేష్ఠుడాయన. ప్రజలు పరీక్షిత్తుపాలనను భరతునితో, రంతిదేవునితో, యయాతితో సరిపోల్చుకున్నారు. తన పరిపాలనలో భూమిమీద ధర్మం నాలుగు పాదాల నడవడానికి వీలుగా కలిపురుషుని సంచారానికి నియమాలను విధించిన ప్రభావశాలి పరీక్షిత్తు.

జూదాన్ని,మద్యపానాన్ని, కామినీజనాన్ని , జీవహింసను, బంగారాన్ని కలికి నివాసస్థలాలుగా నిర్దేశించి, కలిని నిగ్రహించిన మహానుభావుడాయన. అతని రాజ్యంలో తపము, శౌచము, దయ, సత్యము వర్ధిల్లి ప్రజలు సుఖశాంతులతో జీవించారు.

అలా అరవై సంవత్సరాలు జనరంజకంగా పాలించిన పరీక్షితు తన తొంభై ఆరవయేట విధిప్రేరితుడై తన ముత్తాత అయిన పాండురాజువలె వేటకువెళ్ళాడు. వేటాడే తమకంలో నిర్దాక్షిణ్యంగా అన్నిరకాల అరణ్య జంతువులను వధిస్తూ కలిప్రభావానికి లొంగిపోయాడు.

తన బాణం దెబ్బతిని చావకుండా పారిపోయిన మృగాన్ని తరుముతూ అడవిలో బాగా లోపలికి వెళ్ళాడు. మృగం అతడికి ఆయాసాన్ని మిగిల్చి, ఏమార్చింది. మృగాన్ని చంపలేక పోయానన్న బాధకు తోడు ఆకలి దప్పుల బాధ జతయింది.

మృగాన్ని వెతుకుతూ ముని పల్లెకు చేరిన పరీక్షిత్తుకు తపస్సమాధిలో మునిగి ఉన్న శమీకఋషి కనిపించాడు. మౌనవ్రతంలో ఉన్న మునిని చూచి తనచే గాయపడ్డ మృగం ఆచూకీని గూర్చి ప్రశ్నించాడు పరీక్షిత్తు.

ముని మౌనాన్ని నిరాదరణగా భావించి ఆగ్రహించాడు పరీక్షిత్తు. హస్తినాపురి చక్రవర్తినైన తనపట్ల ముని నిర్లక్ష్యంగా ప్రవర్తించడాన్ని మన్నించలేకపోయాడు. తన చేతిలో ఉన్న విల్లు కొనతో ఆ ప్రక్కనే చచ్చిపడి ఉన్న పామును తీసి ఋషి మెడలో వేసి పరీక్షిత్తు తన దారిన తాను హస్తినకు వచ్చేసాడు.

శమీకునికి శృంగి అనే కుమారుడు ఉన్నాడు. అతడు కూడా బ్రహ్మజ్ఞానాన్ని కోరుతూ తాపసిగా జీవిస్తున్నవాడే. కృశుడనే మిత్రుడు శృంగికి పరీక్షిత్తు శమీకుడిని అవమానించిన విధానాన్ని వివరించాడు. బాధతో తండ్రి వద్దకు వచ్చి తండ్రి మెడలోని మృత సర్పాన్ని చూచాడు శృంగి!

ఇంద్రియాలను జయించి, జనసంచారానికి దూరంగా తపస్సు చేసుకుంటున్నాడు తన తండ్రి. వృద్ధుడూ, మౌనవ్రతుడూ, కేవలం దూడలు పాలు త్రాగేటప్పుడు చెదిరిపడ్డ పాలనురుగునే ఆహారంగా స్వీకరిస్తున్న వాడూ, నిరపరాధీ అయిన తన తండ్రిని దురహంకారంతో అవమానించిన పరీక్షిత్తు చర్యను సహించలేకపోయాడు శృంగి.

ఆగ్రహావేశాలతో జలాన్ని స్వీకరించి "ఈ నరాధముడైన పరీక్షిత్తు ఏడురోజులలో తక్షకుని విషాగ్నికి బలియై మరణించుగాక" అని తీవ్రంగా శపించాడు. ఆ తర్వాత తండ్రి వద్దకు చేరి అతని

మెడలోని పాము మృతకళేబరాన్ని తీసి అవల పారవేసి, తండ్రి పాదాలవద్ద దీనంగా కూర్చుండి పోయాడు.

కొద్దిసేపటికి శమీకుడు ధ్యానాన్ని ముగించుకొని కండ్లు తెరిచి శృంగిని చూచాడు. కుమారుడు కన్నీళ్ళతో జరిగిన విషయాన్ని తండ్రికి వివరించాడు.

శమీకుడు కుమారుని ప్రతిక్రియ వృత్తాంతాన్ని విని బాధపడ్డాడు. "నాయనా! శృంగీ! మనం తాపసులం! ఆగ్రహం తపస్సును నాశనం చేసేదని నీకు తెలియదా! తపస్వికి క్రోధం పనికిరాదు. అసూయ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈ శత్వము, వశిత్వమనెడి అష్ట సిద్ధులు కోపం వల్ల నిష్ఫలమౌతాయి.

అతిగర్విష్టి యొక్క సంపద, పగిలిన కుండలోని నీరు, ధర్మభ్రష్టుడైన వాడి రాజ్యం నశించినట్లే సహనం లేని వాని తపస్సుకూడా నశిస్తుంది.

ఏ రకంగా చూచినా అసహనంతో పరీక్షిత్తును నీవు శపించడం నాకు ఉచితమనిపించడంలేదు. ఆ రాజు ఎంతో ఉత్తముడు. ఈ భూమండలానికి రక్షకుడు. మనలాంటి మునులు సుఖంగా తపస్సు చేసుకోగలుగుతున్నామంటే అందుకు పరీక్షిత్తు యొక్క రాజ్యపాలనమే కారణం. వేదవిహితమైన ధర్మం అతని పాలనలో చక్కగా సాగుతున్నది. అలాంటి రాజుకు నీవు కీడు తలపెట్టావు. భరతవంశాన్ని పవిత్రం చేసిన పరీక్షిత్తును నీవు తక్కువగా భావించావు. శ్రీరామచంద్రుడు, మాధాంతృచక్రవర్తి, రఘుమహారాజులకు తీసిపోని మహానుభావుడాయన. వేటకు వచ్చి, ఆకలిదప్పులతో, అలసటతో తెలియక అతడు చేసిన చిన్న అపచారానికి నీవు అంతశిక్షవిధించతగునా?

అల్పమైన అతని దోషాన్ని సహించి మన్నించాలే కాని మరణించాలని శపించ వచ్చునా? నీ శాపాన్ని ఉపసంహరించుకో గలిగితే మంచిది. ఆలోచించు" అని కుమారుడిని మందలించాడు శమీకుడు.

శృంగి తండ్రికి తన నిస్సహాయత్వాన్ని తెలియజేసాడు. "పలికిన పలుకు వమ్ముకాదు. అది తక్షకుని ప్రేరేపించి తీరుతుంది" అని శృంగి చెప్పిన జవాబును విని శమీకుడు దుఃఖించాడు.

తన శిష్యుడైన గౌరముఖుడిని పిలిచి "నాయనా! నీవు వెంటనే హస్తినకు వెళ్ళి పరీక్షిత్తుకు జరిగిన వృత్తాంతాన్ని తెలియజేసి, ప్రాణాన్ని రక్షించుకొనే ఉపాయం చూసుకోమని రాజును హెచ్చరించు" అని పలికి తక్షణమే శిష్యుడిని రాజువద్దకు పంపాడు.

అప్పటికే జరిగిన విషయాన్ని తలచుకొని పశ్చాత్తాపంతో బాధపడుతున్న పరీక్షిత్తుకు గౌరముఖుడు తెచ్చిన వర్తమానం మరింత వేదనను కలిగించింది. మంత్రులు రాజు రక్షణకు హడావుడీ పడసాగాడు.

రకరకాల విషాలకు విరుగుడు చేయగల మంత్ర తంత్రవేత్తలైన ప్రసిద విషవైద్యులు రాజుకు అందుబాటులో ఉండి ఆయనను రక్షించసాగారు.

శృంగి శాపవాక్కుచే ప్రేరేపించబడ్డ తక్షకుడు పరీక్షిత్తు ప్రాణాలు తీయడానికి బయలుదేరాడు. దారిలో అతనికి కశ్యపుడనే బ్రాహ్మణుడు కనిపించాడు. అతడు గొప్ప మంత్రవేత్త. తన విద్యా ప్రభావంచేత పరీక్షిత్తును బ్రతికించి సంపదను, కీర్తిని పొందుదామని హస్తినకు బయలుదేరాడు. తక్షకుడు కశ్యపుని మంత్రశక్తిని స్వయంగా పరీక్షించి చూచి, తన కార్యానికి విఘ్నంగా ఉన్న కశ్యపునికి కావలసినంత ధనమిచ్చి వెనుకకు పంపాడు.

ఇది ఇట్లా ఉండగా లౌకికంగా ప్రాణరక్షణకు తగిన ఏర్పాట్లను ఒకవైపు మంత్రులు చేస్తూంటే, మరొకవైపు బ్రతికి ఉండబోయే ఈ ఏడురోజులైనా సద్వినియోగం చేసుకోవాలని పరీక్షిత్తు ప్రాయోపవేశం చేసి ఋషుల 'సత్సాంగత్యం'లో కాలం గడపసాగాడు.

ఆ విధంగా గంగానదీ తీరాన ప్రాయోపవేశదీక్షలో ఉన్న పరీక్షిత్తును పరామర్శించడానికి నలుదిక్కులునుండీ దేవర్షులు, రాజర్షులు, బ్రహ్మర్షులు విచ్చేసారు. అత్రిమహర్షి, వశిష్ఠుడు, చ్యవనుడు, శరద్వంతుడు, అరిష్టనేమి, భృగువు, అంగీరసుడు, ఉచథ్యుడు, ఇంద్రుడు, ప్రమథులు, ఇధ్మవాహుడు, మేధాతిథి, దేవలుడు, అర్ష్టిషేణుడు, భరద్వాజుడు, గౌతముడు, పిప్పిలాదుడు, మైత్రేయుడు, ఔర్వుడు, అగస్త్యుడు,





వేదవ్యాసుడు, నారదుడు వంటివారు అలా వచ్చిన వారిలో ప్రముఖులు.

ఇంతమంది మహానుభావుల సాంగత్యంలో ఉన్న పరీక్షిత్తును అనుగ్రహించడానికి జగన్మోహనకర స్వరూపంతో, దిగంబరునిగా అవతరించాడు అవధూత శుకమహర్షి. వారందరినీ దర్శించి పులకరించిపోయాడు పరీక్షిత్తు.

అందరికీ నమస్కరించి శుక మహర్షినుద్దేశించి " స్వామీ! పాండవులతో పరిమితం చేసుకోకుండా శ్రీకృష్ణ భగవానుడు తన అనుగ్రహ విశేషాన్ని ఈ అల్పునిమీద కూడా ప్రసరింపచేసాడు. దాని పర్యవసానమే ఇందరి మహానుభావుల దర్శనం. మృత్యువు సమీపించిన నాబోటి వారు చేయవలసిన కర్తవ్యాన్ని, మననం చేసుకోవాల్సిన విషయాన్ని తెలియజేసి తరింపచేయండి! మేము దేనిని స్వీకరించాలో, దేనిని విడచి పెట్టాలో వివరించండి" అంటూ త్రికరణశుద్ధితో ప్రార్థించాడు పరీక్షిత్తు.

తన తండ్రి వేదవ్యాసుని ద్వారా తాను ఆలకించిన భాగవత పురాణాన్ని పరీక్షిత్తును ఉద్ధరించడం కోసం శుకుడు అతడికి చక్కగా వివరించి వెళ్ళాడు. నిశ్చింతగా మృత్యుభయం లేకుండా పరమాత్మ చింతనతో పరీక్షిత్తు కాలం గడపసాగాడు.

శృంగి విధించిన గడువు సమీపించడంతో తక్షకుడు తన కర్తవ్యాన్ని ముగించుకొనే ఏర్పాట్లు చక్కబెట్టుకొన్నాడు. తక్షకునిచే నిర్దేశించబడ్డ నాగకుమారులు కొందరు బ్రాహ్మణబాలుర వేషంతో పూలు, పండ్లు తీసుకొని వేదం చదువుతూ రాజదర్శనం చేసారు. బ్రాహ్మణభక్తుడైన పరీక్షిత్తు బ్రాహ్మణబాలురకు తగిన సత్కారాలు చేసి, వారిచ్చిన పూలు పండ్లు స్వీకరించాడు.

సూర్యాస్తమయ సమయంలో పరీక్షిత్తు విధి ప్రేరితుడై బ్రాహ్మణ బాలురరూపంలో నాగకుమారులు తెచ్చిన పండును తీసుకొని ఆరగించబోయాడు. ఆ పండులో నల్లని క్రిమిరూపంలో దాగున్న తక్షకుడు తక్షణమే తన రూపం ధరించి పరీక్షిత్తును కాటువేసాడు.ఆ తక్షకుని విషాగ్ని ప్రభావం వల్ల పరీక్షిత్తు దేహత్యాగం చేసాడు. ఆ విధంగా పరీక్షిత్తు

జననము, మరణము కూడా పెను సంచలనాన్ని, ఆశ్చర్యాన్ని కల్గించింది.

ఇక "పరీక్షిత్తు' గాథను మనం "ఇతిహాస బోధ-18"లో ప్రస్తావించడంలోని పరమార్థాన్ని చర్చించుకొందాం కొద్దిసేపు!

గత రెండు సంచికలలో యయాతి చక్రవర్తి, జాజలి మహర్షుల గాథలను మనం చర్చించుకొన్నాం అతిమానిత్వాన్ని మాటలలో ప్రదర్శించి యయాతి భంగపడితే, జాజలి మహర్షి మనస్సులో సంకల్పించి బాధపడ్డాడు. పరీక్షిత్తు అంతటి గొప్ప చక్రవర్తి ఈ షణ్మాత్రపు కాలం అతిమానిత్వం ఆవహించడంతో చేయగూడని పని చేసి ప్రాణం పోగొట్టుకున్నాడు అతని కర్మలో ప్రతిఫలించిన అతిమానిత్వ దోషఫలం తక్షకుని రూపంలో మృత్యువైంది.

మనసా, వాచా, కర్మణా మూడు రూపాలలోనూ పైముగ్గురు మహానుభావులూ అతిమానిత్వాన్ని అత్యల్పంగానే ప్రదర్శించినా, విపరీత ఫలాలను, గుణపాఠాలను అందు కొన్నారు.

మరి మన వర్తమానం మాటేమిటి? మన మాటలలో చేతలలో, సంకల్పాలలో నిరంతరం తొణికిసలాడే ఆసురీ ప్రవృత్తి లక్షణమైన అతిమానిత్వాన్ని తగ్గించుకునేందుకో, తొలిగించుకునేందుకో మనం ఏ విధంగా కృషిచేస్తున్నారు?

పరీక్షిత్తు తప్పిదాన్ని మన్నించి, జరగబోయే దారుణాన్ని గురించి ముందుగానే హెచ్చరించిన శమీకమహర్షికున్నంతటి అమానిత్వసంపద మనకు లేకపోవచ్చు! కానీ ఆ సంపదను పెంచుకోవాలనే పట్టుదల మాత్రం మనకు ఉండాలి కదా! దాన్ని మనకు అనుగ్రహించడం కోసమే మన స్వామివారు "మంచిని పెంచే శాంతి పట్టిక"ను మనకందించి సాధన చేయమంటున్నారు.

మన చైతన్యానికి దిశానిర్దేశం చేసేందుకు శ్రీస్వామివారు చూపుతున్న బాటలో నడవాలనుకునే సాధకులు శ్రీ విష్ణు సహస్రనామంలోని "అమానీ మానదో మాన్యో లోకస్వామీ త్రిలోకధృత్" అన్నపదాలపై దృష్టిని గట్టిగా కేంద్రీకరించాలి.

మూడు లోకాలను ధరించే శ్రీమన్నారాయణుడే లోకస్వామి. ఆయన మనందరినీ నడిపిస్తున్నాడు. నడిపించే విధానాన్ని భీష్మాచార్యులవారు పై పదాలలో ఎంత రమ్యంగా వర్ణించారో చూడండి!

పరమాత్ముడైన శ్రీమన్నారాయణుడు "అమాని" అంటే తాను ఎవరినుండీ ఎటువంటి గౌరవాదరాలను ఆశించనివాడు.

ఆయన ''మానదో'' అంటే అందరికీ గౌరవాదరాలను అందించేవాడు. మూడవ పదమైన "మాన్యో" పై రెండు కారణాలచేత లోకులందరిచేత గౌరవాదరాలను పొందుతున్న వాడన్నమాట.

భగవంతుడు మన సాధన విషయంగా ఎంత గొప్ప సూచనను తన 'నామాల' ద్వారా మనకు అందిస్తున్నాడో చూడండి.

మనం ఎవరినుండి ఎటువంటి గౌరవాదరాలను ఆశించకుండా, అందరికీ గౌరవాదరాలను అందిస్తూ పనిచేస్తూ ఉంటే 'లోకపూజ్యత' దానంతట అదే భగవదనుగ్రహ ఫలితంగా లభిస్తుంది.

దురహంకారంతో ఆశించి, నిరాశచెంది, నిందించడం, హింసించడం వంటి అతిమానిత్వపు దుర్లక్షణాలు మన కలహప్రియత్వ స్వభావంలో మనకు కనిపిస్తున్నంత కాలం 'మాధవ సేవగా సర్వప్రాణిసేవ' లక్ష్యాన్ని చేరుకోవడం మనకు అసాధ్యమే అవుతుంది. మనోవికారాల ఊబిలో కూరుకుపోయే బుద్ధికి మాధవుని సేవించే శక్తి ఎక్కడినుండి లభిస్తుంది.?

ఈ సత్యాన్ని గ్రహించి పరీక్షిత్తులా మనమూ మన పొరపాట్లకు, గ్రహపాట్లకూ పశ్చాత్తాపపడి, భగవంతుని వేడుకుంటే, మనకు లభించవలసిన జ్ఞానఫలాన్ని ఆయనే తన దైన పద్ధతిలో అనుగ్రహిస్తాడు.

## ఇతిహాసబోధ - 16 శీర్షికకు పాఠకులు పంపిన కొన్ని పేర్లు

1. నిర్మల శ్రద్ధయే - హిత దాయకం
- ఎమ్. జయప్రకాష్, హన్మకొండ.

2. సత్యనిష్టతో నిత్య కర్మలు ఆచరించి ఉత్తమ లోకాలను పొందవచ్చు.
- జె. రాధాకృష్ణ అప్పారావు-బి. సావరం

3. నిష్కల్మషమైన హృదయంలో చేసే ప్రతి కర్మా ముక్తి మార్గానికి సోపానం
-ఇ. అరుణ పాపిరెడ్డి- నిర్మల్

4. శ్రద్ధ కలిగి శాస్త్రాన్ని అనుసరించు
-ఎస్. పుష్పలత కమలాకరరావు-కరీంనగర్

5. సంసారి లేక సన్యాసి ధర్మనిరతితో సత్యాన్ని అతిక్రమించకుండ సాధనచేసేవారే ధన్యులు.
-ఎల్. లక్ష్మీ - బొబ్బిలి.

6. ప్రవృత్తి లేక నివృత్తి ఏ మార్గాన్ని అనుసరించిన ధర్మనిరతిని పాటించేవారే ధన్యులు. -
ఎల్. అప్పారావు - బొబ్బిలి.

7. అహంకార మమకారాదులు ఎంతటి తపస్విసైనా అధఃపాతాళానికి తోసేస్తాయి.
- ఎ. రామయ్య - హన్మకొండ.

8. ఆత్మస్తుతి అనర్థాలకు హేతువు.
-ఎమ్. ప్రసన్నాచార్యులు - హైదరాబాద్.

9. తులాధారుడు జాజలికి చేసిన హితబోధ.
-వి. వాసవి- భీమునిపట్నం.

10. ప్రతిజీవి శ్రద్ధతో కర్మలను ఆచరించిన యెడల పరమాత్మలో విధిగ ఐక్యమగును.
-బి. వీర్రాజు - జగ్గంపేట.

11. కామ క్రోధ మోహములను కాల్చునది రామనామము
- వి. సుజాత - హైదరాబాద్.

12. అహంకారా తపస్సుకి అధో లోకప్రాప్తి సత్య, నిర్మల, ధర్మతపస్సుకి సత్యలోకప్రాప్తి
-వి. బాపురాజు - విశాఖపట్నం.

13. నిర్మల చిత్తముతో చేసిన కర్మలే ముక్తి మోక్షములకు మార్గాలు
- ఎమ్. ఇందిర - ఇందుకూరు పేట.

14. నిస్వార్థంగ తపస్సును, యజ్ఞాన్ని చేసిన దైవం మెచ్చును.
- ఎన్. ఉమామహేశ్వరరావు - అనకాపల్లి.





15. నిర్మల మనసే ముక్తికి మార్గం
-ఎమ్. జీయర్ స్వామి - ఇందుకూరుపేట.

16. సంసారంలో ఉన్న కర్మయోగి మోక్షానికి అర్హుడే-
-డా॥ సి.హెచ్. హనుమంతరావు-కరీంనగర్.

17. ఆచార్యులను ఆశ్రయించి వారివలన తత్త్వాన్ని తెలుసుకొని ఆచరించి తరించవలెను.
- జె. అమరయ్య - అమరావతి.

18. అరిషడ్ వర్గాలను అదుపులో ఉంచినవారే మహానుభావులు
- సముద్రాల శ్రీనివాసాచార్యులు-హైదరాబాద్.

19. కర్మలు ఆచరించు కర్మఫలం చరించకు-
ఎమ్.విశ్వనాథం - హన్మకొండ.

20. మమకారహితుడు పరమాత్మకు హితుడు
-ఎమ్. శ్రీలతా రాధాకృష్ణ-వేకనూరు.

21. నిత్యతృప్తో-నిరాయయః-తులాధారః
- వి. రమ్య భార్గవి - తాడిపత్రి.

22. ఆచార్యోపాసన లేని అహంకారులకు శ్రియఃపతి కరుణా కటాక్షం దుర్లభం
-ఎమ్. పద్మావతి- రాజమండ్రి.

23. నిష్కామ కర్మకు శ్రద్ధ కలిగిన మాధవునికి ఆలయంగ మారవచ్చును.
- ఎన్ జయలక్ష్మి - విశాఖపట్నం.

24. జాజలి అహంకారం - తులాధారుని ధర్మనిష్ఠ
-కె. గౌతమ్ - కంభ సముద్రాగ్రహారం

25. దార్మిక జీవనం గడపడం వలన కులమేదైనా భగవద్ కటాక్షం పొందవచ్చు.
- డి. కిషన్‌రావు -హైదరాబాద్

26. శ్రద్ధావాన్ త్యజ్యతే పాపం - లభతేజ్ఞానమ్ -వేదాంతం
శ్రీనాధకవి-తాడిపత్రి.

27. నిర్మల చిత్తసేవ నిరాకారునికి త్రోవ
- ఎమ్. మణిచంద్ర - వేకనూరు.

28. జాజలి అహంకారంతో తపస్సు ఆచరించాడు. తులాధారుడు ఫలితాన్ని ఆశించకుండ కర్మలను ఆచరించడు.
- టి.ఎస్.ఆళ్వాందార్ - విజయవాడ.

29. చేసే వృత్తిని దైవంతో భావించి చేయాలి
-వి. విష్ణు వర్ధన్ - ఖమ్మం.

30. తులాధారుని ధర్మవర్తనను సర్వజనులు శ్రద్ధ తో ఆచరించవలెను.
- ఆర్. సుమ - హన్మకొండ.

31. తులాధారుని ధర్మకాంతేనే దేశ కోర్టులలోని న్యాయదేవత ప్రదర్శించేది
-ఆర్.రమేష్-హన్మకొండ.

32. శ్రద్ధా భక్తితో నిష్కామ కర్మచేసినపుడు మానవుడు ఊర్ధ్వలోకమునకు చేరుచున్నాడు.
-బి.ఎ.ఎయన్.గుప్తా-హిందుపురం.

33. సత్యం వద-ధర్మం చర-అహంత్యజేత్
- ఆర్.చక్రపాణి-హన్మకొండ.

34. నిర్మల శ్రద్ధచే కర్మాచరణ ఉత్తమ లోకప్రాప్తి
- కె. సూర్యనారాయణ- మిర్యాలగూడెం.

35. ధార్మిక వర్తనం అంటే ఏమిటి -
- రమణాజి - మార్టూరు.

36. ధర్మో రక్షతి రక్షితః-
- ఎ. అరుంధతి -హైదరబాద్.

37. అహంకారం ఆత్మహత్య -
- ఎ. రామరాజు

38. చేసే పనిలో శ్రద్ధ ఉన్నవాడు ఆపని యొక్క ఫలితానికి పరిపూర్ణమౌతుంది.
- వి. విష్ణువర్ధన్ - మామిళ్ళ గూడెం.

39. స్వధర్మనిష్ట - అనసూయ - అనంతపురం.

.40. కలియుగంలో ధర్మబద్ధంగ జీవనం సాగించడమే తపస్సులాంటిది.
- ఎన్. లక్ష్మీనారాయణ । వెంకట్రావుపల్లి.

41. శ్రద్ధావాన్ లభతే జ్ఞానం
- ఎన్ లక్ష్మీనారాయణ - కరీంనగర్.

42. ఆచార్యుల కటాక్షం లేకుండా భగవంతుని దర్శించుట దుర్లభం
- ఎమ్. రామానుజం - విజయనగరం

43. నివురుగప్పిన నిప్పులాంటి వారికి కీర్తి సంతోషంకర తలామలకం
- కె. రామశేషమ్మ - హిల్‌కాలనీ.
- వికాసతరంగిణి.

వీరందరికీ శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములు అందజేయుచున్నాము

# గ్రంథ పరిచయం

## అమలనాది పిరాన్

భక్తినందనంలో తావులు చిమ్మిన దేవ పారిజాతాలు దివ్యసూరులు. సవితృమండల మధ్యవర్తి, స్వామి శ్రీమన్నారాయణుడు తాపోపశాంతికై తానుగా వారి యెదల నెలవు చేసుకొన్నాడన్న రాయలవారి మాట అక్షరసత్యం.

ఆళువారలంతా భక్తిపారవశ్యంతో పాడినవారే! ఆ భక్తి పరసీమలు చేరుకొన్నది తిరుప్పాణాళ్వారులలో.

వారు శ్రీరంగనాథుని అవయవశోభను ఆపాదచూడమూ అనుభవించి ఆనంద పారవశ్యాన పదిపాశురాలు పాడినారు.

రంగని చూచిన కనులు వేరొకరిని కనలేవని రంగనిలోనే లీనమయిన మహానుభావులు వారు.

వారు పాడిన ప్రబంధం 'అమలనాదిపిరాన్' రహస్యత్రయసారాన్ని, అర్థ పంచకస్వరూపాన్ని ఈ ప్రబంధం ప్రబోధిస్తోందని అభిజ్ఞుల నిరూపణం.

ఈ ప్రబంధానికి తమిళంలో పలువ్యాఖ్యానాలు వెలసినయి. వేదాంత దేశికుల మునివాహనభోగ' వ్యాఖ్య తెలుగులోనూ వచ్చింది.

ఇప్పుడున్న అన్ని వ్యాఖ్యానాలనూ ఆకళించుకొని పరిపుష్టము, ప్రామాణికము, పరమభోగ్యమూ అయిన ఆంధ్రవ్యాఖ్యానాన్ని 'శ్రీసేవా వ్యాఖ్య' పేర ఈ ప్రబంధానికి సమకూర్చి ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులవుతున్నారు బహుసంప్రదాయ గ్రంథవ్యాఖ్యాతలుగా పాఠకులకు సుపరిచితులయిన ఉ.వే. శ్రీమాన్ డా॥ఈ ఏ. శింగరాచార్యస్వామివారు.

వ్యాఖ్యాతలు తమ 'నివేదనము'లో కవి ప్రబంధ–వ్యాఖ్యానములను గూర్చి తామే చక్కని పరిచయాన్ని ఇచ్చేరు. సత్సంప్రదాయపరులకు వ్యాఖ్యానంతోడి ఈ 'అమలనాదిపిరాన్' బాగా ఉపయోగపడు తుందనటంలో సందేహంలేదు.

148 పుటల ఈ గ్రంథం వెల రూ.50/–

పుస్తకాలు లభించుచోటు

1. ఆర్. కృష్ణకుమారి 4–103, KTD- Colony Exn. కొత్తపేట, చీరాల – 523157
2. సాధన గ్రంథమండలి, తెనాలి– 522201
3. డా॥ శ్రీమాన్ ఈ.వే. శింగరాచార్యులు, తిరుపతి



\18/
Mydocuments\
BnAugust o3.p65



న్యూస్

# వికాస దర్శిని నివేదన

## తిరిగి శ్రీ స్వామివారి అమెరికా పర్యటన

2001 సెప్టెంబరు 11వ తేదీ దుర్ఘటన తర్వాత అమెరికాలోనే కాక ప్రపంచ మంతటా సెక్యూరిటీ కట్టుదిట్ట మవ్వడంతో విదేశీయాత్రలకు సుముఖంగ లేని శ్రీస్వామివారు మస్కట్, ఆస్ట్రేలియా పర్యటనలయింతర్వాత, అమెరికా వెళ్ళడానికి సుముఖత చూపారు. ఇతర ప్రాంతాలలో ఎలా ఉన్నా అమెరికాలో ఇంకా సెక్యూరిటీ వ్యవస్థ చికాకుగానే ఉన్నట్లు యాత్ర చేసినవారు చెపుతూండటంతో ఎలా యాత్ర చేయాలనే మీమాంస చాలా రోజులు జరిగినా చివరకు ఒక నెలరోజులు పర్యటనకు శ్రీవారు అంగీకారం తెలియ చేసారు.

గతంలో వలె ఎక్కువ పట్టణాలకు విమానంలో తిరుగవద్దని, వీలయినంత వరకూ రోడ్డు ప్రయాణమే మంచిదని, తప్పనిసరైన కొన్ని దూర ప్రాంతాలకు మాత్రమే విమానం ఏర్పాటు చేయమని, అదైనా, 1,2 చోట్లుచూచి, ఇబ్బందైనట్లుంటే అవికూడా మానివేస్తామని, కాస్త సౌకర్యంగ ఉన్నట్లయితే యధాతథంగ పర్యటన కొనసాగుతుందని శ్రీవారు చేసిన సూచనల కంగీకరించి 5 ముఖ్యకేంద్రాలు మాత్రం దర్శించి వెనుదిరిగే ఏర్పాటు చేస్తామన్నారు జెట్ USA కార్యవర్గ సభ్యులు.

గతంలో వలే ఇబ్బంది పడకుండా చెన్నైలోని శ్రీమాన్ పండుప్రసాద్‌గారు, ఆనందకుమారిగార్ల చొరవతో శ్రీవారి సిబ్బందిగా తీసుకువెళ్ళదలచుకున్న 5గురికీ వీసాలు వచ్చాయి.

ఈసారి యాత్రలో శ్రీవారితో శ్రీమాన్ జి. వేణుగోపాలాచార్యస్వామివారు, శ్రీమాన్ టి. కృష్ణమాచార్యులు (కంప్యూటర్స్), శ్రీమాన్ మధుసూదనాచార్యులు, శ్రీమాన్ భాగవతా చార్యులు, చిరంజీవి గోపీకృష్ణ, శ్రీమాన్ టి. శాంతారామ్ గార్లు యాత్రచేసే భాగ్యం పొందారు. జూన్ 27వ తేదీ రాత్రి చెన్నైనుండి బయలుదేరిన స్వామి 'లుఫ్తాన్సా' విమానంలో ఫ్రాంక్‌ఫర్ట్ మీదుగ 28వ తేదీ మధ్యాహ్నానికి (అక్కడి సమయం ప్రకారం) శాన్ ఫ్రాన్సిస్కో చేరారు.

ఈసారి కార్యక్రమంలో ప్రధానాంశాలు మూడే 1. శాన్‌ఫ్రాన్సిస్కోలో ''గిరిజన గురుకుల విద్యాలయాల "నిధిసేకరణ" సంబంధించి జరిపే పూజల కార్యక్రమాలలో పాల్గొనడం. 2. చికాగో సమీపాన లేక జనీవాలో జరిగే 7 రోజుల కాంప్ నిర్వహణ, 3. హ్యూస్టన్, వాషింగ్ టన్ లలో జరిపే ఆలయాల నిర్మాణార్థం భూమిపూజ జరపడం. వీటి కంగంగ ఏదైనా కార్యక్రమా లేర్పరిస్తే అక్కడక్కడా, వాటిలో పాల్గొనడం, అనేవే ఈసారి కార్యక్రమంలో ప్రధానాంశాలు.

28వ తేదీ మధ్యాహ్నం, అక్కడి సమయం ప్రకారం 2 గంటలకు శాన్ ఫ్రాన్సిస్కో చేరిన శ్రీవారి పరివారాన్ని JET కాలిఫోర్నియా కార్యకర్తలు శ్రీమాన్ విష్ణు, హరి, సూరపనేని కుటుంబ సభ్యులు, K. మురళీకృష్ణ, హరిత భీమ్ దంపతులు, వంశీ, రఘు సోదరులు శ్రీమాన్ జైమినీ సామవేదం పండిట్ శ్రీనివాసన్ స్వాగత సుమాంజలితో ఆహ్వానించారు. కాలిఫోర్నియా 'బే' ఏరియాలో JET సేవా

కార్యక్రమాలను నిర్వహిస్తున్న శ్రీమాన్ విష్ణు అరుణ దంపతుల గృహములో శ్రీ స్వామివారు వేంచేసి ఆరాధనానంతరం తీర్థగోష్ఠిని నిర్వహించారు.

సాయంత్రం లివర్‌మూర్‌లోని శివ, విష్ణు ఆలయాన్ని సందర్శించి 'భౌతిక-ఆధ్యాత్మిక వాదాల సమతౌల్యం' అను అంశమును ప్రవచించారు. ఆ ఆలయ గ్రంథాలయాన్ని పర్యవేక్షించి మన రామానుజవాణి గ్రంథ సమూహాన్ని అందించారు.

శ్రీమతి K. రాధా, మురళీకృష్ణ దంపతులు శని ఆదివారాలలో ఇక్కడి చిన్నారులెందరికో పలు స్తోత్రాలు నేర్పుతున్నారు. 29 ఉదయం ఆ చిన్నారులు శ్రీ స్వామివారి సమక్షంలో వాటిని పఠించగా ఆనందించి, వారిని ప్రోత్సహించి, మరికొన్ని ఉచ్చారణా పరమైన మెలుకువలు అందించి మంగళా శాసనములు కృపచేసినారు. ఆ మధ్యాహ్నం జెమినీ శ్రీనివాసుగారి ఆహ్వానం పై ఫ్రీమౌంట్‌లోగలవారి ఆలయాన్ని సందర్శించి అచ్చట భక్తగోష్ఠికి "Harmonious living according to Bhagavadgita" అనే శీర్షికపై ప్రవచనాన్ని అనుగ్రహించారు. అలానే సాయంత్రం సన్నివేల్‌లో గల ఆలయాన్ని సందర్శించి గిరిజన పాఠశాలల ప్రణాళికను Power point slide show ద్వారా వివరించారు. తరువాత భక్త బృందానికి గల సందేహాలను తీర్చి శ్రీకృష్ణ పూజ చేయించారు. పూజలకు వచ్చిన ద్రవ్యాన్ని గిరిజన పాఠశాలకు కైంకర్యముగా జెట్ శాన్‌ఫ్రాన్సిస్కో శాఖ నిర్వాహకులు శ్రీమాన్ విష్ణు ప్రకటించారు. అటుతర్వాత శ్రీ స్వామివారి లాస్‌హౌస్ హిల్స్‌లోని శ్రీమాన్ S హరిగారి ఇంటికి వేంచేశారు. మార్గమధ్యంలో శ్రీమాన్ పొలిశెట్టి రమేష్‌గారు గృహాన్ని సందర్శించారు. శ్రీమాన్ హరి, ఉష దంపతులు వారి చిరంజీవులు శ్రవణ్, శ్వేతలు శ్రీస్వామివారికి పాదపూజ చేశారు. అనంతరం శ్రీ స్వామివారు అచట భకబృందానికిగల సందేహాలను తీర్చారు. శ్రీమాన్ హరిగారి కుటుంబం గతనెల సమాశ్రయణం పొందడానికై బదరీనాథ్‌కు ప్రత్యేకంగ వచ్చి శ్రీ స్వామివారి కృపకు పాత్రులైనారు. భక్తిలో ఔదార్యంలో వారి పిల్లలు తల్లిదండ్రులను మించినవారు. 11వ తరగతి చదివే కుమార్తె శ్వేత పుట్టినరోజు బహుమతిగా కారు కొనుక్కోవడానికి నాన్నగారు (హరిగారు) ఇచ్చిన 30వేల డాలర్లను శ్రీ స్వామివారు ప్రారంభించిన గిరిజన పాఠశాల నిర్మాణం కోసం కైంకర్యముగా సమర్పించినది. కుమారుడు శ్రవణ్ చక్కటి సంప్రదాయనిష్ఠ స్తోత్ర సేవాకాలం పఠనలయందు ఎంతో మక్కువ శ్రద్ధ. పర్యటనలో స్వామివారు ఈ ఆదర్శ కుటుంబాన్ని గూర్చి ప్రస్తావించని చోటు లేదంటే అతిశయోక్తి కాదేమో!!

1వ తేదీ ఉదయం ఆరాధనానంతరం శాంతా క్లారాలోని FOSWL (Friends of Same wave Length) వేంచేసినారు. వివిధ రంగాలలో సేవలందించే విశ్రాంతులైన భారతీయ వయోవృద్ధులు కలసి ఏర్పరచుకున్న సమాజం ఇది. శ్రీ స్వామి వారు "Ethics and Morals what is our duty" అనే శీర్షికపై అద్భుతమైన ప్రవచనాన్ని అనుగ్రహించారు. అటుపై జయరామ్ రెడ్డి, చిలకమఱ్ఱి రవి, మధుసూదన్ రాజగోపాలాచార్యులు మొదలుగువారి గృహాలను సందర్శించి మంగళాశాసనం కావించారు. సాయంత్రం సౌత్ శానోజే ఆలయాన్ని సందర్శించి మకాంకి చేరుకున్నారు.

2వ తేదీ మధ్యాహ్నం 1గంటకు శ్రీమాన్ రవీంద్రగారి అభ్యర్థనపై నమస్తే ప్లాజా (సూపర్ మార్కెట్) ను సందర్శించి మంగళాశాసనం చేసారు.

గత ఏడాదిలానే ఈసారిగూడ స్టాన్‌ఫర్డ్ యూనివర్శిటీలో చిన్నారులందరికీ రెండు





రోజుల ఆధ్మాత్మిక శిబిరం నిర్వహించారు. మానవుడు కోతి రూపాంతరం కాదని ఋషి సంతానమని ఉద్బోధిస్తూ పరమ ఋషి నమస్కారము ప్రతిరోజు కృతజ్ఞతతో చేసినవారికి జ్ఞాపక శక్తి మేధా సంపత్తి వాక్‌శక్తి కలుగునని తెలుపుతూ అనేక లోకోపకారక కార్యాలను నిర్వహించిన అగస్త్యాది మహర్షులను దృశ్యరూపంగా వివరించారు. అటు తర్వాత పెద్దలకు కూడా తోచని అనేక ప్రశ్నలు ఆశ్చర్యము కలిగించే విధంగా అడిగిన చిన్నారులకు శ్రీ స్వామివారు తగిన సమాధానాలను తెలిపారు. 2,3 తేదీలలో మధ్నాహ్నం ఈ చిన్నారుల శిబిరం జరిగాక, అందరికీ సర్టిఫికెట్లు శ్రీమాన్ మురళీగారి నిర్వహణంలో అందించారు.

3వ తేదీ శ్రీ స్వామివారి సమాశ్రయణ కార్యక్రమము నిర్వహించి జెట్ ప్రముఖ కార్యకర్తలు హరితా భీమ్ పటేల్ దంపతుల గృహాన్ని అనుగ్రహించారు. జెట్ కాలిఫోర్నియా శాఖవారు చిన్నారులకు నిర్వహించిన వివిధ పోటీలలో విజేతలకు యోగ్యతాపత్రములు ఈ కార్యక్రమాన్ని నిర్వహించిన యూనివర్శిటీ విద్యార్థి శ్రీమాన్ అరుణ్ శ్రీధర్‌కు అనేక మంగళా శాసనములు కృపచేసినారు.

శ్రీమాన్ ముక్కామల అప్పారావుగారి ఆహ్వానంపై చిన్మయ మిషన్‌లో ప్రముఖ కార్యకర్త శ్రీమాన్ ప్రాణ్‌జీ గృహాన్ని, జయ సుమన వెంకటేశ్వరరావు దంపతుల గృహాన్ని సందర్శించారు. 4వ తేదీనాడు శ్రీ స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో "Sunny wale Temple" ఆవరణలో శ్రీ లక్ష్మీనారాయణేష్టి కార్యక్రమం అత్యంత వైభవంగా జరిగింది. ఆగమాచార్యులు శ్రీ మధుసూదనాచార్యులు గారు ఇష్టిని చక్కగా చేయించారు. చిరంజీవి గోపీకృష్ణ, శ్రీమాన్ భాగవతాచార్యులుగారు, సామవేద పండితులు గోవింద శ్రీనివాసన్ గారు స్థానిక పురోహిత వర్గమంతా వేద, ఇతిహాస, పురాణ దివ్యప్రబంధ పారాయణములు చేసారు. కాలిఫోర్నియా రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుండి వచ్చిన అశేష భక్తజనం ఈ కార్యక్రమాన్ని కన్నుల పండుగగా సేవించుకున్నారు. జెట్ కార్యవర్గం హరిత భీంపటేల్, అరుణ విష్ణు, ఉష హరి దంపతులు అనేక మంది కార్యకర్తలు భక్తులచే కార్యక్రమాన్ని ఆనందంగా సేవింపచేశారు. ఆలయ అధ్యక్షులు శ్రీమాన్ జోషిగారు పూర్తి సహకారాన్ని అందించారు. వీరందరికీ శ్రీ స్వామివారు అనేక మంగళా శాసనాలు కృపచేసారు. ఈ ఇష్టి, మరియు పూజలలో సేకరించిన ధనాన్నంతనూ ''జీయర్ గురుకుల'' వ్యవస్థలో వినియోగించాలని జెట్ నిర్ణయించగానే ఇద్దరు ఉదారదాతలు, ఆ ధనానికి సరియైన ధనాన్ని తామిరువురూ వేరు వేరుగా సమర్పిస్తామని వాగ్దానం చేసారు. మధ్యాహ్నం మూడు గంటలకు శ్రీ స్వామి వారు TANA వారి ఆహ్వానంపై శాన్‌హోశే వేంచేసి అక్కడి భక్తజనానికి ప్రవచనాన్ని అనుగ్రహించారు. భారత దేశానికి, తెలుగు తనానికి దూరంగా ఉంటూ కూడా ఇంత చక్కటి అభిమానంతో మానసిక ఆనందాన్ని, ఆప్యాయతలను పంచుకుంటూ పెంచుకొనే మీ శ్రద్ధను చూస్తుంటే మాకు చాలా ఆనందంగా ఉందని శ్రీ స్వామివారు అన్నారు. తెలుగు భాషకు ఉన్న పూర్ణత్వాన్ని, గొప్పతనాన్ని వర్ణించి వేదానికి దగ్గరి భాష మన తెలుగేనని వివరించారు. భగవద్గీత జీవించేకళను మనకు నేర్పుతుందని చెప్తూ, ఆ విధానాన్ని సోదాహరణముగా వివరించి సభలోని వారందరిని ముగ్ధుల్ని చేసారు. సాయంత్రం ఆరు గంటలకు శ్రీమాన్ కల్వపూడి మురళీకృష్ణగారి గృహానికి శ్రీ స్వామివారు వేంచేసి పాదపూజ స్వీకరించి అనుగ్రహించినారు. అటు తరువాత అరుణ విష్ణు దంపతుల గృహములో పాదపూజను స్వీకరించి రాజకుమారి, నవీన్ దంపతులకు కూడా మంగళాశాసనములు చేసారు.

5వ తేదీ చికాగోలోని ఒహేర్ విమానాశ్రయంలో శ్రీమతి మణి అక్కినేని

గారు శ్రీమతి ఊర్వశి పటేల్ గారు, శ్రీమతి అనుపమ మొదలగువారు శ్రీస్వామివారికి స్వాగతం పలికినారు. జనీవా సమీపంలోని ఇంటర్ లేకెన్ రిసార్ట్‌కు శ్రీవారు నేరుగ చేరుకున్నారు. JET USA ట్రెజరర్ శ్రీమతి చిత్రామాధవన్-కార్యదర్శి పొన్నాల శ్రీనివాస్ మరియు మాధవన్‌గార్లు, శిబిరంలో పాల్గొనుటకు విచ్చేసినవారంతా శ్రీ స్వామి వారికి స్వాగత సుమాంజలి సమర్పించారు. అద్భుతమైన ప్రకృతి సౌందర్యంతో అలరారుతున్న ప్రదేశం ప్రక్కనే 'కోమో' అనే సరస్సు ఉంది. ఈ ప్రాంతానికి అమెరికా వాసులు శని, ఆది వారాలలో విహరించ డానికి విపరీతంగా వస్తూంటారు. శ్రీ స్వామి వారు విహారప్రదేశంలో ఎలావుంటారోనని అందరూ అనుకున్నారు. కాని శ్రీ స్వామి వారు రిసార్ట్‌లో తమ పాదం మోపగానే ఆ ప్రాంతమంతా శిబిరంలో పాల్గొనటానికి వచ్చిన 50 మంది కుటుంబాల భగవద్బంధువులతో ఆశ్రమ వాతావరణంగా కళకళలాడింది. రాత్రి 10 గంటలకు అందరిని సమావేశపరచి 6వ తేదీనుండి 12వ తేదీవరకు జరిగే ఈ వేసవి శిబిరంలో పాటించవలసిన దినచర్యను నియమాలను శ్రీ స్వామివారు అందరికి తెలియజేసారు.

## జూలై 6 నుండి 12వ తేదీవరకు లేగ్‌జనీవా ప్రాంతంలో జరిగిన ఆధ్యాత్మిక వేసవి శిబిరం

శ్రీ స్వామివారు అమెరికాలోని ప్రవాస భారతీయులకు ఎడారిలోని ఒయాసిసులా ప్రసాదించిన వరం ఈ వేసవి శిబిరం. అత్యంత వైభవంగా నిర్మాణాత్మకంగా జరిగింది. అమెరికా నలుమూలలనుండి (50) కుటుంబాలు సుమారు 120 మంది ఈ శిబిరంలో పాల్గొని తమను గూర్చి, భగవంతుని గూర్చి, సత్సంప్రదాయమును గూర్చి అనేక విషయాలు శ్రీ స్వామివారి ద్వారా తెలుసుకొనేందుకు సమయమును సద్వినియోగం చేసుకున్నారు. ఉదయం 5 గంటలకు ప్రాతఃస్మరణీయంతో ప్రారంభమైన దినచర్య రాత్రి 10 గంటల వరకు ఇంటరాక్టివ్ కాలాంశంతో ప్రతీరోజు సమాప్తమయ్యేది. అప్పుడపుడూ వచ్చిపోయే భక్తులు సుమారు 10, 20 మంది రోజూ ఉంటూ ఉండేవారు.

శారీరక మానసిక ఆరోగ్యంకోసం ప్రాతః స్మరణీయానంతరం ప్రాణాయామము, యోగాభ్యాసమునుకూడా నేర్పించారు. ఈ కాలాంశాన్ని శ్రీ స్వామివారి పర్యవేక్షణలో తత్త్వప్రచారకులు శ్రీమాన్ శాంతారామ్ జెట్ న్యూజెర్సీ నిర్వాహకులు శ్రీమతి విజయఅలక్కిగారు నిర్వహించారు. శ్రీ స్వామివారి పెరుమాళ్ళ సన్నిధిలో ఆరాధనా సేవాకాలం తీర్థప్రసాదగోష్ఠి కాగానే తదనంతరం ఉదయం9 గంటలకు శ్రీస్వామివారు మాండుక్యోపనిషత్‌ను కంప్యూటర్ దృశ్యాల ద్వారా సులభ శైలిలో అనుగ్రహించారు. మరియు వైదిక వాఙ్మయ పరిచయం చేసారు. మధ్యాహ్నం అనుయాగం అయిన తరువాత స్వల్ప విశ్రాంతినిచ్చి భజన, సంకీర్తనలు నేర్పే కాలాంశమును శ్రీమతి కొండవీటి జోతిర్మయి నిర్వహించారు. మధ్యాహ్నం శ్రీ స్వామివారు శ్రీ యామునాచార్యులు రచించిన గీతార్థసంగ్రహం 6 అధ్యాయాల సారాన్ని బోధించారు. ఉచ్చారణా కాలాంశంలో ప్రాతఃస్మరణీయం, కాంతాచతుశ్లోకి, శ్రీస్తవము అందరిచే రాగయుక్తముగా వల్లింపచేసారు. సాయంకాలం సామూహిక శ్రీవిష్ణు సహస్రనామస్తోత్ర పారాయణము, రాత్రి అనుయాగము జరిగిన అనంతరము ఇంటరాక్టివ్ కాలాంశంలో శ్రీ స్వామివారు బోధించిన విషయాలలో సందేహాలు ఏమైనా ఎవరికైనా ఉంటే తీర్చేవారు. ఇదే కాలాంశంలో పంచాగ్నివిద్య, వేదము చెప్పిన Big Bang సిద్ధాంతాన్ని తెరపై చూపిస్తూ శిబిరంలోనివారందరికీ సువిదితం చేసారు. శ్రీమాన్ కృష్ణగారు (కంప్యూటర్స్)





వివిధ కాలాంశములలో శ్రీ స్వామివారు వివరిస్తున్న విషయానికనుగుణంగా యానిమేషన్స్ కంప్యూటర్ ద్వారా తెరపై ప్రత్యక్షం చేస్తూ శిబిరంలో విశేష సేవలు అందించారు. అలాగే విషయానికనుగుణంగా సులభ గ్రాహ్యతకోసం యానిమేషన్స్ తయారుచేసిన రాజమహేంద్రి నగరంలో ప్రముఖ మానసిక వైద్య నిపుణులు దక్షిణభారత మానసికవైద్య సంఘాధ్యక్షులు అయిన శ్రీమాన్ కత్తి రామారెడ్డిగారికి శ్రీ స్వామివారు ప్రత్యేక మంగళాశాసనములు కృపచేసారు. శిబిరంలోనివారంతా కూడా కృతజ్ఞతాం జలులు సమర్పించుకున్నారు.

8వ తేదీన పెరియాళ్వార్ తిరునక్షత్ర మహోత్సవాన్ని శ్రీ స్వామివారు చాలా వైభవంగా నిర్వహించారు. పెరియాళ్వార్ల వైభవాన్ని తెలిపే దృశ్యాలను తెరపై చూపిస్తూ శ్రీ స్వామివారు వివరించారు.

10వ తేదీ సాయంకాలం అందరూ శ్రీ స్వామివారితో జెనీవా సరస్సులో పెద్ద పడవలో ఒక గంటసేపు చిన్నారుల శ్లోకపఠనము, భజనలు, కీర్తనలతో ఆధ్యాత్మిక విహారయాత్ర సాగించారు.

11వ తేదీన విశేషంగా అందరూ ఆరుబైట ప్రకృతి మాత వడిలో కూర్చొని శ్రీ స్వామివారి వేదాంత పాఠాలు విని రాత్రి ఇంటరాక్టివ్‌కాలాంశంలో శ్రీ స్వామివారి ద్వారా బోధింపబడిన మాండుక్యోపనిషత్, భగవత్‌గీత వేద వాఙ్మయములలో అందరూ ఒక్కొక్క అంశంపై తాము గ్రహించిన విషయాన్ని శ్రీ స్వామివారి ముందు విన్నవించుకున్నారు.

12వ తేదీ శిబిరంలో చివరిరోజు. ఆరోజు శిబిరంలో నేర్చుకున్న విషయాలపై క్విజ్ కార్యక్రమాన్ని నిర్వహించారు. శిబిరంలో పాల్గొన్నవారందరినీ నారాయణ, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, అనే ఐదు గ్రూపులుగా విభజించి శ్రీ స్వామివారే స్వయంగా క్విజ్‌ను నిర్వహించారు. శ్రీమాన్ మురళీకృష్ణగారు, శ్రీమతి విజయ అలక్కిగారు శ్రీమాన్ కృష్ణగారు (కంప్యూటర్స్) సమన్వయ కర్తలుగా వ్యవహరించారు. నారాయణ గ్రూపు మొదటి స్థానాన్ని, ప్రద్యుమ్న గ్రూపు రెండవస్థానాన్ని గెలుచుకున్నారు. తదనంతరం శిబిర సమారోహణ కార్యక్రమం ప్రారంభమైంది. JET USA. కమిటీ కార్యకర్తలందరూ ఒకరి తరువాత ఒకరు వేదికపై మాట్లాడారు. భారత దేశంలో ఊపిరి సలపని కార్యక్రమాలున్నా ఖండాంత రంలో ఉన్న మమ్మల్ని తరింపచేయడానికి విచ్చేసి అమూల్యమైన వేదాంత రత్నాలను, సంప్రదాయ పరిమళాలను వెదజల్లి జీవితాలలో వెలుగును నింపిన శ్రీ జీయరు స్వామివారికి అనేకమైన కృతజ్ఞతాపూర్వక దాసోహములను అందరూ తమ ఉపకార స్మృతిని వ్యక్తం చేసారు. ఈ వారంరోజులు శిబిరంలోనివారందరికీ రుచికరమైన ప్రసాదాలు సాపాటు తయారుచేసి వడ్డించడంలో శ్రీమతి డా. చిత్రామాధవన్ గారు, శ్రీమాన్ భగవతాచార్య స్వామివారు శ్రీమతి వాసంతి అహరంగారు, శ్రీమతి సుధ చెలసానిగారు, ఆనంద్ అపూర్వ దంపతులు మొదలగు వారు ప్రధాన పాత్రపోషించిన వారు. శిబిర సమన్వయ కర్తలు శ్రీమతి మణి అక్కినేనిగారు, శ్రీమాన్ పొన్నాల శ్రీనివాసుగారు విశేష సేవలందిం చారు. శ్రీమాన్ విష్ణు, హరి సూరపనేనిగార్లు, శ్రీమాన్ రవి అహరంగారు, శ్రీమాన్ డా॥ తమిరెసగారు, శ్రీమాన్ పులిజాలగారు, శ్రీమాన్ కంభాటిగారు, సాయిగారు, మోహన్, వంశి, రఘు, కరుణాకర్ మొదలగువారు వివిధ సేవలలో సహకరించి శిబిరం విజయవంతం కావడానికి విశేష కృషి చేసారు. చివరగా శ్రీ స్వామివారు సమారోపణ సందేశంలో శిబిరంలో పాల్గొన్నవారందరికి ప్రత్యక్షంగా పరోక్షంగా విశేష సేవలందించిన జెట్ చికాగో, కాలిఫోర్నియా, న్యూజెర్సీ,

వాషింగ్‌టన్ D.C., హ్యూస్టన్, ఫ్లొరిడా, బ్లూమింగ్‌టన్ కార్యకర్తలందరికీ మంగళా శాసనములు చేసారు. శాంతిమంత్రముతో శ్రీ స్వామివారు శిబిరమును ముగించి శిబిర స్థలమునుండి బ్లూమింగ్‌టన్‌కు బయలుదేరి మార్గ మధ్యంలో వర్నన్ హిల్స్‌లోని శ్రీమాన్ కరుణాకర్‌గారి గృహానికి వేంచేసి, మంగళాశాసనము చేసి అరోరా ప్రాంతం లోని శ్రీవేంకటేశ్వరస్వామిని సేవించుకుని రాత్రికి బ్లూమింగ్‌టన్‌లోగల శ్రీమాన్ రామ్మోహనరావుగారి గృహానికి వేంచేసి బసచేసారు.

## గురుపూజా మహోత్సవం

**13-7-2003 బ్లూమింగ్‌టన్** - శ్రీస్వామివారి ప్రత్యేక పర్యవేక్షణలో బ్లూమింగ్‌టన్ నగరంలో ఉన్న ప్రవాస భారతీయులే కాకుండా శ్రీ స్వామివారితో శిబిరంనుండి విచ్చేసిన జెట్- కాలిఫోర్నియా, చికాగో, హ్యూస్టన్, వాషింగ్‌టన్, న్యూజెర్సీ కార్యకర్తలందరూకూడా ఈ కార్యక్రమంలో పాల్గొనడంతో నయనానందకరంగా గురుపూజామహోత్సవం ప్రారంభమైంది. శ్రీ స్వామివారు తమ అనుగ్రహ భాషణంలో ఆచార్యుల ప్రాముఖ్యాన్ని, వైభవాన్ని ప్రవచించారు. మనం ఆచార్యులకోసం వెదకనక్కరలేదని భగవంతుడే తగిన ఆచార్యులను మార్గదర్శనం చేయడానికి పంపిస్తాడని తెలియజేసారు. ఆ తరువాత శ్రీ స్వామివారు లోకానికే జగద్గురువైన శ్రీకృష్ణునియొక్క ప్రతిమలను అందరికీ అనుగ్రహించి పూజ చేయించారు. వేదికపై శ్రీ పెద్దజీయరుస్వామివారి పాదుకులకు అభిషేకం చేసి అర్చన చేసారు. అనంతరం అభిషేకతీర్థం, ప్రసాదం అంతరికీ వితరణ కావించడంతో గురుపూజా మహోత్సవం సుసంపూర్ణమైంది. ఈ కార్యక్రమాన్ని సేవించుకొనుటకు చక్కటి ఏర్పాట్లుచేసి అందరికీ అమూల్య అవకాశాన్ని కలిగించిన శ్రీమాన్ ముళ్ళపూడి రామ్మోహనరావుగారికి, వారి కుటుంబానికి, సహకరించిన కార్యకర్తలందరికీ శ్రీ స్వామివారు మంగళాశాసనములు అనుగ్రహించారు. మధ్యాహ్నం రోడ్డుమార్గాన బయలుదేరి రాత్రికి మినియాపోలీస్ నగరం చేరుకొని శ్రీమాన్ కాండూరి జగన్నాథాచార్యులవారి గృహంలో బసచేసారు.

**14-7-2003న మినియా పోలీస్** - ఉదయం ఆరాధనానంతరం శ్రీ స్వామివారు శ్రీమాన్ కాండూరి సీతారామాచార్యులు, కుమారి లక్ష్మి, శ్రీమాన్ వంశీ మోహన్‌గార్ల కోరిక మేరకు వారిగృహాలకు వేంచేసి మంగళాశాసనములు చేసారు. సాయంత్రం 7 గంటలకు సీతారామచంద్రస్వామివారి ఆలయాన్ని సందర్శించి అక్కడ చేరిన అశేష భక్తజనానికి అమూల్యమైన సందేశాన్ని కృపచేసి గీతాజ్యోతి సూత్రాలను సోదాహరణంగా వివరించారు. శ్రోతలు తమ ధార్మిక సందేహాలను కూడా నివృత్తి చేసుకున్నారు. శ్రీమాన్ కె. జగన్నాథా చార్యులవారు ఇదే ఆలయంలో అర్చకులుగా సేవలందిస్తున్నారు.

15-7-2003న ఆరాధనానంతరం శ్రీమాన్ జగన్నాథాచార్యులుగారు శ్రీమాన్ శ్రీహరి ఆచార్యులుగారు సతీసమేతంగా శ్రీ స్వామివారికి పాదపూజ సమర్పించారు. వారిని అనుగ్రహించి శ్రీ స్వామివారు చికాగో బయలుదేరారు. మార్గమధ్యంలో జెట్ - U.S.A. కార్యదర్శి శ్రీమతి శ్రీమాన్ పొన్నాల వందన శ్రీనివాసు గార్ల అభ్యర్థన మేరకు వసీతా పట్టణంలోని వారి గృహానికి వేంచేసి పాదపూజను స్వీకరించి వారికి, వారికుమారుడైన చిరంజీవి నైమీష్‌కు అక్షరాభ్యాసం చేసి **చికాగో** చేరుకున్నారు. జెట్-ట్రజరర్ శ్రీమతి చిత్రామాధవన్‌గారి గృహానికి వేంచేసి మంగళాశాసనాలు అనుగ్రహించి అర్థరాత్రికి జెట్-U.S.A. అధ్యక్షులు శ్రీమతి మణి అక్కినేనిగారి గృహానికి వేంచేసి బసచేసారు.

16న అక్కినేనిగారి గృహంలో ఆరాధన పూర్తిచేసుకొని వారి కుటుంబ సభ్యులకు మంగళాశాసనాలు అనుగ్రహించి టెక్సాస్ రాష్ట్రంలోని హ్యూస్టన్ ప్రాంతానికి బయలు దేరారు. హ్యూస్టన్ విమానాశ్రయంలో శ్రీ స్వామివారికి శ్రీమాన్ తమిరెస శ్రీనివాసా చార్యులుగారు వారి కుటుంబ సభ్యులు, పులిజాలగారు, కంభాటిగారు మొదలగు వారందరూ శ్రీ స్వామివారికి స్వాగతం పలుకగా తమిరెసవారింటికి వేంచేసి అనుష్ఠానాదులు పూర్తిచేసుకొని శ్రీస్వామి వారు జెట్ - హ్యూస్టన్ కార్యకర్తలందరితో సమావేశమై కార్యకర్తలు నిర్వహించిన కార్యక్రమాలను సమీక్షించి వారు నిర్మించబోయే అష్టలక్ష్మీదేవాలయము తీరుతెన్నులు ఎలా ఉండాలో వివరించారు.





17న శ్రీ స్వామివారి ఆరాధనానంతరం వికాసతరంగిణి ప్రముఖ కార్యకర్త శ్రీమాన్ జీవన్ పులిజాలగారి గృహాన్ని పావనం చేసి వారి కుటుంబానికి మంగళాశాసనములు చేసి, అలాగే హరీష్‌గార్ల గృహాన్నికూడా మంగళాశాసనములు చేసి బసకు చేరుకున్నారు. డా॥ శ్రీనివాసాచార్య తమిరెసగారి విశాల గృహం ఈ మూడు రోజులు భగవద్బంధువులతో కళకళ లాడింది. తమిరెస దంపతులు తమకు లభించిన ఈ అవకాశం అపూర్వమని భగవత్ భాగవతాచార్య సేవ అని మురిసిపోయి అందరికి చక్కటి ఆతిథ్యాన్ని అందించారు. మధ్యాహ్నం కొద్దిసమయం ప్రవచనగోష్ఠి జరిగింది. అనంతరం శ్రీ వైష్ణవి, ఆర్తి, అనుపమ, సీత, మాణిక్యం అను పిల్లల శాస్త్రీయ సంగీతాన్ని ఆలకించారు. సాయంత్రం స్వామినారాయణ మందిరంలో శ్రీ స్వామివారు భక్తగోష్ఠికి మృదుమధుర సందేశాన్నందించి భక్తుల సందేహాలను కూడా తీర్చారు.

18వ తేదీ ఉదయం శ్రద్ధాళువులంతా శ్రీస్వామివారిద్వారా సమాశ్రయణం పొంది సత్సంప్రదాయంలోకి ప్రవేశించారు. అనంతరం అపూర్వా ఆనంద్ దంపతుల గృహానికి వేంచేసి వారికి మంగళాశాసనాలు చేసి సాయంత్రం తమిరెస గృహంలోనే చిన్నపిల్లలందరికి శ్రీ స్వామివారు అగస్త్య మహర్షి, భరద్వాజమహర్షి గురించి చక్కని విషయాలను తెరపై చూపిస్తూ వివరించారు. అనంతరం చిన్నారులు అడిగిన అద్భుతమైన సందేహాలను తీర్చి వారిని ఆనంద భరితులను చేసారు. సాయంత్రం శ్రీమాన్ ముక్కామల అప్పారావుగారి అభ్యర్థనమేరకు హ్యూస్టన్‌లోని చిన్మయా మిషన్ సెంటర్‌ను శ్రీ స్వామివారు సందర్శించారు. అక్కడ చిన్నపిల్లలకు వేసవి శిబిరములు నిర్వహించి వారిచే ఆధ్యాత్మిక చిత్రలేఖనం చేయిస్తూ భగవద్గీతా శ్లోకాలను నేర్పించేటువంటి పాఠ్య ప్రణాళికను, అధ్యాపకులను పర్యవేక్షించి అక్కడి భక్తులకు తమ సందేశంలో ఆచార్యకృపకు పాత్రులమైతే చాలు, మనం సాధించలేనిదంటూ లేదని శబరిని ఉదాహరణగా వివరించారు. ఆ తరువాత స్వామినారాయణ మందిర్‌లో వేదవే పరమప్రమాణమని దానిని అనుసరించినవారు ఉన్నత స్థితిని పొందుతారని శ్రీ స్వామివారు తమ సందేశంలో తెలియజేసారు. ఆ తరువాత శ్రీమాన్ రఘుగారి గృహాన్ని సందర్శించి బసచేరారు. తమిరెస కుటుంబ సభ్యులంతా కలసి శ్రీస్వామివారికి వైభవంగా పాదపూజ నిర్వహించగా తమిరెస దంపతులకు, వారి కుటుంబసభ్యులకు జెట్-వికాసతరంగిణి కార్యకర్తలందరికీ, ముఖ్యంగా వీరిని అనుసంధానం చేస్తున్న శ్రీమాన్ దిట్టకవి తాతాచార్యులవారికి మంగళాశాసనాలు చేసారు.

19వ తేదీన అష్టలక్ష్మీదేవాలయం నిర్మించబోయే ప్రదేశంలో శ్రీ స్వామివారు సామూహిక శ్రీలక్ష్మీనారాయణ పూజ భగవద్బంధువులందరిచే చేయించారు. పూజానంతరం వికాసతరంగిణి చిన్నారు లంతా శాస్త్రీయ నృత్యం, సాంస్కృతిక కార్యక్రమాలు ప్రదర్శించారు. కార్యకర్తలు శ్రీస్వామివారి కరకమలముల ద్వారా

చిన్నారులకు బహుమతులిప్పించారు. తరువాత కార్యకర్తలకు, శ్రేయోభిలాషులందరికీ శ్రీస్వామివారు ఆలయ నిర్మాణాన్నిగూర్చి సూచనలందించారు. సంప్రదాయం ఉట్టిపడేరీతిలో అమ్మవారి వైభవానికి ధీటుగా పద్మాకారంలో ఆలయ నిర్మాణం జరగాలన్నారు. అనంతరం ఆలయ ప్రాంగణంలో శ్రీ స్వామివారి శ్రీహస్తాలతో 'ఓక్' అనే మొక్కను నాటారు. తరువాత చిత్ర శ్రీధరన్‌గారి గృహానికి విచ్చేసి మంగళాశాసనములు అనుగ్రహించి తిరిగి బసచేరి అక్కడనుండి సపరివారంతో శ్రీస్వామివారు హ్యూస్టన్ విమానాశ్రయానికి చేరుకొని గగనమార్గంగా అమెరికా రాజధాని వాషింగ్‌టన్-D.C. చేరుకున్నారు. విమానాశ్రయంలో కో-ఆర్డినేటర్ శ్రీమాన్ రవి అహరంగారు, కార్యకర్తలు కిషోర్, డా॥ చంద్ర, శేషు, హేమ మొదలగువారందరూ శ్రీస్వామివారికి స్వాగతం పలికారు. విమానాశ్రయంనుండి వర్జీనియా రాష్ట్రంలోని మన జెట్-ఆశ్రమ స్థలానికి చేరుకున్నారు. ఈ స్థలమును ఫేర్‌పాక్స్ అనే ప్రాంతంలో ఆశ్రమ నిర్మాణానికి శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయంకోసం ఆరున్నర ఎకరాల స్థలాన్ని వాషింగ్‌టన్ D.C. శాఖవారు కొనుగోలుచేసారు.

20వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీ వేంకటేశ్వరస్వామిమందిర ప్రదేశంలో భూమిపూజ శ్రీస్వామివారి పర్యవేక్షణలో ఆగమ విద్వాంసులు మధుసూదనాచార్యులు మరియు గోపీకృష్ణమాచార్యులు నిర్వహించారు. ఈ కార్యక్రమంలో భాగవతోత్తములంతా కూడా భాగస్వామ్యులయ్యారు. సాయంత్రం ఆరు గంటలకు సామూహిక శ్రీకృష్ణపూజా కార్యక్రమాన్ని అందరిచే చేయించారు.

21వ తేదీమధ్యాహ్నం నుండి కోసూరి శేషాచార్యులు చంద్రకళ, కుమారస్వామి సాయిలక్ష్మి, కిరణ్‌కుమార్ జాస్తి ధరణి గార్ల కోరికమేరకు గృహాలకు వేంచేసి మంగళాశాసనాలు అందజేసారు. సాయంత్రం శ్రీధర్ ఛత్రాతి ప్రేమ అభ్యర్థనపై మేరీలాండ్‌లో వారి నూతనంగా తీసుకున్న భూమిలో పాదాన్నిమోపి పునీతంచేసి అనంతరం వీరి గృహానికి వేంచేసి మంగళాశాసనములు కావించారు. వీరు చాలా ఉదార స్వభావులు. తమకున్న మరోగృహాన్ని జెట్-కార్యక్రమాలు నిర్వహించుకొనుటకు ఎలాంటి రుసుము తీసుకోకుండా అప్పగించారు. శ్రీ స్వామివారు దానినికూడా సందర్శించి మంగళాశాసనములుచేసి వర్జీనియాలో క్రొత్తగా నిర్మాణంచేసినా ఈ కేంద్రాన్నికూడా వదలకుండా ఇక్కడవారికి అనుకూలతకోసం కొనసాగించాలని కార్యకర్తలను శ్రీ స్వామివారు ఆదేశించారు.

22వ తేదీ మధ్యాహ్నం శ్రీస్వామివారు, పరివారం మరియు కార్యకర్తలతో ఇంటర్‌నేషనల్ స్పై మ్యూజియంను, నేషనల్ ఎయిర్ స్పేస్ మ్యూజియంను వీక్షించారు. స్పేస్ మ్యూజియంలో చంద్రమండలంపైకి పంపించిన శాట్‌లైట్ ర్యాకెట్లను, ప్రపంచాన్నంతా భయపెట్టిన స్కైలాబ్‌ను కూడా వీక్షించి ఇందులోనే ఐన్‌స్టీన్ ప్లానిటోరియం, ఐమాక్స్ థియేటర్‌లో స్పేస్ స్టేషన్-3డి సినిమా కూడా సందర్శించారు వ్యోమగాములు ఆరు నెలలు రాకెట్‌లోనే ఉండి ఏవిధంగా వారి దైనందిన కార్యక్రమాలు చేసుకుంటూ విశ్వంలోని వింతలను కనిపెడతారో కన్నులకు కట్టినట్టుగా చూపించారు.

సాయంత్రం 7 గంటలకు ప్రముఖ కార్యకర్త శ్రీమాన్ కిషోర్-ప్రియ గార్ల గృహాన్ని సందర్శించి మంగళాశాసనం చేసారు. అనంతరం జెట్-ఆశ్రమస్థలంలో సామూహిక శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణ జరిగింది. శ్రీ స్వామివారు తమ ప్రవచనాన్ని మొదలు పెట్టారో లేదో వెంటనే ఉరుములు, మెరుపులతో కుంభవృష్టి ప్రారంభమైంది. అయినా భక్తులు కదలకుండా కార్యక్రమంలో పాల్గొన్నారు. శ్రీవారు అందరిచే వర్షంలో భజనకూడా



చేయించగా భక్తులు ఆనంద పారవశ్యంతో నృత్యంచేస్తూ గొంతుకలిపారు.

23 ఉదయం శ్రీ స్వామివారు ఆరాధనానంతరం భగవద్బంధువులకు సమాశ్రయణములు అనుగ్రహించి, మేరీలాండ్‌లోని తేజస్వీ, లక్ష్మి, సాయికాంత్ శైలేష్, రూప వెంకట్ రాజేశ్వరి దంపతుల ఆహ్వానాన్ని మన్నించి వారి గృహాలకు వేంచేసి మంగళాశాసనములు అందించారు. జెట్-వాషింగ్‌టన్ D.C. ప్రతినిధులు అయిన వాసంతి రవిఅహరమ్ దంపతుల ఆహ్వానంపై వారి గృహాన్ని పావనంచేసి, వారికీ వారి పెద్దలకు మంగళాశాసనములు చేసి రోడ్డుమార్గంగా న్యూజెర్సీ బయలుదేరారు. మార్గమధ్యంలో Corneys point ప్రాంతంలోని Comfert Inn & suits (Motel) సందర్శించి మంగళాశాసనములు చేసారు. దీనిని మన హైదరాబాద్ జెట్ కార్యాలయ మేనేజర్‌గా ఉంటున్న శ్రీమాన్ విజయకుమార్‌గారి సోదరులు శ్రీమాన్ గోవిందరాజులు, శ్రీమాన్ రమేష్‌గారు నిర్వహిస్తున్నారు. అనంతరం సమీపంలోని వీరి సోదరి శ్రీమతి సుజాతగారి గృహాన్నికూడా మంగళాశాసనంచేసి, న్యూజెర్సీలోని Plainsboro ప్రాంతంలోని శ్రీమాన్ శర్మఅలక్కీగారి గృహానికి చేరి బసచేసారు. శ్రీమాన్ శర్మ అలక్కీ, విజయఅలక్కీగారు జెట్ న్యూజెర్సీ శాఖ నిర్వహణా బాధ్యతను నిర్వహించి అంకితభావంతో సేవలందిస్తున్నారు.

24వ తేదీ ఆరాధనాదులు ముగించుకొని రమేష్‌గారు, గోవిందరాజులుగారు సోదరులు నిర్వహిస్తున్న మరో మోటెల్‌ను సందర్శించి మంగళా శాసనం చేసి, శ్రీమతి యశోధర రవీందర్‌గార్ల గృహానికి వేంచేసి మంగళాశాసనములు అనుగ్రహించి అనంతరం మురళి-పారిజాతం, రమ- గోవిందరాజుల గృహాల్ని కూడా శ్రీ స్వామి వారు తమ పాదస్పర్శతో పునీతం కావించారు. సాయంత్రం శ్రీమాన్ డా॥ పూర్ణచంద్రరావు గారి క్లినిక్‌ను సందర్శించి మంగళాశాసనం చేసి అక్కడ నుండి కంట్రీ హాస్పిటల్‌లో చికిత్స పొందుతున్న నరహరిరావుగారిని పరామర్శించి, శ్రీమాన్ పూర్ణచంద్రరావుగారి గృహానికి వేంచేసి అక్కడ నిరీక్షిస్తున్న భగవద్బంధువులందరికీ గిరిజన పాఠశాల ప్రాజెక్టును తెరపై చూపించి దానిప్రాముఖ్యతను వివరించారు. పూర్ణచంద్రరావు దంపతులు శ్రీస్వామివారి పాదపూజ నిర్వహించగా అందరికీ మంగళాశాసనములు అనుగ్రహించి నిలయానికి చేరుకున్నారు.

25వ తేదీన ఆరాధనానంతరం సమాశ్రయణాలను నిర్వహించి మధ్యాహ్నం నుండి అయ్యల విశ్వనాథం, వెల్లంకి రవి, దిట్టకవి భట్టాచార్యుల గృహాలకు వేంచేసి మంగళాశాసనములు చేశారు. సాయంత్రం శ్రీస్వామివారు దుర్గామందిర్ కమ్యూనిటీ హాలులో భగవద్బంధువులందరిచే లక్ష్మీనారాయణ పూజ జేయించారు. దీనికి ముందు వికాసతరంగిణి చిన్నారులంతా తాము నేర్చుకున్న శ్లోకాలను తెలుగును స్వామివారిముందు విన్నవించుకున్నారు. వారందరికీ ప్రోత్సాహంకోసం సర్టిఫికేట్లు కూడా అందించారు. అశేష భక్త జనానికి గిరిజన పాఠశాలల ప్రాజెక్టునుగూర్చి వివరించారు. ఈ నిర్మాణాత్మక కార్యానికి స్పందించిన శ్రీమతి తోటా పుష్పాదేవి నరహరిరావుగారు వారి కుటుంబ సభ్యులు అంతాకలసిజీయర్ గురుకుల్ పాఠశాలల కోసం 15వేల డాలర్లు సమర్పించు కున్నారు. విశేష కైంకర్యం చేసుకుంటున్న గోవిందరాజులు మరియు కుటుంబ సభ్యులను మంగళాశాసనములు చేశారు. పూజలో పాల్గొన్నవారంతాకూడా వారివారి శ్రద్ధను ఈ ప్రాజెక్టుకు సమర్పించుకున్నారు. శ్రీ స్వామివారు అందరికీ మంగళాశాసనములను చేసి నిలయానికి చేరుకున్నారు.

26వ తేదీన శ్రీస్వామివారి అమెరికా పర్యటనలో చివరిరోజు. జెట్-వాషింగ్‌టన్ D.C. జెట్-కాలిఫోర్నియా కార్యకర్తలు, ఇంకా అనేక దూర ప్రాంతాలనుండి శ్రీ స్వామివారిని సేవించుకొనుటకు విచ్చేసారు. ఉదయం తీర్థగోష్ఠి అనంతరం శ్రీమాన్ శర్మగారి గృహంలో 'ప్రజ్ఞ' అనే పేరుతో జెట్-లెర్నింగ్ సెంటర్ ను ప్రారంభించారు. ఇందులో పిల్లలకి, యువకులకు, పెద్దవారికి యోగ, ఆధ్యాత్మిక, సామాజిక సంబంధమైన విషయాలలో, సేవాకార్యక్రమాలలో శిక్షణ ఇవ్వడం జరుగుతుంది. శ్రీమతి విజయ అలక్కి, శ్రీమాన్ శర్మ అలక్కి దంపతులు దీనిని నిర్వహించే బాధ్యతను స్వీకరించారు. వీరికి తోడుగా 30మంది వాలంటీర్స్ కూడా సిద్ధమయ్యారు. వీరందరికీ శ్రీస్వామివారు మంగళాశాసనములు అనుగ్రహించారు. ప్రజ్ఞ ప్రారంభోత్సవం చి॥ అనిరుద్ధ్ కు అక్షరాభ్యాసంచేయడంతో ప్రారంభమైంది. అలక్కి దంపతులు, కార్యకర్తలు సామూహికంగా శ్రీస్వామివారికి పాదపూజ సమర్పించారు.

మొత్తంమీద అమెరికా పర్యటన ఒక చికాగోలో తప్ప యిబ్బంది లేకుండా సాగింది. సెప్టెంబర్ 9, నవంబర్‌లో యాక్సిడెంట్ తరువాత అమెరికాలో సెక్యూరిటీ చాల గట్టిగా ఏర్పాటు చేసారు. ఫ్లైట్ ఎక్కేముందు మనిషిని పూర్తిగా స్కాన్ చేస్తూ, చెప్పులుకూడా విప్పమని వాటిని కూడా స్కాన్ చేయటం జరిగింది. అయితే ఈసారి పెరుమాళ్ళను చెక్‌చేయటం విషయంలో ఎవ్వరూ ఇబ్బంది పెట్టలేదు.

ఈ సంవత్సరం జరిగిన స్పిర్చ్యువల్ క్యాంప్‌వలే వచ్చే సంవత్సరం తూర్పు, పశ్చిమ, ఉత్తర ప్రాంతాల్లో మూడు చోట్ల ఇటువంటి క్యాంపులు నిర్వహించాలని JET - USA మీటింగ్‌లో నిర్ణయం చేసారు. అయితే వారువారు తమ స్థానాల్లో అనేకమంది ఉత్సాహంగల కార్యకర్తలను ముందుగా నిర్ణయించేసి వారందరితో సంప్రదించుకొని, ఎలాచేయాలి అనే విషయాన్ని ధనుర్మాసంలోపుగా శ్రీస్వామి వారికి తెలియ చేయాలని సూచించారు. ఆతరువాత వచ్చిన సంప్రదింపులను ప్రోత్సహించబోమని, ప్రోగ్రామ్‌లు ముందుగానే నిర్ణయింపబడి అదేక్రమంలో సాగుతాయని JET - USA వారు శ్రీస్వామివారికి తెలియజేసారు. శ్రీస్వామి వారు అందుకు అంగీకరిస్తూ దీనిని చాలా స్ట్రిక్ట్‌గా అమలుపరచాలని సూచన చేసారు.

హ్యూస్టన్‌లోను, వాషింగ్‌టన్ - D.C. లోను నిర్మించబోయే ఆలయాల గురించి జరిగే ఏర్పాట్లను తెలియచేస్తూ ఉండమని వాటికి తగిన సూచనలిస్తూ వారందరికీ మంగళా శాసనాలు చేసారు.

మధ్యాహ్నం 3 గంటలకు న్యూయార్క్ అంతర్జాతీయ విమానాశ్రయానికి చేరి భారతదేశానికి చేరుకుని చెన్నైలో ఆరాధనా తిరుమంజనాదులు పూర్తి చేసుకొని నేరుగా రాజమహేంద్రిలో జరుగు గోదావరీ పుష్కర కార్యక్రమానికి వేంచేసి, ప్రారంభించారు.

## గోదావరి పుష్కర ప్రయుక్త బ్రహ్మయజ్ఞ నివేదిక

శ్రీమాన్ సముద్రాల రంగరామానుజా చార్యస్వామి, శ్రీమాన్ ఎస్.పి. రంగరాయ బట్టర్‌స్వామి, శ్రీమాన్ ఎన్.టి.పి. కృష్ణమాచార్యస్వామి మరియు జి. రంగనాథాచార్యస్వామివార్ల సలహాల మేరకు శ్రీమాన్ డా॥ ఎన్. రాజారాం, డా॥ కె. రామారెడ్డి, డా॥ టి.వి. నారాయణరావు, డా॥ ఎ. ప్రసాద్ చౌదరిగార్ల బృంద రూపకల్పనలోనూ...ఎం. రంగప్రసాద్, కె. పాపారాయుడు, శిఖాకొళపు శివరామ సుబ్రహ్మణ్యం, శ్రీనారయ్యగారు (కోరుకొండ), నంజల సీతారామరాజు, ముత్తంగి బుచ్చిరామయ్యగారు ఎమ్.వి.వి. రామానుజమ్, శిఖాకొల్లి సీతారామాంజ నేయులు ఎమ్. వెంకటరమణారెడ్డిగార్లవంటి పెద్దలు ప్రధాన దాతలై సహకారాన్ని అందించగా ఎస్.కె.వి.టి. కాన్వెంట్, దానవాయిపేట యజ్ఞ కార్యక్రమానికై అలంకరించుకొని శ్రీవారి ఆగమనానికై ఎదురుచూచుచుండగా...





**శ్రీవారి ఆగమనం**:- 28-7-03 సాయంత్రం 4 గం॥లకు స్థానిక మధురపూడి విమానాశ్రయంలో శ్రీవారు ప్రత్యేక విమానంలో దిగారు. శ్రీమాన్ గంగరాజుగారు ఏర్పాటు చేసిన Charted flight శ్రీవారు సరియైన సమయాన్కి రాజమహేంద్రి వేంచేయునట్లు చేసింది. JET-VT రాజమహేంద్రి ముఖ్యకార్యవర్గ సభ్యులు శ్రీవార్కి విమానాశ్రయంలో స్వాగతాంజలి ఘటించారు. అనంతరం శ్రీవారు రాందాసుపేటలోని శ్రీవరాహ లక్ష్మీనరసింహ స్వామివార్ని సేవించుకొని ఇంబాల ట్యాంకు పార్కువద్ద పూర్ణకుంభ స్వాగతం తెలియజేయడాన్కి సిద్ధమై ఉన్న 400 మంది వేద విద్యార్థులు మరియు అనేక వందలమంది భక్తజనుల వద్దకు విచ్చేసారు. మంగళ వాయిద్యాలతో శోభాయాత్రగా యజ్ఞప్రాంగణానికి శ్రీవారు వేంచేసారు. అనంతరంరాత్రి అంకురారోపణ విష్వక్సేన పూజాది కార్యక్రమాలు శ్రీమాన్ రమాకాంతాచార్యస్వామివారు నిర్వహించగా శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారు భక్తజనులకు మంగళాశాసనములు అందిస్తూ కార్యక్రమ స్వరూపాన్ని వివరించారు.

**అరణిమధనం**:- 29వ తేదీ ఉదయం యజ్ఞాచార్యస్వామి వారి ఆధ్వర్యంలో శ్రీమాన్ శ్రీనివాసాచార్య, మధుసూదనాచార్య స్వామివారి నేతృత్వంలో అరణిమధన కార్యక్రమం జరిగి బ్రహ్మయజ్ఞ, ఇష్టిహోమ కుండాలలో అగ్నిప్రతిష్ఠాపనా మహోత్సవం జరిగింది. దీనికి ముందుగానే యాగశాల ప్రాంగణంలో శ్రీశ్రీశ్రీ స్వామివారి కరకమలములతో "గరుడధ్వజ" ఆరోహణము జరిగినది. నాటినుండి 3వ తేదీవరకు రోజుకొక ఇష్టిహోమము, బ్రహ్మయజ్ఞాది కార్యక్రమాలు నిర్వహించబడ్డాయి. ఎంతోమంది యజమానులుగా ఈ కార్యక్రమాల్లో అన్వయించి తమ అభీష్టములు నెరవేర్చు కున్నారు. యాగశాలవద్ద పర్యవేక్షణ బాధ్యతను శ్రీమాన్ ఎస్. సీతారామాంజ నేయులుగారు స్వీకరించారు. వివిధ పారాయణల్లో అనేకమంది ఋత్వికులు అన్వయించి క్రమం తప్పక పారాయణాదులు చేసారు.

**పుష్కర స్నానాలు**:- 30-7-03వ తేదీ సాయంత్రం 7.16 ని॥లకు శ్రీశ్రీశ్రీ స్వామి వారు, అశేష జన ప్రవాహం శోభాయాత్రగా వెంటరాగా శ్రీమాన్ మధుసూదనాచార్య స్వామివారు పోలీసు కంట్రోలురూమ్ వైకులో సంకల్పాన్ని అందరిచేత అనిపించుచుండగా శ్రీవారు గోదావరి మాత పూజచేసి పసుపు కుంకుమ పట్టుచీరలు సమర్పించి పుష్కరస్నానాన్ని ఆచరించారు. అనంతరం అనేక వేలమంది భక్తులూ పుష్కర స్నానాలు ఆచరించి తరించారు. శ్రీమాన్ రోశయ్యగారి దంపతులూ ఈ కార్యక్రమంలో అన్వయించడం విశేషం.

**వికాసతరంగిణి పుష్కరోత్సవం**:- 1991వ సం॥లో ప్రారంభించిన వికాసతరంగిణి తన మొదటి పుట్టినరోజు వేడుకను ''వికాసతరంగిణి పుష్కరోత్సవం''గా ప్రధానవేదికపై శ్రీశ్రీశ్రీ స్వామివారు, వివిధ వికాసతరంగిణి కో-ఆర్డినేటర్లు జెట్ కార్యవర్గ సభ్యులు సమక్షంలో వైభవంగా జరుపుకొంది. శ్రీమాన్ భవాని ప్రసాద్‌గారు కార్యక్రమ నిర్వహణ బాధ్యతను స్వీకరించి 1991వ సం॥లో వికాసతరంగిణి ప్రారంభానికి ముఖ్యకారకులైన శ్రీమాన్ ఎస్.పి. రంగరాజుబట్టర్‌స్వామి, ఎస్.టి.పి. కృష్ణమాచార్యస్వామి (గీతాభవనం), ఎన్. సీతారామాచార్యస్వామి, నందం సీతారామ రాజుగారు, ప్రభాకరవర్మగారు, శ్రీమతి ఎమ్.వి. పద్మావతి, కుమారి శారద, శ్రీమతి పవిత్ర, శ్రీమతి అరుణగార్లకు శ్రీవారి కరకమలాలతో శాలువాలు, జ్ఞాపికలు అందించారు. తరువాత కో-ఆర్డినేటర్లకూ జ్ఞాపికలు అందించారు. ఈ సందర్భంగా

రామానుజవాణివారు శ్రీవారి కార్యక్రమాల సి.డి.లను శ్రీస్వామివారి చేతులమీదుగా ఆవిష్కరింపజేసారు. 400 వికాసతరంగిణి కార్యక్రమాలు, మరియు వికాసతరంగిణి ఆశయాలు తెలియజేయు ఫోటో ఎగ్జిబిషన్ కూడా శ్రీవారు ఆవిష్కరించారు.

**ప్రజ్ఞ - (విజ్ఞానతరంగిణి)**: - వాలంటీర్లుగా సేవలందించుచున్న హైస్కూలు, కాలేజి విద్యార్థుల శ్రీస్వామివారు ఇష్టాగోష్ఠిగా కూర్చొని విద్యార్థులలోని విజ్ఞాన తరంగలను వెలికి తీయాలనే సంకల్పంతో "ప్రజ్ఞ" అను "విజ్ఞానతరంగాన్ని" ఆవిష్కరించాలని దాన్కి ఆగష్టు 15వ తేదీని ముహూర్తముగా నిర్ణయించారు. ప్రతీనెలా ఈ కార్యక్రమ నివేదికను E-mail ద్వారా తమకు తెలియజేస్తూ ఉండమని విద్యార్థులకు మంగళాశాసనాలు అనుగ్రహించారు.

**సామూహిక పూజలు**:- యజ్ఞ కార్యక్రమంలో అన్వయించిన భక్తజనులచే ఆగష్టు 1,2,3 తేదీలలో ఆండాళ్ళు తిరునక్షత్రం, శనివారము మరియు బదరీనారాయణ తిరునక్షత్రము వంటి పర్వదినాల్లో సామూహిక పూజాది కార్యక్రమాలు నిర్వహింపజేసారు. పూజాది కార్యక్రమాల ఏర్పాట్ల పర్యవేక్షణమును హెచ్.వి. పద్మావతిగారి నేతృత్వంలో వాలంటీర్ల బృందం స్వీకరించారు.

**మహాపూర్ణాహుతి**:- 4వ తేదీ ఉదయం 10 గంటలకు మహాపూర్ణాహుతి జరిగి, యాగశాలలోని గరుడధ్వజ అవరోహణము, వేదికపై శాంతికళ్యాణాలు కార్యక్రమాల అనంతరం, వేదాది, దివ్యప్రబందాది పారాయణములు శాత్తుముఱై విన్నపం జరిగింది. వెనువెంటనే ఋత్విక్ మర్యాదలు కూడా జెట్ సభ్యులచే అందించబడినవి. తరువాత శ్రీస్వామివారి పెరుమాళ్ళకు శాంతి కళ్యాణము, మహాకుంభంతో అవబృధజల ప్రోక్షణము జరిగింది. భక్తులకు ప్రసాద వినియోగము జరిగింది. కార్యక్రమానికి ప్రభుత్వ అమాత్యులైన శ్రీ యనమల రామకృష్ణుడు మరియు శ్రీ కోటగిరి విద్యాధరరావుగార్లు కూడా అన్వయించారు.

కార్యవర్గ సభ్యులకు శ్రీవారి కరకమలముల ద్వారా మంగళాశాసనములు -

విరాళాల సేకరణలో శ్రీమాన్ బట్టర్ స్వామివారి బృందం సేవ అనిర్వచనీయము. యాగశాలాది నిర్మాణములలో శ్రీ యం.వి.వి. రామానుజమ్ గారి సేవ బహుప్రశంసనీయము.

వేదికపైగల బ్యాక్డ్రాప్ తయారీలో శ్రీశివరామా కలర్ల్యాబ్వారి కైంకర్య రూపమయిన సేవ వేలాదిమంది భక్తుల ప్రశంసలుకు నోచుకుంది.

రోజుకు 15వేలమందికి ప్రసాదాన్ని సమయాన్కి అందించుటలో శ్రీమాన్ రంగాచార్యస్వామి, ప్రకాష్గార్ల సోదరద్వయబృందం వేగం, రుచి, శుచి ఎన్నోవేలమంది భక్తులకు ప్రీతిపాత్ర మైనవి.

తదీయారాధన క్రమపద్ధతిలో జరుగుటకు శ్రీమాన్ సత్యన్నారాయణగారు (ధవణగెరె), నందం సీతారామరాజుగారు మరియు బొట్టిలంక గ్రామ వాలంటీర్ల సేవ వర్ణింపనలవికాదు.

స్టోర్సు విభాగంలో శ్రీమాన్ ప్రభాకర వర్మ, నర్సింహమూర్తిగార్లు, పర్చేజింగ్ తవిభాగంలో రమేష్, నాగరాజు, శ్రీనివాస్ గార్లకు శ్రీమాన్ గ్రంధి పిచ్చయ్యగారు సారధ్యం వహించి ఎంతరాత్రయినా కావలసిన పదార్థాలు క్షణాల్లో తీసుకొచ్చే బాధ్యతను స్వీకరించి అందించారు.

జి. రామలింగేశ్వరరావు, కె.వి.రమణ, వీరభద్రరావు రాజగోపాలాచార్యులుగార్లు అకౌంట్సు డిపార్టుమెంట్సులోను చక్కటి సేవనందించారు. JET వికాసతరంగిణి వారు నీటిఎద్దడిని తట్టుకొనే నిమిత్తం ఎస్.కె.వి.టి. కాన్వెంటులో బోర్వెల్ను త్రవ్వించి అందించారు.

సులబ్ కాంప్లెక్స్వారి టాయ్లెట్స్ అందరికీ ఉపయోగపడినవి. వీరేకాకుండా యజ్ఞ కార్యక్రమాన్కి ప్రత్యక్షంగాను పరోక్షంగాను ఎంతోమంది వారి సహాయసహకారాలు అందించారు. వేదవతిగారు (ధవళేశ్వరం) బాబి





(కోటి గ్రామం), రాజా (గోకవరం), సత్తిరాజుగార్లు చుట్టుప్రక్కల గ్రామాల్లో చక్కటి ప్రచారంచేసి విరాళాలు స్వీకరించడమేకాక చక్కటి వాలంటీర్ల బృందాలను కూడా అందించి సహకరించారు.

యజ్ఞ కార్యక్రమంలో వొట్టిలంక, చీరాల, వట్టిచెరుకూరు, కలపచర్ల, గుంటూరు, కోటి, గొల్లలమామిడాడ వాలంటీర్లబృంద సేవలు నిర్వచనీయం. వీరందరికీ శ్రీవారు మంగళాశాసనములను అనుగ్రహించారు. ముఖ్యులకు జ్ఞాపికలు అందించారు.

ఇంకా చాలామంది అన్వయించిన వీర్కి జెట్-వికాసతరంగిణి సర్వదా కృతజ్ఞతలు తెలియజేస్తూంటుంది.

జై శ్రీమన్నారాయణ

### జాంద్రపేట

ప్రకాశంజిల్లా జాంద్రపేట వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో 20-9-02 నుండి 24-1102 వరకు తిరుమల శ్రీవారి అన్నదాన కార్యక్రమంలో పాల్గొనుట, శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం 18 అధ్యాయాలు పారాయణం చేయుట, స్వర్ణ గ్రామంలో మహిళలచే కోలాట కార్యక్రమం, వీర రాఘవులు గృహంనందు శ్రీ హనుమాన్ చాలీసా 51సార్లు పారాయణం చేయించడం జరిగింది. అన్ని కార్యక్రమాలు ఉత్సాహంగా నిర్వహించుచున్నారు.

### B. పత్తిపాడు

తూర్పు గోదావరిజిల్లా పత్తిపాడు వికాసతరంగిణి శాఖ శ్రీ విష్ణు సహస్రనామ పారాయణం నిర్వహించారు. ప్రతి శుక్రవారం సాయంత్రం 3గం॥ నుండి 5గం॥ వరకు ఒక భక్తుని గృహంలో నిర్వహిస్తున్నట్లు ఛైర్పర్సన్ సత్యవాణి తెలిపారు.

### శ్రీహరిపురం

విశాఖపట్నంలోని శ్రీహరిపురం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో వార్షికోత్సవ సందర్భముగా శ్రీమాన్ రఘునాధాచార్యస్వామి వారి ఆధ్వర్యంలో అనేక కార్యక్రమాలు నిర్వహించినారు. 29-6-03 తేదిన పశువైద్య శిబిరం, సాధారణ వైద్య శిబిరములు నిర్వహించినారు. పేద విద్యార్థులు, పేద బ్రాహ్మణులకు ఆర్థిక సహాయము అందజేయడం జరిగింది. వృద్ధాశ్రమంలోనివారికి పండ్లు, బిస్కెట్లు, బట్టలు పంపిణీ చేయడం జరిగింది. చిన్నారులకు గీతాజ్యోతి శ్లోకమాలిక పారాయణం, చిత్రగీతలపై పోటీలను నిర్వహించినారు. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి కార్యకర్తలు ఉత్సాహంగా పాల్గొనుచున్నారు.

### అనకాపల్లి

విశాఖపట్నం జిల్లా అనకాపల్లి వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో జూన్ 15వ తేదిన శ్రీ విష్ణు సహస్రనామ పారాయణం, కృష్ణాష్టకం గోవిందనామ పఠనములు పారాయణం చేయడం జరిగింది. పేద విద్యార్థికి పుస్తక సహాయం చేసినారు. వికాసతరంగిణి కార్యదర్శి శ్రీమతి జి. శశికళ యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

### నిజామాబాద్

నిజామాబాద్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో డాక్టర్స్ 'డే' సందర్భముగా ఆయా వైద్యరంగంలో నిపుణులైన 6గురు డాక్టర్లకు స్థానిక చంద్రశేఖర కాలనీలోగల అర్బన్ హెల్త్ సెంటర్లో ఘనంగా సన్మానింపబడినారు. గతంలో నిజామాబాద్ వికాసతరంగిణిశాఖ ఆధ్వర్యంలో నిర్వహించబడిన పలు వైద్యశిబిరాలలో ఈ వైద్యులు తమయొక్క అమూల్యమైన సేవలను అందించినారు. వికాసతరంగిణి సెక్రటరీ G.లక్ష్మారెడ్డి భవిష్యత్తులో కూడ మరిన్ని సేవలను పేదలకు అందజేయవలెనని కోరారు.

### పొన్నూరు

గుంటూరు జిల్లా పొన్నూరు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో జూలై 5వ తేదిన తాళ్ళపాలెం గ్రామంలో "న్యాయ విజ్ఞాన సదస్సు" కార్యక్రమం నిర్వహించినారు. విద్యావంతులైనవారు చట్టాలను గూర్చి తెలుసుకుంటే వాటిని అనుభవించే వీలు కలుగుతుందని అన్నారు. ఈ సదస్సులో శ్రీ K.V. సుబ్బారావుS.I, M.వీరయ్య చౌదరిగారు, రామాచార్యులు గారు, Ch.పిచ్చయ్య గార్లు, K.S.R.K. సివిల్ జడ్జి జాన్ గార్లు పాల్గొన్నారు.

**పుల్లడిగుంట**

గుంటూరుజిల్లా పుల్లడిగుంట ధర్మక్షేత్ర ప్రచార కార్యక్రమంలో భాగంగ వంగిపురం గ్రామంలో పాఠశాల విద్యార్థులకు గీతాజ్యోతి శ్లోకాలు పోటీలను నిర్వహించడం జరిగింది. విజేతలైన వారికి బహుమతి ప్రదానం చేసినారు. ఈ కార్యక్రమంలో శ్రీమాన్ సుదర్శనాచార్యులు, లక్ష్మివల్లభాచార్యులు సహకరించారు.

ఏటుకూరు గ్రామంలో అన్ని పాఠశాలలకు తిరిగి 1200 మంది విద్యార్థులకు మెదడువాపు రాకుండ బెల్లడోనా మందులు పంపిణీ చేసారు. వాసవీక్లబ్ అధ్యక్షులు రాయవరపు అశోక్‌కుమార్‌గారు సహాయసహకారములు అందజేసినారు ఈ కార్యక్రమంలో ధర్మక్షేత్ర కన్వీనర్ శ్రీమతి లలితకుమారిగార్ల ఆధ్వర్యంలో నిర్వహించబడినది.

**రామచంద్రపురం**

గుంటూరు జిల్లా రామచంద్రపురం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో 10వ తేదిన ఏకాదశి సందర్భముగా గీతాజ్యోతి పారాయణ కార్యక్రమం నిర్వహించినారు. వికాసతరంగిణి అధ్యక్షులు భీమిరెడ్డి లక్ష్మీ నారాయణరెడ్డి, సత్యనారాయణ గార్లు నిర్వాహకులుగ కృషిచేసారు

**బొమ్మకల్లు**

వరంగల్ జిల్లా బొమ్మకల్లు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో బొమ్మకల్లు పట్టణంలో శ్రీ ఆంజనేయ స్వామివారి దేవాలయంలో జూన్ 30వ తేదిన లోకక్షేమం కొరకు "ఆర్ద్రీమృగ్రీక్కణ్ణా" పాశురం పారాయణం చేసినారు. ఈ మంత్ర ప్రభావంతో మూడు గంటలు వర్షం కురియడం జరిగింది. బొమ్మకల్లు వికాసతరంగిణి అధ్యక్షులు K. ఇందిరా దేవి ఆధ్వర్యంలో కార్యక్రమం జరిగినది.

**కరీంనగర్**

కరీంనగర్ పట్టణ వావిలాలపల్లి వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమంలో భాగంగా 10-7-03 తేదిన శ్రీ సీతారామ చంద్రస్వామి దేవాలయంలో తొలి ఏకాదశి ఉత్సవములు వైభవంగా నిర్వహించుకొన్నారు. పెరుమాళ్ళ సన్నిధిలో గీతాజ్యోతి శ్లోకమాలికలను పఠనం కావించి, శ్రీ విష్ణు సహస్రనామ పారాయణం నిర్వహించినారు.

13-07-03వ తేదిన గురుపూర్ణిమ ఉత్సవములు శ్రీ సీతారామచంద్రస్వామివారి దేవాలయంలో ఘనంగా నిర్వహించుకొన్నారు. వికాసతరంగిణి అధ్యక్షులు M. నారాయణరావు గారు గురుపూర్ణిమ వైభవమును గూర్చి వివరించినారు. ఆది గురువైన వేదవ్యాస భగవానుని గురించి చక్కగ ఉపన్యసించడం జరిగింది.

**సప్తగిరికాలనీ**

కరీంనగర్ పట్టణ సప్తగిరి కాలనీ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో శ్రీకోదండరామస్వామి దేవాలయంనందు వర్షాలు పడుటకు గాను "శ్రీవిష్ణుసహస్రనామ విరాట్ పారాయణం''ను నిత్యం పారాయణం చేయుచున్నారు. వికాసతరంగిణి అధ్యక్షులు తడకా రాధకిషన్‌గారు యితర వికాసతరంగిణి కార్యకర్తలు పాల్గొన్నారు.

**సుల్తానాబాద్**

కరీంనగర్ జిల్లా సుల్తానాబాద్ వికాసతరంగిణిశాఖ ఆధ్వర్యంలో గురుపూర్ణిమ సందర్భముగ పెద్దపల్లి శ్రీవేంకటేశ్వర దేవాలయం నందు శ్రీవిష్ణుసహస్రనామ పారాయణాన్ని చేసి, శ్రీవ్యాసభగవానుని గూర్చిఘనంగ తెలియజేయడం జరిగింది.

టి.టి.టి ధర్మప్రచార పరిషత్ వారిచే రామాయణం చెప్పించడం జరిగింది. ధర్మక్షేత్ర కన్వీనర్ శ్రీమాన్ మెంగానిచంద్రశేఖర్‌గారు, మురళీధర్‌గార్లు, సత్యన్నారాయణాచార్యులు, హన్మంతరెడ్డిగార్లు ఇతర ముఖ్యులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. 14వ తేదినుండి 17వ తేదీవరకు 4 మండలాలలో గోదావరి పుష్కర ప్రచార కార్యక్రమం నిర్వహించినారు. ప్రతిగ్రామంలో కరపత్రాలు, వాల్ పోస్టర్లు పంపిణీ చేయడం జరిగింది.

**ఖమ్మం**

ఖమ్మం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో గీతాజ్యోతితో అన్వయినస్తూ తొలి ఏకాదశి సందర్భముగా భగవద్గీతలోని 18 అధ్యాయములు పారాయణం చేసినారు. "భజ యతిరాజ" స్తోత్రాన్ని చిన్నగ్రంథముగా ముద్రించి వితరణ చేయడం జరిగింది.





గురుపూర్ణిమ సందర్భముగా స్వర్ణభారతి కళ్యాణమండపములో శ్రీకృష్ణ భగవానుడికి అష్టోత్తర పూజలు నిర్వహించడం జరిగింది. గురుపూర్ణిమ ప్రాముఖ్యతను వివరించడం జరిగింది.

వికాసతరంగిణి ఆర్గనైజింగ్ సెక్రటరీ గారైన శ్రీమాన్ భవానీ ప్రసాద్ గారి ఆధ్వర్యంలో ఖమ్మం జిల్లా వికాసతరంగిణి శాఖలకు ఒక సమావేశం E. రామారావుగారి అధ్యక్షతన ఏర్పాటు చేసినారు. గోదావరి పుష్కరాలు వంటి వివిధ సేవా కార్యక్రమాలలో యువ వికాసతరంగిణి సభ్యులను వాలంటీర్లుగా సేవ చేయాలని సూచించినారు. అలాగే T.T.D. శ్రీవారి సేవా కార్యక్రమంలో యువసభ్యులు విధిగ పాల్గొనాలని చెప్పారు. 17 వికాసతరంగిణి శాఖలు, 100 మంది సభ్యులు హాజరైనారు.

**సత్తుపల్లి**

ఖమ్మం జిల్లా సత్తుపల్లి వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో సదాశివుని పాలెంలో తొలిఏకాదశి సందర్భముగా స్థానిక రామాలయంలో హరేనామ సంకీర్తనం 24గంటలు పారాయణం చేయడం జరిగింది. ఈ కార్యక్రమంలో తిరునగరి వెంకట నర్సయ్య, నారాయణపురం వికాసతరంగిణి శాఖ అధ్యక్షులు మందపాటి కేశవరెడ్డి యితర ముఖ్య కార్యకర్తలు పాల్గొన్నారు.

**పాలవంచ**

ఖమ్మంజిల్లా పాలవంచ వికాసతరంగిణిశాఖ ఆధ్వర్యంలో 10-07-2003 తేదిన తొలిఏకాదశి నాడు శ్రీసీతారామాంజనేయ దేవాలయం నుండి బయలుదేరి జైశ్రీమన్నారాయణ సంకీర్తన చేస్తూ నగర పరిక్రమణచేస్తూ తిరిగి ఆలయ ప్రవేశం చేసినారు. 15 పర్యాయములు శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రం, గీతాజ్యోతి 48 శ్లోకములు పఠించినారు. ఈ కార్యక్రమంలో అధ్యక్షులు రాఘవాచార్యులు, నర్సింహరెడ్డి, వెంకటేశ్వరరావు, శ్రీమతి కోటారత్నమ్మ, ఇతర ముఖ్య కార్యకర్తలు పాల్గొన్నారు.

**జగ్గయ్యపేట**

కృష్ణాజిల్లా జగ్గయ్యపేట ధర్మక్షేత్రం ఆధ్వర్యంలో 9వ తేదిన C.SR.H.V.P. పాఠశాల, B.H.A.V.P.పాఠశాల విద్యార్థులకు 21మందికి నోట్ బుక్స్‌ను ఉచితంగా పంపిణీ చేసారు. శ్రీమాన్ శ్రీనివాస్, కృష్ణారావు, లక్ష్మీ నారాయణ, కాశీ విశ్వనాథం గార్ల సౌజన్యంతో కార్యక్రమం నిర్వహించినారు.

10వ తేదిన ఏకాదశి పర్వదిన సందర్భముగా స్థానిక శ్రీ వేంకటేశ్వర దేవాలయంనందు శ్రీ విష్ణు సహస్రనామ పారాయణం నిర్వహించినారు.

**పటమట**

విజయవాడ పటమట వికాసతరంగిణిశాఖ ఆధ్వర్యంలో 10వ తేది తొలిఏకాదశి పర్వదినాన శ్రీరామచంద్రుని క్షీరాభిషేకం నిర్వహించినారు. అనంతరం 50మంది సామూహిక చాలీసా పూజకార్యక్రమం జరిగింది. 12వ తేదీ రామలక్ష్మణ ద్వాదశి రోజున 200మందికి అన్నదాన కార్యక్రమం నిర్వహించినారు.

13వ తేది గురుపూర్ణిమ సందర్భముగ ఆచార్యుల పాదుకలకు పంచామృతాభిషేకం చేసినారు. శ్రీమాన్ రాఘువాచార్యులుగారి ఆధ్వర్యంలో అష్టోత్తర శతనామ పూజ చేసికొని సాయంకాలం దీనులకు పాయసం, అరటిపళ్ళు అందించినారు. 15మంది నవజీవన్ బాలభవన్ బాలలకు వస్త్రదానం చేయడం జరిగింది.

ఈ కార్యక్రమంలో శ్రీమతి అన్నపూర్ణ, రాణి సంయుక్త, పర్వతనేని అన్నపూర్ణదేవి, కుసుమ, పి. విజయలక్ష్మిగార్లు ముందుండి కార్యక్రమ నిర్వహణ బాధ్యతలు చూచినారు.

**నందిగామ**

నందిగామ వికాసతరంగిణిశాఖ ఆధ్వర్యంలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమంలో భాగంగ స్థానిక గీతామందిరంలో ప్రతిరోజు శ్రీవిష్ణుసహస్రనామ పారాయణం, గీతాజ్యోతి శ్లోకపఠనం కార్యక్రమం పారాయణం చేయుచున్నారు. 5గ్రామాలలో గీతాజ్యోతి ప్రచారం కావించుచున్నారని అధ్యక్షులు శ్రీ రవీంద్రనాథ్ తెలిపారు.

**ఏలూరు**

పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు ధర్మక్షేత్ర కేంద్రముగా గీతాజ్యోతి ప్రచార మరియు విశేష ఆధ్యాత్మిక, సేవా కార్యక్రమాలు నిర్వహించుచున్నారు. 01-07-03 తేదిన 'డాక్టర్స్ దే'

సందర్భముగా లయన్స్ క్లబ్ ఆఫ్ హేలాపురి ఆధ్వర్యంలో శ్రీశ్రీ ఎడ్యుకేషనల్ సొసైటీ వారి సౌజన్యంతో అమీనా పేటలోని శ్రీశ్రీ విద్యా సంస్థలందు దంత పరీక్షలు, దంత సంరక్షణ అవగాహన శిబిరము నిర్వహించబడినది. ఈ కార్యక్రమంలో 550 మంది పిల్లలకు దంత పరీక్షలు నిర్వహించి, అవసరమైన వారికి ఉచితంగా మందులు పంపిణీ చేయడం జరిగింది. పిల్లలకు పేస్టులు, బ్రష్‌లు, అవగాహన పత్రములు ఉచితంగా అందజేసినారు. ఈ కార్యక్రమమును తత్త్వ ప్రచారకులైన కుమారి శారదగారు అతిథిగా విచ్చేసినారు. శ్రీమాన్ M. రాజాగారు కార్యక్రమానికి సహకరించారు. ఈ కార్యక్రమంలో శ్రీమాన్ Dr. R. చంద్రశేఖర్ గారు, Dr. M. పార్ధసారధి గారు, Dr. P. ఉమారాణి గారు, Dr. K. వంశీ ప్రసాద్, Dr. P. మధు గార్లు పాల్గొన్నారు.

సుమారు 20,000/– రూ. లైన ఈ శిబిరానికి కోల్గెట్ కంపేనీవారు, ఇండియన్ డెంటల్ అసోసియేషన్ వారు సహాయ సహకారములు అందజేసినారు.

**విజయనగరం**

విజయనగరం ధర్మక్షేత్ర కేంద్రముగ గీతాజ్యోతి ప్రచార కార్యక్రమంలో భాగంగా పాఠశాల విద్యార్థులకు గీతాజ్యోతి శ్లోకాలను నేర్పించడం జరుగుతోంది. స్థానిక బాలాజినగర్‌లో గురుపూర్ణిమ సందర్భముగా శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రపారాయణం, లక్ష్మీ సహస్ర కార్యక్రమం నిర్వహించారు.

శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి తిరునక్షత్రం సందర్భముగా నేత్ర విద్యాలయ పిల్లలకు “యతిరాజ వింశతి” శ్లోకాలను నేర్పించి పోటీలను నిర్వహించడం జరిగింది. 15వ తేదినుండి శ్రీమతి అరుణగారు కార్యకర్తలతో 3 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచారం నిర్వహిస్తున్నారు.

**జంటనగరముల సమన్వయ కమిటి కార్యక్రమములు:**

**జులై 6వతేదీన** సమన్వయ కమిటి అధ్యక్షులు శ్రీమాన్ కల్కి అవతారంగారు కార్యదర్శి శ్రీవనజా చలపతిరావుగారు, ఉపాధ్యక్షులు శ్రీమాన్ వరకుమార్ గుప్తాగారు, కోశాధికారి శ్రీమాన్ శ్యాంసుందర్‌రెడ్డి గారు, వనస్థలిపురం వికాసతరంగిణి వారు నిర్వహించిన ఉచిత, ఆయుర్వేద, చెవిముక్కు, గొంతు మరియు స్త్రీ సంబంధవ్యాధుల చికిత్సా శిబిరమునకు మరియు మహిళా సదస్సుకు ముఖ్య అతిథులుగా వెళ్ళటం జరిగినది.

**13-7-03**నాడు మంచిర్యాల వికాస తరంగిని వారి అభ్యర్తనమేరకు కేంద్రకమిటి వారి సూచనలకు అనుగుణంగా అధ్యక్ష కార్యదర్శులు, శ్రీమాన్ వి.కె. అవతారంగారు, పద్మనాభరావు గారు, శ్రీమతి వనజా చలపతిరావుగారు, శ్రీమాన్ విజయకుమార్, జెట్ సొసైటీ కార్యదర్శి శ్రీపురుషోత్తం గారు మంచిర్యాలకు పుష్కర ఏర్పాట్ల పర్యవేక్షణకు బయలుదేరి వెళ్ళటం జరిగినది. అచ్చట కార్యకర్తలతోను, నిర్వహకులతోను ఏర్పాట్లను సమీక్షించి, పుష్కరబ్రహ్మయజ్ఞ ప్రదేశమును, ఇతర ఏర్పాట్లను చూచి తగు సూచనలను, సలహాలను అందించటము జరిగింది. తదుపరి శ్రీస్వామివారు అల్లంపల్లి, బీర్‌సాయి పేటలలో నిర్మాణము కావించుచున్న గిరిజన పాఠశాలల నిర్మాణ పురోగతిని పరిశీలించుటకు కార్యవర్గ సభ్యులంతా అచ్చటికి పోయి నిర్మాణము కార్యక్రమములను చూచి అచ్చట కాంట్రాక్టరుకు, మేస్త్రీలకు తగుసూచనలు ఇచ్చి సాయంత్రము శ్రీవిష్ణు సహస్రనామ పారాయణమును గ్రామస్తుల సమీక్షములు అనుసంధానించడము జరిగినది. తదుపరి భజనకార్యక్రమము జరిపినారు.

**9-7-03** రోజున మీర్‌పేట వికాస తరంగిణివారు పిల్లలకు, మహిళలకు గీతాజ్యోతి, చిత్రగీతిక శ్లోకాలను నేర్చుకొనుటకు శ్రీకాశినర్మదేశ్వర స్వామి దేవాలయములో ఏర్పాటు చేసిన ప్రారంభ కార్య క్రమమునకు కార్యదర్శి శ్రీమాన్ పద్మనాభరావు ముఖ్య అతిథిగా హాజరు అయినారు.

**శాఖల నివేదిక**

**బోయినపల్లి:**

10 జులై తారీఖున ఇక్రిశాట్ కాలనిలోని శ్రీమతి రమాదేవిగారి గృహములో తొలి ఏకాదశి కార్యక్రమమును అతివైభవముగా జరుపుకున్నారు. 12-7-03 రోజున మనోవికాసనగర్ వంశీ అపార్ట్‌మెంట్స్‌లోని శ్రీమతి విజయభూంరెడ్డిగార్లు గీతాజ్యోతి ప్రవచనం మరియు భజన కార్యక్రమము





నిర్వహించినారు. **15-7-03** నాడు (లోని శ్రీసాయి అపార్ట్‌మెంట్స్ శ్రీదేవిగారింట్లో ఇదే కార్యక్రమమును నిర్వహించినారు. **16-7-03** రోజున దాత శ్రీమాన్ సూర్యనారాయణ రావుగారి పర్యవేక్షణలో శ్రీమాన్ రాజారెడ్డిగారి నేతృత్వంలో రామలింగంపల్లి గ్రామంలోని శ్రీరామకృష్ణ వాన ప్రస్థ ఆశ్రమమంలో ఉచిత ఆరోగ్య శిబిరమును నిర్వహించినారు. ఈ కార్యక్రమములో భాగంగా గ్రామస్తులకు గీతాజ్యోతి పుస్తకములను, ఆశ్రమములోని వృద్ధులకు పండ్లు పంచిపెట్టి శ్రీవిష్ను సహస్రనామ పారాయణము, గీతాజ్యోతి శ్లోకములను పారాయణము చేయుట జరిగినది.

**దోమల్‌గూడ**

వికాసతరంగిణి జంటనగరముల సమన్వయ కమిటివారు అందించిన ద్విచక్రవాహనముతో కుమారి కమల జంటనగరములలోని దేవాలయములు, పాఠశాలలో గీతాజ్యోతి శ్లోక ప్రవచనము, శ్లోకాలను నేర్పించుట కార్యక్రమమును చేపట్టినది. ఇందులో భాగంగా అశోక్‌నగర్, బేగంపేట, మాసబ్‌టాంక్, సికింద్రాబాద్ ప్రాంతములలో ప్రవచనములను చేయటం జరిగింది. ప్రతి శుక్రవారం తిలక్‌నగర్‌లోని శ్రీసాయిబాబా దేవాలయంలో లక్ష్మీనారాయణ పూజలు నిర్వహించి గీతాజ్యోతి శ్లోకములను అనుసంధానము చేయించి ప్రవచనమును కావించారు. వారికి కృష్ణాష్టకం, హయగ్రీవస్తోత్రం, విష్ణు సహస్రనామ పారాయణం, భజనలు నేర్పించుటం జరుగుతుంది. పిల్లలందరు ఎంతో ఉత్సాహంగా పూజాకార్య క్రమములో పాల్గొంటున్నారు.

**కవాడిగూడ**

తొలిఏకాదశిరోజున సూరారం కాలనీలోని వాసుదాసాశ్రమంలో శ్రీ కృష్ణ పూజలు నిర్వహించి, శ్రీ గీతాజ్యోతి శ్లోకమాలిక పఠనం ప్రవచనం కావించటం జరిగింది. శ్రీమతి విజయలక్ష్మి గారి ఆధ్వర్యవంలో ఈ కార్యక్రమము నిర్వహించినారు.

**కూకట్‌పల్లి**

తొలి ఏకాదశి రోజున బాలాజీ దేవాలయములో శ్రీ విష్ణు సహస్రనామ పారాయణము భక్తులు, కార్యకర్తలతో కలిసి పఠించడము జగినది. శ్రీ రామాలయములో వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ అల్లం సత్యనారాయణగారు ముద్రించిన 5,000 గీతాజ్యోతి శ్లోక పుస్తకములను పంచిపెట్టడం జరిగినది. లక్ష పుస్తకములు ముద్రించి పంచి పెట్టాలనే లక్ష్యంతో ఇది మొదటి విడత కార్యక్రమము. వీరు నిర్వహిస్తున్న ప్రభుత్వ పాఠశాలలో ఉచిత బియ్యమునకు ఆకర్షితులై విద్యార్థుల సంఖ్య తగ్గినది.

**అమీర్ పేట**

**9-7-2003** రోజున పిల్లలకు, పెద్దలకు గీతాజ్యోతి శ్లోకములో చిత్రగీత శ్లోకములను నేర్పించే కార్యక్రమము శ్రీ కాశి నర్మదేశ్వరస్వామి దేవాలయములో ప్రారంబించారు. ఈ కార్యక్రమమునకు వికాస తరంగిణి కార్యదర్శి శ్రీమాన్ పద్మనాభరావుగారు ముఖ్య అతిధిగా విచ్చేసి వికాసతరంగిణి లక్ష్యాలు, గీతాజ్యోతి ఆశయములు, లక్ష్యాలు, శ్రీ స్వామివారి ఉద్దేశ్యము. మనము చేయవలసిన కర్తవ్యమును గురించి భక్తులకు వివరించడము జరిగినది. ఈ కార్యక్రమములో 20మంది పిల్లలు 25 మంది మహిళలు, వికాసతరంగిణి అధ్యక్ష కార్యదర్శులు శ్రీమాన్ దామోదరరావుగారు, శ్రీమతి వి. సువర్ణ మరియు కుమారి మాధవీలలు కాలనీ నాయకులు, భక్తులు పాల్గొన్నారు. ప్రతి గురువారం గీతాజ్యోతి శ్లోకములను విద్యార్థులకు అందించుటకు గౌతమి స్కూలు, టి.ఆర్.ఆర్. మిషన్ స్కూలు, రత్నా గ్రామర్ స్కూల్ యాజమాన్యము అంగీకరించగా ఈ కార్యక్రమము శ్రీమాన్ సువర్ణగారి ఆధ్వర్యములో **10-7-03** నాడు ప్రారంభించినారు. తొలి ఏకాదశి పర్వదినమున శ్రీ కాశీ నర్మదేశ్వరస్వామి దేవాలయములో 50మంది భక్తులతో సా॥ 4-8 గం॥ల వరకు సామూహిక విష్ణు సహస్రనామ పారాయణ కార్యక్రమమును నిర్వహించినారు.

**రామాంతపూర్**

జూలై 15, 21 మరియు 22వ తారీఖులలో పాల్ & మరియు ఓకార్డ్ వారి సౌజన్యంతో ఉచిత మధుమేహ వ్యాధి శిబిరము 45 మందికి, 120 పసి పిల్లలకు వాక్సిన్, టి.బి. మరియు ఛాతి వ్యాధి శిబిరములను నిర్వహించినారు. మందులను ఉచితంగా అందించుట జరిగినది. పాత

రామాంతపూర్, వెంకటరెడ్డినగర్, ప్రేమ్‌నగర్ కాలనీలోని బీద కుటుంబముల వారికి, పేద విద్యార్థులకు 300 వంటపాత్రలు, 150 ప్లేట్లు, 150 గ్లాసులను అందచేయటం జరిగినది. జులై 5, 2003 నాడు వెంకటరెడ్డి నగర్ శ్రీ సాయిరాం కాన్వెంట్ పాఠశాలలో 32మంది పేద విద్యార్థులకు పాఠ్య పుస్తకములు అందించినారు.

**సంతోష్‌నగర్**

జులై 13, 2003 రోజున వికాసతరంగిణి సభ్యులు శ్రీ వెంకటేశ్వరస్వామి దేవాలయములో గురుపూజ మహోత్సవమును అతి వైభవముగా జరుపుకున్నారు. పుష్కర సేవ నిమిత్తము రాజమండ్రి, మంచిర్యాలకు పోవుచున్నారు.

**వనస్థలిపురం**

జులై 6, ఆదివారం రోజున చార్మినార్ గవర్నమెంట్ హాస్పిటల్‌లో ముక్కు, గొంతు మరియు స్త్రీ సంబంధ వ్యాధులకు చికిత్సా శిబిరమును నిర్వహించడమైనది. ఈ కార్యక్రమమునకు ముఖ్య అతిథిగా ఆరోగ్యశాఖ, సంయుక్త సంచాలకులు వికాసతరంగిణి జంటనగరముల శాఖ అధ్యక్షులు శ్రీమాన్ కల్కి అవతారంగారు, ఉపాధ్యక్షులు - వరకుమార్ గుప్తాగారు, కార్యదర్శి-వనజా చలపతిరావుగారు, శ్యాం సుందర్‌రెడ్డిగారు విచ్చేసినారు. మందుల కంపెనీవారి సహకారముతో మందులను, 500 ప్రొటీన్ పొట్లాలను ఉచితంగా అందచేయడం జరిగినది. ఈ శిబిరమునకు 700 మంది రోగులు ఆరోగ్య పరీక్షలు జరిపించు కున్నారు. ఈ కార్యక్రమమునకు డా॥ శ్రీనివాసులు గారి ఆధ్వర్యములో చార్మినార్ ఆసుపత్రి వైద్యులు, డా॥ శేషగిరిరావు, డా॥ సాహు, కుమారి సుశీలరెడ్డి విచ్చేసి తమ సేవలను అందించుట జరిగినది. ఈ కార్యక్రమములో వరకుమార్ గుప్తాగారు, వనజగారు జ్యోతి వెలిగించినారు. శ్రీమతి ప్రమీల ముఖ్య అతిథిగా విచ్చేసి ఆధ్యాత్మికంగా స్వామివారి కార్యక్రమములు, మహిళల పాత్ర గురించి, గీతాజ్యోతి కార్యక్రమము తమ అభిప్రాయం వెల్లడించారు. 60మంది సభ్యులు, కార్యకర్తలు, భక్తులు పాల్గొన్నారు.

జులై 8, 2003 నాడు పెరియాళ్వారు తిరునక్షత్రం శ్రీ రామాలయములో శ్రీమాన్ రమణమూర్తి, శ్రీమాన్ శేషావతారంగారి ప్రవచనములతో అతివైభవముగా జరిగినది. జులై 11నాడు తొలి ఏకాదశి, 80 మంది భక్తులతో రామాలయములో ఉ॥ 10 గం॥7నుండి సాయంత్రం 7-30గం॥ వరకు అఖండముగా పారాయణ జరిగినది. వికాసతరంగిణి కార్యవర్గ సభ్యులు, భక్తులు అనేకమంది ఈ కార్యక్రమములో పాల్గొన్నారు.

ది.13-7-2003 రోజున వ్యాసపూర్ణిమ సందర్భముగా హిల్ కాలనిలోని శ్రీమాన్ లక్ష్మారావుగారి గృహంలో గురుపూర్ణిమ కార్యక్రమము అత్యంత వైభవముగా జరిగినది. 100 మంది సభ్యులు, కార్యకర్తలు భక్తులు ఈ కార్యక్రమములో పాల్గొన్నారు. శ్రీమాన్ సత్యనారాయణాచార్యులు, శ్రీమాన్ రమణమూర్తి, శ్రీమతి సీతారత్నంగారు, వ్యాసుల ప్రాశస్త్యము గురించి ప్రసంగించినారు.

జై శ్రీమన్నారాయణ !

## పరమపదవార్త



**కోటగిరి వెంకట సుబ్బాయమ్మ గారు (కన్నమ్మ)**
**కోటగిరి సీతాపతి గారి ధర్మపత్ని**
చంద్రగూడెం, కృష్ణాజిల్లా.

పరమపదించిన తేది:- **28-5-2003**





జయ జయ శ్రీసుదర్శన !! జయ జయ శ్రీ సుదర్శన !!

శ్రీమతే రామానుజాయనమః

**"తిరుమల తిరుపతిలో ఉగాది నుండి జరుగుతున్న శ్రీ సుదర్శనహోమము"**

# శుభాహ్వానము

**ప్రియ భగవద్బంధువులారా !**

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయరుస్వామివారి మంగళాశాసనములతో 108 శ్రీసుదర్శన దివ్యప్రబంధ జ్ఞాన యజ్ఞములను దేశవ్యాప్తంగా నిర్వహించిన శ్రీ ఉ.వే. శ్రీమాన్ వేంకటేశన్ అయ్యంగార్ స్వామి వారు వివిధ పీఠాధిపతుల మంగళాశాసనములతో ప్రోద్బలంతో మళ్ళీ 1008 శ్రీ సుదర్శన హోమములు చేయడానికి సంకల్పించినారు. ఆ ప్రకారం శ్రీ సుదర్శన యజ్ఞసమితి ద్వార ఇంతవరకు 330 హోమములు నిర్వహించినారు.

ప్రస్తుతం శ్రీవేంకటేశ్వర స్వామివారి దివ్యానుగ్రహముతో విశ్వశాంతి, మానవకల్యాణము వైదిక సనాతన ధర్మసంరక్షణ కొరకు స్వభాను నామ సంవత్సర ఉగాది నుండి (2-4-2003) వరకు సంవత్సరం పాటు ప్రతినిత్యం తిరుమలలో శ్రీసుదర్శన హోమం ప్రారంభించారు.
**స్థలం : శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి మఠం,** రింగ్‌రోడ్, తిరుమల.

**కార్యక్రమముల వివరములు**

**ప్రతిరోజూ ఉదయం :** తిరువారాధన సేవకాలం,
శ్రీ సుదర్శన శతక మంత్రముతో హోమం,
శ్రీ లక్ష్మీనృసింహ మహామంత్ర హోమం,
శ్రీ యజ్ఞ, వరాహ మంత్ర హోమం,
శ్రీ వేంకటేశ మహామంత్ర హోమం,
పూర్ణాహుతి

**సాయంత్రం :** శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణం,
మంగళహారతి.

**సేవా వివరములు :**

| | |
|---|---|
| మహారాజ పోషకులు | రూ.5001-/ |
| రాజపోషకులు | రూ.1116-/ |
| ఒక్కరోజు హోమయాజమాన్యం | రూ.516-/ |

**గమనిక :-** శ్రీసుదర్శనయజ్ఞ సమితికి విరాళములను సమర్పించదలచిన వారు చెక్కు / డ్రాఫ్టు ద్వారా శ్రీసుదర్శనయజ్ఞ సమితి పేరిట ఈ చిరునామాకు పంపగలరు.

ఇట్లు
**శ్రీసుదర్శనయజ్ఞ సమితి**
**తిరుపతి.**

**చిరునామా :**

1. **శ్రీసుదర్శన యజ్ఞ కార్యాలయం**
**C/o. శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌మఠం రింగ్‌రోడ్, తిరుమల. ఫోన్ : 0877 2277301, Cell : 984908478**
2. **శ్రీసుదర్శన యజ్ఞ సమితి, 556 బాలాజీకాలనీ, తిరుపతి ఫోన్ : 0877 2251834.**

జరిగింది. సమయం కేవలం 45 రోజులే ఉన్నా అందరూ ఉత్సాహంగా సేవలందించి ఈ స్థలానికొక రూపు తెచ్చారు.

స్థానికాధికారులవల్ల మధ్యలో చిన్న చిన్న సమస్యలెదురైనా మొత్తానికి వాటిని సరిచేస్కొని రాజమహేంద్రి పుష్కరాలలో సభ్యులందరూ వచ్చి జరిగిన అభివృద్ధి తెలిపారు. ఆగస్టు 12 నాడు దీక్ష నారభించ డానికి వస్తామని శ్రీవారు అంగీకారం తెలియజేశారు.

గోదావరి పుష్కరాల బ్రహ్మయజ్ఞాన్ని రాజమహేంద్రిలో ఆగస్టు 4నాడు మహా పూర్ణాహుతితో ముగించి ఆ సాయంకాలము బయలుదేరి ఆదిలాబాద్ జిల్లాలోని మంచిర్యాలలో చివరి 7 దినాలూ బ్రహ్మయజ్ఞాన్ని గోదావరీ తీరంలో జరవడానికి చేరారు. 'పుష్కరాలంటే రాజమహేంద్రిలోనే తప్ప ఇతరచోట్ల కాదు' అనే దురభిప్రాయం చాలామందిలో ఉంది. ఆయానది ప్రవహించే ఏచోటనైనా పుష్కరాలస్నానం చేయవచ్చు. అది శ్రేష్ఠమే. ఆయా తీరాలలో కొన్ని ఆలయాలూ, ఋష్యాశ్రమాలవంటివి ఉన్నట్లు చరిత్ర కూడా తోడైతే ప్రచారమధికంగా ఉంటుంది. అంతేతప్ప అదే ప్రధానమై, మిగిలినవి నిష్ఫలములైతేకావు. గోదావరి విషయంలో కూడా అంతే. తెలంగాణా ప్రాంతాల్లో గోదావరి ఉన్నా పుష్కరోత్సవాలుగా గతంలో వైభవమిప్పుడూ జరగలేదు. ఈసారి శ్రీ స్వామివారు బ్రహ్మోత్సవం మంచిర్యాలలో జరపడం, ప్రభుత్వంకూడా ఆ ప్రాంతాలకి ఎంతో కొంత ప్రోత్సాహాన్నందించడం వంటి వాటివల్ల, మీడియా చూపిన శ్రద్ధవల్ల చక్కటి ప్రాచుర్యం ఏర్పడి, ఆ ప్రాంతీయులంతా పుష్కర ఫలాన్ని పొందడమేకాక; బ్రహ్మ యజ్ఞ విశేషాన్ని కూడ బాగ అనుభవించారు. ప్రతిరోజూ మంచిర్యాల భక్తులు బ్రహ్మయజ్ఞంలో భాగంగా 15 వేలనుండి 25 వేల మందిదాక వారంరోజులూ చక్కని తదీయారాధన నందచేసారు. అసలు పుష్కరాలలో అటు రాజమహేంద్రిలోకానీ, ఇటు మంచిర్యాలలోకాని, పూర్తిస్థాయిలో తదీయారాధన చేసినది మన వికాసతరంగిణులే తప్ప, ఇతరులెవ్వరూ ప్రకటనలేతప్ప చేసిన దంతంత మాత్రమే. ఇతర చోట్లైతే అమాత్రం కూడాలేదు. పుష్కరాల్లో రెండు బ్రహ్మయజ్ఞాలు జరపడం ఇదే మొదటిసారి. మన వేదాగమ అధ్యాపక బృందం విద్యార్థులూ ఈ రెంటినీ చాలా సమర్థవంతంగా నిర్వహించారు. అయితే రాజమహేంద్రిలో శ్రీమాన్ S.రమాకాంతా చార్యస్వామి, మంచిర్యాలలో శ్రీమాన్ నంబి వేణుగోపాలాచార్యస్వామి ఈ కార్యక్రమాల్లో నిర్వాహ సహకారాన్నందించి విజయవంతంగా జరిపించారు.

(పూర్తి వివరాలు44 పేజీలో చూడగలరు)

అవి పూర్తి కాగానే ఆగస్టు 11వ తేదినాడు మంచిర్యాలలో బయలుదేరి 12వ తేది ఉదయం శ్రావణ పూర్ణిమనాటికి శ్రీ స్వామివారు పరివారంతో విశాఖ పట్టణం దిగి నేరుగా **'వారిజ'** ఆశ్రమం చేరారు. విశాఖలోని భక్తులు, విజయనగర భక్తులు శ్రీవారికి పరివారానికి హార్దమైన స్వాగతాంజలి ఘటించారు.

గతంలో చూచిన దానికీ, ఇప్పుడు కన్పించేదానికీ పోలికేలేదు. 35 దినాల్లో కార్యకర్తలందరూ అహర్నిశలూ శ్రమించి

# విషయ సూచిక.....



## పంచాంగ వివరాలు

### అక్టోబర్

6. సర్వేషామేకాదశి
11.విదియతిథి.
12. శూన్యతిథి
13. తదియతిథి
18. తులా సం॥ ఉ. 11-07
21. సర్వేషామేకాదశి
23. నరక చతుర్దశి
25. దీపావళి, ధనలక్ష్మీపూజ
సర్వేషాం అమావాస్య
26. **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నశ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి తిరునక్షత్రం**
27.తిథిద్వయం
28.చవితి తిథి
30. మనవాళమామునుల తిరు॥

### నవంబర్

1. పొయిఘయాళ్వార్,పిళ్లైలోకాచార్యర్ తిరు॥
2. పూదత్తాళ్వార్ తిరు॥
తిరుమలైయాండాన్ తిరు॥
3. పేయాళ్వార్ తిరు॥
4. సర్వేషాం బోధనైకాదశి
5. చిలుకుద్వాదశి చాతుర్మాస్య సమాప్తి
7. విశాఖ కార్తె ఉ. 10-47 వైకుంఠ చతుర్దశి
8. గ్రస్తాస్తమయ సంపూర్ణ చంద్రగ్రహణం
13.పంచమి తిథి
14.శూన్యతిథి
15.షష్ఠితిథి
17.వృశ్చిక సం॥ ఉ. 8-38
19.తిథిద్వయం
20.సర్వేషామేకాదశి, ద్వాదశి తిథి


మీ సేవలో....

**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 272929,
**చందావివరాలు** :- సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-, విదేశాలకు సంవత్సరచందా $ 25,
E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org
D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం,






శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాస పత్రిక




స్వభాను నామ సంవత్సరం ఆశ్వయుజమాసం

**సంపుటి 56** **2003 అక్టోబరు** **సంచిక 7**


వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు :

**శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు**

సంపాదకీయం

# మాధుర్య రహస్యం



- శ్రీరామచంద్రాచార్య

శ్రీకృష్ణుణ్ణి మాధుర్యకందంగా అందంగా వర్ణిస్తారు శ్రీ వల్లభాచార్య స్వాములు.

శ్రీకృష్ణుని పెదవి మధురం, చూపు మధురం, నగవు మధురం, ఎద మధురం, నడ మధురం, మాట మధురం, చేష్ట మధురం, కట్టిన పుట్టం మధురం.

ఆయన వంపులు సొంపులు, ఆ తీరు ఆ సౌరు అంతా మధురం, ఆయన చేయిమధురం, చేత పట్టిన వేణువు మధురం, పాదాలు మధురం, అవి చేసిన నృత్యం మధురం, ఆయన ఈదులాడిన యమున మధురం, తాకిన గోవులు మధురం, ఆయన చూపులు తాకిన గోపకులు మధురం, ఆయన ఎదను తాకిన గోపికలు మధురం.

ఇదేమిటదేమిటి, ఆయనతోపాటు ఆయనకు చెందిన సర్వమూ మధురమే! ఆయనకు చెందనిదేమున్నది ఈ సృష్టిని? అంతా ఆయనే. అంతా ఆయనదే. అంతా కృష్ణమయం. అంతా మధురం.

అసలా స్వామికి ఇంత మధురిమ ఎల్లా వచ్చింది? ఎక్కణ్ణుంచి వచ్చింది?

వల్లభులా మాధుర్యపు రుచులు 'మధురాధిపతే రఖిలమ్మధుర'మ్మని ఎలుగెత్తి పాడేరు.

ఆ మాధుర్యానుభవంలో పరవశించి పోయేరు. ఈ ప్రశ్న వారికి పట్టలేదు.

విచికిత్సలకు తావులేని విలక్షణానుభవం వారిది!

ఇంతకూ ఆ స్వామికి ఇంత మాధుర్యం ఎల్లా వచ్చిందిట!

శ్రీకృష్ణుడంటే ఎవరు? సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే!

**"ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవ నికేతనః।**
**నాగ పర్యంక ముత్సృజ్యహ్యాగతో మధురాం పురీం"**

హెచ్చరిక!

అవతారంగా కాక **'కృష్ణస్తు భగవాన్ స్వయం'**– అని కృష్ణుణ్ణి అవతార కందంగా, అవతారిగా అభియుక్తుల నిరూపణం. అంచేత ఆయన పరమాత్మే.

ఆయన పరమపదంలో ఉంటాడు. పాలకడలిలో ఉంటాడు. పరమయోగి మానసాల్లో ఉంటాడు. **ఇందుగలడందు లేడను సందేహమునకు తావీయక సర్వోప గతుడు**గా తానుంటాడు, దేని వైలక్షణ్యం దానికుంది.

ఆయనను ద్వాదశాదిత్య మండలాం–తర్వర్తిగా వేదం పేర్కొంటోంది.

సూర్యుడో ప్రచండమైన నిప్పులకొలిమి. ఒకటికాదు రెండు కాదు పన్నెండు కొలుముల నడుమ తా నిత్యనివాసం చేస్తున్నాడా 'నారాయణుడు' నీటి నెలవు కలవాటు పడ్డవాడేమో ఆ తాపానికి తట్టుకోలేక పోయినాడు పాపం!

చలువలనెలకెక్కడయిన దొరుకుతుందేమో కాస్త ఇవతళింతమని మనసు పడ్డాడు.

ఇలా వెలసిన పన్నిద్దరు ఆళ్వారుల ఎద తమ్ములు కనవచ్చెను. విస్మయాన కనుదమ్ములు నెరవిరిసెను.

ఎద ఆనందముతో మందాకిని తానాయెను. పన్నెండు నిప్పుల కొలుములకు





దీటుగా పోటీగా ప్రేమకురుస్తూ కనువిందుగా ఎద పొందుగా మేనికి పసందుగా కనవచ్చిన వా ఎదతమ్ములు. తేనె వాకలు జాలువారుతూ వగరుతావులు విరజిమ్ముతూ రారమ్మని స్వామికి స్వాగత గీతాలు పాడినాయి.

తావులు మూర్కొంటూ, తేనెలు గ్రోలుతూ, పూరేకుల పొత్తిళ్లపై పవళిస్తే కాస్త సేదదీరటమే కాదు. నిప్పుల కొలుములు కొప్పున్న నెగ్గలపు తాపము శమించి, మేనూ, ఎదా ఇవతళిస్తా యనుకొన్నాడు.

పన్నిద్దరాళు వారల హృదయ పుండరీ కాలలో కాపురం పెట్టేడు (రాయలవారి దర్శనం).

ఆళువారల ఎదతమ్ములు భక్తి మరంద భరాలు. ఆ తేనెవాకలలో నానినాని, ఊరి ఊరి ఆయన మాధుర్యపు ముద్ద అయినాడు. దీనితో ఆయన పలుకులో మాధుర్యం, కులుకులో మాధుర్యం, చూపులో మాధుర్యం, నడకలో మాధుర్యం నగవులో మాధుర్యం.

ఆయన పట్టినదానిలో మాధర్యం, మెట్టిన దానిలో మాధుర్యం, తట్టిన దానిలో మాధుర్యం, కట్టిన దానిలో మాధుర్యం, ఆయన సర్వమూ మాధుర్యమయం అయి కూచుంది.

ఈ మాధుర్యాన్ని చవిగొనే వల్లభులు మధురాష్టకం పాడేరు.

ఏమండీ కృష్ణుడు మొన్నటివాడు. ఆళువారలు నిన్నటివారు, ముందు వెనకల పొందిక ఎట్లా? అంటారా? అయ్యా ఇది రసిక దర్శనం! ఆ చూపుకల వారికి ఇది చక్కగానే కనవస్తుంది.

అయినా ఒక మాట.

విశ్వరూప సందర్శనంలో అర్జునుడింకా కింద పారేసిన విల్లమ్ములు చేపట్టకముందే ధృతరాష్ట్రులు, భీష్మ ద్రోణాదులు అందరూ భగవానునిలో లయమవటం చూస్తాడు. అప్పటికింకా జరక్కపోయినా ఆ దృశ్యాన్ని అర్జునుడు దర్శిస్తాడు.

అట్లాగే కృష్ణావతారం నాటికి ఆళువార లవతరించక పోయినా స్వామి సంకల్ప ప్రణాళికలో అది చేరే ఉంది. ఆయన మధురకు వచ్చేనాటికే తన సంకల్పంలో ఆళువారలు. వారి ఎదతమ్ములు, వాటిలో తేనెవాకలు, ఆ భక్తి మాధ్వీకఝురులలో తాను తేలియాడటాలు– అన్నీ సిద్ధాలే! కొత్తగా ఏదో తరువాతి కాలంలో వచ్చినవి కావు. అంచేత ఇక్కడ పౌర్వాపర్య ప్రశ్నేలేదు.

ఆళువారల ఎదతమ్ముల తేనెవాకల స్వామి దోగాడటం ఆకాల మీకాలమని కాక నిత్యత్వ దృష్టితో చూడాలి బుద్ధిమంతులు! అయినా ఇది ఎద నిండి పెల్లుబికిన మాధుర్యపు కులుకు మది నలయించే తర్కపు బెళుకు కాదు

కొందరంటారు– సహజంగానే మాధుర్య కందమయిన శ్రీకృష్ణుడు నానిన తేనెలనుంచి వెలువడిన పలుకులు కావటాన్నే ఆళువారల శ్రీ సూక్తులకు అంత మాధుర్యం వచ్చిందని! కానీండి, దానికేమి? ఈ మాధుర్యం పారస్పరికం అనుకొన్నా మాకేమీ విప్రతి పత్తిలేదు.

అన్యోన్యాశ్రయ దోషం అంటారా?

ఇట్లాంటి చోటుల "నశాస్త్రం, నైవ చ క్రమః"

అని పెద్దలతీర్పు. పానకంలో పుడకలు రాకూడదని!

- శ్రీరామచంద్రాచార్య.



# మహర్షుల చరిత్ర

## వైశంపాయన మహర్షి

తమిళమూలం :
శ్రీ.వా. నావల్‌పాకం దేవనాథ
తాతాచార్యస్వామి

తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూపురాణి
ఉడయవర్‌స్వామి, విజయవాడ

**శ్లో॥ వాసుదేవ కథాప్రశ్నః, పురుషాంస్త్రీన్ పునాతి హి**
**వక్తారం పృచ్ఛకం శ్రోతౄన్, తత్పాద సలిలం యథా ॥**

శ్రీమన్నారాయణుని కథలను చెప్పమని అడిగినందులకు ఆ కథలు చెప్పుమీరు కూడ పవిత్రులగుదురనియు, అంతమాత్రమేకాక అక్కడచేరి ఆ కథలను విను సామాన్యులు కూడ తరింతురనియు, భగవానుని పాదకమలము నుండి బయలుదేరిన గంగకు కూడ ఇదే విధమైన యోగ్యత కలదనియు పై శ్లోకమునకు అర్థము.

ఈ శ్లోకము శుకుడు పరీక్షిన్మహారాజుకు ఉపదేశించిన శ్రీ భాగవత పురాణములోనిది. శ్రీ శుకుడు ఆచార్యుడుగను, పరీక్షిన్మహారాజు శిష్యుడుగను, వర్ణింపబడినది. అట్లే సూత పౌరాణికుడు, ఆచార్యుడు, జనమేజయ చక్రవర్తి శిష్యుడు. మహాభారతమని, పంచమవేదమని ప్రసిద్ధిచెందిన ఇతిహాస రత్నమును కాపాడి తరువాతి తరములకు అందించినది ఈ వైశంపాయన జనమేజయులే. మహాభారతకథ చెప్పినవాడు వైశంపాయనుడు. విన్నవాడు జనమేజయుడు. మహాభారతం చదివేవారికి అడుగడుగునా "వైశంపాయన ఉవాచ" అనే మాట కనిపిస్తూ ఉంటుంది. బ్రహ్మాండమైన ఈ మహాభారత కథను ఏ కొంచెము తగ్గించక, విసుగులేక, చలించక చెప్పిన మహానుభావుడైన వైశంపాయన మహర్షిని సూత పౌరాణికుడు మాటిమాటికి తలచుకొని మనస కరిగి అంజలి ఘటించునట్లు తెలిపేదే ఈ "వైశంపాయన ఉవాచ" అనే వాక్యము.

అంతేకాదు. కథ చెప్పేటప్పుడు, అసలు కథ విడిచి కథలో కథగా ఎక్కడకో పోవడం జరుగుతుంది. వినేవారుకూడ పరవశులై వింటూ కథాగమనాన్ని మరచే అవకాశం ఉంది. ఇటువంటి సందర్భాలలో తిరిగి అసలు కథలోకి రావడానికి సూత పౌరాణికునికి ఈ "వైశంపాయన ఉవాచ" అనేవాక్యం బాగా ఉపకరించింది. ముఖ్యమైన కథాఘట్టాల దగ్గర ఈవాక్యం మనకు గోచరిస్తూ ఉంటుంది.

**వ్యాస శిష్యుడు:**

వేదవ్యాసుడు వేదాలను విభజించి వాటిని ప్రచారం చేయడంకోసం ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరిని స్వీకరించడం జరిగింది. అలా స్వీకరించిన వారిలో వైశంపాయనుడు ఒకడు. యజుర్ వేదాన్ని ప్రవచించి ప్రచారం చేయడానికి ఈ వైశంపాయనుడు నియమించబడ్డాడు. వేదవ్యాసునికి సమ ఉజ్జీగా ఉండి, వేదశాఖలను విభజించడంలో ఆయనకు సహకరించి, యజుర్ వేదమును కాపాడిన ఘనత వైశంపాయన మహర్షిదే. వ్యాసుని ఆజ్ఞను అనుసరించి జనమేజయునికి మహాభారతకథ చెప్పే అదృష్టం వైశంపాయన మహర్షికే దక్కింది.

**జనమేజయేన పృష్టః (సన్) బ్రాహ్మణైశ్చ సహస్రశః**





**శశాస శిష్యమాసీనం, వైశంపాయన మన్తికే ॥**
**స సదెస్స్యైస్సమాసీనం, శ్రావయామాస భారతమ్**
**కర్మాన్తరేషు యజ్ఞస్య, చోద్యమానః పునః పునః ॥**

జనమేజయుని యాగంలో మహాజ్ఞాన సంపన్నులును, బ్రాహ్మణోత్తములును తండోపతండాలుగా వచ్చి చేరారు. తమ శిష్యులతో అచ్చటకు చేరిన వేదవ్యాసమహర్షిని, తన ముత్తాతలైన పాండవుల కథ వినిపించవలసిందిగా యజ్ఞ విరామ సమయములో ప్రార్థించాడు జనమేజయుడు. ఆ కథను తానే చెప్పకలిగినప్పటికీ, వేదవ్యాసుడు పాండవుల కథను జనమేజయునికి వినిపించడానికి వైశంపాయన మహర్షిని నియోగించి, తానుకూడ ఆ కథను మిగతావారితో పాటు విని ఆనందించాడట. వైశంపాయనుడు ఆచార్యుని అనుగ్రహంతో సాటిలేని వాగ్వైభవాన్ని పొంది మహాభారత కథను ప్రచారం చేశాడు.

**జనమేజయుడు:**

వైశంపాయన మహర్షి గొప్పదనం లోకానికి వెల్లడికావడానికి మూలకారణభూతుడు జనమేజయుడు. ఈతడు 'పరీక్షిత్' మహారాజు కుమారుడు. మహావీరుడైన అభిమన్యుని మనుమడు. అర్జునుని మునిమనుమడు పరీక్షిన్మహారాజు అకాల మరణాన్ని పొందిన తరువాత ఈతడు పట్టాభిషిక్తుడయ్యాడు. కాశి రాజపుత్రి వపుష్మ ఈతని ధర్మపత్ని. శతపథ బ్రాహ్మణము, ఐతరేయ బ్రాహ్మణము మొదలైన వేద భాగములలో ఈయనపేరు కనబడుచున్నది. శ్రుతసేనుడు, ఉగ్రసేనుడు, భీమసేనుడు అనువారు వీరికి సహోదరులు. ఈతని తల్లిని 'మాద్రవతి' అని పిలిచేవారు.

జనమేజయుడు ఒకదాని తరువాత ఒకటిగా యజ్ఞాలు యాగాలు చేస్తానే ఉండేవాడు. ఈయన కురుక్షేత్రంలో 'దీర్ఘసత్రము' అనేయాగం చేస్తూ ఉన్న సమయంలో అక్కడకు ఒక కుక్క వచ్చిందట. దానిని జనమేజయుని సోదరులు చావబాదారట. ఆ కుక్క దెబ్బలను సహించలేక తన తల్లి దగ్గరకు వెళ్ళి"అమ్మా, యాగంలో ఏవిధమైన అశుభ్రతను చేయకుండా ఒకమూల ఒదిగి ఉన్న నన్ను కొట్టారు" అని చెప్పి ఏడ్చిందట. వెంటనే తల్లి కుక్క యాగశాలకు వెళ్ళి జనమేజయుని దగ్గర మొరపెట్టుకుంది. రాజు తన మొర వినకపోవడంతో "నిన్ను గొప్ప భయం ఆవరించుగాక" అని రాజును శపించింది ఆ కుక్క. మహారాజయినా, మహర్షి అయినా శాపం అనుభవించవలసిందే. ఆ రోజులు అటువంటివి. జనమేజయునికి గొప్ప భయం ఆవహించింది. తక్షశిలా నగరాన్ని వశం చేసుకొని అక్కడ చాలమంది ఋత్విక్కులతో శాపవిముక్తికై గొప్ప యాగాలను చెయ్యడానికి ఏర్పాట్లు చేశాడు.



# రామాయణంలో రమ్య గాథలు

## సీతాన్వేషణలో అద్భుత కథలు

-చెవుటూరి కుసుమ కుమారి, విజయవాడ.

రామపత్నిని అపహరించి రావణుడు హేయమైన పని చేసినాడు. అంతియేకాదు నా సోదరుని చంపినందుకు రావణునిపై ప్రతీకారము నేనునూ చేయవలెను. కనుక మీరు ఏదో విధముగా ఈ లవణ సాగరమును దాటు ఉపాయమును కనుగొనవలెను. అప్పుడే మీరు అర్థసిద్ధులై తిరిగి వెళ్ళగలరు. మీరు దయతో నన్ను సముద్రము వరకు తీసుకొని వెళ్ళుడు. ఉత్తముడు, స్వర్గస్థుడు అయిన నా సోదరుడు జటాయువునకు సలిలక్రియలు (తర్పణలు) చేయుదును. అని కోరుకొనగా బలశాలులైన ఆ వానరులు సీత జాడ తెలిసినదని ఉప్పొంగిపోయినారు. ఆ సంపాతిని సముద్ర సమీపమునకు తీసుకొని వెళ్ళి, మరల యథాస్థానమునకు చేర్చినారు. రావణుడు సీతనెత్తుకొని పోవుచుండగా తన పుత్రుడైన సుపార్శ్వుడు చూచి చెప్పిన వృత్తాంతమును చెప్పెదను వినుడు అని సంపాతి పలుకగా, వానరులకు ఆమాట అమృతోపమాన మైనది. వానర శ్రేష్ఠుడైన జాంబవంతుడు వెంటనే లేచి, "సంపాతీ! సీత ఎక్కడ వున్నది? ఆమెనెవరు చూచినారు? వజ్రవేగతుల్యమైన రామబాణ శక్తినీ, లక్ష్మణుని శరోద్ధతినీ తలపోయక కాలము చెల్లిన వాడి గురించి చెప్పుము". అని పలికినాడు. వానరులందరూ ప్రాయోపవేశమును విడిచి, సీతా వృత్తాంతమును వినవలెనన్న ఉత్కంఠతో చుట్టునూ చేరి సావధానచిత్తులై వేచి చూడసాగినారు. ప్రీతమనస్కుడైన సంపాతి చెప్పసాగినాడు.

"ఎన్నడో చాలాకాలము క్రిందట సూర్యకిరణ జ్వాలకు రెక్కలు కాలిన నేను అనేక యోజన విస్తీర్ణముగల ఈ వింధ్య పర్వతము మీద పడిపోయి జరాభార వశుడను అయినాను. నా బలపరాక్రమములు నశించి పోయినవి. అప్పటినుండి సుపార్శ్వుడు అనే నాపుత్రుడు నాకు సమయానుసారము ఆహారమును తెచ్చిపెట్టి నన్ను కాపాడు చున్నాడు. ఆనాడు నేను పగలంతా ఆకలితో పడివుండగా సూర్యాస్తమయ సమయము దాటిన తరువాత కొంచెమైనా ఆహారము తేకుండా వచ్చిన నా కుమారుని చూచి, అసలే ఆకలి పీడితుడనైన నేను వానిని చాలా నిందించినాను. అప్పుడు నాకుమారుడు నన్నెంతగానో బ్రతిమాలి, నాకీ వృత్తాంతము చెప్పినాడు.

తండ్రీ! నేను నీకు ఆహారము తెచ్చుటకై మహేంద్ర పర్వతమునకు గగన మార్గమున ఎగిరి పర్వత ద్వారమునకు అడ్డుగా నిలచినాను. తలక్రిందకు వంచి సముద్రములోని జలజంతువుల కదలికను తీక్షణముగా పరిశీలించుచుండగా, కాటుక కొండవంటి వాడొకడు సూర్యకాంతి సమాన





తేజోరాశి అయిన ఒక స్త్రీ మూర్తిని పట్టి తీసుకొని పోవుచూ కనుపించినాడు. నేను వారినే ఆహారముగా గ్రహించుటకు యత్నించినాను. కాని ఆ చీకటి రాశివంటి పురుషుడు అతి వినయంగా దారి ఇమ్మని పదేపదే వేడుకొనినాడు.

**"నహి సామోప పన్నానాం ప్రహర్తా విద్యతే భువి**
**నచేష్వసి జనః కశ్చి త్కి మజ్జ బత మద్విధః"**

తండ్రీ! ఈ భూమిమీద నీచుడైన వాడుకూడా బ్రతిమాలుకొనుచున్న వానిని చంపడు కదా! యింక నావంటివాడెట్లు చంపగలడు? అందుచేతనే వానిని వదలిపెట్టినాను. అంతట అతని తేజస్సుచేత ఆకాశమే చిన్నది అవుతున్నదా! అన్నట్లు వాయువేగంతో గగన మార్గాన వెళ్ళిపోయి నాడు. అప్పుడు ఆకాశమున వసించు ప్రాణులన్నీ నావద్దకు వచ్చి నన్నభినందించి నారు.

**"దిష్ట్యా జీవతి సీతేతి అబ్రువన్మాం మహర్షయః**
**కథంచి త్స కళత్రో౽సౌ గతస్తే స్వస్త్య సంశయమ్"**

దైవవశమున సీత సజీవముగా వున్నది. రావణుడు ఎట్లో సీతతో సహ తప్పించుకొనినాడు. "నాయనా! నీకు క్షేమము కలుగగలదు. అని అచ్చట సిద్ధులు, మహర్షులు కూడా పలికినారు. అక్కడ సిద్ధులు ఆమె జనకుని కూతురనీ, దశరథ భూజాని కుమారుడైన శ్రీరామచంద్రుని పత్ని అనీ, అస్తవ్యస్త వస్త్రములు జారి పడిపోవుచున్న ఆభరణములు, ముడివీడిపోయిన కేశ పాశములతో దుఃఖోద్వేగము చేత రామ లక్ష్మణులను ఎలుగెత్తి పిలుస్తున్న ఆ స్త్రీని అపహరించుకొని పోవుచున్నవాడు రాక్షస రాజైన రావణుడనీ వారు నాకు చెప్పినారు. తండ్రీ! నీ ఆలస్యమునకు ఇదియే కారణము. అని చెప్పినాడు సుపార్శ్వుడు. వానర ముఖ్యులారా! అంతటి ఘోర వార్తను వినికూడా రెక్కలులేని పక్షినైన నేను ఏమీ చేయలేకపోతిని. నేను మాటసాయమును, బుద్ధిబలముచేత కొంత సహాయమును మీకు చేయుగలను. రామకార్యము నాదిగనే భావించి మీకు ప్రియము కూర్చగలను. బుద్ధిమంతులు పరాక్రమశాలురు అయిన మీరు ఆలస్యము చేయక కాగల కార్యమును నిర్ణయించవలె".

అటుతరువాత వానర నాయకులు, సంపాతి అందరూ జటాయువుకు జల తర్పణలు విడిచి, సంపాతి చుట్టూ ఉపవిష్టులు అయినారు. సంపాతి మరల చెప్పసాగినాడు.



## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషిచేస్తున్న వారిలో **శ్రీ రాచకొండ రాజేశ్వరరావు - విజయలక్ష్మి** దంపతులు ఒకరు (బెల్లంపల్లి). వీరికి శ్రీశ్రీశ్రీ స్వామివారు అనేక మంగళాశాసనములు కృపచేయుచున్నారు.



# భగవద్రామానుజ చరిత్ర

శ్రీమతి **టి.కె. చూడామణి,** విజయవాడ



తమ అనంతరం శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంతం అవిచ్ఛిన్నంగా సాగడానికి యతిరాజులు చేసే ప్రయత్నాలన్నింటిని చూసిన శిష్యబృందం ఆచార్య వైభవానికి ఆనందిస్తూనే చెప్పలేని మనోవేదనకు గురి అయ్యారు. మన ఆచార్యులు. మన భగవద్రామానుజులు అన్నివిషయాలను చక్కబాటు చేసేస్తున్నారే. ఎందుకు తొందర? ఏదైన అడుగుదామని ప్రయత్నించినా మందస్మితమే జవాబుగా మెదులుతోంది. ఆచార్యులు నూట ఇరువది సంవత్సరాల వారౌతున్నారు. పుట్టినది మానవులుగా కదా.. అదే భయం. ఈ మహనీయునికి దూరమై మనం జీవించగలమా? ఈ మహాపురుషుని ఎడబాసిన బ్రతుకు బ్రతుకేనా.... ఇలా ఆలోచనలలో తల్లడిల్లిపోతున్నారు శిష్య బృందం.

యతిరాజులు తమ మఠంలో పెరుమాళ్ తిరువారాధన పూర్తి చేసికోని తీర్థం స్వీకరించినారు. స్వామికి సాష్టాంగ దండ ప్రణామం గావించారు. వారి ఆలోచనలు భగవంతుని చుట్టూ సాగుతుండగానే శిష్యకోటి అంతా వచ్చి దాసోహం పెట్టారు. వారిని కూర్చోమని ఏమిటన్నట్లు చూశారు యతిరాజులు స్వామి! ఆనాడు తిరునారాయణపురం భక్తకోటి మీకు దూరమై బ్రతుకలే-మంటే మీ అర్చామూర్తిని అనుగ్రహించారట. వారెంత అదృష్టవంతులు. మాకు కూడా ఆభాగ్యం అంటూ మౌనం దాల్చారు. వారుశ్రీ కందాడై ఆండాన్ "ఔను స్వామి! శ్రీ పెరుంబుదూరులో మీ అర్చామూర్తిని నిత్యారాధన నిమిత్తం ప్రతిష్ఠించుకుంటాం. శ్రీరంగంలో మీ అర్చామూర్తిని ప్రతిష్ఠించుకొని ఆచార్య నిత్యారాధన చేసుకుంటాం అన్నారు. మొదట రామానుజులు అంగీకరించలేదు. కాని శిష్యులంతా బలవంత పెట్టేటప్పటికి కాదనలేక పోయారు. వెంటనే మంచి శిల్పిని రప్పించారు. ఆయన భగవద్రామానుజులను బోలిన మూర్తులను రెండింటిని చాల చక్కగా నిర్మించారు. రామానుజులు ఆనందంతో ఆవిగ్రహాలను ఆలింగనం చేసుకున్నారు. వారిలోని దివ్యశక్తి ఆ విగ్రహాలలోనికి వచ్చింది. దీనినే **"తమరుకన్ద తిరుమేని"** అంటారు. శ్రీ కందాడై ఆండాన్ రామానుజుల విగ్రహాన్ని పల్లకిలో ఉంచి ఊరేగిస్తూ శ్రీ పెరుంబూదూర్ తీసికొని వెళ్ళారు.

పుష్య శుద్ధ గురువారం పుష్యమీ నక్షత్రం నాడు శ్రీ పెరుంబుదూరులో ఆ విగ్రహ ప్రతిష్ఠ చేసినపుడు శ్రీరంగంలో ఉన్న ఉడయవరులు ఉక్కిరిబిక్కిరి అయ్యారట. అక్కడ నేత్రోన్మీలనం చేస్తోంటే ఇక్కడే ఉడయవరుల కన్నులనుండి రక్తం





వచ్చిందట. ఆ కార్యక్రమం జరుగుతున్నంత సేపు రామానుజులకు చెప్పలేని శ్రమ కలిగిందట. దీనిని బట్టి తమ అర్చారూపంలో రామానుజులు ఎలా అధిష్ఠాన దేవతా మూర్తిగా వేంచేసి యున్నారో తెలుస్తుంది. ఇలా అటు తిరునారాయణ పురవాసులకి, ఇటు శ్రీరంగవాసులకి, శ్రీ పెరుంబుదూరు వాసులకి మూడు క్షేత్రాల వారికి మూడు అర్చామూర్తులుగా తమను అర్పించుకున్నారు రామానుజులు నూటయిరువది సంవత్సరముల మూర్తి నిండుగా నడుస్తుంటే ఆనందం తోపాటు... ఎప్పుడే ఎడబాటు వస్తోందో అనే భయం, బెంగ పెరిగిపోయాయి భక్తకోటికి.

శ్రీరంగామృత స్వామి ఎంతో గొప్ప కవులు. వీరు శ్రీరంగనాధుని కైంకర్యం చేసే అధికారపదవిలో ఉండేవారు. శ్రీకూరేశుల శిష్యులై శ్రీరంగ నిర్వహిణాధికారాన్ని శ్రీభాష్యకారులకు అప్పగించేశారు. వీరికి ఉడయవరులంటే ఎంతో ప్రేమ. శ్రీ రంగనాధస్వామి ఒకరోజు వీరిని పిలిచి ఉడయవరులను గూర్చి అందరూ అనుసంధించుకునేలా ఒక ప్రబంధాన్ని రచింపుడని ఆజ్ఞాపించారు. మురిసిపోయారు శ్రీరంగామృతస్వామి. ఉడయవరులకి ఆళ్వార్లందరి యెడల ఎంత భక్తి ప్రపత్తులున్నాయో తెలియచేసేలా ఈ గ్రంథాన్ని రచించారు. ప్రతిపాశురంలోను శ్రీరామానుజుల తిరునామం వచ్చేలా, మొత్తం ప్రబంధం పూర్తిగా చదివితే శ్రీరామానుజులు తిరునామం, 108 సార్లు వచ్చేటట్లు **ఇరామానుశనూత్తందాది** అనే గ్రంథాన్ని రచించారు వీరు. దీనికే ప్రపన్న గాయత్రి అని పేరు. ఒక పాశురంలో చివరి పదం(అంతం) తరువాతి పాశురంలో మొదటిగా(ఆది) వస్తే దానిని అందాది అంటారు. అంతమే ఆదిగా కలది అనిఅర్థం. ఇలా ఈ గ్రంథం ఇరామానుశనూత్తందాదిగా ప్రసిద్ధికెక్కింది. శ్రీ రామానుజుల ఆమోద ముద్ర లభించింది శ్రీరంగనాధుడు నాలాయిర దివ్య ప్రబంధంతో పాటు ఈ ఇరామానుజ-శనూత్తందాదిని కుడా అనుసంధానం చేయాలని ఆజ్ఞాపించాడు. అప్పటి నుండి అది సంప్రదాయంగా కొనసాగుతోంది.

## చరమోపదేశం

కాంచీపురిలో శ్రీరంగంలో తమ జీవితాన్ని ఎక్కువ భాగం గడిపిన రామానుజులు శ్రీరంగనాధుని చేరి తమను రప్పించుకోనుమని ప్రార్థించారు. కాదనలేకపోయాడు శ్రీరంగ నాధుడు. విషయం తెలుసుకున్న భక్తకోటి దుఃఖంతో నిండిన ముఖాలతో చుట్టూ చేరారు. వారిముఖాలు చూస్తూ నవ్వే ప్రయత్నం చేశారు రామానుజులు. ఎందుకయ్యా మీ అందరికి ఇంత దుఃఖం. జాతస్యమరణం ధ్రువం అన్న సంగతి మీకు తెలియదా. నా గురించి బెంగఎందుకు నా బోధనలను ఆచరించి చూపించి నాపై మీకు గల ప్రేమని లోకానికి చాటండి ధర్మం వినడంతో పూర్తిగాదు. ఆచరణ ఉండాలి. చూడండి.





# శ్రీ రామచంద్ర ప్రభువుకు సామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవము

**శ్రీ రామస్వామివారి దేవస్థానము - రామతీర్థం, విజయనగరం జిల్లా.**

**10-10-2003 నుండి 19-10-2003 వరకు**



| | |
|---|---|
| **తేది: 10-10-2003 సా॥ 6గం॥కు** | : విష్వక్సేనారాధనము, అంకురారోపణము, ఋత్విగ్వరణము,అగ్ని ప్రతిష్ఠాపన |
| **తేది: 11-10-2003 ఉ॥ 7గం॥నుండి నుండి మ॥ 12గం॥వరకు 18-10-2003** | : 60మంది ఋత్విగ్వరేణ్యులచే 24 శ్రీమద్రామాయణ పారాయణలు, 108 సుందరకాండ పారాయణలు, శ్రీభాష్యం, భగవద్విషయాది దివ్య గ్రంథముల పారాయణలు, మరియు శ్రీమత్సుందరకాండ సంక్షేప రామాయణ, గాయత్రీ రామాయణ హవనము. |
| **తేది: 14-10-2003 ఉ॥ 9గం॥లకు** | : మహాస్నపనము |
| **తేది 19-10-2003 ఉ॥ 9గం॥లకు** | : పూర్ణాహుతి, శాంతి కళ్యాణము, సామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవము |

ప్రతీరోజూ సాయంత్రం సమయములలో పండితుల ఉపన్యాసములు, సంగీత, నృత్య కార్యక్రమములు జరుగును.

ఆస్తిక భగవద్భాగవత బంధువులగు భక్తవరేణ్యులు దర్శించి భగవత్కృపకు పాత్రులు కావలసినదిగా కోరుచున్నాము.

-నిర్వాహకులు

మరిన్ని వివరములకు: 08922 - 244036
08922 - 244468








ఆస్ట్రేలియాలోని మెల్‌బోర్న్‌లో శ్రీ స్వామివారు శ్రీ అనుమర్లపూడి అమర్‌నాథ్‌గారి గృహానికి వేంచేసారు. శ్రీవారితో తాము పంచుకొన్న అనుభూతులకు అక్షరరూపాన్నిస్తూ శ్రీ అమరనాథ్ పంపిన లేఖాకుసుమమే- ఈ శీర్షిక.

శ్రీస్వామివారు ఎంతో కరుణతో శ్రీ హనుమత్సమేత శ్రీ సీతారామలక్ష్మణ నిత్యపూజా విగ్రహములు, పరమ గురువుల విగ్రహములతో విచ్చేసి మమ్మల్ని, అనేక మంది భక్తులను ఆశీర్వదించారు. వారి ప్రవచనాలద్వారా మంచి పనులు, నలుగురు కలిసి నిర్వహించవలసిన విధానాన్ని ప్రబోధించారు. మా ఇళ్ళలో, అతిథి సత్కారాలలో దొర్లిన పొరపాట్లు, లోపాలు ఎంతో సహృదయంతో మన్నించి, వారి చిరు దరహాసంతో ఊరట కలిగించారు.

శ్రీవారి దర్శనము, స్పర్శనము, వారి ప్రవచనముల శ్రవణం ఆస్ట్రేలియాలో అనేకమందికి ఎంతో ఆనందం కలిగించింది. అయితే ఒక ఆలోచన... మమ్మల్ని అందరినీ కలవడం వలన శ్రీ స్వామివారు కూడా మాలాగే సంతుష్టాంతరంగులు అయినారా? ఏమిటో ఇలాంటి ఆలోచన, ప్రశ్న ఉచితమేనా? కలతగా ఉన్న నామదిలో ప్రేమగా శ్రీ జ్ఞాన సరస్వతి మాత పిలుపు. ఏమిటి నీ ఆలోచన అని. సంగతి చెపితే నవ్వుతూ, చిన్నపుడు నేను నేర్చుకున్న పద్యము జ్ఞప్తికి తెచ్చుకోమన్నది.

**క్షీరము మున్ను నీటి కొసగెన్ స్వగుణంబును తన్ను చేరుటన్**
**క్షీరము తప్త వెకాటగని, చిచ్చురికెన్ వెతచే జలంబు**
**దుర్వార సుహృ ద్వి పత్తిగను వహ్నిం చొరంజెనె దుగ్ధమంతలో**
**నీరము గూడి శాంతమగు నిల్చు మహాత్ముల మైత్రి ఈగతిన్.**

అమ్మా! ఈ పద్యమే కదూ అంటే అవును అన్నది. అంటూ ఇక ఇంటావిడ. గిన్నెలో పాలు చిక్కగా ఉన్నాయని నీళ్ళు కలిపింది. వచ్చి కలిసిన నీళ్ళతో, పాలు తన స్వంత గుణాల్ని పంచుకున్నది. **"క్షీరము మున్ను నీటికొసగెన్ స్వగుణంబును తన్ను చేరుటన్"** శ్రీ స్వామివారు, భగవత్తత్వం అనే క్షీరము ఆయనతో నీళ్ళలాంటి మనము

చేర్చబడినాము. జగన్మాత – అలా కలిపిన ఇంటావిడ, ఇలా కలిసిన మనల్ని– నీళ్ళు కలిసిన పాలని– సృష్టికార్యక్రమం అనే అగ్నిమీద వేడి చేస్తున్నది– పాలు కాచుతున్నది.

శ్రీ స్వామివారు మెల్బోర్నలో మొట్టమొదటి సారిగా తెలుగులో అందించిన ప్రవచనము మనసులో మెదిలింది. ఆయన ఇక్కడకు వచ్చిన తెలుగువాళ్ళ గురించి చెపుతూ, నీటి గుణము "ఆర్జవము"తో పోల్చారు. నీరు, తన సహజ గుణాన్ని విడిచిపెట్టకుండా, ఎటువంటి రూపమున్న పాత్రలో పోస్తామో, ఆ పాత్ర రూపంలో పొందికగా అమరుతుంది. ఇదికూడా భగవంతుని అనేక కళ్యాణ గుణములలో ఒక గుణముగా అభివర్ణించారు. అయతే, సహనంవలన అబ్బిన గుణములకి ప్రాధాన్యం ఇచ్చి, సహజ గుణం మరచిపోకూడదని హెచ్చరికతో కూడిన ప్రబోధన అందించారు.

భక్తితో వింటున్న మమ్మల్ని అందరినీ, శ్రీ స్వామివారు నీరుతో పోలుస్తూ చేసిన హితబోధలోని ఆంతర్యరేమిటి? జగన్మాత చేస్తున్న పని గురించి, చూచాయగా తెలియచేయుడమే అని అనిపిస్తున్నది.

**"క్షీరము తప్త మోటగని చిచ్చురికెన్ వెతచే జలంబు"**

కుంపటిమీద ఉంచిన గిన్నెలోని పాలు, వేడివలన తపించుట చూసిన నీళ్ళకి చాలా బాధకలిగి, నీళ్ళు అగ్నిలోకి దూకినవి అయి ఆవిరిగా మారిపోతున్నవి.

సృష్టి అనే అగ్నిలో, యుగ ధర్మాన్ని అనుసరించి, భగవత్తత్వ ఆరాదన జరుగుతున్న పద్ధతుల వైవిధ్యంలో ఉన్న విషయ అవగాహన సరిగాలేని కారణంగా, నీళ్ళలాంటి మనము, మనకు తోచిన రీతిలో పూజ, జపము, తపము, తదితర సత్కార్యా చరణలనే అగ్నిలో దూకినవారము అయితిమి.

**"దుర్వార సుహృద్విపత్తిగని వహ్నిం జొరం జనె దుగ్ధము"**

వారింప శక్యము కాని మంచి మిత్రుడయిన నీళ్ళయొక్క విపత్తును చూసిన పాలుకకూడా అగ్నిలో దూకడానికి సిద్ధము అయింది – పాలు పొంగు చూపాయి. సకృమయిన పద్ధతిలో సత్కర్మ, ఆచరణ జరగని కారణాన, మనకి పాప, పుణ్య ఫలితములు లభించి, జనన మరణ చక్రభ్రమణం నుంచి బయట పడలేకపోవడం అనే వారింపశక్యముగాని విపత్తులో పడిపోయాము. అది కాంచిన శ్రీ స్వామివారు, మన అందరికి పరమేశ్వర అనుగ్రహ సిద్ధికోసం, "నిర్వికల్పసమాధి" అనే అగ్నిలో ప్రవేశింప ఉద్యుక్తులయారు.





**"......అంతలో, నీరము కూడి శాంతమగు,**

**నిల్చు మహాత్ముల మైత్రి ఈ గతిన్"**

పొంగు చూపిన పాలమీద, నీళ్ళు చల్లిన కారణంగా, నీళ్ళతో (మరల) కూడినపాలు, పొంగుట ఆపి శాంతించినట్లు, పరస్పర ప్రేమాభిమానములు, గౌరవములతో ఉంటూ ఉండే విడదీయరాని మిత్రుల పరిస్థితి ఈవిధంగా ఉంటుంది. జగన్మాత, విషయము గ్రహించినది అయి, సీతానగరంలో ఉంటున్న శ్రీ స్వామివారిని, సుదూర ప్రాంతములలో ఉంటున్న మనల్ని దగ్గరచేసి ఆశీర్వదించింది.

శ్రీ స్వామివారిని కలిసి మనమెంత ఆనందించామో, అలాగే మనల్ని కలిసిన శ్రీ స్వామివారు కడా సంతసించి, మనం చేయవలసిన పనులగురించి, వాటి సక్రమ ఆచరణల గురించి సవివరముగా ప్రస్తావించి, చూపించి కార్యోన్ముఖులను కావించారు.

అమ్మా, నామనసు ఇప్పుడు ప్రశాంతముగా ఉన్నది.

**అఖిల జగన్మాతరం, అస్మిన్ మాతరం అశరణ్య శర్యం, అనన్య శరణః శరణ మహం ప్రపద్యే.**

ఓం సర్వం ఖల్విదం గురు పరబ్రహ్మ సర్వం శ్రీగురు చరణారవిందం సమర్పయామి.

ఓం అస్మద్ గురుభ్యో నమః

ఓం సర్వ గురుభ్యో నమః

ఓం శాంతిః శాంతిః శాంతిః

హరిః క్షం తత్సత్.

## తిరునక్షత్ర శుభాహ్వానము

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి తిరునక్షత్ర శుభ సందర్భంగా విశాఖపట్నంలో సముద్ర తీరాన నూతనంగా ఏర్పడుతున్న **'వారిజ'** ఆశ్రమంలో ది. 26-10-03 నుండి 30-10-03 వరకు 'పాంచాహ్నిక దీక్షతో' శ్రీవారి ఆరాధ్యదైవం శ్రీకోదండరామ ప్రభువుకు సహస్ర కలశ స్నపనం జరుగనున్నది.

ఈ సందర్భంగా ది 26-10-03 న కృష్ణ యజుర్వేద ఘనాంత స్వాధ్యాయులు, న్యాయమీమాంసా, భాష్య, శ్రౌత విద్వన్మణులు శ్రీమాన్ చతుర్వేద శతక్రతు వలయపేట్టై నావల్ పాక్కం కృష్ణ రామానుజ తాతాచార్యస్వామివారికి 'జీయర్ అవార్డు' ప్రదానము జరుగుచున్నది.

ఈ కార్యక్రమములో భక్తులు సకల విధాలా అన్వయించుకొని ఆనందించవలసినదిగా 'వారిజ' నిర్వాహకులు కోరుతున్నారు.

# ? సందేహాలు - సమాధానాలు ✓

**ప్ర. వైష్ణవ, శైవ, బౌద్ధ, జైనమతముల శాఖలు, ఉపశాఖలు గురించి తెలుప ప్రార్థన.**

జ. ఒకే సత్యాన్ని అన్వేషించేందుకు బయలుదేరిన మతాలవన్నీను. కొన్ని శాస్త్రాన్ని అంగీకరించక తమకు నచ్చిన మార్గాన్ని నిర్మించుకున్నవి. శ్రీవైష్ణవం మాత్రం వేదశాస్త్రాన్ని పూర్తిగ అంగీకరించి బయలు దేరినది. శాఖల గురించి విడిగ ఒక వ్యాసం క్రింద అందించే ప్రయత్నం చేయగలము.

టి. సునీత,

**ప్ర. మా ఇంటి ప్రక్కన కట్టిన మసీదు శిఖరనీడ మా ఇంటిపై పడుతోంది దోషమా?**

జ. దానినొక ఆరాధనాస్థలంగ గుర్తించకపోతే దోషంలేదు. ఎన్నో చెట్లు, భవనాలు ఉన్నపుడు వాటి నీడను పట్టించుకోవడం లేదు గద! ఇదీ అంతే.

శ్రీడి.బి.ఆర్.బి. రాజు, సుకూర్‌నగర్

**ప్ర. బ్రాహ్మీముహూర్తానికి సరైన సమయమేది? "ఋతుః సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః" అర్థాలు తెలుప ప్రార్థన.**

జ. సూర్యోదయానికి ముందు 1 1/2 గంట నుండి అంటే సుమారు తెల్లవారు ఝాము గం. 4-00 నుండి గం. 5-30 దాక బ్రాహ్మముహూర్తం. ఆపై సూర్యోదయం దాక ఉండే సమయం సంధ్యాకాలము, ఆ సమయంలో జపం, ధ్యానం వంటి సాత్త్వక కార్యాలేవైనా చేస్కోవచ్చు. స్తోత్రపారాయణలు గూడ చేస్కోవచ్చు.

ఋతుః = మాయని గుణములు కలవాడు, సుదర్శనః = శుభము కల్గించు ధర్శనము కలవాడు, కాలః = చరాచరములను తనలో చేర్చుకొనువాడు, పరమేష్ఠి = జగద్రక్షణ చేస్తూ తన పదమును వీడనివాడు, పరిగ్రహః = తన నాశ్రయించిన క్షుద్రజీవులను కూడ ప్రేమతో స్వీకరించువాడు.

శ్రీ ఎ. వీరాచార్యులు, బందరు

**ప్ర. పురోహితులకు భార్య లేక తల్లిదండ్రులు పరమపదిస్తే ఎంతకాలం పౌరోహిత్యం చేయరాదు?**

జ. శుభకార్యాలైతే ఏడాదిదాక చేయరాదు.





**ప్ర.మహిళాపౌరోహిత్యం శాస్త్ర సమ్మతమేనా?**

జ. ఇతరత్రా అవకశాంలేకపోతే వారు చేయించవచ్చు. శాస్త్రం మహిళా పురోహితులను గురించి చర్చించలేదు.

శ్రీ బి. అనంతరాములు, తాతిమూడి

**ప్ర.కన్యాదానం చేసినవారు 3నెలలలోపు బంధువులో, ప్రక్కయింటివారెవరైనానో చనిపోతే పరామర్శించడానికి వెళ్ళరాదా?**

జ. దీనికి శాస్త్రం ఏమీ చెప్పదు. అవి చాల వరకు వాళ్ళ వాళ్ళ నమ్మకాలను, ఇంటి ఆచారాలను బట్టి ఉంటాయి. ఎవరైనా తెలిసినవారు చనిపోతే, వారి బంధువులను పరామర్శించి రావడం కనీసధర్మం. పుణ్యస్త్రీలు వంటివారైతే శుక్ర, మంగళ వారాల్లాంటి రోజులలో వెళ్ళరు. మిగిలినపుడు వెళ్ళడం తప్పేమీకాదు.

**ప్ర.పరమపదించిన వారింట్లో ఎన్ని రోజులవరకు కళ్యాణాలు చేయకూడదు?**

జ. ఇంటిలో ఎవరైనా పరమపదిస్తే సాధారణంగ ఏడాదిదాక ఏమీ చేయరు. ఆ ఇంటివారికి సంవత్సర సూతకం తొలగాలి కనుక అంతవరకూ ఆగుతారు. అది సామాజిక కేంద్రమైతే మాత్రం ఆ నియమాలు ఉండవు.

శ్రీ ఆర్.వి. సుబ్బారావు, బాపట్ల

**ప్ర. వైష్ణవులు హారతి, నైవేద్యం వంటి సమయాలలో గంట ఎందుకు కొట్టరు?**

జ. శ్రీవైష్ణవ ఆలయాలలో, అన్ని ఉపచారములు సమర్పించేటపుడూ గంట తప్పక కొడతారు. అది, ఆయా ఉపచారాలు స్వామికి జరుగుతున్నాయి, అనే విషయం బయటివారికి తెలియజేయడమన్నమాట. ప్రధానోపచారాలు, అంటే, నీటిని తీసుకొని వెళ్ళేటపుడు, నైవేద్యం సమర్పించేటపుడు, బలిహరణ చేసేటపుడు ఈశాన్యంలో ఉండే పెద్ద గంటను మ్రోగిస్తారు. అది శుభము, మంగళమూ అని.

"దేవతలు రావడానికి, రాక్షసులు పోవడానికి ఘంటారావం చేయాలి" అనేది ఆలయాలకు జరిగే సేవల విషయంలో వర్తించదు. ఆలయాల బయట జరిగే కార్యాలలోనే ఆ శ్లోకం చదువుతారు. ఇండ్లల్లో గంట అవసరంలేదని మ్రోగించరు.

భగవద్భాగవతాచార్య సన్నిధి సదా ఆరాధనలో ఉంటుంది కనుక అది సదా

మంగళమే. అపుడు దుష్టశక్తులు ఉండవు. భగవానుడు గృహార్చనలో సర్వసులభుడై ఉంటాడు కనుక గంట అవసరంలేదు.

**ప్ర. తిరుమంత్రం అర్థభావన కలిగేవరకు జపం చేయాలంటే ఏమిటి? ద్వయమంత్రాన్ని అర్థభావనతో సదా మననం చేయాలి అంటే ఏమిటి?**

జ. ఒక మంత్రానికి, అర్థమును అంటే ఆ మంత్రం ఎవరిని చెపుతోందో ఆ తత్త్వమును మనసులో దర్శించినంత స్పష్టంగా భావించగలగాలి. కుక్క అనేది ఒక శబ్దం, అక్షర సముదాయం. దానికి అర్థమేమిటి? ఆ శబ్దాన్ని ఉచ్చరించినపుడు ఒక జంతువును చూస్తామే శబ్దానికి అర్థము అంతే తప్ప శ్వా, డాగ్, కుత్తా, నాయి ఇలా ఇతర భాషలో చెప్పడం అర్థంకాదు. డాగ్ - కుక్క అంటే దానికి భాషాంతరీకరణం మరోభాషలో చెప్పడమంటాం తప్ప అర్థం తెల్సినట్లు కాదు. నాలుగుకాళ్ళు, తోక వంకర, భౌభౌమని అరచే జంతువు ఈ పై శబ్దాలకి అర్థం. ప్రతీశబ్దానికీ అలానే ఒక అర్థముంటుంది. మంత్రాలు గూడా శబ్దస్వరూపాలేకదా! మంత్రాన్ని పలికినపుడు గూడ ఆ మంత్రం చెప్పే అర్థమేదో అది మన మనస్సులో గోచరించాలి. దానికీ మనకీ ఉండే సంబంధం తెలియాలి. ఆ సంబంధజ్ఞానం కలగగానే ఆ అర్థము మీద ప్రేమ కలుగుతుంది. ప్రేమపెరిగే కొద్దీ ఏదో ఒక సేవ చేయాలనిపిస్తుంది. అలా ప్రేమ ప్రేరితుడై సేవగ భావన సాగుతూంటే బాహ్యజీవితంలో గూడ, తనకు లభించిన ఏవో కొన్నిటితో చేతనైనదేదో ఒకటి చేయకుండా ఉండలేడు. అది మరింత పెరుగుతూ ఉంటే, తన జీవితంలో సాగించే ప్రతిపనీ ఆ భావనలో గోచరించే మంత్రార్థముయొక్క సేవగానే తప్ప మరోలా చేయబుద్ధికాదు. అలాంటి జీవితమే ధన్యమైనదన్నమాట.తిరుమంత్రానికీ, ద్వయమంత్రానికీ గూడ లక్ష్మీవిశిష్టుడైన నారాయణుని కల్యాణగుణములను భావిస్తూ, ఆతనికీ మనకీ కల నవవిధ సంబంధములను స్మరిస్తూ మన ప్రతీచర్యనూ ఆతని సేవగ అర్పించుట. తిరుమంత్రాన్నైతే అనుష్ఠాన సమయంలోనే. ఆహారం తీసుకోవటానికి ముందుగా ఈపై భావన సాగడానికి అభ్యాసంగ జపిస్తాం. అదే ద్వయమంత్రాన్నైతే ఈ అర్థభావనతో సతతం స్మరించుకోవచ్చు. ఎంతెంత స్మరిస్తోంటే అంతంత భావనాస్పష్టత ఏర్పడాలి అందుకే మనవారు మంత్రానికి జపసంఖ్యానియమం చెప్పలేదు.

శ్రీ కె.వి. నరసింహమూర్తి, భీమవరం

**ప్ర.చిత్తాకాశం, చిదాకాశం, భూతాకాశం అంటే ఏమిటి? సూక్ష్మ లోకాలంటే ఏమి?**





జ. భూతాకాశం అంటే పంచభూతాలలో ఒకటైన ఆకాశతత్త్వము. ఇది మన ఇంద్రియములకు గోచరించనంత సూక్ష్మాంశములు కలిగి ఉండటం వల్ల కొందరు దానిని ఒక తత్త్వముగ అంగీకరించరు. కానీ వేదాంతులు పృథివీ, జలము, తేజస్సు, వాయువులతోపాటు, వాటికి కారణమైన 5వ భూతముగ ఆకాశాన్ని గుర్తించారు. దాన్నే భూతాకాశం అంటారు. 'చిత్' అంటే జ్ఞానం కల జీవుడు. ఆతని ఉనికి శరీరాలలో కర్మ ఉన్నంత వరకూ ఉంటుంది. శరీరాలు మారుతుంటాయి. అలా జీవుడు శరీరాలను మార్చేటప్పడు అతనితో పంచభూతాల సూక్ష్మాంశలూ ఉండే సూక్ష్మశరీరం ఒకటుంటుంది. వాటిల్లోనూ ఆకాశమే ప్రధానం. దానిని జీవునితో సదా ఉండేది కనుక 'చిదాకాశం' అంటారు. లేదా కర్మకృత శరీరాలలో జీవుడు సుషుమ్నా నాడి చివర ఉండే స్థానాన్ని 'దహరాకాశం' అంటారు. దానికే 'చిదాకాశం' అనికూడా పేరు. జీవుడు ఉండు స్థానమైన ఆకాశం అని అర్థము. ఇక చిత్తాకాశమనేదేమిటో అంతబాగా తెలియదు. అలాంటిదొకటి ఉన్నట్లువినలేదు.

శ్రీ వి. బాపిరాజు, విశాఖ

**ప్ర. జ్యేష్ఠాదేవి ఎవరు? శ్రీమహావిష్ణువునకు ఈమె మొదటి భార్యయా?**

జ. దారిద్ర్యానికి అధిష్ఠాన దేవతను జ్యేష్ఠాదేవి అంటారు. ఈమె లక్ష్మీదేవికి సోదరి అనికూడా అంటారు. అయితే వీటికి ప్రమాణము ఏమీలేదు. శ్రీమహావిష్ణువున కీమె భార్య అయినట్లు లేదు. అలా అయితే ఆమె స్వరూపమే మారిపోయి శుభాస్పద అయి ఉండేది.

శ్రీ కె. విష్ణువర్ధన్, భద్రాద్రి.

**ప్ర. "సర్వేషామేవ ధర్మాణాం ఉత్తమో వైష్ణవో విధిః" అనే శ్లోకం, దాని తాత్పర్యం, దేమునితో ఉండే 9 సంబంధాలు తెలుపుతారా?**

జ. "సర్వేషామేవ ధర్మాణాం ఉత్తమో వైష్ణవో విధిః ।
రక్షతే భగవాన్ విష్ణుః భక్తాన్ ఆత్మ శరీరవత్" ॥

"వేదము ప్రతిపాదించిన శ్రీవైష్ణవధర్మము, సంప్రదాయములన్నింటిలోనూ శ్రేష్ఠమైనది. అంటే శీఘ్రఫలాన్ని, శాశ్వతఫలాన్ని, నిశ్చితమైన ఫలాన్ని యిచ్చును. ఎందుకంటే, శరీరంలో ఆత్మ, ఆ శరీరాన్ని 24 గంటలూ చాల జాగ్రత్తగా కాపాడుకొంటున్నట్లే, శ్రీమహావిష్ణువు తనతో సంబంధము పెంచుకున్న శ్రీవైష్ణవ భక్తులను ఎల్లప్పుడూ తన శరీరమంత జాగ్రత్తగ, కంటికి రెప్పలా కాపాడుకుంటాడు". భగవంతునికీ భక్తునికీ నారాయణమంత్రం వల్ల తెలిసే సంబంధాలు 9. అవి:-

**1). పితాపుత్ర సంబంధం:-** ఆతడు ప్రళయంలో తనలో దాచుకొన్న చేతనవర్గాన్ని సృష్టిలో వెలికి తీయును. కనుక, ఆయన తండ్రి.

**2). రక్ష్యరక్షక సంబంధం:-** ఇష్టములను ఇవ్వడం, కష్టములను తొలగించడం అనే రెండూ చేయడాన్ని రక్షించుట అంటారు. వారివారి స్థాయినిబట్టి బద్ధ,ముక్త,. నిత్యులని శాస్త్రం చెప్పే జీవులందరికీ రక్షణ కల్పించేవాడు నారాయణుడే. మనమంతా రక్ష్యవర్గంలోని వారము.

**3). శేషి-శేష సంబంధము:-** ఒకదానితో చేరియుండి, దాని వైభవాన్ని పెంచే రెండవదానిని "శేష"మంటారు. మొదటిదానిని శేషి అంటారు. పరమాత్మతో చేరి, ఆతని ప్రయోజనానికై ఉండదగిన ఈ జీవులందరూ శేషభూతులు. వీరిని కల ఆతడు శేషి. ఇది జీవేశ్వరులకు సహజంగానే ఉంది.

**4). భార్యాభర్తృ సంబంధము:-** జీవులందరినీ పోషించుచు భరించువాడు నారాయణుడే. ఆతని భరణంలోనివారే జీవులందరూ. భార్యస్థానీయులన్నమాట.

**5). జ్ఞాతృ జ్ఞేయ సంబంధము:-** జ్ఞానమున్నందుకు జ్ఞాతులమైన మనకు తెలుసుకోదగిన సారము నారాయణుడే. ఆతడే జ్ఞేయము.

**6). స్వ స్వామి సంబంధము:-** స్వమ్మంటే "సొత్తు". స్వామి అంటే సొత్తు కలవాడని అర్థం. జీవులందరూ తనసొత్తుగ కలవాడు. తానే యజమాని. ఇది తెలియక తమను కొందరికి యజమానులుగ భావిస్తుంటారెందరో.

**7). ఆధారాధేయ సంబంధము:-** జీవులందరి ఉనికి ఆయనపై ఆధారపడి ఉంది. ఆయన ఆధారం. జీవులందరూ ఆధేయులు.

**8). శరీరాత్మ సంబంధము:-** ఆయన ఆధీనంలో, ఆయనకే విధేయమై, ఆయన నియమనానికి లోబడిఉండే జీవప్రకృతులు రెండూ ఆయనకి శరీరములే. ఆయన ఆత్మ లేక శరీరి.

**9). భోగ్య భోక్తృ సంబంధము:-** జీవులందరూ చేసే కర్మఫలాలను లోనుండి అనుభవించు భోక్త అతడే. ఇవన్నీ ఆతనికి భోగ్యవస్తువులే. జీవుడుగూడ భగవంతునికి ఆనందాన్నిచ్చే భోగ్యవస్తువు వలే వినియోగపడాలి. అలా వినియోగపడటంలో అచేతనం స్పందించదు. జీవుడు స్పందించును. ఆ స్పందన భగవంతుని ఆనందాన్ని పెంచుతుంది. అలా మనముండాలని తెలిపే బంధమిది. లోకంలో ఒక్కొక్క సంబంధం తెలిస్తేనే ఆయా వ్యక్తుల మధ్య పట్టరాని ప్రేమ పెరుగుతూంటుంది కదా! 9 రకాల సంబంధాలు శ్రియఃపతితో మనకున్నాయని తెలిస్తే ఇక మనకి కలిగే ప్రేమ ఎంత ఉంటుందో ఆ భగవంతునికి మనపై ప్రేమ ఎంత ఉంటుందో ఆ భగవంతునికి మనపై ప్రేమ ఎప్పుడూ ఉండనే





ఉంటుంది. ఎటొచ్చీదానిని గుర్తించవలసిన అవసరం మనదే. అందుకే అష్టాక్షరీ మహామంత్రం ఈ విషయాన్ని మనకి తెలిపింది.

శ్రీ సి. పాపిరెడ్డి, నిర్మల్.

**ప్ర. గోత్రం పూజలలో చెప్పుకోరు పెద్దలు. ఆలయాలన్నింటిలోనూ అర్చకులే మీ గోత్రం ఏమిటి? అని అడుగుతారెందుకు?**

జ. నిత్యారాధన చేసుకునేటపుడు భగవంతుణ్ణి మనకి తండ్రి, తల్లి, యజమానివలె, అంతకంటే ప్రియమైన ఆత్మగ భావిస్తాము. పై వాళ్ళ దగ్గర మన గోత్రాదులు ఎప్పుడూ చెప్పుకోము. వీళ్ళు మాత్రమే కాదు. సహజ సంబంధం కల వాళ్ళెవరివద్దా మనం గోత్రనామాలు చెప్పుకోనవసరంలేదు. ఆ సంబంధంలేని వారితో మన పరిచయం చేసుకోవాల్సి వస్తుంది తప్ప బంధువులతో కాదు. గోత్రనామాదులు చెప్పుకోవడం, పూజ ఫలానా ప్రయోజనం కోసం... అంటూ చేయడం. ఇవన్నీ భగవంతునితో వ్యాపారలావాదేవీలు చేస్తున్నట్లే కద! మన మన వంశపరిచయము చేసుకోవడం వల్ల, భగవంతునితో ఆయా ఋషులకుండే వాత్సల్యాన్ని జ్ఞాపకం చేసి, నేనూ ఆ వంశంవాడినే సుమా! అనుగ్రహించుమా! అంటూ మనవైపు త్వరగా కృపను అందించడానికి, ఆయనను త్రిప్పడానికి పనికివస్తుంది కనుక చెప్పుకోవడం తప్పులేదంటారు కొందరు. నిజమే! కానీ, ఆయన అసలు మనని మరచితే, లేదా, జ్ఞాపకం లేకపోతేనో కద మనం జ్ఞాపకం చేయవలసివచ్చేది! అలాంటి దోషం ఆయనకు లేనే లేదని శ్రుతి చెప్పింది (యస్సర్వజ్ఞః సర్వవిత్) అంటూ. భగవంతుని, ఆయన సంబంధాన్ని మరచిన వాళ్ళు తమ గోత్రనామాలు చెప్పుకుంటారనుకోండి! కానీ, మనము చెప్పుకోనవసరం లేదు.

ఇక అర్చకులంటారా! మరి పూజలు చేస్తే వారికి ఎంతోకొంత ఉండాలిగ! అది ఊరికే, సామూహికంగానే పూజలు చేసేస్తానంటే భక్తునికి తృప్తి ఉండదు. ఆ తృప్తి లేకపోతే భక్తుడు ధనమివ్వడు. గట్టిగ శఠారిపెట్టి, వారిచేత గోత్రాదులు చెప్పిస్తారు. గోత్రం లేకపోయినా, ఫలానా దానికోసం అని చెప్పుకోకుండా చేయించేదసలు పూజే కాదని భక్తులనుకుంటారు. కనుక, పూజారీ వారి తృప్తికోసం అలానే చేయిస్తాడు. భక్తులు, మీరే ఇది తెలుసుకొని అర్చకులను "ఇలా చేయండి" అని ప్రార్థిస్తే తప్పక చేస్తారు.



# బదరికాశ్రమంలో పునర్నిర్మించే సత్సంగసదనమునకు విరాళాలు సమర్పించిన దాతలు

**మహారాజపోషకులు:**

శ్రీమాన్ సురభి తిరుపతిరావు, ప్రమీల–నిజామాబాద్, శ్రీమాన్ గడ్డం లక్ష్మారెడ్డి, భూలక్ష్మి– నిజామాబాద్, శ్రీమాన్ రుద్రరాజు సీతారామరాజు, జానకమ్మ–కోడూరు, శ్రీమాన్ ఎమ్.లోకేశ్వరరావు, కమలాదేవి –హైదరాబాద్, శ్రీమతి ఎల్. అరుణ కుమారి, శ్రీమాన్ ఎ.ఎల్. సుదర్శన్ & బ్రదర్స్–హైదరాబాద్

**రాజ పోషకులు:**

శ్రీమాన్ డా॥ బి.మురళీకృష్ణ–హైదరాబాద్,

**పోషకులు:**

శ్రీమాన్ డి.చిరంజీవి రాజు–విశాఖపట్నం, శ్రీమాన్ కె.ఎస్.ఆర్. కృష్ణారావు–న్యూ ఢిల్లీ, శ్రీమతి ఎస్. సుశీల–నర్సరావుపేట,

**పి. విమలమ్మ (విజయవాడ) గారి ద్వారా:**

**పోషకులు:**

శ్రీమతి వై.మీనాక్షమ్మ–మోమిడి,

**జీవిత సభ్యులు:**

శ్రీమాన్ దొడ్డపనేని కృష్ణారావు–విజయవాడ, శ్రీమాన్ కొల్లిపర శేషగిరిరావు–కపిలేశ్వరపురం, శ్రీమాన్ గోపాలం వెంకటేశ్వరరావు–విజయవాడ, శ్రీమతి పొట్లూరి ఉమ–విజయవాడ, శ్రీమతి ఎన్.ఆర్. స్వరూప–బెంగుళూరు, శ్రీమతి నంబూరు సత్యవతి–ఏడిద సీతానగరం,

**అభిమానులు:**

శ్రీమాన్ పొట్లూరి వేణుగోపాల్– విజయవాడ, శ్రీమాన్ పి.రామచంద్రరావు–విజయవాడ, శ్రీమాన్ వి.శ్రీరామ మూర్తి–విజయవాడ, శ్రీమాన్ బి.కృష్ణారావు–విజయవాడ, శ్రీమాన్ జి.సుధాకరరావు–విజయవాడ, శ్రీమతి సి.హెచ్. శోభ–విజయవాడ, శ్రీమతి వి.గీతాలక్ష్మి –కేకులపాడు, శ్రీమాన్ బి.వి.కె రామేశ్వరరావు–విజయవాడ, శ్రీమాన్ బి.నరసింహులు–తారాబాయి, శ్రీమాన్ కె.బాలసుబ్రహ్మణ్యం–విజయవాడ, శ్రీమాన్ గోగినేని మల్లిఖార్జునరావు–కుంటముక్కల, శ్రీమాన్ కిలారు మనుతేజ –విజయవాడ, శ్రీమాన్ వై.వెంకటేశ్వర్లు,జ్యోతి–బెంగుళూరు, శ్రీమాన్ బి.ఎమ్.ఎమ్.చిదంబరరావు –విజయవాడ, శ్రీమాన్ వి.వి.కృష్ణారావు,శేషారత్నం శ్రీమతి ఉయ్యూరు అంకమ్మగారు–విజయవాడ, శ్రీమాన్ యెనిగళ్ళ వెంకటేశ్వరరావు–విజయవాడ, శ్రీమతి చలసాని కమలాంబ–విజయవాడ, శ్రీమాన్ కిలారు విజయకుమార్–విజయవాడ, శ్రీమాన్ కిలారు సాంబశివరావు,మణి–విజయవాడ, శ్రీమాన్ వి.జగన్నాధరావు–విజయవాడ, శ్రీమాన్ బి. మాణిక్యాలరావు–గంగన్నగూడెం, శ్రీమాన్ కమ్మా నాగేశ్వరరావు–ఏలూరు, శ్రీమతి పాలడుగు రాజ్యలక్ష్మి–విజయవాడ, శ్రీమాన్ సూర్యదేవర మధుసూధనరావు–విజయవాడ, శ్రీమాన్ వై. రామ్మోహనరావు–విజయవాడ, శ్రీమాన్ కొవ్వూరు అమ్మేశ్వరరావు–ఏలూరు, శ్రీమాన్ గుట్ట వెంకయ్య చౌదరి–ఏలూరు, శ్రీమాన్ నడిగం చిట్టిబాబు–ఏలూరు, శ్రీమాన్ ఎర్నేని కోనయ్య– ఏలూరు, శ్రీమాన్ నూతక్కి అరవింద్ కుమార్– ఏలూరు, శ్రీమతి ఎంకినేని రాధాకృష్ణమ్మ–ఏలూరు, శ్రీమాన్ కొమ్మారెడ్డి వెంకటరత్నం–ఏలూరు, శ్రీమాన్ కొట్లపల్లి శ్రీరంగవధ, శ్రీమాన్ జాస్తి రామారావు, శ్రీమాన్ పర్వతనేని వెంకటేశ్వరరావు, శ్రీమాన్ పర్వతనేని సత్యనారాయణ, శ్రీమాన్ బాల గంగాధరరావు, శ్రీమాన్ పి. రాంబాబు, శ్రీమాన్ పి. సుబ్రహ్మణ్యేశ్వర రావు, శ్రీమాన్ దాసరి ఏసుబాబు– గుడివాడ, శ్రీమాన్ మల్లెల నాగమాణిక్య ప్రసాద్–విజయవాడ, శ్రీమతి దూబగుంట కనకమ్మ –బెంగుళూరు, శ్రీమాన్ జలధి సుబ్బారావు– నిడమానూరు, శ్రీమాన్





ముసునూరు విష్ణువర్ధనరావు –విజయవాడ, శ్రీమతి వెంకట తాయారమ్మ– విజయవాడ, శ్రీమతి మరింగంటి రాధాకుమారి– హనుమకొండ, శ్రీమాన్ ముడుంబై వేణుగోపాలా చార్యులు –జగ్గయ్యపేట, శ్రీమాన్ ఎ.వి. రామారావు –హైదరాబాద్, శ్రీమతి ఎన్.శోభ– హైదరాబాద్, శ్రీమతి పి.సంధ్య –సికింద్రాబాద్, శ్రీమాన్ లక్ష్మీ నరసింహం, శ్రీమాన్ సి.గీతానరేష్ –సికింద్రాబాద్, శ్రీమాన్ కె. వెంకటేశ్వరరావు– నర్సరావుపేట, శ్రీమాన్ బి.రామచంద్ర మధుసూధన్ –నర్సరావుపేట, శ్రీమాన్ డా॥ నాదెళ్ళ శ్యామలాశాస్త్రి –సికింద్రాబాద్, శ్రీమాన్

**పి. రమణమ్మ (విజయనగరం) గారి ద్వారా: –**

**మహారాజపోషకులు:**

ఖమ్మం జిల్లా, 'మదిర' వాస్తవ్యులైన శ్రీమాన్ కొల్లారామయ్య, రామకోటమ్మ వారిపేర వారి మూడవ కుమారుడు శ్రీమాన్ కొల్లా కుమారస్వామి, పుల్లమ్మ దంపతులు మరియు వారి కుటుంబ సభ్యులు.

కుమార్తెలు–అల్లుళ్ళు:

శ్రీమతి & శ్రీ మెలవరపు రామరూప– గాంధీ
శ్రీమతి & శ్రీ నేరళ్ళ అరుణ కుమారి–ఆంజనేయులు
శ్రీమతి & శ్రీ చేరుగుళ్ళ భాగ్యలక్ష్మి – నాగేశ్వరరావు
శ్రీమతి & శ్రీ సముద్రాల పద్మావతి – సత్యనారాయణ
శ్రీమతి & శ్రీ కొల్లిపర కమల – మోహనరావు
శ్రీమతి & శ్రీ కట్టమూర్తి సత్యభామ – రఘునాథరావు
శ్రీమతి & శ్రీ కొంకిమళ్ళ చంద్రకళ – జనార్ధనరావు
మరియు మనుమలు మనుమరాళ్ళు.

**పోషకులు:**

శ్రీమాన్ బి. అప్పలరాజు, సుభద్రమ్మ–పోరలి,

**జీవిత సభ్యులు:**

శ్రీమాన్ బోడపాటి వెంకట నర్సింహంగారు–విశాఖపట్నం, శ్రీమతి వై. రాధాలక్ష్మి–విజయ నగరం

**అభిమానులు:**

శ్రీమాన్ ఎమ్. రామకృష్ణగారు–చెన్నై, శ్రీమతి సూరంపల్లి విజయలక్ష్మి–విజయనగరం, శ్రీమాన్ పి. అప్పల సూర్యనారాయణ–విజయనగరం, శ్రీమతి డా॥ పావని–విశాఖపట్నం, శ్రీమతి జి. పార్వతమ్మ–రాంబిల్లి, శ్రీమాన్ ఆర్.సంజీవరావు–విజయనగరం, శ్రీమాన్ నేరెళ్ళ రామకృష్ణారావు–విజయనగరం, శ్రీమాన్ జె. రామారావు–విజయ నగరం, శ్రీమాన్ వై.బాబూజీ–విజయనగరం, శ్రీమతి ఎస్. వరాలమ్మ–విజయనగరం, శ్రీమాన్ పుల్లి మురళీకృష్ణ–విజయనగరం, శ్రీమాన్ వి. సత్యనారాయణ–హైదరాబాద్, శ్రీమాన్ గున్నరాజు–విశాఖపట్నం, శ్రీమాన్ పాలవలస జగపతినాయుడు –పుర్లి, శ్రీమతి మందపాటి రమణమ్మ–చిన్నబుచ్చి రాజుపాలెం, శ్రీమతి గుజ్జల గౌరి–విజయనగరం,

**ఆఫీసు ద్వారా:-**

**జీవిత సభ్యులు:**

శ్రీమతి నంబూరు సత్యవతి–ఏడిద సీతానగరం, శ్రీమాన్ వెంకట సీతారామస్వామి–కాకినాడ, శ్రీమాన్ ఇందుకూరి సుబ్రహ్మణ్యంగారు–అర్ధవరం, శ్రీమాన్ అట్లూరి జగన్నాథ ప్రసాదరావు–ఉయ్యూరు, శ్రీమాన్ దాట్ల పట్టాభిరామరాజు–గుడివాడ, శ్రీమతి దాట్ల అప్పలనరసాయమ్మ–గుడివాడ, శ్రీమతి దామర్ల శ్రీ కుమారి–ఉంగుటూరు, శ్రీమతి జి. సుభద్రమ్మ–హైదరాబాద్, శ్రీమాన్ మన్నే వరహాల బుచ్చయ్య,లక్ష్మి–కాకినాడ, శ్రీమతి ఎన్. శోభ–మోస్ పేట, శ్రీమాన్ ఎమ్. కృష్ణారావు–హైదరాబాద్.

**అభిమానులు:**

శ్రీమాన్ బలుసు సూర్యనారాయణ–ఏడిద, శ్రీమతి ఆర్.నిర్మల–మొదువాలి, శ్రీమతి పాకలపాటి చంద్రమతి–కోనిస, శ్రీమతి బుచ్చి వెంకాయమ్మ–కోనిస, శ్రీమతి ఇ.స్వరాజ్యం–ఎండగండి, శ్రీమతి పురిచర్ల రమాదేవి–విశాఖపట్నం, శ్రీమాన్ పి. కృష్ణారావు–మెదక్, శ్రీమాన్ పాండురంగ శర్మ–హైదరాబాద్, శ్రీమతి ఐ. సూర్యనారాయణమ్మ–వేంపాడు, శ్రీమతి వెంకట సూర్యావతి–రామచంద్రాపురం, శ్రీమాన్ జె.ఎ.వి.ఆర్.కె.సుబ్బారావు–హైదరాబాద్, శ్రీమతి ఎ. లక్ష్మి బృంధావనమ్మ–విజయవాడ, శ్రీమాన్ ఎ.ఎమ్. కృష్ణమోహన్–ఒంగోలు, శ్రీమాన్ అడుసిమిల్లి రాంప్రసాద్–దేవగిరి, శ్రీమాన్ కె. రవికుమార్–విజయవాడ.



# శ్రీవిష్ణు మహాపురాణం

## సప్తమాధ్యాయం

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, రాజమండ్రి

### నిత్య నైమిత్తిక ప్రాకృతిక ఆత్యంతిక ప్రళయాలు:-

నిత్యం ఈ జగత్తులో ఉండే ప్రాణికోటికి జరిగే ప్రలయం 'నిత్య ప్రలయం'.

**"నిత్యః సదైవ జాతానాం యోవినాశో దివానిశమ్!"**

రాత్రింబవళ్ళు నిరంతరం జరిగే ఈ ప్రలయం మనకు నిత్యం అగుపిస్తూనే ఉంటుంది.

చతుర్ముఖ బ్రహ్మరూపుడైన జనార్దనుడు శయనించినప్పుడు జరిగే జగత్ప్రలయం నైమిత్తికం. ' శయనించడం' అనే నిమిత్తాన్ని బట్టి ఏర్పడిందన్నమాట.

ఇక ఈ సమస్త బ్రహ్మాండం తనకు కారణమైన **'ప్రకృతి'**లో లయించినప్పుడు దాన్ని ప్రాకృతిక లయం అని అంటారు.

ఇక, నాల్గవది ఆత్యన్తిక ప్రలయం. తత్త్వజ్ఞానాన్ని పొందిన యోగులు సంసారం తొలగిపోయి పరమాత్మతో లయించడం ఆత్యన్తిక ప్రలయం. ఇదే మోక్షమన్నమాట. ఇది జగత్తుకంతటికీ ఏకకాలంలో సంభ్రమించేది కాదు. ఎవ్వరికి తత్త్వజ్ఞానం కలగడంవల్ల సంసార బంధము తొలగిందో వారికే ఈ లయం.

### ప్రాకృతిక సృష్టి:-

మధ్య మధ్యగా జరిగే ప్రలయాల తరువాత ప్రకృతి నుండిపరమాత్మ చేసే ఏ సృష్టి ఉన్నదో దాన్ని ప్రాకృతిక సృష్టి అంటారు. ఇది దైనందిన సృష్టి. నిరంతరం సాగుతూ ఉంటుంది. వివిధ ప్రాణులు నిత్యం పుడుతూనే ఉంటాయి కదా. దీన్నే నిత్య సృష్టి అంటారు. పైన పేర్కొన్న ప్రలయాలలో నైమిత్తిక – ప్రాకృతిక – ఆత్యన్తిక ప్రలయాల గురించి విష్ణు పురాణంలోని చిట్టచివరి అంశం విశేషంగా పేర్కొన్నది. నిత్య ప్రలయం విషయములో వ్యాఖ్యాతల అభిప్రాయాలు వేరుగా ఉన్నాయి. ప్రాణులకు నిత్యం ఏర్పడే 'నిద్రా'దశ కూడా నిత్య ప్రలయంలో చేరుతొందని కొందరు వ్యాఖ్యానించినారు. పాశ్చాత్య విద్వాంసులు కూడా కొందరు ఇలాగే వ్యాఖ్యానించారు.

Vans Kennedy అనే విద్వాంసుడు, "Ancient and Hindu Mythology Pzzh" అనే గ్రంథంలో విష్ణుపురాణం 'నిద్రా' దశను నిత్య ప్రలయంగా పేర్కొన్నదని పేర్కొన్నాడు–

" Nitya is the extinction of life, like the extinction of a lamp, in sleep at night". అయితే విష్ణుపురాణ వచనాన్ని బట్టి ఇలాంటి అర్థం రావటంలేదు.

**"నిత్యః సదైవ జాతానాం యో వినాశో దివానిశమ్"** అని మాత్రమే ఉంది. పుట్టే ప్రాణులకు రాత్రింబవళ్ళు ఎల్లప్పుడూ జరిగే వినాశమే నిత్య ప్రలయమని దీని అభిప్రాయం. ఇక **'నిత్య సృష్టి'** విషయంలో వ్యాఖ్యాతలు ఇలా అన్నారు.

**"అస్మదాది సృష్టి ప్రవాహో నిత్య సర్గ ఇత్యర్థః"** మన మూలంగా ప్రాణుల మూలంగా నిరంతరం సాగే ప్రాణ్యుత్పత్తియే నిత్య సృష్టి అని దీని అభిప్రాయం.

**వైష్ణవ శక్తులే సృష్టి స్థితిలయాలకు మూలం**

**"సృష్టి స్థితి వినాశానాం**
**శక్తయః సర్వదేహిషు ।**
**వైష్ణవ్యః పరివర్తంతే**
**మైత్రేయ! అహర్నిశం సదా ॥**

నిరంతరం ఈ సృష్టి–స్థితి లయాలు సాగడానికి సర్వ ప్రాణుల దేహాల్లో ఉన్న వైష్ణవ శక్తులే రాత్రింబవళ్ళు కారణం అవుతున్నా యంటుంది విష్ణుపురాణం.




## శ్రీ ఉడైవర్ తిరుమఞ్జన కట్టియమ్

(ద్రావిడ మూలం. తెలుగు అనువాదం)

అనువాద కర్త :- **శ్రీమాన్ ఈ.ఏ. సింగాచార్యులు**
సమర్పణము:- **డా. ఎస్.వి. రంగ రామానుజా చార్యులు**
శ్రీ రామానుజ సేవా సమితి- కొవ్వూరు.

ఎంబెరు మానార్ల తిరుమంజన సమయంలో అనుసంధించేందుకు ఎంబార్ జీయరువారు తమిళంలో ప్రసాదించిన **'తిరుమంజన కట్టియమ్'** ప్రబంధాన్ని **శ్రీమాన్ సింగరాచార్యస్వామి** తెలుగు అనువాదంతో కొవ్వూరువారు చాలమంది తెలుగువారి ఉపయోగం కోసం చక్కగా ముద్రించి ప్రకటించినారు. ఆలయాలలోనూ ఇళ్ళలోనూ ఇది ఎంతో ఉపయోగపడేది. అమూల్యమయిన ఈ గ్రంథాన్ని క్రింది చోటులనుంచి పొందవచ్చును.

**ప్రాప్తిస్థానములు:-**

1. **డా. ఎస్.వి. రంగ రామానుజాచార్యులు,**
అన్ను టవర్స్,
**S.S.I.** కంప్యూటర్ ఎడ్యుకేషన్ ప్రక్కన,
గాంధీపురం రోడ్డు,
దానవాయిపేట, రాజమండ్రి.
ఫోన్:- (0833) 2425889

2. **ఈ. ఏ. సింగరాచార్యులు**
డోర్ నెం. 18-3-58 (7),
శాంతినగర్,
కె.టి. రోడ్డు, తిరుపతి,
ఫోన్:- (0877) 223291







......................గత సంచిక తరువాయి భాగం

**నచికేతుడు**

ఇంకా ఆలస్యం ఎందుకు? పదండి ఎక్కడ ఆ బాలుడు?

యముడు తన పరివారంతో నచికేతుని వద్దకు

బ్రాహ్మన్! నీ దీక్షకు నమస్తే అతిధిగా మా భవనమునకు విచ్చేశావు! సంతోషం

మూడు రాత్రులు మాఇంట ఉన్నావు! కార్యాంతర వ్యగ్రుడనై నిన్ను స్వాగతించలేకపోతిని!

ఇవిగో ఈ ఉపచారములు స్వీకించు నాయనా!

ఇదిగో అర్ఘ్యం








# మేల్కోట తిరునారాయణ పెరుమాళ్ ఆరాధన సమితి సమావేశం

తేది. **21-09-03న "వారిజ"**, బీచ్‌లో శ్రీ స్వామివారి అధ్యక్షతన మేల్కోట కమిటీ సమావేశమైంది. ప్రార్ధనతో సమావేశాన్ని ప్రారంభిస్తూ శ్రీ స్వామివారు ముందుగా కమిటీ సభ్యులకు మంగళాశాసనాలు చేసారు.

**పెరుమాళ్ళకు ఆరాధన**:– మేల్కోటలో నీటి కరువు మూలంగా పెరుమాళ్ళకు ఆరగింపు సక్రమంగా జరగలేకపోతున్నందుకు శ్రీ స్వామివారు ఆవేదనను వ్యక్తం చేసారు. దేవునికి జరగాల్సిన నివేదనలలో లోపం రాకూడదు కనుక కమిటీ సభ్యులు ఈ విషయంలో అర్చక కుటుంబాలు చొఅవ తీసుకొనే విధంగా ప్రయత్నం చేయాలని శ్రీ స్వామివారు సూచించారు.

**జ్ఞాన మండపం**:– మేల్కోటకు వచ్చిన భక్తులకు వసతి, తదీయారాధనాది ఏర్పాట్లు చేసే నిమిత్తంగా దా వణగిరి వికాసతరంగిణి 2002లో ఆలయం వెనుక వీధిలో ఒక చక్కని స్థలాన్ని సేకరించింది. శ్రీ స్వామివారిచే శంఖుస్థాపన చేయబడి, ఇప్పుడు సర్వాంగ సుందరంగా భవనం నిర్మాణమైంది. శ్రీ స్వామివారు ఆ భవనానికి **"జ్ఞాన మండపం"** అని నామకరణం చేసారు.

**తదీయారాధన ఏర్పాట్లు**:– **"జ్ఞాన మండపం"**లో ప్రతిరోజూ కనీసం 50 మందికి తదీయారాధనకు ఏర్పాట్లను కమిటీ సభ్యులు చేసారు. ఈ తదీయారాధన కార్యక్రమం **"బదరీ"**లో వలే మహావైభవంగా జరిగేందుకు వీలుగా తగిన ఏర్పాట్లు చేయవలసినదిగా కమిటీ సభ్యులకు శ్రీ స్వామివారు సూచించారు.

తదీయారాధన కైంకర్యంలో పాల్గొనదలచిన వదాన్యులైన భక్తులకు సమాచారం తెలిసేందుకు వీలుగా చక్కని కరపత్రాన్ని ముద్రించి అందజేయాలని, అదేవిధంగా మేల్కోట విశేషాలను తెలియజేసే బ్రోచర్‌ను, మేల్కోట పెరుమాళ్ళ ప్రసాదాన్ని కూడా కైంకర్యపరులైన దాతలకు అందజేయాలని శ్రీ స్వామివారు సూచించారు.

శ్రీ స్వామివారి మంగళాశాసనాలతో వారాదేశించిన విధంగా పని చేస్తామని కమిటీ సభ్యులు శ్రీ స్వామివారి ఎదుట తమ వినయపూర్వక శ్రద్ధను ప్రకటించారు.

# ఇది తెలుసుకుందాం!

**'అప ఏవససర్జాదౌ తాసువీర్య మపాసృజత్'** 'ఈసృష్టికి ముందుగ జలమును సృజించెను. భగవంతుడాజలములందు జీవజాతి నంతనూ తమ తమ కర్మలకనుగుణముగ శరీరములు ధరించునట్లు విడచెను' అంటుంది ఋషి వాక్కు. ఋషి మనకు వివరించిన ఆ జలము బహుశ ఆవరణజలమై యుండవచ్చు.

ఆవరణ జలమంటే? అండమునకు చుట్టూ పదిరెట్లు అధికంగ ఆవరించి ఉండే జల ప్రపొర. అందులో అండముంటుంది. అండమంటే? మనము నివసించే భూగోళంతోపాటు భువః,సువః, మహః, జనః, తపః, సత్య,.... అనే ఏడు పుర్వలోకాలు ఒకవైపుంటాయిట. ఇవి ఒకదాని కంటే ఒకటి కొన్ని రెట్లు పెద్దవి.

అలానే మరోవైపు అతల, వితల, సుతల, రసాతల, మహాతల, తలాతల, పాతాళ అనే ఏడు పాపపు లోకాలు ఒకదానికంటే మరొకటి పెద్దవిగ అమరిఉంటాయట. ఈ 14లోకాలకీ మధ్య కొన్ని వేల తేజో గోళాల రాశులున్నాయట. బహుశ అవే పాలపుంతలని అంటారు కాబోలు! పైన చెప్పిన 14లోకాలూ కొన్ని ప్రసిద్ధమైన లోకాలన్నమాట. ఇవన్నీ కోడిగ్రుడ్డు లోపలి పదార్థం ఒక క్రమంలో అమరి ఉన్నట్లే ఈ లోకాలన్ని కాంతి గోళాలతోపాటు ఈ అండంలో అక్కడ దక్కడ అమరి ఉంటాయి. వీటిన్నింటికీ మధ్యభాగంలో ఉండేది మహామేరువు అంటారు.

వీటన్నింటిని సురక్షితంగ ఒక దానితో ఒకటి కలువకుండా, బయటినుండి ఏశక్తీ వీటిని ఏమీచేయవీలు లేకుండా రక్షించే ఒక పొరచుట్టూ ఆవరించి ఉంటుంది. దానినే అండకటాహమంటారు. కోడిగ్రుడ్డుపై కవచం వంటిదే ఈ అండకటాహం. ఈ అండము లోపల పైనుండి క్రిందిదాక 100కోట్ల యోజనాల దూరముంటుందట అండ కటాహపు దళసరియే ఒకకోటి యోజనా లుంటుందట. అంటే అండకటాహపు పైనుండి అండకటాహపు క్రింది వరకూ బయటి ఎత్తు, బయటి అంచులతో కొలిస్తే, 102 కోట్లయోజనా లుంటుందని పురాణాలు చెప్తున్నాయి. ఈ అండానికి లోపల ఉండే గోళాల మధ్య ఎంతెంతో శూన్య ప్రదేశమున్నట్లు కన్పిస్తున్నా, ఈ గ్రహాలన్నింటి మధ్యా ఒక సంబంధము, ఒక సుసూక్ష్మము కానీ, సుదృఢమూ అయిన పదార్థజాతం నిండి ఉంటుంది. అది ఎంతో వత్తిడి శక్తికల పదార్థము కనుకనే ఈ గోళాలు ఒక దానితో ఒకటి కలిసిపోకుండా దీని కక్ష్యకు అవే



పరిమితమై ఉండిపోతాయి. అందులో మన భూగోళం ఓ చిన్ని ఇసుక రేణువంత మాత్రమే. అలాంటి కోకొల్లల గ్రహరాశుల్లో సూర్యుని కుటుంబానికి చెందిన వాటిల్లో ఒక గ్రహం మన భూగోళం.

ఇలాంటి సూర్యుళ్ళెందరో! మరి ప్రతీ సూర్యుని చుట్టూ ఓ కుటుంబముండి ఉంటుంది.

మన భూగోళం వంటివి ఇంకాఎన్నెన్ని ఉన్నాయెూ తెలియదు. వాటి వాటిల్లో మనవంటి జీవరాశులు ఎన్నిరకాలున్నాయో! ఇన్నిటితో కూడుకున్ని ఈ అండానికి నిర్వాహకుడిగ ఓ 'చతుర్ముఖ బ్రహ్మ' ఉంటాడు. ఆతని నేతృత్వంలో 12 మంది సూర్యుళ్ళు, 11మంది రుద్రులు, 8మంది వసువులూ, ఇరువురు అశ్వనీదేవతలూ, వీరికి నిర్వాహకుడిగ ఓ ఇంద్రుడూ, సప్తఋషులూ... ఇలా ఉంటారు.

ఇలాంటి అండముచుట్టూ దీని కంటే పదిరెట్లు అధికంగ ఉండేజలాన్ని 'ఆవరణ జలం' అంటారు దానిపై పదిరెట్లు అధికంగ ఆవరణ తేజోవలయం, ఆపై పదిరెట్లు అధికంగ ఆవరణ వాయువలయం, దానిపై మరో పదిరెట్లు అధికంగ ఆవరణ ఆవేశవలయం, దానిపై అహంతత్వమూ, ఆపై మహత్తత్వమూ ఇలా ఉంటాయని **"దశోత్తరాణి ఆవరణాని యాని చ"** అంటూ శ్రీ యమునా చార్యస్వామిస్తోత్ర రత్నంలో వివరించారు.

ఇదంతా కలిపి ఓ అండమైతే, దీనికి పలువేల, లక్షల అండములు కలిస్తే ఓ బ్రహ్మాండమవుతుంది. అలాంటి బ్రహ్మాండము లేన్నో లెక్కలేనన్నింటిని ఒకేక్షణకాలంలో పరమాత్మ సృజించాడని **'అండానాం సహస్రమకరోత్'** ఋషులు చెపుతున్నారు. ఇవన్ని దాటితే ఆపై విరజానది ఉంటుందట. దాని విస్తీర్ణమేంతో తెలియదు. దాని ఆవల ఉండేది పరమపద మంటారుట. విరజానది ఒక సీమాభూమి. దానికీవల ఉండేవీలోకాలన్నీ. వాటికి క్రింది హద్దెక్కడో తెలియదు. విరజానది కావల ఉండే పరమపదానికి పై హద్దెంతో తెలియదు. క్రింద ఉండే ఈ లోకాలన్నింటిని భగవంతుని క్రీడా భూములంటారు. దీనినే ''లీలావిభూతి'' అంటారు. ఆ పైలోకాన్నంతటిని 'నిత్యవిభూతి' అంటారు, పరమపదం అని అంటారు.

ఈ లీలావిభూతిలోని లోకాలన్నీ నీటిలోంచే వచ్చి ఆనీరావరించి ఉంటేనే నిలిచేవి కనుక వీటన్నింటినీ **'వారిజ'**ములంటారు. మన శ్రీస్వామివారారంభించిన విశాఖ భీమిలీ బీచ్ రోడ్డులోని క్రొత్త ఆశ్రమాన్ని గూడ 'వారిజ' అనే పిలుస్తున్నారు. అది గూడ అపారపారావారమునకు ఒడ్డున ఉంది. సాగరతీరంలో ఉండటం వల్ల 'వారిజ' అని పిలిచినా దాని పూర్తిపేరు

**'వేద అధ్యయన & రీసెర్చ్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ జీయర్ ఆశ్రమమ్.**

# ప్రచారవార్తలు

**'వారిజ'** ఆశ్రమంలో శ్రీచిన్న జీయరుస్వామివారు చాతుర్మాస్యంలో ఉన్నారు. వేదాధ్యయనం, శ్రీపాంచరాత్రా గమము, దివ్యప్రబంధము నేర్చే విద్యార్థి బృందమూ, వారికి విద్య నేర్పే ఆచార్య బృందమూ అందరూ సుమారు 200మంది ఇక్కడనే శ్రీవారిసన్నిధిలో ఉండి తమ దైనందిన అనుష్ఠాన అధ్యయనాదులు శ్రద్ధగా చేస్తున్నారు. విద్యార్థులు మూడుపూటలా సంధ్యావందనం, రెండుపూటలా అగ్నికార్యమూ ఈప్రాంతాన్ని వేదధూమాలతో పునీతం కావిస్తోంది. విద్యార్థులు దినమంతా చేసే వేదఘోష సముద్ర ఘోషతో పోటీపడుతున్నట్లుంది. ఇక్కడి వాతావరణ మంతా వేదనాదతరంగితమై సాగరపవనాల ద్వారా ఆ వేదనాద దివ్యశక్తి విశ్వవ్యాప్తమౌతోంది.

ఇక్కడి కార్యకర్తలలో ఒకరైన శ్రీమాన్ B.V. నాయుడుగారు విద్యార్థులకు అందరకూ వారానికొకసారి అభ్యంగన స్నానాలు స్వయంగా చేయిస్తూ, అవసరమైన ఆరోగ్య రక్షణచర్యలు చేపట్టడంతోపాటు, విద్యార్థులకు మానసి కోల్లాసం అవసరమని కొన్ని దృశ్యమాలికలను ప్రదర్శింపచేస్తున్నారు. తీరిక సమయాలలో విద్యార్థులను శ్రీకూర్మంవంటి సమీప దివ్యక్షేత్రాలకు, షిప్‌యార్డ్, జూపార్క్‌వంటి విజ్ఞానదాయకస్థలాలకు తీసుకువెళ్ళి చూపిస్తున్నారు. శ్రీమాన్ కాశీరాజుగారు, శ్రీమాన్ రామానుజంగారు మొదలైన కార్యకర్తలు ఆర్థికవ్యవహారాలు, వసతి సౌకర్యాలు, ప్రముఖుల రాకపోకల వ్యవహారాలు, విశేషోత్సవ నిర్వహణాదులు చూస్తున్నారు. శ్రీమాన్ ఉమాసుదర్శన్‌రాజు, లక్ష్మీగారలు అవసరమైన పాత్రలు సమకూరుస్తున్నారు. మహారాజా బ్యాంక్ ఛైర్మన్ శ్రీమాన్ MRK రాజుగారు ప్రభృతులు ఇతర వైద్యప్రముఖులతో విద్యార్థుల ఆరోగ్యవ్యవహారాలు, పాత్రికేయ వ్యవహారాలలో సహకరిస్తున్నారు. విజయనగర జెట్‌గోష్ఠికి చెందిన శ్రీమతి రమణమ్మ, బేబీ, విజయగార్లు, ఈ దీక్షాకాలంలో జరిగే తదీయారాధన కంతటికీ బాధ్యతవహించి, తమ అధ్యక్షులు శ్రీమాన్ MSN రాజుగారి నేతృత్వంలో ఆహారాది వసరులన్నీ సమకూరుస్తున్నారు.

ప్రతి మంగళవారమూ మారుమూలలో వాహన సౌకర్యాలుగూడ లేని ప్రాంతాలకు చెందిన గ్రామీణులను కలసి, వారికుండే ఆధ్యాత్మిక సమస్యలను తెలుసుకుంటూ, అలాంటి 3,4 గ్రామాల ప్రముఖులను, భక్తులను 'వారిజ'కు తెచ్చి, వారికి చేతనైనంత సహకారాన్ని, ప్రోత్సహనాన్ని యిస్తూ ఆ గ్రామముల నైతికబలాన్ని పెంచే బాధ్యత విజయనగరం వికాసతరంగిణి ద్వారా శ్రీమతి అరుణ, బేబి, విజయగార్లు సమర్థవంతంగ నిర్వహిస్తున్నారు.

దాంతోపాటు ప్రతిరోజూ 10,15మంది వాలంటీర్లకు తక్కువ కాకుండా అటు





విజయనగరం, ఇటు విశాఖపట్నంలోని విభిన్న వికాసతరంగిణుల నుండి వస్తున్నారు. ఎంతో శ్రద్ధతో సేవలందిస్తున్నారు. కార్యాలయ నిర్వహణాబాధ్యతను విజయనగరానికి చెందిన శ్రీమాన్ V. సూర్యనారాయణగారు చాల ఓపికగ పగలు, రాత్రి తేడా లేకుండా చూసుకుంటున్నారు.

ఖమ్మం, హైదరాబాద్, కరీంనగర్, వరంగల్ గుంటూరు, కృష్ణా మొదలైన జిల్లాలకు చెందిన వికాసతరంగిణి కార్యకర్తలు 'వారిజ'ను సందర్శించి అక్కడక్కడ జరిగే కార్యక్రమాల వివరాలను తెలియచేసారు.

ఎందరో ప్రముఖులు, యతీశ్వరులు 'వారిజ'ను సందర్శించి, శ్రీవారితో ముచ్చటించి తమకు సౌహార్దాన్ని ప్రకటించారు. గత29వ తేదీన హరిపురం వద్ద పంచదార్లలోని శ్రీరామలింగేశ్వరస్వామి ఆలయాన్ని, B.C.T డా॥ పరమేశ్వరరావుగారి నేతృత్వంలో శ్రీవారు సందర్శించారు. సెప్టెంబర్ 10తేదీన సమీపంలో ఉండే తగరపువలసలోని ప్రాచీన రామాలయం సందర్శించారు. ఈ రెండు ఆలయాల జీర్ణోద్ధరణకై స్థానికులను ప్రోత్సహిస్తూ రూ. 10,000/-లు చొప్పున శ్రీవారు అనుగ్రహించారు.

చాతుర్మాస్య సమయంలో దీపావళి తర్వాత సహస్రకలశాభిషేకం పూర్తయ్యే వరకూ ఇక బయటకి వెళ్ళవద్దని నిర్ణయించుకోవడం వల్ల శ్రీవారు వారిజలో జరిగే కార్యక్రమాలను సమీక్షిస్తూ ఉండిపోయారు.

'వారిజ' ఆశ్రమంలో విఘ్ననివారక చతుర్థి ఉత్సవాన్ని విద్యార్థులందరూ చాలా వైభవోపేతంగ జరుపుకున్నారు.

సెప్టెంబరు 27,28,29 తేదీలలో మన 'వారిజ' ఆశ్రమంలోనే **41వ ఉభయవేదాంత పండిత సభలు** జరిగాయి. ఈ సభలు ప్రతీ ఏడాదీ దసరా సందర్భంలో విజయవాడలో జరుగుతూండేవి. గత కొద్ది సంవత్సరాలుగ సీతానగరంలోనే జరుగుతున్నాయి. శ్రీచిన్న జీయరుస్వామివారు ఈ చాతుర్మాస్యం విశాఖలో వేంచేసి ఉండటం వల్ల, శ్రీవారిసన్నిధిలో, వారి నేతృత్వంలో జరపాలనే అభిలాషతో 'వారిజ'లోనే ఏర్పాటు చేసారు.

ప్రతీఏడాదీ 5దినాలుజరిగే ఈ సభలు ఈ ఏడాది మూడు దినాలు మాత్రమే ఏర్పాటు చేసారు. ఉదయపు వేళలలో సంస్కృతవేదాన్త ప్రవచనాలు, సాయంవేళలో ద్రావిడవేదాన్త ప్రవచనాలు జరపడం పరిపాటి. అదే క్రమంలో ఈ ఏడాది బృహదారణ్యకోపనిషత్ లోని కొన్ని ఘట్టాలను 9మంది పండితులు ప్రవచించేందుకు శ్రీనమ్మాళ్వార్ల తిరువాయ్‌మొళ్ళిలో 5పదిలో 4 దాక తిరువాయ్‌మొళ్ళిలు 9మంది పండితులు ప్రవచించడానికి నిర్ణయమైంది. ఉదయపు ప్రవచనాలలో సృష్టిజరిగిన విధానం, ప్రకృతిలోని పదార్థజాతాన్ని ఎలా భావించి సేవించాలో మానవశరీరంలో వివిధ చర్యలనే విధంగా ప్రభావితం చేయాలీ మొదలైన విషయాలకు సంబంధించి యాజ్ఞవల్క్య మహర్షి, జనకసభలో చేసిన వివరాలకు

సంబంధించిన ప్రవచనాలు పండితులు వివరించిన విధానం శ్రోతలందరినీ ఆలోచింపచేసింది. తత్వప్రచారకులు కుమారి శారద, రఘునాధ్‌గారల ఈ ఉపనిషత్‌కి సంబంధించిన విశేషాలు బ్రహ్మసూత్రాలలో ఎలా నిర్ణయించారో వివరించారు.

29వ తేదీన వేదాగమ విద్యార్థులు శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రంపై నిర్వహించిన అవధాన కార్యక్రమము పండితుల ప్రశంశను పొందింది. వారు చిరంజీవుల నాశీర్వదించారు. 'వారిజ' ఆశ్రమ నిర్వాహక బృందం విచ్చేసిన పండితబృందానికందరకూ వస్త్ర సంభావనాదులతో సత్కరించారు. ఇక్కడికి ప్రక్కనే ఉన్న మంగమారిపేటలో కొత్తగృహం నిర్మించుకొన్న సర్పంచిగారి భర్త శ్రీమాన్ కింగ్ తమ నూతన గృహాన్ని పండితుల వసతికి కేటాయించి వారి కృపను పొందిరి.

తిరుమలలో జరిగే బ్రహ్మోత్సవాలలో పాల్గొనడానికి మన దివ్యప్రబంధ విద్యార్థులు కొందరు తిరుమల చేరి శ్రద్ధతో కార్యక్రమాలలో పాల్గొంటున్నారు.

జగ్గయ్యపేట KCLలో జరిగే బ్రహ్మోత్సవాల నిర్వహణకై ఆగమాచార్యులు కొందరు వెళ్ళారు. మిగిలిన విద్యార్థులందరూ ఈ నెలలో జరుగబోయే ఆగమ, వేద పరీక్షలకై సిద్ధమౌతున్నారు.

సెప్టెంబరు 21వ తేదీన శ్రీవారి సన్నిధిలో **'తిరునారాయణ పెరుమాళ్ ఆరాధనసమితి'** సమావేశం జరిగింది. కర్నాటకనుండి శ్రీమాన్ వీరభద్రరావుగారు, శ్రీమాన్ సదాశివరెడ్డిగారు, శ్రీమాన్ సత్యనారాయణగారు, హైదరాబాద్ శ్రీమతి డా॥ శోభాజయంతి దంపతులు, వరంగల్ శ్రీమాన్ డా॥ బి. రాధాకృష్ణగారు, తదితరులీ సమావేశంలో పాల్గొన్నారు. మేల్కోటలో నిత్యమూ 50మంది ఆగంతుక భక్తులకు తదీయారాధన ప్రస్తుతం మన సమితి నిర్వహిస్తోంది. ఈ కైంకర్యానికై నిర్మించిన భవనమునకు ఇంతవరకు సుమారు రూ.20 లక్షలు ఖర్చుచేసారు. ఇప్పుడాభవనం అన్ని వసతులతో భక్తుల ఉపయోగంలో ఉంది. ఆ భవనాన్ని **"జ్ఞానమండపం"**గ నామకరణం చేయాలని నిర్ణయించారు. అలానే ఆరాధనకై తమ ధనాన్ని వినియోగించిన భక్తులకు ప్రసాదం పంపాలని, ఇది **"దక్షిణ బదరీ"** అని ప్రసిద్ధిచెందినది కావడాన బదరీ అంతట ప్రాచుర్యం వచ్చేట్లు అందరికీ దీని వైభవం తెలియజేయాలని నిర్ణయించారు.

## బదరీనాథ్:

ఈమధ్యనే పరమపదించిన 'మాతా భాగమతీ మాయి'కి సెప్టెంబరు 11వ తేదీన మన అష్టాక్షరీక్షేత్రంలో పరమ పదోత్సవం జరిగింది. 60 సం॥లుగా బదరీనాధునిసేవలోనే గడిపిన ఈమె తన దేహబంధువులకు పూర్తిగ దూరం గానే ఉండిపోయిరు. 5సం॥ల క్రితం శ్రీశ్రీశ్రీచిన్న జీయరుస్వామివారి సన్నిధిలో ఈమె సమాశ్రయణం పొందారు. 11వ తేదీన పరమపదోత్సవం సందర్భంగ బదరీలోని పండాలందరినీ ఆహ్వానించి వారికీ, రావల్‌జీకి గూడ మనక్షేత్రంలో తదీయారాధన





జరిపించారు. శ్రీమద్భాగవతగ్రంథాన్నంతనూ కంఠస్థపరచిన ఆ మహానుభావురాలియొక్క వైభవాన్ని అందరూ స్మరించుకున్నారు.

సత్సంగనదన నిర్మాణ కార్యక్రమం ప్రారంభమైంది. క్రింద పాకశాల, తదీయారాధనశాలలు, మొదట అంతస్థులో భక్తుల వసతులు, పైభాగములో గతంలో వలెనే మన శ్రీనివాసపెరుమాళ్ళ పరివారం కోసం ఆలయం, ముందు మండపం ఇలా నిర్మించ డానికి నిర్ణయించారు. అందులో క్రింద తదీయరాధన మండపానికి శ్లాబు వేయడం పూర్తి అయింది. కుమారి ఉషశ్రీ బదరీనుండి బయలుదేరి తిరుమలలో జరిగే బ్రహ్మోత్సవముల సందర్భంగా అక్కడికి విచ్చేసే భక్తుల సౌకర్యముల వ్యవస్థను సరిగా ఉండేటట్లు చూడడం కోసం, తిరుమల వచ్చారు.

ఈ మధ్య తిరుమలలోని మన మఠమును కొంత పునరుద్ధరణ చేయించారు. పారిశుద్ధ్యము, పరిశుభ్రత భక్తులకు కలిగించే సౌకర్యాలను పరిశీలించడం, వీలయినంత మెరుగు పరచడానికి చెన్నై జెట్ నిర్వాహకురా లైనా శ్రీమతి ఆనందకుమారి గారు, కుమారి ఉషశ్రీ ప్రయత్నిస్తున్నారు.

రాబోయే 8వ తేదీన అంటే 8.11.03 నాడు శ్రీవారి చాతుర్మాస్యదీక్షపూర్తి అవుతుంది. ఈ ఏడాది ధనుర్మాస కార్యక్రమం ఖమ్మంలో చేయాలని అక్కడి వికాసతరంగిణి శాఖల తరపున శ్రీమాన్ E. రామారావు, ఖమ్మం జిల్లా "గీతాజ్యోతి" కన్వీనర్, శ్రీవారిని కోరి ఉన్నారు. శ్రీస్వామివారు వారి అభ్యర్ధనను అంగీకరించారుగూడ. చాతుర్మాస్యానికీ, ధనుర్మాసానికీ మధ్య ఉండే సమయంలో 14 ధర్మక్షేత్రాలలో గీతాజ్యోతి కార్యక్రమాలు జరిపి, అక్కడక్కడి భక్తులతో గీతాజ్యోతి ప్రతిజ్ఞ చేయించాలనేది శ్రీవారి సంకల్పము.

### ఆయా ధర్మక్షేత్రాలు జరిగే వివరాలు తాత్కాలికంగ ఇలా ఉంటాయి.

నవంబరు 9 **ఆముదాలవలస** (శ్రీకాకుళం)
" 11 **రాజాం** (శ్రీకాకుళం)
" 12 **బొబ్బిలి** (విజయనగరం)
" 14 **గోకవరం** (తూ.గో.జిల్లా)
" 16 **పాలకొల్లు** (ప.గో.జిల్లా)
" 20 **పుల్లడిగుంట** (గుంటూరు)
" 21 **వినుకొండ** (ప్రకాశంజిల్లా)
" 25 **కడప ధర్మక్షేత్రం**
డిసెంబర్ 2 **చవటపాలెం** (నెల్లూరుజిల్లా)
" 4 **గాలిపాలెం** (నెల్లూరుజిల్లా)
" 6 **మదనపల్లి** (చిత్తూరుజిల్లా)
" 13 **జగ్గయ్యపేట** (కృష్ణాజిల్లా)
" 14 **కోదాడ** (నల్గొండ జిల్లా)
" 15 గంపలగూడెం (కృష్ణాజిల్లా)

★ అవసరాన్ని బట్టి వీటిలో మార్పులు చేర్పులు జరుగవచ్చు.

ఇంత వరకు 23 ధర్మక్షేత్ర కార్యక్రమాలు

జరిపారు శ్రీస్వామివారు. అన్ని చోట్లా మంచి స్పందనఉంది. మన గీతాజ్యోతి కార్యక్రమ సమగ్ర స్వరూపం పాఠకులకు జ్ఞాపక ముండియే ఉంటుంది.

**1) "స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ"**

**2) "మాధవసేవగా సర్వప్రాణిసేవ"** అనే రెండు సూత్రాలను ఇంటింటికీ అందించడం, విద్యార్థులకు కంటి, పంటి, పరీక్షల ద్వారా ఈ సందేశాన్నందివ్వడం, వీలయినచోట పశువైద్యశిబిరాలు నిర్వహించడం, జాతి, కుల, మతములకతీతంగ, అందరూ కలసి తమప్రాంత ప్రగతికి పరిశ్రమించేట్టు ప్రతిన పూనడం మన గీతాజ్యోతిలోని ప్రధానాంశాలు. ఈ ఏడాది గీతాజ్యోతిలో భగవద్గీత 13వ అధ్యాయాన్నికి సంబంధించి తయారు చేసుకొన్ని ప్రథమ అభ్యాసపట్టికను గూడ ప్రారంభించాలని అనుకున్నారు, అది అంత సమర్థవంతంగ సాగడంలేదు. మన 'ఇతిహాసబోధ'లో ఆ అధ్యాయంలో అభ్యసించమనిన గుణాలను వివరించే కథనాలను ప్రచురిస్తున్నాం. భగవద్బంధువులు ఈ విషయాన్ని గమనిస్తూ ఉండి ఉంటారు. ఆయా గుణాలను అభ్యసించే విధానాన్ని తెలిపే ప్రామాణికమైన కథలను పాఠకులెవరైనా మన పురాణ, ఇతిహాసాల్లోంచి వ్రాసి పంపినట్లైతే పరిశీలించి మన **'భక్తినివేదన'** ప్రచురించే ప్రయత్నం చేస్తుంది.

## ముఖ్యమంత్రికి శ్రీవారి మంగళాశాసనములు

1వ తేదీనాటి సాయంకాలం తిరుమల ఘాట్‌లో కొండపైకి వెడుతూండగా జరిగిన ఘోరప్రమాదం నుండి భగవంతుని కృపతో బ్రతికి బయటపడ్డ ఆంధ్రప్రదేశ్ ముఖ్యామాత్యులు శ్రీమాన్ **N**. చంద్రబాబు నాయుడుగారికి శ్రీవారు మంగళా శాసనములు పంపించారు.



వారి మీద ఏర్పడ్డ దోషాలన్నీ ఈ ప్రమాదంతో తొలగిపోయి, పునఃప్రజలకీ, రాష్ట్రానికీ సేవను మరిన్ని సంవత్సరాలు చేయగలిగే అవకాశం, భగవదనుగ్రహంతో లభించిందనీ, దీనిని ప్రేరణగ గైకొని ఆ భగవంతుని ఆరాధనాదులు మరింత బాగ జరిగే వ్యవస్థను ఏర్పరచే ప్రయత్నం చేయమని, త్వరలోనే పూర్ణమైన ఆరోగ్యంతో విధులకు హాజరు కాగలగాలని మంగళాశాసనాలు చేసారు.

## జీయర్ పురస్కారం

రాబోయే 26.11.03నాడు, శ్రీశ్రీశ్రీ మన చిన్న జీయరుస్వామి వారి తిరునక్షత్ర సందర్భంగా ప్రతీ ఏడాదీ ఒక విశిష్ట



వేదవిద్వాంసునికి అందచేసే **"జీయరు అవార్డు"** ఈ ఏడాది కాంచీపుర సమీపంలో వేంచేసి ఉండే ఉ.వే.ప్ర. **శ్రీమాన్ వలయప్పేట్టై నావల్ పాక్కం కృష్ణ రామానుజ తాతాచార్య స్వామి**వారిని వరించబోతోంది. ఒక ప్రశంసా పత్రము రూ.50,000/-లు నగదు ఈ సందర్భంగా శ్రీవారు ఆ స్వామికి మంగళా శాసనపూర్వకంగా అనుగ్రహిస్తారు. వారు రాష్ట్రపతి అవార్డు గ్రహీతలే కాక, చతుర్వేద శతక్రతు బిరుదాంకితులు. కృష్ణయజుర్వేదము లో ఘనాంతస్వాధ్యాయి కావడంతోపాటు, వీరు న్యాయ, మీమాంసా శాస్త్రములలో పూర్ణపాండిత్యం కలవారు. వేదభాష్యాన్ని అధ్యయనం చేసి, శ్రౌతప్రక్రియ లో నిష్ణాతులుగ ప్రసిద్ధిగాంచిన మహానుభావులు. శ్రీవారి తిరునక్షత్ర వేడుకలు పూర్తికాగానే ఉదయం గం. 11-00 నుండి 1-00 వరకు జరిగే బహిరంగ సభలో వీరికి శ్రీజీయరు స్వామివారి కరకమలముల మీదుగ ఈ 'జీయరు పురస్కారాన్ని' అందజే స్తారు. ఈ వైభవోపేతమైన కార్యక్రమము భీమిలీబీచ్ రోడ్డులోని నూతన "వారిజ" ఆశ్రమంలో జరుగుతుంది.

### జగ్గయ్యపేట:-

కృష్ణాజిల్లా జగ్గయ్యపేట ధర్మక్షేత్ర ప్రచార కార్యక్రమంలో భాగంగా 12-08-03 తేదిన హయగ్రీవ జయంతి సందర్భముగా 300 మంది విద్యార్థులతో శ్రీ చంద్రమౌళేశ్వర ఆలయం నుండి, శ్రీరంగనాయక స్వామి ఆలయం వరకు శోభా యాత్ర నిర్వహించి నారు. శ్రీమాన్ లక్ష్మీ నరసింహాచార్యులు గారిచే శ్రీ హయగ్రీవ వైభవము గురించి ప్రవచనం జరిగినది.

### ముత్యాలంపాడు:

కృష్ణాజిల్లా ముత్యాలంపాడు వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యంలో శ్రీ కృష్ణ జన్మాష్టమి సందర్భముగా పిల్లలకు నోటు పుస్తకములు, స్వీట్లు పంచిపెట్టినారు.

### పటమట (చైతన్య):

కృష్ణాజిల్లా పటమట (చైతన్య) వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో జయప్రకాష్ నగర్‌లోని "అమ్మకోసం" వృద్ధాశ్రమంలోని వృద్ధులకు పండ్లు పంచి పెట్టినారు. కానూరులోని వృద్ధాశ్రమంలో నున్న 35 మంది వృద్ధులకు గీతాజ్యోతి ఆశయాలను వివరించి స్టిక్కర్సు అంద జేయటం జరిగింది. ఈ కార్యక్రమంలో శ్రీమతి రాణి సంయుక్త, అన్నపూర్ణ, అన్నపూర్ణాదేవి, లీలాకుమారి గార్లు పాల్గొన్నారు.

### జాంధ్రపేట:-

ప్రకాశంజిల్లా జాంధ్రపేట వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యంలో 24-08-03 తేది ప్రథమ వార్షికోత్సవ కార్యక్రమం నిర్వహించినారు. ఈ కార్యక్రమంలో గీతాజ్యోతి 48 శ్లోకములు పోటీలు నిర్వహించి విజేతలకు బహుమతి ప్రదానం చేసారు. మధ్యాహ్న భోజన పథకమునకు వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యంలో 50 పళ్ళెములు, 50 గ్లాసులు అందజేసినారు.

### నిజామాబాద్:

నిజామాబాద్ ధర్మక్షేత్ర కేంద్రముగా వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో లయన్స్ క్లబ్ వారి ఆధ్వర్యంలో 22-09-03 తేదిన ఉచిత దంతవైద్య శిబిరం నిర్వహించ బడింది. ఈ శిబిరంలో 40 మంది

విద్యార్థినులకు, ఉపాధ్యాయులకు దంత పరీక్షలు నిర్వహించారు. ఈ కార్యక్రమంలో శ్రీమాన్ డా॥ నితిన్ కుమార్ తమ సేవలను అందజేసినారు. జి. లక్ష్మారెడ్డి యితర వైద్యులు పాల్గొన్నారు.

**వికాసతరంగిణి - జంటనగరముల సమన్వయ కమిటీ సెప్టెంబరు 2003. కార్యక్రమముల నివేదిక-**

జంటనగరముల వికాసతరంగిణి కార్య వర్గము మరియు అనుబంధ శాఖల సమావేశము ది.21-09-03 ఉ.11 గం.కు JET Buildings లో జరిగినవి. 9 శాఖల నుండి అధ్యక్ష కార్యదర్శులు విచ్చేసి తమ నివేదికలను సమర్పించినారు.

**1&2. ఆధ్యాత్మిక పునాదిపై ధార్మిక జీవనము - వ్యక్తిత్వ వికాసము:**

ఈ ఆశయములకు అనుగుణంగా **కూకట్‌పల్లి శాఖవారు** 30 పాఠశాలలను సందర్శించి 50,000 గీతాజ్యోతి శ్లోకమాలిక పుస్తకములను పంపిణీ చేసి, వాటిని అనుసంధానం చేయటం భోదించి, గీతాజ్యోతి ఆశయములను వివరించినారు.

**మాసబ్‌ట్యాంక్ శాఖవారు**

కృష్ణాష్టమి రోజున శ్రీ వేంకటేశ్వర దేవాలయములో కృష్ణపూజలు, ముకుందమాల, భాగవత ప్రవచనము చేసారు. సెప్టెంబరు 8, 18వ తారీఖులలో ఆనందనగర్ కాలనీలో గీతాజ్యోతి శ్లోకపఠనము, శ్రీమాన్ రామాచారిగారి ప్రవచనము భారత, భాగవతము మధుర ఘంట్టాలు ఎంతోమంది భక్తులను ఆకట్టుకుంది.

**సంతోష్‌నగర్ శాఖ**వారి ద్వారా శ్రీకృష్ణ జయంతి రోజున బాలబాలికలచే గోపాలుడు-గోపికల వేషధారణలతో చక్కని సాంస్కృతిక కార్యక్రమములు ఎంతో మనోహరముగా జరిగినవి. చంచల్‌గూడ లోని చెన్నకేశవస్వామివారి ఆలయంలో గీతాజ్యోతి ప్రవచనము, శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం జరిపినారు. వినాయక చవితి రోజు శ్రీవేంకటేశ్వర స్వామి ఆలయంలో కుమారి కమలచే గీతాజ్యోతి ప్రవచనం, శ్రీ విష్ణు సహస్రనామ పారాయణం, శ్రీ విష్వక్సేన







ఆరాధన కావించినారు. భువనగర్ మరియు ఇతర ప్రాంతములలోని వినాయక మండపములలో పూజలు, సాంస్కృతిక కార్యక్రమములు నిర్వహించినారు.

**వనస్థలిపురం శాఖవారు**

21-08-03 శ్రీ కృష్ణాష్టమి సందర్భముగా శ్రీ సీతారామచంద్ర స్వామి దేవాలయములో శ్రీ కృష్ణ పూజలు నిర్వహించి, భగవద్గీతా ప్రవచనము చేసినారు. ఆగస్టు 31, 2003 రోజున శ్రీ రామాలయంలో, శ్రీ విష్వక్సేన పూజా కార్యక్రమములు నిర్వహించిన తదుపరి, కమలానగర్ బ్రాహ్మణ సంక్షేమ సంఘం వారి గణేష్ మండపములో పారాయణము, ప్రవచన కార్యక్రమ ములు జరిగినవి. గణేష్ నవరాత్రుల సందర్భముగా గీతాజ్యోతిని ప్రచార నిమిత్తము మా కార్యకర్తలు, టెలిఫోన్ కాలని, వనస్థలి హిల్స్, కమలానగర్ రామాలయం, గణేష్ దేవాలయము, పాతబస్తీలోని లాల్ దర్వాజ వద్ద, టి.వి.కాలనీలో, బాగ్ లింగంపల్లిలోను పారాయణము మరియు ప్రవచన కార్యక్రమములను నిర్వాహకుల అభ్యర్థన మేరకు నిర్వహించినాము.

09-09-03 రోజున తిరుమలగిరి మండలం ఫణిగిరి గ్రామంలో గీతాజ్యోతి ప్రచారం జరిపి సాయంత్రం వందలాది భక్తులకు గీతాజ్యోతి కార్యక్రమ వివరములు-లక్ష్యములను వివరించి, వికాసతరంగిణి సంస్థ గురించి వివరించి చక్కని కార్యక్రమములు చేపట్టవలసినదిగా సూచించటము జరిగినది.

**ఆర్తులకు - దీనులకు వివిధ సేవలను అందించుట:**

**వనస్థలిపురం శాఖ**వారి ద్వారా 24-08-03 రోజున కమలానగర్ కమ్యూనిటి హాల్‌లో ఉచిత నేత్ర మరియు ఆక్యుప్రెషర్ వైద్య శిబిరమును నిర్వహించినారు. ఈ శిబిరములో 120

మంది రోగులను పరీక్షించి మందులను అందించటం జరిగినది. 12 మందికి ఉచితముగా కంటి అద్దాలు, 10 మందికి 50 శాతం రాయితీతో అద్దములను అందించటము జరిగినది.

**రామాంతపూర్ శాఖవారు**

దయాబెటిక్ టి.బి, చాతి వ్యాధులు, బి.పి, కాల్షియం రోగులకు చికిత్సా శిబిరములను నిర్వహించి మందులను అందజేయటం జరిగినది. 1000 మందికి సేవలను అందించినారు.

**మాసబ్‌ట్యాంక్‌శాఖవారు**

07-09-03 రోజున గీతామందిర్‌లో ఉచిత కంటి పరీక్ష నిర్వహించినారు.

**బోయిన్‌పల్లిశాఖవారు** 20-09-03న కేసరమండలం తిమ్మాయిపల్లి గ్రామములో చుట్టుప్రక్కల 5 గ్రామాలకు కలిపి మెగా వైద్య శిబిరమును నిర్వహించినారు. ఈ శిబిరములో ఉచితముగా నేత్ర పరిక్ష, దంత, స్త్రీ వ్యాధుల చికిత్స, సామాన్య వ్యాధులు, ఆక్యుప్రెషర్ వైద్య విధానముల ద్వారా 1500 మందికి సేవలను అందించినారు. నిష్ణాతులైన 20 మంది డాక్టర్లు ఈ శిబిరములో తమ సేవలను అందించటమేకాక 80 మందికి నేత్ర శస్త్ర చికిత్సలు జరిపినారు. 120 మందికి ఉచితముగా కంటి అద్దములను అందించటము జరిగినది. గ్రామ ప్రజలు ఈ తమ సేవలను బాగా కొనియాడి సంతోషము వ్యక్తపరచినారు.

**పర్యావరణము పరిరక్షణ:**

**సంతోష్‌నగర్ శాఖ**వారి ద్వారా 25 దేవాలయములకు తులసిమొక్కలను పంపిణి చేసినారు. వనస్థలిపురం శాఖవారి ద్వారా పద్మావతినగర్‌లో గల పార్కులో మొక్కలు నాటుటకు స్థలమును శుభ్రము చేయటము జరిగినది.

## మన వికాసతరంగిణికి ముఖ్యమంత్రి పురస్కారం

ఈ సం॥ జులై 30వ తేదినుండి ఆగస్ట్ 10వ తేది వరకు మన రాష్ట్రంలో ప్రతిష్ఠాత్మకంగా జరిగిన గోదావరీ పుష్కర మహోత్సవాలలో మన భద్రాద్రి వికాస తరంగిణి తరఫున సుమారు 243 మంది కార్యకర్తలు వివిధ సేవలను అందించి ఖమ్మంజిల్లా యంత్రాంగం యొక్క ప్రశంసలను పొందినారు. ఆగస్ట్ 15వ తేదిన ఖమ్మంలో జరిగిన ఒక కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ శ్రీమాన్ అరవింద కుమార్‌గారు వికాస తరంగిణి 67వ శాఖకు ప్రత్యేక ప్రశంసా పత్రాన్ని అందజేసారు. అంతే గాక సెప్టెంబరు తేదిన హైదరాబాద్ శిల్పా రామంలో జరిగిన ప్రభుత్వ పురస్కార ప్రదాన కార్యక్రమంలో రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీమాన్ నారా చంద్రబాబు నాయుడుగారి చేతులమీదుగా భద్రాచలం వికాసతరంగిణి శాఖ కార్యదర్శి శ్రీమాన్ గట్టు వెంకటాచార్యులు గారు **ప్రశంసా పత్రాన్ని** అందుకున్నారు. ఈ గుర్తింపు, గౌరవంకూడ శ్రీ స్వామివారి మంగళా శాసనములవల్ల, V.T. కార్యకర్తలందరి సేవాభావంవల్ల లభించాయని ఈ సందర్భంగా జరిగిన కార్యకర్త సమావేశంలో అందరికి కృతజ్ఞతలను సమర్పించారు.



## పరమపదము



సుమారు 16 సంవత్సరాలనుండి భీమవరం మరియు పరిసర ప్రాంతాల్లో విశిష్టాద్వైత ప్రచారానికి ఎంతో కృషి చేసిన **శ్రీ రుద్రరాజు విశ్వనాథరాజు**(SBH) గారు ది.**24-07-03**న పరమాచార్య తిరువడికి చేరుకున్నారు. ఈ సమాచారం విని శ్రీ చిన్నజీయరుస్వామివారు ఎంతో బాధపడ్డారు. భగవత్కృపకై ప్రార్థించారు. వీరికి ఆశ్రియఃపతి సాన్నిధ్యం నిత్యం కలగాలని ప్రార్థిస్తున్నాము.





**మెగా ఉచిత పశువైద్య శిబిరం**

భద్రాచలం వికాసతరంగిణి శాఖ 67, లయన్స్ క్లబ్ పశు సంవర్థక శాఖలతో కలిసి సమీప గ్రామమైన పాండురంగా పురంలో సెప్టెంబరు 18వ తేదిన పశువైద్య శిబిరాన్ని నిర్వహించింది. పశువులకు వచ్చే రకరకాల వ్యాధులన్నిటికీ ఈ శిబిరంలో ఉచితంగా వైద్యంతోపాటు సుమారు 40,000 రూపాయలు ఖరీదుచేసే మందులను కూడా పంపిణీచేయటం జరిగినది. శాఖ కార్యదర్శి శ్రీమాన్ వెంకటాచార్యులు గారి నిర్వహణలో జరిగిన ఈ శిబిరంలో శాఖ సేవాదళ నిర్వాహకులు శ్రీమాన్ శీలం పుల్లారెడ్డిగారి సేవలో ప్రయోజనవంతంగా జరిగాయి. ఈ శిబిరంలో 13 మంది వైద్యులు- సుమారు 4,500 పశువులకు వివిధ పరీక్షలను నిర్వహించి వైద్యం నిర్వహించి వైద్యం చేశారు. ఈ కార్యక్రమంలో భద్రాచలం సబ్ డివిజనల్ పోలీస్ ఆఫీసర్ శ్రీమాన్ బి. సంపత్‌కుమార రెడ్డిగారు Z.P.T.C (B.C.M) అధ్యక్షులు శ్రీమతి ప్రభావతిగార్లు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. శ్రీమాన్ P.J భట్టర్ (V.T. శాఖ అధ్యక్షులు) వారి పరోక్ష పర్యవేక్షణలో ఈ శిబిరం ప్రయోజన వంతంగా జరిగినది.



**ఉచిత వైద్య శిబిరం:**

భద్రాచలం శాఖ, లయన్స్ క్లబ్ – లియో క్లబ్‌ల సంయుక్త నిర్వహణలో ఈ ఉచిత మెగా వైద్య శిబిరం సమీప గ్రామమైన కాటుకపల్లిలో 24వ తేదిన ఎంతో ప్రయోజనవంతంగా జరిగింది. సుమారు 400 మందికి కంటి, దంత, జనరల్ చెకప్ మొ॥గు వివిధ వైద్య పరీక్షలు నిర్వహించి, ఉచితంగా మందులను కూడ ఉచితంగా పంపిణీ చేయటం జరిగినది.

ఈ శిబిరంలో పాల్గొన్న 18 మంది డాక్టర్లు ఎంతో అంకితభావంతో వైద్య శిబిరాన్ని నిర్వహించారు. ఈ కార్యక్రమంలో శ్రీమాన్ ఇ. రంగారెడ్డిగారు (శ్రీ జీయర్ మఠం ట్రస్ట్ సభ్యులు) మొదలైన పుర ప్రముఖులు పాల్గొన్నారు. శాఖ కార్యదర్శి శ్రీమాన్ గట్టు వెంకటాచార్యులు గారి నిర్వహణలో ఈ శిబిరం ప్రయోజనవంతంగా జరిగింది. శ్రీమాన్ పుల్లారెడ్డి, సత్యనారాయణ మొ॥గు కార్యకర్తలు చక్కని సేవలను అందించారు.

**ఉచిత మెగా పశువైద్య శిబిరం:**

వివిధ స్థానిక సేవాసంస్థల సహకారంతో భద్రాచలం వికాసతరంగిణి శాఖ మరొక మెగా పశువైద్య శిబిరం నిర్వహించింది. ఈ శిబిరంలో సుమారు 2వేల పశువులకు వివిధ పరీక్షలను నిర్వహించి సుమారు 2 వేల రూపాయల మందులను ఉచితంగా పంపిణీ చేయడం జరిగింది.

ఈ శిబిరంలో పశుసంవర్ధక శాఖ వారి సేవా సహకారాలు ప్రశంసనీయాలు. శాఖ తరపున కార్యదర్శి శ్రీమాన్ గట్టు వెంకటాచార్యులుగారు, ఉత్సవ కార్యదర్శి శ్రీమాన్ కోటి రామ స్వరూప్ గార్లు కార్యక్రమాన్ని క్రమబద్ధంగా నిర్వహించారు. జిల్లా సబ్ కలెక్టర్ శ్రీమతి నీతూ ప్రసాద్ I.A.S. గారు, శ్రీమతి పూజా సత్యవతి M.P.P. గార్లు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. శ్రీమాన్ పి.జె. భట్టర్‌గారి పరోక్ష పర్యవేక్షణలో ఈ శిబిరం చాలా ప్రయోజనవంతంగా జరిగింది. వికాస తరంగిణి శాఖ తరపున శ్రీమాన్ పుల్లారెడ్డి, ఫణి, సత్యం ప్రభృతులు చక్కని సేవలను అందించారు.



 **పరమపదము** 

**శ్రీమతి వెంట్‌పల్లి ఊర్మిళ** గారు ది.18-06-03న పరమపదించినారు. వీరు మన జీయరుస్వామివారి అనేక కార్యక్రమములలో పాల్గొని విశిష్ట సేవలను అందించారు. వీరికి ఆశ్రియఃపతి సాన్నిధ్యం నిత్యం కలగాలని ప్రార్థిస్తున్నాము.





# గమనిక

ఇటీవల **"భక్తి నివేదన"** ఎంతో సౌజన్యంతో మన వికాసతరంగిణి కార్యక్రమాల వార్తలకు అధిక ప్రాధాన్యాన్ని ఇవ్వడం శాఖలు గమనించి ఉంటాయి. పత్రికలో వార్త పడాలనే ఉద్దేశ్యంతో తాము చేసిన ప్రతి చిన్న కార్యక్రమాన్ని కార్యాలయానికి పంపటం, వార్త రాకపోతే మా వార్త రాలేదని ఫిర్యాదులు చేయడం ఎక్కువయ్యాయి.

ఉదారంతో **"భక్తి నివేదన"** మన వార్తల కిచ్చిన స్థలం సద్వినియోగం కావటంలేదన్న విమర్శలూ ఎక్కువయ్యాయి. చేసిన కార్యక్రమాలను పత్రికలో ప్రచురిస్తే ప్రోత్సాహం ఉంటుందనేది వాస్తవమే అయినా వార్తలలో **'రాశి'** కన్నా **"వాసి"** ముఖ్యమన్న విషయాన్ని కూడా మనం విస్మరించకూడదు.

వికాసతరంగిణి శాఖలు తాముచేసే కార్యక్రమాల సమాచారాన్ని జిల్లా కమిటీకి, కేంద్ర కార్యాలయానికి తెలియజేయడం తప్పనిసరి. అయితే మన **"ఆరు ఆశయాల"**కు, **'గీతాజ్యోతి'** కార్యక్రమానికి సంబంధించిన అంశాలకు మాత్రమే ప్రచురణ నిమిత్తంగా ఇకనుండి ప్రాధాన్యం ఉంటుందని సభ్యులు గ్రహించవలసిందిగా మనవి చేస్తున్నాము.

గోదావరి పుష్కరాల సందర్భంగా మన వికాసతరంగిణి కార్యక్రమాలను వివరించే ఎగ్జిబిషన్ జరిగింది. ఈ ఎగ్జిబిషన్‌కు తమ కార్యక్రమ వివరాలను తెలిపే ఫోటోలను పంపమని ముందుగా కోరినప్పటికీ అత్యధిక శాఖలు సరిగ్గా స్పందించలేకపోయాయి.

ఈ విషయం శ్రీ స్వామివారికి ఎంతో అసంతృప్తిని కల్గించింది. రాబోయే **"కృష్ణా పుష్కరాల"**కైనా తగిన విధంగా స్పందించేటట్లు శాఖలకు సూచించ వలసిందిగా శ్రీవారు ఆదేశించారు.

కనుక తాము నిర్వహించిన ముఖ్య కార్యక్రమాల వివరాలను తెలియజేసే ఫోటోలను, సమాచారాన్ని మీరు ఇప్పటినుండే **'సీతానగరం'** కార్యాలయానికి పంపినట్లయితే, మన పొరపాట్లను సరిదిద్దుకున్నవారమౌతాము.

పై అంశాలను గమనించి స్పందించ వలసినదిగా **వికాసతరంగిణి** శాఖలను మనవి చేస్తున్నాము.



 **పరమపదము** 

**శ్రీమాన్ సురబి చంద్రశేఖరరావు**గారు 27-07-03న ఆచార్య తిరువడిని చేరినారు. వీరు మన పెద్ద జీయరుస్వామివారి శిష్యులు. వీరి స్వగ్రామము మద్దికుంట (మెదక్ జిల్లా), సిద్ధిపేటలోని దేవాలయాలను అభివృద్ధి చేయుటకు ఎంతగానో కృషిచేసినారు. వీరికి ఆశ్రియఃపతి సాన్నిధ్యం నిత్యం కలగాలని ప్రార్థిస్తున్నాము.

ఓం అస్మత్ గురుభ్యో నమః

## పదవిందు-I



| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| * | 1 | | 2 | * | 2 | 5 | 4 | | * |
| 3 | | * | 4 | | * | 5 | | * | 6 |
| 6 | | 7 | | * | * | 7 | | 9 | |
| | * | | * | 8 | | | * | | * |
| 9 | 11 | | | | * | * | 10 | | 12 |
| 11 | | | * | | * | * | | * | |
| * | 12 | | 13 | * | 13 | 14 | * | 17 | * |
| 19 | * | * | | * | 14 | | * | 15 | |
| 16 | 15 | * | 17 | 16 | | * | 18 | | |
| * | 19 | | * | | * | * | | * | * |



\22/
Mydocuments\
Bn Oct. o3.p65



**అడ్డము:-**

1 అన్ని జన్మలలోకి ఉత్తమమైన జన్మ(3)
2 నశించని పదార్థాలన్నింటికీ ఆధారమైన తత్త్వము (4)
3. కృష్ణ భక్తులలో ఈమె మొదటిదట (2)
4. తెలుగు ఆభరణమిది (2)
5. ప్రణవంలోని 'మ' కారము (2)
6. వనమే కాని చెవులకింపు (4)
7. మనిషి విలువని వీటిని బట్టే అంచనా వేస్తారు (4)
8. 'అను' సరిస్తే ప్రేమభావము, 'వి' చేరిస్తే వైరాగ్యము (3)
9. కనులకింపైనది (5)
10. జరిగి పోయినది (3)
11. విరులు కలిగినవే కానీ తిరగబడ్డాయి (3)
12. రోజుకివి ఎనిమిదిట వెనుకనుండి (3)
13. ఒక ప్రసిద్ధ కంప్యూటర్ పేకేజ్ (2)
14. భగవంతునికి ఆశ్చర్యకర శక్తి (2)
15. భగవంతునికి ముదమును కలిగించే ఆరాధనలో ప్రక్రియ (2)
16. యయాతిలోని సన్యాసి (2)
17. సంతోషించిన స్త్రీ (3)
18. ఇది చేస్తున్నాననుకోవడం ఈనాటి ఫ్యాషన్ (3)
19. జీవ, పరమాత్మలని తిరుప్పావైలో దీనితో పోలుస్తారు (2).

**నిలువు:-**

1. హిందీలో తల్లికి భర్తయైనవాడు (3)
2. పెద్దల పాదధూళి సోకనిచో భవనమే అయినా.....(3)
3 ఇవి ఉంటేనే బంధుత్వాలు నిలుస్తాయి. (5)
4. ఒక ధాన్య విశేషము (3)
5. రాముని నేత్రములకు పోలిక, రాగలదే, జీవమున్నది (4)
6. పాపాలుతో చేరియున్న స్వీకార యోగ్యమైన "భాగం" (2)
7. ఎప్పుడు 'కొత్తది' , కృష్ణునికిష్టము (5)
8 అందరినీ రమింపచేసేవాడు తెలుగులో(3)
9. లత, కవితల్లా జతకోరే స్త్రీ (3)
10. బంగారమైనా దీనిలోనే దొరుకుతుంది(2)
11. మరుత్‌లులో ఇవి ఉన్నాయి (3)
12. జలుబు చేసేది దీనికే (3)
13. మాయాజాలమే కాని మాయ తొలగింది. (3)
14. ఒకసారి వేసి రుబ్బిన పిండిని ఈ పేరుతో పిలవచ్చు (2)
15. గడ్డి తిని తలక్రిందులైన బుద్ధి (2)
16. రాక్షస మాత, కశ్యపుని భార్య (2)
17. గోపిక ఉచ్ఛిష్టంతో పవిత్రమైన నది(3)
18. సూర్యుని భార్య తలక్రిందులుగా తపమాచరిస్తోంది (2)
19. భగవంతునిలో ఇది పైకి వస్తేనే సృష్టి(2)

జై శ్రీమన్నారాయణ

## ప్రజ్ఞ - జెట్ లెర్నింగ్ సెంటర్, రాజమహేంద్రి

శ్రీశ్రీశ్రీ స్వామివారి ఆదేశానుసారంగా గోదావరి పుష్కర ప్రయుక్త బ్రహ్మ యజ్ఞంలో ప్రజ్ఞా (జెట్ లెర్నింగ్ సెంటర్) "Discovering our own self" అన్న ముఖ్య ఉద్దేశ్యంతో ప్రారంభించబడింది. 15-08-03 స్వాతంత్ర్య దినోత్సవ రోజున స్థానిక S.K.V.T. పాఠశాలలో మధ్యాహ్నం 2 గం॥లకు ప్రారంభించబడింది. దీనిని శ్రీమతి పద్మావతి రామానుజంగారు నిర్వహించారు. సుమారు 20 మంది విద్యార్థినీ విద్యార్థులు పాల్గొన్నారు. డార్విన్ సిద్ధాంతంపై ఆసక్తికరమైన సెమినార్ కార్యక్రమం నిర్వహించబడింది. మనిషి కోతినుండి పుట్టాడా? మనిషి కోతినుండి పుట్టినట్లైతే మరి ఎక్కడో ఇప్పుడు కూడా ఏదో ఒక కోతికి మనిషి పుట్టాలి కదా! మరి అటువంటి దాఖలాలు కనబడటం లేదు. కనుక మరి డార్విన్ సిద్ధాంతం ఎంతవరకు నిలబడుతుంది? మనగురించి మనవాళ్ళు చెప్పిన విషయాలను విశ్వసిద్దాం. మన ఋషులు మనకు చెప్పిన విషయాన్ని విశ్వసిస్తూ ముందుకు సాగుదాం. ఈ కార్యక్రమానికి వేద ఆచార్య "రఘునాథ్‌గారు" విచ్చేసి వేద ప్రామాణ్యం గురించి వివరించారు. కార్యక్రమంలో సర్వశ్రీ ఎం.వి.వి. రామానుజం, సీతారాం S.K.V.T. అధ్యాపకులు పాల్గొన్నారు.



పరమహంస పరివ్రాజకులు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి** వారి

**దివ్య మంగళాశాసనములతో...**

### గీతాజ్యోతి

### శ్రీరంగక్షేత్ర పాదయాత్ర

**పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి అష్టాక్షరీ సంపత్కుమార రామానుజ జీయర్ స్వామి** వారు (శ్రీమత్ అష్టాక్షరీ పీఠం, విజయవాడ). మన గీతాజ్యోతి సందేశాన్ని వాడవాడలా ప్రచారం చేస్తూ తేది 5-10-03 ఆదివారం ఉదయం 9 గం॥లనుండి **"శ్రీరంగక్షేత్ర పాదయాత్ర"** నిర్వహించనున్నారు. గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాలు మీదుగా చెన్నై చేరి దివ్య దేశాలను దర్శించుకుంటూ శ్రీ స్వామివారు శ్రీరంగక్షేత్రం చేరుతారు. కనుక మన వికాసతరంగిణి కార్యకర్తలు, భక్తులు తమ తమ ప్రాంతాలలో శ్రీ అష్టాక్షరీ జీయర్ స్వామివారి గీతాజ్యోతి పాదయాత్ర కార్యక్రమాన్ని విజయవంతం చేయవలసినది శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారు ఆదేశించారు. యాత్రకు సంబంధించిన విశేషాలు తెలుసుకొని భాగస్వామ్యం కాదలచినవారు ఈ సెల్ నంబరు: **944051884**ను సంప్రదించ గలరు.





## గీతాజ్యోతి కార్యక్రమం

ప్రజలందరి సమగ్ర చైతన్యాన్ని లక్ష్యంగా ఉంచుకొని శ్రీస్వామివారు రూపొందించిన కార్యక్రమం **"గీతాజ్యోతి"**. కుల, మత ,వర్గ, వర్ణవివక్షలకు అతీతంగా దేశ సమైక్యాన్ని ఆశిస్తూ ఉద్యమస్ఫూర్తితో ఈ కార్యక్రమం ప్రారంభమైంది. రాష్ట్ర వ్యాప్తంగా రెండు కోట్ల మందిని చైతన్యవంతులను చేసే దిశగా ఈ ఉద్యమం సాగుతున్నది.

**'స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ', 'మాధవసేవగా - సర్వ ప్రాణి సేవ'** అనే లక్ష్యాలను గీతా సందేశానుసారంగా వాడవాడలా మన వికాసతరంగిణి కార్యకర్తలు ప్రచారం చేస్తున్నారు.

పశు వైద్య శిబిరాలు, దంతవైద్య శిబిరాలు, నేత్రవైద్య శిబిరాలవంటి వివిధ వైద్యసేవలు, పాఠశాలలలో విద్యార్థులకు చిత్రలేఖన పోటీలు, శ్లోకాల పోటీలు వంటి వివిధ కార్యక్రమాలను ధర్మక్షేత్రాలలో మన కార్యకర్తలు నిర్వహిస్తున్నారు.

ఇప్పటిదాకా అలా నిర్వహించిన 23 ధర్మక్షేత్రాలను శ్రీ స్వామివారు దర్శించి, అక్కడి కార్యకర్తలకు మార్గదర్శకం చేశారు. చాతుర్మాస్య దీక్ష అనంతరం శ్రీ స్వామివారు ప్రభంజనంలా వివిధ ధర్మక్షేత్రాల కార్యక్రమాలను పర్యవేక్షించబోతున్నారు.

వివిధ ధర్మక్షేత్రాలలో "గీతాజ్యోతి" కార్యక్రమంలో భాగంగా జరిగిన వైద్యసేవా కార్యక్రమాల వివరాలను దిగువ తెలియజేస్తున్నాం.

| వైద్యశిబిరాలు | శిబిరాల సంఖ్య | సేవలందుకున్నవారి సంఖ్య | మొత్తంఖర్చు |
|---|---|---|---|
| పశువైద్య శిబిరములు | 70 | 57,978 (పశువులు) | 10,50,367 |
| దంతవైద్యశిబిరాలు | 131 | 55,279 | 9,65,105/- |
| నేత్రవైద్యశిబిరాలు | 77 | 26,697 | 7,48,190 |
| సాధారణవైద్యశిబిరములు | 167 | 75,035 | 14,24,235 |
| మొత్తం | 445 | 1,57,011 | 41,87,897 |

# ఆముదాలవలస ధర్మక్షేత్రం

## ఆహ్వానము

నవంబర్ 7,8,9 తేదిలలో శ్రీమాన్ **తమ్మినేని సీతారాం** గారి(మంత్రివర్యులు)
స్వగృహంలో 3 రోజుల పాటు **"సుదర్శన యజ్ఞం"** జరుగును.

సభాస్థలి:- **ప్రభుత్వ డిగ్రీ కళాశాల. 09-11-03** తేదిన

పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ
జీయరుస్వామివారి పర్యవేక్షణలో...

ఉదయం 09.00 గంIIనుండి 12.30 గంIIవరకు **"ధార్మిక సదస్సు"**
మధ్యాహ్నం 12.30 గంIIనుండి 02.00 గంIIవరకు **"తదీయారాధన"**
03.00 గంIIనుండి 05.00 గంIIవరకు **"శోభాయాత్ర"**
సాయంత్రం 05.00 గంIIనుండి **"శ్రీకృష్ణ పూజలు, గీతాజ్యోతి ప్రతిజ్ఞ కార్యక్రమం"**

శ్రీవారి పర్యవేక్షణలో జరిగే ఈ ధార్మిక కార్యక్రమమునకు భగవద్బంధువులు వచ్చి శ్రీవారి
అనుగ్రహభాషణము శ్రవణం చేసి మంగళాశాసనములు పొందవలసినదిగా కోరుచున్నారు.

సంప్రదించవలసిన ఫోన్ నెంబరు: (08942) 286330

# రాజాం ధర్మక్షేత్రం

## ఆహ్వానము

సభాస్థలి:- **ప్రభుత్వ జూనియర్ కాలేజి.** తేది: **11-11-03**

పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ
జీయరుస్వామివారి పర్యవేక్షణలో...

ఉదయం 09.00 గంIIనుండి 12.30 గంIIవరకు **"ధార్మిక సదస్సు"**
మధ్యాహ్నం 12.30 గంIIనుండి 02.00 గంIIవరకు **"తదీయారాధన"**
03.00 గంIIనుండి 05.00 గంIIవరకు **"శోభాయాత్ర"**
సాయంత్రం 05.00 గంIIనుండి **"శ్రీకృష్ణ పూజలు, గీతాజ్యోతి ప్రతిజ్ఞ కార్యక్రమం"**

శ్రీవారి పర్యవేక్షణలో జరిగే ఈ ధార్మిక కార్యక్రమమునకు భగవద్బంధువులు వచ్చి శ్రీవారి
అనుగ్రహభాషణము శ్రవణం చేసి మంగళాశాసనములు పొందవలసినదిగా కోరుచున్నారు.

ఫోన్స్: (08941) 251144, 251100, 251034, 98480 14934





# బొబ్బిలి ధర్మక్షేత్రం

## ఆహ్వానము

సభాస్థలి:- **బొబ్బిలి రాజావారి ప్యాలెస్.** తేది: **12-11-03**

పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ
జీయరుస్వామివారి పర్యవేక్షణలో...

ఉదయం 10.00 గంIIనుండి 12.30 గంIIవరకు **"ధార్మిక సదస్సు"**
మధ్యాహ్నం 12.30 గంIIనుండి 02.00 గంIIవరకు **"తదీయారాధన"**
03.00 గంIIనుండి 05.00 గంIIవరకు **"శోభాయాత్ర"**
సాయంత్రం 05.00 గంIIనుండి **"శ్రీకృష్ణ పూజలు, గీతాజ్యోతి ప్రతిజ్ఞ కార్యక్రమం"**

శ్రీవారి పర్యవేక్షణలో జరిగే ఈ ధార్మిక కార్యక్రమమునకు భగవద్బంధువులు వచ్చి శ్రీవారి
అనుగ్రహభాషణము శ్రవణం చేసి మంగళాశాసనములు పొందవలసినదిగా కోరుచున్నారు.

సంప్రదించండి. ఫోన్స్: 08944 – 253808, 253555

# గోకవరం ధర్మక్షేత్రం

## ఆహ్వానము

సభాస్థలి:- **గోకవరం.** తేది: **14-11-03**

పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ
జీయరుస్వామివారి పర్యవేక్షణలో...

ఉదయం 10.00 గంIIనుండి 12.30 గంIIవరకు **"ధార్మిక సదస్సు"**
మధ్యాహ్నం 12.30 గంIIనుండి 02.00 గంIIవరకు **"తదీయారాధన"**
03.00 గంIIనుండి 05.00 గంIIవరకు **"శోభాయాత్ర"**
సాయంత్రం 05.00 గంIIనుండి **"శ్రీకృష్ణ పూజలు, గీతాజ్యోతి ప్రతిజ్ఞ కార్యక్రమం"**

శ్రీవారి పర్యవేక్షణలో జరిగే ఈ ధార్మిక కార్యక్రమమునకు భగవద్బంధువులు వచ్చి శ్రీవారి
అనుగ్రహభాషణము శ్రవణం చేసి మంగళాశాసనములు పొందవలసినదిగా కోరుచున్నారు.

సంప్రదించండి. ఫోన్: 0883 – 2456111

## విషయ సూచిక.....



## పంచాంగ వివరాలు

### నవంబర్

22. మాస శివరాత్రి

23. సర్వేషాం అమావాస్య

### డిసెంబర్

1. సర్వేషామేకాదశి, గీతాజయంతి

7. తిరుమంగైయాళ్వార్ తిరు॥ శ్రీ మహావిష్ణు ఆలయాలలో ద్రావిడ వేదాధ్యయన నిగమనం

8. శ్రీపాంచరాత్ర వైఖానస కృత్తికా దీపోత్సవం తిరుప్పాణియాళ్వార్ తిరు॥ శ్రీ వైష్ణవ గృహములలో ద్రావిడ వేదాధ్యయన నిగమనం

16. ధనుస్సంక్రమణం రా.8-24లకు ధనుర్మాస వ్రతారంభం

19. సర్వేషామేకాదశి

21. మాసశివరాత్రి

22. తొండరడిప్పొడియాళ్వార్ తిరు॥

23. సర్వేషాం అమావాస్య

24. తిథిద్వయం

25. తదియతిథి

**నూతన గ్రంథములు:-** తైత్తిరీయ ఆరణ్యకము, శుక్లయజుర్వేద కాణ్వక్రమ పాఠము, మైత్రాయణీ సంహిత 1,2 భాగములు. సంగ్రహ నిత్యానుసంధానము, బ్రహ్మకపాల పిండదానానంతర ప్రత్యాబ్దిక శ్రాద్ధ విధానము, త్రికాల సంధ్యావందనము, హయగ్రీవ స్తోత్రము. శ్రీవారి తిరునక్షత్ర సమయంలో ఆవిష్కరింపబడి సిద్ధముగా ఉన్నవి. వివరములకు:- శ్రీరామానుజవాణి, 11-49-136, శివాలయంవీధి, విజయవాడ-1. ఫోన్: (0866) 2420820.


మీ సేవలో....

**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 272929,

**చందావివరాలు** :- సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-, విదేశాలకు సంవత్సరచందా $ 25,

E-mail : jetsitanagaram@yahoo.com Internet : www.chinnajeeyar.org

D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం,




శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాస పత్రిక




స్వభాను నామ సంవత్సరం కార్తీకమాసం

**సంపుటి 56 2003 నవంబరు సంచిక 8**

వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు :

శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. **శ్రీరామచంద్రాచార్యులు**

సంపాదకీయం

# ఎట్లా సంపాదించాలి? ఎట్లా వ్యయం చేయాలి?



సమాజంలోని ప్రతిమనిషీ ఉన్నంతలో సుఖంగా బతకాలి. అట్లా బతికేందుకు ప్రయత్నించాలి కూడాను. ఐతే సుఖం అంటే ఏమిటి? దీనికి హద్దెక్కడ అన్నది కూడా ఆలోచించాలి.

ఒకప్పుడు వర్ణవ్యవస్థను పట్టి ఆర్జన విధానం, జీవనవిధానం ఉండేవి. నేటి సామాజిక పరిస్థితులలో ఆ విధానాలు కనబడవు.

రకరకాల బలాలను పట్టి ఏర్పడిన తారతమ్యాలేతప్ప వేరు వ్యవస్థ ఇందులో పాత్ర వహించడంలేదు.

ఏ వ్యవస్థలోనైనా మనిషికి ఆర్జనం తప్పదు. వ్యయమూ తప్పదు. ఇవి రెండూ వైయక్తికాలే అయినా ఇటు ఆర్జనంలోనూ, అటు వ్యయంలోనూ కూడా సమాజమే కొలబద్ద దీనికి ఒక కొన న్యాయము, వేరొక కొన ధర్మమూను.

వ్యక్తి ఆర్జనంలో సమాజ భద్రతకు ముప్పు రాకూడదు. వ్యయం సమాజ హితానికి కావాలి. ఎవరి ఆర్జనమూ పొరుగు వారికి నష్టాన్ని కష్టాన్ని కలిగించకూడదు. అందుకే ఆర్జనం ఎప్పుడూ న్యాయబద్ధంగా ఉండాలి. ధర్మానుమతంగా ఉండాలి. ఆర్జించిన వాని అవసరాలు తీర్చటంతో పాటు సమాజ శ్రేయస్సుకు హితానికి కూడా ఉపయోగ పడాలి.

ఆర్జనం తప్పుకాదు. ఆర్జించాలి. కణం కణం పోగు చెయ్యాలి. తేనెటీగలు మధువును ప్రోదిచేసినట్టు ధనాన్ని కూడబెట్టాలి.

కాస్త సంపాదన కంటికి కనబడుతూంటే వాడు రెండు చేతులా సంపాదిస్తున్నాడంటుంది లోకం. "ఈ రెండు చేతులా--" అర్థం బాగా సంపాదిస్తున్నాడని మాత్రమే కాదు. సవ్యాపసవ్యాలు రెండు మార్గాలా సంపాదిస్తున్నాడనీని.

ఐతే రెండు చేతులా సంపాదించటమంటే 'ఇబ్బడి'గా సంపాదించటమనే కాని అధర్మంగా, అన్యాయంగా సంపాదించమని మట్టుకు కాదు.

రెండు చేతులానే కాదు 'పదిచేతులా' సంపాదించమంటుంది శ్రుతి. అడ్డదార్లంట - దొడ్డిదార్లంట కాదు. ధర్మాన్ని న్యాయాన్ని అతిక్రమించ





కుండానే.

ఇట్లా పదిచేతుల సంపాదించిన దాన్ని వందచేతుల వితరణం కావించమంటోంది ఆ వేదమే. **'త్యాగాయ సంభృతార్థానాం'** అన్నట్లుగా ఆర్జనం వితరణం కోసమే. పోగులుపడి ఉండటంకోసం కాదు.

ధర్మాన్ని తప్పకుండా, న్యాయాన్ని దాటకుండా సంపాదన ఉండాలి. అంతేకాదు, శరీరాన్ని తెగనొవ్వజేసీ సంపాదించకూడదు. కొందరు పగలనకరేయనక ఎన్నో శ్రమలకోర్చి 'ఆర్జిత ద్రవ్యం' చేతికి వచ్చే వరకూ ఈ శరీరం నిలుస్తుందా? ఈ శ్రమను ఓరుస్తుందా? అని భయం కలిగేట్టుగా సంపాదిస్తారు. ఇది స్పృహణీయం కాదు.

శరీరం అర్థసాధనం మాత్రమే కాదు ధర్మసాధనమూను. ధర్మానుష్ఠానంకోసం నిర్దేశించబడిన పాటవాన్ని కూడా అర్థార్జనంలోనే వినియోగించేస్తే ధర్మానుష్ఠానం ఎట్లా?

కాటికి కాళ్ళు చాచేవరకూ సంపాదించనీండి. తప్పులేదు. అది లేక వీడు బతక లేనంతవరకూ తప్పులేదు. పర్యాప్త సుఖంగా జీవితం గడుస్తున్నప్పుడు కూడా శరీరాన్ని అర్థసాధన పరతంత్రంగా కూడా క్లేశపెట్టటానికి బదులు పరిపూర్ణ ధర్మ సాధనంగా వినియోగించడం ఎంతైనా అవసరం.

అర్థసాధనకు మితులుంటాయి. ధర్మానుష్ఠానానికి పరిమితులు లేవు. అర్థ సాధనలో వైయక్తిక దౌర్బల్య ప్రాబల్యాలు ఉంటాయి. ధర్మం అట్లాకాదు. ఇది వ్యక్తుల ఇష్టానిష్టాలతో శక్తియుక్తులతో సంబంధించినది కాదు. స్వతంత్రమయినది. రాగద్వేషాలకు తావులేకుండా సర్వభూత హితాన్ని చేకూర్చేది. మానవుడు మానవుడుగా చరితార్థుడు కావటానికి సర్వకాలాల్లో, సర్వదేశాలలో అవశ్యం అనుష్ఠించ వలసినది ధర్మం.

ప్రతి మనిషీ ధర్మంకోసం అర్థాన్ని ఆర్జించాలి. ఈ ఆర్జనం న్యాయంగా ఉండాలి. ధర్మానుమతం కావాలి. ఇందులో తేడాలు లేవు. ఆర్జించేవారు దీన్ని దృష్టిలో పెట్టుకొని మరీ ఆర్జించాలి.

న్యాయబద్ధం, ధర్మానుమతం కానిది పాపపు సొమ్ము. దీన్ని పరిగ్రహించటమూ పాపమే. "తనది పాపపు సొమ్ము కాదు", నిశ్శంకంగా పరిగ్రహించవచ్చునంటాడు అశ్వపతి. తన దగ్గరకు వచ్చిన ప్రాచీన శాలాది బ్రహ్మనిష్ఠులతో. ఆర్జవంలో

ఇంతటి ఆర్జవం ఉండాలి.

ఆర్జించిన దాన్ని ఎట్లా ఖర్చు చేయాలి?

అదేమిటి స్వామీ, ఇంత ఆర్జించీ ఖర్చుపెట్టటానికా? అంటారా?

అట్లా అనేవారూ లేకపోలేదు. అందుకే యీ మాట చెప్పాల్సివస్తోంది.

ఆర్జించినది వ్యయానికి కాక పాతర వెయ్యటానికి అనే వ్యక్తుల కథలు మనం వింటున్నాం, చూస్తున్నాం. ఈ పాతరలు పాపం వారికీ కావు ఎవరికౌనో, మట్టిపాలౌనో వారెరుగరు. ఈ చీమలు పెట్టిన పుట్టలు ఏ పాములకొరకో!

చెరువులో నీరు చేరేది, చేర్చేదీ తాగటానికే. కుండనీరు తీయక, చుక్క నీరు తాగక చెరువును నింపుతూ పోతూంటే ఒడ్డులనొరసిన నీటి ఒత్తిడికి గట్టుతెగి గండిపడి మొత్తం నీరుచుక్క లేకుండా కొట్టుకపోతుంది.

సంపాదన కూడా అంతే. సంపాదించు– న్యాయం తప్పక ధర్మాన్ననుసరించి వ్యయించు, పద్ధతి ప్రకారం.

“ఏడు తరాలు కాలుమీద కాలు వేసుక్కూచున్నా తరగనంత సంపద సంపాదించినాడు”– అనుకోగా వింటూంటాం. ఇట్లాంటి ఆర్జనం స్పృహణీయంకాదు.

ఇక్కడ వినియోగ లోపంవల్ల ‘ఆర్జితం’ పోగులు పడిపోయింది. అంతేకాదు ఏడుతరాల వారిని సుఖజీవనులుగా రూపొందించటం మట్టుకేకాదు అలసులుగా నిష్క్రియాపరులుగానూ నిలబెట్టింది. ఇట్లాంటి నిష్క్రియాపరుల వల్ల సమాజానికి చేటు వాటిల్లుతుంది.

చేతనులంతా నిరంతర క్రియాశీలులు కావాలి. ఈ క్రియ అర్థసాధనంతో పాటు ధర్మానుష్ఠానానికీ ఉపకరించాలి.

ఈ అర్థధర్మాలు రెండూ వ్యక్తిని పోషిస్తూ సంస్కరిస్తూ సమాజానికి శ్రేయస్సును చేకూర్చేవి కావాలి.

ఇంతకూ ఆర్జించిన దాన్ని ఎట్లా వ్యయం కావించాలి?

**ధర్మాయ యశసేఽర్థాయ ఆత్మనే స్వజనాయ చ**
**పంచధా విభజేద్విత్త మిహాముత్ర చ శోభతే,**

ఇక్కడ మంచి మనుగడ సాగించి ఉత్తమగతులు పొందాలనుకొనే బుద్ధిమంతులు న్యాయంగా ధర్మంగా ఆర్జించిన ద్రవ్యాన్ని ఐదు భాగాలుగా వినియోగించాలి.

ఆర్జనాన్ని ఐదు సమభాగాలు కావించి వాటిలో మొదటి భాగాన్ని ముందుగా ధర్మాచరణానికి తీసిపెట్టాలి.

గురుసేవనం, దేవతారాధనం పితరుల్ని, ఋషుల్ని సంభావించటం





అతిథిసేవనం దీనానాథ పరిపోషణం– ఇట్లాంటి వాటికి ముందే ఒక భాగాన్ని తీసిపెట్టాలి. ఐదు భాగాలలో మొదటిభాగం ఇది. తరవాతే మిగిలినవన్నీని. ఇది విధి. అవశ్యకర్తవ్యం. ఏదో వస్తుందని, రావాలని కాక చెయ్యాలని చేసేది.

కీర్తి, ప్రతిష్ఠలను చేకూర్చే పనులకోసం ఒకభాగం. ఇక రెండోది సమాజ శ్రేయస్సుకోసం చేసే కార్యాల వల్ల కీర్తి ప్రతిష్ఠలు లభిస్తాయి. విద్యాశాలలు, వైద్యశాలలు, శరణాలయాలు, సత్రాలు, చలివేంద్రాలు ఇట్లాంటివెన్నో సమాజ హితకరాలయిన సేవలున్నాయి. వీటికోసం రెండవ భాగం.

మూడవభాగం. దీన్ని పునస్సంపాదన కోసం పెట్టుబడిగా పెట్టాలి. ఓపిక ఉన్నంతవరకూ ఇది సాగుతూనే ఉంటుంది.

నాల్గవభాగాన్ని తనకుటుంబ పోషణానికి వాడుకోవాలి. చివరి భాగాన్ని తననాశ్రయించి, తనను నమ్ముకున్నవాళ్ళ యోగక్షేమాలకు వినియోగించాలి.

వ్యక్తినుంచి సంస్థవరకూ, సామాన్యుడి నుంచి శ్రీమాన్యుని వరకూ సర్వులూ ఇట్లాంటి వ్యయ ప్రణాళికను అనుసరిస్తే ఉన్నంతకాలం ఇక్కడ సుఖంగా ఉంటాడు కాలం చెల్లేక పరంలోనూ ఆనందాన్ని పొందుతాడు.

ఇహ పరాలకు రెండింటికీ ఉభయ తారకమైన ఉపాయం ఈ విధానం.

పునస్సంపాదన, తాను, తనవారు– ఈ మూడింటిపై మనిషి తన సంపాదనలో ఐదింట మూడువంతులు ఖర్చుచేస్తే మిగిలిన రెండింటిమీదా అంటే ధర్మంమీద, యశస్సుమీద ఐదింట రెండు వంతులు ఖర్చు చెయ్యాలన్నమాట. ఒక రకంగా ఈ 40శాతం సమాజశ్రేయస్సుకోసం వినియోగ పడినట్లే.

ఈ వ్యయ ప్రణాళికను ప్రభుత్వం వారు మనకు ప్రసాదించినది మరి ధర్మం!

మానవులంతా ఈ పద్ధతిని పాటిస్తే సామాజిక వారులభిలషించే సమ సమాజశ్రేయస్సూ, సనాతనులు కాంక్షించే ఇబ్బందులు లేని ఇహము, పరమానంద ప్రదమయిన పరమూ చేకూరుతాయని ఒక ఆశ.

**– శ్రీ రామచంద్రాచార్య**

# మహర్షుల చరిత్ర

## వైశంపాయన మహర్షి

తమిళమూలం :
వైౖ.వా. నావల్‌పాకం దేవనాథ
తాతాచార్యస్వామి



తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూపురాణి
ఉడయవర్‌స్వామి, విజయవాడ

జనమేజయుడు యజ్ఞం చేయాలని అనుకుంటూ ఉండగా అక్కడకు ఉదంకుడు అనే మహర్షి వచ్చాడు. ఉదంకుని, తక్షకుడు అనే సర్పం అనేక విధాలుగా బాధించింది. ఆ కష్టాలనుంచి ఎలాగో బయటపడ్డాడు ఉదంకుడు. కాని తక్షకునిమీద ఎలాగైనాసరే పగతీర్చుకోవాలని పట్టుదలతో ఉన్నాడు. జనమేజయుని ద్వారా ఆ పని చేయాలను కున్నాడు. ఎందుకంటే జనమేజయుడికి కూడ తక్షకుడు శత్రువే. ఎలా అంటే– జనమేజయుడి తండ్రి అయిన పరీక్షిత్తును కాటువేసి చంపినది తక్షకుడే గదా! ఆ విషయం జనమేజయుడికి జ్ఞాపకంచేసి, అతనిచేత సర్పయాగం చేయిస్తే తక్షకుడితో సహా మొత్తం సర్పజాతి అంతా నశిస్తుందని ఆలోచించాడు. వెంటనే జనమేజయుని సమీపించి “ఓ రాజా! నువ్వు అనేక యాగాలు చేస్తున్నావు. కాని నీతండ్రిని నిష్కారణంగా కరిచి చంపిన ఆ తక్షకునిమీద పగతీర్చుకొనే విషయమే ఆలోచిస్తున్నట్లు కనబడడం లేదు. వెంటనే సర్పయాగం చేసి నీ పగ తీర్చుకో, త్రిలోకాలకీ కూడ పాము కాటు బెడద ఉండదు అని, అతనిలో ప్రతీకార ఇచ్ఛను కలిగించాడు. ఆ ప్రభావంతో జనమేజయుడు సర్పయాగం చేయడానికి ఆరంభించాడు.

సర్ప జాతికి శనిపట్టింది. మంత్రశక్తిచేత పాములు, మూలమూలలో దాగినవి కూడ కట్టలు కట్టలుగా వచ్చి హోమగుండంలో పడసాగాయి. ఒకడు చేసిన తప్పిదానికి సర్పజాతికే వినాశం ఏర్పడింది. తక్షకుడు అనే సర్పంమీద ఏర్పడిన కోపంతో సర్పజాతినే నశింపచేసే యాగం ఆరంభం అయింది.

గొప్ప రక్షణలో ఉన్న పరీక్షిత్తు మహారాజునే శాపసమయం దాటేలోగా కాటేసి చంపి ఎవరికీ దొరకకుండా ఆకాశమార్గంలో తప్పించుకున్న వాడు తక్షకుడు. అలాగే అత్యంత సమర్థుడు ఆచార్య భక్తి యుక్తుడు అయిన ఉదంక మహర్షిని ముప్పుతిప్పలు పెట్టి అతనికీ దొరకకుండ తప్పించుకున్నవాడు. అటువంటి వానికి జనమేజయుని సర్ప యాగాన్నుండి తప్పించు కోవడం పెద్ద కష్టమైన పని ఏమీ కాదు. పరీక్షిత్తును చంపడంలో తాను ఋషి శాపాన్ని అమలు పరచడం మాత్రమే జరిగిందని, ఇందులో తన దోషం ఏమీ లేదని ప్రచారం చేశాడు. అందుచే ఈ సర్పయాగంలో తాను నశించవలసిన అవసరం లేదని, దేవతలతో తన వాదాన్ని వినిపించాడు. ముల్లోకాధి పతియైన దేవేంద్రుని సింహాసనానికి చుట్టబెట్టుకొని నిర్భయంగా ఉన్నాడు.

మంత్రశక్తి తక్షకునితో బాటు సింహాసనాన్ని ఇంద్రుణ్ణికూడ హోమగుండం వైపు లాగనారంభించింది. ఇప్పుడు ఇంద్రుడే హోమంలో ఆహుతి అయ్యే స్థితి ఏర్పడింది. లోకపాలకులంతా చేరి ఆలోచించారు. ఇంద్రుని విడవనంటాడు తక్షకుడు. తక్షకుడు హోమాగ్నికి దగ్ధం





అయ్యేంతవరకు హోమం మాననంటాడు ఉదంకుడు. అంతలో ఆస్తీకుడు అనే మహర్షి మధ్యవర్తిగా వచ్చి ఇద్దరికీ రాజీ కుదిర్చి పరిస్థితిని సర్దుబాటు చేశాడు. తక్షకుడు చావకుండా తప్పించు కున్నాడు.

ఈ సందర్భంలోనే ఒక మంత్రం సాక్షాత్కరించింది.

**అపసర్ప మహాసర్ప దూరం గచ్ఛ మహాయశాః।**
**జనమేజయ యజ్ఞాన్తే ఆస్తికస్య వచః స్మరన్ ॥**

విష సర్పాన్ని చూచినపుడు ధైర్యంగా ఈ మంత్రాన్ని చదివితే, ఆ పాము వారిని కరవక వెనుతిరిగి పారిపోతుందట. పై శ్లోకం ఆధారంగానే జనంలో ఈ విశ్వాసం ప్రచారమయింది.

**జనమేజయుని సర్ప యాగానికి ఫలమేమి?**

ఆస్తికుడు సర్పాలకి మేనల్లుడు. వాసుకి సోదరియైన జరత్కారు అను ఆమె కుమారుడు. అతని తండ్రిపేరు కూడా జరత్కారే. వాసుకి మొదలైనవారు జనమేజయుడు చేసే సర్పాయాగానికి భయపడి ఆస్తికునితో “ఏ విధంగా అయినా సరే ఈ యాగాన్ని నిలుపు చేయించ వలసింది'' అని ప్రార్థించారు. ఆస్తికుడు, జనమేజయ మహారాజు చేసే యజ్ఞశాలకు వెళ్ళి, జనమేజయుణ్ణి యజ్ఞశాలను అచ్చటి బ్రాహ్మణులను అనేక విధాలుగా స్తోత్రంచేసాడు. ఆనందంతో పరవసించి వరమడగమన్న జనమేజయ మహారాజును, సర్పయాగం నిలిపివేయటమే తను కోరే వరమని తెలిపి, సర్పయాగాన్ని నిలిపి వేయించాడు. తన మేనమామలైన వాసుకి మొదలైన సర్పములను సమీపించి ఈ శుభవార్త వారికి తెలియజేశాడు. వారు చాలా సంతోషించి “నీకు ఏం వరం కావాలో కోరుకో, ఇస్తాం” అన్నారు, ఆస్తికునితో.

''పాము కరచి జనం అధికంగా చనిపోతున్నారు. అట్లు జరగకుండా చేయాలి” అని జనమేజయుడు సర్పయాగం తలపెట్టాడు. అది అర్థాంతరంగా ఆగిపోయింది. అందుచే ఈ చరిత్ర చెప్పేవారిని, వినేవారిని కూడా పాములు కరవకుండ ఉండేటట్లు వరం అనుగ్రహించండి అన్నాడు ఆస్తికుడు. వారు అతడికి ఆ వరాన్ని అనుగ్రహించారు.

ఆ సమయంలో ఒక మంత్రం ఆవిర్భవించింది.

**జరత్కారోర్జరత్కార్వా, సముత్పన్నో మహా యశాః।**
**ఆస్తికస్సత్యసంథో మాం పన్నగేభ్యోభిరక్షతు ॥**

మహాభారతం 1–53–22

ఈ మంత్రాన్ని అనుసంధించుకొనే వారిని పాములు కరవకూడదు అని ఒక నియమాన్ని ఏర్పాటు చేసుకొంది సర్పజాతి.

జనమేజయుని సర్పయాగానికి ఇదే ఫలితంగా మిగిలింది.

**సర్పయాగానికి మరో ప్రయోజనం:**

జనమేజయుని సర్పయాగం లోకులకు ఒక గొప్ప ప్రయోజనాన్ని కూడ చేకూర్చింది. అదే మహాభారతం

**జడాన్ధ బధిరోన్మత్తం, తమోభూతం జగత్ భవేత్ ।**
**పరిజ్ఞాన హుతాశేన, త్వయా నోజ్జ్వలితం భవేత్ ॥**

(మహాభారతం 1–1–99)

చతుర్ముఖ బ్రహ్మ వ్యాసుని చూచి “మూఢులు, అంధులు, బధిరులు ఉన్మత్తులు లోకమంతా వ్యాపించకుండా జ్ఞానజ్యోతియైన నీ మహాభారతం కాపాడింది” అన్నాడట. కలియుగం ప్రవేశించిన తరువాత వేయి సంవత్సరాలు పరిపాలించాడు జనమేజయుడు. ఈ వేయి సంవత్సరములు కూడ ఈ మహాభారత ఇతిహాసాన్ని యాగాలలో విరామ సమయంలో వైశంపాయనుని ద్వారా ప్రవచన రూపంలో ప్రచారం చేయించాడు జనమేజయుడు. ఆయన పుణ్యప్రయత్న ఫలితంగానే ఈనాడు మనకు మహాభారత ఇతిహాసం లభించింది.



# రామాయణంలో రమ్య గాథలు

## నిశాకర ముని చెప్పిన భవిష్యవాణి

-చెవుటూరి కుసుమ కుమారి, విజయవాడ.

''వానరులారా! సీతను గురించి పూర్వమెన్నడో నాకు తెలిసిన యథార్థమును మీరు ఏకాగ్రచిత్తులై వినుడు. నేను కాలిన పక్షములతో వింధ్య పర్వతముమీద పడితిని కదా! అక్కడికి సమీపముననే ఉగ్రతపస్వి, దేవతలచేత కూడా పూజింప బడువాడు అయిన నిశాకరుడను ఋషి వుండెడివాడు. పూర్వము నేను, జటాయువు కూడా అనేకసార్లు ఆ ఋషిని దర్శించినాము. అతి కష్టముమీద నేను ఆ మహర్షి ఆశ్రమమును చేరి ఆయన దర్శనార్థం ఒక వృక్షము మొదలునందు కూర్చుండినాను.

సత్త్వ సంపన్నుడైన ఆ ఋషి పుంగవుడు స్నానము చేసి వచ్చుచుండగా పెద్దపులులు, సింహములు, ఎలుగుబంట్లు, సాధు మృగాలు, సర్పాదులు బ్రహ్మదేవుని అనుసరించి ప్రాణులు వచ్చినట్లు ఆయనను అనుసరించి, ఆశ్రమము వరకూ వచ్చి, రాజు లోనికి వెళ్ళిన తరువాత అమాత్యులు సైన్యము వెనుదిరిగి వెళ్ళిపోయినట్లు వెళ్ళిపోయినవి. కొద్దిసేపటికి నిశాకరముని తిరిగివచ్చి ''సౌమ్యుడా! సంపాతీ! నీ శరీరము మీది రోమములు కాలిపోయి వికృతమగుటచేత నిన్ను గుర్తించలేక పోతిని. గృధ్రరాజులు, వాయు వేగవంతులు, ఇచ్ఛానుసార రూపమును పొందగలవారూ అయిన మీ సోదరుల నిరువురినీ ఇంతకు పూర్వమే చూచినాను. సంపాతీ! నీవు పెద్దవాడవు. నీ తమ్ముడు జటాయువు. మీరిద్దరూ మనుష్యరూపమున నాకు ఒకపరి నమస్కరించినారు కదా! యిప్పుడు నీకేమయినది? ఏదైనా వ్యాధి వచ్చినదా? లేక ఎవరైనా దండించినారా? నాయనా! ఆ వృత్తాంతము నాకు చెప్పు"మనినాడు.

'మునివరా! నేను, జటాయువు సూర్యగమనాన్ని అనుసరించి అస్త్రాద్రి వరకు వెళ్ళవలెనని పందెము వేసుకొని గగన తలానికి ఎగిరి నేను వింధ్యగిరిమీద, జటాయువు జనస్థానమున పడినాము. రాజ్యము పోయినది. సోదరుడూ లేడు. రెక్కలు లేవు. పరాక్రమములేదు. కాలిన రెక్కలతో వ్యర్థజీవినైన నేను ఈ గిరినుండి పడి ప్రాణములు వదలెద' నని విలపించి నాను. అప్పుడా ఋషిపుంగవుడు నామీద దయ తలచి, నీకు చిన్న చిన్న కొత్తరెక్కలు పుట్టగలవు. బలము పరాక్రమము, ప్రాణశక్తి కూడా పొందగలవు. ఇంకనూ వినుము. ముందు ముందు ఒక మహత్కార్యము జరుగునని విన్నాను. నా తపోబలముచేత జరుగగల దానిని చూచినాను. అది ఏమనిన.....

**"రాజా దశరథో నామ కశ్చిదిక్ష్వాకు వర్ధనః**
**తస్య పుత్రో మహాతేజా రామోనామ భవిష్యతి"**

ఇక్ష్వాకు వంశవర్ధనుడైన దశరథుడను





రాజునకు మహాతేజ సంపన్నుడు అయిన రాముడను పుత్రుడు జన్మించును. ఆ రాముడు తండ్రి మాట పాలించుటకై, సోదరుడైన లక్ష్మణునితో కూడి అరణ్యమున వసించ గలడు. దేవతలకు కూడా చంపశక్యము గాని రావణుడను దానవరాజు జనస్థానమున అతని భార్య నపహరింప గలడు. రావణుడు అనేక సంపద్వస్తువులను, భక్ష్యములను, భోజ్యములను తెచ్చి సీతను ఆకర్షించి ప్రలోభమునకు గురిచేయవలెనని ఎంత ప్రయత్నము చేసిననూ సీత ఆ ఆహారము భుజించదు. సీతకు ఆహారము లేకుండుటను తెలుసుకున్న దేవరాజు ఇంద్రుడు

**"పరమాన్నంచ వైదేహ్యా జ్ఞాత్వా దాస్యతి వాసవః**
**యదన్న మమృత ప్రఖ్యం సురాణామపి దుర్లభమ్"**

అమృతోపమానము, దేవతలకు కూడా లభించ వీలులేనిదీ అయిన పరమాన్నమును సీతకు అందించగలడు. ఆ పాయసాన్నము ఇంద్రునివలన ఈయబడినదని తెలుసుకొనిన సీత దానిపైభాగమును తీసి రాముని కొరకై నేలమీద వుంచి

**"యది జీవతి మే భర్తా లక్ష్మణో వాపి దేవరః**
**దేవత్వం గచ్ఛతో ర్వాపి తయోరన్న మిదం త్వితి"**

నాభర్త అయిన రాముడు, నా మరిది అయిన లక్ష్మణుడు భూమిమీద జీవించి వున్ననూ, లేక స్వర్గస్థులైననూ సరే ఈ పాయసాన్నము వారిరువురకు చెందుగాక ! అని పలుకును. ఓ పక్షిరాజా! భవిష్యత్తును యింకనూ వినుము. రామకార్యార్థులైన వానరులు అచటకు రాగలరు. అప్పటివరకూ నీవు ఎక్కడికీ వెళ్ళరాదు. అయిననూ ఈ పరిస్థితిలో ఎక్కడకు వెళ్ళగలవూ! దేశకాల పరిస్థితులను అనుసరించి నిరీక్షణే కర్తవ్యము. సంపాతీ నీకు రెక్కలు తప్పక రాగలవు. నేనే నీకు రెక్కలు తెప్పించగలను. కాని ఆ దేవేంద్రునకు, దాశరథులకు, బ్రాహ్మణులకు, గురువులకు హితమైన కార్యమును చేయవలెను కదా! నాకునూ ఆ దశరథ రాకుమారులను చూడవలెననియే వున్నది. కాని, ఈడిగిలబడి ప్రాణములు చిరకాలము ధరించి వుండుట నాకు ఇష్టము లేదు. నాయనా! అందుచేత నేను ఈ ప్రాణములు విడిచిపెట్టదలచినాను. అని నాకు అనేక విధముల బోధించి స్వర్గమునకు వెళ్ళిపోయినాడు. ఇప్పటికి నూరు సంవత్సరముల నుండి మునివరుని మాటలు స్మరించుకొనుచూ కాలాను కూలము కొరకై వేచివున్నాను.



## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషిచేస్తున్న వారిలో **శ్రీ రాజారెడ్డి** ఒకరు. వీరికి శ్రీశ్రీశ్రీ స్వామివారు అనేక మంగళాశాసనములు కృపచేయుచున్నారు.



# భగవద్రామానుజ చరిత్ర

శ్రీమతి టి.కె. చూడామణి, విజయవాడ

శ్లో॥ అర్చ్యావిష్ణౌ శిలాధీ: గురుషు నరమతిః, వైష్ణవే జాతి బుద్ధిః।
విష్ణోర్వ్యావైష్ణవానాం కలిమల మథనే పాదతీర్థేంబు బుద్ధిః॥
సిద్ధే తన్నామ మంత్రే సకల కలుష హే శబ్దసామాన్య బుద్ధిః।
శ్రీశే సర్వేశ్వరేశే తదితర సమధీః యస్య వా నారకే సః॥

ఆలయాలలో దైవ విగ్రహాన్ని సామాన్యమైన రాయి అనుకోకండి గురువులను మామూలు మనుషులే అని తక్కువగా భావించకండి వైష్ణవులను వారివారి జాతిని బట్టి భావించకండి భగవత్ భాగవతశ్రీపాద తీర్థాన్ని 'ఆ ....నీరేకదా' అని తేలికగా తీసి వేయకండి. దివ్యనామాలని సామన్య శబ్దాలే అనుకోకండి. అలా భావిస్తే నరకమే లభిస్తుంది. అంతేకాదు,

శ్లో॥ శ్రీమద్భాగవతార్చనం భగవత: పూజావిధే రుత్తమం।
శ్రీవిష్ణోరవమాననాత్ గురుతరం శ్రీవైష్ణవోల్లంఘునమ్॥
తీర్థా గదచ్యుత పాదజాత్ గురుతరం తీర్థం తదీయాంఘ్రిజమ్ ।
తస్మాన్నిత్య మతంద్రితో భవ సతాం తేషాం సమారాధనే ॥

భగవంతుని పూజించడం కంటె భగవద్ భక్తుల్ని పూజించడం చాల గొప్ప. భగవంతుని నిందించిన పాపం కంటె భక్తుల నిందించిన పాపం చాలా చాలా ఎక్కువ. భగవంతుని పాద తీర్థం కంటె భక్తుని శ్రీపాదతీర్థం సేవించడం ఎన్నోజన్మల పుణ్యఫలం, కాబట్టి భగవద్భక్తుల పూజలో మీ జీవితాలు ధన్యం చేసుకోండి. అంతేగాదు.

శ్లో॥ శ్రీభాష్య ద్రవిడాగమ ప్రవచనం శ్రీశస్థలే ష్వన్వహం।
కైంకర్యం యదుశైల నిత్యవసతిః సార్థం ద్వయోచ్చారణం,
యద్వా భాగవతాభిమాన వసతిః శ్రేయ స్సతా మిత్యలం।
శిష్యాన్ ప్రాహ యతీశ్వరః పదమగాత్ విష్ణోః పరం శాశ్వతమ్॥

శ్రీభాష్యాన్ని చదవండి, అంతశక్తి లేదా, తిరువాయ్ మొళ్రికి వ్యాఖ్యానం భగవద్విషయం చదవండి! అదీ కష్టమా. పోనీ ఆలయాలలో వేంచేసి యున్న పెరుమాళ్ళ సేవలో అన్వయించండి. పోనీ... తిరు నారాయణ పురంలో నివాసం చేయండి. అదీ కష్టమే. ద్వయమంత్రాన్ని సదా ఉచ్చరించండి. లేదా ఒక భాగవతోత్తముడు మిమ్మల్ని చూచి వీడు నావాడు అని అనుకోనేలా అతని అభిమానాన్ని సంపాదించండి.

నెమ్మది నెమ్మదిగా అలసటగా ఆగి... ఆగి చెప్తున్నారు యతిరాజులు. దివ్యసూక్తులు అలా సాగిపోతున్నాయి. ఎంబారు ఒడిలో వారి శిరస్సు వెలిగిపోతోంది. ఆంధ్రపూర్ణులు అంటే వడుగనంబి ఒడిలో వారి పాదాలు విరాజిల్లుతున్నాయి. శిష్యబృందం నోట మాట రావడంలేదు. వారిని బ్రహ్మవల్లి భృగువల్లి, దివ్యప్రబంధాలు గట్టిగా చదవమన్నారు. పెరియనంబి పాదుకలను తెప్పించుకొని కన్నులకద్దుకున్నారు హృదయంలో యమునార్యులను నింపుకున్నారు. శ్రీపరాశర భట్టార్యులను శ్రీరంగనాథ దాస్య సామ్రాజ్యానికి చక్రవర్తిగా ప్రకటించారు. ఆనాడు మాఘ శుద్ధ దశమి శనివారం శిష్యులందరిని తృప్తిగా చూశారు. రామానుజులు భృగువల్లి, ఆనందవల్లి నమ్మాళ్వార్ల....తిరువాయ్‌మొళ్రి దివ్య శ్రవణం... వేద సూక్తులు, గద్యత్రయం... వరదరాజా... దివ్యసుందరమూర్తే.. శ్రీరంగనాథా... నంబెరుమాళ్.... అనుగ్రహించారా తండ్రీ... ఆచార్యా... యామునార్యా.... దా....సో...హమ్... బ్రహ్మరంధ్రమార్గ ద్వారా పరమపదం.... చేరారు భగవద్రామానుజులు. అది 1137వ సంవత్సరం 120సం॥ దీర్ఘాయుష్మంతులైన ఉడయవర్లు వైకుంఠం వేంచేశారు.





రామానుజాచార్యుల అస్తమయంతో లోకమంతా అంధకార బంధురమైంది. దాశరథి, ఆంధ్రపూర్ణుడు, గోవిందుడు, కురుకేశుడు. ఈ నలుగురు ఉత్తరక్రియలలో అన్వయించారు. కురుకేశులు పుత్రునితో సమానులు కాబట్టి శ్రీరామానుజులకు యథావిధిగా ఉత్తరక్రియలు చేశారు. శ్రీరామానుజార్య దివ్యాజ్ఞగా శ్రీ పరాశర భట్టర్ శ్రీరంగంలో శ్రీవిశిష్టాద్వైతసిద్ధాంత ప్రవర్తకులుగా అవ్యాహతంగా కొనసాగారు.

**మీ కాషాయము, మీ త్రిదండమును,**
**మీ స్మేరాంకురాస్యంబు మీ**
**శ్రీకాంతాంఘ్రి సరోజ దాస్యమును మీ**
**శ్రీభాష్యవైదుష్యమున్**
**మీ కల్యాణ గుణప్రభావమును స్వామీ**
**లక్ష్మణాచార్యయిం**
**దా కల్పాంతము నిత్యమంగళము**
**నిత్యశ్రీగ వర్ధిల్లుతన్.**

శ్రీ గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు.
(కవిగారు).

❋❋❋



# శ్రీవిష్ణు మహాపురాణం

## 8వ అధ్యాయం

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, రాజమండ్రి

### రుద్ర సృష్టి:-

రుద్ర సృష్టిని గురించి విష్ణుపురాణం ఏడవ అధ్యాయంలో సూచనగా చెప్పింది. ఈ అధ్యాయంలో విస్తృతంగా చెబుతున్నది. ముఖ్యంగా ఇతర పురాణాల్లో

ఉన్న ప్రక్రియకంటే వైష్ణవ పురాణాల్లో (సాత్త్విక పురాణాల్లో) రుద్ర సృష్టి విలక్షణంగా చెప్పబడింది. రుద్రుడు బ్రహ్మ పుత్రునిగానే నిరూపింపబడ్డాడు.

**కల్పాదావాత్మన స్తుల్యం సుతం ప్రధ్యాయత స్తతః ।**
**ప్రాదురాసీత్ ప్రభో రంకే కుమారో నీలలోహితః ॥**
**రుదన్ వై సుస్వరం సోఽథ ద్రవంశ్చ ద్విజసత్తమ ।**
**కిం రోది షీతి తం బ్రహ్మా రుదన్తం ప్రత్యువాచ హ ॥**
**నామ దేహీతి తం స్యోఽథ ప్రత్యువాచ ప్రజాపతిమ్ ।**
**రుద్రస్త్వం దేవ నామ్నాసి మారోదీ ర్ధైర్య మావాహ ॥**
**ఏవముక్తః పునస్సోఽథ సప్తనామాని వై ప్రభుః ।**
**భవం, శర్వం, మహేశానం తథా పశుపతిం ద్విజ ॥**
**భీమముగ్రం మహాదేవ ముువాచ స పితామహః ।**
**సూర్యో జలం మహీ వహ్నిః వాయు రాకాశమేవ చ ।**
**దీక్షితో బ్రాహ్మణః సోమ ఇత్యేతాః తనీవ క్రమాత్ ॥**
**సువర్చలా తథైవోమా సుకేశా, చాపరా శివా।**
**స్వాహా దిశ స్తథా దీక్షా రోహిణీ చ యథాక్రమమ్ ॥**

పైన పేర్కొన్న శ్లోకాలు రుద్ర సబంధమైన ఎన్నో విశేషాలను మనకు విశద పరుస్తున్నాయి.

కల్పాదిలో తనతో సమానమైన సామర్థ్యంకల పుత్రుడు కావాలని మనస్సులో ధ్యానిస్తున్న చతుర్ముఖ బ్రహ్మకు ఆయన ఒడిలో నీలలోహితుడైన, నల్లగా ఎర్రగా, ఉన్న కుమారుడు ఆవిర్భవించాడు. ఆ కుమారుడు ఏడుస్తూ పరుగెత్తడం ప్రారంభించాడు. ఏడున్తున్న ఆ కుమారునితో బ్రహ్మ, ఎందుకు ఏడుస్తున్నావని ప్రశ్నించాడట. దానికి ప్రతి సమాధానంగా, ఆ కుమారుడు నాకు పేరు పెట్టమని అడిగాడట.

"రోదిస్తున్నావు కనుక నీవు రుద్రుడవు. రోదించవద్దు. ధైర్యాన్ని పొందు". అని బ్రహ్మ అనగా, మళ్ళీ ఏడుసార్లు ఆతడు రోదించాడట. ఆ కారణంగా ఇతరులైన వారి ఏడు పేర్లను కూడా ఆతనికి ఏర్పరచినాడట. ఇలా ఎనిమిదిరూ





పాలుదాల్చిన రుద్రునకు ఎనిమిది స్థానాలు ఎనమండుగురు పత్నులను, బ్రహ్మ ఏర్పరచినాడు. ఆ పేర్లు భవుడు, శర్వుడు, మహేశానుడు, పశుపతి, భీముడు, ఉగ్రుడు, మహాదేవుడు మొదటినామం రుద్రుడు. రుద్రునికి సువర్చల, భవునికి ఉమ, శర్వునకు సుకేశి, మహేశానునికి శివ, పశుపతికి స్వాహ, భీమునికి దిక్, ఉగ్రానికి దీక్ష, మహదేవునికి రోహిణి క్రమంగా పత్నులైనారంటుంది శ్రీవిష్ణుమహాపురాణం. ఎనమండుగురు రుద్రులు సపత్నీకులై ఎనిమిది స్థానాల్లో ఉంటారట. ఆ స్థానాలు–

సూర్యుడు, జలం, భూమి, వహ్ని, వాయువు, ఆకాశం, యజమానుడు, హోత, చంద్రుడు. ఇందువల్లనే పరమేశ్వరునికి అష్టమూర్తి అని పేరు వచ్చింది. ఈ వర్ణణాన్ని బట్టి ఈ సృష్టిలో రుద్ర సంబంధంలేని స్థానం లేనేలేదని విస్పష్ట మవుతున్నది.

యజుర్వేదంలోని శతరుద్రీయ భాగం ఈ సృష్టి అంతా అసంఖ్యాకాలైన రౌద్ర శక్తులతో నిండి ఉన్నాయని, వాటిలో కొన్ని నాశక శక్తులు కాగా మరికొన్ని పోషక శక్తులని విశదపరుస్తున్నది. ఇక్కడ వైదిక సంవాదాన్ని మనం గుర్తింపవచ్చు

# ? సందేహాలు - సమాధానాలు ✓

**శ్రీ. రామకృష్ణ, చీరాల**

**ప్ర. సంధ్యావందనం సి.డి.లో నారాయణుని కాలస్వరూపునిగ పేర్కొన్నారు. కాలానికి రూప, గుణాలు లేవన్నారు. కొందరు శ్రీ వైష్ణవులు 'నిరాకార' అనే పదానికి వేరే అర్థం చెపుతారు. కాలమంటే భగవంతుని నిరాకార రూపమా?**

జ. భగవంతుడైన శ్రీమన్నారాయణునికి అనేక రూపాలున్నాయి. కాలాన్ని తన శరీరంగ కలిగి ఉండటం గూడ ఒక రూపమే. నిరాకారమై ఉండటం గూడ ఒక రూపమే. సాకారమై ఉండుట మరో రూపం. సగుణమై ఉండటం, నిర్గుణమై ఉండటం... ఇవన్నీ భగవంతుని రూపాలే.

భగవంతుడినైనా, మనుష్యులమైన మనము, మనలను బట్టియే ఆలోచిస్తాము తప్ప మరోలా తలువలేము. గుణాలు, రూపాలు ఉన్నాయనగానే మనలాంటివే ఉంటాయి కాబోలుననిపిస్తుంది. మనవన్నీ కర్మవల్ల ఏర్పడ్డవి, పాంచభౌతికమైనవీ కద! ఆయనకలా ఉండవు. మనవి మురికికి ఆలవాలమైనది. ఆయన వలా ఉండవు. అయితే అసలుండవా? అంటే, ఉంటాయి. అవి, ఆయనకు మాత్రమే తగినట్లు ప్రాకృతమైనవి కాకుండా, ప్రకృతి సంబంధానికి అతీతంగ, అంటే, అప్రాకృతంగ ఉంటాయన్నమాట. అందుకే ఆయన్ని 'నిర్గుణుడు' అనవచ్చు. మనవంటి పాంచ భౌతిక, ప్రాకృతిక గుణాలులేనివాడు అని అర్థం. మన రూపాలు బాల్య, యౌవ్వన, వార్థక్యములవంటి మార్పులకు లోను అవుతాయి. కాని ఆయనకి అలాంటివేమీ అంటవు. అందుకే ఆయన నిరాకారుడు.

మన బుద్ధికందనంతటి పరిశుద్ధమైన, పవిత్రమైన, అప్రాకృతమైన ఆకారం, గుణాలు, రూపాలూ ఉంటాయని వేదాలు చెపుతున్నాయి కనుక ఆయన 'సగుణుడు', దివ్య మంగళ విగ్రహ స్వరూపుడు అనవచ్చున్నమాట.

వాటితోపాటు భగవంతుడు జీవులనూ, త్రిగుణాత్మకమై ప్రకృతినీ, కేవల శుద్ధ సత్త్వ ప్రకృతినీ, సత్త్వ శూన్యమనే కాలాన్ని, ఈ నాలుగింటినీ తన శరీరంగ ధరించి ఉంటాడు. వీటన్నింటికీ తానే ఆధారమై ఉంటాడు.

త్రిగుణాత్మక ప్రకృతి అంటే ఈ లోకాలన్నింటినీ కలిగి ఉండే బ్రహ్మాండములన్నీ శాస్త్రాల్లో విరజానదికి ఇటువైపు ఉండేదిగా చెప్పబడేది, అంటే 'లీలావిభూతి' అంతా ఇందులో సత్త్వమూ, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలూ అవసరాన్ని బట్టి క్రిందిమీదవుతూ మారుతూ ఉంటాయి.





శుద్ధ సత్త్వమంటే, విరజానదికి ఆవల ఉండే పరమపదమంతా అక్కడ రజస్తమస్సులు అసలుండవు. అందుకే దాన్ని శుద్ధ సత్త్వమంటారు. 'త్రిగుణాతీతము' అనిగూడ అంటారు. ఆ ప్రకృతి అంతా పరమేష్ఠి, పుమాన్, విశ్వ, నివృత్తి, సర్వ అనే 5 శక్తులతో కూడి ఉంటుంది. జీవులంటే, కర్మబద్ధులు, ముక్తులు, నిత్యులు అని వారి వారి స్థానాన్ని బట్టి రకరకాల పేర్లుకల చేతనవర్గమంతా ఈ పైవన్నింటినీ శరీరంగానే భగవంతుడు కల్గి ఉంటాడు. మూడుగుణాలూ లేనిది కాలము. కానీ అదిగూడ ఒక పదార్థమే. అదీ అఖండమైనది. నిత్యమైనదే గూడ, దానిని మన మన అవసరాలను బట్టి నిముషం, గంట, రోజు, నెల, ఏడాది, యుగం కల్పం..... ఇలా పేర్లుపెట్టి పరిమితంగ చెప్పుకుంటున్నాము. ఇదికూడా భగవంతునికి శరీరముగనే ఉంటుంది. అంటే కాలానికీ భగవంతుడే ఆధారం. అదికూడా భగవంతుడి రూపాలలో ఒకటన్నమాటే గద! అందుకే ఆయన్ని కాలస్వరూపుడు అంటాం. కాలాన్ని శరీరంగ కలవాడని అర్థం.

అంతేతప్ప నిరాకారుడంటే కాలశరీరక పరమాత్మ కాదు. నిరాకారమంటే అర్థం వేరు. కాలస్వరూపుడంటే అర్థమూవేరు.

**శ్రీ. ఎమ్. కృష్ణమాచార్య, వీణవంక.**

**ప్ర. నా ముగ్గురు కుమారులకు క్రమంగా వయస్సు 21, 17, 14. పెద్ద వాళ్ళిద్దరికీ ఉపనయనమైంది. చిన్నవానికి గూడ చేస్తే ముగ్గురు బ్రహ్మచారులౌతారు. ఇది కూడదంటున్నారు. ఒకవేళ చేస్తే ఇంటిలోనా, దేవాలయంలోనా ఎక్కడ చేయవచ్చు?**

జ. శాస్త్రీయంగా ముగ్గురూ బ్రహ్మచారులుండరాదనే నియమంలేదు. అది ఒక ప్రాంతీయమైన ఆచారం విశ్వాసమంతే. వేదమార్గంలో ఉంటే అలాంటివేమీ పట్టించుకోనవసరంలేదు. 8వ వయస్సులోనే ఉపనయనం చేసి వేదవిద్యలో ప్రవేశింపచేయవచ్చు. అలాకాక లౌకిక విద్యలో ఉన్నాడనుకోండి, అప్పుడు ఒకనికి వివాహమయ్యేంతవరకూ వేచి ఉన్నా ఇబ్బందేమి ఉండదు. ఇక ఎప్పుడైనా, ఏ శుభకార్యమైనా స్వగృహంలో చేసుకోవడమే మంచిది. అలా వీలు కానప్పుడు మాత్రమే ఇతర చోట్లు గురించి ఆలోచించడం.

**శ్రీ కె. రామారావు, హైదరాబాదు., U. నూకరాజు, నర్సీపట్నం.**

**ప్ర. తల్లితండ్రులు పరమపదిస్తే సంవత్సరందాక పూజలు, దైవదర్శనం, ఆలయదర్శనం చేయవచ్చా? ఏ గ్రంధాలలో ఉంటుందీ విషయం? పుండ్రధారణ ఎలా?**

జ. ధర్మశాస్త్రములను స్మృతులు అంటారు. వాటిలో ఈ విషయాలన్నీ నిర్ణయిస్తారు. పితరులు పరమపదిస్తే ఆశౌచం తీరిపోయాక, గృహారాధన మామూలుగానే చేసుకోవాలి. కొందరు ఏడాదిదాక దీపం కూడా పెట్టరాదంటారు. అది తప్పు. గృహారాధన మైల సమయంలో తప్ప ఎప్పుడూ ఆపరాదు. మామూలుగా ఆలయాలు, దైవదర్శనం దోషంకాదు. ఉత్సవాలూ, విలాసాలూ పనికిరాదు. మైలసమయంలో కేవలం తెల్లబొట్టు మాత్రమే ధరించాలి. మైల తీరగానే తిరిగి ఎఱ్ఱబొట్టుతో కలిపి ఊర్ధ్వ పుండ్రమును ధరించాలి.



**శ్రీ బి. లక్ష్మీనారాయణ, కవిటి.**

**ప్ర. జాతి దుష్టాలు ఏవి? పూర్తి నిషిద్ధాలు వాటిలో ఏది?**

జ. మాంసాదులు, గ్రుడ్లు, ఉల్లి, వెల్లుల్లి మొదలైనవి జాతి దుష్టాలు. జాతిదుష్టాలన్నీ నిషిద్ధాలే. వాటల్లో మినహాయింపులేదు.



**ప్ర. గాయత్రీ మంత్రాన్ని యజ్ఞోపవీతధారకులు ఎన్నిసార్లు చేయాలి? నియమాలేమిటి?**

జ. ఉపదేశం పొంది ఉండటం, సంధ్యావందనమాచరించడమూ నియమం. మన సమయాన్నిబట్టి, 10 సార్లు, 28 సార్లు, 108 సార్లు, 1008 సార్లు ఇలా చేయవచ్చు. ఎన్నిసార్లు చేసినా కాస్త అర్థం తెలిసి ప్రేమ, విశ్వాసాలతో చేయడం మంచిది.



**శ్రీ జి.మల్లయ్య, కె.సముద్రం, సి.హెచ్. నారాయణరావు,తిర్నకొండ, కరీంనగర్.**

**ప్ర. బదరీలో పిండప్రదానం చేసాక, ఇంట్లో ఇక కూడదన్నారు. వివరాలు చెప్పలేదు. ఏమి చేయాలి? అలానే తిలదర్భలు వాడాలా, వద్దా?**

జ. బదరీలో చేసేముందు గయలో చేయాలి. పితృకార్యాలు విష్ణుపాదం వద్ద గయలో చేయడంకోసమనే పిల్లలను కనమని ధర్మశాస్త్రం చెప్తోంది. ఎందరినో కంటే ఏ ఒక్కరైనా అక్కడికి వెళ్ళగలుగుతారేమోనని. ఆ రోజుల్లో యాత్ర కఠినంగా ఉండేది. ఇప్పుడా శ్రమలేదు కనుక ఎక్కువమందిని కననవసరం లేదనుకోండి.

గయలో మాత్రమే పిండప్రదానం చేస్తే, మళ్ళా ప్రతి ఏడాదీ ఇంట్లో మామూలుగానే వాయసపిండం పెట్టడంతోపాటు క్రియ అంతా చేయాలి. మళ్ళీ గయ వెళ్ళినా అక్కడ తిరిగి చేయాలిగూడ. కానీ ఒకసారి గయలో అయ్యాక బదరీలోని బ్రహ్మకపాలంవద్ద కూడ పిండప్రదానం చేస్తే ఇక వాయసపిండం పెట్టడం ఉండదు. తిల, దర్భలు ఆ పితరుల విషయంలో మాత్రం వాడనవసరంలేదు. సంకల్ప విధానంగానే పితృకార్యాలు చేయాలి. ఇక మళ్ళీ గయలో కానీ, తిరిగి బదరీకెళ్ళినా అక్కడగానీ, మరి





వాయసపిండంతో ఆయా వ్యక్తికి మాత్రం పితృకర్మ చేయరాదు. సంకల్ప విధానంగా ఎలా చేయాలీ అనే విషయంతో మన **'రామానుజవాణి'**లో ఒక గ్రంథాన్ని ముద్రించారు. దానిలో వివరాలన్నీ ఉన్నాయి చూడండి !



**శ్రీ ఎమ్. కృష్ణారావు, ఖానాపూర్.**

**ప్ర. విష్ణువు, నారాయణుడు ఒకరేనా?**

జ. నారాయణుడు అనేది పరమాత్మకు మొదటిపేరు. అన్ని పేర్లకూ మూలభూతమైనదిగూడ. 'విష్ణు' అనేది ఆయనకుండే అనేక గుణాలలో 'వ్యాపించి ఉండువాడు' అనే ఒక లక్షణాన్ని చెప్పే పదము. ఇంద్రునికీ, సూర్యునికీ గూడ ఈ విష్ణు అనే పేరు ఉంది.



**శ్రీ. కె.జి. ఆచార్య, కె.ఎస్. అగ్రహారం.**

**ప్ర. శ్రీ వేంకటేశ్వరుని భార్య 'బీబీనాంచారమ్మ' ముస్లిం అంటారు. నిజమా?**

జ. 'బీబీనాంచార్' అనే ఆమె ముస్లిం సుల్తాన్ కుమార్తె. ఆమె 11వ శతాబ్దంలో శ్రీ రామానుజులవారి కాలంలో ఉండేది. మన పత్రికలో వచ్చిన రామానుజచరిత్రలో మీరు చదివి ఉండాలే! కర్నాటకలోని మేల్కోట క్షేత్రంలోని ఉత్సవమూర్తులను సుల్తాన్ నుండి శ్రీ రామానుజులవారు తెచ్చినపుడు, ఆతని కుమార్తె, ఆ విగ్రహంమీది ప్రేమతో వెన్నంటివచ్చి ఆ ఆలయంలో భగవంతుని విగ్రహం వద్ద శరీరత్యాగం చేసింది.

ఆ మూర్తిని విడిచి ఉండలేక ఆమెకంత ప్రేమ ఉండటాన్ని బట్టి ఆమెనూ ఆండాళ్‌తో సమంగా ఒక తాయారుగ అంగీకరించారు. అయితే ఒక విష్ణ్వాలయంలో ఉండే ఆచారం, ఆ ఆలయ ప్రామాణిక దివ్యదేశమైతే, అన్ని ఆలయాలకూ వర్తిస్తుంది కనుక, తిరుమల, శ్రీరంగం వంటి క్షేత్రాలలోనూ బీబీనాచ్చియార్ ఏర్పడింది.



**శ్రీ. ఎల్.ఎల్.ఎన్. ఆచార్య, అల్వాల్, హైదరాబాదు.**

**ప్ర. జడభరత, దత్తాత్రేయ వంటి భాగవతంలో కన్పించే అవధూతలు కలియుగంలో ఉన్నారా? అవధూత ధర్మాల్లో ఏమైనా మార్పులు కలియుగంలోనూ ఉంటాయా?**

జ. వారిలాంటి అవధూతలు ఉండరు. కానీ 'అవధూత' పేర్లు పెట్టుకొన్నవారుంటారీ కలియుగంలో. శరీర స్పృహలేనివారూ, వైరాగ్యధనులు, సర్వభూతాలతో నిర్వైరులు, తుల్య నిందాస్తుతులైనవారూ కొందరు అక్కడక్కడ మనకి గోచరిస్తారు. కానీ మీరు పైన చెప్పినవారు పరమ వైష్ణవులు అంటే విష్ణు పారమ్యాన్నంగీకరించిన

మహానుభావులు, వైదికులూకూడ, వేదధర్మాన్ని దాటనివారన్నమాట. కానీ ఇప్పుడున్న అవధూతలు దానికి పూర్తి విరుద్ధంగ ఉంటున్నారు. నిజానికలాంటివారెప్పుడూ జన బాహుళ్యానికి దూరంగా... ఉంటారు.



**శ్రీ బాపిరాజు, విశాఖపట్టణం.**

**ప్ర. శ్రీ రామాయణ, భారతాలు వ్యాస వాల్మీకులు చూచే వ్రాసారా? ఊహించి వ్రాసారా? జరిగినదే వ్రాసారా?**

జ. జరిగినదే యధాతథంగ ఇరువురూ కూడా వ్రాసారు. అందులో ఊహలకాస్కారం లేదు. దైవకృప, ఋషి ఆశీస్సులు, అలా వారు టి.వి.లో చూస్తున్నట్లుగ చూపాయి. అదే వారు దర్శిస్తూ గ్రంథస్థం చేసారు.



**ప్ర. జ్యేష్ఠాదేవి విష్ణువుకు ప్రథమ భార్యయా?**

జ. అలా ఎక్కడా లేదు. లక్ష్మీదేవియే పట్టపురాణి. మిగిలినవారంతా ఆమెకు అంశభూతులు వారిలో జ్యేష్ఠాదేవి లేదు.



**శ్రీ కె.ఎస్.ఆర్.కె. ప్రసాద్, హైదరాబాద్.**

**ప్ర. భాద్రపద శుక్ల చతుర్థి, అందరూ విఘ్ననివారకులని పూజించాలి, ఏకదంతునే కాదని సెలవిచ్చారు. వేంకటేశ్వరస్వామి పరివారంలో విఘ్ననివారకుడెవరు? వీరభద్రస్వామికెవరు?**

జ. శ్రీ వేంకటేశుడు, నారాయణుడే కనుక ఆయన నారాధించేవారికి విఘ్ననివారకుడు శ్రీ విష్వక్సేనుడే. ఇక వీరభద్రుడు శివుని పరివారంలోనివాడే తప్ప ఆయనకంటూ స్వతంత్ర ప్రతిపత్తిలేదు. శివునికి ఆరాధకులకు ఏకదంతుడైన గజాననుడే విఘ్ననివారకుడు కనుక భద్రునికీ ఆతడే కావచ్చునేమో!



**శ్రీ ఎ.కె. శేఖర్, వైజాగ్.**

**ప్ర. ప్రస్తుత ఆధ్యాత్మికత డబ్బు, పదవి, స్త్రీలు, చందాలతో మునిగి తేలుతోంది. గురువులకు సంస్థలకు అతీతశక్తులంటగట్టే పుస్తకాలు కోకొల్లలు. ఏది నమ్మాలో తెలియక విసుగు పుడుతోంది. వీరికి మీ సూచన ఏమిటి? ఈ కాలంలో 16 కళలతో భగవానుడు అవతరించి ఉన్నాడా?**

జ. అర్చామూర్తికి తప్ప, చరమూర్తిగ భగవంతుని అవతారం ఇప్పుడుండదనే గ్రంథాలు చెప్తున్నాయి. ప్రామాణిక గ్రంథాలనే నమ్మేవాళ్ళం మనం. వర్తమాన ఆధ్యాత్మికత





చాల రకాల కలగూరగంప అయిపోయిన మాట వాస్తవం. అతిపెద్ద రాజకీయ ప్రాభవంకల మఠాధిపతులే ఇవి ప్రోత్సహిస్తున్నారు. వీరికి, మీకు ఒకటే సూచన. భగవద్రామానుజులూ, ఆది శంకరులూ వంటి మహానుభావులు అందించిన ప్రామాణిక గ్రంథాలు ఇప్పటికీ లభిస్తున్నాయి. వాటిల్లో నారాయణుడే పరతత్త్వమనే దాన్ని అందరూ ముక్తకంఠంతో అంగీకరించారు. ఆ ప్రాచీన మార్గంలో నడవటమే ఎప్పటికైనా శ్రేయస్సు. మధ్యలోని పొంగులెన్ని వచ్చినా ఆయా కాలాలకే అవి పరిమితం. కానీ మన పుణ్యాచార్యుల మార్గం పొంగులేకున్నా నిలకడ కలిగినశాశ్వత మార్గము. అది నమ్ముకోండి. చాలును.



**శ్రీ ఎ. గురవయ్య, చిట్యాల.**

**ప్ర. సరస్వతి ఎవరి కుమార్తె?**

జ. చతుర్ముఖుని సృష్టిలో ఆమెగూడ ఒకర్తె. ఆమెను సృజించి, ఆ చతుర్ముఖుడు ఆమెను వివాహమాడాడు. అప్పటి సమాజం ఆ బ్రహ్మని అంగీకరించలేదు కానీ, ఆయన అలానే చేసాడని శ్రీమద్భాగవతం చెప్తోంది.



**ప్ర. నరకాసురవధ సత్యభామచే జరిగిందని, దేవీమాహాత్మ్యం దేవిచే జరిగిందనీ ఉంది. ఏది నిజం?**

జ. దేవీమాహాత్మ్యం అనేది ప్రామాణిక గ్రంథం కాదు. నరకాసురవధ వృత్తాంతం శ్రీమద్భాగవతంలో దశమ స్కంధంలో ఉంది. అది వ్యాసుడు రచించిన 18 పురాణాలలోనిది. దేవీమాహాత్మ్యం దేవీ భాగవతం వంటివి వ్యాసరచనలు కావు. ప్రామాణికాలూ కావు. పురాణాల సంఖ్యలోనివీ కావు. అవి తామసములు, శాక్తేయములున్నూ వేద బాహ్యమైన గ్రంథాలు.



**ప్ర. జపమాలలో 108 ఎందుకుంటాయి?**

జ. 1,8 కలిపితే పూర్ణ సంఖ్య '9' వస్తుంది. ఆరెంటికీ మధ్యలో పూర్ణత గుర్తుగ '0' ఉంచారు. పెరిగే రీతిలో మొదట '1' చివర '8' ఏర్పాటు చేసారు.

'1' జీవునికి గుర్తు. '8' ప్రకృతికి గుర్తు. ఈ రెంటినీ సంధించే భగవంతుడు రెంటికీ లోపల ఉంటాడు ఆయన పరిపూర్ణుడు. అందుకే '0'ను పూర్ణమంటారు తప్ప 'శూన్య' మనరు. ఈ మధ్య దానిని శూన్యమని, అదే వికృతి చేసి సున్నాగా చెపుతున్నారు. కానీ నిజానికది భగవంతుని తెలిపే పూర్ణము. అది మధ్య ఉంటే '108' అవుతుంది కద!







# బదరికాశ్రమంలో పునర్నిర్మించే సత్సంగసదనమునకు విరాళాలు సమర్పించిన దాతలు

**ఎస్. రామానుజం (విశాఖపట్నం) గారి ద్వారా:**

**మహారాజ పోషకులు:**

శ్రీమాన్ డా॥ ఎమ్.వి.వి.మురళీమోహన్–అనకాపల్లి

**జీవిత సభ్యులు:**

శ్రీమాన్ కె.సాంబశివరావు–విశాఖపట్నం, శ్రీమాన్ మారెళ్ళ విశ్వేశ్వరరావు, శ్రీమాన్ ఐ.రాజకుమార్, శ్రీమాన్ అరవిందకిషన్–పెందుర్తి, శ్రీమాన్ ఆర్.నాగేంద్ర కుమార్–విశాఖపట్నం,

**అభిమానులు:**

శ్రీమాన్ ఎన్.వి.రాయుడు–విశాఖపట్నం, శ్రీమతి కె.శకుంతల–విశాఖపట్నం, శ్రీమాన్ చిన్న అప్పన్న– విశాఖపట్నం, శ్రీమాన్ మందూరు తాండవకృష్ణ– విశాఖపట్నం, శ్రీమాన్ డా॥ కె. సూర్యనారాయణ– గోపాలపట్నం, శ్రీమాన్ ఐ.వి. కామేశ్వరరావు– గుణదల, శ్రీమాన్ ఆర్. బుచ్చిలింగం–విశాఖపట్నం, శ్రీమతి పి.లక్ష్మి–అనకాపల్లి, శ్రీమాన్ బి.రామారావు–మెదనందొడ్డి, శ్రీమతి డి.జగదాంబ–అనకాపల్లి, శ్రీమతి ఎస్. ఉమా విజయగౌరి–అనకాపల్లి, శ్రీమాన్ పి. ఓం శ్రీనివాస్–మునగపాక, శ్రీమాన్ కె.కె.విశ్వనాథం–అనకాపల్లి, శ్రీమాన్ బి. జగ్గారావు–అనకాపల్లి, శ్రీమాన్ ఎస్. సోమునాయుడు–గవరపాలెం, శ్రీమతి బి.లక్ష్మీబాయి–గవరపాలెం

**ఆఫీసు ద్వారా:-**

**పోషకులు:**

శ్రీమాన్ బి. విశ్వనాథరావు–కర్నూలు, శ్రీమతి ఎస్.వసంత–హైదరాబాదు,

**జీవిత సభ్యులు:**

శ్రీమాన్ పి. వెంకయ్య–ఎల్లారెడ్డిపేట, శ్రీమతి దాట్ల చంద్రకాంతం–గుడివాడ, శ్రీమతి ఎన్ లక్ష్మి–ఖమ్మం, శ్రీమాన్ కాలేపల్లి నాగేశ్వరరావు –రాజమండ్రి, శ్రీమతి ఎమ్.వరలక్ష్మి– జట్లపాలెం, శ్రీమాన్ ఆర్. సుబ్బారావు,లక్ష్మీదేవి– తాపేశ్వరం, శ్రీమాన్ దండే నారాయణస్వామి– అనంతపురం, శ్రీమాన్ ఎమ్. రామకృష్ణ–బెంగుళూర్, శ్రీమాన్ రాజా రామాంజనేయులు–డోన్, శ్రీమాన్ కె. నరసరాజు –అనకాపల్లి, శ్రీమాన్ చంద్రశేఖర్–ప్రొద్దుటూరు, శ్రీమతి కె. సుమతి, శ్రీమాన్ ఎన్.రాధాకృష్ణ–గ్యాంగ్‌టాక్, శ్రీమాన్ బి. అప్పలరాజు,సుభద్రమ్మ–భూపాలరాజుపాలెం, శ్రీమాన్ ఓ.వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి,

**అభిమానులు:**

శ్రీమతి కె.పుష్పావతి–ఐనంపూడి, శ్రీమాన్ ఎమ్.వీరభద్రరావు–మండపేట, శ్రీమాన్ కె. గోవిందరాజు–సేలం, శ్రీమాన్ బి.పురుషోత్తం స్వామి–దేగపావరపాలెం, శ్రీమాన్ కె.వెంకట రంగారావు–పెదపాలెం, శ్రీమాన్ కె. సత్యనారాయణ రావు– వేంపాడు, శ్రీమాన్ సూరంపల్లి శేఖర్–సికింద్రాబాదు, శ్రీమతి వి.సరస్వతి –గుడివాడ, శ్రీమతి బి. మంగతాయారు –చెన్నై, శ్రీమాన్ ఎమ్. వీరరాఘవులు–ఓళ్ళపల్లి, శ్రీమతి కె.ప్రభావతి– చిననందిపాడు, శ్రీమాన్ కాకాని హుస్సేన్– చిననందిపాడు, శ్రీమతి ఎమ్.గంగాయమ్మ –అనపర్తి, శ్రీమతి ఎ. వర్ధనమ్మ –సీతంపేట, శ్రీమతి కె.లక్ష్మి–హైదరాబాద్, శ్రీమాన్ జి.వెంకటేశ్వరరావు –సికింద్రాబాద్, శ్రీమతి బి.మంగతాయారు –మద్రాసు, శ్రీమాన్ జి. రాంబాబు–ప్రత్తిపాడు, శ్రీమాన్ వై.సురేష్–వాకాడ, శ్రీమాన్ పెందుర్తి శ్రీకృష్ణయ్య– శృంగేరి





పురం, శ్రీమాన్ కె. కృష్ణయ్య, వరలక్ష్మమ్మ– బట్టరు కాగల్లు, శ్రీమాన్ కె.వి. రంగనాథన్ –హైదరాబాదు, శ్రీమాన్ వి. వెంకట చలపతిరావు –రాజమహేంద్రి, శ్రీమాన్ ఆర్.రాజబాబు –భీమవరపుకోట, శ్రీమాన్ ఎమ్.శ్రీనివాసరావు –సికింద్రాబాద్, శ్రీమాన్ వి.ఆర్. ప్రసాద్‌బాబు –ఎల్.ఆర్.పురం, శ్రీమతి పి. వీరమ్మ– ఆర్తమూరు, శ్రీమతి కె. లక్ష్మి–ఏలూరు, శ్రీమాన్ ఆర్.వి.మురళీకృష్ణారావు–యు కొత్తపల్లి. శ్రీమతి ఆర్. లక్ష్మి–యు కొత్తపల్లి, శ్రీమాన్ డి.వి. వినోద్ కుమార్–కాకినాడ, శ్రీమాన్ కె. సూర్యనారాయణ–గోకవరం, శ్రీమాన్ తాడికొండ భద్రారావు –అంజూరు, శ్రీమాన్ కె. సుబ్బారావు–కోటిపల్లి కోట, శ్రీమాన్ కె. వెంకటసుబ్రహ్మణ్యం గుప్త–గంగవరం, శ్రీమతి ఎమ్.నారాయణమ్మ –ఏడిద సీతానగరం, శ్రీమతి ముద్దనూరు నారాయణమ్మ–ఏడిదసీతా నగరం, శ్రీమతి ఆర్. ఈశ్వరం–సోమిదేవరపాలెం, శ్రీమాన్ కె. రామకృష్ణ–గుడివాడ, శ్రీమాన్ కె. వెంకటేశ్వరరావు –కోరుకొండ, శ్రీమాన్ టి. వీరభద్ర ప్రసాద్–ప్రత్తిపాడు, శ్రీమాన్ కె. బుచ్చిరాజు– వేంపాడు, శ్రీమాన్ కె. నర్సింహరాజు,సత్యవతి–విద్యానగరం, శ్రీమతి కె. విజయలక్ష్మి–కూకట్‌పల్లి, శ్రీమాన్ నంబూరు పెదసూర్యనారాయణ–సూరంపల్లి, ఐనంపూడి పెరుమాళ్ళరాజు –వేంపాడు, శ్రీమాన్ కె. రామకృష్ణంరాజు–మాగళ్ళ, శ్రీమాన్ కె. రామచంద్రరాజు–భీమవరపుకోట, శ్రీమాన్ ఎమ్. సూర్యగోపాల రఘురామరాజు –రాజమండ్రి, శ్రీమాన్ ఎ.ఎస్.ఎన్.మూర్తి–వీరభద్రపురం, శ్రీమతి ములగపాటి వెంకట నారాయణమ్మ– ముచిమిల్లి, శ్రీమాన్ పి. మోహనకృష్ణ–తిరుపత్తూరు, శ్రీమాన్ డా॥ డి.వి.సుబ్బిరెడ్డి– కొంకుదురు, శ్రీమాన్ కె.వెంకట రామారావు–తణుకు, శ్రీమతి ఎ. లక్ష్మీకాంతమ్మ –గుంటూరు, శ్రీమాన్ కె.ఎస్.కె. నారాయణవర్మ –భీమవరం, శ్రీమతి కె.ఎస్. జానకీ దేవి–మధురై, శ్రీమతి ఆర్.వెంకటనారాయణమ్మ– చిలకలూరిపేట, శ్రీమాన్ సి.హెచ్.వెంకటేశ్వర్లు– ఒంగోలు, శ్రీమాన్ వి.ఎల్.రామ్మూర్తి–హైదరాబాద్, శ్రీమతి కె.సత్యవతి–వడ్లమూరు, శ్రీమాన్ ఆర్. గోవిందరాజులు,సరోజినిదేవి–సికింద్రాబాదు, శ్రీమాన్ ఎమ్.ఎమ్.నాయక్–మహారాష్ట్ర, శ్రీమాన్ కె.ఎ.నర్సింహాచార్యులు–బెల్గామ్, శ్రీమాన్ కె.కామేశ్వరరావు –సూళ్ళూరుపేట, శ్రీమతి ఎమ్. జగదాంబ–సికింద్రాబాద్, శ్రీమతి మామిళ్ళపల్లి లక్ష్మమ్మ–చవటపల్లి, శ్రీమాన్ ఎ. సుబ్రహ్మణ్యం –నెల్లూరు, శ్రీమాన్ ఎ. సుబ్బయ్య– నెల్లూరు, శ్రీమతి జి. చంద్రలీల, శ్రీమతి బి.టి.వి.సుభద్రమ్మ –ఉపమాక, శ్రీమాన్ డి.వి.నరసింహారావు– సత్యనారాయణపురం, శ్రీమాన్ ఎ.భాస్కరరావు– కోట్రేనుపాడు, శ్రీమాన్ ఎ.మోహనరావు–చినగంజాం, శ్రీమతి గూడూరు రేణుక,రమేష్, శ్రీమతి నండూరి తాయారమ్మ–హైదరాబాద్, శ్రీమాన్ డి.నర్సింహారావు –హైదరాబాద్, శ్రీమాన్ బి.రాధాకిషన్‌రావు –హైదరాబాద్, శ్రీమాన్ కూడూరు భూపాల్‌రెడ్డి–హైదరాబాద్, శ్రీమాన్ పి. నాగేశ్వరరావు–హైదరాబాద్, శ్రీమాన్ ఎమ్.వి.బి. వసంతరావు–హైదరాబాద్, శ్రీమాన్ కె.సీతారామాచార్యులు–మూలపర్రు, శ్రీమాన్ ఎమ్. రామకృష్ణ–చెన్నై, శ్రీమతి సూరంపల్లి విజయలక్ష్మి– విజయనగరం, శ్రీమాన్ అప్పల సూర్యనారాయణ– విజయనగరం, శ్రీమతి డా॥ ఎమ్.పావని–విశాఖ, శ్రీమతి జి.పార్వతమ్మ –యలమంచిలి, శ్రీమాన్ ఆర్. సంజీవరావు–విజయనగరం, శ్రీమాన్ నేరెళ్ళ రామ కృష్ణారావు–విజయనగరం, శ్రీమాన్ జయ రామారావు–విజయనగరం, శ్రీమతి ఎస్.వరాలమ్మ –విజయనగరం.



# ఇతిహాసబోధ-19(1)



వ్యక్తుల జీవన విధానాన్ని బట్టి మన పెద్దలు, తమోగుణ ప్రధానులు, రజోగుణ ప్రధానులు, సత్వగుణ ప్రధానులు, మూడు రకాలుగా మనల్ని గుర్తించారు. నీటిని విడచి జీవించలేని చేపల్లాగా విషయ సుఖాలను విడచి ఒక్కక్షణం కూడా బ్రతుకలేని వారు తమోగుణప్రధానులు. అలసత్వం, అశ్రద్ధ, జడత్వం వీరి సొత్తు. వీరికి బ్రతుకు అర్థాన్ని వెదికే తీరికగాని, ఓపికగాని, ప్రయత్నంగాని తెలియనే తెలియదు.

రాగ ద్వేషాల గంతలు కట్టుకోవడం వల్ల మూసుకుపోయిన జ్ఞాన నేత్రాలతో తబ్బిబ్బయ్యే ఉద్వేగ స్వభావులు రజోగుణ ప్రధానులు. వీరు అటు మధుర పదార్థాలపైన, ఇటు మలిన పదార్థాలపైనా వ్రాలి అన్నిటినీ కలగాపులగం చేసి చెడగొట్టే ఈగల్లాంటి చంచల ప్రవృత్తికలవారు.

పూవు రూపానికి, పుప్పొడికీ కూడా ప్రమాదం కలిగించకుండా మాధుర్యాన్ని మూటగట్టే తేనెటీగల్లాంటి వారు సత్త్వ గుణ ప్రధానులు. భగవదనుభవమనే తీయదనం ఎక్కడ ఉందో తెలుసుకొని దానిని పొందే ప్రవృత్తి వీరిది.

ఎప్పుడు ఏ గుణం ఆధిపత్యం వహించి ఆటాడిస్తుందో తెలియని బద్ధజీవులమైన మనం ఈ మూడు రకాలలో ఎక్కడున్నామో ఆత్మావలోకనం చేసుకుంటే బోధపడుతుంది. మనలోనూ, మన బైటా ఉన్న మాధవుడిని గుర్తించి, మన చైతన్య శక్తులను ఆయనకు సమర్పణ చేయగలగటమెలాగన్నదే మన ముందున్న అతి పెద్ద సమస్య, సవాలుకూడా. "మాధవసేవగా సర్వప్రాణిసేవ" ను మన జీవన సూత్రంగా స్వీకరించడం ద్వారా ఈ సమస్యకు, సవాలుకు తగిన జవాబును వెతుక్కోవాల్సిన బాధ్యత మనకేర్పడింది. శబ్దమూ, నిశ్శబ్దమూ అయినవాడు, నిర్వచనానికి అందీ, అందనివాడు అన్నీ ఇచ్చేవాడు, అందరిలో అన్ని కాలాలపాటు ఉన్నవాడూ అయిన భగవంతుడిని ''యజమాని''గా స్వీకరించి, ఆయన ''సేవకుడి''గా జీవించడమెలా? అసలు భగవదిచ్ఛనుగ్రహించేదెలా?

అహంకారాన్ని తృప్తి పరచడానికి ఇంద్రియ దాస్యం చేసే బలహీన మనస్కులమూ, విషయలాలసతో బుద్ధిహీనులమూ అయిన మనకు సర్వేశ్వరుని శరణాగతిచేసే క్రమమెలా విశదమౌతుంది?

భగవంతుని కార్యం మన లోపలా, బైటా కూడా విస్తరించి ఉన్నదని గ్రహించి, మన ఆలోచనలలోనూ, సంకల్పాలలోనూ, ఆవేశాలలోనూ, చిత్తవృత్తుల పునరావృతిలోనూ దృష్టిపెట్టి, మనము అహంకారాన్ని కేంద్రంగా చేసుకొని సాగించే సమస్త వ్యాపారాలు, వికారాలు, వికాసాలు కూడా మాధవునికి సమర్పితం చేసే విధానమెలా?

మన ఇచ్ఛకు, మాధవుని ఇచ్ఛకు మధ్య తేడాలేని స్థితికి, ఎటువంటి ఫలితాలు ఎదురైనా చలించక భగవదనుగ్రహ సంప్రాప్తాలుగా వాటిని స్వీకరించే స్థితికి మనం చేరేదెలా?





ఇటువంటి చిక్కు ప్రశ్నలకు సమాధానంగా తన జీవితాన్ని ఉదాహరణగా నిలిపినవాడే జ్ఞాని. కేవలం విషయాలను విని లేదా చదివి చక్కగా గుర్తుపెట్టుకొని, అందంగా ఆవిష్కరించ గలిగినంత మాత్రాన 'జ్ఞానులు' కాలేరు.

సమర్పణ దిశగా సాధన సాగనప్పుడు మనం ఎన్ని మత గ్రంథాలను వల్లెవేసినా, అది గాడిద గంధపు చెక్కలను మోయడమే అవుతుంది. దీపం వెలుతురిచ్చేదే అయినప్పటికీ అది గ్రుడ్డివాడి చేతిలో ఉంటే, అతనికికానీ, అతని ద్వారా దారి తెలుసుకోవాలనుకొనే వారికి గానీ ఎంత మాత్రమూ ఉపయోగపడదు.

దైవానికి శరణాగతి చేయడం తెలియని వ్యక్తియొక్క పాండిత్యం కూడా అంతే. అది వాని భుక్తికే తప్ప ముక్తికి ఉపయోగపడదు. ఎండమావివెంట పరుగులెట్టేవానికి దాహమెలా తీరదో, ఇలాంటి భుక్తి పండితులను ఆశ్రయించిన వారికి కూడా ఆధ్యాత్మిక దాహం తీరదు.

వేషభాషలు, కులము, హోదా, సంపద, సౌందర్యము వంటివేవీ జ్ఞానానికి కొలబద్దలు కావు. జ్ఞానిని గుర్తించి, సంశయాలను తొలగించుకొని సాధనలో ముందుకు వెళ్ళడానికి వీలుగా శ్రీకృష్ణ భగవానుడు ''అమానిత్వ, అదంభిత్వాది'' లక్షణాలను కొలబద్దలుగా మనకు తెలియజేసాడు. ఈసారి "ఇతిహాసబోధ" ద్వారా కూడా ఈ లక్షణాలను విశ్లేషించుకొనే ప్రయత్నం చేద్దాం.

పూర్వం కౌశికుడనే పరమ శ్రోత్రియ బ్రాహ్మణుడుండేవాడు. అతడు నిరంతరం వేదాధ్యయనంతో జీవితాన్ని గడిపే నిష్ఠాగరిష్ఠుడు. బాల్యమూ, యౌవనమూ గడుస్తున్నప్పటికీ గృహస్థాశ్రమంపై ప్రీతిలేక బ్రహ్మచర్యదీక్షతో అధ్యయనమే ఊపిరిగా చేసుకొని అతడు కాలం గడుపుతున్నాడు.

ఒకనాడు కౌశికుడు యథాప్రకారం చెట్టుక్రింద కూర్చుని వేదాలు వల్లెవేస్తున్నాడు. ఆచెట్టు వేదాధ్యయనం కోసం అతనికి ఎలా ఆశ్రయం ఇచ్చిందో, అలాగే ఎన్నో పక్షులకు కూడా ఆశ్రయం ఇచ్చింది. ఆచెట్టు కొమ్మపై నివసిస్తున్న ఓ కాకి యాధృచ్ఛికంగా వేసిన రెట్టక్రింద ఉన్న కౌశికునిపై పడింది.

కౌశికునికి విపరీతమైన కోపం వచ్చింది. తీక్షణంగా తల పైకెత్తి చూచాడు. ఆ చూపుల వేడిమికి కాకి విలవిల లాడుతూ నేలకూలింది. కోపం తగ్గాక కౌశికుడికి పశ్చాత్తాపం కలిగింది. "అయ్యో! అన్యాయంగా నావల్ల ఈ పక్షి మరణించిందే. నాకోపం ఎంతచేటు తెచ్చింది? ఆగ్రహాన్ని నిగ్రహించుకోలేక జీవహింసకు కారకుడనయ్యాను కదా!" అని అతడు కాసేపు చింతించాడు.

ఇంతలో మధ్యాహ్నం కావడంచేత ఎప్పటిలాగే భిక్షాటనం కోసం కౌశికుడు బ్రాహ్మణ వీధికి వెళ్ళాడు. "భిక్షాం దేహి"! అంటూ ఓ ఇంటి ముందు నిలిచాడు అతడు. ఆ ఇంటి ఇల్లాలు భిక్షను సిద్ధం చేస్తుండగా, గ్రామాంతరం వెళ్ళిన ఆమె భర్త అలసి ఆకలితో ఇంటికి వచ్చాడు. పతిభక్తి పరాయణురాలైన ఆ పడతి భర్తకు కావలసిన సౌకర్యాలన్నింటినీ అమర్చి, అతడు తృప్తిగా భోజనంచేసి, శయనించాక భిక్ష తీసుకొని వీధి గుమ్మం వద్దకు వచ్చింది.

గుమ్మం ముందు భిక్షకోసం పడికాపులు కాస్తున్న కౌశికుడు ఆమెను చూడగానే కోపంతో మండిపడుతూ, "ఎంత మదమమ్మా నీకు? భిక్షకోసం నీ ఇంటికి వచ్చిన బ్రాహ్మణున్ని నిరాదరిస్తావా? మండుటెండలో నన్నింతసేపు నీగడపముందు నిలబెడతావా"? అంటూ

గర్జించాడు.

“బ్రాహ్మణోత్తమా! మన్నించు. సతికి పతియే ప్రత్యక్ష దైవం కదా! దూర ప్రయాణంచేసి వచ్చిన నాధుడికి అమర్చవలసినవన్నీ అమర్చి వచ్చేసరికి ఆలస్యమైంది. కారణాన్ని గ్రహించి, ఈ తప్పుకాచి భిక్ష స్వీకరించండి''. అని వినయపూర్వకంగా ప్రార్థించింది గృహిణి.

''ధూర్తురాలా! ఈ పుడమిపై బ్రాహ్మణునికన్నా ఎక్కువ ఎవ్వరున్నారు? వేదవేదాంగ వేత్తనైన నేను అల్పుడనూ, నీ భర్త అధికుడూనా? దురహంకారంతో పూజ్యులను అవమానిస్తే పర్యవసానం ఎంత తీవ్రంగా ఉంటుందో తెలుసునా? బ్రాహ్మణుని రోషాగ్నికి ఈ భూమండలమే భస్మీపటలం కాగలదు జాగ్రత్త” అంటూ కనుబొమలెగరేస్తూ గృహిణిని బెదిరించాడు కౌశికుడు.

ఆ ఇల్లాలు శాంతంగా కౌశికుడిని చూస్తూ, “మహాత్మా! బ్రాహ్మణులు దేవతాసమానులనీ, తమ తపోమహిమతో వారేదైనా చేయగలరనీ నాకు తెలుసు. అయితే మనో వాక్కాయకర్మలా పతిని సేవించడమే నాకు పరమధర్మం.

ధర్మాలు, ధర్మసూక్ష్మాల మర్మాలు గ్రహించిన వాడవైతే అనవసరంగా ఇంత ఉద్రిక్తపడవు. సత్యము, అహింస, శాంతము, జితేంద్రియత్వము కలవాడే నిజమైన బ్రాహ్మణుడు. అతడు క్రోధాన్ని, మోహాన్ని దగ్గరకు రానీయడు.

వేదాధ్యయన వేత్తననే గర్వం నిన్ను కోపానికి వశుడిని చేసింది. నీ ఆగ్రహానికి బూడిదయ్యేందుకు నేను కాకినికాను. కాస్త కనువిప్పు కలిగి ప్రవర్తించు”– అని పలికింది.

ఆ పలుకులు వినగానే కౌశికుడు నిశ్చేష్టుడయ్యాడు. ''తనలా ఆమెకు వేదాధ్యయన యోగ్యత లేదు. తనలా మంత్రపూర్వక అనుష్ఠానమూ, కఠోర నియమ జీవనమూ లేదు. అయితే ఆమె పాతివ్రత్య మహిమ ఎంత అమోఘం? ఎంతో శాంతంగా, ప్రేమగా తనకు పుత్ర వాత్సల్యంతో జ్ఞానోపదేశం చేస్తున్నది. నా దోషాలను తొలగించుకునేందుకు దారికూడా ఈమే చూపాలి''– అనుకుంటూ లజ్జతో మౌనంగా కౌశికుడు ఆమెకు పాదాభివందనం చేసాడు.

“నాయనా! నీకు జ్ఞానబోధ చేయదగిన వాడు మిధిలానగరంలో ఉన్నాడు. అతడు ధర్మవ్యాధుడనే కిరాతకుడు. వెళ్ళి అతడిని శరణువేడి నీ సంశయాలను తొలగించుకో”– అని చెప్పి గృహిణి కౌశికునికి భిక్ష వేసింది.

కౌశికుడు ఆమెకు శుభం పలుకుతూ ఆలోచించుకుంటూ తన వసతికి చేరాడు. “తన అధ్యయనం, పరిశ్రమ తనను “గొప్పవాడి”ని చేసింది కాని 'జ్ఞాని' ని చేయలేదు. తన “గొప్పదనం” యొక్క డొల్లదనాన్ని ఆ గృహిణి స్పష్టంగా తెలియజేసింది. ఆమె చెప్పిన విధంగా జ్ఞానభిక్ష కోసం ధర్మ వ్యాధుడిని ఆశ్ర యించాలి” అనుకున్నాడు కౌశికుడు.

ఆ తర్వాత అతడు క్షణం ఆలస్యం చేయకుండా మిధిలా నగరానికి ప్రయాణమయ్యాడు. మిధిలా నగరంలో ధర్మవ్యాధుని చిరునామా వెతుక్కుంటూ అతడున్న చోటుకు చేరాడు.

అక్కడ అతనికి ఒళ్ళు గగుర్పాటు చెందే విధంగా అతి జుగుప్సాకరమైన దృశ్యం కనిపించింది. అది ఒక కిరాతుడి మాంసపు దుకాణం. రకరకాల జంతువుల కళేబరాలు దండల్లా అక్కడ వ్రేలాడు తున్నాయి. కోరిన వారికి కోరినట్లుగా ఆయా జంతువుల

\13/
*Mydocuments\
Bn Nov. o3.p65*



మాంసాన్ని ముక్కలు చేసి అమ్ముతున్నాడా కిరాతుడు.

తన దుకాణానికి కొద్దిగా దూరంగా తొట్రుపాటు పడుతూ, తన వైపు చూసీ, చూడలేక నిలుచున్న కౌశికుడిని గమనించాడాకిరాతుడు. తన వ్యాపారాన్ని సహాయకునికి అప్పగించి తక్షణమే కౌశికుని వద్దకు చేరి నమస్కరించాడతడు.

“బ్రాహ్మణోత్తమా! మీకిదే నా వందనం! పతివ్రతా శిరోమణి అయిన గృహిణి సూచన మేరకు నా వద్దకు వచ్చినందుకు ధన్యవాదాలు. ఈ ప్రాంతం మీబోటి వారికి ఉండతగినది కాదు. నా వసతికి దయచేయండి. అక్కడ మీ అభీష్టానుసారం వ్యవహరించవచ్చు''– అంటూ సాదరంగా కిరాతుడు కౌశికుడిని తన గృహానికి ఆహ్వానించాడు.

కౌశికునికి ఆశ్చర్యం రెట్టింపయింది. “వండి వార్చడమే యజ్ఞంగా భావించే ఆ ఇల్లాలు కాకిపై తాను చేసిన అఘాయిత్యాన్ని గ్రహించ గలిగింది. ఈ కసాయి కొట్టువాడు తానెందుకొచ్చాడో, ఎవరు పంపితే వచ్చాడో గ్రహించ గలిగాడు. అతి సామాన్య వృత్తులను నిర్వహిస్తూ కూడా, ఇంతటి అద్భుత జ్ఞానాన్ని వీరెలా పొందగలిగారో కదా!” అనుకుంటూ కౌశికుడు ధర్మవ్యాధుడిని అనుసరించాడు.

ధర్మవ్యాధుడు కౌశికుడిని తన ఇంటికి తీసుకొని వెళ్ళి భక్తి శ్రద్ధలతో పూజించాడు. ఆతని బ్రాహ్మణ భక్తికి కౌశికుడెంతో సంతోషించాడు.

“ధర్మవ్యాధా! నీవెంతో ధర్మవేత్తవని ఆ పతివ్రత తెలిపింది. అది నిజమేనని నీ ప్రవర్తన నిరూపిస్తున్నది. ధర్మసూక్ష్మాలను నీ వద్దనుండి తెలుసుకోవాలని వచ్చాను. అయితే నీ జీవనోపాధి మార్గం నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నది. అన్ని ధర్మాలలోకి ఉత్తమ ధర్మం అహింసే కదా. మరి నీవేమో హింసా పూరితమైన కసాయి దుకాణాన్ని జీవికగా చేసుకున్నావు. నీలాంటి జ్ఞానికి ఈ వృత్తి తగునా? ముందీ సందేహానికి సమాధానం చెప్పు”. అన్నాడు కౌశికుడు.

“విప్రశ్రేష్ఠా! మృగమాంసజీవనం మా కిరాతులకు వంశక్రమానుగతమైన ధర్మం. అందుచేత నా వృత్తి ధర్మాన్ని నేను పాటిస్తున్నాను. అయితే నేను జీవహింస చేయడంలేదు. ఇతరులు చంపి తెచ్చిన మాంసాన్ని తగిన వెలకుకొని, తిరిగి అమ్ముతూ జీవనాన్ని కొనసాగిస్తున్నాను.

ఇక నా జీవన విధానమంటావా?– ఏక పత్నీవ్రతుడను. పరస్త్రీలు నాకు తల్లితో సమానం. తల్లిదండ్రులు, గురువులు, వృద్ధులు, అతిధులు, విప్రులు, దేవతలు– అందరూ నాకు పూజనీయులు. సేవకులను, బంధుమిత్రులను యధోచితంగా ఆదరిస్తాను. సత్యము, ధర్మము తప్పను. అసూయాద్వేషాలను దగ్గరకు రానీయను. నిందాస్తుతులను పరిగణించను.

ధర్మాన్ని తెలుసుకోవడంకోసం మీరు నావద్దకు వచ్చారు కనుక ధర్మవిశేషాలను వివరిస్తున్నాను. సావధాన చిత్తంతో వినండి.

నిరహంకారం, శౌచం, సౌశీల్యం. అసూయ లేకపోవడం, తపం, గురుజనసేవ, యజ్ఞం– వంటివి శిష్టాచార పరాయణుడికి ఉండవలసిన లక్షణాలు. అలాంటివాడే ధార్మికుడు.

మీ సందేహ నివృత్తికాని అహింస విషయంగా కాస్త ముచ్చటించుకుందాం. ఇది

హింస, అది అహింస అని విభజనచేసి నిర్ణయించడం ఎవ్వరికీ సాధ్యమయ్యే విషయంకాదు.

పావురం మీది ప్రేమతో ఇంద్రాగ్నులకు శిబిచక్రవర్తి తన మాంసంకోసి ఇచ్చాడు. ఆలోచిస్తే ఇది మాత్రం జీవహింస కాదా! తన శరీరాన్ని హింసించుకోవడం కూడా హింసే కదా!

రంతిదేవుడు ప్రతిరోజూ రెండువేల పశువులను వధించి అతిథులకు భోజనం పెట్టేవాడట! బ్రాహ్మణులు మంత్రపూతంగా యజ్ఞాలలో పశుహింసచేసి పుణ్యఫలాలను పొందుతున్నారు. ఆ హింసను మనం ఆమోదించడంలేదా?

దైవ కార్యాలలోనూ, శ్రాద్ధాది పిత్రు కార్యాలలోనూ మాంస వినియోగాన్ని సత్కార్యంగానే ప్రాచీనులు పరిగణించారు.

ఇవన్నీ ప్రక్కన పెట్టి ఆలోచించినా, సృష్టిలో జీవహింస అనివార్యమని అర్థమౌతుంది. రైతు భూమి దున్నేటప్పుడు ఎన్నో జీవరాశులు నశిస్తూనే ఉన్నాయి. మన ఆరోగ్యం కోసం వృక్షాల బెరడులను, ఆకులను, కాయలను, వ్రేళ్ళనుకోసి మందులు తయారు చేసుకుంటున్నాం. కందమూలాలను, ఫలాలను ఆరగిస్తున్నాం. ఇదీ ఒకరకమైన ప్రాణిహింసే కదా!

హింస యొక్క ఉనికి ఈ విధంగా మనకు అణువణువునా గోచరిస్తూనే ఉన్నది. జీవన ధర్మానికి సంబంధించిన సృష్టి నియమాన్ని నిరాకరించి మన అస్తిత్వాన్ని నిలుపుకోగలమా?

కనుక హింస, అహింసలను గూర్చి మన అవగాహనలో తీవ్రమైన మార్పు ఎంతో అవసరం". అంటూ ధర్మవ్యాధుడు కౌశికునికి అహింసా తత్త్వాన్ని గూర్చి బోధించడానికి మరింత ప్రయత్నం చేసాడు. కౌశికుని సందేహానికి తగిన మేరకు మాత్రమే ఆరోజు ధర్మవ్యాధుడు అహింసను గూర్చి చర్చించాడు.

"బుద్ధిపూర్వకంగా హింస చేయవద్దనీ వీలైనంత మేరకు హింసను విడచి పెట్టడమే అహింస అనీ" అతడు కౌశికుడికి బోధించినాడు.

దేనినీ హింసించబుద్ధి కానంతగా ప్రేమించడమే అహింస అనీ, హింసించాలనే కోరికకూ, హింసించాల్సి వచ్చే అవసరానికి మధ్య తేడాను గుర్తించాలని కౌశికునికి ధర్మవ్యాధుడు తెలియజేసాడు.

అహింసతోపాటు అనేక ఇతర ముఖ్య ధర్మాలను గూర్చికూడా ధర్మవ్యాధుడు కౌశికుడికి వివరించాడు. అయితే మనం ప్రస్తుతం 'అహింస'కు సంబంధించిన అంశంపైనే మన దృష్టిని కేంద్రీకరిద్దాం.

'గీతాజ్యోతి' కార్యక్రమంలో భాగంగా మన స్వామివారు "మంచిని పెంచే శాంతి పట్టిక" ను అభ్యసించమన్నారు. అమానిత్వ, అదంభిత్వాల తర్వాత "అహింస, క్షాంతి" లు ఈ శాంతి పట్టికలో మన సాధనకోసం నిలిచి వున్నాయి. అందువల్ల అహింస పట్ల ఆచరణాత్మక దిశగా మనకు అవగాహన ఎంతో అవసరం.

కౌశికుడు గృహిణికి తలవంచిందీ ధర్మవ్యాధుని చెంత చేరిందీ ఈ అవసరాన్ని గ్రహించే కదా! అహింసకు సంబంధించి మరింత లోతుగా మనం చర్చించడంకోసం మనం వచ్చే మాసపు "ఇతిహాసబోధ" కోసం ఎదురుచూద్దాం.





# నచికేతుడు

గత సంచిక తరువాయిభాగం










# ❊ నూతన గ్రంథములు ❊

**జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ ద్వారా శ్రీవారి కర కమలములతో**

**ఆవిష్కరింపబడిన గ్రంథములు**

1). సంగ్రహ నిత్యానుసంధానము– రూ. 15/–
(దీనిలో మనం నిత్యం చదువుకొనే ముఖ్యమయిన పాశరములు ఉంటాయి.

2). బ్రహ్మకపాల పిండదానానంతర ప్రత్యాబ్దిక శ్రాద్ధ విధానము– రూ. 5/–
(దీనిలో బ్రహ్మకపాలములో పిండప్రదానము చేసిన తరువాత ఆచరించవలసిన ప్రక్రియ విశదముగా నున్నది)

3). ఆళ్వారుల చరిత్ర– రూ. 25/–
(12 మంది ఆళ్వారుల కలర్ ఫోటోలతో సంక్షేపముగా సులభశైలిలో ముద్రణ గావింపబడినది).

4). భగవద్రామానుజ చరిత్ర– రూ.
శ్రీమతి టి.కె. చూడామణిగారిచే రామానుజ చరిత్ర సంపూర్ణముగా అందరికీ అర్థమయ్యేరీతిలో రచింపబడి చక్కని చిత్రములతో ముద్రింపబడి సిద్ధముగా ఉన్నది– రూ.

5). తైత్తిరీయ ఆరణ్యక భాగము– రూ. 150/–

6). శుక్ల యజుర్వేద కాణ్వక్రమ పాఠము– రూ. 200/–

7). మైత్రాయణీ సంహిత–1వ భాగము, 2వ భాగము– రూ. 100/– (ఒక్కొక్కటి)

8). శ్రీవారు నూతనముగా అనుగ్రహించిన ప్రవచనముల ఆడియో క్యాసెట్లు

9). శ్రీవారి మారిషస్ పర్యటన. (100–00) వీడియో సి.డి.

10). శ్రీవారు గుజరాత్‌లో అపూర్వముగా నిర్మింపజేసిన గృహముల సముదాయము వీడియో సి.డి. –

11). శ్రీవారి విశ్వశాంతి విరాట్పారాయణ వీడియో సి.డి.లు లభ్యమవుతున్నవి.

ఇంకా మరెన్నో ఆధ్యాత్మిక గ్రంథములు– క్యాసెట్లు,ఆధ్యాత్మిక పరికరములకు

సంప్రదించండి:
**శ్రీరామానుజవాణి,**
11-49-136, శివాలయంవీధి, విజయవాడ-1. ఫోన్: (0866) 2420820.

# ఇది తెలుసుకుందాం !

## అనంతుడైన భగవదవతారములు పదేనా!

భక్తుల సంరక్షణకై భగవంతుడు తన సహజస్వరూపాన్ని, స్థితినీ మార్చుకొని దిగి రావడమే అవతారమంటే! ఆయా సందర్భాలలో ఆయా భక్తుల అవసరాలకి తగినట్లుగా, ఆర్తిని తీర్చగలిగేట్లుగా వ్యూహ దశనుండి మన మధ్యకి, మనకోసం స్వామి అనేకసార్లు అవతరించాడు. అలాంటి అవతారాలు ప్రధానంగా ఓ "పది" అని మన పెద్దలు చెప్తుంటారు. అవి:

**మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః**
**రామో రామశ్చ రామశ్చ కృష్ణః కల్కిరేవచ ॥**

1. మత్స్యావతారం 2. కూర్మావతారం 3. వరాహావతారం 4. నృసింహావతారం 5. వామనావతారం 6. రామావతారం 7. పరశురామావతారం 8. బలరామావతారం 9. కృష్ణావతారం 10. కల్కి అవతారం.

ఈ పది అవతారాలలో బుద్ధావతారం కూడా ఒకటని కొందరు చెప్తారు. అది మరొక పాఠాంతరం "రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కిరేవచ" అని. రామావతారం, పరశురామావతారం, కృష్ణావతారం, బుద్ధావతారం, కల్కి అవతారం అని మూడవ రామ పదానికి కృష్ణుని అర్థంగా చెప్తారు. బలరాముని అవతారంగా చెప్పరు. ఆ వాదం అలా ఉంచితే, కల్కి అవతారమంటే కలియుగదైవమైన వెంకటేశ్వరుడే అంటారు. కొందరు కల్కి ఇంకా అవతరించలేదంటూంటే, ఎందరెందరో ఎందరెందరినో కల్కి అవతారాలుగా భావించి ఆరాధనలు చేసేస్తూ ఉన్నారు. ఈ వివాదాన్ని పక్కనబెడితే, అసలీ అవతారాలు ఎన్ని విధాలు? ఏమేమిటి? అన్నది మనకి శ్రీగర్గ సంహిత మరియు శ్రీమద్భాగవతం వివరిస్తున్నాయి.

శ్రీమద్భాగవతం ప్రథమస్కదంలో 2వ అధ్యాయంలో భగవంతునియొక్క- అవతారాలు 22 అని, ఆపై అధ్యాయములో 24పైనే చెప్పి, భగవంతుడి అవతారాలు అసంఖ్యాకములు అని తెలిపింది.

**అవతారాహ్యా సంఖ్యాతా హరే స్సత్వ నిధేర్ద్విజాః ।**
**యథాఽ విదాసినః కుల్యాః సరసః స్యుః సహస్రశః ॥**

నిరంతరం ప్రవహించే సరస్సు నుండి వేలాది కాలువలు ఏర్పడుతున్నట్లుగానే అనంతమైన భగవత్తత్త్వము నుండి అనేకావతారములు ఆవిర్భవించుచున్నవి. అనగా భగవదవతారములు అపరిమితములు, అసంఖ్యేయములు అని తాత్పర్యము.

ఈ అవతారాలన్నింటికీ సూక్ష్మంగా ఆరు విధాలుగా విభజించింది శ్రీగర్గ సంహిత. 1. పరిపూర్ణావతారము 2. పూర్ణావతారము 3. ఆవేశావతారములు 4. కలావతారము 5. అంశావతారము 6. అంశాంశావతారము.





ఈ అవతారములన్నీ అనిరుద్ధ వ్యూహ స్వరూపుని నుండి వెలువడినవే.

'అంశాంశావతారము' అంటే భగవదంశలో ఏకాస్తనో కలిగి ఉండేవి. లోకంలో మనకి కన్పించే పరిపాలకులంతా, అధికారులంతా ఈ అవతార స్వరూపులే. అందుకే "నా విష్ణుః పృథివీపతిః" అంటారు. పృథివిని గోవుగా ఆయా జీవులకి కావలసినవన్నీ పాలుగా పిండిన మహాప్రభువు పృథు చక్రవర్తి ఈ అవతారమే. నాభి అనే మనువు యొక్క కుమారుడైన ఋషభుడు మొదలగువారు అంశాంశావతారములే.

అంశావతారమంటే భగవానునికి ఉండే జ్ఞాన శక్తి బల ఐశ్వర్య వీర్య తేజస్సుల్లో ఏదో ఒక గుణం తీసుకొని ఒక జీవద్వారా అనుప్రవేశించి ఉండి కార్యాలు చేయడం. మంత్ర ద్రష్టలగు ఋషులు, వశిష్ఠాది మునులు, శుకాది మహర్షులు, ఇంద్రాది దేవతలు. దక్షాది ప్రజాపతులు భగవంతుని అంశావతారములే. అంతేగాక ఆయన అంశలో ఏ లవలేశమో పొంది శ్రేష్ఠతను సంపాదించుకొన్నవి లోకములో ఎన్నో ఉన్నాయి. అవన్నీ తన అంశావతారములే అని భగవద్గీతలో స్వామే చెప్పాడు.

**"యద్యత్ విభురాతిమత్ సత్వం శ్రీమదూర్జిత మేవనా ।**
**తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవమ్ ॥"**

అని.

అలాగే విభూతి విస్తరయోగంలో అక్షరాలలో ''అకారము'' నేను అని ప్రారంభించి, వృక్షములలో అశ్వత్థము తానని, వేదాలలో సామవేదము తానని, ఇలా సృష్టిలోని ప్రతీ వర్గానికి చెందిన వాటిలో శ్రేష్ఠమైనది తానేనని చెప్పాడు స్వామి. అవన్నీ ఆయన అంశావతారములే.

కలావతారమంటే తనలో కొన్ని కళలు తీసుకొని సాక్షాత్తుగ అవతరించి ఆయా కార్యాలు నెరవేర్చుకొని వెళ్ళిపోవడం. ఆయా ఆటంకాలు తొలగించడం కోసం ఆ క్షణంలోనే అక్కడే ఆవిర్భవించే అవతారం కలావతారము. మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన అవతారములు అలాంటివే. వేద సంరక్షణకై మత్స్యమూర్తిగా ఆవిర్భవించాడు. అమృత మథన సమయంలో కూర్మరూపిగా, భూమిని ఉద్ధరించడానికి వరాహంగా ఇంద్ర సంరక్షణకై వామనునిగా, హిరణ్యకశిపుని సంహరించి, లోక రక్షణకై నరసింహునిగా స్వామి అవతరించాడు. ఇవన్నీ కలావతారములే.

ఇక ఆవేశావతారమంటే, స్వరూపమును ఆవహింప చేసి లేదా శక్తిని ఆవహింప చేయడం ద్వారా కొందరు జీవులను ప్రభావితం చేసి ధర్మసంస్థాపనము చేయడం. ఆ కార్యము పూర్తికాగానే తిరిగి ఆ శక్తిని ఉపసంహరించుకోవడం జరుగుతుంది. దుష్ట క్షత్రియులను ఏరిపారవేయడం కోసం ఏర్పడిన పరశురామావతారం స్వరూపావేశము. అలాగే భావితరాలకు వేదములు, వైదిక ధర్మాలు గ్రంథరూపంలో అందించ

డానికి వ్యాస, నారదాది ఋషులలో తన శక్తిని ఆవహింపచేసినది శక్త్యావేశము. ఆ పని పూర్తికాగానే వారినుండి ఆయా శక్తిని ఉపసంహరించుకున్నాడు. శక్త్యావేశ అవతారమైన వ్యాసుని ద్వారా వేదవిభాగం చేసి, 18 పురాణాలు, 18 ఉపపురాణాలు, ఉపనిషత్ వ్యాఖ్యాన రూపములైన బ్రహ్మసూత్రములు లోకానికి అనుగ్రహించెను. అలాగే సాంఖ్యశాస్త్రాన్ని ప్రవర్తింపచేసిన కపిలుడూ ఆవేశావతారమే.

పూర్ణావతారము అంటే మానవుడిగా ఉండటానికి అవసరమైన రసాలన్నీ పోషించింది. నవరసభరితమైన శ్రీరామావతారము పూర్ణావతారము. ఇది భగవంతుడే సాక్షాత్తుగా అవతరించి లోక రక్షణ కావించిన అవతారము.

పరిపూర్ణావతారము పై అవతారాల లక్షణాలన్నింటినీ కలిగి ఉండడమేగాక, భగవద సాధారణమైన జ్ఞాన శక్తి బలైశ్వైర్య వీర్య తేజస్సులనే షాడ్గుణ్యపూర్తి కలిగి ఉండేది. ఆయా సందర్భాలలో ఆయా గుణాలను ప్రకటించిన శ్రీకృష్ణావతారము పరిపూర్ణావతారము. సాక్షాత్ భగవానుడే అవతరించి తన భక్తులైన దేవకీ, వసుదేవులను, నంద యశోదలు, గోపికాదులను ఆనందింపచేయడమే కాక, కంసాది రాక్షస సంహారం కావించి లోకరక్షణ చేసిన అవతారమిది.. షాడ్గుణ్య పూర్తితోపాటు సౌలభ్య, సౌశీల్య, వాత్సల్యాది కళ్యాణ గుణములు, పుండరీకాక్షత్వము మొదలైన దివ్యమంగళ విగ్రహ గుణములు పరిపూర్ణముగా ప్రకాశించిన అవతారమిది.

ఇంతవరకూ ఆరువిధములైన అవతారాలు గురించి తెలుసుకున్నాం! ఇవన్ని కాకుండా శ్రీమద్భాగవతము అనుప్రవేశావ తారమని మరొకటి కూడా తెలిపింది. అంటే ప్రతిజీవిలోనూ భగవంతుడు తాను అనుప్రవేశించి ఉంటాడు. అలా ఉంటేనే ఆ జీవికి ఒక పేరు, ఆకృతి ఏర్పడతాయి. ఈ రూపంలోనే సురనర తిర్యక్ స్థావరాది సృష్టి అంతా జరిగింది. అందులో కొందరు కొందరు జీవుల ద్వారా కొన్ని కొన్ని కార్యాలు చేయిస్తుంటాడు. అది తెలుసుకోగలిగిన జీవి తనని భగవంతుని పరికరంగా భావించి ధర్మసంస్థాపనాది భగవత్కార్యంలో అతిశయించి ప్రవర్తించ గలుగుతారు వారు చేసిన గ్రంథాదులవల నైతేనేమి, చేష్టితములవల నైతేనేమి మనం వారిని గుర్తించి మహానుభావులుగా, దైవస్వ రూపులుగా ఆరాధిస్తున్నాం. వీరంతా అనుప్రదేశావ తారములే ఈ విధంగా భగవదవతారములు అనేకములు ఉంటుంటే ''పదింటిని మాత్రమే ఎందుకు చెప్పుకుంటున్నాము''? అంటే, ఒక్కొక్క అవతార రకాన్ని గుర్తించటానికి వీలుగా పదిపేర్లు చెప్పారంతే తప్ప వాటి సంఖ్య పది అని కాదు.. ఇలా 6 విధాల అవతారములను పరమాత్మ ఎందుకు ధరిస్తాడు అంటే తానే భగవద్గీతలో సమాధానమిచ్చాడు.





**"యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత।**
**అభ్యుత్థానం అధర్మస్య తదాత్మానం సృజామి"॥**

అనీ,

**"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" ॥**

అని.

ఎప్పుడెప్పుడైతే ధర్మానికి ఆటంకం ఏర్పడి, అధర్మం తలెత్తుతుందో అప్పుడప్పుడల్లా తానవతరిస్తానన్నాడు. అంతేకాక, ఆర్తితో, ప్రేమతో ఎదురుచూసే భక్తులను ఆనందపరచడానికి, వారి కష్టాలను తొలగించడానికి అవతరిస్తా నన్నాడు.

సృష్టి ఆదినుండి నేటి వరకు ఎన్ని యుగాలు గడిచాయో! ఎన్నిసార్లు స్వామి మనకోసం స్వయంగా అవతరించాడో కదా! ఇప్పటికీ మనకి ఎప్పుడే ఆపద వచ్చినా మనని రక్షిస్తూనే ఉన్నాడు ఇది "కలికాలం" కనుక తాను సాక్షాత్తుగా అవతరించనన్నాడే కానీ, మన రక్షణ దీక్ష మానుకోలేదు. మనకి ఏమాత్రం ఆటంకాలు ఏర్పడినా, కష్టాలు ఎదురైనా మన చుట్టూ ఉండే వ్యక్తులరూపంలో తన శక్తితో మనల్ని కాపాడుకుంటూనే ఉన్నాడు. అందుకే మనం కూడా ఎవరివల్లనైనా మంచి జరిగితే ''దేవుడిలా సమయానికి వచ్చి కాపాడారండీ''! అనడం వింటూంటాం! ఇంకా, "దైవం మానుషరూపేణ" అని కూడా అనుకుంటాం! ఈ కాలంలో భగవంతుడు మనలోనే తన శక్తిని నింపి తన కార్యాన్ని నెరవేరుస్తాడు. కనుక, ఆయన సంకల్పాన్ని అడ్డకుండా, అంగీకరించగలిగే సాత్వికత మనలో పెంపొందించుకోగలిగితే ప్రతి మనిషీ, భగవంతుని ఆవేశావతారమే కాగలుగుతాడు. తద్వారా లోకంలో మంచిని పెంచుతూ, ధర్మసంస్థాపకులు కాగలుగుతారు. అలాంటి స్థితిని పొందినవారు కనుకనే, మనమంతా మన ఆచార్యులని భగవత్స్వరూపులుగా భావించి, దర్శించుకుంటున్నాం. ఆచార్యులు భగవంతుని ఆవేశావతారమే! అలాంటి ఆచార్యులచే తీర్చిదిద్దబడేందుకు అంగీకరించగలిగితే మనమంతా ఆయనంతటి వారముకాగలము.

జై శ్రీమన్నారాయణ!

శ్రీ ఉ.వే. శ్రీమాన్ **పరాశర రంగరాజ భట్టర్ స్వామివారికి**

## బ్రహ్మరథ మహోత్సవము

శ్రీరంగములో ది. **4-11-2003** తేదీన కైశిక పురాణ పఠనముతో ప్రారంభమగును. **5-11-2003**న ఉ॥ **6**గం॥ల నుండి బ్రహ్మరథ మర్యాద, తిరువీధి ఉత్సవము జరుగునని శిష్యబృందము తెలిపినారు. **శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారు** మంగళాశాసనములు కృపచేసినారు.

న్యూస్

# ప్రచార వార్తలు

## 'వారిజ' విశాఖలో
## విజయదశమి వేడుకలు

మనకు సత్సంకల్పాలను కల్గింపచేసి ఆచరణ పర్యన్తం సిద్ధింపచేసి విజయవంతం చేయగల్గిన మన అమ్మ అనుగ్రహమును పొందినవారమైనందులకే మనకు సదాచార్య సమాశ్రయణం లభించింది. స్వామి అశ్వత్థరూపంగా అవతరించినపుడు, అమ్మ శమీ వృక్షరూపంగా అవతరించి ఆయనను అనుసరించిందని పెద్దలు చెప్తూంటారు. ఒక్కొక్క వృక్షం ఒక్కొక్క సమయంలో ఆయా అసాధారణ శక్తిని పరిపూర్ణంగా కలిగి ఉంటుందని వృక్షశాస్త్రం తెలియజేస్తోంది. ఈ రహస్యాన్ని గుర్తించిన వైదికులైన మన పెద్దలు, సమాజ శ్రేయస్సును కోరినవారైనందువలన ఆ దైవీ శక్తిని పూజించి మన కృతజ్ఞతను ఆవిష్కరించి తద్వారా అనుగ్రహమును పొందే విధంగా పండుగలను ఏర్పరిచారు. విశేషించి వృక్షరూపంలో భగవంతుని అమ్మను ఆరాధిస్తూ, ప్రకృతి కృతజ్ఞతను చూపడానికి విజయదశమి పండుగను ఏర్పాటు చేసారు. ఆనాడు పాండవులు తమ అత్యంత శక్తివంతమైన ఆయుధాలను శమీవృక్షంపై ఉంచి అజ్ఞాతవాసానికి వెళ్ళారని, తరువాత తిరిగి వచ్చేవరకూ ఎవరికంటా పడకుండా, ఒకవేళ కనపడినా శవంవలే కనిపిస్తూ ఉండేటట్లు ప్రార్థన చేసి, అజ్ఞాతవాసం పూర్తికాగానే ఈ విజయదశమి నాడు ఆ వృక్షానికి పూజచేసి తమ ఆయుధాలను గ్రహించి విజయపరంపరకు నాందిపలికారని మన పవిత్రమైన శ్రీమన్మహాభారతం తెలియజేస్తుంది.

అంతేకాదు శ్రీరామాయణంలో రాముడు కూడా యుద్ధానికి వెళ్ళేముందు శమీ వృక్షానికి పూజచేసి తన యుద్ధ సన్నాహాలను ప్రారంభంచేసాడని తెలియ చేస్తారు మన పెద్దలు. శ్రీ వేంకటేశుడు కూడా శమీపూజ చేసికొని పద్మావతి అమ్మవారిని పరిణయమాడే ప్రయత్నాలు ప్రారంభించాడని శ్రీ వేంకటాచల మాహాత్మ్యం తెలుపుతుంది. అంతటి విశేషము కలిగిన విజయదశమినాడు మన ఆచార్యులు అయిన శ్రీ స్వామివారి సన్నిధిలో **'వారిజ'** ఆశ్రమము విశాఖలో శమీవృక్షపూజ అత్యంత వైభవంగా జరిగింది. భగవత్సేవగా సమాజ సేవ చేయడంలో అందరికి శక్తియుక్తులు లభించాలని, మనోదౌర్బల్యం, నిరాశ, నిస్పృహలవంటి భావాలు తొలగి అందరూ కార్యోన్ముఖులు కావాలని శ్రీ స్వామివారు ఈ సందర్భంగా అందరికి మంగళాశాసనాలు కృపచేసారు. శ్రీ స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో వేద, ఆగమ, విద్యార్థులు ఈ పూజా కార్యక్రమాన్ని ఎంతో వైభవంగా జరిపించారు. **"వారిజ"** కమిటీ సభ్యులు, స్వచ్ఛందసేవకులు వచ్చి భక్తులందరికీ అవకాశం ఉన్నంతవరకూ సౌకర్యాలను ఏర్పాటు చేయడంలో తమవంతు కృషి చేసారు. అందరికీ తదీయారాధన ఎంతో ఘనంగా జరిగింది.

అదేరోజు, మన పూర్వాచార్యులలో భగవద్వైభవాన్ని తామనుభవించి తమ అనుభవాన్ని ఘనమైన గ్రంథాల రూపంగా ప్రసాదించిన ''కవితార్కిక కేసరి''– ''వేదాంతాచార్య వర్యులు" అయిన శ్రీ వేందాంత దేశికుల వారి తిరునక్షత్రం. అంతేకాదు, ఆ రోజుకి మరొక విశిష్టత కూడా ఉంది! కలియుగ దైవమై, ఏడుకొండలపై వెలసిన తిరువేంకటనాయకుని తిరునక్షత్రం కూడా ఆరోజే! ఇన్ని విశేషాలున్న ఈ శుభదినాన శ్రీ స్వామివారు విద్యార్థులందరిచేత దసరా ఉత్సవము గూర్చి తమ తమ భావాలను, తమకు తెలిసిన విషయాలను చెప్పించి, వారు చెప్పిన అనేక విశేషాలను ఆసక్తిగా వింటూ అందరికీ అనుగ్రహపూర్వక మంగళాశాసనములు చేసారు.





### ఆగమ, వేద పరీక్షలు (8 నుండి 12 వరకు)

విద్యార్థులందరూ తామధ్యయనం చేస్తున్న పాఠాలను సక్రమంగా గ్రహిస్తున్నదీ లేనిదీ తమ గురువుల సమక్షంలో ప్రతి విద్యార్థిని శ్రీ స్వామివారు స్వయంగా పరీక్ష చేసి వారు పాటించవలసిన విషయాలను ఆదేశించారు.

భగవదారాధన మొదలు బ్రహ్మోత్సవము వరకూ అధ్యయనం చేస్తున్న విద్యార్థులకు మౌఖికముగా మరియు వ్రాత పరీక్షలు మరియు క్రియా విధానంలో పరీక్షలు నిర్వహించారు.

కొంత గ్రంథాన్ని అధ్యయనం చేసిన వారి వివరాలు ఇవి.

| విషయం | పరీక్షించబడినవారు | ఉత్తీర్ణులు |
|---|---|---|
| ఋగ్వేదం– | 6 | 1 |
| శుక్ల యజుర్వేదం– | 4 | 1 |
| మైత్రాయణి– | 14 | 7 |
| కృష్ణయజుర్వేదం– | 27 | 7 |
| అథర్వ వేదం– | 2 | 1 |
| భగవదారాధన– | 37 | 13 |
| నిత్యహోమం– | 13 | 5 |
| ఉత్సవం– | 2 | 1 |

మిగిలిన విద్యార్థులు అధ్యయనం చేస్తున్న విధానాన్ని పరీక్షించి పరిశీలించి తగిన సూచనలు చేసారు. 12వ తేదీ ఆదివారంనాడు వివిధ పాఠశాలలనుండి వచ్చిన విద్యార్థులందరికీ శ్రీ స్వామివారు కులశేఖరాళ్వార్ గురించి Slide Show ద్వారా ఎన్నో విశేషాలను అనుగ్రహించారు.

### ఆగమ సదస్సు (14 నుండి 19 వరకు)

శ్రీ వైష్ణవ ఆలయాల్లో అనుసరించే శ్రీ పాంచరాత్రాగమములో నిష్ణాతులైన పండితులతో భగవన్మూర్తులకు అభిషేకములు జరిపే పద్ధతుల గూర్చి ప్రామాణిక గ్రంథాలు ఏయే విధంగా తెలియచేస్తున్నాయో పరిశీలించి ఆ ప్రయోగాన్ని తెలిపే ఒక గ్రంథరూపంగా వెలువరించుటకై ఈ సదస్సును ఏర్పాటు చేసారు. సింహాచలం, భద్రాచలం వంటి ప్రధాన ఆలయాలనుండి, కాకినాడ నుండి ఆగమాచార్యులు విచ్చేసి ఈ సదస్సులో పాల్గొన్నారు. ప్రతిరోజూ ఉదయం ఆరంభమైన సదస్సు మధ్యాహ్నం సుమారు 3 గం॥ల వరకూ కూడా జరిగి, తిరిగి సుమారు 4 గం॥ల నుండి రాత్రి 10, 11 గంటల వరకూ సుదీర్ఘంగా జరిగింది. వివిధ ఆచారాలు, ఆగమ గ్రంథాలు, ప్రమాణ గ్రంథాలు, సంహితలు, అనేక తాళపత్ర గ్రంథాలు ఈ సందర్భంగా పరిశీలించబడ్డాయి. ఎన్నో అద్భుతమైన విషయాలు ఈ సందర్భంగా చర్చించబడ్డాయి. పరమ ప్రామాణికంగా ఆ గ్రంథం రూపుదిద్దు కుంటోంది. ఒక్క కలశంతో అభిషేకం చేసే పద్ధతి నుంచి 1001 కలశాలతో చేసే ప్రక్రియలన్నీ కూడా నిర్దుష్టంగా తయారు చేసారు. ఆగమ శాస్త్ర విషయమై ఆచార్యులు, పండితులు ఆమోదించిన పరంపరానుగుణమైన పద్ధతులను, ప్రధాన ఆలయాలలోనేకాక అన్ని ఆలయాల వారికీ అందించే విధంగా, సులభంగా పాటించే విధంగా ఈ గ్రంథాన్ని తీర్చిదిద్దుతున్నారు. ఇది ఒక అపూర్వమైన సదస్సుగ గుర్తించతగినది. సమాజశ్రేయస్సుకై మన ఆచార్యులు చేసే కృషి ఎంతటిదో గుర్తించినవారిదే భాగ్యం!.

19 వ తేదీ ఆదివారం నాడు చుట్టు ప్రక్కల ఊళ్ళనుంచి కూడా ఆసక్తితో వచ్చి చేరిన విద్యార్థులందరికీ శ్రీస్వామివారు స్లైడ్ షో ద్వారా, మంచి విషయాలను ఎలా వినాలి, ఎలాగ్రహించాలి, ఏవి చూడాలి, ఎలా చూడాలి మొదలయిన విషయాలను అత్యంత ఆసక్తికరంగా చిన్న పిల్లలకు అర్థం చేసుకునే విధంగా అనుగ్రహించారు.

22 వ తేదీ సాయంత్రంతో తిరుమంత్ర, ద్వయమంత్ర, చరమశ్లోక అర్థ విశేషాలను 3నెలలుగా అనుగ్రహిస్తున్న సాయంకాల ఉపన్యాసములను సంపూర్ణం కావించారు. అది సేవించిన భక్తులందరూ శాత్తుముఱైగా శ్రీ స్వామివారికి మంగళ నీరాజనాలను అర్పించి తమ కృతజ్ఞతలను ఆవిష్కరించుకున్నారు. శ్రీస్వామివారి అపార ప్రేమకూ, అనుగ్రహానికి ముగ్ధులయ్యారు.

23వ తేదీన విద్యార్థులందరినీ తీసుకుని **"వారిజ"** కమిటీ సభ్యులైన శ్రీమాన్ బి.కె.యన్.నాయుడుగారు **అరకు లోయకు** వెళ్ళారు. అక్కడి ప్రకృతి సౌందర్యాన్ని అక్కడ ఉన్న అనేకమైన గుహలను ఇతర విశేషాలను దర్శింపచేసి రాత్రికి తిరిగి "వారిజ" ఆశ్రమానికి చేర్చారు.

శుక్రవారం 24వ తేదీన సామూహిక లక్ష్మీపూజలు నిర్వహించబడ్డాయి. వందలాది భక్తులు ఈ కార్యక్రమములో పాల్గొని మన ఆచార్యులైన శ్రీ స్వామివారు చేయిస్తుండగా, దయా స్వరూపిణి అయిన అమ్మను పూజించి తమశ్రద్ధా భక్తులను ఆవిష్కరించుకున్నారు. శ్రీస్వామివారి మంగళాశాసనముల ద్వారా అమ్మ కటాక్షాన్ని అందుకున్నారు.

"వారిజ" ఆశ్రమం శ్రీ జీయర్ స్వామివారి దివ్యపదారవింద స్పర్శచే పునీతమై భగవద్భక్తులకు,భాగవతశ్రేష్ఠులకు వైకుంఠ ధామమైనది. ఆధ్యాత్మిక కేంద్రంగా రూపుదిద్దుకుంటోంది. శ్రీ స్వామివారు చాతుర్మాస్య దీక్ష ఇక్కడ నిర్వహించడం అత్యంత భాగ్యవిశేషమని అది వారి అదృష్టమని గుర్తించిన విశాఖ మరియు చుట్టుప్రక్కల పట్టణాల,గ్రామాల భక్తులు, రవాణా వసతులు అంతంత మాత్రంగా ఉన్నా, ఎంతో శ్రద్ధతో వచ్చి ఇక్కడ జరిగే కార్యక్రమాలలో ఉత్సాహంగా పాల్గొన్నారు. అది నరక చతుర్థశి పర్వదినం, 'దీపావళి'ని ప్రసాదించిన శుభదినం.

**25వ తేదీ శనివారం దీపావళి పండుగ** శుభసందర్భముగా శ్రీస్వామివారు ఉదయం ఆరాధానా నంతరం భక్తులందరికీ మంగళాశాసనాలు అనుగ్రహించారు. దీపావళి చీకట్లను పటాపంచలు చేసినట్లు, మనలో గీతాజ్యోతులు వెలిగించుకుంటే కర్మబంధ విముక్తులమై నిత్యానందమును ఆ భగవంతుని అనుగ్రహ రూపంగా పొందవచ్చని ఉద్బోధ చేసారు. ఆ మర్నాడు జరగబోయే తిరునక్షత్ర మహోత్సవంలో పాల్గొని శ్రీస్వామివారికి తమ శుభాకాంక్షలు తెలియజేసి శ్రీస్వామివారి దివ్యానుగ్రహాన్ని పొందాలని అత్యంత ఆనందంతో విచ్చేసే భక్తుల కోలాహలంతో **"వారిజ"** ఆశ్రమం నూతన వైభవాన్ని సంతరించుకుంది. ఎంతటి మహాభాగ్యం... వారు వారు తమకు తోచిన కైంకర్యాన్ని చేస్తూ, శ్రీరాముడు జన్మించినపుడు అయోధ్యవాసులు ఊరంతటినీ అలంకరించి తమ ఇళ్ళన్నీ అలంకరించుకొని ఆట పాటలతో ఉత్సవాల్ని జరుపుకున్నట్టు "వారిజ" ఆశ్రమం అంతా భక్తులతో వారి సేవలతో శోభిల్లింది. దీపావళి నాటిరాత్రి విద్యార్థులంతా కలిసి పెరుమాళ్ళ సన్నిధిలో బాణాసంచాను కాల్చారు.

**వికాసతరంగిణి కేంద్ర సభ్యుల సమావేశం :**

5వ తేదీన అనగా దీపావళి పండుగ నాడు, శ్రీస్వామివారి సమక్షంలో వికాసతరంగిణి కేంద్ర సభ్యుల సమావేశం **"వారిజ"** ఆశ్రమంలో జరిగింది. ముందుగా, వికాసతరంగిణి వారు చేస్తున్న వివిధ సేవా కార్యక్రమాలని సమీక్షించారు. సాధారణంగా అందరూ పాటించే సంస్థాగతమైన కట్టుదిట్టాలు వికాసతరంగిణికి లేనప్పటికీ సుమారు 400 శాఖలుగా అది విస్తరించి ఎంతో చక్కని నేవలను అందిస్తోందని సభ్యులంతా ఎంతో సంతోషాన్ని ప్రకటించారు. 400పైగా శాఖలు ఉన్నా అందులో 100-150 శాఖలు చాలా ఉత్సాహంతో మంచి సేవలు అందిస్తున్నాయని మిగిలినవి, వాటికి వీలైనంత పరిధిలో కార్యక్రమాలు చేస్తున్నాయని సభ్యులు తెలియజేసారు. శ్రీ స్వామివారు మాట్లాడుతూ వి.టి. ఒక చక్కని సేవాసంస్థగా సమాజంలో





గుర్తింపు పొందిందని, దీనిని ఒక కట్టు దిట్టమైన సంస్థగా అందరికీ మరింత సేవలందించే విధంగా చెయ్యాలని సూచించారు. ఈ దిశగా వి.టి.ముఖ్య కార్యకర్త లందరికీ ఒక శిక్షణ శిబిరం ఏర్పాటు చేయ్యాలని సభ్యులు చేసిన ప్రతిపాదనను శ్రీస్వామివారు అంగీకరించారు. ఈ సందర్భంగా వీరిని మిగిలిన కమిటీల సభ్యులకు పరిచయం చేయడం సమంజసంగా ఉంటుందని, తద్వారా వి.టి. సభ్యులు మరింత మందికి బాగా సేవలు అందించే అవకాశం ఉంటుందని శ్రీస్వామివారు సూచన చేసారు. అందుకు కమిటి వారంతా తమ ఆనందాన్ని వ్యక్తం చేసారు. అయితే శిక్షణ శిబిరం ఎప్పుడు ఎక్కడ జరిగేదీ త్వరలో తెలియజేస్తామన్నారు. కమిటి సభ్యులందరికీ శ్రీస్వామివారు మంగళాశాసనాలు అనుగ్రహించారు. శాంతిమంత్రంతో సమావేశం సంపూర్ణమైంది.

**శ్రీస్వామివారి తిరునక్షత్ర విశేషాలు :**

26వ తేదీ ఆదివారం తెలతెలవారుతూనే యశోదాదేవికి కన్నయ్య జన్మించాడని తెలిసి ఊరంతా నందుని ఇంటనే ఉందిట, అలా పిల్లలూ, పెద్దలూ అందరూ చేరి శ్రీస్వామివారికి మేల్కొలుపు తోనే మంగళహారతుల నిచ్చి "పల్లాండు పల్లాండు" పాడుతూ, లోకాలనేలే పరమాత్మ యశోదమ్మ ఒడిలో పసిపాపగా ఉన్నట్టు, ఆ శ్రీమన్నారాయణుడే మన చిన్నజీయర్ స్వామివారిగా మనల్ని అనుగ్రహిస్తున్నారనే ఆనందంతో ఉత్సవవేడుకలను ఆరంభం చేసారు. శ్రీ స్వామివారు పెరుమాళ్ళ ఆరాధనానంతరం సుమారు 8.30 గం॥లకు ప్రారంభమైన తీర్థగోష్ఠి ఎంతో వేగంగా నడిపించినా 11గంటలవరకూ సాగుతూనే ఉంది. తీర్థగోష్ఠి అనంతరం శ్రీవారికి పాదపూజ జరుగవలసి ఉన్నది, కాని ఇక సమయం లేక ముందు వేదికపై కార్యక్రమాన్ని ప్రారంభించాలని నిర్ణయించారు. ఈ సంవత్సరం **"జీయర్ పురస్కార్ 2003"** తో సమ్మానించ దలచిన వేద పండితులు శ్రీమాన్ వలయపేట్టై నావల్‌పాక్కం కృష్ణరామానుజ తాతాచార్య స్వామివారిని శ్రీస్వామివారే స్వయంగా ఆహ్వానించి వెళ్తూండగా, ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథి శ్రీ వైష్ణవ సంప్రదాయాన్ని పరిరక్షించే దిశలో విశేషమైన సేవలను అనుగ్రహిస్తున్న యతీశ్వరులు పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ రంగరామానుజ జీయర్‌స్వామివారు వేంచేసారు.

ఇద్దరు దివ్య పురుషులని కలిపి సేవించే భాగ్యం భక్తులకు ఒక దివ్య అనుగ్రహమే!

జీయర్ పురస్కారాన్ని గ్రహించబోయే శ్రీమాన్ తాతాచార్య స్వామివారి శ్రీ జీయరుస్వామివారు శ్రీ రంగరామానుజ జీయరు స్వామివారికి పరిచయం చేసారు. తదనంతరం వారంతా వేదికనలంకరించారు. నాలుగు వేదశాఖలకు చెందిన విద్యార్థుల వేదశాంతి మంత్రాలతో సభ ప్రారంభమైంది. శ్రీస్వామివారు దీపారాధన కావించారు.

పార్లమెంటు సభ్యులు శ్రీమాన్ M. పద్మనాభంగారు, రాష్ట్రశాసనసభ సభ్యులు శ్రీమాన్ దయాకర్‌గారు, కాకతీయ సిమెంట్స్& షుగర్స్ JMD శ్రీమాన్ వీరయ్యగారు మహా సిమెంట్స్ అధినేత శ్రీమాన్ రామేశ్వరరావు గారు, వికాసతరంగిణి ఛైర్మన్ శ్రీమాన్ D.V.L.N. మూర్తిగారు, JET కార్యదర్శి శ్రీమాన్ గంగరాజుగారు, JET సభ్యురాలు శ్రీమతి ఆనందకుమారిగారు, విశాఖమేయర్ శ్రీమతి రాజారమణిగారు మరియు, ఎందరో ప్రముఖులు, పెద్దలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. భక్తినివేదన సంపాదకులు ఉ.వే. శ్రీమాన్ T.P. రామచంద్రాచార్యస్వామి వారు సభను ప్రారంభం చేసారు. తిరుమల తిరుపతి నుంచి శ్రీస్వామివారి తిరునక్షత్ర సందర్భంగా వేంకటేశుని దివ్యానుగ్రహమును ఆలయ మర్యాద రూపంగా తీసుకొని వచ్చిన ఆలయ ప్రధానార్చకులు శ్రీస్వామివారికి ఆ మాలను సమర్పించారు. భారతీయ తత్త్వశాస్త్ర

కళాశాలలో శిక్షణపొందిన కుమారి శారదగారు విశేష అతిథులందరినీ పరిచయం చేస్తూ వేదికపైకి ఆహ్వానించి శ్రీస్వామివారి ద్వారా మంగళా శాసనములు స్వీకరింపచేసారు.

ఆహూతులైన వేదవేత్త యొక్క పరిచయానంతరం శ్రీస్వామివారు **"జీయరు పురస్కార్ 2003"** ని ఉ.వే. శ్రీమాన్ వలయపేట్టై కృష్ణరామానుజ తాతాచార్య స్వామివారికి



అందించారు. పురస్కార పత్రంతోపాటు రూ.50,000/–లను అందచేసారు. శ్రీమాన్ తాతాచార్య స్వామివారు సుమారు గంటన్నరసేపు, వేదాలలోని అనేక రహస్యాలను విశేషాలను వివరించారు. వేదశబ్దోచ్చారణ వల్ల ఆ శబ్దం వ్యాపించినంతవరకూ ఎటువంటి దుష్టశక్తులూ క్రూరప్రవృత్తులూ ప్రవేశించజాలవని అన్నారు. వేద శబ్దరాశి అంతా, లక్ష్మీదేవితో కూడియున్న నారాయణుని రూపమేనని, ఇదే తత్త్వాన్ని వేదం అనేక చోట్ల అనేక విధాలుగా తెలియచేస్తోందని, తరించగోరిన వారంతా ఆ తత్త్వాన్నే ఉపాసన చెయ్యాలని చెప్తోందని వారు తెలిపారు. తమ ప్రసంగాన్ని సంస్కృతంలో ఆరంభం చేసినా, వినేవారందరికీ సులభంగా విషయం బోధపడాలని తమ మాతృభాషయైన తమిళ భాషలో సాగించారు. వారు చెప్పిన విశేషాలని తెలుగులోకి అనువదించారు వారి అల్లుడు. శ్రీస్వామివారు వారికి మంగళాశాససనములు కృపచేసారు. ఈ వేదపండితులు "కదిలే వైజ్ఞానిక గ్రంథాలయాలని" శ్రీస్వామివారు అభివర్ణించారు.

### అపూర్వ వేదగ్రంథముల ఆవిష్కరణ:

వైదిక వాఙ్మయాన్ని పుస్తకరూపంగా ప్రకటించే కృషి సాగిస్తోంది జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్. ఈ శుభసందర్భంగా జెట్, మూడు అపూర్వమైన వేదగ్రంథాలను ప్రచురించడం జరిగింది. **కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ ఆరణ్యకం, శుక్లయజుర్వేద కాణ్వశాఖీయ క్రమపాఠం, యజుర్వేద మైత్రాయిణీ సంహిత – 1** అనే మూడు గ్రంథాలను శ్రీస్వామివారి మంగళాశాసనములతో లోకావిష్కృతం కావించారు. శ్రీశ్రీశ్రీ త్రిదండి రంగరామానుజ జీయర్‌స్వామివారు శుక్లయజుర్వేద కాణ్వ శాఖీయ క్రమపాఠం అనే గ్రంథాన్ని ఆవిష్కరించారు. వేద పరిరక్షణకై శ్రీస్వామివారు చేస్తున్న కృషికి తమ వంతు. కైంకర్యాన్ని ఎంతో ఔదార్యంతో చక్కగా చేస్తూ **"వారిజ"** ఆశ్రమం అభివృద్ధికై తమ సేవలను అందిస్తోన్న ప్రముఖులు శ్రీమాన్ U.A.N.రాజుగారు (అప్పన్నబాబుగారు) తైత్తిరీయ ఆరణ్యకం అనే గ్రంథాన్ని ఆవిష్కరించారు. శ్రీస్వామివారు మైత్రాయిణి సంహిత–1 అనే గ్రంథాన్ని ఆవిష్కరించారు. ఇప్పటివరకు సంహిత పాఠం తప్ప క్రమపాఠం ముద్రణ ఎక్కడా జరుగలేదు. ఈ కాణ్వశాఖ క్రమపాఠం, చరిత్రలోనే, క్రమపాఠానికి చెందిన మొదటి గ్రంథం అవుతుంది. వీటిలో 2 గ్రంథములలో ఒక గ్రంథమునకు మాన్యశ్రీ కలకుంట్ల మాధవరావు గారు, వారి సతీమణి శ్రీమతి రమణమ్మ గార్ల (గ్రా. మందమర్రి) కుమార్తెలు, కుమారులు కైంకర్యం గావించారు. మరియొక (మైత్రాయణీ సంహిత) గ్రంథమును ద్వారకా తిరుమల దేవస్థానంవారు కైంకర్యం గావించారు. ఈ గ్రంథాలను ముద్రించడానికి కృషిచేసిన శ్రీరామానుజవాణి శ్రీమాన్ వేంకటాచార్యులు గారికి శ్రీస్వామివారు మంగళా శాసనములు చేసారు.





భక్తులంతా ఉత్కంఠతతో, ఎంతో ఆత్రుతతో ఎదురు చూసే శ్రీస్వామివారి అనుగ్రహ భాషణం, సంసార తాపములతో ఎండిన మనసులలో పన్నీటి వర్షం కురిసిన వైనంగా సాగింది. శక్తికొలది సాటివారికి ఇతర జీవులకూ భగవత్సేవగా తమవంతుసేవను తప్పక చెయ్యాలని శ్రీస్వామివారు పిలుపునిచ్చారు. ఉజ్జీవించగోరిన వారందరికీ ఇది భగవంతుని ఆదేశమని శ్రీస్వామివారు తెలియచేసారు. సమాజంలో ప్రతిఒక్కరూ పవిత్రమైన భరతభూమి బిడ్డలుగా ఈ దేశ సంస్కృతీ సంప్రదాయాలను పరిరక్షించుకోవాలని, తన చుట్టూ జరుగుతున్న ధర్మవిరుద్ధ కార్యకలాపాలను, ప్రధానంగా ఎలక్ట్రానిక్ ప్రసారసాధనాల ద్వారా ఇతిహాస పురాణాలతో ఉన్న విషయాలను మార్చి తమ బుద్ధికి తోచినట్లు శాస్త్ర విరుద్ధంగా 'నిపుణులం' అనుకునే ఆభాస విద్యావంతుల ఆగడాలను, స్వార్థపరమైన వారి పనులనై, తెలివైన వాళ్ళం అనుకుంటూ నహిస్తూ నిష్క్రియులుగా, ఉదాసీనులుగా ఉండిపోక మన వైదికమైన పెద్దలు అందించిన ధర్మాన్ని 'మనదే'నని గుర్తించి ఉదాసీనత వదిలి సక్రియత కల్గినవారుగా స్పందించాలని, ప్రవర్తించాలనీ అందరినీ ఆదేశించారు. మంచికి స్పందించేటటు వంటివారుగా స్పందించాలని, ప్రవర్తించాలనీ అందరినీ ఆదేశించారు. మంచికి స్పందించేటటు వంటి వాడు భగవంతునికి అత్యంతప్రీతి పాత్రుడౌతాడని అలాంటివారి ప్రతి స్పందన తనకూ, సమాజానికీ ఎంతో మేలు చేస్తుందని, అటువంటి చైతన్యం సక్రమమైన ఆధ్యాత్మిక చింతన వల్ల ఏర్పడుతుందని శ్రీస్వామివారు తెలిపారు. ఈ చైతన్యం ముఖ్యంగా పిల్లల్లోనూ, యువతలోనూ కలగాలని, అప్పుడే ధర్మం సముద్ధరింపబడుతుందని, సమాజానికి చక్కని శ్రేయస్సు కలుగుతుందని, ఈనాటి పెద్దలంతా ఒక చక్కని సమాజ వ్యవస్థ వల్ల తాము లాభం పొందుతున్న విషయాన్ని స్మరిస్తూ తమవంతు సేవను భగవత్సేవాభావంతో సమాజానికి చెయ్యాలని, నరకుడు ఎంతో గొప్ప విజ్ఞాన వేత్తయని, కాని, అది భగవద్భక్తులను హింసించుటకు ఉపయోగపడినందున వానిని శ్రీకృష్ణుడే తొలగించాడనీ, అదే మనకు చీకట్లను తొలగించిన 'దీపావళి' అని, భగవత్సేవగా సమాజసేవ, భగవత్సేవగా సర్వప్రాణి సేవ మనలను అత్యున్నత పథంలో నడిపిస్తుందని, ఉజ్జీవింప చేస్తుందని, అటువంటి శక్తిని భగవంతు డనుగ్రహించాలని శ్రీస్వామివారు మంగళా శాసనములు చేసారు.

తిరుపతి, సింహాచలం, భద్రాచలం మొదలైన దివ్యక్షేత్రాలనుంచి పెరుమాళ్ళ అనుగ్రహ పూర్వకమైన మర్యాదలను ఆయాక్షేత్రాలనుంచి విచ్చేసిన ప్రధాన అర్చకస్వాములు శ్రీస్వామివారికి సమర్పించారు. దక్షిణదేశంలోని సుమారు 60 దివ్యక్షేత్రాలనుంచి మర్యాదలను శ్రీస్వామివారికి సమర్పించారు శ్రీమాన్ మాధవన్ స్వామి, చెన్నై. అనేక దేవాలయాల నుండి శ్రీస్వామివారికి ఆలయ మర్యాదలు సమర్పించుటకై విచ్చేసిన వారందరినీ శ్రీస్వామివారు సమ్మానించి సత్కరించి మంగళాశాసనములు అనుగ్రహించారు.

వేదికపై కార్యక్రమం పూర్తి అయ్యేటప్పటికి దాదాపు సాయంత్రం అయ్యింది. శ్రీస్వామివారి చెదరని చిరునవ్వుల పలుకరింపులను, వారి మంగళాశాసనములను అందుకుని అనంతరం భక్తులంతా తదీయారాధనలో అన్వయించి, ప్రసాదాలను స్వీకరించి వెళ్ళారు. చీకటిపడగానే బాణాసంచాతో సిద్ధమైనారు. మండపేట నుండి వచ్చిన కార్యకర్తల బృందంవారు, రకరకాల రంగురంగుల కాంతి పుంజాలను వెదజల్లే ఆ విన్యాసాలను విద్యార్థులందరితో కలసి శ్రీస్వామివారు తిలకించారు. వారికున్న శ్రద్ధా భక్తులకు శ్రీస్వామివారు అనేక మంగళా శాసనాలు చేసారు.

అన్ని కార్యక్రమాలు ఎంతో వైభవంగా

జరిగాయి కానీ శ్రీస్వామివారికి చేసే పాదపూజ ఇంకా జరగాల్సి ఉందని అందరూ కోరడంతో శ్రీస్వామివారు అంగీకరించి వారిని అనుగ్రహించారు. శ్రీస్వామివారి తిరునక్షత్ర శుభసందర్భంగా, విద్యార్థులూ, భక్తులూ, అంతా కలసి శ్రీవారికి పాదపూజను భక్తిశ్రద్ధలతో చేసారు.

ఇంతటి వైభవంతో "వారిజ"లో శ్రీస్వామివారి తిరునక్షత్ర మహోత్సవం జరిగింది.

27వ తేదీ సాయంత్రం, వివిధ ఆటలపోటీలలో విజయాన్ని సాధించిన విద్యార్థులందరికీ బహుమతి ప్రదానం చేసారు శ్రీస్వామివారు.

29వ తేదీన, వేద, ఆగమ పరీక్షలలో ఉత్తమ ఫలితాలను పొందిన వారికి బహుమతి ప్రదానం చేసారు శ్రీస్వామివారు.

**బదరీ కమిటీ సమావేశం** : బదరి అష్టాక్షరీ క్షేత్రీయ అన్నదాన శాఖాసంఘం వారి సర్వసభ్య సమావేశం **"వారిజ"** ఆశ్రమంలో శ్రీస్వామివారి సమక్షంలో జరిగింది. ఈ సంవత్సరం బెంగుళూరుకు చెందిన శ్రీమాన్ చౌదరిగారు, BAKAAS కు 80G క్రింద ఆదాయపు పన్ను మినహాయింపు పొందుటకై తమ సహాయ సహకారాలందించి నందులకు సభ్యులంతా కృతజ్ఞతాంజలులు తెలియపరచారు. ఈ సంవత్సరం, పెరుమాళ్ళకు నిత్యకైంకర్యం మరియు అన్నదానం తదీయారాధన కార్యక్రమాలని చేసిన అర్చకులకూ స్వాములకూ కమిటీ సభ్యులు కృతజ్ఞతలు తెలియచేసారు. వారికి శ్రీస్వామివారు మంగళాశాసనములు అనుగ్రహించారు.

పాత దానిని తొలగించి, ఆ స్థానంలో నూతనంగా నిర్మించబడుతున్న సత్సంగసదనానికి శ్లాబ్ పోయడం వరకూ పూర్తి అయ్యింది. ఇకపై దానికి జరుగవలసిన విధానాన్ని చర్చించారు. ఈ సంవత్సరం కట్టడం సాగుతున్న రోజులలో ఇంజనీర్ శ్రీమాన్ మురళీకృష్ణగారు ఈ నిర్మాణ వివరాల్ని పరిశీలించి వచ్చే ఏడాది తిరిగి కట్టడం ఆరంభం అయిన దగ్గరనుంచి ఈ నిర్మాణ పర్యవేక్షణ కైంకర్యాన్ని చేస్తామని కోరగా శ్రీస్వామివారు అంగీకరించి అనేక మంగళాశాసనములు చేసారు.

సభ్యులందరు సత్సంగసదన నిర్మాణంలో తమ వంతు కృషిచేస్తామని తెలియజేసారు. శ్రీస్వామివారు వారందరికి మంగళాశాసనం అనుగ్రహించడంతో సమావేశం పూర్తి అయ్యింది. నవంబరు 17వ తేదీన బదరీ పెరుమాళ్ళ కోవెల ద్వారబంధనం జరుగుతుందని కుమారి ఉషశ్రీ తెలియజేసారు.

## శ్రీస్వామివారి పెరుమాళ్ళకు సహస్రకలశాభిషేకం:

27వ తేదీనుండి 30వ తేదీ వరకు శ్రీస్వామివారి పెరుమాళ్ళకు ప్రతి ఏడాది జరిగే సహస్ర కలశాభిషేకానికి ఏర్పాట్లు జరిగాయి. ఈ సంవత్సరం కలశాభిషేకానికి 1000 కలశాలను జంషెడ్‌పూర్‌కు చెందిన శ్రీమాన్ అశోక్‌గారు ఏర్పాటు చేసారు. మన ఆగమ విద్యార్థులు, ఆగమ సదస్సులో పాల్గొన్నపండితులందరు కూడా దగ్గరుండి ఈ అభిషేక కార్యక్రమాన్ని వైభవంగా జరిపించారు.

25వ తేదీ వరకు ఎడతెరపిలేకుండా వానలు, వేలమంది భక్తులకు ఈ కార్యక్రమాన్ని సేవించవచ్చిన వారికి ఏ అసౌకర్యం కలుగకుండా ఉండేవిధంగా 26న ప్రశాంత వాతావరణం 27,28,29 మూడు రోజులూ వాన, 30వ తారీఖున చక్కటి ఎండతోటి వాతావరణం, సముద్రమూ విశేషంగా నీలి వర్ణంతో ప్రకాశించింది. అభిషేక ఆరంభానికి ముందర ఆకాశంలో 2 ఇంద్రధనుస్సులు సాక్షాత్కరించి దివ్యమైన అనుభూతులను భక్తులకందించడం ఒక అద్భుత సన్నివేశం. వీనిని జాగ్రత్తగా గమనిస్తే, మన పెద్దలు ఆచరించే సత్కార్యాలకు దేవతలు ఎలా సహకరిస్తారో అర్థమౌతుంది.





## గ్రంథావిష్కరణ:-

అభిషేక కార్యక్రమాన్ని పరిచయం చేసుకున్న అనంతరం శ్రీరామానుజవాణి వారు ముద్రించిన నాలుగు శ్రీకోశాలను శ్రీస్వామివారి మంగళాశాసనములతో, విశేష అతిథి శ్రీమాన్ కోటేశ్వరరావుగారు ఆవిష్కరించారు. **"బదరీలో బ్రహ్మకపాల పిండదానానంతర ప్రత్యాబ్దిక కర్తవ్య విధానం"** పిండప్రదానం చేసుకునే విధానం గూర్చి గతంలో చాలామంది భక్తులు కోరిన కారణంగా, ఆ విధానాన్ని వివరంగా అందిస్తూ ఒక చిన్న గ్రంథాన్ని ప్రచురించడం జరిగింది. అలాగే **సంగ్రహ నిత్యానుసంధానం, కృష్ణయజుర్వేద సంధ్యావందనం,** 12 కలర్ ఫోటోలతో నిండిన **ఆళ్వారుల చరిత్ర** అనే గ్రంథాలను ఆవిష్కరించారు.

1993 నవంబరులో శ్రీ స్వామివారి తిరునక్షత్ర మహోత్సవ అనంతరం, స్వామివారి పెరుమాళ్ళను అపహరించుకుపోవడం, అప్పటి ఆ సంఘటన వివరాలను స్మరించుకున్నారు శ్రీమాన్ కోటేశ్వరరావుగారు. శ్రీ స్వామివారికి తనపైగల అనుగ్రహాన్ని పరిపరివిధాల కొనియాడారు. శ్రీస్వామివారితో దూరప్రయాణాలు చేయాలని సంకల్పంతో పెరుమాళ్ళు చోరగ్రస్తుదై యుండవచ్చునని అన్నారు. అంతేకాదు. శ్రీ స్వామివారిద్వారా తమను అనుగ్రహించటానికే పెరుమాళ్ళు ఆడిన ఒక ఆట అని వారు కృతజ్ఞత నిండిన మనస్సుతో తమ అనుభవాన్ని భక్తులతో పంచుకున్నారు. వారు ఎప్పటికీ శ్రీస్వామివారి సేవలోనే ఉండాలని ఆకాంక్షించారు.

ఎంతో వైభవంగా శ్రీరామచంద్రస్వామి పరివారానికి అందరికీ రకరకాల పరిమళ ద్రవ్యాలతో, వివిధ ఓషధులతో చేర్చిన కలశతీర్థంతో, తేనె, పాలు, పెరుగు, నెయ్యి మొదలగు పంచామృతాలతో, వివిధ ధాన్యాలతో, పసుపు, చందనం, రకరకాల సుగంధభరిత పుష్పాలతో అత్యంత వైభవంగా అభిషేక కార్యక్రమం శ్రీ స్వామివారి స్వహస్తాలతో జరిగింది. ఇలా వారిచేత సేవలు చేయించు కోవాలనే కాబోలు ఆనాడు 3 రోజులు, స్వామివారిని వీడి అజ్ఞాతవాసం చేసినది! భగవంతుని లీలలు మనకు అర్థంకావుమరి!

వేదికమీద అభిషేక కార్యక్రమం పూర్తి అయ్యి శ్రీస్వామివారు కుటీరానికి వేంచేసేటప్పటికి సాయంత్రం సుమారు 5 గంటలు అయ్యింది. ఎంతో శ్రద్ధలతో ఓపికగా ప్రొద్దున్న 7–8 గం॥లకు వచ్చిన భక్తులు అలా కార్యక్రమాన్నంతా సేవించి ఆ తరువాతే తదీయారాధన కావించిన వారున్నారు. మధ్యాహ్నం 12 గంటల నుండి తదీయరాధన ప్రారంభమై రాత్రివరకూ జరిగుతూనే ఉంది. ఉదయం తీర్థగోష్ఠి అవడంతోనే వేదిక వద్దకు వేంచేసిన శ్రీ స్వామివారు సాయంకాలం ఆరాధన మరియు విశేషంగా మణవాళమహాముని తిరునక్షత్రం తదుపరి తీర్థగోష్ఠి పూర్తి అయ్యేవరకూ అవిశ్రాంతంగా కార్యక్రమాన్ని నిర్వహించి భక్తకోటిని అనుగ్రహించారు. అప్పటికి రాత్రి సుమారు 10గం॥లు అయ్యింది. ఆ తరువాత "వారిజ" సభ్యులందరితోను సమావేశమై వారందించిన సేవలను కొనియాడుతూ అందరికీ మంగళాశాసనములు కృపచేసారు.

### గీతాజ్యోతి పాదయాత్ర -

విజయవాడ ప్రాంతానికి చెందిన శ్రీశ్రీశ్రీ సంపత్కుమార జీయర్ స్వామివారు (అష్టాక్షరీ జీయర్ స్వామివారు) శ్రీ చిన్నజీయర్ స్వామివారు సంకల్పించిన బృహత్తర కార్యక్రమమైన "గీతాజ్యోతి" యొక్క ప్రచార కార్యక్రమం చేస్తూ శ్రీరంగం వరకు పాదయాత్ర చేస్తున్నారు. గీతాజ్యోతియొక్క దివ్యమైన ఆశయాలను ఆర్తికలిగినవారందరికీ పంచే ఈ యాత్రలో తిరువళ్ళూరు దాటి శ్రీరంగం వైపు సాగుతున్నారు. వారితోపాటు శ్రీమాన్ కోగంటి వెంకటాచార్యులుగారు అనుసయిస్తున్నారు. అష్టాక్షరీ జీయర్ స్వామివారు దివ్య సంకల్పముతో

సాగించే ఈ ప్రచారంలో గ్రామాలలో ప్రజలనుండి మంచి స్పందన ఉందని, ఎంతోమంది భక్తులు వారి అనుగ్రహపాత్రులౌతున్నారని తెలుస్తోంది.

శ్రీవారి చాతుర్మాస్య దీక్ష పరిసమాప్తి దిశలో... –

ఢిల్లీ నుండి బెంగుళూరు దాగా ఉన్న వి.టి. కార్యకర్తలు ఎంతోమంది అత్యంత ఉత్సాహంతో వచ్చి, చాతుర్మాస్య సమయంలో "వారిజ"లో జరుగుతున్న వివిధ కార్యక్రమాలలో తమ సేవలను అందించారు. తూర్పుగోదావరి జిల్లా వి.టి. కార్యదర్శి శ్రీమాన్ పాపారాయుడుగారు విద్యార్థులందరికీ మరియు ముఖ్య వాలంటీర్లకూ క్లాత్ సూట్‌కేసులను తమకైంకర్యంగా అందించారు. చెన్నైకు చెందిన విజయలక్ష్మిగారు బ్యాగ్‌లను తమకైంకర్యంగా అందించారు. 8వ తారీఖుతో చాతుర్మాస్యం సమాప్తమౌతుంది. నవంబర్ 1వ తేదీనుండి బయటకార్యక్రమాలకు సమయాన్నిచ్చియున్నందున శ్రీస్వామివారు భక్తులననుగ్రహించుటకై చుట్టుప్రక్కల ప్రాంతాలకు వేంచేస్తున్నారు. చాతుర్మాస్యం పూర్తికావడంతోనే వరుసగా గీతాజ్యోతి ధర్మక్షేత్రకార్యక్రమాలలో పాల్గొంటారు శ్రీవారు.

**హిందూపూర్**

అనంతపురం జిల్లా హిందూపురం శాఖ ఆధ్వర్యంలో సాంఘికసేవ, సాంస్కృతిక, పేదల ఉపాధి కల్పన కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ప్రభుత్వ అంధుల పాఠశాలలో జాతీయ దినోత్సవములలో వస్త్రదానం, రక్తదాన శిబిరములు ఏర్పాటుచేసి స్వచ్ఛంద రక్తదానము చేయుచున్నారు. వేసవిలో దాహార్తుల కొరకు చలివేంద్రములు ఏర్పాటు చేసారు. ముఖ్యంగ మహిళలకు హస్తకళా నైపుణ్యము పెంపొందించుటకు ఆర్ట్ ఎగ్జిబిషన్స్ ఏర్పాటు చేస్తున్నారు.

**తాడిపత్రి:**

అనంతపురం జిల్లా తాడిపత్రి వికాసతరంగిణి శాక ఆధ్వర్యంలో శ్రీ స్వామివారి తిరునక్షత్రోత్సవం సందర్భముగ సామూహిక శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం నిర్వహించారు. షెడ్యూల్ కులాలు, షెడ్యూల్ తెగల సంక్షేమ హాస్టల్ నందు 60 మంది పిల్లలకు మిఠాయిలు పంచిపెట్టారు.

**సూర్యాపేట**

నల్గొండజిల్లా సూర్యాపేట ధర్మక్షేత్ర కేంద్రముగ జాజిరెడ్డిగూడెం శాఖ ఆధ్వర్యంలో ఉచిత పశువైద్య శిబిరం నిర్వహించారు. 200 పశువులకు గాలికుంటు వ్యాధులు రాకుండ వ్యాధినిరోధక టీకాలు ఇవ్వబడినవి. 10 పశువులకు గర్భకోశ వ్యాధి చికిత్సలు నిర్వహించి ఉచితంగ మందులు పంపిణీ చేసారు. 8 మంది డాక్టర్లు ఈ కార్యక్రమంలో ఈ సేవలను అందజేసినారు. అధ్యక్షులు సి.హెచ్. వేణుగోపాలాచార్యులు, కె. వెంకట్రావు, సావిత్రమ్మ గార్లు పాల్గొన్నారు.

**పొన్నూరు**

గుంటూరు జిల్లా పొన్నూరు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో శ్రీశ్రీశ్రీ త్రిదండి అష్టాక్షరీ సంపత్కుమార రామానుజ జీయర్ స్వామివారు శ్రీరంగక్షేత్ర పాదయాత్రలో భాగంగ స్థానిక మున్సిపల్ కార్యాలయం వద్ద ఘనంగ స్వాగతం పలికినారు. శ్రీ ఆంజనేయ స్వామివారి దేవాలయంలో పూజలు నిర్వహించి శ్రీ జగన్నాథ స్వామివారి కళ్యాణ మండపంలో తీర్థగోష్ఠి నిర్వహించారు. శ్రీ స్వామివారు గీతాజ్యోతి వైభవాన్ని వివరించారు. కాన్వెంట్ బాలికలు గీతా ప్రవచనం చేసారు. వికాసతరంగిణి అధ్యక్షులు, కార్యదర్శులు యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

**నందిగామ**

కృష్ణాజిల్లా నందిగామ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో దేవి నవరాత్రుల సందర్భముగ పేదలకు, వృద్ధులకు వస్త్రదానం చేసారు. స్థానిక గీతా మందిరంలో శ్రీ స్వామివారి తిరునక్షత్రం వైభవంగ నిర్వహించుకొన్నారు. శ్రీ స్వామివారి అష్టోత్తర నామములు, శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం నిర్వహించారు. ఈ సందర్భముగ పేద మహిళలకు బియ్యం పంపిణీ చేసారు. పేద బాలికలకు 250/-రూ స్కూలు ఫీజు ఏర్పాటు చేసారు.





**జగ్గయ్యపేట:**

జగ్గయ్యపేట ధర్మక్షేత్ర కేంద్రముగా 20-10-03 తేదిన కండ్ల కలకల వ్యాధితో బాధపడేవారికి జగ్గయ్యపేట అన్ని వార్డులలో ఉచితంగా మందులు పంపిణీ చేసారు.

**పటమట:**

పటమట (చైతన్య) వికాసతరంగిణి ఆధ్వర్యంలో కావూరు వృద్ధాశ్రమంలో శ్రీకృష్ణనామ జపయజ్ఞ ముగింపు సందర్భముగ అందరికి గీతాజ్యోతి శ్లోకమాలికలను అందజేసినారు. శ్రీస్వామివారి తిరునక్షత్రం సందర్భముగ 100 మందికి అన్నదాన కార్యక్రమం నిర్వహించారు. నిరుపేదలైన 20 మంది, 70 మంది పిల్లలకు వస్త్రదానము చేసారు. శ్రీస్వామివారి ఆశయం కొరకు మరిన్ని సేవలను నిర్వహిస్తున్నారు. ఈ కార్యక్రమంలో అధ్యక్ష కార్యదర్శులు శ్రీమతి అన్నపూర్ణ, రాణి సంయుక్త, అన్నపూర్ణాదేవి గార్లు పాల్గొన్నారు.

**లేబర్ కాలనీ:**

విజయవాడ పట్టణ లేబర్ కాలనీ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో 26వ తేది శ్రీ స్వామివారి తిరునక్షత్ర ఉత్సవము వైభవంగ నిర్వహించారు. శ్రీ స్వామివారికి అష్టోత్తర పూజా కార్యక్రమములు నిర్వహించి శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం నిర్వహించారు. ఈ కార్యక్రమంలో అధ్యక్షులు నీలం అప్పారావు దంపతులు, సుశీల యితర భక్తులు పాల్గొన్నారు.

**నర్సంపేట**

వరంగల్‌జిల్లా నర్సంపేట వికాస తరంగిణి శాఖల ఆధ్వర్యంలో లింగాపురం గ్రామంలో ఉచిత వైద్య శిబిరం నిర్వహించారు. 300 మంది స్త్రీలకు రక్త, మూత్ర పరీక్షలు నిర్వహించారు. 30 మందికి పాప్‌స్మియర్ ఉన్నట్లు గుర్తించారు. 'ఐ.ఎమ్.ఎ' ల ఆర్థిక సహకారంతో 10,000/- రూ॥ విలువగల మందులను పంపిణీ చేసారు. ఈ కార్యక్రమంలో డా॥ఉషారాణి, వనజ, భారతి, సుజాతరాణిగార్లు తమవంతు సేవలను అందజేసారు. వికాసతరంగిణి అధ్యక్ష కార్యదర్శులు శ్రీమాన్ వీరేశలింగం, ఎమ్.వి. కృష్ణారావు గార్లు, యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

**జనగామ:**

వరంగల్‌జిల్లా జనగామ ధర్మక్షేత్ర కేంద్రముగ 22-10-03 తేదిన మద్దూరు గ్రామంలో ఉచితనేత్ర వైద్య శిబిరం నిర్వహించారు. లయన్స్ క్లబ్ హైదరాబాద్ వారి సౌజన్యంతో ఈ కార్యక్రమం నిర్వహించారు. 400 మంది రోగులను పరీక్షించి 50 మందికి కంటి అద్దములు, 42 మందికి ఆపరేషన్లు నిర్వహించారు. సుమారు 30,000/-రూ ఖర్చు అయినవి. ఈ కార్యక్రమంలో అధ్యక్షులు పి. లక్ష్మీనర్సయ్య, అయిత ఆంజనేయులు, వెంకన్న, హన్మంతరావు యితర కార్యకర్తలు పాల్గొన్నారు. శ్రీమాన్ సంపత్కుమార కృష్ణమాచార్య సిద్ధాంతిగారి ఆధ్వర్యంలో కార్యక్రమం నిర్వహించబడినది.

**ఒంగోలు:**

శ్రీశ్రీశ్రీ త్రిదండి అష్టాక్షరీ సంపత్కుమార జీయర్ స్వామివారి శ్రీరంగక్షేత్ర పాదయాత్ర సందర్భముగ ఒంగోలు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో ఒంగోలు పట్టణంలో ఘనంగ స్వాగతం పలికినారు. శ్రీ స్వామివారు స్థానిక శ్రీ ఆంజనేయస్వామి దేవాలయం నుండి బయలుదేరి వివిధ కాలనీలు పర్యటించి ఉపన్యసించడం జరిగింది. ఈ కార్యక్రమంలో సి.హెచ్. శ్రీమన్నారాయణ, చక్రధర పెరుమాళ్, ఎమ్.ఎస్. వరప్రసాద రాజు యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

**ద్రోణాదుల:**

ప్రకాశంజిల్లా ద్రోణాదుల వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో శ్రీ స్వామివారి తిరునక్షత్రంను వైభవంగ నిర్వహించారు. ఈ కార్యక్రమంలో లక్ష్మీనారాయణ యితర కార్యకర్తలు పాల్గొన్నారు.

**ఆర్తమూరు:**

తూర్పుగోదావరి జిల్లా ఆర్తమూరు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో శ్రీస్వామి 48వ తిరునక్షత్ర మహోత్సవము వైభవంగ నిర్వహించుకొన్నారు. గ్రామంలో ఉదయం 8 గం॥ వేదఘోష, మంగళ వాయిద్యములలో విష్ణు సహస్రనామ పారాయణంలో శోభాయాత్ర నిర్వహించారు. శ్రీస్వామివారికి సామూహికంగ అష్టోత్తర శతనామావళి పూజ కార్యక్రమాలు నిర్వహించారు. బ్రాహ్మణ సత్కారం, ఆర్తులకు దీనులకు 848 మందికి వస్త్రదానంతోపాటు అన్నదాన కార్యక్రమం నిర్వహించారు. ఈ కార్యక్రమంలో 1,02,000/–రూ ఖర్చు అయినది.

ఈ కార్యక్రమంలో భాగంగ ఆర్తమూరు గ్రామంలో ఉచిత నేత్రవైద్య శిబిరం నిర్వహించి ఉచితంగ మందులు పంపిణీ చేయుటకు సన్నాహాలు చేస్తున్నారు. ఈ కార్యక్రమంలో కో ఆర్డినేటర్ సి.హెచ్. ప్రసాదరెడ్డి, ఎమ్. సూర్య నారాయణరెడ్డి, అన్నపూర్ణ, సీతాయమ్మ, రామకృష్ణరెడ్డి, తులసీదేవి, శ్రీనివాసరెడ్డి విశేష సేవలందించారు.

**ప్రజ్ఞ-జెట్ లెర్నింగ్ సెంటర్- రాజమండ్రి**

ప్రజ్ఞా 4, 5వ కార్యక్రమాలు 12–10–03 మరియు 19–10–03 తేదిలలో స్థానిక కందుకూరి రాజ్యలక్ష్మి స్త్రీల కళాశాలలో నిర్వహించబడ్డాయి. 30 మంది విద్యార్థిని విద్యార్థులు సభ్యులుగ పాల్గొన్నారు. వారు 6 టీములుగా ఏర్పడి చర్చలలో ఉత్సాహంగా పాల్గొన్నారు.

4వ కార్యక్రమంలో "మనము ప్రార్థించడం అవసరము'' అనే విషయంపై చర్చ నిర్వహించబడినది. ప్రార్థించడం వల్ల కలిగే అనుభవాలు గురించి విద్యార్థులు చక్కని వివరణలు యివ్వడంతోపాటు కొన్ని సందేహాలను కూడ వెలిబుచ్చారు.

5వ కార్యక్రమంలో "ఆహార నియమాలు పాటించడము అవసరము" ఈ విషయంపై కూడ వారు చక్కని అవగాహనని ప్రదర్శించారు. ఈ కార్యక్రమాలను శ్రీమతి పద్మావతి రామానుజం నిర్వహించారు.

**అనకాపల్లి:**

విశాఖపట్నం అనకాపల్లి వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో శంకరం గ్రామంలో షెడ్యూల్ కులాల స్కూలులో ఉచిత వైద్య శిబిరం నిర్వహించారు. మలేరియా, డయేరియా వంటి వ్యాధులు రాకుండ ఉచితంగ మందులు పంపిణీ చేసారు. మరొక గ్రామం కృష్ణాపురంలో దళిత బహుజన కాలనీలో పాఠశాల విద్యార్థులకు, మహిళలకు ఉచిత వైద్య శిబిరం నిర్వహించి మందులు పంపిణీ చేసారు. విద్యార్థులకు, మహిళలకు వృద్ధులకు వస్త్రదానం నిర్వహించారు.

**నిజామాబాద్**

నిజామాబాద్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో 12–10–03 కంఠేశ్వర సంఘములో ఉచిత దంత సంరక్షణ సలహాలను యివ్వడం



\23/
Mydocuments\
Bn Nov. o3.p65



జరిగింది. 250 మందికి దంత సంరక్షణపై అవగాహన సదస్సు ఏర్పాటు చేసారు. అనంతరం రోగులకు పరీక్షలు నిర్వహించి మందులు పంపిణీ చేసారు. ఈ కార్యక్రమంలో శ్రీమాన్ డా॥ శ్రీహరి, డా॥ ముత్తన్న, డా॥ నితిన్ కుమార్ గార్లు పాల్గొన్నారు. శ్రీమాన్ జి. లక్ష్మారెడ్డిగారు శిబిర అధ్యక్షులుగా వ్యవహరించారు.

**వికాసతరంగిణి - జంటనగరముల సమన్వయ కమిటి కార్యక్రమముల నివేదిక**

జంటనగరముల సమన్వయ కమిటి వారి ఆధ్వర్యంలో శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళా శాసనములతో వారి ఆదేశానుసారము జెట్–భవనములో వికాస తరంగిణి స్వచ్ఛంద సేవకులకు ది. 11–10–2003 నుండి 13–10–2003 వరకు 3 రోజులపాటు శిక్షణ శిబిరమును నిర్వహించినాము. ఈ శిబిరమునకు జంట నగరములలోని 9 శాఖలనుండి 130 మంది కార్యకర్తలు ఈ శిబిరములో పాల్గొని శిక్షణ పొందినారు. ఈ శిక్షణలో దృశ్య, శ్రవణ యంత్రముల ద్వారా మరియు కంప్యూటర్, పవర్ పాయింట్ పద్ధతిలో కార్యకర్తల భాగస్వామ్య పద్ధతిలో నిర్వహించటము జరిగినది.

ఈ కార్యక్రమము అందరికి అనుభవజ్ఞురాలైన సీనియర్ కార్యకర్త శ్రీమతి బంగారమ్మగారు జ్యోతి ప్రజ్వలనముతో ప్రారంభించారు. ఈ కార్యక్రమ ఉద్దేశాలను శ్రీమాన్ కల్కి అవతారం వివరించగా, ప్రారంభ ఉపన్యాసం శ్రీమాన్ ప్రొఫెసర్. పురుషోత్తమరావు గారు అందించినారు. మొట్టమొదటి అంశము సంస్థాగత వ్యవస్థ నిర్మాణము– సంస్థ ఆశయాలు, ఉద్దేశాలను శ్రీమతి వనజా చలపతిరావు గారు O.H.P. ద్వారాకార్యకర్తలకు వివరించారు. 'ఆధ్యాత్మిక భవన ఆధారంగా సేవ" అనే అంశమును శ్రీమాన్ మురళీ కృష్ణమాచారి గారు వివరించగా, డా॥ రామనాథంగారు వ్యక్తిత్వ వికాసం గురించి శ్రీమతి కృష్ణకుమారిగారు అత్యవసర పరిస్థితులను ఏవిధంగా ఎదుర్కోవాలి అనే అంశమును వివరించినారు. చివరగా తిరుపతి నుండి విచ్చేసిన శ్రీమాన్ నాగేంద్రశాయి గారు "తిరుమలలో శ్రీవారి సేవ" కార్యకర్తలు ఎలా సేవ చేయాలి అని వివరించినారు. స్వచ్ఛంద సేవకుడు, అర్థము, స్వచ్ఛంద సేవకుల సేవ – వారి పాత్ర, శిక్షణలో వారియొక్క నైపుణ్యం అభివృద్ధి– సమాజంలో వారిపాత్ర ఏవిధంగా సేవచేయాలి, మానవ సంబంధాలు మరియు స్వచ్ఛంద సేవకుల విజయగాథలను డా॥పి. పద్మనాభరావు వివరించినారు. సమూహము, గుంపు, సమూహముల తయారి – రూపకల్పన(Team Building) సమాజంలో వీరి పాత్ర, శారీరక దృఢత్వమును శ్రీమతి కృష్ణకుమారిగారు వివరించగా, ఆధ్యాత్మిక సేవను గురించి శ్రీమాన్ తిరుమలరావు గారు, వ్యక్తిత్వ

**మంచిమాట:** ఈర్ష్య ఉన్న వారికి శత్రువులు లేకపోయినా ఈర్ష్య అతని శత్రువు అవుతుంది.

వికాసము గురించి మర్రిచెన్నారెడ్డి మానవ వనరుల అభివృద్ధి సంస్థ సంయుక్త సంచాలకులు శ్రీమాన్ డా॥ విజయరాఘవాచార్యులుగారు వివరించారు.

O.H.P. ఉపయోగించి పర్యావరణము, పర్యావరణ పరిరక్షణ- భవన, పర్యావరణ- సమతుల్యము, వృక్ష రక్షణలో స్వచ్ఛంద సేవకుల పాత్ర; అనే అంశంపై డా॥ పి. పద్మనాభరావు వివరించారు. కార్యకర్తలను ఉద్దేశించి వికాసతరంగిణి కేంద్ర కమిటి అధ్యక్షులు శ్రీమాన్ D.V.L.N. మూర్తిగారు ప్రసంగించినారు. డా॥ రామనాధంగారు, శ్రీమాన్ పురుషోత్తంరావుగారు, డా॥ శోభా జయంత్‌గారు, శ్రీమతి శ్రీకుమారిగారు, శ్రీమాన్ విజయకుమార్‌గారు, కార్యకర్తలతో ముఖాముఖి- శిక్షణపై వారి అభిప్రాయములను ప్రత్యక్షముగా తెలుసుకొని వారి సందేహాలకు సమాధానమును అందించినారు.

ఈ కార్యక్రమము ముగింపు సమావేశమునకు ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖ అధ్యక్షులు ప్రొ॥ కసిరెడ్డి వెంకటరెడ్డిగారు ముఖ్య అతిథిగా విచ్చేసి కార్యకర్తలకు సందేశమిచ్చారు.

**శాఖల వార్తలు:**

**1). ఆధ్యాత్మిక భవన పునాదిపై ధార్మిక జీవనము:- వ్యక్తిత్వ వికాసం**

**మీర్‌పేట శాఖ:**

గీతాజ్యోతి, చిత్రగీతిక శ్లోకపారాయణం ప్రతి బుధవారం శ్రీ కాశి నర్మదేశ్వర దేవాలయములలో జరుగుచున్నది. సెప్టెంబరు 16 నుండి సుందరకాండ సప్తాహము శ్రీ శ్రీధర వేంకట రమణగారిచే నిర్వహించినారు. 25-9-03 చివరిరోజున అశేష భక్తులకు శ్రీ స్వామివారి మానస సరోవర యాత్రను ప్రదర్శించినారు. దేవి నవరాత్రుల సందర్భముగా గీతాజ్యోతి ప్రచారము నిర్వహించినారు.

**మాసబ్ ట్యాంక్:**

గుడి మల్కాపూర్ పాఠశాల విద్యార్థులకు చిత్రమాలిక శ్లోకపఠనం, ప్రతి శనివారం శ్రీ వేంకటేశ్వర దేవాలయంలో గీతాజ్యోతి గోష్ఠి నిర్వహిస్తున్నారు.

**బోయిన్‌పల్లి:**

రాయల్ కాలని మరియు చుట్టుప్రక్కల కాలనీలలోని 100 మంది భక్తులతో కలిసి గీతాజ్యోతి ప్రచారము- భజన కార్యక్రమము నిర్వహించినారు.

**కవాడిగూడ:**

కాలనీలలో గృహములను సందర్శించి గీతాజ్యోతి ప్రచారము గావించి పుస్తకములను అందించటం జరిగినది.

**సంతోష్‌నగర్:**

శ్రీమాన్ వింజమూరి విజయకుమార్ గారిచే 26-9-2003 నాడు శ్రీమతి మంజుల శ్రీ గారిచే 27-9-2003 నాడు శరన్నవరాత్రి సందర్భముగా శ్రీ వేంకటేశ్వర స్వామి దేవాలయములో ప్రవచనము జరిగినది.

**వనస్థలిపురం:**

9 రోజుల దేవి నవరాత్రుల సందర్భముగా 26-9-2003 నుండి 5-10-2003 వరకు వనస్థలి హిల్స్, కమలానగర్, టి.వి.కాలనీ, సచివాలయనగర్, వెంకటేశ్వర దేవాలయము, బ్రహ్మోత్సవములలో గీతాజ్యోతి ప్రచారము గావించి సుమారు 1000 మంది భక్తులకు 48 శ్లోక పుస్తకములను, స్టిక్కర్స్‌ను అందజేసినారు.

**2). ఆర్తులకు - దీనులకు వివిధ సేవలు అందించటం**

**మాసబ్ ట్యాంక్:-**

కొండాపూర్ గ్రామము సందర్శించి అచట అనాద, వృద్ధాశ్రమములో బియ్యం, పప్పు దినుసులను అందించి, గీతాజ్యోతి శ్లోక పఠనముగావించి కార్యక్రమము ప్రచారం కావించినారు.

జెట్‌లో నిర్వహించిన స్వచ్ఛంద శిబిరములో 25 మంది కార్యకర్తలు పాల్గొన్నారు.





**సంతోష్‌నగర్:-**

36 మంది కార్యకర్తలు 3 రోజుల శిక్షణ శిబిరములో పాల్గొన్నారు. 10 మంది వారిజలో శ్రీ స్వామివారి కార్యక్రమంలో పాల్గొన్నారు.

**వనస్థలిపురం:-**

9 మంది 3 రోజుల శిక్షణలో పాల్గొన్నారు. కమలానగర్, బ్రహ్మ సంక్షేమ సంఘంలో శ్రీ వెంకటేశ్వర దేవాలయము వారి అభ్యర్థన మేరకు వారి 9 రోజుల బ్రహ్మోత్సవ కార్యక్రమములో 12 మంది కార్యకర్తలు పాల్గొని సామూహిక విష్ణు సహస్రనామ కార్యక్రమములో పాల్గొని, అన్నదానము, కళ్యాణ కార్యక్రమంలో పాల్గొని కార్యకర్తలు సేవలను అందించినారు.

**మీర్‌పేట:-**

నవరాత్రుల సందర్భముగా కాలనీలో సేవలను అందించినారు.

**రామాంతపూర్:-**

21-9-2003నాడు టీకా మందుల శిబిరము ఏర్పాటుచేసి 150 మంది పిల్లలకు పోలియో మందును ఉప్పల్ ప్రాథమిక ఆరోగ్య కేంద్రం వారి సహాయంతో అందజేసినారు. అప్పారావుగారు, యాదగిరిరెడ్డి గారి నేతృత్వంలో ఈ కార్యక్రమం జరిగింది. ఇదేరోజు బి.పి శిబిరం నిర్వహించి 98 మందికి ఉచితముగా పరీక్షలు నిర్వహించినారు.

ది. 28-9-03 నాడు చాతి వ్యాధుల శిబిరము. లుపిన్ కంపెని వారి సహకారములో నిర్వహించి 65 మంది రోగులకు చికిత్సను చేసినారు డా॥ శ్రవణ్ కుమార్ వారి సహాయముతో ది. 28-9-03 నాడు షుగర్ వ్యాధి శిబిరమును అవంతీస్ వారి సహాయముతో ఉచితముగా షుగర్ రోగ నిర్ధారణ చేసినారు.

ది. 12-10-03 నాడు బి.పి. శిబిరము నిర్వహించి 300 మంది రోగులకు సేవలు అందించినారు. ఈ శాఖ అనాధ పిల్లలను దత్తత తీసుకొనే కార్యక్రమము చేపట్టినది ఇందులో భాగంగా ముగ్గురు పిల్లలను శ్రీమతి లీల, శ్రీమతి మాధవి, శ్రీమతి సుజాత గార్లు దత్తత తీసుకొని వారికి ఆశ్రయము కల్పించి వారి బంగారు భవిష్యత్తుకు పునాది వేసినారు.

**3). పర్యావరణ పరిరక్షణ:**

ఈ కార్యక్రమములో భాగంగా వనస్థలిపురం వికాసతరంగిణి వారు శ్రీ పద్మావతి నగర్ కాలనీలో మరియు హిల్ కాలనీలో మొక్కలు నాటే కార్యక్రమము చేపట్టి 120 మొక్కలను నాటి వాటికి మున్సిపాలిటి వారి సహకారములో రక్షణ Tree Guards ను అమర్చినారు.

**దావణగిరి:**

దావణగిరి వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో 26వ తేది శ్రీ స్వామివారి తిరునక్షత్ర మహోత్సవ సందర్భముగ జిల్లా సెంట్రల్ ఖైదీలకు శ్రీ భగవద్గీత పారాయణ కార్యక్రమం నిర్వహించారు. జైలు సూపరింటెండెంట్ గారైన శ్రీమాన్ శ్రీనివాస్ మాట్లాడుతూ జైలు వాతావరణం పూర్తిగా ఒక యజ్ఞముగ, వైదిక కార్యక్రమంగా జరగడం చాల సంతోషము అని అన్నారు. ఈ సందర్భముగ వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ వీరభద్రరావు గారు 255 మంది ఖైదీలకు, 25 మంది జైలు సిబ్బందికి ప్రసాద వినియోగం, పండ్లు పంచిపెట్టారు.

**హోస్పేట:**

హోస్పేట వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో 26-10-03 శ్రీ స్వామివారి తిరునక్షత్రోత్సవ సందర్భముగ స్థానిక వరదరాజస్వామి వారి దేవాలయంలో శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం, శ్రీ లలితా సహస్రనామ పారాయణం నిర్వహించారు. 200 మందికి ప్రసాద వితరణ కార్యక్రమం జరిగినది. వికాసతరంగిణి శాఖ అధ్యక్షులు శ్రీమాన్ సదాశివరెడ్డి గారి ఆధ్వర్యంలో ఈ కార్యక్రమం నిర్వహించారు.

30 వటువులకు ఉపనయనములు జరిగాయి. శ్రీ స్వామివారు వారందరికి మంత్రాన్ననుగ్రహించి మంగళాశాసనములు చేసారు.

# తిరుమలలో బ్రహ్మోత్సవాలలో శ్రీవారి సేవ

సెప్టెంబరు, 27వ తేది నుండి అక్టోబరు 5వ తేది వరకు జరిగిన బ్రహ్మోత్సవాలలో సేవలను అందించడానికి స్వామివారు 200 మందిని పంపించినారు. విజయనగరము, కరీంనగర్, పిట్టలవానిపాలెం, జి.ఎన్.పాలెం నుండి అధిక సంఖ్యలో వచ్చినారు. ఇంకను తిరుపతి, విజయవాడ, విశాఖపట్నం, వరంగల్, తేలప్రోలు, రామచంద్రపురం, కొండపల్లి, నర్సీపట్నం, ఖాజీపాలెం, బేతవోలు, జహీరాబాద్, గంపలగూడెం, వట్టిచెరుకూరు శాఖల నుండి పాల్గొన్నారు.

తొలిరోజున శ్రీవారి సేవకులకు ప్రత్యేక సమావేశము జరిగినది. ఈ సమావేశములో E.O. గారు శ్రీవారి సేవకులకు 'ఓరియంటేషన్' ఇచ్చినారు. శ్రీవారి సేవకులకు చక్కటి స్ఫూర్తిని, మార్గదర్శకత్వమును ఇచ్చినారు.

150 మంది నిత్యన్నదాన కాంప్లెక్స్‌లో రోజుకి సగటున 30 వేల మందికి వడ్డన చేసినారు. 9 రోజులకు మొత్తం 2 లక్షల మందికి వడ్డన చేసినారు.

మిగిలిన 50 మంది ఆలయ ప్రాంగణంలో సేవలను అందించినారు. ఆలయ మహాద్వారం నుండి వికలాంగులను దర్శనానికి తీసుకెళ్ళి వారికి తీర్థము, లడ్డులు ఇప్పించి వారి కానుకలు హుండిలో సమర్పించి తిరిగి వారిని వారి బంధువుల వద్దకు చేర్చినారు. నడవలేని వికలాంగులను భుజాలపై మోసుకెళ్ళినారు.

విమాన ప్రాకారం వద్ద జనం గంటల తరబడి కూర్చొనకుండ బయటకు మర్యాదగా నచ్చచెప్పి పంపించినారు.

సన్నిధిలో 'క్యూ' ను వేగముగా, మర్యాదగా నడిపించడానికి ప్రయత్నం చేసినారు. సన్నిధిలో ఒక్క నిముషానికి 40 మంది దర్శనం చేసుకోగలిగితేగాని రోజుకి 40 వేల మందికి దర్శనం కాదు. యాత్రికులను అరుపులు కేకలు లేకుండా ఘర్షణ పడకుండా దర్శనానంతరం యాత్రికులను బయటకు పంపించినారు. వృద్ధులు, పసి బిడ్డలతో వచ్చే తల్లులు, హృద్రోగులును గమనించి వారిని జాగ్రత్తగా నెట్టివేయకుండా సాగనంపినారు.

కళ్యాణ కట్టలో అవకతవకలు, వేధింపులు, జరగకుండా ప్రయత్నించినారు.

ప్రతిరోజు ఉదయం 6 గం॥లకు తిరుమల నాలుగు మాడ వీధులలో మొత్తం 200 మంది నగర సంకీర్తన చేసినారు. (గోవింద నామములు).

ప్రతిరోజు ఉదయం 9 గం॥లకు ఆస్థాన మండపంలో తిరుపతి శాఖ సభ్యులు విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణం చేసినారు.

ఒక్కరోజు ధర్మదర్శనం 'క్యూ' అదుపు తప్పి లేపాక్షి వరకు విస్తరించినపుడు, విజయనగరం, పిట్టలవానిపాలెం, జి.ఎన్.పాలెం సభ్యులు వరుసగా 16 గంటలు పనిచేసి పరిస్థితిని అదుపులోనికి తెచ్చి ధర్మదర్శనం వేగంగా జరిగేటట్లు చూసినారు.

E.O. గారు బ్రహ్మోత్సవాలు ముగిసిన తరువాత జరిగిన సమావేశములో





అన్నదానములో వికాసతరంగిణి సేవకులు అందించిన సేవలను ప్రత్యేకముగా ప్రశంసించినారు. వికలాంగులు వికాసతరంగిణివారు తమ సొంత మనుష్యుల వలె బాధ్యతగా, జాగ్రత్తగా తమని దర్శనానికి తీసుకెళ్ళుతున్నారని సంతోషాన్ని, సంతృప్తిని వ్యక్తం చేస్తున్నారు.

ఈ బ్రహ్మోత్సవాలలో వికాసతరరగిణి సేవకుల రవాణా ఖర్చు రూ-1,64,000 రూపాయలు, మరియు వారి ఉచిత సేవల విలువ 3,60,000-00 రూపాయలు.

వికాసతరంగిణి సేవలకు సంతసించి J.E.O. శ్రీ పి. బాల సుబ్రహ్మణ్యం గారు, తన కృతజ్ఞతలను శ్రీవారి సేవకులకు సమర్పించడానికి జీయర్ మఠానికి విచ్చేసినారు. ఈ సందర్భంగా శ్రీవారి సేవకులకు వసతి, దర్శనం, లడ్లు, చాపలు వగైరా ఎటువంటి ఇబ్బందులు లేకుండా ఏర్పాటు చేసినందుకు, వేధింపులనుండి రక్షణ కల్పిస్తున్నందుకు J.E.O. గారికి శ్రీ నాగేంద్రశాయి కృతజ్ఞతలను సమర్పించి నారు. స్వామివారు పంపిన జ్ఞాపికను J.E.O. గారు స్వీకరించినారు.

ఈ సేవాకార్యక్రమం శ్రీ ఎన్. నాగేంద్రశాయి (చిత్తూరు జిల్లా కన్వీనర్) మరియు శ్రీ ప్రభాకర్ (కరీంనగర్)ల పర్యవేక్షనలో సమర్థవంతంగా జరిగినది. వీరికి శ్రీ పి. ఉమాశంకర్, రామలక్ష్మి దంపతులు, శ్రీ కె. రమేష్ మరియు శ్రీ ఎస్. దామోదరం సహకరించినారు.





 **పరమపదము** 

**శ్రీమాన్ ఫణిహారం రాఘవాచార్యులు** గారు ది.**24-10-03**న ఆచార్య తిరువడిని చేరినారు. వీరు మన జీయరుస్వామివారి అనేక కార్యక్రమములలో పాల్గొని విశిష్ట సేవలను అందించారు. వీరికి ఆశ్రియఃపతి సాన్నిధ్యం నిత్యం కలగాలని ప్రార్థిస్తున్నాము.

# ఆచార్యుల ఆవశ్యకత

కుమారి **లతా కుమారి**గారు
విజయనగరం.

ఆర్ష సంప్రదాయంలో ఆచార్యస్థానం అతి ఉత్కృష్టమైనది. మానవునికి తల్లితండ్రుల తరువాత ఆచార్యులే దైవం అంటుంది. ఉపనిషత్తు, "మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ". తల్లిదండ్రులు భౌతికదేహాన్నిచ్చి, దాని పోషణ ద్వారా దేహాభివృద్ధికి తోడ్పడితే, ఉజ్జీవించడానికి కావలసిన జ్ఞానాన్నిచ్చి మనోవికాసానికి వ్యక్తిత్వ వికాసాభివృద్ధికి దోహదం చేస్తారు ఆచార్యులు. అందుచే ఇరువురిలో "గరీయాన్ బ్రహ్మదః పితా" అంటే పరతత్త్వ జ్ఞానాన్ని ఉపదేశించిన ఆచార్యులే శ్రేష్ఠులని నిర్ణయించ బడింది. అన్నప్రాసనం చేయగలవారు పితరులు, అక్షరారాధనం నేర్పువారు ఆచార్యులు. అందుకనే ''ఆచార్యం దేవమివ ఉపాసీత'', ఆచార్యుని భగవంతునిగా భావించి ఆరాధించాలి అంటుంది ఉపనిషత్తు.

వేదశాస్త్ర, ఇతిహాస, పురాణాలను అధ్యాపనం చేయువారు ఆచార్యులు. మంత్రోపదేశం ద్వారా మనుష్యులను ఉజ్జీవింపచేయువారు ఆచార్యులు. "ఆళియుళ్ పుక్కు ముగందు కొడు ఆర్ తు ఏతి" అన్నట్లు వేదసాగరంలో మునిగి, వేద ప్రతిపాద్యుడగు నారాయణుని గుణామృతమును ఆస్వాదించిన వార్తై, ఆ అమృతపు జల్లులను మనపై కురిపించు మేఘము వంటివారు ఆచార్యులు.

తల్లిదండ్రులకు, తమ సంతాన విషయములో ఉండే సంకల్పాలు తీరవచ్చు. తీరకపోవచ్చు కాని, ఆచార్యుల సంకల్పం అప్రతిహతం. తనంతటివాడు కావాలి అని ఆశించి అస్త్ర, శస్త్ర విద్యలలో ఆరితేరినవానిగా శ్రీరాముని తీర్చిదిద్దాడు విశ్వామిత్రుడు. (అర్జునుని) తనంతవానిగా చేస్తానన్నాడు. అలాగే తన సంకల్పాన్ని నెరవేర్చు కున్నాడు ద్రోణాచార్యుడు. పరశురాముడు తన శిష్యుడైన భీష్మణ్ణి తనతో సమునిగా చేసి చూపించాడు.

"ఆచార్య" అని పేరులో ఉన్నంత మాత్రాన ఆచార్యులు కాలేరు. ఆచార్య పదవి నలంకరించ డానికి కొన్ని ప్రత్యేక లక్షణాలు కలిగి ఉండాలి. అవి ఏవంటే

**"ఆచినోతి హి శాస్త్రార్థాన్ ఆచారే స్థాపయత్యపి ।**
**స్వయమాచరతే యస్మాత్ తస్మా దాచార్య ఉచ్యతే" ॥**

శాస్త్రజ్ఞానాన్ని తాము కష్టపడి సంపాదించుకొని, అలానేర్చిన దానిని తాము ఆచరిస్తూ, శిష్యులకు ఆ అనుభవపూర్వక సారాన్ని జ్ఞానాన్ని బోధిస్తూ, వారినీ అనుష్ఠాన పరులుగా తీర్చిదిద్ది తరింపచేసే మహానుభావులే ఆచార్యులు.

శ్రీమద్వేదాంత దేశికులు అనుగ్రహించిన సువిశాలమైన పర్యాప్తమైన ఆచార్య నిర్వచనాన్ని పరిశీలిద్దాం:

**"సిద్ధం సత్సంప్రదాయే స్థిరధియ, మనఘం, శ్రోత్రియం, బ్రహ్మనిష్ఠం సత్వస్థం, సత్యవాచం, సమయ నియతయా సాధువృత్యాసమేతం । దంభాసూయాది ముక్తం, జిత విషయగణం, దీర్ఘబంధుం, దయాళుం స్థాలిత్యే శాసితారం, స్వపరహితపరం, దేశికం భూష్ణురీప్సేత్"॥**

అర్థాత్ శ్రియఃపతినుండి అవిచ్ఛిన్నంగా వస్తున్న సంప్రదాయ గురుపరంపరా సంబంధం కలవారు, బ్రహ్మ సాక్షాత్కారం పొందినవారు, రజస్సు, తమస్సు కలవని సత్వగుణం కలవారు, సత్యవ్రతులు, పెద్దల నడవడికను అనుసరించేవారు, దంభం, అసూయవంటి గుణాలు లేనివారు, ఇంద్రియాలను నియంత్రించగలవారు, శిష్యాచార్య సంబంధం ఎడతెగక కొనసాగేలా ఉండేవారు, శిష్యుని లోటు పూరించి, యోగ్యత ప్రసాదించేవరకూ దయకలవారు, అంటే "నినైత్తు ముళై వఖ్రీయే నిస్పుపాల్ శోర" అన్నట్లు ఉండేవారు, శిష్యుడు తప్పుమార్గం పడుతూ ఉంటే "మార్గంనుండి మరలు" అని నిర్దేశించి, నిర్బంధించి, నిష్ఠూరంగానైనా





ప్రవర్తించి ఆజ్ఞాపించగలవారు, తనకేది హితమో పరులకేది హితమో తెలుసుకొని ప్రవర్తించేవారు కావాలి ఆచార్యులు.

ఆచార్యులు 2 రకాలు. **1). కృపామాత్ర ప్రసన్నులు, 2). అనువృత్తి ప్రసన్నులు.**

**1). కృపామాత్ర ప్రసన్నులు:**

కేవలం దయతో ప్రతిఫలాపేక్ష లేక మానవాళిని ఉజ్జీవింపచేయాలనే అభిలాషతో, జాలితో శిష్యులను తామేచేరి వారిని తమ ఆచరణతో, ఉపదేశంతో సంస్కరింపచేసి ఉజ్జీవింపచేసేవారు. ఉదాహరణకు భగవద్రామానుజులు ఎవరడిగారని, ఎవరాశ్ర యించారని, ఎవరు కనిపెట్టుకు కూర్చున్నారని గోపురమెక్కి తమ ఆచార్యులు విధించిన ఆంక్షలను లెక్కచేయక మంత్రార్థం అనుగ్రహించారు.

**2). అనువృత్తి ప్రసన్నులు:**

మళ్ళీమళ్ళీ అడిగించుకొని, జిజ్ఞాస ఎటువంటిదో పరీక్షించి అప్పుడు తత్త్వబోధ చేసేవారు అనువృత్తి ప్రసన్నులు. ఈ కోటికి చెందినవారు రామానుజుల గురువులైన గోష్ఠీపూర్ణులు.

ఆచార్యుని పొందించే హేతువేమి? పరమాత్మను పొందించేవాడు ఆచార్యుడైతే, ఆచార్యుని పొందుటకు భగవానుని నిర్హేతుక కృపే కారణం అంటుంది శాస్త్రం. ఆచార్యుని పొందించే కారణం: **"ఈశ్వరస్యచ సౌహార్దం, యదృచ్ఛా సుకృతం, తథా విష్ణోః కటాక్షశ్చ, అద్వేషః , ఆభిముఖ్యం, సాత్త్వికైస్సహ సంభాషణం షడేతాని ఆచార్య ప్రాప్తి హేతవః".** 1). సర్వేశ్వరుని దయ, 2). యాదృచ్ఛిక సుకృతం, 3). పరమాత్మ కటాక్షం, 4). అద్వేషము, 5). ఆభిముఖ్యము, 6). సాత్వికులతో సంభాషణము ఈ ఆరును నిర్హేతుక కృపగల భగవానునకాధారముగా లభించుటచే భగవానుడు మనకు సదాచార్య సంబంధం కలుగునట్లు చేయును.

గ్రంథ అధ్యాపనం ద్వారా జ్ఞానాన్ని ఉపదేశించి అంటే **"ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినః తత్త్వదర్శినః"** అని జగద్గురువైన శ్రీకృష్ణ పరమాత్మ ప్రబోధించినట్లు జ్ఞానాన్ని కాలక్షేపాల ద్వారా అందించి ఉజ్జీవింప చేసేవారు "ఉపకారకాచార్యులు". మంత్రోపదేశం ద్వారా ఉజ్జీవింప చేసేవారు "ఉత్తరకాచార్యులు". భగవద్రామానుజుల అవతారమైన శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయరు స్వామివారు ఉత్తారకులు, ఉపకారకులే కాక కృపామాత్ర ప్రసన్నాచార్యులు కూడా.

ఆచార్య అనుగ్రహంవల్ల సమకూడనిది ఏమీ ఉండదని తెలియజేస్తుంది ఈ క్రింది ప్రమాణవచనం.

**"ఆచార్యస్య ప్రసాదేన మమ సర్వమభీప్సితమ్ ।**
**ప్రాప్నుయామితి విశ్వాసః యస్యాస్తి స సుఖీభవేత్" ॥**

ఆచార్యునిపై విశ్వాసం ఉన్నవానికి ఆయన అనుగ్రహంవల్ల సర్వసుఖములు, అభీష్టములు నెరవేరును. ఉపమన్యువు దీనికి మంచి ఉదాహరణ. ఆచార్య పారతంత్ర్యముగల ఉపమన్యువు ఆచార్య నిష్ఠాగరిష్ఠుడై, ఆచార్య ఆజ్ఞాపాలకుడై, ఆచార్య అనుగ్రహానికి పాత్రుడై సర్వవేద జ్ఞానము, సమస్త జ్ఞానము సిద్ధించేలా వరాన్ని పొందేడు.

**"సర్వే చ తే వేదాః ప్రతిభాస్యన్తి**
**సర్వాణి చ ధర్మశాస్త్రాణి**---ఇత్యాది వేదంలో అనడం ద్వారా జ్ఞానాన్ని, ధర్మశాస్త్రం అనడం ద్వారా ఆచరణను సాంకేతికంగా చెప్పడం జరిగింది.

ఆచార్యునియందు గల విశ్వాసంలో మనకు ఒక శబరి, ఒక ఏకలవ్యుడు, ఒక వివేకానందుడు ఆదర్శం కావాలి.

భగవానుడు తప్పు, ఒప్పులను బట్టి సంసారాన్ని గాని, మోక్షాన్నిగాని అనుగ్రహిస్తాడు. ఆచార్యులు మాత్రం పరమ దయాళువు కనుక మనను ఉజ్జీవింపచేసి మోక్షాన్నే పొందేలాగా చేస్తారు. అందువల్ల ఆచార్య సమాశ్రయణమే, ఆనంద దాయకం.

"బాలమూక జడాన్ధశ్చ పంగవో బధిరాస్తథా।
సదాచార్యేణ సంధృష్టాః ప్రాప్నువంతి పరాంగతిం ॥"

సదాచార్య కటాక్షంవల్ల బాలలు కాని, మూగవారుకాని, అజ్ఞులుకాని, గుడ్డివారు కాని, కుంటివారు కాని సద్గతిని పొందుతారు

**"నారాయణోపి వికృతం యాతి గురోః ప్రచ్యుతస్య దుర్బుద్ధేః।
కమలం జలాదపేతం శోషయతి రవిర్న తోషయతి ॥"**

ఆచార్య సంబంధం లేకపోతే భగవంతుడు కూడా అటువంటి మనుష్యుని చూచి బాధ పడతాడట. తామర పువ్వును సూర్యుడు వికసింప చేస్తాడు. ఎప్పుడూ? పూవు నీటిలో ఉన్నంత వరకే. నీటితో సంబంధాన్ని కోల్పోతే వికసింపచేసే సూర్యుడే తామర పూవును వాడిపోయేట్టు చేస్తాడు కదా! ఆచార్యులు నీటివంటివారు భగవానుడు సూర్యునివంటివాడు. మన సత్తను నిలబెట్టినారు ఆచార్యులు. ఆచార్య సంబంధమున్ననాడు సూర్యుడు తామర పూవును వికసింపచేసినట్లు, సర్వేశ్వరుడు ఆత్మజ్ఞానమును వికసించునట్లు చేయును. ఆచార్య సంబంధంలేనినాడు ఆత్మ నీటితో సంబంధంలేని తామర పూవువంటిది. అప్పుడు జ్ఞానవికాసం కలిగించు ఈశ్వరుడే జ్ఞానం లేకుండా పోవునట్లు చేయును.

**"ఆచార్యవాన్ పురుషోవేద తస్య తావదేవ చిరం।
యావన్న విమోక్ష్యే అథ సంపత్స్యే ॥"**

ఆచార్యుడు గలవాడే భగవంతుని సాక్షాత్కరించుకొనగలడు. అట్టివానికి శరీరపాతమే ఆలస్యము. శరీరపాత మయిన వెంటనే మోక్షాన్ని పొందగలడు.

భగవంతునికి మనపై ఎంత కృప. శ్రీశ్రీశ్రీ జీయరు స్వామివారి వంటి సదాచార్యునిమనకు అనుగ్రహించిన ఆ సర్వేశ్వరుడు మహోపకారకుడు. ఆచార్య కృపా కటాక్షాలను మాపై సర్వకాల సర్వావస్థలయందు ప్రసరింపచేసేలా ఆ శ్రీమన్నారాయణుడు మంగళాశాసనం చెయ్యాలని ఆకాంక్షిస్తూ............!

ఇదే ఆచార్య తిరునక్షత్ర సందర్భ అక్షర నీరాజనం.

**ఆచార్య దివ్య తిరువడిగళే శరణం**

-జై శ్రీమన్నారాయణ !-

ఓం అస్మత్ గురుభ్యో నమః

## పదాలవిందు-2

## పూరించండి:

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 1 | ■ | 2 | | 3 | ■ | 4 | 4 |
| ■ | ■ | | ■ | | ■ | 3 | 17 | ■ | |
| 11 | ■ | 5 | 5 | | ■ | ■ | | ■ | |
| 11 | | ■ | | ■ | 7 | ■ | ■ | 6 | |
| | ■ | 12 | ■ | 8 | | 8 | ■ | 7 | |
| 12 | | | 18 | ■ | 10 | | ■ | | ■ |
| | ■ | ■ | | ■ | ■ | | 10 | | 9 |
| | ■ | 15 | ■ | 13 | ■ | ■ | | ■ | |
| ■ | ■ | | | 13 | ■ | 14 | ■ | 14 | |
| 15 | | | 16 | | | | | | |

## పదాలవిందు-1: సమాధానాలు

**అడ్డము:-**

1.మానవ 2). నారాయణ 3). రాధ 4). నగ 5). జీవ 6). కవనము 7). వలువలు 8). రాగము 9). కమనీయము 10). గతము 11). తరులు 12). జాములు 13). జావా 14). మాయ 15). ముద్ర 16). యతి 17). ముదిత 18). ధ్యానము 19). మణి.

**నిలువు:-**

1). మాధవ 2). వనము 3). రాకపోకలు 4). యవలు 5) రాజీవము 6). పాలు 7). నవనీతము 8). రాముడు 9). వనిత 10). గని 11). మరులు 12). ముక్కు 13). జాలము 14). వాయ 15). మతి 16). దితి 17). యమునా 18). సంధ్యా 19). దయ.





**అడ్డము:-**

1. సృష్టికి మూలము, తెలియాల్సినవన్నీ తెలిపేది (3)
2. నాశము లేని పదార్ధము (3)
3. నిప్పులాంటిదే (2)
4. ఈయన గాంచనిది కూడా కవి గాంచును (2)
5. ముచికుంద మహర్షిలోని శ్రీకృష్ణుడు (3)
6. తమిళనాట ముత్యము (2)
7. దమయంతి భర్త ఓ వానరం (2)
8. త్రాగేదే కానీ కృష్ణుడు మాత్రం తింటాడట (3)
9. మీరు నింపుతున్నది హఠాత్తుగ తిరగబడితే (4)
10. తిరుప్పావైలో విశేషవాద్యము, పరమ పురుషార్థమిదే (2)
11. గజేంద్ర రక్షణకై ఆవిర్భవించిన అవతారము (2)
12. రమింపచేయగలిగనామె భర్త (4)
13. మన శరీరంలో ఆరనిమంట (3)
14. ఆశ్చర్య నక్షత్రం (2)
15. భీష్మునికి ఆచార్యత్వం ఇది ఉపదేశించడంవల్లనే (10)

**నిలువు:-**

1. ఎటు చూసినా సంతోషమే (3)
2. బ్రహ్మపుత్రుడు(3)
3. మననశీలుడు (2)
4. వీరి పుత్రిక ఆండాళ్ (5)
5. యమునా తీరవిహారే, – విహారి కూడా (2)
6. భగవంతుడు ప్రత్యక్షమై తల్ల క్రిందులైతే (4)
7. క్రిందనుండి పైకి ప్రయాణం (3)
8. శంఖానికి సవతి (3)
9. పెద్దల శ్రీచరణ స్పర్శ చేసేది, పాపాలనుండి రక్షణ (4)
10. హిందీ అరటిపండు (2)
11. బృహత్ తత్త్వాన్ని తనలో ఇముడ్చుకున్న అరణ్యము, వేదాంతమిది (6)
12. బెత్తెడు కన్నా ఎక్కువ మూర కన్నా తక్కువ (2)
13. గోదాదేవి కృష్ణుని బంధించిన సాధనం సంస్కృతంలో తిరగబడింది (3)
14. కోతికంటే చంచలమైనది (2)
15. మంచి రసమే, కాని హనుమంతునే మ్రింగాలనుకున్నది (3)
16. ఇది ఒకయోగం తలకిందులైనా చేయాల్సిందే (2)
17. వెరుపు రెండక్షరాలలో (2)
18. ఇది తలకిందులై కంచికి వెళితే మనమింటికే వెళ్ళాలి (2)